# తొలి పలుకులు

సంస్కృతాలంకారచరిత్ర కాంధ్ర లాక్షణికులు కొందర లంకార ఘాతులై అలరారుచున్నారు వారిలో అగ్రగణ్యుడు జగన్నాథపండిత రాయలు. నూత్నసిద్ధాంత ప్రతిపాదన సమర్థ మగు శాస్త్ర వ్యుత్పత్తియు, రసవత్కవిత్వ రచనాప్రతిభయు విశిష్టమేళనము నొందిన సంస్కృత లాక్షణికులలో దాదా పితఁడే చివరివాఁ డని విమర్శకుల యభిప్రాయము. కావున రసగంగాధరము సంస్కృత సాహిత్య శాస్త్ర తరంగిణిలోఁ గడపటి పుణ్య తీర్థము !

సారవంతములును, సూత్రప్రాయములు నైన సంస్కృత లక్షణ గ్రంథములకు వ్యాఖ్యానము లాభాష యందే వెలసినవి. అవి సహృద యుల కాగ్రంథ తాత్పర్యములను వివరించి చెప్పుచున్నవి క్రీ. శ. 19వ శతాబ్దములోఁ దెలుఁగున సంస్కృత లక్షణ గ్రంథానువాదము, వాని వ్యాఖ్యానరచనము చేయు నుద్యమము ప్రారంభమైనది. ప్రసిద్ధా లంకార గ్రంథము లనువదింపఁబడినవి. వానిలో రసగంగాధర మొకటి.

శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులుగారు రసగంగాధరము యొక్క రసనిరూపణాత్మక ప్రథమానన విస్ఫూర్తి వెలయునట్లు 'ఆంధ్ర రసగంగాధర' మను ఈ వ్యాఖ్యాన గ్రంథమును రచించిరి మూలము నిచ్చి, తెలుఁగు తాత్పర్యము వివరించి, వ్యాఖ్యానము నిర్వహించి, విశేష సమన్వయములను 'శ్రీశర్వాణి' వ్యాఖ్యాలో 'బొందుఁపఱిచి రచించుట ఈ గ్రంథ ప్రణాళిక.

ఈ గ్రంథకర్త లగు శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులుగారు న్యాయశిరోమణులు, సాహిత్య తర్క మీమాంసాది శాస్త్రవేత్తలు, సిద్ధాంధ్ర సాహిత్య శాస్త్రానువాదకులు, వ్యాఖ్యాతలు. వీరు రచించిన యీ 'ఆంధ్ర రసగంగాధరము'యొక్క వైశిష్ట్యమును గుర్తించి ఆంధ్ర

ప్రదేశ సాహిత్య అకాడమీ సంస్కృతగ్రంథ ప్రచురణ సలహాసంఘము దీని ప్రచురణమును జేపట్టు ప్రతిపాదనము చేసినది. దాని నంగీకరించి అకాడమీ ఈప్రచురణమును గావించినది. ప్రాచీన సాహిత్యశాస్త్రమర్యాదల నెఱుంగుటకును, ప్రమాణబద్ధమైన విమర్శనము వ్యాప్తి జెందుటకును ఇట్టి గ్రంథ ప్రచురణము తోడ్పడగలదని అకాడమీ విశ్వాసము.

ఈ గ్రంథ ప్రచురణమున కవకాశము గల్పించిన శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులవారికిని, ఈ గ్రంథమును ముచ్చటగా ముద్రించి యిచ్చిన గ్రీన్ ప్రింటింగ్ ప్రెస్ అధిపతులకును అకాడమీ పక్షమున కృతజ్ఞతలు.

హైదరాబాదు
28—6—1969

దేవులపల్లి రామానుజరావు,
కార్యదర్శి.

# విషయసూచిక

# ప్రార్థన

శ్రియః కాన్తాయ కల్యాణ నిధయే నిధయేఽర్థినాం,
శ్రీ వేఙ్కట నివాసాయ శ్రీనివాసాయ మఙ్గళమ్.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిమ్,
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీయ ముపాస్మహే.

మఙ్గళం కోసలేన్ద్రాయ మహానీయ గుణాబ్ధయే,
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మఙ్గళం.

శారదా శారదామ్భోజ వదనా వదనామ్బుజే,
సర్వదా సర్వదాఽస్మాకం సన్నిధిస్సన్నిధిం క్రియాత్.

యో నిత్య మచ్యుతపదామ్బుజ యుగ్మ రుక్మ,
వ్యామోహతస్తదితరాణి తృణాయ మేనే.

అస్మద్గురోర్భగవతోఽస్య దయైక సిన్ధోః,
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే.

వేదాన్తోభయ తత్త్వ విత్త్వ మహితః శ్రీమన్నృసింహార్యతః,
సంసారార్ణవ మగ్న మాదృశ సముద్ధారైక దీక్షా జుషః.

సమ్ప్రాప్తాగమ శీర్షమాదృత భరద్వాజా స్వయోద్దీపికః,
శ్రీమద్వేఙ్కట రంగదేశికమహం జ్ఞానాదిపూర్ణం భజే.



శ్రీః

# ఆంధ్ర రసగంగాధరము

## ౧. గ్రంథారంభము

### మంగళము

సంస్కృత మూలము

స్మృతాపి తరుణాతపం కరుణయా హరన్తీ నృణాం
అభంగుర తనుత్విషాం వలయితా శతైర్విద్యుతామ్
కళిన్దగిరి నన్దినీ తట సురద్రుమాలంబినీ
మదీయ మతిచుమ్బినీ *భవతు కాపి కాదమ్బినీ.

తెనుఁగు తాత్పర్యము

మనుజులు తలంచిన మాత్రమునఁ దరుణాతపమును దొలఁగించుచుఁ జెదరని యొడలి మెఱుఁగులు గల మెఱుపు లనేకములు (తనను) చుట్టుకొనఁగా, యమున యొడ్డున దేవతరువుల నాలంబించియున్న యొకక్రొత్తరకపు మేఘమాల నామతినిఁ బ్రీతితో స్పృశించునుగాక

శ్రీ శర్వాణి

*శ్రీ రమేశుల గురువుల సేవచేసి పండితుని రసగఙ్గాధర భావగరిమ
వ్యక్తపరుప నాగేశుని వంక దీయ దేవి శర్వాణి దీర్చెద దివ్యభక్తి.

శ్రీకృష్ణమూర్తిని మేఘమాలగా అధ్యవసాయమొనర్చి తానాతని స్మరణము నతిప్రీతితో నొనరించునట్లును, అతఁడు తన తలఁపులో నెపుడును బ్రీతితో గోచ

రించుచుండునుగాక యనియును పండితరాజు జగన్నాథుఁడు ప్రార్థించుచున్నాఁడు. ఈ శ్లోకములో 'భవతు' అనునది అనుగ్రహ ప్రార్థనము నందలి నాగేశుఁడు (రసగఙ్గాధరమున కింతకు పూర్వము మర్మప్రకాశ మను పేరి వ్యాఖ్య వ్రాసిన యతఁడు) వ్రాసెను. ఈమేఘమాలయొక్క వర్షము కరుణగా నధ్యవసింపఁబడి మనుజుల సాంసారికాదితాపముల నిర్వాపణ మొనర్చు నని భావము.

## గురునమస్కారము

సంస్కృత మూలము :

శ్రీమజ్జ్ఞానేన్ద్రభిక్షో రధిగత సకల బ్రహ్మవిద్యాప్రపంచః
కాణాదీ రాక్షపాదీ రపి గహనగిరో యో మహేన్ద్రా దవేదీత్
దేవాదేవాధ్యగీష్ట స్మరహరనగరే శాసనం జైమినీయం
శేషాఙ్కప్రాప్త శేషామలఫణితి రభూత్సర్వవిద్యాధరో యః.

తెనుఁగు తాత్పర్యము :

"అహేబుధ్ని యమన్త్రం మే గోపాయ ఋషయస్త్రైవిదావిదః ఋచస్సామాని యజూగ్ంషి సాహిశ్రీ రమృతాసతాం" అను శ్రుతినిబట్టి త్రయీరూపమగు నమృత శ్రీగల జ్ఞానేన్ద్ర భిక్షువునుండి బ్రహ్మవిద్య నంతను, వేదాన్తము నంతను నేర్చినాఁడు. మహేంద్రుఁ డను గురువు నుండి కణాదుని వైశేషిక శాస్త్రమును, అక్షపాదుని, గౌతముని, న్యాయశాస్త్రమునుగూడ అతిదురవగాహము లైనవానినిఁ దెలిసికొనెను. మన్మథుని సంహరించిన శివుని నగరున – కాశిలో ఖండదేవు నుండియే జైమిని యొనరించిన శాస్త్రమును (పూర్వమీమాంసా శాస్త్రమును) అధ్యయన మొనర్చెను. శేషము అనుగుర్తు ఇంటిపేరుగల శ్రీ వీరేశ్వర శాస్త్రిగారియొద్దనుండి వ్యాకరణ మహాభాష్యము నొందెను. ఇట్లు సర్వవిద్యలను ధరించెను – సర్వవిద్యాధరుఁ డయ్యెను.

శ్రీ శర్వాణి :

పూర్వమీమాంసాశాస్త్రములో పార్థసారథిమిశ్రుల గ్రన్థత్రయమునకుఁ దరువాత నంతటిగౌరవాదరములతో నభ్యసింపవలసిన–భాట్టదీపిక,మీమాంసా కౌస్తుభము, భాట్ట రహస్యము అను మూఁడు గ్రన్థములను రచించిన

ప్రామాణికాగ్రేసరుఁడు. ఈతని మీమాంసాకౌస్తుభము పీఠికలో నీతని కాలము నిర్ణయింపఁబడినది.

సర్వవిద్యాధరుఁ డను పదమువలన 'విద్యలనుండి యాభిరూప్యము, విద్యాధరునకువలె నీతని కందఱిలోను లభించెనని వ్యక్తము. నన్నయభట్టుకూడ రాజరాజనరేంద్రుని 'కుమార విద్యాధరుఁడు' అని వర్ణించెను. ఇందులో గల విశేష మింకను సువ్యక్తము కాలేదు. బాగుగాఁ బరిశీలింప వలసి యున్నది. అథవా ముందుశ్లోకములోఁ జెప్పఁబోవు 'పాషాణమునుండి పీయూషమును స్రవింపఁజేయుట యను విశేషమును ద్యోతన మొనర్చుచే యదేమో ?

సంస్కృత మూలము :

పాషాణా దపి పీయూషం స్యన్దతే యస్య లీలయా
తం వన్దే పేరు భట్టాఖ్యం లక్ష్మీకాన్తం మహాగురుమ్.

తెనుఁగు తాత్పర్యము :

అతఁడు పాషాణమునుండి పీయూషమును – అమృతమును, లీలగా – అనాయాసముగా స్రవింపఁజేయగల్గును. ఇంతటి మహానుభావుఁ డా పేరుభట్టు, లక్ష్మీకాంతుఁడు, నాకు మహాగురువు ( = అన్నివిద్యలను నాకు నేర్పినాఁడు. ) అతనికి నేను నమస్కరింతును.

శ్రీ శర్వాణి :

పాషాణమువంటి–వట్టి మొద్దైన తాను అమృతమువంటి కవిత నల్లగల్గుట మహాగురువైన శ్రీ పేరుభట్టు ననుగ్రహమేనని గురుని సామర్థ్యమును జెప్పుటగా మహాగురు పదపు నర్థమును వ్యంగ్యపఱచుచుఁ దన కవితముందు 'నిర్మాయ నూతన ముదాహరణానురూపం' అను శ్లోకములోఁ జెప్పఁ బోవునట్లుగా నలంకారశాస్త్రపు సకల విషయములకు నుదాహరణముగా నిలువగల్గు నంతటి యమృతమధుర మని వ్యంగ్యము ద్వారమున దానిని సమర్థించుచున్నాఁడు. మఱియు నతఁడు చదివిన విద్యలనన్నింటిని సస్రమ్ప్రదాయ రహస్యముగాఁ దనకు నేర్పి తనకు మన్త్రోపదేశాదిక మొనర్చె ననియు, నందువలన నతఁడు అందఱి గురువులలోను గొప్పవాఁడగు లక్ష్మీ

కాంతుఁడు నారాయణుఁ డనియు వ్యంజన మొనర్చెను. సర్వప్రథమా చార్యుఁడు మహాగురువతఁడే కదా ! లక్ష్మి పేరుభట్టు భార్య, ఇతని తల్లి.

## అవతారిక

సంస్కృత మూలము :

నిమగ్నేన క్లేశై ర్మననజలధే రన్తరుదరం
మయోన్నీతో లోకే లలితరసగఙ్గాధరమణిః
హర న్నన్తర్ధ్వాన్తం హృదయ మధిరూఢో గుణవతాం
అలంకారాన్సర్వా నపి గలితగర్వాన్ రచయతు.

తెనుఁగు తాత్పర్యము :

యుక్తిమూలమున నాలోచించుట మననము. అదొక మహాసముద్రము. దాని లోతులోపల నానాకష్టములఁబడి మునిఁగి అందమైన రసగఙ్గాధర మను మణిని నేను-జగన్నాధుఁడను, పైకి-భూలోకమునకుఁ దీసికొనివచ్చితిని. ఆమణి (గ్రన్థపక్షములో) సాహిత్యమును గూర్చిన లోపలి యజ్ఞానమును, (మణి పక్షములో) లోని జీఁకటిని దొలఁగించుచు గుణవంతుల హృదయములకెక్కి- అలంకారము లన్నింటి యొక్క-యు (గ్రన్థ పక్షములో) = ఉపమాద్యలంకారముల యొక్క-యు (మణి పక్షములో) = హారాద్యలంకారముల యొక్క-యు, అతిశయము తనంత తాను తొలఁగిపోవున ట్లొనర్చుఁగాక.

## ప్రతిజ్ఞ

సంస్కృత మూలము :

పరిష్కుర్వ న్త్వర్థాన్ సహృదయధురీణాః కతిపయే
తథాఽపి క్లేశో మే కథ మపి గతార్థో నభవితా ;
తిమీన్ద్రాస్సంక్షోభం విదధతు పయోధేః పున రిమే
కి మేతే నాయాసో భవతి విఫలో మన్దరగిరేః ?

తెనుఁగు తాత్పర్యము :

కొందఱు సహృదయులలోని పెద్దలు (అలంకారాదులగు సార్థములైన) అర్థములను పరిష్కరింతురు గాక. అంతమాత్రమున నా ప్రయాసము గతార్థము

కాఁబోదు. గొప్ప తిములు-(చేపలలోని యొకజాతి) కల్లోల మొనర్చినను ఇంత మాత్రమున మందరగిరిశ్రమ వ్యర్థమగునా?

సంస్కృత మూలము :

నిర్మాయ నూతన ముదాహరణానురూపం
కావ్యం మయాఽత్ర నిహితం నపరస్య కించిత్ ;
కిం సేవ్యతే సుమనసాం మనసాఽపి గన్ధః
కస్తూరికా జననశక్తిభృతా మృగేణ ?

తెనుఁగు తాత్పర్యము :

ఇట నుదాహరించుటకుఁ దగినట్లుగాఁ గ్రొత్తకావ్యమును రచించి నేనిట నుంచితిని. ఇతరుని దే లేశమును లేదు. కస్తూరిని పుట్టించు శక్తిగల మృగము పూవుల వాసనపై మనసునైన గొల్పునా?

సంస్కృత మూలము :

మననతరితీర్ణవిద్యార్ణవో జగన్నాథపణ్డితనరేంద్రః
రసగఙ్గాధరనామ్నీం కురుతే కుతుకేన కావ్యమీమాంసాం.

తెనుఁగు తాత్పర్యము :

ఓడతో గడలినివలె మననముతోఁ జదువు పారమొందిన పణ్డితరాజు జగన్నాథుఁడు రసగఙ్గాధర మను పేరుగల కావ్య మీమాంసను - (విచారశాస్త్రము) నుత్సాహముతో రచించుచున్నాఁడు.

శ్రీ శర్వాణి :

ఇక్కడ పరోక్ష వృత్తిలో ప్రథమ పురుషతోఁ జెప్పుటలో విశేషమేమనఁగా దీనిని తాను శ్రమలేకుండనే రచించుచుంటి నని ద్యోతనమొనర్చుట. 'వ్యాతేనే కిరణావలీముదయనః' అనుచోటఁ గూడ నిట్టి విశేషమే ద్యోతితము. దీనిని గుర్తింపలేని వ్యాకృతి మూఢుఁడు అక్షర కోష్ఠాగారమైన భట్టోజీ దీక్షితుఁడు దాని నాక్షేపించినాఁడు. ఆధాన్తుని అవివేక ప్రసఙ్గమునకు లెక్కేమి? మీమాంసయనఁగా గౌరవాదరములతోడి విచారము. అదే పూర్వమీమాంస, ఉత్తరమీమాంస యని ప్రసిద్ధము. అట్లే యీ కావ్య మీమాంసాశాస్త్రమును ఆదరింపఁదగినదని వ్యంగ్యము.

సంస్కృత మూలము :

> రసగఙ్గాధరనామా సన్దర్భోఽయం చిరం జయతు
> కించ కులాని కవీనాం నిసర్గ సమ్యఞ్చి రంజయతు.

తెనుఁగు తాత్పర్యము :

చక్కఁగా కూర్పఁబడిన 'రసగఙ్గాధరము' అను పేరుగల యీగ్రన్థము చిరకాల మన్నింటికన్నను మిన్నగా నుండును గాక ! మంచి స్వభావముగల కవుల కులములను రఞ్జించునుగాక !

శ్రీ శర్వాణి :

ఈ శ్లోకమునందు రెండు నాల్గు పాదముల చివరి 'రఞ్జయతు' అను పదావృత్తివలని యమకమును, అందును రెండవ పాదము చివర సభంగతను గమనింపఁదగును.



శ్రీః

# ఆంధ్ర రసగంగాధరము

## ౧. కావ్యలక్షణము

సంస్కృత మూలము

తత్ర కీర్తి పరమాహ్లాద గురురాజ దేవతాప్రసాదాద్యనేక ప్రయోజనకస్య కావ్యస్య వ్యుత్పత్తేః కవి సహృదయయో రావశ్యకతయా గుణాలంకారాదిభిర్నిరూపణీయే తస్మిన్విశేష్యతావచ్ఛేదకం తదితరభేద బుద్ధౌ సాధనం చ తల్లక్షణం తావ న్నిరూప్యతే

తెనుఁగు తాత్పర్యము

(ఈ కావ్యమీమాంసను-రసగంగాధరమును కావ్యలక్షణముతోఁ బ్రారంభింతుము ఈ రసగఙ్గాధరము మొదట గావ్యలక్షణమును నిరూపింతుము). ఏమనఁగాఁ గావ్యమువలన కీర్తియు, గొప్ప యానన్దమును, గురువులు, రాజులు, దేవతలు వీరి యనుగ్రహమును మొదలగు ననేక ప్రయోజనములు సమకూడును.

శ్రీ శర్వాణి

ఇది కావ్యమీమాంసాశాస్త్రము కనుక మొదట గావ్యలక్షణ విచార మొన రించు టుచితమని భావము ఈ శాస్త్రమున విషయము కావ్యస్వరూపము ప్రయోజనము, దేవతాదిప్రసాదాదికము. సంబంధము శాస్త్ర విషయములకు వ్యుత్పాద్యవ్యుత్పాదకభావము విషయప్రయోజనములకు జ్ఞానద్వారమున సంపాద్య సంపాదక భావము కావ్య స్వరూపజిజ్ఞాసువు అధికారి అను అనుబంధ చతుష్టయము వ్యక్తపరుపఁబడినది

కనుకనే దానిని గుఱించి కవులును సహృదయులునుగూడ (సరస్వత్యాః తత్త్వం కవి సహృదయాఖ్యం విజయతే అని అభినవగుప్తుఁడు ధ్వనిలోచనారమ్భమున నన్నాఁడు) సరిగాఁ దెలిసికొనుట అత్యావశ్యకము. అది గుణములు, అలంకారములు మొదలగువాని ద్వారమున నిరూపింపఁబడఁదగియున్నది. ఈకావ్యము గుణాలంకారాదులచే విశేషింపఁబడఁదగినదని నిర్ణయించునట్టి దాని ధర్మమును (= లక్షణమును) నిరూపించినచోఁ గావ్యమునకును దదితరములకును భేదము తెలియనగును. కనుక నిరూపింతుము.

## ప్రథమ కావ్య లక్షణము

సంస్కృత మూలము :

రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యమ్.

తెనుఁగు తాత్పర్యము :

రమణీయమగు నర్థమును ప్రతిపాదించు శబ్దము కావ్యము.

శ్రీ శర్వాణి :

ఇచట రమణీయత్వములోని లోకోత్తరాహ్లాదము వాచ్య వ్యంగ్యాద్యర్థముల నేర్పడు చమత్కారము అర్థము వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యము. శబ్దము = వాచకము, లక్షకము, వ్యంజకము నని త్రివిధమే కాక వర్ణము, పదము, పదైకదేశము పదసమూహము వాక్యము సంఘటన ప్రబన్ధము అను రూపముల నుండునది కూడ. ప్రతిపాదకత్వము—అభిధ, లక్షణ, వ్యంజన యని మూఁడు రకములు.

## రమణీయతా వివరణము

సంస్కృత మూలము :

రమణీయతా చ లోకోత్తరాహ్లాద జనక జ్ఞానగోచరతా లోకోత్తరత్వం చ ఆహ్లాదగతశ్చమత్కార పర్యాయోఽనుభవసాక్షికో జాతి విశేషః కారణం చ తదవచ్ఛిన్నే భావనావిశేషః పునః పునరను సన్ధా

నాత్మా 'పుత్ర స్తే జాతః, ధనంతే దాస్యామి' ఇతి వాక్యార్థధీ జన్య స్యాహ్లాదస్యన లోకోత్తరత్వం 'అతోనతస్మిన్ వాక్యే కావ్యత్వప్రసక్తిః'

## ద్వితీయ కావ్యలక్షణము

ఇతం చ చమత్కార జనక భావనా విషయార్థ ప్రతిపాదక శబ్దత్వమ్.

## తృతీయ కావ్యలక్షణము

యత్ప్రతి పాదితార్థ విషయక భావనాత్వం. చమత్కార జనకతా వచ్ఛేదకం తత్త్వమ్.

## చతుర్థ కావ్యలక్షణము

స్వవిశిష్ట జనకతా వచ్ఛేదకార్థ ప్రతి పాదకతా సంసర్గేణ చమత్కారత్వ వత్త్వమేవవా కావ్యత్వమితి ఫలితమ్.

తెనుఁగు తాత్పర్యము :

శబ్దము బోధించిన యర్థము తెలిసి లోకోత్తరమగు నాహ్లాదము గల్గినపు డాయర్థము రమణీయమగును. ఆహ్లాదము లోకోత్తరమని సహృదయులు తమ యనుభవముతో నిర్ణయింతురు. ఆ యాహ్లాద మందున్న ఆ యసాధారణ ధర్మమునకే - లోకోత్తర మగుటకే 'చమత్కారత్వము' అని మరొక పేరు. ఇదొక విశిష్టమగు జాతి. ఈ చమత్కార మొదువుటకై అర్థమును మాటి మాటికిని అనుసంధింపవలెను. ఆ యనుసంధానమే విశిష్టమగు భావన. లోకములో 'నీకు కొడుకు పుట్టినాడు', నీకు డబ్బిత్తును' అను నీరకపుమాటల యర్థము తెలిసినను గూడ ఆహ్లాదము కల్గును. కాని అది లోక సామాన్యపు చాయలదే. కనుక నా మాటలు కావ్యము కావు. కాఁగా చమత్కారమును కల్గించు భావనలో గోచరమగు నర్థమును బ్రతిపాదించు శబ్దముకానీ, ఏది ప్రతిపాదించిన యర్థములు భావించుట యందుండు వైశిష్ట్యము చమత్కారము నొదవించుటలో ప్రయోజక మగునో, అట్టి శబ్దముకానీ కావ్యము అని తేలినది. అథవా చమత్కారత్వమును కలియుండు శబ్దమే కావ్యము. ఎట్లు ? చమత్కారమును పొదవించు నర్థమును ప్రతిపాదించుట యను చుట్టరికము శబ్దమునకే కదా యుండును. కనుక ఈ సంబంధమును బట్టి చమత్కారమే కావ్యమును గుర్తింపఁజేయును. కాగా పై జెప్పిన చమత్కారత్వ మేకావ్యమునకు లక్షణము.

(అనఁగా నాహ్లాదమందుండు లోకోత్తరత్వమే కావ్యమును గుర్తింపఁజేయు ననుట).

శ్రీ శర్వాణి :

ఇచట ముఖ్యముగా గ్రహింపవలసిన విషయమొకటి యున్నది. కడమ వారు = మమ్మటాదులు 'అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యం' ఇత్యాదిగా కావ్యలక్షణమును నిర్మించిరి. అది కావ్యశరీరమును మాత్రము చూపగల్గును కాని అసలు కావ్యతత్త్వమును స్పృశింపఁజాలదు. రచించు వానికి రచనా విషయమును—శబ్దార్థములను, గుణాలంకారములను దెల్పును. అచట పనికిరానివని కొన్నింటిని( = దోషములను) నిర్దేశించును. అనగా కవియగువాఁడు దోసము లంటకుండ గుణాలంకారములతో శబ్దార్థములను గూర్చి రచనాప్రయత్న మొనరింపవలె నని సూచించును. కాని ఇంత మాత్రముననే కావ్యమేర్పడదు. ఏమనగా — దేనిని బట్టి ఏది దోసమో ? దేనిని బట్టి ఏది గుణమో? ఏదిదేని కలంకారమో? దేనిని బట్టి శబ్దార్థముల నెట్టి వానిని గూర్పవలెనో ఆ ప్రధాన విషయము వారి లక్షణములలో నెచటను గూడ స్పృశింపఁబడ నైనను లేదు. ప్రధాన విషయమును—స్వరూపా నుబంధియైన దానిని యావద్దేహ భావిని నిరూపింపనిది లక్షణమగునా ? అదికాక కావ్యమిది యను నిర్ణయము పూర్వులన్నట్లు గుణాలంకారాదుల పని కాదు. సహృదయుల పని యది. రసమును బట్టి చేయవలసిన యాపనిలో నధికారము అచేతనములగు గుణాలంకారములకు లేదు. సచేతనుల దాయధి కారము. 'సహ్యంధస్యాధికారోఽస్తి రూపభేదవివేచనే' = రూపములలో విశేష నిరూపణమున గ్రుడ్డి కధికార మెట్టుల గూడునయ్య" అయితే సహృదయులు మాత్రమెట్లు నిర్ణయింతురు ? వారి హృదయము లెచట నలౌకికమగు నానన్ద మనుభవించునో అది కావ్యమని నిర్ణయింతురు. కాఁగా వారి హృదయానుభవమే ప్రధానమైన ప్రమాణము. ఆనన్ద సన్ధానమే కావ్యత్వమును నిర్ణయించు ప్రధానమైన లక్షణము. సహృదయుల హృదయముల కనుభవమగు నా యానన్దము కావ్యమందుండినగదా లక్షణ మగును దానికి? ఈ సంశయమును దీర్చుటకే తృతీయ లక్షణ మవతరించి నది. ఇట్లు కావ్యత్వము 'సచేతనుల నిర్ణయములోనిది' అనియు, అట ప్రధాన ప్రమేయమగులక్షణము లోకోత్తరమగు నానన్దమనియు 'ప్రమా

ణము సహృదయుల హృదయము' అనియు 'సంబంధము చివరి లక్షణములో తెల్పినదే ననియు, లక్షణాభ్యాసములో అనుబన్ధ చతుష్టయమును దీర్చుట యొకటి పణ్డితరాజు లక్షణములోని విశేషము. 'రమణీయ' పదములో రమణీయముగా గుప్తపఱుపఁబడిన దీవిశేషము. ఆపదములను వివరించుటలో వ్యక్తపఱుపఁబడినది. నిజమునకు లోకోత్తరాహ్లాదమున దేలు సహృదయుల హృదయము లోక సామాన్యమగు దాని పొంతకుబోదు. 'మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబు వోవునే మదనములకు' అనెనుకదా సహజపండితుఁడు శ్రీ బమ్మెర పోతనామాత్యుఁడు. అట్టి లోకోత్తరమగు నానన్దము నాస్వాదింపఁగల యర్హత కావ్యనాటకాదుల బరిశీలించు నభ్యాసమున గల్గును. ఏమి ? అట్టి యానందమును పరిచయ మొనరించునవి అవియేకాని మరొకటికావు కదా ? ఈ విషయమునంతను పణ్డితరాజు 'రమణీయ పదపు వివరణము ద్వారమున వ్యక్తపఱచెను. ఇట్లు ప్రధానమైన ప్రమాణమును – సహృదయహృదయానుభవమును, ప్రధానమైన ప్రమేయమును – లోకోత్తరానందమును, ప్రధానమైన ప్రమాతలు – సహృదయులను, ప్రధానమైన ప్రమను = లోకోత్తరానన్దానుభవమును ఈనాల్గింటిని వ్యక్తపరచు పండితరాజు లక్షణము కడమ యన్నింటికన్న మిన్నయేకదా ; విలక్షణమనుట విస్పష్టమే. అయితే ఇటరివి ప్రయత్న గోచరములు గుణములు కావా ? కావనము. కాని అవి యుండియే తీరవలెనను నియమములేదు. ఏమనగా–అవియున్నను 'అద్రావత్ర ప్రజ్వలత్యగ్ని రుచ్చైః ప్రాజ్యః ప్రోద్యన్నుల్ల సత్యేషధూమః' అనుదానిని కావ్యమనరేమి ? అట శబ్దాలంకారాదిక మున్నది కదా ? ఇదేదియు లేకున్నను 'అస్తమేతి రవిః' అనుదానిని కావ్యమందురేల ? కనుక గుణాదులకిట నైయత్యము లేదు. నిజమునకు గుణత్వము, అలంకారత్వము మొదలగునది యంతయుగూడ నొక నియతిలేనిదే. అనియతములకు నియతైకాన్తమగు లక్షణములో జోటీయదగునా ? కనుకనే దోషగుణాలంకారాదులకిట ప్రవేశము తిరస్కరింపఁబడినది. గుణాలంకారాదుల స్వరూపము అనితయ మను టేమనఁగా అవి రసవిశేషమును బట్టియే యేర్పడును కనుక. ఒక చోట దోషములు మరొకచోట గుణములగును. ఒక చోట గుణములు మరొక చోట దోషములగునుకదా : కాఁగా వానిస్వరూపమే ప్రధానైక (రస)

నిరూపణీయము. అట్టియెడ ప్రధానము నసలే స్పృశింపక తదేక జీవనము లైన వీనిని లక్షణములో జేర్చుట తగనిపనియేకదా! మరియు దాను అనుగతమై లక్ష్యముల నన్నింటిని అనుగతితో లక్షింపజేయు లక్షణములో నీ యననుగతములగు గుణములను, అలంకారములను జేర్చుటవలన లక్షణ మననుగతమై దాని స్వభావమైన అనుగతియే చెడి మొదటికే మోసమగును.

ఇక శబ్దార్థములు నియతములు, ప్రధానమైనది లోకోత్తరాహ్లాదము. ఇవి లేకుండ కావ్యములో నసలు కుదురనే కుదురదు కనుకనివి లక్షణములో దప్పక యుండదగినవే ఉండవలసినవే చేర్పబడినవి ఈ చేర్పులో ప్రధానానుగుణ్యము - ఆనన్ద సన్ధాయకత్వము స్పష్టముగా దెల్పబడినది. కాఁగా సహృదయుల హృదయములకు లోకోత్తరమైన ఆనన్దమును సమకూర్చునట్లుగానే అర్థమును బ్రతిపాదించి శబ్దము కావ్యము కాగల్గును. ఈశబ్దాలంకారములు వృత్తిరీతులు మొదలగునవి కూడ ప్రధానమగు నానన్దానుభవమునకు అనుగుణముగానే యుండితీరవలె నన్నట్టయినది. ఆ లోకోత్తరానన్దమే రసభావాదిరూపమున విస్తరిల్లును. కాఁగా రసభావాది రూపమగు నానన్దము కావ్యజీవితమనియు, దాని కనుగుణముగా శబ్దార్థాదికమును గూర్చుటకై కవి ప్రయత్నింపవలెననియు, అట గుణాలంకారాదుల సంధానమున వేరుగా బ్రయత్న మనావశ్యకమనియు, ఈ ఆనన్ద సన్ధానపు బ్రయత్నములోనే అవికూడ నేర్పడవలెననియు (చెలగి కవిహృదయము రసాక్షిప్త మగుట దేనికూరుపు శక్యనిర్మాణమగునో అదియె ధ్వనికి నలంకారమగును రసప్రయత్నమును వీడనక్కఱయచటలేమి. ఆంధ్ర ధ్వన్యాలోకము. ౨ ఉద్యోతము). అది యంతయు సహృదయుల మనసుల కెక్కినపుడే కావ్యమగు ననియు కనుక వారి మనసుల కెక్కునట్లుగా రచించుటకై కవి ప్రయత్నింపవలెననియు, తనంతఁ దాను మురుసుకొనరాదనియు బర్యవసన్న తాత్పర్యము. కనుకనే కవి బ్రహ్మ "ఎట్టి కవికైన దన కృతి యింపుఁ బెంపఁజాలు గావున గావ్యంబు సరసులైన కవుల చెవులకు నెక్కినగాని నమ్మ దెందుపరిణతి గల్గు కవీశ్వరుండు" అనెను. ఆంధ్రభువనోపజీవ్యుఁడైన ఆదికవి నన్నయ సూక్తి యిది.

"సారమతిం గవీన్ద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తి నిధి నన్నయభట్టు తెనుంగున న్మహా
భారత సంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితమ్ముగన్."

ఈ లోకోత్తరాహ్లాదమునకును – చమత్కారమునకును కావ్యమునకును మాత్రమే అసాధారణమైన సంబంధమనియు, నీ చమత్కారమే కావ్యమునకు బ్రధానమగు లక్షణమనియు ముఖ్యముగా వ్యక్తపరచుటకే చిట్టచివరి లక్షణమును పండితరాజు ప్రతిపాదించెను. కావ్యమును ముఖ్యముగా గుర్తింపఁజేయునది చమత్కారమే. అతిగుణాలంకారాదు లుత్సర్గతస్సంబద్ధములే ననియు దెల్పుటకే స్వవిశిష్ట జనకతావచ్ఛేదకార్థ ప్రతిపాదకతా సంసర్గేణ చమత్కారత్వవత్త్వం, అను నాల్గవ లక్షణము. ఇందువలన లఘువగు లక్షణ మేర్పడుటేకాక కావ్యమని గుర్తించుటకు అత్యన్త ముఖ్యమును చులకనిదియు నగు నుపాయముయొక్క చమత్కారమే ననియు దేలినది. శబ్దార్థాదులు ఈ రెంటికిని లక్ష్యలక్షణములగు కావ్యచమత్కారములకు సంబంధమును గల్పునవేకాని ప్రధానములు కావనియు సూచింపబడినది. ఈ లక్షణము–చిట్ట చివరది 'నాట్యం నామ ...... సమస్త నాటకాన్యతమ కావ్యవిశేషాచ్చ ద్యోతనీయోఽర్థః...... తత ఏవ నిర్విఘ్న స్వసంవేదనాత్మక విశ్రాన్తి లక్షణేన రసనా పరపర్యాయేణ వ్యాపారేణ గృహ్యమాణత్వాద్రసశబ్దేనాభిధీయతే తేనరస ఏవ నాట్యం (అభినవ భారతి 6 అధ్యాయం) అను అభినవగుప్తుని సిద్ధాన్తమును బట్టి యేర్పడినదని గ్రహింపవలెను. ఇట 'రస' పదము 'చమత్కారైకఘన' మను నర్థముతో గ్రహింపవలెను.

'రమణీయ' పదపు నర్థములోని జ్ఞానము భావనారూపము – శబ్దము తెల్పిన యర్థమును మాటిమాటికిని అనుసంధించుట రూపము అని వివరించి ఆ భావనయే లోకోత్తరాహ్లాదము నొదవింపగల్గును గాని మామూలు జ్ఞానము కాదనుటకై రెండవలక్షణ మేర్పడినది. చమత్కారకాచమత్కారకార్థముల సమూహమును భావించినపుడు ఆ చమత్కారకార్థమును బ్రతిపాదించు శబ్దభాగమున నతివ్యాప్తి లేకుండుటకై "భోజనంబును బెట్టుము భోజరాజ, ఆజ్యసూపాన్వితముగ మాకందఅకును, శారదోజ్జ్వల పూర్ణిమాచన్ద్రచన్ద్రికాధవళమాహిషదధియు గల్గు నట్లు" (శ్రీ వేంకటరామకృష్ణకవులు) ఇత్యాది పద్యముల పూర్వార్ధములందు మాత్రమే కావ్య

వ్యము ప్రసక్తింపకుండుటకై మూఁడవ లక్షణ మవతరించినది అని గ్రహింపవలెను. నాల్గవ లక్షణ మవతరించుటకు గారణమును ప్రయోజకమును ఇంతకు మునుపే తెల్పితిమి. ఇట నాల్గవ దానిలో, జమత్కారత్వమను చెప్పనఁగా, వస్తు, అలంకార, రస రూపములగు త్రివిధ వ్యంగ్యముల చమత్కారమును. అందును నవవిధములగు రసముల చమత్కారములను ఇంకను నానావిధములగు భావముల చమత్కారములను సంగ్రహించుటకై ఏక ముఖముగా తెల్పుటకై అనుగతి యొనర్చుటకై జాతియైన దీనిని స్వీకరించెను. అంతేకాక 'పదము, వాక్యము' అను నీ రెండు తీరులను సంగ్రహించుటకై 'శబ్దము' అనఁబడినది ఒక్కొకచోట నొక్కొక్క పదమే చమత్కారకమగు నర్థమును బ్రతిపాదించి ధ్వని కాగల్గును. అయితే అచట మొత్తము వాక్యమువల్లనే సౌన్దర్యము స్ఫురించును కాని యచట నాయొక్క పదమున్ననే ఆ స్ఫూర్తి కల్గును. అది లేకున్నచో నేర్పడదు ఇందువలన నా చమత్కార ప్రతీతి ఆ పదమునందే అనఁగా ఆ మొత్తము వాక్యపు భాగమునందే కల్పింపఁబడును కనుక నీ వ్యంజకత్వము ద్వారమున నా పదమునే ధ్వని యని వ్యవహరింతురు.' "కించ కావ్యానాం శరీరాణామివ సంస్థాన విశేషావచ్ఛిన్న సముదాయసాధ్యాపి చారుత్వ ప్రతీతి రన్వయ వ్యతిరేకాభ్యాం భాగేషు కల్ప్యతే ఇతి పదానామపి వ్యంజకముఖేన వ్యవస్థితో ధ్వని వ్యవహారో న విరోధీ = లోకమున శరీరములకుండు సౌన్దర్యము విశిష్టమగు కూర్పుగల అవయవముల సముదాయమువలననే ఏర్పడుచున్నది. ఇది యింతవరకు నిజమే. అయినను కొన్ని శరీరములం దేకన్నో, ముక్కో యొకటి కడమవానికన్న విలక్షణముగా నుండిననే ఆ సౌన్దర్యము స్ఫురించుచున్నది. అవిలేని శరీరాన్తరమునందు ఆ సౌన్దర్యము స్ఫురించుటలేదుకదా! ఈ యన్వయ వ్యతిరేకముల గ్రహించియే ఆయా యవయవములు సౌన్దర్యసంపాదకములుగా లోకమున గ్రహించుచున్నారు. అట్లే వానికి సున్దరములను వాడుక యున్నది. ఇంతవర కుభయులకును సమ్మతమేకదా! ఇఁకఁ బ్రకృతమున పదసముదాయ విశేషమే విశిష్టవిన్యాసముతోఁ గూడినపుడు అర్థసౌన్దర్యము నొదవించును. ఆ సౌన్దర్య ప్రతీతి యొక్కొక్క పదమున్న నేర్పడుటయు, అది లేకున్న నీ ప్రతీతి లేకుండుటయు మన యనుభవములోనిదే కావున నా పదముల

వాచకత్వముతో ప్రసక్తి యక్కఱలేకయే అర్థసౌన్దర్య ప్రత్యాయకములు కాగలుగుచున్నవి' అన్నారు ఆనన్దవర్ధనులు కనుక ఆ యేక పదస్థలములనుగూడ సంగ్రహించుటకై 'శబ్ద' అనబడినది. అట్లే ఇచట శబ్దము అర్థమును ప్రతిపాదించుననుటలో అభిధ, లక్షణ, వ్యంజన యను మూఁడు వ్యాపారములును సంగ్రహింపఁబడెనని గ్రహింపవలెను.



శ్రీః

# ఆంధ్ర రసగంగాధరము

## ౧. ప్రాచీన లక్షణ ఖండనము

సంస్కృత మూలము

యత్తు ప్రాఞ్చః అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యమ్ ఇత్యాహుః తత్రవిచార్యతే—శబ్దార్థయుగలం న కావ్యశబ్దవాచ్యం మానాభావాత్ కావ్యముచ్చైః పఠ్యతే. కావ్యాదర్థోఽవగమ్యతే, కావ్యం శ్రుతమర్థోనజ్ఞాతః ఇత్యాది విశ్వజనీన వ్యవహారతః ప్రత్యుత శబ్దవిశేషస్యైవ కావ్యపదార్థత్వ ప్రతిపత్తేశ్చ వ్యవహారః శబ్దమాత్రే లక్షణయోపపాదనీయః ఇతిచేత్ స్యాదప్యేవం యది కావ్యపదార్థతయా పరాభిమతే శబ్దార్థయుగలే కావ్యశబ్దశక్తేః ప్రమాపకం దృఢతరం కిమపి ప్రమాణంస్యాత్ తదేవతు నపశ్యామః. విమతవాక్యం త్వశ్రద్ధేయమేవ ఇత్థంచాసతి కావ్యశబ్దస్య శబ్దార్థయుగలశక్తిగ్రాహకే ప్రమాణే ప్రాగుక్తాద్వ్యవహారతహః శబ్దవిశేషే సిద్ధ్యన్తీం శక్తిం కోనామ నివారయితుమీష్టే, ఏతేన వినిగమనాభావాత్ ఉభయత్ర శక్తిరితిప్రత్యుక్తం, తదేవం శబ్దవిశేషస్యైవ కావ్యపదార్థత్వే సిద్ధే తస్యైవ లక్షణం వక్తుం యుక్తం నతు స్వకల్పితస్య కావ్యపదార్థస్య ఏషైవ చ వేదపురాణాది లక్షణేష్వపిగతిః, అన్యథా తత్రాపీయం దురవస్థా స్యాత్

తెనుఁగు తాత్పర్యము

ఈ సందర్భమున ప్రాచీనులు దోషములు లేక గుణములతోను అలంకారములతోను కూడియున్న శబ్దార్థములు రెండును కావ్యము" అనిరి దానిని విచా

రింతము. ఏమనఁగా శబ్దార్థములు రెండును గలసి కావ్యమనఁదగదు. అట్లనుటకు ప్రమాణములేదు. 'కావ్యమును పెద్దగా చదువుచున్నాడు' 'కావ్యమునుండి అర్థమును దెలిసికొనుచున్నాడు' 'కావ్యమును వింటినికాని అర్థము తెలియలేదు' అని లోకులవాడుక శబ్దార్థములు రెండును కావ్యము కాదనితెల్పును. పైపెచ్చు విశిష్టమగు శబ్దమొక్కటియే కావ్యమనదగును. అనియేర్పరచును (చదువుటయు, వినుటయు శబ్దమునకే చెల్లునుగాని యర్థమునకు చెల్లవుకదా! మఱియు అర్థము కూడ కావ్యమ్మేయగుచో కావ్యము విన్నప్పుడు శబ్దముతెలియుచుండగా అర్థము తెలియకుండుట కుదురదు. ఇందువలన శబ్దమొక్కటే కావ్యము. అర్థము కావ్యము కాదని తేలినది.) పైవాడుక నొక్క శబ్దమునందే లక్షణతో కుదుర్పవలెనందురా? కుదుర్పవచ్చునుగాని పెద్దలనుకొన్నట్లుగా శబ్దార్థములు రెండును కావ్యపదమున కర్థమని నిరూపించు దృఢతర ప్రమాణమేది? అదియే కన్పడదు. అదియున్న గాదాపైవాడుకలోని ముఖ్యార్థమునకును (శబ్దార్థములు రెంటికిని) బాధయేర్పడును. అదికదా లక్షణకు బీజము. విరుద్ధబుద్ధితోనుండువారి (ప్రాచీనుల) మాట మన మాదరింపరాదు. ఇట్లు కావ్యపదము శబ్దార్థములు రెంటిని తెల్పునని దృఢపరచు ప్రమాణమేదియు లేదు; కనుక కావ్యపదమునకు శబ్దము నొక్కదానిని తెల్పుటకే శక్తియున్నదని సిద్ధించును. దీనినెవరు వారింపగలరు? ఇందువలన వినిగమకము ఏకపక్షమును స్థాపించుయుక్తి లేదు; కనుక శబ్దార్థములు రెండును వాచ్యములే అను ప్రసంగము తొలగిపోయినది. కాగా ఇప్పటికి శబ్దవిశేషమే కావ్యమని సిద్ధించినది. కనుక దానికే = ఆశబ్దవిశేషమునకే లక్షణముఁ జెప్పవలెను. కాని తామునొంతముగా కల్పించుకొన్న కావ్యపదార్థమునకు చెప్పదగదు. ఇదియే వేదములు, శాస్త్రములు, పురాణములు మొదలగువాని లక్షణముల యొద్దనుగూడ నడక. ఇట్లు కానిచో నచటగూడ నీ దురవస్థయే తటస్థించును.

సంస్కృత మూలము :

యత్త్వాస్వాదోద్బోధకత్వమేవ కావ్యత్వ ప్రయోజకం తచ్చ శబ్దేచార్థేచా విశిష్టమిత్యాహుః తన్న; రాగస్యాపి రసవ్యంజకతాయా ధ్వనికారాది సకలాలంకారిక సమ్మతత్త్వేన సుకృతే లక్షణీయత్వాపత్తేః; కింబహునా నాట్యాంగానాం సర్వేషాం అపి ప్రాయశస్తథాత్వేన తత్త్వాపత్తిర్దుర్వారైవ ఏతేన రసోద్బోధనసమర్థస్యైవాత్ర లక్ష్యత్వమిత్యపి

పరాస్తమ్ ; అపిచ కావ్య పదప్రవృత్తినిమిత్తం. శబ్దార్థ యోర్వ్యాసక్తం ప్రత్యేక పర్యాప్తం వా; నాద్యః ఏకోనద్వావితి వ్యవహారస్యేవ శ్లోక వాక్యం నకావ్యమితి వ్యవహారస్యాపత్తేః; నద్వితీయః; ఏకస్మిన్ పద్యే కావ్యద్వయ వ్యవహారాపత్తేః ; తస్మాద్వేద శాస్త్ర పురాణ లక్షణస్యేవ కావ్యలక్షణస్యాపి శబ్దనిష్ఠతై వోచితా ; లక్షణేగుణాలంకారాది నివేశోపి నయుక్తః; 'ఉదితం మణ్డలం విధోః' ఇతి కావ్యే దూత్యభిసారికా విరహిణ్యాది సముదీరితే, అభిసరణ విధినిషేధ జీవనాభావాదిపరే 'గతోఽస్తమర్కః' ఇత్యాదౌచావ్యాప్త్యాపత్తేః ; న చే దకావ్యమితి శక్యంవదితుమ్; కావ్యతయా పరాభిమతస్యాపి తథావక్తుం శక్యత్వాత్; కావ్యజీవితం చమత్కారిత్వం చావిశిష్టమేవ, గుణత్వాలంకారత్వాదేరననుగమాచ్చ; దుష్టంకావ్యమితివ్యవహారస్య బాధకం వినాలాక్షణికత్వాయోగాచ్చ ; నచ సంయోగాభావనాన్ వృక్షః సంయోగీతివదంశభేదేన దోషరహితం దుష్టమితి వ్యవహారే బాధకం నాస్తీతి వాచ్యమ్ ; మూలే మహీరుహో విహంగమ సంయోగీ నశాఖాయాం' ఇతిప్రతీతేరివేదం పద్యపూర్వార్ధే కావ్య ముత్తరార్ధేతు నకావ్యమితి స్వరసవాహినో విశ్వజనీ నానుభవస్య విరహాదవ్యాప్య వృత్తితాయాఅపి తస్యా యోగాత్; శౌర్యాదివదాత్మధర్మాణాం; గుణానాం హారాది వదుపస్కారకారణ మలంకారాణాం చ శరీరఘటక త్వానుపపత్తేశ్చ ;

తెనుఁగు తాత్పర్యము :

కొంతమంది 'ఆస్వాదము నుద్బోధించుటయే కావ్యమగుటను ప్రయోజించును' అన్నారు. అదిసరికాదు. రాగముకూడ రసవ్యంజకమని ధ్వనికారాదులైన యాలంకారికులందఱునుగూడ నంగీకరించిన విషయమే. కనుకఁ బ్రకృతములో దానికిఁగూడ లక్షణముఁ జెప్పవలసివచ్చును. ఎక్కువయెందుకు? 'నాట్యాంగము లన్నియు సామాన్యముగా నీ తీరులే; కనుక ' వానికిఁగూడ నీస్థితియే రావలసివచ్చును. అది వారింప నలవికానిదికూడను. ఇందువలన రసోద్బోధన సమర్థమైనదే యిట లక్షణీయము' అనుటయు నిరాకృతమైనది. మఱియుఁ గావ్యపదము బ్రవర్తించుటకు నిమిత్తమైన ధర్మము (కావ్యత్వము) శబ్దార్థముల రెంటను గలసియే యుండునా? ప్రత్యేక మొక్కొక్కదాననే పర్యాప్తము (పూర్తి)

అగునా? మొదటి పక్షము కుదురదు 'ఒకఁడు ఇద్దఱుకాదు, అన్నట్టుగా 'శ్లోక వాక్యము కావ్యము కాదు' అను వాడుకె యేర్పడును. (వాక్యమొకటి శబ్దమేకాని అర్థముకూడఁ గాజాలదుకదా!) ఇక రెండవ పక్షముగూడనంతే. ఒకె పద్యముననే రెండు కావ్యములు (శబ్దమొకటి కావ్యము అర్థమొక కావ్యము) అని వాడుక వచ్చును. కనుక వేదములు, శాస్త్రములు, పురాణములు వీని లక్షణము వలెఁ గావ్యలక్షణము గూడ శబ్దమునందే నిష్ఠిత మగుట యుక్తము. మఱియుఁ బ్రాచీనులు కావ్యలక్షణములో గుణాలంకారాదులఁ బ్రవేశపెట్టుటయు నుచితము కాదు.

'ఉదితం మణ్డలం విధోః' అదిగో చంద్రుఁడు ఉదయంబయ్యె అను కావ్యమును దూతియు, అభిసారికయు, వియోగినియు ఈరకమువారు నుడివి నపుడు క్రమముగా అభిసరణమును విధించుటయు, నిషేధించుటయు, నిఁక బ్రదుకులేదనియు నీరకము దలంపులు వ్యక్తము లగునుకదా. ఇపుడు ఆకావ్యమును, దానితోపాటుగా 'గతో ఽ స్తమర్కః' అను సుప్రసిద్ధ కావ్యమును గూడఁ గావ్యములు కాకపోవలసివచ్చును. ఏమి? వానిలో గుణములుకాని యలంకారములుకాని లేవుకదా. ఆకావ్యలక్షణములు (ప్రాచీనులు తెల్పినది) అటనెట్లువ్యాపించును? పోనీ, యివి రెండును 'కావ్యములేకావు' అనుటకు వీలు లేదు. అట్లన్నచో వారు (ప్రాచీనులు) కావ్యమని యిష్టపడినవానినికూడఁ గావ్యములు కావనవచ్చునుగదా? వారు కావ్యమను దానియందును, మేము చూపిన దానియందునుగూడఁ గావ్యమునకు జీవితమగు చమత్కారము తేడాలేకయే యున్నది. అంతేకాక, గుణము లగుటయు నలంకారము లగుటయు నీమొదలగు నదంతయుగూడ నొక త్రోవననుసరించి నడువదుకదా? ఇంతేకాక, యీ పక్షములో 'ఈకావ్యమున దోషమున్నది' అను వాడుక కుదురదు. అదోషమైననేకదా కావ్యమని మీరొప్పినది? పోనీ, లక్షణ నాశ్రయింత మన్నచో (దానికి) బీజమైన బాధక మేమున్నది? 'అది కాదయ్యా! చెట్టున నొకయెడ సంయోగము లేకున్నను మఱొకయెడ సంయోగమున్నది' యన్నట్లుగా, నొకచోట దోషములేదనియు, మఱొకయెడ దోషమున్నదనియుఁ బైవాడుకకు భావమన్నచో నేమియు బాధకలుగఁబోదు.' అనెదరా? చెట్టుమొదటిలోఁ బిట్టలున్నవి, కొమ్మలందులేవు అన్నట్లుగా, నీపద్యమున మొదటిసగము కావ్యము, రెండవసగము కావ్యముగాదు అని లోకులందఱకు సహజముగా ననుభవము లేదుకదా. కనుక,

కావ్యమగుట పద్యమునందంతటను వ్యాపించియుండవలెనుగాని కొంతభాగమునఁ గావ్యమగుటయు, మఱికొంత భాగమునఁ గావ్యము కాకపోవుటయుఁ గుదురదు. శౌర్యాదులవలె నాత్మయందేయుండు గుణములును, హారాదులవలె నలంకరించు నలంకారములును శరీరములోఁ జేరుట తగదుకదా.

శ్రీ శర్వాణి :

## నాగేశుని మొదటి వంక

ఇక్కడ నాగేశుని వంక యిది. ఆస్వాదము నుద్భోధించుటలో శబ్దార్ధములు రెంటికిని తేడా లేదు. చమత్కార ప్రయోజకత్వము రెంటియందు నుండును. ఈలక్షణము అనఁగా చమత్కారకమగు బోధ కల్గించు జ్ఞానములో గోచరమగుటకుఁ బ్రయోజకమగు ధర్మము (ప్రకాశకారాదులు తెల్పిన లక్ష్యతా నిర్ణాయకమగు ధర్మము) శబ్దార్ధముల రెంటను నుండును. మఱియుఁ 'గావ్యముచదువఁబడినది, కావ్యముతెలియఁబడినది.' యను రెండు రకముల (శబ్దమునకు సంబంధించియు, నర్ధమునకు సంబంధించియు) వ్యవహార మగుపడుచున్నది. ఈ రెండు హేతువులఁబట్టియుఁ గావ్యపదపువృత్తికి నిమిత్తమగు ధర్మము రెంటను వ్యాసజ్యవృత్తియే. (అనఁగా శబ్దార్ధములు రెంటినిఁ గలుపుకొనియే (అంటిపెట్టుకొని) వ్యాపించి యున్నది. భగవానుఁడగు పతంజలి (వ్యాకరణమహాభాష్యకారుఁడు)కూడ 'తదధీతే తద్వేద' యను సూత్రపు భాష్యములో నీభావమునే (వేదాదులన్నియు శబ్దార్ధోభయ రూపములేయని) ప్రతిపాదించినాఁడు. లక్షణచేశబ్దార్ధములలో నొక్కొక్కటియు గావ్యమగునుగనుక "ఒకఁడు-ఇద్దఱుకారు." అనునట్లాయాపత్తియు రాదు. కాఁగా ప్రకాశకారాదులు తెల్పిన కావ్యలక్షణము నపహసింపఁదగదు. బాధకములేనిది. ఆస్వాదమునందు వైలక్షణ్యమును గూర్చినచోఁ గడమ రెండు లక్షణములనుగూడ నిర్బాధకములే. కనుక నితరమతమును దుష్టము గాదు. అనినచో నట్లే కానిమ్ము. కాని, సామాన్యలక్షణములో మాత్రము 'అదోషాది' పదములను వారును గూర్పదగదు. అట్లగుచో నేదోషము లేదు' అని. ఈవంకనుదీర్తుము. శబ్దార్ధము లాస్వాదోద్భోధములో తేడాలేనివనుట తప్పు. ఏమంటే, శబ్ద మర్ధద్వారమున నాస్వాదోద్భోధకము. అర్ధము స్వతంత్రముగా నాస్వాదోద్భోధకము. ఈవిషయము నానందుఁడు 'యత్రార్థశ్శ

బ్దోవాతమర్థ ముపసర్జనీ కృతస్వార్థౌవ్య క్తః కావ్యవిశేష స్సధ్వనిరితి సూరిభిః కథితః' అని స్పష్టపఱచెను అభినవుఁడును 'యద్యపిహి ధ్వననం శబ్ద వ్యాపారః తథాపి అర్థసామర్థ్యస్య సహకారిణః సర్వత్రానపాయాత్ వాచ్య సామర్థ్యాక్షిప్తత్వంశబ్దశక్తి మూలానురణనవ్యంగ్యేపి అర్థసామర్థ్యాత్ప్రతీయ మానావగతిః' అనెను. అనఁగా శబ్దమునకు ధ్వనన వ్యాపారమున్నను తోడుగా నర్థసామర్థ్యము అన్నియెడలను విడువకుండ నుండును. కనుక నది (వ్యంజకత్వము) ఆస్వాదోద్బోధకత్వము. దీనికిఁ (శబ్దమునకు) అర్థసా మర్థ్యముననే యేర్పడును. శబ్దశక్తి మూలానురణన వ్యంగ్యస్థలమునందు గూడ నర్థసామర్థ్యమునుండియే ప్రతీయమానమగు నర్థము అవగత మగును అని. ఇందువలన తేలినదేమి? కావ్యశబ్దమునకు స్వతంత్రముగా నా స్వాదోద్బోధకత్వమేమియు లేదనియు, నర్థానుగ్రహప్రసూతమేయనియు, (కనుక) నద్వారకమగు నాస్వాదోద్బోధకత్వము అర్థమునందును, సద్వా రకమగు నాస్వాదోద్బోధకత్వము శబ్దమునందు నుండునని తేలినది. ఇపు డారెండును(శబ్దార్థములును) ఆస్వాదోద్బోధనమునందే తేడాలేవని నాగేశుఁ డనుట తప్పుమాటేకదా. సద్వారకమగు దండమువంటి కారణమా అద్వారక కారణమగు భ్రమణము? అదికాక శబ్దైకనిష్ఠములగు యమకాదుల యాస్వాదోద్బోధకత్వమును? ఎట్లనగా 'యోజనినాగోపీతః చచారయో వల్లవాంగనా గోపీతః' అను నీ రీతి చోటులనుండునదియు

"అనురాగవతీ సన్ధ్యా దివస స్తత్పురస్సరః,
అహో! దైవగతిశ్చిత్రా ఉభయోర్న సమాగమః"

అను నీతీరుల ప్రదేశము లందుండు నాస్వాదోద్బోధకత్వమును సమాన మని యేబుద్ధిమంతుఁడనును? 'అదికాదయ్యా' 'ఆస్వాదములోఁ దేడా యున్నను తదుద్బోధకత్వములలో శబ్దార్థములలోఁ దేడాలేదు అనుటయు దగదు. యమకకృతమగుచోటుల సార్థకయమకములు,నిరర్థకయమకములు, దీనిని బట్టియు నాస్వాదోద్బోధకత్వము విభిన్నమే. ఎట్లనగా, 'గారుత మాహాత్మ్యశన భీరుతమామలయనేలభృతమధుకరవా మారుతమా మలయా చలమారుతమా నీదుకాని మది మారుతమా' ఇత్యాదులగు సార్థకయమకము లకును

'అన్నైతర పన్నైతర దున్నైతర కన్నడంబుతోపిడి చెత్తా
చెత్తా చెల్లా చెదరా చెదరాయిత పదరకంపతోపిడిచెత్తా" ఇత్యాది నిరర్థక యమకములకును ఆస్వాదము నొదవించుటలో దేడాలేదనగలమా? శబ్దత్వమను సామాన్యధర్మమును బట్టి యీరెండు చోటులను అనుగతమొనర్తు మనుట తగదు. అపుడు రాగాదులందుగూడ వైశబ్దత్వమను ధర్మమును బట్టి యనుగతిఁ జేయరాదుగదా. రాగాదులందు రసాద్యుద్బోధకత్వము రసాది సామగ్రిను ద్బోధించుట ద్వారమునఁ నేర్పడుననియే పెద్దలతలంపు. ఈ సార్థక నిరర్థక యమకములకు నట్టిమనోవికాసమును సమకూర్చు శక్తి లేదుగదా. కనుక, నాస్వాదోద్బోధకత్వము శబ్దార్థములకు సమానమనుటతోపాటు అది సామాన్యలక్షణ మనుటయుదప్పే. నాట్యాంగములకు రాగములకుఁ గూడ నాస్వాదోద్బోధకత్వము సర్వాంగీకృతమే కనుక నవికూడఁ గావ్యములు కావలసివచ్చును. ఆస్వాదమునందు వైలక్షణ్యమునుగూర్చి తక్కిన రెండులక్షణములను సరిపెట్టఁబోవుటయుఁదప్పే. 'ఆ వైలక్షణ్యమేమిటి?' యని యెవరినైన నడిగినచో నేమి సమాధానముఁ జెప్పగలరు? రసాదుల యాస్వాదము ద్వారమున వైలక్షణ్యము గుదురదు. రసాదులు సర్వేసర్వత్ర యొకేరూపమున నాస్వాద గోచరములగును; గనుక, రాగవ్యక్తములైనను, నాట్యాంగవ్యక్తములైనను, గావ్యవ్యక్తములైనను నట వైలక్షణ్యము నుడువ నవకాశములేదు. అట్లే రసోద్బోధనముగూడఁ బైస్థలములందు అవిలక్షణమే. కాఁగా, నావైలక్షణ్యము దుర్నిరూపము. ఇట్లు తాను నిరూపింపలేని వైలక్షణ్యమును లక్షణములోఁగూర్చుట తెలివిగల పనికాదు. శబ్దజన్యత్వమనుచో నాట్యాంగములలోఁగొన్నింటికి వ్యాప్తికల్గినను మిగిలినవియు రాగములును గావ్యములయిపోవును. కావ్యజన్యత్వము వైలక్షణ్యమనుచో నాత్మాశ్రయమను దోషముతప్పదు. కావ్యజన్యాస్వాదోద్బోధకము 'కావ్యము' అనియుఁ, గావ్యప్రతిపాద్య రసోద్బోధకము 'కావ్యము' అని లక్షణములు రెండును గావ్యఘటితములే కదా. ఇఁక నాత్మాశ్రయమెట్లు తొలఁగును? కనుకఁ, బ్రకాశకారాదుల లక్షణముతోపాటు కడమ రెండు లక్షణములు (ఆస్వాదోద్బోధకత్వము, రసోద్బోధకత్వము అనునవి) అనేకములగు పాట్లుపడుటయేకాక, యుపహసింపఁదగినవియు, నుపహసింపవలసినవియుగూడనైనవికదా. ఈలక్షణములనఁట, పండితరాజఁట, సరే

యని యంగీకరించినాఁడఁట! 'అదోషా' అనునది సామాన్యలక్షణములోఁ జేరరాదన్నాఁడఁట!!! ఈ నాగేశుని ప్రసంగమునకుఁ బండితరాజు మాటలలోఁ జీమకాలంతైన చోటున్నదా?

## పాణిని సూత్రము

ఇఁక 'తదధీతే తద్వేద' (4-2-59) యను పాణిని సూత్రపు భాష్యములోఁ బతంజలి వేదాదులు శబ్దార్థోభయ రూపములని పూర్వపక్ష మొనర్చి యట్లుకాదని ఖండించినాఁడు. వినండి. "కిమర్థ మిమావుభౌ అపి నిర్దిశ్యేతే నయోఽధీతే వేత్త్యప్యసౌ; యస్తు వేత్తి, అధీతేఽప్యసౌ; నైతయోరావశ్యక స్సమావేశః; భవతిహి కశ్చిత్సంపాఠం పఠతి నచవేత్తి కశ్చిత్త్వేత్తి న చ సంపాఠంపఠతి." (ఇచట నధ్యయన వేదనముల రెండిటి నెందుకుఁ జెప్పినాఁడు? ఎవఁ డధ్యయనమొనర్చునో, మాటలఁ జదువునో, వానికి నర్థముఁ దెలిసియుండ నక్కఱలేదు. ఎవనికి నర్థముఁ దెలియునో వాఁ డధ్యయనముఁ (మాటలఁ జదువుటను) జేసికూడ నుండ నక్కఱలేదు. ఇట్లు కూడ నుండునుగదా. ఒకఁడు గ్రంథపాఠమును జక్కఁగాఁ బఠించును. అయితే వాఁడర్థము నెఱుఁగఁడు. ఒకఁ డర్థము నెఱుఁగును కాని వాఁడు గ్రంథపాఠమును బఠింపఁడు. ఈభాష్యమేమి చెప్పుచున్నది? పూర్వపక్షి వేదాదికము శబ్దార్థోభయాత్మక మనుకొని యధ్యయనవేదనముల రెంటిని సూత్రములో నిర్దేశింపఁబనిలేదన్నాఁడు. భాష్యకారుఁడది తప్పన్నాఁడు. ఎట్లనగా, నొకఁడు వేదమును శబ్దపాఠమును జక్కఁగా నధ్యయనమొనర్చును. కాని, యతని కర్థము దెలియదు. మఱొకనికి వేదముయొక్క యర్థము చక్కఁగా నెఱుఁగవచ్చును. కాని యతఁడు శబ్దసంపాఠమును బఠింపలేదు. అనఁగా నధ్యయనముఁ జేయలేదు. కనుక, నీయధ్యయనవేదనములు రెండును తప్పక కూడియే యుండవలసిన యావశ్యకములేదు. కావున యధ్యయనముచేత వేదనముగాని, వేదనముచే నధ్యయనముగాని సిద్ధించు నవకాశము లేదు. కాఁబట్టి పరస్పరవ్యభిచారులైన 'అధ్యయన వేదనము'లను సూత్రములోఁ బాణిని కూర్చెనని తేలినది. ఇపుడు వేదము శబ్దార్థోభయాత్మకమగుచో నధ్యయనము వలననే యర్థావబోధకూడ గావలసియుండును గదా! అట్లు కాదనికదా యవి రెండును ఒకదానిచే నొకటి సిద్ధింపవనిచెప్పినది? అదికాక, సూత్రములో 'అధీతే' యని ప్రత్యేకముగాఁ బేర్కొనుటవలన "స్వాధ్యాయోఽ

ధ్యేతవ్యః '' అను శ్రుతికి కేవల వేదాక్షర గ్రహణమే పరమ తాత్పర్య మనియు, వేదము శబ్దైకరూపమనియు విస్పష్టమైనది. కనుకనే " అధ్యయన మాత్ర వతః '' అను బ్రహ్మసూత్రముగూడఁ బైవానితో నేకకంఠ మగు చున్నది. వేదాదు లుభయాత్మకములను వాదమును '' నైతయోరావశ్యక స్సమావేశః " అను భాష్య వాక్యము నిర్దాక్షిణ్యముగ గొంతుపిసుకును. ఇట్లు పతంజలి, వ్యాసుఁడు, మొదలగు వారందఱుగూడ వేదాదులు శబ్దైకరూపము లని సిద్ధాంతపఱచియున్నారు. కాఁగా; బతంజలి యుభ యార్థక మన్నాఁడను నాగన్న వాదము అసత్యమును, అనుప పన్నమును. వేద ముభయాత్మక మగుచో నధ్యయన మొనర్చినపుడు వేదశబ్దమువలె వేదార్థముగూడఁ దెలిసియుండియే తీరవలెను. ఇందువలన, నప్రామాణిక మును, శ్రీ శంకరాది సకల విద్వన్మూర్ధన్య గర్హితమును నగు స్ఫోట శబ్దమును బట్టుకొని ప్రేలాడినను గతిలేదని స్పష్టము.

ఈ కావ్యలక్షణమును నిరూపించు సందర్భమున నొక విశేష మవశ్యముగా గ్రహింపవలసియున్నది. 'ప్రాచీనతముఁడును, ఈయలంకార శాస్త్రమునకు నాదితమమగు గ్రంథమును రచించినవాఁడును నగు వ్యాసుఁడు అగ్నిపురాణములో '' సంక్షేపాత్కావ్య మిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావలీ '' అన్నాఁడు. భరతుఁడు నాట్యసూత్రములో '' వాచి యత్నస్తు కర్తవ్యః నాట్యస్యైషా తనూః స్మృతా " అనియు, నాచార్య దండి కావ్యాదర్శములో "శరీరం తావదిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావలీ" అనియు, భోజరాజు సరస్వతీ కంఠాభరణములో '' నిర్దోషం గుణాలంకార రసవద్వాక్యం కావ్యమ్ '' అనియుఁ, బీయూషవర్షుఁడు(జయదేవుఁడు) చంద్రాలోకములో ''నిర్దోషం గుణాలంకార లక్షణరీతి వృత్తిమత్ '' అనియు, వామనుఁడు '' విశిష్టపద రచనా రీతిః " అనియు, విశ్వనాథ కవిరాజు సాహిత్య దర్పణములో '' వాక్యం రసాత్మకం కావ్యమ్ " అనియు, శౌద్ధోదనుని యలంకార సూత్రములో " రసాది మద్వాక్యం కావ్యమ్ " అనియు, మహిమభట్టు వ్యక్తి వివేకములో '' ధ్వన్యాత్మకం వాక్యం కావ్యమ్ " అనియు, నానంద వర్ధనుఁడు ధ్వన్యాలోకములో " తత్రచారుత్వాతిశయ విశిష్టార్థ ప్రకాశన లక్షణే ప్రయోజనే కర్తవ్యే యది శబ్దస్య అముఖ్యతా " అనియు, నభినవ

గుప్తుఁడు లోచనములో "శబ్దస్తావ చ్ఛరీరభాగ ఏవ నివిశతే, సర్వజన సంవేద్య ధర్మత్వాత్ స్థూలకృశాదివత్ అర్థః పునః సకలజన సంవేద్యో నభవతి" అనియు, నర్థము కావ్యశరీరముగాదని వ్యవచ్ఛేదించుచు శబ్దము మాత్రమే కావ్యమని స్పష్టముగా సిద్ధాంతపఱచిరి. ఇట్టు లగ్నిపురాణము మొదలు ఆచార్య దండి యభినవగుప్తాదులవఱకు శబ్దమే కావ్యమని చాల మంది యాలంకారికుల సంప్రదాయము. ఈసంప్రదాయపు ద్రోవనుంచి తొలఁగి, భామహుఁడు, మమ్మటుఁడు, విద్యానాథుఁడు, మొదలగు కొద్ది మంది శబ్దార్థములు రెండును గావ్య మనిరి. మహా ప్రామాణికుఁ డగు నభినవుఁడు అర్థము కావ్యశరీరముగాదని వ్యవచ్ఛేదించుచు శబ్ద మొకటియే కావ్యమని నిష్కర్షించుచుండఁగా, వ్యాస భరతాదులు శబ్దమే కావ్యమని యుపక్రమించి తెలుపుచుండఁగాఁ, బ్రామాణికుఁడెవ్వఁడు మార్గాంతరమునఁ బోఁగలఁడు? 'అర్థము సర్వజన సంవేద్యము కాదు' అను యుక్తితో 'అర్థము కావ్యశరీరము గాదు' అన్న యభినవుని మాటయే నాగేశుని 'కావ్యము తెలిసినది' అన్న వాదుకు యన్యథా సిద్ధమే యనియు, 'గావ్య శరీర మర్థము గాదనియు వ్యక్తపఱచినది, 'కావ్యము శబ్దార్థోభయాత్మకము' అనిన నాగన్న వాదమును ఖండించినది. ఇట్లుపపత్తియుఁ బ్రమాణమును సంప్రదాయమును మాత్రమేకాక "కవి కర్మకావ్యమ్" అను వ్యుత్పత్తియుఁగూడ భరతుఁడు "వాచి యత్నస్తు కర్తవ్యః" అని యన్నట్లు శబ్దమే కావ్యమని స్థిరీకరించినది. కాఁగా, రమణీయార్థ ప్రతిపాదక శ్శబ్దః కావ్యమ్" అను పండితుని లక్షణము పైన యుపపత్త్యాది చతుష్టయమును సురక్షిత మొనర్చినది.

మఱియు నింకొకవిశేషముఁగూడ నవశ్యముగా గ్రహింపవలయును. రామాయణాదులు "శోక శ్లోకత్వ మాగతః" అని భావచమత్కారముఁ గావ్యలక్షణమన్నవి. "వాగ్వైదగ్ధ్య ప్రధానేపి రసఏవాత్ర జీవితమ్" అని భరతుఁడు, "ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్" అని క్షేమేంద్రుఁడు మొదలగువారు రసచమత్కారము నాదరించిరి. "కావ్యం కల్పాంతరస్థాయి జాయతే సదలంకృతి" "కావ్యంగ్రాహ్య మలంకారాత్" ఇత్యాదిగా దండి, భామహ, ఉద్భట, వామనాదులు గుణాలంకారాదుల చమత్కారమునఁ గావ్యమును గుర్తించిరి. ఆనంద అభినవాదులు వ్యంగ్య

చమత్కారము కావ్యలక్షకమనిరి. ఇట్లు ప్రాచీనులు, నవీనులు, ప్రాచీనతములు, నవీనతములుగూడఁ గావ్యమును జమత్కారముననే ప్రధానముగా గుర్తించిరి. ఇట్లు వేర్వేరు త్రోవలఁబోవు నీ యాలంకారికు లందఱికిని (రసాత్మవాదులు, రీత్యాత్మవాదులు, వక్రోక్త్యాత్మవాదులు, వ్యంగ్యవైభవాత్మవాదులు, ఔచిత్యాత్మవాదులు) కావ్యమును గుర్తించుటకుఁ బ్రధానమైన సాధనము 'చమత్కారమే' యనుటలో విప్రతిపత్తి లేక సమన్వయమేర్పడుచున్నది. ఈవిషయమును గుర్తించియే 'రమణీయ' శబ్దముతో లక్షణము నుపక్రమించి, దానినిచటఁ 'జమత్కారమే' కావ్యలక్షణమని పర్యవసింపఁజేసి పండితరాజు రమణీయోపక్రముఁడైనాఁడు. ఇందువలన, సకలాలంకార శాస్త్రపండితులకును సమన్వయ మేర్పడినది. విభిన్న మార్గగాములగు ప్రజలను సమన్వయపఱచి యొక త్రోవను నడిపించుట రాజకృత్యమేకదా. కనుకనే యలంకారశాస్త్ర పండితుల నందఱినిఁ బైన నిరూపించినట్లుగాఁ జమత్కారముతో సమన్వయపఱచి, చమత్కారమను నొక లక్షణ మార్గమున సులక్షణముగా నడిపించిన యీ జగన్నాథుఁడు 'పండితరాజు' అనుటకు సర్వవిధముల నర్హుఁడేకదా. కనుకనే "మననతరి" అను శ్లోకములో "పండితధరేన్ద్రః" అనక "పండితనరేన్ద్రః" అన్నాఁడు. వివిధ మార్గగాములగు నరుల సమన్వయపఱచి యొకత్రోవ నడుపు రాజువలెఁ బండితులనందఱి నీశాస్త్రములో సమన్వయపఱచితిననియు, నాసమన్వయ మలంకార శాస్త్రమునంతను మననమొనరించుట వలననే చేయఁగల్గితిననియు వ్యక్తపఱచినాఁడు. మఱియు సకలాంధ్ర భువనోపజీవ్యుఁడైన తెలుఁగుల యాదికవి నన్నయభట్టారకుఁడు తెల్పిన "సారమతిన్" అను పద్యములోఁ 'గవితా లక్షణము, శయ్యాపాకము' అను రెంటిని ఇక్కడ చక్కగా సమన్వయించెను. ఎటులనఁగా, ప్రసన్నార్థయుక్తిని, పాకమును "రమణీయార్థ ప్రతిపాదకమనియు, నక్షరరమ్యతను శయ్యను 'అర్థప్రతిపాదక' మనియు సంగ్రహించె నని తెలియవలెను.

## నాగేశుని రెండవ వంక

ఇక్కడ నాగేశుఁడు మరల వంకలు దిరిగినాఁడు. గుణములను, అలంకారములను దా ననుగమ మొనర్చునఁట. అందువలన నిట దోషమును

మాని 'అదోష' పదమునొద్ద దోషనిరూపణకై పండితుఁడు ప్రయత్నించుచున్నాఁడఁట! అదెట్లనఁగా, 'కావ్యధర్మములనికానీ, రసధర్మములనికానీ గుణముల కనుగమము. కావ్యధర్మములనికానీ, కావ్యశోభాకరములనికానీ, యలంకారముల కనుగమము' అన్నాఁడతఁడు. ఇది తప్పు. 'కావ్యధర్మములు గుణములు' అనే యనుగమము దాను వెనువెంటనే చెప్పినట్లు అలంకారములం దతివ్యాప్తమేకదా. కావ్యాత్మయైన రసము చిదేకరూపముగదా. అది గుణము కనుక నట గుణాంతరములగు మాధుర్యాదులుండవు. శౌర్యాదులు ఆత్మగుణములన్న పండితరాజు మతమున గుణము లాత్మయందుండుట సరిపడునందురా? అటులయిన, నతని మతమునుబట్టి యవి మాధుర్యాదులు మూఁడేకావు. శ్లేషప్రాసాదులు పది. అవి శబ్దార్థవృత్తులని యతని నిష్కర్ష కనుక 'రసధర్మములు' అను అనుగమము గుదురదుగదా. అదియుఁగాక గుణములు మూఁడా? పదియా? అనువికల్ప మొకఁడున్నది. అసలవి దోషాభావ రూపములను నొక విప్రతిపత్తి యున్నది. ఇన్ని చిక్కులలో గుణముల కనుగమ మొనర్చుట తన తరమగునా? మఱియు, కావ్యశోభాకరములైన యలంకారములనుగా దండ్యాచార్యుఁడు "కావ్యశోభాకరాన్ ధర్మాన్ అలంకారాన్ ప్రచక్షతే" "కాశ్చిన్మార్గ విభాగార్థ ముక్తాః ప్రాగప్యలంక్రియాః" అని గుణములను కావ్యశోభాకరములని యలంకారములుగాఁ బరిగణించినాఁడు. ఇందువలనఁ గావ్యశోభాకరములను అలంకారముల యనుగమము ఉపమాదులం దతివ్యాప్తము కనుక నది తప్పని స్పష్టము, ఇఁకఁ గావ్యధర్మములు గుణములు గూడ నగును; కనుక నీ యనుగమము సర్వథా దుష్టమే. ఈవిధముగ నాగన్న పాండిత్యము బట్టబయలైనది కదా. ఇతఁ డఁట! అనుగమ మొనర్చునఁట!! "తేచాద్యాపి వికల్ప్యన్తే కస్తాన్ కార్త్స్న్యేన వక్ష్యతి" యని వాల్మీకి వ్యాసులతో మూఁడవకవియైన దండి పండితుఁ డననుగతిని స్పష్టపఱచినాఁడు. కనుక ననుగతి గుణాలంకారాల కేర్పడునని పండితుఁడు తలఁచెననుట మిక్కిలి తెలివితక్కువ ప్రసంగము.

రసము కావ్యాత్మయని యాలంకారికుల సిద్ధాంతము. గుణము లాత్మధర్మము లగుటయే యుక్తము. హారాద్యాలంకారములు శరీరమునకు వెలుపలివే. అటులే యుపమాఽనుప్రాసా ద్యలంకారములుగూడఁ గావ్య

శరీరమునకు వెలుపలివే;కాని యంతర్గతములుగావని భావము. "శరీరీకరణం యేషాం కావ్యత్వేనవ్యవస్థితం'' అని యానందుఁ డన్నాఁడు. ఇచటఁ గాశీ పండితుఁడు మహామహోపాధ్యాయ గంగాధరశాస్త్రి యిట్లు వ్రాసిరి. 'ప్రకాశకారాదుల' లక్షణములో దోషాభావగుణాలంకారములు కావ్యలక్ష ణోద్దేశతను నిర్ణయించుకోటిలోనివికావు. (అనఁగా లక్ష్యతావచ్ఛేదకములు కావు)' అని, పాపము ! ఇందువలన 'గుణాలంకారములు గావ్యశరీర మునఁ బ్రవేశింపఁ దగవు' అనిన పండితరాజు నాక్షేపము తొలఁగెనని దురాశ! కాని, యది తొలఁగలేదు సరికదా; గుణాలంకారము లప్రసక్తములు గనుక వీని నిరూపణము కావ్యశరీర నిరూపణ ప్రతిజ్ఞులగు ప్రకాశకారాదుల కప్రసక్త ప్రసంగమగునని వారెఱుఁగరు. లక్షణోద్దేశత్వము శబ్దార్థముల రెంట నున్నది. కేవల మొకశబ్దమునందే కాదు కవి కావ్యమును నిర్మించు టలో నీ శబ్దార్థముల రెండింటిని స్వీకరించునుగదా. ఈరెంటికిని అనుగత మగు కావ్యలక్షణ మేమనఁగా : 'రసజ్ఞానమున కుపయోగించు సామగ్రిని సమకూర్చు కవి తలంపులో గోచరమగుట.' ఇందుచేతనే లాస్యాంగములు కావ్యమగు నాపత్తి తొలఁగును. అవి పైఁ జెప్పిన కవితలంపులో గోచ రము గాదుకదా. ఇఁక శబ్దము మాత్రమే కావ్యమనిన పండితరాజు పక్ష ములో నా శబ్దమునందు మాత్రమే యుండు గుణాలంకారముల నిరూపణ ముచితముకాని యర్థమునందుండు వాటిని నిరూపించుట పిచ్చివాని (ఉన్మత్త ప్రలపి తత్వాపత్తేః) వాగుడు కావలసివచ్చును. రసమున నుపయోగించును (శాస్త్రిగారి లక్షణములో రసోపయోగి పదార్థముల సంఘటించు తలంపునకు అవసరముగాన కవికవి తెలియవలెను.) కనుక వాటిని నిరూపించితి మనుట కుదురదు. కావ్యాంగముల నిరూపింతునని ప్రతినచేసినవాఁడు రసోపయో గుల నిరూపించుట యసంగతముగదా? అని యాక్షేపము. దీనిని విచా రింతము. ఇట ప్రకాశకారుని వాక్యము 'అదోషములు, సగుణాలంకార ములు నగు శబ్దార్థములు కావ్యము' అనికదా. ఈ లక్షణవాక్యములో, ఉద్దేశ్య విధేయభావ మున్నదా? లేదా? శబ్దార్థము లుద్దేశ్యములుకదా? అందు విశేషణములగు అదోషసగుణ సాలంకారత్వము లుద్దేశ్యతా నియామకము లేల కావు ? కావనుటకు హేతువేమి ? యుక్తియేమి? 'విలక్షణమగు

యుద్దేశ్యతను నియమింపకుండ నుండునా? అట్లు నియమింపనిచో "కేవల శబ్దార్థములు' అను లక్షణము 'కచటతప' యనుచోట నతివ్యాప్తముగాదా? కనుక 'అదోషాదికము' ఉద్దేశ్యతా నియామకమని తీరవలెను. 'అదికాదు' అనుటలో, న్యాయాలంకారశాస్త్రముల విజ్ఞానమేమియుఁ గన్పడదు ఇంకొక రీతి విచారింతము. అదోషాదికము ప్రాచీనులు కావ్యశరీర మనుచున్న శబ్దార్థములందు నిత్యానుబద్ధము లగుటయేకాక ప్రకృత సందర్భములో నవశ్య నిర్దేశ్యములుకూడ గనుక నది యుద్దేశ్యతను నియమింపకమానదు. కాదన్నచో దోషమును ముందే నిరూపించితిమికదా. కనుక దానిలో విశిష్టము లగు శబ్దార్థములే లక్షణోద్దేశ్యములని యొప్పుకొని తీరవలెను. అపుడు పండితుఁడు చెల్పిన దోషము (లక్షణ శరీరములో జేరదగనివి చేర్చుట యను నట్టిది) తప్పనే తప్పదు. చక్కఁగా విచారించుచో నీ "అదోషౌ సగుణౌసాలంకారౌ శబ్దార్థౌ కావ్యమ్" అను లక్షణమునం దతివ్యాప్తియో, యవ్యాప్తియో, యేదియోయొకదోషము దీనినెంత పరిష్కరించినను లక్షణమునందు దుర్గంధమువలె జన్మతస్సంబంధమై విడువనే విడువదు

ఇఁక 'కచటప' యను స్థలములో స్వరూపమను నర్థము, వర్ణాత్మక శబ్దమును, అర్థవ్యక్తియను గుణమును, వర్గాద్యక్షరములై తద్జ్ఞాపకములు గనుక ముద్రయను అలంకారమునున్నవి కదా. దోషముగూడ లేదు కనుక నతివ్యాప్తి తప్పదు. 'వర్గాద్యక్షరములుండుట ముద్రకావచ్చునుగాని చమత్కారము లేదు. కాన నలంకారముగాదు. ఇఁక నతివ్యాప్తిరాదు." అందురా? చిట్టచివర కలంకార గతముగానైనను చమత్కారము (పండితుఁడు చెప్పిన దానిని) లక్షణములోఁ జేర్చుకొనిననే కాని మీ కతివ్యాప్తి తప్పెడు గతిలేక పోయినది. పాపము. ఇంత తంటాలు పడినప్పటికి మీకవ్యాప్తి తప్పదు. ఇట శబ్దార్థములను ద్వంద్వము వలని సాహచర్యము గ్రహింపవలెనని ముందు మీరు నుడువఁబోవు నట్లుగా, నిచట గుణసాహచర్యమువలన నీ యలంకారములు వాచ్యములే యనక తీరదు. అపుడు వ్యంగ్యములగు నలంకారములు వస్తువు, రసము, భావము మొదలగువాని చమత్కారము సంగ్రహింపఁబడలేదు కనుక 'గతోఽస్తమర్కః', 'అదిగో చంద్రుఁడుదయంబయ్యె' నిత్యాది కావ్యము లందు, వ్యంగ్యైక చమత్కారము లందు నవ్యాప్తి తప్పదు అంతేకాక,

"కందర్పుని చందముగాఁ గుందములు మిళిందములును
గోవిందుండానందంబున బృందారక సందోహము
కందళింపఁ జందురుఁడలరెన్."

(కవి రంజాభరణము. వేంకట రామకృష్ణకవులు) అను నిరన్వయ పద్యమున నతివ్యాప్తి తప్పదు సౌకుమార్యమను గుణము, సబిందుకదకారాను ప్రాసము, అలంకారము నున్నవికదా. నిరన్వయ దోషమొకటే కనుక మీ సిద్ధాంత ప్రకార మది కావ్యత్వమును భంగింపదు. అల్పదోషమున్నను ఆక్షేపములేదని మీసిద్ధాంతమేకదా అథవా మీరు పరిగణించిన దోషములలో నిరన్వయత్వము లేదుగదా. కనుక వ్యంగాదులం దుండు చమత్కారము (వాచ్యవస్తువు మొదలగు పదగ్రాహ్యములు) గ్రహింపఁబడనంతవఱకు నవ్యాప్తి దీనివెన్నంటియే యుండును. అంతయేకాక, యట్లు చమత్కారక మగు నర్థముఁ బ్రతిపాదించుట యను విశేషము శబ్దమునందు నివేశింప నంతవఱకు, విధవా బ్రహ్మచారులవలె నీ శబ్దముల సమావేశము దుష్టమే యగును. పై పెచ్చు 'అదోషౌ' అనుదానికి స్ఫుటముగా దోషములు లేకుండుట యను అర్థమును దప్పే యగును. "తదల్ప మపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన" యను దండ్యాచార్యుని వాక్యము బాధించును. అయితే సర్వథా నిర్దోషములైన కావ్యములు విరళములే. కానిండు; మన మేమిచేయఁగలము? సహృదయ చక్రవర్తి యానందవర్ధనుఁడన్నాఁడుకదా "ఏతావతి సంసారేద్విత్రాః పఞ్చషా వా మహాకవయః" అని. కాఁబట్టి 'అదోషౌ' అని లక్షణములోఁ జేర్చుటయుఁ దప్పేయగును. అసలీ లక్షణ ములో నున్న ముఖ్యమగు లోటేమియనఁగా: శబ్దార్థములకు న్యాయముగ, సాహజికముగ నుండు సంబంధము (ప్రతిపాద్య ప్రతిపాదక భావము) నివేశింపకపోవుట. అంతమాత్రమేకాక యీ నివేశించునపుడుగూడ నా సంబంధము అలంకారశాస్త్రానుగుణముగా దృశ్యశ్రవ్యములం దుండవలసిన తీరుగా రమణీయమై, చమత్కారనిర్వాహక మగునట్లుగాఁ దీర్చి దిద్దవలసి యున్నది. అట్టిదేమియు నీలక్షణములో గ్రహింపఁబడలేదు. నిరలంకారయు, వ్యత్యస్తాలంకారయునగు వైదికపు ముత్తైదువువలె నున్న యీ లక్షణమును, రసభావాదివిలసితయు, మహాభావాదిసంపన్నయు నగునిపుణనాయికాస్థానమున నెట్లు తీసికొనిరాఁగలరు? పండితరాజు దిద్దితీర్చినాఁడు గనుకనే యాయన లక్ష

ణము సొగసు మిగులుచున్నది. ప్రాచీనలక్షణములో నస లాసంబంధమే (శబ్దార్థములకు) లేక "స్వామినః తీర్థం ప్రసాదః''లన్నట్లు శబ్దానికి శబ్దమే, యర్థానికి అర్థమే. కనుక నీ ప్రకాశకారాదు లగు ప్రాచీనుల లక్షణము సర్వ విధముల నసమంజసము, నుపహాసనీయముఁగూడ నైనది. ఒకశ్లోకములోని "వన్దారు జనమన్దారం వన్దేఽహం రఘునన్దనమ్'' అనియు, వేఱొకశ్లోకము లోని "పూర్వం ప్రభూషితో రాజ్ఞాం హృదయేఽగ్ని రివ స్థితః'' అనియుఁ గలసి కావ్య మేల కారాదు ? 'శబ్దార్థౌ' అను ద్వంద్వమునుబట్టి సహచరిత శబ్దార్థములే కావ్య మని నిర్ణయింపవచ్చునా ? సర్వత్ర ద్వంద్వము సాహ చర్యముననే లేదు. "రావణార్జునౌ, రామరావణౌ" అని విరోధమునఁ గూడ నున్నవి. కనుకఁ బై మాట యడ్డుపుల్లయే గాని గట్టిగ నిలువగలది కాదు. విలువఁగలదియుఁ గాదు. తుష్యతు. మీరన్నట్లు శబ్దార్థములకు సాహచర్యము దప్పదని యంగీకరించినను ''ఆర్ద్రా వక్త్ర ప్రజ్వల త్యగ్ని రుచ్చైః'' ఇత్యాదికమం దతివ్యాప్తి తప్పదుకదా. ''ఉదితం మణ్డలం విధోః'' ఇత్యా దికమం దవ్యాప్తి యట్లే యున్నదికదా. ఎందుచేత ననఁగా : చమత్కా రము (ముఖ్యముగఁ గావ్యమును గుర్తింపఁజేయు పదము) ను గూర్ప లేదు. 'అందులకే మేము శబ్దార్థముల కనుగతలక్షణములో (గంగాధరశాస్త్రి వ్రాసినదానిలో) చమత్కారఘనమగు రసమును గూర్చితిమికదా' యని యందురా? సరే. ఇప్పుడు ప్రాచీనుల లక్షణము పూర్తిగాఁ దప్పదనియుఁ, బనికిరానిదనియు మీ రంగీకరించినట్లే కదా. కాదన్న దానిని వీడి మీరు సొంత ముగ లక్షణము నిర్మించుకొను పని యేల వచ్చినది ? దానినిఁ బరిష్కరించు పని కేల ప్రయత్నింపవలసివచ్చినది? ఇంతకు ఆ 'అదోషౌ' ఇత్యాదికము లక్షణస్వభావము (అనుగతి) లేదనికదా మీరే యనుగతలక్షణము వ్రాయు టకుఁ బూనుకొన్నది ? లక్ష్యములగు శబ్దార్థముల ననుగత మొనరింపని "అదోషౌ" ఇత్యాదికము లక్షణ మెట్లగును? కనుక లక్షణమను ప్రకాశకారాదు లపహాసనీయు లని స్వయముగ మీరే వ్యక్తపఱచినట్లైనది. ఇంతశ్రమ పడి మీరనుగతలక్షణము వ్రాసితిరికదా. దానిగతికూడ నింతయే. ఎట్లో నిరూపింతుము. చూడండి.

## నవీనలక్షణ ఖండనము

మీరు రసము నొకదానినే లక్షణములోఁ జేర్చినారు; కాని, చమ

త్కార మొక రసరూపమే కాదు, ఇంకను భావ, వస్తు, అలంకారాది రూపముగా నున్నది. కనుకఁ దత్ప్రధాన కావ్యములం దవ్యాప్తి తప్పనే తప్పదు. పోనీ. రస శబ్దము తీసివేసి ధ్వని యనెదరా? గుణీభూతవ్యంగ్య కావ్యములం దవ్యాప్తి. వ్యంగ్య మని వీటినన్నింటిని సంగ్రహించినను, వాచ్యములగు వస్త్వలంకారములు ప్రధానముగ నుండు కావ్యము లీలక్షణమునకుఁ దగలవు. రసాదియని ఆదిపదమును గూర్తుమనుటయుఁ గుదురదు. ఆదిపదము రసరీతులనుండువాటినే సంగ్రహించునుగాని (వ్యంగ్యములు మాత్రమే) వాచ్యములను (ఇతరములను) సంగ్రహింపఁ జాలదు. ఏకరీతికమగు కోటిలోనివి కాదుగదా వాచ్యవ్యంగములు ! కనుక ఆదిపదము ఘటపటముల సంగ్రహింపదు. పండితరా జీవిషయమంతయును జక్కఁగా భావించెను. కనుకనే, రసభావాది వ్యంగ్యములందును, అవ్యంగ్యములందును నుండు చమత్కారముల నన్నింటిని సంగ్రహించి చమత్కారత్వవత్త్వము కావ్యలక్షణ మన్నాఁడు. ఆయన పండితరాజపదము సార్థకమో, మీ మహామహోపాధ్యాయ పదము సార్థకమో విచారించుకొనుఁడు. ఈ విధముగ మీ లక్షణమున కవ్యాప్తి తప్పకపోవుటయేకాక మీరు లేదని చెప్పుకొన్న లాస్యాంగములం దతివ్యాప్తియుఁ దప్పదు. ఎట్లనఁగా: రత్నావళీ శకుంతలాది దృశ్యములం దాయా పాత్రములయొద్ద లాస్యాంగములఁ గూర్పఁదలఁచినపుడు కవి రసోద్బోధనము నభిలషించికదా "తతః ప్రవిశతః ద్విపదీ ఖండం గాయన్త్యౌ చేట్యౌ" "శకుంతలా శృఙ్గారలజ్జాం నిరూపయతి" "చేట్యౌ బహుతరం నృత్యం కృత్వా" ఇత్యాదిగఁ బాత్రలకు సూచన లిచ్చుటఁ జేసినది. అట్టి లాస్యాంగవాచకములగు పదములలో మీ లక్షణ మతివ్యాప్తమే కదా. ఇఁక "కవితలఁపులో గోచరములగు శబ్దార్థములు" అని తాము లక్షణము దిద్దుకొనినను దుర్గతి మారదు. ఇట్టిదానినే "భక్షితేపి లశునేన రోగశాన్తిః" అంటారు. మీదుమిక్కిలి యాత్మాశ్రయదోషము తప్పదు; సరికదా, కవి ప్రయత్నములో "ఉదితం మణ్డలం విధోః" వంటి నిర్గుణాలంకార శబ్దార్థములుగూడ నుండుటచే మీ కత్యంతనియతములుగ నభిమతములైన గుణాలంకార దోషాభావాదు లనియతము, లసంగ్రాహ్యము, లసంగృహీతము లవుచున్నవి. చివరకుఁ బండితరాజ లక్షణము కడకే చేరవలసిన గతి పట్టును. ఇట్టి పట్టులనే "ఘట్టకుటీప్రభాతన్యాయముఁ" బేరుకొందురు.పండితుని లక్షణ

ములో నీ యతివ్యాప్తి రాదు. నాటకాదులందలి లాస్యాంగవాక్యములు పాత్రధారులకు సూచకములు మాత్రమే కనుక వాని యర్థముల యభినయము వలననే చమత్కార మేర్పడును; గాని, యర్థముల కట భావన ప్రసక్తింపదు. అభినీతములగు లాస్యాంగముల భావనవలనఁ జమత్కార మేర్పడినను, తచ్చమత్కారజనక మగు భావనలో గోచరములగు లాస్యాంగములఁ బ్రతిపాదించునది యట యభినయమే కాని శబ్దము కాదు శబ్దములు పాత్రధారులకు నర్థము సూచించునుగాని భావమును గల్గింపవు. ప్రేక్షకులకును పాత్రల యభినయమే భావనఁ గల్గించును, కాని, శబ్దములు గావు. కనుకనే పండితుని లక్షణముల నన్నింటనుగూడ శబ్ద మవశ్యముగాఁ గూర్పఁబడినది. ఎటులనగా: 'రమణీయార్థ ప్రతిపాదకశబ్ద' మని మొదటిలక్షణము. 'చమత్కృతిజనక భావనావిషయార్థ ప్రతిపాదకశబ్ద'మని రెండవ లక్షణము. 'యత్ప్రతిపాదితార్థవిషయక భావనాత్వము చమత్కృతి జనకతలోఁ బ్రయోజకమో యట్టి శబ్ద' మని మూఁడవలక్షణము 'స్వవిశిష్టభావనా విషయార్థ ప్రతిపాదకతాసంసర్గమునఁ జమత్కారత్వము గల శబ్దము కావ్య' మని నాల్గవ లక్షణము. ఇట్లు శబ్దము నియతముగ లక్షణోద్దేశము కనుకనే లాస్యాంగము లం దెచ్చటకూడ నతివ్యాప్తి ప్రసక్తింపదు. లేనిచోఁ గావ్యశబ్దము గూడ వ్యంజనాద్వారమున రమణీయ మగు నర్థముఁ బ్రతిపాదించునదే కనుక నట్టిదేయైన లాస్యాంగముల యభినయము గూడఁ గావ్యము కావలసి వచ్చును. "అజ్గైపథ్యసత్త్వాని వాక్యార్థం వ్యజ్జయంతి హి" యని భరతుఁ డభినయము వ్యంజక మన్నాఁడుగదా. (నిజమునకు దృశ్యములం దా మాటలు దమ యర్థము దెలుపు నంతవఱకే, భావనఁ గల్గింపనేరవు.) పండితరాజు భావనను లక్షణములోఁ జేర్చుటకుఁగల ప్రయోజన మిదియే. నాల్గవలక్షణములోని సంసర్గమును ('స్వవిశిష్టజనకతావచ్ఛేదకార్థ ప్రతిపాదకతా' యను దానిని) నాగేశుఁ డిట్లు వివరించెను; "స్వం చమత్కారత్వం, జనకతావచ్ఛేదకార్థేతి – అర్థే భావనానిష్ఠ జనకతావిషయతా సమ్బంధేన బోధ్యా" అని. కాఁగా, పండితరాజు లక్షణములో దోషము గానీ, తమ లక్షణములో దోషాభావము గానీ ప్రసక్తింప వని స్పష్టము. మఱియొక విషయముగూడ విచారింపవలసియున్నది. పండితరాజు శబ్దమే కావ్య మని, యర్థగత గుణాలంకారాదుల నిరూపించుట యున్మత్తప్రలాప మన్నాఁడు

గంగాధరశాస్త్రి. కేవలశబ్దమాత్రమే కావ్య మన్నాఁడా, జగన్నాథుఁడు ? రమణీయార్థ ప్రతిపాదకశబ్దము కావ్య మన్నాఁడు. తాము గుణాలంకారాదులు ద్దేశ్యతను నియమింప వన్నట్లుగా నతఁడు 'రమణీయార్థ ప్రతిపాదకత్వ ముద్దేశ్యతను నియమింపదు' అనలేదు. కనుక నతనికి రమణీయార్థ ప్రతిపాదకత్వము కావ్యశరీరములోనిదే. అపుడు ప్రతిపాద్యగతములు, ప్రతిపాదకగతములు నగు నుభయ విశేషముల నిరూపించుట యప్రసక్త మగునా ? అట్లు వివరించుట మీ రన్నట్టు లున్మత్తప్రసంగమో, మరి యెట్టిప్రసంగమో విద్వాంసులే నిర్ణయింతురు. ఇంకొక సంగతి 'కేవల శబ్దార్థములే లక్షణోద్దేశ్యములు, దోషాభావాలంకార గుణాదు లేవియు నుద్దేశ్యతా నియామకములు గావు' అన్న శాస్త్రి (మీ) పక్షములో ననుద్దిష్టకోటిలోని యీ గుణాలంకారాదులకుఁ బ్రసక్తి యేది ? అప్రసక్తములగు వీనిని నిరూపించుటను ఏ ప్రసంగముగా గణింపవలెనో శాస్త్రిలే యాలోచింపవలెను. చక్కఁగా విచారించుచోఁ బండితరాజే మొదటఁగావ్య లక్షణభూమికలో, 'కావ్యము గుణాలంకారాదులతో నిరూపణీయము.' అని స్పష్టముగాఁ దెల్పినాఁడు. అనఁగా: నివి కావ్యశరీరమునకు విశేషణము లని యర్థము. నాగేశుఁడు గూడ 'గుణాలంకార' యనుచోట "విశేషణై రిత్యర్థః" అని వ్యాఖ్యానించెను. ఇందువలన శాస్త్రిల యసందర్భ ప్రసంగముల నన్నింటిని త్రోసి రాజనినట్లైనది. అర్థరమణీయతకు, గుణాలంకారాదు లుభయమును నిర్వాహకములే కనుక వాని నిరూపణ మత్యంత మావశ్యకము; అత్యంత సముచితముగూడను. చివరకు సారాంశ మేమనఁగా; 'శాస్త్రికి న్యాయాలంకార శాస్త్రముల చెంటను దగినంత పరిచయము లేదు' అని.

సంస్కృత మూలము :

యత్తు 'రసవదేవ కావ్యమ్' ఇతి సాహిత్య దర్పణే నిర్ణీతమ్, వస్త్వలఙ్కార ప్రధానానా మకావ్యత్వాపత్తేః. న చేష్టాపత్తిః, మహాకవి సమ్ప్రదాయస్యాకులీభావప్రసఙ్గాత్. తథా చ జలప్రవాహవేగనిపతనోత్పతన భ్రమణాని కవిభి ర్వర్ణితాని. కపిబాలాది విలసితాని చ. న చ తత్రాపి కథంచిత్ పరమ్పరయా రసస్పర్శోఽస్త్యే వేతి వాచ్యమ్, ఈదృశరస స్పర్శస్య 'గౌశ్చలతి' 'మృగో ధావతి' ఇత్యాదావతి ప్రసక్తత్వేనా

ప్రయోజకత్వాత్. అర్థమాత్రస్య విభావానుభావ వ్యభిచార్యన్యతమత్వా దితిదిక్.

తెలుఁగు తాత్పర్యము :

ఇఁక సాహిత్య దర్పణమున 'రస మున్నదే కావ్యము' అని నిర్ణయింపఁ బడినది. అదియుఁ దప్పే. వస్తువు, అలంకారము ప్రధానముగాఁ గలవి కావ్యములు గాకపోవలసి వచ్చును. మా కిష్టమే యనరాదు, మహాకవుల సంప్రదాయము వ్యాకులమైపోవును. జలప్రవాహము వేగముగాఁ బోవుటయుఁ, గ్రిందబడుటయు, గిఱ్ఱున సుడులుతిరుగుటయు మహాకవులు వర్ణించిరి. క్రోఁతుల చేష్టలు, పిల్లలు మొదలగువారి యాటలఁగూడ వర్ణించిరి. (అటఁ గావ్యమగుటకు రసమేది ?) అచ్చటగూడ నెటులో యటులు పరంపరగా నుండనే యుండ దనుట తగదు. ఈ రకపు రసస్పర్శ 'ఆవు కదలును, లేడి పరుగెత్తును' ఇత్యాదులయందుగూడ నుండును. కనుక దానివలన ప్రయోజన మేమి ?* అర్థమాత్ర మంతయు విభావమో, యనుభావమో, వ్యభిచారిభావమో యేదో యొకటి యగునుగదా. •

శ్రీశర్వాణి :

ఇక్కడఁ గాశీపండితుఁడు గంగాధరశాస్త్రి వాద మిది. 'ప్రకృతము లైన రసములుగాఁ బరిణమించునవి రత్యాదులుగదా. ఆభావములఁ గూర్చిన సంస్కారముల నుద్బోధించుట యంతటను సంభవింపదు. కనుక నర్థమాత్ర మంతయు విభావాద్యన్యతమ మగునను వాదము ప్రౌఢియే. (గడుసుఁదనపుమాటయే) కాని, వాస్తవపుమాట కాదు. విశిష్టములగు వాక్యార్థములలోఁ దాత్పర్యము లేనపుడు సంస్కారోద్బోధనము జరుగదుగదా. తాత్పర్యమున్నచో నచట నొకటి యున్నను తా నితరము నాకర్షించి రసవ్యక్తిద్వారమునఁ జమత్కరించును. జలప్రవాహాది వర్ణనమునందుఁగూడ మహాకావ్యార్థజ్ఞానము ఈ చెప్పినతీరున (రసతాత్పర్యమువలన) రసోద్బోధనము సమకూర్చును గనుకఁ గావ్య మగుటకు నడ్డము లేదు.' అని.

ఈ వాదములోఁ బస యేమియు లేదు. ఈరకపు వర్ణన లున్నచోట్ల నంతటను రసతాత్పర్య మున్నదా ? లేదా ? ఉన్నచో నర్థమంతయుఁ బండితుండు చెప్పినట్లే విభావాదులలో నేదో యొకటిగా నయి తీరినదికదా. ఇఁకఁ బ్రౌఢి యేది ? ఈ వర్ణనాస్థలమందుఁగాక తదితరస్థలములందు అర్థ మట్లు

రాదన్నచో, నచ్చటఁగూడ రసతాత్పర్య మను త్రోవయే కడమవానినిఁ గూర్చును. అది లేనిచోట నెట్లు ?

జమ్బూఫలాని పక్వాని పతన్తి విమలే జలే
కపికమ్పితశాఖాభ్యః గుళుగుగ్గుళుగుగ్గుళు.

ఇత్యాదులం దది లేదన్నచో నట మీ లక్షణ మగు 'రసాత్మక మగు వాక్యము కావ్యము' అనుదానికి నవ్యాప్తి తప్పదు. నిజమున కిచటఁ జమత్కార మున్నను రసోద్బోధన మసలే లేదు. పండితుఁ డన్న దదియే. (రసాత్మక ములు గాని చోటులందుఁగూడఁ జమత్కార మున్నది యని.) ఆనన్దవర్ధనుఁడు గూడ "యత్ర వాక్యే రసాది తాత్పర్యం నాస్తి" "రాజాన మపి సేవన్తే త్రియ మప్యుపభుఞ్జతే" "రమన్తే చ సహ స్త్రీభిః కుశలాః ఖలు మానవాః" అని తోడుపలుకుచున్నాఁడు. ఇచ్చట వైలక్షణ్య మవ్యాప్తమే కనుక నది'కావ్యమే కాదు'అనరాదు. "తత్ర గుణీభూతవ్యంగ్య తైవ" అని దానికిఁ గావ్యత్వము నతఁడే నిష్కర్షించినాఁడు. కాదు కూడదు. "యద్యప్యత్ర నిర్వేదాత్మక శాన్తరసప్రతీతి రస్తి" యని యభినవుఁ డన్నాఁడు గనుక నీచోట రస ప్రతీతిఁ దీసికొని వచ్చెద మన్నచో, "తథాపి చమత్కారో వాచ్య నిష్ఠ ఏవ" యని యతఁడే యీచోట రసాత్మకత్వము లేదనియు, వాచ్యమే చమత్క రించు ననియు నన్నాఁడుగదా. ఇందువలన రసము వాచ్యము గాదు గనుక వాచ్యనిష్ఠమే యగు నీచమత్కారము రసప్రసక్తి లేనిదని స్పష్టమైనది. ఈ శాంతరసముగూడ దూరప్రతీతము, సంలక్ష్యక్రమము గనుక నిది శ్లోక ములోఁ బ్రౌఢప్రముఖ వ్యంగ్యమై లేదు. ఇందువలన దర్పణకారుని లక్షణ మవ్యాప్తిదుష్ట మనియుఁ, బండితుని లక్షణము సువ్యాప్తిశిష్ట మనియుఁ దేలి నదికదా. సరి. అది యట్లుంచుడు. అర్థమాత్రము విభావాద్యన్యతమ మన్న పండితునిమాట ప్రౌఢి యనుటకు నేమి యడ్డువచ్చినది? జలప్రవాహాది వర్ణన లందు రసాత్మకత్వము లేదనుట కభ్యంతర మేమి ? కవి వివక్షవలన నట రసాత్మకత్వము గుదురు నన్నచో. నావివక్షయే యర్థమునంతను (శబ్దప్రతి పాద్యమునంతను) విభావాదులలో నేదో యొకదానినిగా సమర్థించునని చెప్పు దుము. అభినవుఁడుగూడ ధ్వనిలోచనములో "న హి రసశూన్యం కించి దస్తి" యన్నాఁడు. కాఁగాఁ బ్రౌఢివాదమని యాక్షేపించుట యనాలోచితము గాదా ?

ఈవాదమునం దింకొక తప్పున్నది. ఇటువంటి రసతాత్పర్యము లేని జలప్రవాహాది వర్ణనలందుఁ దమ లక్షణము గుదుర్చుకొనుటకై రసవివక్షఁ గల్పించుచోఁ బ్రపంచమందలి సకల వాక్యములకడను ఈరసవివక్ష కల్పితమై పై విధముగనే రసస్పర్శఁ గల్గి యా వాక్యము లన్నియుఁ గావ్యములు గావలసివచ్చును. అయినచో నేమందురా? ఇఁకఁ గావ్యము కాని దేది? మీలక్షణమువలన దేనివ్యావృత్తిని సాధింతురు.? కావ్యలక్షణమ కావ్యవాక్యముల వ్యావర్తింపవలయును గాని ఘటాదుల వ్యావర్తించి సప్రయోజనము కాఁబోదుగదా. మీపద్ధతిని శబ్దప్రతిపాద్యమగు నర్థమంతయు రసస్పర్శ కలదే యయ్యెను. ఇఁకఁ గావ్యముగాని వాక్య మేమున్నది? అన్నింటను మీకావ్యలక్షణ మతిప్రసక్తమై స్వప్రయోజకమైన వ్యావృత్తిని సమకూర్పఁజాలని దగును; ఈ భావమునే పండితుఁ డీక్రింది మాటలతో స్పష్టపఱచెను. "ఈదృశ రసస్పర్శస్య (మీరు కవి వివక్షాదికమును గల్పించుటవలన సమకూర్చునట్టి రసస్పర్శమును) గౌశ్చలతి, మృగో ధావతి ఇత్యాదావతి ప్రసక్తత్వేన (గోవు కదలును, లేడి పరుగెత్తును ఇత్యాదులం దతివ్యాప్తము (అచటఁ గూడఁ గవి వివక్షాదికముఁ గల్పించుటవలన రసస్పర్శ కలుగు ననుటచే) లక్షణ మితరవ్యావృత్తి యను తన ప్రయోజనమును నెరవేర్పలేదు) అర్థమాత్రస్య విభావానుభావవ్యభిచార్యన్యతమత్వాత్ (ప్రతి యర్థమును వస్తువు గాదు. శబ్దాదిమునఁ దెలుపఁబడునదే యర్థము. కాఁగా 'అభిధేయ' మని పర్యవసానము. వస్తు వన్నచో నీ భావము రాదు. శబ్దవాచ్య మగు ప్రతిదియు విభావాదులలో నేదో యొకటి యగును) అని.

మఱొకవిశేషముగూడ నిట గమనింపవలెను. "అర్థోఽభిధేయరై వస్తుప్రయోజన నివృత్తిషు" అన్న యమరనిఘంటువునుబట్టి వాచ్యమే యర్థము. లక్ష్యాదిక మీపద ముఖ్యార్థము గాదు. దీనివలనఁ దేలు భావ మేమి? వాచ్యమునందే నిష్ఠతో వర్ణితములైన జలప్రవాహాదుల కవివక్షఁ గల్పించి వ్యంగ్యమను రసస్పర్శఁ దెచ్చుచో వాచ్యమే ప్రధానముగఁ జమత్కారమగు చోట దానికి విరుద్ధమైన రీతి వ్యంగ్య మగు రసమునకు సంబంధముఁ దీసికొనివచుచ్చో, (ఇట్లు తెచ్చుట తప్పు) వాచ్య మంతయు వ్యంగ్యమగు రసమునకు వ్యంజకమైన విభావాద్యన్యతమమే యగును; కనుక, మీ లక్షణము వ్యావృత్తిని (తన ప్రయోజనము) సాధింపవలె నన్నచో నితర మేది? వాచ్య

మగు సర్వము విభావాదులలో నొకటియై రసస్పర్శ కలదియే యయ్యెను. ఇంక రసస్పర్శ లేని వాచ్య మేదైన నుండినఁ గదా వ్యావృత్తి(లక్షణ ప్రయోజనము) సమకూడును ? అట్లులేదు గనుక మీరు చెప్పినది లక్షణమే కాఁజాలదు. ఒకవేళ మీలక్షణ మవ్యాప్తి లేకుండ సరిపెట్టుకొనుటకై సార్వత్రికముగ వస్త్వలంకార ప్రధానస్థలములందుఁ గూడ రసస్పర్శ నాపాదించుచో దాని మూలమున విభావాద్యన్యతమత్వము వాచ్య మంతటను సార్వత్రికముగ నాపాదిత మగును. ఈరెండాపదలను మీరే స్వయముగాఁ గొనితెచ్చుకొంటిరి. అప్పటికిని మీ లక్షణ మప్రయోజకమై, యవ్యావర్తకమై, తన లక్షణత్వమునే పోఁగొట్టుకొన్నది. "ప్రాప్తేఽపి సోమయాజిత్వే నంబిత్వం నైవ ముఞ్చతి"గా మీగతి యైన దని పండితుని వాక్యములనుండి వ్యంగ్యమగు భావము. ఇట నింకొక విషయము గమనింపవలయును. పండితుఁడు లక్షణపు టవక్రమములోఁ గావ్యలక్షణము నిరూపించినచోఁ గావ్యమునకుఁ, దదితరమునకు భేదము దెలియఁదని యపక్రమించినమాట, యిచటఁ గావ్యలక్షణోపసంహారములో విశ్వనాథకవిరాజు లక్షణవ్యవచ్ఛేద ద్వారమున నుపసంహరింపఁబడినది.

అర్థమాత్రము (ప్రతీయభిధేయము – శబ్దమువలనఁ జెప్పఁబడు ప్రతిదియు) విభావానుభావవ్యభిచారిభావములలో నేదో యొకటి యెట్లగునని చాలమంది సంశయపడుచున్నారు. వారి యభిప్రాయ మిది: వస్తువు (ఘట పటాదికము) జడము గనుక విభావముగానీ, యనుభావముగానీ, కాఁగలదు గాని యజడ మగు వ్యభిచారిభావ మెట్లగునని. కాని, యిచటి సత్యమేదో వారు గుర్తింపలేదు. ఇచటి వాస్తవార్థమేదో వెనుకటి వివరణములో స్పష్టపఱచితిమి. అయినను వారి శంకానివృత్తికై వారి మార్గముద్వారముననే నివృత్తి గల్పింతుము. వస్తువు భావ మెట్లగునని కదా శంక. భావములుగూడ విభావము లగునని భావధ్వని ప్రసంగములోఁ బండితుఁడు సెప్పఁబోవుచున్నాఁడు. కాఁగాఁ, బ్రపంచములోని దేదైనను (అది వస్తువుగాని, భావముగాని) కవి వివక్షనుబట్టి మారితీరును. జడ మజడముగ, నజడము జడముగ నెట్లగునని సంశయింప నక్కఱలేదు. "భావా నచేతనాపి చేతనవ చ్చేతనా నచేతనవత్ వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతన్త్రతయా" యని ధ్వనికారుఁడే తెల్పినాఁడు. నిజమున కిచట (కావ్యములో) విభావానుభావ

ములు జడములైన వస్తువులు గావు. కేవలభావమయములు. పై పద్యములో భావపదోపయోగము గమనింపఁదగినది. కాఁగా, జడమైన, నజడమైన భావింపఁబడి భావైకరూప మైనపుడే వాటికి విభావాది సంజ్ఞ లేర్పడును. లోకములో నవి జడములే యగుఁగాక. కావ్యప్రపంచములో భావనాగోచరత నంది, (భావింపఁబడి) భావైకరూపములై భావములే యగును. నిప్పుతో నుండు కట్టెకు నిప్పురూపమే యేర్పడి నిప్పైనట్లుగా, లోకములోని వస్తువులకు భావనావ్యాప్తి వలన భావరూప మేర్పడి యవి భావములే యగును కనుకనే యవి 'భావ' శబ్దములతో (విభావ, అనుభావ, సంచారి భావములని) పిలువఁబడును. ఇట్లు కావ్యములకు విభేదము తప్పనిది కను కనే లోకధర్మి కావ్యధర్మి యనియుఁ, 'గారణకార్య సహకారులు విభావాను భావ సంచారిభావము లనియు విభాగ మేర్పడినది. ఈమొత్తము విషయమున ప్రాప్తిని (ప్రమాణము) ఉపన్యసింతుము. కుమారస్వామి సోమపీథి ప్రతాపరుద్రీయవ్యాఖ్య రత్నాపణములో రసప్రకరణమున నిట్లన్నాఁడు. "ఇవ మత్రానుసంధేయం కావ్యేన అభినయేన వా నివేద్యమాన రామాది సుఖదుఃఖాద్యనుభవజనిత వాసనారూపస్సంస్కారా పరపర్యాయ స్సామాజిక మనోవికారో భావః తదుక్తమ్.'సుఖదుఃఖాదిభిర్భావైః చావత్తద్భావభావనం' ఇతి. తస్యభావకస్య భావః చిత్తం తస్యభావనం వాసితత్వం తద్భావభావ నమ్ (భావః) తావత్ ద్వివిధః సన్నిహితో వ్యవహిత శ్చేతి తత్రాద్యః పటం ప్రతితస్తువత్ రసం ప్రత్యాకారమాత్రవ్యవహితః స్థాయిభావ ఇ త్యుచ్యతే తస్య సాక్షాద్రసభావ ప్రతిపాదనాత్. తదుక్తం ప్రకృష్యమాణో యో భావో రసతాం ప్రతిపద్యతే స ఏవభావస్థాయీతి భరతాదిభి రుచ్యతే. ఇతి. ద్వితీ యస్తు కువిన్దాది వద్భావానరవ్యవహితః విభావాదిః, తస్య స్థాయిద్వారా రసో ల్లాసకత్వ సమర్థనాత్. ఏతేన సామాజిక మనోవికారవిశేషోపాధికో బ్రహా నన్ద సబ్రహ్మచారిణో రసస్య సన్నిహిత పూర్వావస్థా విశేష స్థాయి భావ ఇతి ఫలితమ్." కావ్యప్రకాశములో "కారణాన్య థ కార్యాణి సహకారీణి యాని చ, రత్యాదే స్థాయినో లోకే తానిచే త్కావ్యనాట్యయోః, విభావా అను భావాశ్చ సాత్త్వికావ్యభిచారిణః ఉచ్యన్తే" అని తెల్పఁబడినది. ఇంతేకాక అభినవుడు ధ్వని లోచనములో "న హి రసశూన్యం కించి దస్తి రస ఏవ వస్తుతః ఆత్మా, వస్త్వలఙ్కారధ్వనీ తు సర్వథా రసం ప్రతిపర్యవస్యేతే" అనెను. ఇందువలన, బ్రహ్మశ్రీ సదాశివశాస్త్రిగారు కావ్యాలంకారచూడా మణి వివరణములో వ్రాసిన తప్పువ్రాఁతయు, నెవరో భారతి పత్రికలో వెలిబుచ్చిన సంశయములు సమాధానింపఁ బడినవి.

# ఆంధ్ర రసగంగాధరము

## ౪. కావ్య సామగ్రి

సంస్కృత మూలము.

తస్య చ తారణం కవిగతా కేవలా ప్రతిఘా; సా చ కావ్య ఘటనానుకూల శబ్దార్థోపస్థితిః, తద్గతం చ ప్రతిభాత్వం కావ్యకారణతావచ్ఛేదకతయా సిద్ధో జాతివిశేష ఉపాధిరూపం వా అఖణ్డమ్, తస్యా శ్చ హేతుః క్వచిద్దేవతా మహాపురుషప్రసాదాదిజన్య మదృష్టమ్, క్వచిచ్చ విలక్షణ వ్యుత్పత్తి కావ్యకరణాభ్యాసౌ; న తు త్రయ మేవ, బాలాదేస్తౌ వినాపి కేవలా న్మహాపురుష ప్రసాదా దపి ప్రతిభోత్పత్తేః; న చ తత్ర తయోర్జన్మాంతరీయయోః కల్పనం పచ్యం, గౌరవా న్మానాభావాత్ కార్యస్యాన్యథా ప్యుపపత్తే శ్చ; లోకే హి బలవతా ప్రమాణేన ఆగమాధినా సతి కారణతా నిర్ణయే పశ్చా దుపస్థితస్య వ్యభిచారస్య వారణాయ జన్మాన్తరీయ మన్యథా నుపపత్త్యా కారణం ధర్మాధర్మాదికల్ప్యతే; అన్యథా తు వ్యభిచారోపస్థిత్యా పూర్వవృత్తకారణతా నిర్ణయే భ్రమత్వ ప్రతిపత్తిరేవ జాయతే; నాపి కేవల మదృష్ట మేవ కారణ మిత్యపి శక్యం వదితుమ్; కియన్తం చిత్కాలం కావ్యం కర్తు మశక్నువతః కధ మపి సంజాతయోః వ్యుత్పత్త్యభ్యాసయోః ప్రతిభాయాః ప్రాదుర్భావస్య దర్శనాత్; తత్రాస్య దృష్టస్యాఙ్గీకారే ప్రాగపి తాభ్యాం తస్యాః ప్రసక్తేః, న చ తత్ర ప్రతిభాయాః ప్రతిబన్ధక మదృష్టాన్తరం కల్ప్య మితి వాచ్యమ్, తాదృశానేకస్థలగతా దృష్టద్వయ కల్పనాపేక్షయా క్లప్తవ్యుత్పత్త్య

భ్యాసయో రేవ ప్రతిభా హేతుత్వకల్పనే లాఘవాత్; అతః ప్రాగుక్తసరణి రేవ జ్యాయసీ; తాదృశాదృష్టస్య తాదృశవ్యుత్పత్త్యభ్యాసయో శ్చ ప్రతిభాగతం వైలక్షణ్యం కార్యతావచ్ఛేదకం అతో న వ్యభిచారః; ప్రతిభాత్వం చ కవితాయాః కారణతావచ్ఛేదిమ్ ; ప్రతిభా వైలక్షణ్య మేవవా విలక్షణకావ్యం ప్రతీతి నాత్రాపి సః ; న చ సతో ఽపి వ్యుత్పత్త్యభ్యాసయో ర్యత్ర నప్రతిభోత్పత్తిః తత్ర అన్వయ వ్యభిచార ఇతి వాచ్యమ్. తత్ర తయో స్తాదృశ వైలక్షణ్యే మానాభావేన కారణతావచ్ఛేదకా నవచ్ఛిన్నత్వాత్ ; పాపవిశేషస్య తత్ర ప్రతిబన్ధకత్వ కల్పనాద్వా నదోషః ; ప్రతిబన్ధకాభావస్య చ కారణతా సముదితశక్త్యాదిత్రయ హేతుతా వాదినః శక్తిమాత్ర హేతుతా వాదిన శ్చా విశిష్టా ; ప్రతివాదినా మన్త్రాదిభిః కృతే కతిపయ దివసవ్యాపిని వాక్స్తమ్భే విహితానేక ప్రతిబన్ధస్యాపి కవేః కావ్యానుదయస్య దర్శనాత్.

తెనుఁగు తాత్పర్యము :

ఆకావ్యమునకుఁ గారణము కవియం దుండు ప్రతిభ యొక్కటియే. కావ్యములఁ గూర్చుట కనుకూలములగు శబ్దములయు, నర్థములయు నుపస్థితియే యది. ఆయుపస్థితి ప్రతిభ యగుట యనఁగా నేమి ? కావ్యమున కిది కారణ మని నిర్ణయించుటకుఁ దగినట్టి ధర్మ ముండుటయే పై నిర్ణయమున సిద్ధించిన యా ప్రతిభాత్వమను ధర్మమొక విశిష్ట మగు జాతి, యథవా యఖండ మగు నుపాధి. ఆ ప్రతిభ యొక్కయెడ దేవతలు, మహాపురుషులు మొదలగువారి యనుగ్రహము వంటి వానివలన నదృష్ట మేర్పడి దానివలన జనించును. మఱియొకచోటఁ గ్రొంగ్రొత్త లకపు వ్యుత్పత్తియుఁ గావ్యరచన సలపరుచుకొనుటయు, నీరెండు గూడి ప్రతిభను గల్పించుటయు జరుగును. అంతేకాని, యీమూఁడును (ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములు) గలసి యొకేకారణ మనరాదు. విలక్షణమగు వ్యుత్పత్తియు, నలవాటును లేకున్నఁగూడఁ బిల్లలు మొదలగువారియందు మహాపురుషుల యనుగ్రహముననే ప్రతిభ యుదయించినది. (మూకపంచశతియను గ్రంథ మిట్లేర్పడినదే యని చెప్పుదురు.) వెనుకటిజన్మలోని వ్యుత్పత్త్యభ్యాసములు ఇపు డున్నవని కల్పించుట తగదు. కల్పనాగౌరవమేకాక ప్రమాణముగూడఁ

గన్పడదు. ఇపుడు ప్రత్యక్షానుభవములోని మహాపురుషానుగ్రహము వలననే యిట సరిపడుచుండఁగాఁ గనుపడని జన్మాంతరీయమైన కారణముఁ గల్పించుట మఱొక దోషము.

లోకములో సామాన్యముగ నాగమము మొదలగు బలిష్ఠమైన ప్రమాణ మొకదాని కొకటి కారణమని నిర్ణయించినపు డెచటనైన వ్యభిచారము తటస్థించినచో వారించుటకై జన్మాంతరీయమగు ధర్మాధర్మాదికముఁ గారణ మని కల్పింతురు. అట్లుగానిచో, నాగమాదిప్రమాణములు నిరూపించిన కార్యకారణభావము వేరువిధమునఁ గుదురదు. పోనిమ్మనుటకు వీలులేదు. ఆగమాదులదివరలో నొనర్చిన కారణతానిర్ణయము భ్రమ యనుకొనఁబడును.

పోనీ. ఒక యదృష్టమే కావ్యమునకుఁ గారణ మనుటయుఁ గుదురదు. కొంతకాలము దనుకఁ గావ్యము రచింపని వానికి నెట్టెట్టో వ్యుత్పత్తియు, నభ్యాసము గలుగగాఁ బ్రతిభ యుదయించుటఁ గన్పడుచున్నది. అటఁ గూడ నదృష్ట మొక్కటియే కారణ మని యొప్పినచో నీవ్యుత్పత్త్యభ్యాసము లుదయింపక పూర్వమే యా ప్రతిభ కల్గవలసివచ్చును అప్పు డాప్రతిభ మరలఁ బుట్టకుండఁ జేయు నింకొక యదృష్టముఁ గల్పించుటయుఁ దగదు. ఇట్టి స్థలములం దంతటను ప్రతిభ నుత్పాదించు నదృష్టముఁ, బ్రతిబంధక మగు నదృష్టము నని రెండదృష్టములఁ గల్పించుటకన్న నిదివఱకే కారణములుగా సిద్ధమైన వ్యుత్పత్త్యభ్యాసమునే యా ప్రతిభకుఁ గారణము లనుట తేలికకాదా? కనుక మేము వెనుకఁ జెప్పిన త్రోవయే మెఱుఁగు.

అయితే యట్టి యదృష్టముఁ గలిగించు ప్రతిభయు, వ్యుత్పత్త్యభ్యాసముల నుండి కల్గిన ప్రతిభయు వేరువేరు తీరులగనే యుండును. ఆవైలక్షణ్యములే యా యా విలక్షణ కారణములనుండి యా యా ప్రతిభలు జనించిన వని నిర్ణయించును; గనుక 1. వ్యభిచారము రాదు. 2. కవితాసామాన్యమునకుఁ గారణతను నిర్ణయించునది ప్రతిభాత్వము. విలక్షణమైన కావ్యమును గుఱించి కారణత్వముఁ బ్రతిభయందలి వైలక్షణ్యమే నిర్ణయించునని యైనఁ జెప్పవచ్చును. అపుడు 3. నిది యిటఁ బ్రసక్తింపఁ బోదు. అయితే యొక్కొకచోట, వ్యుత్పత్తి, 4. యభ్యాసము రెండున్నను ప్రతిభ కలుగుటలేదే? అపు డన్వయవ్యభిచారము (కారణ ముండియుఁ గార్యము గలుగక

పోవుట) రాదా? రాదు. ఎట్లన: వ్యుత్పత్త్యభ్యాసము లున్నను ప్రతిభ కలుగ లేదని మీరే యనుచుంటిరి. ఆ రెండును ప్రతిభఁ గల్గింపఁ గలవనుటకుఁ దగిన ప్రమాణము లేదు. కాఁగా: ప్రతిభకుఁ గారణ మగుటకుఁ దగిన వైలక్షణ్యము (ప్రతిభాకారణత్వము నిర్ణయించు ధర్మము) ఆరెండిటియందును లేదనియే నిర్ణయము. అథవా, యచట నేదైనవిశిష్టమగు పాపము ప్రతిబంధకమని కల్పించినను దోషమురాదు. ప్రతిబంధకాభావముగూడఁ గారణ మగుటలో నిరువుటకు (శక్త్యాదిత్రితయము కారణ మనువారికీ, శక్తిమాత్రమే కారణ మను వారికీ) భేదములేదు. ప్రతివాది యేమైన మంత్రాదులతోఁ గొన్ని దినములవఱకు మాటరాకుండ స్తంభింపఁజేసినపు డదివరలో ననేక ప్రబంధముల నొనర్చిన కవియైనను గావ్యము నిర్మింపఁ జాలక పోవుట కన్పించుచున్నదికదా*

శ్రీ శర్వాణి:

వ్యుత్పత్త్యభ్యాసములు లేనపు డదృష్టమునుండి ప్రతిభ కల్గినను, అదృష్టములేక యా రెండిటిచేఁ బ్రతిభ యేర్పడినను (వ్యతిరేకముచేఁ గారణములేక కార్యము జనించుటవలని) వ్యభిచారము రాదు. రెండు ప్రతిభలు వేరువేరు రకములే కనుక. ఆయా రకపు బ్రతిభ దాని కారణము లేనపు డేర్పడదుగదా.

1. ఈ ప్రతిభను రెండువిధములుగను, అందులకుఁ గారణములు రెండు విధములుగను నిరూపించుటకు ఆధారము లిట్లు లున్నవి:

ఉత్తమోత్తమములగు కాళిదాసాది ప్రబంధము లొకవంకను, రెండవ రకములో భారవి, మాఘాదికావ్యములు వేరొకవంకను గనుపడు చుండుట యొకటి.

"ద్విత్రాః పఞ్చషా వా మహాకవయః" అనియు "సరస్వత్యై వైషా ఘటయతి యథేష్టం భగవతీ, యేషాం సుకృతినాం కవీనాం ప్రాక్తనపుణ్యాభ్యాసపరిపాకవశేన ప్రవృత్తిః తేషాం పరోపరచితార్థ పరిగ్రహ నిస్పృహాణాం స్వవ్యాపారో న క్వచి దుపయుజ్యతే" యను ఆనందవర్ధనుని సూక్తులు రెండవది.

2. అనఁగాఁ: గవిత యంతయుఁ బ్రతిభవలననే కలుగునని సామాన్య మగు కార్యకారణభావమును, విలక్షణమైన కవిత విలక్షణమైన ప్రతిభ

నుండి కలుగునని విశేషణమైన కార్యకారణ భావమును గ్రహింపవలెను.

3. అది (వ్యతిరేక వ్యభిచారము) యిట్లు తెలియవలెను. ఒకరకమైన ప్రతిభ లేకున్నను వేరొకరకమైన ప్రతిభవలనఁ గవిత కల్గినపుడు వ్యభిచార మేర్పడునని యనరాదు ఈ రెండవరకమైన విలక్షణకవితకు రెండవరకమైన వైలక్షణ్యముగల ప్రతిభ యఁట నుండనే యున్నది కదా. అట్లే యీ రెండవ విధమైన ప్రతిభ లేనపుడు మొదటిరకమైన విలక్షణకవిత కల్గినను దీనికిఁ గారణమైన మొదటిరకపు వైలక్షణ్యము గల ప్రతిభ యఁట నుండియేతీరినది ; కనుక వ్యతిరేక వ్యభిచారము రాదని భావము. వెనుకటిది ప్రతిభలకు వాని కారణములకడ నేర్పడు వ్యభిచారము. ఇది ప్రతిభలకును వాని కార్యములకు నేర్పడు వ్యభిచారమని వివేకము.

4. ఈ యభ్యాసమునే క్షేమేంద్రుఁడు తన కవికంఠాభరణములో నిరూపించినాఁడు. దానినిఁ దెలుఁగులో శ్రీవేంకటరామకృష్ణులు వ్రాసిరి.

"మొదట నభ్యాసమునకయి మృదుపదముల, నన్వయములేని పద్దెములల్లవలయు ; బిదపఁ దుల్యార్థములగు పదముల నిడి. ప్రాఁతపద్దెములకు మారువల్కవలయును."

అన్వయములేని పద్యమున కుదాహరణము.

'కందర్పుని చందముగాఁ, గుందములు మిళిందములును గోవిందుండా
నందంబున బృందారక సందోహము కందళింపఁ జందురుఁ డలరెన్.'

ప్రాఁతపద్దెములకు మారువలుకుట కుదాహరణము :

తివిరి యిసుమునఁ దైలంబు దీయవచ్చు,
దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చుఁ,
దిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చుఁ,
జేరి మూర్ఖులమనము రంజింపరాదు. (ఏనుగు లక్ష్మణకవి)

మార్చిన పద్యము.

కడఁగి యిసుమున నూనియఁ బడయవచ్చుఁ,
గోరి యెండమావుల నీరు గ్రోలవచ్చు,

నెమకి శశవిషాణంబు గణింపవచ్చుఁ;
జీరి మూర్ఖజనమను మెచ్చింపరాదు.

ఈయభ్యాసకాలములోనే ధ్వనికారుఁడు దెలిపిన ప్రతిబింబాకారసంవాదముఁ, జిత్రాకారసంవాదము నేర్పడును. అది కవిత్వముగాదు; కాని, ముందుముందుఁ గవిత యేర్పడుట కుపయోగించును.

*ఇచ్చట గంగాధరశాస్త్రి వాద మిట్లున్నది:

లోకోత్తర వర్ణనానైపుణ్యముతోడి కవికర్మయే విశిష్టమైన కావ్యము. దానికిఁ బ్రకాశకారాదులు చెప్పినట్లు శక్తి (ప్రతిభ) నిపుణత. యభ్యాసములు మూఁడును గలసియే హేతువు. కాని, యొకశక్తిమాత్రమే హేతువను (పండితుని) వాదము తగదు. శక్తియనఁ బ్రతిభ అది యుత్పాదిక, వ్యుత్పాదిక యని రెండురకములు. మొదటిది కవిత్వములో మాటలఁ గూర్చునంతవఱకే పనిచేయును. రెండవది లేనిచో, లోకోత్తర వర్ణనానైపుణ్యము కలుగదు. సహృదయులకుఁ జమత్కారాదిస్ఫూర్తి యది యున్ననే కదా యేర్పడును? ఇదే నిపుణత. ఇక మూఁడవ దగు నభ్యాసము లోకోత్తరత్వము నిర్వహించును. కనుక నీమూఁడుఁగలసియే యిట్లు లోకోత్తరవర్ణనానైపుణ్య విశిష్టమైన కావ్యమునకుఁ గారణ మగును అని.

దీనికి మా సమాధానము:

ఈ వివరణము తప్పు. వ్యుత్పాదిక యన్న ప్రతిభకు 'నిపుణత' యను పేరు క్రొత్తగాఁ బెట్టినను, అ దొక్కటియే యవిశిష్టకావ్యమును నిష్పాదించును. మూకపంచాశతి యట్టిదే కదా. అది లేనప్పటికిఁ దక్కిన రెండును దమ కనుగుణముగాఁ గావ్యముల నిర్వహించును. అట్టివే కిరాతార్జునీయాదులు. ఇట్లు రెండురకముల కావ్యములు వేరువేరుగాఁ గన్పడుటయే త్రితయమును మిశ్రితకారణ మగుటకు బాధక మని గ్రహింపవలెను. విచారించుచో, 'లోకోత్తరవర్ణనానిపుణ కవికర్మ కావ్యమే' అనునదికూడఁ దప్పే, అట్టి కవి దంతధావనముగూడఁ గావ్యముకాదుగదా? అప్పుడు లోకోత్తర వర్ణనమే కావ్య మనవలెను. కానిచో "కురఙ్గైతరఙ్గాక్షైః స్తబకర్ణై రుదీక్ష్యతే" ఇత్యాదులు కావ్యము గాకపోవచ్చును. అని.

# ఆంధ్ర రసగంగాధరము

## ౧. కావ్యవిభాగము

సంస్కృతమూలము

తచ్చోత్తమోత్తమోత్తమ మధ్యమాధమభేదా చతుర్ధా

తెలుఁగు తాత్పర్యము

అది ఉత్తమోత్తమము, ఉత్తమము, మధ్యమము, అధమము అని నాల్గురకములు

సంస్కృత మూలము

* శబ్దార్థౌ యత్రగుణీభావితాత్మానౌ కమప్యర్థమభివ్యఙ్క్తస్తదాద్యమ్.

తెలుఁగుతాత్పర్యము

శబ్దార్థములు రెండును స్వరూపతః గుణ (అప్రధాన) ములుగా భావితములై యేదోయొక యర్థము వ్యక్తపఱచునది మొదటిది

శ్రీశర్వాణి

* ఈ సూత్రమును నాగేశుఁ డిట్లు వ్యాఖ్యానించెను. 'గుణీభావితాత్మానౌ శబ్దార్థౌ యత్ర కమప్యర్థ మభివ్యఙ్క్త' ఇత్యన్వయః, అని. ఇది తప్పు. పండితుని భావమును సరిగాఁ దెల్పదు. 'గుణీభావితాత్మానౌ' అను దానిని సహజవిశేషణముగ నన్వయించుటవలన శబ్దార్థములు సహజములుగ గుణీకృతము లను నర్థ మేర్పడును. అపుడు శబ్దార్థముల యప్రాధాన్యముతో విశిష్టమగుచునే చమత్కారకార్థవ్యంజనము. అదియే "రామస్సీతా సహితో జగామ" ఇత్యాదులందు మాత్రమే గమనక్రియయందు సీతాసాహిత్యమవశ్యముగా నన్వయించుట యనుభవసిద్ధమే కాదా ధ్వనికిఁ బ్రయోజనము

అను నర్థము రాదు. అంతేకాక శబ్దార్థముల యప్రధాన్య నిష్పత్తి సహజము గాక చమత్కారాతిశయస్థానమై వ్యంగ్య మగు నర్థమునుండి యేర్పడు నను నీభావముగూడ నావశ్యకము. ఈ భావము రానిచో వ్యక్తి వివేకకారుఁడు దెల్పిన "శబ్దః పున రనుపాదేయ ఏవ...తస్య పునరుక్తి ప్రకారతోవ్పపాద నతః" అను దోషము తప్పదు. ఇవి కూడ నాగేశుని యన్వయము నుండి రాదు. దీనికి విరుద్ధముగూడ నిది. ఇట, నాగేశుని యన్వయములో శబ్దార్థము లందు అప్రాధాన్యము సహజము గదా. 'ఇట వ్యంగ్యమగు నర్థము చమత్కారాతిశయమునకు నెలవు' అను తలఁపు వ్యక్తమగుటకే 'కమపి' (చమత్కృతిభూమిం) అని పండితుఁడు వివరించెను. దీనిని గమనింపలేక యితఁడు 'భూమిం' అను పదమును 'నిదానం' అని వ్యాఖ్యానించెను. అట్లా యర్థము వచ్చునా? తుష్యతు: వచ్చినను పండితుని భావము నిష్పన్నమగునా? సరి. ప్రకృతములో శబ్దార్థముల స్వరూప మప్రధానీ భావిత మగును. అనఁగా: శబ్దార్థములు సహృదయుల భావనను దమవద్దకే నిలువనీయక ప్రధాన చమత్కారక మగు వ్యంగ్యమువఱకు సాఁగించును. ప్రధానమువఱ కాభావన ప్రసరించుటకు ముఖ్యముగాఁ బ్రయోజక మగున దేది? శబ్దార్థము లప్రధాన మగుట ముందు ముందిట నేదో యొక యర్థము చమత్కరించు నని తోచునపు డప్రధానములకడ మన భావన నిలిచిపోదు. అట 'అప్రధానము లవి' అను భావనయే ప్రధానమును భావించుటకుఁ ద్రోవ తీసి ప్రయోజక మగును. కాఁగా, విధేయ మగు 'గుణీభావి తాత్మత, 'కమప్యర్థ మభివ్యఙ్క్తః' అనుదాని యర్థమునకుఁ బ్రయోజకహేతువుగా నన్వయించు టత్యవసరము. ఈ భావ ముత్తమోత్తమ కావ్యమున కత్యంత మావశ్యకము. కనుకనే పండితుఁడు 'గుణీభావితాత్మానౌ' అను దానిని విధేయవిశేషణముగ (విశేష్యము తరువాత) నే సూత్రములోఁ గూర్చెను. (నాగేశుఁడు గూడ సందేహాలంకారపు వ్యాఖ్యానములో "విధేయస్య పాశ్చాత్య మితి నియమా దితి భావః" అని వ్రాసినాఁడు. పండితునికిఁ గూడ నిట్లే భావ మని యచ్చటనే మూలములో "ఏవం చ ప్రజాపతేః ప్రథమోద్దేశో న స్యాత్" అను వాక్యమే స్పష్టపఱచును.) అసలు ధ్వనికారుఁడు గూడఁ దనధ్వని లక్షణకారికలో "యత్రార్థః శబ్దో వా తమర్థ ముపసర్జనీకృతస్వార్థౌ వ్యఙ్క్తః కావ్య విశేష స్స ధ్వని రితి సూరిభిః" అనుచోట దీనిని

విధేయవిశేషముగనే నిర్దేశించెను. పై ప్రమాణములచే నాగేశుఁడు సహజ విశేషణముగ నన్వయించుట తప్పని స్పష్టమైనది. మఱియొక విశేషము. 'గుణీకృతాత్మానౌ' అనక, 'భావిత' యనుటలోఁ జమత్కారపు బ్రాధాన్యము భావించు సహృదయులు శబ్దార్థముల నప్రధానముగ మొదట భావింతురు' అని సూచన. కాఁగా, శబ్దార్థముల యప్రాధాన్యము భావించిన వెంటనే వ్యంగ్యార్థముఁ జమత్కారప్రాధాన్యము భావింతు రని వ్యక్తపఱచుట వలన "వాచ్యేన త్వస్య సహైవ ప్రతీతిః" అను ధ్వనికారుని సూక్తి సరిగా సమన్వయించి నట్లయినది.

ఈ లక్షణములో 'కమప్యర్థ మభివ్యఙ్క్తః' అను నంత వఱకుఁ గావ్యసామాన్య లక్షణము. "శబ్దార్థౌ గుణీభావితాత్మానౌ' అనునంతవఱకు నీ మొదటిరకపుఁ గావ్యమునకు విశేషలక్షణము. దీని కనుగుణముగా. రమణీయార్థ ప్రతిపాదక' యను సామాన్య లక్షణములోని 'ప్రతిపాదక' యనునది 'వ్యఙ్క్తః' అని వ్యంజనైకరూపముగాఁ బరిణమించినది. ఈవిధముగ నీలక్షణమున గుణీభూత వ్యంగ్యములు నిరసింపఁ బడినచోఁ (వ్యవచ్ఛేదింపఁబడినచో) గడమ నాలవకార్యము (అధమము) ప్రధానమల్ల నిబర్హణ న్యాయమున నిరాకృతము అని తెలియవలెను. ఈ న్యాయమునే గుణీభూత వ్యంగ్యములకడఁ గూడఁ బ్రయోగించినాఁడు. ఎట్లనఁగా: కమపి చమత్కృతిక భూమిం" అని వివరించుటవలన విశిష్టచమత్కారమగు నర్థము వ్యక్తపఱచ లేవు గనుక నతిగూఢ స్ఫుటవ్యంగ్యములు నిరస్తములైనవి. విశిష్టచమత్కారములు కాని వానిలో నివి రెండును ప్రధానములు గనుక వీనినిఁ బేర్కొని నిరాకరించుటచే సందిగ్ధ తుల్య ప్రాధాన్యకాక్వాక్షిప్తములు నిరాకరించినట్లైనది. అచ్చటఁ జమత్కృతి భూమి (చర్వణా విశ్రాంతిధామమైన) విశిష్ట చమత్కారము లేదు గదా. 'సుందరము' కేవల శబ్దచిత్రము వలె సామాన్య లక్షణమే లేదు. గనుక మొదటనే నిరాకృతమైనది. 'అప్రధానములుగా భావితము లయి' యనుటచే 'అసుందరము' నిరాకరింపఁబడిన దన్నాఁడు నాగేశుఁడు. ఈ మాట తప్పు. సామాన్యలక్షణము ప్రసక్తించినపుడు విశేషలక్షణ ప్రసక్తినిఁ గూర్చి యాలోచనఁ గలుగును. అసలదే లేనపుడు విశేషలక్షణములోని 'గుణీభావితాత్మానౌ' అను దాని ప్రసక్తి యేమున్నది? 'అసుందరము' అన్నపేరే 'రమణీయార్థ

ప్రసక్తి లేనిదని తెల్పును. కనుక విశేషలక్షణ పర్యంతానుధావనము సరి కాదు. ఇంకొకటికూడ నిట విచారింపవలెను. అసుందరములో శబ్దార్థములు గుణీభావితము' లనుటకుఁ బ్రసక్తి యేమున్నది ? గుణీభావము చమత్కారమును బట్టియే కదా. అట వ్యంగ్యమున కసలు చమత్కారమే లేదు కనుకనే యది తొలఁగిపోయినది. అగూఢస్ఫుట వ్యంగ్యములుగూడ నేదో యొక యర్థము (చమత్కారకము) వ్యక్తపఱచును. అందువలన నట నతివ్యాప్తి వచ్చును. కనుకనే 'కమపి చమత్కృతి భూమిం' అని స్వయముఁగనే వివరించెను. చమత్కృతిభూమి చర్వణా విశ్రాంతి ధామ మని, 'యను రెండవ యుదాహరణమును వివరించుచు "అమర్ష శ్చర్వణా విశ్రాన్తి ధామత్వా త్ప్రాధాన్యేన వ్యజ్యతే" అని కంఠతః స్పష్టపఱచినాఁడు. కాఁగా, 'విశిష్టచమత్కారకము' అనియే యర్థము పర్యవసించును. అంతేకాని 'చమత్కృతి భూమిం' అంటే 'చమత్కృతినిదాన' మని యన్న నాగేశుని యర్థము రాదు. అది తప్పు కూడను. ఘటనిదానమైన మృత్తును ఘటభూమి యని వాడరు కదా. ఇఁక 'సామాన్యతశ్చమత్కారకము' అని యర్థము 'క మపి' (యేదోయొక) అను దానికిఁ జెప్పఁగూడదు. ఏలయన: సామాన్య చమత్కారక మగు నర్థము అతిగూఢస్ఫుట వ్యంగ్యములందు నుండును. 'అట్లుండదు. అది యసుందరమే' యందురా ? అపుడు 'అసుందరము' అను విభాగములో నివియుఁజేరును గనుక వీనినిఁ బ్రకాశకారాదులు ప్రత్యేకముగ విభజించి గణించుట తప్పయి పోవును. అందుచే నా రెండిటి యందును సామాన్యతః చమత్కారకమైన యర్థ మున్నదని యొప్పి తీరవలెను. అప్పు డట నతివ్యాప్తి యేర్పడును. అందులకే 'చమత్కృతిభూమి' (విశిష్టచమత్కారకమైన) అని వివరింపఁబడినది. అట నది లేదు కాన నతివ్యాప్తి తొలఁగినది. ఈ విధముగా "అగూఢ మపరసాఙ్గం వాచ్యసిద్ధ్యఙ్గ మస్ఫుటం, సందిగ్ధతుల్య ప్రాధాన్యే కాక్వాక్షిప్త మసున్దరమ్" అను నీకావ్య ప్రకాశకారుని కారిక ప్రకారముగ నాఱు గుణీభూతవ్యంగ్యములు దొలఁగినవి. ఇఁక, 'అపరాంగము, వాచ్యసిద్ధ్యంగములు రెండున్నవి. ఈరెండింటిలో గూడ నతివ్యాప్తి తొలఁగవలెను. అందులకై 'శబ్దార్థములు రెండు నప్రధానముగ భావింపఁబడి (శబ్దార్థౌ గుణీభావితాత్మానౌ) యనఁ బడినది. వాచ్యసిద్ధ్యంగములో, వ్యంగ్యము వాచ్యమున కన్న నప్రధానముగనే

యుండును. ప్రధానము గాదు; కనుక నటవ్యంగ్య ప్రాధాన్యముతోఁడి యీలక్షణము ప్రసక్తింపదు. ఈ విషయమును పండితుఁడు "అపరాఙ్గవాచ్య సిద్ధ్యఙ్గవ్యఙ్గ్యస్యాపి చమత్కారితయా తద్వారణాయ గుణీభావితాత్మనా ఇతి స్వాపేక్షయా వ్యఙ్గ్యప్రాధా న్యాభిప్రాయకమ్" అని తెల్పినాఁడు. ఇక్కడ వ్యంగ్యపద 'ముభయత్ర (అపరాంగ వాచ్య సిద్ధ్యంగములకు) అన్వయించును కాఁగా : అపరాంగవ్యంగ్యము, వాచ్యసిద్ధ్యంగవ్యంగ్యము నని సిద్ధించును' అనినాఁడు నాగేశుఁడు

ఇదియును దప్పే. ఎట్లందురా? "తేనాతిగూఢస్ఫుటవ్యఙ్గ్యయో ర్నిరాసః" అనుచోట ద్వివచన మున్నది. కనుక నట "ద్వన్ద్వాన్తే శ్రూయమాణం పదం ప్రత్యేక మభిసంబధ్యతే"యను న్యాయమున ద్వంద్వాంతమునం దున్న వ్యంగ్యపద ముభయత్ర (అతిగూఢస్ఫుటమునందు) యన్వయించు ననుట సబబుగా వచ్చును. కాని, యిక్కడ ద్వివచనము లేదే. 'వ్యంగ్యస్య' యని యేకవచనమే యున్నది. కనుక తాను 'ఏవమగ్రేపి' యని యిచటి వ్యంగ్యపదమును గూడ రెండుచోట్ల నన్వయింతు ననుట కవకాశ మేదీ? "అది కాదు, 'అపరాంగము, వాచ్యసిద్ధ్యంగము' అని రెండున్న విక్కడ. అరెండును వ్యంగ్యపదము నన్వయింతు ననుటలోఁ దప్పేమి? ఏకవచనమే కదా యున్నది" యన్నచో, శబ్దమున కన్న యర్థము బలవత్తరము. రెండువిషయము లిచట నున్నవి. కనుక వానినిఁ బట్టి 'వ్యంగ్యస్య' యనుదానిని 'వ్యంగ్యయోః' అని మార్చుకొనవలెను. 'ఇట్లావిభక్తి విపరిణామము న్యాయసిద్ధమే' యనుటయు సరికాదు. ఇచట నసలు రెండు విషయము లున్నపుడు గదా వానిఁబట్టి విభక్తి విపరిణామ ప్రసక్తి? వస్తుతః ఇట రెండే యున్నచోఁ బైన 'అతిగూఢస్ఫుట వ్యంగ్యయోః' అని ద్వివచనముఁ జెప్పిన పండితుఁ డిక్కడ మాత్ర మేల ద్వివచనముఁ జెప్పడు? కనుక నిట రెండువిషయములు లేవు. ఇది తెలియక తాను భ్రమపడి 'ఏవమగ్రేపి' యను వ్యాఖ్యతో నితరులఁగూడ భ్రమ పెట్టినాఁడు. అపరాంగమునం దతివ్యాప్తి రాదు. అది లక్ష్యమే. రెండవరకపు (ఉత్తమ) కావ్యలక్షణము వివరించుచుఁ బండితుఁడు "వాచ్యాపేక్షయా ప్రధానీభూతం వ్యఙ్గ్యాన్తర మాదాయ గుణీభూతం వ్యఙ్గ్య మాదాయాతివ్యాప్తి (ద్వితీయ కావ్య లక్షణను – గుణీభూతకావ్యలక్షణను) వారణాయావధారణం తేన తస్య

ధ్వనిత్వ మేవ" యనియు, "అయంసరశనోత్కర్షీ" యనియు, నిత్యాది యపరాంగకావ్యము ధ్వనియే యని చెప్పినాఁడు కదా. ఇఁక దానియం దతి వ్యాప్తికిఁ బ్రసక్తి యేది? తుష్యతు: అతివ్యాప్తి వచ్చిన దనుకొందము. శబ్దార్థముల యప్రాధాన్యము వలన నది తీరునా? అచ్చట ('అయం సరశ నోత్కర్షీ' యను చోట) వ్యంగ్య మగు శృంగారము శబ్దార్థములకన్నఁ బ్రధానమే కాని. యప్రధానము గాదు గదా. ఇఁక దానికి నిరాస మెట్లు? ఒక రన్నారుగదా. "అయం సరశనోత్కర్షీత్యాద్యపరాంగములోఁ బ్రధానవ్యంగ్య మైనకరుణమున కుత్కర్షకము వాచ్యమే శృంగారము వ్యంగ్య మైనను నది వావాచ్యము వలెఁ బ్రధానవ్యంగ్య మగు కరుణమునకుఁ బోషకము గాదు. కావున నది స్వవ్యంజకమగు శబ్దార్థములకన్నఁ బ్రధానము గాదు. అందుచే నతివ్యాప్తి వారింపవచ్చును. కనుక నే నాగేశుఁడు ద్వితీయకావ్య వివరణము వ్యాఖ్యానించుచు "అపరాఙ్గోదాహరణే. అయం సరశనోత్కర్షీత్యత్రాపి వాచ్యాపేక్షయా శృఙ్గారస్య నప్రాధాన్యం శోకోత్కర్షకతయా శృఙ్గారరూప వ్యఙ్గ్యాపేక్షయా వాచ్యస్యైవ చమత్కారకారిత్వాత్. ఏవం సర్వత్రా పరాఙ్గో దాహరణే షూహ్యః (అర్థము. అపరాంగోదాహరణ మగు నయంసరశ నోత్కర్షీ యనుచోట గూఢవాచ్యమునకన్న శృంగారమునకుఁ (వ్యంగ్యము నకు) బ్రాధాన్యము లేదు. శృంగారరూప మగు వంగ్యమునకన్న వాచ్యమే శోకము నుత్కర్షించును కనుక నదియే (వాచ్యమే) చమత్కారకము, ఇట్లే యపరాంగోదాహరణముల నంతట నూహింపవలెను" అని చెప్పినాఁడు. కాఁగా: శబ్దార్థముల కన్న నిట వ్యంగ్య మగు శృంగారము ప్రధానము గాదు కనుక నతివ్యాప్తిని వారించును." అని.

ఇది తప్పు. అయం సరశనోత్కర్షీత్యాదులందు నంతరాళ వ్యంగ్య మగు శృంగారము ప్రముఖ వ్యంగ్య మేనా? సంలక్ష్యక్రమ వ్యంగ్యమా? రెండవపక్షములో నిది యిటఁ బ్రధానవ్యంగ్య మగు కరుణమున కంగము కాఁజాలదు. ఎందువలన నందురా? ఇట సర్వతః ప్రధాన మగు కరుణము అసంలక్ష్యక్రవ్యంగ్యము దాని కిది యంగ మగుచో, దానికిఁ బూర్వమున (కాని దానితో సమకాలమున) వ్యంగ్యము గావలయునే కాని, దూరతః వ్యంగ్యమై, సంలక్ష్యక్రమవ్యంగ్య మగుచో (కరుణము వ్యంగ్యమైన తరు వాత వ్యంగ్య మగుచో, శృంగారము వలనఁ గరుణ కే ముపకారము? అను

పకారక మగునది యంగ మెట్లగును ? కాదు. "నాకించిత్కార్వత: శేష త్వమ్" అని కదా న్యాయము ? ఇపుడు శృంగారమున కంగ మగుట పొసగదు. "అది కాదయ్యా! వాచ్యమున కంగ మగును. అనఁగా: నిట వాచ్యము కరుణోత్కర్షకము. అది కేవలముగఁ గాదు. ఇఁక నేమి ? శృంగారమును వ్యంగ్యపఱచి, దానితో నుపస్కృతమై, కరుణమున కుపకారము కాఁగల్గును, కనుక నిట వ్యంగ్య మగు శృంగారము అవరమునకు (వాచ్యమునకు) అంగము (అపరాంగము) అగును" అని. వాదింతురా ?

ఇది కూడఁ దప్పే. ఈపక్షములో వాచ్యసిద్ధ్యంగ మని వేఱొక గుణీభూతవ్యంగ్యవిభాగము నెట్లొనర్చిరి ? ఇది కూడ వాచ్యాంగమే కదా. కాఁగా. అపరాంగము, వాచ్యసిద్ధ్యంగము నను రెండువిభాగములు కుదురవు.

"అట్లు కాదు. ఏది వ్యక్తము కాక పోయినచో నసలు వాచ్యార్థమే పొసగదో యది వాచ్యసిద్ధ్యంగము. ఏది వ్యక్తమై వాచ్యము నితర వ్యంజనకై సిద్ధపఱచునో యది యపరాంగము. కాఁగా, నపరాంగములోని శృంగారము ప్రకృతము వాచ్యమును కుదుర్చదు. శృంగారము లేకున్నను వాచ్యము కుదురును గదా ఇఁక నేమి. వాచ్యమును కరుణవ్యంజకముగా సిద్ధపఱచును. కనుక నపరాంగ మగును. ఇపుడు విభాగద్వయము కుదురును." అనెదరా ?

ఇట్లనుటయు ననుపన్నమే. ఎట్లనఁగా : రసాదులు చమత్కారైక ఘనములు. అవిభావరూపములు. అవి వస్తువున కంగము కావు. ఎందు చేత నన : అంగాంగిభావము చమత్కారైకాధీనము, వ్యంగ్య మగు వస్తువు కన్న గూడ, భావమే యధికచమత్కారకము. కనుకనే "వ్యజ్యన్తే వస్తుమాత్రేణ యదాలంకృత యస్తదా ధ్రువం ధ్వన్యఙ్గతా తాసాం కావ్యవృత్తేస్తదాశ్రియాత్" అని ధ్వన్యాలోకము సెప్పెను. అట్టిసితిలో వాచ్యము స్వవ్యంగ్య మగు రసము కన్న నధికముగాఁ జమత్కారకము కాఁ గల్గునా ? అటు లని యేయాలంకారికుఁ డనడు. అట్లు కాదు కూడను. ఈవాదము ఆలంకారికులకే కాక యస లలంకారశాస్త్రసిద్ధాంతములకే విరుద్ధము. కాఁగా, వాచ్యమునకన్నఁ దద్వ్యంగ్య మైన శృంగారమే యధికచమత్కారకము. అదియే కరుణోత్కర్షకము. దానికన్న వాచ్య మెన్నడు నెక్కడ నెట్లు

గూడ నధికచమత్కారికము గాదు. కాఁబోదు. కనుక నాగేశున కలంకార శాస్త్రపరిజ్ఞానము చాలక వ్రాసినవ్రాఁత ప్రమాణము కాఁజాలదు. అదియుఁ గాక యతనికిఁ బరమప్రమాణ మైన మమ్మటుఁడే కావ్యప్రకాశములో 'అయం సరశనోత్కర్షీ' యని యుదాహరించి, 'అత్ర శృఙ్గారః కరుణస్య' (అఙ్గం ఇతి శేషః) అని వ్రాసినాఁడు. ఇట్లు ప్రాచీన సకలగ్రంథగ్రాంథికులకును, యుక్తికినిఁ గూడ 'వ్యంగ్యరసము వాచ్యము నుత్కర్షించు' నన్న పద్ధతి మిక్కిలి విరుద్ధము. కనుక నామార్గ మంతయును పరిహార్యము. కాఁగా, నిపుడు వ్యంగ్య మైన శృంగారము వాచ్యాపేక్షయా ప్రధానమే కనుక నతివ్యాప్తి తప్పదు. ఈసందర్భములో మఱొక రన్నారు కదా!

"మూలములోని 'స్వాపేక్షయా' యను దానిని 'శబ్దార్థాపేక్షయా' యని నాగేశుఁడు వ్యాఖ్యానించెను. మూలమునఁ గూడ 'వ్యంగ్యప్రాధాన్యాభిప్రాయకమ్' అని యున్నది. కనుక 'స్వ' శబ్దమునకు వాచ్య, లక్ష్య, వ్యంగ్యములకు; వాచక, లక్షక, వ్యంజకము లను మూఁడురకముల శబ్దార్థములు నర్థ మనవలెను. కాఁగా, ధ్వని యగు వ్యంగ్యము ఈవీని యన్నింటి కిన్న ప్రధానముగ నుండవలె నని భావ మేర్పడును. ఇపు, డపరాంగములో వ్యంగ్య మగు శృంగారమున కన్నకూడఁ బ్రకృతవ్యంగ్య మైన కరుణము సర్వతః ప్రధానముగ నున్నది. వాచ్యవాచకముల కన్న మాత్రమే వ్యంగ్యము ప్రధానముగ నుండవలెనను నియమ మిటఁ గుదురలేదు. కనుక నపరాంగములలో (అయం సరశనోత్కర్షీత్యాదులలో) నతివ్యాప్తి రాదు. ఈభావముతోడనే 'అపరాంగ' యను మాట నట వాడఁబడినది. అనఁగా: 'అపర' (మఱియొక) వ్యంగ్యమునకు నంగముగ నుండు వ్యంగ్యములో నతి వ్యాప్తి తొలఁగుటకు హేతువును వ్యక్తపఱచిన దామాట. ఈమొత్తము ప్రతిపాదనకు ఫలిత మేమన: త్రివిధశబ్దార్థములు తమవ్యంగ్యమున కన్న నప్రధానముగ నుండవలె ననియుఁ, దమవ్యంగ్యము సర్వతః ప్రధానముగ నుండవలె ననియు. అపుడు ఇటశృంగారవ్యంజకము లగు శబ్దార్థము లందు (వాచ్యవాచకములందు) అప్రధానీభావితాత్మలై చమత్కృతిభూమియగు నర్థము వ్యక్తపఱచును అనుధ్వనిలక్షణము అతివ్యాప్త మగును. దాని నివారణ మెట్లనఁగా: శబ్దార్థములు (త్రివిధములు) ప్రకృతములో నతివ్యాప్తిఁ గల్గించు నర్థము (శృంగారము) అది కరుణమునకు వ్యంజకము కనుక

నీవ్యంగ్యము (శృంగారము) సర్వతః ప్రధానము గాలేదు. ఇట్లు సర్వతః ప్రధాన మగు నర్థమును వ్యక్తపఱచ లేవు కనుక వాచ్యవాచకములం దతివ్యాప్తి తొలఁగినది. ఇట నిష్కృష్టాభిప్రాయ మిది. ఇట నతివాప్తి వాచ్యవాచకములందా? వ్యంగ్యవ్యంజకము లందా? (అనఁగా: వాచ్యవాచకత్వోపాధిని బట్టియా? వ్యంగ్యవ్యంజకత్వోపాధిని బట్టియా? అతివ్యాప్తి యని ప్రశ్న) రెండవపక్షములో నతివ్యాప్తి లేదు. అది లక్ష్యమా యేమి? సర్వతః ప్రధాన మైన కరుణమును వ్యక్తపఱచునవి కదా? ఇఁక మొదటి పక్షము నందా? (శృంగారవ్యంజకము లైన వాచ్యవాచకములయందని భావము) అట వ్యంగ్య మైన శృంగారము చమత్కృతిభూమి యైనప్పటికి సర్వతః ప్రధానము కాదు. ఎందుచేత నన: ఆ వ్యంగ్య మగు శృంగారము తాను కరుణవ్యంజకము కనుకఁ దనకన్న (వ్యంజక మైన) తాను (వ్యంగ్య మగు) ప్రధానము కాఁజాలదు కదా? ఈభావమే 'స్వాపేక్షయా' యని తెల్పఁబడినది. అనఁగా: దేనినిఁ బట్టి (శృంగారమును బట్టి) ఇట నతివ్యాప్తి ప్రసక్తించునో, యావ్యంగ్య మగు శృంగారముకూడ వ్యంజక మే కనుక సర్వతః ప్రధానము గాదు. అట్టి 'స్వాపేక్షయా' వ్యంజక మగు తనకన్న తా నధికము కాఁజాలదు కనుక ఉత్తమోత్తకావ్యలక్షణము వాచ్యవాచకములం దతివ్యాప్తము కాఁజాలదు." అని.

ఈనిరూపణము గూడఁ దప్పే యగుచున్నది. ఏమనఁగా: 'శబ్దార్థౌ' అనునది త్రివిధములుగ గ్రహించినను, అన్నియు వ్యంగ్యముఁ బట్టి వ్యంజకములే కదా? శృంగారవ్యంజకము లన్న నిట శబ్దార్థములు (వాచ్యవాచకములు) తమకన్నఁ జమత్కారమున నధికములైన శృంగారాద్యర్థములను వ్యంగ్య మొనర్చుచున్నవి కదా? అతివ్యాప్తి తొలఁగు టెట్లు? ఇఁక 'కమపి' అను పదమునకు సర్వతః ప్రధాన మన్న యర్థము తగదు. గుణీభావితాత్మానౌ' అనునది వ్యర్థ మగును. అది యీతాత్పర్యమునకు గ్రాహక మన్నను, భావ, అలంకార, వస్తుధ్వనులం దవ్యాప్తి వచ్చును. అవి రసమునం దవశ్యముగ విశ్రాంతములు గావలసినవే కదా. "న హి రసశూన్యం కిఞ్చి దస్తి రస ఏవ వస్తుతః ఆత్మా, వస్త్వలఙ్కార ధ్వనీతు సర్వథా రసం ప్రతిపర్యవస్యేతే" అని యభినవగుప్తుఁడు ధ్వనిలోచనములోఁ దెల్పెను; కనుక, నాయర్థముఁ జెప్పఁ దగదు. సరే. ఇఁక నపరాంగము

లోని ధ్వనిలక్షణమున కతివ్యాప్తి తప్పదా ? ఈపండితునిలక్షణము తప్పే యగునా ? ఎన్నటికిఁ గాదు. అ దెట్లన : వినుడు. వివరింతుము అపరాంగము మూఁడుఁ దెఱఁగులు. 'రసాంగము, భావాంగము, వాచ్యాంగము' అని. అందు మొదటివి రెండును వ్యంగ్యప్రధానములు గనుక నుత్తమోత్తమ కావ్యములే. లక్ష్యములే ఈవిషయము నుత్తమకావ్యలక్షణవివరణములోఁ బండితుఁడే "తేన తస్య ధ్వనిత్వ మేవ" అని స్పష్టపఱచెను, కాఁగా, నట లక్షణము ప్రసక్తింపవలసినదే. ఇఁక మూఁడవది వాచ్యాంగము.

"జనస్థానే భ్రాన్తం కనకమృగతృష్ణాంధిత తయా,
వచో వైదేహీతి ప్రతిపద ముదశ్రు ప్రలపితం,
కృతాలఙ్కా భర్తుర్వదనపరిపాటీషు ఘటనా,
మయాప్తం రామత్వం కుశలవసుతాన త్వధిగతా." (ఇత్యాదికము)

ఇటఁ గవికి శ్రీరామచంద్రునితో నుపమానోపమేయ భావము ఉభయార్థకము లగు శబ్దముల శక్తివలన వ్యంగ్యము—అది 'మయాప్తం రామత్వం' (నాకు రామత్వము ప్రాప్తించినది) అను వాచ్య మగు నతిశయోక్తి నుత్కర్షించును, అనఁగాఁ : గవి స్వయముగ 'నేను రామత్వము నొందితి' ననుటవలన వ్యంగ్య మైన శ్రీరామౌపమ్యము రామతాదాత్మ్యము నారోపించుట కుపయోగించినది. (అత్ర శబ్దశక్తి మూలానురణన రూపో రామేణ సహోపమేయభావో వాచ్యాఙ్గతాం నీతః అని మమ్మటుఁడు) కాఁగా, నిటఁ జమత్కృతిభూమి యైన యర్థము శ్రీరామునితోడి యౌపమ్యము. అది వ్యక్త మగును; గనుక, నతివ్యాప్తి. ఆవ్యంగ్య మగునర్థము వ్యంజకము లగు శబ్దార్థముల కన్నఁ బ్రధానము కాదు కనుక నతివ్యాప్తి తొలఁగినది. ఈభావముతోనే 'యపరాంగ వాచ్యసిద్ధ్యంగవ్యంగ్యస్య' యని యేకవచన ముపయోగింపఁ బడినది. అనఁగా : అపరాంగములలోని వాచ్యసిద్ధ్యంగ మగు వ్యంగ్యమునం దతివ్యాప్తి వారించుట కని. ఇందువలన, వాచ్యసిద్ధ్యంగ మను మూఁడవగుణీభూతవ్యంగ్యమునందుఁ గూడ నతివ్యాప్తిని నిరసించిన ట్లైనది. ఈవిధముగ నిక్కడ సమన్వయము వక్తవ్యశేషము రెండవ లక్షణ వివరణములోఁ జెప్పుదుము.

సంస్కృత మూలము :—

కమ పీతి చమత్కృతిభూమిం తేన అతిగూఢ స్ఫుటవ్యఙ్గ్యయో ర్నిరాసః ; అపరాఙ్గ వాచ్యసిద్ధ్యఙ్గవ్యఙ్గ్య స్యాపి చమత్కారి తయా తద్వా రణాయ గుణీభావితాత్మానా వితి స్వాపేక్షయా వ్యఙ్గ్యప్రాధాన్యాభి ప్రాయకమ్.

తెలుఁగు తాత్పర్యము.

'ఏదో యొక' యనఁగా 'చమత్కారపునెలవైన' యని. ఇందువలన నతిగూఢవ్యంగ్యము స్ఫుటవ్యంగ్యమును గూడ నీకావ్యమార్గము నుండి తొలఁగింపఁబడినవి అనఁగా : ఆరెంటియందు నతివ్యాప్తి రాదు అని ; అపరాంగవాచ్య సిద్ధ్యంగవ్యంగము కూడఁ జమత్కారకము కనుక, దానిని నిరూపించుటకై 'స్వరూపతః గుణ (అప్రధాన) ములుగా భావితములై యని, తమకన్న (శబ్దార్థములకన్న) వ్యంగ్యము ప్రధానముగా నుండు నని భావము.

## కావ్యోదాహరణము — ౧

సంస్కృత మూలము :—

శయితా సవిధే ప్యనీశ్వరా సఫలీ కర్తు మహో మనోరథాన్
దయితా దయితాననా మ్బుజం దరమీల న్నయనా నిరీక్షతే.

తెలుఁగు తాత్పర్యము.

సమీపమునఁ బరుండియుఁ గోరికల నెరవేర్చు కొనఁజాలక, ఆహా ! ప్రియురాలు ప్రియుని వదనకమలము నల్లార్చుచున్న కనులుగలది యై నిరీక్షించుచున్నది.

ఆంధ్ర పద్యోదాహరణము

శమనారాతినివృత్త ధైర్యుఁ డగుచున్ జంద్రోదయారంభకా
లమునన్ లొంగిన దుగ్ధసాగరము లీలన్ బక్వబింబాధరో
ష్ఠముఁ గర్ణాంతవిశాలనేత్రము నతిస్వచ్ఛంబు నై యొప్పు గౌ
రిముఖాంభోజమునందు నిల్పె సరసప్రేమంబు లొ చూడ్కులన్.

—హరవిలాసము. 3 ఆ. 80 ప.

విషయ వివరణము :

ఇట (రసమునకు) ఆలంబనవిభావ మగు నాయకుఁడు సన్నిధిలోఁ బరుండుట వలన స్ఫురించు రహస్యప్రదేశము మొదలగు నుద్దీపనమైన విభావమును • నిరీక్షణము మొదలగు ననుభావము త్రపయు (సిగ్గు) నౌత్సుక్యము మొదలగు సంచారిభావమును జేరుటవలన నాయిక యొక్క రతివ్యక్త మగును. ఆలంబనాదుల స్వరూపమును ముందుఁ జెప్పుదుము. ఇచట నొక శంక యిట్లున్నది. 'ఇతఁడు నిద్రించినచో నితనివదనాంబుజమును ముద్దిడుకొందు నను నాయిక కోరికయే యిట వ్యంగ్యము.' అని. అట్లనరాదు. 'కోరికల నెరవేర్చుకొనఁ జాలనిది యై' యనుటలోఁ గోరిక లన్నియు నీమె మనసులో నున్న వని దోచుచున్నది. కదా, 'కోరికలు' అను స్వశబ్దము సామాన్యాకారముతో నట్టి యిచ్ఛను గూడఁ జెప్పుచున్నది. (చెప్పఁ బడునది వ్యంగ్యము గాదు) 'కోరికలు అని * సామాన్యాకారమునఁ జెప్పినను 'ముద్దు పెట్టుకొనెదను' అని విషయవిశేషముతో విశిష్ట మగు నిచ్ఛగా వ్యంగ్య మగుటలో బాధక మేమి ?' యన రాదు. చమత్కారము గలుగ దనుటయే బాధకము. విశేషాకారముతో వ్యంగ్య మైనను సామాన్యాకారమునఁ జెప్పఁబడిన యర్థము సహృదయులకుఁ జమత్కారముఁ బుట్టింపఁ జాలదుగదా *వాచ్యవృత్తి యేకోశమునను (సామాన్యాకారమునఁ గానీ, విశేషాకారమునఁ గానీ) స్పృశింప కున్న నేవ్యంగ్యము చమత్కరించు నని యాలంకారికుల యంగీకారము. మఱియుఁ జుంబనేచ్ఛ (ముద్దిడుకొనవలె నను కోరిక) రతి యనుభావ మైననే (ప్రీతివలనఁ గలిగినపుడే) యందగించును గనుక, నారతి వ్యంగ్యము కానిచో 'ముద్దు పెట్టుకొందు' నని మాట చెప్పినప్పటి చుంబనేచ్ఛ వలె నెక్కువగాఁ జమత్కారము నొదవింపఁ జాలదు కూడను. ఇట్లే త్రపయు (సిగ్గు) గూడ ముఖ్యముగా వ్యంగ్యము గాదు. ఈలజ్జ యిట నాయిక * అనువదింపఁ బడుటలోఁ బ్రయోజకముగా దోచుచున్నది. అట్టిది ప్రధాన వాక్యార్థ మెట్లగును ? 'అట్లు గాదు. కొద్దిగా మొగుడుచున్న కనులు గలది యై నిరీక్షించుటనే విధింతుము. ఇపుడుత్రప యను నాద్యతలోఁ బ్రయోజకము గాదు. (విధేయములో = నిరీక్షణములో విశేషణము గనుకనే విధేయతలోఁ బ్రయోజక మగు నని భావము) అందురా ? కనులు కొలఁదిగా మొగుడుట, కను లల్లార్చుట త్రపవలనఁ గల్గినను, త్రప కనుభావ మైనను, అట్లు నిరీక్షించుట ప్రీతివలననే కలుగును. సిగ్గు మాత్రమే వ్యంగ్య మగు నన్నచో నిరీక్షించు

చున్న దనుట కెక్కుడు ప్రయోజనము లేక పోవలసివచ్చును. ప్రీతికి నను భావ మగు నిరీక్షణమునందు త్రప కనుభావ మగు కను లల్లార్చుట వాచ్య వృత్తిలో గుణమై తెలిసినట్లే వ్యంజనావృత్తిలోఁ బ్రీతియందు త్రపయును గుణమై తోచుటయే యుచితము కదా.

శ్రీశర్వాణి :

ఈశ్లోకములోఁ బ్రాచీనులలక్షణము గూడ సరిపడును. 'దయితా దయితాననామ్బుజమ్, అనుచోట శబ్దాలంకారము, యమకమును, దయితుని యొద్దనే పరుండి యున్నను తనకోరికల నెరవేర్చుకొన లేక పోయిన దనుటలోఁ (ఈకారణముచేతనే యాశ్చర్యము సూచించు అహో యను నిపాత ముపపన్నము) గారణ మున్నను కార్య ముదయింప కీ దను విశేషోక్తి యర్థాలంకారమును, శబ్దార్థములు స్వచ్ఛములు కనుకఁ బ్రసాద మను గుణమును, అర్థము సుఖముగా వ్యక్తమగుచున్నది కనుక నర్థవ్యక్తి యను గుణము నున్నవి. దోషము లేమియు లేవు. అల్పసమాస మైన రచన. వైదర్భి రీతి. నాయకుఁ డనుకూలుఁడు. నాయిక స్వీయ. అనురక్త ప్రియుని మొగము నుత్కంఠతోఁ గను లల్లార్చుచు చూచుచున్నది. ఈ సంభోగశృంగారమున కనుగుణముగాఁ గైశికీవృత్తి, పదము లొకదానితో నొకటి పొంది పొసఁగియున్నవి కనుక శయ్య, శ్లేష యను శబ్దగుణము రసవత్తర మగు శబ్దార్థసందర్భ మగుట మాధుర్య మను నర్థగుణము, శృంగారాస్వాదము నొదవించును గనుక ద్రాక్షాపాకము. ఇట్లిచటఁ బ్రాచీనలక్షణానుగ్రహము.

ఇఁకఁ బ్రకృతలక్షణము సమన్వయింతుము. ఈశ్లోకరూప మగు శబ్దము తనవాచ్య మగు నర్థమును ప్రకృతరసవ్యంజన కుపయోగించు నట్లు దెలుపుటలోఁ బర్యవసించినది. ఇఁక నర్థము. దయితాదయితు లాలం బనవిభావములుగా రతిని వ్యంగ్యపఱచును, దయితునియొద్దఁ బరుండి యుండుట యాయేకాంతమును. ఆప్రియునిఁ గలిసి యుద్దీపనవిభావముగా వ్యక్తపఱచును. ఒద్ద పరుండియుఁ దనకోరికల నెరవేర్చుకొనఁ జాల లే దనుటలో ముగుదతనముతో పాటు 'నష్టచేష్టత' యను సాత్త్వికభావమును కను లల్లార్చుచుఁ బ్రియునిమొగముఁ బద్మముఁ జూచినట్లు జూచుచున్న దనుటలో లజ్జాహర్షౌత్సుక్యముః లను వ్యభిచారి భావములును, ఆమెచూపు

రతి కనుభావముగా వ్యక్తమగు నంతలో వ్యంగ్యము లగును. ఇట్లు వాచ్యార్థము ఈవ్యంగ్యవ్యంజనములో విశ్రాంత మగును. ఈవ్యంగ్యము – విభావానుభావవ్యభిచారిభావ సాత్త్వికభావములతో సంయుక్త మగు రతి. మాటిమాటి కనుసంధింపఁ బడి (భావితమై) చమత్కారైకఘనమగు శృంగారరసముగా సహృదయుల కాస్వాద్య మగును. ఇట్లు లోకోత్తరాహ్లాదమయ మగు శృంగారరసమును భావనతో రత్యాదిరూప మగు నర్థమును వ్యంజనావృత్తిచేఁ బ్రతిపాదించు నీశ్లోకము 'రమణీయార్థప్రతిపాదక శబ్ద' మను కావ్య సామాన్య లక్షణమునకు లక్ష్య మగును. ఇట శబ్దార్థములు రెండును తమను అప్రధానములుగా నొనర్చుకొని వ్యంగ్యవ్యంజనమునఁదే విశ్రాంతము లై, చర్వణావిశ్రాంతిధామ మైన చమత్కారమునకు నెల వగు శృంగారరస' మను అర్థముఁ బ్రధానముగా వ్యక్తపఱచుచున్నవి. కనుక, నుత్తమోత్తమ మనుకావ్యవిశేషలక్షణమునకును (శబ్దార్థము లప్రధానమై చమత్కారభూమి యగు నర్థమును వ్యక్తపఱచుట యను దానికిని) లక్ష్యమైనది. అనఁగా : నీరెండులక్షణములచేత నీశ్లోకము కావ్య మనియు, నందు నుత్తమోత్తమ మనియు గుఱుతింపనగును.

• సామాన్యాకార మనఁగా – ఇచ్ఛాత్వము.

* "సామాన్యాకారమునఁ గానీ, విశేషాకారమునఁ గానీ, వాచ్యవృత్తితో స్పృశింపఁ బడినచో నది వ్యంగ్య మనఁ జెల్లదు. ఈవిషయముఁ గావ్యప్రకాశమునం దయిదవ యుల్లాసములో గుణీభూతవ్యంగ్యనిరూపణము సందర్భమునను, ఏడవ యుల్లాసములో రసదోషనిరూపణ ప్రకరణమునను స్పష్టపఱుపఁ బడినది వ్యంగ్యమును వాచ్య మొనర్చినచో 'వమనము' అనుదోష మనియుఁ దెలిపిరి." అని ప్రాచీను లైన మమ్మటాదులను నాగేశుఁడు పేర్కొనినాఁడు. కాని, యీదోష మెప్పుడు, నెచ్చటను సంభవింప దని మేము ఆంధ్రధ్వన్యాలోక లోచనములో స్పష్టముగ నిరూపించితిమి. వాచ్యవృత్తితో స్పృశింపఁ బడినచో వ్యంగ్యము కాఁజాల దని ససందేహాలంకారనిరూపణములోఁ బండితరాజే మిక్కిలి స్పష్టముగ నిరూపించఁ బోవుచున్నాఁడు.

* అనువాద మనఁగా : ఇదివరలోఁ జెప్పిన విషయము మఱియొక ప్రయోజనమునకై తిరిగి తెల్పుట. ఇట నాయకునియొద్దఁ బరుండియున్న

దని మొదటఁ జెప్పిన ప్రియురాలు నిరీక్షణ మను విషయాంతరమును విధించుటకై యిటఁ దిరిగి తెలుపఁ బడినది. ఇందుకుఁ బ్రయోజక మేమి? త్రప యను భావము (ఈభావము నిరీక్షణ వలనఁ) దోచును. కాఁగా, నాయిక యిట ననువదింపఁ బడుటలో లజ్జ ప్రయోజకముగఁ దోచుచున్నది. అట్టి యనువాదకోటిలోనే యిముడును. అది ప్రధానము కాఁజాలదు విధేయమై నపుడే వాక్యార్థము (వాక్యముచే ముఖ్యముగఁ బ్రతిపాదింపఁ బడినది) కాఁగల్గును అని వాక్యశాస్త్రమర్యాద.

• "త్రపవలనఁ గూడ నిరీక్షణము కలుగవచ్చును కనుకఁ గను లల్లార్చుటతోపాటుఁగాఁ ద్రపను వ్యక్తపరచుట యను సామాన్య ప్రయోజనము నిరీక్షణమున కుండు ననుట వలన నెక్కువ ప్రయోజనము లేదు." అన్నచో కన్నులు మొగుడ్చుట త్రపకు విశిష్టము, రమణీయము నగు వ్యంజకమైన కార్యము — అనుభావము. నిరీక్షణ మట్టిది కాదు. ఇది సాధారణము. లజ్జ, భయము, విస్మయము, ఉదాసీనత మొదలగు భావముల నుండి కూడ నేర్పడును. ప్రకృతములోఁ గను లల్లార్చుటతో డిది కనుక నీనిరీక్షణము. దానితో పాటుగఁ ద్రపను వ్యక్తపఱచుటలో నిదియుఁ గొంచె ముపయోగించును. అంతియే కాని వీని కిట విశిష్ట మగు ప్రయోజన మసాధారణ మైన దేదియు లే దని భావము గ్రహింపవలెను.

## భావమున కుదాహరణము — ౨

సంస్కృత మూలము :

గురుమధ్యగతా మయా నతాఙ్గీ
నిహతా నీరజకోరకేణ మన్దం
దరకుణ్డల తాణ్డవం నతభ్రూ
లతికం మా మవలోక్య ఘూర్ణితాసీత్.

తెనుఁగు తాత్పర్యము :

అత్త, మామ మొదలగు పెద్దల నడుమ నున్న యానతాంగిని తామర మొగ్గతోఁ గొట్టితిని. అపు డామె చెవుల నున్న కుండలములు కొద్దిగాఁ దాండవింపఁ గనుబొమలఁ గుంచించి ననుఁ జూచి ఘూర్ణన మొనర్చెను.

సంస్కృత మూలము — వివరణము :

అత్ర ఘూర్ణితాఽసీ దిత్యనేనా సమీక్ష్యకారిన్ కి మిద మనుచితం కృతవా నసీత్యర్థసంవళితోఽ మర్ష శ్చర్వణావిశ్రాన్తి ధామత్వా త్ప్రాధాన్యేన వ్యజ్యతే ; తత్ర శబ్దః అర్థ శ్చ గుణః.

తెనుఁగు తాత్పర్యము :

ఇఁట 'ఘూర్ణన మొనర్చెను' అనుటచే, ముందు వెనుక లాలోచింపక యేమి తగనిపనిఁ జేసితివి ?' అను నర్థముతోఁ గలసిన యమర్షము ఆస్వాద పర్యవసానము కనుకఁ (ఇదియే వెనుకటిదాని కన్న నిట విశేషము) ప్రధాన ముగ వ్యంగ్య మగును. ఆ యమర్షమున (వ్యంగ్యమున) శబ్దము నర్థముగూడ నప్రధానములు.

## కావ్యోదాహరణము - ౩

సంస్కృత మూలము యథావా,

తల్పగతాపి చ సుతనుః శ్వాసాభఙ్గం (సఙ్గం) నయా సేహే,
సమ్ప్రీతి సాహృదయగతం ప్రియపాణిం మన్దమాక్షిపతి

సంస్కృత మూలము — వివరణము :

ఇదం చ పద్యం మన్నిర్మితప్రబన్ధగతత్వేన పూర్వాసాకాంక్ష మితి దిఙ్మాత్రేణ వ్యాఖ్యాయతే.

యా నవవధూః ప్రత్యఙ్క—శయితాశ్వాసస్యా సఙ్గమాత్రే ణాపి సంకుచ దఙ్గలతికా భూత్వా సమ్ప్రీతిప్రస్థానపూర్వరజన్యాం ప్రవత్స్య త్పతికాప్రియేణ సశఙ్క—న సమర్పితం హృదిపాణిం నవవధూ జాతి స్వాభావ్యా దాక్షిపతి పరన్తు మన్దమ్; అత్ర శనైః స్వస్థానప్రాపణాత్మనా మన్దాక్షేపేణ రత్యాఖ్యః స్థాయీ సంలక్ష్యక్రమ తయా వ్యజ్యతే ఉప పాదయిష్యతే చ స్థాయ్యాదనా మపి సంలక్ష్యక్రమ వ్యఙ్గ్యత్వమ్; అము మేవ చ ప్రభేదం ధ్వని మామనన్తి ; యత్తు చిత్రమీమాంసా యా మప్పయ్యదీక్షితైః "నిశ్శేషచ్యుతచన్దనమ్" ఇతి పద్యం ధ్వన్య

దాహరణప్రసఙ్గే వ్యాఖ్యాతమ్; ఉత్తరీయకర్షణేన చన్దనచ్యుతి రితి అన్యథా సిద్ధిపరిహారాయ నిశ్శేషగ్రహణమ్; తత శ్చన్దనచ్యుతేః స్నాన సాధారణ్యవ్యావర్తనేన సమ్భోగచి హ్నోద్ఘాటనాయ తటగ్రహణమ్; స్నానే హి సర్వత్ర చన్దనచ్యుతిః స్యాత్. తరతు స్తనయో స్తట ఉపరిభాగ ఏవ దృశ్యతే; ఇయ మాశ్లేషకృ తైవ. తథా 'నిర్మృష్టరాగోధరః' ఇత్యత్ర తామ్బూలగ్రహణ విలమ్బాత్ ప్రాచీన రాగస్య కిఞ్చి న్మృష్ట తే త్యన్యథాసిద్ధి పరిహారాయ 'నిర్మృష్టరాగః' ఇతిరాగస్య నిశ్శేష మృష్ట తోక్తా; పునః స్నాన సాధారణ వ్యావర్తనేన సమ్భోగచి హ్నోద్ఘాటనాయ 'అధరః' ఇతి విశిష్య గ్రహణమ్, ఉత్తరోష్ఠే సరాగేఽ ధరోష్ఠ మాత్రస్య నిర్మృష్టరాగతా చుమ్బన కృతైవ; ఇత్యాదినా 'ఇద మపి ధ్వనే రుదాహరణమ్; ఇ త్యన్తేన సన్దర్భేణ 'తటాది ఘటితా వాక్యార్థాః స్నానవ్యావృత్తిద్వారా సమ్భోగాఙ్గానా మాశ్లేష చుమ్బనాదీనాం ప్రతిపాదనేన ప్రధానవ్యఙ్గ్య వ్యఞ్జనే సాహాయక మాచ రన్తి; ఇతి తదే తదలఙ్కార శాస్త్రతత్త్వా నవబోధ నిబన్ధనమ్; ప్రాచీనసకలగ్రన్థవిరుద్ధత్వా దుపపత్తివిరోధా చ్చ; తథా హి పఞ్చమోల్లాస శేషే 'నిశ్శేషేత్యాదౌ (నిశ్శేషచ్యుతచన్దన మిత్యాదౌ) గమకతయా యానిచన్దన చ్యవనా దీన్యుపాత్తాని తాని కారణా న్తర తోఽపి భవన్తి; యత (అత) శ్చా త్రైవ స్నానకార్యత్వే నోపాత్తా (నోక్తా) నీతి నోప భోగ ఏవ ప్రతిబద్ధానీ త్యనైకాన్తికాని' ఇతి కావ్యప్రకాశ కృతోక్తమ్.

తెనుఁగు తాత్పర్యము :

ఈపద్యము నా (పండితరాజు) రచించిన ప్రబంధములోనిది. కనుక, వెనుకతో సంబంధించి యుండు నని కొంచెము వ్యాఖ్యానింతుము. ఇదివరలో నీనాయిక క్రొత్తగాఁ గాఁపురమునకు వచ్చినకోడలు కనుక మంచమునఁ బరుండి నపుడు మగని నిట్టూర్పు తగిలినచో నొడలు ముడుచుకొనుచుండెడిది. ఈయోర్వక యొడలు ముడుచుకొనుట 'సుతనుః' అనుటలో వ్యంగ్యము. ఇపుడు ప్రియుఁడు దూరదేశమునకుఁ బ్రయాణ మైపోవుటకు వెనుకటి రాత్రి

యనుమానించుచునే తన హృదయమున నుంచిన చేతిని మందముగాఁ ద్రోయు చున్నది.

క్రొత్తకోడలు స్వభావ మీవిధముగనే యుండును గదా. ప్రియుఁడు సాపేక్షముగ వక్షోజములపై హస్తము నుంచుట తనకు సమ్మతమే. అయినను నవవధూజాతి స్వాభావ్యమువలన మెల్లగా (ప్రథమదినములలో వలె దురుసుగాఁ గాక) నున్నచోటుననే చేర్చుచున్నది. ఇందు వలన రతి యను స్థాయిభావము సంలక్ష్యక్రమము (క్రమముఁ బాటింపఁ దగినట్లు) గా వ్యంగ్య మగును. పూర్వో దాహరణముకంటె వ్యంగ్య వ్యంజకములక్రమము గుఱుతింపఁ దగియుండుటయే దీని యందలి విశేషము. స్థాయిభావము మొదలగునవి కూడ సంలక్ష్యక్రమ వ్యంగ్యములగు నవి ముం దుపపాదించెదము *

ఈప్రభేదమునే ధ్వని యనెదరు అథవా,

సహకారాధిపుఁ గౌఁగిలించుకొని వాసంతీలతాకాంతసా
రహరిద్రారసగౌరకేసరములన్ రంజిల్లు మాధ్వీకవా
ర్లహరీస్వేదము సూపఁ బట్టపగ లేలా ? యింతటన్ సిగ్గు లే
దహహా ! యంచుఁ దొలంగి నవ్వెఁ జెవి మాఱై ముద్దరా లయ్యెడన్.
(ఉత్తర హరివంశము.)

శ్రీశర్వాణి.

* ప్రకరణము స్ఫుటముగా నుండి విభావానుభావవ్యభిచారులు వెంటనే (ఝడితిగ) స్ఫురించెనా మార్మికు లగు సహృదయులకు రసము వెంటనే కలుగును. అటఁ గారణకార్యముల క్రమ మెఱుకపడదు కనుక నాధ్వనిని అసంలక్ష్యక్రమ మందురు ఆవిధముగాఁ గానిచో (ఆలోచించినఁ గాని ప్రకరణము తెలియ రాక, విభావాదులు గూడ బుద్ధిబలమున నూహింప వలసి యుండినచో) రసమును వ్యక్తపఱచు సామాగ్రియొక్క యాలస్య ముచేఁ జమత్కృతి యాలస్య మగును. ఈయాలస్యమువలన వ్యంగ్య వ్యంజకముల క్రమము తెలియవచ్చును కనుక దానిని సంలక్ష్యక్రమ మనఁ బడును. ప్రకృతశ్లోకములో 'సంప్రతి – ఇప్పుడు' అను మాటవలన నిది వరలో నీనాయిక క్రొత్తగాఁ గాఁపురమునకు వచ్చినప్పటితీరు వేరు. ఇపుడు వెనుకటి సంకోచము కూడఁ గ్రమముగా సంకోచపడుచున్న దని

తోచును. ఈవిధముగాఁ బూర్వాపరము లనుసంధింపఁబడును. అందుచే నర్థబోధ యాలస్య మగును. తత్కారణమునఁ గ్రమము గుఱుతింపఁ బడును. కాఁగా, నిది సంలక్ష్యక్రమవ్యంగ్యము.

'శయితా సవిధే' యను మొదటిది యసంలక్ష్యక్రమవ్యంగ్యరసధ్వని కావ్యము.

'గురుమధ్యగతా' యను రెండవది యసంలక్ష్యక్రమవ్యంగ్యభావధ్వని కావ్యము.

'తల్పగ తాపి చ సుతనుః' అను మూఁడవది సంలక్ష్యక్రమవ్యంగ్యభావ ధ్వనికావ్యము. అని తెలియవలెను.

## అప్పయ్య దీక్షిత వివేచన ఖండనము

తెనుఁగు తాత్పర్యము :

మఱి, చిత్రమీమాంసలో నప్పయ్యదీక్షితులు 'నిశ్శేషచ్యుత చందనం స్తనతటం' అను పద్యము ధ్వని కుదాహరించుచు నిట్లు వ్యాఖ్యానించిరి. 'పైగుడ్డ లాగుటవలనఁ జందనము పోయిన' దను అన్యథాసిద్ధినిఁ తొలఁగించుటకై (వేఱొకతీరున నట్టిది సంభవించుట లేకుండుటకై) 'నిశ్శేష' యనుట జరిగినది. 'స్నానమువలనఁ బోయిన' దని కూడ ననకుండుటకై (సంభోగము చేతనే యని తెలుపుటకై) 'తట' వాడఁబడినది. 'తాంబూలము వేసికొనుట యాలస్యమైనందునఁ బెదవి యెఱ్ఱఁదనము కొంచెమే పోయిన' దనుటకు వీలు లేకుండ 'నిర్మృష్టరాగః' అని గ్రహింపఁ బడినది. అనఁగా : అధరరాగము కొంచెమే కాక పూర్ణముగఁ బోయిన దనుటతో. 'అధర' శబ్దము (క్రింది పెదవి మాత్రమే. ఇది ప్రియుని చుంబనము చేతనే జరిగిన దని సూచించుటకు) విశేషించి ప్రయోగింపఁ బడినది. ఈవిధముగ తట, అధరపదార్థములు గూర్చిన వాక్యార్థములు కౌఁగిలి, చుంబనము' మొదలగు సంభోగసంబంధాంగములను స్నానకారణమునుండి తొలఁగించినవి. ఇట్లు ప్రతిపాదించుట మూలమునఁ బ్రధాన మగు వ్యంగ్యమును వ్యంజన మొనర్చుటలో నవి తోడ్పడుచున్నవి. అని ఈవ్యాఖ్యానముఁ జేయఁ బడిన శ్లోక మిది.

నిశ్శేషచ్యుత చన్దనం స్తనతటం నిర్మృష్టరాగోఽధరో
నేత్రే దూర మనఞ్జనే పులకితా తన్వీ తవేయం తనుః

మిథ్యావాదిని ! దూతి ! బాన్ధవజనస్యాజ్ఞాతపీడాగమే
వాపీం స్నాతు మితో గతాసి ? న పున స్తస్యాధమ స్యా న్తికమ్.

పండితుఁ డీవివేచనమును ఖండించుచున్నాఁడు.

ఈదీక్షితవ్యాఖ్యాన మంతయు నలంకారశాస్త్రత త్త్వ మెఱుకవడక పోవుటను వెల్లడించు చున్నది. ఇది ప్రాచీనుల సకలగ్రంథములతో విరోధించుట కాక యు క్తికిని విరుద్ధమే. కావ్యప్రకాశ మం దయిదవయుల్లాసము శేషభాగములో మమ్మటభట్టు నిశ్శేషే త్యాదులందు గమకములుగ స్వీకరింపఁబడిన చందనచ్యవనాదులు కారణాంతరములచేఁ గూడ సంభవించును. ఈపద్యమునందే యవి స్నానకారణములుగఁ జెప్పఁబడినవి. కనుక నవి సంభోగముతోడనే సంబంధించి యుండలేదు కాఁబట్టి యవి 'నియతములు గావు' అన్నాఁడు.

శ్రీశర్వాణి.

1. అది ప్రాచీనగ్రంథమే యగుఁ గాక. యు క్తి కనుగుణముగ లేనిచో నిరాకరింపవలయు నను భావముఁ గలవాఁడు గనుకనే పండితరాజు ప్రాచీనమతము నప్పయ్యదీక్షిత మతముతో పాటు నిరాకరించుచుండును. అందులకే యిచటఁ బ్రమాణవిరోధము, యు క్తివిరోధము రెండును జూపినాఁడు. మొదటిది సిద్ధము గనుక నటఁ దన తెలివితోఁ బనిలేదు. ఇఁక రెండవ దైన యు క్తివిరోధము నిరూపించుటలోనే స్వీయప్రతిభాబలముఁ బ్రదర్శింప వీలుపడును అందులకే యు క్తి విరోధముఁ బ్రస్తావించినాఁడు.

సంస్కృత మూలము :

తథా తత్రైవ తేన.

భ్రమ ధమ్మి అవీసత్థో సో సుణఓ అజ్జమారి దో తేణ
గోలాణఇ కచ్ఛని కుడుంగ వాసిణా దరి అసీహేణ.

(ప్రాకృతము)

భ్రమ ధార్మిక ! విస్రబ్ధః సశునకోఽ (సశ్వాఽ) ద్యమారిత స్తేన
గోదానదీ కచ్ఛకుడుఙ్గ (నికుఞ్జ) వాసినా దృ ప్తసింహేన.

(సంస్కృతము)

ఇత్యాదౌ లిఙ్గజలిఙ్గిజ్ఞానరూపేణ అనుమానేన వ్యక్తిం గతార్థ యతో వ్యక్తివివేకకృతోమతం ప్రత్యాచక్షణేన వ్యభిచారిత్వేన అసిద్ధ త్వేన చ సందిహ్యమానా దపి లిఙ్గాద్వ్యఞ్జనమభ్యుపగతం ; ఇత్థ మేవ చ ధ్వనికృ తాపి ప్రథమోద్ద్యోతే; ఏవం చ వ్యఞ్జకానాం సాధా రణ్యం ప్రతిపాదయతాం ప్రామాణికానాం గ్రన్థై స్సహ అసాధారణ్యం ప్రతిపాదయత స్తవగ్రన్థస్య విరోధః స్ఫుటః؛ కిం చ యదిదం నిశ్శే షేత్యవా న్తరవాక్యార్థానాం వాపీస్నానాది వ్యావృత్తిద్వారేణ వ్యఙ్గ్యాసాధా రణ్యం సంపాద్యతే త త్కిమర్థ మితి పృచ్ఛామః; వ్యఙ్గ్యస్య వ్యఞ్జ నార్థ మితి చే న్న, వ్యఞ్జకగతా సాధారణ్యస్య వ్యఞ్జనానుపాయత్వాత్.

ఔణ్ణిద్ధం దోబ్బల్లం చిన్తా అలస త్తణం సణీ ససిదం
మహ మన్దభాఇణీ ఏకే సహితు హావి పరిభవఇ.

(ప్రాకృతము)

ఔన్నిద్ర్యం దౌర్బల్యం చిన్తా అలసత్వం సనిశ్శ్వసితం
మమ మన్దభాగిన్యాః కృతే సఖి ! త్వా మప్యహహ పరిభ్రమతి.

(త్వా మపి పరిభవతి.) పా. భేదము. (సంస్కృతము.)

ఇత్యాదౌ సాధారణానా మౌన్నిద్ర్యాదీనాం వక్త్రాదివై శిష్ట్య వశాత్ అర్థవిశేష వ్యఞ్జకతా యా అభ్యుపగతేః; ప్రకృతా సాధారణ్యస్య వ్యా ప్యపరపర్యాయస్య అనుమానానుమూలతయా వ్యక్తిప్రతికూలత్వా చ్చ.

తె. తాత్పర్యము :

అక్కడనే యతఁడు 'లింగము వలనఁ గలుగు లింగిజ్ఞాన మైన యను మానముతో వ్యంజనచరితార్థము' అను వ్యక్తివివేకకారుని (మహిమభట్టు) మతము నిరాకరించుటలో

అదిగో ! గోదావరీకచ్ఛమందు కుంజ
మందు నివసించు దృప్తసింహంబె యాళు
నకము నీవేళనే మారణం బొనర్చెఁ
దిరుగుమా; యింక ధార్మికా ! దిగులు దీరి. (శ్లోకానువాదము)

* లనుచోట వ్యభిచారియు, నసిద్ధము నని సందేహింపఁ బడుచున్న లింగము కూడ వ్యంజన మొనర్పఁ గలుగు నని యొప్పినాఁడు ఆనంద వర్ధనుఁడు కూడ మొదటియుద్యోతములో నిట్లే యంగీకరించినాఁడు. కాఁగా, వ్యంజకములు సాధారణము లని తెలుపు ప్రామాణిక గ్రంథము లన్నింటితోఁ గూడ నీ (వ్యంజకముల సాధారణ్యమును) వ్యాఖ్యకు విరోధము విస్పష్టమే.

8. మఱియు, నిశ్శేషేత్యాదు లగు సమాంతరవాక్యముల యర్థములను వాపీస్నానమునుండి మరల్చి వ్యంగ్యము (సంభోగము) నందే యసాధారణములుగా నొనరించు టెల? యని యడిగెదము. 'వ్యంగ్యము (సంభోగము) ను వ్యంగ్య మొనర్చుటకు' అనరాదు. వ్యంజకము లసాధారణము లగుట వ్యంజనలో నెంతమాత్ర ముపయోగింపదే. (శ్లోకతాత్పర్యము.) †. ఓ చెలీ! నిదుర లేకపోవుట, దుర్బలము, చింత, మాంద్యము, నిట్టూర్పు మొదలగు నివియన్నియు నదృష్టహీనురాల నగు నామూలమున నిన్నుఁ గూడ నాక్రమించు కొన్నవి. ఇత్యాదులందు సంభోగమునకు, వ్యాధికిఁ గూడ సాధారణము లగు నౌన్నిద్ర్యాదులు వక్త మొదలగువారి వైశిష్ట్యము బట్టి యర్థవిశేషము వ్యక్తపఱచు నని యంగీకరించిరి కదా. మీఁదుమిక్కిలి యసాధారణ్యము 'వ్యాప్తి' యను మారు పేరు తో, ననుమానమున కనుకూలము కనుక వ్యంజనకుఁ బ్రతికూలముగా నగుచున్నది.

శ్రీశర్వాణి.

* గోదావరి యొడ్డునఁ బూపొదలకడఁ బూలు కోయ వచ్చుచుఁ దన సంకేతము వెలితి గల దానినిగఁ జేయఁ దలఁచు సన్న్యాసిని నటకు రాకుండఁ జేయుటకై యొకజాణ యన్న యీమాటలో కుక్కకు భయపడుట వాచ్యమై, పొదరింటికడ సింగ మున్నది కనుకఁ దిరుగవల దని వ్యంగ్య మొనర్చును.

“ప్రాచీనులు 'సాధారణములు గూడ వ్యంజకము' లని యంగీకరించుటలో, నసాధారణములు గూడ వ్యంజకములే యని పూర్తిగ నంగీకరించి నట్లే ప్రకృతములో విశేషణములు అసాధారణములుగ నున్నవి కనుకనే న ట్లుపపాదించితిని. ఇఁక నాకుఁ బ్రాచీనులతో విరోధము లేదు. అనఁగా, నిజమే. ఇందువలననే యుక్తివిరోధమును మఱియొక దోషముఁ

బండితుఁడు దెలుపుచున్నాఁడు." అని నాగేశుఁ డవతరణిక వ్రాసినాఁడు. ఇది తప్పు. వ్యంజకము లెన్నఁడు నసాధారణములు గారాదు. అట్లగుచో నట ననుమానమే. వ్యంజన కుదురదు. ఇట్లు వ్యంజకముల యసాధారణ్యముఁ బ్రాచీను లెన్న, డెక్కడను గూడ నంగీకరింపలేదు. అంగీకరింపఁ దగదు గూడ. మఱియుఁ బ్రకృతములో వ్యంజకముల యసాధారణ్యమును గుదురదు. ఈవిషయముఁ బండితుఁడే 'ఓదూతీ!' ఇత్యాదిగాఁ దన వ్యాఖ్యానములో నిరూపింపఁ బోవుచున్నాఁడు. కనుక మేము పూర్వమే వివరించిన యవతరణికయే సరి యైన దని గ్రహింపవలెను.

నిశ్శేషేతి పద్యముతో నన్నింట సమస్కంధ మైన యీ శ్లోకములోని విశేషణములు అసాధారణములుగాక సాధారణములుగానే యుండి, వ్యంగ్య మగు దూతీసంభోగమును వ్యక్తి మొనర్చుచున్నవని నిరూపించుట వలన, నప్పయ్యదీక్షితుని నిరూపణము, విశేషణముల అసాధారణ్య వ్యాఖ్యానము అలంకారశాస్త్రతత్త్వ మెఱుఁగక వ్రాసిన దని సప్రమాణముగ వివరించఁ బడినది.

వ్యాప్తితో నర్థముఁ దెలియ నగుచోటు లింగజలింగిజ్ఞాన మగు ననుమితిస్థలము. గమకముల కసాధారణ్య మేర్పడి నపు డట వ్యాప్తియే ప్రసక్తించును. కాని, శబ్దవ్యాపార మగు వ్యంజన ప్రసక్తింపదు. "అనన్యలభ్య శ్శబ్దార్థః, అప్రాప్తే శాస్త్ర మర్థవత్" ఇత్యాది ప్రమాణముల బట్టి పర్యాలోచించినచోఁ బ్రత్యక్షాది ప్రమాణాంతరములు ప్రసక్తించినచోట శబ్దవ్యాపారమున కెట్టి యవకాశ ముండ దని తెలియవచ్చును. కనుక ననుమానప్రమాణమునకు (వ్యాప్తికి) ముఖ్యావలంబన మైన అసాధారణ్యము వ్యంజనకుఁ దప్పక ప్రతికూలమే. ప్రతికూలము కాదనుట న్యాయప్రమాణోపహతము. కాఁగా, నిసుపకుతికల శంకరశాస్త్రి గారి వాద మసమంజస మని స్పష్టపడినది.

సంస్కృత మూలము :

అథ తటాది ఘటితత్వేపి న నిశ్శేషే త్యాది వాక్యార్థానా మసాధారణ్యం ; సలిలార్ద్రీవసనకరణక ప్రోంఛనాది నాఽపి తత్సమ్భవా దితి చేత్, త ర్హి వాపీస్నానవ్యావర్తనేన కః పురుషార్థః ? ఏకత్రానైకాన్తి

కత్వ స్యేవ బహుష్వనై కా న్తికతాయా అపి జ్ఞాతాయాః అనుమితి ప్రతికూలత్వాత్ వ్యక్తి ప్రతికూలత్వా చ్చః అపి చాత్ర హి తద న్తిక మేవ రన్తుం గతా సీతి వ్యఙ్గ్య శరీరే తద న్తిక గమనం రమణ రూపఫలాంశ శ్చేతి ద్వయం ఘటకం ; తత్ర తావ త్తద న్తికం గతాసీ త్యంశస్య త్వన్మతే వ్యఙ్గ్యత్వం దురుపపాదం ; త్వదు క్తరీత్యా విశేషణవాక్యార్థానాం నిశ్శేషేత్యాది ప్రతిపాద్యానాం వాచ్యార్థే వాపీస్నానే బాధితత్వా ద్వాచ్య కక్షగత ప్రధానవాక్యార్థీభూత విధినిషేధ ప్రతిపాద కాభ్యాం 'గతా నగతా' ఇతి శబ్దాభ్యాం విరోధిలక్షణయా నిషేధస్య విధే శ్చ ప్రతీతే రుపప త్తేః ; న హి ముఖ్యార్థబాధేన ఉన్మీలితేఽ ర్థేవ్య క్తి వేద్య తోచితా ; యథా 'అహో పూర్ణం సరో యత్ర లుఠ న్త స్స్నా న్తి మానవాః' ఇత్యత్ర క ర్తృవిశేషణానుపప త్త్యధీనోల్లాసే పూర్ణత్వాభావే; అథ తద న్తికగమనస్సలక్షణా వేద్యత్వేఽపి రమణస్య ఫలాంశస్య లక్ష్య శ క్తిమూల ధ్వననవేద్యత్వ మవ్యాహత మే వేతి చేత్ ; 'అధమత్వ మప్రకృష్టత్వం త చ్చ జాత్యా కర్మణావా భవతి ; తత్ర జాత్యాపకర్షం నో త్తమనాయికా నాయకస్య వ క్తి' ఇత్యాదినా సన్దర్భేణ భవతైవ అర్థా ప త్తివేద్యతాయాః స్ఫుటం వచనాత్ ; అన్యలభ్యస్య చ శబ్దార్థతాయా అస్వీకృతేః : అన్య చ్చ, యథా కథం చిదఙ్గీకురు వాత్రవ్యఞ్జనావ్యాపా రం ; త థాపి న తవేష్టసిద్ధిః ; వాచ్యానాం నిశ్శేషచ్యుతచన్దన స్తనతట త్వాదేనా మధమత్వస్య చ త్వదు క్తరీత్యా ప్రకారా న్తరే ణానుపపద్యమాన తయా దూతీ సమ్భోగమాత్ర నిష్పాద్యత్వేన గుణీభూత వ్యఙ్గ్యత్వ ప్రసఙ్గాత్.

తెనుఁగు తాత్పర్యము :

ఇఁక నిశ్శేషేత్యాది వాక్యార్థములు తటాదులఁ గూర్చిన నసాధారణములు గావు. 'నీటఁ దడిసిన గుడ్డతో రుద్దుకొనుట మొదలగు దానినుండి కూడ నవి (చందనచ్యవనాదులు) సంభవించును గాదా ? యందురా ? అపుడు వాపీస్నాన మును మాత్రము నిషేధించుటలో నేమి పురుషార్థము ? ఒకచోట ననియతి

వలెనే పలుచోటుల ననియతి. 1. తెలిసినను, అనుమితికిఁ బ్రతికూలమును, వ్యక్తి కనుకూలమును గదా. 2. అంతే కాక యస లిచట వ్యంగ్య మేమి? 'అతని యొద్దకే రమించుటకుఁ బోయితివి' యని కదా? ఈ వ్యంగ్యశరీరములో నతనియొద్దకుఁ బోవుటయు, రమించుట రూప మైన ఫలాంశము రెండుఁ గూడి యున్నవి. ఇందులో 'అతని యొద్దకే పోయితివి' యను నంశము నీ (దీక్షిత) 3. మతములో వ్యంగ్య మగుట కుదరదు. ఏమన? ఇచట నిశ్శేషేత్యాదులు దెలుపునట్టి విశేషణవాక్యార్థములు (అప్రధానములు) నీ చెప్పినట్లు వాచ్యార్థమగు 4. వాపీస్నానమున బాధితము లగును. కనుక వాచ్యకక్ష్యలోఁ బ్రధానవాచ్యార్థము లగు విధినిషేధములఁ దెలుపు 'గతా (వెళ్ళితివి) నగతా (వెళ్ళలేదు)' అను పదములు క్రమముగా నిషేధము (వెళ్ళలేదు) విధిని (వెళ్ళితివి) తెలుపునట్లుగా విరోధిలక్షణమే కుదుర్చును. ముఖ్యార్థబాధతో నున్మీలిత మగు నర్థమును వ్యంజనతోఁ దెలియవచ్చు ననఁ దగదు. ఎట్లన? (శ్లోక తాత్పర్యము) 'అబ్ధేః చెఱువు నిండుగా నున్నది. ఇట మనుష్యులు దొరలుచు స్నాన మొనర్చుచున్నారు' అనుచోట, కర్తల విశేషణము. 5. (దొరలుట) కుదురక పోవుట వలనఁ బైటఁబడిన చెఱువుయొక్క యపూర్ణత వ్యక్తివేద్య మనరు గదా.

'అయితే యతనియొద్ద కేఁగుట లక్షణతోనే తెలియనైనను, ఈలక్ష్యముఁ దెలుపు సామర్థ్యము (లక్షణ) మూలమున నేర్పడిన వ్యంజన వలననే 6. రమణము (ఫలాంశము) వేద్య మగుటలో నడ్డు లేదుగదా?' యన్నచో. 'నధమత్వ మనఁగాఁ దక్కువతనము. అది జాతితోఁ గాని, పనితోఁగాని యేర్పడును. అందులో, తననాయకుఁడు జాతితోఁ దక్కువ యని యుత్తమనాయిక తెలుపదు' మొదలగు సందర్భములతో నీవే (దీక్షతులే) అది - దూతీ రమణము 7. అర్థాపత్తితోఁ దెలియనగు నని స్పష్టపఱచితివి కదా. మఱియొక దాని నుండి లభించునది శబ్దార్థ మగు టొప్పదు గదా. ఇంకొక విషయ మేమన? అటు నెటులో వ్యంజనావ్యాపార మొప్పినను నీ (దీక్షితుల) కిష్ట మయినది సిద్ధింపదే. వాచ్యము లైన 'నిశ్శేషచ్యుత చందన స్తనతటత్వాదులును, అధమత్వమును' గూడ నీచెప్పినటులే మఱియొక తీరునఁ గుదురవు కనుకను, దూతీసంభోగము మాత్రమే దానిని సిద్ధింపఁ జేయును గనుకను గుణీభూతవ్యంగ్య మగుట యే 8 ప్రసక్తించును.

శ్రీశర్వాణి.

1. ఇచ్చట 'జాతాయాః – కల్గినను' అని పాఠ మన్నాఁడు నాగేశుఁడు. అది తప్పు. అనియతి 'కల్గుట' యిట నుపయోగింపదు. అది తెలియుట'యే యిట నుపయోగించును. కనుక 'జ్ఞాతాయాః' అన్నదే సరియైన పాఠము. 'జాతాయాః' అనుట తప్పుపాఠము.

2. అధమపదము ముఖ్యముగా 'సతనియొద్దనే పోయితివి' యను వ్యంగ్య మొనర్చు నని కావ్యప్రకాశకారాదులు దెల్పిరి. కనుక స్నానమును వ్యావర్తింపఁ జేసితి నన్నచో, దానిని సమాధానించుచున్నాఁడు. 'అంతే కాక' యని నాగేశుఁడు వ్రాసెను.

3. పండితుని మతములో వ్యంగ్య మగుటఁ జక్కఁగాఁ గుదుర్పు నగును. దీక్షితమతములో వలె ననుపపత్తిమూలక మగు లక్షణ యిటఁ బసక్తిం పదు గదా.

4. నిశ్శేషే త్యాది సమాసపదములచేఁ దెల్పినది (అర్థము) అప్రధానము. సతతటాదులందలి విశేషణములు 'గతా, నగతా' యను మాటలు దెల్పిన విధినిషేధములు ప్రధానములు. విశేషణబలమునఁ బ్రధానములు మారు ననియు, నట విరోధిలక్షణయే సాధక మనియు, వ్యంజన కవకాశము లేదనియుఁ గనుక 'అతని యొద్దకే పోయితివి' అను నర్థముల లక్షణా వేద్యమే కాని, వ్యంజనావేద్య మగుట దీక్షితమతములోఁ గుదురబో దనియు, నుపపాదింపఁ బడినది.

5. దొంగిలుట యను స్నానకర్తృ విశేషణము చెఱువు నిండుగా నున్నచోఁ గుదురదు గదా.

6. ఫలాంశము : రమణము – సంభోగము. ప్రధానము గనుక వ్యంగ్య మైనచో నది ధ్వని కావచ్చు నని భావము.

7. జీవించి యున్న దేవదత్తుఁ డింట లేనిచో బయటనే కద యుండును. అట్లే జాతితో నధముఁడు గాని వ్యక్తి పనితోనే కదా యగును ?

8. అధమపదవాచ్యార్థము సమకూర్చుటకే యీ వెనుకటి వ్యంగ్య మంతయు నుపయోగించును. కనుక వాచ్యసిద్ధ్యంగ మను గుణీభూతవ్యంగ్య

(రెండవ, లేక మూఁడవ, మధ్యమ) కావ్యముగనే యీ శ్లోకముఁ జెప్ప నగును. కాని, ప్రథమకావ్య (శబ్దార్థములకన్న వ్యంగ్యము ప్రధానముగ లేదు గనుక) కాఁజాలదు.

సంస్కృత మూలము :

ఏవం చోపపత్తి విరోధోఽపి స్ఫుటతర ఏవ; తస్మా ద్వాచ్యార్థ సాధారణ్య మే వోచితమతి విదగ్ధనాయికా నిరూపితానాం విశేషణ వాక్యార్థానాం; తథా హి ''అయి' బాన్ధవజనస్య అజ్ఞాత పీడాగమే ! స్వార్థపరాయణే ! స్నానకాలాతిక్రమ భయవశేన నదీమదీయప్రియయో రన్తిక మగత్వైవ వాపీం స్నాతు మితో మమాన్తికా ద్గతాపి. న పున స్తస్య పరవేదనానభిజ్ఞతయా దుఃఖదాతృత్వేన అధమస్యాన్తికం ; యతో నిశ్శేష చ్యుత చన్దనం స్తనయో స్తట మేవ నోరస్థలం, వాపీగత బహుల యువజన త్రపాపారవశ్యా దంసద్వయలగ్నాగ్ర స్వస్తికే కృత భుజలతాయుగలేన తటస్యైవోన్నతతయా మహు రామర్శాత్. ఏవం త్వరయా సమ్యగక్షాలనే నోత్తరోష్ఠేన నిర్మృష్టరాగో ఽధర స్తు తదపేక్షయా గణ్డూష జల రదన శోధనాఙ్గుల్యాదీనా మధికసంసర్గం ఆవహతీతి తథా; కించ సమ్యగక్షాలనేన నేత్రే జల మాత్ర సంసర్గా ద్దూరము పరిభాగ ఏవా నఞ్జనే; శీతవశా త్తానవా చ్చ తవతనుః పులకి తేతి ;'' ఏవం తస్యాః విదగ్ధాయాః గూఢతాత్పర్యై వోక్తిరుచితా, అన్యథా వైదగ్ధ్య భఙ్గాపత్తేః.

తెలుఁగు తాత్పర్యము :

కాఁగా, నీరీతిని ఉపపత్తి విరోధించుటయు * స్ఫుటముగానే యున్నది. కనుక, నతివిదగ్ధ యగు నీనాయిక నిరూపించిన యీ విశేషణ వాక్యార్థము నిశ్శేషచ్యుత చందనస్తనతటత్వాదులు వాచ్యార్థము నందు ననఁగా వాపీ స్నానము నందు (అతని తోడి రమణము నందు గూడ) సాధారణములే. అట్లే కదా. "ఓ దూతీ ! నీవు చుట్టపక్కముల బాధలను గుఱుతింపవు. నీస్వార్థమునే చూచుకొందువు. స్నాన మూడువేళ దాటిపోవు నను భయముతో నేటియొద్దకుఁగానీ, నాప్రియునియొద్దకుఁ గానీ పోవకయే యిచ్చటి (నాయొద్ద) నుండి దిగుడుబావికిఁ బోయితివి. అంతే కాని యితరుల బాధల గుర్తింపక కష్ట

ముల పాలొనరించు సరిమిుఁ డగు నాతని కడకు బోలేదు. ఏమంటే; నీ స్తన ముల పైభాగ మందే చందనము పూర్తిగాఁ బోయినది. కాని మొత్తమునం దంతయుఁ బోవలేదు. యువకులు చాలమంది బావియొద్ద నుండుట వలన సిగ్గుతో నంసముల వెంటచివరలకును బూన్చి (స్వస్తిక్ విధముగ) త్వరితముగ మార్ద నము సేయుటలో నుపరిభాగ మెత్తుగా నున్నందున నంతవఱకే పోయినది. ఇట్లే సరిగా ప్రక్షాళనము సేయక పోవుటచేఁ బై పెదవి యెఱుపు పోలేదు. నీరు పుక్కిలించునపుడు, దంతధావన సేయుటలో వ్రేలు పుక్కిలిగా క్రింది పెదవికిఁ దగిలి యూరాపిడిచేత దాని యెఱుపు మాత్రమే పోయినది. ముఖముఁ గడుగు నపుడు నీరు తగినంత యుపయోగించి శ్రద్ధగా నాప్రదేశమంతయుఁ దోము కొనకుండుటచేఁ గొంచెముగా నీరు తగిలి కన్నుల పైభాగము నందలి కాటుక మాత్రమే పోయినది. నీవు సహజముగ సుకుమారదేహవు గనుకఁ జలిమూల మున నొడలు గగుర్పొడిచినది." అని యీవిధముగ నిపుణురాలైన నాయిక తనభావమునం దిముడ్చుకొని మాటాడుటయే యుచితము. కానిచో నైపుణ్య భంగము కలుగును.

శ్రీ శర్వాణి :

ప్రాచీన మతానుసారముగ నిట్టు లంటి నన్నచో, యుక్తి విరోధించు టయే కాక ప్రకృతమున నీవు నిరూపించిన విశేషణముల యసా ధారణ్యము గూడఁ బ్రాచీనమార్గముతో విరోధించునదే కదా యని భావము.

సంస్కృతి మూలము :

ఏవం సాధారణే ష్వేవ వాక్యార్థేషు ముఖ్యార్థే బాధాభావా త్తాత్ప ర్యార్థస్య ఝటి త్యనాకలనాత్ కుతో ఽత్ర లక్షణా ఽవకాశః ? అనన్తరం చ వాచ్యార్థ ప్రతిపత్తేః వక్తృబోద్ధవ్య నాయకాదీనాం వైశిష్ట్యస్య ప్రతీతౌ సత్యా మధమపదేన స్వప్రవృత్తి ప్రయోజకో దుఃఖదాతృత్వ రూపో ధర్మః సాధారణాత్మా వాచ్యార్థదశాయా మపరాధాన్తర నిమిత్త దుఃఖదాతృత్వరూపేణ స్థితో వ్యఞ్జనావ్యాపారేణ దూతీ సమ్భోగ నిమి త్తక దుఃఖదాతృత్వాకారేణ పర్యవస్యతీ త్యాలఙ్కారిక సిద్ధాన్త నిష్కర్షః; ఏతేన 'అధమత్వం అపకృష్టత్వం త చ్చ జాత్యా కర్మణా వా భవతి;

తత్ర జాత్యాపకర్షం నోత్తమనాయికా నాయకస్య వక్తి; నాపి స్వాప రాధ పర్యవసాయి దూతీ సమ్భోగాది హీనకర్మాతిరిక్తే న కర్మణా; తాదృశం చ దూతీసమ్ప్రేషణా త్ప్రాచీనం సోఢ మేవేతి నోద్ఘాటనార్హ మితీతర వ్యావృత్త్యా సమ్భోగరూప మేవ పర్యవస్యతి' యదుక్తం తదపి నిరస్తం; విదగ్ధోత్తమనాయికా యాః సఖీసమక్షం తదుపభోగ రూపస్య స్వనాయ కాపరాధస్య స్ఫుటం ప్రకాశయితు మతితమా మనౌ చిత్యేన ప్రాచీనానా మేవసోఢానా మప్యపరాధా నామ సహ్యతయా దూతీం ప్రతి ప్రతిపాదయిషితత్వా దితి దిక్.

తెనుఁగు తాత్పర్యము.

ఇటు లీవిశేషణము లగు వాక్యముల యర్థము లన్నియు సాధారణములు కాఁగా, ముఖ్యార్థమునకు బాధ లేదు. కనుక నాయిక తాత్పర్యములోని యర్థము వెంటనే గోచరము కాఁబోదు. ఇపు డిఁక లక్షణ కవకాశ మేది? (లక్షణ) తాత్పర్యానుపపత్తి దెలిసినఁ గాని రాదు. అసలు తాత్పర్యమే తెలియ నపుడు దాని యనుపపత్తియుఁ దెలియదు కదా! ఇట్లు వాచ్యార్థ మవగత మైన తరువాత వక్తయు, బోద్ధవ్యుఁడు, నాయకుఁడు మొదలగు వారిలోని వైశిష్ట్యము (విశే ష్యము స్ఫురింపఁగా) వ్యంజన యుద్బుద్ధ మగును. పూర్వము వాచ్యార్థదశలో నధమపదము ప్రవర్తించిన ధర్మము వేరువిధముల దుఃఖమును గల్గించుట రూప మున నున్నది. ఇపుడు వ్యంజనదశలో నీదూతీసంభోగము మూలమున దుఃఖము గల్గించుటగాఁ బర్యవసించుచున్నది. ఆయా వైశిష్ట్యప్రభావమువలన వాచ్య వ్యంగ్యసాధారణ మైన యర్థము చమత్కారముఖముగాఁ బర్యవసానముఁ బొందు నని యాలంకారికుల సిద్ధాంత నిష్కర్ష.

'ఇందువలన నధమత్వ మనఁగా నీచుఁ డగుట. అది జాతితోఁ గాని, పనితోఁ గాని యేర్పడును. అందులో నుత్తమనాయిక తననాయకుఁడు జాతితో నీచుఁ డని తెలుపదు. ఇఁక పనిమూలముననే యతఁడు నీచుఁ డనవలెను. ఆపని కూడ మఱియొకటి కాదు. ఇతరరకము లగు కార్యముల సహించియే కదా దూతినిఁ బంపినది? అందుచేఁ బూర్వకృత్యముల నిపుడు తడవవలసిన పనిలేదు. కాఁగా, నీయధమత్వ మిప్పటి దూతీ సంభోగరూపముననే పర్యవ సించును. ఇట్లు భావించిననే నాయకుఁడు నాయికయం దపరాధ మొనర్చె నని

తేలును.' అని దీక్షితు లన్నమాటలుకూడ నిరస్తమైనది. ఏమనఁగా : ఉత్తమ నాయిక తనచెవి సమక్షమున దూతీసంభోగము వలని యపరాధము స్పష్టముఁ జేయుట యత్యంత మనుచితము. తాను పూర్వమే యపరాధముల సహించినదో వానినే ప్రస్తుత మసహ్యముగ దూతి నుద్దేశించి చెప్పఁ దలఁచినది ; కాని క్రొత్తగాఁ బ్రతిపాదింపఁ దలఁచలేదు. ఇదియే దారి.

శ్రీశర్వాణి :

అధమపదము ప్రవర్తించుటకు నిమిత్తమైన యధమత్వము అధము లందఱిలో నొకేవిధముగ నుండదు అందుచే నక్కడ నేయేధర్మము లుండునో వానినే నిమిత్తములుగ గ్రహించవలెను. ఇప్పటి యీ యధమత్వము ప్రకృతము వాచ్యకక్ష్యలో 'నాయకుఁడు మొదట నేదో విధమైన యపరాధముఁ జేసినవాఁ డగుటవలన దుఃఖప్రదాత యగుచున్నాఁ డనియు, వ్యంజనావ్యాపారద్వారముగ దూతీసంభోగరూపమైన దుఃఖప్రదాత యగుచున్నాఁ డనియుఁ బర్యవసించుచున్నది.



# ఆంధ్ర రసగంగాధరము

## ౨. ఉత్తమకావ్య విచారము

సంస్కృత మూలము

యత్ర వ్యఙ్గ్య మప్రధాన మేవ సచ్చమత్కారకారణం ద్వితీయమ్ వాచ్యాపేక్షయా ప్రధానీభూతం వ్యఙ్గ్యాన్తర మాదాయ గుణీభూతం వ్యఙ్గ్యమా దా యాతివ్యాప్తి వారణాయ అవధారణం; తేన తస్య ధ్వనిత్వ మేవ, లీనవ్యఙ్గ్యవాచ్యచిత్రాతిప్రసఙ్గవారణాయ చమత్కారే త్యాది.

తెలుఁగు తాత్పర్యము

వ్యంగ్య మప్రధానముగ నుండి చమత్కారమున కెట కారణ మగు నది రెండవది (ఉత్తమకావ్యము.)

వాచ్యార్థమునకన్నఁ బ్రధానముగ, వేఱొక వ్యంగ్యమున కన్న నప్రధానముగ నుండి చమత్కారము నొదవించు వ్యంగ్యముఁ బట్టి రసవదాద్యలంకార కావ్యములందతివ్యాప్తి రాకుండ (అట్టివి యీయుత్తమ కావ్యకోటిలోనికి రాకుండ) వారించు టకై 'ఉండియే' (తప్పక యుండితీరవలె నని) యవధారణ ముపయోగింపఁ బడినది రసవదాద్యలంకారస్థలములందు ప్రధానమగు కరుణాదిరసముఁ బట్టి 'యప్రధానము.' వాచ్యార్థముఁ బట్టి 'ప్రధానము' నగు శృంగారాదిరసము అప్రధానముగనే యుండలేదు. వాచ్యార్థమునకన్నఁ బ్రధానముగ నుండియుఁ [illegible] కనుక నీలక్షణములోని "అప్రధానముగ నుండియే"

ఆకావ్యము ధ్వనియే. ఉత్తమోత్తమ కావ్యమే వ్యంగ్యము లీన మైన వాచ్య చిత్రమున నతివ్యాప్తి లేకుండఁ 'చమత్కారముఁ గల్గించునది' యనఁ బడినది. (వాచ్యచిత్రమున లీనమైన వ్యంగ్యము చమత్కారముఁ గలిగింపలేదు గనుక నతివ్యాప్తిరాదు.)

శ్రీశర్మాజీ·

అస లీరెండవవిభాగముఁ బండితరా జొనరించుటలో నతనిభావ మేమో పరిశీలింతుము

మమ్మటుఁడు తన కావ్యప్రకాశములో "ఇద ముత్తమ మతిశయిని వ్యఙ్గ్యే వాచ్యా ద్ధ్వని ర్బుధైః కథితమ్" (వాచ్యము కన్న వ్యంగ్య మతిశయించినచో నది యుత్తమము, ధ్వని యనెదరు బుధులు) అని ధ్వని కావ్యలక్షణము చెప్పి, "అతాదృశి గుణీభూతవ్యఙ్గ్యం వ్యఙ్గ్యే తు మధ్యమమ్" (వ్యంగ్య మట్టిది (యతిశయించునది) కానిచో మధ్యమము గుణీభూతవ్యంగ్యము) అని గుణీభూత వ్యంగ్యకావ్యమునకు లక్షణము చెప్పెను· ఇవి యెనిమిదివిధము లనియు. నందులో రెండవ దైన యపరాంగమును. 'అపరస్య – రసాదే. ర్వాచ్యస్యవా (వాక్యార్థీభూతస్య) అఙ్గం రసాది, అనురణనరూపం వా' (అపరమునకు – రసాదికమునకు. వాచ్యమునకుఁ గాని = వాక్యార్థమైనదానికి, అంగము = రసాదికము, అనురణనరూప ముగాని) యని చెప్పి మొదటిదాని కుదాహరణముగ 'అయం సరశనోత్కర్షీ పీనస్తనవిమర్దనః, నాభ్యూరుజఘనస్పర్శీ నీవీ విస్రంసనః' అను శ్లోకము వ్రాసి, 'అత్రః శృఙ్గారః కరుణస్య' (ఇచ్చట శృంగారము కరుణమునకు అంగము అన్నాఁడు. ఇపు డీచోట 'గుణీభూతవ్యంగ్యము' అన్న 'అయంసః' అనుచోట ధ్వనికావ్యలక్షణ మతివ్యాప్త మైనది. గుణీభూత వ్యంగ్యకావ్యలక్షణ మవ్యాప్తము నయినది. ఎటు లనఁగా ;

ఇట వ్యంగ్యమైన శృంగారము వాచ్యమునకన్న నతిశయితమే కదా. అయితే "యద్యపి సనాస్తి విషయః యత్ర ధ్వని గుణీభూతవ్యఙ్గ్యయోః స్వప్రభేదాదిభి స్సహ సఙ్కరః సంసృష్టిర్వా నాస్తి, తథాపి ప్రాధాన్యేన వ్యపదేశాభవ న్తీతి క్వచిత్కేనచి ద్వ్యవహారః" (విచారింపఁగా, ధ్వనికిని, గుణీభూతవ్యంగ్యమునకును స్వప్రభేదాదులతో సంకరమో. సంసృ

ష్టియో లేనిచోటు లేదు. అయినను. ప్రాధాన్యముఁ బట్టి వాడుక లేర్పడుతవి) అని ముందు చెప్పఁబోవుచున్నాఁడు. కనుక. 'నీశ్లోకము కరుణరసముఁ బట్టి ధ్వనియుఁ గావచ్చును శృంగారముఁ బట్టి గుణీభూతవ్యంగ్యముఁ గావచ్చును కనుకఁ, బై దోషములు దగులవు' అని యొకవాదము

ఈవాదము తప్పు. "ఉపధేయసఙ్కరేఽపి ఉపాధే రసఙ్కరః" (ఉపాధిప్రయుక్తములకు సంకర మున్నను, ఉపాధులకు సంకరము పనికి రాదు.) అని న్యాయము. కాఁగా, శృంగార మను నుపాధిఁ బట్టియే యిది ధ్వని కావలసివచ్చును. (గుణీభూతవ్యంగ్య మగుటకుఁ జెప్పిన యుపాధియే ధ్వని కుపాధి యై సంకరముఁ దెచ్చి పెట్టు చున్నది.) ఇట శృంగారము (వ్యంగ్యము) వాచ్యమున కన్న నతిశయితమే కదా. అందుచేతనే గుణీభూతవ్యంగ్యలక్షణమున కవ్యాప్తి తప్పదు.

ఈదోషమును వారింపవలె నని నాగేశుఁడు అపరాఙ్గోదాహరణే అయం సరశనోత్కర్షీత్యత్రాపి వాచ్యాపేక్షయా శృఙ్గారస్య న ప్రాధాన్యం, శోకోత్కర్షకతయా శృఙ్గారరూప వ్యఙ్గ్యాపేక్షయా వాచ్యస్యైవ చమత్కారకారిత్వాత్, ఏవం సర్వత్రాపరాఙ్గోదాహరణే షూహ్యః" (దీనిని గుఱించి పూర్వము కొంత విమర్శ సలిపితిమి. వక్తాంశ శేష మిట వివరింతుము)

'అయం సరశనోత్కర్షీ' యనుచోట నైనను, వ్యంగ్య మగు శృంగారము వాచ్యమునకన్నఁ బ్రధానము గాదు. దానికన్న నిట వాచ్యమే, యది శోకము నుత్కర్షించును గనుకఁ జమత్కారము, ఇటులే యపరాంగోదాహరణములం దంతట నూహింపవలెను. అని చెప్పిన నాగేశుని వివరణము నలంకారశాస్త్రతత్త్వ మెఱిఁగిన ప్రామాణికు లందఱు గర్హింతురు.

ధ్వన్యాలోకములో నానందవర్ధనుఁ డిట్లనినాఁడు

"అథవా వాక్యార్థభూత స్యాపి కస్యచి త్కరుణరస విషయస్య తాదృశేన శృఙ్గార వస్తునా భంగివిశేషాశ్రయేణ సంయోజనం రసపరిపోషా యైవ జాయతే...యథా; అయం సరశనోత్కర్షీత్యాదౌ." (ఏదే నొక కరుణరస గోచర మగునది, యట్టి దే యగు శృంగారవస్తువుతో విశిష్ట మగు భంగిని గూర్చుట రసముఁ బోషించుటకే యగును. సహజసుందరము లగు పదార్థ

ములు శోచనీయస్థితి నొందినపుడు, వెనుకటి మంచిసమయమునందలి వాని విలాసములు జ్ఞప్తికి వచ్చి శోకావేశము వృద్ధి యగును ఉదాహరణము. ఆంధ్రధ్వన్యాలోకము 'మెలుపారఁగాఁ బట్టి' యను పద్యము.

ఇందుచేఁ గరుణోత్కర్షకత్వ మను నంగత్వము శృంగారమునకే యని ప్రామాణికులు దెలిపిరి. కాని, వాచ్యమునకుఁ గాదు గదా. ఇంత యెందులకు? అసలీమమ్మటుఁ డీశ్లోకము నెట్లు సమన్వయించినాఁడు? 'అత్ర శృఙ్గారః కరుణస్య' యని నాఁడే కాని, వాచ్యము కరుణమున కంగ మన లేదు. ఆట్లే యన్నచో, నీశ్లోకము రసము రసాంతరమున కంగ మగుట కుదాహరణ మెట్లగును? ఇట్లు తనకుఁ బ్రామాణికులైన వారందఱు విరోధింతు రని యీనాగన్న యెఱుఁగడు.

మఱియు, భావధ్వని నిరూపణ ప్రకరణములో "అస్తు వా ప్రాధాన్యే నేతి" యను ప్రతీకము నెత్తుకొని వ్యాఖ్యానించుచు "రసం ప్రతి గుణీభూత త్వేపి వాచ్యాతిశాయిత్వాత్ తద్ధ్వనిత్వం, రాజానుగమ్యమాన వివహనప్రవృత్తభృత్య స్యేవ రసాపేక్షయాపి హి అస్య ప్రాధాన్య మస్తి. అత ఏవ న భావధ్వని విలోపప్రసఙ్గః" (భావము రసమునకన్న నప్రధాన మైనను వాచ్యమున కన్న నతిశయించునదే కనుక దానిధ్వని యగును. రాజు వెంట వచ్చుచున్నను పెండ్లికొడు కైన భృత్యుఁడే ప్రధానము గదా. కనుక రసమున కన్న కూడ నిది ప్రధానము) అని యన్నాఁడీ నాగన్న. ఈమాటలు 'అపరాంగ వ్యంగ్యస్థలములం దంతటను వాచ్యమే వ్యంగ్యమున కన్న నతిశయితము' అను పైనిర్ణయముతో విరోధింపదా? ఈనాగన్న యీవిధముగ వచ్చు స్వవచనవ్యాఘాతము గూడ గుఱుతింపఁ జాలడు. అదికాక, 'రసము వాచ్యాంగ మగుట స్పష్ట మగుటచే వాచ్యము వంటిదే యైనది. కనుక గుణీభూతమే' యనినాఁడు గదా? వాచ్యము = గూఢము గానిది, వ్యంగ్యము = గూఢమైనది; దీనికన్న వాచ్యము చమత్కరించు టసంభవమే కదా. ఇట్లు సర్వమార్గముల నాగేశుని వ్రాఁత ఖండింపఁ బడినది.

ఇఁకఁ బ్రకృతము, ఇట్లపరాంగవ్యంగ్యములో మమ్మటుని రెండు లక్షణములు దప్పయినవి. కాఁగా, మిగిలినది యపరాంగవ్యంగ్యము. (రసమునకు రస మంగ మగుచోటు.)

'అయం సరశనోత్కర్షీ' త్యాదులందుఁ బ్రాకరణికము గనుకఁ, గరుణము ప్రధాన మైనను, అటులే వాక్యార్థ మగు శృంగారము గూడఁ బ్రముఖమునఁ జమత్కారిక మగుచున్నది. శృంగార మిట వాక్యార్థమే యని యానందవర్ధనుఁడు ధ్వన్యాలోకపంక్తి పైన 'తావృశేన' యని వ్రాసినది ప్రమాణించును. కాఁగా, వాచ్యాతిశాయి యగు వ్యంగ్య మైన శృంగారమాకావ్యమును ధ్వని నొనరించియే తీరును

ఇఁక రెండవప్రకారము. (భావమునకు రసాదు లంగమగుచోటు) అటఁ గూడ వ్యంగ్యము లగు రసభావాదులు స్వేతరము లగు భావాదులకంగము లగుఁ గాక. వాచ్యమునకన్నఁ జమత్కారమున నతిశయించునవే. కనుక నవియు ధ్వనిస్థలములే. అనఁగా: భావాంగము లగు రసాదులఁ బట్టి యవి కూడ ధ్వనిస్థలము లయి తీరును. కనుక రెండుచోటుల గూడ, గుణీభూతవ్యంగ్యముల (మధ్యమకావ్యముల) లెక్కలోఁ జేర్పరాదు.

ఇఁక మూఁడవది యగు వాచ్యాంగ మొకఁ డున్నది. ఇట వ్యంగ్యము ప్రాయశః వస్తురూపముగ నుండును. ప్రకృతోదాహరణములో 'రాఘవవిరహజ్వాలా' యను దానిలో 'జానకీదేవి కుశలము నివేదించి హనుమ శ్రీరామచంద్రుని సంతాపముఁ జల్లార్చెను' అను వస్తువు వ్యంగ్యము. మమ్మటుని యుదాహరణములో 'గ్రామతరుణం తరుణ్యా' యను దానిలో వ్యంగ్యము (సంకేతభంగము) వస్తువే కదా. ఇవి గుణీభూతములు గనుక శ్లోకములు రెండును లక్ష్యములు.

అయితే, యపరాంగములో వాచ్యాంగ మి ట్లున్నచో, నిఁక వాచ్యసిద్ధ్యంగ మను వేఱొక గుణీభూతవ్యంగ్య భేద మె ట్లేర్పడినది? యన్న శంకకు సమాధాన మిట్లున్నది.

నిజమున కీవిచారము గూడఁ దప్పే. అయితే మీ రన్నట్లు పునరుక్తివలన మాత్రము గాదు. ఆవిషయముఁ దరువాతఁ దెల్పుదుము. ప్రకృతము వినుడు. ఎచట వాచ్యము వ్యంగ్యము లేక పొసగదో (వాచ్యార్థము తన సిద్ధికై మఱియొక యర్థము. నాకర్షించునో) యట వాచ్యసిద్ధ్యంగ వ్యంగ్యము. ఇఁకఁ బ్రకృతములోని (అపరాంగ వ్యంగ్యములోని) వాచ్యాంగ మట్లు గాదు. వాచ్య మిది లేకపోయి నను గుదురును. అయితే

యీయర్థము వ్యంగ్యమై వాచ్యమును బూరించును. ఎట్లనఁగా: "గ్రామ తరుణం తరుణ్యా నవ వఞ్జుల మఞ్జరీ సనాథకరం పశ్యన్త్యా భవతి ముహు ర్మలినా నితరాం ముఖచ్ఛాయా" యన్న మమ్మటుని యుదాహరణములో, వాచ్య మగు తరుణీముఖ మాలిన్యాతిశయము సంకేతభంగమును గలుగ వచ్చును. లేక వంజులమంజరినిఁ ద్రుంచఁ దగ దని తలంపునఁ గానీ, గ్రామవనితాంతరాసక్తుఁ డగు నిజనితోడి పొందు కర్తవ్యము కా దని కానీ, యామెకుఁ గలుగవచ్చును. 'తస్య అతిరిక్తవ్యక్త్యా బుద్ధ్యాపి సంభవాత్' అని నాగేశుఁ డన్నాఁడు. కాఁగా, వాచ్య మైన తరుణీముఖమాలిన్యము వ్యంగ్య మగు సంకేతభంగము లేకున్నఁ గుదురక పోవుట లేదు. కనుక నిది వాచ్యాంగమే; కాని, వాచ్యసిద్ధ్యంగవ్యంగ్యము గాదు. ఇఁక నిందులో (వాచ్యసిద్ధ్యంగవ్యంగములో) నిట్లుగాదు. వ్యంగ్య మున్ననే వాచ్యము సుస్థ మగును. లేకున్నఁ బొసగనే పొసగదు. ఉదాహరణము.

"భ్రమి మరతి మలసహృదయతాం ప్రలయం మూర్ఛాం తమ శ్శరీరసాదం, మరణం చ జలదభుజగజం ప్రసహ్య కురుతే విషం వియోగినీనాం" అత్ర హాలాహలం వ్యఙ్గ్యం భుజగరూపస్య వాచ్యస్య సిద్ధి కృత్. (కావ్యప్రకాశము. ౫ ఉ.)

ఈశ్లోకములోని 'విష' పదము 'హాలాహలమును' వ్యంగ్య మొనర్చి జలదము (మేఘము) సర్పరూప మైనది' యను వాచ్యార్థముఁ గుదుర్చును. అనఁగా, నిట హాలాహలము స్ఫురింప కున్నచో, జలదము సర్పము అను రూపకము సిద్ధింప దని భావము. "అత్ర జలద ఏవ భుజగ ఇతి రూపణం వాచ్యం తావత్ న సిద్ధ్యతి, యావత్ విష మి త్యనేన జలవాచకేన హాలాహలం న వ్యజ్యతే ఇతి వాచ్యసిద్ధ్యఙ్గమ్" ఇతి బాలబోధినీ వ్యాఖ్యా." కాఁగా, నిపు డపరాంగములలోని వాచ్యాంగమునకు, మమ్మటుని గుణీభూత వ్యంగ్యములలో మూఁడవ దైన వాచ్యసిద్ధ్యంగమునకును భేదము తెలిసినది కద. ఇఁక నిది యసలు గుణీభూతవ్యంగ్య మేల కాదో తెల్పెదము.

ఇట వ్యంగ్య మనుకొన్న హాలాహలము భుజగరూపణాన్యథానుపపత్తి (జలదమునందు సర్ప మను రూపకము మఱియొక విధమునఁ గుదురకపోవుటవలన) నేర్పడుచున్నది. అది లేకున్న నిది కుదురదు గదా! కనుక నిది 'యర్థాపత్తి' యను ప్రమాణాంతరమున లభించు నర్థము.

ఇట శబ్దవ్యాపార మగు వ్యంజన ప్రసక్తికి దావులేదు. 'అనన్యలభ్య శ్శబ్దార్థః' అని కదా ప్రమాణము. 'దేవదత్తుఁడు బ్రదికియే యున్నాఁడు; గాని యింటఁ గన్పడలేదు' అన్నప్పుడు బైట నెచ్చటనో యున్నాఁడని యేర్పడును గదా? దీనిని వ్యక్తివాదులు వ్యంగ్య మందురా? అనరు కద! ఏల యనరు? ఈయర్థ మర్థాపత్తి యను ప్రమాణాంతరమున నేర్పడును గనుక అటులే, ప్రకృతములో జలదభుజగరూపణమను నర్థముగూడ హాలాహల మను నర్థము నాపాదింపకుండఁ గుదురదు. కనుక నర్థాపత్తి ప్రమాణ వేద్యమే. వ్యంజన రాదు. కాఁబట్టి యిట వ్యంగ్యమే లేదు. అర్థాపత్తిస్థలమునందు వ్యంజన కవకాశము లే దని యధమత్వ మర్థాపత్తి వేద్య మని నిరూపించుచు నాయిక నాయకునకు జ్ఞాత్యాపకర్షముఁ దెలుప దను సందర్భములోఁ బండితుఁ డింతకుఁ బూర్వమే తెలిపి యున్నాఁడు. కాఁగా, వ్యంజన కేప్రసక్తి లేనిచోట 'ఈవ్యంగ్యము గుణీభూతమా? ప్రధానమా?' యను ప్రశ్న యేది? కనుక, వాచ్యసిద్ధ్యంగవ్యంగ్య మను విభాగము గుదురదు.

ఇటులే మమ్మటుని విచారములో 'కాక్వాక్షిప్తము, అపరాంగము' ఇవి రెండు తప్ప మిగిలిన గుణీభూతవ్యంగ్యవిభాగము లేవియుఁ గుదురవు. కొన్నింటి 'అగూఢ, అసుందర, అస్ఫుటము' లం దసలు చమత్కారమే లేదు. 'సందిగ్ధతుల్యప్రాధాన్యము' లెంత మాత్రము గుదురవు. ఈవిషయ మతివిస్తృతముగ నాంధ్రధ్వన్యాలోక లోచనములో వివరించితిమి. వాచ్య సిద్ధ్యంగ వ్యంగ్యముయొక్క యధార్థస్వరూపము నిచటనే బైటపెట్టితిమి.

ఇఁక బ్రకృతము. ఉపమాద్యలంకారములు గూడ గుణీభూత వ్యంగ్యము లని పేర్వడినను, అట వ్యంగ్యము చమత్కరించుటలో జాగ రూకము గాదు. అపరాంగవాచ్యాంగములోని వ్యంగ్యము జాగరూకము. ఈవిషయముఁ బండితుఁడే 'జాగరూకాజాగరూక గుణీభూతవ్యఙ్గ్యయోః' అని స్పష్ట మైన విభేదముఁ దెలిపినాఁడు.

కాఁగా, నుపమాద్యలంకారములు గుణీభూతవ్యంగ్యము లైనను, వానిని వ్యవచ్ఛేదింప వలసిన పని యొక టున్నది. అది కాక, ప్రకృత ములో నింకొక చిక్కున్నది. మమ్మటుఁడు సెప్పినట్లుగా ధ్వని, గుణీ భూతవ్యంగ్యముల సంకరస్థల మొకఁ డున్నది. ఇట రెండు నున్నపుడు

ప్రధాన మైనది ధ్వనియే కాని, గుణీభూతవ్యంగ్య మెన్నఁడును కాఁబోదు. కనుక నట నేవేళయందైనను ధ్వని యని వ్యవహారమే కాని రెండవ (గుణీభూతవ్యంగ్య) వ్యవహారము సంభవింపదు. కాఁగా నా సంకరస్థలములు రెండవవ్యవహారముగా గణింపఁ గూడదు. కనుకనే 'ప్రహరవిరతౌ' అను శ్లోకమును దీక్షితులు గుణీభూతవ్యంగ్యమున కుదాహరింపఁ దగ దని పండితుఁడు ఖండించినాఁడు. అచట 'ధ్వని' యనుటకుఁ దగిన విభావానుభావ వ్యభిచారిభావసంపత్తి ప్రముఖముగ నుండి, 'సాయంకాలము దాటినచో, నేను ప్రాణముల నిలుపఁజాలను' అని తనవలె (ధ్వనివలె) విప్రలంభ శృంగారము రసపోషకముగా స్వీకరించి ప్రధానముగ గుణీభూతవ్యంగ్యము వ్యంగ్య మొనర్చుచున్నది. అందుచే గుణీభూతవ్యంగ్యమునకు వివిక్త మగు లక్ష్యము కాఁజాలదు.

"అయితే, 'గ్రామతరుణం' అను శ్లోకము మమ్మటుఁడు గుణీభూతవ్యంగ్యమున కుదాహరించెనే, యటఁ గూడ నిట్లే విప్రలంభాభాసము స్ఫురింపదా? అదియు వివిక్త మగు నుదాహరణము కా దన్నచోఁ ప్రామాణిక మైన కావ్య ప్రకాశగ్రంథము వ్యాకుల మగు నే?" యని మీ రన వచ్చును. ఇందుకు మా సమాధానము వినుఁడు.

అచట 'గ్రామ తరుణం......ముఖచ్ఛాయా' యను శ్లోకములో సంకేతభంగము వ్యంగ్యమై తరుణికి ముఖమాలిన్యాతిశయము (వాచ్యము) నుత్కర్షించుచున్న దని నాగేశుఁడే యంగీకరించినాఁడు. కనుక వ్యంగ్యము గుణీభావము నొందుటలో సంశయము లేదు కదా? ఇఁక వివిక్తతను పరిశీలింతుము.

ఇట విప్రలంభమును వ్యక్తపఱచు నేయొక వాక్యముగానీ, చిహ్నము గానీ లేశము లేదు. తరుణీతరుణులు నాయికానాయకులు. నాయిక, తరుణ దర్శనమున, నందు నవవంజుల మంజరి యలంకరింపఁబడిన హస్తము గలదిగా నున్నపుడు 'వికాసము నొంపవలసిన ముఖము మాలిన్యముఁ బొందుట యేల?' యను నర్థము విరోధమును స్ఫురింపఁ జేసి తానే ప్రముఖ చమత్కారకముగ నిల్చును. తదుపరి విరుద్ధకారణములు భావిత మై క్రమముగా నిరువురికిఁ గల యవినయసంబంధము (వ్యభిచారము) పర్యాలోచిత మై నాయిక యేర్పఱచిన సంకేతము భంగ మై యామె మొగము మలిన

మైన దని వాచ్యార్థమున కుపపత్తి యేర్పడును. ఆపిమ్మట నిరువురు (నాయికానాయకులు) విభావములుగా, సంకేతభంగనిమిత్తముగా నైన ముఖమాలిన్యాతిశయము అను భావముగా, గ్రహింపఁ బడును. పిమ్మట విషాద దైన్య చింతాది వ్యభిచారులు అక్షిప్తములై విప్రలంభాభాసము స్ఫురించును. ఇట్లీ విప్రలంభాభాసస్ఫురణము కడపటిది. దీనినే 'పర్యన్తస్ఫురణ' మందురు. ప్రముఖమున విప్రలంభరసస్ఫురణయే లేదు. ఇట్లు మమ్మటుఁడే యిటు లన్నాఁడు. 'అత్రవఞ్జులలతాగృహే దత్తసఙ్కేతానాగతేతి వ్యఙ్గ్యం గుణీభూతం తదపేక్షయా వాచ్యస్యైవ చమత్కారిత్వాత్" అని. ఇఁక నిట మీ కెట్టి వ్యాకులతయు లేదు. ఈ యర్థస్ఫురణక్రమము సరిగా నాగేశుఁడు భావింపక వ్రాసిన వ్రాత తప్పు కాఁగా, నిఁక 'ప్రహరవిరతౌ' అనుచోటఁ బ్రముఖముననే విప్రలంభరస మెట్లు స్ఫురించునో, తత్పోషకము లెట్లున్నవో పండితుఁ డిదివఱకే నిరూపించినాఁడు కాఁగా, నిది గుణీభూతవ్యంగ్యమునకు వివిక్త మగు లక్ష్యము గాదు. 'ఎచట మొదటనే స్థాయిభావస్ఫూర్తి యేర్పడునో యట రసధ్వని, యెట నట్లు లేదో యట రసధ్వని కాదు' అని వీరరసనిరూపణము చివర "స్థాయి ప్రతీతి ర్ధురవహ్నావా చేత్" అని పండితుఁడు నిరూపింపఁ బోవుచున్నాఁడు. ధ్వనిత్వయో నివారయేత్" అను నిష్కర్షయే నాతని యాశయము గూడ. అందుచేతనే యట వివిక్తమైన లక్ష్యము గాదనినాఁడు.

ఇఁక నాగేశుని యింకొక ప్రశ్న మిగిలియున్నది. అది యిట్లున్నది.

వివిక్తములనే లక్షింప వలసిన పని లేదు. అది యట్లే యగుచో, మమ్మటుఁడు 'అయం సరశనోత్కర్షీ' యనుదాని నేల గుణీభూతవ్యంగ్యమున కుదాహరించును? ధ్వనిసంకరస్థలము గదా? మరియు నట 'శృంగారము వాచ్యాతిశాయి' యనుటయు సరికాదు. శృంగారమున కన్న నట నెక్కువగా వాచ్యమే శోకము నుత్కర్షించును. కనుక శృంగార మక్కడ వాచ్యమున కంగమే. అయితే రసము వాచ్యాంగముః కా దని కదా మీ తలంపు? మమ్మటుఁ డుదాత్తాలంకారప్రకరణములో రసము వాచ్యాంగ మన్నాఁడు. ఎటు లనఁగా -

"మహతాం చోపలక్షణం" ఉపలక్షణం _ అఙ్గభావః, అర్థా దుప లక్షణీయే ఒర్థే _ ఉదాహరణమ్

త దిద మరణ్యం యస్మిన్ దశరథవచ నానుపాలనవ్యసనీ
నివసన్ బాహుసహాయః చకార రక్షః క్షయం రామః.
న చాత్ర వీరో రసః త స్యైహాఙ్గత్వాత్" అని.

వీరరసమును (వ్యంగ్యమును) ఉపలక్షణీయ మగు నరణ్యమునకు (వాచ్యమునకు) అంగము అని భావము

మా సమాధానము వినుఁడు.

ఇట రసము వాచ్యాంగ మన లేదు. ఇదివరలో (రసము) అపరాంగ మని చెప్పు ప్రకరణములో 'అపర' యన వాచ్య మని యర్థము సెప్పి, తదంగముల నిరూపించుచోటఁ గూడ వాచ్యమునకు రస మంగ మనలేదు. దానికి లక్ష్యమును ఈయలేదు. అచట రసాంగముల నన్నింటిని నిరూపించి నట్లుగా, వాచ్యమున కంగముల నన్నింటిని నిరూపింపవలసియే యున్నది కాదా ? ఏల నిరూపింప లేదు ?

'అటఁ జెప్పకపోవుటకు వేఱు కారణము లేదు. ఉదాత్తాలంకార ప్రకరణములో రసము వాచ్యాంగ మని చెప్పి లక్ష్యముతో గూడ నిరూపింపఁ బోవుచుండుటయే' యని యందురా ? ఇ ట్లనుట యయు క్తము. స్వప్రకరణములోఁ దెలుపవలసిన దానినిఁ దెలుపక యప్రస క్తముగ నితర నిరూపణములో నీ ప్రస్తావముఁ దెచ్చి 'వీరరసము వాచ్యాంగ' మన్నచో గృతక ర్తవ్యుఁడు గానీ, యుచితక ర్తవ్యుఁడు గానీ కాఁగలఁడా? పైమాటతో 'రససామాన్య మంతయు వాచ్యసామాన్యమున కంగ మగు'నన్న సామాన్య న్యాయమును నిరూపించి న ట్లగునా ? ఇతః పూర్వమే ప్రాచీనాలంకార గ్రంథములో నైన రసము వాచ్యాంగ మని చెప్పిన ట్లున్నదా ? ఏయొక్క యుదాహరణము నైనఁ జూపఁగలరా ? ఆప్రయత్న మసంభవము కూడ. ఎటు లనఁగా : అగూఢప్రకరణములో 'వాచ్యాయమాన మైన నేచమత్కారకము కాదు' అన్న మమ్మటుఁడు, వాచ్యమునకు వ్యంగ్య మైనదియు, నందును రసము నంగ మగు ననునా ? కనుకనే "మహతాం _ రసాదీనాం అ ప్యుపలక్షణం" అని నాగేశుఁడు బృహదుద్ద్యోతములో వ్రాసిన వ్రాఁత

యనుచితము. నసంగతిమను. ఏల యందురా? అస లాచోట నాయర్థ మెట్లు వచ్చును? ఇదివఱలో నింతకన్న తక్కువ యైన వని వేనినైన మమ్మటుఁడు దెలిపినాఁడా? లేదు కద. అతని కాధారము లైన ప్రాచీనా లంకారిక గ్రంథములలో (అలంకార సర్వస్వము, అలంకార రత్నాకరము మొదలైన వానిలో) వేనిలోఁ గూడ నీచోట నీయర్థము చెప్పఁబడలేదే. రుయ్యకుఁ డలంకారసర్వస్వములో, "అఙ్గభూత మహాపురుషచరిత వర్ణనం చ" యని సూత్రించి "మహాపురుషాణా ముదారచరితానాం అఙ్గిభూత వస్తువ్యతిరిక్తతయా ఙ్గభావే నోపనిబద్ధం చరితం చోదాత్తం; మహాపురుషచరిత స్యోదారరూపత్వాత్" అని చెప్పి, 'తదిదం' అను శ్లోకమునే యుదాహరించి "అత్రారణ్యే వర్ణనీయే రామచరిత మఙ్గత్వే న వర్ణితం" అనియు నలంకారరత్నాకరకారుఁ డైన శోభాకరమిత్రుఁడు స్వీయగ్రంథములో. "ఉదారచరితాఙ్గత్వ ముదాత్తం" అని సూత్రించి "ఉదాత్తచరితానాం యత్ర చరితం వస్తువ్యతిరిక్తతయా ఙ్గతా ముపయాతి త దుదాత్తం" అని చెప్పుచు "కశ్చి త్కాన్తా" యను మేఘసందేశ శ్లోకము నుదాహరించి "అత్ర వాక్యార్థీ భూతస్య దేశవిశేషస్య ఉదారచరిత జానక్యాది చరిత మఙ్గత యోపనిబద్ధం" అనియు, జయదేవుఁడు చంద్రాలోకములో "ఉదాత్త మృద్ధి శ్చరితం శ్లాఘ్య మన్యోపలక్షణం" అనియు వివరించినారే కాని యేయొక్కఁ డుదాత్తాలంకారములో రసము వాచ్యాంగ మనలేదే. ఈ 'తదిదం' అనిన శ్లోకము నుదాహరించిన రుయ్యకుఁడు గూడ రామచరిత మంగ మన్నాఁడు గాని రస మంగ మన లేదే. ఇచటి మమ్మటుని పంక్తికి సరిగా నర్థముఁ దెలిసికొనక పోయెనే నాగన్న!!

ఆ పంక్తి యిది. "న చాత్ర వీరో రసః, తస్యేహాఙ్గత్వాత్" అని. దాని యర్థ మిది: అత్ర = ఈ తదిదం అను శ్లోకములో, వీరః = ఉత్సాహము; న చ రసః = రసము గాదు (పరిపోషము నంది రస్యమానము గాలేదు). ఏల యన? తస్య = ఆయుత్సాహము, ఇహ = ఈచోట, అఙ్గత్వాత్ = అపూర్ణము గనుక.

ఇట వీరపదమునకు 'ఉత్సాహము' అనియు, నిట 'భావ మపరిపుష్టము' అనియు నావ్యాఖ్యాతలే యొప్పుకొనిరి. బాలబోధినిలో "ఉత్సాహే

నోత్కర్షితో హి రామో వర్ణనీయ మరణ్యముత్కర్షయ న్తీతి భావః. "రామవిషయిక రతిభావస్యా పరిపుష్టత్వా న్నభావస్య ధ్వనిత్వ మి త్యుద్యో తాదౌ స్పష్టం" అని వ్రాయబడినది.

ప్రశ్న : నీవు సెప్పినదే యర్థ మనుట కాధార మేమి ?

ఇట 'వీరరసః' అని సమాసము గాలేదు. అట్లు సమాసముగ నున్నచో 'న చాత్ర వీరరసః' అనిన యీమాటకు 'ఇట వీరరసము లేదు' అని యర్థ మగును. అపుడు 'త స్యేహాంగత్వాత్' = 'అది యిట నంగము గాదు గనుక' యను నది దానికి సమాధానము గాఁ జాలదు. అంగ మగుచో రసము గాక పోవునా ? ఆవిషయమును (రసమున కంగ మైనను రసము గావచ్చు ననుటను) 'అత్ర శృఙ్గారః కరుణస్య' యని మమ్మటుని మాటయే స్థిరపఱచును నాగేశుఁడు గూడ శృంగారరసమును వాచ్యాంగముగఁ దెలి పెను. అదికాక. వీరరస మనియుఁ దానే యనుచున్నాఁడు గదా. కనుక 'అంగత్వాత్' అను హేతువు వీరరసము లే దనుటకుఁ గానీ, వీరరసము గాదనుటకుఁ గానీ యుపయోగింపదు. కనుక నాగేశుని 'యన్వయము, నర్థము' రెండు గూడఁ దప్పే.

ఇఁకఁ 'ప్రధానం' అని యధ్యాహారము సేయుట కుపపత్తి యేము న్నది ? అది యప్రసక్తప్రసంగ మగును. తుష్యతు. అట్లు చేసి 'వీర రసము ప్రధానము గాదు; అంగము గనుక దానితో వ్యవహరింప రాదు' అని యర్థము సెప్పుట యంత కన్నను మిక్కిలి తప్పే, మీఁదు మిక్కిలి స్వవచోవ్యాఘాతము గూడ. 'అయం సరశనోత్కర్షీ' యనుచోట సంగ మైన శృంగారముఁ బట్టి వ్యవహారమును మమ్మటుఁడు దాను గూడ నంగీక రించియే యున్నారు గదా. కనుక వారు సెప్పిన యర్థము సర్వవిధములఁ దపేవ.

ప్రశ్న : అయితే యట నేమి యర్థము ?

ఇట, 'వీరః, రసః' యని వ్యత్యస్తముగా నుండుటవలన రసత్వమే విధేయముగ నన్వయించును. అనఁగా : 'న చ' యను నది 'న చ రసః' యని యన్వయించి రసము కా దను నర్థముఁ దెల్పును ; (రూఢ

ముగ రసత్వమునే నిషేధించును.) గాని. వీరరస మిట లేదని తెలుపదు. పర్యవసానమునఁ 'బ్రాన్తి ము గాదు గనుక నిట వీరము రసము గాదు' అని తేలును ఇట వీరము ఉత్సాహము పరిపుష్టముగ నున్నచో రసమే యగును. 'అపుడు వీరరస మనియే వ్యవహార మేర్పడును గాని. యుదాత్తాలంకార మనుట కవకాశము లేదు' అను శంక రావచ్చును. దాని నిట్లు సమాధానించు కొనవలెను.

'వీరము = (ఉత్సాహము) బాగుగఁ బరిపుష్టము గాలేదు గనుక, రసము స్థాయికి రాలేదు. కావున దానితో వ్యవహరింప వీలుగాదు. ఉదాత్తాలంకారమే యిట వ్యవహరింపఁ దగును.' అని.

అసలీప్రసంగమునకు మూల మలంకారసర్వస్వము, అలంకారరత్నాకరము. జయరథుని యలంకారవిమర్శ నీటీకలయందు నున్నది వానికి సంబంధించి ప్రసక్తానుప్రసక్తముగ నది మమ్మటుని వఱకు వచ్చినది. దాని కతఁడు సమాధానము సెప్పికొనినాఁడు ఆవిషయ మాగ్రంథముల సపరిశీలనముగఁ జదువుకొనినఁ గాని తెలియదు. ఈ మన నాగన్న వాని నెఱుఁగడు. తనకుఁ దోఁచిన ట్లీకగ్రంథ దప్పుగ నన్వయించుకొని. తప్పుగ నర్థము సెప్పి, యాతప్పుభ్రాంతిలో బాలబోధినీకారుని, నితరులఁ గూడ ముంచినాఁడు. సరి. ఇక్కడ 'రసము వాచ్యాంగ మను నసంభవ ప్రసంగమునకుఁ జోటు లే దని సమాధానింపఁ బడినది.

కాఁగా, నిపుడు గుణీభూతవ్యంగ్యమునకు ధ్వని సంకీర్ణములు గాకుండు లక్ష్యములను సంగ్రహింపవలెను.

ప్రశ్న : అయితే యది ప్రామాణికమా ?

అగును. ధ్వన్యాలోకములో "యత్ర తు వాక్యే రసాదితాత్పర్యం నాస్తి; గుణీభూతవ్యఙ్గ్యైః పదై రుద్భాసితేఽపి తత్ర గుణీభూత వ్యఙ్గ్యతైవ సముదాయధర్మః. యథా — రాజాన మపి సేవన్తే విషమ ప్యుపభుఞ్జతే, రమన్తే చ సహ స్త్రీభిః కుశలాః ఖలు మానవాః ఇత్యాదౌ" అని వివిక్త మగు నుదాహరణముఁ జూపఁ బడినది. ఇట లోచనములో యద్యపి చాత్ర విషయే నిర్వేదాత్మక శాన్తరస ప్రతీతి రస్తి తథాపి చమ

ల్కారో యం వాచ్య నిష్ఠ ఏవ" అని యభినవుఁ డనినాఁడు. అనఁగా : ఇట వాచ్యార్థమును సవ్యంగ్యముగ భావించిన తరువాతఁ బర్యంతమున (దూరముగా) నిర్వేదాత్మక మగు శాంతరసము స్ఫురించును. కనుకనే మూలకర్త 'యత్ర తు వాచ్యే రసాదితాత్పర్యం నాస్తి = వాక్యమున రసభావాది తాత్పర్యము లేనప్పుడు' అనుట పొసఁగును. కాఁగా, వివిక్తము లగు గుణీభూతవ్యంగ్యముల సంగ్రహించుట యవసరము. ప్రముఖమున వ్యంగ్యాంతరప్రసక్తి లేక, వాచ్యోపకారక మై, చమత్కారకి మగు వ్యంగ్య ముండు తావుల లక్షించి గ్రహింపఁ బడవలసి యున్నది. మమ్మటుని యుత్తమ కావ్యలక్షణము ననుసరించి, యాస్థలము అపరాంగవ్యంగ్య మగు రసాదికముఁ బట్టి ధ్వని యని నిష్కర్షింపవలసియున్నది. ప్రకాశకారుని లక్షణముఁ బట్టి రసవదలంకారస్థలమున నెప్పుడు దోషములు దొలఁగింపఁ బడవలసియున్నది. అజాగరూకవ్యంగ్యము లగు నుపమాదులను వాచ్యోపకారముగా జాగరూక మగు వ్యంగ్యము గలవానినుండి తొలఁగింపవలసి యున్నది. ఇన్ని ప్రయోజనములు సమకూడుటకై యీ రెండవవిభాగముఁ బండితుఁ డొనరింపవలసి వచ్చినది.



# ఆంధ్ర రసగంగాధరము

## ౭. అన్య లక్షణ విచారము

సంస్కృత మూలము

యత్తు అతాదృశి గుణీభూత వ్యఙ్గ్యం ఇత్యాది కావ్యప్రకాశ గత లక్షణే చిత్రాన్యత్వం టీకాకారైః దత్తం, తన్న; పర్యాయోక్త సమాసోక్త్యాది ప్రధాన కావ్యే ష్వవ్యాప్త్యాపత్తేః, తేషాం గుణీభూత వ్యఙ్గ్యతా యా శ్చిత్రతాయా శ్చ సర్వాలఙ్కారిక సమ్మతత్వాత్ ఉదాహరణమ్.

రాఘవవిరహజ్వాలా సన్తాపిత సహ్యశైల శిఖరేషు
శిశిరే సుఖం శయానాః కపయః కుప్యన్తి పవనతనయాయ.

ఇతి అత్ర జానకీకుశలావేదనేన రాఘవః శిశిరీకృతః ఇతి వ్యఙ్గ్య, మాకస్మిక కపికర్తృక హనుమద్విషయక కోపోపపాదకతయా గుణీభూత మపి దుర్దైవ వశతః దాస్య మనుభవత్ రాజకలత్ర మివకామపి కమనీయతా మావహతి; నన్వేవం ప్రాగుక్తం ఆక్షేపగతం మాన్ద్య మపి నవవధూ ప్రకృతి విరోధా దనుపపద్యమానం వ్యఙ్గ్యే నైవోపాద్యత ఇతి కథ ముత్తమోత్తమతా తస్య కావ్య స్యేతి చేత్ న. యతో హ్యనుదిన సఖ్యుపదేశాదిభి రనతి చమత్కారిభి ర ప్యుపపద్యమానం మాన్ద్య మిదం ప్రథమ చిత్తచుమ్బినీం విప్రలమ్భరతి మప్రకాశయ న్న ప్రభవతి స్యాత న్త్రేణ పరనిర్వృతి చర్వణా గోచరతా మాధాతుం;

ఇత్థ మేవ హి నిశ్శేషచ్యుత చన్దన మిత్యాది పద్యే ష్వధమత్వాదీని వాచ్యాని వ్యఙ్గ్యాతిరిక్తేనార్థే నాసాతతో నిష్పన్నశరీరాణి వ్యఞ్జకానీతి న తత్రాపి గుణీభావః శఙ్కనీయః ; అనయో ర్భేదయో రనపహ్నవనీయ చమత్కారయో రపి ప్రాధాన్యాప్రాధాన్యాభ్యా మస్తి కశ్చిత్సహృదయ వేద్యో విశేషః ; యత్తు చిత్రమీమాంసా కృతోక్తం—*

ప్రహర విరతా మధ్యే వాహ్న స్తతోపి పరేణ వా
కిముత సకలే యాతే వాహ్నిప్రియ ! త్వ మిహైష్యసి !
ఇతి దినశతప్రాప్యం దేశం ప్రియస్య యియాసతః.
(పిపాసతో. పా. ఆ)
హరతి గమనం బాలాఽలాపైః సబాష్పగలజ్జలైః.

ఇత్యత్ర సకలమహః పరమావధి స్తతః పరం ప్రాణాన్ ధారయితుం న శక్నో మీతి వ్యఙ్గ్యం ప్రియగమన నివారణ రూప వాచ్య సిద్ధ్యఙ్గమతో గుణీభూత వ్యఙ్గ్యం ఇతి ; తన్న సబాష్పగల జ్జలానాం ప్రహరవిరతా' మిత్యా ద్యాలాపానా మేవ ప్రియగమన నివారణ రూప వాచ్యసిద్ధ్యఙ్గతయా, వ్యఙ్గ్యస్య గుణీభావాభావాత్ ; 'ఆలాపైః' ఇతి తృతీయయా ప్రకృత్యర్థస్య హరణక్రియాకరణతాయాః స్ఫుటం ప్రతిపత్తేః ; న చ వ్యఙ్గ్య స్యాపి వాచ్యసిద్ధ్యఙ్గతా ఽత్ర సమ్భవ తీతి తథోక్త మితి వాచ్యం 'నిశ్శేషచ్యుత చన్దన' మిత్యాదా వపి అధ మత్వ రూప వాచ్య సిద్ధ్యఙ్గతాయాః దూతీ సమ్భోగాదౌ సమ్భవా ద్గుణీ భావాపత్తేః ; అస్తు ; వా తతః పరం ప్రాణాన్ ధారయితుం న శక్నో మీతి వ్యఙ్గ్యస్య వాచ్యసిద్ధ్యఙ్గతయా గుణీభావః ; త థాపి నాయకాదే ర్విభావస్య భాష్పాదే రనుభావస్య చిత్తావేగాదే శ్చ సంచారిణః సంయోగా దభివ్యజ్యమానేన విప్రలమ్భేన ధ్వనిత్వం కో నివారయేత్ ?

తెనుఁగు తాత్పర్యము :

అయితే 'అతాదృశి గుణీభూత వ్యంగ్యం' అను కావ్యప్రకాశము లోని లక్షణమున, వ్యంగ్యము వాచ్యమున కన్నఁ బ్రధానము గాని యపుడు గుణీభూత

వ్యంగ్య మని వివరించు నప్పుడు 'చిత్రకావ్యమున కన్న భిన్నములు' అని టీకా కారులు వ్రాసినారు. అది సరి కాదు. పర్యాయోక్తి, సమాసోక్తి మొదలగు నవి ప్రధానములుగా నుండు కావ్యములం దవ్యాప్తి వచ్చును. అవి గుణీభూత వ్యంగ్యము లనియు, చిత్రము లనియు సకలాలంకారికులకు సమ్మతమే. చిత్ర కావ్య మయిన గుణీభూతము కారా దన్న నియమము లేదు. ఉత్తమకావ్యమున కుదాహరణముగ నిచ్చిన శ్లోకమునకుఁ దాత్పర్య మిది.

శ్రీరాముని విరహజ్వాలలచే మిక్కిలి వేడెక్కిన సహ్యపర్వత శిఖర భాగములందు శిశిరములో సుఖముగఁ బరుండుచున్న క్రోఁతులు పవనపుత్త్రుఁ డైన హనుమంతునిఁ గోపించుచున్నారు

ఇచ్చట 'హనుమ సీతాక్షేమముఁ దెల్పి రాముని హృదయతాపముఁ జల్ల పఱచెను' అని వ్యంగ్యము – క్రోఁతు లాకస్మికముగ హనుమను గోపించుట నుపపాదించును. కనుక వ్యంగ్య మప్రధాన మైనను, దురదృష్టముచే దాస్యము ననుభవించు 2 రాజకళత్రము వలె నొకక్రొత్త యందము సమకూర్చును.

ప్రశ్న : ఏమయ్యా ! వెనుకఁ జెప్పిన 'తల్పగతాపి చ సుతనుః' అను శ్లోకములోఁ జేయిఁ దొలఁగించుటలోని యాలస్యము గూడఁ గ్రొత్తకోడలి స్వభా వమునకు సరిపడదు. వ్యంగ్యము (దేశాంతరమున కేఁగు ప్రియునిఁ గూర్చిన రతి) తోనే సరిపడును. కనుక నాకావ్యము మాత్ర ముత్తమోత్తమ కావ్య మెట్లయినది ?

వాచ్యవ్యంగార్థముల వలననే కాక యితరార్థముల వలన కూడ నుపపన్న మై సిద్ధ మైనపుడు గుణీభూతవ్యంగ్య మనకూడదు కేవల వ్యంగ్యమే వాచ్యా ర్థము నుపపాదించు నపు డుత్తమకావ్య మని యనవలెను. ఇచటి మందాక్షేపము ప్రతిదినము చెలు లుపదేశించు విశేషచమత్కారకములు గాని యుపదేశముల చేతఁ గూడఁ గలుగవచ్చును. ఇట్లు కారణాంతరములచేఁ గూడ సరిపడు మాంద్యము ప్రథమమున విప్రలంభరతిపై మనసు గొలిపితీరును. ఆవిధముగ విప్రలంభరతిఁ బ్రకాశింపఁ జేయని మందాక్షేపము స్వతంత్రముగఁ బరమా నందాస్వాదవిషయము కాఁజాలదు. ఇటులే 'నిశ్శేష చ్యుతచందనం' మొదలైన పద్యములందు అధమత్వాది వాచ్యములు వ్యంగ్యమున కన్న వేరగు నర్థముతో (సామాన్యముగ) దమ శరీరముల సమకూర్చుకొనినవై వ్యంజకము లగును గనుక నచటఁ గూడ వ్యంగ్యమున కప్రాధాన్యము నాశంకింపఁ దగదు.

ఇఁక నుత్తమోత్తమము, ఉత్తమము నను నీరెండు భేదములలోఁ జమత్కారము తప్పక యుండును. ఆచమత్కారము ప్రధాన మగుటయు, నప్రధాన మగుటయు నను ఒకానొక విశేష మున్నది. దానిని సహృదయులు మాత్రమే గుఱుతింపఁ గలరు.

శ్రీశర్వాణి ·

1. "ఈవ్యంగ్యము లేకున్నచోఁ గ్రోఁతులు హఠాత్తుగఁ గోపించుట కుదురదు. కనుక నిది 'వాచ్యోపపాదక' మని మధురానాధ శాస్త్రి తన సరళవ్యాఖ్యలో వ్రాసిరి ; కాని, యది సరికాదు. అపు డిది వాచ్యసిద్ధ్యంగ మను మమ్మటుని తృతీయ గుణీభూత వ్యంగ్య మగును. కాని మ్మనరాదు. వెనుక నిరూపించిన ప్రకారముగ నీయర్థము అర్థాపత్తి లభ్యము. కావున వ్యంగ్య మెట్లగును ? అందుచే శాస్త్రి యుపపాదన మయుక్తము. ఇఁక నిది కోపించుట నుత్కర్షించును. కపిస్వభావ మైన చాపల్యము నుండి కూడ నీయాకస్మిక కోప మేర్పడవచ్చును. ఈవ్యంగ్యము లేకున్న నిది కుదురక పోదు. కనుక నిట నర్థాపత్తి కవకాశమే లేదు. అయితే వ్యంగ్య మీకోపమును యుక్తితో నుత్కర్షించును. ఇందులకే 'ఉపపాదకతయా' యని పండితుఁడు చెప్పెను. 'వాచ్య సిద్ధ్యంగతయా' యని యన లేదు. కపికోపము మఱియొక విధమునఁ గుదురు ననుటకే 'ఆకస్మిక' యనుట, 'సుఖం శయనాః కుప్యంతి' యనుటఁ బ్రయోగించెను. అట్లు భావింపనిచో నిట నాకస్మికపదము నిరర్థకము. దీని వివర మిది.

సుఖముగఁ బరుండిన వారికిఁ గోప మేల గలుగును ? శిశిరేషు సుఖం శయానాః' అనుటచేఁ బక్కలు కుదుర లే దనుటకు వీలు లేదు. ఈకోపము కారణము లేకయే కలిగినది. అప్పు డీకోపము కపి స్వాభావిక మగు చాపల్యము చేత నాకస్మికముగ నేర్పడినది యని వాచ్యకక్ష్యలో సరిపడును. ఇఁక వ్యంగ్య కక్ష్యలోఁ బూర్వార్థమును భావింపఁగాఁ బైఁ జెప్పిన వ్యంగ్యము స్ఫురించి కపిస్వభావజనితము నీకోపము నుత్కర్షించును. అనఁగా ; విరహతప్తుఁ డైన శ్రీరామచంద్రునకు జానకీ క్షేమవార్త తెలియుట కారణముగఁ, బూర్వము రామవిరహజ్వాలాసంతప్తము లైన సహ్యాశైలశిఖరములు జల్లఁ బడినవి. ఆకారణమున, శిశిరసంబంధ మైన శీతవాతములచేఁ గ్రోఁతులు గజగజవణఁక సాఁగినవి. ఈవార్త రాముఁ

డెఱుంగక పూర్వము శిశిరశీతములు తద్విరహజ్వాలాసంలీనములై సుఖశయనముఁ బ్రసాదించినవి ఇపుడు రామునిహృదయము చల్లఁబడుటచేఁ గపులకు బాధాకరము లైనవి. వణఁకుబాధ భరింపలేని క్రోఁతులు 'ఇంతకుఁ గారణ మీహనుమయే' యని కోపగించుట జరిగినది అని

నిజము విచారించిన నిటఁ గోపకారణ మున్నదా? తాము పరుండు రాళ్ళు చల్లఁబడరా దనియు, రాముని విరహ మట్లే యుండవలె ననియుఁ దలంచుట సంగతము కాదు గదా. కనుకఁ గపిస్వభావ చాపల్యమే కోపము (వాచ్యము) నుత్కర్షించి వ్యంగ్యము వాచ్యోపపాదక మైనది. కనుకనే 'కామపి కమనీయతా మావహతి' = చమత్కృతి విశేషమును సమకూర్చినది, యని చెప్పగలిగినాఁడు.

ఈ విధమైన సప్రమాణయుక్తులతోఁ బ్రాచీన నవీనాలంకారికుల భ్రాంతిని నివారించి, సుస్థిర మైన యాలంకారికసిద్ధాంతము సృష్టించి పండితుఁడు రాజశబ్దధారణయోగ్యతను నిరూపించుకొనినాఁడు. దీక్షితులయు, తదనుయాయులయు మతము ననుసరించి వారిని సమాధానించినాఁడు. లక్ష్యలక్షణనిరూపణములో నాగేశ్వరమధురానాథశాస్త్రిల వంటి భ్రాంతిమంతుల కందని విధమున జాగరూకుఁ డైనాఁడు. అనన్యసాధ్య మైన రసగంగాధరమణితో సహృదయుల నలంకరించి చరితార్థుఁ డైనాఁడు.

2. పండితరాజునకు మిత్రుఁ డైన దారా (రాజకుమారుఁడు) ఔరంగజేబుచేఁ జంపఁబడగా నాతని భార్య యనుభవించుచున్న యానాఁటి దైన్యజీవిత మిందు సూచిత మగుచున్నది.



# ఆంధ్ర రసగంగాధరము

## ౮. ఇతర కావ్య విచారము

* ఇటఁ జిత్రమీమాంసాకారుఁ డైన దీక్షితోదాహరణ శ్లోకమును విచారించెదము

తెలుఁగు తాత్పర్యము

'ప్రియా ' జాము గడిచిన వచ్చెదవా ? మధ్యాహ్నము వచ్చెదవా ? ఆతరువాత వచ్చెదవా ? లేక పగ లంతయు గడిచిన తుది వచ్చెదవా ?' యని యశ్రుధారాసిక్తము లైన పలుకులతో, నూఱుదినములకుఁ జేరఁ దగిన దేశమున కేఁగఁ దలఁచిన ప్రియుని గమనము బాల నిరోధించుచున్నది దీక్షితుఁ డీశ్లోకము నిట్లు వ్యాఖ్యానించినాఁడు

ఈపద్యమునఁ బగ లంతయుఁ దుదిగడువు ఈలోపల రాకున్న నాపైఁ బ్రాణముల నిలుపఁ జాలను అని వ్యంగ్యము ప్రియగమన నివారణను వాచ్యము పగలు గడిచినఁ బ్రియురాలు జీవింప దని ప్రియుఁడు భావించి నపుడే యాతని గమనము నివృత్తి మగును ఏతద్వ్యంగార్థము వాచ్యసిద్ధిలో నంగ మగుచున్నది ఆకారణమున నిది గుణీభూతవ్యంగ్యము, అని

ఈవిషయమునఁ బండితుని విమర్శ యి ట్లున్నది

ఈశ్లోకము గుణీభూతవ్యంగ్యోదాహరణ మనుట సరికాదు దీక్షితనిర్దేశ వ్యంగ్యమే గౌణముగ వాచ్యసిద్ధికిఁ దోడుపడ నక్కఱలేదు ప్రియురాలి కన్నీటి ధారలతో మిళిత మైన దీనాలాపములే ప్రియగమన నివారణరూప మైన వాచ్యసిద్ధ్యంగము లగుచున్నవి 1. ఇట వ్యంగ్యమునకు గుణీభావమే లేదు 'ఆలాపైః గమనం హరతి' = ఆలాపములతో గమనము హరించుచున్నది, యను చోటఁ

ద్రుతీయావిభక్తి వాచ్యము సిద్ధించుట కంగముగఁ గరణార్థములోఁ బ్రయో గింపఁబడినది. అదియే గమననివారణ సాధకము. 'ఆలాపైః' యనుపదము విస్పష్టముగఁ గరణార్థము సెప్పు నవుడు వ్యంగ్యమునకు గుణీభావము నిర్ణ యింప రాదు. 'వ్యంగ్యము గూడ వాచ్యము సిద్ధించుట కంగ మగును గనుక నటు లంటిమి' యన రాదు. 'నిశ్శేషచ్యుత చందనం' ఇత్యాదు లందు గూడ దూతీసంభోగాదికము నాయకుఁ డధముఁ డగుట (వాచ్యము) నుత్కర్షించును. కనుక దానినిఁ గూడ గుణీభూతవ్యంగ్య మనవలసి వచ్చును. వ్యంగ్యము వాచ్యమునం దుపకరించు నట్టిది యైనను గుణీభూత మనరాదు.

పై విషయ మిట్లు భావింప వచ్చును. పొడిపొడి మాటలు ప్రియుని గమ నము హరించ లేవు. వ్యంగ్యసహితము లయినప్పుడే వాచ్యసిద్ధికి దోహదకారు లగును. 'ప్రియా ! మీరు వెళ్ళిన చోట బహుకాల ముందురేమో ! అటు లుండ వలదు' అను నర్థములో నాయిక కన్నీటి జలముతోడి దీనవచనములు సార్థకము గావచ్చును. కనుక వ్యంగ్యసహితము లైన పలుకులే గమననివారణము సేయఁ గలుగు చున్నందున గుణీభూతము సెప్పుట యుచితముగ నుండును; అని.

పిమ్మట 'జీవింపలేను' అను వ్యంగ్యము నెటులో వాచ్యసిద్ధ్యంగ మని యంగీకరించినను, లేకగుణీభావము సెప్పినను 'ప్రహర విరతౌ' అను శ్లోకము ధ్వనిలక్ష్యము గాకుండ నెవరు నివారించ లేరు. 2. ఈపద్యము నందు విప్ర లంభశృంగారము ముఖ్యముగ ధ్వనించుచున్నది. నాయకుఁ డిందు విభావము. కన్నీరు మొదలగునవి యనుభావములు. మనమునకుఁ గల్గిన యావేగాదులు సంచారిభావములు. దీని సంయోగముచే విప్రలంభరతి వ్యజ్యమాన మగుచున్నది. కనుక నిది ధ్వనికావ్యము గాదనుట కెవరికి సామర్థ్యము లేదు.

శ్రీశర్వాణి :

1. ఇచటఁ బ్రథమముగ నీవిషయము దెలియ వలెను. మమ్మటాదు లైన ప్రాచీనులమతములో వాచ్యసిద్ధ్యంగ మగు గుణీభూతవ్యంగ్యములో రెండురకము లున్నవి. మొదటిది. వ్యంగ్యమే లేకున్నచో వాచ్యము సిద్ధిం పనిచోటు. దీనిని వాచ్యసిద్ధ్యంగవ్యంగ్య మందురు. ఉదా. 'భమి మరతి మలసహృదయతాం' ఇత్యాదికము. (దీని నిదివఱకే పరామర్శించి, యిచ్చోట నర్థము 'అర్థాపత్తిలభ్యము గనుక' వ్యంగ్యకోటిలోనికి రా

దని స్పష్ట పఱచితిమి.) రెండవది. వాచ్యము వేరు విధమున నేర్పడినను దాని నుత్కర్షించునది. దీని నపరాంగ వ్యంగ్య మందురు. ఉదాహరణము: 'గ్రామతరుణం తరుణ్యా' ఇత్యాదికము.

దీక్షితాదులు మమ్మటాదులత్రోవఁ బోవుదురు. ఈమార్గద్వయమును వికల్పించి పండితుఁడు ఖండించుచున్నాఁడు. అందు మొదటి పద్ధతికి ఖండనము 'మాటలవలననే వాచ్యము సిద్ధించును గనుక' ఇత్యాదికము. సారాంశము: వ్యంగ్యము లేక వాచ్య మసలే యేర్పడ దను పద్ధతి పనికిరా దని. ఇఁక రెండవమార్గము నాశంకించి, 'వ్యంగ్యము గూడ' నని మొదలు బెట్టి 'నిశ్శే షేత్యాది' యను పర్యంతము సాభిప్రాయముగ ఖండించినాఁడు. "అధమత్వాదిక మితర విధముల నేర్పడినను, వ్యంగ్య మగు దూతీసంభోగ మధమత్వము నుత్కర్షించును గనుక నటఁగూడ గుణీభావము ప్రసక్తించి తీరును. అయితే, దీక్షితాదులు ధ్వని గుణీభూత వ్యంగ్య సంకరము నంగీకరింతురు. మఱియుఁ బ్రతిబంది దోషాపాదకమును గాదు. కనుక నట గుణీభూతవ్యంగ్య మను వ్యవహారము సరిపడును." అనువాదమును 'అస్తువా' = పోనీ, యని తన యసమ్మతిని వ్యంగ్యపఱచినాఁడు. "మీరు వ్యంగ్య మన్న యర్థము వాచ్యోపపాదకము మాత్రమే కాక, మొదట నిట శృంగారరసమూల మైన విప్రలంభరతినే యాకర్షించి వ్యంగ్యపఱచును. కాఁబట్టి యిది వాచ్యోపపాదకమాత్రము గాదు" అని నిరూపించినాఁడు.

నిజమున కిట నాయిక నాయకుని గాఢముగఁ బ్రేమించినది. కానిచో, నతని యెడబాటున కంత భయపడవలసిన పని కాని, పరితపింప వలసిన పని కాని యే మున్నది? 'నేను పగలు గడచిన బ్రదుకఁ జాలను' అను వ్యంగ్యము ప్రియగమనము నెట్లు నిరోధించినది? నాయకుని యందుఁ దన కున్న నిరతిశయ ప్రేమను వ్యక్తము సేసి, 'నీ వియోగము సహింపలే నను పలుకులలోని యర్థముచేతనే కదా? ఇట మఱియొక విషయము ప్రయాణము నిరోధించినను, తత్కారణమున వ్యక్త మగు మొదటి విషయము ప్రధాన మై ధ్వనితము సమకూర్చును. ఇది యరసికులకు గోచరము గాదు.

2. ఇచట నాగేశుఁ డిట్లు ప్రశ్నించుచున్నాఁడు :

"నడుమ నుండు వ్యంగ్యముఁ బట్టియే ధ్వని గుణీభూతముల వ్యంగ్యము గుదురును. అటు తరువాతఁ 'బాణముల నిల్పఁజాలను' అను దానిఁ బట్టి గుణీభూతవ్యంగ్యమే. కనుక, 'విప్రలంభశృంగారముఁ బట్టి యీకావ్యము ధ్వని యగుట నెవడు వారించును?' అని పండితుఁ డనుట సరికాదు. ఇటులే యగుచోఁ, ప్రకాశకారాదులు 'గ్రామతరుణం' ఇత్యాది శ్లోకములను గుణీభూతవ్యంగ్యమున కుదాహరించుట యసంగతము గావలసి వచ్చును. అందు వలన గందరగోళ మేర్పడును. అచటఁ గూడ వ్యంగ్య మగు సంకేతభంగము వాచ్య మగు ముఖమాలిన్యాతిశయ రూపమైన యనుభావము ద్వారముననే విప్రలంభాభాసమును బోషించును అంతియే కాని, కేవలము సంకేతభంగ మొక్కటియే పోషింపదు. 'అది చేయఁగఁ దగదు' అను తలంపున నైనను అది సంభవింపవచ్చునుగదా?" దీనిని విచారింతము.

ఆంతరాళిక వ్యంగ్యముఁ బట్టి ధ్వని గుణీభూతవ్యంగ్య వ్యవహార మేర్పడు ననుట పూర్తిగా నసంబద్ధము. ప్రకృతములోఁ చర్వణావిశ్రాంతి సీమ యైన వ్యంగ్యముఁ బట్టి యావ్యవహారము లేర్పడును. ధ్వని యుండు చోట సామాన్యముగ గుణీభూత వ్యంగ్య ముండియే తీరును. ఇది సకలాలంకారిక సమ్మత మైన సిద్ధాంతమే. అయితే యాచోటుల నెక్కడను గుణీభూతవ్యంగ్య మను వ్యవహారము లేదే. ప్రధానవ్యంగ్యముఁ బట్టి ధ్వని యనియే వ్యవహరింతురు. ఎవరి నీతఁ డనుసరించెనో యామమ్మటుఁడే యీవిషయ మంగీకరించి యున్నాఁడు. "ప్రాధాన్యేన వ్యపదేశా భవన్తి" యని ధ్వనికారాదు లంద అంగీకరించిన సిద్ధాంతమే యిది. (అనఁగా : నెట నేది చమత్కారమునఁ బ్రధానమో, దానిఁ బట్టి యట వాడుక యేర్పడును.)

ప్రకరణముఁ బట్టి గుణీభూత మైన వ్యంగ్యమే చమత్కారక మగుచో నట గుణీభూతవ్యంగ్య మనియే వ్యవహారము. (ఈగుణీభావము వాచ్యవ్యంగ్యములకు సంబంధించినది. కనుకనే 'అయం సరశనోత్కర్షీ' త్యాదులందు శృంగారము వాచ్యమున కన్నఁ బ్రధానమే కనుక నట గుణీభూతవ్యంగ్య మనుట తప్పు అని మమ్మటమతముఁ బండితుఁడు ఖండించి

నాఁడు.) ప్రకరణాదులఁ బర్యాలోచించినపు డీగుణీభూతమునకు ధ్వనిరూపత యేర్పడును. అక్కడి ప్రమాణ వాక్య మిది.

“ప్రకారోయం గుణీభూత వ్యఙ్గ్యోపి ధ్వని రూపతాం ధత్తే రసాది తాత్పర్య పర్యాలోచనయా పునః” అని. ఈవాక్యముఁ జక్కఁగఁ బర్యాలోచించినచో నాగేశుని వాదము తప్పని స్పష్టపడును. మొట్టమొదటగా గుణీభూతవ్యంగ్య మైన స్థలములో దూరముగ రసాదితాత్పర్యము స్ఫురించినచో, నపు డది ధ్వని యగును. అనఁగా : వ్యంగ్యముచే భూషిత మైన వాచ్యము రసాంగముగా నేర్పడి యాకావ్యమునకు ధ్వనిత్వము సమకూర్చు నని భావము. పై విషయము “ఏవ మేష వ్యంగ్యార్థ సారో వాచ్యం భూషయతి, తత్తు వాచ్యం భూషితం స దీర్ఘా విప్రలమ్భాఙ్గత్వ మే తీతి” యని లోచనములోఁ జెప్పఁ బడినది.

కాఁగా ; ప్రముఖమున గుణీభూతవ్యంగ్యము చమత్కరించుచో, నాకావ్యము గుణీభూతవ్యంగ్యమే. పిమ్మట దూరముగఁ బర్యాలోచించి నపుడు రసాది తాత్పర్య మట స్ఫురించినచో సంలక్ష్యక్రమ మగు ధ్వని యగును. ‘ప్రహర విరతౌ’ అనుచోటఁ బండితుఁడు నిరూపించి నటులు నాయికానాయకాది సామాగ్రి రసమును స్ఫురింపఁ జేయును. అందుచే ధ్వనియే కాని గుణీభూతవ్యంగ్యము గాదు. ఇఁక ‘గ్రామతరుణం’ అను చోటఁ బ్రముఖమున ‘నవమంజుల మంజరీ సనాథ కరుఁ డగు గ్రామతరుణునిఁ జూచినకొలఁది నుజ్జ్వలముగా వలసిన తరుణీముఖము అంతకంత కింకను మలిన మెక్కు వగుచున్న దేల ?’ యని (కార్యజ నిర్విశేషోక్తి స్సతి పుష్కలకారణే) విశేషోక్తియు, (అకారణా త్కార్యజన్మ చతుర్థీ స్యా ద్విభావనా) విభావనయు నను నలంకారములు (వాచ్యములు) ప్రముఖమునఁ జమత్కరించును. కారణగవేషణ సేయఁగా, నీమెకు వంజులముల కడ నేర్పఱచు కొనిన సంకేతము భగ్న మైనది. దానికి గుఱుతుగాఁ, దరుణుఁడు త నచ్చోటి కేఁగి నట్లును, ఈమె రానట్లును దెలియఁ జేయుటకై వంజులమంజరిఁ జేత నుంచుకొని కనఁబడుచున్నాఁడు. ఆసంకేతభంగము చేతనే ముఖమాలిన్యము గలిగి చూచుచున్న కొలఁది విషాద మధిక మై మాలిన్యాతిశయము గలిగినది, ఇక్కడ సంకేతభంగము స్వయముగఁ జమత్కారకము గాక, వాచ్య మైన ముఖమాలిన్యాతిశయమును విషాద

ద్వారమున నుపపాదించి చమత్కారిక మగును. ఈవిషయము నాగేశుఁడు స్వయముగనే యంగీకరించి నాఁడు గదా. ప్రముఖములో విప్రలంభ రససామగ్రి వ్యంగ్య మని కానీ, యది వాచ్యము కన్న స్వతంత్రముగఁ జమత్కారక మగు నని కానీ, తానే నిరూపింప లేక పోయెను. కాఁగా, నిక్కడి విషయ మంతయుఁ బర్యాలోచనోత్తరకాలమందు దూరముగ రసము ధ్వనించును. కనుకఁ బ్రముఖ స్థితిఁ బట్టి యది యెప్పటికిని గుణీభూతవ్యంగ్యమే. ఇదంతయు నటుండ. నిట స్ఫురించు నర్థ మంతయు గూఢమే కాని వ్యంగ్యము గాదు. వ్యంగ్యప్రసక్తియే యిట లే దని యలంకార రత్నాకరకారుఁ డగు శోభాకరమిత్రుఁడు (మమ్మటునకుఁ బూర్వుఁడు) స్వీయగ్రంథమునం దిట్లు వ్రాసినాఁడు.

"గ్రామతరుణం ఇత్యాదావయ మేవా లఙ్కారః న గుణీభూత వఙ్గ్యత్వం; ఏవ మాదౌ గూఢార్థస్య వ్యఙ్గతా సమ్భావనాయా అస్య భావా దిత్యావేదిత ప్రాయమ్" అనియు, "యదిదే వరేణ" ఇత్యాదుల మఱి కొన్నింటి నుదాహరించియు, నిందు గూఢాలంకారమే కాని వ్యంగ్యప్రసక్తిలే దని చెప్పెను. ఆలంకారిక సిద్ధాంతసాంప్రదాయికము లెఱుంగని నాగేశుని యాక్షేపము లిటు లుండక మఱి యెట్లుండును?



# ఆంధ్ర రసగంగాధరము

## ౩. మూఁడవ కావ్యవిచారము
### (మధ్యమము)

సంస్కృత మూలము

యత్ర వ్యఙ్గ్య చమత్కారా సమానాధికరణో వాచ్యచమత్కార స్త
తృతీయమ్ యథా యమునా వర్ణనే -
తనయ మైనాక గవేషణ లమ్బీకృత జలధి జరరప్రవిష్ట
హిమగిరి భుజాయమానాయాః భగవత్యాః భాగీరథ్యా స్సఖీ. ఇతి

అత్రోత్ప్రేక్షా వాచ్యైవ చమత్కృతి హేతుః; శైత్యపాతాల తల చుమ్బిత్వాదీనాం చమత్కారో లేశతయా స న్నపి ఉత్ప్రేక్షా చమత్కృతి జరరనిలీనో నాగరికేతరనాయికా కల్పిత కాశ్మీరాఙ్గరాగ నిగీర్ణో నిజాఙ్గగౌరి మేవ ప్రతీయతే; నతాదృశో ఽస్తి కోపి వాచ్యార్థః యో మనాగనా స్పృష్ట ప్రతీయమాన ఏవ స్వతో రమణీయ మాధాతుం ప్రభవతి; అనయోః ఏవ ద్వితీయ భేదయో ర్జాగరూకా జాగరూక గుణీభూత వ్యఙ్గ్యయోః ప్రవిష్టం నిఖిల మలఙ్కార ప్రధానం కావ్యమ్.

తెలుఁగు తాత్పర్యము

వ్యంగ్యచమత్కారము వాచ్య చమత్కారముతోఁ దులఁదూగ నపుడు మూఁడవది (మధ్యమము) అగు కావ్యము ఉదాహరణము

తన బిడ్డను మైనాకుని వెదకుటకై దీర్ఘముగాఁ జేయఁబడి చాపగా, సముద్రగర్భములోఁ జొరబడిన హిమవంతుని భుజమువలె నగుచున్న భగవతి యగు గంగకు తోడు, ఇది

వివరణము :

ఈశ్లోకమున వర్ణిత విషయము యమునా వర్ణనము. ఈయమున, గంగానదికి సఖి. ఎట్టి గంగానదికి సఖి ? కుమారుఁ డైన మైనాకుని వెదకుటకై చాపిన హస్తము సముద్రమునఁ బ్రవేశించు నపుడు హిమవంతుఁ డేమో యని భ్రాంతిఁ గూర్చుచున్నట్టి గంగానదికి సఖి, దీర్ఘత్వమున, శ్వేతత్వమున, నగాధత్వమునఁ, బావనత్వమున సాటిలే నట్టిది యామె. అట్టి యామెకుఁ బ్రియసఖి యగుటయే యమున గొప్పదన మని భావము.

ఇఁకఁ బ్రకృతవిషయము :

* ఇచట వాచ్య మగు నుత్ప్రేక్షయే చమత్కారముఁ గలిగించును. తెల్లదనము, పాతాళము నంటుట మొదలగు వ్యంగ్యములు లేశమాత్ర చమత్కారము లైనను ఉత్ప్రేక్షాచమత్కారగర్భములో లీన మై పోయినవి. (ఇందులకే వ్యంగ్యచమత్కారము తులఁ దూగ దని చెప్పబడినది.) అనాగరికనాయిక కాశ్మీరద్రవము పూసికొనినప్పు డామె దేహగౌరిమ వలెఁ గప్పవడి తోచును. ఏవాచ్యార్థము గూడ వ్యంగ్య మే కొంచె మంటనిదే తనంతటతాను జమత్కారము సమకూర్పఁ జాలదు. ఈరెండవ మూఁడవ రకముల యం దేక్రమముగ వ్యంగ్యము (చమత్కారము) జాకరూకముగ నుండుటయు, నజాగరూకముగ నుండుటయు సంభవించును. అనఁగా: ఉత్తమకావ్యమునందు వ్యంగ్యార్థము స్ఫుటముగాఁ (జాగరూకముగ) బ్రకాశించును. మధ్యమ కావ్యములో వ్యంగ్యార్థము అస్ఫుటము (అజాగరూకము) గ మినుకుమినుకు మనుచుండును. వ్యంగ్యకృతశోభ దీనియం దేమాత్ర ముండ దన్నమాట.

శ్రీశర్వాణి :

* మిక్కిలిలోతును, దెల్లదనమును గల గంగ, తెల్ల నైన హిమవంతుని భుజము సముద్రగర్భములోఁ జొరబడి తనబిడ్డఁ డైన మైనాకుని వెదకుటకై పాతాళపర్యంతము వ్యాపించినట్లు తోచుచున్నది యని యిందలి యుత్ప్రేక్ష.



# ఆంధ్ర రసగంగాధరము

## ౧౦. నాల్గవ కావ్య విచారము

### ( అధమము )

సంస్కృత మూలము

యత్రార్ధచమత్కృత్యుపస్కృతా శబ్దచమత్కృతిః ప్రధానం తదధమం చతుర్థమ్. యథా. ఉదాహరణమ్.

మిత్రాత్రిపుత్రనేత్రాయ త్రయీ శాత్రవ శత్రవే
గోత్రారి గోత్రజత్రాయ గోత్రాత్రే తే నమో నమః ఇతి

అత్రార్ధచమత్కృతిః శబ్దచమత్కృతౌ లీనా ; యద్యపి యత్రార్ధచమత్కృతి సామాన్యశూన్యా శబ్దచమత్కృతి స్తత్పఞ్చమ మధమాధమ మపి కావ్యవిధాసు గణయితు ముచితమ్ ; యథైకాక్షర పద్యార్ధావృత్తి యమక పద్మబన్ధాది ; తథాపి రమణీయార్ధ ప్రతిపాదక శబ్దతారూప కావ్యసామాన్య లక్షణా నాక్రాన్తతయా వస్తుతః కావ్యత్వాభావేన మహాకవిభిః ప్రాచీనపరంప రానుసన్ధానైః తత్ర తత్ర కావ్యేషు నిబద్ధ మపి నాస్మాభి ర్గణితం ; వస్తుస్థితే రేవానురోద్ధవ్యత్వాత్. కేచిదిమా నపి చతురో భేదా నగణయన్త ఉత్తమమధ్యమాధమ భావేన త్రివిధ మేవ కావ్య మాచక్షతే ; తత్ర అర్ధ చిత్ర, శబ్దచిత్రయో రవిశేషేణ అధమత్వ మయుక్తం వక్తుమ్.

తారతమ్యస్య స్ఫుట ముపలబ్ధేః; కో హ్యేవం సహృదయ స్సన్

వినిర్గతం మానద మాత్మ మన్దిరాత్
భవ త్యుపశ్రుత్య యదృచ్ఛయాపి యం
ససమ్భ్రమేన్ద్ర ద్రుతపాతితార్గలా
నిమీలితా క్షీవ భియాఽ మరావతీ.

(ఇతి కావ్యప్రకాశార్థ చిత్రోదాహరణమ్)

అప్పయ్యదీక్షిత అర్థచిత్రోదాహరణమ్ —

సచ్ఛిన్నమూలః క్షతజేనరేణుః
తస్యోపరిష్టా త్పవనావధూతః
అఙ్గారశేషస్య హుతాశనస్య
పూర్వోత్థితో ధూమ ఇ వావభాసే.

ఇత్యాది కావ్యైః—

స్వచ్ఛన్దో చ్ఛలద చ్ఛ కచ్ఛకుహర చ్ఛాతేత రామ్బుచ్ఛటా
మూర్ఛ న్మోహ మహర్షి హర్షవిహిత స్నానాహ్నికాహ్నాయ వః
భిన్ద్యా దుద్యదుదారదుర్దురదరీ దీర్ఘా దరిద్రద్రుమ
ద్రోహోద్రేక మహోర్మి మేదురమదా మన్దాకినీ మన్దతామ్.

ఇత్యాదీనాం పామరశ్లాఘ్యానాం అవిశేషం బ్రూయాత్ ; సత్యపి తారతమ్యే యద్యేక భేదత్వం, క స్తర్హి ధ్వనిగుణీభూత వ్యఙ్గ్యయోః ఈషద న్తరయో ర్విభిన్నభేదత్వే దురాగ్రహః ; యత్ర చ శబ్దార్థచమత్కృత్యో రైకాధికరణ్యం తత్ర తయోర్గుణప్రధానభావం పర్యాలోచ్య యథా లక్షణం వ్యవహ ర్తవ్యమ్ ; సమప్రాధాన్యే తు మధ్యమ తైవ. యథా—

ఉల్లాసః ఫుల్లపఙ్కేరుహపటలపత న్మత్త పుష్పన్ధయానాం
నిస్తారః శోకదావానల వికల హృదాం కోక సీమ న్తినీనాం
ఉత్పాత స్తామసానా ముపహత తమసాం చక్షుసాం పక్షపాతః
సంఘాతః కోఽపి ధామ్నామయ ముదయగిరి ప్రా న్తతః ప్రాదురాసీత్.

అత్రవృ త్త్యనుప్రాసప్రాచుర్యా దోజోగుణ ప్రకాశకత్వా చ్చ శబ్దస్య, ప్రసాదగుణయోగా దన న్తర మేవాధిగతస్య రూపకస్య, హేత్వ లఙ్కారస్య వా వాచ్యస్య, చమత్కృతే స్తుల్య స్కన్ధత్వా త్సమ మేవ ప్రాధాన్యమ్.

తెనుఁగు మూలము :

అర్థచమత్కృతితో నలంకరింపఁబడి శబ్దచిత్రము ప్రధాన మైనచో నది యధమము. నాల్గవది—

## ఉదాహరణ శ్లోకవివరణము

సూర్యచంద్రులు నేత్రములుగాఁ గల్గి వేదవిరోధులను సంహరించి నట్టియు, నింద్రపుత్త్రుఁ డగు నర్జుననిఁ గాపాడి నట్టియు, గోవులఁ గాచినట్టియు నీకు నమస్కారము,

ఇచట నర్థచమత్కృతి (దేవుని మహిమాతిశయ చమత్కారము) శబ్ద చమత్కృతిలో లీన మైనది. అర్థచమత్కృతి లేశము గూడ లేక కేవల శబ్ద చమత్కృతి మాత్రమే యుండునది యైదవ విభాగము. దానిని నధమాధమముగ గావ్యభేదము లందు గణింపఁ దగును. ఉదాహరణము :

దాదదో దుద్దదుద్దాదీ దాదాదో దుదదీదదోః
దుద్దాదం దదదే దుద్దే దదా దదదదోఽ దదః. (ఏకాక్షరము)
ననో ననున్నో నున్నోనో నాఽనా నానాఽఽ ననానను
నున్నోఽ నున్నో ననున్నేనో నాఽనేనా నున్న నున్ననుత్. (ఏకాక్షరము)

వేదవేదవిదాం వాద విద్దేవో దివిదావదః
వాదో వాదే వదే వాది విద్యో వాదివదే విదమ్. (ద్వ్యక్షరము)

ఏకాక్షర ద్వ్యక్షరాది శ్లోకములు, పద్యములో సగ మావర్తించు యమ కాదులు, పద్మబంధము మొదలైనవి యాయైదవ విభాగమునఁ జేరును. వీని యందు 'రమణీయ మగు నర్థముఁ బ్రతిపాదించు శబ్దము' అను సామాన్యలక్ష ణము లేదు గనుక నివి యసలు కావ్యము లగుటయే కుదురదు. ప్రాచీన పరంప రానుసారు లైన మహాకవు లట నటఁ గావ్యములందుఁ బైవానిఁ గూర్చినను మేము పరిగణింప లేదు. వస్తుస్థితియే కదా యనుసరింప వలసినది!

శ్రీశర్వాణి.

* ఇచట 'త్ర' యను నక్షర మనేక పర్యాయము లావృత్తమై చమత్కరించును. ఈశబ్దచమత్కారములోనే యర్థకృత చమత్కారము లీన మగును.

తెలుఁగు తాత్పర్యము :

1. కొంతమంది యీనాల్గుభేదముల గూడ గణింపక, యుత్తమ మధ్య మాధమము లని మూఁడు రకములుగనే కావ్యముల విభజింతురు. అందులో 'శబ్దచిత్రము, అర్థచిత్రము' అను నీ రెండిటికి భేదముఁ జూపక యధమ మనుట తగదు. భేదము స్పష్టముగఁ గనఁబడుచున్నది కదా. 2. వినిర్గతం మానద మాత్మ మందిరాత్,' 3. 'సచ్ఛిన్నమూలః' అను నర్థచిత్రములకుఁ, బామరులు మెచ్చుకొను 4. 'స్వచ్ఛం దోచ్ఛల దచ్ఛ' యను శబ్దచిత్రములకు భేదము లేదనియే సహృదయుఁ డనును. తారతమ్య ముండినను ఒకే రకముగ గణించుచో, నల్పభేద మున్న ధ్వని, గుణీభూతవ్యంగ్య కావ్యములు వేరువేరు భేదము లనుటలో దురాగ్రహ మెందులకు ?

శ్రీ శర్వాణి :

1. మమ్మటాదులు కావ్యప్రకాశాది గ్రంథముల నట్లు నిరూపించిరి.

2. హయగ్రీవుఁ డను రాక్షసుఁ డలవోకగాఁ దనమందిరము వెలువడి నను, ఆవార్త విన్న యింద్రుఁడు తొట్రుపాటున శీఘ్రముగ నమరావతీ పట్టణ సింహద్వార కవాటముల మూసి గడియ వేయు నఁట. అట్లు మూయఁబడిన యమరావతి భయముచేఁ గనులు మూసి కొనిన ట్లున్నది. ఇందలి యలంకార ముత్ప్రేక్ష. అచేతన మయిన యమరావతి పట్టణము సయితము హయగ్రీవుని భయముచేఁ గనులు మూసికొనినది యని యర్థచిత్రతను గుఱుతింపవలెను.

3. ఇది కాళిదాసకృత రఘువంశ శ్లోకము. విషయము ; రణవర్ణనము. గుఱ్ఱముల గిట్టలచే నలుగుడు వడిన భూమి యందలి దుమ్ము రక్తముచే నమసిపోయినది. కాని, గాలి విసరున యాదుమ్ము మరల నారక్తము పైనఁ బ్రసరించుచున్నది. ఈదృశ్య మగ్నిశేషముగ నున్న బొగ్గుపైఁ గానుపించు పొగవలె నున్నది. ఇం దుపమాలంకార మర్థచిత్రముగ నున్నది.

4. ఇది యాశీర్వాద రూపకముగ మందాకినీ వర్ణనము. స్వేచ్ఛగా దుముకు చున్న నిర్మలజలప్రదేశ కుహరమందు నీటిధారలచే నశించుచున్న యజ్ఞానము గల ఋషులు సంతోషపూర్వకముగఁ జేయఁబడు స్నానరూప మైన మాధ్యాహ్నిక కార్యకలాపములు గలిగినట్టియు, మండూకములతో నిండిన గొప్పబొరియలు గలిగినట్టియు, దీర్ఘములై, పూర్ణములై యున్న వృక్షముల యడ్డుచే నధిక మగుచున్న సాంద్రతరంగములచే మిక్కిలి మదము గలిగి నట్టిదియు నైన మందాకినీనది మీమందత్వముఁ బోఁగొట్టుఁ గావుత.

ఈశ్లోకము కావ్యప్రకాశమం దున్నది. ఇం దనుప్రాస ప్రచురముగ నుండి శబ్దకృత చమత్కారముఁ గలిగించుచున్నదే కాని యర్థమునం దెట్టి వైచిత్ర్యముఁ గలిగించుట లేదు.

తెలుఁగు తాత్పర్యము :

ధ్వని గుణీభూతవ్యంగ్యములకు భేదము స్పష్టమే కదా. 1. శబ్దచమత్కృతియు, నర్థచమత్కృతియు నొకే యొకచోట నుండుచో వానిలోని ముఖ్యతాముఖ్యతలఁ బట్టి చక్కగ నాలోచించి లక్షణము చొప్పున వ్యవహరింపవలెను, రెండు నొకే తరగతిలో నున్నచో 2. మధ్యమకావ్య మనవలెను. ఉదాహరణ శ్లోక తాత్పర్యము.

వికసించిన తామరపూవులలో వ్రాలుచున్న మదించిన తుమ్మెదల కుల్లాసము, శోకము దావాగ్నివలె దహింపఁగా మనసు వికల మైన యాడుజక్కవలకు దుఃఖనిరాసము, వెలుఁగు నడంచిన చీఁకటిగుంపుల కుత్పాతముఁ గన్నులకుఁ బక్షపాత మైన యొకవిలక్షణ మగు తేజోరాశి యుదయగిరిప్రాంతమునుండి యావిర్భవించినది. ఇది సూర్యవర్ణనము.

ఇచట వృత్త్యనుప్రాసము ప్రచురముగా నున్నది. రచన యోజోగుణ ప్రకాశకముగ నున్నది. కనుక శబ్దచమత్కారము ప్రసాదగుణముఁ గూడి యుండుట వలన నవ్యవహితముగఁ దెలియవచ్చు రూపకమో, హేత్వలంకారమో వాచ్య మై యది చమత్కరించును. ఈరెండు చమత్కారములు గూడ సమానస్కంధములు గనుకఁ బ్రాధాన్యము సమమే. కనుక నిది మధ్యమ కావ్యము.

శ్రీ శర్వాణి :

1. వ్యంగ్యము రెండింట నుండక తీరదు. అతి ప్రధానము, అప్రధాన మను నల్పభేదము. దీనిఁ బట్టి వేరువేరు రకము లనుట సరికాక పోవచ్చు నని యాక్షేపము. ఇఁక నీ నాల్గుభేదములఁ గూడ వారు గణింపలే దనుటలోని భావ మేమనఁగా : లక్షణ మెపుడు లక్ష్యముల ననుసరించి తీరవలసినదే. మహాకవులు ప్రాచీనపరంపరను బట్టి యైదవది యైన యధమాధమకావ్యములఁ గూడ రచించిరి. అందుచే నైదవ దానినిఁ గూడ గణించుట యవసరము. విషయ మిట్లుండగా, రమణీయార్థముఁ బట్టి నాల్గురకము లని మేము గణించితిమి. ఈ విభాగము గూడ మమ్మటాదులు గణింపక పోవుట యనుచితము అని

2. అప్పయ్య దీక్షితులు చిత్ర మీమాంసలో, శబ్దచిత్రము, అర్థచిత్రము వేఱుగా గణించి, యుభయముఁ గూడ మధ్యమకావ్యమున కన్న వేఱుగ భావించెను. అది యుక్తము కాదు అని. శబ్దార్థచిత్రతల సమానస్థ మధ్యమ కావ్యముగ గణించుటకే పనికివచ్చును. కనుక మధ్యమకావ్యమున కన్న వేఱుగా నుభయచిత్రమును గణింపఁ దగ దని పండితుని భావము.



# ఆంధ్ర రసగంగాధరము

## ౧౧. రసవాదము

సంస్కృత మూలము

తత్ర ధ్వనే రుత్తమోత్తమస్య అసంఖ్యేయ భేద స్యాపి సామాన్యతః కేపి భేదా నిరూప్యన్తే ద్వివిధో ధ్వనిః అభిధా మూలో, లక్షణా మూల శ్చ. తత్రాద్య స్త్రావ త్త్రివిధః ; రస వస్త్వలఙ్కార ధ్వని భేదాత్ ; రసధ్వని రి త్యలక్ష్యక్రమోపలక్షణాత్ రసభావ తదాభాస భావశాన్తి భావోదయ భావసన్ధి భావశబలత్వానాం గ్రహణం ; ద్వితీయ శ్చ ద్వివిధః ; అర్థాన్తర సంక్రమిత వాచ్యోఽత్యన్త తిరస్కృత వాచ్య శ్చ , ఏవం పఞ్చాత్మకే ధ్వనౌ పరమరమణీయతయా రసధ్వనే స్తదాత్మా రసః తావ దభిధీయతే.

తెనుగు తాత్పర్యము

ఈ నాల్గురకములం దుత్తమోత్తమ మగు ధ్వనిభేదముల లెక్కఁబెట్ట లేము అయినను, సామాన్యముగఁ గొన్నిరకముల నిరూపింతుము ధ్వని రెండు రకములు అభిధ వలన నేర్పడు నదియు, లక్షణచే నేర్పడు నదియు అందు మొదటిది మూఁడురకములు 'రసము, వస్తువు, అలంకారము' అని ఇట రసధ్వని యనుటలో నలక్ష్యక్రమము లన్నియుఁ జేరువ చేరువగా గుఱుతునకుఁ దేఁబడినవి. అందువలన, రసము భావము, తదాభాసము, భావశాంతి, భావోదయము, భావసంధి, భావశబలతలు గ్రహింపఁబడును ఇఁక రెండవది యగు లక్షణవలన నేర్పడు ధ్వని రెండు రకములు అర్థాంతరసంక్రమిత వాచ్యము, అత్యంత తిరస్కృతవాచ్యము. (అనఁగా వాచ్యార్థము మఱొక

యర్థమున సంక్రమింపఁ గా వ్యంగ్యమగు నదియు, ననలు వాచ్యమునే నిరాక రించు నదియు నని భావము.) ఇట్లు పంచాత్మకము లగు నీధ్వనిలో రసధ్వని పరమరమణీయము. (ఉత్తమోత్తమము.) కనుక దాని యాత్మ యగు రసమును సమగ్రముగఁ దెలుపుదుము.

శ్రీ శర్వాణి

రసము చమత్కారైక ఘనము. పరమరమణీయము. బ్రహ్మైక రూపము. దానిసంబంధముచేతనే కావ్య ముత్తమోత్తమ మగు చున్నది. 'శ్రీమదూర్జిత మేవవా......మమతేజోంఽశసమ్భవమ్' అని గీతలోఁ జెప్పఁబడి యున్నది. కాఁగా, బ్రహ్మానందానుభవమును గల్గించు కావ్యములు రసధ్వని పవిత్రితములు వాని పవిత్రతకు, నందుచే నేర్పడు నుపాదేయ తకు నిదాన మగు రసనిరూపణము బ్రహ్మనిరూపణమే కదా. 'రసో వై సః' అని శ్రుతి రసమే బ్రహ్మ మని స్పష్టీకరించినది. కనుక 'అధిగత సకలబహ్మవిద్యా ప్రపంచుఁ' డని మొదటఁ బ్రస్తావింపఁ బడిన పేరుభట్టు శిష్యుఁడు, గుమారుఁడు నైన తన కవశ్యకర్తవ్యము కనుక దాని నొనరింతు నని భావము.

సంస్కృత మూలము – రస నిరూపణము :

సముచిత లలిత సన్నివేశ చారుణా కావ్యేన సమర్పితైః, సహృదయ హృదయం ప్రవిష్టైః తదీయ సహృదయతా సహకృతేన భావనా విశేష మహిమ్నా విగళితదుష్యన్తరమణీత్వాదిభిః. అలౌకిక విభావానుభావ వ్యభిచారిశబ్ద వ్యపదేశ్యైః శకున్తలాదిభిః ఆలమ్బనకారణైః చన్ద్రికాదిభి రుద్దీపనకారణైః అశ్రుపాతాదిభిః కార్యైః చిన్తాదిభి స్సహకారిభి శ్చ సమ్భూయ ప్రాదుర్భావితేన, అలౌకికేన వ్యాపారేణ, తత్కాల నిర్వర్తితానన్దాంశావరణాజ్ఞానేన అత ఏవ ప్రమృష్ట పరిమిత ప్రమాతృత్వాది నిజధర్మేణ ప్రమాత్రా స్వప్రకాశతయా వాస్తవేన నిజస్వరూపానన్దేన సహగోచరీక్రియమాణః ప్రాగ్వినష్టవాసనారూపో రత్యాది రేవ రసః

తెనుగు తాత్పర్యము :

ఆయారసములకనుసరిపడునట్లు లలిత మగు శబ్దార్థముల యమరికచే నందగించు కావ్యము చక్కఁగ బోధపఱచగా, శకుంతలాదులు, వెన్నెలలు

కన్నీరు కారుటలు, చింతించుటలు మొదలగు నవి సహృదయుని హృదయ ములోఁ బ్రవేశించును. వాడు వానిని తన హృదికలో (సహృదయుని తోడ్పా టున)నున్న సంస్కారములతో భావించును. అందువలన, శకుంతలాదులందు దుష్యంతుని భార్య యను నీరీతి విశేషములు తొలంగి తామే తొలంగును అప్పుడు శకుంతలాదులు లోకసామాన్య మగు త్రోవను పడి. శకుంతలా దుష్యంతు లాలంబన కారణములుగ ; చంద్రికాదు లుద్దీపన కారణములుగ, అశ్రుపాతాదులు కార్యములుగ, చింతాదులు సహకారులుగ భావనాగోచరము లై యలౌకిక వ్యాపారము చర్వణ యను దాని నుదయింపఁ జేయును. సామాజికునకుఁ బ్రమాత యని పేరు. ప్రమాతయందలి యానందాంశము నావరించిన యజ్ఞాన మాచర్వణవలన వెనువెంటనే తొలఁగును. ఇందు చేతనే 'తా నొక్కఁడే దీని ననుభవ మొనర్చుకొనుచుంటిని' యను నీరీతి పరిమితము లైన ప్రమాతృత్వాది నిజధర్మములు ప్రమాతయందు బూర్తిగా నశించిపోవును. అప్పుడు ప్రమాతకు నిజస్వరూప మైన యానందము. పూర్వ సంస్కారరూపవాసనారూపరతియును భాసించును. అటువంటి రత్యాదికమే రసము.

శ్రీ శర్వాణి :

నిజస్వరూపానందముతో పాటుగ గోచర మగు రత్యాదికమే రస మని లక్షణము. మిగిలిన దంతయు దీని నుపపాదించు వివరణము అంతియే కాని, యీదంతయు మంతయు రసలక్షణము గాదు. అట్లే యగుచో, లక్ష్య మగు రసమున కన్న లక్షణ మతిదీర్ఘ మై లక్షణత్వమునే కోల్పోవును. అథవా, 'రస స్స్వాద దభిధీయతే' యని ప్రతిజ్ఞ. కనుక రసస్వరూపవివరణ మే కాని యిది యంతయు లక్షణము గా దని యైన గ్రహింపవలెను.

## రసనిరూపణము — ౧

సంస్కృత మూలము :

తథా చాహుః ; 'వ్యక్త స్స తై ర్విభావాద్యైః స్థాయిభావో రస స్స్మృతః' ఇతి వ్యక్తః = వ్యక్తివిషయీకృతః; వ్యక్తి శ్చ భగ్నావరణా చిత్; యథాహి శరావాది నాపిహితః దీపః తన్నివృత్తౌ సంనిహితాన్ పదా ర్థాన్ ప్రకాశయతి. స్వయం చ ప్రకాశతే. ఏవ మాత్మచైతన్యం విభావాది

సంవలితాః; రత్యాదీన్; అన్తఃకరణ ధర్మాణాం సాక్షిభాస్యత్వా భ్యుప గతేః; విభావాదీనా మపి స్వప్నతురగాదీనా మివ రజ్జురజతాదీనా మివ సాక్షి భాస్యత్వ మవిరుద్ధం వ్యఞ్జక విభా వాది చర్వణాయాః ఆవరణభఙ్గస్య వా ఉత్పత్తి వినాశాభ్యా ముత్పత్తివినాశే రసే ఉపచర్యే తే వర్ణనిత్యతాయా మివ వ్యఞ్జకతాత్వాది వ్యాపారస్య గకారాదౌ ; విభావాది చర్వణావధిత్వా దావరణ భఙ్గస్య, నివృత్తాయాం తస్యాం ప్రకాశస్యావృతత్వా ద్విద్య మానోఽ పి స్థాయీ న ప్రకాశతే.

యద్వా విభావాదిచర్వణా మహిమ్నా సహృదయస్య నిజ సహృదయతావశోన్మిషితేన తత్త స్థా య్యుపహిత స్వస్వరూపానన్దాకారా సమాధా విన యోగిన శ్చిత్తవృత్తి రుపజాయతే ; తన్మయీభవన మితి యావత్ ; ఆనన్దో హ్యయం నలౌకిక సుఖాన్తర సాధారణః అన్తః కరణ వృత్తిరూపత్వాత్ ; ఇత్థం చాభినవగుప్త మమ్మటభట్టాది గ్రన్థస్వారస్యేన భగ్నావరణచి ద్విశిష్టో రత్యాదిః స్థాయీభావో రస ఇతి స్థితమ్.

తెలుఁగు తాత్పర్యము :

రత్యాది స్థాయి భావము విభావాదులవలన వ్యక్తము సేయఁ బడినపుడు 'రసము' అనఁబడుచున్నది.

వ్యక్త మనఁగా వ్యక్తికి గోచర మొనర్పఁ బడినది. వ్యక్తి యనఁగా: ఆవరణము దొలఁగిన చిత్తు. మూఁకుడు మూసిన దీప మది తీయగనే చేరువ నున్న వస్తువులఁ గన్పఱచును, తాను గన్పడును. అటులే యాత్మచైతన్యము (విభావాదిమేళన జన్య మగు నలౌకికవ్యాపారము వలనఁ దనయావరణము తొలఁగి పోగా) విభావాదులతోఁ గూడిన రత్యాదులను గోచర మొనర్చును. 'అంతః కరణ ధర్మములు (కామసంకల్పాదులు) సాక్షిచైతన్యముచే భాసింపఁ బడఁ దగి నవి' యని పెద్ద లంగీకరించిరి కదా. విభావాదులు గూడ స్వప్నమందలి తురగా దులవలెను, జాగ్రద్దశలో వంగ (తగరము) రజతాదులవలెను సాక్షిచే భాసింపఁ బడఁ దగియుండుటలో విరోధ మేమియు లేదు

"అయితే రసము నిత్యమైన యాత్మరూప మగు నానందానుభవమే యగుచో 'రస ముదయించినది, రసము నశించినది' యను వ్యవహార మెట్లేర్పడినది? యని శంకింపవచ్చును. సమాధాన మిది. వ్యంజకము లైన విభావాదుల చర్వణయో, యావరణ భంగమో యుదయించినపుడు రస ముదయించిన దనియు, నది యేదో నశించినప్పు డిది నశించిన దనియు వ్యవహరింతురు అనఁగా: ఆచర్వణావరణభంగముల యుత్పత్తివినాశము లీరసమునం దుపచారమున వ్యవహరింపఁ బడు నని భావము. 'అక్షరములు నిత్యములు' అన్న మతములో వ్యంజకము లగు తాల్వాదుల వ్యాపారోత్పత్తి వినాశములను గకారాద్యక్షరములం దుపచరించుట లేదా? విభావాదుల చర్వణ యుండు నంతవఱకావరణము భగ్నమగును. చర్వణ తొలఁగఁగనే యావరణభంగముఁ దొలఁగును. ఆత్మప్రకాశ మావృత మగును స్థాయిభావ మున్నను ప్రకాశింపదు.

## రస నిరూపణము - ౨

సంస్కృత మూలము :

వస్తుతస్తు వక్ష్యమాణ శ్రుతి స్వారస్యేన రత్యా ద్యవచ్ఛిన్నా భగ్నావరణా చిదేవ రసః; సర్వథైవ చాస్యాః విశిష్టాత్మనః విశేషణం విశేష్యం వా చిదంశ మాదాయ నిత్యత్వం స్వప్రకాశత్వం చ సిద్ధం; రత్యా ద్యంశ మాదాయత్వ నిత్యత్వం ఇతరభాస్యత్వం చ; చర్వణా చాస్య చిద్గతావరణభఙ్గ ఏవ ప్రాగుక్తా; తదాకారా న్తః కరణవృత్తిర్వా; ఇయం చ పరబ్రహ్మాస్వాదా త్సమాధేః విలక్షణా, విభావాది విషయ సంవలిత చిదాలమ్బనత్వాత్; భావ్యా చ కావ్య వ్యాపార మాత్రాత్.

అథాస్యాం సుఖాంశభానే కిం మాన మితి చేత్ సమాధా వపి తద్భానే కిం మాన మితి పర్యనుయోగస్య తుల్యత్వాత్ 'సుఖ మాత్య న్తికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియమ్' ఇత్యాదిః శబ్దోస్తి తత్ర మాన మితిచేత్; అ స్త్యత్రాపి 'రసో వై సః రసం హ్యేవాయం లబ్ధ్వాఽఽ నన్దీ భవతి' ఇతి శ్రుతిః సకల సహృదయ ప్రత్యక్షం చేతి ప్రమాణద్వయం ;యేయం ద్వితీయపక్షే తదాకారచి త్తవృత్త్యాత్మికా రస

చర్వణా ఉపన్యస్తా సా శబ్దవ్యాపార భావ్యత్వా చ్ఛాబ్దీ అపరోక్ష సుఖా లమ్బనత్వా చ్చ అపరోక్షాత్మికా త త్త్వం వాక్యజ బుద్ధివత్ ; ఇత్యాహు రభినవగుప్తాచార్యపాదాః.

తెనుఁగు తాత్పర్యము

లేదా, సహృదయునకుఁ దన సహృదయత వలన విభావాది చర్వణా మహిమ వికసించును దానివలన నాయా స్థాయిభావము లుపాధులుగా నిజ స్వరూప మగు నానందము గోచర మగును. అనఁగా : నీయుపాధిసహిత మగు నానందాకారముననఁ జిత్తవృత్తి యేర్పడును. యోగులకు (సవికల్పక) సమాధిలో నట్టి సోపాధికానందాకార మగు చిత్తవృత్తి యనుభవములో నున్నదే కదా. అదియే తన్మయత యని పర్యవసానము. ఇట నేర్పడు నానందము కడమ లౌకిక సుఖముల వంటిది కాదు. ఎందుచే ననఁగా : ఇది యంతఃకరణవృత్తి రూపము గాదు (ఇంద్రియములతో ననుభవము వలన నేర్పడు సుఖము మనో గుణము. అది యంతఃకరణవృత్తి రూపము). ఇట్లుగ నభినవగుప్తులు, మమ్మటభట్టు మొదలగు వారి గ్రంథముల స్వారస్యముఁ బట్టి యావరణము దొలఁగిన చైతన్యముతోడి రత్యాదికము గానీ, రత్యాదులతోడి నిరావరణ మగు చైతన్యము గానీ రస మని సిద్ధాంత మేర్పడినది.

కాని, వస్తుతత్త్వముఁ బట్టి చూచినచో, ముందు దెలుపఁ బోవు శ్రుతి స్వారస్యముఁ బట్టి యావరణము దొలఁగిన చైతన్యమే రత్యాదులతోఁ గలసి రస మగును. అన్ని విధములఁ గూడ నీ రసము విశిష్టస్వరూపమే ఈవిశిష్ట తలో నొకరి పక్షమునఁ జైతన్యము విశేషణము. మఱియొక పక్షమున విశే ష్యము. ఇట్లున్న యీ చైతన్య మనుభాగముఁ బట్టియే యీరసము నిత్య మగు టయుఁ, దనంత తానే ప్రకాశించు నది యగుటయు సిద్ధించును. రత్యాదిక మైన యితరాంశముఁ బట్టి ( యీ 'రసము' ) యనిత్య మనుటయు, నితరములనుండి ప్రకాశింపఁ జేయఁబడవలసి యుండుటయు నేర్పడును. దీనికిఁ జర్వణ యనఁగాఁ జైతన్యమున కుండు నావరణము దొలఁగుటయే. అథవా, వెనుకఁ జెప్పిన యానందాకార మగు నంతఃకరణవృత్తి యైనను జర్వణ యగును. ఈరసచర్వణ పరబ్రహ్మము నాస్వాదింపఁ జేయు సమాధికన్న విలక్షణమే. ఏమనఁగా : ఈరస చర్వణములోఁ గూడఁ జైతన్యము ఆనందరూపమున

గోచర మైనను నది విభావాది విషయములతో గూడిన దై యుండియే గోచరించును. (పర బ్రహ్మాస్వాదసమాధియందు విషయ మేమియు భాసింపదు.) ఈరసస్వాద కావ్య వ్యాపారమున మాత్రమే యేర్పడును

అయితే యిందులో సుఖాంశము భాసించు ననుటలోఁ బ్రమాణ మేమందురా? బ్రహ్మసమాధిలో మాత్ర మది భాసించు ననుటలోఁ బ్రమాణ మేమి?' యను ప్రశ్నము సమానమే. "సుఖ మాత్యన్తికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియమ్" (ఇంద్రియములకు గోచరము గాక బుద్ధికి మాత్రమే గోచర మగు పరమ మైనసుఖము) అను ప్రమాణ మున్నది యందురా? ఇక్కడ గూడ "రసో వై సః, రసం హ్యే వాయం లబ్ధ్వాఽఽనన్దీ భవతి." యను వేదము నంతియే కాక 'సహృదయు లందఱ ప్రత్యక్షానుభవము' అను రెండు ప్రమాణము లున్నవి. రెండవ పక్షములో రసచర్వణ రసాకారచిత్తవృత్తి రూపమంటిమి. అది శబ్దవ్యాపారమున నేర్పడు నది కనుక శాబ్ది యనఁ దగును. (పరోక్ష మనుట.) ఎవనికి వానికి నా సుఖ మనుభవములో గోచర మగుచుండును గనుక నపరోక్షస్వరూప మైనదియు నగును. 'ఒకటియే పరోక్షాపరోక్షము' నగుట యెట్లందురా? 'అది విరుద్ధము గదా' యందురా? "తత్త్వ మసి" యను వాక్యము నుండి యేర్పడు బుద్ధియందుఁ బరోక్షత్వము, నపరోక్షత్వము నంగీకరించుట లేదా?' యని యభినవగుప్తపాదులు దెలిపిరి.



# ఆంధ్ర రసగంగాధరము

## ౧౨. భట్టనాయక మతము

సంస్కృత మూలము

భట్టనాయకాస్తు - తాటస్థ్యేన రసప్రతీతా వనాస్వాద్యత్వం, ఆత్మగతత్వే న తు ప్రత్యయో దుర్ఘటః ; శకున్తలాదీనాం సామాజికా ప్రతి అవిభావత్వాత్ ; వినా విభావ మనాలమ్బనస్య రసాదే రప్రతిపత్తేః · న చ కాన్తాత్వం సాధారణ విభావతావచ్ఛేదక మ స్త్రీతి వాచ్యం; అప్రామాణ్య నిశ్చయా నాలిఙ్గి తాగమ్యాత్వ ప్రకారక జ్ఞానవిరహస్య * విశేష్యతా సమ్బన్ధావచ్ఛిన్న ప్రతియోగితా కస్యవిభావ తావచ్ఛేదక కోటావవశ్యం నివేశ్యత్వాత్, అన్యథా స్వస్రాదే రపి కాన్తాత్వాదినా తత్త్వాపత్తేః ; ఏవ మశోచ్యత్వకాపురుషత్వాది జ్ఞానవిరహస్య తథావిధస్య కరుణరసాదే, తాదృశ జ్ఞానా నుత్పాదస్తు తత్ప్రతిబన్ధకాన్తర నిర్వచన మన్తరేణ దురుపాదః ; స్వాత్మని దుష్యన్తా ద్యభేదబుద్ధి రేవ తథేతి చేత్, న, నాయకే ధరాధౌరేయత్వ ధీరత్వాదేః, ఆత్మని చ ఆధునికత్వ కాపురుషత్వాదే రై్వధర్మ్యస్య స్ఫుటం ప్రతిపత్తే రభేద బోధ స్యైవ దుర్లభత్వాత్.

తెనుఁగు తాత్పర్యము

ఇఁక భట్టనాయకులు రసము (స్వగతముగనో, పరగతముగనో గోచరము గాకుండ) తటస్థముగఁ బ్రతీతిలో గోచర మగుచో రుచింపదు పోనీ, స్వగతముగనే గోచరము గారాదా ? అది దుర్ఘటము శకుంతల మొదలగు వారు

సామాజికుల (శృంగారమున) కు, విభావములు గావు గదా. పోనీ, వారిని వీడు మందురా ? విభావమును వీడినచో సాధారణము చేసి రసాదులు స్ఫురింపవు. (అటు దుష్యంతాదులకు, నిటు సామాజికులకుం గూడ) ఆమె కాంత యగుట సమానమే కనుక దానినే విభావతానిర్ణాయకముగ స్వీకరింపవచ్చు గదా యందురా ? 'ఈకాంత నాకుఁ బొంద దగదు. ఇది సత్యము' అను నిశ్చయము విశేష్యతా సంబంధమున లేనప్పుడే శృంగారములో విభావముగా నిర్ణయింపఁ దగును. అట్లు కాదేని (స్త్రీ యయినంతమాత్రమున శృంగారములో విభావముగ నగుచున్నచో) తోడఁ బుట్టినది మొదలగు వారు గూడ స్త్రీలే కనుక సామాజికునకు) విభావము గావలసివచ్చును. ఇట్లే కరుణములోఁ గూడ ఉపేక్షింప కుండుట, కాపురుషుఁ డగుట మొదలగునవి వెనుకటి వారిఁ దెలియ రాకుండవలెను. అప్పుడే కరుణ రసాదులందు విభావముగ నిర్ణయింప నగును. (ఇతనినిఁ గూర్చి మనము విచా రింపఁ దగదు. ఇతఁడు మంచివాఁడు గాడు అని తోచినచో మనకు జాలి కలుగదు గదా. అట్లు తోచుటచేతనే కస రావణుఁడు మొదలగు వారిని గురించి మనకు జాలి కలుగుట లేదు. ప్రకృతములో శకుంతలాదుల విషయములోఁ బొంద దగనిది యను నీరీతిబుద్ధి సహజముగనే కల్గును గదా.) అట్టి బుద్ధి కలుగ కుండుట కేదైన నొక యడ్డము నిరూపింపకున్నచోఁ గుదురదు. పోనీ, తనకును దుష్యంతాదులతో నభేదబుద్ధి వలన పైఁ జెప్పిన బుద్ధి కలుగ దనఁదగదు. అసలా యభేదబుద్ధియే మనకు దుర్లభము. ఏ మందురా ? 'దుష్యంతాదు లేనాఁడో భూచక్రమునంతను బాలించిన వారు, ధీరులు; తానో, యీనాఁటివాఁడను, అల్పుఁడను' అను భేదము స్పష్టముగ గోచర మగుచుండఁగ భేదము లే దను తలంపెటుల కల్గును ?

శ్రీశర్వాణి :

* ఇట విశేష్యతా సంబంధము — సమవాయ మని నాగేశుఁడు వ్యాఖ్యానించినాఁడు. అది తప్పు. అగమ్యాత్వ ప్రకారముగాఁ గల జ్ఞానము 'ఈకాంత యగమ్య' యనునది. అట విశేష్యము కాంత. విశేష్యతా సంబంధముతో నాజ్ఞానము కాంతయం దుండును. అది లేనప్పు-డాజ్ఞానము నందలి ప్రతియోగిత విశేష్యతా సంబంధముచే నవచ్ఛిన్న మగును గనుక విశేష్యతా సంబంధావచ్ఛిన్న ప్రతియోగితాక, మాజ్ఞానాభావ మగును గాని సమవాయమున కిట నెట్టి ప్రసక్తియు లేదు.

సంస్కృత మూలము :

కించ కేయం ప్రతీతిః ? ప్రమాణాన్తరానుపస్థాపాచ్ఛాబ్దీతి చేత్; న; వ్యావహారిక శబ్దాన్తరజన్య నాయక మిథున వృత్తాన్తవిత్తీనామి వాస్యా అస్య హృద్యత్వాపత్తేః; నాపి మానసీ; చిన్తోపనీతానాం తేషామేవ పదార్థానాం మానస్యాః ప్రతీతేః అస్యాః వైలక్షణ్యోప లమ్భాత్ : న చ స్మృతిః; తథా ప్రాగననుభవాత్; తస్మాదభిధయా నివేదితాః పదార్థాః భావకత్వ వ్యాపారేణ అగమ్యాత్వాది రసవిరోధి జ్ఞానప్రతిబన్ధద్వారా కాన్తాత్వాది రసానుకూల ధర్మపురస్కారేణ అవస్థా ప్యన్తే. ఏవం సాధారణీకృతేషు దుష్యన్త శకున్తలా దేశకాలవయో వస్థాదిషు, పశ్చాత్ పూర్వవ్యాపార మహిమని, తృతీయస్య భోగకృత్త్వ వ్యాపారస్య మహిమ్నా నిగీర్ణయో రజస్తమసో రుద్రిక్తసత్త్వజనితేన నిజ చిత్స్వభావ నిర్వృతి విశ్రాన్తి లక్షణేన సాక్షాత్కారేణ విషయీ కృతః భావనోపనీతః సాధరణాత్మా రత్యాదిః స్థాయీ రసః; తత్ర భుజ్యమానో రత్యాదిః రత్యాదిభోగో వేత్యుభయమేవ రసః; సోయం భోగో విషయ సంవలనాత్. బ్రహ్మాస్వాద సవిధవర్తీ త్యుచ్యతే; ఏవం త్రయోంశాః కావ్యస్య = 'అభిధాభావనా చైవ తద్భోగీకృతి రేవ చ ఇత్యాహుః ; మతస్యైతస్య పూర్వస్మాన్మతాత్ భావకత్వ వ్యాపా రాన్తర స్వీకార ఏవ విశేషః; భోగస్తు వ్యక్తిః; భోగకృత్త్వం తు వ్యఞ్జనా దవిశిష్టం; అన్యాతు సైవ సరణిః.

తెనుఁగు తాత్పర్యము :

మఱి, యీ రసప్రతీతి యేమిటి ? ప్రమాణాంతరము లేమియు నిట సన్నిహితములు గావు గనుక శబ్దజన్యమైన ప్రతీతియే యందురా? మామూలుగా మాటాడు మాటలలో నాయికానాయకుల సమావేశము విన్నప్పుడు రుచింపనట్లే; కావ్యమునుండి తెలిసినను రుచింపక పోవలెను. (రెండుచోటులఁ దెల్పునది శబ్దమే కదా?) అయితే కావ్యశబ్దము వలనఁ గలుగు నీప్రతీతి రుచించుచున్నది కనుక, మామూలు రకము గాక యిది యొకక్రొత్తదైనది. పోనీ, మానసిక

ప్రతీతి యెందువలన? ఈ దుష్యంతాది పదార్థములను గూర్చియే కేవలముగ మనసులో నాలోచించు నప్పటికన్న, నీకావ్యము వినునప్పటి మానసిక ప్రతీతి విలక్షణముగ ననుభవ మగుచున్నదే. కానీ స్మృతి యెందువలన? ఇదివరలో నీవిధ మైన యనుభవ మేది? (అనుభవము లేనిదే స్మృతి కలుగదు గదా.) కనుక, కావ్య మభిధావ్యాపారముతో నివేదించిన పదార్థములు సహృదయులచే భావితము లగును. అపుడా భావనావ్యాపారము రసప్రతిబంధక మగు నగమ్యత్వ జ్ఞానము 'పొందదగదు' అను దానిని ద్రోసివైచి రసానుకూలము లగు కాంతాత్వాది ధర్మములతోఁ బైపదార్థములఁ జేర్చి విడుచు. ఇట్లు దుష్యంతుఁడు, శకుంతల దేశకాలములు, వయసు, అవస్థ మొదలగునవి యీ భావనావ్యాపార మహిమముచే నందఱకును సాధారణము లగును. ఇట్లు సాధారణములుగాఁ జేసి యీ భావనావ్యాపారమహిమ విజృంభించి రజస్తమస్సుల ద్రొక్కివైచి సత్త్వము నుద్రేకించును. అపుడు చిద్రూప మైన తనస్వభావము సుఖమే కనుక దాని పర్యవసానరూప మైన సాక్షాత్కారము నా సత్త్వ ముద్రేకించి కల్పింపఁగా నందులో భాసించే, సాధారణ రూపమున సంచరింపఁ బడి గోచర మగు రత్యాది స్థాయిభావమే రసము. ఈ భోగీకరణములో ననుభవింపఁబడు రత్యాదికము గానీ, రత్యాది భోగము గానీ రస మగును. ఈభోగము (విభావాది విషయములతో మిళితము గనుక, బ్రహ్మాస్వాదము గాక) బ్రహ్మాస్వాదమునకుఁ జేరువగా నుండు నందురు. ఈతీరునఁ గావ్యములో నభిధయు, భావనయు, భోగీకృతియు నను మూఁడంశము లుండు ననిరి. వెనుకటి మతమునకన్న నీమతమునందు విశేష మేమనఁగా 'భావన' యను క్రొత్తవ్యాపారము నొకదానిని స్వీకరించుటయే. భోగ మనఁగా వ్యక్తి. భోగకృత్త్వమునకు, వ్యంజనకు భేదము లేదు. మిగిలిన దంతయు వెనుకటి త్రోవయే.

శ్రీ శర్వాణి :

సాధారణరూప మనఁగా : శకుంతలరతి యని కానీ, దుష్యంతుని రతి యని కానీ, యెట్టి విశిష్టసంబంధమును లేక 'రతి' మాత్రముగ గోచరించుట. కడమ వగు హాసాది స్థాయిభావములందు నిదే విధముగ గ్రహింప వలెను. ఇట నీ విశేషము గ్రహింపవలెను. సత్త్వరజస్తమస్సు లుద్రేకించుట వలనఁ గ్రమముగ సుఖదుఃఖమోహము లుదయించును. అందు, నిచటి సుఖము విషయానుభవజన్యముగాదు. కనుక నొకవిశేష మిట

నున్నది. రజస్తమోదశలందు విషయములు సామాన్యరూపమునఁ గాక విశిష్టరూపమున గోచరించును. అవిశేషములే - నీది, నాది, యితరులది, మొదలైన రూపములై నుండు నది మనకు దుఃఖమోహాదులఁ గల్గించును. "అయం నిజః పరో వేతి గణనా లఘుచేతసామ్' అన్న దానిసారాంశ మదే. ఇఁక సత్త్వదశలో వానియం దుండు అవిశేషములు = దుఃఖమోహాదులు ; తొలఁగి కేవలముగ సామాన్యాకారమున ననుభవ మగును. అదియే "ఉదారచరితానాం తు వసుధైవ కుటుమ్బకమ్" అనుటలోని రహస్యము. ఉదారచరితులు సాత్త్వికులే కాఁగా, సత్త్వ ముద్రేకించి రజస్తమస్సులను గ్రమ్మివైచి, విశేషములు దొలఁగినదశలో నానందము ప్రకాశించును. ఆయానందరూప మైన సంవిత్తు యొక్క యనుభవము సాక్షాత్కార రూపమున నుండును. అపుడితర మేమియు భాసింపదు. "యత్ర త్వస్యసర్వ మాత్మైవాభూత్ తత్కేన కిం పశ్యతి" యన్న దశవంటిదే యిది. ఇదే భోగము. విషయాంతరానుభూతివలనఁ గలుగు లౌకిక మగు సుఖాంతరమున కన్న నిది విలక్షణము. ఈభోజకత్వము వెనుకటి మతములోని వ్యంజన స్థానములో నిల్చును. కాఁగా, నిట శకుంతలాదులను (విభావాదులను) సాధారణముగా నొనరించు భావనావ్యాపారమే క్రొత్తది.

2. ఈమతములో రసానుభవ మెట్లు కలుగు నను ప్రశ్నమే విచారింపఁ బడినది. కాని, యసలు ప్రకృత మైన రసతత్త్వముఁ గూర్చి యేమియు విచారణ లేదు. నిరూపణమును లేదు. ఇదియే యీమతము నందుఁ గల యస్వారస్యము.



# ఆంధ్ర రసగంగాధరము

## ౧౩. నవ్య మతము

సంస్కృత మూలము.

నవ్యాస్తు కావ్యే నాట్యే చ కవినా నటేన ప్రకాశితేషు విభావాదిషు వ్యఞ్జనావ్యాపారేణ దుష్యన్తాదౌ శకున్తలాది రతౌ గృహీతాయామనన్తరం చ సహృదయతోల్లాసితస్య భావనావిశేషరూపస్య దోషస్య మహిమ్నా కల్పిత దుష్యన్తత్వావచ్ఛాదితే స్వాత్మన్యజ్ఞానావచ్ఛిన్నే శుక్తికాశకల ఇవ రజతఖణ్డః సముత్పద్యమానోఽనిర్వచనీయః సాక్షిభాస్య శకున్తలాది విషయికరత్యాదిరేవ రసః; అయం చ కార్యో దోషవిశేషస్య; నాశ్య శ్చ తన్నాశస్య స్వోత్తరభావినా లోకోత్తరాహ్లాదేన భేదాగ్రహాత్ సుఖపదవ్యపదేశ్యో భవతి; స్వపూర్వోపస్థితేన రత్యాదినా తదగ్రహాత్ తద్రతిత్వే నైకత్వాధ్యవసానాద్వా వ్యఙ్గ్యో వర్ణనీయ శ్చోచ్యతే; అవచ్ఛాదకం దుష్యన్తత్వ మప్యనిర్వచనీయ మేవ; అవచ్ఛాదకత్వం చ రత్యాది విశిష్టబోధే విశేష్య తావచ్ఛేదకత్వం, ఏతేన - "దుష్యన్తాది నిష్ఠస్య రత్యాదే రనాస్వాద్యత్వా న్న రసత్వం; స్వనిష్ఠస్య తు తస్య శకున్తలాదిభి రత త్సమ్బన్ధిభిః కథ మభివ్యక్తిః; స్వస్మిన్ దుషన్తా ద్యభేదబుద్ధి స్తు బాధబుద్ధిపరాహతా" ఇత్యాదిక మపాస్తం; యదపి విభావాదీనాం సాధారణ్యం ప్రాచీ నై రుక్తం తదపి కావ్యే న శకున్తలాది శబ్దైః శకున్తలాత్వాది ప్రకారకబోధజనకైః ప్రతిపాద్యమానేషు శకున్తలాదిషు దోషవిశేషకల్పనం వినా దురుపపాదం, అతోఽ

వశ్యకల్ప్యే దోపవిశేషే తే నైవ స్వాత్మని దుష్యన్తాద్యభేదబుద్ధి రపి సూపపాదా.

నవ్యేవ మపి రతే ర్వస్తు నామ దుష్యన్త ఇవ సహృదయేపి సుఖవిశేషజనకతా ; కరుణరసాదిషు తు స్థాయినః శోకాదేః దుఃఖజనకతయా ప్రసిద్ధస్య కథ మివ సహృదయాహ్లాదహేతుత్వం ప్రత్యుత నాయక ఇవ సహృదయేఽపి దుఃఖజననస్యై వౌచిత్యాత్ ; న చ సత్యస్య శోకాదేః దుఃఖజనకత్వం క్లృప్తం నకల్పితస్యేతి నాయకానామేవ దుఃఖం న సహృదయ స్యేతి వాచ్యం ; రజ్జుసర్పాదేః భయకమ్పాద్యనుత్పాదకతాపత్తేః; సహృదయే రతే రపి కల్పితత్వేన సుఖజనకతాఽనుపపత్తే శ్చేతి చేత్; సత్యం; శృఙ్గార ప్రధాన కావ్యేభ్య ఇవ కరుణ ప్రధాన కావ్యేభ్యో ఽపి యది కేవలాహ్లాద ఏవ సహృదయహృదయ ప్రమాణకః తదాకార్యానురోధేన కారణస్య కల్పనీయత్వా ల్లోకోత్తర కావ్యవ్యాపార స్యైవ ఆహ్లాదప్రయోజకత్వ మివ దుఃఖప్రతిబన్ధకత్వ మపి కల్పనీయం; అథయద్యాహ్లాద ఇవ దుఃఖమపి ప్రమాణసిద్ధం తదా ప్రతిబన్ధకత్వం నకల్పనీయం ; స్వస్వకారణవశా చ్చోభయ మపి భవిష్యతి : అథ తత్రకవీనాం కర్తుం, సహృదయానాం చ శ్రోతుం కథం ప్రవృత్తిః ? అనిష్టసాధనత్వే నవివృత్తే రుచితత్వాత్, ఇతి చేత్ ; ఇష్టస్యాధిక్యా దనిష్టస్య చ న్యూనత్వా చ్చన్దనద్రవ లేపనాదా విన ప్రవృత్తే రుపపత్తేః ; కేవలాహ్లాదవాదినాం తు ప్రవృత్తి రప్రత్యూ హైవ; అశ్రుపాతాది యోఽపి తత్త దాస్వాదానుభవ స్వాభావ్యాత్, న తు దుఃఖాత్.

అత ఏవ భగవద్భక్తానాం భగవద్వర్ణనాకర్ణనా దశ్రుపాతాదయ ఉపపద్యన్తే ; న హి తత్ర జాత్వపి దుఃఖానుభవోఽస్తి ; న చ కరుణరసాదౌ - స్వాత్మని శోకాది మద్దశరథాది తాదాత్మ్య రోపేయద్యాహ్లాదః తదా స్వప్నాదౌ సన్నిపాతాదౌ వా స్వాత్మని తదారోపేఽపి స స్యాత్ ;అనుభవికం చ తత్ర కేవలం దుఃఖం ఇతీ హాపి తదేవయుక్త మితి వాచ్యం ; అయం హి లోకోత్తరస్య కావ్యవ్యాపారస్య మహిమా;

యత్రప్రయోజ్యా అరమణీయా అపి శోకాదయః పదార్థాః ఆహ్లాద మలౌకికం జనయన్తి; విలక్షణో హి రమణీయః కావ్యవ్యాపారజ ఆస్వాదః ప్రమాణాన్తరజా దనుభవాత్ జన్యత్వం చ స్వాత్మన్యభావనాజన్య రత్యాది విషయకత్వం చ; తేన రసాస్వాదస్య కావ్యవ్యాపారజన్యత్వేఽపి న క్షతిః; శకున్తలా దావగమ్యా త్యజ్ఞానోత్పాదస్తు స్వాత్మని దుష్యన్తా వ్యభేద బుద్ధ్యా ప్రతిబధ్యతే ఇత్యాహుః.

తెనుఁగు తాత్పర్యము :

నవ్యు లయితే – కావ్యమునందైనను, నాట్యమునందైనను కవి గానీ, నటుఁడు గానీ, విభావాదులను బ్రకాశింపఁ జేయఁగా, దుష్యంతుఁడు మొదలగు వారి యందు శకుంతలాదుల రతివ్యంజనచే గోచరించును పిమ్మట సహృదయత్వము వలన విశిష్టమైన భావనావ్యాపార ముత్పన్నమగా నది దోషమై తనశక్తి వలన సహృదయుని యందు దుష్యంతత్వము నాచ్ఛాదకముగఁ గల్పించును. అనఁగా : సహృదయుఁడు 'తాను దుష్యంతుఁడు' అనుకొనును. అందువలన నతనివ్యక్తిత్వ మాచ్ఛాదిత మగును. అపు డజ్ఞానాచ్ఛాదిత మైన యాత్మయం దనిర్వచనీయము లైన రత్యాదు లుదయించి సాక్షి వలన భాసించును. అట్లు భాసించు రత్యాదికమే రసము

ఈరత్యాదికము పైఁ జెప్పిన దోషవిశేషముఁ (భావన) పుట్టినఁ బుట్టును. అది గిట్టిన గిట్టును. తన తరువాతఁ గలుగు లోకోత్తర మైన యాహ్లాదము తోడి భేద మెఱుక పడకుండుట వలన సుఖ మనఁ దగును. తనకుఁ బూర్వ మున్న (వాస్తవ శకుంతలా దుష్యంతుల) రత్యాదికముతో = వ్యంజనచే గోచరించు శకుంతలా దుష్యంతుల లౌకికరత్యాదికముతో; దీనికి – ఈయలౌకిక మగు రత్యాదికము నకు భేదము దెలియక కానీ, యదియే యని యొకటిగా నధ్యవసించు కొనుటవలనఁ గానీ వ్యంగ్య మనియు, వర్ణనీయ మనియుఁ జెప్పఁబడును. ఈయవచ్ఛాదక మగు దుష్యంతత్వము గూడ ననిర్వచనీయమే. (ఇది యిట్టిది యని చెప్పుటకు వీలు గానిదే.) ఇట వచ్ఛాదకత్వ మనఁగా : 'రత్యాదులతో విశిష్టుఁ' డను బోధమున విశేష్యతను నిర్ణయించునది. (ఇది ముందు దెలియును.)

ఇందువలన నీచెప్పఁబోవు నాక్షేపము దొలఁగినది. "దుష్యంతాదులందుండు రత్యాదికము వ్యక్తి కాలవ్యత్యాసములవలన సహృదయున కనుభవములోనికి రాదు. కనుక నది రస మగుట కుదురదు. పోనీ, తనకు (సహృదయునకు) సహజముగా నుండు రత్యాదికమును శకుంతలాదులువ్యక్తమొనర్పలేదు. వారు దానికి సంబంధింపరుగదా. 'తాను దుష్యంతుఁడు' అను నభేదబుద్ధి కలుగదు. 'తాను దుష్యంతుఁడు గాదు' అనుబాధ బుద్ధి యుండనే యున్నది కదా?" అను నీరీతి దంతయుఁ ద్రోసివేయఁబడినది.

ప్రాచీనులు శకుంతలాది విభావము లంతటికిఁ గూడి సాధారణములే యనినారు. అది కూడఁగుదుర వలె ననుచో నట నేదైన దోషవిశేషముఁ గల్పించియే తీరవలెను. ఏమంటే? కావ్యములలోని శకుంతలాది శబ్దములు శకుంతలాత్వము మొదలగు విశిష్టధర్మములతో (నాయికలను) దెలుపును. ఆవిశిష్టధర్మములతో నుండు వా రవిశిష్టులుగ సహృదయుల కెట్లగుదురు? అవిశిష్టులుగనే కాక తప్ప దన్నపుడు వైశిష్ట్యముఁ దొలఁగించుటకై యేదైన నొకదోషవిశేషముఁ గల్పింపక తప్పదుగదా. ఆదోషమే తనయందు దుష్యంతాదులతోడి యభేద బుద్దినిఁ గూడఁ గల్గించు నని సులువుగనే కుదురును. అయితే, యీరీతిలో రతి దుష్యంతాదులందు వలె సహృదయునియందుఁ గూడ నాహ్లాదవిశేషమును గల్పించు ననుట యొప్పును. కాని, కరుణరసము మొదలగు వానివిషయములో స్థాయిభావ మగు శోకాదికము దుఃఖాదులను గల్గించుట ప్రసిద్ధము గదా. అది సహృదయున కాహ్లాదము నెట్లు కల్పించును? మీఁదు ఓక్కాలి నాయకునియందు వలె సహృదయునియందుఁ గూడ దుఃఖమునే కలిగించుట యుచితము. 'వాస్తవ మగు శోకమే దుఃఖముఁ గలిగించును గాని కల్పిత మైనది కాదు కనుక, నాయ కాదులకే కాని సహృదయులకుఁ గాదు—'అనుట తగదు. త్రాడునందుఁదోచు సర్ప భ్రాంతియు, నందుచేఁ గలుగు భయకంపాదులు మొదలగునవి కలుగకపోవలసి వచ్చును. అదికాక, రతి కూడ సహృదయునియందుఁ గల్పితమే కనుక సుఖము గూడఁ గలుగబోవలసివచ్చును.' అని యనియెదరా? నిజమే కాని, శృంగారము ప్రధానముగ నుండు కావ్యములనుండి కేవలముగ నాహ్లాదమే యనుభవ మగు చున్నట్లుగఁ, గరుణరస ప్రధానము లగు కావ్యములనుండి కూడ కేవలముగ నొక్క యాహ్లాదము మాత్రమే యనుభవ మగుచున్నది యని సహృదయుల హృదయములు ప్రమాణించు నేని కార్యముఁ బట్టి కారణముఁ గల్పించు

కొనక తీరదు కనుక లోకోత్తర మగు కావ్యవ్యాపార మాహ్లాదము గల్గించు నన్నట్లుగ దుఃఖము బ్రతిబంధించు ననియుఁ గల్పించుకొనవలెను. అట్లు గాక యాహ్లాదమువలె దుఃఖముగూడఁ (కరుణ గంధములందు) బ్రామాణిక మైన యెడల (కావ్యవ్యాపారమునకు దుఃఖముఁగూర్చి) ప్రతిబంధకత్వముఁ గల్పింప రాదు. తదుపకారణములవలన రెండును ఏర్పడును. అయితే – 'కరుణ కావ్యము దుఃఖజనక మగుచో నట్టి కావ్యమును రచించుటకుఁ గవు లేల ప్రయ త్నింతురు? సహృదయు లేల వినవలతురు? అనిష్టము, దుఃఖము గదా యాకావ్య మునుండి యేర్పడును? దానినుండి నివృత్తు లగుట కదా యుచితము?' అందురా?

నిజమే. కాని, యటఁ గరుణకావ్యములం దిష్ట మగు నాహ్లాద మెక్కు వగా నుండును. అనిష్ట మగు దుఃఖము తక్కువగా నుండును. కనుకఁ బ్రవర్తింతురు. (గంధము దీయుట శ్రమ యైనఁ, బూసికొనుటవలనఁ జలి కలిగి, నారినపిమ్మట నుసినుసిగా రాలిపోయినఁ గూడ) గంధము బూసి కొనుటలేదా? కేవల మొక్కయాహ్లాదమే కలుగునను వా రిటుఁ బ్రవర్తించుట కద్దు మే లేదు. ఈకరుణకావ్యముల విను నపుడు గనులవెంట నీరు కారుట మొదలగునవి యాయానంద మనుభవించుటలో సహజములే కాని, యవి దుఃఖమునుండి కలి నవి కావు. ఇందుచేతనే భగవంతుని కథలు వినునపుడు తద్భక్తులకుఁ గనుల నీరు కారుట మొదలగునవి సరిపడును. అచట నొకపుడు గూడ దుఃఖ మను భవములో లేదు గదా ?

'ఏమయ్యా! కరుణకావ్యముల యొద్ద శోకించు దశరథాదుల తోడి తాదా త్మ్యము సహృదయుఁడు దనయం దారోపించుకొను ననియు, నందుచే నతని కాహ్లాదముఁ గలుగు ననియుఁ గదా మీవాదము? అట్లగుచో, గలలు మొదలగు వానిలోఁ గానీ, సన్నిపాతాదులలోఁ గానీ యట్టియారోపము తనయందుఁ గలుగును గదా. ఆహ్లాదము గలుగ దేమి? అటఁ గేవలము దుఃఖము మాత్రమే యందఱి యనుభవములో నుండు నేమి? కనుక, నీ కరుణకావ్యములయొద్ద గూడ దుఃఖానుభవమే తగును' అందురా?

ఇటఁ గేవల మాహ్లాదమే కలుగుట లోకోత్తర మగు కావ్యవ్యాపార మహిమయే. దానివలననే లోకములో రమణీయములు గాకున్నను శోకాదు లగు పదార్థము లలౌకిక మగు నాహ్లాదముఁ గల్గించును. కడమప్రమాణముల నుండి కలుగు నను భవమునకన్న నీకావ్యవ్యాపారమునఁ గల్గు నాస్వాదము విలక్షణ మై రుచించును. ఇది కావ్యవ్యాపారమునఁ గల్గుట యనఁగా: కావ్యవ్యాపారము = అభిధాదికమువలన భావనావ్యాపార మేర్పడి దానివలనఁ గలుగు రత్యాదుల

గోచర మొనర్చుట. ఇపుడు రసాస్వాదము కావ్యవ్యాపార మగు నభిధాదికము వలనఁ గలుగ కున్నను ఇబ్బంది లేదు 'శకుంతలాదులను దాను పొందఁ దగదు' అనుజ్ఞాన మేల యేర్పడ దన్నచోఁ దాను (సహృదయుఁడు) దుష్యంతుఁడ నను అభేదభావ ముండుట 'ప్రతిబంధకము' * అందుచు

శ్రీశర్వాణి :

* ఈ మతములో భావనవలన విశిష్ట మగు దుష్యంతత్వము కల్పిత మగు నపుడు శకుంతలాదులందు శకుంతలాత్వాదులు విశిష్టధర్మము లె ట్లుపనీతము లగును? దోషము కదా యది? ప్రతిదానికి నేదో యొకటియే స్వభావ ముండును గనుక నిది కల్పించు నందురా? సహృదయునియందు దుష్యంతత్వము గల్పించునట్లుగ, శకుంతలాదులందు మఱి యేదైన వానియం దుండని ధర్మముఁ గల్పింపవలెను అంతియే కాని, సహృదయునియందు సహృదయత్వముఁ దీసివేయు నట్లుగ శకుంతలాదుల యందు శకుంతలా త్వాదుల దీసివేయు నవకాశము లేదు. సాధారణుఁ డైన సహృదయుని యందు దుష్యంతత్వాదిక మను విశిష్టధర్మముఁ గల్పించినట్లు శకుంతలాదుల యందు నింకొక విశిష్టధర్మముఁ గల్పింప వలయుఁ గాని విశిష్టధర్మ మగు శకుంతలాత్వము దీసివైచి కాంతాత్వ మను సాధారణ ధర్మముఁ గల్పింప వీలుపడదు. కాంతాత్వ మచట సహజమే. కనుక దానిఁ గల్పింప వీలుపడదు.

* ఇఁక భట్టనాయకమతమునందు భావన, శకుంతలాత్వాదిక మగు విశిష్టధర్మమును వలె సహృదయునియం దతని ప్రత్యేక వ్యక్తిత్వముఁ దొలఁగించి సాధారణీకరణ మొనర్చును సహృదయునియందు, శకుంతలా దుల యందుగూడ దీని కొక్కటే స్వభావము. విశిష్టధర్మము దొలఁగించి సాధారణీకరణ మొనరించుట. ఈనవ్యమతమునం దట్లులేదు, అంతియేగాక, కావ్యమునందుఁ గాని, రసానుభవ విషయమునందుఁ గాని భావన దోష మనుట గడమవా రెవ్వ రంగీకరింపరు. అంగీకరింపఁ దగదుకూడ. ఏమనఁగా : రసానుభవముతో సమానయోగక్షేమ మగు బ్రహ్మానుభవము నందుఁ గూడ భావనను దోషమే యనవలసి వచ్చును అది "మన్తవ్యో నిధి ధ్యాసితవ్యః" అను శ్రుతికి విరుద్ధము. శ్రుతి దోష మొనర్పు మనదు గదా ? యని యస్వారస్యము. ఇఁక భట్టనాయకమతములో 'రసానుభవ మెట్టు లని విచారణయే కాని, రసస్వరూపమును, ప్రస్తుతమును గూర్చిన విచారణయే లేదు' అని యస్వారస్యము.

---

# ఆంధ్ర రసగంగాధరము

## ౧౪. పరమతములు

సంస్కృత మూలము

పరే తు - 'వ్యఞ్జనవ్యాపారస్య అనిర్వచనీయఖ్యాతే శ్చా నభ్యుపగ మేపి ప్రాగు_క్తదోష మహిమ్నా స్వాత్మని దుష్య_న్తాది తాదాత్మ్యావగాహీ శకు_న్తలాది విషయిక రత్యాది మదభేదబోధో మానసః కావ్యార్థ భావనా జన్మా విలక్షణవిషయతా శాలీ రసః ; స్వప్నాది _స్తు తాదృశ బోధో న కావ్యార్థ చి_న్తన జన్మేతి న రసః, తేన తత్ర న తాదృశాహ్లాదా ప_త్తిః , ఏవ మపి స్వస్మిన్ నవిద్యమానస్య రత్యాదే రనుభవః కథం నామ స్యాత్ ; మైవం ; న హ్యాయం లౌకిక సాక్షాత్కారః రత్యాదేః, యేన అవశ్యం విషయసద్భావో ఒపేక్షణీయ స్యాత్ ; అపి తు భ్రమః; 'ఆస్వాదస్య రసవిషయకత్వ వ్యవహార_స్తు రత్యాది విషయక త్వాలమ్బనః' ఇత్యపి వద_న్తి ;

ఏతై_ శ్చ స్వాత్మని దుష్య_న్తత్వ ధర్మితావచ్ఛేదక శకు_న్తలాది విషయక రతి విశిష్ట దుష్య_న్త తాదాత్మ్యావగాహీ, స్వాత్మత్వ విశిష్టే దుష్య_న్తత్వ శకు_న్తలావిషయక రత్యో ర్వైశిష్ట్యావగాహీ వా త్రివిధోపి బోధో రసపదార్థతయాఽ భ్యుపేయః ; తత్ర రతే ర్విశేషణీభూతాయాః శబ్దా దప్రతీతత్వా ద్వ్యఞ్జనాయా శ్చ తత్ప్రత్యాయకాయా అనభ్యుపగమా చ్చేష్టాది లిఙ్గక మాదౌ విశేషణజ్ఞానార్థ మనుమాన మభ్యుపేయమ్.

తెలుఁగు తాత్పర్యము :

ఇతరు లైతే - వెనుకటిమతములో వలె వ్యంజనావ్యాపారము, ననిర్వచనీయఖ్యాతి నంగీకరింపకున్నను వెనుకఁ జెప్పిన 'భావన' యను దోషమహిమ వలన, నెవనికి వానికి 'నేదుష్యంతుఁ డను' అనియు, 'శకుంతలను ప్రేమించినది తానే' యనియు, నొకరకపు దలంపు మనస్సులోనే కల్గును. ఈతలఁపు కావ్యార్థమును భావించుట వలనఁ గలుగును. కనుకనే యిది చాలవిలక్షణముగ గోచర మగును. ఇట్టి యిదియే రసము. స్వప్నాదులందలి తలంపు ఇట్టిది కాదు, కావ్యార్థభావనాబలమునఁ గల్గదు. కనుక నది రసము గాదు. కనుక నిపు డట లోకో త్తర మగు నాహ్లాద మనుభవములో నుండ వలసిన పని లేదు గదా. 'ఇట్లైనను దనయందు లేని రత్యాదు లనుభవ మెట్లగు నయ్యా?' యన్నచో నట్లు గాదు ఇది. రత్యాదులు లోకములో సాక్షాత్తుగ ననుభవ మగుట కాదు. అట్లయినపుడు రత్యాదివిషయము లవశ్యముగ నుండవలసినవే. కాని, యిది భ్రమ. అనఁగా : అవిద్యమానములు, నింద్రియములతో సంబంధించనివియు నగు శకుంతలాదుష్యంతులను గూర్చిన తలంపు. కనుక వాస్తవము లగు రత్యాదు లుండ నక్కఱలేదు అయితే యీయాస్వాదము రసమును గోచరింపఁ జేయుట యెట్లు? రత్యాదులను = స్థాయిభావములను; గోచరించును గనుక నట్లందు రనియుఁ దెల్పుదురు. 1.

వీరు 'నేను దుష్యంతుఁ డను గాన శకుంతలాదులఁ గూర్చిన రతి నాయం దున్నది;' యని కానీ 'నేను శకుంతలాదులను ప్రేమించిన దుష్యంతుఁ డను;' అని కానీ, 'దుష్యంతుఁ డను నేను, శకుంతలను ప్రేమించినది నేను,' అని కానీ, యీమూఁడురకముల తలంపు గూడ 2. రస పదమున కర్థ మని యంగీకరింప వలెను. ఈమతములో నాయికానాయకులకు విశేషణ మైన రతి, శబ్దములనుండి స్ఫురింపదు. దాని స్ఫురింపజేఁయు వ్యంజన నంగీకరింప లేదు గనుక మొట్టమొదటనే (నటాదుల) చేష్టాదులు లింగముగ ననుమానము నంగీకరింప వలెను.

శ్రీ శర్వాణి :

1. 'ఇచట వాచ్యములు గాని రత్యాదు లభిధచే నెట్లు తెలుపఁబడును. అవి తెలుపఁబడ వేని మానసబోధలో గోచర మెట్లగును? స్మృత్యుపనీత మగు నాబోధ కావ్యార్థభావనాజన్య మెట్లగును? ఆభావన

కూడ నభిహితములకే గాని యనభిహితములకుఁ గాదు. అది స్మృతి రూపము గదా. రతి యననుభూత మగు నది స్మృతిలో నెట్లు గోచర మగును ?' అను దోష మీమతమున నందున్నది.

2. ఈమూఁడు తలంపుల తాత్పర్య మొకటే. మొదటిదానిలో రతి వైశిష్ట్యము విధింపఁబడినది దుష్యంతత్వము ధర్మితను నిర్ణయించును. రెండవదానిలో, శకుంతలఁ బ్రేమించిన దుష్యంతునితోడి తాదాత్మ్యము దన యందు విధింపఁ బడినది. ఇట నహంత్వము ధర్మితను = విశేష్యతను, నిర్ణయించును. మూఁడవదానిలో దుష్యంతత్వమును, శకుంతలఁ గూర్చిన ప్రేమయును రెండును విధింపఁబడినవి. ధర్మితను అహంత్వమే యిట నిర్ణయించునది. ఇట్లు విధేయభేదమే కాని, మూఁడు తలంపులకుఁ దాత్పర్య మొక్కటే. కాఁగా, మొదటిదానిలోఁ దనను దుష్యంతునిగా నిర్ణయించు కొని శకుంతలారతితో విశేషించు కొనును. రెండవదానిలో శకుంతలఁ బ్రేమించిన – శకుంతలా రతిఁ గల దుష్యంతుఁడ నని తనను విశేషించు కొనును. మూఁడవ దానిలో దుష్యంతుఁడుగను, శకుంతలారతి కలవాఁడు గను దననే విశేషించు కొనును. ఈమూఁడింటను రతివిశేషణమే. అది శబ్దమునఁ దెలియదు. వ్యంజన నంగీకరింపరు గనుక నటాదుల చేష్టలు వహ్నికి ధూమమువలె లింగమై యారతినిఁ దెలుపు నని యనుమాన మంగీకరింతురు. దుష్యంతుని యందు శకుంతలాదుల రతి యనుమానము వలన సాధింపఁ బడును. దోషవిశేషబలము తనకు = సహృదయునకు, దుష్యంతునకు నుండు భేదముఁ గ్రమ్మి వైచి పైనఁ జెప్పిన రతిఁగల దుష్యంతునితో గూడఁ దనకును ఏకాత్మతను సాధించును. అపు డా రతిఁగలవాఁడు దానే యను నభేద భావము కల్గును. ఆతలంపే రస మని యీమతకర్త యగు శ్రీశంకుకుని నిర్ణయము.

సంస్కృత మూలము :

ముఖ్యతయా దుష్యన్తాది గత ఏవ రసో రత్యాదిః కమనీయ విభావా ద్యభినయ ప్రదర్శనకోవిదే దుష్యన్తా ద్యనుకర్తరి నటే సమారోప్య సాక్షాత్క్రియతే ; ఇత్యేకే మతేస్మిన్ సాక్షాత్కారో దుష్యన్తోఽయం శకున్తలావిషయక రతిమా నిత్యాదిః, ప్రాగ్వద్ధర్మ్యంశౌ లౌకికః ఆరోప్యాంశే త్వలౌకికః.

తెలుఁగు తాత్పర్యము :

అసలు రత్యాదిక మగు రసము ముఖ్యముగా దుష్యంతాదులందే యుండును. విభావాదులను రుచించున ట్లభినయించు నేర్పు గల నటుఁడు దుష్యం తాదుల ననుకరించునపుడు ఆతనియందు = నటునియందు; ఆరసము నారోపించి సామాజికులు సాక్షాత్కరింతురు' అని యొక రందురు. ఈమతములో దుష్యంతుఁ డీతఁడు, శకుంతలఁ గురించి ప్రీతితో నున్నాఁడు. అని కలుగు నీసాక్షాత్కారము వెనుకటి వలె ధర్మిభాగమున = నటుని విషయములో, లౌకికము. అనఁగా: నటుఁడు వీఁ డని ప్రత్యక్షముగ నగుపడును గనుక * నీసాక్షాత్కార మిట లౌకికము. ఆరోప్యభాగములో మాత్రము (దుష్యంతాద్యంశములో మాత్రము) అలౌకికము. (అతఁడు ప్రత్యక్షముగ లేడు గాన నలౌకికము.)

శ్రీ శర్వాణీ :

* దుష్యంతుని ననుకరించు నటుని చేష్టల వలన నతనిని దుష్యంతుఁ డని యారోపబుద్ధితో గ్రహించి యతనిచేష్టల వలన శకుంతలారతి నతని యం దారోపించి (యనుమానించి) దోషవశమున నటునితోఁ దాను (సహృదయుఁడు) ఐకాత్మ్య మంది రత్యాదికము ననుభవించు ననియు, నాయనుభవములోనే రత్యాదికము రసరూపమునఁ బరిణత మగు ననియు భట్టలోల్లటుని మతము. ఇటఁ బ్రత్యక్ష మగు నటుని తోడి తాదాత్మ్యము వలన రసము ప్రత్యక్ష మగు నని భావము. సామాజికుని యందు రస ముదయింప దని యీమతమున నస్వారస్యముఁ గావ్యప్రకాశికలో మమ్మటుఁడు దెలిపెను.

సంస్కృత మూలము :

దుష్యన్తాదిగతో రత్యాది ర్నటే పక్షే దుష్యన్తత్వేన గృహీతే విభావాదిభిః కృత్రిమై రపి అకృత్రిమతయా గృహీతైః భిన్నే విషయేఽనుమితి సామగ్ర్యాః బలవత్త్వా దనుమీయమానో రసః ; ఇత్యపరే.

తెలుఁగు తాత్పర్యము :

దుష్యంతాదులం దుండు రత్యాదికము దుష్యంతుఁ డని భావింపఁ బడు నటుని పక్షముగ (అనుమానమున కాధారముగ) స్వీకరించి, వాస్తవమునకుఁ గృత్రిమము లైనను (అసహజము లైనను) అకృత్రిమములు (సహజములు) గ. భావింపఁబడు విభావాదులతో నూహింపఁబడునది రసము. వేరు విషయమున ననుమితి సామాగ్రికి బల మెక్కువ కనుక ననుమితియే యేర్పడును; అని యితరులు.



# ఆంధ్ర రసగంగాధరము

## ౧౫. ఇతరమతములు

సంస్కృత మూలము

విభావాదయ స్త్రయ స్సముదితాః, ఇతి కతిపయే

తెలుఁగు తాత్పర్యము

'విభావానుభావవ్యభిచారులు మూఁడు గలసి రసము' అని కొందఱు

సంస్కృత మూలము

త్రిషు య ఏవ చమత్కారీ స ఏవ రసః, అన్యథా త్రయోఽపి న, ఇతి బహవః.

తెలుఁగు తాత్పర్యము

'పై మూఁడింటిలో నేయది చమత్కరించునో యదియే రసము అట్లు గాదేని మూఁడును గూడ రసము గాదు' అని చాలమంది

సంస్కృత మూలము

భావ్యమానో విభావ ఏవ రసః, ఇ త్యన్యే.

తెలుఁగు తాత్పర్యము

'విభావమే భావనలో గోచరమగుచు రసమగును' అని మఱికొందఱు

సంస్కృత మూలము

అనుభావ స్తథా, ఇ తీతరే

తెలుఁగు తాత్పర్యము

'అనుభావము ఆవిధముగ రసము అగును' అని యింక కొందఱు

సంస్కృత మూలము

వ్యభిచా ర్యేవ తథా తథా పరిణమతి, ఇతి కేచిత్

తెలుఁగు తాత్పర్యము

'వ్యభిచారిభావమే క్రమక్రమముగఁ బరిణమించును' అని వేఱొక కొందఱు

౬. విభావాదిభిః కృత్రిమై రపి అకృత్రిమతయా గృహీతైః, సంయోగాత్ = అనుమానాత్, రసస్య-రత్యాదేః, నిష్పత్తిః = అనుమితిః నటాదౌ పక్షే, ఇతి శేషః' ఇతి పక్షే.

౭. 'విభావాదీనాం త్రయాణాం, సంయోగాత్ = సముదాయాత్. రసనిష్పత్తిః = రసపద వ్యవహారః' ఇతి సప్తమే,

౮. 'విభావాదిషు సమ్యగ్యోగాత్ = చమత్కారాత్, ఇ త్యష్టమే, త దేవం పర్యవసితః; త్రిషు మతేషు సూత్రవిరోధః; విభావానుభావవ్యభిచారిణా మేకస్య తు రసా న్తర సాధారణతయా నియత రసవ్యఞ్జకతా ఽనుపపత్తేః సూత్రే మిలితానా ముపాదానం; ఏవం చ ప్రామాణికే మిలితానాం వ్యఞ్జకత్వే యత్ర క్వచిత్ ఏకస్మా దేవ అసాధారణా ద్రసోద్బోధః త త్రేతర ద్వయ మాక్షేప్యం అతో నానైకాన్తికత్వం, ఇత్థం నానాజాతీయాభి ర్న్యైముషీభిః నానారూపతయా ఽవసి తోఽపి మనీషిభిః పరమాహ్లాదా వినా భావితయా ప్రతీయమానః ప్రపఞ్చే ఽస్మిన్ రసో రమణీయతా మావహ తీతి నిర్వివాదమ్, స చ

శృఙ్గారః కరుణ శ్శాన్తో రౌద్రో వీరోఽ ద్భుత స్తథా
హాస్యో భయానక శ్చైవ బీభత్స శ్చేతి తేన వ

ఇత్యుక్తే ర్నవధా, మునివచనం చాత్ర మానమ్;

కేచి త్తు

శాన్తస్య శమసాధ్యత్వా న్నటే చ త దసమ్భవాత్
అష్టావేవ రసా నాట్యే న శాన్త స్తత్ర యుజ్యతే.

ఇ త్యాహుః ; త చ్చాపరే న క్షమన్తే.

తెనుఁగు తాత్పర్యము :

ఆవిషయములో 'విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః' అను భరతముని సూత్రము నాయామతముల కనుగుణముగా వ్యాఖ్యానింతుము.

౧. మొదటి మతములో, విభావానుభావ వ్యభిచారులతోడి సంయోగము = వ్యంజనము, వలన, రసము = చిదానందముతోఁ గూడిన స్థాయిరూప మైనది. లేదా, స్థాయితోఁ గలసి చిదానందరూప మైనది, నిష్పత్తి = స్వరూపముతోఁ బ్రకాశించుట యేర్పడును ; అని.

౨. రెండవ మతములో, విభావానుభావ వ్యభిచారులు, సం = సాధారణము లుగా, యోగము = భావకత్వ వ్యాపారముతో భావించుట, వలన, రసము = సత్త్వోద్రేకముతోఁ బ్రకాశించు స్వాత్మానందము, స్థాయి యను నుపాధితో, నిష్పత్తి = భోగ మను సాక్షాత్కారములో గోచరీక రింపఁ బడును ; అని.

౩. మూఁడవమతములో, విభావానుభావవ్యభిచారులు, సంయోగము వలన = విశిష్ట మగు భావనారూప మైన దోషమువలన, రసము = అనిర్వచనీయ మగు దుష్యంతాదుల రతిరూప మైనది, నిష్పత్తి = ఉత్పత్తి యగును ; అని.

౪. నాల్గవమతములో, విభావాదుల సంయోగము = జ్ఞానము వలన, రసము = జ్ఞానవిశేష రూప మైనది, నిష్పత్తి = ఉత్పత్తి, యగును ; అని.

౫. అయిదవ మతములో, విభావాదుల సంబంధము వలన, రసము = రత్యాది రూప మైనది, నిష్పత్తి = ఆరోపము ; అగును ; అని.

౬. ఆఱవదానిలో, విభావాదులు కృత్రిమము లైనను, అకృత్రిమములుగ గ్రహింపఁబడి, సంయోగమువలన = అనుమానము వలన, రసము = రత్యాదిరూప మైనది, నిష్పత్తి = అనుమితి, యేర్పడును, పక్ష మైన నటాదులయందు అని శేషము ; అని.

౭ ఏడవ దానిలో, విభావాదులు మూఁడును, సంయోగము = సముదాయ ముగఁ జేరుట వలన, రసనిష్పత్తి = రస మనుమాట వాడఁబడు; అని.

౮. ఎనిమిదవదానిలో, విభావాదులయందు చక్కని యోగమువలన = చమ త్కారము వలన ; అని.

ఈవిధ సమన్వయములో నాఱు మొద లెనిమిది వఱ కుండిన మూఁడు మతములయందు భరతసూత్రముతో విరోధ మేర్పడినది. విభావానుభావవ్యభిచా రులలో నొకొక్కటియు రసాంతములకుఁ గూడ సాధారణము గనుక నియత

ముగ నొకరసమునే వ్య క్త మొనర్చుట కుదుర దని భరతసూత్రములో మూఁడు గలిపి స్వీకరింపఁ బడినవి. కాఁగా, నీమూఁడును గలిసియే వ్యంజకము లగుట ప్రామాణికము. ఎక్కడ నయిన నొకచో నీమూఁడింటిలో నేదో యొక్కటియే యుండి, విశిష్టముగ రసము నుద్బోధించుచోఁ గడమ రెండు గూడ నచట కాక్షింప వలసిన దే. ఇందుచే మూఁడును లేనిదే రస మెట్లు నిష్పన్న మైన దను వ్యతిరేకవ్యభిచారము రాదు. ఈరకముగ విద్వాంసులు, వారివారి బుద్ధులు నానారీతులుగఁ బ్రసరించి, నానారూపముగ నిర్ణయించినను, పరమ మైన యాహ్లాదము విడువకుండఁగనే గోచరించుచుండు రస, మీజగమున లోకోత్తర మగు రమణీయత్వము నొదవించు ననుటలో నేయొక్కరికిని వివాదము లేదు. ఆరసము గూడ, 'శృంగారము, కరుణము, శాంతము, రౌద్రము, వీరము. అద్భుతము, హాస్యము, భయానకము, బీభత్సము' అనుటచేఁ దొమ్మిదివిధము లుగ నుండును.

కొంతమంది మాత్రము 'శాంతరసము శమముతోనే సాధింప వలసి యున్నది కనుక, యోగులయందు మాత్రమే యుండు నాశమము నటునియం దుండదు గావున నాట్యమునం దెనిమిదియే రసములు. శాంతరస మటఁ గుదు రదు' అని యందురు , ఆవిషయము మఱికొందఱు సహింపరు.

సంస్కృత మూలము :

తథా హి - నస్తే శమాభావా దితి హేతురసం గతః; న చే రసాభివ్య క్తే రస్వీకారాత్; సామాజికానాంశ మనత్త్వేన తత్ర రసో ద్బోధే బాధకాభావాత్; న చ నటస్య శమాభావా త్తదభినయ ప్రకాశ కత్వా నుపప త్తి రితి వాచ్యం; తస్య భయక్రోధాదే రప్యభావేన తదభి నయ ప్రకాశకతాయా అ ప్యసంగత్యాపత్తేః ; యది చ నటస్య క్రోధాదే రభావేన వా స్తవ తత్కార్యాణాం వధబన్ధాదీనాం ఉత్ప త్త్యస మ్భవేఽపి కృత్రిమ తత్కార్యాణాం శిక్షాభ్యాసాదితః ఉత్పత్తౌ నా స్తి బాధక మితి నిరీక్ష్యతే. తదా ప్రకృ తేఽపి తుల్యం; అథ నాట్యే గీత వాద్యాదీనాం విరోధినాం సత్త్వాత్ సామాజికే ష్వపి విషయవైముఖ్యా త్మనః శా న్తస్య కథ ముద్రేకః ఇతి చేత్, నాట్యే శా న్తరశ మభ్యుప గచ్ఛద్భిః ఫలబలా త్తద్గీతవాద్యాదేః తస్మిన్ విరోధితా యా అకల్ప

నాత్; విషయచిన్తా సామాన్యస్య తత్రవిరోధిత్వ స్వీకారే తదీయాలమ్బ నస్య సంసా రానిత్యత్వస్య, తదుద్దీపనస్య పురాణశ్రవణ సత్సఙ్గ పుణ్య వనతీర్థావలోకనాదే రపి విషయత్వేన విరోధిత్వాపత్తేః; అత ఏవ చ చరమాధ్యాయే సఙ్గీతరత్నాకరే—

అష్టా వేవ రసా నాట్యే ష్వితి కేచి దచూచుదన్
త దచారు యతః కంచి న్న రసం స్వదతే నటః॥

ఇత్యాదినా నాట్యేఽ పి శాన్తో రసో ఽ స్తీతి వ్యవస్థాపితం; యై రపి నాట్యే శాన్తో రసో నా స్తీత్యభ్యుగమ్య తే తై రపి బాధకాభావాత్ మహాభారతాది ప్రబన్ధానాం శా న్తరసప్రధానతా యాః అఖిలలోకానుభవ సిద్ధత్వా చ్చ కావ్యే సోఽ వశ్యం స్వీకారః; అత ఏవ 'అష్టా నాట్యే రసాః స్మృతాః' ఇ త్యుపక్రమ్య 'శాన్తోపి నవమో రసః' ఇతి మమ్మట భట్టా అప్యుప సమాహార్షుః.

తెలుఁగు తాత్పర్యము :

ఏమనఁగా :'నటునియందు శమము లేదు గనుక శాంత మగుట గుదు రదు' మాట తగదు. నటునియందు రస మభివ్య క్త మగు నని యంగీకరింప లేదు గదా. రసాభివ్య క్తి యగు నన్నది సామాజికులకు. అట శమ మున్నది కనుక శాంతరసము నిర్బాధకముగ నుద్బోధిత మగును. 'నటునకు శమము లేనపుడు దాని నె ట్లభినయింపఁ గలఁడు ?' అనఁ దగదు. అతనికి భయక్రోధ ములు గాని, మఱి యే యితర మైనవి కాని స్థాయిభావము లున్నవా ? లేవు గనుక వాని నభినయించుట గూడ నసంగతము గావలసి వచ్చును. నటునకుఁ గ్రోధాదులు లేవు. గనుక వా స్తవముగ వధించుట గాని, కట్టివేయుట గాని మొదలగునవి సంభవింపకుండు గాక. 'కృత్రిమము లైన క్రోధాదుల వధ బంధనాది కార్యములు, నటునినేర్పు, అలవాటు, వీని సామర్థ్యమువలన నుద యించుట కదేమి ? యని యందురా ? అది ప్రకృతములో శమనవిషయమునఁ గూడ 1. సమానమే. 'నాట్యములోని గీత వాద్యాదులు శమమునకు విరోధులు గనుక సామాజికులకు మాత్రము శాంతము విషయమై ముఖ్య రూప మైనది యె ట్లుద్రేకించును ? అన్నచో, వినుఁడు. నాట్యములో శాంతము నంగీకరించువారు

శాంతస్ఫురణ ఫలబలముఁబట్టి, యట గీతవాద్యాదులు శాంతము నదగింపలే వనియే యంగీకరింతురు. 'ఏవిషయముఁ గూర్చియు గూడ, విచారము లేశమును శాంతములో నుండఁ దగ' దందు రేని, శాంతమున కాలంబన మైన సంసారము యొక్క యనిత్యత్వమును, దాని నుద్దీపింపఁజేయు నట్టి పురాణశ్రవణము, సత్సంగము, పుణ్యము లైన వనతీర్థసందర్శనము మొదలగునవి కూడ విషయములే కనుక, నవికూడ విరోధులు గావలసి వచ్చును. ఇందుచేతనే సంగీతరత్నాకరము చివరి యధ్యాయములో 'నాట్యములం దెనిమిదియే రసము లని కొందఱు పూర్వపక్ష మొనర్చిరి. కాని, యది బాగుండలేదు. నటుఁడే రసము ననుభవింపఁడు గదా ?' అని 2. యాతీరున నాట్యమునందు శాంతరస మున్న దని సిద్ధాంత మొనర్చిరి. నాట్యములో శాంతరసము లే దనువారు గూడ, నాట్యమునందు వలె బాధకము లేదు గనుకను, మహాభారతాదు లగు గ్రంథములు శాంతరస ప్రధానము లగుట లోకులందఱ యనుభవములోఁ బ్రసిద్ధమే కనుకను గూడఁ గావ్యములందు దానిని స్వీకరింపక తప్పదు. ఇందుచే 'నాట్యమున రసము లెనిమిదియే యని యుపక్రమించి శాంతము తొమ్మిదవరస మున్నది' యని మమ్మటభట్టులు గూడ నుపసంహరించిరి.

శ్రీ శర్వాణీ .

*1. చేష్ట లేమియు లేకున్నను. వాని నన్నింటిని మానుటయే శాంతరసమున నభినయ మని, యది వ్యక్తపఱుప నని యందురు.

2. కనుకనే శ్రీకృష్ణమిశ్రుని 'ప్రబోధచంద్రోదయము,' రత్నఖేటదీక్షితుల 'భావనాపురుషోత్తమము,' వేదాంత దేశికుల 'సంకల్ప సూర్యోదయము విద్వాంసు లందఱు నాటకము లని యంగీకరించిరి.



# ఆంధ్ర రసగంగాధరము

## ౧౭. స్థాయిభావము.

సంస్కృత మూలము

అమీషాం చ —

> రతిః శోక శ్చ నిర్వేద క్రో ధోత్సాహా శ్చ విస్మయః
> హాసో భయం జుగుప్సా చ స్థాయిభావాః క్రమాదమీ.

రసేభ్యః స్థాయిభావానాం ఘటాదేః ఘటాద్యవచ్ఛిన్నాకాశా దివ ప్రథమ ద్వితీయయో ర్మతయోః సత్యరజతస్య అనిర్వచనీయరజతా దివ తృతీయే, విషయస్య (రజతాదేః) జ్ఞానా దివ చతుర్థే భేదో బోధ్యః; తత్ర ఆప్రబన్ధం స్థిరత్వా దమీషాం భావనాం స్థాయిత్వం; న చ చిత్తవృత్తి రూపాణా మేషా మాశు వినాశిత్వే న స్థిరత్వం దుర్లభం, వాసనా రూపతయా స్థిరత్వం వ్యభిచారిష్వతి ప్రసక్తం ఇతి వాచ్యం; వాసనా రూపాణా మమీషాం ముహుర్ముహు రభివ్యక్తే రేవ స్థిరపదార్థత్వాత్; వ్యభిచారిణాంతు నైవ, తదభివ్యక్తేర్విద్యుదుద్యోత ప్రాయత్వాత్; యదాహుః —

> విరుద్ధై రవిరుద్ధై ర్వా భావై ర్విచ్ఛిద్య తేన యః
> ఆత్మభావం నయత్యాశు స స్థాయీ లవణాకరః
> చిరం చిత్తేఽ వతిష్ఠన్తే సంబధ్యన్తే ఽనుబన్ధిభిః
> రసత్వం యే ప్రపద్యన్తే ప్రసిద్ధాః స్థాయినోఽత్ర తే.

చిర మితి వ్యభిచారి వారణాయ; అనుబన్ధిభిః = విభావాద్యైః.
తథా —

సజాతీయ విజాతీయై రతిరస్కృత మూర్తిమాన్
యావద్రసం వర్తమానః స్థాయిభావ ఉదాహృతః ; ఇతి.

తెలుఁగు తాత్పర్యము :

ఈరసములకు – రతియు, శోకము, నిర్వేదము, క్రోధము, ఉత్సాహము, విస్మయము, హాసము, భయము, జుగుప్సయు నను నివి క్రమముగ స్థాయి భావములు. రసములకు స్థాయిభావములనుండి భేదము, ప్రథమ ప్రథమద్వితీయ మతములలోఁ గూడ * (మొదటి రెండుమతములలోఁ గూడ) ఘటాదులకు వానిలోని యాకాశాదులనుండి భేదము వంటిది. మూఁడవమతములో, వాస్తవ మగు రజతమున కనిర్వచనీయ మగు రజతము నుండి భేదము వంటిది. నాల్గవ మతములో, విషయమునకు (రజతాదికిమునకు) దాని జ్ఞానమునుండి భేదము వంటిది యని తెలియ నగును. ప్రబంధము ముగియు నంతవఱకు స్థిరములు గనుక నివి స్థాయు లయినవి. 'అయితే, యివి చిత్తవృత్తి రూపములు. త్వరగా నశించిపోవును. ఇఁక స్థిరత యేది ? సంస్కారరూపమున స్థిరములుగ నుండు నన్నచో, వ్యభిచారులు గూడ నటులే యుండునే ?' అని యందురా ? అట్లు గాదు. సంస్కారరూపము లగు నివి మాటిమాటికి నభివ్యక్తము లగు చుండు టయే యిట స్థిరపదమున కర్థము. వ్యభిచారు లీ తీరు గాదు. అవి మెఱపు మెఱసినట్లు మెఱయునవే కదా. పెద్దలిటులు చెప్పిరి. 'విరుద్ధములు గాని, యవి రుద్ధములు గాని యేభావములచేతను విచ్ఛేద మొనరింపఁ బడకుండ నుండు నదియు, (భావాంతరములను) విభావాదులను దనరూపముఁ బొందించు నదియు, స్థాయిభావము. ఇది యుప్పుసముద్రము వంటిది. చిత్తములోఁ జిరకాల ముండి తన యనుబంధులతో సంబంధించును. రసము లగును. అభిభావములు స్థాయి భావము లని ప్రసిద్ధములు. ఇఁటఁ జిరకాల మనుట వ్యభిచారులను దొలఁగించు టకు, ననుబంధులు – విభావాదులు అల్లే. సజాతీయములు గాని, విజాతీయములు గాని భావము లేమియు దీనిరూపమును గ్రమ్మిమేయఁ జాలవు. ఇది రస మగు నంతవఱకును నిల్చును. కనుకనే యిది స్థాయిభావ మని యుదాహరించిరి ;' అని,

శ్రీ శర్వాణి :

* అభినవగుప్తుడు, మమ్మటుఁడు మొదటి రెండుమతములవారు. మూఁడవది నవ్యమతము. నాలవది 'ఇతరులైతే' యను మతము.

సంస్కృత మూలము :

కేచిత్తు రత్యాద్యన్యతమత్వం స్థాయిత్వమాహుః ; తన్న రత్యాదీనాం ఏకస్మిన్ ప్రరూఢే అన్యస్యాప్రరూఢస్య వ్యభిచారిత్వోపగమాత్; ప్రరూఢత్వ ప్రరూఢత్వే బహ్వల్ప విభావజత్వే ; తదుక్తం రత్నాకరే —

రత్యాదయః స్థాయిభావాః స్యుర్భూయిష్ఠ విభావజాః
స్తోకైర్విభావైరుత్పన్నా స్త ఏవ వ్యభిచారిణః. ఇతి.

ఏవంచ వీరరసే ప్రధానే క్రోధః, రౌద్రే చోత్సాహః, శృఙ్గారే హాసః, వ్యభిచారీ భవతి: నాన్తరీయకశ్చ; యదా తు ప్రధానపరిపోషార్థం సోపి బహువిభావజః క్రియతే తదా తు రసాలఙ్కార ఇత్యాది బోధ్యం.

తెనుఁగు తాత్పర్యము :

రత్యాదులలో నొకటి యగుట స్థాయిత్వమని కొందఱనినారు. అట్లుగాదు. రత్యాదులలో నొక్కటి వేరూని స్థిరపడి నపుడు, స్థిరపడని మఱియొకటి వ్యభిచారి యగు నని యంగీకరించిరి కదా. అనేక విభావములవలన నేర్పడినచో, స్థిరపడును = ప్రరూఢ మగును. కొద్దివిభావములతో నేర్పడినచో, నవియే వ్యభిచారు లగును. అని. ఇట్లు కాఁగా, వీరరసము ప్రధాన మగు నపుడు క్రోధము, రౌద్రము ప్రధాన మగు నపు డుత్సాహము, శృంగారము ప్రధాన మగు నపుడు హాసము వ్యభిచారి యగును. విడువరానిదియు నగును. ప్రధానరసముఁ బోషించుటకై దానిఁ గూడ ననేక విభావముల నుండి వ్యక్త మొనర్చుచో నట రసాలంకారము. ఇత్యాదికముగఁ దెలియ నగును.

## స్థాయిభావ లక్షణములు

సంస్కృత మూలము : ౧.

తత్ర స్త్రీపుంసయో రన్యోన్యావలమ్బనః ప్రేమాఖ్య శ్చిత్తవృత్తివిశేషో రతిః స్థాయిభావః ; గురుదేవతా పుత్త్రాద్యాలమ్బన స్తు వ్యభిచారీ.

తెనుఁగు తాత్పర్యము

అచట నాఁడుదానికిని, మగవానికి నొకరి కొకరు ఆధారముగ నేర్పడిన 'ప్రేమ' యను చిత్తవృత్తివిశేషము రతి. స్థాయిభావము. గురువులు, దేవతలు, బిడ్డలు మొదలగు వా రాధార మగుచో వ్యభిచారి యగును.

సంస్కృత మూలము : ౨.

పుత్త్రాది వియోగ మరణాది జన్మా వైక్లవ్యాఖ్య శ్చిత్తవృత్తి విశేషః శోకః స్త్రీపుంసయోస్తు వియోగే జీవితత్వ జ్ఞానదశాయాం వైక్లవ్యపోషితాయాః రతే రేవ ప్రాధాన్యాత్ శృఙ్గారో విప్రలమ్భాఖ్యో రసః ; వైక్లవ్యం తు సంచారిమాత్రం : మృతత్వ జ్ఞానదశాయాం తు రతిపోషితస్య వైక్లవ్య స్యేతి కరుణ ఏవ ; యదా తు సత్యపి మృతత్వ జ్ఞానే దేవతాప్రసాదాదినా పునరుజ్జీవనజ్ఞానం కథంచి త్స్యాత్ తదాలమ్భస్యాత్యాన్తికనిరాసః ; కేచిత్తు రసాన్తర మేవ అత్ర కరుణ విప్రలమ్భాఖ్య మిచ్ఛన్తి.

తెనుఁగు తాత్పర్యము :

బిడ్డలు మొదలగువారి యెడబాటు, చావు మొదలగు వాటివలనఁ గలిగిన 'వెగడుపాటు' అను చిత్తవృత్తివిశేషము శోకము. ఆఁడుదానికి, మగవానికి నెడబాటు గలిగినపుడు బ్రదికి యుండె నని తెలిసినచో వెగడుపాటుతో బెంపఁబడిన రతియే ప్రధానము గనుక విప్రలంభశృంగారము రసము ఆవెగడుపాటు వ్యభిచారి మాత్రమే. చనిపోయె నని తెలిసినచో రతిచేఁ బెంప బడిన వెగడుపాటు ప్రధానము గనుకఁ గరుణరసమే. ఒకచోటఁ జనిపోయె నని తెలిసినను, దేవతా ద్యనుగ్రహము మొదలగు వానిచేఁ దిరిగి బ్రదుకు నని యెటులో తెలిసినచో నపు డాధారము పూర్తిగాఁ దొలఁగి పోలేదు. కనుకఁ జిరకాల మెడబాటు నందువలె విప్రలంభమే కాని కరుణము గాదు. మహాశ్వేత మాటలందుఁ జంద్రాపీడునిఁ గూర్చి విప్రలంభమే కదా గోచరించును. కరుణము గాదే. కొందఱిమంది మాత్ర మిచటఁ గరుణవిప్రలంభ మని మఱియొకరస మని తలంతురు.

సంస్కృత మూలము : ౩.

నిత్యానిత్య వస్తువిచార జన్మా విషయవిరాగాఖ్యః నిర్వేదః. గృహకలహాదిజ స్తు వ్యభిచారీ.

తెనుఁగు తాత్పర్యము ;

'ఈవస్తువు నిత్యము, ఇది యనిత్యము' అను విచారణముచే జనించిన విషయములయెడ వైరాగ్య మను చిత్తవృత్తి విశేషము నిర్వేదము. ఇంటిలోని పోరు వంటి వానివలనఁ గలుగునది వ్యభిచారి.

సంస్కృతి మూలము : ४.

గురుబన్ధువధాది పరమాపరాధ జన్మా ప్రజ్వలనాఖ్యః క్రోధః అయం చ పరవినాశాది హేతుః ; క్షుద్రాపరాధ జన్మా తు పరుషవచనా సంభాషణాది హేతుః ; అయ మే వామర్షాఖ్యో వ్యభిచా రీతి వివేకః.

తెనుఁగు తాత్పర్యము :

గురువధ, బంధువధ వంటి గొప్పయపరాధమువలనఁ గల్గు, మనసు మండుట యనునది క్రోధము. దీని వలనఁ బరులవినాశము మొదలగునది యేర్పడును. తక్కువరకమైన యపరాధమువలన నేర్పడునది కఠినముగ మాటాడించును. లేదా ? యసలు మాటలాడకుండ మాన్పించును. ఇట్టివానినే కల్గించును. ఇది యమర్ష మను పేరుతో వ్యభిచారి యగు నని వివేచింపవలెను.

సంస్కృత మూలము : ౫.

పరపరాక్రమ దానాది స్మృతిజన్మా – ఔన్నత్యాఖ్య ఉత్సాహః.

తెనుఁగు తాత్పర్యము :

ఇతరుల పరాక్రమము, దానము మొదలయిన వానిఁ దలంచుటచేఁ గలిగి, యౌనత్య మని పేరొందినది యుత్సాహము.

సంస్కృత మూలము : ౬.

అలౌకికవస్తుదర్శనాది జన్మా వికాసాఖ్యో విస్మయః,

తెనుఁగు తాత్పర్యము :

లోకవిలక్షణము లగు వానిఁ జూచుటచేఁ గలుగు నాశ్చర్య మనునది విస్మయము.

సంస్కృత మూలము : ౭.

వాగంగాది వికార దర్శన జన్మా వికాసాఖ్యో హాసః.

తెనుఁగు తాత్పర్యము :

మాటలు, శరీరము మొదలగు వాని వికారములఁ జూచుటచేఁ గలుగు వికాస మనునది హాసము.

సంస్కృత మూలము . ౮

వ్యాఘ్రపుదర్శనాదిజన్మా పరమానర్థవిషయకో వైక్లవ్యాఖ్యః సభయమ్. పరమానర్థవిషయక త్వాభావే తు స ఏవ త్రాసో వ్యభిచారీ; అపరే తు ఔత్పాతిక ప్రభవ స్త్రాసః స్వాపరాధ ద్వారోత్థం భయ మితి భయ త్రాసయో ర్భేద మాహుః.

తెనుఁగు తాత్పర్యము :

పెద్దపులిని జూచుట మొదలగు వానిఁ గల్గి గొప్ప యనర్థముఁ గూర్చిన వెగడుపాటు అనునది భయము గొప్ప యనర్థము గుఱించినది కానిచో, నిదియే త్రాస మను వ్యభిచారి యగును. మఱికొందఱు ఔత్పాతికములనుండి కలుగునది త్రాసము. తనతప్పులవలనఁ గలిగినది భయము. అని భయమునకుఁ ద్రాసమునకు భేదముఁ జెప్పిరి.

సంస్కృత మూలము : ౯

కదర్యవస్తువిలోకజన్మా విచికిత్సాఖ్య శ్చిత్తవృత్తి విశేషో జుగుప్సా.

తెనుఁగు తాత్పర్యము :

రోఁతఁ గల్గించువానిఁ జూచుటవలనఁ గల్గు విచికిత్స యను చిత్తవృత్తి విశేషము జుగుప్స ఈతీరున నీస్థాయిభావములు లోకములో, నాయానాయకులం దుండు నపు డాలంబనములుగఁ గాని, యుద్దీపనములుగఁ గాని కారణము లై ప్రసిద్ధము లగు నవి ఈకావ్యనాట్యములలో వ్యంగ్యము లగునపుడు విభావము లనఁబడును. విశేషముగా భావింపఁ బడును గనుక విభావము లని వ్యుత్పత్తి.



# ఆంధ్ర రసగంగాధరము

## ౧౭. రసధ్వని

సంస్కృతి మూలము,

౧. ఏవ మేషాం స్థాయిభావానాం లోకే తత్తన్నాయకగతానాం యాన్యాలమ్బనతయా ఉద్దీపనతయా వా కారణత్వేన ప్రసిద్ధాని తాన్యేష కావ్యనాట్యయో ర్వ్యజ్యమానేషు విభావశబ్దేన వ్యపదిశ్యన్తే. విభావయ న్తీతి వ్యుత్పత్తేః

౨ యాని చ కార్యతయా తా న్యనుభావ శబ్దేన; అను పశ్చా ద్భావః, ఉత్పత్తిః యేషాం, అనుభావయ న్తీతి వా వ్యుత్పత్తేః.

౩. యాని సహచర న్తి తాని వ్యభిచారి శబ్దేన.

తత్ర, శృఙ్గారస్య స్త్రీపుంసా వాలమ్బనే; చన్ద్రికా వసన్త వివి ధోపవన రహస్స్థానాదయ ఉద్దీపనవిభావాః; తన్ముఖావలోకన తద్గుణ శ్రవణ కీర్తనాదయో ఽన్యే సాత్త్వికభావా శ్చానుభావాః; స్మృతిచిన్తా దయో వ్యభిచారిణః

కరుణస్య - బన్ధునాశాదయ ఆలమ్బనాని, తత్సమ్బన్ధి గృహ తురగాభరణ దర్శనాదయ స్తత్కథా శ్రవణాదయ శ్చోద్దీపకాః; గాత్ర క్షేపాశ్రుపాతాద యోనుభావాః; గ్లాని క్షయ మోహ విషాద చిన్తౌత్సుక్య దీనతా జడతాదయో వ్యభిచారిణః.

శాన్తస్య — అనిత్యత్వేన జ్ఞాతం జగ దాలమ్బనం; వేదాన్త శ్రవణ తపోవన తాపస దర్శనాది ఉద్దీపనం, విషయారుచి శత్రుమిత్రా

ద్యాదాసీన్య చేష్టాహాని నాసాగ్రదృష్ట్యాదయో ఽనుభావాః హర్షోన్మాద స్మృతి మత్యాదయో వ్యభిచారిణః.

రౌద్రస్య — ఆగస్కృత్పురుషాది రాలమ్బనం ; తత్కృతోపరాధాది రుద్దీపికః ; వధ బన్ధాది ఫలకః నేత్రారుణ్య దన్తపీడన పురుష భాషణ శస్త్రగ్రహణాది రనుభావః ; అమర్ష వేగౌగ్ర్య చాపలాదయః సంచారిణః.

ఏవం యస్యా శ్చిత్తవృత్తేః యో విషయః సత స్యా ఆలమ్బనం ; నిమిత్తాని చోద్దీపకా నీతి బోధ్యమ్.

తెనుఁగు తాత్పర్యము :

కార్యములుగాఁ బ్రసిద్ధము లగు నవి యనుభావము లను మాటలతోఁ దెలుపఁబడును 'అను - తరువాత, భావః - పుట్టుక కలవి.' 'అనుభవింపఁ జేయునవి' యని గాని వ్యుత్పత్తి. తోడునీడగా సంచరించునవి 'వ్యభిచారులు' అని పేర్కొనఁబడును.

ఆరసములలో శృంగారమునకు స్త్రీపురుషు లిరువురు నాలంబనములు. వెన్నెల, వసంతము, నానావిధము లగు నుద్యానములు, చల్లనిగాలి, యేకాంతము, ఈఁరిక మైనవి యుద్దీపన విభావములు. ఆలంబనముయొక్క మొగముఁ జూచుట, దాని గుణములను వినుట, కొనియాడుట మొదలగునవియు, నివికాక సాత్త్వికము లగు భావములు ననుభావములు. స్మృతి, చింత మొదలగు నవి వ్యభిచారములు.

కరుణమునకు —— బంధునాశాదు లాలంబనములు. వారికి సంబంధించిన యిల్లు, గుఱ్ఱము, నగలు వీనినిఁ జూచుట మొదలగు నవియు, వారి కథలు వినుటవంటివియు నుద్దీపకములు. ఈశరీరము వీడుట, కన్నీరు గార్చుట, మొదలగునవి యనుభావములు. గ్లాని, క్షయము, మోహము, విషాదము, చింత, యౌత్సుక్యము, దైన్యము, జడత మొదలయినవి వ్యభిచారులు.

శాంతరసమునకు —— అనిత్య మని తెలిసిన జగము ఆలంబనము. వేదాంతము వినుట, తపోవనములఁ, దాపసులఁ జూచుట, మొదలగు నవి యుద్దీపన

ములు. విషయములయందు రుచి తప్పుట, శత్రుమిత్రులయం దుదాసీన ముగ నుండుట. యేపనియుఁ జేయకుండుట, ముక్కుచివర చూపు నిల్పుట, యిత్యాదు లనుభావములు. హర్షము, ఉన్మాదము, స్మృతి, మతి మొదలైనవి వ్యభిచారులు.

రౌద్రమునకు — అపరాధ మొనర్చినవా రాలంబనము. వా రొనర్చిన యప రాధాదిక ముద్దీపనము. వధ, బంధము మొదలగునవి ఫలించునట్టి కనుల యెఱుపు, పండ్లు కొఱుకుట, కఠినముగ మాట్లాడుట, యాయుధము పట్టుట మొదలైనవి యనుభావములు. అమర్షము, వేగము, ఔగ్ర్యము, చాపల్యము, మొదలైనవి సంచారులు. ఈతీరుననే చిత్తవృత్తి కేది గోచర మైనదది దాని కాలంబనము నిమిత్తము లుద్దీపకములు; అని తెలియవలెను.

## శృంగార భేదములు

సంస్కృత మూలము :

తత్ర శృఙ్గారో ద్వివిధః ; సంయోగో విప్రలమ్భ శ్చ; రతేః సంయోగ కాలావచ్ఛిన్నత్వే ప్రథమః; వియోగ కాలావచ్ఛిన్నత్వే ద్వితీయః ; సంయోగ శ్చ న దమ్పత్యో స్సామానాధికరణ్యం, ఏకతల్ప శయ నేపి ఈర్ష్యాది సద్భావే విప్రలమ్భ స్యైవ వర్ణనాత్; ఏవం వియోగోపి న వైయధికరణ్యం, దోష స్యోక్తత్వాత్; తస్మా ద్వావిమే సంయోగ వియోగాఖ్యౌ అన్తఃకరణవృత్తి విశేషౌ; య త్సంయుక్తో వియుక్త శ్చా స్మీతి ధీః; తత్రాద్యో యథా—'శయితా సవిధే ప్యనీశ్వరా' ఇ త్యత్ర నిరూపితః; యత్తు చిత్రమీమాంసాయాం— 'వాగర్థా వివ సంపృక్తౌ' ఇత్యత్ర రసధ్వనిః; నిరతిశయ ప్రేమశాలితా వ్యఞ్జనాత్. ఇతి. తద్ధ్వని మార్గానా కలన నిబన్ధనం; పార్వతీ పరమేశ్వర విషయక కవిరతౌ ప్రధానే నిరతిశయ ప్రేమ్ణో గుణీభావాత్; న హి గుణీభూతస్య రత్యాదేః రసధ్వని వ్యపదేశ హేతుత్వం యుక్తం; భిన్నో హి రసాద్య లఙ్కారా దలఙ్కార్యతయా స్థితః ఇతి సిద్ధాన్తాత్.

ద్వితీయో యథా—

వాచో మాంగలికీః ప్రయాణ సమయే జల్ప త్యనల్పం జనే
కేలీమన్దిర మారుతాయన ముఖే విన్య _స్త వక్త్రామ్బుజా
నిశ్వాస గ్లపి తాధరో పరిపత ద్బాష్పార్ద్ర వక్షోరుహా
బాలా లోలవిలోచనా శివశివ ! ప్రాణేశ మాలోకతే.

అత్రా ప్యాలమ్బనస్య నాయకస్య, నిశ్వాసాశ్రుపాతాదే రనుభావస్య, విషాదచి స్తాఽఽవేగాదే శ్చ వ్యభిచారిణః, సంయోగా ద్రతి రభివ్యజ్యమానా, వియోగ కాలావచ్ఛిన్నత్వా ద్విప్రలమ్భ రస వ్యపదేశ హేతుః.

యథా వా—

ఆవిర్భూతా యదవధి మధుస్యన్దినీ నన్దసూనోః
కా _న్తిః కాచి న్నిఖిల నయనాకార్షణే కార్మణజ్ఞా
శ్వాసో దీర్ఘ _స్తదవధి ముఖే పాణ్డిమా గణ్డయుగ్మే
శూన్యావృ _త్తిః కులమృగదృశాం చేతసి ప్రాదు రాసీత్.

యథా వా—

నయనాఞ్చ లావమర్శం యాన కదాచి త్పురాసీ హీ
ఆవిజ్ఞి తాపి జోషం తస్యా సాగన్తుకేన దయితేన.

ఇహాపి సహజ చాంచల్య నివృ _త్తిః జడతా చానుభావ వ్యభిచారిణౌ;
విరహ, ఈర్ష్యా,శాపానాం విశేషానుపలమ్భా న్నాస్మాభిః ప్రపఞ్చితః

తెనుఁగు తాత్పర్యము :

ఆరసములలో శృంగారము రెండు రకములు. సంయోగము. విప్రలంభము. రతి, సంయోగకాలములో నిదిగాఁ గుఱుతింపఁ బడినచో మొదటిది. వియోగకాలములో నిదిగా గుఱుతింపఁ బడినచో రెండవది. సంయోగ మనఁగా: దంపతు లొక్కచో నుండుట కాదు. 1. ఒక్క ప్రక్కమీఁదఁ బరుండి యున్నను, ఈసు మొదలగు నవి యున్నచో, వియోగము = ఎడబాటునే వర్ణిం

తుదు. ఇట్లే వియోగ మనఁగా : వేఱువేఱు చోటుల నుండుట కాదు. దోషముఁ దెలిపితిమి కదా. కనుక నీసంయోగ వియోగములు రెండు నంతఃకరణ ప్రవృత్తి విశేషములు. 'నేను గలసి యుంటిని' 'యెడబాసి యుంటిని' యను తలంపు. అందు మొదటిది 'శయితా సవిధే' యని యుదాహరింపఁ బడెను. అయితే, చిత్రమీమాంసలో, 'వాగర్థా వివ సంపృక్తౌ' అనుచోట రసధ్వని నిరతిశయ ప్రేమతోఁ బార్వతీపరమేశ్వరు లున్నట్లు వ్యక్తమగును గనుక నని యున్నది. ఆధ్వని యొక్క మార్గము నాకళింపు జేసికొనక పోవుట మూలమున నేర్పడినది. ఏమన : ఇచటఁ బార్వతీపరమేశ్వరులఁ గూర్చిన కవిప్రీతి పరమ ప్రధానము. అందులో నీనిరతిశయ ప్రేమము గుణీభూత మైనది. గుణీభూత మగు రత్యాదికము రసధ్వని యనుట కుపయోగింపఁ దగదు గదా ? రసాద్యలంకారమున కన్న వేఱై యలంకార్యముగ నిల్చినది రస మని కదా సిద్ధాంతము. రెండవది యెట్లనఁగా : ప్రయాణసమయమున జనమంతయు శుభవాక్యములఁ బలుకుచుండఁగాఁ, గ్రీడామందిర మందలి కిటికీలో మొగ ముంచి, నిట్టూర్పులతో వాఁడిన పెదవిమీఁదఁ బడుచున్న కన్నీటితో స్తనములు దడియుచుండఁగాఁ దత్తరపడు చూపులతో, శివశివ ! ఆబాల ప్రాణేశునిఁ జూచుచున్నది. ఇటఁ గూడ నాలంబ మగు నాయకుఁడు, నిట్టూర్పు. కన్నీరు గాఱుట మొదలగు ననుభావము, విషాదము, చింత, యావేగము, మొదలగు వ్యభిచారిభావములు వీని కూడికచే వ్యక్త మగుచున్న రతి యెడబాటు సమయములోనిదిగ గుర్తింపఁ బడుట వలన విప్రలంభ శృంగారరస మని పేర్కొనుటకుఁ గారణ మగును.

ఇంకను, తేనె లూరుచు, నందఱ కనుల నాకర్షించు నుపాయ మెఱిఁగిన నందసూనుని (కృష్ణుని) కాంతికనుల యెదుట నావిర్భవించి నప్పటినుండియుఁ, గులీన లైన హరిణనేత్రలకు మొగమున, నిడుదయూర్పు, చెక్కిలియందు దెల్లఁదనము, మనస్సున శూన్యవృత్తియు నుదయించెను. పోనీ, యిదైన నిది వరలో నేయొకప్పుడు గూడఁ గ్రీగన్నులతోఁ జూచుట నైనను సహింపని యామె, పయనమై పోవు దయితుఁడు గౌఁగిలించుకొనినఁ గూడ నులుకక, పలుకక యుండెను. ఇచటఁ గూడ సహజ మగు చాంచల్యము దొలఁగుట యనుభావము. జడత వ్యభిచారి భావము. ప్రాచీనులు ౨. ప్రవాసము, అభిలాష, విరహము, ఈర్ష్య, శాపము, అను ఐదుఉపాధులతో నీవిప్రలంభ మును విభజించిరి. కాని, వానిలో భేద మేమియు మాకుఁ గనరానందున విస్తరింప లేదు.

శ్రీ శర్వాణి :

1. 'ఏకతల్పశయనేపి' ఇట సంస్కృత మూలము. 'ఏక ఖట్వాయాం నిద్రాయా మపీ త్యర్థః' (ఒకమంచము పై నిద్రించునపుడైనను) అని నాగేశుని వ్యాఖ్య. ఇది తప్పు. నిద్రించుచో నట సంయోగ మేది? వియోగ మేది? దేనికి నవకాశము లేదు గదా? ఇట ముఖ్యముగ నిరూపింప వలసినవి సంయోగవియోగములు. వానికిఁ బ్రక్కన పరుండి యుండుటలోనే యవకాశము గాని, నిద్రించుటలో లేదు గదా?

2. ప్రవాస మనఁగా; దూరదేశమున కేఁగుట. అదివఱలోఁ గనుపింపకున్నను, గుణములు వినుట మొదలగు వాని వలనఁ గోరిక కల్గి, ప్రియుఁడు ప్రాప్తించ నప్పటి విప్రలంభ మభిలాష హేతుకము. అత్త మామలు మొదలగు గురుజనములనుండి కలయిక కడ్డమేర్పడి నపుడు విరహము. 'ఈర్ష్య = అసూయ, అది పదముచే మానహేతుక మగు విప్రలంభము గూడ గ్రహింపవలెను.' అని నాగేశుని వ్యాఖ్య. ఇది తప్పు. గురుజనాదిక మే కాక, సఖీజనాదికము, వ్యాపారాంతరము, పగలు మొదలగు కాలము, జనసమ్మర్దము, ఘాతుకజంతువులు, సంకేతభంగము మొదలగునవి కూడఁ బ్రియసంగమమునకుఁ బ్రతిబంధకములే. వానిని గ్రహింపక పోవుట లోపము. ఈర్ష్య యన, అసూయ యని యర్థము గాదు. 'అక్షాన్తిరీర్ష్యా, అసూయా తు దోషారోపో గుణే ష్వపి' యని యమరుఁడు. అది కాక, ముందు 'యస్యోద్దామ' యను శ్లోకవ్యాఖ్యలో 'ఈర్ష్యా = అక్షమా, గుణేషు దోషారోపో సూ యేతి భేదః' అనియు, దరువాత వ్యాఖ్యలోఁ గూడ 'ఈర్ష్యాజనికా చాసూ యేతి వ్యఙ్గ్యత్వ మేవా స్యాః' అనియుఁ దానే స్వయముగ వ్రాసి యున్నాఁడు. పోనీ, మానముఁగూడ నాది పదముతో గ్రహించుచో నుపాధు లా అగును. కనుక నితని వ్యాఖ్య యంతయుఁ దప్పే యగును. ఈర్ష్యయే, యసూయ. మానము మొదలైన యన్నింటి కుపలక్షణ మని మూలకర్త తాత్పరము.

సంస్కృత మూలము :

కరుణో యథా —

అపహాయ సకలబాన్ధవచిన్తా ముద్వాస్య గురుకుల ప్రణయం
హా ! తనయ ! వినయశాలిన్ ! కథ మివ పరలోకపథికో ఽభూః.

అత్ర ప్రమీత తనయ ఆలమ్బనం, తత్కాలావచ్ఛిన్న బాన్ధవ దర్శనా ద్యుద్దీపనమ్; రోదన మనుభావః; దైన్యాదయ స్సంచారిణః.

శాన్తో యథా —

మలయానిల కాల కూటయోః రమణీకుస్తల భోగిభోగయోః
శ్వపచాత్మభువో ర్నిరన్తరా మమజాతా పరమాత్మని స్థితిః.

అత్ర ప్రపఞ్చ స్సర్వో ప్యాలమ్బనం; సర్వత్ర సామ్య మనుభావః; మత్యాదయ స్సంచారిణః; యద్యపి ప్రథమార్ధే ఉత్తమాధమయో రుపక్రమా ద్ద్వితీయార్ధే ఽధమోత్తమ వచనం క్రమభఙ్గ మావహతి; తథాపి వక్తు ర్బ్రహ్మాత్మకత యోత్తమాధమ జ్ఞానవైకల్యం సమ్పన్న మితి ద్యోతనాయ క్రమభఙ్గో గుణ ఏవ.

ఇదం పున ర్నోదాహార్యమ్ —

సురస్రోతస్విన్యాః పులిన మధితిష్ఠ న్నయనయోః
విధా యాన్తర్ముద్రా మథ సపది విద్రావ్య విషయాన్
విధూతా న్తర్ధ్వాన్తో మధురమధురాయాంచితి కదా
నిమగ్నః స్యాం కస్యాం చన నవనభ స్యామ్బుద రుచి.

అత్రాపి య ద్యపి విషయగణాలమ్బనః; సురస్రోతస్వినీ తటాద్యుద్దీపితః, నయన నిమీలనాదిభి రనుభావితః; స్థాయీ నిర్వేదః ప్రతీయతే; తథాపి భగవ ద్వాసుదే వాలమ్బనాయాం కవి రతౌ గుణీభూత ఇతి న శాన్తరస ధ్వనివ్యపదేశ హేతుః; ఇదంచ పద్యం మన్నిర్మితాయాం భగవద్భక్తి ప్రధానాయాం కరుణాలహర్యా ముపనిబద్ధ మితి తత్ప్రధాన భావప్రాధాన్య మేవార్హతి; శాన్తరసా ననుగుణ శ్చాయ మోజస్వీ గుమ్ఫః ఇతి చానుదాహార్య మేవై తత్; పూర్వపద్యేతు పరమాత్మని స్థితిః; ఇ త్యనేన తత్త్వద్రూపాప్యవగమా ద్రతీ రప్రతిపత్తిః.

తెనుఁగు తాత్పర్యము :

కరుణ మెట్లనఁగా :

'తన సర్వబంధుజనముఁ గూర్చి యున్నట్టి (వా రేమయ్యెదరో యను) దిగులు వీడి, తలిదండ్రుల చనవుఁ ద్రోసివైచి, యయ్యో!బిడా! ఎంతయో వినయ

వంతుఁడ వైన నీవు. పరలోకమార్గ మిప్పుడు పట్టితి వేమయ్యా ?' ఇచటఁ జనిపోయిన బిడ్డఁ డాలంబనము. ఆసమయమున నున్న చుట్టపక్కము లగు పడుట మొదలైనది యుద్దీపనము. ఏడుపు అనుభావము. దైన్యము మొద లైనవి సంచారులు.

శాంత మెట్లనఁగా :

'మలయానిల మైనఁ, గాలకూట మైన, రమణీ కేశపాశ మైన, పాము శరీర మైనఁ, గుక్కఁ డినువాఁ డైన, బ్రహ్మదేవుఁ డైన భేదము లేని యట్లు, నాకుఁ బరమాత్మ యందు నిలువర మేర్పడినది.'

ఇటఁ బ్రపంచ మంతయు నాలంబనము. అంతటను సమత యను భావము. మతి మొదలగు నవి సంచారులు. ఇట నీశ్లోకము మొదటి సగములో, మొదట గొప్పదియుఁ, దరువాతఁ దక్కువదియుఁ జెప్పుచు, రెండవ సగములో, మొదటఁ దక్కువదియుఁ, బిమ్మట గొప్పదియుఁ జెప్పఁబడినది కనుకఁ గ్రమ భంగము గల్గును. కాని, యీశ్లోకమును జెప్పువాఁడు బ్రహ్మాత్మకుఁడు గాన, గొప్పతక్కువల వివేచించు బుద్ధి తొలఁగుట సమకూడిన దని ద్యోతన మొన ర్చుటకై యిటఁ గ్రమభంగము గుణమే.

ఇది మాత్ర ముదాహరింపఁ దగదు.

'గంగానది యిసుక తిన్నెపైఁ గూరుచుండి, కనులు లోపలఁ జూచు నట్లు ముద్ర వైచికొని, యావెంటనే విషయములఁ బాఱఁ ద్రోలి, లోనిచీఁక టినిఁ దూలగొట్టి, క్రొక్కారు మొగులు సొగసుతో మధురమధుర మగు నొక చిజ్జ్యోతియం దెపుడు మునుఁగుదునో !'

ఇచటఁ గూడ విషయముల లెక్కసేయక పోవుట యాలంబనముగ, గంగా నదీతటాదు లుద్దీపనములుగఁ, గనులు మూయుట మొదలగు నవి యనుభావము లుగ నిర్వేద మను స్థాయి స్ఫురించును. అట్లయినను, భగవానుఁ డగు వాసు దేవుని నాలంబనముగఁ గైకొన్న కవి రతిలో నిది గుణీభూత మగును. కనుక శాంతరసధ్వని యని వ్యపదేశింపఁ దగదు. ఈపద్యము భగవానునిఁ గూర్చిన భక్తిప్రధానముగ నా రచించిన కరుణాలహరిలోఁ గూర్పఁబడినది. కనుక దానిలోఁ బ్రధాన మగు భావమే యటఁ బ్రధాన మగుట తగును. అది కాక, నీశ్లోకములోని కూర్పు ఓజోగుణముతో నున్నది కనుకఁ గూడ శాంతరసమున

రనుగుణము గాదు. కాఁగా, నిది యుదాహరింపఁ దగనిదే. వెనుకటి పద్య మునం దన్ననో, 'పరమాత్మని యందు నిలుపరము' అనుటచే నతని తోడి తాద్రూప్య మవగత మగును. కనుక రతి స్ఫురింపదు

సంస్కృత మూలము :

రౌద్రో యథా —

నవోచ్ఛలిత యౌవన స్ఫుర దఖర్వగర్వ జ్వరే
మదీయ గురుకార్ముకం గలితసాధ్వసం వృశ్చతి
అయం పతతు నిర్దయం దలిత దృప్త భూభృద్గల
స్థలస్రుధిరఘస్మరో మమ పరశ్వధో భైరవః.

అత్ర తదానీం రామత్వే నాజ్ఞాతః గురుకార్ముక భఞ్జక ఆల మ్బనం ; అత ఏవ విశే ష్యానుపాదానం ; గురుద్రుహో నామగ్రహణా నౌచిత్యాత్, క్రోధావిష్కారాద్వా ; ధ్వని విశే షానుమితః ; నిశ్శఙ్క ధనుర్భఙ్గ ఉద్దీపకః ; పరుషోక్తి రనుభావః ; గర్వోగ్రత్వాదయ స్సంచా రిణః ; ఏషా చ ధనుర్భఙ్గ ధ్వనిభగ్న సమాధే ర్భార్గవ స్యోక్తిః ; వృత్తి ర ప్యత్ర మహోద్ధతా రౌద్రస్య పరమౌజస్వితాం పరిపుష్ణాతి ; అన్యత్ర గురుస్మరణే సత్యహంభావ విగమస్యావశ్యకతయా ప్రకృతే చాజహత్స్వార్థలక్షణామూల ధ్వననేన మదీయే త్యనేన గర్వోత్కర్ష స్యైవ ప్రకాశనా త్స్ఫుటం గమ్యమానేన వివేకశూన్యత్వేన క్రోధస్య ఆధిక్యం గమ్యతే. ఇదం తు నోదాహార్యం ——

ధనుర్విదలనధ్వని శ్రవణ తత్క్షణావిర్భవ
న్మహాగురువధస్మృతిః శ్వసనవేగధూతాధరః
విలోచన వినిస్సర ద్బహులవిస్ఫులిఙ్గ వ్రజః
రఘుప్రవర మాక్షిపన్ జయతి జామదగ్న్యో మునిః,

అత్రాప్యపరాధాస్పదేన రఘునన్దనే నాలమ్బితః ; ధనుర్విదలన ధ్వనిశ్రవణే నోద్దీపితః ; నిశ్వాసనేత్రజ్వలనాదిభి రనుభావితః ; మహా

గురువధ స్మృతిగర్వోగ్రత్వాదిభి శ్చ సంచారితః ; క్రోధో య ద్యపి వ్యజ్యతే, తథా ప్యసౌ తత్రప్రభావవర్ణన బీజభూతాయాం కవి రతౌ గుణీభూత ఇతి. న రౌద్రరస ధ్వని వ్యపదేశ హేతుః ; కావ్యప్రకాశ గతా రౌద్రరసోదాహరణేతు –

కృత మనుమతం దృష్టం వా యైరిదం గురుపాతకం
మనుజపశుభి ర్నిర్మర్యాదై ర్భవ ద్భిరుదాయుధైః
నరకరిపుణా సార్ధం తేషాం సభీమకిరీటినాం
అయ మహ మసృఙ్మాంసైః కరోమి దిశాం బలిం.

ఇతి పద్యే రౌద్రరసవ్యఞ్జనక్షమా నా స్తి వృత్తిః ; అత సత్కావే రశ క్తి రేవ, వీర శ్చతుర్ధా ; దాన దయా యుద్ధ ధర్మై స్తదుపాధే రుత్సాహస్య చాతుర్విధ్యాత్ –

తత్రాద్యో యథా –

కియదిద మధికం మే యద్ద్విజాయార్థయిత్రే
కవచ మరమణీయం కుణ్డలే చార్పయామి
అకరుణ మవకృత్య ద్రాక్కృపాణేన నిర్య
ద్బహుల రుధిరధారం మౌలి మావేదయామి

ఏషా ద్విజవేషా యేన్ద్రాయ కవచకుణ్డలదానోద్యతస్య కర్ణస్య తద్దాన విస్మితాన్ సభ్యాన్ ప్రత్యుక్తిః ; అత్ర యాచమాన ఆలమ్బనం ; త దుదీరితా స్తుతి రుద్దీపికా ; కవచాది వితరణం తత్ర లఘుత్వ బుద్ధ్యాదికం చానుభావః ; 'మే' ఇ త్యార్థాన్తరసంక్రమిత వాచ్యధ్వ న్యుద్భావితో గర్వః; స్వకీయ లోకో త్తర పితృజన్య త్వాది స్మృతి శ్చ సంచారిణౌ ; వృత్తిర ప్యత త్త దర్థానురూపోద్గమ విరామశాలితయా సహృద యైక చమత్కారిణీ ; తథా హి – ఉత్సాహపోషకం కవచకుణ్డలార్పణయో ర్లఘుత్వ నిరూపణం విధాతుం పూర్వార్ధే తదనుకూల శిథిల బన్ధాత్మికా ; ఉత్తరార్ధే తు మౌలితః ప్రాగ్వ క్త్రగత గర్వోత్సాహ పరి

పోషణా యోద్ధతా ; తతః పరం బ్రాహ్మణే సవినయత్వం ప్రకాశయితుం తన్మౌలీభూతం గర్వరాహిత్యం ధ్వనయితుం పున శ్శ్లిధి లైవ ; అత ఏ వావేదయా మీత్యుక్తం న తు దదామి వితరా మీతి వా

తెనుఁగు తాత్పర్యము

రౌద్ర మెట్లనఁగా :

'కార్తవీర్యావసపు పొంగుతోఁ బెల్లుగా గర్వజ్వరము పొంగఁగా, బెదురు వీడి నాగురువు వింటిని విరిచిన వానిమీఁదఁ, బొగ రెక్కిన రాజుల కంఠముల నరికి వానినుండి కారుచున్న నెత్తురు ద్రావి భయంకర మైన నాగంద్ర గొడ్డలి నిర్దయముగా వ్రాలు గాక.'

ఇచట రాముఁ డని యప్పటికి పే రెఱుఁగ రాక, తనగురువు వింటిని విరిచినవాఁ డాలంబనము. ఇందు చేతనే విశేష్యము నుపయోగింప లేదు. గురు ద్రోహినిఁ బేర్కొనుట యనుచితము గదా. క్రోధమున బైటికి వెడలఁ గక్కుటచే నైనను, పేరెత్త లేదు. జంకు లేక విల్లు విరచుట ధ్వనివిశేషముచే నూహింపఁబడి యుద్దీపకము. పరుష మగు యనుభావము. గర్వము, ఉగ్రత మొదలగునవి సంచారులు. విల్లు విరుగుట వలనఁ గల్గిన ధ్వని తనసమాధిఁ జెఱుపగాఁ బరశురాము డన్నమాట యిది. ఇచట వృత్తి కూడ మిక్కిలి యుద్ధత మై, యోజోవంతముగా రౌద్రరసము నెక్కువఁగ బోషింపు చున్నది. క్రోధము లేనపుడు గురుస్మరణయం దహంకారము దొలఁగుట యావశ్యకము. కనుకఁ బ్రకృతములో 'మదీయ' యను పదము అజహత్స్వార్థ* లక్షణ వలనఁ బరశురాముని గర్వోత్కర్షమునే స్ఫుటముగ ధ్వనింపఁజేయును. ఇందువలన నతని వివేకశూన్యత స్పష్టముగ స్ఫురించి కోప మెక్కువగా నున్నదని తోచును.

ఇది మాత్ర ముదాహరింప రాదు.

'విల్లు విరిచిన చప్పుడు విన్నప్పుడే తన గొప్పవాఁడైన గురువుఁ జంపిన సంగతి జ్ఞప్తిరాఁగా, నిట్టూర్పుగాలి తొందరతోఁ బెదవి యదరగాఁ, గనులనుండి మిడుగురులు గుట్టలుగుట్టలుగ మిక్కిలి రాలుచుండఁగా, శ్రీరామచంద్రుని ధిక్కరించుచు జామదగ్న్య ముని యైన పరశురాముఁడు సర్వోత్కర్షగ నున్నాఁడు.'

ఇచటఁ గూడ నపరాధ మొనర్చిన శ్రీరామచంద్రుఁ డాలంబనము. విల్లు

విరచిన ధ్వని యుద్దీపనము. నిట్టూర్పు విడుచుట, కనుల నిప్పురవ్వలు మొద లగు నవి రాలుట, యనుభావములు. మహాగురువధస్మృతికి వచ్చుట, గర్వము, ఉగ్రత, మొదలైనవి సంచారులుగఁ గ్రోధము వ్యక్తమగును. కాని, యది పరశు రాముని ప్రభావము వర్ధించుటకు బీజ మైన కవిమదిలోని ప్రీతియందు గుణీ భూతము గనుక రౌద్రరసధ్వని యన రాదు.

శ్రీ శర్వాణి.

ఇఱువదియొక్కమారుగ నీ భూమిని క్షత్రియరహితముగ నొన రించిన పరశురాముఁ డీలక్షణవలన బోధింపఁబడును. ఇందు 'ఒనరిం చిన' పర్యంతము లక్ష్యము. పరువాటది స్వార్థము. ఇదియే సరియైన లక్ష్యము. శ్లోకముసందలి 'దలితదృప్తభూభృద్గల' యను దాని కను గుణమును దాని యర్థమే. 'మదీయ' పదమున నీలక్షణా తాత్పర్యమును గ్రహింపఁ జేయును. అంతే కాని, తండ్రి యాజ్ఞచేఁ దల్లిఁ జంపుట యిట లక్ష్యము గాదు. అది ప్రకృతానుగుణమును గాదు. దాని కిచటఁ దాత్పర్యగ్రాహకమును లేదు. ఇచట, నాగన్న తెలివితక్కువ మాత్రమే యున్నది. 'నిర్దయం' అనునది తాత్పర్యగ్రాహక మని భ్రమ. అది 'పతతు' లో విశేషణము. అది భూభృత్తగు శ్రీరాముని విషయములోని క్రౌర్యమును మాత్రమే పోషించును. కావ్యప్రకాశములోని రౌద్రరసోదా హరణమైన 'కృత మనుమతం దృష్టం వా యైరిదం గురుపాతకమ్' అనుదానిలో వృత్తి రౌద్రరసమును వ్యంజన నొనరింపఁ గలదిగ లేదు. కనుక నది కవి శక్తి చాలమియే.

వీరము నాలుగు విధములు. దానము, దయ, యుద్ధము, ధర్మము. ఈచతురుపాధులనుండి యుత్సాహము చతుర్విధము లగును అందు దాన వీరోదాహరణము.

బ్రాహ్మణుని వేషముతోఁ గవచకుండలముల యాచించిన యింద్రున కవి యిచ్చుట కుద్యుక్తుఁడై, దాని నిచ్చుచున్న తన్నుఁ గాంచి యాశ్చర్య పడుచున్న సభ్యులఁ గూర్చి కర్ణుఁ డి ట్లనుచున్నాఁడు.

'ఇది నా కొక గొప్పవిషయము గాదు. యాచింప వచ్చిన ద్విజు నకు సాధారణ మైన కవచకుండలముల నిచ్చెదను. ఆతఁడే యర్థించినచోఁ

గృపాణమున ఖండించి రక్తధారలు స్రవింపుచున్న శిరమునే నివేదించెదను ’ అని.

ఇట యాచించు నాతఁ డాలంబనము. అతఁడు చేసిన స్తోత్రము లుద్దీపనము. కవచకుండలముల నిచ్చుటయు, నాయిచ్చుట మొదలగున దంతయు ననుభావము. *‘మే’ = నావిషయమునలో, నని యర్థాంతరసంక్రమిత వాచ్యధ్వనినుండి వ్యక్తమైన గర్వము. తాను లోకు లందఱకన్న గొప్పవాఁడైన తండ్రికిఁ గొడుకు నను దలంపును వ్యభిచారులు. ఇచట వృత్తి కూడ. నాయాచోటులం దర్థమునకుఁ దగునట్లు ప్రారంభమగుటయు, శిథిల మగుటయుఁ గల్గియున్నది అటఁ జమత్కారము సహృదయులు మాత్రమే గ్రహింపఁ గలరు. ఎట్లన : కవచకుండలము లొక లెక్కలోనివి కావని వానియందు జులకదనముతో నుత్సాహముఁ బోషించుటకై, దాని కనుకూల మగు కూర్పు మొదటిసగములో మృదుల రచనయు, శిథిలబంధముఁ గూర్పఁ బడినవి. రెండవసగములో, ‘మౌలిం’ = తల; అను పర్యంతము వక్తయందలి గర్వోత్సాహములఁ బోషించుటకై యుద్ధతముగ నున్నది. దాని పిమ్మట, బ్రాహ్మణునిఁ గూర్చి వినయముఁ జూపుటకై, దానికి మూలమైన గర్వాభావము (వినయము) వ్యక్తపఱచుటకు మరల శిథిలబంధము స్వీకరింపఁ బడినది. ఆవినయముఁ దెలుపుటకే ‘ఆవేదయామి = సమర్పింతును’ అన్నాఁడు గాని, ‘దదామి’ = ఇత్తును. ‘వితరామి’ = దాన మొనరింతును. అని యనలేదు.

శ్రీ శర్వాణి :

రాజ్యకోశము మొదలగు దానినంతయు నిచ్చుట నిట నర్థాంతరము. ఇట ‘మే’ యను దానికి వాచ్య మగు కర్ణుఁడు, పై వివరించిన యర్థాంతరసంక్రమిత సర్వస్వము నిచ్చువాఁడుగ ధ్వనించును. ‘మే =’ నా; యనుట సంజ్ఞామాత్రముగ నిరర్థకము గనుక, సంజ్ఞి = కర్ణుఁడు, రాజ్యకోశాది సకలదాతృత్వరూప మగు నర్థాంతరమున సంక్రమితుఁడుగా ధ్వనించును. అంతే కాని, యుద్ధములందు దెబ్బలతో జర్జరిత మై శరీరముఁ గలిగి యుండె నని నాగేశుఁడు సెప్పినది కానీ, రవి కుంతీసుతుఁ డని కానీ లక్ష్యము గాదు. అవి యిట లేశముఁ బ్రసక్తింపవు. ‘తన తల నైన నిచ్చెద’ ననుటలో, ‘నిది నాకొక యెక్కువా’? యనుటను బట్టి

ధ్యేయముఁ గూర్చిన చింత యతనికి లే దని తోచును. మఱియొకటి కాదు.
కనుక నవి లక్ష్యములు గావు. అపుడు ప్రయోజనముఁ గలుగదు.

సంస్కృత మూలము ;

ఇదం తు నోదాహార్యమ్—

యస్యోద్దామ దివా నిశార్ధి విలస ద్దానప్రవాహప్రథా
మాక ర్ణ్యావనిమణ్డలాగత వియద్వన్దీన్ద్ర బృన్దాననాత్
ఈర్ష్యా నిర్భరఫుల్ల రోమనికర వ్యావల్గ దూధఃస్రవ
త్పీయూషప్రకరైః సురేన్ద్ర సురభిః ప్రావృట్పయోదాయతే.

అ త్రేన్ద్రసభామధ్యగత సకలనిరీక్ష కాలమ్బనః ; అవనిమణ్డలాగత వియద్వన్దీన్ద్ర వదననిర్గతరాజదానవర్ణ నోద్దీపితః; ఊధం ప్రస్నుత పీయూషప్రకరై రనుభావితః; అసూయాదిభి స్సంచారిభిః పరిపోషితోఽపి కామగవీగత ఉత్సాహో రాజ స్తుతి గుణీభూత ఇతి నరసవ్యపదేశహేతుః; అత ఏవేద మపి నోదాహార్యం—

సాబ్ధిద్వీపకులాచలాం వసుమతీ మాక్రమ్య సప్తా న్తరాం
సర్వాం ద్యా మపి సస్మితేన హరిణా మన్దం సమాలోకితః
ప్రాదుర్భావ పరప్రమోద విదల ద్రోమాఞ్చిత స్తత్క్షణం
వ్యానమ్రీకృత కన్ధరోఽ సురవరో మౌలిం పురోన్య స్తవాన్.

ఇహ చ భగవద్వామనాలమ్బనః ; తత్కర్తృక మన్దనిరీక్షణోద్దీపితః ; రోమాంచాదిభిః అనుభావితః ; హర్షాదిభిః పోషితః ఉత్సాహో వ్యజ్యమా నోఽపి గుణః ; ప్రాగన్యగత స్యేవ ప్రకృతే రాజగత స్యాపి తస్య రాజ స్తు త్యుత్కర్షకత్వాత్ ; ఏతేన—

ఉత్పత్తి ర్జమదగ్నితః సభగవాన్ దేవః పినాకీ గురుః
శౌర్యం యత్తు నత ద్గిరాం పథి నను వ్యక్తం హి తత్కర్మభిః
త్యాగః సప్తసముద్రముద్రితమహీ నిర్వ్యాజదానావధిః
క్షత్రబ్రహ్మ తపోనిధేః భగవతః కిం వా న లోకోత్తరమ్.

ఇతి శ్రీవత్సలాఞ్ఛనోక్త ముదాహరణం పరాస్తమ్; తస్య గుణీభూతవ్యఙ్గ్యత్వేన రసధ్వని ప్రపఞ్చే ఽనుదాహరణీయత్వాత్; నను 'కియదిద మధికం...అకరుణ మపకృత్య' ఇత్యత్రాపి ప్రతీయమానస్య దానవీరస్య కర్ణస్తుత్యఙ్గత్వాత్ కథం ధ్వనిత్వ మితి చేత్; సత్యం; అత్ర కవేః, కర్ణవచనానువాదమాత్ర తాత్పర్యకత్వేన కర్ణస్తుతౌ తాత్పర్య విరహాత్; కర్ణస్య చ మహాశయత్వేన ఆత్మస్తుతౌ తాత్పర్యానుపపత్తేః స్తుతిః; అవాక్యార్థ ఏవ; పరస్తు, వీరరసప్రత్యయానన్తరం తాదృశోత్సాహేన లిఙ్గేన స్వాధికరణే సానుమీయతే; రాజవర్ణనపద్యే తు రాజస్తుతౌ తాత్పర్యా ద్వాక్యార్థ త్వైవ తస్యాః; ద్వితీయో యథా——

స కపోత! భవస్త మణ్వపి, స్పృశతు శ్యేనసముద్భవం భయం
ఇద మద్య మయాతృణీకృతం, భవదాయుః కుశలం కలేబరమ్.

అథవా - ఏవం విన్యాసః——

స కపోత కపోతకం తవ స్పృశతు శ్యేన! మనాగపి స్పృహా!
ఇద మద్య మయా సమర్పితం భవతే చారుతరం కలేబరమ్.

ఏషా శిబేః కపోతం శ్యేనం ప్రతిచోక్తిః; అత్ర కపోత ఆలమ్బనం: తద్గతం వ్యాకులీభవన ముద్దీపనం; తస్య కృతే స్వకలేబరార్పణ మనుభావః; న చాత్ర శరీరదాన ప్రత్యయా ద్దానవీర ధ్వనిత్వాపత్తి రితి వాచ్యం; శ్యేనకపోతయోః భక్ష్యభక్షక భావాపన్నత్వేన శిబిశరీరస్యార్థినో ఽభావాత్త దప్రతిపత్తేః; శ్యేనశరీర త్రాణోపాధికతయా వినిమయపదవాచ్యత్వాత్;

తృతీయో యథా——

రణే దీనాన్ దేవాన్ దశవదన! విద్రావ్యవహతి
ప్రభావప్రాగల్భ్యం త్వయి తు మమకోఽయం పరికరః
లలాటోద్యజ్జ్వాలా కవలిత జగజ్జాల విభవో
భవో మే కోదణ్డచ్యుత విశిఖవేగం కలయతు

ఏషా దశవదనం ప్రతిభగవతో రామ సో క్తిం; ఇహ భవ ఆల మ్బనం; రణదర్శన ముద్దీపనం; దశవదనావజ్ఞాన మనుభావః; గర్వః సంచారీ; వృత్తి రత్ర దేవానాం ప్రస్తావే తద్గత కాతర్యప్రకాశన ద్వారా వీరరసానాలమ్బనత్వా విగతోత్సాహా నాలమ్బనత్వేన తదాలమ్బనస్య రసస్యా ప్రత్యయా స్వప్రకర్షవతీ; భగవతో భవస్య తు పరమోత్త మాలమ్బన విభావత్వా త్తత్ప్రస్తావే తదాలమ్బన స్యోజస్వీ నో వీర రసస్య నిష్పత్తేః ప్రకృష్టోద్ధతా.

తెలుఁగు తాత్పర్యము :

'ఆరాజు రాత్రింబవళ్ళు కూడ యాచకుల కత్యంతముగ నెడతెరపి లేకుండ దాన మొనరించుచున్నాఁ డను కీర్తిని, స్వర్గలోకమునకు వచ్చిన స్తుతి పాఠకులలో మొనగాళ్ళ నోటినుండి విని యీర్ష్యతోఁ గామధేనువు నిండి, రోమాంచ మధిక మై, పిక్కలి చేపుచున్న పొదుగునుండి యమృతము కారగా వర్షాకాలము నందలి మబ్బువలె నగుచున్నది .

ఇచట నింద్రసభలోనుండి చూచువా రిందఱు నాలంబనము, భూమండ లమునుండి వచ్చిన వియద్వందింద్రుల నోటినుండి వెలువడిన రాజదానస్తుతి వర్ణన యుద్దీపనము. పొదుగునుండి పిక్కలి స్రవించిన పాలధార లనుభావము. అసూయాదులు సంచారులు. ఇవి పోషించిన కామధేనువు నందలి యుత్సాహము రాజస్తుతిలో గుణీభూత మైనది. కనుక రస మనుటకు హేతువు గాదు. ఇందుచేత నిదియుఁ గూడ నుదాహరింపఁ దగదు.

'సముద్రములు, ద్వీపములు, కులాచలములు వీనితోడి భూమి నంతయు నేడుప్రాకారముల నున్న ద్యులోకము నంతయుఁ గూడ నాక్రమించి శ్రీమ న్నారాయణుఁడు చిఱునగవుతో మెల్లగాఁ జూడ, నసురేంద్రుఁ డగు బలిచక్ర వర్తి గొప్ప సంతోష ముదయించి గగుర్పాటొదవ మెడ వంచి శిరమును ముందుంచి నాఁడు'.

ఇచటఁ గూడ భగవానుఁ డగు వామనమూర్తి యాలంబనము. ఆతని మెల్లని చూపు లుద్దీపనము. రోమాంచాదు లనుభావములు. హర్షాదులు సంచా రులు. ఇవి పోషింపఁగా నుత్సాహము వ్యక్తమగు చున్నను గుణీభూతమే.

* వెనుకటి పద్యములో మఱియొకరియం దున్నట్లుగాఁ, బ్రకృతములో రాజునం దుండియు నది బలిస్తుతి నుత్కర్షించును గదా. ఇందువలన, 'త్యాగ స్స ప్త సముద్రముద్రిత మహీనిర్వ్యాజ దానావధిః' అని శ్రీవత్సలాంఛనుఁడు గావ్య ప్రకాశమునకు సారబోధిని యను వ్యాఖ్యలో నుటంకించిన యుదాహరణము గూడఁ ద్రోసివేయఁబడినది. అది గుణీభూతవ్యంగ్యము. అట వ్యక్తమగు నుత్సాహము పరశురాముని పొగడ్తనుండి వ్యక్త మైన కవి రతి నుత్కర్షించును గదా. కనుక రసధ్వని ప్రసంగములో నెది యుదాహరింపఁ దగదు.

అయితే, అకరుణ మవకృత్య'—బ్రాహ్మణుఁడు యాచింపు చుండఁగ; నను చోటఁ గూడ దానవీరము దోఁచుచున్నను గర్ణుని పొగడ్తలో నంగమే. కనుక ధ్వని యెట్లగును?' అన్నచో, నిజము. ఇటఁ గర్ణుఁ డన్నమాటల ననువదించుటలోనే కవికి తాత్పర్యము. • కర్ణుని పొగడ్తలోఁ దాత్పర్యము లేదు. ఇఁకఁ గర్ణుఁడా? మహానుభావుఁడు. కనుకఁ దన్ను తాను పొగడుకొనుట అతని తాత్పర్య మనరాదు గదా కాఁగా, నిట స్తుతివాక్యార్థము కానేకాదు. ఇఁక నేమి యన? వీరరసము స్ఫురించిన తరువాత నా యుత్సాహమున కంగముగ నాయుత్సాహమున కధికరణ మగు కర్ణునియందు స్తుతి యూహింపఁబడును. వెనుకటిది రాజవర్ణనపద్యము గనుక నందుఁ గవి కభిమత మైన రాజస్తుతి వాక్యార్థమే.

శ్రీశర్వాణి :

* యస్యోత్సాహ యను పద్యములో నుత్సాహము = ఉత్కర్షకము. కామధేనువునం దున్నది. ఉత్కర్షింపఁ బడునది రాజస్తుతి వ్యధికరణము వేరుచోటున నున్నది. ప్రకృతములో రెండు నొకచోటనే బలియం దున్నవి. కనుక సమానాధికరణములు. ఈభేద మున్నను, రెండుచోట్ల యుత్సాహములు మఱియొక దాని నుత్కర్షించి దాని కంగ మగుట సమానమే యని భావము.

• స్తుతివాక్యార్థము గా దనఁగా, నిట నీశ్లోకరూప మగు వాక్యము స్తుతినిఁ దెలుప దని. కవికిఁ గర్ణస్తుతియందుఁ దాత్పర్యము లేదు. కర్ణుఁడా ఉదారుఁడు. అతని కాత్మస్తుతియందుఁ దలంపు జనింపదు. ఇట్లు తాత్పర్యము లేని స్తుతిలో వీరము- ఉత్సాహ మె ట్లంగ మగును? సరి కాని, 'కియదిద మధికం మే' యను పద్యములోఁ గర్ణుఁ డుదారాశయుఁ డని స్తుతి

కిన్నడను గదా? ఇట నది వాచ్యార్థ మేల కాదు? అందురా? అచటి యుత్సాహము లింగమై = హేతువై, తన యధికరణ మైన శ్రోత హృదయమునఁ 'గద్దఁడు స్తుతింపఁ దగును. అంతటి యుత్సాహ మున్నది కనుక'; నని తోఁచును 'యస్యోద్దామ' 'సాబ్ధిద్వీప' యను వానిలో రాజస్తుతి ప్రస్తుతమే ప్రధానము. అందులో నుత్సాహాదిక మంతయు నప్రధానము. కనుక 'అంగము' అని తెలియ నగును

రెండవది దయావీరము; ఎట్లనఁగా :

“ఓ పావురమా! డేగనుండి కొంచెము గూడ భయము నిన్నంట కుండు గాక! ఇదిగో, ఇపుడు నీయాయువును భద్రపఱచుటకై నా కళేబర మును స్వీకరించితిని.'

పోనీ, యీరీతిగ శ్లోకమును విన్యసింతము.

'ఓ శ్యేనమా! నీకుఁ గపోతకిశోరమందు లేశమైనఁ గోరిక తగుల కుండుగాక! ఇదిగో, ఇప్పు డంతకన్న నెక్కువ రుచిగల నా దేహమును నేను సమర్పించితిని.'

మొదటిది పావురముఁ గూర్చియు, రెండవది డేగఁ గూర్చియు, శిబిచక్రవర్తి యను మాట. ఇచటఁ బావుర మాలంబనము. అది కలవర పడుచుండుట యుద్దీపనము. దాని నిమిత్తము తన శరీరము నర్పించుట యనుభావము. అయితే యిచట శరీరమును దాన మొనర్చుట తెలియు చున్నది. అందుచే దానవీరము ధ్వనింపవలసి వచ్చునే యని శంకింపరాదు. డేగయుఁ, బావురమును భక్షకము, భక్ష్యము సహజముగనే యగును. కనుక, నట శిబిని శరీరము నర్థించుటయే లేదు. ఇఁక దానము స్ఫురించుట కవకాశ మేది? డేగకు శరీర మర్పించుట. పావురముయొక్క దేహముఁ గాచు నిమిత్తమే, కనుక నిది వినిమయము. ఇచ్చి పుచ్చుకొనుట వంటిది యని తెలియ నగును.

మూఁడవది యుద్ధవీరము. ఎట్లనఁగా——

యుద్ధములోఁ జేతకాని దేవతలఁ బరుగెత్తించి మంచిశక్తి గల వాఁడ నని ప్రగల్భము లాడుకొను నీకొఱకై యింత ప్రయత్న మేల? నుదుటినుండి పైకెగయుచున్న మంటల చాలులో, లోకము లన్నింటి

వైభవముఁ గలిగించిన భవుఁడు = శివుఁడు, నేను వింటి నుండి విడుచు సంబులపడిని గుఱుతించుఁ గాక'

ఇది రావణునిఁ గూర్చి భగవానుఁ డగు శ్రీరామచంద్రుఁ డను మాట. ఇటఁ భవుఁ వీరరసమున కాలంబనము. రావణుఁడు గాడు. శ్రీరామమూర్తి కతనియం దవజ్ఞాదృష్టి కదా యున్నది? యుద్ధదర్శన ముద్దీపనము. రావణుని యవజ్ఞ యనుభావము. గర్వము సంచారిభావము. ఈశ్లోకములో దేవతలఁ బ్రస్తావించు నపుడు వారి కున్న భయమును బయల్పఱచుటకై, వారు (దేవతలు వీరరసమున కాలంబనము గా దని తెలియుటకై) వృత్తి యౌద్ధత్యము లేకయే యున్నది. రావణుని ప్రస్తావములో దేవతల గర్వ మడఁచిన వీరుఁ డని చెప్పుటకై రచన కొంత యుద్ధత మైనను, ఆతనియం దవమానబుద్ధితో నుండు శ్రీరామచంద్రుని యుత్సాహమున కెట్టి యాలంబనము గాలేదు. కనుక వీరరసము స్ఫురించుటకు రావణుఁ డాధారము గాడు. కావుననే యిట వృత్తి యుత్కృష్టతో లేదు. భగవానుఁడు భవుఁడే యగుచో నత్యంతోత్కృష్టమగు విభావము. అందుచే నతని ప్రస్తావించినపుఁ డతఁ డాలంబనముగా నుండు వీరరస మోజోవంతముగనే నిష్పన్న మగును. కనుక నట వృత్తి చాల యుద్ధత మైనది.

సంస్కృత మూలము :

చతుర్థో యథా—

సపది విలయ మేతు రాజ్యలక్ష్మీ రుపరిపతం త్వథవా కృపాణధారాః అపహరతు తరాం శిరః కృతాన్తో మమతు మతిర్న మనాగపైతి ధర్మాత్। ఏషాధర్మేణాపి రిపుః జేతవ్యః ఇతి వదన్తం ప్రతి యుధిష్ఠిరోక్తిః। అత్ర ధర్మవిషయ ఆలమ్బనం। 'నజాతు కామా న్నభయాన్న లోభా ద్ధర్మం త్యజేజ్జీవిత స్యాపి హేతోః' ఇత్యాది వాక్యాలోచన ముద్దీపనం। శిరశ్ఛేదా ద్యంగికారో౽నుభావః। ధృతిః సంచారిణీ। ఇత్థం వీరరసస్య చాతుర్విధ్యం ప్రపంచితం ప్రాచా మనురోధాత్।

వస్తుతస్తు, బహవో వీరరసస్య శృంగారస్యేవ ప్రకారా నిరూపయితుం శక్యన్తే।

తెనుఁగు తాత్పర్యము :

నాల్గవది - ధర్మవీరము - ఎట్లనగా -

"రాచసిరి యంతయు వెంటనే లయ మొందుగాక! వాలు కత్తుల వాడి మొనలు పైన బడుగాక! యముఁడు తల తీయుగాక! నాబుద్ధి ధర్మమునుండి లేశమును తొలఁగి పోకుండు గాక!"

ధర్మము తప్పి యైనను శత్రువును జయించవలె నను వానితో ధర్మరాజు అనుమాట యిది. ఇట ధర్మపువిషయ మాలంబనము. ('ఏదైన కోరిక వలన గాని, భయపడి గాని, లోభము వలన గాని, చిట్టచివరకు ప్రాణము కొరకైన సరే ధర్మమును వీడరాదు) - అను నిటువంటి మాటల నాలోచించుట ఉద్దీపనము. "తల తీసినా సరే" అను ఈరకపువాటి నంగీకరించుట అనుభావము. ధైర్యము సంచారిభావము. ఈతీరుగా ప్రాచీనులను బట్టి వీరరసము నాల్గు తెరగులును విస్తరింపఁబడినవి. కాని, వాస్తవముగా నాలోచించినచో శృంగారమున వలెనే వీరమున గూడ చాల ప్రకారములు నిరూపింప వీలగును.

శ్రీ శర్వాణి :

"రాచసిరి" ఇది మొదలు "శేషుఁడు భూమినంతను" వరకు కవికిఁగల భారత పరిచయము వ్యక్తపరుపఁ బడినది. మధ్య నొకటిరెండు విషయాంతరములు. తిరిగి "చరాచర" అనునది శ్రీభాగవతపురాణ పరిచయమును దెల్పును. ఇట్లే ఇతని పాండిత్యమును గమనింపవలెను,

సంస్కృత మూలము :

తథాహి - ప్రాచీన ఏవ 'సపది విలయమేతు' ఇత్యాది పద్యే "మమతు మతిర్న మనాగపైతు సత్యాత్ 'ఇతి చరమపాద వ్యత్యాసేన పద్యాన్తరతాం ప్రాపితే సత్యవీరస్యాపి సంభవాత్। న చ సత్యస్యాపి ధర్మాంతర్గత తయా ధర్మవీరరస ఏవ తద్వీరస్యాప్యన్తర్భావ ఇతి వాచ్యం; దానదయయోరపి తదన్తర్గతతయా తద్వీరయో రపి ధర్మవీరాత్పృథగ్గణనా నౌచిత్యాత్।

ఏవం పాణ్డిత్యవీరోఽపి ప్రతీయతే - యథా -

"అపి వక్తి గిరాం పతిః స్వయం యది తాసామధిదేవతాపి వా
అయమస్మి పురో హయాననస్మరణోల్లంఘిత వాఙ్మయామ్బుధిః॥"

అత్ర బృహస్పత్యాద్యాలమ్బనః సభాదిదర్శనోద్దీపితః నిఖిలవిద్వత్తిరస్కారానుభావితః గర్వేణ సంచారిణా పోషితః ఉత్సాహో వక్తుః ప్రతీయతే। నన్వత్ర యుద్ధవీరత్వమ్। యుద్ధస్యాస్య వాదసాధారణస్య వాచ్యత్వాత్। ఇతి చేత్, క్షమావీరే కిం బ్రూయాః? యథా -

"అపి బహలదహనజాలం మూర్ధ్ని రిపుర్మే నిరన్తరం ధమతు
పాతయతు వాసిధారామహమణుమాత్రం న కించిదాభాషే॥"

క్షమావత ఉక్తిరియమ్। బలవీరే వా కిం సమాదధ్యాః? యథా -

'పరిహరతు ధరాం ఫణిప్రవీరః సుఖమయతాం కమఠోఽపి తాం విహాయ
అహమిహ పురుహూత! పక్షకోణే నిఖిలమిదం జగదక్లమం వహామి॥"

పురుహూతం ప్రత్యేషా గరుత్మత ఉక్తిః। నను 'అపి వక్త్రి-' 'పరిహరతు ధరామ్-' ఇతి పద్యద్వయే గర్వ ఏవ నోత్సాహః। మధ్యస్థపద్యే తు ధృతిరేవ ధ్వన్యతే ఇతి భావధ్వనయ ఏవైతే న రసధ్వనయః ఇది చేత్, తర్హి యుద్ధవీరాదిష్వపి గర్వాదిధ్వనితామేవ కిం న బ్రూయాః। రసధ్వనిసామాన్యమేవ వా కిం న తద్వ్యభిచారధ్వననేన గతార్థయేః? స్థాయిప్రతీతిర్దురపహ్నవా చేత్తుల్యం ప్రకృతేఽపి। అనన్తరోక్తపద్యే తు నోత్సాహః ప్రతీయతే। దయావీరాదిషు ప్రతీయత ఇతి తు రాజ్ఞామా (రాజా) జ్ఞామాత్రమ్।

తెనుఁగు తాత్పర్యము :

ఈ వెనుక నున్న పద్యములోనే "మమతు మతిర్నమనాగపైతు సత్యాత్" (నా బుద్ధి సత్యము నుండి తొలగ కుండుగాక) అని చివరిపాదమును మార్చినచో నది మరొక పద్యమై 'సత్యవీరము' కూడ సంభవించును. "అదేమయ్యా?

సత్యము కూడ ధర్మముకాదా ? కనుక నది ధర్మముతోనే యంతర్భవించును." అనరాదు. అట్లా ఆలోచించినచో, దానమును, దయయును మాత్రము ధర్మములు కూడ ధర్మములో జేరునవే కనుక ఆవీరములను కూడ ధర్మవీరము కన్న వేరుగా గణించుట యుచితము కాకపోవును. ఇట్లే పాండిత్య వీరము కూడ స్ఫురించును, ఎట్లనగా – ("మాటలరాజగు బృహస్పతి స్వయముగా మాటాడ గల్గునా ? ఆమాటల యధిదేవత సరస్వతియైనా కానీ, మాటాడగల్గునా ?) ముందున్న నే నెవరో ఎరుగుదువా ? హయగ్రీవుని స్మరణముచేత వాఙ్మయ మనే సముద్రమును దాటిన నేను సుమా !")

ఇక్కడ బృహస్పతి యాలంబనముగా, సభాసదులను జూచుటవల్ల నుద్దీపిత మై విద్వాంసుల నందరిని తిరస్కరించుట యను ననుభావముతో గర్వము సంచారియై తనను బోషింపగా వక్తయొక్క యుత్సాహము స్ఫురించును. "అగునయ్యా ? యిచట యుద్ధవీరము సుమీ ! వాదము కూడా యుద్ధమే యను నట్లు చెప్పఁదగును కదా !" అనెదరా ? క్షమావీరములో నేమందురు. ఎట్లనగా – ("శత్రుడు నాతల మీద నిప్పులకుప్ప బోసి విడువకుండ ఊదర పెట్టినా సరే. కత్తివాదర నుంచినా సరే, నేను కొంచెమైనా ఏమీ అనను.) మంచి యోర్పుగల వాని మాట యిది. బలవీరమును గురించి ఏమి సమాధానింతము ? ఎట్లనగా – 'శేషుఁడు భూమిని విడిచివేయునుగాక, ఆదికూర్మము కూడ దానిని (భూమిని) వీడి సుఖపడు గాక. ఓ యింద్రా ! నేను, నా రెక్కయంచున నిక్కడ బ్రహ్మాండము నంతను అనాయాసముగా మోయుదును.

ఇంద్రునితో గరుత్మంతుఁ డను మాట యిది –

''ఏమయ్యా ?'' మాటల రాజగు ('అపివక్తి') ''శేషుఁడు భూమిని వీడి" (పరిహరతు ధరాం) ''అను రెండు చోట్లను గర్వమే కాని ఉత్సాహము కాదు. నడుమ నున్నదానిలో – 'శత్రుఁడు నాతలమీద' ('అపి బహల దహన జాలం') అనేచోట ధృతియే ధ్వనించును. కాగా ఇవి మూడును భావధ్వనులే కాని రసధ్వనులు కావు ''అంటారా ? అయితే యుద్ధవీరాదులందు, గర్వాది ధ్వను లనియే అననేల ? ఇంతెందుకు ? అసలు రసధ్వని యంతను * గూడ వ్యభిచారి ధ్వనిగానే ఏల సరిపెట్టవు ? స్థాయిభావము ప్రతీయ మగుచుండగా నది (రసము) లేదని బొంకుట తగదందురా ? ప్రకృతములో గూడ నంతే. ''అదికాదు" ఈ వెనుక నున్న దానిలో – 'శేషుడు భూమి విడచి – "అను దానిలో మాత్ర

ముత్సాహము స్ఫురింపదు. ఉదాహరణములలో మాత్రము స్ఫురించును" అనుట రాజాజ్ఞ మాత్రమే.

శ్రీ శర్వాణి :

: 'రసధ్వని యంతయు' అనఁగా రసము ధ్వనించుచోట వ్యభిచారు లవశ్యము స్ఫురించియే తీరును గనుక, అది యుభయులకును అపరిహార్యము కూడ కనుక, వ్యభిచారి భావధ్వని యనుటతోనే సరిపడుచుండగా 'రస ధ్వని' యని క్రొత్తకలన మేల? యని యాక్షేపణ. అయితే వ్యభిచారులు ధ్వనించు ననుట కైనను ఒకస్థాయి యగు భావము లేనిదే వ్యభిచారిభావ మేర్పడదు. స్ఫురింపదు. రతి యను స్థాయిభావము లేనిదే శృంగార లజ్జ యను వ్యభిచారిభావ మేర్పడదు. వానిని త్రోచివైచి, హర్షము మొదలగు భావము లుదయించుటకు గూడ వెనుకటి రతి యట స్థాయిగా నున్ననే కుదురును కనుక పరస్పరోపమర్దముతో - ఒకదానిని మరొకటి తోసి వేయుచునే యుదయింపగల యీవ్యభిచారులు స్థాయిని స్ఫురింపఁజేయక తప్పదు. ఇవన్నియు స్థాయినుండి యేర్పడునవే కదా! వహ్నినుండి యేర్పడిన ధూమము వహ్నిని వెంటనే అవగమింపక జేయక మానదు కదా! కనుక స్థాయి ధ్వనిని ఈచోట్ల నంతటను అంగీకరింపక తప్ప దనెదరా? ఈసంగతి నీవు చెప్పిన చోట్లను నేను చెప్పిన చోట్లను సమానమే నని. అనగా నేను - పండితరాజు నిరూపించిన స్థలములందు - 'అపివక్తి' ఇత్యాదులందుఁ గూడ స్థాయి - ఉత్సాహము వ్యభిచారి - గర్వము వలన స్ఫురింపక తప్పదు కనుక రసధ్వని. ఇక్కడ నీవిషయ మవశ్యము గ్రహింపవలెను. "గ్రామతరుణం" అనుచోట గ్రామతరుణదర్శనమున గ్రామతరుణికి మొగము విస్ఫురితము కావలసి యుండఁగా నట్లు కాక ముఖము మలినమగు టేమి? యని "అకారణా త్కార్యజన్మ చతుర్థీస్యా ద్విభావనా" యను విభావనాలంకారము - వాచ్యము ప్రప్రథమమునఁ జమ త్కార మొదవించును ఇచట విషాదమున కనుభావము ముఖమాలిన్య మున్నను, అది విషాదమునందు సహృదయుల భావమును వెంటనే విశ్రాం తము లొనర్పలేదు. ఏమనగా - వాచ్యము ఎట్ట యెదుట తన చమత్కార ముతో మనల నావంక కీడ్చును. అందువలన అశోకమంజరిని, త్రుంపదగని దానిని త్రుంచెనే యనియు గూడ మొగము నల్లవడ వచ్చును గనుక వాచ్య

గిత చమత్కారమునందే మనము మొట్టమొదట విశ్రాంతుల మగుదుము. పిమ్మట ఆతరుణీ తరుణపృచ్ఛాంతమును పర్యాలోచన మొనర్పఁగా దూర మున నీ మాలిన్యము సంకేతభంగ జనిత మగు విషాదమువలన గల్గిన దని తెలియవచ్చును. కాగా. అసలు వ్యభిచారిభావమే చాల తరువాత = దూర ముగా గాని స్ఫురింపదు. ఇంతా స్ఫురించినా వాచ్యముతో కలిసియే అది చమత్కరించినా, వాచ్యపు చమత్కారము కన్న తక్కువగానే యుండును. కనుక వ్యభిచారిభావము సద్యస్స్ఫురితమై వెంటనే స్థాయిభావము నాస్వా దింపఁ జాలదు. కనుక యిది రసధ్వనిస్థల మగుట కెట్టి యవకాశమును లేదు. వాచ్యమున కన్న న్యూన చమత్కారమే కనుకను, ముఖమాలిన్యా పాదక మగు విషాదము సంకేతభంగ జనిత మగు విషయము బహుదూర వర్తి కనుకను, స్థాయికి ప్రథమస్ఫూర్తి లేకపోగా వాచ్యమే తన చమ త్కారమున మన మనసులకు విశ్రాంతి నిచ్చును. కనుక నిది గుణీభూత వ్యంగ్యమే. ఇక "ప్రహరవిరతౌ" అను స్థలమున విప్రలంభరతి ప్రముఖ వేద్యమే కనుకను, విషాదశోకాదు లన్నియు దానినే యిట నుపస్కరించు చున్నవి కనుకను, నది రసధ్వనియే. కాగా, నిష్కర్ష మిది: స్థాయి ప్రముఖ స్ఫురిత మగుచో రసధ్వని యగుట తప్పదు. అట్లు కాదేని గుణీభూత వ్యంగ్యము.

సంస్కృత మూలము :

అద్భుతో యథా—

'చరాచర జగజ్జాలసదనం వదనం తవ
గల ద్గగన గామ్భీర్యం వీక్ష్యాస్మి హృతచేతనా॥'

కదాచి ద్భగవతో వాసుదేవస్య వదన మాలోకితవత్యా యశో దాయా ఇయముక్తిః। అత్ర వదన మాలమ్బనం। అంతర్గత చరాచర జగజ్జాల దర్శన ముద్దీపనం। హృతచేతనత్వం, తేన గమ్యం రోమాఞ్చ నేత్రస్ఫారణాది చానుభావః। త్రాసాదయో వ్యభిచారిణః। నైవాత్ర విద్యమానాపి పుత్రగతా ప్రీతిః ప్రతీయతే। వ్యంజకాభావాత్। ప్రతీతా యాం వా తస్యాం విస్మయస్య గుణత్వం నయుజ్యతే। ఏవం కశ్చి

న్మహాపురుషోయ మితి భక్తి రపి తస్యాః పుత్రో మమాయం బాల ఇతి నిశ్చయేన ప్రతిబన్ధా దుత్పత్తుమేవ నేష్టే । అత స్తస్యా మపి విస్మయస్య గుణీభావో నశంక్యః ।

యచ్చ సహృదయశిరోమణిభిః ప్రాచీనై రుదాహృతం—

"చిత్రం మహానేష నవావతారః ! క్వ కాన్తి రేషాభినవైవ భంగిః !
లోకోత్తరం ధైర్య మహో ప్రభావః! కాప్యాకృతి! ర్నూతన
ఏష సర్గః ! " ఇతి.

తత్రేదం వక్తవ్యం - ప్రతీయతాం నామాత్ర విస్మయః, పరం త్వసౌ కథంకారం (అద్భుతరస) ధ్వనివ్యపదేశహేతుః ? ప్రతిపాద్య మహాపురుషవిశేష విషయాయాః ప్రధానీభూతాయాః స్తోతృగతభక్తేః ప్రకర్షైకత్వేనాస్య గుణీభూతత్వాత్, యథా - మహాభారతే గీతాసు విశ్వ రూపం దృష్టవతః పార్థస్య" పశ్యామి దేవాం స్తవ దేవ దేహే సర్వాం స్తథా భూత విశేష సంఘాన్" ఇత్యాదౌ వాక్య సన్దర్భే । ఇత్థం చాస్య రసాలంకారత్వ ముచితం । భక్తి ర్నైవాత్ర ప్రతీయత ఇతి చే ద్దర ముకుళితలోచనం విదాం కుర్వన్తు సహృదయాః ।

తెనుఁగు తాత్పర్యము :

అద్భుత మెట్లనఁగా - ( "స్థావరజంగమ ప్రపంచ మంతయు నీనోటిలో నెలవుకొని యున్నది. నీనోటిముందు ఆకాశపు గాంభీర్య మేటిపాటి ? ఇట్టి నీనోటిని జూడఁగా నాతెలివి తప్పుచున్నది.)

ఒకప్పుడు భగవానుఁడగు వాసుదేవుని నోరు జూచి యశోద యిట్లన్నది. ఇట వదన మాలంబనము. దానిలో చరాచరజగజ్జాల మగుపడుట యుద్దీపనము. తెలివితప్పి పోవుటయు, దానివలనఁ దోచు రోమాంచమును (గగుర్పాటు) కనులు విప్పారుట మొదలగునవి యనుభావములు. భయము మొదలగునవి వ్యభిచారులు. ఇచ్చట 'బిడ్డ' డను ప్రీతి యశోద కున్నను అది తోచుట లేదు. దానిని వ్యక్తి మొనర్చున దేదియు నిట లేదుకదా ! పోనీ, అది స్ఫురించినను అందులో నీవిస్మ యము గుణ మగుట కుదురదు (ఈప్రకరణ మంతయు బర్యాలోచించి నపుడు

యశోదకు శ్రీకృష్ణునందుఁ గల ప్రీతి తోచక మానదని స్ఫురించినా శ్లోకార్థము మాత్రము విస్మయవ్యంజకమే కాని ప్రీతివ్యంజక మెట్లును కాదు. కనుక నిట పట్టమొదట దోచు ముఖ్యవాక్యార్థ మద్భుతమే యని భావము. ఇట్లే ఎవరో యొక మహాపురుషుఁ డీతఁ డను భక్తియుఁ గూడ, నాబిడ్డ డీతఁ డను నిశ్చయ మామె కున్నది కనుక ఉదయింపనే చాలదు. కాగా ఆభక్తిలో గూడ ఈవిస్మయము గుణీభూత మనుకొనరాదు.

సహృదయశిరోమణు లగు ప్రాచీను లుదాహరించిన దిది.

( "చిత్రము నీయవతారము గొప్పది. ఈకాన్తి యెక్కడ ? అసలీతీరే సరిక్రాన్తది. ధైర్యమా లోకోత్తరము. ప్రభావమా ఆశ్చర్యము. ఆకారమా ? విలక్షణము. అసలీ సృష్టియే నూతనము." ) ఇట నీమాట చెప్పవలసి యున్నది. ఇచట విస్మయము స్ఫురించును గాక. కాని యిది అద్భుతరసధ్వని యనుటకు ఎట్లు వీలగును ? ఏమంటే ఇచట ఒక గొప్ప పురుషవిశేషుని గూర్చిన భక్తిని ప్రధానముగా స్తోత ప్రతిపాదించు చున్నాఁడు. దానికీ విస్మయము గొప్పఁదనమును సమకూర్చుచున్నది. కనుక ఆభక్తిలో ఈవిస్మయము గుణీభూత మగును. ఎట్లనగా మహాభారతములో గీతలందు, విశ్వరూపమును జూచి అర్జునుఁడు ( "పశ్యామి దేవాంస్తవ దేహే సర్వాంస్తథాభూత విశేషసంఘాన్" ) దేవతలును, భూతవిశేషములును అన్నియు నోదేవా ! నీశరీరమున గన్పడుచున్నవి. "ఇత్యాదికములగు మాటల సందర్భమున గూడ ఇట్లే శ్రీకృష్ణభగవానుని గూర్చిన భక్తిలో విస్మయము గుణీభావము నొందును కదా ! కాగా పై ఉదాహరణమున "చిత్రము" అనునది రసాలంకార మగుట యుచితము. అసలిచట భక్తి స్ఫురించుటయే లేదందురా ? కొంచెము కనులు మూసికొని సహృదయులు బోధపరచుకొందురుగాక ! (నిజమున కిచట పండితుని మతము ననుసరించి రెండవ కావ్య లక్షణమువద్ద చెప్పినట్లుగా గుణీభూత మగు విస్మయమును బట్టియు నీశ్లోకము అద్భుతరస ధ్వనియే. వాచ్యాపేక్షయా ప్రధానీభూతం వ్యంగ్యాన్తర మాదాయ గుణీభూతం వ్యంగ్య మాదాయాతివ్యాప్తివారణాయావధారణం. తేన తస్య ధ్వనిత్వమేవ" = వాచ్యార్థముకన్న ప్రధానముగాను, మరొక వ్యంగ్యముకన్న నప్రధానముగాను నుండి చమత్కారము నొదవించు వ్యంగ్యమును బట్టి అతివ్యాప్తి రాకుండ వారించుటకై అవధారణ (ఏవ) ముపయోగింపఁ బడినది. "అనికదా అట నన్నది. కాగా, ఇట విస్మయమే సర్వతః

ప్రధానముగా నుండు కావ్యము కాదని తాత్పర్యము. పూర్వపక్షి మతమున ధ్వనికావ్య మనఁగా నదియే. రసభావాదికము సర్వతః ప్రధానముగా నుండు కావ్యమే యని యర్థము రసము నట్టిది కాదని వారిపరిభాషను బట్టి నిషేధించె నని గ్రహింపనగును )

సంస్కృత మూలము.

హాస్యో యథా—

"శ్రీతాతపాదై ర్విహితే ప్రబన్ధే నిరూపితా నూతన యుక్తి రేషా
అఙ్గం గవాం పూర్వ మహో పవిత్రం నవా కథం రాసభధర్మపత్న్యాః."

తార్కికపుత్రోఽత్రాలమ్బన । తదీయా నిశ్శంకోక్తి రుద్దీపికా । రదనప్రకాశా ది రుద్వేగాదయశ్చ అనుభావ వ్యభిచారిణః । అత్రాహుః-

ఆత్మస్థః పరసంస్థశ్చే త్యస్య భేదద్వయం మతమ్
ఆత్మస్థో ద్రష్టు రుత్పన్నో విభావే క్షణమాత్రతః ॥
హస న్త మపరం దృష్ట్వా విభావ శ్చోపజాయతే
యోసౌ హాస్యరస స్తజ్ఞైః పరస్థః పరికీర్తితః ॥

ఉత్తమానాం మధ్యమానాం నీచానా మ ప్యసౌ భవేత్
త్ర్యవస్థః కథిత స్తస్య షడ్భేదాః స న్తి చాపరే॥
స్మితం చ హసితం ప్రోక్తం ఉత్తమే పురుషే బుధైః
భవే ద్విహసితం చోపహసితం మధ్యమే నరే॥

నీచే ఉపహసితం చా తిహసితం పరికీర్తితమ్
ఈషత్ఫుల్లకపోలాభ్యాం కటాక్షై ర ప్యనుల్బణైః॥
అదృశ్య దశనో హాసో మధురః స్మిత ముచ్యతే
వక్త్ర నేత్ర కపోలై శ్చే దుత్ఫుల్లై రుపలక్షితః ॥

కించి ల్లక్షిత ద న్తశ్చ తదా హసిత మిష్యతే
నశబ్దం మధురం కాయగతం వదనరాగవత్॥

అకుఞ్చితాక్షి మస్వ్రం చ విదు ర్విహసితం బుధాః
నికుఞ్చితాంస శీర్షశ్చ జిహ్మ దృష్టి విలోకనః ॥
ఉత్ఫుల్లనాసికో హాసో నామ్నోపహాసితం మతమ్
అస్థానజః సాశ్రుదృష్టి రాకమ్ప స్కన్ధ మూర్ధజః॥
శార్ఙ్గదేవేన గదితో హాసోఽపహసితాహ్వయః
స్థూలకర్ణ కటుధ్వానో బాష్పపూర ప్లుతేక్షణః
కరోపగూఢ పార్శ్వశ్చ హాసోతి హసితం మతమ్॥ ఇతి.

తెనుఁగు తాత్పర్యము:

హాస్య మెట్లనఁగా—

ఈ హాస్యము తనయం దుండున దనియు (ఆత్మస్థము), ఇతరులయం దుండునదనియు (పరసంస్థము) రెండువిధములు ఏదైనా విభావములఁ జూచి నంతమాత్రమున నపుడు తనకు (దృష్టము) గల్గునది ఆత్మస్థము. ఒకఁడు నవ్వుచుండఁగా నతనిని జూచినపుడు మరొకనికి విభావము కల్గును. అది పరస్థము. ఈ హాస్య ముత్తములకు మధ్యములకు అధములకుఁ గూడ కల్గును. ఇట్లు మూడువిధముల నుండును. దీనికి మరొక యారుభేదము లున్నవి. (అనఁగా ఆత్మస్థము, పరస్థము నని, దీనికి = ఈ ముగ్గురియం దుండు హాస్యమునకును, ఆరు భేదములును దప్పనివే కదా: ఇవిగాక వేరువిధములు ఆరున్న వని తాత్పర్యము), అవేవనఁగా; ఉత్తమునందు స్మితము, హసితము; మధ్యమునందు విహసితము, ఉపహసితము, అధమునందు అపహసితము, అతిహసితము; అని ఆరువిధములు. చెక్కిళ్లు కొంచెము విప్పారగా క్రీగంటిచూపు లెక్కువ గాకుండగా, పన్నులు కనబడకుండగా, మధురముగా నవ్వునప్పటి నవ్వు స్మితము. మొగము, కనులు, చెక్కిళ్ళు బాగా విప్పారి వికసింపగా కొద్దిగా పన్నులు కనపడు నవ్వు హసితము. ధ్వనితో మధురముగా, కాలగతముగా (సమయోచితముగా) కాయగతముగా (నాగన్నపాఠము) మొగమునం దెట్టదనము తోచగా కనులు కొంచెము ముడిచి మంద్రముగా నుండు నవ్వు – విహసితము అంసములు = భుజ శిరస్సులు, తలయు రిక్కించి, చూపులు వంకరబోగా, ముక్కుపుటములు విప్పారగా నవ్వెడి నవ్వు ఉపహసితము. కనులు నీరు కారగా, భుజస్కంధములు, తల

వెండ్రుకలు కదలుచుండగా గల్గునది అపహసితము. ఇది తగనియెడ గల్గునదియు, కనుల నీరు గార్చునదియును (గనుక) అపహసిత మని శార్ఙ్గదేవుఁడనెను. చెవులు గింగురు మనునంతటి కటువైన చప్పుడుతో కనులనీరు వరదలోడగా రెండుచేతులతో రెండు పక్కలను బట్టుకొని నవ్వెడి నవ్వు అతిహసితము.

భయానక మెట్లనఁగా —

"శ్యేన మంబరతలా దుపాగతం, భక్ష్యదాననబిలో విలోకయన్
కంపమాన తనురాకులేక్షణః, స్పన్దితుం న హి శశాక లావకః."

ఇచట దేగ ఆలంబనము. వేగముగా వచ్చిపడుట ఉద్దీపనము. నోరెండి పోవుట మొదలగునవి అనుభావములు. దైన్యాదులు సంచారులు. (ఆకసమునుండి వచ్చిపడుచున్న దేగను జూచుచునే నోరెండగా నాడలు వణకుచుండగా కనులు బిత్తరపోగా లావకము కదలను గూడా జాలలేదు )

ఇక బీభత్స మెట్లనఁగా—

"నఖై ర్విదారితాన్త్రాణాం శవానాం పూయశోణితం
ఆననే ష్వనులిమ్పన్తి హృష్టా వేతాల యోషితః"

గోళ్లతోఁ బ్రేవులు చీల్చిన శవముల కంపు నెత్తురును సంతసముతో ఆడువేతాళములు మొగములఁ బూసుకొనుచున్నవి.

ఇచట శవములు ఆలంబనములు. ప్రేగులు చీల్చుట ఉద్దీపనము, దాని వలనఁ దోచక తప్పని గగుర్పాటు, కనులు మూయుట మొదలగునవి అనుభావములు. ఆవేగాదులు సంచారులు.

అయితే రతి, క్రోధము, ఉత్సాహము, భయము, శోకము, విస్మయము, నిర్వేదము వీనికి వెనుకఁ జూపిన యుదాహరణములందు ఆలంబనము, ఆశ్రయము రెండును జక్కఁగా స్ఫురించును. కాని, 'హాసము' నందును, 'జుగుప్స' యందును అట్లు రెండును లేవు. ఒక ఆలంబనమే తోచును. ఆపద్యములను వినువాఁడు (అలౌకికమగు) రసాస్వాదమునకే స్థానము కాని లౌకికములగు నీ హాస జుగుప్సలకు ఆశ్రయముగా నగుట కుదురదుగదా! అందురా? నిజమే. అచట వానిని గమనించుచున్న యొక పురుషుఁడు తప్పక తోచదగును. అట్లు

తోచుచుండుదురా ? తన ప్రియురాలిని వర్ణించు పద్యమునుండివలె శ్రోతకు రసముదుత్పన్న మగుటలో బాధక మేమియు లేదు కదా !

ఇట్లు రసముల సంగ్రహ నిరూపణ మైనది. ఇవి ప్రధానములగుచో ధ్వని యనుటకుఁ గారణ మగును. అప్రధానము లగుచో రసాలంకారము లగును. కొందఱమంది "ఇవి ప్రధానము లగు నపుడే రసము లన దగును. కాని యెడల అలంకారములే. రసాలంకార మనుట అలంకారధ్వని యనుట వంటిదే. బ్రాహ్మణ శ్రమణకుఁ డను న్యాయమువలె గ్రహింపవలెను ఈతీరుగ రసములు అసంలక్ష్యక్రమ * వ్యంగ్యము లగునపుడే. కానపుడు వస్తుమాత్రమే యని అందురు.

"ఇవి- ఈరసములు అలక్ష్యక్రమ వ్యంగ్యములు" అనుట యేలననగా రసములు ఝటితి వ్యక్తమగునపుడు విభావానుభావ వ్యభిచారులు క్రమముగా విమర్శింపఁబడినను, ఆక్రమ ముండితీరినను 'నూరు తామరాకుల నొకసారి సూదితో గ్రుచ్చినప్పుడువలె' సహృదయునకు ఆక్రమము గుర్తింపరా కుండును. అందువలన నివి 'అసంలక్ష్య = బాగా గుర్తింపరాని' క్రమము కలవి. అంతే కాని క్రమము లేకుండ వ్యంగ్యము లగు ననుట కాదు. వ్యంజనయు దానిహేతువులును కార్యకారణభావమును (ఆక్రమమును) వీడకయే యుండక తప్పవుకదా ! కనుక ఇటఁ గ్రమము లేదన్నచో నాకార్యకారణభావము = పౌర్వాపర్యము అసంగతము కావలసి వచ్చును.

---

శ్రీ శర్వాణి :

* మొదట బ్రాహ్మణుఁడై యుండి తరువాత సన్యాసమును బుచ్చుకొన్నప్పుడు అతనిని బ్రాహ్మణశ్రమణకుఁ డందురు. కాని, శ్రమణకత్వమునందు కులముల పరిగణన ముండదు. కనుక ఆనాడు శ్రమణుఁడు బ్రాహ్మణుఁ డని కాదు. అతఁడు కేవలము శ్రమణుఁడే. వెనుకటి గుర్తును బట్టి బ్రాహ్మణుఁడై శ్రమణకుఁడు = బౌద్ధసన్యాసి యయ్యెననుట. అట్లే ప్రకృతములో వ్యంగ్యము ప్రధానమే కాని, మరొకదాని కంగము కాదు. కాని, అది వాచ్యమగునప్పటి స్థితి 'అలంకారము' కనుక ప్రకృతములో అలంకార ధ్వని యనుట.

అయితే రసము లింతే యనుట యెట్లు? భాగవతాదిపురాణముల విను నప్పుడు భక్తులు రోమాంచము, అశ్రుపాతము (కనులనుండి ఆనందభాష్పములు రాలుట) మొదలగు ననుభావములతో హర్షాదులు పోషింపగా "భక్తిరసము" ననుభవించుచున్నారు. అది తోసివేయ రానిదే కదా! ఇట భగవానుని గూర్చి అనురాగరూప మైన భక్తియే స్థాయి భావము.

శాంతరసములో దీని నిముడ్పఁ దగదు. ఇది అనురాగము, అది వైరాగ్యము. ఇవి రెండును (తత్తద్భావరూపము లగుట) పరస్పర విరుద్ధములు. ఇక నొకదానిలో నొకటి ఎట్లు ఇముడును?

మామాట వినుడు. దేవతలు మొదలగు వారిని గూర్చిన రతియేకదా భక్తి? అది భావములలోనిదే కనుక రసమగుట కుదురదు. "రతిర్దేవాదివిషయా వ్యభిచారీ తథాంజితః భావః ప్రోక్త స్తదాభాసా హ్యనౌచిత్య ప్రవర్తితాః." దేవతాదులను గూర్చి వ్యక్తమయిన రతి వ్యభిచారిభావము. దాని యాభాసములు అనౌచిత్యమున ప్రవర్తించును. అని ప్రాచీనుల సిద్ధాంతము.

'అయితే స్త్రీని గూర్చిన రతియే వ్యభిచారి కానిండు, అది రసమగుటలో తేడా యేమియు లేదు కదా! భగవద్భక్తియే స్థాయిభావము. కాంతాన్యాది రతులు భావములు మాత్రమే. ఇట్లు కాదనుటకు వినిగమక మేమి?' (ఇక పక్షమును నిర్ణయించు ప్రమాణము వినిగమకము) అనెదరా? భరతాదులగుమునులు రసమనీ, భావమనీ, విభజించి యేర్పరిచిరి. వారిమాటలే మనకు ప్రమాణములు. మన మీవిషయమున స్వాతంత్ర్యము వహించుట తగదు కాదనెదరా? బిడ్డలను గూర్చిన రతికూడా స్థాయిభావ మేల కారాదు? జుగుప్సాశోకాదులు కాకుండ కేవల వ్యభిచారులే = శుద్ధభావములే ఏలకావు? ఇట్లు ఈశాస్త్ర మంతయు గందరగోళమై పోవలసి వచ్చును. 'రసములు తొమ్మిది' అను లెక్కయు భరతముని మాటలవలనే ముడివేయఁ బడినది. ఇపు దాముడి కూడ వీడిపోవును. కనుక శాస్త్రము నతిక్రమింపకుండుటయే మంచిది.

ఈరసములలోఁ గొన్ని యొకదానితో నొకటి కలసియుండును. (అవిరోధము). మరికొన్ని అట్లు కలసి యుండవు. (విరోధము). అందు వీరశృంగారములు, శృంగారహాస్యములు, వీరాద్భుతములు, వీరరౌద్రములు, శృంగారాద్భుతములును ఒకదానితో మరియొకటి కలసియుండఁగలవు. (అవిరోధ

మనుట.) శృంగార బీభత్సములు, శృంగారకరుణములు, వీరభయానకములు, శాంతరౌద్రములు, శాంతిశృంగారములును అట్టుండవు (విరోధ మన్నమాట.) కవియగువాడు తన గ్రంథములో ప్రధానముగా వర్ణింప మొదలిడిన రసమును బోషింపఁదలచినపుడు ఆరసమునకు విరుద్ధములగు రసాంగములను గూర్పఁ దగదు. అట్లు కూర్చినచో ఆయంగములవలన విరుద్ధరస మభివ్యక్తమై ప్రకృత మగు రసమును బాధించును. సుందోపసుంద న్యాయముతో ఒకదాని నొకటి బాధించి రెండు రసములును పాడై పోవును. ఒకప్పుడు విరుద్ధరసములను గూర్పఁదలచుచో వాని విరోధమును తొలగించి కూర్పవలెను. అదెట్లనగా—విరోధము రెండురకములు. స్థితివిరోధము, జ్ఞానవిరోధము అని. మొదటిది — తనకు విరుద్ధ మైన రస ముండుచోట నుండకుండుట. రెండవది—విరుద్ధరసప్రజ్ఞానమును ప్రతిబంధించు జ్ఞానముతో నుండుట. మొదటిది మరొకచోట నావిరుద్ధరసమును గూర్చినచో నివర్తించును. ఎట్లనగా — నాయకునందు వీరరసమును వర్ణింపవలసి వచ్చినపుడు ప్రతినాయకునందు భయానకమును గూర్పనగును ఈప్రకరణములో 'రసము' అను మాటకు దాని యుపాధియగు స్థాయిభావ మర్థము. ఏమనగా — రసము సామాజికునందే యుండును కనుక నాయకునం దుండదు అదీకాక రస మనగా మరొకటి గోచరింపని యానందముతో నిండియుండునదే కనుక విరోధ మేర్పడదు కూడాను ఉదా॥ "కుండలీకృత కోదండ దోర్దండస్య పురస్తవ। మృగారాతే రివ మృగాః పరే నైవా వతిస్థిరే". భుజదండములతో విల్లును గుడుసు గావించిన నీయెదుట సింహము నెదుట లేళ్ళవలె శత్రువులు నిల్వలేరు

ఇక రెండవ విరోధ మెట్లు నివర్తించు ననగా—ఈరెండు విరుద్ధరసముల తోను విరోధింపని యొకరసమును సంధి యొనరించువానినివలె వీని నడుమ నిల్చినచో జ్ఞానకృత మగు విరోధము తొలగును. ఎట్లనగా — నేను రచించిన ఆఖ్యాయికలో కణ్వుని యాశ్రమమునందు శ్వేతకేతుమహర్షిని శాంతరసము ప్రధానముగా వర్ణించునపుడు "కి మిద మనాకలిత పూర్వరూపం ? కోయ మని ర్వాచో వచన రచనాయాః మధురిమా ?" ఇదివరలో నెన్నడును చూడని యీరూప మేమి? చెప్పఁదరము కాని యీమాటల కూర్పులోని మాధుర్య మేమి?" అని యద్భుతరసమును మధ్య నిల్పి తరువాత వరవర్ణినిని గూర్చి అనురాగము వర్ణింపఁబడినది.

ఇంకను నెట్లనగా – "సురాంగనాభి ర్గాశ్లిష్టాః వ్యోమ్ని వీరా విమానగాః। విలోకన్తే నిజాన్ దేహాన్ ఫేరునారీభి రావృతాన్". అప్సరసల కౌగిళ్ళతో స్వర్గమున విమానము లందున్న వీరులు తమ దేహముల నిట నక్కలు కౌగిలించు కొనుటను జూచుచున్నారు. ఇక్కడ నక్కలు, మృతశరీరములు – ఇవి రెండును క్రమముగా శృంగారమునకును, బీభత్సమునకు ఆలంబనములు. ఈ రెండు రసములును విరుద్ధము లగుట వీనికి నడుమను స్వర్గలాభముచే ఆక్షేపింపఁబడిన వీరరసము కూర్పఁబడి ఆ రెంటి విరోధమును తొలగించినది

నడుమ నుంచు టనగా 'ఆ రెండు రసముల చర్వణ మొనరించు సమయముల నడుమ ఈరసము చర్వణ కల్గునట్లు కూర్చుట. ఈపద్యములో మొదటిపాదము లోనే శృంగారరసపు చర్వణ, తర్వాత వీరరసపుఁజర్వణ, ఆ వెనుక రెండవ సగములో బీభత్సరసపు జర్వణ కనుక నడుమనివేశము స్పష్టముగానే యున్నది.

"భూరేణు దిగ్ధా న్నవ పారిజాత మాలారజో వాసితగన్ధమల్యాః" (నేల మీద దుమ్ములో దొర్లుచున్నవారిని మెత్తని పారిజాతపు పూలదండలలోని పొడితో బరిమళించు వాసనతోడి పూదండలుగలవారు) అను కావ్యప్రకాశమున నుదాహరింపఁబడిన పద్యములగుంపులో మాత్రము మొదట బీభత్ససామగ్రి కనుపడును. అందువలన బీభత్సరసచర్వణ మొదట నేర్పడును. పిమ్మట వెనుకటి సామగ్రి మూలమున నిశ్శంకముగా ప్రాణత్యాగ మొనర్చి రను నీతీరు వీరరస సామగ్రి స్ఫురించును. ఈసామగ్రి వీరరసమును స్ఫురింపజేయును. అపుడు దాని చర్వణ మొనర్పబడును. ఆతరువాత శృంగారరసచర్వణ సమకూడును. ఇట్లు విరోధము లేక రెండు రసములకును నుదాసీన మైన రసాంతరపుఁ జర్వణ నడుమ నేర్పడుటవలన ప్రతిబంధక మగు పూర్వరసపు జ్ఞానము నివర్తించును. కాగా ఇపుడు ప్రతిబధ్యమగు తరువాతి రసాంతరపుఁ జర్వణ యేర్పడుటకు ఎటువంటి యాటంకమును లేదను నర్థము ఫలించినది.

ఈవిరుద్ధరసము లొకదాని కొకటి అంగముగా నుండినను, మరొకరసమున నీవిరుద్ధరసములు రెండును అంగములుగా నైనను గూడ విరోధము కల్గదు. విరోధమే యుండుచో ఒక యంగిరసమున అంగ మగుట కుదురదుకదా! ఎట్లనగా–

"ప్రత్యుద్గతా సవినయం సహసా సఖీభిః స్మేరైః స్మరస్య సచివైః సరసావలోకైః

మామద్య మంజులవచనై ర్వచనైశ్చ బాలే హా తే శతోఽపి నకథం వద సత్కరోషి"*

''చెలికత్తెలు కూడా రాగా వినయముతో వెంటనే నన్నెదుర్కొని చిరునగవుతో ప్రీతిని సూచించు సరసము లగు చూపులతోను మంచితీరుమాటలతోను ఇప్డు డోబాలా! నన్ను నీవేమాత్రమును ఆదరింప వేమి?''

ఇది యుందు మరణించి పడియున్న నాయికను గూర్చి నాయకుఁ డన్న మాట యిది. ఇందులో ఆ నాయిక యాలంబనము; కన్నీరు కార్చుట మొదలగు నవి అనుభావములు. ఆవేగము, విషాదము, మొదలగునవి సంచారులు. ఇవి యన్నియు గూడి నాయికనుగూర్చి నాయకున కున్న ప్రేమను వ్యక్తపఱచును. అట్లు వ్యక్తమైన ప్రేమ ఆమెనుగూర్చిన శోకములోనే అంగ మగును. ఏమనగా ఇట ప్రేమను వ్యక్తపరచు విభావాది సామగ్రియే శోకమును వ్యక్తపరచును. అయితే అది (శోకము) ప్రకృతము గనుక (ఈప్రకరణములోనిది కనుక) ప్రధానము. దీని నప్రకృతము (అప్రధానము) అగు ప్రేమ = రతి ఉత్కరించును. అనగా వెనుకటి రోజులనాటి తన యనుభవములోని ప్రేమ ప్రసంగములు ఈనాడు జ్ఞప్తికి వచ్చి నాయకునకు శోకము నుద్దీపింపఁజేయును

"అట్లుకాదు. నాయికనుగూర్చి నాయకున కున్న ప్రేమ ఇట వ్యక్తము కాదు. నాయకునం దున్న శోకము మాత్రమే పేము నిరూపించిన సామగ్రివల్ల ప్రకృతము గనుక వ్యక్త మగును—'' అని ఆగ్రహింతురా? అట్లైనయెడల నాయకుఁ డాలంబనముగా నాయిక కున్న ప్రేమయే. 'ఎదుర్కొలు' మొదలగు ననుభావములతో హర్షాదులు పోషింపఁగా వ్యక్తమగుచు నాయకుని శోకములో నంగము కానిండు. తనయందు నాయిక కున్న ప్రీతిని దలచుకొనినను నాయకునకు దుఃఖము హెచ్చగు నని అందరు నంగీకరించినదే కదా! 'అయితే ప్రకృత



* ఈశ్లోకము ధ్వన్యాలోకములోని 'అయం సరశనోత్కర్షీ' వంటి ఉదాహరణము. ఇచట నిరూపింప వలసిన విశేషముల నిరూపించుటకై అటువంటిదే యగు నీశ్లోక ముదాహరింపబడినవి. విశేష నిరూపణమందు మూలములో జేయబడును.

ములో నాయిక చనిపోయినది కదా! ఆమె రతి ప్రకృతములో లేదు. అట్టిది శోకమున కంగ మెట్లగును?' అనుమానపడపద్దు. అంగ మగుటకు సన్నిధిలో నుండుటయే ఆవశ్యము కాదు. తలపులోనికి వచ్చినను అంగము కావచ్చునుగదా!

ఒక యంగియం దంగముల రెట్లనగా — ఉదాహరణము—

"ఉత్తిష్ఠాః రబరీభరం వివలితాః పార్శ్వద్వయం న్యక్కృతాః
పాదాంభోజయుగం రుషా పరిహృతా దూరేణ చేలాంచలమ్
గృహ్ణంతి త్వదరియా భవత్ప్రతిభటక్ష్మాపాల వామభ్రువాం
యా స్త్రీనాం గహనేషు కంటకచితాః కేకేన భూమీరుహాః"

నీ శత్రువుల యంగనలు చొరరాని యడవులలో తొందర తొందరగాఁ బోవునపుడు వారి నేముక్ల చెట్లు పట్టుకొనలేదు? (కొమ్మలను) పైకి త్రోసివేసి నపుడు కేశపాశములను ప్రక్కలకు దిరిగినపుడు రెండుపార్శ్వములను, కాలితో నెట్టినపుడు మెత్తని యడుగులను, కోపముకొద్దీ దూరముగా విసరినపుడు కోకల చెంగులను పట్టుకొన్నవి.

ఈ శ్లోకములో సమాసోక్తి అలంకారము. దానికి ప్రకృత వ్యవహార మొక యంగము. అప్రకృతి వ్యవహారము మరొక యంగము. ప్రకృత వ్యవహారము అడవులలోని చెట్లు శత్రువుల భార్యల తలవెంట్రుకలు మొదలగు వానిని పట్టుకొనుట. దానితోడి సామ్యమువలన అప్రకృత వ్యవహారము — కాముకులు ప్రియల యధరపాన మొనర్చు వేళలలో కేశపాశాదుల గ్రహించుట స్ఫురించును. చెట్లొనర్చిన పనులు, కాముకు లొనర్చు క్రీడలు ఈ రెండును సమాసోక్తికి అవయవములు. ఇందు మొదటిది ప్రకృత వ్యవహారము (చెట్లొనర్చిన పని) దానివల్ల శత్రురాజుల భార్యలందు కరుణము — జాలి వ్యంగ్యము. రెండవది (అప్రకృత వ్యవహారము) కాముకు లొనర్చిన క్రీడావ్యాపారము. దీనివల్ల శృంగారము వ్యక్తమగును. ఈ వ్యక్తములగు కరుణశృంగారములు రెండును ఇట్లు రాజును పొగడిన శృంగారములో నంగము లగును. *

---

శ్రీశర్వాణి :

* ఇది ధ్వన్యాలోకములో 'క్షిప్తో హస్తావలగ్నః' అనుదానివంటిది. విరుద్ధములగు రెండు భావములు మరొకదాని కంగము లగుట యిట నిరూపింపఁ బడినది.

ఇంతేకాదు, కవి ప్రకృతరసమును పోషింపఁ దలచినపుడు దీనిచే బాధింపఁబడఁదగిన రీతిలో విరుద్ధరసమునైనను తప్పక కూర్పఁదగినదే. అపుడు శత్రువుల జయించుటవలన నేర్పడు శోభ విలక్షణమై సమకూడును. రసము బాధింపఁబడఁదగిన తీరు ఏమనఁగా — తన అంగములు — విభావాదు లున్నను విరోధిరసము సంగములు ప్రబలములై రసము సరిగా నేర్పడనీయకుండుట. వ్యభిచారి బాధింపఁబడఁదగిన రీతి యేమనఁగా — దాని తాలూకు రసము నిష్పత్తి నొందకుండ జేయుటయే. అంతేకాని వ్యభిచారిని వ్యక్తము కానీయకుండుట కాదు అది వ్యక్తమగుటవలన బాధ యేమియు లేదుకదా! 'విరోధిరసపు టంగము అభివ్యక్తమై ప్రకృత వ్యభిచారి వ్యక్తము కాకుండ అడగించును" — అనదగును. దీనిని వ్యక్తపరచు శబ్దాదికము తెలియవచ్చు వేళలో దీని విరోధి అంగములను వ్యక్తపరచు శబ్దాదిజ్ఞానము సన్నిహితము కాబోదుకదా! ఇట్లుకాక ఒకటి ప్రతిబంధక మనియు మరొకటి ప్రతిబధ్య మనియు నీతీరు గల్పింత మన్నచో అందుకు ప్రమాణము లేదు. లేకున్నను గల్పింత మన్నచో, భావశబలతయు ఉచ్ఛిన్న మగును. (అదియు విరుద్ధములగు ననేకభావముల సమావేశమేకదా!) ఇక ప్రకృతములో రసము నిష్పన్నము కాకుండ ప్రతిబంధింపఁబడుట అనుభవసిద్ధము. కనుక విరోధి రసపు టంగములు బలవంతములై రస మభివ్యక్తము కాకుండ ప్రతిబంధించు ననుటయే న్యాయము.

మరియు విరుద్ధము లగు రసములు రెంటికిని సాధారణముగా విశేషణము ఉండి ఆ రసములు వ్యక్తము లైనను విరోధము రాదు. ఎట్లనఁగా—

"నితాన్తం యౌవనోన్మత్తాః గాఢరక్తాస్సదాహవే
వసున్ధరాం సమాలిఙ్గ్య శేరతే వీర. తేఽరయః"

(పడుచుదనపు పొంగున నుద్రిక్తులై ఎపుడును యుద్ధమున గాఢముగా రక్తులైన నీశత్రువు లో వీరుఁడా! భూమినిఁ గౌగలించుకొని పరుండి యున్నారు). ఇచట 'గాఢముగా రక్తులై' అనుచోట 'రక్త' పదము అనురాగమును, నెత్తురును గూడ తెల్పును. అందువలన శృంగారము, కరుణము గూడ స్ఫురించును. ఇట నివి పరస్పరము విరోధించుకొనవు. 'గాఢరక్తులై' అను విశేషణము రెంటిని సమానముగానే స్ఫురింపఁ జేయును కదా!

అయితే యీతీరుగా విరోధము లేకుండ సమకూర్చినను రసమును 'రసము' అనుమాట కానీ, శృంగారాది పదములు గానీ చెప్పఁదగదు. ఏమి?

రూపింపకపోవుట ఘటస్థించును. రస మాస్వాద్యము కావలె నన్నచో వ్యంజన యొక్కటియే దానిని సమకూర్పఁగలదు. కాని, తదితర మేదియు నుపయోగింపదు. ఈవిషయము నిదివరకే చెప్పితిమి.

అయితే విభావాదులు రసమును వ్యక్త మొనర్చినచోట 'రసము' అను పదము గానీ, శృంగారాదిపదములు గానీ దానికి చెప్పినచో దోష మేమి? వ్యంగ్య మగుదానిని వాచ్యముగా నొనర్చినచో వమనము * అను దోషమును ముందు తెల్పెదము.

రసమును రుచించునట్లుగా 'రస' పదము తెల్పజాలదు. అనగా రుచించుట కుపయోగించుతీరులో 'రసపదము' రసమును దెల్పఁజాలదు. కనుక అచట రస మను మాటతో దెల్పుట కోతిచేష్ట వంటిది. ఇది సామాన్యదోషమా? అధిక దోషమే కూడాను.

ఇట్లే స్థాయిభావము కాని, వ్యభిచారిభావములు కానీ స్వశబ్దములతోఁ జెప్పినచో దోషమే ఈతీరుననే విభావములు, అనుభావములు కూడా సరిగా తెలియరానపుడు గానీ, ఆలస్యముగా తెలియవచ్చినపుడు గానీ రసాస్వాదము కలుగదు. కనుక అవి దోషములు. ప్రకృతరసమునకు విరోధిరసము సంగములు ప్రకృతరసాంగములతో సమానబలముగా గానీ అంతకన్న ప్రబలముగా గానీ కూర్చుట దోషము. అట్లు కూర్చుట ప్రకృతరసపోషణకు విరుద్ధము కదా!

ప్రబంధములో ప్రకృతరసము మరొకప్రసంగము వలన విచ్ఛిన్నమైనపుడు తిరిగి దానిని ప్రకాశ మొనర్చినచో సామాజికులు ఆరసమును సమగ్రముగా నాస్వాదింపఁ జాలరు కనుక 'విచ్ఛిన్నదీపనము' (ఎడబడినదానిని తిరిగి వెలయఁజేయుట) దోషము. ఎట్లనగా, సంధ్యవార్చుట, దేవతార్చనము, మొదలగు ధర్మముల వర్ణించు ప్రసంగములో ఏదో యొక కాముకురాలితో ఏదో యొక కాముకుని యనురాగమును వర్ణించుట. మరియు, శత్రువులు బాగా

---

శ్రీ శర్వాణి :

* ఈదోష మెంతమాత్రమును సంభవింపదు. ఈవిషయవిస్తరము మాఆన్ధ్రధ్వన్యాలోక వివరణములో నిరూపించితిమి. సోపపత్తికముగా నందు తెలియనగును.

ప్రేమించి యున్నపుడు కుద్యుక్తులై మన్మథభేదములను మాటలతోఁ బ్రకటముగా నె త్తిపొడుచు చుండగా నాయకుఁడు సంధ్యావందనాదు లొనర్చుచుండె నని వర్ణించుట. ఈరెండును అనుచితములు.

అలాగే అప్రధాను డైన ప్రతినాయకుని నానావిధములగు చరిత్రము లను, అనేకవిధము లైన సంపదలను గూడ నాయకుని చరితము కన్నను, నాయకుని సంపదకన్నను అధికముగా వర్ణింపఁ దగదు అట్లు వర్ణించుచో నాయకుని యుత్కర్షము అసలు వర్ణింపఁదలచినది సిద్ధింపదు. అపుడు రసము నకు పుష్టియు నుండదు. ఆయితే, ప్రతినాయకుని గొప్పదనము అతని జయించిన నాయకుని గొప్పదనమున కుపయోగించును కదా! వర్ణింపఁ దగదందు రేమి? ప్రతినాయకుని గొప్పదనము నెంతమట్టుకు వర్ణించినచో నతని జయించు నాయ కుని గొప్పదనమునకు భంగము కలుగదో, అంగ మగునో (అనఁగా నాయకుని గొప్పదనమును పోషింపఁగలుగునో) అంతవరకే వర్ణించు టిష్టమే. నాయకుని గొప్పదనమును భంగించు నట్టి వర్ణనమే కాదన్నది. "అట్లు కాదు. శత్రువునకు నాయకుని కన్న గొప్పదనమును వర్ణించినను, అంత గొప్పవానిని సంహరించినా డనుటవల్లనే ప్రకృతినాయకుని గొప్పదనము నింకను హెచ్చించును. కనుక నిది తప్పు కాదు" అనరాదు.

ఏమంటే — అదే సరియగుచో ఒక మహారాజును విషముపూసిన బాణము వేసి చంపిన బోయవానికి గూడ గొప్పదనము రావలెను. అట్లున్నదా లోక ములో? లేదు. కనుక నాయకునకు గూడ నిటనే గొప్పదనమును రాబోదు. అట్లే రసమున కాలంబనమును విషయమును నడుమ నడుమ ననుసంధింప కున్నచో దోషము. ఏల? వాని ననుసంధించుటను బట్టి కదా రసానుభవము ధారగా ప్రవహించును! అనుసంధాన మొనర్చినచో నాయనుభవపు ధార యాగి పోవును. ఇట్లే ప్రకృతరసములో నుపయోగింపని వస్తువును వర్ణించినను రసానుభవమునకు విరామము కల్గును గనుక దోషమే.

ఇక ననౌచిత్యమా? రసమును భంగ మొనర్చును కనుక దానిని పరిహరిం చియే తీరవలెను. రసము భగ్న మగునను టేమి? పానకము మొదలగు రసములలో ఇసుక మొదలగునవి పడినప్పుడువలె మనస్సులఁ జించు బాధ కల్గుట. అదెట్లనగా— ఈప్రపంచములో జాతి, దేశము, కాలము, వర్ణము, ఆశ్రమము, వయసు,

అవస్థ, ప్రకృతి, వ్యవహారము, మొదలగునవి ప్రసిద్ధములే కదా! అందులో లోకమును, శాస్త్రమును దేనికి దేని కేయేద్రవ్యగుణక్రియాదు లుచితము లని తెల్పునో అందుకు వ్యతిరేకమే అనౌచిత్యము – జాత్యాదుల అనౌచిత్య మెట్లన: ఆవులు మొదలగు సాధుజంతువులు సాధుస్వభావముతో నుండు ననీ, స్వర్గములో ముసలితనము రోగము మొదలగునవి యుండవని, భూలోకమున నమృతసేవనము లేదని, ఇటువంటివి సుప్రసిద్ధములే కదా: వీనికి వ్యతిరేకముగా గవాదులగు సాధుజంతువులు తేజోబలకార్యములను పరాక్రమాదులను క్రూరమృగోచితముల నొనర్చెననీ, సింహాదులు సాధుస్వభావముతో నుండెననీ, స్వర్గమున జరావ్యాధ్యాదు లున్నవనీ భూలోకమున నమృతము సేవించిరనీ, శిశిరమున జలక్రీడాదు లొనర్చిరనీ, ఎండాకాలమున నిప్పు గాచుకొనిరనీ, బ్రాహ్మణుఁడు వేటాడెననీ, రాచవాడు దానము పట్టెననీ, శూద్రుడు వేదాధ్యయన మొనర్చెననీ, బ్రహ్మచారియు, సన్యాసియుఁ దాంబూలము వేసికొనిరనీ, పెండ్లిచేసికొనిరనీ, పసివాడు ముసలివాడు స్త్రీలతోఁ గలసిరనీ, పడుచువాడు విరక్తుడయ్యెననీ, దరిద్రులు సంపన్నులుగా నడచిరనీ, సంపన్నులు దరిద్రులుగా నడచిరనీ వర్ణించుట అనౌచిత్యము.

ఇక ప్రకృతులు :– దివ్యము, అదివ్యము, దివ్యాదివ్యము అని ప్రకృతులు మూడువిధములు. ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత, ధీరశాంతులు క్రమముగా ఉత్సాహము క్రోధము, కామినీరతి, నిర్వేదమును ప్రధానముగా నవలంబింతురు. ఉత్తములు, మధ్యములు, అధములుగాను నుందురు. ఈప్రకృతులందంతటను గూడ భయము గాక తక్కిన స్థాయిభావములు సమములుగానే యుండును. అయినను సంభోగరూప మైన రతి స్థాయిభావమును మనుష్యులందు వర్ణించినంత విచ్చలవిడిగా, ఉత్తమదేవతలం దనుభావములు ( = రతికార్యములు) అన్నియు వ్యక్తమగునట్లు వర్ణించు టుచితము కాదు. అట్లే దివ్యుల కోపము లోకములను భస్మ మొనర్పఁ జాలియుండును. రాత్రింబగళ్లను మార్పఁ జాలును – ఇట్లనేక విచిత్రములను జేయఁ గల్గిన వారికోపమును అదివ్యులందు వర్ణించు టుచితము కాదు. ఏమంటే: (శృంగారము మనుజులందువలె దివ్యులందు వర్ణించినపుడు కలుగవలసిన శృంగారోల్లాసము కలుగదు. ఏమి వారు దివ్యులు. మనకు ఆరాధనీయులు అని తెలియును కదా! అట వారి శృంగారము నానావిభాగములతోఁ దెలియవచ్చినపుడు మన మనసులందు ఏవగింపే కల్గును.

లలితేంద్రుల శృంగారమువలె నదియు రోత కల్గించునే కాని రసము నొదవింపదు). అట్లే అదివ్యుల క్రోధము వలన లోకములు భస్మమైనవనీ, రాత్రిం బగళ్లు వ్యత్యస్తములైనవనీ వర్ణించుచో వీరు దివ్యులు కారు కనుక ఈపను లన్నియు నబద్ధములే యని తోచును ఇట్లే రెండు తలంపులును (దివ్యులందు 'ఆరాధనీయులు' అను తలంపును, అదివ్యుల క్రోధకృత్యము 'అనృతము' అను తలంపును క్రమముగా శృంగార రౌద్రములను తలపులోనికి రానీయవు పేడి విలాసములందు శృంగారమును, ఉత్తరుని ప్రగల్భములందు రౌద్రమును మన మనసులందు తోచవుకదా!

"(భట్టనాయకుని మతమును బట్టి సహృదయత వల్లనేర్పడు భావన యను దోషము దివ్యులకును అదివ్యులకును గూడ) సర్వసామాన్యముగా (దివ్యత్వాదివ్యత్వములు తోచకుండ) జేయును గనుక రసస్ఫూర్తికి ప్రతిబంధము లేదు –" అనుట తగదు. సహృదయులకు రసానుభవము ప్రమాణసిద్ధమైన యెడల నే పాత్రాదికము సర్వసామాన్యము (సాధారణీకరణము) గాఁ జేయబడెనని కల్పింపబడును. అట్లు కాదేని తన తల్లియందు తండ్రిరతిని వర్ణించిన యెడల గూడ సహృదయునకు శంగార రసానుభవము కలుగవలసి వచ్చును.

అయితే, జయదేవాదులు గీతగోవిందాది గ్రంథములందు సహృదయు లందరు నంగీకరించిన యీశిష్టాచారమును మదోన్మత్తమగు మాతంగకులము వలె నాశ మొనర్చిరి. వారి నుదాహరణముగాఁ గొని ఇప్పటివా డెవడును అట్లు వర్ణింపఁదగదు.

సరి, అదే తీరున విద్యలో, వయసులో, వర్ణములో, ఆశ్రమములో, తపసులో గొప్పవారు తమకన్న తక్కువవారి విషయము నగౌరవ వాక్యములతో వ్యవహరింపరాదు. తక్కువవా రెక్కువవారితో నట్లే యొనర్పవలెను. అగౌరవపు మాటలలో గూడ 'తత్ర భవాన్, భగవన్' ఇత్యాదులతో మునులు, గురువులు, దేవతలు మొదలగువారిని మాత్రమే సంబోధింపవలెను. రాజు మొదలగు వారిని కాదు. ఆపిల్చుటయు ఉత్తమజాతీయు లగు ద్విజులే కాని అధము లగు శూద్రాదు లట్లు పిలువదగదు. "పరమేశ్వర!" ఇత్యాది సంబోధనలు చక్రవర్తులను గూర్చియే కాని మునులు మొదలగు వారినిగూర్చి కూడదు. పెద్ద లిట్లు తెల్పుదురు: "అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణం ప్రసిద్ధౌచిత్య బన్ధస్తు. రసస్యోపనిషత్పరా". (రసము భగ్న మగుటకు అనౌచిత్యముకన్న వేరే కార

ణము లేదు. ప్రసిద్ధ మగు నౌచిత్యమును గూర్చుటయే రసస్ఫూర్తికి పరమోపనిషత్తు.) అనౌచిత్యమును కూడ రసమునకుఁ బుష్టి కల్గునంత వరకును గాదనము. రసమును బ్రతికూలించు నప్పుడే దానిని నిషేధింప నగును. ఇందువల్లనే

"బ్రహ్మ న్నధ్యయనస్య నైష సమయ స్తూష్ణీం బహిస్స్థీయతామ్
స్వల్పం జల్ప బృహస్పతే! జడమతే నైషా సభా వజ్రిణః
వీణాం సంహర నారద! స్తుతి కథాలాపై రలం తుమ్బురో
సీతారల్లకి * భల్ల భగ్నహృదయః స్వస్థో న లంకేశ్వరః॥"

బ్రహ్మ! వేదాధ్యయనమున కిది యదను కాదు. ఊరక బయట బృహస్పతీ! ఎక్కువగా వాగకుము. ఇది ఇంద్రసభ కాదు. వీణ నాపవోయి నారదా! పొగడిక కతల మాటలు చాలునయ్యా తుంబురుడా! సీత పాపిడి బల్లెమువలె గుండెకుఁ దాకినది లంకేశ్వరు (డు)ని మనసు నెమ్మదిగా లేదు(డు).

ఏదో నాటకములోని యీద్వారపాలకుని మాటలు బ్రహ్మాదుల నధిక్షేపించు నవిగా నున్నవి. అయినను అవి యిటఁ బ్రధాన మగు రావణుని విప్రలంభశృంగారమున కంగముగా వీరరసము నాకర్షించుటకై రావణుని పారమైశ్వర్యమును బోషింప వలె నని కూర్పఁబడినవి. కనుక అనగా రసపరిపోషకములు గనుక, దోషము లేదు. ఇట్లే 'అరేరే సద్యస్సముత్పాటిత హరిత కుశగ్రన్థిమయాక్ష మాలా పరివృతి నిర్భర్త్సిత బాలవిధవాంతఃకరణాః బ్రాహ్మణాః' 'అప్పుడే కోయఁబడిన పచ్చని దర్భల ముడుల మయమైన రుద్రాక్షమాలలఁ ద్రిప్పుటతో లేఁబ్రాయపు విధవల మనసుల నమ్మించి యాకర్షించుచున్న బాపలారా! అను విదూషకుని మాటలలో బ్రాహ్మణుల గూర్చి 'రే' శబ్దాదుల ప్రయోగము నట్టిదే. హాస్యమునకు తగున దదేరిదా! ఇది దిగ్దర్శనము. ఈతోవనే బుద్ధిమంతు లింకను నూహించుకొనవలెను.

ఈ చెప్పిన రసములందు మాధుర్యము, ఓజస్సు, ప్రసాదము' అను మూడుగుణములఁ దెల్పుదురు. అందులో సంభోగశృంగార మందలి మాధుర్య

---

శ్రీ శర్వాణి :

* 'శిరస్సీమన్త సరణిః స్త్రీణా మారల్లకం మతం' అని హలాయుధుడు. 'కనురెప్పలబారు' అని మరొకచోట వ్యాఖ్య.

మునకన్న కరుణమునందలి మాధుర్య మెక్కువ అరెంటియందుకన్న విప్రలంభమున నధికము. ఈ మూడింటియందు కన్న గూడ శాంతమున నధికము. ముందు ముందు పోను పోను హెచ్చుగా మనసు ద్రవించును గనుక అని కొందరు. సంభోగశృంగారమునకన్న కరుణ శాంతము లందును వానికన్నగూడ విప్రలంభమునను మాధుర్య మధికము' అని మరికొంద రందురు. 'సంభోగశృంగారమున కన్న కరుణ విప్రలంభశాంతములం దధికమే మాధుర్యము. అంతేకాని, ఈ మూడింటిలోని మాధుర్యమున హెచ్చు తగ్గులు లేవు — 'అని కొందరు' ఈ మతములలో మొదట చివరి మతములు 'కరుణే విప్రలమ్భే తచ్ఛాన్తే చాతిశయాన్వితం' అను ప్రాచీనసూత్రము ననుకూలపరచు కొన్నది. ఈ సూత్రము తరువాతి సూత్రములోని 'క్రమేణ' (క్రమముగా) అనుదానిని వెనుకకు లాక్కొని వచ్చి ఇందులోని కన్వయించుచో మొదటిమతము సరిపడును. అట్లు వెనుకకు లాక్కొని రాకపోవుచో చివరిమతము సరిపడును. ఇక నడుమ మతములో కరుణశాంతములందుకన్న విప్రలంభము నం దధికముగా మాధుర్య మధికముగా నుండుట సహృదయుల కనుభవ మగుచో నది ప్రమాణ మగును.

వీరము, బీభత్సము, రౌద్రము — వీనిలో నోజస్సు ముందుముందు అధికము. చిత్తవృత్తి వెనుకటిదానిలో కన్న ముందుదానిలో నెక్కుడుద్దీప్త మగును. అద్భుతము, హాస్యము, భయానకములలో నీమాధుర్యౌజస్సులు రెండు గుణములకును సంబంధ ముండునని కొందరి తలంపు. ప్రసాద గుణ మొకటే యుండు నని ఇతరు లందరు. ఈ ప్రసాదగుణము సర్వరసములకును సర్వరచనలకును గూడ సాధారణమే. ఈ మూడు గుణములును క్రమముగా ద్రుతి, దీప్తి వికాస (విస్తర) ములను గల్గించును. అనగా నాయాగుణములతో నుండు రసములందు మాత్రమే యుండు ధర్మము లని నిర్ణయము. కాగా 'ఈ రచన మధురముగా నున్నది.' ఈకూర్పు చాల ఓజోవంతముగా నున్నది' అను నీతీరు వాడుకలు 'ఇతనియాకారము చాలశూరముగా నున్నది 'అనువాడుక వలె నుపచార మాత్ర మేర్పడు నని మమ్మట భట్టాదు లందురు.

అయితే ఈమాధుర్యము, ఓజస్సు, ప్రసాదము అనునవి రసములకు మాత్రమే ధర్మములు. అనగా రసములందు మాత్రమే యుండు నవి—'అని అంటిరే అందుకు ప్రమాణ మేమి? ప్రత్యక్ష మనరాదు. ఏమనగా—రసములనుండి ద్రుతి, దీప్తి, వికాసము కల్గుటయే అనుభవము కాని వీనికన్న వేరుగా రసము లందు

గుణము లున్నట్లు అనుభవము అగుటలేదు. అట్లు కార్యము కన్న వేరుగా కారణము నందు గుణమున్న ట్లనుభవ మైనపుడే కదా గుణము నంగీకరింతురు. ఎట్లనగా నిప్పు కాల్చునప్పుడు కార్యమగు కాల్చుట కన్న వేరుగా వేడిమి యను గుణ మనుభవ మగుచున్నది. కనుక నిప్పునందు దాహమున కన్న వేరుగా నుష్ణస్పర్శ యనుగుణ మున్నదని యంగీకరింతురు. ఇట నట్టి యనుభవము లేదే? "ఆయాగుణములతో గూడియే రసములు ద్రుత్యాది కార్యముల నొదవించును కనుక రసము లీద్రుత్యాదుల గల్గించుటలో నీ గుణములు ప్రయోజకము లని యూహింతుము" అనుట తగదు. ఈ గుణముల సంబంధము లేకుండ విడిగానే ఆరసములు ద్రుత్యాదుల గల్గించుట సరిపడుచుండగా నీదుమ నీగుణముల గల్పించుట ఊరక బరువు చేటేకదా? "శృంగార కరుణ శాంతముల మూటిని కలిపి మాధుర్యము కలవి కనుక ద్రుతి హేతువు లనుట లఘువుగా నుండును. అట్లు కాక శృంగారము ద్రుతికారణము. కరుణము ద్రుతికారణము, శాంతము ద్రుతి కారణము అని విడివిడిగా కారణము లనుటయే బరువు చేటు కదా! అని అందురా? మూడింటిని గలపి చెప్పిన కారణత్వము గడ్డుగా నుండి కుదురదు. ఏమంటే, మధురతరము మధురతమము అనుగుణములు వేరు వేరుగా ద్రుతతరము అనెడు కార్యముల లోని హెచ్చుతగ్గులకు ప్రయోజకము లని పరు లంగీకరించిరి కనుక శృంగారకరుణ శాంతములు మూటిని కలిపి మాధుర్యము కలవి కనుక కారణము లనుట గడ్డుగా నుండును. కాగా విడివిడిగానే—అనగా మాధుర్యాదులు లేకుండానే కారణత్వము (ను కల్పించుట) చులకన. అదీకాక ఆత్మ నిర్గుణము కదా! అట్టి ఆత్మరూప మగు రసమునకు మాత్రము మాధుర్యాది గుణము లుండు టెట్లు పొసగును? అట్లే రసముల కుపాధు లగు రత్యాది స్థాయిభావములకు అవి గుణము లనుటయుం దగదు దీనికి ప్రమాణమును లేదు. అదీ కాక పరులు గుణము లందు గుణాంతరము లుండు నను టొప్పరు కదా! (రత్యాదులు గుణములు. వాని యందు మాధుర్యాది గుణాంతరము లుండుట పరులమతమునకే విరుద్ధము.)

అయితే 'శృంగారము మధురముగా నున్నది'— అను వ్యవహార మెట్లు పొసగును? అందురా? ద్రుత్యాదు లగు చిత్తవృత్తులకు ప్రయోజక మగుట కానీ ఈ ప్రయోజకత్వ మను సంబంధముతో ద్రుత్యాదులు కానీ మాధుర్యాదిక మగును. పై జెప్పిన వాడుక "వాజిగన్ధ వేడిది" అను వాడుకవలె సరిపడును. పై జెప్పిన ప్రయోజకత్వము శబ్దార్థరసరచనములం దుండునదే. అది అదృష్టము కన్న వేరే

నని గ్రహింపవలెను. కనుక అవ్యవహార మతి ప్రసక్తము కాబోదు. కాగా శబ్దార్థము లందు గూడ ఇటువంటి మాధుర్యాదు లుండవచ్చును కనుక మమ్మటాదుల మతమందు కల్పించవలసిన యుపచార మక్కర లేదని మాటో ట్లందురు.

జగన్నాథరులు "శ్లేషః ప్రసాద స్సమతా మాధుర్యం సుకుమారతా అర్థవ్యక్తి రుదారత్వ మోజః కాన్తి సమాధయః అని పది శబ్దగుణములను, అన్నియే అర్థగుణములను సంప్రదాయముగాఁ దెల్పుదురు. ఈ శబ్దగుణములకును అర్థగుణములకును పేరులు సమానమే కాని లక్షణములు వేరే. అందు—

శ్లేషము :— ఒకే జాతిలోని వర్ణములను ఒక్కొరిలి దగ్గరగాఁ గూర్చుట లోని విశేషము శ్లేషము. దీనికే గాఢత్వ మని మరొక పేరు. దీనివలన మాటలు వేరైనను ఒకటిగానే తోచును. ఏమంటే 'శైథిల్య పునస్పర్శ లేనిది శ్లేషము' (శిష్ట మస్పృష్ట శైథిల్యమ్) అని అందురు కదా !

ఉదా :—"అనవరత విద్వద్ద్రుమ ద్రోహి దారిద్ర్య మాద్యద్విపో
ద్దామ దర్పోఘ విద్రావణ ప్రౌఢ పంచాననః॥" *

ప్రసాదము :—గాఢత్వమును, శైథిల్యమును, క్రమము తప్పించి బంధమున కల్పుట ప్రసాదము.

ఉదా .—కిం బ్రూమ స్తవ వీరతాం వయ మమీ యస్మిన్ ధరాఖండల
క్రీడా కుండలిత భ్రు శోణనయనే దోర్మణ్డలం పశ్యతి
మాణిక్యావలి కాన్తిద న్తురతరైః భూషా సహస్రోత్కరైః
విన్ధ్యారణ్యగుహా గృహా వనిరుహా స్తత్కాల ముల్లాసితాః॥" •

---

శ్రీశర్వాణి :

* 'ఎల్లప్పుడును విద్వాంసులను చెట్లకు ద్రోహ మొనర్చు దారిద్ర్యమును మదించిన ఏనుగుయొక్క యుత్కట మగు మదము రాశిని కరిగించుటలో ప్రౌఢయగు సింగము' అని యర్థము.

'నీ విక్రమమును మేమే మందుము. నీ వలవోకగా, కనుబొమల గుండ్రముగా నొనర్చి కను లెఱ్ఱజేసి భుజమండలమును జూడగా మాణిక్యముల చాలుయొక్క కాంతులు వ్యాపించి అనేక వేల నగలరాసులతో, వింధ్యారణ్యమునందలి గుహాగృహముల యొద్ది చెట్లు అపుడే యుల్లసించినవి.

ఇచట 'యస్మిన్' వరకును బంధము వదులుగాను, తరువాత 'భ్రమ' వరకును గట్టిగాను, తిరిగి 'సయన' వరకును వదులుగాను నున్నది.

సమత :— మొదలిడి నప్పటి నుండియు ముగించువరకును నొకేరీతి సమత.

ఉదా :— ముందు వ్రాయఁబోవు మాధుర్య గుణపు టుదాహరణే దీనికిని ఉదాహరణము. అట ఉపనాగరిక వృత్తితోనే మొదటినుండియుఁ జివర వరకును నడచినది.

మాధుర్యము :— సంయోగపరము లైన హ్రస్వములు గాక వేరువర్ణములు కూడిన పదములు విడివిడిగా నుండుట మాధుర్యము.

ఉదా :— "నితరాం పరుషా సరోజమాలా న మృణాళాని విచారపేశలాని
యది కోమలతా తవాంగకానా మధకానామ కథాపి పల్లవానామ్" *

సుకుమారత :— పరుషములు గాని వర్ణములతోడి కూర్పు సుకుమారత.

ఉదా :— "స్వేదామ్బు సాన్ద్రకణశాలి కపోలపాలి
దోలాయిత శ్రవణకుణ్డల వన్దనీయా
ఆనన్ద మంకు రయతి స్మరణేన కాపి
రమ్యా దశా మనసి మే మదిరే క్షణాయాః"

ఇటఁ బూర్వార్ధమున సుకుమారత యొక్కటియే. ఉత్తరార్ధమున మాధుర్యము కూడ నున్నది.

అర్థవ్యక్తి :— అర్థములును వాని యన్వయమును వెంటనే స్ఫురించుట అర్థవ్యక్తి.

ఉదా :— 'నితరాం' అను శ్లోకమే

---

శ్రీ శర్వాణి :

* కమలదండ మిక్కిలి పరుషము తామరతూండ్లు ఆలోచించుటకే మృదువులు కావు. నీ అవయవముల మెత్తదనము ముందర చివురుల ప్రసంగ మేల ?

చెమట నీటి చుక్కలు దట్టముగా చెక్కిళ్ళ నుండగా చెవుల కుండలములు వ్రేలగా ప్రశంసించఁదగిన వనితయొక్క యొకానొక స్థితి అనఁగా పురుషాయిత దశ ఆనందము నంకురింపఁ జేయును.

వికటత్వము :— కఠినములగు పదములు కూర్పుగా నుండుట వికటత్వము.

ఉదా :— ప్రమోదభరితుందిల ప్రమథదత్త తాలావలీ వినోదిని వినాయకే డమరు డిండిమధ్వానిని లలాటతట విస్ఫుటస్ఫుట కృపీటయోనిచ్ఛటాహతోద్ధత జటోద్భటోగతిపటోనటో నృత్యతి". •

(పదానాం నృత్యత్ప్రాయత్వం వికటతా) పదము లాడుచున్నట్లుండుట వికట యని వామనుని కావ్యాలంకారసూత్రవృత్తిని బట్టి కావ్యప్రకాశ టీకాకారు లన్నారు. "స్వచరణ వినివిష్టై ర్నూపురై ర్నర్తకీనాం ఝడితి రణితి మాసీ త్తత్ర" ఇత్యాదిగా నుదాహరించిరి గూడాను. ఇట్టి వికటత్వరూప మైన యుదారతను ఓజస్సులో నంతర్భవింపఁ జేయుచున్నాడు కావ్యప్రకాశకారుడు. అది యీ వ్యాఖ్యాతల కెట్లనుకూలు డగునో వారికే తెలియును. * ఇక్కడ (స్వచరణ) ఓజస్సు విపులముగా స్ఫురించుట లేదు కదా! 'వినివిష్టై ర్నూపురై ర్నర్త' అనుచోట ఓజ స్సేలేశమో యున్నను చమత్కరింపలేదు. వర్ణము లట నటనాడుచున్న ట్లున్నదని సహృదయులకు అనుభవమున్నూ లేదు. ఇతరాంశమునందు మాధుర్యమే యున్నది. (కాని యుదారత లేదు)

ఓజస్సు :—సంయోగపదము లగు హ్రస్వవర్ణము లధికముగా నుండుట యను చిక్కదనము ఓజస్సు.

---

శ్రీశర్వాణి :

గతిపటు డగు నటుడు తాండవ మొనరించు శివుడు. అతడు దిగంబరుడు గదా! ఆనందాతిశయము నిండిన ప్రమథులు తాళముల వరుసలు వేయగా వినోదించు వినాయకుడు డమరు డిండిమముల మ్రోయించుచుండ, నుదురు నుండి బయల్వెడలు క్రొత్తనిప్పులరాశి గల్గి ఆకస్మికముగా జటలు పైకెగురఁ గట్టుగుడ్డ జారిపోవ నటుడు (శివుడు) నృత్య మొనరించును.

* ఇచటి భావ మిది — నృత్యత్ప్రాయత్వము శృంగారరసపు గుణ మగు మాధుర్యమున నంతర్భవించు టుచితము. వీరరౌద్రాది గుణమగు నోజస్సున దగదు. అట్లంతర్భవింపఁ జేయు మమ్మటుని దృష్టిలో ఈ వామనుని లక్షణ మనభిమత మగును. వ్యాఖ్యాతలు మమ్మటుని హృదయము నెరుగక వామనుని 'ఉదారత' ను స్వీకరించిరి.

ఉదా :— 'సాహంకార సురాసురావళి కరాకృష్ట భ్రమన్మందర
క్షుభ్య త్క్షీరధి వీచివలయ శ్రీ గర్వ సర్వంకషాః
తృష్ణాతామ్యద మన్దతాపస కులై స్సానన్ద మాలోకితాః
భూమీభూషణ! భూషయన్తి భువనాభోగం భవత్కీర్తయః.'

"అయం పతతు నిరయం" అను పద్యమైనా ఇందు కుదాహరణము.

కాంతి :— చాదస్తులైన వైదికులు ప్రయోగించుట కనువగు మాటలను వదలి ప్రయోగించు మాటలతో లోకోత్తరమగు శోభ యుజ్జ్వలముగా నుండుట కాంతి

ఉదా :—'నితరాం పరుషా' యను వెనుకటి పద్యము.

సమాధి :— బంధము చిక్కగాను వదలుగాను క్రమముతో నుండుట సమాధి. ఈ చిక్కదనమును, వదలుదనమునే ప్రాచీనులు ఆరోహావరోహము లనిరి. ఇవి క్రమముగా నుండుటయే దీనికిని ప్రసాదమునకును భేదము. ప్రసాదములో నివి వెనుక ముందులుగా నుండును.

'స్వర్గ నిర్గత నిరర్గళగంగాతుంగ భంగుర తరంగ సఘానాం
కేవలామృతముచాం వచనానాం యస్య లాస్యసరోజమ్"

ఇట మొదటి సగములో ఆరోహము మూడవపాదములో నవరోహము. 'గంగా' ఇత్యాదిః మున మాధుర్యమును వ్యక్తపరచినను దీర్ఘ సమాసములో బంధింపబడినవి గనుక మాధుర్యము పైకి రాదు. తరువాతి సగములో నదియు (మాధుర్యము) నున్నది. ఇవి పది శబ్ద గుణములు

---

శ్రీ శర్వాణి :

దేవరాక్షసుల గుంపు అహంకారముతో త్రిప్పగా దిరుగుచున్న మంధర ముతో కల్లోలపడు పాలసముద్రపు టందమైన తరగల చుట్టల సొబగు నంతను త్రోసివేయునట్టి నీకీర్తిలో భూమీభూషణమా ! తృష్ణతో నెక్కు వగాఁ దపించు గొప్ప తాపసుల గుంపానందముతోఁ జూడగా నీ భువన ముల వైశాల్యము నలంకరించు చున్నవి. 'స్వర్గనిర్గత' అని. స్వర్గము నుండి వెల్వడు ఎత్తుగా నడ్డము లేకుండ నెగిరి తునిగిపడు గంగాతరంగ ములకు తోడునీడలై కేవలముగా నమృతమునే స్రవించు వచనముల కెవని యాస్యకమలము లాస్యగృహమో.

ఇక నర్థగుణములు :_ పనుల వరుసతో నేర్పరి పనియు అదిస్పష్టము గాకుండు టయు, దానిని పొసగించు యుక్తియు నొకయెడనుండు సంబంధము శ్లేషము. అర్థమునకుఁ దూచినట్లు సరిపడు పదము లుండు నర్థవైమల్యము ప్రసాదము.

ఉదా :_ 'ఆమె మొగము కమలమును బోలును' విరుద్ధోదాహరణము _ 'ఆమె మొగము కమలపు గాంతిని బోలును'_ఈరకము.

అవైషమ్యము సమత. ప్రక్రమభంగము లేకుండుట అవైషమ్యము. "హరిః పితా హరిర్మాతా హరిః భ్రాతా హరి స్సుహృత్। హరిం సర్వత్ర పశ్యామి హరే రన్య న్న భాతి మే' * ఇట నడుమ 'విష్ణుస్త్రాతా' అను తీరున గూర్చినచో ప్రక్రమ భంగరూప మగు వైషమ్య మేర్పడును.

ఉక్తివైచిత్ర్యము మాధుర్యము అది ఒక మాటనే (అర్థమునే) వేరు తీరున దిరిగి చెప్పుట.

ఉదా _"విధత్తాం నిశ్శంకం నిరవధి సమాధిం విధిరహో
సుఖం శేషేశేతాం హరి రవిరతం నృత్యతు హరః
కృతం ప్రాయశ్చిత్తై రల మథ తపోదాన యజనైః
సవిత్రీ కామానాం యది జగతి జాగర్తి భవతీ॥"†

---

శ్రీ శర్వాణి :_

* విష్ణువు తండ్రి, విష్ణువు తల్లి, విష్ణువు సోదరుడు, విష్ణువు మిత్రుడు, విష్ణువు నంతటను జూచుచున్నాను. విష్ణువుకన్న వేరేదియు నా కగుపడదు.

† బ్రహ్మ నిశ్శంకముగా సమాధిని అంతులేకుండ జేసికొనుగాక. శ్రీహరి శేషుని మీద సుఖముగాఁబండుకొను గాక! శివుడు విడువకుండ నృత్య మొనర్చుగాక. ప్రాయశ్చిత్తములు ఇక వద్దు. తపస్సులు, దానములు, యజ్ఞములును వద్దు. కోరికలు తీర్చు తల్లి వీలోకమున నీవుంటివి కదా! ఈశ్లోకము 'వేదవివాదగోష్ఠిఁ బడి వృద్ధులబుద్ధుల గొల్పవచ్చు' అను తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యములోని పద్యమునకు శరీర్యంతర సంవాదము.

ఇట బ్రహ్మ మొదలగువారితో నేమియు ప్రయోజనము లేదను నీయొక్క యర్థమే సమాధి యొనరించుకొనుట మొదలగువానియందుఁ బ్రేరేపించుట రూపమగు సు క్తివైచిత్ర్యముతోఁ జెప్పఁబడినది. అట్లు వైచిత్ర్యము లేనిచోఁ గ్రొత్తదనము లేక పోవలసి వచ్చును.

అపారుష్యము సమత. అది అసమయమున శోకము గల్గింపక పోవుట రూపమున నుండును. ఉదా : 'త్వరయా యాతి పాంథోఽయం ప్రియావిరహకాతరః ' ప్రియురాలి యెడబాటునకు భయపడి బాటసారి త్వరగాఁ బోవుచున్నాడు. ఇట 'ప్రియామరణకాతరః' – 'ప్రియురాలి మరణమునకు భయపడి' అనుచో మరణపదము శోకము నొదవించు నందుండును గనుక పారుష్యము. ఇదంతయు నశ్లీలదోషమును వీడకుండును.

వర్ణింపఁదగిన వస్తువున కసాధారణమైన క్రియను, రూపమును వర్ణించుట అర్థవ్యక్తి.

"గురుమధ్యే కమలాక్షీ కమలాక్షేణ ప్రహర్తు కామం మాం
రదయన్త్రితరసనాగ్రం తరలితనయనం నివారయతి॥" *

దీని నిప్పటివారు స్వభావోక్త్యలంకార మందురు. 'ఓ పెండ్లామా ! చందాలుడైన కాముని తృప్తిపరచుటకై నాకు ముద్దిమ్ము'అను నీరకపు గ్రామ్యతను దొలగించుట ఉదారత.

ఒక పదము నర్థమును చాలపదములతోఁ జెప్పుటయు, చాలపదముల యర్థము నొక్కమాటతోఁ జెప్పుటయు, ఒకవాక్యము నర్థమును జాలవాక్యములతోఁ జెప్పుటయు, చాలవాక్యముల యర్థము నొకవాక్యముతో జెప్పుటయు, విశేషణములను సాభిప్రాయముగా నుపయోగించుటయు నను నైదురకములును ఓజస్సు.

---

శ్రీశర్వాణి :

* పెద్దల నడుమ నున్న కమలాక్షి మీద నేను తామరగింజతో రువ్వబోతిని. ఆమె నాలుకచివరను పంటితో నొక్కి కనులతో నదల్చి నన్ను వారించెను.

'పదార్థే వాక్యరచనా వాక్యార్థే చ పదాభిధా
ప్రౌఢి ర్వ్యాస సమాసౌ చ సాభిప్రాయత్వ మస్య చ"

మొదటి సగమున జెప్పబడిన జంటయు, వ్యాససమాసములు అనునాల్గు రములప్రౌఢియు, సాభిప్రాయత్వమును కలసి యోజనచే నైదుప్రకారము లగు నని యర్థము. ప్రౌఢి యనగా చెప్పుటలో వైచిత్ర్యము. ఉదా:—

'సరసిజ వనబన్ధు శ్రీసమారమ్భ కాలే
రజని రమణరాజ్యేనాశమాశు ప్రయాతి
పరమపురుష వక్త్రా దుద్గతానాం నరాణాం
మధుమధురగిరాం † ప్రాదు రాసీద్వినోదః"

ఇట 'ఉషస్సు' అను నొకపదము నర్థమును దెల్పుటకై మొదటిపాదము. ఈతీరున ముందు గూడ తెలియవలెను.

'ఖండితానేత్రకంజాలి మంజురంజన పండితాః
మండితాఖిల దిక్ప్రాన్తా శ్చణ్డాంశో ర్భాన్తిభానవ' *

ఇట 'యస్యాః పరాంగనా గేహోత్పత్తిః ప్రాతర్గృహేంచతి' (దేని మగడు పరాంగన యింటినుండి తెల్లవారి వచ్చునో) అను వాక్యార్థమున 'ఖండితా' యనునొక పద ముపయోగింపబడినది. "అయాచిత స్సుఖం దత్తే యాచిత శ్చ నయచ్ఛతి, సర్వస్వం చాపి హరతే విధి రుచ్ఛృంఖలో నృణాం" † ఇట 'సంపయు దైవాధీనము' — అనునొక్క వాక్యపు టర్థమున ననేకవాక్యముల రచించుటగా విస్తరము = వ్యాసము.

---

శ్రీ శర్వాణి :

† సూర్యోదయము అనుటకు రెండవచరణము, విప్రులు అనుటకు మూడవపాదము, 'తుమ్మెద' లనుటకు 'మధుమధురగిరాం' అని.

* ఖండితనాయిక కనుదమ్మిలచాలును చక్కగా రంజించుటకు నేర్పు కల్గి దిక్కులప్రాంతముల నలంకరించుచు సూర్యుని కిరణములు వెలయును.

† అడుగకున్నను సుఖము గూర్చును. అడిగినను సుఖ మివ్వడు. సమస్తము హరించును. దైవము మనుజుల విషయములో నిరంకుశముగాం బ్రవర్తించును.

ఇక సమాసము. 'తపస్యతో మునే ర్వక్త్రాద్వేదార్థ మధిగత్య సః। వాసు దేవ నివిష్టాత్మా నివేశ పరమం పదం'. ఇట ముని తప సొనరించుచున్నాడు. అతని నోటినుండి వేదార్థము నెరిగెను పిమ్మట వాసుదేవునందు మనసును ప్రవేశ పెట్టెను. దాన, ముక్తు డయ్యెను' – అను వాక్యముల యర్థ మంతయు 'శతృ, క్త్వా, బహువ్రీహులును, తిజన్తములును వీనితో అనువదించి విధేయ ముగా నొక వాక్యమున సంగ్రహించి ప్రతిపాదింపఁ బడినది.

సాభిప్రాయత్వ మనగా ప్రకృతార్థమును బోషించుట. ఉదా :– గణికాఽ జామిలముఖ్యా నవతా భవతా బతాహమపి సీద న్భవమరుగర్తే కరుణామూర్తే నసర్వథోపేక్ష్యః." ఇట నుపేక్షింపఁ దగకుండుటను స్వామి జాలిరూప మగుట పోషించును. తాను పాపిష్ఠుడు కనుక స్వామికి జాలి లేకపోవుట ప్రసక్తించును. అపుడు జాలిని సమకూర్చుటకై 'గణికే' త్యాదికమును, సీదన్' = నాశన మగు చుంటి ననియు, గూర్పఁబడినది.

రస ముద్దీపించుట కాంతి. అనగా రసములు స్ఫుటముగా వ్యక్తము లగుట. దీని కుదాహరణ మిదివరకే వర్ణింపబడెను. రసప్రకరణములో వర్ణింప బడ నున్నది కూడ. ఈయర్థమును బూర్వాచార్యు లెవ్వరును వర్ణింపలేదా ? ఇది వరలో వర్ణించిన మోస్తరేనా ? అని కవి యాలోచనము సమాధి. ఆలోచనము జ్ఞానము; దానిలో నర్థము విషయము కనుక జ్ఞాన మావిషయమునం దుండి అర్థ గుణ మగును.

మొదటిదాని కుదాహరణము – 'తినయు మైనాక గవేషణ (76) అనునది. రెండవది సామాన్యముగా నంతటను నుండునదే యందురు.

మరికొందరైతే – ఈగుణములలోఁ గొన్నింటిని వెనుక చెప్పిన మూడు గుణములు–మాధు * ర్యౌజః ప్రసాదముల తోను, ముందు నుడువబోవు దోషముల

---

శ్రీ శర్వాణి :

* 'పృథక్ పదత్వం మాధుర్యమ్' అని వామను డన్నాడు. సమాస మొనరింపని విడివిడి పదముల నివేశించుట 'మాధుర్యము' అని అక్షరముల కూర్పునందు వామనాదులు మాధుర్యమును గూర్చిరి. ఇది మమ్మటు ననుస రించి మాధుర్యమును వ్యంగ్య మొనర్చు శబ్దసంఘటనమే.

యభావముతోను, అలంకారములతోను గతార్థముల నొనరించుచు, మరికొన్నిటిని వైచిత్ర్య మాత్రము లనియు, ఒక్కొక్క యెడ దోష మని తలంచుచును అన్నిం టిని అంగీకరింప కున్నారు. అదెట్లనగా - శ్లేషము, ఉదారత, ప్రసాదము, సమాధియు, ఓజోవ్యంజక మగు ఘటనలో నంతర్భవించును. సరేకాని సర్వాం శములందును చిక్కదనము - అనగా గాఢమగు చిక్కదనము రూపమున నుండు శ్లేషోదారత శ్లేషము, ఉదారతయు, ఓజోవ్యంజన కగు కూర్పులో జేరుగాక. మిక్కిలి వదలుదనపు రూపముల నుండు ప్రసాదసమాధులు ఒకయంశమున నోజోవ్యంజక మగు రచనలో నంతర్భవించినను మరొకయంశమున (వదలు దనపు టంశమున) దేనిలో నంతర్భవించు నందురు ?

మాధుర్యమును వ్యక్తపరచు ఘటనలో కాని, ప్రసాదమును వ్యక్తపరచు ఘటనలో గాని చేరునని చెప్పుననుట సులభము గదా ! ఇతరులమాధుర్యము మే మంగీకరించిన మాధుర్యమును వ్యక్తపరచునదే. ఈతీరుననే వ్యంజకము నందు వ్యంగ్యశబ్దమును భాక్తముగా నంతటను ప్రయుక్త మగును. 'సమత' మాత్రము అంతటను నుచితము కాదు. చెప్పవలసిన విషయ ముద్భట మగుటను బట్టియు, అనుద్భట మగుటను బట్టియు నొకపద్యమునందే మార్గము వేరుగా నుండుట ఇష్టమేకదా ! † ఎట్లనగా.

---

శ్రీ శర్వాణి :

† దీనిభావమిది :- మమ్మటాదులమతములో రసధర్మము లగు నీమాధుర్యాది గుణములు శబ్దార్థములనుండి వ్యంగ్యము లగును. కనుక వ్యంగ్యములగు గుణములందే మాధుర్యాది శబ్దము లుపయోగింపఁబడును, ఇక వామ నాదులు రసగుణము లని వీని నంగీకరింపలేదు కనుక వారిపద్ధతిలో ఏక జాతీయ మగు వర్ణ విన్యాసము 'శ్లేషము.' విడివిడిగా పదము లుండుట మాధుర్యము. సంయోగపరము లగు హ్రస్వము లధికముగా నుండుట యోజస్సు. ఇత్యాదిగా శబ్దార్థసంఘటనమే మాధుర్యాది నామములతో బిలువబడును. కాగా, మమ్మటుని మతమునుబట్టి వ్యంజక మగు శబ్దార్థ సంఘటనను వ్యంగ్యవాచకము లగు మాధుర్యాది పదము లుపచారమునఁ జెల్లు నని భావము.

"నిర్మాణే యది మార్మికోఽసి నితరా మత్యన్త పాకద్రవ
న్మృద్వీకా మధుమాధురీ మదపరీహారోద్ధురాణాం గిరాం
కావ్యం తర్హి సఖే సుఖేన కథయత్వం సమ్ముఖే మాదృశాం
నోచే ద్దుష్కృత మాత్మనా కృత మివ స్వాన్తా ద్బహిర్మాకృథాః॥"

ఈ శ్లోకములో మొదటి సగమును మూడవచరణమును గూడ లోకోత్తర మగు నిర్మాణమును ప్రతిపాదించును గనుక దాని కనురూప మగు మాదిరి రచింప బడినది. ఆ మార్గము నాల్గవ చరణములో లేదు. ఏల? హీనమైన వాక్యము కదా అట చెప్పఁబడును. కనుక ఈ శ్లోకములో వైషమ్యమే గుణము. గ్రామ్య త్వమును, కష్టత్వమును * త్యజించుటవలన కాంతియు, సౌకుమార్యమును గతార్థములు. ప్రసాదములో నర్థవ్యక్తియు నంతే. (ఇంతవరకును శబ్దగుణ ముల విషయము).

ఇక అర్థగుణములలో శ్లేషమును, ఓజస్సులోని మొదటి నాల్గుతీరులును, వైచిత్ర్య మాత్రములే కాని గుణములలోఁ జేరఁదగవు. అట్లననిచో ప్రతి

---

శ్రీశర్వాణి :

* చెవులకుఁ గఠినముగా విన్పడుట శ్రుతికటుత్వ మని కావ్యప్రకాశ కారుని తలంపు. ఇది అందరు నెరిగినదే. 'కష్టత్వం శ్రుతికటుత్వం' అని అతని మాట. కాగా పరుషము లగు నక్షరముల కూర్పు, చెవులకు వెగడు కల్పించునది కష్టమని పర్యవసానము. దీనికి విపరీత మైనది సుకుమారత. పరుషములు కాని వర్ణముల కూర్పు కాగా ఆసమయములో పరుషము లగు వర్ణములఁ గూర్చుట యను కష్టత్వము లేకపోవుట సౌకుమార్య మని స్పష్టము. కనుక, మమ్మటుని మాటలో నెట్టి దోషమునకును చోటులేదు. ఇది ఇట్లుండగా ఈ నాగన్న "కష్టత్వ మనగా ఓజోవ్యంజకము లగు వర్ణముల కూర్పు. సుకుమారత్వ మనగా మాధుర్య వ్యంజకము లగు వర్ణముల కూర్పు" అని అర్థము చెప్పి ఈరెండును పరస్పరాభావరూప ములు కావు. కనుక నొకదానితో నొకటి గతార్థము లెట్లగును? అని అవక తవక ప్రసంగ మొనర్చెను. అయితే 'ఓజోవ్యంజక వర్ణసంఘటన కష్టత్వ మను లక్షణ మెక్కడిది? ప్రకాశకారాదుల తలపు నిదివరకే వ్రాసితిమి.

శ్లోకమునందును అర్థవైచిత్ర్యము వేరువేరు కనుక వేరువేరు గుణముల నంగీకరింపవలసి వచ్చును. అధికపదములు లేకుండుట యను ప్రసాదమును, ఉక్తివైచిత్ర్యపు టాకారమైన సౌకుమార్యమును, అగ్రామ్యాత్మ యగు నుదారతయు, వైషమ్యాభావరూప మగు సమత, సాభిప్రాయత్వ మను నోజస్సు యొక్క అయిదవ ప్రకారమును స్వభావము స్ఫుటముగా నుండుట యగు నర్థవ్యక్తియు, రసములు స్ఫుట మగుట యైన కాంతియుఁ గ్రమముగా – అధికపదత్వమును, అనపీకృతత్వమును, అమంగళరూప మగు నశ్లీల మగు గ్రామ్యము, భగ్నప్రక్రమము, అపుష్టార్థము నను దోషముల తొలగించుట వలనను స్వభావోక్త్యలంకారమును, రసధ్వనిని, రసవదలంకారమును స్వీకరించుట వలనను గతార్థము లగును.

సమాధి మాత్రము కవి గతమై కావ్యమునకుఁ గారణ మగును అంతే కాని గుణము కాదు. అట్లు కాదన్నచో కవిప్రతిభకూడ కావ్యమునకు గుణము కావలసి వచ్చును. ఇందువలన మూడే గుణము లని మమ్మటాదులు.

ఆ రచనలలో టవర్గమును వీడి మిగిలిన వర్గములలోని యొకటి మూడు వర్ణములతోను, శ–ష–స–ల తోను, య–ర–ల–వ ల తోను గూర్చినదియు, అనుస్వారము పరముగా నుండు సవర్ణములును శుద్ధము లగు ననునాసికములును దగ్గరిగా కూర్చినదియు, ముందు చెప్పబోవునట్లుగా సామాన్యముగాను, విశేషముగాను నిషేధింపఁబడిన సంయోగాద్యక్షరముల యానుపూర్వీరూప మగు రచన మాధుర్యమును వ్యంజన మొనర్చును.

వర్గములలోని రెండవ నాల్గవ వర్ణములు దూరము దూరముగా కూర్చినచో నీ గుణమునకు (మాధుర్యమునకు) అనుకూలమునకు అనుకూలమును గావు, ప్రతికూలములును గావు. దగ్గరగా కూర్చినచో మాత్రము ప్రతికూలములును అగును. అయితే యీ వర్గముల మూలమున ననుప్రాస మేర్పడినపుడే ఈ ప్రతికూలత తగ్గును. మరికొందరు వర్గములలోని వర్ణము లైదును మాధుర్యము నేమియు తేడా లేకుండ వ్యక్తపరచు నందురు.

ఉదా :—తాం తమాల తరుకాన్తి లంఘినీం కింకరీకృత నవామ్బుదత్విషమ్

స్వాంత మేక లయి శాన్తయే చిరం నైచికీ నయన చుమ్బితాం శ్రియమ్.

ఇట్లైన నుదాహరింపవచ్చును.

స్వేదాంబుసాన్ద్రకణశాలికపోలపాలి రన్తస్స్మితాలస విలోకనవన్దనీయా
ఆనన్ద మంకురయతి స్మరణేన కాపి రమ్యాదశా మనసి మే మదిరేక్షణాయాః.

మొదటి పద్యములో అతిశయోక్తితో నలంకరింపఁబడిన, భగవద్ధ్యానము నందలి యౌత్సుక్యము కానీ, భగవద్విషయ మగు రతికానీ ధ్వనించుచు శాంతమునందే పర్యవసించును గనుక ఈ రచనయందలి మాధుర్యమును వ్యక్తపరచును. రెండవదానిలో రచన స్మృతిచే నిల్పఁబడిన శృంగారములోని మాధుర్యమును వ్యక్తపరచును.

ఇక నోజో వ్యంజక మగు రచన యెట్లనగా—

రెండవ నాల్గవ వర్గములలోని వర్ణములు, టవర్గము, జిహ్వామూలీ (ఃక ఃఖ), ఉపధ్మానీయము (ఃప ఃఫ), విసర్గ, సకారము ఇవి అధికముగాఁ గల వర్ణములు గూర్చినదియు 'ఝయ్', * రేఫ, వీనిలో నేదో యొకదానితోఁ గూర్పఁబడిన సంయోగపరము లగు హ్రస్వములు దగ్గరగా ప్రయోగింపఁబడినదియు, దీర్ఘసమాసాత్మకము నగు కూర్పును 'ఓజస్సు'ను వ్యక్తపరచును. ఈ కూర్పులోఁ బడిన మొదటివర్గములోని వర్ణములు మూడవవర్గములోని వర్ణములును (సంయోగములోఁ జేరకున్నచో) ఈ యోజోగుణమున కనుకూలింపవు; ప్రతికూలములును గావు. (సంయోగము) చేరినచో ననుకూలములే. అనుస్వారపర సవర్ణములు కూడ నింతే. ఎట్లనగా :—"అయం పతతు నిర్దయం దళితదృప్త భూభృద్గల స్ఖల ద్రుధిరఘస్మరో మమ పరశ్వధో భైరవః" ఇత్యాదులు — వెనుక నుదాహరించినవి గమనింపవలెను.

విన్నంత మాత్రముననే 'అరచేతిలోని రేగుపండువలె' వాక్యార్థము తెలియవచ్చునట్టి కూర్పు ప్రసాదగుణమును వ్యక్తపరచును. ఇది అన్నింటికిని † సాధారణమైన గుణము. దీనికి సామాన్యముగా నాపద్యము లన్నియు నుదాహరణములే. అయినను ఉదాహరింతుము—

---

(శ్రీ) శర్వాణీ :

* ఝ, భ—ఈ రెండు వర్ణములును 'ఝయ్' అనఁబడును.

† అన్నిరసము లందును, అన్ని రచనలందును నీగుణ ముండదగు నని సహృదయ చక్రవర్తి ఆనందవర్ధనుడు.

"ఖిన్నో మీలిత మానసో మనసిజః సఖ్యో విహీనప్రభాః
ప్రాణేశః ప్రణయాకులః పున రసావాస్తాం సమస్తా కథా
ఏతత్త్వాం వినివేదయామి మమచే దుక్తిం హితాం మన్యసే
ముగ్ధే మా కురు మాన మానని మిదం రాకాపతి ర్జేష్యతి." •

ఈ శ్లోకము మొత్తముమీద ప్రసాదమును వ్యక్తపరచును. కొద్దిచోట మాత్రము ఓజస్సును గూడ వ్యంజించును. 'మనసిజః' వరకును, 'మాకురు' నుండియు మాధుర్యమును వ్యక్తమగును. 'సఖ్యః' మొదలోజస్సు వ్యక్త మగును.

అయితే ఇట (ఈర్ష్యామాన విప్రలంభ) శృంగారము నాశ్రయించి యున్న మాధుర్యమును వ్యక్తపరచుటకై దాని కనుకూలముగా రచన యుండును గావున, ఓజస్సున కిట ప్రసక్తి యేమి ? దానికై తదనుకూలము లగు వర్ణముల నిట నేల యుంచవలెను ?

నాయికకుఁ గల్గిన ఈర్ష్యామానము నుపశమింపఁ జేయుటకై ఎన్నో ప్రయత్నములఁ జేసి, ఆమెకు హితవు నుపదేశించు చెలికత్తె కోపించె నని వ్యక్తపరుపవలసి యున్నందున నట్లు వర్ణవిన్యాసము సఫలమే. ఎక్కువెందుకు? ఓజోవంతమైన రసమును గాని, అమర్షము మొదలగు భావమును గాని, వివక్షింప కున్నను, వక్త కోపించినట్లుగా ప్రసిద్ధమైనను, వాక్యము క్రూరతర మైనను ఆఖ్యాయిక మొదలగు ప్రబంధముననైనను, పరుషము లగు వర్ణముల కూర్పు ఇష్ట మగుచున్నది. ఇలాగైనను—

ఉదా : వాచా నిర్మలయా సుధామధురయా యాం నాథశిక్షా మదాః
తాం స్వప్నేపి ససంస్పృశా మహమహంభావావృతో నిష్ప్రభః

---

శ్రీ శర్వాణి :

• మన్మథుడు విచారముతో మనసు క్రుంగినాడు. చెలికత్తెలు వన్నె దరిగిరి. ప్రాణేశుడు ప్రేమాకులుడై యున్నాడు. సరే, ఈ కథయంతయు నిట్లుండనిమ్ము. నామాటను హితముగా భావించెదవేని నేను నీ కిదె నివేదింతును. నీవు కోపింపకుము. మానవేని నీ ముఖమును పున్నమినాటి చందురుడు జయించును సుమీ.

ఇత్యాగశ్శతశాలినం పునరపి స్వీయేషు మాం బిభ్రత
స్త్వత్తో నాస్తి దయానిధి ర్యదుపతే మత్తో నమత్తః పరః" *

ఇట మరొకగుణముతో గూడని ప్రసాదము వ్యక్తమగును.

ఇపు ఛాయాగుణములను వ్యక్తపరుప గల్గినట్టి నిర్మాణము పరిచయమగుటకై సామాన్యముగాను, విశేషముగాను కూడ పేడవలసిన దొకింత నిరూపింతుము. వర్ణములు తమతో వ్యవధానము నొందకుండుట, ఒకసారి యొక్కపదమునం దగుచో గొంచెము వినుట కింపుగాదు ఎట్లనగా – 'కకుభసురభిః' 'వితతగాత్ర పలలమివాభాతి' ఇత్యాదులందు. మాటిమాటి కట్లుండె నేని ఎక్కువగా శ్రావ్య మగును. అ దెట్లనగా – 'వితతతర స్తరు రేష భాతి భూమౌ' – ఈతీరు వేరుగా నున్న పదములందును నింతే. ఉదా: 'శుక, కరోషి కథం విజనేరుచిం' ఇత్యాదులందు. వేరుపదములందు మాటిమాటి కెట్లున్నచో నింకను నెక్కువగా నశ్రావ్యత యేర్పడును. ఎట్లనగా – 'పిక: కకుభో. ముఖరీకురు ప్రకామం' – ఈతీరుగా వర్ణములకు తమతమ వర్గలలోని వర్ణములతో నవ్యవధాన మొక్కసారి, యొక్కపదమున నైనచో కొంచె మశ్రావ్యముగా నుండును. ఎట్లనగా– 'వితథ స్తే మనోరథః'. మాటిమాటికి నైనచో నెక్కువగా అశ్రావ్యమగును. ఉదా:– 'వితథతరం వచనం తవ ప్రతీమః'. ఈతీరే వేరేవేరే పదములం దున్న పుడును, ఎట్లనగా – 'అథ తస్య వచశ్శృణ్వ' ఇత్యాదులందు, మాటిమాటికిని వేరుగా నుండు పదములం దీతీ రున్నచో మాత్రము అంతకంటెం గూడ నెక్కువగా నశ్రావ్యత యేర్పడును. ఎట్లనగా – 'అథతథా కురుయే నసుఖం లభే'. ఇదియు, వర్గలలోని ప్రథమ ద్వితీయములకు, తృతీయ చతుర్థములకు నుండు నవ్యవధానము, ప్రథమ తృతీయములకు గానీ, ద్వితీయ తృతీయములకుగానీ ఈ యవ్యవధానము అలా అశ్రావ్యము కాదు కాని, రచనలో మర్మ మెరిగిన

---

శ్రీ శర్వాణి :

* అమృతమువలె మధురమై నిర్మల మగు పలుకుతో నో ప్రభువా! నీ వేశిక్షణము నొసగితివో, దానిని నేను అహంకారము క్రమ్మి, సిగ్గువీడి, కలలోనైనను తలపకుంటిని. ఇట్లనేకము లగు నపరాధముల నొనర్చినను నన్ను తిరిగి నీవాళ్ళలో జేర్చికొన్న నీకన్న కరుణాశాలియు, నాకన్న మత్తుడును మరెవ్వడును లేడు.

వారు మాత్రమే కొంచెము గుర్తింపఁగలరు. ఇది కూడా ( = ప్రథమతృతీయ, ద్వితీయతృతీయ వర్ణానంతర్యము) మాటిమాటికి నుండుచో అంతకన్న నెక్కువ గను సామాన్యులు కూడ అశ్రవ్యతను గుర్తింపఁగల్గుదురు. ఉదా :– 'ఖర ! కలానిధి రేష విజృమ్భతే' 'ఇతి వదతి దివానిశం సధన్యః'

వర్గములోని యైదవవర్ణనములు మధురములు. కనుక తమ తమ వర్గీయములతో నవ్యవధానముగా నుండుట అశ్రావ్యము కాదు. ఎట్లనగా – 'తను తే తనుతాంతనా' తమతోనే అవ్యవధానము మాత్రము అశ్రవ్యమే. అదెట్లనగా – 'మమ మహతీ మనసి వ్యథా విరాసీత్' ఈ యశ్రావ్యతలు గుర్వక్షరములతో వ్యవధానమున్నచోఁ దొలగిపోవును. 'సంజాయతే కథంకారం కాకేకేకా కలస్వనః'. ఇలాగైనా – 'యథా యథా తామరసాయతేక్షణా మయా సరాగం నితరాం నిషేవితా। తథా తథా తత్త్వకథేవసర్వతో నికృష్యమాణో మేకరసం చకార సా' ఇది దీర్ఘాక్షరముల వ్యవధానమునందు సంయోగాక్షరములతోడి వ్యవధానములో నైతే

'సదా జయానుషంగాణా మంగాం సంగరస్థలమ్
రంగాంగణ మివా భాతి తత్ర త్తురగ తాండవైః'

ఇది మాత్రము తెలుసుకొనవలసి యున్నది. గురువు ఏరెండక్షరములకు నడుమ నుండునో ఆరెంటికే అవ్యవధానము నుండి కల్గిన అశ్రవ్యతను † తొలగించును. అందుచేత నిచట థకార రకారములకు ఆనంతర్యమువలని దోషము తొలగించినను, తకారథకారముల యానంతర్యము వలని అశ్రవ్యత్వము తొలగింప బడనేలేదు. ఇలాగే మూడు * మొదలుకొని అక్షరముల కూడిక కూడ తిరుచుగా అశ్రవ్యమగును. 'రాష్ట్రేతవోష్ట్రైః పరితశ్చరన్తి' అని–ఈరీతులు, ఇంకా వేరేవి కూడా అనుభవమును బట్టి తెలియవలెను.

---

శ్రీశర్వాణి :

† యథాయథా = తథాతథా తత్త్వకథా అనుచోట్ల తకారద్వయము నడుమ గుర్వక్షర మున్నది కనుక అశ్రవ్యత తొలగినను తథాయథా యనుచోట త, థ కారముల అవ్యవధాన మశ్రావ్య మని భావము.

* మూడక్షరముల కూడిక నాల్గక్షరముల కూడిక ఇత్యాదులు.

తరువాత వేరేపదమునం దున్న సంయోగమునకు దీర్ఘముతోడి అవ్యవధాన మొక్కస్థానైనను అశ్రావ్యము. మాటికి ననుచో నింకను – 'హరిణీప్రేక్షణా యత్ర గృహిణీ నవిలోక్యతే, సేవితం సర్వసంపద్భి రపితద్భవనం వనమ్' – ఒక పదమునందున్నచో న ట్లశ్రావ్యము కాదు ఎట్లనగా — 'జాగ్రతా విచితః పన్థాః కాత్రవాణాం వృథోద్యమః' పరసవర్ణమువలన నేర్పడిన సంయోగ మవ్యవహితముగా నున్నను అది ఎన్నివిధములుగాఁ జూచినను దీర్ఘమున కన్న వేరుపదమునం దుండదు గనుక, మధురము కనుకను అవ్యవధాన మేమాత్రమును అశ్రావ్యముగా నుండదు. ఉదా :– 'తాంతమాల తరుకాన్తి' యనునది ఇచట 'తాం' అనుచోటను, 'నీం' అనుచోటను పరసవర్ణము, పూర్వపదమునకు సంబంధించినది కనుక అట్టి సంయోగము వేరేపదమునం దుండునది కాదు. ప్రత్యేకముగానే 'సంయోగసంజ్ఞ' యను పక్షముననైనను సంయోగము వేరేపదమునం దుండి కూడా దీర్ఘమున కవ్యవహితముగా పరమైలేదు. 'నవామ్బుద' * అనుచోటనైతే ఏకాదేశము రెండుపదములకును సంబంధించినది. పరసవర్ణకృత మగు సంయోగము దీర్ఘమునకు భిన్నపదగతము, అవ్యవహితోత్తరము నగును. అయినను ఇచట 'భిన్నపదగతము' అనగా ఒక పదమున నుండుదానికన్న వేరగుట యని వివక్షింతుము గనుక దోష మంటదు. మాటిమాటి కైనచో నింకను ఉదా :– 'ఏషా ప్రియ మే క్వ గతా త్రపాకులా' ఈయశ్రవ్యత కావ్యమునకు కుంటిదనమువోలెఁ దోచును. (ఈయశ్రావ్యత యుండుచోట కావ్యము కుంటిగా నడచినట్లుండును).

మరియు ఇష్టము వచ్చినట్లు సంధి మానుట యొకస్థానైనను చెవి కింపు గొల్పదు. ఎట్లనగా—'కమ్యాణి ఇన్దుముఖి తే కిలిగించితాని' ప్రగృహ్యాభావము

---

శ్రీశర్వాణి :

* నవ + అమ్బుద అనుచోట 'అకస్సవర్ణే దీర్ఘః' అని దీర్ఘము రెండు ఆకారములకు ఏకాదేశముగా వచ్చినది గనుక అది రెండు పదములకును సంబంధించిన దనవచ్చును. అపు డది పూర్వపదమునకుఁ జేరునపుడు 'నవామ్బుద' లో 'మ్బు' అను సంయోగము దీర్ఘమునకు బరమును వేరు పదమునం దున్నదియు నగును. కనుక వెనుక చెప్పిన దోషము తగుల వచ్చునని యాశంక.

వలన నేర్పడు విసంధి మాటిమాటి కైనపుడే అశ్రవ్య మగును. 'అహో అమీ ఇనుముఖీ విలాసాః'. య, వ లోపమువల్ల నేర్పడునదియు నింతే. 'అపర ఇషవ ఏతే కామినీనాం దృగన్తాః' అయితే

'భుజగాహిత ప్రకృతయో గారుడ మంత్రా ఇవావనీరమణ
తారా ఇవ తురగా ఇవ సుఖలీనా మన్త్రిణో భవతః'

అను నీ పద్య మెట్లు సరియగు నన్నచో 'య' లోపము నొనర్పకయే పఠింతుము. కనుక దోషము రాదు.

ఇట్లే రోరుత్వము. హవిలోపము, యణ్, గుణవృద్ధి సవర్ణపూర్వ రూపాదులు దగ్గరగా నెక్కుడుగా నుండుటయు అశ్రవ్యతకుఁ గారణము. ఈరీరుగా నుండు అశ్రవ్యభేదము లన్నియు నన్నికావ్యము లందును విడువవలెను.

ఇక విశేషించి వీడవలసినవి — 'అందును మధురరసములందు విశేషించి వీడవలసినవి' అని వేనిని అను పదముననే తెల్పబోవుదమో అవియే ఓజస్వి రసములందు అనుకూలములు 'ఏ వనుకూలము లంటిమో అవి ప్రతికూలములు' అని సామాన్యముగా నిర్ణయము. మధురరసములందు దీర్ఘ సమాసములను వీడవలెను. ఝయ్‌తో గూడిన సంయోగపరమైన హ్రస్వమును, విసర్జనీయమున కాదేశమైన సకారమును, జిహ్వామూలీయోపధ్మానీయములను గూడ విడువవలెను. టవర్గమునకును, ఝయ్యులకును, రేఫహకారములలో నేదేనితోనైన నేర్పడిన

---

శ్రీ శర్వాణి :

• ఓరాజా ! నీ మంత్రులు భుజగ = విటులకు, అహిత = హితముగాని, ప్రకృతయః = స్వభావము కలవారు. ఎటువలె ? గారుడమన్త్రా ఇవ = గరుడును సంబంధించిన మంత్రములవలె, ఆమంత్రములు – భుజగ = సర్పములకు, అహిత = చెరుపుచేయునట్టి, ప్రకృతయః = స్వభావముకలవి యని మొదటి సగములో అర్థము. అంతేకాక, తారా ఇవ = నక్షత్రముల వలెను, సు, ఖ, లీనాః = బాగా ఆకసమున దాగియున్నవి. తురగా ఇవ = గుఱ్ఱములవలె, సు, ఖ, లీనాః మంచికళ్ళెములు కలవి. ఇట్లొక్క శబ్దపు సామర్థ్యమువల్ల నుపమాపోషణము కాగా శ్లేషపూరిత మగు నుపమ యిట నలంకారము.

సంయోగమును ల, మ, స, లు గాక మిగిలిన హల్లులకు తమతమతో నేర్పడిన సంయోగమును, ఝయ్యులు రెంటితో నేర్పడిన సంయోగమును, దగ్గరగా మాటిమాటికిని ప్రయోగింపరాదు సవర్ణము లైన రెండు ఝయ్యులతోడి సంయోగమును, శర్ఛలు తప్ప మిగిలిన మహాప్రాణములతోఁ గూర్పఁబడిన సంయోగమును, ఏయొక్కసారియు గూడ ప్రయోగింపఁ దగదని సంగ్రహము దీర్ఘసమాస మెట్లనగా —

'లోలాలకావలి వలన్నయనారవింద
లీలావశంవదిత లోక విలోచనాయాః
సా యాహని ప్రణయినో భవనం వ్రజన్త్యా
శ్చేతో న కస్య హరతే గతి రంగనాయాః. *

ఝయ్‌తో నేర్పడిన సంయోగము పరముగా నున్న హ్రస్వములు అధికముగా దగ్గరగా నుండు టెట్లనగా...

'హీర స్ఫుర ద్రదన శుభ్ర మనోభి కించ
సాన్ద్రామృతం వదన మేణవిలోచనాయాః
వేధా విధాయ పునరుక్త మివేన్దు బిమ్బం
దూరీకరోతి న కథం విదుషాం వరేణ్యః" †

ఇచట 'భ్రా' అన్నంత వరకును శృంగార రసమునకు దగదు. మిగిలినది బాగుగనే యున్నది. ఉత్తరార్ధములో కకార రకారములను ఝష్ † ద్వయపు సంయోగమున్నను తరుచుగా లేదు కనుక దోషము రాదు. ఇట 'దన్తాంశుకాన్త

---

శ్రీశర్వాణి :

* ముంగురుల గుంపు నొయ్యారము, కమలములవలెఁ జలించు కనుల యొయ్యారమును లోకుల చూపులను లోబరచుకొనగా సాయంసమయమున ప్రియునింటి కేగుచున్న యంగన నడక ఎవని మనసు నాకర్షింపదు ?

• వజ్రములవంటి పన్నుల తెల్లఁదనముతో చిక్కనైన అమృత మున్న లేడికంటి మొగము నిర్మించిన బ్రహ్మ పునరుక్తముగా నుండు చంద్రబింబము నేల దూర మొనర్పడు ? అతడు తెలిసినవారి కెల్ల మేటికదా !

† ఝయ్యులు వర్గము లైదింటిలోని ప్రథమ, ద్వితీయ, చతుర్థ వర్ణములు.

మరిచిన్న రమావహారి సాన్ద్రిమ్మలిమ్' అని యీతీరుగా పూర్వార్థమున గూర్చి నచో నప్పదంతియు రమణీయముగానే యగును.

విసర్గలు ప్రచురముగా నుండుటకు ఉదాహరింతుము

'సానురాగా స్సానుకమ్పా శ్చతురా శ్శీలశీతలాః
హరన్తి హృదయం హన్త కాన్తాయా స్స్వాన్త వృత్తయః' †

ఇక్కడ రవర్ణములు రెండును కలియునరకును (శీలశీతలాః) పూర్వార్ధము—ఈశ్లోకములోని మొదటి సగము మాధుర్యమునకు అనుగుణముగా కూర్పబడలేదు.

జిహ్వామూలీయములు ( ఃక ఃఖ ) తరుచుగా నుండుట కుదాహరణము —

'దలిత కులిశ ఘాతాః కేఽపి ఫేలను వాతాః
కుశల మిహ కథం వా జాయతాం జీవితే మే
అయ మపి బత గుఞ్జ న్మాలిమాకన్ద మౌలౌ
చులుకయతి మదీయాం చేతనాం చంచరీకః" ౭

ఇచట రెండవ జిహ్వామూలీయ పర్యంతము—'వాతాఃకు' పర్యంతముకూర్పు మాధుర్యమునకు సరిపడదు. అయితే. 'కథయ కథమువాశా జాయతాం జీవితే మే మలయ భుజగ వాన్తాః వాన్తి వాతాః కృతాన్తాః' అనికూర్చినచో నీదోషముతగులదు.

ఉపధ్మానీయములు ( ఃప ఃఫ ) లు తరుచుగా నుండుట కుదాహరణము —

'అలకాః ఫణిశాబతుల్య శీలాః
నయనాన్తాః పరి పుంఖితేషు లీలాః
చపలోపమితా ఖలు స్వయం యా
బత లోకే సుఖసాధనం కథం సా" △

---

శ్రీశర్వాణి :

† అనురాగము, జాలి, వడుపు గల్గి సహజముగా చల్లనైన ప్రియురాలి మనసునడకలు హృదయము నాకర్షించుచున్నవి.

౭ వజ్రపు దెబ్బలవలె నేవోగాలులు ఆడుచున్నవి. నాప్రాణ మెట్లు నిల్చును. ఈతుమ్మెదయు మామిడిమీద జుమ్మని రొద పెట్టుచు నాబుద్ధిని హరించుచున్నది.

△ ముంగురులు పాముపిల్లలవంటివి. కనులచివరలు ఎక్కుపెట్టబడిన బాణములవంటి ఆమె తాను స్వయముగా మెరుపువలె మెరయును. ఆమె లోకములో సుఖమున కెట్లుపయోగపడును ?

ఇక్కడ ఈరెండును పద్మానీయములే (ఃప ఃఫ) శాంతమునకుఁ దగవు. టవర్గము, ఝయ్యాలు ఎరుచుగా నుండుట కుదాహరణము:—

'వచనే తవ యత్ర మాధురీ సాహృదిపూర్వా కరుణా చ కోమలేభూత్
అధునా హరిణాక్షి హా కథం వా కటుతాత్ర కఠోరతా విరాసీత్'

'అధునా సఖి తత్రహా కథంవా గతిరన్యై వనిలోక్యతే గుణానాం.'

రేప కలసిన సంయోగము తరుచుగా నుండుట కుదాహరణము :—

'తులా మనాలోక్య నిజామఖిర్వం గౌరాంగి గర్వం నకదాఽపి కుర్యాః
లసన్తి నానాఫలభారవత్యో లతాః కియత్యోగ హనాన్తరేషు.'

అయితే, 'తులా మనాలోక్య మహీతలేఽస్మిన్' అని నిర్మించినచో బాగగును.

ల, మ, నలు కాక కడమహల్లులు తమతోనే కలసి మాటిమాటికిని ప్రయోగింపఁ బడుటకు 'విగణయ్య మేనికాయ్యం తా మనుయాతోసి నైవత న్నాయ్యయ్యం'. ల, మ, సలు తమతో గలియుట అంతగా పరుషము కాదు. ఎట్లనగా—

'ఇయ ముల్లసితా ముఖస్య శోభా పరిఫుల్లం నయనామ్బుజ ద్వయం తే
జలదాలి మయం జగద్వితన్వ≡ కలితః క్వాపి కిమాలి నీలమేఘః.'

రెండు ఝయ్యాలు కలిసిన సంయోగ మెట్లనగా (అసకృత్తుగా) —

ఆసాయం సలిలభరే సవితార ముపాస్య సాదరం తపసా
అధునాబ్జేన మనాక్తవ మానిని! తులనాముఖస్యాప్తా!

ఇట రెండవసగము బాగుండలేదు. 'సరసిజకులేన సమ్ప్రతి భామిని తే ముఖతులాఽధిగతా' అనిన బాగు.

రెండు ఝయ్యాలు కలసిన సంయోగము సకృత్తుగా ప్రయోగించుట కుదాహరణము :—

'అయి మన్దస్మిత మధురం వదనం తన్వంగి యది మనాక్కురుషే
అధునైవ కలయ శమితం రాకారమణస్య సామ్రాజ్యమ్.

అయితే ఇక్కడ 'మనాక్కురుషే' అనుచోటి 'కద్వయ' సంయోగము రెండుహల్లులు తమలో కూడినసంయోగముగానే నిషేధింపఁ బడును. ఇక 'క, ఖ' ల సంయోగము మహాప్రాణముల సంయోగముగానే నిషేధింపఁబడును.

తృతీయవర్ణములతో మొదటివర్ణముల సంయోగము మహాప్రాణముల సంయోగముగానే నిషేధింపఁబడును. తృతీయవర్ణములతో మొదటివర్ణముల సంయోగము (క్గ, చ్జ, ట్డ, త్ద, ప్బ) అసంభవమే. కాగా సవర్ణము లగు రెండు ఝయ్యల సంయోగపు నిషేధము అనుదానికి చోటేది? నిజమే, సంస్కృతముగా ప్రయోగించుచోటు కనుక ఇది = సవర్ణ ఝయ్ద్వయసంయోగము వేరే కాద న్నచో 'మనాక్కురుషే' అనునది నిర్దోషము కావలసి వచ్చును. మహాప్రాణ ములు కూడిన సంయోగ మెట్లనగా :– 'అయి మృగమదబిన్దుం చేత్ ఫాలేబాలే సమా తనుషే' ఉత్తరార్ధము వెనుకటిదే.

ఇలాగే త్వప్రత్యయము, యజన్తములు, యఙ్జన్తములు (ఇవి కేవలము సంస్కృతమునకు మాత్రమే సంబంధించినవి), ఇంకను ఇతరము లైనవి, శాబ్దికులకుఁ బ్రియము లైనను మధురరసమునఁ బ్రయోగింపరాదు. ఇట్లే వ్యంగ్యచర్వణలో నిముడక, వేరుగా యోజనావిశేషమును బట్టియే యేర్పడు ననుప్రాసముల గుంపులను, యమకములు మొదలగు వానిని, అవి యాపాతతః చమత్కారము నెక్కుడుగా కల్గించును గాక. అయినను కవి వానిని గూర్పఁదగదు. ఏమంటే, అవి రసచర్వణలో నిముడవు. ఇముడక పోగా, సహృదయుల హృదయములను దమవంకకు ద్రిప్పుకొని రసము నెడ బెడమొగము పెట్టించును. విప్రలంభశృంగారమున నివి యస లేమాత్రమును జేరరాదు. ఏమనగా – ఈరసము కడమ యన్నింటికన్నను మిక్కిలి మధురము. పరిశుభ్ర మగు పంచదారతో చేయబడిన పానకరసము వంటిది. అందులో నిముడక, తనంత దానుగా నుండు పదార్థము ఎంతకొద్దిదైనను సహృదయుల హృదయములకు నొప్పి కల్గించును. కనుక నచట నట్టి దేదియును జేరరాదు. ఏమన్నారనగా –

'ధ్వన్యాత్మభూతే శృంగారే యమకాది నిబన్ధనమ్
శక్తావపి ప్రమాదిత్వం విప్రలమ్భే విశేషతః.'

అయితే ఈ అనుప్రాసాదులు లేశమును క్లేశము నొదవింపక తమంత దాము తలెత్తుకొని * నిలువబడక (రసాదులకన్న) వేరుగా భావింపఁ బడకుండె



* 'స్వతంత్రముగాను విస్తరించియును నుండకపోవుట'. యని అర్థము.

నేని, రసచర్వణలోనే యిక్కడి సుఖముగా గోచరింప వీలగునేని అట్టివానిని వీడరాదు. ఎట్లనగా —

'కస్తూరికా తిలకి నూలి విధాయ సాయం
స్మేరాననా సపది శీలయ సౌధ మౌలిం
ప్రౌఢిం భజన్తు, కుముదాని ముదాముదారాం
ఉల్లాసయన్తు పరితో హరితో ముఖాని.' †

సరి, ఇప్పటికి ప్రసంగవశమున మధురరసమును వ్యక్తపరచు రచనయందలి దోషములను సంక్షేపముగా నిరూపించితిమి.

సంస్కృత మూలము :

ఏభి ర్విశేషవిషయై స్సామాన్యై రపి చ దూషణై రహితా
మాధుర్య భార భంగుర సుందర పద వర్ణ విన్యాసా
వ్యుత్పత్తి ముద్గిరన్తీ నిర్మాతు ర్యా ప్రసాదయుతా
తాం, విబుధా వైదర్భీం, వదన్తి వృత్తిం గృహీత పరిపాకామ్.

తెలుగు తాత్పర్యము :

ఈచెప్పిన సామాన్యదోషములు, విశేషదోషములు లేకుండను, కమ్మదనము నిండి అందమైన పదములు, అక్షరములు నెలకొన్నదియు, నిర్మించువాని తెలివి తేటలను (వ్యుత్పత్తిని) వెలువరుచుచు, ప్రసాదగుణము కలిగి, పరిపాకము నొందిన వృత్తి వైదర్భి యని విద్వాంసు లందురు. దీనికిఁ గొన్ని పద్యముల నుదాహరించితిమి. అయినను, మరొకటి —

'అయాతైవ నిశా నిశాపతి కరైః కీర్ణం దిశా మన్తరం
భామిన్యో భవనేషు భూషణగణై రుల్లాసయన్తి శ్రియం
వామే మాన మపాకరోషి నమనాగద్యాపి రోషేణ తే
హా హా బాలమృణాలతోఽ ప్యతితమా తన్వీ తనుస్తామ్యతి' †

---

శ్రీశర్వాణి :

† రాత్రి రానే వచ్చినది. చంద్రుని కిరణములు దిగంతరాళమున వ్యాపించినవి. సుందరు లిండ్లయందు నగల సొగసుల వెలయించుచున్నారు. ఇప్పటికినీ నీవు బెట్టు మానవు. లేఁదామరతూడు కన్న గూడ నీ సన్నని శరీరము నవసి పోవుచున్నది.

ఈవైదర్భీరీతినిఁ దీర్చుటలో కవి యెక్కుడు జాగ్రత్త వహింపవలెను. లేనిచో సరియగు పాకము రాదు. ఎట్లనగా – అమరుకకవి పద్యములో

'శూన్యం వాసగృహం విలోక్య శయనా దుత్థాయ కించి చ్ఛనై
ర్నిద్రావ్యాజ ముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖం
విస్రబ్ధం పరిచుమ్బ్యజాత పులకా మాలోక్య గణ్డస్థలీం
లజ్జా నమ్రముఖీ ప్రియేణ హసతా బాలా చిరం చుమ్బితా'.

ఇక్కడ 'ఉత్థాయ కించి చ్ఛనైః' అని సవర్ణము లగు ఝయ్యల జంట కలయిక, అందును చాల దగ్గరగా నుండుట మిక్కిలి అశ్రవ్యము. అట్లే ఝయ్యులతో గూడిన సంయోగ పరహ్రస్వపు సంయోగమును (చిచ్ఛ) అశ్రవ్యమే. 'శనై ర్నిద్రా' మను నెడను, 'నిర్వర్ణ్య ప్రత్యుర్ముఖం' అనునెడను రేఫతోడి సంయోగము, ఝయ్యులతో గూడిన సంయోగపర హ్రస్వము తరచుగా నున్నవి. 'విస్రబ్ధం' అనుచోట మహాప్రాణముల కూడికయు, 'లజ్జా' అనునెడ ఝయ్ వర్ణములు తమతో తాము కూడుటయు, 'ముఖీ, ప్రియేణ' అనుచోట, వేరే పదమునందలి దీర్ఘముతో నెడబడని కూడికయు అశ్రవ్యమే. అట్లే 'క్త్వా' ప్రత్యయము అయిదుతడవలును 'లోకృ' ధాతువు రెండుసార్లును వాడబడినవి. ఇవి కవితానిర్మాణమునం (దీకవికి) సామగ్రి లోపముగా నున్న దని స్పష్టపర చును. పరుల కావ్యములను విమర్శించు టిక చాలును. ఇక్కడికి రసములు సంక్షేపముగా నిరూపింపఁబడినవి.

ఇక భావధ్వనిని నిరూపింతుము. సరే! 'అసలు భావ మనగా నేమి? విభావములు, అనుభావములు గాక రసమును వ్యక్తపరచునది భావము' అని యనరాదు. రసమయ మగు కావ్యవాక్యమున నతివ్యాప్తి కల్గును. (ఆవాక్యము భావము కాదు. కాని, రసమును వ్యక్తపరచును). అర్థముద్వారా శబ్దముకూడ రసవ్యంజకమే కదా! మరొకద్వారము లేకుండ రసవ్యంజక మగు నని విశేషణము కూర్చినచో వెనుకటి యతివ్యాప్తి వారించును గాని అసంభవ మేర్పడును. (లక్ష్యమున నేయొక్కచోటను లక్షణము లేకపోవుట సంభవము). ఏమనగా భావ మైనను భావనాద్వారముననే కదా రసమును వ్యక్తపరచ గల్గును. అదీకాక ఈలక్షణము భావనయం దతివ్యాప్తమును నగును. ఇందువలననే విభావానుభావ భిన్నత్వమువలె శబ్దభిన్నత్వమును విశేషణ మొనర్చినను విస్తారము లేదు. మరియుఁ బ్రధానముగా ధ్వనించు భావమునందు రసవ్యంజకత్వము లేదు కనుక

అవ్యాప్తి ఆపాదించును. 'ప్రధానముగా భావము ధ్వనించినను పర్యవసానమున రసము వ్యక్తము కానే అగునుకదా!' అని యందురేని భావధ్వనికి లోపము ప్రసక్తించును. భావము నుండి యేర్పడిన చమత్కృతి భిన్న మైనచో గదా భావధ్వని యగును.

'అది కాదయ్యా! అచట రసము వ్యంగ్య మైనను చమత్కార మొదవింపదు కనుక రసధ్వని యని వ్యపదేశింప వీలుకాదు'_ అనుట కవకాశము లేదు. రస మేదైనను చమత్కారము లేకుండ నుండుటలో ప్రమాణము దొరకదు. (అనగా చమత్కారము లేని రస మొకటియైన నుండ దనుట). రస మెన్నడును ఆనందాంశమును వీడ దనుట ధర్మిగ్రాహక ప్రమాణసిద్ధ * మగు నని ఇదివరకే తెల్పియున్నాము. అథవా, ప్రధానముగా వ్యక్త మగు భావము పర్యంతమున రసమును వ్యక్తమొనర్చుగాక (ఇందువల్ల నసంభవము వారించుగాక). అయినను దేశము, కాలము, వయసు, అవస్థ మొదలగు నానాపదార్థములతోఁ గూర్పఁబడిన పద్యవాక్యార్థమున నతివ్యాప్తి తప్పదు. అది విభావానుభావములు కాదుకదా! రసము నభివ్యక్త మొనర్చు నాయెను. 'రసమును వ్యక్తపరచు చర్వణలో గోచరమగు చిత్తవృత్తి 'భావము'. భావాది చర్వణయు రసవ్యంజకమే కనుక నట నది వ్యాప్తికి రాకుండ 'చర్వణలో గోచర మగును',అని చిత్తవృత్తికి విశేషణ మీయబడినది'. † అనియుఁ జెప్పఁదగదు. ఏమంటే

'కాలాగురు ద్రవం సా హాలాహలవ ద్విజానతీ సితరాం
అపి నీలోత్పల మాలాం బాలా వ్యాలావలిం కిలా మనుతే'

---

శ్రీ శర్వాణి :

* ధర్మిగ్రాహక ప్రమాణసిద్ధము_ అసలువస్తు వేప్రమాణమున సిద్ధించునో అది ధర్మిగ్రాహక ప్రమాణము, రసమునుగ్రహించుప్రమాణము సహృదయ హృదయము. అది రసము నెన్నడును ఆనందాంశమును వీడి గ్రహింపదు. ఆనందాంశముతో నవినాభూతముగానే గ్రహించును. గనుక ఆనందమును వీడి రస మెన్నడును సిద్ధింప దని.

† ఈవిశేషము లేనిచో రసమును వ్యక్తపరచు చిత్తవృత్తి యని లక్షణ ముండును. భావచర్వణ గూడ రసవ్యంజక మగు చిత్తవృత్తియే కనుక నట నతివ్యాప్తి యేర్పడు నని భావము.

(ఆహా! నల్ల యగురుధూపమును హాలాహలము వంటి దనుకొన్నది. నల్లకలువల దండను పాములబారునుగాఁ దలచుచున్నది.) ఈచోట హాలాహల సాదృశ్యము విశేషణముగా గోచరించు జ్ఞానమునం దతివ్యాప్తి యేర్పడును. అది విప్రలంభమున కనుభావము కనుక రసాభివ్యంజక మగు చర్వణలో గోచర మగును చిత్తవృత్తియు గూడ గదా యిది. △ పోనీ భావత్వము అఖండపదార్థ మనెద మన్నచో నందుకు ప్రమాణము లేదు. కాగా నీవిషయమున సిద్ధాంతమును దెల్పుదుము.

విభావాదులచే వ్యక్తపరుపఁబడుచుండు హర్షాదులలో నొకటియగుట భావ లక్షణము. 'వ్యభిచారీ తథాఽఞ్జితః' † (-వ్యంజనచే స్ఫురించునది వ్యభిచారి భావము) అన్నారు ఈహర్షాదులు సామాజికులం దుండునవి.

---

శ్రీ శర్వాణి :

△ ఇట 'అనుభావ భిన్నము' అని విశేషించుచో అతివ్యాప్తి తొలగు నని నాగేశుడు. అదితప్పు. ఏమంటే ముందు 'దరానమత్కంధరం' అనుచోట వాచ్యము కనుక స్మరణము భావముకా దనుచున్నాడు పండితుడు. అట నీలక్షణము-రసాభివ్యంజక చర్వణావిషయ చిత్తవృత్తిత్వము-అతివ్యాప్తము కాక తప్పదు. విభావభేదమున గూడ విశేషించుచో లక్షణము గురుతర మగును. విభావానుభావ భిన్నమై రసాభివ్యంజక మగు చిత్తవృత్తి భావము అను లక్షణముల లక్ష్యమగు భావమున కన్న గురుతరమే కదా ! ఇంత చేసి ననుప్రధానభావమున కంగముగా వ్యక్తమగు భావములో నతివ్యాప్తి తప్పదు. అదికూడా భావమేకనుక లక్ష్యమే యనరాదు. ప్రకృతముతో లక్ష్యములు ప్రధాన వ్యంగ్యము లగు భావములుకాని వాని కంగములగు భావములు కావు. కనుక భక్షితేపి లశునేన రోగశాన్తి అనుటయే నాగేశునకు సిద్ధించును. ముందు గ్రంథములో భావాంగముగా భావము వ్యక్తము కావచ్చు నని నిరూపించిన తరువాత నీయతివ్యాప్తి సుగమ మగునని పండితుడు నిరర్థక మగు నాగేశుని విశేషణము నీయలేదు. ప్రధానాప్రధానభావము లన్నియు లక్ష్యము లన్నను లక్షణము గురుతర మగుట యను దోషము తప్పనే తప్పదు.

† ఈవిశేషణము లక్షణమును గురుతర మొనర్చు ననరాదు. ఇది లక్షణ శరీరములో జేరదు. హర్షాద్యన్యతమమే భావము అని లక్షణము. లఘువే. 'విభావాది' యని వ్యంజక సామాగ్రిని దెల్పుటయే కాని దోషవారణప్రసక్తి లేదని భావము.

'స్థాయిభావములు వ్యక్తమగు తీరున వ్యక్తమగును.' *– అని కొందరందురు. వ్యంగ్యాంతరముల † వలె = వస్తువు అలంకారము వ్యంగ్యమగుతీరున వ్యక్తమగునని మరికొందరందురు. విభావమును, అనుభావమును భావమును వ్యంజించును. అంతేకాని ఒక వ్యభిచారి వ్యక్తమగుటలో మరొకవ్యభిచారి తప్పక వ్యంజకము కావలసిన పనిలేదు. అపుడా వ్యంజక మగు భావమే ప్రధానము కావలసి వచ్చును. అసలు సంగతి యేమనగా – ప్రకరణాదులను బట్టి యొక భావము ప్రధాన మగుచుండును. అపు డాసామగ్రితోనే ప్రధాన భావముతో

శ్రీశర్వాణి :

* స్థాయిభావములు సామాజికుల మనసులందు వాసనారూపమున నుండునవి. కావ్యనాటకాదులం దుపస్థితము లగు విరుద్ధావిరుద్ధ భావములచే విచ్ఛిన్నములు కాకుండ ఆయావ్యంజక సామగ్రితో స్థిరముగా నెట్లు వ్యంగ్యములగునో అట్లే యీహర్షాదులు నని పండితుని పక్షము.

సామాజికుల మనసులందు సహజముగా నున్ననూ విభావానుభావాదిక వ్యంజక సామగ్రిచే సత్త్వ ముద్రేకించి, ఆవరణము తొలగగా స్థాయిభావమను నుపాధితో భగ్నావరణమగు చిదానందమే రసముగా వ్యక్తమగునట్లు విభావాది సామాగ్రిచే సత్త్వోద్రేకము కల్గి, భగ్నావరణమైన చిత్తుతో గూడిన భావములు కూడ సామాజికుల మనస్సులం దభివ్యక్తము లగు నని కొందరు.

† వాచక లక్షక శబ్దములు – వాచ్యలక్ష్యార్థములను దెల్పినను వక్తబోద్ధవ్యుడు మొదలగు విశేషములను బట్టి అనురణనక్రమమున వస్త్వలంకారాత్మక మగు వ్యంగ్యము శ్రోతలకు మనసులం దెట్లు స్ఫురించునో అట్లే విభావాదులను దెల్పు నాయామాటలు తెలిసిన తరువాత (భావము లైనను ఇవి) అనురణనక్రమమున సామాజికుల హృదయములందు అభివ్యక్తము లగునని మరికొందరి పక్షము.

ఇది ప్రధానాప్రధానము లగు సకలభావము లందును సమన్వయింపక తప్పదనియే పర్యవసానము. ఏమన: పుత్రోత్పత్త్యాదికమును గూడ హర్షవిభావములలోఁ జేర్పఁబోవు చున్నాడు కదా ! స్థాయిభావాదులు వ్యక్త మగు తీరు నిదివరలో గ్రంథకర్త తెల్పెను. అది ఇట కూర్పబడెను. ఈవిషయము ముందు వివరణము తెల్పును. ఇట విభావా దీత్యాదికము "కావ్యమున విభావాదులు హర్షాదుల వ్యక్తపరచు ననుట.

నిత్యసంబద్ధము కనుక వ్యంగ్యముకాక తప్పక వ్యంగ్యమగు మరొక భావము అల్పమైనది అంగముగా నున్నను బాధలేదు.

ఎట్లనగా— గర్వాదికము వ్యంగ్య మగునపుడు అమర్షము, అమర్షాదికము వ్యంగ్య మగునప్పుడు గర్వమును అంగమైనను బాధలేదు అయితే ఈతీరులో భావము గుణీభూత వ్యంగ్యము కావలసివచ్చు ననరాదు.

ప్రధానభావపు విభావానుభావాములకన్న వేరగు విభావానుభావములచే వ్యక్తమై ఇందువల్లనే నాన్తరీయకమగు (ప్రధానభావము వ్యక్తమగునపు డిదియు దానిని వీడకుండ వ్యంగ్యముకాక తప్పక వ్యంగ్య మగు) భావమే గుణీభూత వ్యంగ్యమనుటకు హేతువగును. (ప్రకృత మట్టిది కాదు) కనుకనే నాన్తరీయక మగు భావము వ్యక్తమగును. అట్లు కాదేని గర్వాది ధ్వని ఉచ్ఛిన్న మగును.

వ్యభిచారి భావమునకు నిమిత్త కారణము విభావమగును. అంతేకాని రసము నకువలె ఆలంబనోద్దీపనములు తప్పక యుండవలె నను నపేక్షలేదు. ఎచటనైన నొక చోట నవి సంభవించుచో౯ గాదనము.

హర్షాదు లనగా – హర్షము, స్మృతి, వ్రీడ, మోహము, ధృతి, శంక, గ్లాని, దైన్యము, చింత, మదము, శ్రమ, గర్వము, నిద్ర, మతి, వ్యాధి, త్రాసము, సుప్తి, విబోధము, అమర్షము, అవహిత్థ, ఉగ్రత, ఉన్మాదము, మరణము, వితర్కము, విషాదము, ఔత్సుక్యము, ఆవేగము, జడత, ఆలస్యము, అసూయ, అపస్మారము, చపలత, శత్రువు లొనర్చు ధిక్కారాదుల వలన గల్గు నిర్వేదము నని ముప్పదిమూడు వ్యభిచారులు.

---

శ్రీ శర్వాణి :

ఇట నాగేశుడు వ్యంగ్యాంతరములవలె భావములు వ్యంగ్యము లగు ననగా— రసము కన్న నితరము లగు వస్త్వలంకారాదికము వలె వ్యంగ్య మగు నని యర్థ మన్నాడు. అది తప్పు. ఏమంటే—వ్యంగ్యములు రసము అలంకారము వస్తువు నని మూడే. ఇందు రసముకన్న నితరములు వస్తువు అలంకారము నని రెండే. ఇవు డిట ఆదిపదముచే గ్రహింపవలసిన దేది? రసాభాసాదికము, భావము ననరాదు. ప్రకృతమున విచారించునది భావముయొక్క వ్యక్తిని గూర్చి కనుక భావమును గ్రహింప దగదు. అట్లు కాదన్నచో, భావవ్యక్తివలె భావవ్యక్తి యేర్పడు నను నసంగత మగు నర్థ మేర్పడును. ఇక రసాభాసాదిక మంతయు రసవ్యక్తివలె నగునదియే. అది భావమునకు పొసగ దనియే కదా వ్యంగ్యాంతరన్యాయము నిట నపరులు (వ్యంగ్యాన్తరన్యాయే నేత్యపరే) తెల్పిరి. కనుక ఇట్లు ఏదో చేతికి వచ్చినట్లు వ్రాయుటయే కాని నాగేశుడు వివేకముతో వ్రాయజాల డని స్పష్టము.

గురువులు, దేవతలు, రాజులు, బిడ్డలు మొదలగు వారిని గూర్చిన రతియు నని ముప్పదినాల్గు. ఇందువల్ల 'పుత్రాదుల నాలంబనముగాఁ గొనిన వాత్సల్యము మరొక రసము' అనుట తోసివేయుట యైనది. ఇట్లు విచ్చలవిడి తనము భరతముని మాటలను బట్టియే వెనుకకుఁ గొట్టివేయఁ బడినది కదా.

అందులో – 'ఇష్టమైనదానిని పొందుట మొదలగువాని వల్లగల్గు సుఖ విశేషము 'హర్షము'*. ఆ విషయమును పెద్దలు తెల్పిరి.

'దేవభర్తృ గురుస్వామి ప్రసాదః ప్రియ సంగమః
మనోరథాప్తిః అప్రాప్య మనోహర ధనాగమః
తథోత్పత్తి శ్చ పుత్రాదే ర్విభావో యత్ర జాయతే
నేత్ర వక్త్ర ప్రసాద శ్చ ప్రియోక్తిః పులకోద్గమః'.
అశ్రుస్వేదాదయ శ్చానుభావాః హర్షం తమాదిశేత్.

దేవతలు, భర్త, గురువులు, ప్రభువు, వీరి అనుగ్రహము. ప్రియునితో గూడుట, కోరిక సమకూరుట దుర్లభమై మనసు నాకర్షించు ధనము వచ్చుట. బిడ్డలు మొదలగు వారు కల్గుట ఇవి విభావములు కనులు మొగము ప్రసన్నముగా నగుట, ప్రియముగా మాటాడుట, పులక లుదయించుట, కన్నీరు, చెమట మొదలగునవి అనుభావములు.

ఇవి సమకూడిన యెడల హర్ష మనవలెను.

ఉదా :–'అవధే దివసావసానకాలే భవనద్వారి విలోచనే దధానా
అవలోక్య సమాగతం తదామా మథరామావికసన్ముఖీ బభూవ'.

ఇట అవధి * కాలమునఁ బ్రియుడు వచ్చుట విభావము. (అదే కదా నాయిక హర్షమునకు నిమిత్తము) మొగము విప్పారుట అనుభావము. (ఇది హర్షమున జనించినదే కదా)

---

శ్రీశర్వాణి :

* ఇచట గూడ సుఖవిశేషమే హర్షమని లక్షణము. రడమది లక్షణ పరిచయమని గుర్తింపవలెను.

*అవధి – గడువురోజు ప్రొద్దుగూకువేళ ద్వారము వంకనే చూపుంచి అప్డు నేను రాగానే చూచి ప్రియురాలు మొగము విప్పారిన దయ్యెను.

సంస్కారజన్యమగు జ్ఞానము స్మృతి, ఎట్లనగా :

'తన్మంజు మందహసితం శ్వసితాని తాని
సా వైకలం కవి ధురా మధురాననశ్రీః
అద్యాపి మే హృదయ మున్మదయ న్నిహ న్త
సాయ న్తనాంబుజ సహోదరలోచనాయాః' †

విశిష్టమైన చింతిన యిట విభావము. కనుబొమలు పైకెత్తుట, దేహము కదల కుండుట మొదలగు ననుభావను లాక్షేపగమ్యములు.

అయితే ఇచట ఈస్మృతి సంచారిభావము, నాయిక విభావము. 'హన్త' యను పదమునఁ దోచు హృదయవైకల్యము లనుభావము వీని చేరిక వలన విప్రలంభ శృంగారరసము వ్యక్త మగును. కనుక రసధ్వని యన వచ్చును. అయినను స్మృతియే మున్ముందు తోచునదియు, చమత్కరించు నదియు గనుక స్మృతి ధ్వని యంటిమి. తచ్ఛబ్దాదు లగు సర్వనామములు బుద్ధిలోఁ దోచు తీరులతో నిర్ణీతమగు వస్తువునే తెల్పును అను మతములో వస్తువు చెప్పబడుటను. నిర్ణయించు (ప్రతిపాద్యతావచ్ఛేదక) తీరులను ఏకముఖ మొనరించుటే బుద్ధి యొక్కపని. (అంతేకాని తదాదులచే బుద్ధి చెప్పబడదు). కనుక ప్రకృతములో వ్యంగ్య మగు స్మృతి వాచ్యము కానేకాదు. ఇక బుద్ధిలోఁ దోచుటనుగూడ 'తదాదులు' చెప్పు నను మతములో (బుద్ధియను సామాన్యరూపమున జెప్పఁబడినను 'స్మృతి' యను విశేషరూపమునఁ జెప్పఁబడదు కనుక) విశేషరూపమున వ్యంజనయే తెల్పుటలో నడ్డేమియు లేదు. ౭

---

శ్రీశర్వాణి :

† 'తన్మంజు'- సాయంకాలమునఁ బద్మమువలె మొగిడిన కనులతోడి నాయందమగు చిరునవ్వును, ఆ నిట్టూర్పులును కలంకము లేని మధురమగు నా మొగము చెలువమును ఇప్పుడు గూడ నామనసును పిచ్చెత్తించుచున్నవి.

౭ ఇట నాగేశుని యాక్షేప మిది - పండితుడు 'శయితాసవిధే' అను శ్లోకములో "కథం చి దపి వాచ్యవృత్త్యనాలింగి తస్యైవ వ్యంగ్యస్య చమత్కారిత్వే నాలంకారికై స్స్వీకారాత్ (వాచ్యవృత్తి= అభిదచే నెంతమాత్రమును స్పృశింపఁబడనపుడే వ్యంగ్యము చమత్కరించు నని యాలంకారికు లంగీకరించిరి) అన్నాడుకదా. ఇట 'స్మృతి' బుద్ధి యను సామాన్యరూపమున జెప్ప

ఆస్మృతి యిట (వాక్యార్థము కనుక) వాక్యము వల్లనే ఎరుగవచ్చున దైనను పదమునందే కుచ్వద్రూపత్వము = వ్యంగ్యమును సమకూర్పగల విశేషము ఉన్నది కనుక పదధ్వనికే యది గోచర మగును.

---

శ్రీ శర్వాణి :

బడెను కదా చమత్కరించు టెట్లు? వ్యంగ్య మెట్లగును?" అనగాఁ దన గ్రంథమే తనకు విరోధించును.

ఈ యాక్షేపము పొసగదు. ఏమనగా – ఎచట సామాన్యాకారమున ('నిర్విశేషం న సామాన్యం' అను న్యాయమున) విశేషరూపమునను వ్యంగ్య మగునో అచట చమత్కారము లేదు. అది వ్యంగ్యాభాస మగును. ఎట్లనగా 'అబాశేతేఽ త్ర వృద్ధా' 'ఈమెయి గ్రొమ్మెఱుంగులు'–ఇట్టి చోటుల 'వ్యాజ పూర్వం' 'మరుపెట్టి' యనుట వల్లనే అర్థము = నాయిక సంభోగాభిలాష రూపమైనది సామాన్యముగఁ జెప్పబడును. అదే అర్థ శబ్దశక్తిచే వ్యంగ్య మగును. కనుక నిది ధ్వన్యాభాస మనఁబడినది. వ్యంగ్యము విశేషరూప మైనను చమత్కరింపలేదు. ఏదైన నొక విషయము ప్రప్రథమమున విస్మయ మొదవించినను అదే తడవ తడవకును తెల్పుచో విస్మయకరము కాదుకదా! (ధ్వన్యాలోకము – నాల్గవ ఉద్ద్యోతము చూడుడు) కనుక విషయ మొకడే సామాన్యరూపమున నుక్తమై విశేషరూపమున వ్యంగ్యమైనను అది పరిచిత పూర్వమే కనుక చమత్కారము నొదవింపదు. కాని, సామాన్యరూపమున నుక్తమైన దొకటియు, విశేషరూపమున వ్యంగ్యమగునది మరొకటియు నగునపుడు చమత్కారి మేల యొదవదు? సామాన్య రూపమున బరిచిత మైన దిది కాదుకదా! ఎట్లనగా 'మృణ్మయము' అని కుండను నిర్దేశించిన చోట దాక అపరిచితమే కదా'. మృణ్మయత్వము సామాన్యధర్మ మైనను ఆ ధర్మిముతోఁ బరిచితమైనది 'దాకు కాదుకదా!' కనుక ఇక 'శయితా' అను శ్లోకము నొద్ద మనోరథత్వ మను సామాన్యాకారముతో చుంబనేచ్ఛ (రతి ప్రకరణము కనుక) గూడ పరిచిత మైనది కనుకను, అటు ఇతడు 'నిద్రించిన వెనుక చుంబింత' మని అను విశేషాకారమున వ్యంగ్యమైనను చమత్కారము కల్గదు. ఈభావమునే పండితుడు 'స్వశబ్దేన మనోరథపదేన సామాన్యాకారేణ తాదృశేచ్ఛాయా అపి నివేదనాత్...నహి విశేషాకారేణ

కాగా భావములు పదవ్యంగ్యము లైనచో జమత్కారము లేదను మాట త్రోసివేయ బడినది. సాయంకాలపు గమనముతోఁ బోల్చుటవల్ల కనులు ముందు ముందు ఎక్కువగా మూసికొనబోవును అని ధ్వనించును. దాని మూలమున ఆమె యాసంపమగ్నురా లగుట ప్రకాశించును

---

శ్రీశర్వాణి.

వ్యంగ్యోపి సామాన్యాకారేణాభిహితోఽర్థః సహృదయానాం చమత్కృతి ముత్పాదయితు మిష్టః' కిథమపి వాచ్యవృత్త్యనాలింగితస్యైవ వ్యంగ్యస్య చమత్కారిత్వే నాలంకారికైః స్వీకారాత్" అన్నాడు. ఇక్కడ నర్థము నేక వచనముతో నిర్దేశించుట గమనింపవలెను. కాగా, సామాన్యాకార నిర్దిష్టమగు నర్థమే విశేషాకారమున వ్యంగ్య మైనను బరిచిత పూర్వమే కనుక చమత్కారము కాదని తేలినది. ఈకారణమునే తచ్ఛబ్దార్థవిచారము ప్రసక్తించినది. అట మతముల రెంటను గూడ వ్యంగ్యప్రకారమునకు వాచ్యప్రకార సంస్పర్శ లేదనుట విస్పష్టపరచ బడినది. విభిన్నాకార పర్యవసాన మున్నచోఁ జమత్కారిత్వ ముండు ననుటకే 'యదేవ వ్యంగ్యంత దేవోచ్యతే, యథైవ వ్యంగ్యం న తథోచ్యతే' అను నాలంకారికి న్యాయము ప్రవర్తించినది. ఇది ఇట్లే కానిచో ఆయలంకారము కడ - పర్యాయోక్తము కడ ప్రకార భేదమునకు సార్థక్యము రాదు. వమనదోషము - ప్రకాశకారుడు తెల్పిన దతని మెడకే చుట్టుకొనును. మరియు ప్రకృతములో తదాదులు తెల్పుబుద్ధి 'ఊహ' కాని స్మృతికాదు. అదిచట 'తన్మంజు మందహసితం' అనుచోట నీనాయకుని యూహ యను విశేషరూపమునకే విశ్రాంత మగును-అట్లుగాక స్మృతియే యన్నచో నష్టము కుదురిదు. 'స్మృతిలో నుండు మందహసిత మును స్మరింతును' అనుట అసంగతమును, పునరుక్తమునుగదా! 'ఊహలో దోచు నర్థమును స్మరింతును' అనుటయే సంగతము. ఇట తచ్ఛబ్దము ప్రక్రాంత పరామర్శకము గాదు. నిమిత్తోపస్మరణమున విశేషాకార సమర్పణమునకై యేర్పడినది. విప్రలంభమునకు నిమిత్త స్మరణమున నామెయందు మందహాసాదికమును సవిశేషముగా నూహించి ధ్యానించుచున్నాడు ఇచటి నాయకుడు. ఆ విశేషము లట నిపుడు లేనివే కదా! అవి ఇతని యూహా ప్రాప్తములు మాత్రమే. కనుక మందహాసాదులందలి విశేషములు స్మృతి రూపములు కావు. ఊహారూపములు మాత్రమే. ఇట్లిచట తచ్ఛబ్దము స్మృతిని

'దరా న మత్కాన్దం బన్ధ మీష న్నిమీలిత స్నిగ్ధవిలోచనాబ్జం
అనల్ప నిశ్శ్వాస భరాలసాంగం స్మరా విసంగం చిర మంగనాయాః.'

ఇచట స్మృతి భావము కాదు. ఏల? స్వశబ్దము (స్మరామి) దానిని చెప్పినది కనుక నది వ్యంగ్యము కాదు. (వ్యంగ్య మైననే కదా భావ మగును!)

---

శ్రీ శర్వాణి :

దెల్పదు. ఊహనే. కాగా ఇట బుద్ధి సామాన్యాకారము ఊహ యను విశేషమునందుఁ బర్యవసించును. వ్యంగ్యము స్మృతి. ఇది వెనుకటి సామాన్యాకారమున బరిచితముకాదు. ఇది సవిశేషముకదా! కనుక చమత్కారమును సమకూర్పఁగల్గును. తచ్ఛబ్దము నిమిత్తోపస్మరణమున విశేషాకార సమర్పణమున నున్నది. ఈవిషయము ధ్వనిలోచనమునందు నిరూపింపబడినది. "రూపం తదోజస్వి" ఇత్యా ద్యుదాహరణములం దున్నది.

ఈ భావమునే 'బుద్ధి స్థత్వం శక్యతావచ్ఛేదక మితి నయేఽపి స్మృతిత్వేన స్మృతే ర్వ్యక్తి వేద్యతైవ' అను వాక్యములో సామాన్యాకారమును బుద్ధిదముతోను, విశేషాకారమును స్మృతిపదముతోను (వేరువేరు పదముల నుపయోగించి) పండితుడు వ్యక్తపరిచెను. ఊహయు, స్మృతియు నొకటి కాదుకదా! 'అధ్యాహార స్తర్క ఊహః స్యా చ్ఛిన్తా స్మృతి రాధ్యానం' అని అమరుడు రెండును వేరనే తెల్పును. ఇట తచ్ఛబ్దము లూహయందే పర్యవసించు బుదిని దెల్పు ననుటలోఁ బ్రమాణ మేమి? 'అద్యాపి మే హృదయ మున్మదయ న్తి హ న్త' అను మూడవచరణమే 'అనాటి మందహసితాదులు ఈనాడు లేవు. అయినను నామనసు నున్మదింపఁ జేయుచున్నవి' అనుటలో లేని వస్తువుల సవిశేష మగు తలంపు ఇది అని స్పష్టము. అదియే ఊహ. కాగా ఇప్పటికిఁ దేలిన దిది.

'ఇట వ్యంగ్య మగు స్మృతి ఎట్లును వాచ్యము కాదు' కనుక నాగేశుని వ్రాత వ్యంగ్యతత్త్వమును, శబ్దతత్త్వమును, ప్రకృత శ్లోకపు వివరణ తాత్పర్యాదికమును నెరుగని వ్రాత' యని స్పష్టము. మరియు 'నిశ్శేషచ్యుత' శ్లోకములో 'అధమ' పదము కడ అధమత్వము 'అధమ' పదముతో సామాన్యముగా చెప్పబడిసను, అది వాచ్యదశలో నపరాధానరముల మూలమున నేర్పడు సామాన్యమైన యధమత్వమే కాని, వ్యంగ్యదశలో నేర్పడు

స్మరణాలంకారమును కాదు సాదృశ్యము వల్ల నేర్పడలేదు కదా యిది? (సాదృశ్యము మూలమున నేర్పడిననే స్మృతి యలంకార మగును. అట్లు కాక వ్యంజిత మగునది భావ మగునని సిద్ధాంతము

కాగా ఈ స్మరణము విభావమే. సుందరమును కనుక ఎట్లెట్లో రసము నందుఁ బర్యవసించును

స్త్రీలకుఁ బురుషుల మొగము చూచుట మొదలగువాని వల్లను పురుషులకు ప్రతిజ్ఞాభంగము, అవమానము కల్గుట మొదలగువాని వల్లను ఏర్పడు చిత్తవృత్తి విశేషము వ్రీడ. దీనివల్ల తెల్లవోవుట, మొగము క్రిందుకు వాల్చుట మొదలైనవి కల్గును. ఎట్లనగా__

'కుచకలశయుగాన్త ర్మామకీనం నఖాంకం
సపులక తను మన్దమన్ద మాలోకమానా
వినిహిత వదనం మాం వీక్ష్య బాలా గవాక్షే
చకిత నత న తాంగీ సద్మ సద్యో వివేశ.' *

---

శ్రీశర్వాణి :

'దూతీసంభోగ మూలక మగు నధమత్వము కాదు' కనుక నిది విశేషరూపము. దీని నే వాచ్య వృత్తియుఁ దెల్పలేదు. వ్యంగ్యమే. అట నాగేశుడే 'అధమ పదప్రవృత్తి నిమిత్తస్య సకలాధమ సాధారణస్య ఏకస్యాభావాత్ తత్తద్ధర్మా స్తత్ర తత్ర ప్రవృత్తి నిమిత్తతయా స్వీకార్యా ప్రకృతే తు దుఃఖత్వేన రూపేణాపరాధాన్తరనిమిత్తం దుఃఖం ప్రకరణాది వశా ద్ఘటకీభూయ భాసతే. వ్యంగ్య కక్షాయాన్తు దూతీసంభోగ నిమిత్త దుఃఖేన దూతీసంభోగ నిమిత్తకం దుఃఖ మితి భావః । తదభిప్రాయే ణోచ్యతే _ స్థితః పర్యవస్య తీతి చేతి॥ అని పండితుని యుప పాదనను వ్రాసినాడు. కనుక ఇట 'కేచిత్' కారుల మతముతో నొప్పుకొన్న దే. తాను వ్రాసుకొన్న దే.

* 'కుచ'__స్తనముల జంటలో నే నుంచిన గోరునొక్కులను గగురుపాటుతో మెలమెల్లగాఁ జూచుకొను నపుడు కిటికీలో నా మొగ ముంచుటను గమనించి యా బాల భయముభయముతో నొడలు ముడుచుకొని వెంటనే యింటిలోఁ జొరఁబడెను.

ఇట నాయిక ప్రియుని జూచుటయు, ఆమె తన కుచకలశములలోని ప్రియుని గోరునొక్కులఁ జూచుకొని పడు సంతసమును దెలియఁజేయు నామె పులకములను ప్రియుడు జూచుటయు (ఆమె సిగ్గుపడుటకు నిమిత్తములు కనుక) విభావము. ప్రియుని దర్శనము, వెంటనే ఇంటిలోఁ జొరబడుట అను భావము. ఇట్లును నుదాహరింతుము.

'నిరుద్ధ్య యాన్తీం తరసా కపోతీం
కూజత్కపోతస్య పురో దదానే
మయిస్మితార్ద్రం వదనారవిన్దం
సా మన్ద మన్దం నమయాం చకార.' †

వెనుకచోట భీతివలె ఇచటగూడ హర్షము కొద్దిగా నున్నను అది సిగ్గుకు అనుగుణమే. మగపావురము ముందు ఆడుపావురమును తన ప్రియు డుంచుట విభావము. మొగము వంచుట అనుభావము, భయము, నియోగము మొదలగు వానివల్ల నేర్పడిన చిత్తవృత్తి ప్రస్తుతత్త్వము నవధరింపలేనిచో మోహము.

అవస్థాంతరములతో శబలితమైన ఆచిత్తవృత్తి మోహ మని నవ్యలందురు.

ఉదా :— 'విరహేణ వికలహృదయా విలపన్తీ దయిత దయితేతి
ఆగత మపి తం సవిధే పరిచయ హీనేవ వీక్షతే బాలా.' *

ఇటఁ బ్రియుని యెడబాటు విభావము. ఇంద్రియములు వికలము లగుటయు. లజ్జాదులు లేకుండుటయు ననుభావములు. మరొక యుదాహరణము:—

'శుణ్డా దణ్డం కుణ్డలీకృత్య కూలే
కల్లోలిన్యాః కించి దాకుంచితాక్షః
నైవాకర్షత్యమ్బు నైవామ్బుజాలిం
కాన్తాఽపేతః కృత్య శూన్యా గజేన్ద్రః.' †

---

శ్రీ శర్వాణీ :

† 'నిరుద్ధ్య'—పోవుచున్న పావురము నాపి కూయుచున్న మగపావురము నెదుట నేనుంచగా నామె చిరునగవు వెలయ దన మొగమును మెలమెల్లగా వంచెను.

* 'విరహేణ'—ఎడబాటున మనసు చెడి 'దయిత దయిత' అని విలపించుచు అతడు దగ్గరకు వచ్చినను అతని నెరుగనిదివలె యీ బాల చూచుచున్నది.

† 'శుణ్డాదణ్డమ్'—ఏటియొడ్డున నేనుగ తన ప్రియురాలిని వీడి ఏపనియుఁ, దోచక తుండమును చుట్టుకొని కనుల ముడిచి నీటిని త్రాగదు. నీరజములఁ బెరుకదు.

ఇటఁగూడ కాంతావియోగము విభావము. నీర, నీరజముల అనాకర్షణము, కృత్యకృత్యాకృతియు అనుభావము. లోభము, శోకము, భయము మొదలగువాని వల్ల గల్గు నుపప్లవమును వారించుటకు మూలమైన చిత్తవృత్తి విశేషము ధృతి.

ఉదా :—సంతాపయామి కిమహం ధావం ధావం ధరాతలే కిమహం

అస్తి మమ శిరసి సతతం నన్దకుమారః ప్రభుః పరమః.' ౭

ఇట వివేకము, శాస్త్రజన్య జ్ఞానమును సమకూడుట మొదలగునది విభావము. చాపల్యాదు లడగిపోవుట అనుభావము అయితే తరువాతి సగములో 'దిగులు లేదు' అను వస్తువు వ్యంగ్య మగుచున్నది కదా! ఇట ధృతి (భావము) ధ్వని యెట్లగు నందురా! ఈ దిగులు లేకపోవుట యను వస్తువు ధృతి కుపయోగించునట్లుగానే వ్యంజిత మగుచున్నది కదా! (అనగా దిగులు లేకపోవుట ననుటవల్లనే కదా ధైర్యము స్ఫురించును).

నాకేమి యనిష్టము రానున్నదో యను తీరు చిత్తవృత్తి విశేషము శంక.

ఉదా :—'విధి విరచిత యాఽనుయాఽనయా తం
సఖి సంకేత నికేతనం ప్రియస్య
అధునా బత కిం విధాతు కామో
మయి కామో నృపతిః పునర్నజాతే.'

ఇట రాజు నెడ తప్పొనర్చుట విభావము. మొగము వెలవెలబోవుట మొదలగునవి ఆక్షేపగమ్యములు అనుభావములు. ఈ శంకవల్లనే భయాదులు కల్గి వడకుట మొదలగునవి యేర్పడును చింత యట్టిది కాదు. (అనగా దాని వల్ల భయాదు లేర్పడ వనుట). బలహీనత నుండి కల్గు దుఃఖవిశేషము గ్లాని. ఇది మానసిక మైన వ్యధ నుండియు, శారీరక మగు రోగమునుండియు గల్గును. ఈ గ్లానివల్ల చాయ దొరగును. అవయవములు పట్టుదప్పును. కనులు తిరుగును. ఇంకను మరికొన్ని విట్టివే కల్గును.

---

శ్రీ శర్వాణి :—

౭ 'సన్తాపయామి'— ఈ భూమండలము నంతటను పరువెత్తి యెత్తి నేనేల తపింతును? పరమప్రభు వగు నందకుమారుడు నాతల నెల్లప్పుడు నున్నాడు. (ఇట 'శిరసి' యనుట కన్న 'మనసి' యనుట తగును).

ఉదా :—'శయితా శైవలశయనే సుషమా శేషానవేన్దు లేఖేన
ప్రియ మాగత మపి సవిధే సత్కురుతే మధురవీక్షణై రేవ.' *

ఇటఁ బ్రియుని యెడబాటు విభావము 'కమ్మని చూపులతోనే' అను నేవకాలముచేఁ దెలియవచ్చునట్టి ప్రియు నెదుర్కొనుట, పాదములఁ బడుట, కౌగిలించుకొనుట మొదలగువాని నొనర్పక పోవుట అనుభావము.

ఇట శ్రమవల్ల నిట్లు జరిగిన దనుకొనరాదు శ్రమకు గారణ మే దిచట? కొంతమంది వ్యాధి మొదలగు వానివల్ల గల్గు బలనాశము గ్లాని యనెదరు. చిత్తవృత్తి రూపము లగు భావములలో నాశరూపమగు గ్లాని యెట్లు చేరును? ఈవిషయమును వా రాలోచింపలేదు. అయితే 'బలస్యాపచయో గ్లాని రాధివ్యాధి సముద్భవః' (మనోవ్యథగానీ రోగముగానీ కల్గించు బలహీనత గ్లాని) అను లక్షణవాక్యమునుండి అపచయశబ్దమున బలనాశ మే తోచును. అయినను వెనుక చెప్పిన యనుపపత్తివల్ల బలనాశజన్య మగు దుఃఖమే బలాపచయ శబ్దమున జెప్పఁదలచినది.

దుఃఖము, దారిద్ర్యము, అపరాధము మొదలగు వాని నుండి పుట్టిన చిత్తవృత్తి విశేషము దైన్యము. దీనివలన దనను తక్కువగా చేసికొని మాటాడుట మొదలగునవి సంభవించును

ఉదా :—'హతకేన మయా వనాన్తరే వనజాక్షీ సహసా వివాసితా
అధునా మమ కుత్ర సా సతీ పతితస్యేవ పరా సరస్వతీ', *

సీతను విడిచి భగవాను డగు శ్రీరామచంద్రుడు అనుకొను మాట. ఇట సీతను విడచుట యను నపరాధము లేక లందునుండి కల్గిన దుఃఖము గాని విభా

---

శ్రీశర్వాణి :

* 'శయితా'—శైవలపు (చల్లని నీటి పాచి) పక్కమీద కొత్తచందురు రేకవలెఁ బరుండి మంచి మెరుగు మాత్రమే మిగిలియున్న యామె తన ప్రియుడు వద్దకు వచ్చినను కమ్మని చూపులతోనే సత్కరించును.

* హతకుడను నేను హటాత్తుగా నడవిలో సీతను విడిచివైచితిని. ఇపుడు నాకామె యేడ సమకూడును? పతితునకు పరవిద్య దొరకునా?

వము పతితునితో౯ తనను పోల్చుకొనుట = అనగా తనను తక్కువ చేసికొని మాటాడుట అనుభావము. పెద్ద లేమన్నా రనగా:

'చిన్తౌత్సుక్య స్మరసన్తాపా దౌర్గత్యాచ్చ విభావతః
అనుభావాస్తు శిరసో హ్యపవృత్తే ర్గాత్ర గౌరవాత్
దేహోపస్కారణ త్యాగా దైన్యం మలినతాది కృత్. ఇతి
దౌర్గత్యాదే రనౌజస్యం దైన్యం మలినతాదికృత్ – ఇతి చ.

(వగులు, తహతహపాటు, మనసున దాపము, దుర్గతి, ఈ విభావముల నుండియు, తల దిరుగుట, శరీరము బరువెక్కుట, ఒడలి నలంకరించు కొనక పోవుట అను అనుభావములనుండియు దైన్య మను భావమును భావింపవలెను అని. దుర్గతి మొదలగు వానినుండి యేర్పడు కళాకాంతిరాహిత్యము దైన్యము. (అది మాలిన్యాదుల నొనరించును )

'ఇచట హతకుడను నేను సీతను వెడలనడచితిని'. 'అంతేకాని దైన్యము కాదు'– అను నీ యర్థమును బోధించునది. పతితుని తోడి పోలికయే కాని శూద్రాదులతోడి పోలికకాదు. ఏమంటే. శూద్రునకు శ్రుతి లభింపకుండుట పుట్టుకతోనే దైవ మొసంగెను. బ్రాహ్మణునకు దైవము సహజముగా శ్రుతిని సులభముగా నొసగినను పాతిత్యమును కల్గించు పనుల నొనర్చి తనంత దానే శ్రుతిని దూర మొనర్చుకొన్నాడు. కనుక పతితునితోడి పోలిక శ్రీరామచంద్రునకును, శ్రుతి తోడి పోలిక సీతాదేవికిని. ఇట్టియుపమాలంకారము దైన్యమునే అలంకరించును. అట్లే 'నేను' 'ఆమె' అను రెండుపదములును, ఉపాదానలక్షణమూలమున క్రమముగా కృతఘ్నతను, కృతజ్ఞతను, నిర్దయతను, సదయతను ఈ మొదలగు ధర్మములను వ్యంగ్య మొనర్చి పై యర్థమునే పోషించును. 'ఆమె' యనుచోట లేశముగా స్ఫురించు స్మృతియు పై యర్థమునే పోషించును.

ఇష్టము లభింపకపోవుట, అనిష్టము ప్రాప్తించుట మొదలైన వానివల్ల గల్గు చిత్తవృత్తివిశేషము చింత. దీనికే ధ్యాన మని మరొకపేరు. దీనివలన తెల్లబోవుట, నేల వ్రాయుట, మొగము వాంచుట మొదలగునవి యేర్పడును. ఏమన్నా రనగా–'విభావా యత్ర దారిద్ర్య మైశ్వర్యభ్రంశనం తథా
'ఇష్టార్థాపహృతిః శశ్వ చ్ఛ్వాసోచ్ఛ్వాసావధోముఖమ్

సన్తాపః స్మరణం చైవ కార్శ్యం దేహానుపస్కృతిః
అధృతి శ్చానుభావా స్స్యుః సా చిన్తా పరికీర్తితా
వితర్కాత్ స్యాః క్షణేపూర్వే పశ్చాత్త్యేవోపజాయతే
ధ్యానం చిన్తా హితానాప్తేః సన్తాపాదికరీ మతా'

(దారిద్ర్యము, అదివర కున్న యైశ్వర్యము తొలగిపోవుట. అట్లే ఇష్ట మగు నర్థ మపహరింపఁబడుట — ఇవి విభావములు. మాటిమాటికిని నిట్టూర్పులు, ఎగయూర్పులు, మొగము క్రిందికి వంచుకొనుట, తపించుట, మాటి మాటికి దలవంచుకొనుట, చిక్కిపోవుట, శరీరము నలంకరించుకొనకపోవుట, బిగలా పడుట— ఇవి యనుభావములు. ఇట్లున్నచోఁ జింత యగును. ఈ చింతకు వెనుకటి క్షణమునగాని, తరువాతి క్షణమునగాని వితర్కము దగ్గర గానే కల్గును' అని. తనకు హితమైనదాని నొందకుండుటవల్ల ధ్యానము చింత అది సంతాపాదులఁ గల్గించు నని తలంపఁబడినది అనియు.

ఉదా :—అధర ద్యుతి రస్త పల్లవా ముఖశోభా శశికాన్తి లంఘినీ
అకృక ప్రతిమా తనుః కృతా విధినా కస్యకృతే మృగీదృశః'. *

ఇట ఆనాయిక లభింపకపోవుట విభావము. ఆక్షేప్యము లగు అనుపాతాదులు అనుభావములు. ఇట ఔత్సుక్యము ధ్వనించుచున్న దనరాదా? అనరాదు. 'కస్యకృతే =ఎవనికొఱకు అనియే వ్యక్తిని నిర్ధారణ మొనర్పకుండుట వలన నది యాలంబనముగాఁ జింతయే ముందుగాఁ దోచును. కనుక నీవాక్యమున నౌత్సుక్య మున్నను నది ప్రధానముగా బోధింపఁబడదు.

కలుద్రావుట మొదలగువాని వల్ల గల్గు నుల్లాస మను చిత్తవృత్తి విశేషము మదము. పెద్దలు (సమ్మోహానన్ద సన్దోహో మదో మద్యోపయోగజః) 'కల్లు నుపయోగించుటవలన గల్గు సమ్మోహము, ఆనందము వీని మిశ్రస్థితి మదము' అన్నారు. ఈ మద ముత్తమపురుషునిలో నిద్రను (అనుభావమును)

---

శ్రీ శర్వాణి :

* "అధర"— పెదవి సొగసు చివురులతోసివేయునట్లును మొగము సొగసు జందమామ సొబగును దాటునట్లును దేహమా నిరుపమానమును నీ లేడి కనుల పిల్లకు బ్రహ్మ ఎవనికై నిర్మించెనో.

గల్గించును. అధమునందు – ఏడుపు మరుసుమాటలు (అనుభావములు)ను కల్గించును. ఈ మదము మూడు రకములు—తరుణ మని, మధ్యమ, అధమ మని. స్పష్టము గాకుండను సంగతి సంబంధములు లేకుండను మాటాడుట, నడకలో కొంచెపాటు—వీనితో నభినయింపఁ బడునది మొదటిరకపు మదము. బుజము నెగురవేయుటఁ, బొర్లుపడుట, మూర్ఛితము మొదలగువానితో నభినయింపఁ బడునది మధ్యమము. నడక ఆగిపోవుట, స్మృతి లేకపోవుట, ఎక్కిళ్ళు, డోకులు మొదలగువానితో నభినయింపఁ బడునది అధమము.

'మధురతరం స్మయమానః స్వస్మిన్నేవాలపన్ శనైః కిమపి
కోకనదయం స్త్రిలోకీ మాలమ్బన శూన్య మీక్షతే క్షీబః'. *

ఇట మత్తును గల్గించువానిని సేవించుట విభావము. అవ్యక్తముగా మాటాడుట మొదలగునది యనుభావము. ఇట మత్తుని స్వభావమును వర్ణించుటకు ప్రయోజనము. అతనియం దున్న మదమును వ్యక్తపరచుటయే కనుక మదభావమే ప్రధానము. కాగా స్వభావోక్త్యలంకార మిటఁ బ్రధానము కాదు. కాని, మదధ్వని కుపస్కారకమే యగును. ఇది యైన నుదాహరణము—

'మధురసా న్మధురం హిత వాధరం తరుణిమద్వదనే వినివేశయ
మమ గృహాణ కరేణ కరామ్బుజం పపపతామి హహా భభభూతలే.' †

ఇటఁ గూడ నదియే – మాదకద్రవ్యోపయోగమే విభావము. అక్షరములనెక్కువగా నుచ్చరించుట – 'పపపతామి భభభూ' అనునది అనుభావము పూర్వార్ధమున వెకలి మాటలు, ఉత్తరార్ధములో పడుచుచేయిని కమలముతోఁ బోల్ప వలసి యుండగా నట్లు పోల్పక తన కరము నట్లు పోల్చుటయు మదమునే పోషించును.

---

శ్రీశర్వాణి :

* 'మధురతరం' – తియ్యగా నవ్వుచు తనలో దానే యేదో మాటాడుకొనుచు మూడులోకములను (తన యెఱ్ఱని కనులకాంతితో) ఎఱ్ఱకలువలఁ బూయించుచు విషయశూన్యపు చూపులఁ జూచుచున్నాడు మత్తుడు.

† 'మధురసాత్'– తేనెరుచికన్నను నీపెదవి తియ్యనగ దానిని నానోట నుంచుము. నీచేతితో కమలము వంటి నాచేతిని బట్టుకొనుము. ఓపడుచా! నేల మీమీద పపపడు చుంటిని.

శరీర మెక్కువగాఁ బని చేయుట వలన గల్గు నొకవింతయలసట శ్రమ, దీనివలన నిట్టూర్పులు, ఒడలు విసికించుకొనుట, నిద్ర మొదలగునవి కల్గును. ఏమన్నా రనగా -

'అధ్వ వ్యాయామ సేవాద్యైః విభావై రనుభావకైః
గాత్ర సంవాహనే రాస్య సంకోచై రంగమోటనైః
నిశ్శ్వాసై ర్జృంభితై ర్మన్దైః పాదోత్క్షేపై శ్శ్రమోమతః.'

'తోవనడుచుట, వ్యాయామ మొనర్చుట మొదలగు విభావములతోను, ఒడలు పిసికించుకొనుట, మొగము ముడుచుకొనుట శరీరమును మరించుకొనుట, నిటూర్పులు, ఆవులింతలు మెల్లమెల్లగా కాళ్ళ నెత్తివేయుటలతోను శ్రమము (అభినయింప) అగును-' అని.

'శ్రమః ఖేదో ఒధ్వరత్యాదేః నిద్రాశ్వాసాదికృన్మతః' తోవనడచుట రతి యొనర్చుట మొదలగువాని వలని యలసట శ్రమ. నిద్రను, నిట్టూర్పు మొదలగు వానిని గల్గించును.'-అనియు. ఇది బల మున్నప్పటికిని గూడ కల్గును. కాయకష్టము వల్లనే కల్గును. గ్లాని అట్లు కాదు. అది బలహీనతలోఁ గల్గును. వ్యాపారాంతరముల నుండియు గల్గును. కనుక గ్లాని నుండి శ్రమకు తేడా యున్నది.

ఉదా:- 'విధాయ సామద్వదనానుకూలం కపోలమూలం హృదయే శయానా
చిరాయ చిత్రే లిఖితేవ తన్వీ న స్పన్దితుం మన్ద మపి క్షమాఽఽసీత్.'*

ఇచట పురుషాయితమను సురతము శరీరవ్యాపారము విభావము. కదలక మెదలక పరుండుట మొదలగునవి అనుభావములు. ఇట నిద్ర యనుభావమును స్ఫురింపఁ జేయుటవలన పని తీరిపోలేదా యనరాదు. ఇట నిద్రమాత్రమే యగుచో నిద్రలో తెలివి లేనందువల్లనే ప్రయత్నము లేదని యేర్పడును. అపుడు 'కదలుటకుఁ గూడ శక్తి లేదయ్యెను' అనుట ఎక్కువ ప్రయోజనమును

---

శ్రీ శర్వాణి :

* 'విధాయ' - తన చెక్కిలి మొదలును నామె మొగమునకుఁ జేరువగా నొనర్చి నావొమ్మునఁ జాలసేపు పరుండి చిత్తరువున వ్రాసినది వలె నాతన్వి కదిలుటకుఁగూడ నోపిక లేని దయ్యెను.

సమకూర్పఁ జాలకపోవలసి వచ్చును. అదికాక 'శీఙ్' ధాతువు (శయనా) నిద్రను చెప్పినది. అది వ్యంగ్య మను టెట్లు కుదురును – శ్రమయం దది తగినంత యనుకూల మగును.

రూపము, ధనము, విద్య మొదలగువానివల్లఁ దాను గొప్పవాడ నను భావ మేర్పడి ఇతరుల నవమానించుట గర్వము.

ఉదా:– 'ఆమూలా ద్రత్నసానో ర్మలయవలయితా దాచకూలా త్పయోధేః
యావ న్త స్సన్తి కావ్య ప్రణయన పటవ స్తే విశంకం వద న్తు
మృద్వీకామధ్య నిర్య న్మసృణ రసఝరీ మాధురీ భాగ్యభాజాం
వాచా మాచార్యతాయాః పద మనుభవితుం కో స్తి ధన్యో మదన్యః.' †

ఇటఁ దనకవితవంటి కవిత ఇతరుల కెవ్వరికిని లేదను తలపు విభావము. ఇతరుల నధిక్షేపించు తాత్పర్యముతో నిట్టి మాట లనుట అను భావము. ఈ భావమును – గర్వమును, అసూయనుఁ గొలదిగా పోషించుచు ఉత్సాహము ప్రధానముగాను గర్వము గూఢముగాను నుండి కదా వీరరసము ధ్వనించును. అయితే ఇట గర్వము ప్రధానము అగుట దానికన్న విశేషము. అలాగే కదా– వీరరసపుఁ బ్రసంగములో నిదివరలో నుదాహరించిన 'యదివక్తి' ఇత్యాది పద్యములో బృహస్పతితోను, సరస్వతితోను గూడ వాదింతును, అను మాటలతో సువ్యక్తమగు నుత్సాహమునకుఁ బోషకముగా నున్న దేది? 'నే నందరు పండితులకన్న నధికుడ'నను గర్వము. అంతేకాని ప్రకృత పద్యమునందు వలె' ఈ భూమిలో నాకన్న వేరెవ్వడును లేడు' అని స్పష్టముగా సోల్లుంఠనముగాఁ జెప్పుట యను అనుభావము వలన ప్రధానముగా గర్వము స్ఫురించునట్లుగా నట– 'అపివక్తి' యను దాని యందు స్ఫురింపదు. (అనగా నట 'అపివక్తి' యను

---

శ్రీ శర్వాణి :

† 'ఆమూలాత్'– మేరువు మొదలునుండి మలయము చుట్టిన సముద్రపు కూలము నుండియు కావ్యము రచింపఁ గలవారందరును నిశ్శంకముగాఁ జెప్పుదురు గాక ! ద్రాక్షపండ్ల నడుమనుండి వెడలుచున్న తియ్యని రస ప్రవాహపు కమ్మదనపు భాగ్యము నొందిన పలుకుల కులగౌరవము పదవి ననుభవించుటకు నాకన్న వేరుగా నెవడు ధన్యు డున్నాడు ?

పద్యమున నుత్సాహమున కంగముగా గర్వము స్ఫురించును. ఇట 'ఆమూల
అనుచోట గర్వము ప్రధానముగా స్ఫురించును- అని తాత్పర్యము) మ:
మొగుడ్పు నిద్ర. ఇది అలయిక మొదలగు నిమిత్తములవలన (విభావ:
వలన) గల్గును. కనులు మూసికొనుటయు శరీరమున గదలిక లేకుండుట
మొదలగునవి అనుభావములు.

ఉదా.- 'సామదా గమన బృంహిత తోషా జాగరేణ గయతాఖిల దోషా
బోధితాఽ పి బుబుధే మధుపై ర్న ప్రాతి రానవజ సౌరభలుబ్ధైః;*

రాత్రి మేల్కొని యుండుట వలని అలయిక విభావము. తుమ్మె:
ముసురు కొన్నను మేల్కొనకుండుట అనుభావము. అర్థ నిర్ధారణము మతి.
శాస్త్రాదుల విచారముపలననే యేర్పడును. ఇట సంకోచము లేకుండ నా౦
ముల ననుష్ఠించుటయు, సంశయము తొలగుటయు నిత్యాదు లనుభావములు.

ఉదా:- 'నిఖిలం జగదేవ నశ్వరం పునరస్మి న్నితరాం కలేవరం
అథ తస్య కృతే కియానయం క్రియతే హన్త మయా పరిశ్రమః; +

'శరీర మేతజ్జల బుద్బుదోపమం'- 'ఈ దేహము నీటి బుడగవం:
అను నిటువంటి శాస్త్రముల విచారించుట ఇట విభావము· హన్త- అయ్యో య
పదమునందుఁ దోచు తనను గూర్చిన నిందయు, రాజసేవాదుల మ
కొనుటయు, అసలే లేకుండుటయు అనుభావములు ఝట్టున చమత్కరించ
గనుక మతియే ధ్వని యనుట కారణము. ఆలస్యముగా స్ఫురించును గ:
శాంతము ధ్వనికాదు.

రోగము, ఎడబాటు మొదలగు వానినుండి కల్గు మనస్తాపము, వ్యా
శరీరము బిగువు తప్పుట, నిట్టూర్పుట మొదలగునవి అనుభావములు, ఏమ:
రంటే-

---

శ్రీ శర్వాణి :

* 'సామదా'- నారాకవలని యానందమొంది రాత్రి యంతయు మేల్క
ప్రొద్దుట మొగము పరిమలము నాసతో వచ్చిన తుమ్మెదలు లేపినను ఆ
లేవలేదు.

\+ 'నిఖిలం'-జగమంతయు నశించునదే అందింకను ఈ దేహమింక
నెక్కువ. ఇక దానికై నేనయ్యో యెంత పరిశ్రమ చేయుచున్నాను!

ఏకైకశో ద్వంద్వశో వా త్రయాణాం వా ప్రకోపతః
వాతపిత్తకఫానాంస్యుః వ్యాధయో యే జ్వరాదయః
ఇహ తత్ప్రభవో భావో వ్యాధి త్యభిధీయతే"

వాతము, పైత్యము, శ్లేష్మము—ఇవి మూడును ఒక్కొక్కటిగాని, రెండు కలసిగాని, మూడు కలసిగాని ప్రకోపించుటవలన జ్వరాదులు కల్గును. వానివలన గల్గు భావము ఇట వ్యాధి యనఁబడును— అని.

ఉదా: — 'హృదయే కృత శైవలానుషంగా ముహురంగాని యతస్తతః క్షిపన్తీ
తదుదన్తపరే ముఖే సఖీనాం అతిదీనా ప్రియ మాదధాతి దృష్టిం! *

ఇట ప్రియుని విరహము విభావము. ఆచేతులు కాళ్లు నటు నిటు కొట్టుకొనుట మొదలగునవి అనుభావము.

క్రూరములగు జంతువులను జూచుట, పిడుగు చప్పుడు వినుట మొదలగు వాని వలన పిరికివానికి గల్గు చిత్తవృత్తి విశేషము త్రాసము. గగుర్పొడుచుట, వడకుట, కొయ్యబారిపోవుట, బొమ్మలు వోవుట మొదలగునవి అనుభావములు. 'ఔత్పత్తికైర్మనసః క్షేపః త్రాసః కమ్పాది కారకః' = ఉత్పాతములను సూచించు వాని చేత మనసు చెదరుట త్రాసము వడకు మొదలగు వానిని కల్గించును— అన్నారు.

ఉదా :—'ఆలీషు కేలీ రభసేన బాలా ముహుర్మమాలాప ముపాలపన్తీ
ఆరాదు పాకర్ణ్య గిరం మదీయాం సౌదామినీయాం సుషమామయాసీత్! +

ఇట మగడు తన మాటలను వినె నని పిల్ల పరుగెత్తినది, 'వినుట' విభావము. పరుగెత్తుట అనుభావము. ఇట సిగ్గు దోచు ననరాదు. చిన్నతనము కనుక సిగ్గు కల్గదు. అథవా కేవల త్రాసమున కిదియైన నుదాహరణము—

---

శ్రీ శర్వాణి :

* 'హృదయే'— రొమ్ముమీద పాచిని విడువ కుండ నుంచుకొని చేతులు కాళ్లు ఇటునటు వేసుకొనుచూ ప్రియుని కబుర్లను చెప్పుకొను చెలుల మొగము నతిదీనముగాఁ జూచుచున్నది,

+ 'ఆలీషు— ఆటల యుత్సాహముతో నా బాల మాటి మాటికి నా ప్రసంగమునే ప్రసంగించుచు దగ్గరలో నామాట చెవిబడినంతనే మెరపు మెరసినట్లయ్యెను.

'మా కురుకశాం కరాబ్జే కరుణావతి కుప్యతే మమస్వాన్తం
ఖేల న్న జాతుగోపై రమ్య విలమ్బం కరిష్యామి: *

ఇది గొల్లపిల్లడుగా లీలయొనర్చు భగవానుడు శ్రీకృష్ణునిసూక్తి నిద్రయను విభావము వలన గల్గు తెలివి సుప్తము. అనగా స్వప్న మని పర్యవసానము. నిరర్థకపు మాట లాడుట మొదలగునవి అనుభావములు. కనులు మూసికొనుట మొదలగునవి మాత్రము నిద్రకే అనుభావములు దీనికి గాదు. అవి దీనివ వలన గల్గవు కదా!

అయితే ప్రాచీనులు "అస్యా మనుభావా — నిభృతగాత్ర, నేత్రనిమీలన (వళ్లు కదలకుండుట కనులు మూయుట) ఇత్యాదులు దీని కనుభావము లనుటకు గారణ మేమనగా — "అని మరొక విధమున సిద్ధించినను ఈభావములో వ్యాపించును గనుక" అని తెలియవలెను. (అనగా నిద్రవల్ల నేర్పడిన యావదలు కల వచ్చినప్పుడు కూడ నుండును కదా!)

ఉదా :— అకరుణ మసా భాషాసిన్నో విముఞ్చ మమాఞ్చలం
తవ పరిచిత స్నేహః సమ్యఙ్మయే త్యను భాషిణీం
అవిరల గల ద్బాష్పాం తన్వీం నిరస్త విభూషణాం
క ఇహ భవతీం భద్రే నిద్రే వినా వినివేదయేత్. +

దూరదేశమున కేగిన యొకడు కలలో తన ప్రియురా లిట్లు మాట్లాడుచు గన్పడగా జూచి నిద్రను గూర్చి యిట్లనుచున్నాడు. అయితే ఇచట ఈతీరుగానైన ప్రియతమురాలి యవస్థను తెల్పి నిద్ర తన కుపకార మొనర్చె నని వస్తువును. విప్రలంభ శృంగారమును గూడ ఈ శ్లోకమే స్ఫురించును కాని ముఖ్యముగా

---

శ్రీ శర్వాణి :

* 'మాకురు'— జాలిగల దానవు కమలమువంటి నీ చేతితో కశను పట్టుకొనవద్దు. నా గుండె వడకు చున్నది గోపాలతో నాడుచు నోయమ్మా ఇక నెప్పుడును ఆలసింపను.

+ 'అకరుణ'— 'ఓ జాలిలేనివాడా! అబద్ధముల సముద్రమా! నా చెంగు వదలుము. నీ స్నేహము నాకు బాగా తెలిసినది'— అనుచు విడువకుండ కన్నీరు గార్చుచు నగల నేమియు నొంటి మీద బెట్టుకున్న నా ప్రియురాలను ఓ మంచిదానా, నిద్రా! నీవు దప్ప మరెవరు నాకు జూపగలరు ?

స్వప్నమే స్ఫురించును కనుక స్వప్నధ్వనియే యుదాహరింపఁబడినది. ప్రాంతములం దివి రెండును = వస్తువు, విప్రలంభ శృంగారమును స్ఫురించుట నీ ధ్వని యెడ లేదు. నిదుర తొలఁగిన తరువాత కల్గు మేలుకొనుటయే విబోధము. నిదుర పూర్తి యగుట కానీ, కల ముగియుట కానీ, పెద్ద చప్పుడు గానీ, గట్టి స్పర్శ గానీ ఈ రకమైన మరి యేవిగానీ నిదుర తొలఁగించును. కనుక అవియే యిట విభావములు. కనులు నులుముకొనుట, శరీరమును రాచుకొనుట మొదలగునవి అనుభావములు. ఇట సంగ్రహించి యుదాహరింతుము:_

'నితరాం హితయాద్య నిద్రయా మే బతయామే చరమే నివేదితాయాః
సదృశో వచనం శృణోమి యావన్మయి తావత్ప్రచుకోప వారివాహః'.*

ఇట మబ్బురుముట విభావము. ప్రియురాలిమాటల వినుటయందలి యుల్లాసము పొడగుట అనుభావముగా నూహింప నగును. కొంతమంది అవిద్య నశించి (విబోధము) కల్గినను ఇదియే సందురు. వారి మతములో

'నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయానఘ
స్థితోస్మి గత సన్దేహః కరిష్యే వచనం తవ'_ †

అను గీతాశ్లోకము ఉదాహరింపఁ దగును. సరి! పై శ్లోకములో మబ్బును గూర్చిన యసూయయే వాక్యార్థ మనరాదు. విబోధము స్ఫురించుచుండగా ఆవిబోధము అనుచిత మని తెలిసినపుడు ఇట్లనుచితముగా మేలుకొలిపె నని మబ్బును గూర్చి అసూయ చాల ఆలస్యముగా స్ఫురించును. ఇట్లాస్ఫురణము ఇతరుల మొగములవంక నిరీక్షించుచుండునదే కదా! కనుక నది వాక్యార్థము = ప్రధానము కాజాలదు. వారివాహమునందు జాలి లేకపోవుట మొదలగు వానిని జెప్పున దేమైన నున్నచో నసూయకుఁ బ్రాధాన్యము సంభవించెడిదే. ఇట్లే స్వప్నమును వాక్యార్థము కాదు. ఉరుముటతో స్వప్నము నశించిన దనే తెలియును గదా!

---

శ్రీ శర్వాణి :

*'నితరాం' _ ఇపుడు తెల్లవారుజామున బాగుగా పట్టిన నిద్రలోఁ గన్పడిన నా ప్రియురాలిమాటను వినునంతలో మేఘము నామీఁద కోపగించుకొనెను.

† 'నష్టో మోహః'_నీయనుగ్రహమున నా కో యనఘా! అజ్ఞానము నశించినది. జ్ఞప్తివచ్చినది. నీసంశయము తొలగి నిలిచితిని. నీమాట నొనరింతును.

అథవా స్వప్నభావము యొక్క ప్రశమముతోను వారివాహమును గూర్చిన యసూయతోను గూడ నీవిబోధమునకు సంకరము నంగీకరింతము.

ఇదిమాత్ర ముదాహరింపఁ దగదు.

'గాఢ మాలింగ్య సకలాం యామినీ మిహ స్సుప్తిం
నిద్రాం విహాయ సప్రాత రాలిలింగ సచేతనాం '

(రాత్రి యంతయుఁ దనను గాటముగా నిట గవుంగలించుకొని యున్న నిద్రను వీడి తెల్లవారిన తోనే యతడు చేతన నాలింగించుకొనెను).

ఇటఁ జేతనాపదము విబోధమును దెల్పును. ఇక నది వ్యంగ్య మెట్ల గును ? ఇక నాయకుడు సత్యముగా నొప్పంద మొనరించినవాడు. ఇద్దరు నాయిక లను రెండు సమయముల ననుభవింప నేర్పా టొనరించి యొకదానికి తగు సమయ మున నొక నాయిక ననుభవించి, మరొక సమయము ప్రారంభ మగునపుడు వెనుకటి నాయికను విడచి రెండవనాయిక నె ట్లనుభవించునో, అట్లే ఇతడును రాత్రిసమయమందు నిద్రను ప్రాతఃకాలమున చేతనను అనుభవించును అని సమాసోక్తియే ప్రకాశిత మగును.

ఇతరు లొనర్చిన అవమానము మొదలగు నానారకము లగు నపరాధ ముల గల్గిన చిత్తవృత్తి అమర్షము. దీనివల్ల మౌనము పరుషములగు మాటలు మొదలగునవి కల్గును. ఇచటఁగూడ వెనుకటి చోటులందువలెఁ గ్రమముగా కారణములు విభావములు, కార్యములు అనుభావములు అని తెలియునది.

ఉదా:—'వక్షోజాగ్రం పాణినా మృశ్యదూరం,యా తస్యద్రాగానవాట్టం ప్రియస్య
శోణాగ్రాభ్యాం భామినీలోచనాభ్యాం, జోషంజోషం జోషమేవావతస్థే' •

ఇచట నాకస్మికముగాఁ జూచుకమును దాకుట విభావము. కను లెఱ్ఱ వారుట, తెప్ప లార్పక చూచుటయు అనుభావములు.

సరి కాని, స్థాయిభావ మగు క్రోధమునకును సంచారి యగు నమర్షమున కును భేదమేమి ? (స్థాయిగా) గోచరించుటయు, సంచారిగా గోచరించుటయు

---

శ్రీ శర్వాణి :

• 'వక్షోజాగ్రం' – ప్రియుడు స్తనాగ్రమును–చూచుకమును స్పృశించి, దూరముగా పోగా భామిని రెప్పవేయక చూచి చూచి యూరకయే యుండెను.

నేభేద మని తెలియనగును. వీని వైలక్షణ్యమును గమనింపు మెట్లనగా-పరుని వినాశనమునకై వెంటనే ప్రవృత్తి కల్గుట మొదలగునవి స్థాయికి గమకము. మాటాడకుండుట, పెడ మొగము పెట్టుట మొదలగు పనులు సంచారికి గమకములు. (అనగా దీనితత్త్వ మిది ఉత్కటమగు తీరున నున్నచోఁ గ్రోధము. మృదు వగు తీరున నున్నచో అమర్షము).

సిగ్గు మొదలగు నిమిత్తములచే సంతసము మొదలగు ననుభావముల గోపన మొనర్చుకొనుటకై కలిగిన భావవిశేషము అవహిత్థము అని చెప్పఁబడినది.

'అనుభావపిధా నార్థోఽ వహిత్థం భావ ఉచ్యతే
తద్విభావ్యం భయవ్రీడా ధార్ష్ట్య కౌటిల్య గౌరవైః'

అనుభావములు గన్పడ కుండుట కైన భావ మవహిత్థ. అది భయము, సిగ్గుఁ గడుసరితనము, కుటిలత్వము గౌరవము లను విభావముల - నిమిత్తముల (నేర్పడును) భావింపవలెను. ఎట్లనగా—

'ప్రసంగే గోపానాం గురుషు మహిమానం యదుపతేః
ఉపాకర్ణ్య స్విద్య త్పులకితకపోలా కులవధూః
విషజ్వాలాజాలం ఝగితి వమతః పన్నగపతేః
ఫణాయాం సాశ్చర్యం కథయ తితరాం తాండవవిధిమ్' •

ఇట సిగ్గు విభావము. కాళియుని కథాప్రసంగము అనుభావము. ఇదే తీరున భయాదులఁ గల్గు నవహిత్థమును నుదాహరింప నగును. అధిక్షేపించుట అవమానించుట మొదలగువాని వల్ల గల్గి ఇందు కేమి చేతును? అనుతీరున నుండిన చిత్తవృత్తి ఉగ్రత. ఏమన్నా రనగా—

"నృపాపరాధోఽసద్దోష కీర్తనం చోరధారణం
విభావాస్య రధో బన్ధో వధ స్తాడన భర్త్సనే
ఏతే యత్రానుభావా స్త ద్రౌద్రం నిర్దయతాత్మకం"

---

శ్రీ శర్వాణి :

• 'ప్రసంగే'- గోపికలు మాటలాడుటలో శ్రీకృష్ణస్వామియొక్క మహిమను విని చెక్కిళ్ళు చెమర్చుచుండగా కులమింటి కోడలు పెద్దలంద రుండు నపుడు విషపు మంటలఁగక్కు కాళియుని పడగల మీద శ్రీకృష్ణుని తాండవ ప్రకారము నాశ్చర్యముతో తెల్పుచున్నది.

(రాజాపరాధము లేని తప్పు నారోపించుట, దొంగలను దాచుటయు విభావములు. కట్టివేయుటయు, వధించుటయు, కొట్టుటయు అపకారపు మాట లాడుటయు నిట్టివి అనుభావములు. ఇట్టిది జాలి లేకయే స్వరూపముగా నుండు రౌద్రము అని).

ఉదా .—'అవాప్యం భంగం ఖలు సంగరాంగణే నితాన్త మంగాధిపతే రమంగళం
పరప్రభావం మమ గాండివం ధను ర్వినిన్దత స్తే హృదయం న కిమ్పతే'. *

కర్ణుని కోడి గాండివమును నిందించు ధర్మజునితో నర్జును డనుమాట యిది. ఇట ధర్మజు డొనర్చిన గాండివపు నింద విభావము చంపు దలంపు అనుభావము. అయితే అమర్షమునకును ఉగ్రతకును భేద మగుపడదే మనరాదు. వెనుక నిరూపించినది అమర్షపు ధ్వని. ఉగ్రత తోచదు కదా. పోనీ యిది క్రోధమును కాదు అది రౌద్ర మను స్థాయిభావము ఇది సంచారిభావము ఇదియే భేదము అగుటవల్లనే భేద మేర్పడినది.

ఒకదానిని మరొకదానినిగా గ్రహించుట ఉన్మాదము. ఇది ఎడబాటు, గొప్ప ఆపద, అధికమగు నానందము మొదలగువాని వలన గల్గును. దీనికి హేతువులు పేర్కొనుట యెందుకనగా శుక్తియందలి వెండివలన నేర్పడు రజత మను భ్రాంతియం దతివ్యాప్తి నివారించుటకు.

ఉదా :—"అకరుణ హృదయ ప్రియతమ ముంచామి త్వామితః పరం నాహం
ఇ త్యాలపతి కరామ్బుజ మాదాయాలీజనస్య వికలా సా". •

ఒకడు ప్రవాసమున నుండెను. అట కతని ప్రియురాలి సందేశమును గొని యొకతె రాగా తన ప్రియురాలి సందేశ మేమని నాయకు డడిగెను. అపు

శ్రీశర్వాణి :

* 'అవాప్యం'— యుద్ధభూమిలో అంగరాజునుండి అవమానపడి గొప్ప ప్రభావము గల నా గాండివమును నిందించు చుంటివే నీవు నీ మనసున కేమియు జంకు కలుగుట లేదా ?

• "అకరుణ"— జాలిగుండె లేనివాడా ! నాప్రియుడా! నిన్నిటుపైని విడిచిపెట్టను అని చెలికత్తె చేయి పట్టుకొని వికలురాలగు నామె యెప్పుడును అనుచుండును.

డామె యిట్లన్నది. ఇట ప్రియు నెడబాటు విభావము. అసందర్భముగా మాటాడుట అనుభావము. నిజమున కీయున్మాదము వ్యాధిలోనే చేరును. అయినను దీనిని వేరుగా గణించు టేల ననగా కడమ వ్యాధులందు కన్న దీనియం దధికముగా విశిష్టమగు వైచిత్ర్యమును స్ఫురింపఁ జేయనగు నని.

రోగాదులనుండి కల్గు మూర్ఛారూప మైన మరణప్రాగవస్థయే మరణము. ఇట ప్రాణము పోవుట యగు ముఖ్యమైన మరణము గ్రహింపఁ దగదు. చిత్తవృత్తిరూపములగు భావములందు దానికి ప్రసక్తి కల్గదు కదా! భావములందంతటను కార్యముల (అనుభావముల)తో గూడ శరీరప్రాణసంయోగ ముండి పోవలసినదే కదా! (కార్యములు = అనుభావములు శరీరమున ప్రాణ మున్నప్పుడే కదా భావములందు కల్గును).

ఉదా:—దయితస్యగుణా ననుస్మరన్తీ శయనే సమ్ప్రతియా విలోకితాఽఽసీత్
అధునా ఖలు హన్త సా కృశాంగీ గిరమంగీ కురుతే నభాషితాఽపి". *

ఇటఁ బ్రియునితోడి యెడబాటు విభావము. మాట లాగిపోవుట అనుభావము. ఈభావ మిట వాక్యవ్యంగ్య మైనను "హన్త" పదము ఇట నెక్కుడుగా నుపయోగించును కనుక పదవ్యంగ్య మగుచున్నది. ఇందువలన భావము పదమున వ్యంగ్య మగునప్పుడు ఎక్కువ వైచిత్ర్యము లేదను వాదము నిరస్త మగును. "దయితుని గుణముల స్మరించు చున్నది" అనుటవల్ల వ్యక్తమగు వస్తువు = చరమ దశ, అందు గూడ ఆమె దయితుని గుణములను మరువలే దనునది. చివరకు వ్యంగ్యమగు విప్రలంభమును గానీ, శోకమును గానీ పోషించును. ఈ భావమును వ్యక్తపరచు వాక్యము తరువాత సందర్భములో మరొక వాక్యమును గూర్చి నాయికాదులు తిరిగి జీవించినట్లుగా వర్ణించినయెడల ఈ భావము = మరణము, విప్రలంభ శృంగారమును పోషించును. అట్లు కానిచో కరుణరసమును బోషించును అను విశేషము నెరుగవలెను. కవులు మాత్రము ఈ మరణభావమును ప్రధానముగా వర్ణింపరు. ఇది అమంగళప్రాయము కదా:

---

శ్రీశర్వాణి;

* "దయితస్య"— ప్రియుని గుణముల వెంటవెంట స్మరించుచు నిప్పుడీమె పక్కమీదఁ జూచితిమో ఆమె అయ్యో ఇపుడే పల్కరించినను బక్కచిక్కిపోయి మాటకూడ నాడుటలేదు.

సందేహాదుల వెంట గల్గు నూహా వితర్కము. అది నిశ్చయమున కను కూలించును.

ఉదా :—"యది సా మిథిలేన్ద్రనన్దినీ నితరామేవ న విద్యతే భువి
అథమేకిం ధమన్త్రి జీవితం నవినాలమ్బన మాశ్రితిస్థితిః". •

భగవాను డగు శ్రీరామచంద్రుడు తనలో దా ననుకొనుమాట. "ఈ లోకములో నున్నదా సీత? లేదా" అను సందేహ మిట విభావము కనుబొమల నెగురవేయుట, తలపై వ్రేళ్ల నాడించుటయు-నాక్షిప్తమైనది అనుభావము, ఇది చింత యనుటకు వీలుకాదు అది నిశ్చయమును దప్పక కల్గించు ననుటకు వీలేది? ఏమి కానున్నదో? ఎట్లు కానున్నదో? అనుతీరున నుండునది చింత, "ప్రాయశః ఇది యిట్లు కావచ్చును. అను నీ తీరున వితర్క ముండును. ఇట్లీ రెంటికిని = చింతకును, వితర్కమునకును విషయములు విలక్షణములుగానే అనుభవ మగు చున్నవి కదా! ఆలంబమును వీడి యాశ్రితము నిలువ జాలదు" అను (నిశ్చయాత్మక మగు) అర్థాంతరన్యాసము. "ఇదికూడ చింత కాదు. వితర్కమే" అను వాక్యమునందే అనుకూల మున్నది.

ఇష్టము సిద్ధింపకపోవుట, రాజాపరాధము, గురుద్రోహము మొదలగువాని వల్ల గల్గు ననుతాపము విషాదము.

ఉదా :—"భాస్కర సూనావ స్తం యాతే జాతే చ పాండవోత్కర్షే
దుర్యోధనస్య జీవిత! కిథ మివనా ద్యాపి నిర్యాసి?" *

తన తక్కువదనము, పరుల గొప్పదనమును కనుగొనుట విభావము, జీవితము వెడలిపోవలె ననుకొనుటయు, దాన నాక్షిప్త మగు మొగము వాంచుట

---

శ్రీశర్వాణి :

• "యది సా"—ఆ మిథిలరాజు జనకుని, కుమార్తె అసలు ఈ భూమిలో లేకయే పోయెనేని ఇక నాకు బ్రతు కేది? ఆధారము లేనిదే ఆధేయము నిలువ జాలదు కదా!

* "భాస్కర"- సూర్యుని కొడుకు- కర్ణుడు అస్తమించినను పాండవులకు గొప్పదనము సమకూడినను ఇప్పటికి నిజ దుర్యోధనుని ప్రాణమా! నీ వింకను వెడలి పోవేమి?.

మొదలగు సదియు సను భావము, దుర్యోధన వచనములోని అర్థాంతర సంక్రమిత వాచ్య ధ్వని ననుగ్రహించును ఇట "త్రాసము" అను భావము వ్యక్తమగు ననరాదు. మహావీరుడైన దుర్యోధనునందు లేశముగా నైనను త్రాస ముండునా? చింతయు నిటు ధ్వనించును "యుద్ధ మొనర్చి మరణింతును" అని అతనికి దృఢమైన నిశ్చయము కదా! పోనీ దైన్యము ధ్వనించు ననియు ననరాదు. దైన్య మంతయు నశించినను ఒకడదియాపదగానే లెక్కింపలేదుకదా; వీర రస ధ్వనియు గాదు. మరణమునే శరణ మొనర్చు కొన్నపుడు ఇతరుల తిక్కువ దనమునే ప్రాణముగా గ్రహించు నుత్సాహము సంభవింపదు గదా!

ఇది మాత్ర ముదాహరింపఁ దగదు—

"అయి పవన రయాణాం నిర్దయానాం హయానాం
శ్లథ యగతి మహం నో సంగరం ద్రష్టు మీహే
శ్రుతి వివర మమీమే దారయన్తి ప్రసృప్యద్
భుజగనిభభుజానాం బాహుజానాం నినాదాః +

ఇటఁ త్రాసమే స్ఫురించును. విషాదము స్ఫురింపదు. కొద్దిగాఁ దోచు నన్నను ఇది త్రాసమునకే అనుగుణము అగుట ఉచితము కనుక నది విషాదము ధ్వని యనఁ దగదు,

ఇపుడే ఇది నాకు లభించునుగాక యను కోరిక ఔత్సుక్యము. ఇష్టముతో నెడ బాటు విభావము. తొందర, దిగులు మొదలగునవి అనుభావములు. ఏమన్నారనగా—

"సంజాత మిష్ట విరహా దుద్దీప్తం ప్రియ సంస్మృతేః
నిద్రయా తన్ద్రయా గాత్ర గౌరవేణ చ చిన్తయా
అనుభావిత మాఖ్యాతి మౌత్సుక్యం భావకోవిదైః."

'ప్రియమైనది లేకపోవుట వల్ల నుదయించి దానిని స్మరించుట వల్ల నుద్దీప్తమై నిద్ర, మాంద్యము, ఒళ్లు బరువు, లేక బద్ధకము, చింత, యను భావములు (కార్యములు)గా ఔత్సుక్య మగును".) అని.

---

శ్రీ శర్వాణి :

+ "అయిపవన"— గుఱ్ఱములు గాలివలె నతివేగముగా పారుచున్నవి. అపుడు నేను యుద్ధమును చూడ నిచ్ఛగింతును. పగబట్టిన పాములవంటి బుజములతోడి యీ రోజుల సింహనాదములు నా చెవుల బద్దలు చేయుచున్నవి.

ఉదా :_"నిపత ద్బాష్ప సంరోధ ముక్త చాంచల్య తారకం
కదా నయన నీలాబ్జ మాలోకే య మృగీ దృశః" *

అనిష్ట మెక్కుడై మనసుకు హడావుడి_ ఆవేగము.

ఉదా :_"లీలయా విహిత సిన్ధు బన్ధన స్సోయ మేతి రఘువంశ నన్దనః
దర్ప దుర్విలసితో దశాననః కుత్ర యామి నికటే కులక్షయః". +

మందోదరి తనలోఁ దా ననుకొను మాట యిది. శ్రీరామచంద్రుని రాక విభావము. 'ఎక్కడకు పోదును?' అనుటతోఁ దోచు_ అస్థిరత్వము అనుభావము. ఇట 'చింత' ముఖ్యముగా వ్యంగ్య మనుటకు వీలులేదు. 'ఎక్కడకు పోదును?' అని అస్థైర్యము స్ఫుటముగాఁ దోచుటలో ఆవేగము స్పష్టమైనట్లుగా చింతకాదు. ఇక నేమంటే, ఆవేగపు టాస్వాదములో దానిని పోషించు గుణముగా చింతయు గోచర మగును.

దిగులు, తహతహపాటు, బెదరు, ఎడబాటు, ఇష్టానిష్టముల వినుటయు, జూచుటయు_ ఇటువంటి వానివల్ల తప్పక యొనరింప వలసిన పనులను గూర్చిన యాలోచన తొలగుట యగు చిత్తవృత్తి జడత. ఇది మోహమునకు ముందు వెనుక గూడ గల్గును. ఏ మన్నా రనగా_

'కార్యా వివేకో జడతా పశ్యతః శృణ్వతోఽపి వా
తద్విభావాః ప్రియా నిష్టదర్శన శ్రవణే రుజాః
అనుభావా స్త్వమీ తూష్ణీంభావ విస్మరణాదయః
సా పూర్వం పరతో వాస్యా న్మోహా దితి విదాం మతమ్'

(చూచుచున్నను, వినుచున్నను కర్తవ్యమును గుర్తింపలేకుండుట, జడత. ప్రియాప్రియముల దర్శన శ్రవణములు, రోగము ఇవి విభావములు.

---

శ్రీ శర్వాణి :

* 'నిపతత్'_ కన్నీళ్లు పడకుండ ఆపుట వలన కదలకున్న కంటిపాపల తోడి నల్లదామరవంటి నా వేడి కన్నుల ప్రియురాలి కనుల నెపుడు జూతును?

+ 'లీలయా'_ అలవోకగా సేతువును కట్టి ఆరఘునందను డిడుగో వచ్చుచున్నాడు. రావణుడా పొగరు మీరి యున్నాడు. కులనాశమా సమీపించినది. నేనెటఁ జొత్తును?

ఊరకుండుట, మరచిపోవుట మొదలగునవి అనుభావములు. ఇది మోహమునకు వెనుకగాని ముందుగావి కల్గు నని వేత్తల తలంపు.)

ఉదా :- యదవధి దయితో విలోచనాభ్యాం సహచరి! దైవవశేన దూరతోఽ భూత్
తదవధి శిథిలీకృతో మదీయై రథ కరణైః ప్రణయో నిజక్రియాసు' *

ఇట ప్రియుని యెడబాటు విభావము. చక్షురాదు లగు కరణములు = ఇంద్రియములు తమ తమ పనులందు- ఆయా జ్ఞానములఁ గల్గించుట యందు చనవుమ శిథిల మొనర్చుట అనుభావము. మోహములో చక్షురాదులు తమ పనులను జేయవు. అనగా- చాక్షుష ప్రత్యక్షాదులు అసలు కల్గవు, ఇచట- జడతలో ఇంద్రియములు జ్ఞానమును గల్గించును గాని వస్తువులను, ఆయా విశిష్టము లగు తీరులతో నధికముగా గ్రహించు తెలివి కల్గదు. కనుక దానికన్న తేడా యున్నది. కనుకనే ఉదాహరణములో 'శిథిలీకృతము' = పట్టుతొలగినది అనబడినది, అంతేకాని 'త్యక్తము' అనలేదు. ఎక్కువగా తృప్తిపడుట, గర్భముతో నుండుట, రోగము, అలయిక మొదలగు వానివల్ల మనసు పనికి మొగియకుండుట ఆలస్యము. ఇక్కడ శక్తి లేక పోవుటయుకాదు. కార్యాకార్య వివేకము లేకుండుటయు కాదు. ఇందువల్ల పనిచేయలేకపోవుట యను ననుభావము సమానమైనను, గ్లానికిని, జడతకును దీని నుండి భేద మున్నది.

ఉదా :-'నిఖిలాం రజనీం ప్రియేణ దూరా దుపయాతే నవిబోధితా కథాభిః
అధికం న హి పారయామి వక్తుం సఖి మాజల్ప తవాయసీ రసజ్ఞా'. +

ప్రియుడు వచ్చిన మరునాడు గడచినరాత్రి సంగతిని మాటిమాటికిని అడుగుచున్న చెలికత్తెతో రాత్రియంతయు మేలుకొనియుండుటవల్ల బద్ధకముగా నుండిన యొకనాయిక యి ట్లనుచున్నది. ఇట రాత్రి నిద్ర లేకపోవుట విభావము. ఎక్కువ మాటలాడకపోవుట అనుభావము. మోహమునకు వెనుక గానీ ముందు

---

శ్రీ శర్వాణి :

* 'యదవధి'- ప్రియుడు నాకనులకు దూరమయినంతనే నా యింద్రియములు తమ పనులయందు పట్టువీడినవి.

+ ఓ చెలియా ! చాలదూరమునుండి వచ్చిన నా ప్రియు డేవో ప్రసంగములతో రాత్రియంతయు మేల్కొనునట్లు చేసెను. ఇక నే నెక్కువ చెప్పలేను. నీ విక మాటాడకుము. నీది ఇనుప నాలుక.

గానీ జడత తప్పక యుండును. కాని ఇట నట్లు కాదని మరొక విశేషము. (ప్రియునితోడి భోగము) దాచ వలసిన సంగతి కనుక 'కథాభిః' = కథలతో ననునది అవివక్షిత వాచ్య మన్నట్లైతే అపుడు శ్రమ దీనిని పోషించును. అలసట వలనఁ గలుగు బద్ధకమును ఆలసట పోషించుట తప్పనిదేకదా! శ్రమ లేని బద్ధకమునకు విడి యుదాహరణము - అతితృప్త్యాదులనుండి కల్గిన ఆల స్యము కడ గ్రహింపవలెను.

ఇతరుల గొప్పదనమును జూచి వారిని నిందించునట్టి చిత్తవృత్తి విశే షము అసూయ. దీనినే 'ఓరువలేమి' మొదలగు మాటలతో వ్యవహరింతురు. ఎట్లనగా—

కుత్ర శైవం ధను రిదం క్వ చాయం ప్రాకృతశ్శిశుః
భంగ స్తు సర్వసంహర్త్రా కాలే నైవ వినిర్మితః.

శివుని విల్లు విరచిన శ్రీరామచంద్రుని పరాక్రమమును సహింపలేక అచట నున్న రాజు లిట్లనుచున్నారు. ఇట శ్రీమంతు డగు దశరథపుత్రుని బలము అందరికన్న హెచ్చుగా కన్పడుట విభావము. 'ప్రాకృత శిశువు' అనుటలోఁ దోచు నింద అనుభావము.

'తృష్ణాలోల విలోచనే కలయతి ప్రాచీం చకోరీ గణే
మౌనం ముంచతి కించ కైరవ కులే కామే ధను ర్ధున్వతి
మానే మానవతీ జనస్య సపది ప్రస్థాతు కామేఽధునా
ధాతః కిన్ను విధౌ విధాతు ముచితః ధారాధరాడమ్బరః'. *

ఇచట గూడ దైవ ముచ్ఛృంఖలముగాఁ బ్రవర్తించుట (విభావము)చూచి కవి కతనిని గురించిన అసూయ. తగనిపనుల నొనర్చుచున్నా డని నిందను

శ్రీ శర్వాణి :

* ఆడుచకోరముల కనులలో ఆస తొణికిస లాడుచుండ తూర్పుదెస చూచుచున్నవి. కలువలు మూగనోము విడుచున్నవి. మదనుడు విల్లు కద ల్చుచున్నాడు. వొలయలుక నొందిన సుందరుల బింకము అపుడే ప్రయా ణము కట్టబోవుచున్నది. ఇట్లున్న యిపుడు ఓ దైవమా చందమామను మబ్బులతోఁ గ్రమ్మఁ దగునా ?

వెలువరించుట (అనుభావము) తో వ్యక్తమగును అనవచ్చును. అయినను (అమర్షమునకును అసూయకును గూడ) కార్యకారణములు సమానమే కనుక అమర్ష మభివ్యక్తమై అసూయను శబలిత మొనర్చును. అట్లు శబలిత మగు నసూయయే యిట ధ్వనించును. అమర్షము లేకుండ విడిగా స్ఫురింపదు. ఇచట దైవము తప్పొనర్చినట్లుగా వెనుకటి యుదాహరణమున భగవాను డగు శ్రీరామ చంద్రుడు ఏమియుఁ దప్పుచేయలేదు కదా! కనుకనే ఇట కవికి అమర్షము స్ఫురించినట్లు అట వీరుల అమర్షము స్ఫురింపదు. చాల గొప్పపనుల నెరవేర్చుట వీరులకు సహజమే. 'ఇక్కడ అప్రస్తుత మగు చన్ద్రుని వృత్తాంతముతో ప్రస్తుత మగు రాజకుమారుని ('దారా' యను రాజకుమారుని) వృత్తాంతము స్ఫురించును గనుక అసూయాధ్వని కాదు'_ అన దగదు. ఒకటి (రాజపుత్ర వృత్తాంతము) ధ్వనించునపుడు అది మరొకధ్వనితో (అసూయాధ్వనితో) విరోధింపదు. అట్లు కానిచో మహావాక్యధ్వని అవాంతర వాక్యధ్వనులతోను, అవి పదధ్వనులతోను ఒకయెడ నెచ్చటను నుండుట సంభవింపక పోవును.

ఎడబాటు, దుఃఖము, బెదరు, రోఁగింపు మొదలగునవి యుద్రేకించుటయు అనుగ్రహావేశము మొదలగునవియు గల్గించిన యొకరక మగు వ్యాధి అపస్మారము. వ్యాధి యని చెప్పియు దీనిని విశేషించుట యేల ననగా___భీభత్స భయానకములం దీవ్యాధియే యంగము కాని మరొకటి కాదని స్ఫురింపఁజేయుటకు. విప్రలంభ శృంగారములో నితరవ్యాధులుగూడ అంగము లగును.

ఉదా :_ 'హరి మాగత మాకర్ణ్య మధురా మన్తకాన్తకం
కమ్పమానః శ్వసన్ కంసః నిపపాత మహీతలే'

ఇట భయము విభావము. వడకుట, నిట్టూర్చుట నేలపైఁ బడుట మొదలగునవి అనుభావములు.

అమర్షాదులనుండి యేర్పడి పరుషోక్తులు పల్కించు చిత్తవృత్తి చపలత అన్నారు కదా _

---

శ్రీశర్వాణి :

* 'హరిం'_యమునకు గూడ యము డగు శ్రీకృష్ణుఁడు మధురకు వచ్చె నని వినగానే కంసుడు వడకుతో నిట్టూర్చుచు నేలపైఁ బడెను.

అమర్ష ప్రాతికూల్యేర్ష్యారాగ ద్వేషా శ్చ మత్సరః
ఇతి యత్ర విభావాస్యుః అనుభావా స్తు భర్త్సనం
వాక్పారుష్యం ప్రహార శ్చ తాడనం వధబన్ధనే
తచ్చాపల మనాలోచ్య కార్యకారిత్వ మిష్యతే'.

(అమర్షము. ప్రతికూలత, ఈర్ష్య, రాగద్వేషములు, మచ్చరము అని విభావములు. అపకారపు మాటలాడుట, కరినపు మాటలాడుట (తిట్టుట) కత్తి మొదలగు నాయుధములతో గాని కఱ్ఱవంటి వానితోగాని కొట్టుట, చంపుట, కట్టి వేయుట, ఆలోచన లేకుండ పనిచేయుట ఇవి అనుభావములుగా నున్నపుడు అది చాపలముగా నిష్టమగును) అని.

ఉదా:— 'అహితవ్రత పాపాత్మ న్మైవం మే దర్శయాననం
ఆత్మానం హన్తు మిచ్ఛామి యేనత్వమసి భావితః.' *

ప్రహ్లాదునకు విష్ణువం దుండు ననురాగమును పోగొట్టుట కుపాయము కన్పడక హిరణ్యకశిపు డను మాట యిది. భగవానునందు ద్వేషము పుత్రు నందు ద్వేషమును రేపినది. ఇది = ఈ పుత్రదేషము ఇట విభావము. తనను జంపుకొన వలెనను తలంపును, కఠినముగా మాటాడుటయు అనుభావములు. అమర్షమే యిచట వ్యంగ్యమగు ననరాదు. ఎల్లపుడును భగవానునం దనురాగ ముతో నున్న ప్రహ్లాదుని గూర్చి హిరణ్యకశిపున కమర్షము చిరకాలమునుండియు నేర్పడియున్నది. కనుక, తనను జంపుకొనవలె నను తలంపు ఈనాడే మొట్ట మొదట కల్గుట కుదురదు. ఇదే మొదలుగా జరుగుపని అట్టిదే యగు కారణ మున్నగాని జరుగదు. కనుక వెనుకటి తలంపుకన్న వేరుగానే మరొకతలంపు = 'చపలత' యనునది యుండి తీరవలెను.

అలాకాదు. అమర్షము హెచ్చగుటయే తనను జంపుకొనవలెనను తలంపు నకుఁ గారణముగా వ్యంగ్యము కానిండు అనరాదు. ఏమంటే హెచ్చుదన మై

---

శ్రీ శర్వాణి :

* 'అహిత'_పాపస్వభావుడవు. అహితము నొనర్చుటయే నీకు వ్రతము. నీమొగము నాకుఁ జూపకుము. నీవు నాకడుపున బుట్టుటవలన నే నాత్మహత్య చేసుకొనవలె ననుకొనుచున్నాను.

నను, సహజమైనదాని కన్న వేరుగా నుండుట తప్పనిదే కనుక అదే చపలత యనెదము.

తిట్టుట. నిందించుట, రోగము, కొట్టుట, పేదతనము, ఇష్టము విడబడుట ఇతరుల సంపదలఁ జూచుట మొదలగు వానివల్ల నీచులందును అవమానించుట మొదలగువానివల్ల ఉత్తరములందును విషయద్వేషము కల్గును. అదియే నిర్వేదము. దానివల్ల– ఏడ్పు, పెద్దగా నిట్టూర్చుట, లేటమొగముబడుట మొదలగునవి కల్గును—

ఉదా:– 'యది లక్ష్మణ సా మృగేక్షణా నమదీక్షా సరణిం సమేష్యతి
అమునా జడజీవితే న మే జగతా వా విఫలేన కిం ఫలమ్'. •

నిత్యానిత్య వస్తు వివేకము వల్ల కల్గి లేదు కనుక ఇది = నిర్వేదము శాంతరస మనరాదు. దేవతలు మొదలగు వారిని గూర్చిన రతి–ప్రీతి. ఎట్లనగా –

'భవద్వారిక్రుధ్య జ్జయ విజయ దండాహతి దల
త్కిరీటాః తే కీటా ఇవ మహేన్ద్ర ప్రభృతయః
వితిష్ఠన్తే యుష్మ న్నయన పరిపాతోత్కలికయా
వరాకాః కే తత్ర క్షపిత మురనానాధిపతయః'. +

ఇచట అవమానము నోర్చుట భగవానుని ద్వారమున బడియుండుట భగవానుని క్రీగంటిచూపు తమయం దెపుడు ప్రసరించునా యని కోరుకొనుట, ఇట్టివి బ్రహ్మాదులకు భగవానుని గురించిన రతిని వ్యక్త పరుప లేవు. ఇక నేమనగా – "భగవానుని యైశ్వర్యము మాటలకును మనసులకును గూడ నంద

---

శ్రీ శర్వాణి :

• 'యది లక్ష్మణ' – ఓ లక్ష్మణ! ఆ లేడికంటి సీత నాచూపుతో వనబడక పోయెనేని ఈ మొద్దుబాఱిన బ్రతుకుతోగాని నిష్ఫలమగు నీజగముతోగాని నాకు ఏమి ప్రయోజనము ?

+ 'భవద్వారి'—నీద్వారములో జయవిజయులు కోపించి కర్రలతోఁ గొట్టగా కిరీటములు వగులుచున్నను బ్రహ్మేంద్రాదులు నీకటాక్ష మెపుడు తమయందు వచ్చునో యని పడగాపులు పడియుందురు. ఇక నీ దిక్పాలకుల మాట యేమి ?

రానిది అనియే వ్యక్తపరచును" అనందురా? అయినను అట్టి భగవదైశ్వర్యమును వర్ణించుట యను కార్యము (అనుభావము)వలన కవికి భగవాను డాలంబనముగా నుండు రతి ధ్వనించును అందు కభ్యంతర మేమున్నది? పోనిం డిదియైన నుదాహరణ మగును.

'న ధనం న చ రాజ్య సంపదం న హి విద్యా మిద మేక మర్థయే
మయి దేహి మనా గపి ప్రభో కరుణాభంగి తరంగితాం దృశమ్'. *

ఇట ధనాదుల నపేక్షింపక భగవానుని కటాక్ష ప్రసరమునే అర్థించుట మిక్కిలి అనురాగమును వ్యక్తపరచును.

ఇట్లు సంక్షేపముగా భావముల నిరూపణ మైనది.

సరే కాని, ఈభావములు ఇన్నే నని లెక్క నియతి యెట్లు కుదురును, మాత్సర్యము, ఉద్వేగము, దంభము, ఈర్ష్య, వివేకము, నిర్ణయము, క్లైబ్యము: క్షమ, కుతుకము, ఉత్కంఠ, వినయము, సంశయము, ధార్ష్ట్యము మొదలగునవి కూడ ఆయా లక్ష్యములం దగుపడును కదా!

కాదు. ఈ భావము లన్నియు మేము పై జెప్పిన భావములలోనే అంత ర్భవించును. కనుక మరొక లెక్క పనికిరాదు. అంతర్భావ మెట్లనగా-మాత్స ర్యము అసూయలోను, ఉద్వేగము త్రాసములోను, దంభము అవహిత్థలోను, ఈర్ష్య అమర్షములోను, వివేక నిర్ణయములు మతిలోను, క్లైబ్యము దైన్యములోను, క్షమ ధృతిలోను, కుతుకము ఉత్కంఠయు ఔత్సుక్యములోను, వినయము లజ్జ లోను, సంశయము తర్కములోను, దార్ష్ట్యము చాపల్యములోను, అంతర్భ వించును. ఈ జంటలలో నొకదానితో మరొకటికి స్వల్పము లగు తేడా లున్నను పరస్పర మొకదాని నొకటి విడచి యుండ జాలవు. కనుక అనతిరిక్తములుగానే నిర్ణయము. భరతముని అనుశాసనము సరిపడునపుడు ఉచ్ఛృంఖలత యుచితము కాదు.

---

శ్రీశర్వాణి :

* "న ధనం"- ఓ స్వామీ! ధన మడుగను, రాజ్య మడుగను, విద్య నడుగను, ఇదొకటియే నేను అర్థింతును నిన్ను. కరుణాతరంగములు గడ లొ్కను నీ చూపును కొంచె మైనను నాయం దుంచుము.

ఈ సంచారి భావములలో కొన్నికొన్నింటికి విభావములు గాను అనుభావములుగాను అవుతవి. ఎట్లనగా_ ఈర్ష్య నిర్వేదమునకు విభావమును, అసూయకు అనుభావమును అగును. చింత నిద్రకు విభావము, ఔత్సుక్యమునకు అనుభావమును. ఈ రీతి కడమ కడమ వాని విషయమున స్వయముగా నూహింపదగును.

ఇక రసాభాసము :_

అనుచితము లగు విభావముల నాలంబనముగాఁ గొన్నది యగుటయే రసాభాసము అగుటకు గుర్తు. విభావముల యనౌచిత్యము లోకవ్యవహారమున ననుసరించి నిర్ణయింప నగును. 'ఇవి తగనివి' అని తలంపు గల్గుటయే అనౌచిత్యమునకు గుర్తు అని కొందరందురు. మరి కొందరు దాని నోరువరు. ఏమంటే పైవారి నిరూపణములో ముని పత్న్యాదుల రతి మొదలగు నవి చేరినను, అనేకమంది నాయకుల గురించి నదియు ఉభయుల (నాయిక,నాయకుడు) యం దుండనిదియు నగు రతి చేరలేదు. అట విభావములం దనౌచిత్యము లేదు కదా! కనుక అనౌచిత్యము విభావములందు కూర్పఁ దగదు. ఇక నేమి? రత్యాదికమునందే కూర్పవలెను. ఇపుడు పైఁజెప్పిన మూడు రకములు = విభావాదు లనుచితము లగునప్పటి రతియు అనేకమంది నాయకులను గురించినప్పటి రతియు, ఇద్దరి యందుండనప్పటి రతియును జేరును అనౌచిత్యము వెనుకటివలెనే, అయితే రసమగుటయు రసాభాస మగుటయు నొకదానియందే ఏర్పడవు. దోష గంధము లేనపుడే రసము కాగలదు. హేత్వాభాస మగుటయు, హేతు వగుటయు నొక యెడ నుండ నట్లే ఇదియు నని కొంద రందురు. మరికొంద రిట్లు తలతురు. 'అనుచిత మైసంత మాత్రమున స్వరూపమున నేమియు హాని లేదు. కాని అభాస మందురు. అశ్వాభాస మన్నట్లే'నని.

ఉదా :_'శతే నోపాయానాం కథ మపి గత స్సౌధ శిఖరం
సుధా ఫేన స్వచ్ఛే రహసి శయితాం పుష్పశయనే
విబోధ్య క్షామాంగీం చకిత న యనాం స్మేర వదనాం
స నిశ్వాసం శ్లిష్య త్యహహ సుకృతీ రాజ రమణీమ్', *

శ్రీ శర్వాణి :

* 'శతేన'_ ఎన్నో యుపాయములతో మేడపైకిఁ జేరి అమృతపు నురువువలె నిర్మలముగా నున్న పూసెజ్జపైఁ బవళించిన కృశాంగి యగు రాజకాంతను నిదుర లేపి ఆమె బెదరు చూపులతో చిరునవ్వు నవ్వుచుండగా నిట్టూర్చి కౌగలించుకొను నదృష్ట మెంతటి వానికో!

ఇచట( బ్రణయమునకు( దగని రాజపత్ని ఆలంబనము. ఏకాంతము, రాత్రి మొదలగునవి యుద్దీపనములు. సాహసముతో రాజాంతఃపురము( బ్రవేశించుట, ప్రాణములనైన లెక్క-సేయకుండుట, నిట్టూర్పులు, కౌగిలింతలు మొదలగునవి యనుభావములు శంక మొదలగునవి సంచారులు. నిషిద్ధ మైనది ఈః రతికి ఆలంబనము కనుక రసాభాస మైనది. 'అయితే బెదురు చూపుల( జూచుచున్న దనుట వలన పరపురుషుని స్పర్శ వలని త్రాసము వ్యంగ్యము అగుచున్నది. కనుక రతి యిద్దరి యందును లేకపోవుట వల్ల నిట రసాభాస మగుటకు( గారణము'- అనరాదు. ఏమనగా-నాయిక చిరకాలమునుండియు నతని యం దనురాగముతో నున్నది. అంతఃపురము లోని కెవ్వరి రాకయు నూహింప రానిదే యగుట వలన వీడెవడు నను మేలుకొల్పు చున్నా డని మొట్టమొదట యామె భయపడు టుచితమే. పిమ్మట పరిచయము వ్యక్తము కాగానే ఆ నా ప్రియు డీతడే; నా కొరకు ప్రాణములను గూడ లెక్క-సేయక వచ్చినా డని తెలిసికొని సంతసమును వ్యక్తపరచు 'స్మేరవదన' యను విశేషణము ఆమె కతని యందు రతిని-ప్రీతిని వ్యక్తపరచును. కాని, నాయకునం దుండు రతియే యిట ప్రధానము మొత్తము వాక్యమున కింతకును అదియె కదా అర్థము!

ఇలాగైనా ఉదాహరించవచ్చును-

'భవనం కరుణావతీ విశన్తీ గమనాజ్ఞా లవలాభ లాలసేషు
తరుణేషు విలోచనాబ్జ మాలా మధ బాలా పధిపాతయాః చకార'.

ఇచటి విషయ మిది ఒకసుందరి యెటనుండియో వచ్చుచున్నది. ఆమె రూప యౌవనములు మనసుల నాకర్షింపగా యువకు లామె వెంట బడిరి. ఆమె తనయింటికడకు వచ్చెను. ఇంటిలోనికి( బ్రవేశించు సమయ మయ్యెను అపుడా యువకులు ఆమెకు తామొనరించిన (అనుగమనరూప మైన) సేవ సార్థక మైన దను విషయమును తెలిసికొన కోరిరి. తాము వెడలిపోవుట కామె యాజ్ఞ లభించు నని యాసక్తితో నుండిరి, అపు డామె వారొనర్చిన పరిశ్రమను దలచి జాలి కల్గి 'పోవలసినది' అను నాజ్ఞను నివేదించు కనుదామరల దండను వేసెను. ఈ అనుభావమును వర్ణించుట వలన వ్యంగ్య మగు రతి బహువచనము వల్ల అనేక మందిని గూర్చినదిగా స్ఫురించు చున్నది కనుక ఇదియు రసాభాసము.

ఇదైనా యుదాహరణము—

'భుజపంజరే గృహీతా నవ పరిణీతా వరేణ వధూః
తత్కాల జాలపతితా బాలకురంగీవ వేపతే నితరామ్'.

ఇట క్రౌంచగోత్ర కోడలికి రతి స్పర్శ కొంచెము కూడ నుండదు కనుక అది ఉభయుల యం దుండక రసాభాస మగును.

అట్లే చెప్పిరి కూడ- ఉపనాయక నిష్ఠాయాం మునిగురు పత్నీ గతాయాంచ బహునాయక విషయాయాం రతౌ తథాఽనుభయ నిష్ఠాయాం!

(జారునందును, ముని గురువుల పత్నులందును, అనేక మంది యందును (ఇద్దరిలో) ఒకరి యందేను రతి యుండుచో నాభాస మగును)- అని, ఇట ముని, గురు పదములు సలక్షణములు కనుక రాజాదులుగూడ గ్రహింపదగుదురు. అయితే ఇట వ్యంగ్య మేది ?

'వ్యానమ్రా శ్చలితా శ్చైవ స్ఫారితాః పరమాకులాః
పాండుపుత్రేషు పాంచాల్యాః పతన్తి ప్రథమాదృశః'.*

ఇటఁ బాంచాలి చూపులు నమ్రము లైన వనుటవల్ల, ధర్మాత్ముడు గనుక ధర్మజుని గూర్చి భక్తియు, కదలిన వనుట వల్ల బలిష్ఠ మైన భీముని (ఆకారమును) జూచి త్రాసమును, విస్ఫారిన వనుటవల్ల, లోకోత్తర మైన శౌర్యమును విని అర్జునుని గూర్చి హర్షమును, మిక్కిలి ఆకులములు అనుటవల్ల విలక్షణ మగు సౌందర్యమును జూచి, నకుల సహదేవుల గూర్చి యౌత్సుక్యమును ద్రౌపది చూపులు వ్యక్తపరచుచున్నవి. దీనివలన పాండవులను అయిదుగురిని (అనేకులను) గూర్చిన పాంచాలి రతి యంతటను వ్యక్త మగును. ఇది రసాభాసమే యని నవ్యు లందురు. ప్రాచీనుల తలం పే మనగా- పెండ్లాడని యనేక నాయకులను గూర్చిన దైనచో రతి యాభాసమే యని. (ప్రకృతములో శ్లోకమునందు 'ఉపనాయక సంస్థాయాం' అని జారుని గూర్చిన రతియే ఆభాస మని యున్నది కనుకను, ఇచటి పాంచాలి రతి పెండ్లాడిన నాయకులను గూర్చినదే కనుకను మరొకరకము కాదు కనుకను రసాభాస మనరాదని).

రసములలో శృంగారరసము రెండురకము లైనట్లుగా ఈ రసాభాసములలో గూడ శృంగారరసాభాసము రెండురకములు. సంయోగ శృంగారాభాసము, వియోగ శృంగారాభాసము నని.

---

శ్రీశర్వాణి :

* 'వ్యానమ్రాః'-మిక్కిలి వాలినవి, వణకినవి, విస్తరించినవి మిక్కిలిగా ఆకులము లైనవి. పాండుపుత్రుల యెడ పాంచాలిచూపులు___

సంయోగశృంగారాభాసము నొక యడుగు వెనుక నుదాహరించితిమి. విప్రలంభాభాస మెట్లనగా—

'వ్యత్యస్తం లపతిక్షణం క్షణ మధో మౌనం సమాలంబతే
సర్వస్మి న్విదధాతి కించ విషయే దృష్టిం నిరాలమ్బనాం
శ్వాసం దీర్ఘ మురీకరోతి నమనా గంగేషు ధత్తే ధృతిం
వైదేహీ కమనీయతా కవలితో హా హన్త లంకేశ్వరః '. †

ఇచట శ్రీసీతామహాదేవిని గూర్చి రావణునికి యోగకాలపు రతి ఇద్దరి యందును లేదు కనుకను, సకల ప్రపంచమునకును దండ్రి యైన భగవానుడు శ్రీరామచంద్రుని ధర్మపత్నిని గూర్చిన దగుటను ఆభాస మైనది, 'వ్యత్యస్తం లపతి' (= ఎగుడు దిగుడుగా మాటాడు చున్నాడు) ఇత్యాదులైన పలుకులు వ్యక్తిపరచు ఉన్మాదము, శ్రమ, మోహము చింత, వ్యాధులు గూడ అట్లాగే ఆభాసములై పైని విప్రలంభరత్యాభాసమును పోషించినవి. అందువల్ల నిట రసాభాసధ్వని యని వ్యవహరింప నైనది. ఇట్లే తగవులాడు స్వభావముగల పుత్రాదుల నాధారపరచుకొనియు, వీతరాగులగు ఋష్యాదులం దున్నట్లుగా శోకమును వర్ణించినను. బ్రహ్మవిద్యయం దధికారము లేని చండాలాదులం దున్నట్లుగా నిర్వేదమును వర్ణించినను, నీచులు పిరికివారు ఇటువంటి వారి యందు గాని, తల్లిదండ్రి మొదలగు వారినిగూర్చి గాని క్రోధోత్సాహములను వర్ణించినను, గురువు మొదలగువారిని గూర్చి యెగతాళిని వర్ణించి నను, మహావీరు నందు భయమును వర్ణించినను, యజ్ఞార్థమగు పశువుల వసనెత్తురు మాంసము మొదలగు వానిని గూర్చి జుగుప్సను వర్ణించినను ఆ యా రసాభాసము లగును, వీటి నన్నింటి నుదాహరించుచు గూర్చున్నచో గ్రంథము పెరుగును. కనుక నది యొనర్పను. బుద్ధిమంతులు స్వయముగానే యూహింపవచ్చును. ఇట్లే అనుచితము లగు విషయములను గూర్చిన వగుచో భావాభాసము లగును. ఎట్లనగా—

---

శ్రీశర్వాణి :

† 'వ్యత్యస్తం'—ఒక నిముస మెగుడు దిగుడుగా మాటాడును. మరొక నిముస మూరకుండును. అంతటను శూన్యదృష్టితోఁ జూచును. దీర్ఘముగా నిట్టూర్చును. అవయవములు నిలుప లేకుండును. అయ్యయ్యో ! తనను సీతా సౌందర్య మాక్రమింపగా రావణుని స్థితి యిది.

సర్వేపి విస్మృతి పథం విషయాః ప్రయాతాః
విద్యాపి ఖేద కలితా విముఖీ బభూవ
సా కేవలం హరిణశాబక లోచనా మే
నైవా పయాతి హృదయా దధిదేవతేవ'. *

గురువుల యింట విద్య నేర్చు కొనువేళయందు వారి కన్యకయొక్క లావణ్యము మనసు నాకర్షింపగా నున్న విద్యార్ధి గానీ, లేక, ఏతీరున జూచినను స్మృశింప దగని యొకతెను దేశాంతరమున దలంచుకొనువాడు కానీ ఈమాటను చున్నాడు. ఇచట స్రక్చందనాది విషయములును చిరకాలమునుండియు దాను సేవించుచున్న విద్యయు, తమంత తామే యీవక్తను వీడిన వనుటవల్ల నవి కృతఘ్నులని వ్యంగ్యము. అట్లే ఈ హరిణశాబక లోచన_ప్రియురాలు, తన నిప్పటికిని వీడి లేదు కనుక నామె లోకోత్తర మగు వ్యక్తి యనియు వ్యంగ్యమగును. ఈరెండును వ్యతిరేక స్వరూపముతో స్మృతినే పోషించును. ఇట్లు పోషింపబడిన స్మృతియే ప్రధానము. ఇట్లే ఎప్పుడును తనను వీడ లేదని వ్యంగ్య మొనర్చును. అధిదేవతవలె నను నుపమయుఁ బ్రధానము. ఈస్మృతి విభావము (గురుపుత్రిక కానీ, అస్పృశ్యురాలు కానీ) అనుచితమును కనుకను ఇద్దరియందును రతి (భావము) లేదు కనుకను గూడ నిది భావాభాసము. అయితే ఆమెను పెండ్లాడినవాడే ఇట్లు తలంచుకొనుచున్నచో నిది భావధ్వనియే.

ఇక భావశాంతి___

వెనుకఁ జెప్పిన స్వరూపము గల భావమునకు శాంతి _ నాశము. అది భావాంతరపు టుత్పత్తి సమయములోనిది గానే గ్రహింపవలెను. అదియే సహృదయుల హృదయములను చమత్కరించును ఉదాహరణము__

ముంచసి నాద్యాపి రుషం భామిని ముదిరారిరుదియాయ
ఇతి తన్వ్యాః పతివచనై రపాయి నయనాబ్జకోణశోణరుచిః'. •

శ్రీశర్వాణి :

* 'సర్వేపి' _ అన్నివిషయములును మరుపు దగిలినవి. విద్యయు, విసుగుదోచి పెడమొగము పెట్టినది. ఆలేడిపిల్ల కన్నులతోడి పిల్లమాత్రము నాహృదయమున నధిదేవతవలెఁ దొలగిపోలేదు.

• 'ముంచసి'_ఓభామినీ! మబ్బులు క్రమ్మినవి. ఇప్పటికిని నీవు కోపము విడువవు గదా! యను మగని మాటలు ఆతని కనులచివరి యరుణిమను త్రాగి వైచినది.

ఇచటఁ బూర్వాపరరూప మైన ప్రియుని మాట వినుట విభావము. కనుల చివరి యెరుపు పోవుట గానీ, దానినుండి వ్యంగ్యమగు నామె ప్రసన్నత గానీ అనుభావము. ఇట రోషము నశించుట, ప్రసాదభావపుటుత్పత్తి సమయముచే నియమితముగానే వ్యంగ్యము అగును.

'భావోదయము–అనగా భావపు టుత్పత్తి.

వీక్ష్యవక్షసి విపక్ష కామినీ హారలక్ష్మదయితస్య భామినీ
అంసదేశ వలయీకృతాం క్షణా దాచకర్ష నిజబాహువల్లరీమ్.' †

ఇచటఁ గూడ తన ప్రియుని రొమ్మున తన చవితి వేసిన పూలదండను జూచుట విభావము. ప్రియుని మెడను జుట్టియున్న తన బాహులతను దీసివేయుట అనుభావము. రోషోదయము వ్యంగ్యము అయితే భావశాంతిలో భావాంతరపు టుదయము, భావోదయములో వెనుకటి భావపుశాంతియు అవశ్యముగా నుండె డివే కనుక ఈ జంటలలో నొక్కొక్క దానికి ప్రత్యేకంగా బేర్కొను నవ కాశము లేదు. అయినను రెండు నొకచోటఁ జమత్కారము నొదవింపలేవు. చమత్కారమును బట్టి యే (రసభావాది) వ్యవహార మేర్పడును గనుక విషయ విభాగము పొసగును.

ఇట్లే భావసంధి– అనగా ఒకదాని నొకటి తోసివేయ దగియుండునట్లు తోసివేసుకొనని రెండు భాగముల కొకయెడ కలయిక.

ఉదా :–యౌవనోద్గమ నితాన్త శంకితాః శీల శౌర్యబల కాన్తిలోభితాః
సంకుచన్తి వికసన్తి రాఘవే జానకీనయన నీరజశ్రియః.

ఇట భగవానుడు దాశరథి యందలి లోకోత్తర మైన యౌవనపు టుదయమును, అట్టిదే యైన శీల శౌర్యాదికమును జూచుట విభావము. కనులు ముడుచుట, విస్తరించుట అనుభావము. సిగ్గు ఔత్సుక్యముల సంధి వ్యంగ్యము.

అట్లే భావ శబలత్వ మనగా– ఒక దానిచే నొకటి బాధింప బడుచు గానీ బాధించుచు గానీ యుండు నట్టి భావము లైనను, అట్టివి కాని యట్టి భావము లైనను చిత్రముగా కలిసి యుండుచో భావశబలత –

---

శ్రీశర్వాణి :

† 'వీక్ష్య వక్షసి'–తనశత్రు వగు కామిని యొక హారపు గుర్తు తన. మగని రొమ్మున గన్పడగా ప్రియుని యంసదేశమును తీవవలెఁ జుట్టియున్న తన చేయిని భామిని లాగుకొనెను.

కలయికలోని చిత్ర మే మనగా- ఈ భావము లన్నియుఁ దెలియుటతో అవి యన్నియుఁ గలిపి యొకే చమత్కారమును గల్గించు నని భావము.

ఉదా :-'పాపం హ స్త మయా హతేన విహితం సితాపి యద్యా పితా
సామా మిన్దుముఖీ వినాబత వనే కిం జీవితం దాస్యతి
ఆలోకేయకథం ముఖా నికృతినాం కింతే వదిష్య న్తి మాం
రాజ్యం యాతు రసాతలం పునరి దం నప్రాణితుం కామయే'.

ఇట మతి, అసూయ, విషాదము, స్మృతి, వితర్కము, వ్రీడ, శంక, నిర్వేదము వెనుక జెప్పిన తమ తమ విభావములనుండి యేర్పడి శబలము లైనవి. అయితే కావ్యప్రకాశ టీకాకారులు, ముందు భావములు, వెనుకటి భావములను త్రోసి వైచుట శబల యనిరి. అది కాదు. 'పశ్యే త్కశ్చిచ్చపలరే కాత్వ రాహం కుమారీ హస్తాలమ్బం వితరహ మహో మృత్ర్కమః క్వాసియసి' అనుచోట శంక, అసూయ, ధృతి, స్మృతి, శ్రమ, దైన్యము, మతి, ఔత్సుక్యము- ఇవి యొకదానితో నొకటి యుపమర్దము లేశము లేకున్నను శబలము లగుట రాజ స్తుతిలో గుణముగా మూలకారుడే అయిదవ యుల్లాసములో నిరూపించినాడు. తనకు తరువాతి (ఆత్మ)విశేషణ గుణము నుండి యేర్పడు నాశము వ్యంగ్యము కాదు. ఉపమర్ద మనుటకును దగదు. చమత్కారమును గలింపదు. కనుక 'నారికేల జలక్షీర సితా కదల మిశ్రణే విలక్షణో యథాస్వాదో భావానాం స్ఫురతే తథా'-కొబ్బరినీళ్లు, పాలు, పంచదార, అరటిపండ్లు వీనిని బాగుగా కల్పినపు డెట్టి విలక్షణపు రుచి యేర్పడునో అట్లే భావములు కలిసినపుడును. అయితే ఇది యిచట తెలియవలసి యున్నది, ఈ చెప్పిన భావశాంతి, ఉదయము, సంధి, శబలత, వీని ధ్వనులు కూడ వెనుక జెప్పిన భావధ్వనులే. స్థితి దశలో నాస్వాదింపఁ బడుచున్నట్లుగా ఉత్ప త్తి దశలోను (భావోదయము) నశించు నవస్థలోను (భావశాంతి) సంధానదశలోను (భావసంధి) పరస్పరము చాలభావము లొక యెడ కూడియుండు తీరులోను, ఆస్వాదింపబడుచుండు నవి యివియే కనుక వానికే- (అనగా నాయాదశలకే) ప్రాధాన్య ముచితము. చమత్కార మచటనే విశ్రాంత మగును కదా!

అయితే ఉత్ప త్తి, వినాశము, సంధి, శబలతలను నవస్థలును వానికి సంబంధించిన భావములును ఆస్వాదములో సమానముగానే గోచరము లగును కదా! కనుక ప్రాధాన్యము వీనికే నని వివిచ్య నిర్ణయించుటకు వీలుకాదు, అయి

నను స్థితి దశలో * భావములకుఁ బ్రాధాన్యము ఇతః పూర్వమే సిద్ధము. అంతే కాక భావశాంత్యాది దశలందు కూడ భావములే. ఆయా దశలతో నియత సంబద్ధములై † స్ఫురించు చుండును. కాగా భావములకే ప్రాధాన్యము కల్పించు టుచితము.

ఇంకొకటి— భావశాంత్యాదులలో భావము కాదని దానికన్న అప్రధాన మైన శాంత్యాదికమునకే ప్రాధాన్య మంగీకరించినచో భావములు వ్యక్తమగుచు తత్ప్రశమాది దశలు వాచ్యములగుచుండు (నపుడు) కావ్యములను భావశాంత్యాది ధ్వని కావ్యము లనుటకు వీలు కలుగదు. అట్లాగే కదా!

'ఉషసి ప్రతిపక్ష నాయికా సదనా దన్తికమం చతి ప్రియే
సుదృశో నయనాబ్జ కోణమో రుదియాయ త్వరయారుణద్యుతిః'. △

ఇట 'ఉత్' అను నుపసర్గ ముందున్న 'ఇణ్' ధాతువు భావోదయమును వాచ్యముగానే తెల్పుచున్నది ఉదయము వాచ్య మైనను భావము వాచ్యము కాలేదు కనుక ధ్వని యనుట సరియే ననరాదు. ప్రధానము పేర్కొనుట కుప యోగింప నపుడు అప్రధానముతో బేరుపెట్టుట కుదురదు. ఇక మామతములో ఉత్పత్తి వాచ్య మైనను దానితో గూడిన అమర్షము ప్రధానము వాచ్యము కాలేదు

---

శ్రీశర్వాణి :

* ఈ దశ అపుడు గోచరింపదు. భావ మొకటియే గోచరించును. కనుకనే ముందు భావధ్వనులకును. భావశాంత్యాది ధ్వనులకును చమత్కారములో వైలక్షణ్యమును నిరూపించు ప్రపంగములో 'ఈ దశలో భావ మొంటరిగా గోచరించు ననుటయే చివరి సిద్ధాంతముగాఁ దెల్పఁబడినది. కాగా 'స్థితి' ఉన్నను గోచరము కాబోదు. కనుక ఉన్న భావమునకే ప్రాధాన్యము.

† అనగా వ్యంగ్య మగు రోష ప్రశమమును వ్యంజక మగు అరుణ ప్రశమమును వేరనక తప్పదు. ఇది ప్రశమ మను భావ మొక్కటే యద్దా నికి సమాధానము.

△ తెల్లవారునపుడు ప్రియుడు తన శత్రువగు స్త్రీ గృహమునుండి తన వద్దకు రాగా నాయిక కనుదామరల కోణములం దరుణకాంతి వెంటనే యుద యించెను.

కనుక భావోదయధ్వని సరిగానే కుదురును. ఈలాగే భావము వ్యక్తమగుచుండగా వానితో నియత సంబద్ధమగు ప్రశమము-అవస్థా వాచ్యమైనచో నట భావశాంతి ధ్వని కాకపోవును, ఎట్లనగా—

'క్షమాపణైక పదయోః పదయోః పతతి ప్రియే
శేము స్సరోజనయనా నయనారుణ కాన్తయః'.

సరే కాని, ఇట శబ్దములచే వాచ్యము లగు ప్రశమాదులు అరుణకాంత్యాదులతోనే అన్వయించును గనుక అరుణకాంతి ప్రశమాదులే వాచ్యములుగా పర్యవసించినవి. అంతే కాని అటువంటి ప్రశమాదులచే వ్యంగ్యము లగు రోష ప్రశమాదులు వాచ్యము లని యేర్పడలేదు. వ్యంగ్యములకును వ్యంజకములకును భేద మొప్పక తప్పనిదే కదా!

అట్లు కాదు ఆరుణ్యముతో వ్యంగ్య మగు రోషమే వాచ్యము లగు రోషమే వాచ్యము లగు ప్రశమాదులతో నన్వయించు ననరాదు. వాచ్యప్రతీతి మొదటను, వ్యంగ్యప్రతీతి తరువాతనుగా నొక దానివెంబడి మరొకటి యేర్పడును గనుక వాచ్యార్థము లన్వయించు వేళలో, వ్యంగ్యమునకు (తర్వాత స్ఫురించు దానికి) అన్వయము కుదురదు. అట్లే కానిచో 'సదృశో నయనాబ్జ కోణయోః' అనునది అన్వయింపకపోవును. (కాగా నయనాబ్జకోణ శోణ ద్యుతి ప్రశమము వాచ్యమైనను రోషప్రశమము వ్యంగ్యము కనుక భావధ్వని యనుట సరిగానే కుదురును.) అనుచో నీతోవ సరియైనది కాదు. ఇట్లైనా

'నిర్వాసయ న్తీ ధృతి మంగనానాం శోభాం హరేరేణ దృశోధయ న్త్యాః
చిరాపరాధ స్మృతి మాంసలోఽపి రోషః క్షణప్రాఘుణికో బభూవ'.

ఇత్యాదులు గూడ భావప్రశమ ధ్వని కావలసి వచ్చును. ఇట భావము రోషము వాచ్యమైనను, దాని ప్రశమము-ప్రధాన మైనది వ్యంగ్యమే కదా: 'రెండును వాచ్యములు కాకుండుట మా యభిమతము' అందురా! వెనుకటి రెండుపద్యములందును 'శమత్వము' అనియు, 'ఉదయత్వము' అనియు ధర్మములతో 'శమోదయములు' రెండును వాచ్యము లగును. కావున నవి ఉదాహరణములు కాకపోవును. ఉదాహరణములు కాకపోవుట మాకిష్టమేను 'అనుట సహృదయుల కుచితము కాదు. కనుక భావశాంత్యాదు లందు గూడ ముఖ్యముగా భావములే చమత్కారములు. ప్రశమాదులు వానికి ఉపసర్జనములుగా - అప్రధానములు- తోడుగా నుండు నంతటివే. కనుక

నవి వాచ్యములు గాకున్నను దోసము కాదు. (సరి. ప్రసక్తానుప్రసక్తిగాఁ జా దూరము వచ్చితిమి. అసలు ప్రారంభించిన విషయ మట్లే నిలచిపోయినది. దా నిపుడు నిరూపింతుము. భావోదయాది ధ్వనులు భావధ్వను లైనను) భావధ్వన లకును భావ శాంత్యాది ధ్వనులకును చమత్కారము విలక్షణమే. అందును బట్టియే వానికి భేద మేర్పడును.

చమత్కారము విలక్షణ మగుటకు మూల మేమనఁగా – అమర్షాది భావ ములు స్థితిదశతో గలసికొని కలయక కాని – అనగా – కేవలముగా కాని యొక చర్వణలో నాస్వాదింపఁ బడును.

మరొక చర్వణలో భావములు ప్రశమాద్యవస్థల కల్గియుండుటయు గూడ గోచర మగును ఈ విషయ వైలక్షణ్యము వల్ల చమత్కార వైలక్షణ్య మేర్పడును.

ఇక రసము స్థాయిభావ మూలము కనుక దానికి ప్రశమాదులు సంభ వింపవు. సంభవించినను చమత్కారము కలుగదు అని ఆవిషయమును విచా రింపము. ఇప్పటికి రత్యాది రూప మైన వ్యంగ్యప్రపంచ మంతయు స్పష్టముగా నిరూపించి తెల్పబడినది.

ప్రకరణము స్పష్టము కాగానే విభావానుభావ వ్యభిచారులు ఝట్టున స్ఫురిం పగా సహృదయు డగు ప్రమాతకు సూక్ష్మకాలములోనే గోచరించునదియు కార్య కారణముల వెనుక ముందులు గుర్తింపరానిదియు కనుక ఈ వ్యంగ్యప్రపంచ మంతయు అలక్ష్యక్రమ మనఁబడును

అట్లుకాక ప్రకరణ మాలోచించిననే తెలిసి విభావాదుల నూహించుకొన వలసియే యుండుచో ఈ సామగ్రి యాలస్యమువల్ల చమత్కారమునకు నాల స్యము – మాంద్యము ఏర్పడుట తప్పదు. అచోటే సంలక్ష్యక్రమ వ్యంగ్య మగును. ఎట్లనగా – 'తల్పగతాపి చ సుతనుః శ్వాసా సంగం నయా సేహే' అని ఇదివరలో నుదాహరించిన పద్యములో 'సంప్రతి' అనుదాని యర్థము తెలియుట యాలస్యము. రత్యాది ధ్వని అసంలక్ష్యక్రమ వ్యంగ్యమే నను విషయము ధర్మి గ్రాహక ప్రమాణమున సిద్ధింపలేదు. ఇందువల్లనే లక్ష్యక్రమముల ప్రసంగములో

ఏవం వాదిని దేవర్షౌ పార్శ్వే పితు రధోముఖీ
లీలాకమల పత్రాణి గణయామాస పార్వతీ. *

అనుచోట బాల్యమునుబట్టియు మొగము వంచి తామరరేకుల లెక్కించుట పొసగు నదే కనుక కొంచె మాలస్యమై, నారదుడు పెండ్లిప్రసంగ మొనరించె నని తెలిసిన తరువాత స్ఫురించు వ్రీడ చమత్కరింకొను గనుక లక్ష్యక్రమ ధ్వని యని అనందవర్ధనాచార్యు లనిరి

సరికాని ఈ రసభావాదికము సంలక్ష్యక్రమమునకు విషయ మగుచో అను రణనభేదములను గణించు సందర్భములో 'అర్థశక్తి మూలమునకు పన్నెండు భేదములు' అను నభినవగుప్తుల మాటయు, 'అందుచేత నిది పన్నెండు భేదము లైనది' అను మమ్మటుల మాటయు గుదురదు. ఏమంటే – వస్తువు, అలంకా రము నను రూపముల రెండురకములైన వాచ్యముతో స్వతస్సంభవి, కవి ప్రౌఢోక్తి నిష్పన్నము, కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తి నిష్పన్నము అను మూడు రీతులతో ఆరు రూపముల వస్త్వలంకారములు వ్యంగ్యము లగును. అట్లే రసా దులు కూడ వ్యంగ్యము లగును గనుక అర్థశక్తి మూలకములు పన్నెండు గాక పదునెన్మిది కావలసి యుండును.

ఈవిషయములో మాసమాధానమును దెల్పుదుము. ప్రకటము లగు విభా వానుభావవ్యభిచారులచేత నలక్ష్యక్రమముగానే ( = క్రమము గుర్తింపరాకుండనే వ్యక్తపరుపబడు రత్యాది స్థాయిభావము రస మగును సంలక్ష్య క్రమముగా ( = క్రమము గుర్తింపబడ దగునట్లుగా వ్యంగ్య మగునది రసము కాదగును. అసలు రస మగుట యనగా నేమి? స్థాయిభావము పుట్టున అలౌకిక చమత్కా రములో గోచరించుట. రత్యాదికము సంలక్ష్యక్రమముగా వ్యంగ్య మగునపుడు మాత్రము అది వస్తు మాత్రమే కాని రసాదికము కాదు అని వారిరువురి తాత్ప ర్యముగా వర్ణించుచో నట వారి మాటలకు విరోధము సంభవింపదు.

---

శ్రీ శర్వాణి :

* 'ఏవం వాదిని'–దేవర్షి – నారదు డిట్లు చెప్పుచుండగా తండ్రిప్రక్కన మొగము వంచి లీలాకమలపు రేకులను పార్వతి లెక్కపెట్టెను.

ఈవిషయములో నుపపత్తి ( = యుక్తి) ఆలోచింపవలసి యున్నది. అభినవగుప్తుల మాటలో రసభావాదిక మగు నర్థము అనుచోట రసాది శబ్దము రత్యాది స్థాయిభావపరము.

అయితే ఇట్లు నిరూపించిన ఈ రసాది ధ్వని ప్రపంచము, పదములు, వర్ణములు, రచన, వాక్యము, ప్రబంధము, పదైకదేశము అక్షర రూపములు కాని రాగాదులను వ్యంగ్య మొనర్చు నని పెద్దల సంప్రదాయము.

అందులో వాక్యమున బదము లన్నియు దమతమ యర్థములను హాజరు పెట్టుట మూలమున వాచ్యార్థ జ్ఞానమునకు గారణ మగుట సమాన మైనను కుర్వ ద్రూపత్వమును ఏదో యొక విశేషమును బట్టి చమత్కారము కలుగక పోవుటను వారించి ఏయొక్క పదమో ధ్వని యని పేర్పడుటకుఁ గారణ మగును. ఎట్లనగా 'ప్రియపాణిం మన్ద మాక్షిపతి' యనుచోట 'మన్దం' అను పదము 'రచనా వర్ణములు పదములోను,వాక్యములోను జేరినవే కనుక వ్యంజనకు ప్రయోజకములు = తోడు చేయునవే కాని సాక్షాత్తుగా వ్యంజకము లన దగదు. అయినను పదవాక్యములతో గూడ రచన వ్యంజకమా? రచనలో జేరిన పదవాక్యములు వ్యంజములా యని యొక వినిగమకము _ ఒక పక్షమును నిశ్చయింపఁ దగునట్టి ప్రమాణము లేదు కనుక దేనికి దానికి ప్రత్యేకముగానే వ్యంజకత్వము నంగీకరింప నగును. ఘటాదుల విషయములో దండచక్రాదుల కీతీరే కదా అని యందురు ప్రాచీనులు.

వర్ణరచనాది విశేషములు మాధుర్యాది గుణములను వ్యక్తపరచునే కాని రసమును(గుణిని) వ్యక్తపరుపజాలవు. అట్లు కాదనుటకు ప్రమాణము లేక పోవుటయే కాక గౌరవ దోషమును తప్పదు. అయితే 'గుణిని (రసాదికమును) వ్యక్తపరుపకుండ, గుణమును (మాధుర్యాదికమును) వ్యక్తపరుపదు' అనునియమము లేదు. ఇంద్రియత్రయమునందు _ శ్రోత్రజిహ్వాఘ్రాణములందు ఈనియమము తప్పిపోవును గదా !

కనుక గుణములను, గుణులను ఈరెండును గాక ఉదాసీనము లగువానిని గూడ గుణగుణుల నొకదానితో మరొకటి కలిపికానీ, కలుపకుండ విడిగాగానీ, వానివాని వ్యంజకములు ఆయాప్రమితులలో గోచరింపఁ జేయును. అట్లే రసములు వాని గుణములును వ్యంజనలో గోచరము లగు నని నవ్యు లందురు.

ఉదాహరణ మేనగా_'తాంతమాల తరుకాన్తి లంఘినీం' అని ఇదివరలో జెప్పిన పద్యమే వాక్యము వ్యంజక మగుటకు గూడ నుదాహరణము. 'ఆవిర్భూతా

యదవధి' ఇత్యాదికము. ప్రబంధము వ్యంజక మగు విషయములో వాశిష్ఠరామాయణములో శాంతకరుణములును, రత్నావలిలో శృంగారమును వ్యంగ్య మగుట సుప్రసిద్ధమే. నా నిర్మించిన లహరు లైదును భావ వ్యంజన కుదాహరణములు.

పదైకదేశమునకు - 'నిఖిల మిదం జగదండకం వహామి, అనుచోట 'క' అను తద్ధిత ప్రత్యయము నిదివరలోనే యుదాహరించితిమి. ఇట్లే రాగాదుల నుండియు వ్యంగ్య మగు ననుటకు సహృదయుల హృదయమే ప్రమాణము.

ఇట్లు ఈరసాదుల ప్రాధాన్యమును బట్టి యుదాహరణముల నిరూపించితిమి. ఇవి యప్రధానము లగు నపు డుదాహరణములను ముందు జెప్పెదము. పేరులను గూడ తెల్పుదుము. ఇవి ప్రధానము లగు నపుడే రసములు. అప్రధానము లగు నపు డవి రత్యాది భావములు మాత్రమే. వాని పేరులోని 'రస, పదము రత్యాది భావపరమే యని యొక రన్నారు. ఆ రత్యాదులు రసములే కాని ధ్వని యని పేర్కొనుటకు తగవు అని మరొక రన్నారు.

మహోపాధ్యాయుడు, పదవాక్య ప్రమాణ పారావార పారీణుడు నగు శ్రీ పేరుభట్ట సూరి యొక్క కుమారుడు పండితరాజు జగన్నాథుడు నిర్మించిన రసగంగాధరమున రసనిరూపణాత్మక మగు మొదటి యాననము ముగిసినది.



# ఆంధ్రరసగఙ్గాధరము

ద్వితీయాననము

అనువాదకులు

'న్యాయశిరోమణి'

శ్రీమాన్ వేదాల తిరువెంగళాచార్యులు





ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాదు - హైదరాబాదు-4.

## తొ లి ప లు కు

అతివిశాలమగు భారతీయ సాహిత్య శాస్త్రాకాశమునందు అత్యున్నతస్థానము నాక్రమించి ధ్రువతారవలె ప్రకాశించుచున్న మహా మేధావి జగన్నాథ పండితుడు. సర్వశాస్త్రములందును కూలంకష మగు ప్రజ్ఞను సంపాదించి, మొగలు చక్రవర్తియగు షాజహాను ఆస్థానమున పండితరాజ పదవి నలంకరించిన ఈ కవిపండితునియందు పరిపూర్ణ వికాసమును పొందిన ప్రతిభ, అటు కారయిత్రీ రూపమున ఎన్నియో హృదయంగమములగు భామినీవిలాసాది కావ్యములను వెలయింప జేసి, భావయిత్రీ రూపమున ఏన అప్రతిహతప్రభమగు రసగంగాధరమణి నావిర్భవింపచేసి తద్ద్వారా అలంకార శాస్త్రమున కొక స్వతంత్ర ప్రతిపత్తిని సంపాదించి పెట్టినది. మన దురదృష్టముచే ఈ రసగంగాధరము అసంపూర్ణముగనే లభించుచున్నది.

శ్రీమాన్ వేదాల తిరువెంగళాచార్యులవారు దీని ప్రథమాననమునకు శర్వాణీ సహిత ఆంధ్ర రసగంగాధరముఅను పేర రచించిన ఆంధ్ర వ్యాఖ్యానమును ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ నాల్గు సంవత్సరములకు పూర్వమే పాఠకులకు అందించి యున్నది. ఉత్తరాలంకారము వరకును అసంపూర్ణముగ మాత్రమే లభించిన ద్వితీయాననమునకుగూడ వీరు ఆంధ్రానువాదము చేసియున్నారు. దానిని కూడ ఇపుడు పాఠకులకు అందజేయుటకు చాల సంతసించుచున్నాము. ఈ ఆననము అతివిస్తృతమగుటచేతను, శ్రీ ఆచార్యులవారు జరావ్యాధి పీడితు-లగుటచేతను, ముద్రణ ప్రారంభించిన అనతికాలమునకే వారు స్వర్గస్థులగుటచేతను అచ్చటచ్చట దొరలిన అనువాద లేఖనాదులలోని స్ఖాలిత్యములను సవరించి ముద్రణపర్యవేక్షణాదుల ద్వారా కూడ మాకు సహాయపడిన డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడుగారికి కృతజ్ఞులము.

హైదరాబాదు,
5-8-1972.

దేవులపల్లి రామానుజరావు
ప్రధాన కార్యదర్శి.

# ప్రస్తావన

## పండితరాజు జగన్నాథుని వైదుష్యము

బ్రహ్మశ్రీ ఉపద్రష్ట జగన్నాథ పండితరాజు తూర్పు గోదావరి జిల్లా ముంగండ గ్రామమువాడు వేగినాటి బ్రాహ్మణుడు. ('అఖిలాన్ధ్ర వేగినాడ కులావతంస' యని భామినీవిలాసము సమాప్తిలో వ్రాసుకున్నాడు). ఇతడాంధ్రదేశమునందేగాక భరతఖండమునందే శిరోధార్యమైన 'రసగంగాధరము' అను గ్రంథరత్నమును రచించి పండితలోకమునకే మూర్ధాభిషిక్తుడగు రాజైనాడు.

ఈతని పాండిత్య మనితరసాధారణమైనది. ఇతడు తన తండ్రి లక్ష్మీకాను డగు పేరుభట్టుగారి వద్దనే విద్యలన్నింటిని నేర్చెను.

'పాషాణాదపి పీయూషం స్యన్దతే యస్య లీలయా,
తం వందే పేరుభట్టాఖ్యం లక్ష్మీకాన్తం మహాగురుమ్
అనిచెప్పెను.

ఈ పేరుభట్టు తనకు మహాగురువని పండితరాజు తెల్పుటవలన నతడే తన చదివిన విద్యలన్నింటి నితనికి నేర్పెననియు మన్త్రోపదేశాదికమొనర్చెననియు దేలుచున్నది. ఇతని కన్నివిద్యలను నేర్పగల్గవైదుష్యమును శ్రీపేరుభట్టుగారెట్లు సంపాదించిరో మన పండితుడే తన రసగంగాధరములో నిట్లు తెల్పెను :

"శ్రీమద్ జ్ఞానేన్ద్రభిక్షోరధిగతసకలబ్రహ్మవిద్యాప్రపంచః
కాణాదీరాక్షపాదీరపిగహనగిరో యో మహేన్ద్రాదవేదీత్.
దేవాదేవాధ్యగీష్ట స్మరహరనగరే శాసనం జైమినీయం
శేషాంకప్రాప్తశేషామలఫణితిరభూత్సర్వవిద్యాధరోయః"

జ్ఞానేన్ద్రభిక్షువు అనగా భట్టోజీదీక్షితుని సిద్ధాన్తకౌముదికి తత్త్వబోధిని రచించినతడు. మొదట కౌముదిని ఖండించుచు వ్రాసియు, భట్టోజీ చార్జన్యమునకు భయపడి యీగ్రంథము వ్రాసినాడు. ఇతడు వేదాన్తము నందు పూర్ణప్రజ్ఞ కలవాడు. ఇతనియొద్ద వ్యాకరణ సంస్కృతమగు

వేదాన్తమును నేర్చెను. "కాణాదం పాణినీయం చ సర్వశాస్త్రోపకారకం" అన్నట్లు వ్యాకరణగన్ధము లేక శబ్దశత్త్వ మెట్లవగతమగును? కనుకనే "అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్" అనుచోట 'జాత్యాఖ్యాయామేకవచనం' ఇత్యాది వ్యాకరణానుశాసనమెరుగనివారి కట్టి వెనుకటి బహువచనానుగతగు నేకవచనము యొక్క ఔచిత్యమెట్లు తెలియనగును? వ్యాకృతి పవిత్రులు కానివారికి అచట అపవిత్రతయే కన్పడును "పైత్యదోషోదయంబున ఒరుసనైన జిహ్వకును బంచదారయు చేదుకాదె?"

ఇట్లు సర్వవిద్యా మూలమగు వ్యాకృతి విజ్ఞానముతో సుసంస్కృతమగు వేదాన్త విజ్ఞానము కల జ్ఞానేన్ద్రభిక్షువునుండి సకలబ్రహ్మవిద్యమ–సకల విద్యా మూర్ధన్యమును, స్వీకరించెను. ఎవరు? పేరుభట్టు– పండితరాజు తండ్రి. కాణాదీః- వైశేషిక శాస్త్రమును, అక్షపాదీః– న్యాయశాస్త్రమును అతిగహనవచనములైనను మహేన్ద్రుడను గురువునుండి నేర్చెను పార్థసారథి మిశ్రుని తరువాత నింతటివాడు లేడనిపించుకొను శస్త్రత్రయమువంటి గ్రన్థత్రయమును– భట్టదీపిక, భాట్టరహస్య, మీమాంసాకౌస్తుభములను రచించిన శ్రీఖండదేవునుండియు జైమినీయ శాసనమును- పూర్వమీమాంసా శాస్త్రమును, కాశిలో అధ్యయనించెను. అంతేకాదు. శేషాంక ప్రాప్తశేషామల ఫణితి– అనగా శేషము వీరేశ్వరశాస్త్రిగారిను డి వ్యాకరణమును నేర్చెను. ఇట్లు సర్వవిద్యా మూలమైన వ్యాకరణము నేర్చెను గనుక సర్వవిద్యాధరుడయ్యెను. ఇంత మాత్రమేనా? పాషాణమువంటి అనగా పట్టిమొద్దు కఠినుడైన జగన్నాథునుండి అమృతమైన పీయూషలహరి వంటి కవితాధారను అవలీలగా ప్రవహింప జేసినాడు. అతడు పేరు భట్టు. మహాగురువు కాడా మన జగన్నాథునకు? ఆ విద్యలన్నియు తనకు గరతలామలకములని యిందువల్ల వ్యంగ్యపరచినాడు.

ఇకనితడా విద్యలలో దనవైదుష్యము నెట్లు వెలువరించెనో మనము తెలియవలసియున్నది. వెనుక జెప్పినట్లుగా భట్టోజీ గ్రంథాలపై జ్ఞానేన్ద్రభిక్షువు ప్రయత్నమాగి పోవుటవలన మన పండితుడు తాను స్వయముగా 'ప్రౌఢమనోరమాకుచమర్దన' మను గ్రంథమును రచించెను భట్టోజీ రచించిన ప్రౌఢమనోరమకు ఖండన మీ గ్రంథము. ఇందులో "హకారాదిష్వకార ఉచ్చారణార్థః" అను మనోరమావాక్యమును పండితోపహాసనీయమని ఖండించెను. పండితుడు ఈ గ్రన్థము మొదట నిట్లు ప్రతిజ్ఞ చేసెను:

"లక్ష్మీకాన్తపదామ్భోజమానమ్య శ్రేయసాం పదం
పండితేన్ద్రో జగన్నాథః స్యతి గర్వం గురుద్రుహామ్"

లక్ష్మీకాన్తుడు శ్రీమన్నారాయణుడు తన తండ్రి లక్ష్మి మగడు పేరు భట్టు. వీరికి మ్రొక్కి గురుద్రోహియగు భట్టోజీ గర్వము నడచెద ననెను. "తత్ర తావత్సార్వధాతుకమపిత్ ఇతి సూత్రగత కౌస్తుభే ..ఇత్యాదినా సంఖ్యావద్భిరుపహాసనీయమర్థం నిరూపయతాం, తథా అణుదిత్సూత్ర గత కౌస్తుభే... ఇత్యర్థస్య నిర్ణయేన విలక్షణస్వస్యోత్పత్తిపాటనముద్గిరతాం, 'భవతే' ఇతి సూత్రగతమనోరమాయాం శపః ప్రవృత్తిం సమర్థయమానానాం గురుద్వేష దూషితమతీనాం పురుషాయుషేణాపి న శక్యన్తేగణయితుం ప్రమాదాః; తథాపి దిఙ్మాత్రేణ కానపి కుశాగ్రీయధిషణేషు నిరూపయామః ('సార్వ ధాతుకమపిత్' అను సూత్రపు కౌస్తుభములో (భట్టోజీ గ్రన్థములో) పండితులుపహాసింప దగినట్లు అర్థము వ్రాసెను. అణుదిత్సూత్ర కౌస్తుభములో నర్థనిర్ణయమొనర్చి తన తెలివితేటలను బైటవేసుకొనెను 'భవతే' అను సూత్రపు మనోరమలో 'శప్' ప్రవర్తించునని సమర్థించెను ఇట్టి యితని పొరపాటులు లెక్కవేయుచో నూరేండ్లకైనను తరుగవు ఇవన్నియు గురుద్వేషముతో నేర్పడినవే. బుద్ధిమన్తుల యెదుట యెన్నని రూపింతుము ?) అన్నాడు.

ఇతని సర్వశాస్త్ర పాండిత్యమును కవితావైదగ్ధ్యమును చక్కగా నిరూపించగలది ఇతడు రచించిన రసగంగాధరము. అందితని పరిశ్రమము బాగుగా వ్యక్తపడును. అచట నితని మాట యిది.

"నిమగ్నేన క్లేశైర్మననజలధేరన్తరుదరం
మయోన్నీతో లోకే లలితరసగంగాధరమణిః.
హరన్నన్తర్ధ్వాన్తం హృదయమధిరూఢో గుణవతా.
మలంకారాన్సర్వానపి గళితగర్వాన్ రచయతు"

(సముద్రములోపలి మణులను వెదకి పైకితీసుకొని వచ్చుటకెంత శ్రమ పడవలెనో అంతటి పరిశ్రమతో మననమొనర్చి యీ రసగంగాధరమను మణిని పైకి తెస్తిని. ఇది గుణవన్తులగు వారి హృదయమునకెక్కి అలంకారము లన్నిటిగర్వము పోగొట్టుగాక).

ఇందులో నీతడు తనకు గల సకలశాస్త్ర పాండిత్యమును నానాముఖముల వ్యక్తపరచెను. ఇదివరలో వ్యాకరణశాస్త్రపు పాండిత్యమును గొంత

జూపితిమి కాని అం దితనికి గల ప్రత్యేకవ్యక్తిత్వము జూపు స్థలములనేకము లున్నవి. అందొకటి నిరూపింతుము.

“లింపతీవ తమోఽంగాని” అను మృచ్ఛకటిక శ్లోక వాక్యము నుత్ప్రేక్షాలంకారముకడ విచారించెను.

“అనుకూల వ్యాపారాత్మకస్య కర్తృత్వస్యైవ ఆఖ్యాతార్థత్వాత్ తస్య చ ప్రథమాన్తార్థే విశేష్యే ఆశ్రయతా సంసర్గేణాన్వయాత్ న దోషః’ ఇత్యాది గ్రంథము ఆఖ్యాతమునకు ఫలనిష్పాదనానుకూల వ్యాపారమే అర్థము అది ప్రథమాన్తార్థమగు విశేష్యముకం దాశ్రయతాసంబంధముతో నన్వయించును కనుక దోషము రాదు ‘భావప్రధానమాఖ్యాతం’ అను యాస్కుని వాక్యమునకు భావవాచకమాఖ్యాతమనియేయర్థమనటను “సత్త్వప్రధానాని నామాని” అను తరుదాతి వాక్యమున ప్రధానపదము వాచకము అనే అర్థములో కన్పడుచున్నది కదా! అని నిర్ణయించి ధాత్వర్థ ముఖ్యవిశేష్యక శాబ్దబోధను వైయాకరణుల మతమును నిరాకరించెను. అలంకార శాస్త్రము స్వతంత్రముగనుక వైయాకరణమత మంగీకరింపకపోవుట దోషముకా దనెను. అంతేకాక భావమనగా భావనయని అర్థముచెప్పి మీమాంసామతమును కొంత కొంత స్వీకరించెను ప్రథమాన్తార్థముఖ్య విశేష్యకశాబ్దబోధతో తార్కికమత మవలంబించెను. ఇందువలన ‘ప్రకృత్యర్థః ప్రత్యయార్థే విశేషణం’ అన్న న్యాయము నిల్చినట్లగును. ఇందుమూలమున యాస్కాదులగు మహావైయాకరణుల మతమును నిరాకరింపనులేదు. నైయాయికుల ప్రథమాన్తార్థ ముఖ్య విశేష్యకబోధలో ఉద్దేశ్యవిధేయభావము సర్వానుభవసిద్ధమైనది సమకూడును గనుక దానిని చేపట్టెను. భావమనగా భావన యర్థమనుటవల్ల మీమాంసకుల-ఖండదేవాదుల మతము సమన్వయించెను. కాగా “వయం తు లక్ష్యసిద్ధౌ సిద్ధపరమతానువాదినః. నచైవమతిప్రసంగః;. లక్ష్యానుసారిత్వాన్న్యాయస్య ఏవమన్యాపి వ్యవస్థా ఊహ్యా” (మేము మాత్రము లక్ష్యసిద్ధిలో ఇదివరకు సిద్ధములైన మతములనే అనువదింతుము. న్యాయము లక్ష్యముల ననుసరించునదే కదా! కనుక నతిప్రసక్తి రాబోదు. ఇట్లే మరొక వ్యవస్థను గూడ నూహించుకొనవలెను.) అన్న ప్రాచీనాలంకారికవతంసుడగు శ్రీవామనాచార్యుని మార్గమునే ప్రమాణీకరించి అలంకార శాస్త్రము స్వతన్త్రితన్త్రమని స్థిరపరచెను:—

"న చ వైయాకరణమతవిరోధో దూషణమితి వాచ్యం ; స్వతన్త్రత్వే నాలంకారికతన్త్రస్య తద్విరోధస్యాదూషణత్వాత్." (వైయాకరణుల మతముతోడి విరోధము ఈ మతమునందు దోషముకాబోదు. ఇది స్వతన్త్ర శాస్త్రముకదా)

ఇట్లనేక శాస్త్ర మర్యాదలు సాహిత్యములో కార్యకారులగుట చేతనేమో ఈ శాస్త్రము సాహిత్య శాస్త్రమని పేర్పడినది.

"న తచ్ఛాస్త్రం న తచ్ఛిల్పం న సా విద్యా న సా కలా
జాయతే యన్న కావ్యాంగమహో భారో గురుః కవేః"
అనే ప్రమాణమును ఇందుకు తోడ్పడును.

మరొక విషయమున గూడ నితని పరిశ్రమను కొంతదెల్పి ఇతని ప్రధాన ప్రతిపాద్యమగు నలంకార శాస్త్రమునకు మరలుదము. యోగ శక్తి నుండియే అర్థము లభ్యము కాదు వ్యాపారాన్తరములనుండియు కూడ లభ్యమగును అది పరిగ్రాహ్యమే యను విషయములో "శబ్దాదేవ ప్రమితః" (౧-౩-౨౪) అను బ్రహ్మసూత్రము నుపన్యసించెను ఇది వేదాన్త విజ్ఞానమునకు ప్రబలమగు ప్రత్యక్ష సాక్ష్యమేకదా!

ఇక నీతని తార్కిక విజ్ఞానమును పరిశీలింతము. ఉత్ప్రేక్షాలంకార ప్రకరణమున ఆఖ్యాత వాదశిరోమణిమార్గమును ధాత్వర్థాన్వయ ప్రసక్తిలో నుపయోగింపదని నిరాకరించు ప్రౌఢిమను చక్కగా గమనింపవచ్చును.

ఇప్పటికి అవాన్తరశాస్త్రములలో నీతనికిగల వైదుష్యమును జూపితిమి ఇక నీతని స్వస్తమగు నలంకారశాస్త్రములో పాండిత్యమును గ్రహింతము.

అలంకార శాస్త్రములో మొట్టమొదటిది కావ్యము. గుణ, అలంకార రస, రీతి, వృత్తి. శయ్యాపాకములన్నింటికిని ముఖ్యమగు నాశ్రయమిదే కదా! కనుక నది ప్రధానము కూడాను అటువంటి కావ్యము విషయములో కడమయాలంకారికులందరును—కొందరు శబ్దార్థాలు కావ్యలక్షణమనీ, మరికొందరు గుణమయమగు విశిష్ట రచన-రీతి లక్షణమనీ, మరికొందరు అలంకారము కావ్యలక్షణమనీ, ఇంక కొందరు వ్యంగ్యము లక్షణమనీ, మరియింక కొందరు రసము కావ్యలక్షణమనీ, వేరే యొకరు ఔచిత్యమనీ- ఇట్లు ఏవేవో

తలాతోకా లేని ప్రసంగాలు చేశారు. వారందరి లక్షణాలు అవ్యాప్తాలు, అతివ్యాప్తాలు అసమగ్రాలు, కొన్ని కేవలంగా అనుచితాలు కూడాను. ఇలా ఉండే దశలో అందరి అన్ని లక్షణాలనూ సంగ్రహించినాడు. దోషములు తొలగేటట్లు సంస్కరించినాడు. చమత్కారమే కావ్యలక్షణమని నిష్కర్షించినాడు.

"స్వవిశిష్ట జనకతావచ్ఛేదకార్థ ప్రతిపాదకతా సంసర్గేణ చమత్కారిత్వవత్త్వం" అని చాల చమత్కారముగా కావ్యప్రపంచమంతయును లక్షింపబడినది. ఈ లక్షణము పండితరాజు ప్రతిభోద్గీర్ణము. సమగ్రము, వాస్తవము, నిర్దోషము కూడాను. ఇంత చక్కని చిన్న లక్షణమును నిర్మించిన మరొక యాలంకారికుడేడీ?

ఇట్లే ఉత్తమ, మధ్యమ, అధమములుగా మూడు రకములుగానే కావ్యముల నితరులు విభజించిరి. కాని "ద్విత్రాః పంచషా వా మహాకవయః ద్విత్రాణి పంచషాణి వా మహాకావ్యాని" అన్న ప్రామాణిక వాక్యముల ననుసరించి ఉత్తమోత్తమమను కావ్య విభాగమును నూతనముగా లక్ష్యముల ననుసరించి యాతడు ప్రతిపాదించెను. దానికి లక్ష్యమును గూడ తానే నిర్మించి తన సిద్ధాంతమును స్థిరపరచెను

ఇక రసతత్త్వ విచారములో జాలమంది తత్త్వమును గుర్తింపలేకయు, కావ్యములందు రసప్రసక్తి లేకయు గూడ తప్పటడుగుల వైచిరి చాలమంది యాలంకారికులు దశరూపకకారాదులు రత్యాదులగు స్థాయిభావములే రసములగునసిరి. ఇది చాల అనాలోచితమగు ప్రసంగము. ఏమంటే రత్యాదులగు భావములు జడమగు నన్తఃకరణపు వృత్తులు, రసము పరిశుద్ధమగు బ్రహ్మచైతన్యైకరూపము. జడము చైతన్యముగాని చైతన్యము జడము కానీ ఎన్నడును కాదనుట సకల లోకవిదితము. కనుక రత్యాదికమగు భావము జడము చైతన్యైకనాడియగు రసమెట్లు కాగల్గును కనుక "వస్తుతస్తు భగ్నావరణా, రత్యాద్యవచ్ఛిన్నా చిదేవ రసః" యథార్థమునకు ఆవరణముతొలగి రత్యాధిభావ శబలితమగు చైతన్యమే రసము అని సిద్ధాన్తమును ప్రతిపాదించెను. ఇందు కుపోద్బలకమేమి? "రసో వై సః, రసం హ్యేవాయం లబ్ధ్వాఽఽనన్దీభవతి" అను శ్రుతి ఇదివరకు లేదా? ఉన్నది. కాని దాని నిట్లు తరచి సమన్వయించి సారమును పైకి వెలువరించినవారేరి?

ఇట్లే గుణాదుల విషయమునగూడ నిదివరలో నీతనివలె చక్కగా సమాలోచన మొనర్చినవారు లేరు

ఇక అభిధాది శబ్దవృత్తులవిషయములో "శక్త్యా ప్రతిపాదకత్వమభిధా" యను నప్పదీక్షితు నభిధావృత్తిలక్షణమును శక్త్యభిన్న ప్రతిపాదకత్వమను నర్థముతో ఆత్మాశ్రయత్వ దోషముచే దుష్టమని ఖండించెను ఇట నొక యథాజాతుడు "ప్రకృత్యాదిభ్య ఉపసంఖ్యానం", అనునది రక్షకమని దానిచాటున దాక్కొన్నాడు. కాని అభేదమున దృతీయ యెచ్చటను విధింపబడలేదు. ఇటువంటి చోటుల "ప్రకృత్యా చారుః" ఇత్యాదులందు ప్రకృతి ప్రయోజ్యమగు చారుత్వము కలవాడర్థమని భాట్టరహస్యము నిష్కర్షించినది. అభేదమున తృతీయను విధించు నమశాసనము లేదని యీయథాజాతు డెరుగడు కనుక ఖల్వాటతాళఫలన్యాయమే సమకూడిన దతనికి. సరి పోనిండు. దీనివలన నప్పయ దీక్షితుని వృత్తి వార్తికముతోబాటు ఇతని తెలివియు వెల్లడైనది.

ఇతని విచారము సర్వత్ర శాస్త్రానుమతమై యుక్త్యనుగతమై యుండును ఇతడొనర్చిన ఉపమాలంకారపు విచారమును పరీక్షింతము.

అప్పయ దీక్షితుడు "ఉపమితి క్రియానిష్పత్తిమత్సాదృశ్య మదుష్టమవ్యంగ్యముపమాలంకారః" (పోల్చుటను సిద్ధింపజేయు సామ్యవర్ణనము దోషములు లేక వ్యంగ్యము కానిచో నుపమాలంకారము) అని లక్షణమును చెప్పెను దీని నిట్లు పండితుడు ఖండించెను

ఉపమా అర్థాలంకారః అతఏవ శబ్ద వాచ్యతా అపేక్షితా। వర్ణనస్య యద్యలంకారత్వం తర్హి స్వయం శబ్దరూపం వర్ణనం కథం శబ్దవాచ్యం స్యాత్. అవ్యంగ్యత్వాది పదదానమపి వ్యర్థమ్ వ్యంగ్యత్వాలంకారత్వయోర విరోధాత్.

(ఉపమ అర్థాలంకారము కనుకనే దానిని శబ్దము చెప్పవలె ననుట. ఇప్పుడు వర్ణనమే అలంకారమను టెట్లు పొసగును? వర్ణనము స్వయముగా శబ్దాత్మక మేకదా! అది శబ్దమున జెప్పబడు టెట్లు? వ్యంగ్యము కారాదు ఇత్యాదికమును తగదు; వ్యంగ్యమగుటయు నలంకారమగుటయు విరుద్ధములు కావు కదా!)

ఇక ప్రతాపరుద్రీయములోని విద్యానాథుని లక్షణమును జూతము.

"స్వతస్సిద్ధేన భిన్నేన సమ్మతేన చ ధర్మతః
సామ్యమన్యేన వర్ణ్యస్య వాచ్యం చేదేకదోపమా"

(సహజసిద్ధమై, ఉపమానముకన్న వేరై, సమాన ధర్మముతో సమ్మతమైన మరొకదానితో వర్ణ్యమునకు సామ్యము వర్ణింపబడుచో నుపమ) అని. ఇదియు దప్పే. ఏమి? వ్యతిరేకాలంకారమున "సామ్యము నిషేధములో బర్యవసించుచోట గూడ నీ లక్షణముండును కదా!

"ఇక సాధర్మ్యముపమాభేదే" (భేదముండు సామ్యముపమ) అన్న మమ్మటుని లక్షణములోగూడ నీదోషమే— వ్యతిరేకమున నతివ్యాప్తియే.

"ఉపమానోపమేయత్వయోగ్యయోరర్థయోః ద్వయోః
హృద్యం సాధర్మ్యముపమేత్యుచ్యతే కావ్యవేదిభిః"

ఉపమానమగుటకు నుపమేయమగుటకు దగిన రెండువస్తువులకు గల హృద్య సామ్య ముపమ యని కావ్యవేత్తలందురు అను ప్రాచీనుల లక్షణములో హృద్యత్వముదప్ప మిగిలినదంతయు వ్యర్థమే నదబడినది.

అలంకారసర్వస్వకారుడు "భేదాభేదతుల్యత్వే సాధర్మ్యముపమా." భేదాభేదములు సమానముగా నుండునప్పటి సామ్య ముపమ యనుటయు బనికిరాదు. ఏమనగా ఉపమకు సామాన్యలక్షణమగు దీనిలో 'వ్యంగ్యము, వాచ్యము, లౌకికము, అలౌకికమునగు నుపమాలంకారమంతయు సంగ్రహింపబడవలయును గదా! ఆ యుపమలేవియు బ్రసక్తించనట్లున్న లక్షణ ముపమలన్నింటి నెట్లు పరిచయమొనర్పగలదు? ఈ దోషము మమ్మటుని లక్షణమునందును దగులును. ఈ సర్వస్వకారుని మించవలెనని అలంకారరత్నాకరకారుడు "ప్రసిద్ధ గుణమగు నుపమానముతో నప్రసిద్ధ గుణమగు నుపమేయమునకు జెప్పు సామ్య ముపమ"యని లక్షించినాడు కాని అది శ్లేషమూలకమగు నుపమలో నవ్యాప్తమైనది. అచట సమాన ధర్మము అప్పటికప్పుడు కవి శ్లేషమూలకముగ గన్పించినదే కాని ఇదివరలో ప్రసిద్ధమైనది కాదు గదా!

ఈ తీరున కదమ యుపమా లక్షణముల నిరాకరించి "చమత్కృత్యాధాయకం వాక్యార్థోపస్కారకం సాదృశ్యముపమా" (చమత్కృతిని

గూర్చి వాక్యార్థము నలంకరించునట్టి సాదృశ్య ముపను' యని లక్షించెను. అన్ని రకవు టుపమలును చమత్కృతిని గూర్చునవే కనుక సర్వోపమాసంగ్రహము. ఉపమయే చమత్కృతిని గూర్చునది కావున వ్యతిరేకము ప్రసక్తింపదు. ఇట్టి లక్షణములో నవ్యాప్తిగాని అతి వ్యాప్తిగానీ ప్రసక్తింపక చమత్కృతిని గూర్చునదియని స్వరూపము సమన్వయించిన యిది సులక్షణమే కదా!

ఇట్లు లక్షణ పరిష్కార పాండిత్యమే కాక లక్ష్య ప్రదర్శనవైదగ్ధ్యము కూడ నెంతయో బాగుగా నున్నది. ఈ యుపమలో ప్రాచీనులు నిరూపించిన ప్రకారములన్నియు ప్రదర్శించుటయేకాక 'మరికొందరు మరికొన్ని భేదముల బ్రదర్శింతురనుచు ముప్పదిరెండు రకములుగా నుపమను బ్రదర్శించెను. ఈ ముప్పదిరెండు భేదముల యుపమకూడ వస్తువు, అలంకారము రసములను వ్యంగ్యములు మూటికిని వాచ్యములగు వస్త్వలంకారములకునుగూడ నలంకారమగును అని తిరిగి యుపస్కార్యములగు నాయయిదింటినిబట్టి ప్రసరించి యీ ముప్పదిరెండు భేదముల యుపమయు నూటయిరువది భేదములుగా దెల్పెను.

ఇంతటితో నీ పండితునకు దృప్తిదీరలేదు. "ఇంకను బుద్ధిమంతులీ యుపమలో భేదములనూహింపవలెను. ఒక యెడ ధర్మము బింబ ప్రతిబింబ భావముతోను, మరొకయెడ అనుగామిగాను, ఇంకొకచోట రెండురూపముల తోను, మరింకొకచోట వస్తు ప్రతివస్తుభావముతో గల్పబడిన బింబ ప్రతిబింబ భావము నొందును. ఒక్కొక్కచోట నుపచార పురస్కారముండును. ఇంకొక్కచోట కేవల శబ్దైకరూపము. ఈ తీరులతో నుపమాప్రాణమగు సాధర్మ్యమును సూక్ష్మాతి సూక్ష్మరూపములతో బ్రదర్శించెను. ఇట్లింతటి గహనాతి గహనమైన యుపమా విచార మొనర్చిన మొనగాడేడి?

ఇప్పటికిని నతనికి పరితుష్టికలుగలేదు. ఈ యన్నింటికన్న నెక్కువైన మరొక ప్రకారమును నిరూపించడానికి లక్ష్యమును తానే స్వయముగా ప్రదర్శించెను.

"యథా లతాయాస్తబకానతాయాః స్తనావనమ్రే నితరాం సమాసి
తథా లతా పల్లవినీ సగర్వే శోణాధరాయా స్సదృశీ తవాపి"

(పూలగుత్తులతో గొంచెము వంగిన తీగెకు స్తనములతో నొకింత వంగిన నీవెట్లు సరిపోయితివో అట్లే ఎఱ్ఱని పెదవితో, గర్వించిన యోవనితా! చివురులతో నిండిన తీగెయు నీకు సరితూగినది.)

ఇట చమత్కారమును గమనించండి. ఈ శ్లోకములో మూడుపమలున్నవి. అందులో నొకటి, యథా తథా అనీ, సదృశీ సమా అనీ చెప్పబడునది ప్రధానమగు నుపమ. మిగిలిన రెండుపమలు నీయుపమను పోషించునవి సమాన ధర్మములుగా. ఇదివరలోనున్న యుపమలందు గుణమో క్రియయో మరేదో సమాన ధర్మముగా నుండుచున్నది. ప్రకృతములో నుపమయే సమాన ధర్మముగా నున్నది. ఇది యీ యలంకారములో నింతవర కెవ్వరును గనిపెట్టని ప్రార్శించని యొక వైచిత్ర్యము.

'శిరోమణి'

వేదాల తిరువెంగళాచార్యులు

# విషయానుక్రమణిక

| విషయములు | పుట |
|---|---|

శ్రీః

# రసగఙ్గాధరః

## ద్వితీయమాననమ్

### సంలక్ష్య క్రమధ్వని నిరూపణమ్

అథ సంలక్ష్యక్రమధ్వనిర్నిరూప్యతే. స చ తావద్ద్వివిధః, శబ్దశక్తిమూలోఽర్థశక్తిమూలశ్చ. తత్రాద్యో ద్వివిధః, వ్యఙ్గ్యస్య వస్త్వలఙ్కారతాభ్యాం ద్వైవిధ్యాత్. ద్వితీయోఽపి వస్త్వలఙ్కారాత్మనా లోకసిద్ధేన, తథాభూతేనైవ ప్రతిభామాత్రనిర్వర్తితేన చ వ్యఞ్జకేనార్థేన చతుర్విధేన వస్త్వలఙ్కారాత్మనో ద్వివిధస్య వ్యఙ్గ్యస్య ప్రత్యేకం వ్యఞ్జనాదష్టమూర్తిః.

ఇక సంలక్ష్యక్రమ వ్యంగ్య ధ్వనిని నిరూపింతుము. ఇదియంతయు రెండు విధములు. 1. శబ్దశక్తిమూలకము. 2. అర్థశక్తిమూలకము, అని.

మొదటిది రెండురకములు. దీనినుండి వ్యంగ్య మగునది వస్తువనియు, అలంకారమనియు రెండువిధములు కనుక.

ఇక రెండవదానిలో వ్యంజకమగు నర్థము నాల్గు రకములు. వ్యంగ్య మగు నర్థము రెండువిధములు. కాగా – ఎనిమిదిరకములు.

అదెట్లనగా వ్యంజకమగునర్థము వస్తువు, అలంకారమని, రెండురకము లును లోకసిద్ధమైనవి, కవిప్రతిభాబలమున నేర్పడినవి, అనురెండువిధములతో నాల్గురకములగును. ఈ నాల్గురకముల అర్థమును, వస్తువును, అలంకారమును ప్రత్యేకముగా వ్యంగ్యమొనర్చును. ఇట్లిది యెన్మిది రకములగును.

ప్రతిభానిర్వర్తితత్వావిశేషాచ్చ కవితదున్మీలితవక్తృప్రౌఢోక్తినిష్పన్నయోరర్థయోర్న పృథగ్భావేన గణనోచితా; ఉన్మీలితోన్మీలితాదేరపి భేదాన్తరప్రయోజకతాపత్తేః, న చ తస్యాపి కవ్యున్మీలితత్వానపాయాత్ తత్ప్రయోజ్యభేదాన్తర్గతత్వమేవేతి వాచ్యమ్; ప్రథమోన్మీలితస్యాపి లోకోత్తరవర్ణనానిపుణత్వలక్షణ కవిత్వానపాయాత్

పృథగ్భేదప్రయోజకతానుపపత్తేః. ఏవం సాకల్యేన దశభేదోఽయమ్.

ఈ ప్రతిభాబల నిష్పన్నమగు నర్థము విషయములో కొందరు కవి ప్రతిభాబలమనియు, కవినిబద్ధుడగు వక్తయొక్క ప్రతిభాబలమనియు విభాగమేర్పరుపజూతురు గాని అది తగదు.

కవినిబద్ధవక్త ప్రతిభాబలమును వేరుగా గణించినట్లే కవినిబద్ధవక్తచే నిబద్ధుడగువాని ప్రతిభాబలమునుగూడ వేరుగా గణింపవలసిరాదా? ఈ యన్నియర్థములును కవిప్రతిభాబలమున నేర్పడినవే.

అనగా ప్రౌఢోక్తియంతయు కవికూర్చినదేగాని వేఱుగా నచట నేమియు లేదుగదా? ఈ వేఱుగా గణింపబడిన ప్రతిభయంతయు కవియొక్క నిదేగదా!

అటుగాక వక్తనుబట్టి భేదము గణింపబోవుచో కవినిబద్ధుడగు వక్తచే నిబద్ధుడగు వక్తను బట్టియు భేదము గణింపబడవలసి యుండునుగదా! ఈ వక్తృభేదము అంగీకరించుచో తన్నిబద్ధుని బట్టియు భేదము గణనకు వచ్చును. చివరకనవస్థ తప్పదు. ఈ వక్తలందరు కవినిబద్ధులే కనుక, కవి నిబద్ధనిబద్ధాదులనుబట్టి భేదము గణింపనక్కరలేదందురా? అట్లగుచో మొట్ట నిబద్ధుడగు వక్తయందుగూడ లోకోత్తరవర్ణనానిపుణత్వమును కవిస్వము తొలగదు కనుక వేరుగా నతనిబట్టియు భేదము గణింప నక్కరలేదు. కాగా ఈ ధ్వని సమగ్రముగా పదిరకములు.

అత్ర కేచిదాహుః - నానార్థస్య శబ్దస్య సర్వేష్వర్థేషు సఙ్కేతగ్రహస్య తుల్యత్వాచ్ఛ్రుతమాత్ర ఏవ తస్మిన్ సకలానామర్థానాముపస్థితౌ, శబ్దస్యాస్య కస్మిన్నర్థే తాత్పర్యమితి సన్దేహే చ సతి ప్రకరణాదికం తాత్పర్యనిర్ణాయకం పర్యాలోచయతః పురుషస్య సతి తన్నిర్ణయే, తదాత్మకపదజ్ఞానజాయా ఏకార్థమాత్ర విషయాయాః పునః పదార్థోపస్థితేరనన్తరమన్వయబోధ ఇతి నయే ద్వితీయాయాః పదార్థోపస్థితేః ప్రాథమిక్యా ఇవ న కుతో నానార్థగోచరతేతి ప్రకరణాదిజ్ఞానస్య తదధీనతాత్పర్యనిర్ణయస్య వా పదార్థోపస్థితౌ ప్రతిబన్ధకత్వం వాచ్యమ్, అన్యథా శాబ్దబుద్ధేరపి నానార్థవిషయత్వా

ప్రత్తిః. అత ఏవోక్తం - "అనవచ్ఛేదే విశేషస్మృతిహేతవః" ఇతి. అనవచ్ఛేదే - తాత్పర్య సన్దేహే; విశేషస్మృతిః-ఏకార్థమాత్ర విషయా స్మృతిః. ఇత్థఞ్చ 'సురభిమాంసం భక్షయతి' ఇత్యాదేర్వాక్యాజ్జాయమానా ద్వితీయా ప్రతీతిర్గవాద్యుపస్థితేరభావాత్ కథం స్యాదితి తదుపస్థిత్యర్థం వ్యఞ్జనావ్యాపారోఽభ్యుపేయః.

ఆధ్వనివిషయమున కొంద రిట్లందురు. నానార్థకమగు శబ్దముయొక్క అన్ని యర్థములందును సంకేతమును గ్రహించుట సమానమే కనుక ఆ పదమును విన్నంతమాత్రముననే దానియర్థములన్నియు ఉపస్థితములగును. అపుడే శబ్దమునకు నేయర్థమున తాత్పర్యమని సంశయమును గల్గును. తాత్పర్యమును నిర్ణయించు ప్రకరణాదికమును పర్యాలోచింపగా నిర్ణయమేర్పడును. అపుడు తదాత్మక పదజ్ఞానము తాత్పర్యజ్ఞానాత్మకమగును. దానినుండి ఒక్కయర్థమే తిరిగి యుపస్థితమగును. అటువైన పదార్థముల కన్వయబోధయేర్పడును-అనునది పద్ధతి. ఇందులో రెండవపదార్థపుటుపస్థితి మొదటిదానివలెనే నానార్థక పదమునకు గోచరమేలకారాదు? కనుక ప్రకరణాదుల జ్ఞానముగానీ, అందువలన నేర్పడు తాత్పర్య నిర్ణయముగానీ రెండవసారి పదార్థోపస్థితిలో ప్రతిబంధకమగుట న్యాయము. ఇట్లు కానిచో శాబ్దబుద్ధిలోగూడ నానార్థములు కావలసి వచ్చును. ఇందుచేతనే "నిర్ణయము కలుగనపుడు విశేషమును జ్ఞప్తికి తెచ్చుటకు హేతువులు" అనిరి.

నిర్ణయము గలుగనపుడు, తాత్పర్యపు సంశయము కలిగినపుడు "విశేషస్మృతి" ఒకే యర్థమును గూర్చిన స్మరణమును గల్గించుటలో. కాగా- "సురభి మాంసమును దినుచున్నాడు—" అను నీరకపుమాటనుండి కలుగుచున్న రెండవప్రతీతి యెట్లు గల్గును? గవాదు లుపస్థితములు గావు కదా? కనుక నాయుపస్థితికై వ్యంజనా వ్యాపారము నొప్పి తీరవలెను.

అథైకయా శక్త్యా ప్రాకరణికార్థోపస్థితేరనన్తరం ద్వితీయయా శక్త్యా ద్వితీయార్థోపస్థితిస్తథాపి స్యాదితి చేత్-న స్యాదేవ, ప్రకరణాదిజ్ఞానస్య ప్రతిబన్ధకస్యానుపరమాత్. అన్యథా ప్రాకరణికార్థోపస్థితావేవాప్రాకరణికస్యాప్యర్థస్య విషయత్వం స్యాత్.

అయితే - (శబ్దమున కనేక శక్తులున్నవి గనుక) ఒక శక్తితో

ప్రాకరణికమర్థ ముపస్థితముకాగా, రెండవశక్తితో, రెండవయర్థపుటుపస్థితి- అశైననగును కదా? అని యందురా? కావచ్చును. కాని, ప్రకరణాది జ్ఞానము అడ్డుగా నిలచియే యున్నదిగదా? అట్లుగానిచో ప్రకృతార్థపు టుపస్థితిలోనే అప్రకృతార్థమును గోచరము కావలసివచ్చును.

న చ ప్రకరణాదిజ్ఞానస్య తాదృశపదజన్యార్థోపస్థితి సామాన్య ఏవ ప్రతిబన్ధకత్వాద్వ్యక్త్యాపి కథ మర్థాన్తరోపస్థితిరితి వాచ్యమ్; ధర్మిగ్రాహకమానేనాప్రాకరణికోపస్థాపకతయైవ తాదృశవ్యక్తేరుల్లాసా త్తదజన్యోపస్థితిం ప్రత్యేవ ప్రకరణాది జ్ఞానస్య ప్రతిబన్ధకత్వ కల్పనాత్. వ్యక్తిజ్ఞానస్యోత్తేజకత్వకల్పనాద్వా. ఏతదేవ సర్వమభిసన్ధాయోక్తమ్:—

"అనేకార్థస్య శబ్దస్య వాచకత్వే నియన్త్రితే
సంయోగాద్యైరవాచ్యార్థధీకృద్వ్యాపృతి రఞ్జనమ్."

యన్త్రిణమపరార్థోపస్థాపనప్రతిబన్ధ ఇతి.

అట్లుగాదు; ప్రకరణాదుల జ్ఞానము అట్టి (నానార్థక) పదములనుండి కలుగు పదార్థోపస్థితిసామాన్యమునే ప్రతిబంధించును కనుక వ్యంజనచేత మాత్రము అర్థాంతరమెట్లుపస్థితమగును? అని యాశంకింతురా? ధర్మిగ్రాహక ప్రమాణము వ్యంజనను గ్రహింపజేయు ప్రమాణము-దానిని (వ్యంజనను) అప్రకరణపతితములగు పదార్థములను జ్ఞప్తికి దెచ్చుదానినిగానే వెలయించుచున్నది. కనుక ప్రకరణాదులట ప్రతిబంధము నొనరింపలేవు. కనుక వ్యంజనేతరములనుండి కలుగు నుపస్థితులందే అవి (ప్రకరణాదులు) ప్రతిబంధకములు అని కల్పింతుము.

అథవా- వ్యంజనాజ్ఞాన ముత్తేజకమనియైన గల్పింతుము, దీనిని సరిగా భావించియే "అర్థములనేకములుగా కలుగు శబ్దముయొక్క వాచకత్వము సంయోగాదులచే నియంత్రితమగునపుడు అవాచ్యార్థమును తెలుపునట్టి వ్యాపారమే వ్యంజన," అని యనుట.

నియంత్రణమనగా మఱియొక యర్థము నుపస్థాపించుట కడ్డముగ నిల్చుట.

అపరేత్వాహుః — నానార్థశబ్దజశాబ్దబుద్ధౌ తాత్పర్యనిర్ణయ హేతుతాయా అవశ్యకల్ప్యత్వాత్ ప్రథమం నానార్థశబ్దాదనేకార్థోప స్థాపనేఽపి ప్రకరణాదిభిస్తాత్పర్యనిర్ణయహేతుభిరుత్పాదితే తస్మిన్ యత్ర తాత్పర్య నిర్ణయస్తస్యైవార్థస్యాన్వయబుద్ధిర్జాయతే, నాన్య స్యేతి సరణావాశ్రీయమాణాయాం నైకమాత్రగోచరస్మృత్యపేక్షా, నాప్యపరార్థోపస్థానప్రతిబన్ధకత్వకల్పనమ్. ఏవఞ్చ ప్రాగుపదర్శిత నానార్థస్థలే ప్రకరణాదిజ్ఞానాధీనాత్తాత్పర్యనిర్ణయాత్ప్రాకరణికార్థ శాబ్దబుద్ధౌ జాతాయామతాత్పర్య విషయాఽపి శాబ్దబుద్ధిస్తస్మాదేవ శబ్దాజ్జాయమానా కస్య వ్యాపారస్య సాధ్యతామవలమ్బతామ్, ఋతే వ్యఞ్జనాత్.

మరికొందరిట్లందురు: నానార్థబోధకమైన శబ్దమునుండి గల్గు శాబ్ద బోధకు హేతువుగా దాత్పర్య నిర్ణయము నవశ్యము కల్పింపవలెను, కనుక మొదట నానార్థమగు పదమునుండి అర్థములనేకము లుపస్థితములైనను తాత్ప ర్యమును నిర్ణయించుటలో సాధనములగు ప్రకరణాదులనుండి అది నిర్ణయ మగును, కనుక ఏయర్థమునందు తాత్పర్యము నిర్ణయమగునో నాయర్థము నందే అన్వయబోధగలుగును తదితరమునకు గాదు, ఇది అసలుత్రోవ. దీని ననుసరించినపుడు ఒకేయర్థము గోచరించు స్మృతి నపేక్షింపబనిలేదు. మఱి యొక యర్థముపస్థితముగాకుండజేయు ప్రతిబంధకమును గల్పింపవలసియు రాదు, కాగా వెనుకటి నానార్థక స్థలములో దాత్పర్యము ప్రకరణాదులకు లోబడియే నిర్ణయమగును, దీనినుండి ప్రాకరణికమగు నర్థపు శాబ్దబుద్ధి కలిగిన పిమ్మట తాత్పర్యవిషయము కాని శాబ్దబుద్ధియు కల్గుచున్నది కదా? అది వ్యంజనవలనకాక మరిదేనివలన గల్గును? (అదివ్యంజనా వ్యాపారముననే సాధ్యముగాని మరియొకదానికి కాదు).

న చ శక్తిసాధ్యా సేతి వాచ్యమ్; తదధీనబోధం ప్రతి తాత్పర్యనిర్ణయస్య హేతుత్వాత్. వ్యక్త్యధీనబోధస్తు నావశ్యం తాత్పర్యజ్ఞానమపేక్షతే.

ఔనీ — శక్తిసాధ్యమనరాదు, శక్తినుండి కల్గు బోధకు తాత్పర్య నిర్ణయము హేతువుకదా? (ఈ రెండవయర్థము తాత్పర్య గోచరముకాదని

ఇదివరకే తెల్పితిమి) వ్యంజన నుండి కలుగు బోధలోనది తాత్పర్యనిర్ణయము అవశ్యముగా నుండనక్కరలేదు.

నన్వేకమాత్రగోచరస్మృతే స్తచ్ఛాబ్దబుద్ధావనపేక్షితత్వే 'విశేష స్మృతిహేతవః' ఇతి ప్రాచాం గ్రన్థః కథం సఙ్గచ్ఛతే? కథం వా ప్రకరణాది జ్ఞానస్యాపరార్థోపస్థానప్రతిబన్ధకత్వవిరహే సంయోగాద్యైరనేకార్థస్య శబ్దస్య వాచకతాయా నియన్త్రిణోక్తిశ్చేతి చేత్? ఇత్థమ్ - స్మృతి శబ్దస్య నిశ్చయపరతయా విశేషస్మృతిశబ్దేన విశేషవిషయస్తాత్పర్యనిర్ణయో గృహ్యతే. సంయోగాద్యైర్వాచకతాయా నియన్త్రణం చైకార్థమాత్రవిషయకతాత్పర్యనిర్ణయ జనన ద్వారా శాబ్దబుద్ధావనుకూలత్వమ్. అవాచ్యార్థో-ఽతాత్పర్యార్థః. ఏవం చ న గ్రన్థాసంగతిరిత్యపి వదన్తి.

అయితే ఒకే యర్థమును గూర్చిన యుపస్థితి శాబ్దబుద్ధిలో నపేక్షింపబడనిచో 'విశేషమును జ్ఞప్తికి దెచ్చునట్టి హేతువులు' - అను ప్రాచీనుల గ్రంథమెట్లు పొసగును? అంతేగాక ప్రకరణాది జ్ఞానము అర్థాంతరము జ్ఞప్తికి వచ్చుటలో నడ్డముకానిచో "సంయోగాదులు" అనేకార్థముగు శబ్దముయొక్క వాచకత్వమును నియంత్రించును అనుటయెట్లు పొసగును? అనెదరా కుదిర్చెదము - వినుడు-విశేషమును జ్ఞప్తికి దెచ్చుటకు హేతువులు అనుచోట జ్ఞప్తిపదమునకు నిశ్చయము అర్థము. ఇక విశేషమును జ్ఞప్తికి దెచ్చుట యనగా విశేషమును గూర్చిన తాత్పర్య నిశ్చయమును గల్గించుట. ఇక సంయోగాదులు వాచకత్వమును నియంత్రించుట అనగా ఒకేయర్థమును మాత్రమే (కల్గించు) గోచరించు తాత్పర్య నిశ్చయమును కల్గించుటద్వారా శాబ్దబుద్ధికి తోడ్పడుట. అవాచ్యమగు నర్థమును = తాత్పర్య గోచరముకాని యర్థమును. ఈ తీరుగా ప్రాచీనుల గ్రంథము పొసగును; అసంగతిలేదు; అనియెదరు.

అథ ప్రాకరణికార్థబోధానన్తరం తాదృశపదజ్ఞానస్యాసరమాత్ కథం వ్యక్తివాదినాప్యర్థాన్తరధీః సూపపాదేతి చేత్? మైవమ్; ప్రథమార్థ ప్రతీతేర్వ్యాపారస్య సత్త్వాదదోష ఇత్యేకే, అర్థప్రతీతౌ శక్యతావచ్ఛేదకస్యేవ పదస్యాపి విశేషణతయా భానా

ప్రాథమికశక్యార్థబోధస్యైవ పదజ్ఞానత్వాదిత్యపరే. ఆవృత్త్యా పదజ్ఞానం సులభమిత్యపి కశ్చిత్. తదిత్థం నానార్థస్థలేఽనురణనీయం వ్యఞ్జనం శబ్దశక్తిమూలమ్, శబ్దస్య పరివృత్త్యసహత్వాదితి ధ్వని-కారానుయాయినో వర్ణయన్తి.

సరేకాని ప్రాకరణికమగు నర్థబోధ ఐనతర్వాత అట్టి (నానార్థక) పదపు జ్ఞానము నాగిపోయినదిగదా! ఇపుడు వ్యంజన ననుసరించినను అర్థాంతరజ్ఞాన మెట్లు గుదురును? మొదటియర్థప్రతీతి వ్యాపారముగా (ద్వారముగా) నట నున్నది కనుక దోషములేదని యొకరనెదరు. శక్యతా నిర్ణాయకమువలె=శక్యతను నిర్ణయించు ధర్మమువలె పదముకూడ అర్థ ప్రతీతిలో గోచరించును, కనుక మొదటి శక్యార్థ బోధయే పదజ్ఞానమగును కదా? అనిమరొకరు. ఆవృత్తియే అనుసరించినచో పదజ్ఞానము సులభముగానే లభించునని-యొకడు. ఇట్లు నానార్థస్థలములందు అనురణనక్రమమున నేర్పడు వ్యంజనము శబ్దశక్తిమూలము. అట శబ్దము పరివృత్తిని (మార్పిడిని) సహింపదుకదా! అని ధ్వనికారుని అనుయాయులు వర్ణింతురు.

అన్యేత్వత్ర ప్రత్యవతిష్ఠన్తే. యత్తావదుక్తమేకార్థమాత్రవిషయా పదార్థోపస్థితిస్తదన్వయబోధేఽపేక్ష్యత ఇతి తదసారమ్. నానార్థాదర్థద్వయోపస్థితావపి ప్రకరణాదిజ్ఞానాధీనతాత్పర్యమహిమ్నైవ వివక్షితార్థశాబ్దబోధోపపత్తేః, ఏకార్థమాత్రోపస్థిత్యపేక్షాయాం మానాభావాత్. అపరార్థోపస్థాపకసామగ్ర్యాః పదజ్ఞానస్య సత్త్వేన తదుపస్థితేరప్యౌచిత్యాచ్చ.

ఇతరులు మాత్రము ఈవిషయములో నెదిరింతురు. ఏకార్థమాత్ర విషయకమగు=ఒకయర్థమును మాత్రమే గోచరించు, శాబ్దబోధలో నట్టి పదార్థోపస్థితియే యపేక్షింపబడుననుటలో సారములేదు. నానార్థకమగు పదమునుండి రెండర్థములు జ్ఞప్తికివచ్చినను ప్రకరణాదులు దెలియుటవలన నేర్పడు తాత్పర్యపు మహిమలోనే వివక్షితములగు నర్థములను గూర్చిన శాబ్దబోధము కుదురును కనుక ఒక్కయర్థము మాత్రమే జ్ఞప్తికి రావలెనని యపేక్షించుటలో ప్రమాణములేదు. మఱియొక యర్థమును జ్ఞాపకముసేయు సామగ్రియైన పదజ్ఞానమున్నది కనుక ఆయర్థముగూడ జ్ఞప్తికివచ్చుట-యు నుచితమగును.

న చ ప్రకరణాది జ్ఞానం తదధీనతాత్పర్యజ్ఞానం వా నానార్థో పస్థాపనే ప్రతిబన్ధకమితి శక్యం వక్తుమ్. సంస్కార తదుద్బోధకయోః సత్త్వే స్మృతేః ప్రతిబన్ధస్య క్వాప్యదృష్టత్వాత్. అత్రైవ స్మృతావయం ప్రతిబధ్యప్రతిబన్ధకభావః కల్ప్యతే, న స్మృత్యన్తరే ఇత్యస్య హృదయఙ్గమమ్; తాదృశకల్పనాయా నిష్ఫలత్వాత్; అనుభవ విరుద్ధత్వాచ్చ.

ప్రకరణాదులు తెలియుటకాని దానినుండి కలుగుతాత్పర్యజ్ఞానము కాని, మరొకయర్థము జ్ఞప్తికి రాకుండచేయుననుటకు వీలులేదు. సంస్కారము దాని నుద్బోధించునదియు నుండునపుడు స్మృతి కలుగకపోవుట యెచ్చటను కనబట్టదు. "ఈ జ్ఞప్తిలోనే యీయడ్డంకి కల్పింతుము. మరొకచోట కాదు" అనుటయు మనసునకు నచ్చనిమాట, అటువంటి కల్పన నిరర్థకము; అనుభవ విరుద్ధముకూడ.

తథాహి :— నానార్థశక్తివిషయకదృఢసంస్కారశాలినాం ప్రకరణజ్ఞానవతామపి పయో రమణీయ మిత్యాదేర్వాక్యాత్ప్రథ మమర్థ ద్వయోపస్థితిరనుభవసిద్ధా. అత ఏవ "పయో రమణీయమ్" ఇత్యాది వాక్యమకస్మాదాకర్ణితవద్భిః ప్రకరణాద్యభిజ్ఞై రప్రకరణ జ్ఞాః పాంసురపాదా వక్తుస్తాత్పర్యం బోధ్యన్తే, నూనమస్య దుగ్ధే తాత్పర్యం శబ్దస్య, న తు జల ఇతి. యది చ ప్రకరణాదిజ్ఞానం నానార్థ శబ్దాజ్జాయమానా మప్రాకరణికార్థోపస్థితిం ప్రతిబధ్నీయా త్తత్కథమేతే తదానీ మనుపస్థితజలాః ప్రకరణజ్ఞా జలతాత్పర్యం నిషేధేయురిత్యహృదయఙ్గమ ఏవాయమప్రాకరణికార్థోపస్థాపన ప్రతిబన్ధకభావః ప్రకరణాదిజ్ఞానస్య,

ఏమంటే, నానార్థములనుగూర్చి దృఢమగు సంస్కారముగల వారికి ప్రకరణాదులు తెలిసినను "పయస్సు రమణీయము" అనుమాట నుండి మొదట రెండర్థములు జ్ఞప్తికి వచ్చుట అనుభవసిద్ధము కనుకనే ఆకస్మిక ముగా విన్నప్పటికిని ప్రకరణాదుల నెఱిగినవారు, అప్రకరణ జ్ఞానములేని పాంసురపాదులకు (దుమ్ముకాళ్లవారికి) వాని నెరింగింతురు.

పై వాక్యమున పయశ్శబ్దమునకు పాలు అనితాత్పర్యము. నీరు అని

కాదు, అని.- ఇట ప్రకరణాదిజ్ఞానమే కనుక అప్రాకరణికపుటర్థము నానార్థకశబ్దమునుండి యుపస్థితముకాకుండ అడ్డగించుచో వీరికి (ప్రకరణజ్ఞులకు) జలము జ్ఞప్తికి రాదు కదా. అపుడు జలము ఈపయస్సు అనుదానికి తాత్పర్యము కాదని యెట్లుని షేధింతురు? కనుక ప్రాకరణికార్థము జ్ఞప్తికి రాకుండ అడ్డగించును అనుట సుమనస్కులకు రుచింపనిదే! (నచ్చనిదే).

యదప్యుచ్యతే ప్రకరణాదిజ్ఞానా త్ప్రాకరణికేఽర్థే తాత్పర్య విషయతయా నిర్ణీతే తదీయశాబ్దబోధానన్తర మతాత్పర్యవిషయీభూతార్థబోధో జాయమానో వ్యఞ్జనవ్యాపారసాధ్య ఇతి - తత్ర కిమయం నానార్థస్థలే సర్వత్రైవ వ్యఞ్జనోల్లాసః, ఆహోస్విత్క్వచిదేవేతి సమ్మతమ్ ? నాద్యః, ప్రాకరణికా-ప్రాణికరకయోరర్థయోః శాబ్దబుద్ధౌ సర్వత్రా భ్యుపగమ్యమానాయాం తాత్పర్యజ్ఞానకారణతాయాః కల్పనస్య వైయర్థ్యాపత్తేః,

మరియు ప్రకరణాదుల నెరుగుట వలన ప్రాకరణికమగు నర్థము తాత్పర్య విషయమని నిర్ణయముకాగా నాయర్థపు శాబ్దబోధగల్గిన తరువాత తాత్పర్యగోచరముకాని యర్థపు శాబ్దబోధ కూడా గల్గుచున్నది. అది వ్యంజనా వ్యాపారముననే సాధ్యము. అనెదరా మీరు? ఈవ్యంజన నానార్థక స్థలములందంతటను వెలయునా, కాదు ఏదోఒకచోటనే యనియా - మీయభిమతము. మొదటి పక్షము కుదరదు. ఏమంటె ప్రాకరణికార్థము, అప్రాకరణికార్థము, ఈరెండర్థములకును గూడ అంతటను శాబ్దబోధగల్గునని యంగీకరించుచుంటిరిగదా మీరు - ఇక తాత్పర్య జ్ఞానమును కారణముగా నంగీకరించుటెందుకు? అది నిరర్థకమే కావలసి వచ్చును.

న చ శక్తిజబోధే సా కల్ప్యతే, వ్యక్తిజబోధస్తు తాత్పర్యజ్ఞానం వినాఽపి భవతీతి తత్స్థానే శక్తిజబోధవారణాయ తత్కల్పనమితి వాచ్యమ్; అతాత్పర్యబోధస్య సార్వత్రికత్వే తస్య శక్తిజతాయామపి బాధకాభావాత్.

అట్లాకాదు. శక్తివలనగల్గు శాబ్దబోధలో తాత్పర్య జ్ఞానము కారణమందుము. వ్యక్తివల్లగల్గు బోధమాత్రము తాత్పర్య జ్ఞానము లేకున్నను గల్గును కనుక నాస్థలములో శక్తినుండి బోధ గల్గకుండుటకై తాత్పర్య

జ్ఞానము కారణముగా గల్పింతుము అని చెప్పుటకూడ యుక్తముకాదు. తాత్పర్యార్థ భిన్నమగు అప్రాకరణికార్థముకూడ అంతటను బోధింపబడును అనియంగీకరించు పక్షమున అట్టియర్థముకూడ శక్తిచేతనే బోధింపబడును అనిచెప్పుటలో బాధకమేదియు లేదు కదా!

అథ నానార్థశబ్దాదర్థద్వయోపస్థితౌ సత్యాం ప్రకరణాదినా సత్యేకస్మిన్నర్థే తాత్పర్యనిర్ణయే తస్యైవార్థస్య ప్రథమం శాబ్దబుద్ధిర్జాయతే, నాపరస్యేతి నియమరక్షణాయ శక్తిజతదర్థశాబ్దబుద్ధౌ తదర్థతాత్పర్యజ్ఞానం హేతురిష్యతే. అన్యథా తాత్పర్యావిషయతయా నిర్ణీతస్యార్థస్యైవాతథాభూతస్యాపరస్యాప్యర్థస్య ప్రథమం శాబ్దధీః స్యాత్. అనన్తరం తు తాత్పర్యవిషయార్థబోధా దతాత్పర్యవిషయార్థవిషయాపి శాబ్దధీరిష్యత ఇతి తజ్జన్యతావచ్ఛేదకకోటౌ శక్తిజత్వం నివేశ్యత ఇతి చేత్; నైవమ్. "సోఽవ్యాదిష్టభుజఙ్గహారవలయస్త్వాం సర్వదోమాధవః" ఇత్యాదౌ శ్లేషకావ్య ఇవ ప్రకృతేఽపి ప్రకృతాప్రకృతయోరర్థయోర్బోధస్య స్వీకారే బాధకాభావాత్.

తాత్పర్యము నుండి రెండర్థములును జ్ఞప్తియైనప్పుడు ప్రకరణాదుల నుండి యొకదానియందు తాత్పర్యనిర్ణయము గల్గగా నాయర్థమునకే మొదట శాబ్దబోధగల్గును తదితరార్థమునకు కాదు అను నియమమును గాపాడుకొనుటకై శక్తిజన్యమగు నాయర్థపు శాబ్దబోధలో నాయర్థపు తాత్పర్య జ్ఞానము కారణముగా నంగీకరింపబడును. అట్లంగీకరింపనిచో దాత్పర్యవిషయమగు నర్థమునకువలె తాత్పర్య గోచరముగాని అర్థమునకు శాబ్దబోధ మొదట గలుగవలసి వచ్చును. తాత్పర్యగోచరమగు నర్థమునకు బోధగల్గిన తర్వాత తాత్పర్యమునకు గోచరముగాని యర్థమును గూర్చియు శాబ్దబోధ యంగీకరింపబడుచునే యున్నది. కనుక తాత్పర్యజ్ఞానమువలన శాబ్దబోధ గల్గునని నిర్ణయించువాటిలో శక్తిజత్వమును (శక్తివలన కల్గుటను) చేర్తుము. శక్తివలన కలుగు శాబ్దబోధలో తాత్పర్యము కారణము అనుటయును తగదు. 'సోఽవ్యాత్' ఇత్యాది శ్లేష కావ్యము నందువలె ప్రకృతములోకూడ ప్రకృతాప్రకృతములగు నర్థములు రెండును దెలియ వచ్చునని యంగీకరించుచో నెట్టిబాధయును లేదుకదా!

న చ దృష్టాన్తేఽర్థద్వయేఽపి ప్రకరణసామ్యాత్తాత్పర్యజ్ఞానమస్తీతి యుగపద్ద్వయోరర్థ ఉపపద్యతే. దార్ష్టాన్తికే త్వేకత్రైవ ప్రకరణాదివశాత్తదితి న యుగపదర్థ ద్వయబోధోపపత్తిరితి వాచ్యమ్; తాత్పర్యజ్ఞానకారణతాయా ఏవాసిద్ధత్వేన యుగపదర్థద్వయబోధానుపపత్తి వాచోయుక్తేరరమణీయత్వాత్. తాదృశజ్ఞానహేతుతాసిద్ధౌ తు శక్యేతాపీత్థం వక్తుమ్.

అది తగదు - దృష్టాంతములో "సోవ్యాదిష్ట" అనుచోట రెండర్థములను గూర్చియు తాత్పర్యము గ్రహింపనగును. అందువల్ల రెండర్థములు నొక్కసారి బోధకావచ్చును. దార్ష్టాంతికములో=ప్రకృతములో నొక్కచోటనే (అనగా ప్రకృతార్థవిషయములోనే) తాత్పర్యము గుర్తింపబడును. అప్రకృతార్థమున=రెండవయర్థమున తాత్పర్యము గుర్తింపబడలేదు కనుక నొకేసారిగా రెండర్థములు దెలియ వచ్చునవకాశమును లేదు అనరాదు.

అసలు తాత్పర్య జ్ఞానము శాబ్దబోధలో గారణమని యింతవర కేర్పడలేదు కనుక ఒకసారిగా రెండర్థములు = ప్రకృతా ప్రకృతములు బోధపడుట కవకాశములేదు-అను యుక్తి పొసగదు. తాత్పర్యము ఏర్పడుచో నట్లనుటకు వీలయ్యెడిది.

తర్హి తాత్పర్యజ్ఞానస్య కుత్రోపయోగ ఇతి చేత్ ? అస్మిన్నర్థేఽయం శబ్దః ప్రమాణమయమర్థః ప్రమాణవేద్య ఇత్యాదినిర్ణయే ప్రవృత్త్యుపయోగినీతి గృహాణ. ఇత్థం చ నానార్థస్థలేఽపి తాత్పర్యధియః కారణతాయాం శిథిలీభవన్త్యాముతాత్పర్యార్థవిషయశాబ్దబుద్ధిసమ్పాదనాయ వ్యక్తిస్వీకారోఽనుచిత ఏవ; శక్త్యైవ బోధద్వయోపపత్తేః.

అయితే తాత్పర్య జ్ఞానమున కుపయోగ మెక్కడ నందురా? ఈ శబ్దమున ఈయర్థము ప్రమాణము, ఈయర్థము ప్రమాణ వేద్యము అని నిర్ణయము ప్రవృత్తి మొదలగువానిలో నుపయోగించునపుడు తాత్పర్య జ్ఞానము పనికివచ్చు నని గ్రహించుము. ఇట్లు నానార్థ స్థలమునందు గూడ తాత్పర్య జ్ఞాన కారణత్వము పట్టు దప్పిపోవుచుండగా తాత్పర్యగోచరము కాని శాబ్దబోధను సమకూర్చుటకై వ్యంజన నంగీకరించు టుచితమే కాదు. అట ప్రకృతాప్రకృతార్థములు రెండిటి బోధలును శక్తినుండియే కుదురును.

నాపి ద్వితీయః; హేతోరభావాత్. వ్యఙ్గ్యార్థవిషయకకవితాత్పర్యజ్ఞానం తథేతి చేత్; న. వ్యక్తిజబోధే తాత్పర్యజ్ఞానకారణతాయా స్త్వయానభ్యుపగమాత్; యత్రాశ్లీలం దోష స్తత్రాప్రాకరణికేఽర్థే సకలానుభవసిద్ధే కవితాత్పర్యస్య విరహేఽపి, తజ్జ్ఞానస్య తాదృశబుద్ధిహేతుతాయా వ్యభిచారదూషితత్వాచ్చ.

ఇక రెండవ పక్షముకూడ అనగా నానార్థస్థలమున, నేదేయొక చోటనే వ్యంజనవల్ల అర్థము దెలియును, అనికూడ తగదు. ఈ యొక్క చోటనే వ్యంజన వెలయుననుటకు దగినంతటి కారణము లేదుకదా! కవికచట వ్యంగ్య తాత్పర్యమున్నది అని తెలియుటయే కారణమనరాదా? అనరాదు. ఏమి? వ్యంజనవల్ల నర్థము దెలియ వచ్చుటలో తాత్పర్యజ్ఞానము కారణము అని నీవే అంగీకరింపలేదు కదా? అశ్లీలదోషమున్నచోట యప్రాకరణికమగు నాయర్థమునందు అందరికిని యనుభవసిద్ధమైనదాని యందు కవికి తాత్పర్యములేదు గనుక, అట తాత్పర్య జ్ఞానము లేకున్నను నాయర్థము స్ఫురించు చున్నది గనుక, అప్రాకరణికార్థము దెలియుటకు తాత్పర్య జ్ఞానము కారణమగుట కుదురదు, వ్యభిచారము గనబడుచునే యున్నదికదా!

అథ శ్రోతుః శక్తివిశేషో వ్యక్తేరుల్లాసే హేతుః. సచ ఫలబలాచ్చమత్కారిణ్యేవార్థే వ్యక్తిముల్లాసయతి నాచమత్కారిణీతి సిద్ధం వ్యఞ్జనోల్లాసస్య క్వాచిత్కత్వమితి చేత్; న, హన్తైవం స నియన్త్రితశక్తేరేవోల్లాసకోఽస్త్వితి కృతం నానార్థస్థలే వ్యక్తికల్పనయా.

సరి– (ఇంతవరకును వక్తనుబట్టి తాత్పర్యజ్ఞానకారణత్వము విచారింపబడినది, ఇక శ్రోతనుబట్టి విచారింపబడును) అయితే వ్యంజన వెలయుటలో శ్రోతకుగలశక్తి విశేషము హేతువు. అదియు ఫలముయొక్క సామర్థ్యమును బట్టి చమత్కారకమగు నర్థమునందే శక్తి వెలయించును, చమత్కారము బొదవింపదేని యా యర్థమును వ్యంజనము వెలయింపదు గమక వ్యంజన వెలయుట క్వాచిత్కమని సిద్ధమగు నందురా? అమ్మయ్యా! అట్లగుచో నిదివరలో నియంత్రితమగు నభిధనే శ్రోతయొక్క ఆశక్తివిశేషము వెలయింపనగును, కనుక, నానార్థ స్థలములందు వ్యక్తిని గల్పింపవలసిన పనిలేదు.

కించ 'ఉల్లాస్యకాలకరవాలమహోమ్బువాహమ్' ఇత్యాదినానార్థవ్యఞ్జకస్థలేఽగృహీత ద్వితీయార్థశక్తికస్య గృహీతవిస్మృతద్వితీయార్థశక్తికస్య వా పుంసః సర్వథైవ వ్యఞ్జనయా ద్వితీయార్థబోధానుదయాత్త్ర తయా తదాపత్తిస్తవ దుర్వారా.

మఱియు - "ఉల్లాస్యకాలకరవాలమహాంబువాహం" ఇత్యాదికమైన నానార్థకమగు వ్యంజకముయొక్క స్థలములో రెండవయర్థమున శక్తి నెరుగని వానికిగాని ఎరిగి మరచిన వానికిగాని ఎన్నివిధములనైనను వ్యంజన వలన రెండవయర్థము తెలియరాదు, కనుక నచట నీపక్షమున వ్యంజననుండి రెండవయర్థము తెలియరావలసి వచ్చును. దానిని వారింప శక్యముకాదు.

న చ యేన శబ్దేన యోఽర్థో వ్యజ్యతే తస్య శబ్దస్య తదర్థగతశక్తిజ్ఞానం తదర్థవ్యక్తేరుల్లాసే హేతురితి వాచ్యమ్; "నిశ్శేషచ్యుత" ఇత్యాదౌ రమణవ్యక్త్యనాపత్తేః, న హ్యాధమపదస్య కస్యచిద్రమణే శక్తిగ్రహోఽస్తి, సతి వా తస్మింస్తేనైవోపపత్తౌ వ్యక్తికల్పనవైయర్థ్యాపత్తేశ్చ.

అలా కాదయ్యా?[1] ఏశబ్దము యేయర్థమును వ్యక్తపరచునో దానికి నాయర్థమునందు శక్తియున్నదని తెలిసిననే, యట వ్యక్తి వెలయును! అనరాదు 'నిశ్శేషచ్యుత 'ఇత్యాదికమునందు రమణము వ్యక్తముకాకపోవలసి వచ్చును. ఏమనగా నట యధమపదమునకు రమణమునందు శక్తియున్నదని యేయొక్కడైనను ననుకొనునా? అనుకొన్నచో ఆయున్నశక్తిజ్ఞానము వలననే రమణము తెలియవచ్చును గనుక వ్యక్తిని కల్పించుట వ్యర్థముగావలసి వచ్చును.[2]

---

1. వ్యంజన రెండవయర్థము తెలియుటకు గారణమను కార్యకారణభావములో నిట నన్వయవ్యభిచారము తప్పదనుట-అనగా-వ్యంజన యొక్కొకచోటనే చమత్కారకమగు నర్థమునందే వెలయును అని నీవు కల్పించితివి. ఇట వ్యంజనా స్థానమైనను, చమత్కారకమగు నర్థమున్నను, దానిని శ్రోత యెరుగడు కనుక కారణమగు వ్యంజన యున్నను కార్యమగు నర్థజ్ఞానము కల్గదు కాగా అన్వయ వ్యభిచారము తప్పదు.

2. శబ్ద శక్తిమూలకమగు వ్యంజనను విచారించు ప్రకరణములో నర్థశక్తిమూలక వ్యంజనను బట్టి దోషము దెల్పుట యుక్తము కాదనగా ముందు గ్రంథము, నుపక్రమించి సమాధానము దెల్పుచున్నాడు.

న చ నానార్థవ్యఞ్జనస్థల ఏవైవంజాతీయకః కార్యకారణభావః కల్ప్యతే, తత్ర చ శక్తేర్నియన్త్రితత్వేన తద్గ్రహస్యాప్రయోజకతయా వ్యక్తికల్పనానౌచిత్యాదితి వాచ్యమ్; నవీన కార్యకారణభావ-కల్పనే గౌరవప్రసఙ్గాత్. నియన్త్రణస్య పూర్వమేవ దూషితత్వేన తద్ధేతోరేవేతి న్యాయావతారాచ్చ.

నానార్థ (శబ్ద) వ్యంజనస్థలమునందే ఈరకపు కార్యకారణ భావమును కల్పింతుము. ఏమి? అచట యభిధ నియన్త్రితయగును, రెండవ యర్థమున దాని జ్ఞానమున కెట్టి ప్రయోజనమును నుండదు కనుక వ్యక్తిని కల్పించుట యుచితము అనదగదు. ఈరకమైన నవీనమగు కార్యకారణ భావమును నూతనముగా గల్పించుటలో గౌరవము ప్రసక్తించును, అదిగాక నియన్త్రణ మిదివఱకే నిరాకరింపబడినది, కనుక "తద్ధేతోరేవ" అను న్యాయమే ఇట అవతరించును.[1]

అథాస్త్వప్రాకరణికోఽప్యర్థః శక్తివేద్య ఏవాన్వయధీగోచరః పరం తు యత్ర న బాధితః స్యాత్. యత్ర తు బాధితస్తత్ర "జైమినీయమలం ధత్తే రసనాయామయం ద్విజః" ఇత్యాదౌ జుగుప్సితోఽర్థో "వహ్నినా సిఞ్చతి" ఇత్యాదౌ వహ్నికరణకసేక ఇవాబోధ ఏవ స్యాత్. బాధనిశ్చయస్య తద్వత్తాజ్ఞానం ప్రతి ప్రతిబన్ధకతాయాః సర్వజనసిద్ధత్వాత్. వ్యక్తేస్తు బాధితార్థబోధకత్వం ధర్మిగ్రాహకమాన-సిద్ధమితి వ్యక్తివాదినా మదోష ఇతి.

"అయితే అప్రాకరణికమగు నర్థముకూడా నభిధచేతనే తెలియవచ్చి అన్వయబోధలో గోచరముకానిండు. కాని యది యర్థము బాధింపబడని చోటనే సుమండీ ! బాధితమగుచోట "జైమినీయమలం ధత్తే రసనాయా మయం ద్విజః" ఇత్యాదులందు రోతగల్గించు నర్థము బాధితము కనుక తెలియ

1. వ్యక్తిని వెలయింప సాధనమైన రెండవయర్థమును గుర్తించిన శక్తిజ్ఞానమే ఆ యర్థమును దెల్పుటకు హేతువగును కనుక, ఇక వ్యంజన యేల? అని. "తద్ధేతోరేవ" దానికి (వ్యంజనకు) కారణమగు దానికే (శక్తిజ్ఞానమునకే) తత్త్వే=కార్య (అర్థజ్ఞాన) మును గూర్చి కారణమగుట సరిపోగా తిరిగి అది (వ్యంజన) యేల? అని ఆ న్యాయము అర్థము- 'తద్ధేతోరేవ తదస్తు (తత్త్వే) కిం తత్కథనయా' అని న్యాయస్వరూపము.

రాకయే పోవును. "నిప్పుతో తడుపుము" అనుచోట నన్వయము తెలియ రాదుకదా? బాధ నిశ్చయముగా నుండునపుడు తద్వత్తా (అదిగల్గియుండు నన్న) బుద్ధి ప్రతిబంధింపబడునని అందరెరింగినదే కదా! ఇక వ్యంజన బాధితార్థము నెట్లు బాధించునందురా? అసలు వ్యంజనను (ధర్మిని) తెల్పు (గ్రహింపజేయు) ప్రమాణమే దానిని అట్లు సిద్ధింపజేసినది కనుక వ్యంజనా వాదులకు తప్పుకల్గదు అని యందురా?

మైవమ్, 'గామవతీర్ణా సత్యం సరస్వతీయం పతఞ్జలివ్యాజాత్', 'సౌధానాం నగరస్యాస్య మిలన్త్యర్కేణ మౌలయః' ఇత్యాదౌ వాచ్యార్థాన్వయోపపాదనాయానుసరణీయేన యత్నేన నానార్థస్థలేఽపి బాధితార్థబోధస్యోపపత్తిః స్యాత్, అన్యథా ప్రాయశః సర్వేష్వప్యలఙ్కారేషు వాచ్యార్థబోధోపపత్తయే వ్యఞ్జనాఙ్గీకరణీయా స్యాత్. తస్మాన్నానార్థస్యాప్రాకరణికేఽర్థే వ్యఞ్జనేతి ప్రాచాంసిద్ధాన్తః శిథిల ఏవ. ప్రాకరణికాప్రాకరణికయోరర్థయో రుపమాయాం తు సా కదాచిత్స్యాదపి ఇతి.

"గ్రామవతీర్ణా సత్యం సరస్వతీయం పతంజలివ్యాజాత్" "సౌధానాం నగర స్యాస్య మిలంత్యర్కేణ మౌలయః" ఇటువంటిస్థలములందు వాచ్యార్థము (బాధితమైనది కనుక) అన్వయించుట కనుసరింపక తప్పని యత్నముతోనే నానార్థములందుగూడ బాధితార్థపు బోధ యుపపన్న మగును.[1] అట్లు కానిచో దాదాపు అన్ని అలంకారములయందును వాచ్యార్థబోధోపత్తికై వ్యంజనను అంగీకరింపవలసి యుండును. కావున నానార్థకపదము అప్రాకరణికార్థమును బోధింపవలసి యున్నపుడు వ్యంజనావృత్తి ఉపకరించును అనెడు ప్రాచీనుల సిద్ధాంతము దుర్బలమైనదే. ప్రాకరిణికాప్రాకరిణికార్థములకు ఉపమ యున్నపుడు ఆవ్యంజనావృత్తికి అవకాశముండవచ్చును అని.

1. శాబ్దబోధలో బాధజ్ఞానము ప్రతిబంధకముగాదు. అట్లే అయోగ్యతా నిశ్చయముకూడా ప్రతిబంధముకాదు కాగా యోగ్యతాజ్ఞానముకూడా కారణముకాదు. అథవా అసలు శాబ్దబోధంటే ఆహార్య మనెదము. ఈరకపు యత్నము ఇదిమూలములోనే ముందు స్పష్టము.

అత్రాస్మాకం ప్రతిభాతి. ఏవమపి యోగరూఢిస్థలే రూఢిజ్ఞానేన యోగాపహరణస్య సకలతన్త్రసిద్ధతయా రూఢ్యసాధారణస్య యోగార్థాలిఙ్గితస్యార్థాన్తరస్య వ్యక్తిం వినా ప్రతీతిర్దురుపపాదా. యథా :

"అబలానాం శ్రియం హృత్వా వారివాహైః సహానిశమ్
తిష్ఠన్తి చపలా యత్ర స కాలః సముపస్థితః"

అత్రాశక్తానాం ద్రవ్య మపహృత్య జలవాహకైః పురుషైః సహ పుంశ్చల్యో రమన్త ఇత్యర్థా న్తరం న తావదబలా-వారివాహ-చపలా శబ్దైర్యోగరూఢ్యా శక్యతే బోధయితుమ్; మేఘత్వ - విద్యుత్త్వాద్య ఘటితస్యైవ తస్యార్థస్య ప్రతీతేః, అన్యథా చమత్కారో న స్యాత్. అత ఏవ న యోగశక్త్యాపి కేవలయా. రూఢ్యా సంవలితార్థబోధకత్వస్య తస్యా రూఢిసమానాధికరణాయా అసంగతేః. పుంశ్చలీత్వాదేః సర్వథైవ తదవిషయత్వాత్.

ఇచట మాకిట్లు తోచుచున్నది. ఈలాగైనను యోగరూఢిస్థలము నందురూఢిజ్ఞానము, యోగమును అపహరించునని శాస్త్రములన్నియు చెప్పినదేగనుక రూఢికిగోచరము కాక యోగశక్తితో చేర్పడు నర్థాన్తరమును దెల్పుట వ్యంజన లేనిదే కుదురదు. ఎట్లనగా— 'అబలానాం' (స్త్రీలయొక్క శోభను హరించి మెఱుపులు మేఘములతోగూడ నెల్లపుడు నుండునట్టి (వర్ష) కాలము వచ్చినది) ఇత్యాది శ్లోకమున అశక్తుల ద్రవ్యమును హరించి నీరు మోతగాండ్లతోగూడి పుంశ్చలులు=వ్యభిచారిణులు, రమింతురు అనునర్థాంతరమును, అబలా-వారి వాహక-చపలా-శబ్దములు (క్రమముగా) యోగ రూఢితో బోధింపజాలవు. ఈ యర్థాన్తరము (రూఢిబోధ్యములగు)మేఘత్వము, విద్యుత్త్వము, మొదలగు వానిని గలియక యే స్ఫురించునుగదా? అట్లు ఈ యర్థము రూఢ్యర్థములో గలియకుండా విడిగా స్ఫురింపజేయనిదే చమత్కార మేది? కనుక కేవల యోగశక్తియు నీయర్థాన్తరమును బోధింపజాలదు, ఏమనగా- ఈశబ్దమందున్న యోగసంవృతమైన రూఢిలోని యోగశక్తి రూఢి ప్రవర్తించుచోటనే ప్రవర్తించును, అట్టి ఈ యోగశక్తి రూఢిప్రతిపాదిత మగునర్థముతో గలియని ఈయర్థాన్తరమును బోధింపజాలదు కదా? అదేగాక పుంశ్చలీత్వము మొదలగు నర్థములు ఎట్లును దానికి అగోచరమే కదా?

ఏవం యౌగికరూఢిస్థలేఽపి బోధ్యమ్, యథావాగ :

"చాఞ్చల్యయోగి నయనం తవ జలజానాం శ్రియం హరతు
విపినేఽతి చఞ్చలానామపి చ మృగాణాం కథం హరతి."

అత్ర నైవాశ్చర్యకారీ చాఞ్చల్యగుణరహితానాం కమలానాం చాఞ్చల్యగుణాధికేన తవ లోచనేన శోభాయాస్తిరస్కారః. ఆశ్చర్యకృత్తు హరిణానాం తద్గుణయుక్తానాం తస్యాః స ఇతి వాచ్యార్థే పర్యవసన్నేఽపి రూఢినిర్ముక్త కేవలయోగమర్యాదయా మూర్ఖపుత్రాణామత ఏవ ప్రమత్తానాం నేతృభిశ్చోరాద్యైః, శ్రియో ధనస్య హరణం సుశక్యమ్, న తు గవేషకాణామత ఏవాప్రమత్తానామితి జలజనయన మృగశబ్దేభ్యః ప్రతీయమానోఽర్థః కథం నామ వ్యఞ్జనావ్యాపారం వినోపపాదయితుం శక్యతే ?

ఈ రీతియే యౌగికరూఢి స్థలమునందును తెలియవలెను,- ఇంకను ఎట్లనగా 'చాంచల్యయోగి' (చంచలమగు నీనేత్రము పద్మముల సిరి నపహరించును గాక, అడవిలో మిక్కిలి చాంచల్యముగల లేడుల సిరినిగూడా నెట్లు హరింపగల్గుచున్నది?) ఇత్యాది శ్లోకమున చాంచల్య గుణములేని కమలముల సిరిని చాంచల్యములో నధికమగు నీకనులు తిరస్కరింపగల్గుట నాశ్చర్యము నొందింపదు. ఇకనేమనగా నాగుణముగల లేడుల కాంతిని తిరస్కరించుట యాశ్చర్యము నొదవించునని వాచ్యార్థము ముగిసినను రూఢిని వీడిన కేవలయోగమర్యాద జలజనయన మృగశబ్దములందుండునది, "మూర్ఖుల పుత్రులు" కనుకనే ప్రమత్తులు అగువారి సిరిని నేతలగు దొంగలు మొదలగువారు నపహరించుటకు సులువుగా వీలగును; కాని గవేషకులు కనుకనే ప్రమాదము నొందకుండు వారిసిరి నపహరింపజాలరు-అనునర్థమును దెల్పును. ఇది వ్యంజనా వ్యాపారము లేకుండా ఎట్లు కుదర్ప వీలగును?

అత ఏవ పఙ్కజాదిపదేభ్యః పఙ్కజనికర్తృత్వేన కుముదాద్యుపస్థితిర్లక్షణయైవేతి నైయాయికా మన్యన్తే. అత ఏవ చ "ఈశానో భూతభవ్యస్య స ఏవాద్య స ఉ శ్వః" ఇతి వేదాన్తవాక్యే కిమైశ్వర్యవిశిష్టః కశ్చిజ్జీవోఽత్ర ప్రతిపాద్యతే ఉతేశ్వర ఇతి సంశయే, జీవ ఏవేతి పూర్వపక్షే చ 'శబ్దాదేవ ప్రమితః' ఇతి సూత్రితమ ముత్తరమీమాంసా

కార్యైర్బాదరాయణచరణైః (బ్రహ్మసూత్రే, 1-3-24). తస్మాదర్థాన్తరమిహ న శక్తివేద్యమ్, అపి తు వ్యక్తివేద్యమేవ.

ఇందువల్లనే పంకజాది పదములు కుముదాదులను దెల్పుటకు లక్షణయే గతి యని నైయాయికులు దలంతురు. ఇట్టి కారణమున్నది గనుకనే కూడ "ఈశానో భూతభవ్యస్య స ఏవాద్య స ఉ శ్వః" అను (కఠోపనిషత్తు) వేదాన్త వాక్యములో ఐశ్వర్య విశిష్టుడైన యెవడో యొక జీవు డిందు జెప్పబడునా? లేక ఈశ్వరుడా? అని సంశయముదలగగా జీవుడేనని పూర్వపక్షమొనర్చి నపుడు 'శబ్దాదేవ ప్రమితః' బ్ర. సూ. (౧-౩-౨౪) అని పూజ్యులు బాదరాయణు లుత్తరమీమాంసలో (బ్రహ్మ సూత్రములలో) సూత్రించిరి గనుక మరొక యర్థము నిట శక్తితో బోధింప ననువుపడదు. ఇక నేమి? వ్యంజనతోనే వీలగును.

యథాశ్రుతార్థస్యోపపత్తేర్బాధాభావేన లక్ష్యమిత్యపి న శక్యం వక్తుమ్. తాత్పర్యార్థబోధస్తు తదర్థబోధోత్తరం బోధ్యః. స ఏవ తు కథం స్యాదిత్యుపాయోఽయం విచిన్త్యతే. న హ్యపహస్త్య వ్యవహారో వక్త్రా వివక్షిత ఇతి శ్రోతుర్బోధే కశ్చిదుపాయోఽస్తి, ఋతే సహృదయహృదయోన్మిషితాదస్మాద్వ్యాపారాత్. ఏవమన్యత్రాప్యూహ్యమ్. తాదృశార్థప్రతిపత్తిరేవ నాస్తీతి తు గాఢతరశబ్దార్థవ్యుత్పత్తిమస్పృశీకృత్యాన్తఃకరణైర్న శక్యతే వక్తుమ్.

"లక్షణతో బోధింతుము" అనుటకును ననువుకాదు. యథాశ్రుతమగు నర్థమే సరిగా కుదురుచున్నది. కనుక బాధ (లక్షణబీజము) లేదు ఇక లక్షణకు చోటేది? పోనీ ద్వితీయార్థవిషయక తాత్పర్యానుపపత్తి ఇచట లక్షణా బీజమందుమా ఆయర్థము (యోగరూఢార్థము) తెలిసిన తరువాత గానీ యది (తాత్పర్య విషయీభూతార్థము) తెలియరాదు. అదియే యెట్లగునని యుపాయ మాలోచింపబడుచున్నది. అపహస్తవ్యవహారమును వక్తచెప్ప దలచెనని శ్రోత తెలిసికొనుట కేమి యుపాయము లేదే? సహృదయుల హృదయములందున్మిషితమగు నీవ్యంజన యొకటి దప్ప మరొక వ్యాపారమే లేదు. స్థలాంతరమందును నిట్లే యూహించుకొనవలెను. అట్టియర్థము (అపహస్త్య వ్యాపారము) స్ఫురింపనే స్ఫురింపదు అనుటకు వీలులేదు. శబ్దార్థములందు వ్యుత్పత్తి గాఢముగా నున్నచో వారట్లనరు.

తథా చేత్థం సంగ్రహః :-

'యోగరూఢస్య శబ్దస్య యోగే రూఢ్యా నియన్త్రితే
ధియం యోగస్పృశోఽర్థస్య యా సూతే వ్యఞ్జనైవ సా'.

ఇది దీనికి సంగ్రహము – 'యోగరూఢమగు శబ్దముయొక్క యోగమును రూఢి ప్రతిబంధింపగా నాయోగశక్తిస్పర్శగల యర్థమును బోధించునదియును వ్యంజనయే' అని.

ఏవం స్థితే నానార్థస్థలేఽప్యుపమాయాః ప్రాకరణికాప్రాకరణికార్థగతాయాః ప్రతిపత్తయేఽవశ్యం వాచ్యయా వ్యఞ్జనయైవాప్రాకరణికస్యాప్యర్థస్య ప్రతిపత్తావలం క్లిష్టకల్పనయేత్యాశయేన ప్రాచీనైరుక్తం నానార్థవ్యఞ్జకత్వమపి న దుష్యతి.

ఇది యిట్లుండగా నానార్థ స్థలమునందు ప్రాకరణిక మగు నర్థమునకును, అప్రాకరణికమగు నర్థమునకును నౌపమ్యమును బోధించుటకై దప్పక వ్యంజనను జెప్పితీరవలెను, గనుక దానితోనే యప్రాకరణికమగు నర్థము గూడ తెలియవచ్చుచుండగా క్లిష్ట మగు కల్పనయేల? అను దలంపుతో ప్రాచీనులు నానార్థములనుగూడ వ్యంజనయే దెల్పుననిరి. ఆమాటయు దప్పుకాదు.

తత్ర నానార్థశక్తినియమనాయ తైః సంయోగాదయో నిరూపితాః—

'సంయోగో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా
అర్థః ప్రకరణం లిఙ్గం శబ్దస్యాన్యస్య సన్నిధిః
సామర్థ్యమౌచితీ దేశః కాలో వ్యక్తిః స్వరాదయః
శబ్దార్థస్యానవచ్ఛేదే విశేషస్మృతిహేతవః'.

అట నానార్థములందు శక్తిని నియమించుటకై వారు, సంయోగాదులను నిరూపించిరి – "సంయోగము, విప్రయోగము సాహచర్యము, విరోధిత, అర్థము, ప్రకరణము, లింగము, మరొకశబ్దపుసన్నిధి, సామర్థ్యము, ఔచితి, దేశము, కాలము, వ్యక్తి, స్వరము, మొదలగునవి శబ్దముయొక్క అర్థము నిర్ణయము కానపుడు విశేషపు జ్ఞప్తికి కారణములగును.

తత్ర - సంయోగో నానార్థశబ్ద శక్త్యన్తరవృత్తితయా అప్రసిద్ధత్వే సతి తచ్ఛక్యవృత్తితయా ప్రసిద్ధః సంబన్ధః.

యథా :— 'సశఙ్ఖచక్రో హరిః' ఇత్యత్ర శఙ్ఖచక్రయోః సంయోగో భగవన్మాత్రనిష్ఠతయా ప్రసిద్ధో భగవతి హరిశబ్దస్యాభిధాయా నియమేనావస్థాపకః; న త్వాయుధత్వేనాయుధసామాన్యసంయోగః పాశాఙ్కుశాది సంయోగో వా; దలద్వయాభావాత్. న చాసౌ లిఙ్గాన్తర్గత ఇతి మన్తవ్యమ్, శక్త్యన్తరే నియమేనావృత్తేరేవ ప్రకృతే లిఙ్గత్వాత్. శఙ్ఖచక్రయోస్త్విన్ద్రాదినాపి కదాచిద్ధారణ సమ్భవాత్.

సంయోగము అనగా నానార్థకమగు శబ్దము వేరొక యర్థము నందుండినట్లు ప్రసిద్ధిలేనిదై యాయర్థమునందే యుండునట్లుగా ప్రసిద్ధమగు సంబంధము. ఎట్లనగా- శంఖచక్రములతోడిహరి- అనుచోట శంఖచక్రముల సంబంధము భగవంతునందే యుండునని ప్రసిద్ధము, కనుక నిది ఇట హరిశబ్దము టభిధాశక్తిని నియమితము[1] నొనర్చును, అంతేకాని ఆయుధముగా నాయుధ సామాన్యపు సంబంధముకాని, పాశాంకుశాది సంబంధముగానీ అట్లు నియమింప జాలదు. విశేషణద్వయమును అట లేదు కదా? ఐనీ ఇది లింగములో నన్తర్గత మనుకొనరాదా? అనరాదు. మరొక శబ్దార్థమునందు నియతముగా నుండక పోవుటయే ఇట లింగము, శంఖచక్రములను ఇంద్రాదులుకూడ ఒకప్పుడు ధరించిన ధరింపవచ్చును కావున శంఖచక్రసంయోగమునకు లింగత్వము లేదు.

విప్రయోగో విశ్లేషః, యథా:— 'అశఙ్ఖ చక్రో హరిః' ఇత్యత్ర తయోరేవ విశ్లేష స్తథా. అత్రహి విశ్లేష నియతపూర్వవర్తినః సంశ్లేషస్య ప్రాగుక్తదలద్వయాక్రాన్తత్వ మపేక్ష్యతే. తేనాయుధసామాన్య విభాగః, పాశాఙ్కుశాదివిభాగో వా న తథా. యద్యప్యత్ర గుణతయా వర్తమానస్తాదృశసంయోగ ఏవాభిధానియమనాయాలమ్, తథాపి

1. నియమితముగా నొనర్చుటయనగా విశేష్య (హరి) శబ్దమును అనేకములగు నర్థములందు-సూర్యుడు, కోతి, ఇంద్రుడు మొదలగు ననేకార్థములందు వ్యాపింపనీయక (వానిని జెప్పబడనీయక) కేవలము ఒక్కయర్థమునందే (భగవానునియందు) నిల్పుట - అనగా భగవానునొక్కనినే చెప్పునట్లొనర్చుట.

గుణప్రధానయోః సంనిపాతే ప్రధానానురోధ ఏవ న్యాయ్య ఇత్యా శయేన విప్రయోగస్య నియామకత్వముక్తమ్. యద్వా సంయోగ స్యైవ కేవలత్వేన విశ్లేషగుణీభూతత్వేన చ ద్వైవిధ్యప్రదర్శనాయ తథోక్తమ్.

**విప్రయోగము** – విశ్లేషము. "శంఖచక్రముల వీడిన హరి" అని. ఇచట వానికి (వెనుకటిచోట ప్రస్తావింపబడిన శంఖచక్రముల) విశ్లేషము-ఎడబాటు, అట్లే (హరిశబ్దపు టభిధను నియమించును). ఇచట విశ్లేషమునకు పూర్వము నియతముగానుండునట్టి (ఉండకతప్పనట్టి) సంశ్లేషమునకు వెనుక జెప్పబడిన రెండు దలములు నుండుట యావశ్యకము. అందుచే ఆయుధసామాన్యముతోడి విభాగముకానీ, పాశాంకుశాదులతోడి విభాగము (విశ్లేషము) కానీ అట్లు అభిధానియామకము కాదు. అయితే ఇచట గుణముగా నుండునట్టి సంయో గము అభిధను నియమించుటకు జాలును. కానీ "ప్రధానము, అప్రధానము రెండు నొక్కసారి వచ్చిపడినపుడు ప్రధానము ననుసరించుటయే న్యాయము" అను తలంపుతో నట విప్రయోగము అభిధానియామక మనబడినది. అథవా సంయోగము కేవలముగానే అభిధానియామక మగుటయు విశ్లేషణమునకు గుణముగా, విశేషణముగా నభిధానియామక మగుటయు నను నీరెండు తీరులను ప్రదర్శించుటకు గానే అట్లు చెప్పబడినది.

సాహచర్యమేకస్మిన్ కార్యే పరస్పరాపేక్షిత్వమ్. యథా - రామలక్ష్మణా' ఇత్యత్ర లక్ష్మణసాహచర్యం రామశబ్దస్య.

**సాహచర్యము** ఒకపనితో పరస్పరము సాపేక్షముగా (కలిసిమెలసి) ఉండుట, ఎట్లనగా- "రామలక్ష్మణులు" అనుచోట రామునందలి లక్ష్మణుని తోడి సాహచర్యము రామశబ్దపు టభిధను నియమించును.

అథ కిమిదం పరస్పరసాపేక్షిత్వం యత్కిఞ్చిత్కార్యే, సర్వేషు కార్యేషు వా? నాద్యః, ఘటాద్యవ్యావర్తనాద్ఘటసాహచర్యస్యాపి రామపదశక్తి నియామకతాపత్తేః. న ద్వితీయః. లక్ష్మణసాహచర్య స్యాపి నివారణాపత్తేః. పక్షద్వయేఽపి 'రామాయోధ్యే', 'రఘు రామౌ' ఇత్యత్రానియమాపత్తేశ్చ.

సరేకాని ఈ పరస్పర సాపేక్షముగా నుండుటయన ఏదో నొక పని యందా? అన్నిపనులందా? మొదటిది గాదు. ఘటాదుల వ్యావర్తన మొనరింప జాలదు. (అన్యథా రాముని తోడి యేదేనొక పనియందు దావపదము ప్రయోగుట యందు ఘటముకూడా సాపేక్షముగా నుండవచ్చునుగదా? కనుక ఘటాదులు సాపేక్షములు కావు అనుటకు వీలులేదు అన్నట) కనుక వాని సాహచర్యము కూడ రామునకు వచ్చిపడును. ఇక రెండవదియు కుదురదు. లక్ష్మణుని సాహచర్యముకూడ అన్నిపనులందుండదు గాన (మాయా మృగవధను రాము డొకడే కదా చేసినది) అడ్డము వచ్చిపడును. రెండుపక్షములందునూ రామా యోధ్యలు, రఘురాముడు, ఇత్యాది స్థలములందు నియామకత్వము లేక పోవును.

న చ నానార్థపదసమభివ్యాహృతపదాన్తరార్థస్య ప్రసిద్ధః సంబన్ధస్తత్. స చైకజన్యత్వ - దామ్పత్య - జన్యజనకభావ - స్వామి భృత్యభావ - స్వస్వామిభావాదిరనేకవిధః, తేన రామలక్ష్మణౌ, సీతా రామౌ, రామదశరథౌ, రామహనూమన్తౌ, రామాయోధ్యే, ఇత్యాదౌ సాహచర్యం నియామకమితి వాచ్యమ్; లక్ష్మణాది సంబన్ధా పేక్షయా చక్రాదిసంబన్ధస్యావిశిష్టతయా శఙ్ఖచక్ర ఇత్యత్రాపి సాహ చర్యస్యైవ నియామకతాపత్తేః.

నానార్థములగు పదములతోగూడ కలిసి చెప్పబడిన పదాన్తరపుటర్థము యొక్క ప్రసిద్ధమగు సంబంధము (నానార్థక పదపు నర్థమునందుండినది) అట్లగును. (పరస్పర సాపేక్షముగా నుండుట యగును); అసంబంధము ఒకని వల్లబుట్టుట, దాంపత్యము, జన్యజనక భావము, స్వామిభృత్యభావము, సొత్తు దాని కధికారి యగుట మొదలగు ననేకవిధములు నుండును. అందువల్ల రామలక్ష్మణులు, సీతారాములు, రామదశరథులు, రామహనుమంతులు, రామాయోధ్యలు,-ఇత్యాదులందు సాహచర్యము నియామక మని అనరాదు. లక్ష్మణాదులతోడి సంబంధమునకును, చక్రాదులతోడి సంబంధమునకును తేడా యేమియు లేదు, కనుక "శంఖచక్రములతోడి హరి" అనుచోట గూడ సాహచర్యమే నియామకముగా వచ్చిపడును.

న చ సశఙ్ఖచక్ర ఇత్యాదౌ యత్ర సంబన్ధః సంయోగరూపస్తత్రాద్యస్య, యత్ర చ సంబన్ధాన్తరం తత్ర తృతీయస్యావకాశ ఇతి వాచ్యమ్; సంయోగస్యైవ పృథక్కారే బీజాభావాత్.

"సశంఖచక్రః" ఇటువంటిచోట్ల (సంబంధము సంయోగ రూపమున నుండుచోట్ల) మొదటిది (సంయోగము) నియామకము.సంబంధాంతరమున్న చోట మూడవదానికి (సాహచర్యమునకు) అవకాశమేర్పడును అనరాదు. సంయోగము నొక్కదాని నేర్పరుచుటలో బీజము కన్పడదుగదా?.

న చ యత్ర సంయోగః శబ్దోపాత్తస్తత్ర స ఏవ నియామకః, యత్ర తు సంబన్ధిమాత్రం న తు సంబన్ధస్తత్ర సాహచర్యమ్, అత ఏవ 'సశఙ్ఖచక్ర' ఇతి సంయోగస్య, 'రామలక్ష్మణౌ' ఇతి చ సాహచర్యస్యోదాహరణమితి వాచ్యమ్; 'సలక్ష్మణో రామః' 'విలక్ష్మణో రామః' ఇత్యత్ర సంయోగవిభాగయోర్గుణయోరప్రతీత్యా సాహచర్యోదాహరణతాయాం ప్రసక్తాయాం సశఙ్ఖచక్ర ఇత్యాదేరపి తదుదాహరణతాయా ఏవౌచిత్యాత్ - ఇతి చేత్.

సంయోగము శబ్దముతో జెప్పబడుచోట నదియే (అభిధా) నియామకము, ఎచట సంబంధి (సంబంధము కలవాడు) మాత్రమే-సంబంధముకాదు-శబ్దముతో జెప్పబడునో అచట సాహచర్యము నియామకము. కనుకనే "శంఖచక్రములతోడి హరి" యని సంయోగమునకును, "రామలక్ష్మణులు" అని సాహచర్యమునకు నుదాహరణము అనుటయు కుదురదు. 'రాముడు సలక్ష్మణుడు' 'రాముడు విలక్ష్మణుడు' అనుచోట్ల గుణములగు సంయోగ విభాగములు ప్రతీతములుకావు కనుక, వాటిని సాహచర్యమున కుదాహరణముగ చెప్పవలసినపుడు "శంఖచక్రములతోడి హరి" ఇత్యాదికముకూడా దాని కుదాహరణమగుట యుచితమే కదా? అని యన్నచో—

ఉచ్యతే - సంయోగశబ్దస్య సంబన్ధసామాన్యపరతయా యత్ర శబ్దోపాత్తం ప్రసిద్ధం సంబన్ధసామాన్యం శక్తినియామకం తదాద్యస్య, యత్ర తు ద్వన్ద్వాదిగతః సంబన్ధ్యేవ కేవలస్తదా తత్సాహచర్యస్యోదాహరణమితి ప్రాంచా మాశయాత్. ఇత్థం చ 'సగాణ్డీవోఽర్జునః', ఇతి సంయోగస్య, 'గాణ్డీవార్జునౌ' ఇతి సాహచర్యస్యోదాహరణమ్.

(సమాధానమును) తెల్పుదుము. సంయోగ మను పదము సంబంధ సామాన్యమును దెల్పును. కనుక ఎచట సంబంధసామాన్యము శబ్దముతో దెలియబడినది, ప్రసిద్ధముగా నుండునది, శక్తిని నియమించునో అది మొదటి దానికి (సంయోగమునకు) ఎచటనైతే సంబంధియొక్కడే ద్వంద్వాది సమాసములందుండునో అపుడది సాహచర్యమున కుదాహరణమని ప్రాచీనుల తలంపు. కాగా-ఇట్లు "గాండీవముతోడి అర్జునుడు" అని సంయోగమునకు "గాండీవార్జునులు" సాహచర్యమునకు నుదాహరణము.

విరోధితా ప్రసిద్ధం వైరమ్, సహానవస్థానం చ. తత్రాద్యస్య 'రామార్జునౌ' ఇత్యుదాహరణం ప్రాఞ్చో వదన్తి.

విరోధిత్వము ప్రసిద్ధమగు వైరము, కలిసియుండకుండుటయును కూడ-ఇందులో మొదటిదానికి "రామార్జునులు" అను నుదాహరణమును ప్రాచీనులు దెల్పుదురు.

యత్త్వప్పయ్యదీక్షితో వృత్తివార్తికే ప్రాచాముదాహరణం నిరాకుర్వన్నాహ – "రామార్జునపదయోర్వధ్యఘాతకభావవిరోధాద్భార్గవ కార్తవీర్యయోరభిధా నియమ్యత ఇతి తదయుక్తమ్. రామ పదస్యాభిధానియమనే సతి తద్విరోధప్రతిసన్ధానేనార్జున పదస్య కార్త వీర్యేఽభిధానియమనమ్. తస్మింశ్చ సతి తద్విరోధప్రతిసంధానేన రామ పదస్యేత్యన్యోన్యాశ్రయాపత్తేః, తస్మాదన్యతరపదస్య వ్యవస్థితార్థత్వ ఏవ స్మృతతద్విరోధ ప్రతిసన్ధానాన్నానార్థపదస్యాభిధానియమన మితి రామరావణయోరిత్యుదాహరణం భవితుమర్హతి" ఇతి.

ఈ ప్రాచీనుల ఉదాహరణములను అప్పయ్య దీక్షితులు వృత్తి వార్తికములో నిరాకరించుచు ఇట్లన్నారు. "రామార్జునపదములకు, చంప బడుట, చంపుటయను రూపమునుండు విరోధము భార్గవ కార్తవీర్యు లందభిధను నియమించును (అని ప్రాచీనులు) అనుట అయుక్తము. రామ పదమునందభిధ నియమింపబడినపుడు అతనితోడి విరోధము వెనువెంటనే జ్ఞాపకమునకు వచ్చి, అర్జున పదమునందభిధ కార్తవీర్యుని గూర్చి నియమింప బడుట జరుగును. ఇది (కార్తవీర్యుని గూర్చిన అభిధ అర్జున పదమునందు నియతమగుట) జరిగిననే అతనితోడి విరోధము వెనువెంటనే జ్ఞాపకమునకు

వచ్చి రామపదమునందు అభిధ నియమింపబడుట జరుగును. కనుక, అన్యోన్యాశ్రయము వచ్చిపడును కనుక నారెండు పదములలో నేదో యొక పదమున కర్థము, నిశ్చయమైనపుడే, అవిరోధము స్మరింపబడుటవల్ల నానార్థ పదమున నభిధ నియమితము కాగా "రామరావణులు" అనునది ఉదాహరణము కాదగును అని.

తత్ర తావద్రామరావణయోరితి వ్యవస్థితార్థాన్యతరపదక ముదాహరణం విరోధితాయా నియమకత్వస్య న యుక్తమ్. 'రామలక్ష్మణయోః' ఇత్యత్రేవాత్రాపి సాహచర్యస్యైవ నియామకత్వాత్. న చ లక్ష్మణసాహచర్యం రామస్య ప్రసిద్ధమ్, న తు రావణ సాహచర్య మితి వాచ్యమ్; ప్రసిద్ధతత్సంబన్ధకత్వస్యైవ తత్సాహచర్య పదార్థత్వాత్. పితృ - భ్రాతృ - జాయాపత్య - భృత్య - నగరీణాం సంబన్ధస్యేవ రిపోః సంబన్ధస్యాపి లోకప్రసిద్ధత్వాత్. ఏవం స్థితేపి విరోధితాయాః పృథగ్గణనే మిత్రత్వాదేరపి తథా గణనాపత్తేః. తస్మాత్ ప్రాచీనోదాహరణమివ త్వదుక్తముదాహరణమప్యశుద్ధమేవ.

అచట "రామరావణులు" అనుదానిలో నొకపదము యొక్క అర్థము (రావణ పదపుటర్థము) నిశ్చితమే కదా? కనుక 'రామలక్ష్మణు'లను చోటవలె నిచటను సాహచర్యమే నియామకమగును. లక్ష్మణ సాహచర్యము రాము నందు ప్రసిద్ధము. రావణ సాహచర్యము అట్లు ప్రసిద్ధము కాదు గదా? అని యందురా? అతనితోడి సాహచర్యమనగా నతనితోడి ప్రసిద్ధమగు సంబంధము అనియే కదా అర్థము, అతని సహచరుడగుట "అనగా అతనితోడి ప్రసిద్ధమగు సంబంధము గల్గియున్నాడు" అనియే కదా అర్థము. తండ్రి, సోదరుడు, భార్య, బిడ్డ, భృత్యుడు పట్టణము వీనితోడి సంబంధమువలె శత్రువుతోడి సంబంధము కూడ లోకములో ప్రసిద్ధమే కదా? ఇట్లున్నను విరోధిత్వమును వేరుగా గణించుచో మిత్రత్వము మొదలగునవి గూడ వేరుగానే గణింపవలసి వచ్చును. కనుక ప్రాచీనుల యుదాహరణములవలె నీవు (అప్పయ్య దీక్షితుడు) చెప్పిన యుదాహరణముకూడ నిర్దోషము కాదు.

'అన్యతరపదస్య వ్యవస్థితార్థత్వ ఏవ' ఇత్యాద్యప్యసఙ్గతమేవ. 'హరినాగస్య' ఇత్యాదావుభయోరవ్యవస్థితార్థత్వేఽప్యేకపదాభిధానాభివ్య

క్తేన విరోధేన ధర్మివిశేషావిశేషితేనాపి యుగపద్ధర్మి విశేషద్వయేఽభిధాయా నియన్తుం శక్యత్వాత్.

"ఏదోనొక పదమున నర్థము సిద్ధమైనపుడే" అనుటయు నసంగతమే. "హరినాగము" అనుచోట రెండుపదముల యర్థములును నిశ్చయముకాక పోయినను ఏకపదవ్యాఖ్యానము వలన విరోధము వ్యక్తమగును కదా? ఆవిరోధము, ధర్మివిశేషములతో విశేషింపబడక పోయినను ఒక్కసారిగా ధర్మివిశేషములు, రెంటియందును అభిధను నియమింప గల్గును.

యదపి 'రామార్జునగతి స్తయోః' ఇతి శబ్దాన్తరసన్నిధేరుదాహరణమ్, ఇతి స ఏవాహ, తదప్యసత్. త్వయా నిరూపితే శబ్దాన్తర సన్నిధేరుదాహరణే 'నిషధం పశ్య భూభృతమ్', 'నాగో దానేన రాజతే' ఇత్యత్ర చాభిధాయా నియతవిషయతాం వినాన్వయస్యైవానుపపత్త్యా ప్రకృతే చ 'రామార్జునగతి స్తయోః' ఇత్యత్రార్థాన్తర విషయత్వేఽ ప్యన్వయానుపపత్తే రభావాన్మహతి వైలక్షణ్యే శబ్దాన్తరసన్నిధ్యు దాహరణత్వాయోగాత్.

మరియు "రామార్జున గతి స్తయోః"= వారిద్దరిదీ రామార్జునులనడక, అని శబ్దాన్తరసన్నిధి కుదాహరణము అనియతడే యన్నాడు. అదియు తప్పే. నీవు నిరూపించిన శబ్దాన్తర సన్నిధి యుదాహరణము "నిషధ భూభృత్తు చూడుము" "నాగము దానముతో వెలయును" అనుచోట్ల గూడ అభిధకు నియతవిషయత లేనిచో నన్వయమే కుదురదు, కనుక ప్రకృతములోకూడా "రామార్జునుల నడక వారిద్దరిది" అనుచోట అర్థాన్తరమభిధకు గోచరమైనను అన్వయము కుదరకపోవుటలేదు కనుక ఈరెంటికిని తేడా చాలాయెక్కువగా కన్పడుచున్నది. ఇది శబ్దాన్తర సన్నిధికెట్లు ఉదాహరణ మగును?

ఏవమపి కావ్యప్రకాశగతస్య 'రామార్జునగతి స్తయోః' ఇతి విరోధితోదాహరణస్యాసఙ్గతిః స్థితైవేతి చేత్, న; తయోః కయోశ్చిత్ ప్రసిద్ధవిరోధయో రామార్జునగతీ రామార్జున సదృశీ గతిరాచరణమితి తదర్థవర్ణనే విరోధేన ప్రస్తావవశాత్ప్రతీతేన యుగపద్భార్గవకార్త వీర్యయో రామార్జున శబ్దాభిధాయా నియమనస్యోపపత్తేః.

పోనీ కాని, కావ్య ప్రకాశములోని "రామార్జునులనడక వారిద్దరిది" అను విరోధోదాహరణపు సంగతి యట్లే నిలచి యున్నదే అందురా? ప్రసిద్ధ ముగా విరోధులైన ఎవరో ఇద్దరినడత "రామార్జునుల నడకవంటిది" రామార్జు నులతో సదృశ=సమానమైన, గతిః ఆచరణ యని దాని యర్థమును వర్ణించి నపుడు, యుగపత్తుగా భార్గవ కార్తవీర్యులందు రామార్జున శబ్దముల యభిధ నియమమునకు విరోధము కారణము.

న చ ప్రకరణాదవిశేషః. విరోధస్య ప్రక్రాన్తత్వేఽపి భార్గవ కార్తవీర్యయోః శక్తినియమాధికరణయో రప్రక్రాన్తత్వాత్. సహాన వస్థానలక్షణఽవిరోధితా తు 'ఛాయాతపౌ' ఇత్యాదౌ బోధ్యా.

అయితే ప్రకరణమునకన్న విశేషము లేదే? ప్రస్తావ వశమున ప్రతీత మగు విరోధమును ప్రారంభించినను నానాశక్తి నియమమునకు స్థానములగు భార్గవ కార్తవీర్యులను ప్రారంభించలేదు కదా? ఇక రెండ వయర్థమైన విరోధి తకు కలసి యుండకపోవుట కుదాహరణము "ఛాయాతపములు" ఇత్యాదులు.

అర్థః ప్రయోజనం చతుర్థ్యాద్యభిధేయమ్. యథా-'స్థాణుం భజ భవచ్ఛిదే' ఇత్యాదౌ భవచ్ఛేదనాది స్థాణుపదస్య శివే.

అర్థము ప్రయోజనము చతుర్థ్యాదులు తెలుపునది. ఉదాహరణము- "సంసారము నశించుటకై స్థాణువును భజింపుము". ఇట్టి వానియందు సంసార నాశము మొదలగునవి (ప్రయోజనము) 'స్థాణు' పదమున నభిధను శివుని యందు నియమించును.

నన్వర్థస్య లిఙ్గాత్కో భేదః ? న చ లిఙ్గమనన్యసాధారణస్తద్ధర్మః, అర్థస్తు తద్భజనాదేః కార్యమ్, న తు తద్గతో ధర్మ ఇతి స్ఫుట ఏవ భేద ఇతి వాచ్యమ్; భవచ్ఛేదజనకభజనకర్మత్వస్య కాష్ఠవృత్తిభవధర్మ త్వాత్, ఇతి చేత్; అత్రాహుః-ఉక్తస్య విశిష్టధర్మస్య శాబ్దబోధోత్తర భావిమానసబోధవిషయత్వేన ప్రకృతశాబ్దబోధావిషయత్వాల్లిఙ్గతో వైలక్షణ్యోపపత్తిరితి.

పరేనయ్యా? అర్థమునకు లింగమునకను తేడా యేమి? లింగ మనగా నితరమునందెచ్చటను నుండక దానియందే యుండునట్టి ధర్మము, అర్థము

న్నదో శివుని భజించుట మొదలగువానివల్ల నేర్పడునది. అంతేకాని దాని యందుండునట్టి ధర్మము కాదు. ఇట్లు తేడా స్పష్టముగానే యున్నది కదా? అనరాదు. సంసారమును నశింపజేయునట్టి భజనమునకు కర్మమగుట (నెక్కుడుగానీప్సితుడగుట) యను ధర్మము కల్గి, మొద్దు నందుండదుగదా? అని యనగా నిట నిట్లందురు. ఈ చెప్పిన విశిష్టధర్మము (సంసార నాశకమగు భజనమున, నెక్కువగా నీప్సితుడగుట) శాబ్దబోధగల్గిన తరువాత నేర్పడబోవు మానసజ్ఞానమున, గోచర మగును గానీ, ప్రస్తుతపు శాబ్దబోధలో గోచరము గాదు కనుక లింగమునకును దీనికిని వైలక్షణ్యము కదురును అని.

లిఙ్గం త్వేకపదార్థః కోపాదిః, అనన్విత ఏవ యః పదార్థాన్తరేణ ప్రకృతశక్యధర్మతాం శక్యాన్తరవ్యావృత్తతాం చ భజతే; ఉక్తధర్మస్తు న తథేత్యపి కేచిత్.

మరికొందరిట్లందురు. ఒక్కపదము నర్థమగు కోపాదులు లింగము. అనగా మరొక పదార్థముతో నన్వయించకయే ప్రస్తుతార్థము నందుండి మరొకదానియందుండనది యని పర్యవసానము ఇటుచెప్పబడిన సంసారనాశకత్వాది ధర్మము అట్లు లేదు అని.

ప్రకరణం వక్తృశ్రోతృబుద్ధిస్థతా. యథా–రాజానం సంబోధ్య కేన చిద్భృత్యేనోక్తే 'సర్వం జానాతి దేవః' ఇతి వాక్యే దేవపదస్య యుష్మదర్థే.

ప్రకరణము: వక్తకును శ్రోతకును మనసులో నుండుట. ఉ॥ రాజును సంబోధించి ఎవడైనా రాజభృత్యుడు, "దేవర కన్నియును దెలియును" అన్నపుడు అట దేవర యనుదాని యభిధను, 'తమరు' అనునర్థమున ప్రకరణము నియమించును.

లిఙ్గం నానార్థపద శక్యాన్తరావృత్తిరేకశక్యగతః సాక్షాచ్ఛబ్దవేద్యో ధర్మః. యథా–'కుపితో మకరధ్వజః' ఇత్యత్ర కోపో మకరధ్వజపదస్య.

లింగము: నానార్థమగు పదపుటర్థము మరొక యర్థమున నుండక ఒక్కయర్థముననే యుండి సాక్షాత్తుగా శబ్దముచే దెలియనగు ధర్మము. ఎట్లనగా "మకరధ్వజుడు కోపించెను" అను మాటలో కోపము "మకరధ్వజ" పదమునకు.

శబ్దస్యాన్యస్య సన్నిధిర్నానార్థపదైకార్థమాత్ర సంసర్గ్యర్థాన్తర వాచకపదసమభివ్యాహారః. యథా- "కరేణ రాజతే నాగః" ఇత్యత్ర కరపదస్య నాగపదమాదాయ నాగపదస్య చ కరపదమాదాయ శుణ్డాయాం గజే చ.

మరొక శబ్దపుసన్నిధి: నానార్థకమగు పదపు నర్థములలో నొక్క యర్థముతో మాత్రమే సంబంధించునట్టి మరొక యర్థమును జెప్పు పదపు సమభివ్యాహారము (కూడాకలిపి చెప్పట). 'నాగము కరముతో విలసిల్లును' అనుచోట "కర" పదమునకు సమభివ్యాహృతమైన నాగపదమును బట్టియు, "నాగ" పదమునకు "కర" పదమును బట్టియు తుండము, ఏనుగు అర్థము లందు (అభిధ నియమిత మగును).

న చాత్రైక శబ్దశక్తినియమనమపరశబ్ద శక్తినియమోఽపేక్షతే, యేనాన్యోన్యాశ్రయః స్యాత్, కింతు కరనాగశబ్దయోరర్థాన్తర గ్రహణేఽన్వయానుపపత్త్యా యుగపదేవ శక్తిర్నియమ్యతే.

అయితే ఇచట ఒకశబ్దపు శక్తి నియమనము రెండవ శబ్దపుశక్తినియమనము నపేక్షింపదు. కనుక అన్యోన్యాశ్రయము గాదు. కాని కర నాగ శబ్దములందు మరొకయర్థమును గ్రహించుచో నన్వయము కుదరక, నారెంటి యందను నొక్కసారిగానే శక్తి నియమింపబడును.

'దేవస్య పురారాతేః' ఇతి ప్రాచాముదాహరణే సురత్వ భూపత్వాభ్యాం దేవపదాన్నగరారిత్వాసురవిశేషారిత్వాభ్యాం పురారాతి పదాచ్చోపస్థితేరుభయోరపినానార్థత్వాదర్థాన్తరస్వీకారేఽప్యన్వయోపపత్తేశ్చ కథం శక్తేర్నియమః స్యాత్ ?

"దేవుడైన పురారాతి—" అను ప్రాచీనుల యుదాహరణమున దేవ-పదము దేవతగాను, రాజుగాను పురారాతి-పదము, నగరారిగాను, అసుర విశేషారిగాను యర్థమును దెల్పుటవల్ల ఈ రెండుపదములును నానార్థములు కనుక మరొకయర్థమును స్వీకరించినను అన్వయము కుదురును కనుకనున్నా శక్తి నియమింప వీలెట్లగును ?

న చ పురారాతిపదం యోగరూఢమ్, తథా చ రూఢేర్యోగా పహారితయా శివత్వేనై వతస్య బోధకత్వాద్దేవపద శక్తి నియామకతేతి వాచ్యమ్; పురారాతిపదస్య రూఢౌ మానాభావాత్.

అది కాదు— పురారాతిపదము యోగరూఢము కనుక రూఢివల్ల యోగము నపహరింపబడగా—"రూఢిః యోగమపహరతి"—ఆ పదము దన యర్థము శివుడనియే బోధించును. కాగా దేవపదపు శక్తినది నియమించును, అన దగదు. అసలు పురారాతిపదమునందు, రూఢి యున్నదనుటలో ప్రమాణము లేదు.

అథ 'దేవస్య త్రిపురారాతేః' ఇతి పాఠస్తథాపి పదాన్తరోప స్థాపితస్య త్రిపురాసురవైరిత్వస్య లిఙ్గతయా లిఙ్గోదాహరణత్వమేవాస్య స్యాత్ న తు శబ్దాన్తరసన్నిధ్యుదాహరణత్వమితి వదన్తి.

సరి- "దేవుడైనట్టి పురారాతి" అని పాఠము. అట్లయినను మరొక పదమున నుపస్థితమగు త్రిపురాసురవైరిత్వము లింగము కనుక నది లింగమునకే యగును, కాని శబ్దాన్తరసన్నిధి కుదాహరణము కాదని యందురు.

తత్రైకపదార్థః కోపాదిః పదార్థాన్తరేణానన్విత ఏవ యః ప్రకృతశక్యధర్మతాం శక్యాన్తరవ్యావృత్తతాం చ భజతే స లిఙ్గపదేనా త్రోక్త ఇతి ప్రాచామాశయే తు నోక్తదోషః.

అచట నొక పదము కోపాదికము మరొక పదార్థముతో నన్వయింపకయే ప్రకృతవాచ్యము నందుండునది గాను, మరొక శక్యమునందుండనిది గాను అయిన ధర్మమే ఇట లింగమున కర్థము, అని ప్రాచీనులు దలంచుచో మాత్రము వెనుక జెప్పిన దోషము లేదు.

యత్తు, 'శబ్దస్యావ్యభిచరితస్య సన్నిధిః సామానాధికరణ్యమ్' ఇతి కావ్యప్రకాశటీకాకారైరుక్తమ్, తత్తు 'కరేణ రాజతే నాగః' ఇత్యాదావవ్యాపనాత్తన్నియామకాన్తరస్య గవేషణే గౌరవాత్, 'కుపితో మకరధ్వజః' ఇతి తన్మూలోక్తే లిఙ్గోదాహరణేఽతివ్యాపనాచ్చోపేక్ష్యమ్.

"అవ్యభిచరితమగు శబ్దపుసన్నిధి సామానాధికరణ్యము" అని కావ్య ప్రకాశటీకాకారులనిరి. కాని, అది 'కరముతో ఏనుగు వెలయును' ఇత్యాదులందవ్యాప్తమగును. దానిని నియమించుటకై మరొకదానిని వెదకుచో గౌరవము. "మకరధ్వజుడు కోపించెను" అను ఆ టీకకు మూలమగు కావ్య ప్రకాశమున దెల్పబడిన లింగోదాహరణమున నది యతివ్యాప్తము గూడ నగును. కనుక నుపేక్షింపవలసినది.

సామర్థ్యం కారణతా, యథా – 'మధునా మత్తః కోకిలః' ఇత్యత్ర కోకిలమదజనకతా మధుశబ్దస్య వసన్తే.

సామర్థ్యము : అనగా కారణము. ఉ॥ "కోయిల మధువుతో మదించినది" అనుచోట కోయిలకు మదముగల్గించుట మధుశబ్దముయొక్క, అభిధను వసంతమునందు నియమించును.

'అత్ర కోకిలమాదనే మధోరేవ శక్తిర్న తు మధునః. మాదకత్వం మధున్యపీతి న లిఙ్గమ్' ఇతి వదన్తి. తత్ర సామర్థ్యం లిఙ్గాన్తర్గతమేవకుతో న స్యాత్, ఇతి శఙ్కాయాః కథమేతదుత్తరం సంగచ్ఛతే ?

ఇట కోకిలను మదింపజేయుటకు శక్తి మధువునకే – వసంతునకే యున్నది గాని మధువునకు–మద్యమునకులేదు. మాదకత్వము మధువునందు కూడ ఉన్నది. కనుక లింగముకాదు, అనియందురు అట సామర్థ్యము లింగాన్తర్గతమేయేల కారాదు ? అను నాశంకకు నీ సమాధానమెట్లు పొసగును ?

న చ మాదనసామర్థ్యస్య సురావృత్తితయా నాసాధారణధర్మతారూపం లిఙ్గత్వమితివాచ్యమ్, మాదనసామర్థ్యస్య సురావృత్తిత్వేఽపి కోకిలమాదన సామర్థ్యస్యవసన్తా సాధారణతయా లిఙ్గత్వస్య దుర్వారత్వాత్.

"మదింపజేయు సామర్థ్యము సురయందుకూడ ఉండును. కనుక నది యసాధారణమగు లింగముకాదు" అనరాదు. మాదనసామర్థ్యము కల్లునందున్నను కోకిలమాదనసామర్థ్యము వసంతునకే యసాధారణము. కనుక నిది లింగమనుటకు నడ్డేమి ?

న చ ప్రాణిమాత్రమాదన సామర్థ్యస్య మధునః కోకిలమాదన సామర్థ్యమప్యస్తీతి వాచ్యమ్; ఏవం సతి సామర్థ్యస్య వాచకతానియామకత్వమనుసంగతం స్యాత్, న తు మధున ఇతి స్వోక్తివిరోధశ్చ భవేత్. ప్రసిద్ధ్యాశ్రయే పునర్లిఙ్గత్వమప్యుచ్యతామ్. శాబ్దత్వాశాబ్దత్వాభ్యామేకానేకపదార్థత్వాభ్యాం వా విశేషస్తు స్యాత్.

అయితే- ప్రతిప్రాణిని మదింపజేయు సామర్థ్యమున్న మద్యమునకు కోకిలను మదింపజేయు సామర్థ్యము నుండును; అనెదరా? అట్లయినచో సామర్థ్యము వాచకత్వమును నియమించుననుట పోనేపోవును. మద్యమునకు లేదు అను తమ మాటయు దమకు విరోధించును. నను ప్రసిద్ధి నాశ్రయించినచో మాత్రము లింగత్వము తొలగదు. కాని శబ్దగోచ్యమగుటయు, నట్లు గాకుండుటయు వలనగానీ, ఒకపదమర్థమగుట, అనేకపదముల యర్థమగుట వలన గానీ లింగసామర్థ్యములకు భేదామౌను.

ఔచితీ యోగ్యతా. యథా-'పాతు వో దయితాముఖమ్' ఇత్యత్ర దయితాముఖస్య రక్షణకర్మత్వాపత్తి ప్రకామార్తానాం సంబోధ్య పురుషాణాం త్రాణం హి తస్యాః సాంముఖ్యేనైవ భవతి, న తు ముఖమాత్రేణ, వైముఖ్యే తేన త్రాణాయోగాత్. అత స్త్రాణార్హత్వం వదనసాంముఖ్యోభయప్రత్యాయకస్య ముఖశబ్దస్య.

ఔచితి-యోగ్యత ఎట్లనగా- "ప్రియురాలి ముఖము మిమ్ములను రక్షించుగాక". ఇట ప్రియురాలి ముఖము కర్తగానుండు రక్షణలో కర్మగా నాకర్షింపబడు కామార్తులగు పురుషులు (మిమ్ములను అనుపదముతో) సంబోధింపబడదగుదురు. వానిని రక్షించుట ప్రియురాలు సమ్ముఖురాలైననే పొసగును. అంతేగాని మొగము మాత్రమున కాదు. విముఖ మగుచో రక్షింప కుదరదు గదా? కనుక రక్షింప(బడ) దగియుండుట మొగమును, సాంముఖ్యమును, రెంటిని దెల్పు "ముఖ" శబ్దముయొక్క అభిధను (సాంముఖ్యమును) నియమించును.

దేశో నగరాదిః. యథా-'భాత్యత్ర పరమేశ్వరః' ఇత్యాదౌ పరమేశ్వరాదిశబ్దస్య రాజాదౌ. తస్య నగరాదిసంబన్ధ తదభావయోః సంభవేనాభావవ్యావృత్త్యర్థ మధికరణకీర్తనస్య సార్థక్యాత్. పరమాత్మనస్తు సర్వగతస్య వ్యావర్త్యాభావాత్తదుక్తి వైయర్థ్యాపత్తేః.

దేశము - పట్టణమువంటిది. ఎట్లనగా- "ఇట బరమేశ్వరుడు వెలుగొందును"- ఇటువంటిచోట పరమేశ్వర ఆది శబ్దమును రాజు మొదలగు వారి యందు, ఇటయని ఈతీరుగా దెల్పబడు పట్టణము మొదలగునది నియమించును. అతనికి పట్టణము మొదలగువానితోడి సంబంధముండుటయును లేకపోవుటయును దొలగించుటకై అధికరణమును, పట్టణమును, బేర్కొనుట సార్థకమగును. పరమాత్మకైనచో నతడంతటనుండును గనుక నధికరణమును దెల్పుట వ్యర్థముగావలసివచ్చును.

ఏవం "వైకుణ్ఠే హరిర్వసతి" ఇత్యత్రాపిబోధ్యమ్. ఏకత్రార్థాన్తరోపగ్రహేఽధికరణోక్తిర్వైయర్థ్యమ్, అపరత్ర తు తదధికరణత్వాప్రసిద్ధిరితి విశేషః.

ఈ తీరుగానే "వైకుంఠమున హరి యుండును" అనుచోటగూడ తెలియవలెను. అయితే మొదటియుదాహరణమునకు (ఇట పరమేశ్వరుడు వెలుగొందును అనుదానికిని) రెండవ యుదాహరణమునకును (వైకుంఠమున హరి యున్నాడను దానికిని) తేడా యేమనగా—

ఒకచోట : మొదటిచోట— రెండవ యర్థమును, దేవుని గ్రహించుచో నాధారమును నగరమును దెల్పుట వ్యర్థమగును. మరొకచోట నన్నచో నాతనికి-విష్ణువునకు స్థానము గనుక ప్రసిద్ధియని.

కాలో దివసాదిః. 'చిత్రభానుర్దినే భాతి' ఇత్యాదౌ చిత్రభాన్వాది పదానాం సూర్యాదిషు. ఏవం "చాతుర్మాస్యే హరిః శేతే" ఇత్యస్య.

కాలము-పగలు మొదలగునవి. ఉ:- "చిత్రభానుడు పగలు వెలుగొందును" అను నీరకపుచోట్ల చిత్రభానుడువంటి పదములను, సూర్యాదుల యందు (పగలు వంటి కాలము నియమించును). ఇట్లే-చాతుర్మాస్యమున (ఆషాఢ శుక్లైకాదశి మొదలు కార్తీక శుక్లైకాదశి వరకును నాల్గు నెలలు చాతుర్మాస్యమనబడును) హరి శయనించును అనుదానిని గ్రహింపవలెను.

వ్యక్తిః స్త్రీపుంనపుంసకలిఙ్గాని. యథా-"మిత్రోభాతి" "మిత్త్రం భాతి" ఇత్యత్ర మిత్త్రశబ్దస్య పుంనపుంసకే సుహృత్సూర్యయోః. ఏవం "నభో భాతి" "నభా భాతి" ఇత్యత్రాపి.

వ్యక్తి-(స్త్రీలింగము, పుంలింగము, నపుంసకలింగమును. ఎట్లనగా- మిత్రుడు అనుచోట మిత్రశబ్దము పుంలింగమును - నపుంసకలింగమును, సూర్యునందును-సుహృత్తునందును, అభిధను నియమించును.

ఇట్లే-'నభము (నపుంసకలింగము-ఆకాశము) భాసించును' 'నభస్సు- (పుంలింగము-శ్రావణమాసము) భాసించును' అనుచోట్లగూడ తెలియవలెను.

స్వర ఉదాత్తాదిః. యథా-'ఇన్ద్రశత్రుః' ఇత్యత్ర సమాసాన్తో దాత్తత్వమిన్ద్రశత్రుశబ్దస్యేన్ద్రస్యశత్రౌ. పూర్వపదప్రకృతిస్వరప్రా ప్తమాద్యుదాత్తత్వం త్విన్ద్రశత్రుకే ఆదినాభినయాదిపరిగ్రహః. యథా-"పద్దహామేత్తత్తణి ఆ" ఇత్యాదౌ.

స్వరము - ఉదాత్తము - అనుదాత్తము - స్వరితము మొదలగునవి. "ఇన్ద్రశత్రువు" అని. ఇటసమాసము అన్తోదాత్తమగుట "ఇన్ద్రశత్రు" శబ్దమును ఇన్ద్రునకు శత్రువునందు (అభిధను నియమించును). పూర్వపదపు ప్రకృతి స్వరముతో ప్రాప్తమగు నాద్యుదాత్తమును ఈసమాసపదము స్వీకరించుచో నింద్రుడు శత్రువుగాగల దానియందు (అభిధనియమింప బడును). మూలసూత్రములోని ఆదిపదములో నభినయాదులను గ్రహింప నగును.

ఉదా॥ ఇంతమాత్రము స్తనములు గలది

(ఏతావన్మాత్రస్తనికా ఏతావన్మాత్రాభ్యామఙ్గుల్యాభ్యాం ఏతావన్మాత్రావస్థా ఏతావన్మాత్రైర్దివసైః.)

అని ఇటువంటిది.

ఇహార్థసామర్థ్యౌచితీనాముదాహరణేషు చతుర్థ్యాద్యైస్తృతీ యాద్యైరర్థసామర్థ్యేన చ బోధ్యమానకార్యకారణభావ ఏవ నియా మకః, న తు వస్త్వన్తరమ్, బోధకవైచిత్ర్యాచ్చ నియామకస్య వైచిత్ర్యేణోక్తిః ప్రాచామ్.

ఈయభిధానియామకములలో నర్థము - సామర్థ్యము ఔచితి-వీని యుదాహరణములయందు చతుర్థి మొదలగువానిచేతను (అర్థమునొద్ద), తృతీయ మొదలగువానిచేతను (సామర్థ్యమునొద్దను), అర్థపు సామర్థ్యము చేతను (ఔచితి యొద్దను) బోధింపబడు కార్యకారణభావమే అభిధను నియ

మించును. అంతేగాని-మరొకటేదియునుగాదు. బోధకములు విచిత్రములు గనుక నియామకములను విచిత్రములుగా ప్రాచీనులు దెల్పిరి.

వస్తుతస్తు సంయోగాదీనా మర్థాన్తరసాధారణత్వే నానార్థశబ్దస్యార్థవిశేషే శక్తేః సంకోచ ఏవ న సంభవతి, నియామకానామ సంకుచితత్వాత్. అథప్రసిద్ధత్వాదినా తేషా మసాధారణతా బుద్ధిర్యథా కథంచిదుపపాద్యతే, తదా ప్రాయశో లిఙ్గభేదా ఏవైతే, న తు సర్వథైవ స్వతన్త్రాః ఇతి బోధ్యమ్.

నిజమునకు సంయోగాదులు అర్థాన్తరమునకు సాధారణములగుచో నానార్థకమగు శబ్దమున కర్థవిశేషమున సంకోచమేసంభవించదు. నియామకములు సంకుచితములు కావుకదా? ఇక ప్రసిద్ధిమొదలగు వానితో "నవి యసాధారణములు" అనుబుద్ధి నెట్లో కుదుర్తురా? అపుడవి యన్నియు సామాన్యముగా లింగవిషయములే-అంతేకాని అంతకన్న నవియెంతమాత్రము స్వతంత్రములు కావని తెలియవలెను.

## శబ్దశక్తిమూలాలంకారధ్వనిః

తత్ర శబ్దశక్తిమూలాలంకారస్య ధ్వనిర్యథా:-

'కరతలనిర్గలదవిరలదానజలోల్లాసితావనీవలయః
ధనదాగ్రమహితమూర్తిర్జయతితరాం సార్వభౌమోయమ్.'

అత్ర రాజప్రకరణే కర-దాన-ధనద-సార్వభౌమ శబ్దానాం శక్తౌ సంకోచితాయామపి తన్మూలకేన ధ్వననేనప్రతీయమానస్యార్థాన్తరస్యాప్రస్తుతస్యాభిధానం మా భూదితిప్రకృతాప్రకృతయోరుపమానోపమేయభావః ప్రధానవాక్యార్థతయాకల్ప్యత ఇత్యుపమాలంకారధ్వనిః.

అటశబ్దశక్తిమూలమున నలంకారధ్వని యెట్లనగా- "కరతలమునుండి విడువక స్రవించు దానజలముతో నుల్లసింపజేయబడిన భూమండలముగల్గి ధనదాగ్రమున మహితమగు రూపుగల యాసార్వభౌముని జయమెక్కువగా నున్నది". ఇట ఈ రాజప్రకరణమున కర-దాన-ధనద-సార్వభౌమపదముల శక్తిసంకోచింపబడినను, దాని మూలమున నేర్పడుధ్వనిచేత నర్థాన్తరము అప్రకృతమైనది ప్రతీతమగును. దానిని చెప్పుటవలన అప్రస్తుతప్రసంగమొనర్చి

నట్లగును. అది దోషము. కనుక అదిరాకుండవలెనని ప్రకృతాప్రకృతములగు రెండర్థములకు, నుపమానోపమేయ భావము ప్రధానమైన వాక్యార్థముగా గల్పింపబడును. కనుక - ఉపమాలంకారధ్వని.

అథ శ్లిష్టవిశేషణాయాం సమాసోక్తౌ వ్యఙ్గ్యస్యాప్రకృతవ్యవహారస్య ప్రకృతధర్మిణ్యారోప్యమాణస్య ప్రకృతోపస్కారకతయా యథా గుణీభూతవ్యఙ్గ్యత్వ మేవమిహాప్యుచితమ్.

అయితే - విశేషణములు శ్లేషించిన సమాసోక్తిలో నప్రకృతవ్యవహారము వ్యంగ్యమైనను ప్రకృత ధర్మియందు నారోపించబడినదై చమత్కారము నొదవించుటవలన గుణీభూతవ్యంగ్యత్వము నట నొప్పినముగదా? అట్లే ఇచటగూడ నంగీకరింపదగును.

న చోపమా ప్రకృతార్థోపస్కారికా న భవతీతి శక్యం వదితుమ్; 'ఉల్లాస్య కాలకరవాలమహామ్బువాహమ్,' 'భద్రాత్మనో దురధిరోహతనోః' ఇత్యాదౌ ప్రాచీనానాం పద్యే 'కరతల-' ఇత్యాదిప్రాగుదాహృతపద్యే చ వ్యఙ్గ్యోపమయా ప్రకృతస్య రాజ్ఞః ప్రకర్షస్య సకలానుభవసిద్ధత్వాత్. అనుభవాపలాపే తు సమాసోక్తావప్యప్రకృతవ్యవహారస్య ప్రకృతోపస్కారకత్వం నేతి సువచత్వాత్.

ఈయుపమ ప్రకృతార్థముల కుపస్కారమొనరింపదనరాదు. "ఉల్లాస్యకాల కరవాల మహాంబువాహం" "భద్రాత్మనో దురధిరోహతనోః-" ఇత్యాదికమగు ప్రాచీనులపద్యములందును "కరతల" ఇత్యాదికమగు వెనుక నుదాహరింపబడిన పద్యమునను వ్యంగ్యమగు నుపమ ప్రకృతుడగు రాజున కుత్కర్షను గల్గించుట యందరి యనుభవములకును గోచరమగుచునేయున్నది కదా? అనుభవమునపలపించుచో సమాసోక్తియందుగూడ అప్రకృతవ్యవహారము పకృతోపకారకము కాదనవచ్చును.

నను సమాసోక్తావత్ర చాస్తి విశేషః-యత్తత్ర వ్యవహారిణో నానార్థశబ్దానుపస్థాప్యత్వమ్, ఇహ తు తదుపస్థాప్యత్వమితి చేత్; కించాతః? న హి వ్యవహారిణో నానార్థశబ్దోపస్థాప్యతామాత్రేణాప్రకృతధర్మినిరూపితాయా ఉపమాయాః ప్రకృతధర్మ్యుపస్కారకత్వం వార్యతే, యేన గుణీభూతవ్యఙ్గ్యత్వం న స్యాత్.

అయ్యా? సమాసోక్తికిని ప్రకృతమునకును భేదమున్నది. ఏమంటే? అచట (సమాసోక్తిలో) వ్యవహారినానార్థకములగు పదములచే వ్యవహరింప (చెప్ప) బడదు. ప్రకృతములో నావ్యవహారి నానార్థకపదములచే చెప్పబడును. అనెదరా? అయిననేమి? వ్యవహారి, నానార్థకములగు పదములచే నుపస్థాపింప బడినంతమాత్రమున అప్రకృతధర్మి నిరూపితయగు నుపమకు ప్రకృతధర్మి నుపస్కరించుట వారింపబడదుగదా? అట్లైననే గుణీభూతవ్యంగ్యత్వము లేక పోవును.

న చాత్రోపమాదీనామలంకారాణాం స్వభావతః సున్దరత్వా త్కావ్యప్రవృత్త్యుద్దేశ్యతయా చ వస్తుమాత్రే గుణీభావో న సంభవతి, యథా వస్తుమాత్రేణాభివ్యక్తానామలంకారాణామ్, తుల్యన్యాయ త్వాత్, అప్రకృతవ్యవహారస్య తు సమాసోక్త్యవయవస్య నిరలంకార తయా వస్తున్యుపకారకత్వం సమాసోక్తావవిరుద్ధమితి వాచ్యమ్; ఏవ మపి 'బాధేఽదృఢేఽన్యసామ్యాత్కిం దృఢే తదపి బాధ్యతామ్' ఇతి న్యాయేనోక్తయుక్తేః శిథిలత్వాత్; అపరాఙ్గతాయా దురపహ్నవ త్వాత్.

ఒకప్పుడు మీరిట్లనవచ్చును-ఇచట నుపమాద్యలంకారములు సహజము గనే సుందరములు, కావ్యప్రవృత్తికి నుద్దేశ్యములు గనుక వస్తుమాత్రమున గుణీభావము సంభవింపదు. చూచుట లేదా వస్తుమాత్రమున నభివ్యక్తములగు నలంకారములను? న్యాయసామ్యమునుబట్టియే ఇది ఇట్లు తీర్పబడినది. సమాసోక్త్యవయవమగు అప్రకృతవ్యవహారము అలంకారముకాదు, కనుక అది వస్తువునకుపస్కారమగుట సమాసోక్తియందు విరుద్ధముగాదు; అనకుడు. ఇట్లైనను "బాధే దృఢే అన్యసామ్యాత్కిం, దృఢేఽన్యదపిబాధ్యతామ్" అను న్యాయముచే మీరుచెప్పిన యుక్తి శిథిలమగుచుండలేదా? ఇతరమునకంగ మగుటతప్పనిదేకదా?

అథోచ్యేత - ఉపమానముపమేయం సాధారణో ధర్మ ఇతి హ్యుపమాశరీరఘటకమ్, న తు తతః పృథగ్భూతమ్, తైర్వినా తస్యా అనిష్పత్తేః. ఇత్థం చోపమేయస్య సాదృశ్యాంశేనోపస్కారేఽప్యుప మాయా నాపరాఙ్గత్వమ్, ఉపమేయస్యాపరత్వాభావాత్, యథా సమాసోక్తావప్రకృతవ్యవహారేణ ప్రకృతస్యోపస్కరణేఽపి నసమాసో

_క్తేరపరాఙ్గత్వమ్, ప్రకృతాప్రకృతఘటితత్వాత్, ఏవమిహాపి స్యాదితి. తథాపి సమాసోక్తేరివాస్యాపి ప్రభేదస్య గుణీభూతవ్యఙ్గ్యత్వాపత్తేః, అస్యేవ వా సమాసోక్తేరపి ధ్వనివ్యపదేశ్యత్వాపత్తేః.

మీరిట్లనవచ్చును-ఉపమానము, ఉపమేయము. సాధారణధర్మము, అనికదా యుపమా శరీరఘటకము. ఇంతకన్న వేరేదియును లేదు. ఇవిలేనిచో నుపమ నిష్పన్నముకాదుగదా? ఇపు డుపమేయమునకు సాదృశ్యాంశముగను యుపస్కరించినను ఉపమ అన్యాంగముగాదు. ఉపమేయ మన్యముకాదు కదా? ఎట్లనగా-సమాసోక్తిలో నప్రకృతాంశమగు వ్యవహారము ప్రకృతాంశమునకుపస్కారమొనర్చినను అదిప్రకృతమునకు నుపస్కారమేయగును కాని మరొకదాని కంగము కాలేదుగదా? మిగిలిన సమాసోక్తి, ప్రకృతము అప్రకృతము, గలసియేయగునుకదా? ఈతీరే ప్రకృతములో గ్రహింపవలెను. కాని సమాసోక్తివలె ప్రకృతగుణంప (ప్రకృతోపమాస్థలీయ వ్యంగ్యముకూడ) గుణీభూతవ్యంగ్యము కావలెను లేదా దీనివలెనే సమాసోక్తిస్థలముకూడ ధ్వనిగావలయును (కదా).

అన్యచ్చ-శ్లేషే హి శ్లేషభిత్తికమభేదాధ్యవసానం ద్వయోరర్థయోరితి సకలాలంకారికనిబద్ధమ్; అనుభవసిద్ధం చ. తత్ర మూలాన్వేషణే విధీయమానే ఏకపదోపాత్తత్వాన్న శక్యతే మూలమన్యన్నిర్వక్తుమ్. ఏకపదోపాత్తో హ్యనేకోఽప్యర్థోఽభిన్నతయైవ భాసతే, ఇత్థం చ - 'ఉల్లాస్య కాలకరవాల-' ఇత్యాదావప్యేకపదోపాత్తతయా ద్వయోరర్థయోరభేదాధ్యవసానస్య యుక్తత్వేనాభేదస్యైవ వ్యఙ్గ్యత్వముచితమ్,-నోపమాయాః.

మరొకవిషయము-శ్లేషయందు శ్లేషభిత్తికాభేదాధ్యవసానము రెండర్థములకుండుననియు, నాలంకారికులకందరికి సమ్మతమగు విషయము అనుభవసిద్ధమును. దానిమూలమున వెదుకగా నొకపదముతో జెప్పుటకన్న, మరియొకమూలమును నిర్వచింప వీలుకాదు. ఒకపదముచే నుపాత్తములగు ననేకార్థములైనను అభిన్నముగానే భాసించును. అట్లే-'ఉల్లాస్యకాలకరవాల' ఇత్యాదులందు ననేకపదోపాదానముచే రెండర్థములకు నభేదాధ్యవసానము యుక్తమగుటచే, నభేదమే వ్యంగ్యమగుట ఉచితము. ఉపమ వ్యంగ్యమగు ననుట ఉచితముగాదు.

శ్లేషే ద్వయోరర్థయో ర్వాచ్యత్వం ఏకకాలత్వం చ. ఇహ త్వేకస్యైవ వాచ్యత్వమ్, అపరస్యవ్యఙ్గ్యత్వం భిన్నకాలత్వం చేతి. ఏతావన్మాత్రేణైవైకపదోపాత్తత్వప్రయుక్తమభేదాధ్యవసానం న శక్యం త్యక్తుమ్,- వ్యఙ్గ్యతాయా భిన్నకాలత్వస్య చాభేదప్రతిపత్తావబాధకత్వాత్. ఏతేన-'రూపకస్యోపమాజ్ఞానాధీనజ్ఞానత్వేన ప్రథమోపస్థితతయా తస్యా ఏవ సంబన్ధత్వం కల్ప్యమ్' ఇది కావ్యప్రకాశటీకాకారైరుక్తం నాతీవ శ్రద్ధేయమితి. ప్రకృతమనుసరామః.

శ్లేషయందు రెండర్థములు, వాచ్యములగుటయు వానికేకకాలత్వము నుండును. ఇటనన్నచో ఒకటి వాచ్యమగుటయు, వేరొకటి వ్యంగ్యమగుటయు, వేరుకాలములదగుటయునుండును. ఇంతమాత్రముచేతనే ఒకపదముచే జెప్పుటకు వీలగుపక్షమున, ఏర్పడునట్టి యభేదాధ్యవసానము వదలివేయుటకు వీలుండదు. ఏలననగా-వ్యంగ్యత్వము, భిన్నకాలత్వము, అభేదప్రతిపత్తికే మాత్రము బాధకములుగావుకదా ? ఇందువలన "ఉపమాజ్ఞానమున్ననేగాని, రూపకజ్ఞానమేర్పడదు, కనుక ఉపమకే సంబంధత్వకల్పన ముచితము" అను కావ్యప్రకాశటీకాకారుల పలుకులయెడ నెక్కువశ్రద్ధ వహింపదగదు. ప్రకృతమనుసరింతము.

ఏవమలంకారాన్తరమపి శబ్దశక్తిమూలానురణనస్య విషయః. యథా యమునావర్ణనే-'రవికులప్రీతి మావహన్తీ నరవికులప్రీతిమావహతి. అవారితప్రవాహో సువారితప్రవాహో'. ఇహ నరాణాం వీనాం చ కులస్య ప్రీతిమావహతీతి ప్రకృతేఽర్థేసిద్ధే రవికులప్రీతిం నావహతీతి ద్వితీయోఽప్రకృతోఽర్థః విరోధశ్చ. ఏవమన్యత్రాపి. యది తు 'రవికులప్రీతిమావహన్త్యపి న రవికులప్రీతి మావహతి; అవారితప్రవాహోపి సువారితప్రవాహో' ఇత్యపిరన్తర్భావ్యతే తదా విరోధాంశస్యాపినోక్తత్వాత్ ద్వితీయార్థస్య చ తదాక్షిప్తత్వాన్న ధ్వనిత్వమ్. నిపాతానాం ద్యోతకతానయేఽపి స్ఫుటద్యోతితస్య తదాక్షిప్తస్య చ వాచ్యకల్పత్వాన్న తథాత్వమ్.

ఈలాగే మరియొక యలంకారముగూడ శబ్దశక్తి మూలకమగు ననుకరణమునకు విషయమగును. ఎట్లనగా-యమునావర్ణనములో ('రవికుల' మొ.) నరులయొక్కయు పక్షులయొక్కయు కులమునకు ప్రీతి ఆవ

హించినది అనునర్థము సిద్ధముకాగా తరువాత రవికులమున ప్రీతినావ హించుటలేదు అని అప్రకృతమగునర్థమును, విరోధమును స్ఫురింపును. ఇట్లే మరియొకయెడ యూహింపవలయును. అయితే 'రవికుల ప్రీతిమానసఘంత్యాపి న రవికులప్రీతిమావహతి, అవారితప్రవాహోపి సువారితప్రవాహః' అని అపి-అనుదాని నుద్భావించుచో విరోధాంశము అపిచే చెప్పబడును. రెండవ యర్థము వానిచే నాక్షిప్తముగనుక ధ్వనిశబ్దము "నిపాతములు ద్యోతక ములు" అను నీతిలోనైనను స్ఫుటముగా ద్యోతితములను, వానిచే నాక్షిప్త ములును, వాచ్యములవంటివే గనుక వెనుకటివలెనే ధ్వనిశబ్దము లేదు.

నను 'మృణాలవలయాది దవదహనరాశిః' ఇత్యత్ర విరోధాంశా సస్య కథం వాచ్యాలంకారత్వమ్, విరోధాంశస్య శబ్దవాచ్యతావిర హేణ వ్యఙ్గ్యతాయా ఏవాభ్యుపగన్తవ్యత్వాత్.

అయితే- మృణాలవలయాదికము దవదహనరాశి- అనుచో విరోధా లంకారము ఎట్లువాచ్యమగును? విరోధాంశము శబ్దముచే వాచ్యముకాదు కనుక వ్యంగ్యమనియే ఒప్పుకొనవలయును గదా?

న చ విరోధవిశిష్టాభేదస్య సంసర్గత్వాద్వాచ్యార్థబోధ విషయ తయా విరోధస్య వాచ్యత్వమితి వాచ్యమ్; విరోధాభేదయోః పరస్పర విరుద్ధత్వేనైకకాలావచ్ఛేదేనైకసంసర్గత్వస్యానుపపత్తేః. నామార్థ యోరభేదస్యైవ సంసర్గతయా విరోధస్యాపి సంసర్గత్వే మానాభా వాచ్చ; పర్యన్తే దవదహనరాశిపదస్య సదృశలాక్షణికతయా విరోధాం శస్య తిరోధానాచ్చ.

విరోధవిశిష్టాభేదము సంసర్గమగుటవలన వాచ్యార్థబోధవిషయముగా విరోధము వాచ్యమే యనరాదు. ఇది విరోధము, అభేదము, ఇవిరెండును పరస్పరము విరుద్ధములు. ఒకేసమయములో యీరెండునుకలసి సంసర్గము కుదురదు. నామార్థముల కభేదము సంసర్గము గనుక విరోధముకూడ సంసర్గమనుటకు ప్రమాణములేదు. చివఱకు దవదహనరాశి పదము సదృశ మున లాక్షణికము. కనుక విరోధాంశ మంతర్హితమగును.

మైవమ్. ఉక్తపద్యస్య విరోధోదాహరణతామాత్రే తాత్పర్యాత్, వ్యఙ్గ్యత్వేఽపి తథాత్వస్యానపాయాత్. వాచ్యవిరోధోదాహరణ తాయాం త్వపిరన్తర్భావ్యః.

ఇది సరికాదు—ఈ పద్యము విరోధోదాహరణమని మాత్రమే అభిప్రాయము. విరోధము వ్యంగ్యమైనను, విరోధోదాహరణమగుటలో బాధలేమ, వాచ్య విరోధమునకు ఉదాహరణమున మాత్రమున "అపి"ని యంతర్భవింప జేసికొనవలెను.

కేచిత్తు-'విరోధస్య వ్యఙ్గ్యత్వేఽపి విరోధిద్వయస్య వాచ్యతామాత్రేణ విరోధాభాసస్య వాచ్యాలంకారవ్యపదేశోపపత్తిః, ఇత్థమేవ చాంశాన్తరస్య వ్యఙ్గ్యత్వేఽప్యేకాంశమాదాయ సమాసోక్త్యాదీనామపి వాచ్యాలంకారవ్యపదేశః' ఇత్యాహుః.

కొందరు విరోధాంశము వ్యంగ్యమైనను విరోధులిద్దరను వాచ్యమైనంతమాత్రముననే విరోధాభాసము వాచ్యాలంకారమని వ్యపదేశించుట జరుగును. ఈత్రోవనే మరొక యంశము మాత్రము స్వీకరించి, సమాసోక్త్యాదులు వాచ్యాలంకారములు అని వ్యవహరించుటలేదా? అని అనెదరు.

యథావా:-

'కృష్ణపక్షాధికరుచిః సదా సమ్పూర్ణమణ్డలః
భూపోఽయం నిష్కలఙ్కాత్మా మోదతే వసుధాతలే.'

అత్ర భగవత్పక్షాధికప్రీత్యాదిలక్షణే ప్రకృతభూపోపయోగిత్వాత్ ప్రకృతేఽర్థే శక్త్యాప్రతీతిపథమవతీర్ణే ద్వితీయోఽర్థోఽప్రకృతో వైధర్మ్యాత్మా తత్ప్రయుక్తో వ్యతిరేకశ్చ.

మరొక యుదాహరణము- 'కృష్ణపక్షాధిక' మొ. ("బహుళపక్షము (కృష్ణునిపక్షము)న నెక్కుడు ప్రీతియు నెల్లప్పుడును మండలమునిండి యీ రాజు (చంద్రుడను) నిష్కళంకాత్ముడై మిక్కిలికాంతితో ప్రకాశించుచున్నాడు".). ఇట "భగవానుని పక్షమునందు ఎక్కువప్రీతి" మొదలగు స్వరూపములో ప్రకృతుడగు రాజున కుపయోగించును. కనుక ప్రకృతమగు నర్థము శక్తివలన ప్రతీతిమార్గమున నవతరింపగా రెండవయర్థము అప్రకృతమై వైధర్మ్య స్వరూపమై దానివలన ప్రయుక్తమైన వ్యతిరేకము స్ఫురించును.

న చాత్ర వ్యతిరేకస్య కవిగతరాజవిషయకరతిభావోత్కర్షకతయా గుణీభూతస్య కథం ధ్వనివ్యపదేశహేతుత్వమ్? ప్రధానస్యైవ

ధ్వనివ్యపదేశహేతుర్భావ్యః, ఇతి వాచ్యమ్; ఉదాసీనే వక్తరి సత్త్వాద్యర్థకథనపరస్యాస్య పద్యస్య వక్తృగతరతివ్యఞ్జకత్వాయోగాత్, గుణీభూతస్యాప్యర్థస్య వాచ్యార్థాపేక్షయా ప్రధానతయా ధ్వనివ్యపదేశహేతుతాయాః ప్రాచీనైః స్వీకారాచ్చ. అన్యథా—

'నిరుపాదానసంభారమభిత్తావేవ తన్వతే
జగచ్చిత్రం నమస్తస్మై కలాశ్లాఘ్యాయ శూలినే.'

ఇత్యత్ర వ్యతిరేకధ్వనిత్వం తైరుక్తమసంగతం స్యాత్. వ్యతిరేకస్య భగవద్విషయకరతిభావాఙ్గతాయా అనుభవసిద్ధత్వాత్.

అయితే వ్యతిరేకరూపమైన యర్థము కవియందు రాజునుగురించిన రతిభావమున కుత్కర్షమును గొనితెచ్చుటవలన గుణీభూతవ్యంగ్యము కనుక ధ్వనియని వ్యపదేశించుట అయుక్తము. ప్రధానమైననే ధ్వనియనదగును కదా అనరాదు. వక్తయగువాడు ఉదాసీనుడైనపుడు ఉన్నదానినున్నట్లు చెప్పుటయే సరికనుక, ఇది వక్తృగతరతివ్యంజక మనరాదు కదా! మఱియు గుణీభూతమైన అర్థముకూడ వాచ్యార్థమునకన్న ప్రధానమేనుక ధ్వనియని వ్యవహరింప వీలగునని ప్రాచీనులనిరి. అట్లుకానిచో 'నిరుపాదాన' ఇత్యాదిశ్లోకమునందు ("ఉపాదాన సంభారము లేకుండగనే అభిత్తియందే జగత్తనెడి చిత్రమును, విస్తరించుచున్న కలాశ్లాఘ్యుడైన శివునకు నమస్కారము—") వారు చెప్పు ధ్వనిత్వ మసంగతమగును. ఏమనగా వారుచెప్పు వ్యతిరేకము భగవద్విషయమునగల రతిభావమున కంగమగుట, మన యనుభవములోనిదే కదా?

## శబ్దశక్తిమూలవస్తుధ్వనిః

శబ్దశక్తిమూలవస్తుధ్వనిర్యథా—

"రాజ్ఞోమత్ప్రతికూలాన్మే మహద్భయముపస్థితమ్
బాలే! వారయ పాన్థస్య వాసదానవిధానతః"

అత్రోపభోగం దేహీతి వస్తు రాజపదశక్తిమూలానురణన విషయః. రాజపదాచ్చన్ద్రోపస్థితావేవ చన్ద్రజనితభయవారణకారణత్వేనోపభోగస్యాభివ్యక్తేః.

శబ్దశక్తిమూలకవస్తుధ్వని–ఎట్లనగా. 'రాజ్ఞః' ఇత్యాది పద్యమునందు

(నాకు విరోధియగు రాజునుండి గొప్పభయము పట్టించినది. ఓబాలా! పాంథునకు నిఖువనీడ నొసగు నేర్పాటొనరించి వానిని వారింపుము.) "ఉపభోగమునే" ఇమ్ము అనువస్తువు రాజపద శక్తిమూలకమగు నను రణనధ్వనికి గోచరము. రాజపదమున చంద్రుడుపస్థితుడైన నాతనినుండి భయమును వారించుటకు కారణముగా నుపభోగ మభివ్యక్తమగును.

న చాత్ర నృపచన్ద్రయోరుపమానోపమేయభావః భేదాపోహారూపం రూపకం వా తథాస్త్వితి వాచ్యమ్; ఇహ నృపరూపస్యార్థస్య చన్ద్రరూపార్థగోపనమాత్రార్థముపాత్తత్వేన యుగపదుల్లసితోపమానోపమేయకయోరుపమారూపకయోస్తాత్పర్యవిషయతాయా అయోగాత్.

ఇచట నృప-చంద్రులకు, నుపమానోపమేయ భావముగాని, భేదాపోహరూప రూపకముగానీ అనురణనవిషయము అని భ్రమకూడదు. ఇచట నృపరూపమగు నర్థము చంద్రరూపమగు నర్థమును క్రమ్మివేయుటకు మాత్రమే మపాత్తమైనదిగాన ఉపమారూపకముల నొక్కసారే ఉపమానోపమేయములుల్లసిల్లును గనుక అవి తాత్పర్యవిషయనులుగావు.

న చా సంసృష్టార్థద్వయబోధనే వాక్యభేద ఇతి వాచ్యమ్; తుల్యకక్షతయా ద్వయోరసంసృష్టయోరర్థయోః ప్రతిపిపాదయిషితత్వ ఏవ తస్యాభ్యుపగమాత్. ఇహ త్వాచ్ఛాదకప్రతీతిసమయే ఆచ్ఛాద్యాప్రతీతిః, ఆచ్ఛాద్యప్రతీతౌ చాచ్ఛాదకన్యగ్భావ ఏవేతి నాస్తి తుల్యకక్షతా.

పరస్పర మసంబద్ధములగు రెండర్థములు చెప్పబడుటవలన వాక్యభేదమనరాదు. సమకక్షములగు రెండర్థములను, పరస్పరాసంబంధములను; ప్రతిపాదింపదలచినపుడే వాక్యభేదము ప్రసక్తించును. ఇచట నాచ్ఛాదకమగునర్థము (నృపరూపార్థము) స్ఫురించునపుడు, ఆచ్ఛాద్యమగునర్థము చంద్రరూపమగు నర్థము స్ఫురింపదు. ఆచ్ఛాద్యమగు నర్థము స్ఫురించునపుడు ఆచ్ఛాదకమునకు న్యగ్భావము కనుక సమకక్షత అర్థద్వయమునకు లేదు.

కావ్యప్రకాశే తు-'శనిరశనిశ్చ తముచ్చైః' ఇత్యాదిక ముదాహృత్య 'అత్ర విరుద్ధౌ ద్వావపి త్వదనువర్తనార్థమేకం కార్యం కురుత

ఇతి ధ్వన్యత' ఇత్యుక్తమ్. తచ్చ 'ద్వౌ శన్యశనీ ఉదారానుదారౌ చైకం కార్యం హననం భానం చ' ఇతి వ్యాఖ్యాతృభిర్వ్యాఖ్యాతమ్. తత్ర. శన్యశన్యోర్హననక్రియా కర్తృత్వాన్వయేఽప్యుదారానుదార యోర్భానకర్తృ తత్పదార్థ విశేషణయో స్తత్ప్రకారవిశేషణయోర్వా సాక్షాద్భానకర్తృత్వాన్వయాభావాత్ కథమేకకార్యకారిత్వం సంగతం స్యాత్? అతో విరుద్ధౌ ద్వావిత్యాది ప్రథమార్ధవిషయమ్. ద్వితీయార్ధే తు విరోధాభాస ఏవ.

కావ్యప్రకాశమున-శనిరశనిశ్చ గముచ్చైః-అను పద్యము నుదాహరించి, ఇచట విరుద్ధులిద్దరు నిన్ననుసరించుటకై నొకపనిచేయుచున్నారు అనివ్యక్తమగును. అదియు నిద్దరు, శనియు-అశనియు, ఉదారుడు, అనుదారుడు, ఒకపనిని-హననమును-భానమున్ను అనివ్యాఖ్యాతలు వ్యాఖ్యానించిరి. అచట శన్యశనులకు హననక్రియయందు కర్తలు గనుక దానితో నన్వయమున్నను ఉదార-అనుదారులకు, భానకర్తృతత్పదార్థ విశేషణములకు, లేదా తత్ప్రకార విశేషణములకుగాని భానకర్తృత్వముతో సాక్షాత్తుగా నన్వయము లేదు. కనుక ఒక కార్యముచేయుచుండుటయెట్లు? అసంగతమగును. కనుక విరుద్ధులిద్దరు ఇత్యాదికము మొదటి సగమునుగురించినదే. ఇక రెండవ సగములో విరోధాభాసమే.

కర్తర్యభేదాన్వయమాత్రేణ "కురుత" ఇత్యస్యోపపత్తిశ్చేత్; అస్తు ద్వితీయార్ధేఽపి విరుద్ధౌ ద్వావిత్యాదివస్తు వ్యఙ్గ్యమ్. పరంత్వర్ధద్వయేఽపి విరోధాభాసాలంకారశబలితమేవ. శత్రువిరుద్ధస్య శత్రుత్వాసంభవాదేకస్య శన్యశనికర్తృకహననకర్మత్వాయోగేనాద్యార్ధే ఉదారత్వానుదారత్వయోరేకాధికరణ వృత్తిత్వాయోగాద్ద్వితీయార్ధే చ విరోధస్య స్ఫుటత్వాత్.

వెనుకటి కర్తయందు నభేదముతో నన్వయించినంతమాత్రమువలన "కురుతః" చేయుచున్నారు, అని దీని కుపపత్తియనుచో రెండవ సగములో గూడ విరుద్ధులిద్దరు ఇత్యాదికము వస్తువు వ్యంగ్యమగును. కాని రెండర్థము లందును విరోధాభాసముతో శబలతయే. శత్రువిరుద్ధుడు శత్రువుకాజాలడు కనుక, ఒక్కడు శన్యశనికర్తృకమగు హననక్రియలో కర్మకాడు కనుక మొదటియర్థము లోనగును. ఉదారతానుదారతలు ఒకేయధికరణమున

నుండుట పొసగదు కాబట్టి రెండవయర్థముకును విరోధము సమమగును కావున.

## అర్థశక్తిమూలవస్తుధ్వనిః

అర్థశక్తిమూలానురణనం యథా

'గుఞ్జన్తి మఞ్జు పరితో గత్వా ధావన్తి సంముఖమ్.
ఆవర్తన్తే నివర్తన్తే సరసీషు మధువ్రతాః.

అత్ర మధువ్రతకర్తృక మఞ్జు గుఞ్జనాద్యైర్వస్తుభిః కవికల్పితత్వవిరహేణ స్వతఃసంభవిభిరాసన్నసరసిజోత్పత్తిధ్వననద్వారా శరదాగమన నైకట్యరూపం వస్తు వ్యజ్యతే.

అర్థశక్తిమూలకమగు ననురణనమునకు నుదాహరణము. 'గుంజంతి' మొ॥ ఇచట మధువ్రతము లొనరించు గమనాగమనాదులు కవికల్పితములు గావు. స్వతస్సిద్ధములు. సరసిజోత్పత్తి చేరువైనదనియు ధ్వనించును. దాని వలన శరత్తురాక సమీపించినదను వస్తువు ధ్వనించును.

కావ్యప్రకాశేతు-'అలససిరోమణిధుత్తాణాం అగ్గిమ ఇత్యాద్యుదాహృత్య 'మమైవోపభోగయోగ్య ఇతి వస్తు వజ్యతే' ఇత్యుక్తమ్. తత్రకేన వస్తు నేదం వస్తు వ్యజ్యతే ? న తావదలసశిరోమణిత్వాదికాన్త విశేషణైః, తేషాం ధాత్ర్యాదివృద్ధస్త్రీ నిరూపితత్వేన 'తవైవోపభోగ యోగ్యః' ఇత్యాదిరూపేణైవ వ్యఙ్గ్యస్య వక్తవ్యతాపత్తేః. విశేషణానాం కామినీనిరూపితత్వేతు మమైవేత్యాది వ్యఙ్గ్యాకారః స్యాత్. నాపి పరిఫుల్లవిలోచనత్వేన, తస్య హర్షభావానుభావత్వేన హర్షవ్యఞ్జకతాయా ఏవ క్లప్తత్వాత్. మదుపభోగయోగ్యత్వం హి హర్షభావస్య విభావః. నహ్యనుభావైర్విభావో వ్యజ్యత ఇతి తద్విభావవ్యఞ్జనం శక్యం వక్తుమ్. కేవలస్య పరిఫుల్లవిలోచనత్వస్య మమైవేత్యాది వ్యఙ్గ్య వ్యఞ్జనే సామర్థ్యాభావాత్. పుత్రాగమన ధనప్రాప్త్యాది విభావకేఽపి హర్షభావే పరిఫుల్ల విలోచనతాయా అనైకాన్తికత్వాదితి.

కావ్యప్రకాశమునందన్ననో 'అలస సిరోమణి ధుత్తాణం అగ్గిమ'-ఇత్యాదిగానుదాహరించిరి. నాకే యనుభవింపదగినవాడు అనువస్తువు వ్యంగ్యమగును అనబడినది. అయితే - ఆచోట నేవస్తువు ఈవస్తువును వ్యంగ్య

మొనర్చును? అలసశిరోమణిత్వాదికములగు విశేషణములా? అవి దాదిమొద లగుముసలివారిచే నిరూపించబడినవి. కనుక 'నీకే యుపభోగ్యుడు' ఇత్యాది రూపముతోనే వ్యంగ్యము నుడువ వలసివచ్చును. విశేషణము కామినీ నిరూపితమగుచో మాత్రము నాకే ననురూపముతో వ్యంగ్యమేర్పడును. (అట్లుకాదుగదా యిచట). పోనీ-పరిఫుల్లవిలోచన మట్టిది కారాదా? అది హర్ష భావమునకనుభావముకనుక నది హర్షమునకు వ్యంజకముగానే యేర్పడును. ఇచట నాకుపభోగ్యుడను నది హర్షమునకు విభావము అనుభావము లచే విభావము వ్యక్తీకరింపబడదుగాన పరిఫుల్లవిలోచనత్వము హర్ష విభావ మగు మదుపభోగయోగ్యత్వమునకు వ్యంజకము అనిచెప్పుటకు వీలుగాదు. కేవలము, ఒక పరిఫుల్లవిలోచనత్వమునకు 'నాకే అనుభవయోగ్యుడు' మొద లగు వ్యంగ్యమును వ్యంజనమొనర్చుటకు సామర్థ్యము లేదు. బిడ్డలు వచ్చుట-ధనము ప్రాప్తి - మొదలగునవి విభావగములుగా నున్నను హర్ష భావమున పరిఫుల్లవిలోచనత్వమేర్పడును, అదియనైకాన్తికముగదా?

సత్యమ్. "ఇఅ భణిమ్మి" ఇత్యాద్యర్థవశప్రాపితాలస శిరోమణిత్వాది విశేషణశ్రవణ విశిష్టప్రఫుల్ల విలోచత్వేన మదుపభోగయోగ్యత్వ లక్షణవిభావాభివ్యక్తిద్వారా హర్షభావోఽభివ్యజ్యతే. తత్ర ద్వారీభూతవిభావాభివ్యక్తిమాదాయ కావ్యప్రకాశగ్రన్థ సంగతిః.

నిజమే-(ఇయభణమ్మి)-ఇతిభణితేన-ఇత్యాద్యర్థవశమున ప్రాప్తించిన అలస శిరోమణిత్వాదికమగు విశేషణశ్రవణముతోగూడిన ప్రఫుల్లవిలోచనత్వముచేత 'నాకుపభోగ్యుడు' అగుటయే స్వరూపముగానున్న విభావపువభివ్యక్తి ద్వారా హర్షభావ మభివ్యక్తమగుచున్నది. అచటద్వారమగు విభావాభివ్యక్తిని బుచ్చుకొని, కావ్యప్రకాశగ్రంథమును సరిపెట్టుకొనవలెను.

న చ భావధ్వనేః సంలక్ష్యక్రమత్వాపత్తిః, ద్వారస్య సంలక్ష్యక్రమత్వాదితి వాచ్యమ్; ఇష్టాపత్తేః. న చాపసిద్ధాన్తః; తస్య ప్రాగేవోద్ధారాత్.

అయితే-భావధ్వని సంలక్ష్యక్రమవ్యంగ్యము గావలసి నస్తున్నదే. ద్వారము సంలక్ష్యక్రమముకదా? అందురా? ఇష్టమే-అయితే అపసిద్ధాంతముకాదా? అనుచో నది మొదటనే దొలగించితిమిగదా!

'మృద్వీకారసితా సితా సమసితా స్ఫీతం నిపీతం పయః
స్వర్యాతేన సుధాప్యధాయి కతిధా రంభాధరః ఖండితః,
సత్యం బ్రూహి మదీయజీవ భవతా భూయో భవే భ్రామ్యతా
కృష్ణేత్యక్షరయోరయం మధురిమోద్గారః క్వచిల్లక్షితః.'

అత్ర నికృష్టజీవసంబోధ్యకపరిదృశ్యమానస్థూలదేహేంద్రియాది చేతనాచేతన సంఘాతాత్మ కాస్మత్పదబోధ్యకర్తృక ప్రశ్నవిషయేణార్థేన వస్తునా తథాభూతేన భగవన్నామ్నోఽనేక జన్మవృత్తాన్తాధ్యక్షీకరణకారణయోగసిద్ధివిశేష తాదాత్మ్యాధ్యవసాయరూపాతిశయోక్తిర్వ్యజ్యతే.

'మృద్వీకారసితా సితా' ఇత్యాదిశ్లోకమునందు శరీరపథ్యక్కృతుడగు జీవుని సంబోధించు కనబడుచున్న స్థూలదేహము ఇంద్రియాదులు చేతనాచేతనముల సంఘాతము స్వరూపముగాగల్గి అస్మత్పదబోధ్యుడు కర్తగా గల్గిన ప్రశ్నకు గోచరుడగువాడు స్వతస్సంభవియగునర్థము. దీనివలన భగవన్నామమునకు ననేకజన్మవృత్తాంతము నధ్యక్షించుటకు గారణమగు యోగసిద్ధి విశేషముతో దాదాత్మ్యాధ్యవసాయ రూపమైన, యతిశయోక్తి వ్యక్తమగును.

## వస్తునా అలంకారధ్వనిః

అథ ప్రశ్నవిషయస్యాత్ర నానాజన్మగతవృత్తాన్తరూపతయా తజ్జ్ఞం ప్రత్యేవ ప్రష్టుమౌచిత్యేనానభిజ్ఞం స్వజీవం ప్రతి ప్రష్టుమయోగ్యత్వాత్ ప్రశ్నాన్యథానుపపత్త్యా ఆక్షిప్తా, వాచ్యసిద్ధ్యఙ్గత్వేన గుణీభూతవ్యఙ్గ్యరూపా వా ప్రాగుక్తాతిశయోక్తిరిహ కథం ధ్వని వ్యపదేశహేతుః స్యాత్ ? ఇత్థమేవ చ 'తదప్రాప్తి మహాదుఃఖ—' ఇత్యత్రాప్యతిశయోక్తే రర్థాపత్తివిషయత్వం గుణీభూతవ్యఙ్గ్యత్వం వా యుక్తమ్, అనేకజన్మోపభోగ్య దుఃఖసుఖరాశిభ్యాం తదప్రాప్తి మహాదుఃఖచిన్తావిపులాహ్లాదయోరనిగరణేఽశేషపాపపుణ్య పుఞ్జనాశకతాయా అనుపపత్తేః, తద్దుఃఖసుఖానాం స్వస్వఫలోపహితపాపపుణ్యనాశకతాయా ఏవాన్యత్రక్లృప్తత్వాత్, నిగరణే తు తయోస్తన్నాశకతాబుద్ధ్యుపపత్తిః, న చ వస్తుమాత్రాభివ్యక్తస్యాలంకారస్య న గుణీభూతవ్యఙ్గ్యత్వమ్—

"వ్యజ్యన్తే వస్తుమాత్రేణ యదాలంకృతయస్తదా
ధ్రువం ధ్వన్యఙ్గతా తాసాం కావ్యవృత్తేస్తదాశ్రయాత్."

ఇతి సిద్ధాన్తాదితి వాచ్యమ్; బాధే దృఢే సిద్ధాన్తమాత్రేణాత్ర ధ్వనిత్వస్య స్థాపయితు మశక్యత్వాత్ ఇతి చేత్—

అయితే-ఇచట ప్రశ్నవిషయము నానాజన్మవృత్తాంతమగుటచే దాని నెఱిగినవానిని గురించి యడుగుటయే యుచితము. తెలియనివానినడుగుట అయోగ్యము-ప్రశ్నము మరొకవిధముగా గుదురదు గనుక దానిచే నాక్షిప్తమైగానీ, వాచ్యసిధ్యంగమగుటచేత గుణీభూతవ్యంగ్యరూపమైకానీ, వెనుక జెప్పబడిన యతిశయోక్తి ఇచట యెట్లుధ్వని యనివ్యపదేశించుట కర్హమగును. ఈలాగ "తదప్రాప్తిమహాదుఃఖ" అనేచోట నతిశయోక్తి అర్థాపత్తివిషయమని కానీ, గుణీభూతవ్యంగ్యమని కానీ, యనుట యుక్తము. అనేకజన్మలలో నుపభోగ్యమగు సుఖదుఃఖరాసులచే తదప్రాప్తిమహాదుఃఖము, తచ్చింతా విమలాహ్లాదము - వీనినే నిగరణ మొనర్పనియెడల, సమస్తపాపములు పుణ్యములు, వీనిపుంజమును నాశ మొనర్చుటయే కుదురదు. ఆయా దుఃఖములు సుఖములు తమతమఫలములతోగూడిన పాపపుణ్యములను నాశ మొనర్చుటయే క్లిష్టము. నిగరణమునందో వానికి తన్నాశకత్వబుద్ధి కుదురును.

వస్తుమాత్రమున నభివ్యక్తమగు నలంకారము గుణీభూతవ్యంగ్యము గాజాలదు. "ఎప్పుడు వస్తుమాత్రముచే నలంకారములు వ్యక్తములగుచున్నవో నప్పుడివిధ్వనికినంగములే కావ్యవృత్తి దాని నాశ్రయించుటవలన" అని సిద్ధాంతముకదా యని అందురా? బాధదృఢమగుచో సిద్ధాన్తమాత్రమున ధ్వనిత్వమును స్థాపించుటకు వీలగునా?

సత్యమ్; యాదృశవ్యఙ్గ్యప్రతిపత్తిం వినా యత్రవాచ్యస్య సర్వథాప్యనుపపత్తిస్తత్ర తద్వాచ్యసిద్ధ్యఙ్గమ్. యత్ర ప్రకారాన్తరేణాపి తస్యోపపత్తిః శక్యా కర్తుంన తత్ర తథా. అన్యథా హి 'నిఃశేషచ్యుతచన్దనం స్తనతటమ్' ఇత్యత్రాధమత్వ సిద్ధ్యఙ్గత్వాద్దూతీరమణస్య వాచ్యసిద్ధ్యఙ్గ గుణీభూతవ్యఙ్గ్యత్వాపత్తేః. ప్రకృతే చ భగవన్నామ్నియోగసిద్ధి తాదాత్మ్యాధ్యవసాయ రూపామతిశయోక్తిం వినాపి భగవన్నామోచ్చారణమాహాత్మ్యప్రాప్త సార్వజ్ఞ్యబుద్ధ్యాపి ప్రశ్నోపపత్తేర్న గుణీభూతవ్యఙ్గ్యత్వమ్.

అనినచో నిజమే-ఎటువంటి వ్యంగ్యము స్ఫురించకపోయిన ఎచట సర్వథావాచ్యము పొసగదో నచటనావ్యంగ్యము వాచ్యసిధ్యంగము. ఎచట నైతే మరొకతీరునగూడ దానికి ఉపపత్తిని గల్పించుటకు వీలగునో నచట నట్లుగాదు. అలాగాకపోయినచో - నిశ్శేషచ్యుత చందనం స్తనతటం - అను స్థలమున అధమత్వము సిద్ధించుటకంగము గనుక దూతీరమణము వాచ్య సిధ్యంగగుణీభూతవ్యంగ్యము కావలసివచ్చును. ప్రకృతమున- 'మృద్వీకార సితా'- అనుచోట భగవన్నామమునకు యోగసిద్ధితోడి తాదాత్మ్యమును అధ్యవసించుట అను అతిశయోక్తి లేకుండానే భగవన్నామము నుచ్చారణము చేయు మాహాత్మ్యమునచేర్పడిన సర్వజ్ఞత్వబుద్ధి గల్గియున్నాడనుటతోనైనను ప్రశ్నచేయవచ్చును, కనుక గుణీభూత వ్యంగ్యత్వము రాబోదు.

ఏతేనాసమ్బన్ధే సమ్బన్ధరూపాతిశయోక్తిర్నామోచ్చారణమాహాత్మ్యప్రభవసార్వజ్ఞ్యాద్యవసాయేఽపి స్థితేతి స దోష స్తదవస్థఇతి పరాస్తమ్. భగవన్నామోచ్చారణస్యాచిన్త్యమాహాత్మ్యతాయాః పురాణ ప్రసిద్ధత్వాత్.

ఈతీరుగా జెప్పుటవలన భగవన్నామోచ్చారణ మాహాత్మ్యమువల్ల నేర్పడిన సార్వజ్ఞ్యాదులు అధ్యవసించినను అసంబంధే సంబంధరూపాతిశయోక్తి యుండనేయున్నదని యాదోషము తదవస్థము అని దూరుతొలగినది. భగవన్నామమునుచ్చరించుట లెక్కలేనంతటి మాహాత్మ్యము గలదని పురాణ ప్రసిద్ధముగదా?

అథవా మాస్తు ప్రాగుక్తముదాహరణం వస్తునోఽలం కారవ్యఞ్జకతాయాః, ఇదం తు భవిష్యతి—

"న మనాగపి రాహురోధశఙ్కా
న కలఙ్కాధిగమో న పాణ్డుభావః
ఉపచీయత ఏవ కాపి శోభా
పరితో భామిని ! తే ముఖస్య నిత్యమ్."

అత్ర రాహురోధ శఙ్కాభావాధిభిర్నిరపేక్షైర్వస్తుభిర్వ్యతిరేకాలఙ్కారో వ్యజ్యతే.

అథవా-వెనుకటి యుదాహరణము-వస్తువు అలంకార వ్యంజకమగుటకు-వద్ద-ఇదియగును. 'నమనాగపి' అనుశ్లోకమున రాహుదోధశంక లేక పోవుట మొదలగువానిచేత నిరపేక్షములగు వస్తువులు కనుక వ్యతిరేకాలంకారము వ్యక్తమగును.

## అలంకారేణ వస్తుధ్వనిః

'నదన్తి మదదన్తినః పరిలసన్తి వాజివ్రజాః
పఠన్తి బిరుదావలీ మహితమన్దిరే వన్దినః.
ఇదం తదవధి ప్రభో! యదవధి ప్రవృద్ధా న తే
యుగాన్తదహనోపమా నయనకోణశోణద్యుతిః'.

అత్రయుగాన్తదహనోపమయా యదైవ తవ కోపోదయస్తదైవ రిపూణాం సమ్పదో భస్మసాద్భవిష్యన్తీతి వస్తు వ్యజ్యమానం రాజవిషయకరతిభావేఽఙ్గమపి వాచ్యాపేక్షయా సున్దరత్వాద్ ధ్వని వ్యపదేశహేతుః.

'నదంతి' ఇత్యాది శ్లోకమున యుగాన్తదహనోపమచేత ఎప్పుడైతే నీకు కోపోదయమగునో అపుడే శత్రువుల సిరిసంపదలంతట భస్మీభూతములగునని వస్తువువ్యక్తమగుచున్నను వాచ్యాపేక్షయా చమత్కారకారణము కనుక ధ్వనియని వ్యపదేశింపబడెను.

న చ భస్మీకరణపటుత్వరూపస్య సాధారణధర్మస్యోపమానిష్పాదకత్వాత్ వ్యఙ్గ్యస్య వాచ్యసిద్ధ్యఙ్గత్వం శఙ్క్యమ్. ఉపాత్తశోణత్వరూప సాధారణధర్మేణాపి తన్నిష్పత్తేః సంభవాత్. ఉపమేయీభూతశోణద్యుతిగతస్య భస్మీకరణ పటుత్వరూప సాధారణ ధర్మస్యోపమానిష్పాదకత్వేఽప్యుపమేయవ్యఙ్గ్య కోపగతభస్మీకరణ పటుత్వస్యాతథాత్వాచ్చ.

అయితే-భస్మీకరణ పటుత్వరూపమైన సాధారణధర్మము ఉపమానిష్పాదకము అగుటవలన వ్యంగ్యము వాచ్యసిద్ధ్యంగమగరాదా? శోణత్వమనే సాధారణధర్మముపాత్తమైనది. దానివల్లనే ఇట-నుపమ నిష్పన్నమగునుగదా? ఉపమేయమైన శోణద్యుతియందుండు భస్మీకరణ పటుత్వ

రూపమైన సాధారణధర్మము ఉపమానిష్పాదకమైనను ఉపమేయమువలన వ్యంగ్యమగుకోపమునందుండు భస్మీకరణ పటుత్వము అలా కాదుకదా?

'నిర్భిద్య క్ష్మారుహాణామతిఘనముదరం యేషు గోత్రాంగతేషు
ద్రాఘిష్ఠస్వర్ణదణ్డభ్రమభృతమనసో హన్త ధిత్సన్తి పాదాన్
యైః సంభిన్నే దలాగ్రప్రచలహిమకణే దాడిమీబీజబుద్ధ్యా
చఞ్చూంచాఞ్చల్యమఞ్చన్తి చ శుకశిశవస్తేంశవః పాన్తుభానోః'

అత్ర భ్రాన్తిభృతాం తిరశ్చామప్యేవమానన్దం జనయతీతి జగదానన్దహేతుర్భగవానితి వ్యజ్యతే. ఏవం రూపాయా భ్రాన్తేర్లోకేఽపి సంభవాత్స్వతః సంభవిత్వమ్.

ఇంకొకటి- 'నిర్భిద్య క్ష్మారుహాణామ్' అను శ్లోకమునందు భ్రాంతి పడు తిర్యగ్జంతువులకుకూడ ఇట్లానందమును గల్పించుచున్నాడని జగదానందహేతువు భగవానుడని వ్యంగ్యము. ఈతీరుగా భ్రాంతి, లోకమునగూడా సంభవించును. కనుక స్వతస్సంభవిత్వము.

## అలంకారేణాలంకారధ్వనిః

'ఉదితం మణ్డలమిన్దో రుదితం సద్యో వియోగి వర్గేణ
ముదితం చ సకలలలనాచూడామణిశాసనేన మదనేన'

అత్ర సముచ్చయేన క్రియాయౌగపద్యాత్మనా కార్యకారణపౌర్వాపర్యవిపర్యయాత్మికాతిశయోక్తిః. ఏషు స్వతః సంభవీ వ్యఞ్జకః,

'ఉదితం' ఇత్యాదిశ్లోకమునందు క్రియాయౌగపద్యరూపమగు సముచ్చయముచే కార్యకారణముల, వెనుకముందల, వ్యత్యాసస్వరూపమగు నతిశయోక్తి వ్యంగ్యము. ఈ యుదాహరణములలో స్వతస్సంభవి యగునది వ్యంజకము.

తదవధి కుశలీ పురాణశాస్త్రస్మృతిశతచారువిచారజో వివేకః
యదవధి న పదం దధాతి చిత్తే హరిణకిశోరదృశోదృశోర్విలాసః

అత్ర కామినీ దృగ్విలాసే చేతసి పదమర్పితవతి వివేకస్య నాస్తి కుశలమితి వస్తునా దృగ్విలాసకర్తృకపదార్పణస్య లోకసిద్ధ

త్వాభావాత్కవిప్రౌఢోక్తి నిష్పన్నేన సునిషణ్ణే తస్మిన్ కా కుశల చర్చా వివేకస్యేతి వస్తు వ్యజ్యతే.

'తదవధి' ఇత్యాది శ్లోకమున కామినీదృగ్విలాసము మనసున నడుగు పెట్టగా వివేకమునకు కుశలములేదను వస్తువుచే దృగ్విలాసకర్తృకమగు నడుగుపెట్టుట లోకసిద్ధము కాకపోవుటవలన కవిప్రౌఢోక్తినిష్పన్నము. ఇందువల్లనది బాగుగా నడుగుపెట్టగా వివేకమునకు కుశలపు కబురెక్కడిది? అనువస్తువు వ్యంగ్యము.

> "కస్మై హన్త ఫలాయ-సజ్జన! గుణగ్రామార్జనే సజ్జసి
> స్వాత్మోపస్కరణాయ చేన్మమ వచః పథ్యం సమాకర్ణయ.
> యే భావాహృదయం హరన్తి నితరాం శోభాభరైః సంభృతా
> స్తైరేవాస్య కలేః కలేవరపుషో దైనందినం వర్తనమ్."

ఇహ యద్యపి రమణీయాః పదార్థాః కలేర్నిత్యమదనీయా ఇతి వస్తునా ప్రౌఢోక్తిసిద్ధేన మర్తుం కామయసే చేత్ గుణప్రాప్తౌ యతస్వేతి వస్తు వ్యజ్యతే తథాపి తస్య పర్యాయోక్తాత్మనో వాచ్యాపేక్షయా సున్దరతావిరహాద్ గుణీభూతత్వమేవ. అలఙ్కారా హి వాచ్యసౌన్దర్యసారాః ప్రాయశః స్వాన్తర్గతం ప్రతీయమానం పృష్ఠతః కుర్వన్తి.

'కస్మై హంత' ఇత్యాదిశ్లోకమున రమణీయములగు పదార్థము లను కలిప్రతినిత్యము భక్షించుచుండును అనువస్తువు కవిప్రౌఢోక్తి యుత్పన్నము, దీనిచే చావదలంచినచో గుణప్రాప్తికై యత్నింపుము అనివస్తువు వ్యంగ్యము. అయినను పర్యాయోక్తిరూపమగు నిది వాచ్యమునకన్న ఎక్కువగా సుందరముగాదు. కనుక గుణీభూతమే. అలంకారములున్నవే వాచ్య సౌందర్యసారములుగదా! అవి తరచుగా దమలోపలయున్న ప్రతీయమాన మును వెనుకకుపెట్టును.

> "దేవాః కే పూర్వదేవాః సమితి మమ నరః సన్తికేవాపురస్తా
> దేవం జల్పన్తి తావత్ప్రతిభటపృతనావర్తినః క్షత్రవీరాః.
> యావన్నాయాతి రాజన్నయనవిషయతామన్తకప్రాసిమూర్తే
> ముగ్ధారిప్రాణదుగ్ధాశనమసృణరుచిస్త్వత్కృపాణో భుజఙ్గః."

అత్ర కవిప్రౌఢోక్తిసిద్ధేన రూపకేణ త్వయ్యుద్యతకరవాలే సతి కా పరేషాం జీవనస్యాశేతి వస్తు వ్యజ్యతే.

'దేవాః కే' ఇత్యాదిశ్లోకమునందు కవిప్రౌఢోక్తి సిద్ధమైనరూపకముచే నీవు కన్నెత్తినవెంటనే శత్రువులకు బ్రతుకుమీద నాశయేలేదని వస్తువు వ్యక్తమగును.

"సాహంకార సురాసురావలికరాకృష్టభ్రమన్మన్దర
క్షుభ్యత్క్షీరధివల్లివీచివలయశ్రీగర్వ సర్వంకషాః
తృష్ణాతామ్యదమన్దతాపసకులైః సానన్దమాలోకితా
భూమీభూషణ! భూషయన్తి భువనాభోగం భవత్కీర్తయః."

అత్ర కీర్తేః సానన్దాలోకనేన వస్తునా కవి కల్పితేన దుగ్ధభ్రాన్తిస్తాపసగతా వ్యజ్యతే. నచ సానన్దాలోకనస్యైవ చాక్షుషభ్రాన్తిరూపత్వయా వ్యఙ్గ్యవ్యఞ్జకయోరవివేకో, వ్యఙ్గ్యత్వానుపపత్తిశ్చేతి వాచ్యమ్, వస్తున ఏకత్వేఽపి కీర్తిరూపవిశేష్యావృత్తి దుగ్ధత్వప్రకారకత్వాత్మక భ్రాన్తిత్వేన సానన్దావలోకనత్వేన చ వ్యఙ్గ్యవ్యఞ్జకవివేకస్య వ్యఙ్గ్యతావచ్ఛేదకరూపేణ వాచ్యతాయా అభావాత్, వ్యఙ్గ్యత్వస్యచోపపత్తేః. తథా చాహుః — "యదేవోచ్యతే తదేవ వ్యఙ్గ్యమ్. యథా తు వ్యఙ్గ్యం న తథోచ్యతే" ఇతి.

'సాహంకార' ఇత్యాది శ్లోకమున కీర్తినానందముతో జూచుటయను వస్తువుచేత, కవికల్పితముచేత భ్రాంతి తాపసులకు కల్గినదని వ్యంగ్యమగును. కాని ఆనందముతో జూచుటయే గన్నులకు గల్గినభ్రాంతి రూపముగనుక వ్యంగ్య వ్యంజకములకు వివేకము లేకపోవుటయు, దానిమూలమున వ్యంగ్యమగుట కుదరకపోవుటయు, సంభవించునుగదా, యందురా? వస్తువొకటైనను కీర్తిరూపమగు విశేష్యమందుండని దుగ్ధత్వము భ్రాంతియందు ప్రకారముగా నున్నది. అట్టిభ్రాంతి వ్యంగ్యము. సానందావలోకనము ఇచట వ్యంజకము, ఇట్లు వ్యంగ్యతానిర్ణాయకరూపముతో వాచ్యత లేదు. పెద్దలిట్లుచెప్పిరికూడాను ఏదిచెప్పబడునో నదియే వ్యంగ్యము. ఎట్లు వ్యంగ్యమో అట్లు చెప్పబడదు, అని.

దయితే! రదనత్విషాం మిషా
దయితేఽమీ విలసన్తి కేసరాః

అపి చాలక వేషధారిణో
మకరన్దస్ప్రృహయాలవోఽలయః."

అత్ర పూర్వోత్తరార్ధవర్తినీభ్యామపహ్నుతిభ్యాం న త్వం నారీ కిం తు నలినీతి తృతీయాపహ్నుతిర్వ్యజ్యతే. ఏషు ప్రౌఢోక్తినిష్పన్నో వ్యఞ్జకః.

'దయితే' ఇత్యాది శ్లోకమునందు పూర్వార్ధఉత్తరార్ధము లందున్న యపహ్నుతులవలన నీవు స్త్రీవిగావు ఇకనేమనగా తామరతీవెవు; అను మూడవ యపహ్నుతి వ్యంగ్యమగును. వీటన్నిటను ప్రౌఢోక్తిమాత్రమున నిష్పన్నమగునది వ్యంజకము.

యద్యపి శబ్దశక్తిమూలకత్వమర్థశక్తిమూలకత్వం చేత్యుభయ మపి సకలవ్యఙ్గ్యసాధారణం, శబ్దార్థయోరనుసన్ధానం వినా వ్యఙ్గ్యస్యైవానుల్లాసాత్, తథాపి పరివృత్త్యసహిష్ణూనాం శబ్దానాం ప్రాచుర్యే తత్ప్రయుక్తా ప్రాధాన్యా త్సత్యా అప్యర్థశక్తేరప్రాధాన్యాచ్చ వ్యఙ్గ్యస్య శబ్దశక్తిమూలకత్వేనైవ వ్యపదేశః. పరివృత్తి సహిష్ణూనాం తు ప్రాచుర్యేఽర్థశక్తేరేవ ప్రాధాన్యాత్సత్యా అపి శబ్దశక్తేః ప్రధానానుగుణ్యార్థతయా మల్లగ్రామాదివత్ప్రధానేనైవ వ్యపదేశః.

నిజమునకు శబ్దశక్తిమూలకత్వము అర్థశక్తిమూలకత్వమును సకల వ్యంగ్యములకున్నూ సాధారణమే. శబ్దార్థముల యనుసంధానములేకుండా అసలు వ్యంగ్యము కుదరదు అయినను పరివృత్తిని (మార్పిడిని) సహింపని పదము లెక్కువగానుండుచో నాపదముల ప్రాధాన్యమునుబట్టి అర్థశక్తి యున్నను దానికి ప్రాధాన్యములేదు. కనుక, శబ్దశక్తిమూలకమని వ్యపదేశింపదగును, పరివృత్తిని సహింపగల్గిన పదములెక్కువగానున్నచో నచట యర్థశక్తియే ప్రధానముగనుక శబ్దశక్తియున్నను ప్రధానమునకు ననుగుణమగు నర్థము గల్గియుండుటచే మల్లగ్రామాదికమువలె ప్రధానముతో వ్యపదేశింపబడును.

యత్ర తు కావ్యే పరివృత్తిం సహమానానామసహమానానాం చ శబ్దానాం నైకజాతీయప్రాచుర్యం, అపి తు సామ్యమేవ, తత్ర శబ్దార్థోభయశక్తిమూలకస్య వ్యఙ్గ్యస్య స్థితిరితి ద్వ్యుత్థో ధ్వనిః.

నచాయం శబ్దశక్తిమూలకతయైవార్థశక్తిమూలకతయైవ వా వ్యపదేష్టుం శక్యః, వినిగమకాభావాత్. నాపి శబ్దశక్తిమూలకార్థశక్తిమూలకయోః సంకరేణ గతార్థయితుమ్, వ్యఙ్గ్యభేద ఏవ సంకరస్యేష్టేః. ఇహ తు వ్యఙ్గ్యస్యైక్యేన తస్యా నుత్థానాత్.

ఏ కావ్యములో పరివృత్తిసహించు నవియును, సహించనివియు నగు పదములలో నేకజాతీయపదములకు ప్రాచుర్యముండదో, సామ్యమే యుండునో నచట శబ్దార్థోభయ శక్తిమూలకమగు వ్యంగ్యముండును, గనుక నచట ధ్వని యుభయశక్తిమూలకము. పోనీ-శబ్దశక్తిమూలకమనిగానీ యర్థశక్తిమూలకమనిగానీ, దానిననరాదా? అనరాదు-ఒకేపక్షమును సాధించుటకు దగిన యుక్తిలేదుగదా? పోనీ-శబ్దశక్తిమూలకమున కర్థశక్తిమూలకమునకును సంకరమనరాదు. వ్యంగ్యములు భిన్నములగునపుడే నా రెండువ్యంగ్యములకును సంకరమనుట ఇష్టము. ఇచట వ్యంగ్యమొక్కటియే గనుక నా ప్రసంగమనుత్థానోపహతము.

ఉదాహరణమ్——

"రమ్యహాసా రసోల్లాసా రసికాలినిషేవితా
సర్వాఙ్గశోభాసంభారా పద్మినీ కస్య న ప్రియా."

అయం చ వాక్యమాత్రే, పదసమూహశ్చ వాక్యమ్. తేనాస్య నానార్థానానార్థఘటితసమాసవిషయత్వేఽపి న విరోధః. న తు శుద్ధైకపదే, తస్మిన్నానార్థానానార్థయోరసమావేశాత్.

'రమ్యహాసా' ఇత్యాది శ్లోకముదాహరణము. ఇదియు వాక్యమాత్రమునసే. వాక్యము పదసమూహము. అందువలన ఇది నానార్థములు, అనానార్థములు నయినపదముల సమాసవిషయమైనను బాధలేదు. అంతేకాని, శుద్ధమగు నొకపదమున మాత్రముకాదు. ఏమనగా దానియందు నానార్థకములు అనానార్థకములు సమావిష్టములు గావు గదా.

అన్యేతు — "అర్థశక్తిమూలకత్వవ్యపదేశే నానార్థప్రకాశకశబ్దశక్త్యుల్లాస్యత్వసామాన్యశూన్యత్వం తన్త్రమ్; విషయప్రాచుర్యాత్. శబ్దశక్తిమూలకత్వవ్యపదేశే తు నార్థశక్త్యుల్లాస్యత్వసామాన్యశూన్యత్వం తథా, విషయదౌర్లభ్యాపత్తేః. న హి నానార్థ

శబ్దమాత్రఘటితం పద్యం ప్రచురవిషయమ్, అతః శబ్దమూలకత్వే నైవాయం శక్యవ్యపదేశోధ్వనిః ఇత్యప్యాహుః.

ఇత్థమభిధామూలస్త్రివిధోఽపి నిరూపితో ధ్వనిః నిరూపయిష్యతే చాంశతో యథావసరమ్. లక్షణామూలస్తు నిరూప్యతే—

ఇతరులైతే- నానార్థప్రకాశక శబ్దశక్త్యుల్లాసత్వ సామాన్యశూన్యత్వమే యర్థశక్తిమూలకత్వవ్యపదేశమునకు తంత్రము. విషయప్రాచుర్యమున్నది గనుక. శబ్దశక్తిమూలకత్వమని వ్యపదేశించుటకు అర్థశక్త్యుల్లాసత్వ సామాన్యశూన్యత్వము అట్లుగాదు-విషయము దుర్లభమైయుండవలసివచ్చును. నానార్థశబ్దములు మాత్రము గూర్చిన పద్యము ప్రచురవిషయము గాదే- ఇందువలన శబ్దశక్తిమూలకత్వముతోనే ఇదివ్యపదేశింపవీలగును అందురు.

ఈతీరుగా నభిధామూలకమగుధ్వని మూడువిధములున్నా సంక్షేపముగా నిరూపించబడినది. అవసరముకొలది యంశములుగా నిరూపించబడును. ఇపుడు లక్షణామూలము నిరూపించబడును.

## లక్షణామూల ధ్వనిః

తత్ర వక్ష్యమాణలక్షణాయాం లక్షణాయాం ప్రయోజనవత్యాః షడ్విధాయాః సారోపసాధ్యవసానాభ్యాం గౌణీశుద్ధాభ్యాం చ విభక్తానాం భేదానాం చతుర్ణామలంకారాత్మనా పరిణతత్వాద్ద్వౌ భేదౌ ధ్వన్యాశ్రయతయాస్థితౌ, జహత్స్వార్థా అజహత్స్వార్థా చేతి. తన్మూలౌ చ ద్వౌ ధ్వనేః ప్రభేదౌ.

ఇచట వక్ష్యమాణ లక్షణయగు లక్షణయందు ప్రయోజనవతియగు లక్షణ ఆరువిధములు, అందుసారోపసాధ్యవసానలు, గౌణశుద్ధలుగా విభజింపబడిన భేదములు నాల్గును నాల్గలంకారములుగా పరిణతమగును. ఇక జహత్స్వార్థ, అజహత్స్వార్థ అనునవి రెండే ధ్వన్యాశ్రయముగ మిగిలినవి; అవి మూలముగా ధ్వనిప్రభేదములు రెండు.

తయోర్జహత్స్వార్థామూలో యథా—

"కృతం త్వయోన్నతం కృత్యమర్జితం చామలం యశః,
యావజ్జీవం సఖే తుభ్యం దాస్యామో విపులాశిషః."

ఇయం కస్యచిదపకారిణం ప్రత్యుక్తిః. త్వయా కృతేఽప్యపకారే పరమఖేదహేతౌ మధురమేవ యో భాషేయ, న పరుషం తస్మిన్నేవంజాతీయకే మయి పాపమాచరతస్తవ పాపిష్ఠత్వం కథం శక్యతే వక్తుమితి వ్యఙ్గ్యమ్.

అందుజహత్స్వార్థామూలము ఎట్లనగా- 'కృతం' ఇత్యాదికము అపకారినిగూర్చి యొకరిమాట. మహాకష్టమునకు గారణమగు నపకారము నీవొనర్చినను మధురముగానే మాటాడితిని. పరుషముగా మాటాడలేదే? అటువంటి నాకు పాపమాచరింపదలంచిన నీవు ఎంతటి పాపిష్ఠుడవో ఎట్లుచెప్పగలము అని వ్యంగ్యము.

అపరామూలో యథా—

బధాన ద్రాగేవ ద్రఢిమరమణీయం పరికరం
కిరీటే బాలేన్దుం నియమయ పునః పన్నగగణైః,
న కుర్యాస్త్వం హేలామితరజనసాధారణధియా
జగన్నాథస్యాయం సురధుని సముద్ధారసమయః"

అత్ర 'జగన్నాథస్య' ఇత్యనేన శక్య ఏవానేకపాపవిశిష్టత్వేన లక్ష్యతే. పాపానాం పదాన్తరేణానిర్వాచ్యత్వం వ్యఙ్గ్యమ్.

'కున్తాః ప్రవిశన్తి' ఇత్యాదౌ తు వాచ్యగతతైక్ష్ణ్యాదిలక్ష్యమ్.

తదేవ మేతే ప్రాగుక్తా ద్వ్యర్థాతిరిక్తాః సర్వేఽపి ధ్వనయ ఏకస్మిన్ వాచ్యే యద్యేకపదమాత్రగతాస్తదా పదధ్వనితయా వ్యపదిశ్యన్తే. నానాపదగతతాయాన్తు వాక్యధ్వనితయేతి.

అజహత్స్వార్థామూలము ఎట్లనగా- 'బధాన' ఇత్యాది శ్లోకమున "జగన్నాథస్య" అనుటచేత శక్యమే అనేక పాపవిశిష్టుడుగా లక్షితుడగును. పాపములు మరొకపదముచేత, ననిర్వాచ్యములగుట వ్యంగ్యము. "కుంతాః ప్రవిశంతి" ఇత్యాదులందు వాచ్యగతమగు తైక్ష్ణ్యాదికము లక్ష్య (వ్యంగ్య) మగును. కనుక ఈ తీరున వెనుక జెప్పిన ద్వ్యర్థములకన్న వ్యతిరిక్తములగు నాధ్వనులన్నియు నొకవాచ్యమునందు ఏకపదమునందుమాత్రమే యుండుచో నవి పదధ్వనియని వ్యపదేశింపబడు చున్నవి. నానాపదగతములగుచో వాక్యధ్వనియని వ్యవహారము.

## అభిధానిరూపణమ్

అథ కేయమభిధా నామ యస్మూలః ప్రథమం నిరూపితోఽయం ధ్వనిప్రపఞ్చః. ఉచ్యతే—శక్త్యాఖ్యోఽర్థస్య శబ్దగతః, శబ్దస్యార్థగతో వా సమ్బన్ధవిశేషోఽభిధా.

సా చ పదార్థాన్తరమితి కేచిత్ 'అస్మాచ్ఛబ్దాదయమర్థోఽవగన్తవ్య ఇత్యాకారేశ్వరేచ్ఛైవాభిధా. తస్యాశ్చ విషయితయా సర్వత్ర సత్త్వాత్పటాదీనామపి ఘటాది పదవాచ్యతా స్యాత్. అతో వ్యక్తివిశేషోపధానేన ఘటాదిపదాభిధాత్వం వాచ్యమ్' ఇత్యపరే. "ఏవమపీశ్వరజ్ఞానాదినా వినిగమనావిరహః స్యాత్, అతః ప్రథమమతమేవ జ్యాయః' ఇత్యపి వదన్తి.

ఇదియంతయు-అనగా నీ ధ్వనిప్రపంచమంతయును దేనిమూలమున మొదట నిరూపింపబడినదో నాయభిధ ఏది? చెప్పబడుచున్నది. శక్తియనుపేరు గల్గియర్థమునకు శబ్దగతము-లేక-శబ్దమున కర్థగతము అగు సంబంధవిశేషము అభిధ. అదియునొక పదార్థాంతరమని కొందరు. ఈశబ్దమునుండి ఈయర్థము దెలియగగినది యను నాకారమగు నీశ్వరేచ్ఛయే అభిధ. అది అన్నింటను గోచరించును, గాన ఘటాదులు - పటాదిపదములకు వాచ్యముగావలసియుండును కాన వ్యక్తివిశేషమునుగూర్చియే ఘటాదిపదముల యభిధయని చెప్పవలసియుండును అని మరొకరు- ఇలాగైనను ఈశ్వరజ్ఞానేచ్ఛలచే వినిగమనమేర్పడదు. కావున మొదటిమతమే మంచిదని కొందరందురు.

యత్తు వృత్తివార్తికే-'శక్త్యా ప్రతిపాదకత్వమభిధా' ఇత్యప్పయదీక్షితైరుక్తం తత్తుచ్ఛమ్. తథాహి:- ఇహ శబ్దాజ్జాయమానాయామర్థోపస్థితౌ కారణీభూతం యదీయజ్ఞానం సా శబ్దవృత్తిరభిధాఖ్యా లక్ష్యతయా ప్రస్తుతా. ప్రతిపాదకత్వస్య చ ప్రతిపత్తిహేతుత్వరూపస్య శబ్దగతస్య న జ్ఞానం ప్రతిపత్తౌ కారణమ్. అతః కథంనామ ప్రతిపాదకత్వ మభిధేత్యుచ్యతే? అథ ప్రతిపాదకత్వం ప్రతిపత్త్యనుకూలవ్యాపారరూపం జ్ఞాతం సదేవోపయుజ్యతే ప్రతిపత్తావిత్యుచ్యేత, ఏవమపి శక్త్యేత్యనేన శబ్దగతార్థగతా వా కాచిచ్ఛక్తిః ప్రతిపత్తిహేతుతయా వివక్షితా, సైవాభిధేతి "అభిధయా ప్రతిపాదకత్వ

మభిధా'' ఇతిలక్షణం పర్యవసన్నమ్. తథాచ స్ఫుటైవాసంగతిరాత్మాశ్రయశ్చ. న చాభిధాతః శక్తి రతిరిక్తా శబ్దజన్యప్రతిపత్తిప్రయోజికా కాచిదస్తీత్యత్ర ప్రమాణమస్తి.

అయితే- వృత్తివార్తికములో- "శక్త్యాప్రతిపాదకత్వం- అభిధా" 'శక్తిచే జెప్పగల్గియుండుట అభిధ' అని అప్పయ్యదీక్షితులు చెప్పిరి. అది తుచ్ఛము- యుక్తి విరోధించును. దాని వివరమిది: ఇచట శబ్దమువలన నేర్పడు నర్థోపస్థితిలో గారణమగు శబ్దవ్యాపార జ్ఞానములో గోచరమగు వృత్తియే అభిధ, దానిని లక్షణీయ మొనర్చుట ఇటప్రస్తుతము. ప్రతిపాదకత్వ మనగా ప్రతిపత్తిహేతుత్వరూపమైనది, శబ్దగతము. దాని జ్ఞానమర్థప్రతిపత్తికి కారణముకాదు. ఇక నెందువల్ల నర్థప్రతిపాదకత్వము అభిధయగును?

అదికాదయ్యా? ప్రతిపాదకత్వమనగా ప్రతిపత్త్యనుకూల వ్యాపార రూపమైనది. అదితెలిసికొనిన నేగాని ప్రతిపత్తిలో నుపయోగములేదు అని అందురా? ఇలాగైనను శక్తిలోననుటవలన శబ్దగతమో, అర్థగతమో అయిన యొకశక్తిప్రతిపత్తిహేతువుగా వివక్షితమైనది, అదియే అభిధగనుక, అభిధచే ప్రతిపాదకత్వ మభిధ అని లక్షణముగా చివరకు తేలినది. కాగా ఈలక్షణ మసంగతమని, యాత్మాశ్రయదోషము తప్పదనిస్పష్టము. అభిధకన్న వేరుగా శక్తియను ఒకపదార్థము శబ్దజన్యప్రతిపత్తిని గల్గించునది యొకటి యున్నదనుటలో ప్రమాణ మేమున్నది?

సేయమభిధా త్రివిధా- కేవలసముదాయశక్తిః, కేవలావయవ శక్తిః, సముదాయావయవశక్తిసంకరశ్చేతి. ఆద్యాయాడిత్థాదికముదాహరణమ్, తత్రావయవశక్తేరభావాత్. ద్వితీయాయాస్తు పాచకపాఠకాదిః, తత్ర ధాతుప్రత్యయశక్తిబోధ్యయో రర్థయోరన్వయేనోల్లసితాత్పాకకర్తృరూపాదర్థాదతిరిక్తార్థాన్తరస్యానవభాసేన సముదాయ శక్తేరభావాత్. తృతీయాయాః పఙ్కజాదిః. ఇహ ధాతూపపద ప్రత్యయరూపావయవశక్తివేద్యానాం పఙ్కజననకర్తృణామాకాఙ్క్షాదివశాదన్వయే ప్రకాశమానాత్ పఙ్కజనికర్తృరూపాదర్థాదతిరిక్తస్య పద్మత్వవిశిష్టస్య ప్రత్యయేన తదర్థం సముదాయశక్తేరపి కల్పనాదుభయోః సంకరః. ఏతా ఏవ విధా రూఢి-యోగ-యోగరూఢి శబ్దైర్వ్యపదిశ్యన్తే.

అయీ యభిధ ముత్తెరంగులు- కేవలసముదాయశక్తి- కేవలావయవశక్తి- సముదాయావయవశక్తుల సంకరము. మొదటిదానికి డిత్థాదిపదము లుదాహరణములు. రెండవదానికి, పాచక, పాకపదము లుదాహరణములు. అచట ధాతువులు ప్రత్యయములు వీనిచే బోధింపబడు నర్థములు నన్వయించుటవలన నుల్లసిల్లు పాకకర్త్రాది రూపమగు నర్థముగాక మరొకయర్థమేదియు భాసింపదు, కనుక సముదాయశక్తి లేదు, మూడవదానికి, పంకజాదు లుదాహరణములు-ఇచట ధాతువు-ఉపపద ప్రత్యయ రూపములగు నవయవముల శక్తిచే బోధింపబడిన పంకజనన కర్తలకు ఆకాంక్షాదివశమున (ప్రకాశించుచున్న)నన్వయముకలుగగా పంకజని కర్తృత్వరూపమగు నర్థము ప్రకాశించుట యేకాక నతిరిక్తమగునర్థము పద్మత్వవిశిష్టమగునది భాసించును. కనుక దానిని గూర్చి సముదాయశక్తి నిగూడ గల్పించవలెను, కనుక నచట నవయవశక్తికిని, సముదాయశక్తి కినిగూడ సంకరము గల్పింపవలెను. ఈవిధములనే రూఢి, యోగ, యోగరూఢ పదములచే వ్యపదేశింతురు.

యత్తు- "అఖణ్డశక్తిమాత్రేణైకార్థప్రతిపాదకత్వం రూఢిః. అవయవశక్తిమాత్రసాపేక్షం పదస్యైకార్థప్రతిపాదకత్వం యోగః, ఉభయశక్తిసాపేక్షమేకార్థప్రతిపాదకత్వం యోగరూఢిః" ఇతివృత్తివార్తికేఽప్పయదీక్షితైరుక్తమ్, తన్న. అభిధాలక్షణోక్తదూషణానామిహాపి దుర్వారత్వాత్.

అయితే- అఖండశక్తిమాత్రముచే నేకార్థప్రతిపాదకత్వము రూఢి అవయవశక్తిమాత్రము నపేక్షించి పదములకేకార్థత్వము యోగము. వెనుక జెప్పిన రెండుశక్తుల అపేక్షతో నొకయర్థమును ప్రతిపాదించుట యోగరూఢి యని అప్పయ్య దీక్షితులు వృత్తివార్తికములో జెప్పెను. అది సరికాదు. అభిధాలక్షణములో జెప్పిన తప్పులు వారింపరాకయుండుటచే.

అథ అశ్వగన్ధా - అశ్వకర్ణ - మణ్డప - నిశాన్త - కువలయాది శబ్దేషు కాశక్తిరితి.

అత్ర కేచిత్- "అశ్వగన్ధారసం పిబేత్" ఇత్యాదిషు విషయవిశేషే కేవల సముదాయశక్తిః. 'అశ్వగన్ధా వాజిశాలా' ఇత్యాదిషు తు కేవలయోగశక్తిః. సముదాయావయవశక్త్యో రుభయోరేకశబ్దా

శ్రయత్వే కథం కేవలత్వవిశేషితయో రాద్యద్వితీయ భేదయోః ప్రసక్తిరితి తు నశఙ్క్యమ్. సముదాయావయవశక్తివేద్యయోరర్థ యోరన్వయేన తాదృశశక్త్యోః కైవల్యస్య సామ్రాజ్యాత్. ఇదమేవహి కేవలత్వమిహ వివక్షితమ్, యదన్వయాయోగ్యార్థబోధకత్వమ్. సంకరస్త్వన్వయయోగ్యార్థబోధకయోరేవేతి న తస్యాత్రప్రసక్తిః" ఇత్యాహుః.

ఏమయ్యా? అశ్వగంధా- అశ్వకర్ణ- మండప- నిశాంత- కువలయాది శబ్దములకడ యేదిశక్తియని- ఇక్కడకొందరు- "అశ్వగంధా రసం పిబేత్"- ఇత్యాదులందు విషయ విశేషమున కేవల సముదాయశక్తి. 'అశ్వగంధావాజి శాలా' ఇత్యాదులందు కేవలయోగశక్తి. సముదాయ అవయవశక్తులు- రెండును, ఒకశబ్దము నాశ్రయించుచోనెట్లు కేవలత్వముతో విశేషించిన మొదటిరెండు భేదములకు ప్రసక్తిగల్గునని యాశంకింపరాదు. సముదాయావ యవ శక్తులచే నెఱుగనగు అర్థములకు అన్వయము గుదురనియెడల అటువంటి శక్తులకును కైవల్యము-ప్రత్యేక స్థితియేర్పడును. ఇచటకేవలత్వమనగా-అన్వ యించుటకు నయోగ్యమగు నర్థమును బోధించుట. సంకరము అన్వయించుటకు అనుకూలమగునర్థమును బోధించువానికే కనుక దానికిట ప్రసక్తి లేదందురు.

అపరేతు- 'అశ్వకర్ణాది శబ్దేషు నాభిధాయాః ప్రథమద్వితీయ యోర్విధయోః ప్రసక్తిః,- కైవల్యవిరహాత్. పరన్తు సంకరస్య ద్వౌ భేదౌ-యోగ-రూఢి ర్యౌగికరూఢిశ్చేతి. తత్రాద్యస్యోదాహరణం పఙ్కజాదిశబ్దాః. ద్వితీయస్యత్వశ్వకర్ణాదయః' ఇత్యాహుః. 'చతుర్థ ఏవాయమభిధాయా భేదః' ఇత్యప్యన్యే.

"అఖణ్డా ఏవ హి శబ్దాః. తత్రసమాసేషుపదానాం, కృత్తద్ధిత తిఙన్తేషు చ ప్రకృతిప్రత్యయానాం విభాగః కాల్పనిక ఏవేతి కుత్రాస్తి యోగశక్తిః? విశిష్టస్య విశిష్టార్థే రూఢేరేవాభ్యుపగమాత్" ఇత్యపి వదన్తి.

మరొకరు. అశ్వకర్ణాదిశబ్దములకడ నభిధలోని రెండు ప్రకారములును ప్రసక్తింపవు. కైవల్య మచట లేదుకదా? కాని సంకరము రెండురకములు, యోగరూఢియు- యౌగికరూఢియు. అందు మొదటిదాని కుదాహరణము పంకజాదిశబ్దములు. రెండవదాని కుదాహరణము అశ్వకర్ణాది శబ్దములందురు,

ఇది అభిధలోని నాల్గవప్రకారమే అనిరితరులు. అయితే- అఖండములేగదా శబ్దములు. అక్కడ సమాసములలో పదములు- కృత్తద్ధితతిఙంతములయందు ప్రకృతి ప్రత్యయములకువిభాగమున్నూ కల్పితమేగనుక ఎచటనున్నది యోగశక్తి? విశిష్టమునకు విశిష్టార్థమున రూఢినే యంగీకరింతుము అనియు జెప్పుదురు.

అథ,—

'గీష్పతిరప్యాఙ్గిరసో గదితుం తే గుణగణాన్ సగర్వో న
ఇన్ద్రః సహస్రనయనోఽప్యద్భుతరూపం పరిచ్ఛేత్తుమ్'.

ఇత్యాదౌ రూఢ్యర్థమాదాయ పునరుక్త్యాపత్తిః న చైవంవిధపదద్వయ సమభివ్యాహారస్థలే యోగరూఢపదస్యావయవార్థమాత్ర బోధకత్వమ్. తావన్మాత్రస్యైవ ప్రకృతోపయోగ్యతిశయ సమర్పకత్వాత్ ఇతి వాచ్యమ్. ఏవమపి యోగరూఢపదస్య రూఢిశక్తేరనియన్త్రితేన యోగార్థమాత్రప్రతిపాదకతాయా అనుపాదానాదుక్తదోషస్యానువృత్తేః. ఏకేనైవ పదేన యోగార్థరూఢ్యర్థయోరుభయోరప్యావశ్యకయోరర్థయో రుపస్థితి సంభవేన ద్వితీయపదస్య నైరర్థక్యాపత్తేశ్చ ఇతిచేత్.

తరువాత- "గీష్పతిరప్యాంగిరసః" (ఆంగీరసుఁడు బృహస్పతి గీష్పతి యైనను- మాటలకు పతియైనను మీగుణగణములను జెప్పుటకు సమర్థుఁడు గాఁడు. ఇంద్రుఁడు వేయికనులవాడైనను నీయద్భుతమగు రూపమును నిరూపించుటకు సమర్థుఁడుగాఁడు.) ఇత్యాదులందు రూఢ్యర్థమును బురస్కరించుకొని పునరుక్తిప్రాప్తించవలసి యుండును. పోనీ-ఇటువంటి పదములురెంటిని గలిపి యుచ్చరించుచోట యోగరూఢపదము అవయవార్థమునుమాత్రము బోధించును. అంతమాత్రమే ప్రకృతమున నుపయోగించు నతిశయ విశేషమును సమకూర్చును- ఇట్లాగైనను యోగరూఢిపదమునందు రూఢిశక్తి నియంత్రితము గాకపోవుటచే యోగార్థమునుమాత్రమే తెలుపగల్గుటను ఉపపాదించకపోవుటవలన వెనుక జెప్పినదోషము తొలగబోదు. ఒకపదము చేతనే ఆవశ్యకములగు యోగార్థరూఢ్యర్థములు రెంటికి నుపస్థితి సంభవింపగా రెండవపదము నిరర్థకముగావలసివచ్చును అనెదరా?

అత్రాహుః- ఏకపదోపాత్తత్వాదన్తరఙ్గాకాఙ్క్షావశేన ప్రథమం యోగార్థరూఢ్యర్థయోరన్వయే సతి సముల్లసితస్య విశిష్టార్థస్యైవ పదాన్తరార్థేఽన్వయః, న తు తయోరేవ విశకలితయోరితి యద్యపి న్యాయసిద్ధోఽర్థః తథాపి శక్త్యాఽర్థస్య ప్రతిపాదనే స్యాదేవమ్. లక్షణాయాం తు యోగరూఢేన యోగార్థమాత్రప్రతిపాదనేన న కిఞ్చిద్బాధకమస్తి. నాపి ద్వితీయ పదప్రయోగస్య నైరర్థక్యమ్. తథా సతి రూఢ్యర్థబోధనేన గతార్థేన యోగరూఢశబ్దేన ప్రతిపాద్యమానస్య యోగార్థస్య 'పఙ్కజాక్షీ' ఇత్యాదావివ నాన్తరీయకత్వశఙ్కయా కుర్వద్రూపతాయా అపహాతా ప్రకృతోపయోగ్యతిశయవిశేష వ్యఞ్జనస్య పాక్షికత్వాపత్తేః. ద్వితీయపదయోగే తు తేనైవ రూఢ్యర్థప్రతిపాదనే సిద్ధే యోగరూఢపదప్రతిపాద్యస్య యోగార్థస్య నాన్తరీయకత్వశఙ్కయా అయోగాత్కుర్వద్రూపత్వేన వ్యఙ్గ్య విశేషవ్యఞ్జకత్వం నియమేన సిద్ధ్యతి. ఏషా పదద్వయోపాదానస్థలే గతిరుక్తా.

ఈవిషయమున జెప్పెదరు. ఒకపదముచే నుపాత్తముగనుక అంతరంగమగు నాకాంక్షావశమున మొదట యోగార్థ-రూఢ్యర్థముల కన్వయమేర్పడును; అందువలన సముల్లసితమగు విశిష్టార్థమే పదాంతరార్థముతో నన్వయించును; అంతేకాని వాటికి విశకలితములగు నీఅర్థములకే కాదు; అని న్యాయసిద్ధమగు నర్థమైనను ఈపద్ధతి శక్త్యార్థమును ప్రతిపాదించునపుడు కావగును. కానీ లక్షణయందు యోగరూఢముతో యోగార్థమునుమాత్రము ప్రతిపాదించునపుడు ఏమియు బాధకములేదు.

అట్లే రెండవపదము ప్రయోగించుటలో నిరర్థకతయులేదు. అట్లాగైనపుడు రూఢ్యర్థమునుబోధించుటవల్ల గతార్థమగు యోగరూఢశబ్దముచే ప్రతిపాదింపబడుచున్న యోగార్థమునకు 'పంకజాక్షీ' ఇత్యాదులందువలె నాంతరీయకత్వశంకచే కుర్వద్రూపత్వము చెడిపోగా ప్రకృతోపయోగియగు నతిశయవిశేషమును వ్యంజనమొనర్చుట పాక్షికముకావలసివచ్చును. ఇక రెండవపదమున్నచో దానితోనే రూఢ్యర్థము ప్రతిపాదించుట సిద్ధముకాగా యోగరూఢమగు పదముచే ప్రతిపాద్యము యోగార్థమునాంతరీయకమగునను నాశంకయే సంబంధింపదు కనుక కుర్వద్రూపత్వముచేత వ్యంగ్యవిశేషమును

వ్యంజనచేయుట తప్పకుండాసిద్ధించును. ఇవిరెండుపదములును స్వీకరించుచోట గతిచెప్పబడినది.

యత్ర తు- 'పుష్పధన్వా విజయతే జగత్త్రయత్కరుణావశాత్' ఇత్యాదావేకేనైవ పదేన రూఢ్యర్థోపస్థితిర్యోగార్థద్వారా నిఃసారత్వా ద్యవగమశ్చ భవతి, తత్ర కవికృతమన్మథరూఢపదాన్తరానుపాదాన పూర్వకపుష్పధన్వపదోపాదానప్రతిసంధానేన తదీయయోగార్థే కుర్వద్రూపతాధానం బోధ్యమ్. తదిత్థం ద్వితీయపదస్యోపాదానేఽనుపాదానే వా నక్షతిః.

మఱియు- 'పుష్పధన్వా' (పూవిలుకాడు జగత్తులను నీదయవలన జయించుచున్నాడు.) ఇత్యాది స్థలమున నొకపదముచేతనే రూఢ్యర్థోప స్థితియు యోగార్థముద్వారా నిస్సారత్వావ్యవగమ మగును. అచటకవికృత మగు మన్మథరూఢపదాంతర స్వీకారమవసరము లేకుండగనే పుష్పధన్వ పదమును దెల్పుట-యను ప్రతిసంధానమొనర్పుటచేత నే దాని యోగార్థముక కుర్వద్రూపతాధాన మొనర్పవలయును. కనుక నీతిరిగా రెండవపదమును స్వీకరించినను, లేకున్నను ఇబ్బందిలేదు.

ఏవం జాత్యన్తర విశిష్టవాచకపదసమభివ్యాహారేఽపి. 'దిశిదిశి జలజాని సన్తి కుముదాని' ఇత్యాద్యత్రాపి జలజాది పదానాం లక్షణయా యోగార్థమాత్రబోధకత్వమ్, యోగశక్త్యుల్లాసితస్య తు తాదృశార్థస్య రూఢ్యర్థోపశ్లిష్టత్వేన స్వాతన్త్ర్యేణ కుముదాదావన్వయా యోగాత్.

ఇలాగే జాత్యంతర విశిష్టములను దెల్పుపదముల సమభివ్యాహార మొనర్చుచున్నపుడున్ను "దిశిదిశి జలజాని సంతి కుముదాని" అనుచోటకూడ జలజాదిపదములు లక్షణచే యోగార్థమును మాత్రము బోధించును. యోగ శక్తిచే నుల్లాసితమగు అటువంటి యర్థము రూఢ్యర్థముతో గలిసియున్నందున స్వతంత్రముగకుముదాదులం దన్వయమునుగాంచు యోగములేదుగదా?

ఇత్థమభిధా నిరూపితా. అనయా యః శబ్దోయమర్థం బోధయతి స తస్య వాచకః. ఇయం చ యస్య శబ్దస్య యస్మిన్నర్థేఽస్తి తస్య సోఽర్థోఽభిధేయః. స చ జాతిగుణక్రియాయాదృచ్ఛికాత్మకః.

తత్ర జాతిర్గోత్వాదిః సంస్థానవిశేషాభివ్యఙ్గ్యా ప్రత్యక్షసిద్ధా గవాదిపదానామభిధేయా. అనుమానసిద్ధా చ ఘ్రాణరసనత్వాది ర్ఘ్రాణరసనాదిపదానామ్. ఆనన్త్యాత్, వ్యభిచారాచ్చ వ్యక్తీనామభిధేయతాయా అకల్పనాత్.

ఇట్లు అభిధ నిరూపించబడినది. దీనిచే నేశబ్దమే యర్థమును బోధించునో అది దానికి వాచకము. ఇదియు నేశబ్దమున కేయర్థమున గలదో దానికది యభిధేయము. అది జాతి గుణ క్రియా యాదృచ్ఛికములను నాల్గురకములు. అందు జాతిగోత్వాదికము సంస్థానవిశేషముచే నభివ్యక్తమై ప్రత్యక్షసిద్ధముగా గవాది పదములతో జెప్పదగియుండును. అనుమానసిద్ధమగు ఘ్రాణరస నత్వాదిజాతి ఘ్రాణరసనాది పదములతో చెప్పదగియుండును. అంతులేకుండ నుండుటవలనను, వ్యభిచారమువలనను, వ్యక్తులనభిధేయములుగా కల్పింపరు కదా?

న చ జ్ఞాతగోత్వాదిరూపయా గోత్వాదిజ్ఞానరూపయా వా ప్రత్యాసత్త్యా ప్రత్యక్షేణ పరికలితాసు సకలతదీయవ్యక్తిష్వభిధాయాః కల్పనే నాస్తి దోష ఇతి వాచ్యమ్. సామాన్యప్రత్యాసత్తేర్నిరాకరణాత్. గౌరవదోషస్యానుద్ధారాచ్చ. ఏతేన శక్తిగ్రహపదార్థోపస్థితి శాబ్దబోధానాం సమానప్రకారతయైవ హేతుహేతుమద్భావాదగృహీతసంకేతానామపి వ్యక్తివిశేషాణామన్వయబోధవిషయతాయా ఉపపాదనేఽపి న నిస్తారః. వ్యక్తీనాం ప్రత్యయస్యాక్షేపాల్లక్షణయా వేత్యన్యదేతత్.

పోనీ- జ్ఞాతగోత్వాది రూపముగానీ, గోత్వాది జ్ఞానరూపముగాగానీ అయిన ప్రత్యాసత్తిచే ప్రత్యక్షమున గోచరించు తదీయవ్యక్తులన్నింటను అభిధను గల్పించుటలో దోషమేమియును నుండబోదుగదా యనరాదు- సామాన్యప్రత్యాసత్తి నిరాకరింపబడెనుగదా? గౌరవదోషము నిరాకరించ లేదుగూడాను- ఇందువలన ఈ గౌరవదోషమును తొలగించకపోవుటచేత- శక్తిగ్రహపదార్థోపస్థితి, శాబ్దబోధలు సమానప్రకారములైననే కార్యకారణ భావము కనుక సంకేతము తెలియకున్నను వ్యక్తివిశేషము లన్వయబోధకు గోచరములగును, అని యుపపాదనమొనర్చినను నిస్తారములేదు. వ్యక్తులకు ప్రత్యయమాక్షేపమునగానీ లక్షణచేతగానీ సమకూరుననుట విషయాంతరము.

అయం చ జాతిరూపః శబ్దార్థః ప్రాణదకత్యుచ్యతే; ప్రాణం వ్యవహారయోగ్యతాం దదాతి సమ్పాదయతీతి వ్యుత్పత్తేః, తదుక్తమ్ "గౌః స్వరూపేణ న గౌర్నాప్యగౌః, గోత్వాభిసంబన్ధా ద్గౌః" ఇతి. అస్యార్థః-గౌః సాస్నాదిమాన్ ధర్మి స్వరూపేణ అజ్ఞాతగోత్వకేన ధర్మి స్వరూపమాత్రేణ న గౌః, న గోవ్యవహార నిర్వాహకః, నాప్యగౌః, నాపి గోభిన్న ఇతి వ్యవహారస్య నిర్వాహకః, తథా సతి దూరాదనభివ్యక్త సంస్థానతయా గోత్వాగ్రహణదశాయాం గవి గౌరితి గోభిన్న ఇతి వా వ్యవహారః స్యాత్. స్వరూపస్యావిశేషాద్ఘటే గౌరితి గవి చాగౌరితి వా వ్యవహారః స్యాదితి భావః. గోత్వాభిసంబన్ధాత్ గోత్వవత్తయా జ్ఞానాత్ గౌర్గో శబ్దవ్యవహార్య ఇతి.

ఈజాతిరూపమైన శబ్దార్థము ప్రాణప్రదమనబడును. ప్రాణం-వ్యవహార యోగ్యతను, దదాతి - సంపాదయతి సమకూర్చును అని వ్యుత్పత్తి అని చెప్పిరి. "గౌః స్వరూపేణ న గౌః నాప్యగౌః గోత్వాభిసంబంధాత్ గౌః" అని. దీని యర్థము- గోవు సాస్నాదులు కలిగిన ధర్మి, గోత్వము తెలియని ధర్మి స్వరూపమాత్రముచేత, "న గౌః" గోవ్యవహారము నిర్వహింపదు, "నాప్యగౌః" గోవుకన్న వేరైనది యను వ్యవహారమును నిర్వహింపదు. అట్లుకాని దూరమునుండి యభివ్యక్తముగాని సంస్థానముతో గోత్వము గ్రహింపబడని దశయందు గోవును గురించియే, గోవని నీ, గోభిన్నమనిగానీ, వ్యవహార ముండవలెను. స్వరూపము తేడాలేనిదగుటవలన ఘటమునందు గోవనియు, గోవునందు గోవుకాదనియు కానీ వ్యవహార ముండవలెనని భావము. గోత్వాభిసంబంధాత్, గోత్వమున్నదని తెలియుటవలన గౌః, గోశబ్దముచే వ్యవహరింపదగును. అని-

గుణః శుక్లాదిః శుక్లాదిపదానామభిధేయః. క్రియా చలనాది శబ్దానామ్. శుక్లాదీనాం చలనాదీనాం చ ప్రతివ్యక్తి భేదదర్శనా దానన్త్యవ్యభిచారాభ్యాం వ్యక్తిశక్తి వాదదోషాభ్యామిహాపికల్పి కరణమితి చేత్, తేషాం లాఘవాత్ప్రత్యభిజ్ఞాబలాచ్చైకతాయా అభ్యుపగమాత్. తదుక్తమ్ - 'గుణక్రియాయదృచ్ఛానాం వస్తుత ఏకరూపాణామాశ్రయభేదాద్భేద ఇవ లక్ష్యతే' ఇతి. తథా చ భేద ప్రతీతిర్భ్రమ ఏవేతి భావః. ఇదముపలక్షణమ్. ఉత్పత్తి వినాశ

ప్రతీతిరపి తథైవ, వర్ణనిత్యతావాదే గకారాద్యుత్పత్తివినాశప్రతీతే ర్భ్రమత్వస్య స్వీకారాత్.

గుణము తెలుపు - మొదలగునది శుక్లాదిపదముల వాచ్యమగును. క్రియ చలనాది శబ్దములకు. శుక్లాదులకును, చలనాదులకును, ప్రతివ్యక్తి యందును భేదమగపడుచున్నది. అపుడానంత్యము, వ్యభిచారము అను వ్యక్తి శక్తి వాదమునందలి దోషములుదప్పవు. కనుక, ఇచటకూడ గాలుప్యము దప్పనిదై యున్నది. అన్నచో నచట లాఘవము వలనను- ప్రత్యభిజ్ఞాబలము వలనను, ఏకత్వమునే యంగీకరింతుము, అదిచెప్పబడినది- 'గుణక్రియా యదృచ్ఛలు వస్తుతః ఏకరూపములైనను ఆశ్రయ భేదమున భేదమున్నట్లగుపడును,' కాగా భేదప్రతీతి భ్రమయే నని భావము. ఇది ఉపలక్షణము. ఉత్పత్తి వినాశ ప్రతీతియు అలాగే— వర్ణములు నిత్యములు అన్నవాదములో గకారాదుల ఉత్పత్తి వినాశములు భ్రమయేనని యంగీకరించలేదా?

యాదృచ్ఛికస్తు వక్త్రా స్వేచ్ఛయా డిత్థాదిశబ్దానాం ప్రవృత్తి నిమిత్తత్వే సంనివేశితో ధర్మః. న చ 'పరమ్పరయా వ్యక్తిగత శ్చరమవర్ణాభివ్యఙ్గ్యోఽఖణ్డః స్ఫోటః' ఇత్యేకే. 'ఆనుపూర్వ్యావచ్ఛిన్నో వర్ణసముదాయః' ఇత్యపరే. 'కేవలా వ్యక్తిరేవ' ఇతీతరే. తత్రాద్యమతద్వయే విశేషణజ్ఞానాత్ విశిష్టప్రత్యయః. తృతీయమతే చ నిర్వికల్పాత్మకః ప్రత్యయః. తదిత్థం చతుష్టయీ శబ్దానాం ప్రవృత్తిరితి దర్శనం వ్యవస్థితమ్.

యాదృచ్ఛికమైన దనగా వక్త తన యిచ్ఛతో డిత్థాది శబ్దములు ప్రవర్తించుటకు నిమిత్తముగా నుంచబడిన ధర్మము. అదియు పరంపరగా వ్యక్తిగతమైనదియు, చివరి యక్షరముచే నభివ్యంగ్యమగునదియునైన అఖండమైన స్ఫోటమని యొకరు. క్రమమును వీడని యక్షరసముదాయమని ఇంకొకరు. కేవలమగు నావ్యక్తియేయని ఇతరులు. ఈ మొదటిమతముల రెంటిలో విశేషణజ్ఞానమువలన విశిష్టజ్ఞానము. మూడవమతములో నిర్వికల్పకరూపమగు ప్రత్యయము. కాగా- ఈతీరుగా శబ్దముల ప్రవృత్తి నాల్గురకములు అని దర్శనము ఏర్పాటైనది.

సర్వేషాం శబ్దానాం జాతిరేవార్థః. గుణక్రియా శబ్దానాం గుణక్రియా గతా యాః, యదృచ్ఛాశబ్దానాం చ బాలవృద్ధశుకాద్యుదీరిత తత్తచ్ఛబ్దవృత్తేస్తత్తన్మయభిన్నార్థవృత్తేర్వా జాతేరభిధేయతాయాః సంభవాత్. ఇతి జాతివ్యక్తిదర్శనమ్.

అన్నిశబ్దములకును జాతియేయర్థము- గుణక్రియాశబ్దములకు గుణక్రియాగతము, యదృచ్ఛా శబ్దములకు బాల- వృద్ధ- శుకాదులచే నుచ్చరింపబడిన ఆయాశబ్దము లందున్నదియు, నాయాసమయములందు భిన్నరూపములనుండు నర్థమునందుండు నదియు, గాని అయిన జాతియే యభిధేయముగ సంభవించును. అని జాతిశక్తివర్ణనము.

## లక్షణానిరూపణమ్

అథ కేయం లక్షణా, యన్మూలకత్వేనాయం నిరూపితో ధ్వనిః? ఉచ్యతే—శక్యసంబన్ధో లక్షణా. తస్యాశ్చార్థోపస్థాపకత్వే ముఖ్యార్థతావచ్ఛేదకే తాత్పర్యవిషయితావచ్ఛేదకతాయా అభావో న తన్త్రమ్. శక్యతావచ్ఛేదకరూపేణ లక్ష్యమాణస్య స్వీకారాత్, కింతు తాత్పర్యవిషయాన్వయే ముఖ్యార్థతావచ్ఛేదకరూపేణ ముఖ్యార్థప్రతియోగికతాయా అభావో రూఢిప్రయోజనయోరన్యతరచ్చ తన్త్రమ్. ముఖ్యార్థాన్వయానుపపత్తేః తన్త్రత్వే తు 'కాకేభ్యో దధి రక్ష్యతామ్' ఇత్యత్ర లక్షణోత్థానం న స్యాత్.

'గఙ్గాయాం ఘోషః' ఇత్యత్ర సామీప్యమ్, 'ముఖచన్ద్రః' ఇత్యాదౌ సాదృశ్యమ్, వ్యతిరేకలక్షణాయాం విరోధః, 'ఆయుర్ఘృతమ్' ఇత్యాదౌ కారణత్వాదయశ్చ సంబన్ధా యథాయోగం లక్షణాశరీరాణి.

తరువాత చివరనిరూపించిన ధ్వనికిమూలమగు లక్షణను నిరూపింతుము. శక్యముయొక్క సంబంధము లక్షణ. ఈలక్షణార్థము నుపస్థాపన మొనర్చుటలో ముఖ్యార్థతా నిర్ణాయకమునందు తాత్పర్యవిషయాన్వయితా నిర్ణాయకత్వము లేకపోవుట తంత్రముగాదు. శక్యతానిర్ణాయక రూపముతో లక్ష్యము భాసించుటను స్వీకరించిరికదా? ఇక నేమనగా తాత్పర్యవిషయమగు నన్వయమున ముఖ్యార్థతా నిర్ణాయకరూపముతో ముఖ్యార్థప్రతియోగికత్వము యొక్క అభావము రూఢిప్రయోజనము లలో, నేదేయొకటియు తంత్రము.

ముఖ్యార్థాన్వయానుపపత్తియే కారణమగుచో "కాకేభ్యో దధి రక్ష్యతాం"- కాకులనుండి పెరుగుగా పాడుము- అనుచోట లక్షణయుదయించకపోవును. "గంగాయాం ఘోషః"- గంగయందు ఘోషము- అనుచోట దగ్గరగా నుండుట- "ముఖం చంద్రః" మొగము చందమామ- అనుచోట సాదృశ్యము, వ్యతిరేక లక్షణయందు విరోధము, అయుర్ఘృతం- ఇత్యాదులందు, కారణత్వము మొదలగునవియు సంబంధములు యథాయోగముగ లక్షణ యొక్క శరీరములు-

ఇయం తావద్ద్వివిధా-నిరూఢా, ప్రయోజనవతీ చ, తత్రాపి ద్వితీయా ద్వివిధా, గౌణీ శుద్ధా చ. తత్రాద్యా సారోపా సాధ్యవసానా చేతి ద్వివిధా. అన్త్యా చతుర్విధా - జహత్స్వార్థా, అజహత్స్వార్థా- సారోపా, సాధ్యవసానా చేతి ప్రయోజనవతీ షడ్విధా సంపద్యతే.

ఈలక్షణ రెండురకములు : నిరూఢ- ప్రయోజనవతి. అందు రెండవది రెండురకములు గౌణి శుద్ధ. మొదటిది సారోప, సాధ్యవసాయ అనిరెండు రకములు అంత్యయందు నాల్గురకములు- జహత్స్వార్థ- అజహత్స్వార్థ- సారోప, సాధ్యవసాన, అని ఈతీరుగా ప్రయోజనవతి యారువిధములుగా నైనది.

తత్రనిరూఢలక్షణాయా అనుకూల-ప్రతికూల-అనులోమ-ప్రతిలోమ-లావణ్యాదయ ఉదాహరణం, నీలాదయశ్చ. 'ధర్మస్యాయమనుకూలః' ఇత్యాదౌ ముఖ్యార్థస్య కూలానుగతత్వాదేర్బాధాత్. అనాదిప్రయోగప్రవాహవశాదేకవస్తుప్రవణత్వాత్మనా కూలానుగతాదిరూపశక్యస్య సాదృశ్యేన సంబన్ధేనానుకూలాదిశబ్దైరనుగుణాదయో లక్ష్యన్తే. ఏవం నీలాదిపదానాం లాఘవాత్ గుణగతజాతేరేవ శక్యతావచ్ఛేదకతయా గుణద్రవ్యయోః 'నీలో ఘటః' ఇత్యాదౌ సామానాధికరణ్యేనాన్వయస్యానుపపత్తేః సమవాయాత్మనా గుణరూపశక్యస్య సంబన్ధేన నీలాదిశబ్దైర్గుణినో లక్ష్యన్తే. తత్రాద్యవర్గే సాదృశ్యసంబన్ధేన ద్వితీయవర్గే చ తదితరసంబన్ధేన లక్షణాయాః ప్రవృత్తేర్నిరూఢాయా మపి గౌణీత్వశుద్ధత్వాభ్యాం ద్వైవిధ్యమామనన్తి.

నిరూఢలక్షణకు అనుకూల - ప్రతికూల - అనులోమ - ప్రతిలోమ - లావణ్యాదు లుదాహరణములు. నీలాదులును, ఉదాహరణ- "ధర్మస్యాయ మనుకూలః" 'ధర్మమున కితఁ డనుకూలుడు-' అనుచోట ననుకూలపదము ముఖ్యార్థమైన కూలానుగతత్వాదులు బాధితములు గనుక అనాది ప్రయోగ ప్రవాహామునుబట్టి ఏకవస్తుప్రవణత్వరూపమున కూలానుగతాది రూపమగు శక్యార్థపు సాదృశ్యమను సంబంధమువలన అనుకూలాది పదములచే నను గుణాదులు, లక్షితములగును. ఈతీరున నీలాదిపదములకు లాఘవమువలన గుణగతజాతియే శక్యతా నిర్ణాయకమగుటచే గుణద్రవ్యములకు "నీలో ఘటః" నల్లకుండ-ఇత్యాదులయందు సామానాధికరణ్యముతో నన్వయము గుదురదు. కనుక సమవాయరూపమగు గుణరూపశక్య సంబంధముండుటవలన నీలాది పదములు గుణులనులక్షింతును. అందను మొదటివర్గమున సాదృశ్య సంబంధముతోను రెండవ వర్గమునం దితరసంబంధముతోను లక్షణ ప్రవర్తించును గనుక నిరూఢయందైనను గౌణియని శుద్ధయని రెండురకము లుండునని చెప్పుదురు.

విషయవిషయిణోః పృథఙ్నిర్దిష్టయోరభేద ఆరోపః. అపృథఙ్నిర్దిష్టే విషయే విషయ్యభేదోఽధ్యవసానమ్. తత్రాద్యేన సహితా సారోపా-ద్వితీయేనతు సాధ్యవసానా. ఉదాహరణాని చ 'ముఖం చన్ద్రః' ఇత్యాదీని గౌణ్యాః సారోపాయాః, 'పురేఽస్మిన్ సౌధ శిఖరే చన్ద్రరాజీ విరాజతే' ఇత్యాదీని చ తస్యాః సాధ్యవసానాయాః. అత్రాద్యాయాం విషయిప్రతిపాదకైశ్చన్ద్రాదిశబ్దైర్లక్షణయోపస్థాపితానాం చన్ద్రాదిసదృశానామభేదేన సంసర్గేణ ముఖాదిశబ్దోపస్థాపితై ర్ముఖత్వాదివిశిష్టైర్ముఖాదిభి రన్వయః. సాదృశ్యరూపధర్మలక్షణాయాం తు తేన సహ ముఖాదీనా మన్వయో న స్యాత్, నామార్థయో రభేదాతిరిక్తసంసర్గేణ విశేష్యవిశేషణభావస్యానుపపత్తేః.

విషయ విషయులను వేరుగా నిర్దేశించి యభేదము జెప్పుట యారోపము. విషయమును వేరుగా నిర్దేశింపక దానితో విషయి కభేదము బోధపరచుట అధ్యవసానము. అందు మొదటిదానితోగలసినది సారోపలక్షణ. రెండవ

దానితో సాధ్యవసాన. ఉదాహరణము- "మొగము చంద్రుడు" గౌణిసారోపకు. "పురేస్మిన్ సౌధశిఖరే చంద్రరాజీ విరాజతే" ఇది గౌణిసాధ్యవసానకు. మొదటిదానియందు విషయినేచెప్పునట్టి చంద్రాదిశబ్దములచే లక్షణచేప్రతిపాదింపబడిన చంద్రాదిసదృశముల కభేదసంబంధముచే ముఖ దిశబ్దములచే ప్రతిపాదింపబడిన ముఖత్వాదివిశిష్టములగు ముఖాదులతో నన్వయము. సాదృశ్యరూపమగు ధర్మమునులక్షించినచో దానితో ముఖాదులకన్వయము గలుగకపోవును. నామార్థముల కభేదముగాక మిగిలిన సంసర్గముతో విశేష్య విశేషణభావ మనుపపన్నముగదా?

నన్వేవం సతి బోధావైలక్షణ్యా 'చ్చన్ద్రసదృశం ముఖమ్' ఇత్యుపమాతో 'ముఖం చన్ద్రః' ఇతి రూపకస్య కథం భేదః ? న చ సదృశవిశేషణచన్ద్రసంబన్ధాఽసంబన్ధాభ్యామితి వాచ్యమ్. బోధస్య వైలక్షణ్యమాత్రేణ పృథగలఙ్కారతాయా అసిద్ధేః. అన్యథా 'ముఖం చన్ద్ర ఇవ' ఇత్యత్ర చన్ద్రసదృశమిత్యేతద్గతాత్ పృథగలఙ్కారతాపత్తిరితి చేత్.

అయ్యా- అలాగైతే బోధలో భేదములేకపోవునే? "చంద్రసదృశం ముఖం" అను నుపమయున్నా- "ముఖం చంద్రః" అనురూపకమున్నా- భేదములేదుకదా? సదృశవిశేషణ చంద్రసంబంధాసంబంధములచే భేదము గల్పింతుము, అని అనుటకువీలులేదు. బోధలోక్రొద్దితేడాతో నలంకారము వేరగునా? అలాకానియెడల- "ముఖం చంద్ర ఇవ" అనుచోట 'ముఖం చంద్ర సదృశం'- అనేదానికన్నా వేరేయలంకారము కావలయును.

అత్ర కేచిత్— రూపకస్యోపమాతః స్వరూప సంవేదనాంశమాదాయావైలక్షణ్యేఽపి లక్షణాఫలీభూత తాద్రూప్యసంవేదనమాదాయ వైలక్షణ్యం నిర్బాధమ్. తాద్రూప్యసంవేదనం చ విషయే ముఖాదౌ విషయితావచ్ఛేదకస్య చన్ద్రత్వాదేః సంప్రత్యయః. నను లక్షణాప్రయోజ్యాదపి తత్సదృశబోధాత్కథం నామ తాద్రూప్య ప్రత్యయః స్యాత్, ఉపాయస్యాభావాద్భేదజ్ఞానేన ప్రతిబన్ధాచ్చ, అన్యథా చన్ద్రసదృశం ముఖమిత్యత్రాపి తాద్రూప్యప్రత్యయప్రసఙ్గ ఇతి చేత్, మైవమ్. శ్లేషస్థల ఇవాత్రాప్యేకశబ్దోపాదానోత్థస్య వ్యఞ్జనస్యోపాయత్వా ద్వ్యాఞ్జనిక బోధస్య బాధబుద్ధ్యప్రతిబద్ధ్య

త్వాచ్చ. అథ చన్ద్రతత్సదృశయోరేవైకపదోపాత్తత్వాచ్చన్ద్రసదృశే చన్ద్రతాద్రూప్యస్య ప్రత్యయో యథాకథఞ్చిదస్తు, న తు ముఖత్వవిశిష్టే ముఖే. అనుభవసిద్ధశ్చ సర్వేషాం "వక్త్రే చన్ద్రమసి స్థితే కిమపరః శీతాంశురుజ్జృమ్భతే" ఇత్యాదౌ విషయే విషయితాద్రూప్యస్య ప్రత్యయ ఇతి చేన్న. స్వతాద్రూప్యవదభేదబుద్ధ్యా స్వతాద్రూప్యస్య సబోధతయా తస్మిన్నపి తస్య సిద్ధేః ఇత్యాహుః.

ఇచట కొందరు-పూర్వపక్షముగా ఉన్న ప్రశ్నకు సమాధానముగా వేదాంతులు చెప్పిన తాద్రూప్యసంవేదనము దీసికొని వైలక్షణ్యము నిర్వహించిరి. తాద్రూప్యసంవేదనమనగా విషయమగు ముఖాదికమున విషయితానిర్ధారితమగు చంద్రత్వాదికము సంప్రతీతమగుట. అయితే- లక్షణవలన ప్రయోగింపబడిన తత్సదృశబోధనుండి తాద్రూప్య ప్రత్యయము ఎలాగేర్పడును? ఉపాయములేకపోవుటవలన నభేదజ్ఞానము ప్రతిబంధించునుగదా. అలాగే కాకపోయినచో "చంద్రసదృశం ముఖం" అనుచోటకూడ తాద్రూప్యప్రత్యయమేర్పడ గలుగును అన్నచో అదితగదు. శ్లేషస్థలమందువలె నిచటగూడ నేకవిద్యమును స్వీకరించుటవలన నేర్పడు వ్యంజనమువలననుగాక. వైయంజనికమగుబోధ అసలుబాధబుద్ధిచే ప్రతిబంధ్యము కాదుగదా? అయితే- చంద్ర తత్సదృశములుమాత్రమే ఏకపదోపాత్తములుగనుక చంద్రసదృశమునందు చంద్రతాద్రూప్యమునకు ప్రత్యయమేలాగైనాగల్గుగాక. అంతేగాని ముఖత్వవిశిష్టమగు ముఖమునకు మాత్రము కాదు. కాని "వక్త్రే చంద్రమసిస్థితే కిమపరః శీతాంశురుజ్జృంభతే"- (ముఖమనే చంద్రుడుండగా యేల యింకొక చంద్రుడు ఉజ్జృంభించుచున్నాడు?) ఇత్యాదులందు విషయమున విషయితాద్రూప్యప్రత్యయము అందరికిని అనుభవసిద్ధము. అన్నచో నిజమే. స్వతాద్రూప్యముగలవానితో నభేదబుద్ధిచే స్వతాద్రూప్యము సుబోధమే కనుక దానియందుకూడ నది సిద్ధించును అని అందురు

అన్యే తు - చన్ద్రాదిపదేభ్యో లక్షణయా చన్ద్రసదృశత్వేనాపి రూపేణోపస్థితానాం. ముఖాదీనాం చన్ద్రత్వేన రూపేణైవ ముఖాదిపదోపస్థాపితైః సహాభేదాన్వయబోధో జాయతే. తత్తత్పదలక్షణాజ్ఞానస్య తత్తత్పదశక్యతావచ్ఛేదక ప్రకారక లక్ష్యాన్వయబోధత్వావచ్ఛిన్నం ప్రతి హేతుతాయాః, పదార్థోపస్థితి శాబ్దబోధయోః

సమానాకారత్వస్యానుభవసాక్షిక వైలక్షణ్యక లాక్షణికబోధాతిరిక్త విషయతాయాశ్చ కల్పనాత్. అత ఏవ 'గఙ్గాయాం ఘోషః' ఇత్యత్ర తటత్వేనాప్యుపస్థితస్య తటస్య గఙ్గాత్వేనాన్వయబోధస్తత్ప్రయోజ్యః శైత్యపావనత్వాదిప్రత్యయశ్చ సంగచ్ఛతే. ప్రకృతే తు విషయి చన్ద్రాది నిష్ఠాసాధారణ గుణవత్త్వప్రత్యయః ఫలమ్. న హి చన్ద్రత్వ ప్రతీతిం వినా ముఖే చన్ద్రత్వనియతగుణవత్త్వధీః శక్యోపపాదయితుమ్. తాద్రూప్యపదేన తదసాధారణ గుణవత్త్వమేవ ప్రాచీనైరుక్తమ్. ఇత్థం చ స్వరూపసంవిత్తికృతః ఫలీభూతసంవిత్తికృతశ్చోపమాతో భేదః స్ఫుట ఏవ' ఇతి వదన్తి.

అన్యులైతే- చంద్రాది పదములనుండి లక్షణచే చంద్రసదృశత్వ రూపముతో నుపస్థితములైనను ముఖాదులకు చంద్రత్వ రూపముతోనే ముఖాదిపదములతో నుపస్థాపితములగు వానితోఁగూడ నభేదాన్వయము బోధ గల్గును. ఆయాపదముల లక్షణాజ్ఞానమునకు ఆయాపదముల శక్యతానిర్ణాయక ప్రకారకమగు ఐక్యాన్వయ బోధత్వవిశిష్టమునుగూర్చి కారణత్వమును, పదార్థోపస్థితి శాబ్దబోధల సమానాకారత్వమునకు ననుభవసాక్షిక వైలక్షణ్య లాక్షణికబోధాతిరిక్త విషయతనున్న కల్పన మొనర్చుటవలన. ఇందువలననే "గంగాయాం ఘోషః" అనుచోట తటత్వముతో నుపస్థితమైనను తటమునకు గంగాత్వేన యన్వయబోధయు దానివలన ప్రయోజ్యముగా నేర్పడిన శైత్య పావనత్వాదిప్రత్యయమున్ను సరిపడును. ప్రకృతమునందన్నో విషయులగు చంద్రాదులందుండు అసాధారణగుణములు ముఖాదులు కల్గియున్నవనెడు ప్రతీతి ఫలము, చంద్రుడుగా స్ఫురించనిదే మొగమునందు చంద్రత్వము కు నియతమగు గుణముగల్గియున్నదను బుద్ధిని గుదుర్చుట కష్టము. తాద్రూప్య పదముతో తదసాధారణ గుణవత్త్వమే ప్రాచీనులు జెప్పినది. ఇట్లాకాగా- స్వరూపసంవేదనముచే నేర్పడినదియు ఫలీభూతసంవేదనముచే నేర్పడినదియు- నుపమకన్న రూపకమునందు భేదము స్పష్టమేయని చెప్పెదరు.

అపరే తు- 'భేదకరమ్బితం సాదృశ్యముపమాజీవాతుభూతమ్, భేదాకరమ్బితం చ గౌణసారోపలక్షణాయా ఇతి స్ఫుటే భేదే కృతం ఫలకృతవైలక్షణ్యాపర్యన్తానుధావనేన, పక్షేఽస్మిన్ భేదగర్భ సాదృశ్యప్రతిపత్తేస్తాద్రూప్యప్రతీతిః కథం నామ ఫలం భవితుమీష్టే

ఇత్యనుపపత్తిం పరిహర్తుమాయాసోఽపి నాపతతీత్యపరమనుకూలమ్" ఇత్యప్యాహుః, తదిత్థం ప్రాచామాశయో మతభేదేన వర్ణితః.

ఇంకొందరుమాత్రము భేదముతోఁగలసిన సాదృశ్యముపమకు జీవాతువు. భేదాకలంబితమగునది గౌణసారోపలక్షణము; అని భేదము స్ఫుటమగుచుండగా ఫలకృతమగు వైలక్షణ్య పర్యంత మనుధావనము పనిలేదు,

ఈ పక్షమునందు భేదగర్భమగు సాదృశ్యప్రతిపత్తికి తాద్రూప్య ప్రతీతియెట్లు ఫలముగా గల్గును? అను అనుపపత్తి పరిహరించుటకు నాయాస మును లేమ. ఇతరమనుకూలమే అనియు చెప్పెదరు. కాగా నిట్లు ప్రాచీనుల యాశయము భేదముతో వర్ణింపబడినది.

నవ్యాస్తు- 'ముఖం చన్ద్రః, వాహీకో గౌః' ఇత్యాదౌ చన్ద్రాదీనాం ముఖాదిభిః సహ సంభవతి లక్షణాం వినైవ భేదేన సంసర్గేణాన్వయబోధః. బాధనిశ్చయప్రతిబధ్యతావచ్ఛేదకకోటౌ అనాహార్యత్వస్యేవ శాబ్దాన్యత్వస్యాపి నివేశనీయత్వాత్. అత ఏవ 'అత్యన్తాసత్యపి హ్యర్థే జ్ఞానం శబ్దః కరోతి హి' ఇతి ప్రాచాం ప్రవాదోఽపి సంగచ్ఛతే. న చ 'వహ్నినా సిఞ్చతి' ఇత్యతో వాక్యాదపి శాబ్దబోధాపత్తిః. యోగ్యతాజ్ఞానవిరహాత్. 'ముఖం చన్ద్రః' 'గౌర్వాహీకః' ఇత్యాదౌ త్విష్టచమత్కారప్రయోజకతాజ్ఞానాధీనాయా ఇచ్ఛాయాః సత్త్వాదాహార్య యోగ్యతాజ్ఞానసామ్రాజ్యమ్. అత ఏవ శాబ్దబోధే యోగ్యతాజ్ఞానస్య కారణత్వోక్తిః ప్రాచాం సంగచ్ఛతే.

నవ్యులు-అయితే-"ముఖం చంద్రః—వాహీకో గౌః—" ఇత్యాదుల యందు చంద్రాదులకు ముఖాదులతో లక్షణలేకుండగనే యభేద సంబంధముతో నన్వయము కుదురును. బాధనిశ్చయమునకు ప్రతిబధ్యతను నిర్ణయించుకోటిలో ననాహార్యత్వమువలె శాబ్దాన్యత్వమున్ను వేయవలసినదే-కనుకనే-

"అత్యంతాసత్యపిహ్యర్థే జ్ఞానం శబ్దః కరోతి హి"— (ఏమాత్రములేని యర్థము నందుకూడా శబ్దము జ్ఞానమును కలిగించునుకదా?) అను ప్రాచీనుల వాడుకయును సంగతమగును. అలాగైనచో 'వహ్నినా సించతి'-అనుమాట

నుండి శాబ్దబోధ గలుగవలసివచ్చునే? యోగ్యతాజ్ఞానము లేనందున లేదందుము. "ముఖం చంద్రః గౌర్వాహీకః" ఇత్యాదికమునందు నిష్టమగు చమత్కారమునకు ప్రయోజకమనెడు జ్ఞానమున కధీనమగు నిచ్ఛయుండుట వలన నాహార్యమగు యోగ్యతా జ్ఞానము స్పష్టము. కనుక ఇందువలన శాబ్దబోధయందు యోగ్యతా జ్ఞానము కారణమను ప్రాచీనమతముగూడ సంగతమగును.

ఆహార్య ఏవ వాఽభేదాన్వయబోధోఽస్తు. మాస్తుబాధబుద్ధి ప్రతిబధ్యవతాచ్ఛేదకకోటౌ శాబ్దాన్యత్వమ్. మా చాస్తు శాబ్దబుద్ధౌ యోగ్యతాజ్ఞానస్య కారణత్వమ్; ఆహార్యం ప్రాత్యక్షికమేవేతి నియమశ్చ. అవశ్యం 'ముఖచన్ద్రః' ఇత్యాదౌ పరాభిమతసారోపలక్షణోదాహరణే వాచ్యార్థయోరేవాభేదాన్వయోఽభ్యుపగన్తవ్యః, న తు వాచ్యలక్ష్యయోః, అన్యథా 'రాజనారాయణం లక్ష్మీస్త్వామాలిఙ్గతి నిర్భరమ్' 'పాదామ్బుజం భవతు మే విజయాయ మఞ్జు మఞ్జీర శిఞ్జిత మనోహరమమ్బికాయాః' ఇత్యాదౌ క్రమేణోపమారూపకయో రుపమితవిశేషణ సమాసాధీనయోర్లక్ష్మీకర్తృకాలిఙ్గన మఞ్జు మఞ్జీర శిఞ్జితమనోహరత్వయోరనుపపత్తినిర్ణాయికా రూపకోపమయోః ప్రాచీనైస్తత్ర తత్ర నిబద్ధావిరుద్ధాస్యాత్. ఆద్యపద్యే ఉపమాయా ఇవ రూపకస్యాపి స్వీకారే బాధకస్యతుల్యతయా తన్నిర్ణాయకతాయా అసంగతేః. ద్వితీయపద్యే రూపకస్యాపి స్వీకారే బాధకాభావేన తన్నివర్తకతాయా అయోగాత్.

అభేదాన్వయబోధ ఆహార్యమే కానిండు; బాధబుద్ధి ప్రతిబధ్యతా నిర్ణాయకకోటిలో శాబ్దాన్యత్వము లేకపోనిండు-శాబ్దబోధలో యోగ్యతా జ్ఞానమునకు గారణత్వము లేకపోనిండు. ఆహార్యము ప్రాత్యక్షికమే అనేనియమమున్ను వద్దు.

అవశ్యముగ-ముఖచంద్రః-ఇత్యాది స్థలములయందు, ఇతరుల కభిమతమగు సారోపలక్షణోదాహరణమునందు వాచ్యార్థములకే యభేదాన్వయము తప్పక యంగీకరింపవలెను, వాచ్యలక్ష్యార్థములకుగాదు. అలాగానియెడల-

"రాజనారాయణం లక్ష్మీస్త్వామాలింగతి నిర్భరం—

"పాదాంబుజం భవతు మే విజయాయ

మంజుమంజీరశింజితమనోహరమంబికాయాః—"

అనుచోట్ల ప్రయుక్తములగు ముఖము ను, సమాసము ఉపమిత సమాసమునకును, విశేషణ సమాసమునకును, అభావములు కదా? అట లక్ష్మీకర్తృకాలింగనము, మంజుమంజీరశింజితమనోహారిన్వరము, అనుపపన్నములని, రూపకము, ముఖమును నిర్వయించుటకు, నీవనుపపత్తి ప్రసంగములు నటనట నుల్లేఖించుట కుదురుచుండును. మొదట వ్యాసముతో నుపమునకు రూపకమును స్వీకరించినను బాధకము సమాసమే - నుక దానిని నిర్వహించుట యసంగతమగును. ఇంక రెండవసద్యమునందు సమాసము స్వీకరించినను బాధకములేదు. కనుక దానిని నవిర్తించేయుట కుదురదు.

న చ ముఖచన్ద్రాదౌ సమాసే క్వచిదస్తు నామ ప్రాగుక్తరీత్యా లక్షణాం వినాపి బోధోపపత్తిః; వ్యాసే తు లక్షణాయా నాస్తి బాధకమితి వాచ్యమ్. 'కృపయా సుధయా సిఞ్చ హరే మాం తాపమూర్ఛితమ్' ఇత్యాదౌ వ్యాసేఽప్యనుపపత్తేః. న చ సిఞ్చతేరపి విషయీకరణే లక్షణయా నానుపపత్తిః. ఉత్ప్రేక్షాద్యతిరిక్తాతిశయోక్త్యపహ్నవాదిష్వాహార్యజ్ఞానేనైవోపపత్తౌ లక్షణాయాం బీజాభావాదనుభవవిరోధాచ్చ.

ముఖచంద్రాదులందు సమాసములో నెచటనైన వెనుక చెప్పిన తీరుగా లక్షణలేకున్నను బోధకుదురునుగాక - వ్యాసమునందు లక్షణకు బాధకము లేదందురా? "కృపయా సుధయా సించ హరే మాం తాపమూర్ఛితం" అనుస్థలమునందును వ్యాసమునందు అనుపపత్తి తప్పనిదేగదా ? సించధాతువునకుగూడ విషయీకరించుటలో లక్షణతో ననుపపత్తి లేదనుకొనవలదు, ఉత్ప్రేక్షాదులకన్న వేరైన యతిశయోక్తి అపహ్నవము మొదలగు స్థలములందువలె నాహార్యజ్ఞానముతోనే కుదురుచుండ లక్షణాబీజము లేకపోవుటయే గాక యనుభవముతో విరోధమున్ను చప్పదు.

అపి చోపమానవాచకస్య చన్ద్రాదిపదస్య రూపకే ఉపమానసదృశే లక్షణా ఇతి హి ప్రాచాం సమయః. తత్ర చ లక్ష్యతావచ్ఛేదకం సాదృశ్యమ్. తచ్చ సమానధర్మరూపమ్. న చ లక్ష్యాంశే సున్దరత్వాదినా విశేషరూపేణ ప్రతీయతే, ఉతాహో సామాన్యరూపేణ? నాద్యః;

'సున్దరం ముఖం చన్ద్రః' ఇత్యాదౌ పౌనరుక్త్యాపత్తేః. న చైవమాదావుపాత్తధర్మకే రూపకే తద్ధర్మాతిరిక్తో ధర్మ ఏవ లక్ష్యతావచ్ఛేదకీభూత సాదృశ్యరూప ఇతి వాచ్యమ్'; అనుభవవిరోధాత్.

'అఙ్కితాన్యక్షసంఘాతైః సరోగాణి సదైవ హి
శరీరిణాం శరీరాణి కమలాని న సంశయః'

ఇత్యాదౌ శ్లేషభిత్తికాభేదాధ్యవసిత ధర్మం వినా ధర్మాన్తరస్య సర్వథైవాస్ఫూర్తేశ్చ. నాన్త్యః- సాదృశ్యస్య శబ్దోపాత్తత్వేనోపమాత్వాపత్తేః. నచసాదృశ్యస్య వాచ్యతాయామేవోపమావ్యపదేశః. 'నలినప్రతిపక్షమాననమ్' ఇత్యాదౌ తదభావాపత్తేః.

మరియు నుపమానవాచకమునకు, చంద్రాదిపదమునకు, రూపకమున ఉపమానసదృశమున లక్షణ అనికదా ప్రాచీనుల సమయము. అక్కడ లక్ష్యతానిర్ణాయకము సాదృశ్యము. అదియు సమానధర్మరూపమైనది. అది లక్ష్యమగునంశమున సుందరత్వాది విశేషరూపములతో ప్రతీతమగునా. లేక సామాన్యరూపముతోనా?

మొదటిపక్షములో "సుందరం ముఖం చంద్రః" అనేచోట పునరుక్తియగును

అయ్యా! ఇటువంటి ధర్మోపాదానముగల రూపకమునందు తద్ధర్మాతిరిక్తమగు ధర్మమే లక్ష్యతానిర్ణాయకమైన సాదృశ్యరూపమైనది అనుచో ననుభవమునకు విరోధము. 'అంకితాని' (ఇంద్రియముల సమూహముతోను అంకితములై రోగములుగలిగి యెప్పుడూ శరీరుల శరీరములు పద్మాక్షములతో నంకితములై యెప్పుడు సరసునందుండునట్టి కమలములేను; సంశయములేదు ) ఇత్యాదిస్థలములలో శ్లేషభిత్తికమైన యభేదముచేత నధ్యవసితమగు ధర్మము లేకుండా మరొకధర్మము ఎట్లను స్ఫురింపదు గనుక రెండవదిగాదు. సాదృశ్యము శబ్దోపాత్తము గనుక నుపమయే గావలసివచ్చును సాదృశ్యము వాచ్యమైనపుడే ఉపమయను పేరు అనరాదు. అట్లన్నచో "నలిన ప్రతిపక్షమాననం "అనుచోట నుపమ గాకపోవును.

కిం చ 'విద్వన్మానసహంస-' ఇత్యాదౌ శ్లిష్టపరమ్పరిత రూపకే శ్లేషనిష్పత్తౌ శ్లేషభిత్తికాభేదాధ్యవసానేన మానసవాసిత్వరూపే

భ్రూవిహంసయోః సాదృశ్యే సిద్ధే సదృశలక్షణామూలస్య భ్రూపే హంసరూపకస్య సిద్ధిః. తస్యాం చ సత్యాం సరోమనోరూపార్థద్వయాభిధానేఽలఙ్కారస్య శ్లేషస్య నిష్పత్తిరితి పరస్పరాశ్రయః. న హి రూపకాస్ఫూర్త్తౌ సరోరూపేఽర్థే మానసశబ్దస్య తాత్పర్యం వేదయితుం కించిత్ ప్రమాణమవతరతి. స్ఫురితే తు రూపకే తద్ఘటకసాదృశ్యాన్యథానుపపత్తిరూపేణ ప్రమాణేనార్థద్వయాభేదబోధఫలకస్య తదుభయప్రతిపాదనాత్మనః శ్లేషస్య నిష్పత్తిః. అతో నామార్థయోరభేదాన్వయసరణిరేవ రూపకస్థలే రమణీయా. సదృశలక్షణాయాః ఫలం రూపకే తాద్రూప్యప్రత్యయ ఇత్యపి న హృదయఙ్గమమ్. తత్సదృశ ఇతి శబ్దాత్సాదృశ్యప్రత్యయే సత్యపి తాద్రూప్యప్రత్యయానుపపత్తేః' ఇత్యాహుః.

మరియు "విద్వన్మానసహంస" ఇత్యాదులలో శ్లిష్టపరంపరిత రూపకమున శ్లేషమునకు కూడిన పిమ్మట శ్లేషభిత్తికమగు నభేదము నధ్యవసించుటతో, మానసహంసరూపమునకు భ్రూహంసముల సాదృశ్యము సిద్ధముకాగా, సదృశలక్షణామూలకమగు భ్రూవునందు హంసరూపకమునకు సిద్ధి. ఇట్లయుండగా సరస్సు-మనస్సు-లకు రెండర్థములు చెప్పుటయను లక్షణముగల శ్లేషకు నిష్పత్తియని, పరస్పరాశ్రయము. రూపకము స్ఫూర్త్తిగానపుడు సరస్సను నర్థమునందు మానసశబ్దమునకు తాత్పర్యమును చెల్పుటకు నుపకరించు నే ప్రమాణమున్ను ప్రవేశించదు రూపకము స్ఫురించిన వెంటనే దానిలో ఘటకమగు సాదృశ్యము మరొకతీరున కుదురకపోవుట యనురూపముగల ప్రమాణముతో రెండు అర్థములకు నభేదబోధయే ఫలముగాగల్గిన, నా రెండర్థములను ప్రతిపాదించుటయే స్వరూపముగాగల్గిన శ్లేష నిష్పన్నమగును. దీనివలన నామార్థములకభేదాన్వయ సరణియే రూపకస్థలములందు రమణీయమైనది.

సదృశలక్షణకు ఫలము రూపకమున తాద్రూప్యప్రతిపత్తియేననుట కూడ హృదయంగమముకాదు. 'తత్సదృశ' అనుశబ్దమువలన సాదృశ్యప్రత్యయముగల్గినను తాద్రూప్యము ప్రతిపన్నమగుటలేదు అనెదరు.

అత్రేదం విచార్యతే- యత్తావదుచ్యతే నామార్థయోరభేదబోధే నైవోపపత్తౌ రూపకే నాస్తి లక్షణేతి, తత్ర చమత్కారిసాధారణధర్మానుపస్థితి దశాయా ముపమాలఙ్కారస్యైవ రూపకాలఙ్కార

స్యాపి నాస్తి నిష్పత్తిశ్చమత్కారోవేతి సకలహృదయసిద్ధమ్. కథ మన్యథా 'భారతం నాకమణ్డలమ్' 'నగరం విధుమణ్డలమ్' ఇత్యాది వాక్యశ్రవణానన్తర మనున్మిషన్త్యారూపకప్రతిపత్తేః 'సుపర్వాలంకృత' 'సకలకలాది' శబ్దశ్రవణోత్తరమేవ సమున్మేషః సర్వేషామ్.ఇత్థమేవ చ 'ముఖం చన్ద్రః' ఇత్యాది ప్రసిద్ధోదాహరణేఽపి. ఇయాంస్తు విశేషః- యదేకత్ర సాధారణోధర్మః ప్రసిద్ధతయా నియమితః స్వబోధకశ్రుతిం నాపేక్షతే ఇతరత్ర త్వప్రసిద్ధతయా తథా ఏవం స్థితే సాధారణధర్మవత్త్వరూపం సాదృశ్యంయది రూపకమధ్యం న ప్రవిశేత్తదా కథమివ ధర్మవిశేషానుపస్థితి దశాయాం రూపకం న పర్యవస్యేత్. చమత్కారం వా న జనయేత్. ఉపమానోపమేయయోరాహార్యాభేదబుద్ధేరనన్యాపేక్షపర్యవసానాయాః సామ్రాజ్యాత్.

ఇచట విచారింతము - నామార్థముల కభేదసంసర్గముతో బోధగుదురుచుండగా రూపకమున లక్షణలేదు అనిచెప్పిరిగదా? అచట చమత్కారము నొదవించని సాధారణ ధర్మ ముపస్థితముగాని దశలో నుపమాలంకారము వనె రూపకాలంకారమున్ను నిష్పన్నముగాదనియు చమత్కార మేర్పడజాలదనియు సకలసహృదయులకును అనుభవపునరుక్తమే. ఇలాగాకపోతే- "భారతం నాకమండలం" "నగరం విధుమండలం" ఇటువంటి మాటలు విన్నంతనే స్ఫురింపని రూపక ప్రతిపత్తికి 'సుపర్వాలంకృతం' 'సకల కలమ్' మొదలగు శబ్దములు విన్నంతనే సమున్మేషమందరికీ ఎట్లు కలుగుచున్నది? ఇలాగే- "ముఖం చంద్రః" ఇత్యాది ప్రసిద్ధోదాహరణముకడనున్నూ. ఇంత మాత్రము తేడా- ఒకచో సాధారణధర్మము ప్రసిద్ధమగుటచే తప్పకుండ తనను బోధించు శబ్దమునపేక్షించదు. రెండవయెడ నప్రసిద్ధమగుటచేత నట్లుకాదు. ఇలాయుండగా సాధారణధర్మవత్త్వరూపమగు సాదృశ్యము రూపకమధ్యమున ప్రవేశింపకపోయినచో నపుడు ధర్మవిశేషముపస్థితముగాని సమయమందు రూపకము ఏల పర్యవసించదు? చమత్కారమును ఏలగల్గింపదు? ఉపమానోపమేయములకు అన్యాపేక్ష ఏదియు లేకుండగనే పర్యవసితమగు ఆహార్యాభేదబుద్ధి ఉన్నదికదా?

న చాహార్య పదార్థద్వయాభేదబుద్ధౌ తచ్చమత్కారే వా సాధారణధర్మవిశేషజ్ఞానం ప్రయోజకమితి శక్యం వక్తుమ్.

'యద్యనుష్ణో భవేద్వహ్ని ర్యద్యశీతం భవేజ్జలమ్
మన్యే దృఢవ్రతో రామ స్తదా స్యాదప్యసత్యవాక్'

ఇత్యాదౌ సాధారణధర్మస్యాప్రత్యయేఽపి వహ్న్యనుష్ణత్వాదీనా మభేదప్రత్యయోపగమాత్. న చోపమానోపమేయస్థల ఏవాయం నవీనో విశేష ఇతి వాచ్యమ్. తద్విశేషకల్పనే మానాభావాత్. సాధారణ ధర్మానవస్థితిదశాయామపి 'ముఖం యది చన్ద్రః స్యాత్ తదా భూమ్యవస్థితం న స్యాత్' ఇత్యాదౌ తాదృశప్రతీత్యుపగమాచ్చ.

అహార్యమగు వదార్థములయొక్క- విశేషబుద్ధిలోగానీ, వాని చమత్కారములోగానీ, సాధారణ ధర్మవిశేషజ్ఞానము ప్రయోజకమని చెప్పటకువీలు లేదు. "యద్యనుష్ణః" (అగ్ని అనుష్ణమైనయెడల నీరు చల్లగా లేనియెడల అట్లుడు దృఢవతుడగు శ్రీరాముడు అసత్యమాడువాడని అను కొందును)- ఇటువంటిచోట సాధారణధర్మము స్ఫురింపకపోయినను వహ్ని యనుష్ణత్వాదులకు అభేదప్రత్యయము గలుగుచున్నది. ఉపమానోపమేయ స్థలములందే ఈక్రొత్తవిశేషమున్నదనుటకు వీలులేదు. ఇచట నిటువంటి విశేషముకల్పించుటకు ప్రమాణములేదు. సాధారణధర్మానవస్థితముగాని దశలోనైనను ముఖముచంద్రుడేయైనచో నేలమీద నిలువకుండనిది" ఇత్యా దులలో నటువంటి ప్రతీతి నంగీకరించిరిగూడాను.

నను రూపకప్రతీతే రుపమానాభేదవిషయత్వవిరహే 'సింహేన సదృశో నాయం కింతు సింహో నరాధిపః' ఇత్యాదౌ నిషేధ్యవిధేయ యోరసంగతిరితి చేత్, న. అనుపదమేవ ప్రాచీనమతద్వయేఽపి రూపకే తాద్రూప్యప్రతిపత్తేః స్వీకారస్య ప్రతిపాదనాత్. అథ విధేయ కోటౌ ప్రాచాం మతే సాదృశ్యస్యాపి ప్రవిష్టతయా తన్నిషేధాను పపత్తి స్తథాపి స్థితైవేతి చేత్, భేదఘటకసాదృశ్యరూపాయా ఉప మాయా ఏవ నిషేధ్యత్వాత్, తిరోభూతభేదసాదృశ్యలక్షణస్య రూప కస్య విధేయత్వాచ్చ నానుపపత్తిః.

అయ్యా- రూపకప్రతీతియందు ఉపమానాభేదము గోచరించకపోతే "సింహేన" (ఈరాజు సింహముతో సమానుడుకాడు ఇకనేమనగా సింహమే) అనునట్టిస్థలమునందు నిషేధ్యమునకు విధేయమునకను అసంగతియేర్పడును.

అదికాదు; ఇంతకుపూర్వమే ప్రాచీనమైన మతములరెంటను రూపకమున తాద్రూప్యప్రతిపత్తి స్వీకరించుటను దెల్పితిమిగదా? సరేగాని విధేయ కోటిలో ప్రాచీనులమతమున సాదృశ్యము ప్రవేశించినదిగదా? కనుక తన్ని షేధమున కనుపపత్తి యట్లైనను యున్నదే అందురా? అందు భేదఘటిత సాదృశ్యరూపమగు నుపమనే నిషేధింతుము తిరోభూత భేదముగల సాదృశ్యమే రూపమగు రూపకము విధేయమొనరించినచో ననుపపత్తియేది?.

యదప్యుక్తం రూపకే లక్షణాస్వీకారే 'రాజనారాయణమ్' ఇత్యత్ర 'పాదామ్బుజమ్' ఇత్యత్రచోపమారూపకయోర్బాధకతయా రూపకోపమయోర్నిర్ణాయకతయా చ లక్ష్మీకర్తృకాలిఙ్గన మఞ్జు మఞ్జీర శిఞ్జితత్వయో రనుపపత్తిః ప్రాచీనైరుక్తా విరుద్ధా స్యాదిత్యాది, తదపి న. రూపకే ఉపమానతావచ్ఛేదకరూపేణ తత్సదృశప్రత్యయస్యోపపాదితత్వేన 'రాజనారాయణమ్' ఇత్యాదౌ విశేషణసమాసాయత్తస్య రూపకస్య స్వీకారే ప్రధానీభూతోత్తరపదార్థస్య నారాయణసదృశస్యాపి నారాయణత్వేనైవ ప్రతీతేర్లక్ష్మీకర్తృకాలిఙ్గనకర్మతాయా అనుపపత్తేరభావాత్. ఉపమాయా ఉపమితి సమాసాయత్తాయాః స్వీకారే తు ప్రధానీభూతపూర్వపదార్థస్య రాజ్ఞో రాజత్వేనైవ ప్రత్యయాత్తాదృశకర్మతాయా అనుపపత్తేః. 'పాదామ్బుజమ్' ఇత్యాదావపి రూపకస్య స్వీకారే ప్రధానీభూతోత్తరపదస్యాస్యామ్బుజసదృశస్యామ్బుజత్వేనైవ ప్రతీతేర్మఞ్జుమఞ్జీర శిఞ్జితమనోహరతాయా అనుపపత్తేః. ఉపమితిసమాసాయత్తోపమాయాం తు ప్రధానస్య పాదస్య పాదత్వేనైవ ప్రతీతస్య నాస్తి తస్యా అనుపపత్తిరితి న కోఽపి దోషః.

రూపకమున లక్షణ స్వీకరించుచో "రాజనారాయణం" అనే చోటను "పాదాంబుజమ్" అనేచోటను ఉపమారూపకములకు బాధకములుగా రూపకోపమలకు నిర్ణాయకముగా నున్న లక్ష్మీకర్తృకాలింగనము, మంజుమంజీరశింజిత మనోహరత్వమున్ను కుదురవు అని ప్రాచీనులు చెప్పుట విరుద్ధమగునే అనుట మొదలగునదియు లేదు.

రూపకమున ఉపమానవతావచ్ఛేదకరూపముతో తత్సదృశప్రత్యయ ముపపాదితము కనుక - రాజనారాయణం - ఇటువంటి స్థలములయందు

విశేషణ సమాసమున కఠినమైన రూపకమును స్వీకరించుటలో ప్రధానమైన ఉత్తరపదార్థమగు నారాయణసదృశుడుగూడా నారాయణస్వరూపముననే ప్రతీతుడు గనుక లక్ష్మీకర్తృకాలింగనములో కర్మత్వమునకు అనుపపత్తి లేదుగదా? ఉపమితసమాసాధీనమగు నుపమను స్వీకరించినచో ప్రధానమగు పూర్వపదార్థమైన రాజు రాజత్వరూపముననే తెలియవచ్చును. అపుడు వెనుక జెప్పిన యాలింగనకర్మత్వ మనుపపన్న మగును. 'పాదాంబుజం' ఇత్యాదుల యందైనను రూపకమును స్వీకరించుచో ప్రధానభూతమగు నుత్తరపదము నర్థమైన అంబుజసదృశము అంబుజముగానే ప్రతీతము గనుక మంజుమంజీరశింజితమనోహరత్వ మనుపపన్నముగదా? ఉపమితసమాసాయత్తమగు నుపమలోనైతే ప్రధానమగు పాదము పాదముగానే ప్రతీత మగును. కనుక మంజుమంజీర శింజితమనోహరతకు ఏదియు ననుపపత్తిలేదు. కనుక ఏమియు దోసగులేదు.

న చోపమితసమాసే పూర్వపదార్థస్యోపమేయస్యోపమేయతావచ్ఛేదకతయైవ ప్రతీతిరితి యుక్తమ్ 'వక్త్రే చన్ద్రమసి' ఇతి ప్రాగుక్త రూపక ఇవోపమానతాద్రూప్యవదభేదబుద్ధ్యా తత్తాద్రూప్యస్యాత్రాపి ప్రతిపత్తుం శక్యత్వాల్లక్షణాయాస్తుల్యత్వాదితి వాచ్యమ్. ఉపమితి సమాసే భేదఘటిత సాదృశ్యస్య లక్ష్యకోటి ప్రవిష్టతయా వైలక్షణ్యస్య వక్ష్యమాణత్వాత్.

ఉపమితసమాసములో పూర్వపదార్థము అయిన ఉపమేయమునకు నుపమేయతా నిర్ణాయకముగానే ప్రతీతమగుట యుక్తముగాదు. "వక్త్రే చంద్రమసి"—యని వెనుకటి రూపకమునవలె ఉపమానతాద్రూప్యవదభేద బుద్ధిచే ఉపమానతాద్రూప్యము ఇచటగూడ గ్రహించనగును. గనుక లక్షణ ఇటనైనను సమానమేగదా? యనరాదు. ఉపమితసమాసమునకు భేదఘటిత సాదృశ్యము లక్ష్యకోటి ప్రవిష్టము గనుక వైలక్షణ్యము చెప్పబడగలదు. కనుక.

యదప్యుక్తమ్-సాదృశ్యస్య శబ్దేనోపాదానాదుపమాత్వాపత్తిరితి తదపి న. భేదాకరంబిత సాదృశ్యవిశిష్టస్య రూపకే లక్ష్యత్వాదుపమావ్యపదేశస్యాప్రసక్తేః. 'సాదృశ్యముపమా భేదే' ఇతి తత్సిద్ధాన్తాత్.

సరే సాదృశ్యము శబ్దముచే నుపాత్తము గనుక ఉపమకావలసి వచ్చునే యనుటయు గుదురదు. భేదరంజితముకాని సాదృశ్యముతో గలసినదియే రూపకములో లక్ష్యమగుటవలన నుపమయనుట ఇక్కడ ప్రసక్తింపదు. 'సాదృశ్యముపమా భేదే', అని వారి సిద్ధాంతముగదా.—

నను యత్ర భేదఘటిత సాదృశ్యవతి వక్త్రా లక్షణయా 'ముఖం చన్ద్రః' ఇతి ప్రయుక్తం తత్ర తథాప్యుపమాలఙ్కారాపత్తిః స్థితైవేతి చేత్, భేదఘటితసాదృశ్యప్రతిపిపాదయిషాకాలే లక్షణయా తద్వతి శబ్దప్రయోగస్య విరుద్ధత్వాత్. లక్షణాయాస్తాద్రూప్యప్రతిపిపాదయిషాధీనత్వాత్. న హి ప్రయోజనమనుద్దిశ్య రూఢివ్యతిరిక్తయా లక్షణయార్థం ప్రతిపాదయన్త్యార్యాః. భేద తాద్రూప్యయోర్విప్రతిషిద్ధత్వేన యుగపదత్ప్రతిపత్త్రు బుద్ధ్యుపారోహాసంభవాచ్చ.

అయితే భేదఘటిత సాదృశ్యము కలదానియందు వక్తయొకడు లక్షణచే "ముఖం చంద్రః" అని ప్రయోగించెను. అచట నటులైనను నుపమాలంకారము అనవలయునే? అదిసరికాదు. భేదఘటితమగు సాదృశ్యమును ప్రతిపాదించు దలంపు గల్గిన సమయమున లక్షణచే నది గలదానియందు శబ్దప్రయోగము విరుద్ధమేగదా? లక్షణతాద్రూప్యమును ప్రతిపాదించవలెనను నిచ్చకధీనముగదా? ప్రయోజనము నుద్దేశించకుండ రూఢినివదలి లక్షణతో నర్థమును ఆర్యులు ప్రతిపాదించరు. భేదము, తాద్రూప్యము రెండును పరస్పరము విప్రతిషిద్ధములు గనుక ఒక్కసారి బుద్ధికెక్కజాలవు కూడాను.

అథోపమితసమాసే 'పురుషవ్యాఘ్రః' ఇత్యాదావుత్తరపదస్య స్వార్థసదృశే లక్షణైవోపగన్తవ్యా. అన్యథా బోధకాభావేన సమాసే సాదృశ్యప్రత్యయో న స్యాత్. న చ వ్యాఘ్ర ఇవేతీవశబ్దస్తద్బోధక ఇతి వాచ్యమ్; తస్య సమాసే సంబన్ధాభావాత్. సతి చ సంబన్ధే తన్నివృత్తేరయోగాత్; నివర్తకశాస్త్రస్యాభావాత్, విగ్రహవాక్యగతస్త్వివశబ్దః స్వఘటిత వాక్యస్యోపమాప్రతిపాదకత్వం సమ్పాదయితుమీష్టే, న వాక్యాన్తరస్య. తస్య వివరణత్వానుపపత్తేశ్చ. న హి వివరణీయవాక్యగతశబ్దాప్రతిపాద్యస్యార్థస్య వివరణం యుజ్యతే. ఇత్థమిచ్ఛ లక్షణాయా ఏవాభ్యుపగమ్యతయా సత్యాం చ తత్ప్రయోజనీభూత తాద్రూప్యప్రతిపత్తౌ కథముపమా ద్వ్యలఙ్కృతౌ తత్ర ప్రాచీనై

రు_క్తేతి చేత్; అత్రోచ్యతే ఉపమితసమాసస్య భేదఘటితోపమాన సాదృశ్యవిశిష్టోపమేయే శక్తేస్తద్ఘటకీభూతోపమానశబ్దస్య భేద ఘటిత సాదృశ్యవిశిష్టే నిరూఢ లక్షణాయా వా స్వీకారాదదోషః.

ఇయమేవ నిపాతానామివాదీనాం ద్యోతకతాపక్షే ముఖం చన్ద్ర ఇవేత్యాదౌ, వాచకలుప్తాయాముపమాయాం చ గతి రను సరణీయా. వాచకలోపస్తూపమానాద్యకరస్మిన్ సాదృశ్యే తద్విశిష్టాన్య తరప్రతిపాదక శబ్దశూన్యత్వాదుపపాదనీయః. యచ్చ 'విద్వన్మానస' ఇత్యత్ర దూషణమభిహితం తద్దూషకప్రకరణే పరిహారిష్యతే.

అయితే - ఉపమితసమాసములో "పురుషవ్యాఘ్రః" ఇత్యాదుల యం దు_త్తరపదమున స్వార్థసదృశమున లక్షణయే అంగీకరించవలెను. అలాగాక పోతే - బోధకములేక సమాసమున సాదృశ్యప్రతీతి లేకపోవును. 'వ్యాఘ్ర ఇవ' అనుచోట ఇవశబ్దము దానిని బోధింపజాలదు. దానికి సమాసముతో సంబంధములేదు. సంబంధముండుచో నది నివర్తించుటకు (ఇవశబ్దము లోపిం చుట కుపాయమేది?) నివర్తక శాస్త్రమేది? విగ్రహవాక్యగతమగు ఇవశబ్ద మున్నదే అది స్వఘటిత వాక్యమున కుపమాప్రతిపాదకత్వమును సమకూర్ప గలదు. అంతేగానీ వాక్యాంతరమునకు కాదు. దానికి వివరణమగుటయు కుదురదు. వివరణీయ వాక్యమందున్న శబ్దము తెలుపని యర్థమునకు వివర ణముచేయుట కుదురదు. కాగా లక్షణయే ఒప్పవలసి యుండుటవలన దాని ప్రయోజనమగు తాద్రూప్యబోధ కలుగుచుండగా నిచట ద్విలుప్తో పమ యెట్లు ప్రాచీనులు చెప్పిరి అని చెప్పెదరా?

ఇచట చెప్పెదము. ఉపమితసమాసమునకు భేదఘటితమగు నుపమాన సాదృశ్యముతో విశిష్టమగు నుపమేయమునందు శక్తినిగాని, ఉపమితసమాస ఘటితమగు ఉపమానశబ్దమునకు భేదఘటిత సాదృశ్య విశిష్టమునందు నిరూఢ లక్షణగాని స్వీకరించుటవలన దోషములేదు. ఇదియే నిపాతములగు ఇవా దులకు ద్యోతకత్వమతమున "ముఖం చంద్ర ఇవ" ఇత్యాదులందును వాచక లుప్తయగు నుపమయందును, గతి యనుసరింపవలెను. ఉపమానాదులతో గలియని సాదృశ్యము, తద్విశిష్టము, వానిలో నొకదానిని తెలుపు శబ్దము లేదు గనుక వాచకలోపము నుపపాదించవలెను. "విద్వన్మానసహంస" అను

చోట దోషమును జెప్పినారుగదా? ఆదోషమును రూపకప్రకరణమున పరిహ రింతుము.

యదప్యుక్తం-రూపకే సదృశలక్షణాయాః ఫలం తాద్రూప్య ప్రత్యయో న యుజ్యతే. తత్సదృశ శబ్దజబోధానన్తరమపి తథా ప్రత్యయాపత్తేరితి, తన్న. తత్సదృశ ఇత్యత్ర లక్షణాయా అభావేన తాద్రూప్యప్రత్యయస్యాపాదనాయోగాత్. తాద్రూప్యప్రత్యయో లక్షణాయాః ఫల మితి ప్రాచాం సమయః, మహాభాష్యాదిగ్రన్థానా మస్మిన్నేవానుకూలత్వాచ్చ. నవ్యనయే తు తేషామాకులీభావః స్యాదితి దిక్.

మఱియు రూపకమున సదృశలక్షణకు ఫలము తాద్రూప్యప్రత్య యము అనుట యుక్తము కాదు. ఏమనగా "తత్సదృశః" అనుశబ్దమువలన బోధగల్గిన తరువాత కూడ అలా ప్రతీతి గలుగవలసివచ్చును, అనుట యుక్తముకాదు. తత్సదృశః అనేచోట లక్షణలేదు గనుక తాద్రూప్య ప్రత్యయము నాపాదింప వీలులేదు. తాద్రూప్యప్రత్యయము లక్షణకు ఫల మని ప్రాచీనులసమయము. మహాభాష్యాది గ్రంథములకు ఈపక్షమునందే యనుకూలత యున్నది. నవ్యమతమున ఇవి యన్నియు గలుషములగుట యున్ను గల్గును.

సాధ్యవసానాయాఞ్చ 'చన్ద్రరాజీ విరాజతే' ఇత్యాదౌ చన్ద్రాదిశబ్దైర్లక్షణయా ముఖత్వేనోపస్థితస్యాపి ముఖాదేః శాబ్దబోధ శ్చన్ద్రత్వాదినా భవతి; లక్షణాజ్ఞానస్యైవ మాహాత్మ్యాత్' ఇత్యేకే. "లక్షణయా ముఖత్వేన ముఖాదేః శాబ్దబోధే వృత్తే వ్యఞ్జనయైక శబ్దోపాత్తత్వ ప్రాదుర్భూతయా చన్ద్రత్వేన బోధః" ఇత్యపరే.

సాధ్యవసానయందు "చంద్రరాజీ విరాజతే" ఇటువంటిచోట్ల చంద్రాది శబ్దములచే లక్షణాతః ముఖత్వేన నుపస్థాపింపబడినను ముఖాదులకు శాబ్ద బోధ చంద్రత్వాదిగానే యగును. లక్షణాజ్ఞానముయొక్క మాహాత్మ్యమే యది, అని యొకరు. లక్షణచేత ముఖత్వేన ముఖాదిక శాబ్దబోధ కలుగగా నొకశబ్దముచే నుపాత్తముగనుక నుదయించిన వ్యంజనచే చంద్రత్వముచే బోధయని ఇతరులు.

మతద్వయేఽప్యస్మిన్ ముఖాదౌ చన్ద్రత్వభానసామగ్ర్యా ముఖత్వాదేః స్వధర్మస్య భానం న నివార్యతే. ఇత్థం చైకస్మిన్ ధర్మిణి చన్ద్రత్వాదీనాం ముఖత్వాదీనాం చ సాక్షాద్భానమేవ సారోపాతోఽస్యా విచ్ఛేదకమ్. అపరేతు "నివార్యత ఏవ విరుద్ధభానసామగ్ర్యా స్వధర్మస్య భానమ్. రజతత్వభానసామగ్ర్యా శుక్తిత్వస్యాభానాత్" ఇతి వదన్తి. మతేఽస్మిన్ విషయతావచ్ఛేదకాస్ఫూర్తిస్తథా.

ఈ రెండు మతములందును ముఖాదులందు చంద్రత్వముభాసించు సామగ్రిచే ముఖత్వాదియగు స్వధర్మము భాసించుట నివారింపబడదు. ఇలా కాగా ఒకధర్మియందు చంద్రత్వాదులకు ముఖత్వాదులకుగూడా సాక్షాత్తుగా భానమే సారోపకన్నను దీనికి విభేదకము. ఇంకకొంతమంది "విరుద్ధభాన సామగ్రిచేత స్వధర్మభానము వారింపబడును. రజతత్వభానసామగ్రిచేత శుక్తిత్వము భాసింపదుగదా?" అందురు.

ఈ మతమున విషయతా నిర్ధాయకము స్ఫురింపకపోవుట సారోపకన్న దీనికి విభేదకము.

వస్తుతస్తు సాధ్యవసానాయాం విషయతావచ్ఛేదక ధర్మభానం యది సహృదయ హృదయప్రమాణకమ్, తదా తద్వారణాయ కారణ కల్పనానుచితైవ. శుక్తిరజతభానస్థలే తు శుక్తిత్వేన భానే పురో వర్తిని రజతత్వభానం సర్వథైవ విరుద్ధత్వాద్రజతత్వభానసమయే శుక్తిత్వభాననిరాకరణమావశ్యకమ్. న చేహాపి తథా, అనుభవవిరుద్ధ త్వాత్. యది తు తన్న ప్రామాణికం తదా సోచితైవ.

వస్తుతః అయితే సాధ్యవసానయందు విషయతానిర్ణాయకధర్మము భాసించుట సహృదయుల హృదయమునకు ప్రమాణముగా దోచినచో నపుడు దానిని నివారించుటకై కారణకల్పన యనుచితమేను. శుక్తిరజతభాన స్థలమునందైన శుక్తిగా భాసించగా ముందున్నది రజతముగాభాసించుట అన్నివిధములను విరుద్ధమే. కనుక రజతత్వము భాసించువేళలో శుక్తిత్వము భాసించుటను వారింపవలెను. ఇక్కడకూడ నలాగే ననరాదు. అనుభవము నకు విరుద్ధముగనుక. అది అక్కడ ప్రామాణికము కాకపోయినచో నప్పుడది యుచితము.

## ఉపమాప్రకరణమ్

అథాస్య ప్రాగభిహితలక్షణస్య కావ్యాత్మనో వ్యఙ్గ్యస్య రమణీయతాప్రయోజకా అలఙ్కారా నిరూప్యన్తే:- తత్రాపి విపులాలఙ్కారాన్తర్వర్తిన్యుపమా తావద్విచార్యతే- 'సాదృశ్యం సున్దరం వాక్యార్థోపస్కారముపమాలఙ్కృతిః' సౌన్దర్యం చ చమత్కృత్యాధాయకత్వమ్. చమత్కృతిరానన్దవిశేషః సహృదయహృదయప్రమాణకః. అనన్వయే చ 'గగనం గగనాకారమ్' ఇత్యాదౌ సాదృశ్యస్య ద్వితీయసబ్రహ్మచారినివర్తనమాత్రార్థముపాత్తత్వేన స్వయమప్రతిష్ఠానాదచమత్కారిత్వైవ. అత ఏవ తస్యాన్వయాభావాదనన్వయం తమాహుః. వ్యతిరేకే 'తవాననస్య తులనాం దధాతు జలజం కథమ్' ఇత్యాదౌ చమత్కారిణో నిషేధస్య నిరూపణాయ ప్రతియోగినః సాదృశ్యస్య నిరూపణమచమత్కారకమేవ. ఏవమభేదప్రధానేష్వపి రూపకాపహ్నుతిపరిణామభ్రాన్తిమదుల్లేఖాదిషు, భేదప్రధానేషు దృష్టాన్తప్రతివస్తూపమాదీపకతుల్యయోగితాదిషు చమత్కారిషు తత్తన్నిష్పాదకతయావస్థితస్యాపి సాదృశ్యస్య చమత్కారితావిరహేణ నాస్త్యుపమాలఙ్కృతిత్వమ్. 'ముఖమివ చన్ద్రః' ఇతి ప్రతీపే, 'చన్ద్ర ఇవ ముఖం, ముఖమివ చన్ద్రః' ఇత్యుపమేయోపమాయాం చ సాదృశ్యస్య చమత్కారిత్వేనాతిప్రసఙ్గః శఙ్కనీయః, తయోః సఙ్గ్రాహ్యత్వాత్.

తరువాత పూర్వము జెప్పబడిన లక్షణములుగల కావ్యాత్మయగు వ్యంగ్యమునకు రమణీయతా ప్రయోజనములగు నలంకారములు నిరూపించబడును. అందు విపులాలంకారములలో నంతర్వర్తినియగు నుపమ పూర్తిగా విచారింపబడును.

సాదృశ్యము సుందరమై వాక్యార్థోపస్కారకమగునది యుపమాలంకృతి.

సౌందర్యము చమత్కృతిని చక్కగా గలిగించుట. చమత్కృతి యానందవిశేషము. సహృదయుల హృదయమే దీనికి బ్రమాణము. అనన్వయమునందు "గగనం గగనాకారం" ఇత్యాదులందు రెండవసమానవస్తువు లేదనుటకొరకుమాత్రమే సాదృశ్యము స్వీకరించబడినది గనుక స్వయముగా

దానికి ప్రతిష్ఠ లేదు గాబట్టి చమత్కారము గలిగింపనేలేమ. ఇందువలన యీ సాదృశ్యమున కన్వయములేక దానిని యనన్వయమనెదరు.

వ్యతిరేకమునందు "తవాననస్య తులనాం దధాతు జలజం కథమ్" (నీ మొగమునకు సామ్యమును పద్మమెట్లుపొందును?) ఇత్యాదులందు చమత్కారియగు నిషేధమును నిరూపించుటకై ప్రతియోగియగు సాదృశ్యమును నిరూపించుట యచమత్కారమే.

ఈ తీరున చమత్కారముగల నభేదప్రధానములగు రూపకము, అపహ్నుతి, పరిణామము, భ్రాంతిమత్తు, ఉల్లేఖము మొదలగువానియందును, చమత్కారముగల భేదప్రధానములగు దృష్టాంతము, ప్రతివస్తూపమ, దీపకము, తుల్యయోగిత మొదలగువానియందును, నాయావాటికిని నిష్పాదకముగా నున్నను సాదృశ్యము చమత్కారశూన్యమగుటచే నుపమాలంకృతిగాదు. "ముఖమివ చంద్రః" అను ప్రతీపమున "చంద్ర ఇవ ముఖం— ముఖమివ చంద్రః"— అను నుపమేయోపమలోనున్న సాదృశ్యము చమత్కరించినది గనుక నతిప్రసంగము నాశంకింపరాదు. అవి రెండును సంగ్రహింపవలసినదే—

నను "త్వయి కోపో మమాభాతి సుధాంశావివ పావకః" ఇత్యాదావుపమానస్యాత్యన్తమసంభావితత్వాత్ సాదృశ్యమేవ న తావత్ప్రతిపత్తుంశక్యమ్, చమత్కారస్తు పునః కేన స్యాదితి చేత్, కవినాహి ఖణ్డశః పదార్థోపస్థితిమతా స్వేచ్ఛయా సంభావితత్వేనాకారేణ చన్ద్రాధికరణకమనలం ప్రకల్ప్య తేన సహ సామ్యస్యాపి కల్పనే బాధకాభావాత్. కల్పితమసత్సాదృశ్యం కథం చమత్కారజనకమితి తు న వాచ్యమ్, పరమసుకుమారీభవత్కనకనిర్మితాఙ్గ్యా మణిమయ దశనకాన్తి నిర్వాసిత ధ్వాన్తాయాః కాన్తాయా భావనయా పురోఽవస్థాపితాయా ఆలిఙ్గనస్యాహ్లాదజనకత్వదర్శనాత్. ఉపమానోపమేయయోః సత్యత్వస్య లక్షణే ప్రవేశాభావాన్నాత్ర దోషలేశోఽపి. అత ఏవ- 'స్తనాభోగే పతన్భాతి కపోలాత్కుటిలోఽలకః' 'శశాఙ్కబిమ్బతో మేరౌ లమ్బమాన ఇవోరగః'. ఇత్యాదావపి నానుపపత్తిః.

అయ్యా—

"త్వయి కోపః" (నీయందు కోపము చంద్రునియందు అగ్నివలె నాకు తోచుచున్నది) ఇత్యాదులందు ఉపమాన మిచట యేమాత్రము సంభవించక పోవుటవలన సాదృశ్యమే అసలు గ్రహింపవలనుపడదు; ఇక చమత్కార మేది గల్గించును? అన్నచో—కవి తునకలు తునకలుగా పదార్థోపస్థితిని గల్గించుకొని — తన ఇచ్ఛకొలది నూహించుకొని — ఏదోయొకతీరుగా చంద్రునియందగ్నిని కల్పించుకొని దానితోగూడ సామ్యమునున్ను కల్పించు కొనుటలో నిబ్బందిలేదుకదా? కవిత్వమున అసత్సాదృశ్యము ఎట్లు చమత్కారమును గల్గించుననవలదు. పరమసుకుమారమగు బంగరుచేనిర్మింపబడిన శరీరమునుగల్గి మణిమయములగు దంతకాంతులచే నిర్వాసితమగు చీకటికల, కాంతను భావముచే ముందునిల్పుకొని కౌగలించుకొనగా సంతోషమును అనుభవించుట కనబడుటలేదా? ఉపమానోపమేయములు సత్యములనుట లక్షణములో ప్రవేశపెట్టలేదుగనుక దోసమేలేదు.

ఇందువల్ల—

"స్తనాభోగే"–(చెక్కిలినుండి స్తనాభోగమున పడుచున్నదై కుటిలమగు నలకము చంద్రబింబమునుండి మేరువునందు ప్రేలుచున్న పామువలె ప్రకాశించుచున్నది) ఇత్యాదులందుగూడ అనుపపత్తిలేదు.

పరే తు అస్యాః కల్పితోపమాయా ఉపమానాన్తరాభావ ఫలకత్వేనాలఙ్కారాన్తరతామాహుః; తన్న. సాదృశ్యస్య చమత్కారిత యోపమాన్తర్భావస్యైవోచితత్వాత్; సన్నిరూపితత్వస్య లక్షణే ప్రవేశాభావాత్. ఉపమానాన్తరాభావ ఫలకత్వం హ్యుపమావిశేషత్వే సాధకమ్ న తూపమాబహిర్భావే.

ఇతరులైతే—

ఈ కల్పితోపమకు నుపమానాంతరాభావమే ఫలము కనుక మరొక యలంకారమే ననిరి. అదిసరిగాదు. సాదృశ్యము చమత్కారి గనుక నుపమాంతర్భావమే ఉచితము. లక్షణములో సన్నిరూపితత్వము ప్రవేశింపలేదు కదా? ఉపమానాంతరములేకపోవుట ఫలము అగుచో నది యుపమావిశేష మగుటకు సాధకము. అంతేకాని ఉపమకాదనుటకు సాధనముకాదే!

అథ—

'విలసత్యాననం తస్యా నాసాగ్రస్థితమౌక్తికమ్
ఆలక్షితబుధాశ్లేషం రాకేన్దోరివ మణ్డలమ్'

ఇత్యాదౌ సాధారణధర్మస్యాభావాత్ కథముపమానిష్పత్తిః? బుధమౌక్తికయోరేకైకమాత్రవృత్తిత్వాత్. న చాత్ర యది నాసాగ్రస్థితమౌక్తికం తస్యా ఆననమాలక్షితబుధాశ్లేషం రాకేన్దోర్మణ్డలమివ విలసతీతి తాదృశరాకేన్దుమణ్డలనిరూపితసాదృశ్యప్రయోజకవిలాసాశ్రయస్తాదృశమాననమితి తాత్పర్యం తదా విపూర్వకలసత్యర్థశోభావిశేషఏవ సమానో ధర్మః. యది చ తాదృశమిన్దుమణ్డలమివ యత్తాదృశమాననం తద్విలసతీతి తాదృశసాదృశ్యావచ్ఛిన్నమాననముద్దిశ్య విలాసాశ్రయత్వం విధేయతయా వివక్ష్యతే తథాస్యా లుప్తోపమాత్వాత్పద్మమివ ముఖమిత్యాదావివాహ్లాదకత్వాదిధర్మ ఉన్నేయ ఇతి; వాచ్యమ్. ఉపమానోపమేయశోభయోరపి వస్తుతోఽసాధారణత్వాత్.

'కోమలాతపశోణాభ్రసన్ధ్యాకాలసహోదరః
కషాయవసనో యాతి కుఙ్కుమాలేపనో యతిః'

ఇత్యాదౌ ధర్మాన్తరస్యాప్రతిభానాదసున్దరత్వాచ్చ కోమలాతపాదీనామసాధారణత్వాత్కథముపమేతి చేత్—

అయితే!—

'విలసత్యాననం' (ఆమె మొగము ముక్కుచివరనున్న ముత్యము గలదై బాగా గురుతింపవగిన బుధుని సంబంధముఁగల రాకాచంద్రుని యొక్క మండలమువలె ప్రకాశించుచున్నది) ఇత్యాదులందు సాధారణ ధర్మము లేదుకదా? ఎట్లు ఉపమ నిష్పన్నమగును? బుధుడు—మౌక్తికమున్ను ఒక్కొక్కయెడనే ఉందురుగదా? ఇక్కడ నాసాగ్రస్థితమౌక్తికమగు నామె మొగము ఆలక్షితబుధాశ్లేషమగు రాకేందునిమండలమువలె విరాజిల్లుచున్నదని– అటువంటి రాకేందుని మండలముచే నిరూపించబడిన సాదృశ్యమునకు ప్రయోజకమగు విలాసమునకుఆశ్రయమగునది–అటువంటి మొగము అని తాత్పర్యమగుచో నపుడు విపూర్వకలసతికి అర్థమగు శోభావిశేషమే సమాన ధర్మము. అదికానిచో అట్టిచంద్రమండలమువంటి ఏతాదృశమగునాననము కలదో–అదివిలసిల్లుచున్నది అని–అటు సాదృశ్యవిశిష్టమగు నాననముద్దేశించి

విలాసాశ్రయత్వము విధేయముగా వివక్షితమగుచో నపుడిది లుప్తోమ కనుక పద్మమువంటి మొగము ఇత్యాదులందువలె అహ్లాదకత్వాదిధర్మము నూహించ నగును, అనియెదరా? ఉపమానోపమేయశోభలుకూడా వస్తుతః అసాధారణములే.

'కోమలాతప' (కోమలమగు నెండయు ఎఱ్ఱనిమబ్బును యివిగల సంధ్యా కాలముతో తుల్యమైనట్లు కాషాయవస్త్రముగల యతి కుంకుమ బూసుకొని పోవుచున్నాడు) ఇత్యాదులందు మరొకధర్మము స్ఫురింపదు. అది సుందర మున్నూ కాదు. కోమలాతపాదులు అసాధారణములుగదా? ఉపమ ఎట్లగును? అనియెదరా?

అత్రాహుః— ఉపమేయగతానా ముపమాన గతానాం చ సాధారణానామపి ధర్మాణాం సాదృశ్యమూలేనాభేదాధ్యవసాయేన సాధారణత్వకల్పనాదుపమాసిద్ధిః. న చ భ్రమాత్మకేనాహార్యాభేద బోధేన కథం నామ కుఙ్కుమాలేపకోమలాతపాదీనాం వస్తుతో భిన్నానాం సాధారణత్వసిద్ధయేఽత్యన్తమసన్నభేదః సేద్ధుం శక్నుయాత్, భ్రమేణార్థసిద్ధేరభావాదితి వాచ్యమ్. ప్రాగుక్తేఽపి 'త్వయి కోపో మమాభాతి సుధాంశావివ పావకః' ఇత్యాదావుపమానోపమేయ యోరత్యన్తాసత్త్వేఽపి కల్పనామాత్రతో యథా నిష్పత్తి స్తథైవ ప్రకృతే సాధారణధర్మస్యాపీతివ్యక్తముపపాదయిష్యామః. అయ మేవ బిమ్బప్రతిబిమ్బభావఇతి ప్రాచీనైరభిధీయతే.

ఇచట చెప్పెదరు-ఉపమేయగతములు-ఉపమానగతములు నగు అసాధారణములగు ధర్మములకు సాదృశ్యమూలమగు నభేదాధ్యవసాయముతో సాధారణత్వమును గల్పించుటవలన నుపమాసిద్ధి. మరి భ్రమాత్మకమగు నాహార్యాభేదబోధచే కుంకుమాలేపకోమలాతపాదులకు వస్తుతః భిన్నము లైనను సాధారణత్వము సిద్ధించుటకై అసలే లేనియభేదము ఎట్లుసిద్ధింపగలదు? భ్రమవలన యర్థముసిద్ధింపదుగదా? అనెదరా? వెనుక జెప్పబడిన 'త్వయి కోపో మమాభాతి సుధాంశావివ పావకః'—అనేచోట ఉపమానోపమేయములు అసలు లేకున్నను కల్పనామాత్రమున ఎట్లు నిష్పత్తియో అలాగే-ప్రకృతములో సాధారణధర్మమున్ను అని స్పష్టముగా నుపపాదించబోయెదము. ఇదియే బింబప్రతిబింబభావము అందురు ప్రాచీనులు.

ఏవమ్—

'భుజో భగవతో భాతి చఞ్చల్యాచ్చాణూరచూర్ణనే
జగన్మణ్డలసంహారే వేగవానివ ధూర్జటిః'

అత్ర ధూర్జటిభగవద్భుజయోరాకారేణ సాదృశ్యాభావాత్ప్రకార నిర్ముక్తస్య కేవలభానస్యాప్రయోజకతయా చాణూరచూర్ణననిమిత్తక చాఞ్చల్యవత్త్వజగన్మణ్డలసంహారనిమిత్తక వేగవత్త్వయోర భేదాధ్యవసానేనాభిన్నధర్మప్రకారక భానవిశేష్యత్వస్య సాధారణ ధర్మస్య సిద్ధేరుపమాసిద్ధిః. తత్ర చాణూరజగన్మణ్డలయోర్వస్తుతోభిన్న యోర్మహాకాయత్వాదినా సాదృశ్యాద్బిమ్బప్రతిబిమ్బభావః, చూర్ణన సంహారయోశ్చాఞ్చల్యవేగవత్త్వయోస్త్వాశ్రయ భేదాద్భిన్నయోరపి వస్తుత ఏకరూపత్వైవేతి వస్తుప్రతివస్తు భావః. ఇత్థ్యేవం నిరూపిత ముపమాలక్షణమ్.

ఈతీరుగా

"భుజో భగవతో భాతి" (చాణూరు వధించుటయందు చంచలమగు భగవంతుని భుజను జగన్మండలము సంహరించుటయందు వేగముగల ధూర్జటి వలె ప్రకాశించుచున్నది) ఇత్యాదులలో ధూర్జటి భగవద్భుజములకు ఆకారముతో పోలికలేకపోయిన ప్రకారరహితమగు కేవల భాన మప్రయోజకమగుటచేత చాణూరచూర్ణనమే నిమిత్తముకాగా చాంచల్యము గల్గియుండుటయు జగన్మండల సంహారనిమిత్తముగాగల వేగము గల్గియుండుటయు నభిన్నముగా నధ్యవసింపబడి, అభిన్నధర్మప్రకారముగా భాసించుటలో విశేష్యత్వమే సాధారణధర్మము సిద్ధించుటవలన ఉపమ సిద్ధించినది.

అక్కడ చాణూరుడు, జగన్మండలము-వస్తుతః భిన్నములైనను గొప్పశరీరము గల్గియుండుట మొదలగు దానివలన సాదృశ్యము సిద్ధించును గనుక బింబప్రతిబింబభావము. చూర్ణనము-సంహారము, చాంచల్యము-వేగవత్త్వము స్వాశ్రయభేదము వలన భిన్నములైనను వస్తుతః ఏకరూపత-అని, వస్తు ప్రతివస్తుభావము-ఈతీరుగా నుపమాలక్షణము నిరూపించబడినది.

అథేయముదాహ్రియతే—

'గురుజనభయమద్విలోకనాన్తః సముదయదాకులభావమావహన్త్యాః
దరదలదరవిన్దసున్దరం హా హరిణదృశో నయనం న విస్మరామి'

అత్ర దలదరవిన్దశబ్దస్యోపమానవాచకస్య సున్దరశబ్దేన సామాన్యవచనేన సమాసే ప్రతీయమానోపమా సకలవాక్యార్థస్య విప్రలమ్భశృఙ్గారస్య స్మృత్యుపస్కరణద్వారోపస్కారకతయా లఙ్కారః.

న చాత్రస్మృతిః ప్రధానతయా ధ్వన్యత ఇతి వక్తుం యుక్తమ్; న విస్మరామీతి స్మృత్యభావనిషేధముఖేన స్ఫుటమావేదనాత్. నాపి పూర్వార్ధగత త్రాసౌత్సుక్యయోః పరస్పరాభిభవ కామయోః సంధిః ప్రధానమ్, తస్య నాయికాగతత్వేనానువాద్యత్వాత్; ఉత్తరార్ధగత స్మృత్యఙ్గత్వాచ్చ, తస్మాత్ భావసన్ధ్యుపమాలఙ్కారాభ్యాముపస్కృతా స్మృతిర్హా పదగమ్యః సన్తాపోఽనుభావశ్చ విప్రలమ్భమేవోపస్కురుత ఇతి తస్యైవాత్ర ప్రాధాన్యమ్.

తరువాత నుదాహరింతుము-ఇది ఉదాహరణము- "గురుజనులవలన భయము నన్ను చూచుటచే లోపలనుదయించుచున్న వ్యాకులత్వమున్ను వహించుచున్న హరిణాక్షియొక్క కొద్దిగావిచ్చుచున్న అరవందమువలె సుందరమగునేత్రము నేను మరచిపోను?" ఇచట దలదరవింద ముపమాన వాచకము. సామాన్యవాచకమగు సుందరశబ్దములో సమాసమునదోచు నుపమ సకలవాక్యార్థమగు విప్రలంభశృంగారముయొక్క స్మృతి నుపస్కరించుటద్వారా ఉపస్కరించును గనుక నలంకారము. ఇచట స్మృతి ప్రధానముగా ధ్వనించుననరాదు. "నవిస్మరామి" అని స్మృతిభావమును నిషేధించుటద్వారముననే స్పష్టముగా నది చెప్పబడెనుగదా?

మరియు—పూర్వార్ధగతములగు త్రాసౌత్సుక్యములు ఒకదానితో నొకటి త్రోసివేయుకోర్కతోనున్నవి, వాటిసంధియే ఇచట ప్రధానమన రాదు. అది నాయికాగతమగుటవలన అనూద్యమానముగదా? అది ఉత్తరార్ధగతమగు స్మృత్యంగముకూడాను. కాగా భావసంధి ఉపమాలంకారములతో నుపస్కరింపబడిన స్మృతి, "హా"-పదగమ్యమగు సంతాపము, అను భావమున్ను, విప్రలంభమునే యలంకరించుచున్నది. గనుక దానికే ఇట ప్రాధాన్యము.

అప్పయదీక్షితాః పునశ్చిత్రమీమాంసాయాం-- 'ఉపమితిక్రియానిష్పత్తిమత్సాదృశ్యవర్ణన మదుష్టమవ్యఙ్గ్యముపమాలఙ్కారః'

స్వనిషేధాపర్యవసాయి సాదృశ్యవర్ణనం వా తథాభూతం తథా' ఇతి లక్షణద్వయమాహుః తచ్చిన్త్యమ్, వర్ణనస్య విలక్షణశబ్దాత్మకస్య విలక్షణజ్ఞానాత్మకస్య వా శబ్దవాచ్యతావిరహేణార్థాలఙ్కారతాయా బాధాత్. తస్య సర్వథైవావ్యఙ్గ్యత్వాదవ్యఙ్గ్యత్వ విశేషణవైయర్థ్యాచ్చ.

అథ యది వర్ణనవిషయీభూతం తాదృశసాదృశ్యముపమేత్యుచ్యతే, తదా 'యథా గౌస్తథా గవయ' ఇత్యత్రోపమాలఙ్కారాపత్తేః. ఏవం 'కాలోపసర్జనే చ తుల్యమ్' ఇత్యాదావపి. అశిష్యత్వాదినా ప్రధాన ప్రత్యయార్థ వచనసాదృశ్యస్యాత్రాపి ప్రతిపాదనాత్.

అప్పదీక్షితులు-చిత్రమీమాంసలో—

'ఉపమితి క్రియానిష్పత్తిమత్సాదృశ్యవర్ణనము, దోషరహితమై అవ్యంగ్యమగు నపుడు ఉపమాలంకారము' 'తననిషేధమున పర్యవసింపని సాదృశ్యవర్ణనమైనను అటువంటిది' అలాగని రెండులక్షణములు చెప్పిరి. అది సరికాదు. వర్ణనము విలక్షణశబ్దాత్మకముగానీ, విలక్షణజ్ఞానాత్మకముగానీ శబ్దవాచ్యతలేదు గనుక నర్థాలంకారత్వమునకు బాధ. అదియెట్లును వ్యంగ్యముగాదుగనుక నవ్యంగ్యత్వవిశేషణము వ్యర్థము. వర్ణనవిషయీభూతమగు తాదృశసాదృశ్యమే ఉపమ యనరాదా? అనరాదు. అట్లైన "యథా. గౌస్తథాగవయః" అనుచోట నుపమాలంకారము గావలసివచ్చును.

ఇలాగే—"కాలోపసర్జనే చ తుల్యం"—ఇత్యాదులందునుగూడ. అశిష్యత్వాదిచేత ప్రధానప్రత్యయార్థవచనసాదృశ్య మచటనుకూడ ప్రతిపాదించెను గదా?

న చాత్ర వచనభేదస్య దోషస్య సత్త్వాదదుష్టత్వవిశేషణేన వారణం భవిష్యతీతి వాచ్యమ్. ఏతద్వాక్యోపప్లుతవాక్యాన్తర ప్రతిపాదితైకోపమేయకే సాదృశ్యే తథాప్యతిప్రసఙ్గాత్. నచాత్రోపమితి క్రియాయా నిష్పత్తావపి న సాదృశ్యవర్ణనమ్, విషయస్యాచమత్కారిత్వాత్, చమత్కారవిషయక కవివ్యాపారస్యైవ వర్ణనపదార్థత్వాదితి వాచ్యమ్. ఏవం హి చమత్కారిత్వస్య లక్షణేఽవశ్యం నివే

శ్యత్వేనోపమితిక్రియానిష్పత్తివిశేషణస్య వైయర్థ్యాత్. నహ్యనిష్పన్న మాపాతతః ప్రతీయమానం సాదృశ్యం చమత్కృతిమాధత్తే. ఏవం ద్వితీయలక్షణేఽపి నిషేధాపర్యవసాయిత్వం నిరర్థకమ్. వ్యతిరేకే కమలాదిసాదృశ్య నిషేధస్యానన్వయే చ సర్వథా సాదృశ్యనిషేధస్య చమత్కారితయా తదర్థం సాదృశ్యస్య నిరూపణమితి ప్రాగేవాభిధా నాత్.

ఇచట వచనభేదము దోషమున్నది. గనుక అదుష్టత్వవిశేషణముచేత దానిని వారించుటకాగలదందురా? ఈమాటతో సమానముగా గల్పించిన మరొకవాక్యముచే చెప్పబడిన ఒకే ఉపమేయముగల సాదృశ్యమును ప్రతిపా దించినపుడు ఎలాగైనను పై యతిప్రసంగమున్నదేగదా? అయితే—ఇచట నుపమితిక్రియ నిష్పన్నమైనను సాదృశ్యవర్ణనములేదు. అసలు విషయమున చమత్కారములేదు కనుక-చమత్కారవిషయమునుగురించి కవి వ్యాపారమే వర్ణనపదార్థముగదా? అనరాదు. అట్లన్నచో చమత్కారిత్వము లక్షణములో తప్పకవేయవలసినదే, గనుక-ఉపమితిక్రియానిష్పత్తియను విశేషణమువ్యర్థమే గదా? నిష్పన్నముగాక నాపాతతః ప్రతీయమానముగానున్న సాదృశ్యము చమత్కృతిని సమకూర్పజాలదుకదా? ఇలాగే—రెండవలక్షణములోను నిషేధాపర్యవసాయిత్వము విశేషణము నిరర్థకము, వ్యతిరేకమున కమలాది సాదృశ్యనిషేధము, అనన్వయమున అన్నివిధముల నిషేధము చమత్కారి గనుకను, అందుకై సాదృశ్యనిరూపణము-అని వెనుకజెప్పితిమిగదా?

కిఞ్చ—

'స్తనాభోగే పతన్భాతి కపోలాత్ కుటిలోఽలకః
శశాఙ్కబిమ్బతో మేరౌ లమ్బమాన ఇవోరగః'

ఇత్యాదౌ ముఖ్యవాక్యార్థత్వేనానలఙ్కారభూతాయా ముపమాయా మతివ్యాప్తిః. ఉపమితిక్రియా నిష్పత్తిమత్సాదృశ్య వర్ణనస్యాదుష్ట వ్యఙ్గ్యత్వస్య చాత్రాపి సత్త్వాత్. న చేయమప్యుపమా లక్ష్యేతి వాచ్యమ్, ధ్వన్యమానోపమా నివారణప్రయాసస్య వైయర్థ్యాపత్తేః. నహ్యత్రాభేదప్రధానోత్ప్రేక్షా శక్యావక్తుమ్. కల్పితోపమాయా విద్వి షయత్వప్రసఙ్గాత్.

'వ్యాపార ఉపమానాఖ్యో భవేద్యది వివక్షితః,
క్రియానిష్పత్తిపర్యన్తముపమాలఙ్కృతిస్తు సా'.

ఇతి స్వకృత సూత్రేఽలఙ్కారభూతోపమాయా ఏవ లక్ష్యత్వేనాభిధానాత్, అలఙ్కారభూతోపమాలక్షణత్వే తదేవాదుష్టావ్యఙ్గ్యత్వ విశేషితమితి తత్రైవ పునరభిధానాచ్చ. న హ్యత్రోపమానోపమేయ సాదృశ్యాదుపమాస్వరూపాదస్తి కశ్చి దతిరిక్తో వాక్యార్థః, యేనో-పమా తమలఙ్కుర్యాత్.

అపిచ లక్షణే సాదృశ్యవిశేషణం నిరర్థకమ్' 'ఉపమితిక్రియా నిష్పత్తిమద్వర్ణనముపమా' ఇత్యేతావతైవ స్వాభీష్టార్థలాభాత్.

మరియు—

"స్తనాభోగే" ఇత్యాదులందు ముఖ్యవాక్యార్థము కనుక అలంకారము కాని ఉపమయందతివ్యాప్తి-ఉపమితిక్రియా నిష్పత్తిగల సాదృశ్య వర్ణన, అదుష్టమై అవ్యంగ్యమగుట, అది ఇచటగూడ నున్నదిగదా? ఈఉపమ లక్ష్యమేయనరాదు. అట్లయినచో ధ్వన్యమానమగు నుపమను వారించుటలో ప్రయాసము నిరర్థకమేకదా? ఇచట అభేదప్రధానమగు నుత్ప్రేక్షయనుటకు వీలులేదు. కల్పితోపమకు చోటులేకపోవును. "ఉపమానమను వ్యాపారము క్రియానిష్పత్తిపర్యంతము వివక్షితమైనచో అదియే ఉపమాలంకారము." అని తానుజేసిన యొకసూత్రమున అలంకారభూతోపమయే లక్ష్యముగా చెప్పెను కనుక అలంకారభూతోపమాలక్షణమైనపుడు అదియే అదుష్టావ్యంగ్యత్వవిశేషితమని అచటనే మరల చెప్పెనుగూడాను. ఇచట నుపమానోపమేయసాదృశ్యములకెడు నుపమాస్వరూపముకన్న నతిరిక్తమగు వాక్యార్థమేదియులేదు; ఎందుచే ఉపమ దానినలంకరించునో. మరియు లక్షణమునందు సాదృశ్యవిశేషణము నిరర్థకము. ఉపమితిక్రియానిష్పత్తిమద్వర్ణన ముపమ యన్నంతనే తమ ఇష్టమునెరవేరునుగదా?

ఏవమ్—

'స్వతస్సిద్ధేన భిన్నేన సమ్మతేన చ ధర్మతః
సామ్యమన్యేన వర్ణ్యస్య వాచ్యం చేదేకదోపమా'

ఇతి విద్యానాథోక్తం లక్షణమపాస్తమ్. వ్యతిరేకే నిషేధప్రతియోగిని సాదృశ్యేఽతివ్యాప్తేః.

ఏవమ్—

'ఉపమానోపమేయత్వ యోగ్యయోరర్థయోర్ద్వయోః
హృద్యం సాధర్మ్యముపమేత్యుచ్యతే కావ్యవేదిభిః'

ఇతి ప్రాచామపి లక్షణం ప్రత్యుక్తమ్. హృద్యతామాత్రేణ నిర్వాహే విశేషణాన్తరవైయర్థ్యాత్.

ఈ తీరుగానే "స్వతః సిద్ధమైనట్టియు భిన్నమైనట్టియు ధర్మిసంబంధమైన యితరముతో వర్ణ్యమునకు సామ్యము ఒక్కసారి వాచ్యమైనయెడల నుపమాలంకారము." అను విద్యానాథుడు చెప్పిన లక్షణము తోసివేయటమైనది. వ్యతిరేకములో నిషేధప్రతియోగియగు సాదృశ్యమున నతివ్యాప్తి యేర్పడినదిగదా? ఇలాగే "ఉపమానత్వమునకు ఉపమేయత్వమునకు యోగ్యములగు రెండర్థములకు హృద్యమగు సాధర్మ్య ముపమ యని కావ్యవిదులు చెప్పుదురు" అని ప్రాచీనులలక్షణము ప్రత్యుక్తమైనది. హృద్యతామాత్రముచే నిర్వాహముకాగా విశేషణాంతరములు వ్యర్థములు.

ఏవం కావ్యప్రకాశోక్తమపి 'సాధర్మ్యముపమా భేదే' ఇతి లక్షణం నాతీవ రమణీయమ్. వ్యతిరేకే నిషేధప్రతియోగిని సాదృశ్యేఽతి వ్యాపనాత్. న చపర్యవసితత్వేన సాధర్మ్యం విశేషణీయమితి వాచ్యమ్. అనన్వయస్థ సాదృశ్యస్యాపర్యవసాయిత్వేనైవ వారణే భేద విశేషణవైయర్థ్యాపత్తేః. కావ్యాలఙ్కారప్రస్తావే లౌకికాలౌకిక ప్రధానవాచ్యవ్యఙ్గ్యోపమాసామాన్యలక్షణకరణానౌచిత్యాచ్చ.

అత ఏవ 'భేదాభేదతుల్యత్వే సాధర్మ్యముపమా' ఇత్యలఙ్కారసర్వస్వోక్తమపి లక్షణం తథైవ.

ఇలాగే

కావ్యప్రకాశమున-"సాధర్మ్యముపమాభేదే"—అను లక్షణమును నెక్కువబాగులేదు. వ్యతిరేకములో నిషేధప్రతియోగియగు సాదృశ్యమున నతివ్యాప్తివలన సాధర్మ్యము పర్యవసితమగునట్లుగా విశేషించవలెను అనరాదు. అనన్వయములోనున్న సాదృశ్యము పర్యవసించనిదే కనుక వారించునపుడు భేదవిశేషణము వ్యర్థముగావలసివచ్చును. కావ్యాలంకారప్రస్తావమున లౌకికములు, అలౌకికములు, ప్రధానములు, వాచ్యములు, వ్యంగ్య

ములు నగు ఉపమలకు సామాన్యమగు లక్షణము నుచేయుటలో నౌచిత్యము లేదుగదా? ఇందువల్లనే "భేదాభేదతుల్యత్వే సాధర్మ్యముపమా" అని అలంకారసర్వస్వకారుల లక్షణమున్న అంతే—

ఏవం— 'ప్రసిద్ధగుణేనోపమానేనాప్రసిద్ధగుణస్యోపమేయస్య సాదృశ్యముపమా' ఇత్యలఙ్కార రత్నాకరోక్తమపి న భవ్యమ్. శ్లేషమూలకోపమాయాం శాబ్దశాబ్దాత్మకస్య ధర్మస్య కవినైవ కల్పనాత్ తేనరూపేణోపమానస్యాప్రసిద్ధేశ్చ. ఇత్యలం పరకీయదూషణగవేషణయా. ప్రకృతమనుసరామః.

ఇలాగే—"ప్రసిద్ధ గుణయుగు నుపమానముతో నప్రసిద్ధగుణమగు నుపమేయమునకు సాదృశ్యముపమ" అని అలంకారరత్నాకరకారుని లక్షణమున్నూ భవ్యముగాదు. శ్లేషమూలకమగు నుపమలో నటువంటిశబ్దమూలకమగు ధర్మమును కవియే గల్పించునుగదా? ఆ రూపముతో నుపమానము ప్రసిద్ధముగాదు. కనుక పరుల దూషణలు వెదకుకొనుట చాలును. ప్రకృతమనుసరింతము.

అస్యాశ్చోపమాయాః ప్రాచామనుసారేణ కేచిద్భేదా ఉదాహ్రియన్తే. తథాహి—

ఉపమాద్వివిధా, పూర్ణా లుప్తాచ. పూర్ణా తత్ర— శ్రౌతీ ఆర్థీ చేతి ద్విధా భవన్తీ వాక్యసమాసతద్ధితగామితయా షోఢా. లుప్తాచ- ఉపమానలుప్తా, ధర్మలుప్తా, వాచకలుప్తా, ధర్మోపమానలుప్తా, వాచకధర్మలుప్తా, వాచకోపమేయలుప్తా, ధర్మోపమానవాచకలుప్తేతి తావత్సప్తవిధా. తత్రోపమానలుప్తా-వాక్యగా సమాసగా చేతి ద్వివిధా, ధర్మలుప్తా సమాసగాశ్రౌతీ ఆర్థీ, వాక్యగతా శ్రౌతీ, ఆర్థీ. తద్ధితగతా చ - ఆర్థ్యేవ, న శ్రౌతీ. ఇతి పఞ్చవిధా. వాచకలుప్తా-సమాసగతా, కర్మక్యజ్గతా, ఆధారక్యజ్గతా, క్యఙ్గతా, కర్మణముల్గతా, కర్తృణముల్గతా చేతి షడ్విధా. ధర్మోపమానలుప్తా-వాక్యగతా, సమాసగతా చేతి ద్వివిధా. వాచకధర్మలుప్తా క్విప్గతా సమాసగతా చేతి ద్వివిధైవ. వాచకోపమేయలుప్తా త్వేకవిధా. ధర్మోపమానవాచకలుప్తా తు సమాసగత్వైకవిధా. ఇతి. ఏవం సాకల్యేనైకోన

వింశతిర్లుప్తాభేదాః పూర్ణాభేదైః సహ పఞ్చవింశతిః. క్రమేణోదా హ్రియన్తే.

ఈఉపమకు ప్రాచీనులననుసరించి కొన్ని భేదముల నుదాహరింతుము—

ఉపమ రెండురకములు. పూర్ణ-లుప్తఅని. అందు పూర్ణ శ్రౌతి-ఆర్థి అని రెండుగానగుచు, వాక్యగతమని సమాసగతమని, తద్ధితగతమని ఆరు రకములైనది. లుప్తయుఉపమానలుప్త-ధర్మలుప్త-వాచకలుప్త-ధర్మోపమానలుప్త-వాచకధర్మలుప్త-వాచకోపమేయలుప్త — ధర్మోపమానవాచక లుప్త అని పదువిధములు.

అందుపమానలుప్త రెండురకములు. వాక్యగత - సమాసగత అని.

ధర్మలుప్త-సమాసగతమగునది, శ్రౌతి - ఆర్థి. వాక్యగత శ్రౌతి-ఆర్థి; తద్ధితగతయగునదియు ఆర్థియే- శ్రౌతికాదు అని ఐదురకములు.

వాచకలుప్త-సమాసగత, కర్మక్యఙ్గత, ఆధారక్యఙ్గత, క్యఙ్ గత, కర్మణముల్గత, కర్తృణముల్గత, అని ఆరువిధములు.

ధర్మోపమానలుప్తవాక్యగత-సమాసగత అని రెండు విధములేను.

వాచకధర్మలుప్త-క్యఙ్గత, సమాసగత, అని రెండువిధములు.

వాచకోపమేయలుప్త-ఒకవిధమే.

ధర్మోపమానవాచకలుప్త అయితే-సమాసగత అగునది ఒకేరకము, అని.

ఈతీరుగా లుప్తోపమాభేదములు సమగ్రముగ పందొమ్మిదిరకములు

పూర్ణోపమాభేదములు ఆరు కలిసి ఇరువదియైదు విధములు. క్రమ ముగా నుదాహరింపబడును.

తత్ర పూర్ణా శ్రౌతీ వాక్యగతా యథా.—

'గ్రీష్మచణ్డకరమణ్డల భీష్మజ్వాలసంసరణతాపితమూర్తేః
ప్రావృషేణ్య ఇవ వారిధరో మే వేదనాం హరతు వృష్ణివ
రేణ్యః."

అత్ర 'ప్రావృషేణ్య' ఇత్యనేన వారిధరవిశేషణేన నైరా

కాఙ్క్షాయాత్, 'ఇవేన సమాస' ఇత్యేవ పాఠాన్నిత్యత్వాభావాత్ వారిధరేణాపి నేవస్య సమాసః. ఏషాచోపమానోపమేయయోర్వారిధర భగవతోర్వేదనాకర్తృత్వస్య సాధారణధర్మస్య, సాదృశ్యబోధకస్యేవశబ్దస్య చాభిధానాత్పూర్ణా, సాదృశ్యస్య శ్రుత్యాబోధాచ్ఛ్రౌతీ

పూర్ణ శ్రౌతి వాక్యగత—గీష్మర్తువునందు సూర్యమండలముయొక్క, భయంకరములగు జ్వాలలుగలచోటి బోషితవలన గమింపజేయబడిన మూర్తి గలవాని వేదనను, వర్షాకాలమందు మేఘుడువలె, వృష్టివరేణ్యుడు నావేదనను హరించుగాక !

ఇచట—ప్రావృషేణ్యః అను వారిధరని శేషణముతో నాకాంక్ష లేకుండుటవలనను, "ఇవేన సమాసః" - అనిమాత్రమే పాఠముచే నిత్యత్వములేదు కనుక వారిధరశబ్దముతోనైనను 'ఇవ' కు సమాసములేదు. వారిధరము—భగవానుడు, ఇరువురు, నుపమానోపమేయములు, వీరిరువురకును వేదనాహరణకర్తృత్వము సమానధర్మము, సాదృశ్యబోధకమగు నివశబ్దము.—ఇవి యన్నియు నిట జెప్పబడెను. కనుక పూర్ణ సాదృశ్యము శ్రుత్యాబోధితము గనుక శ్రౌతి.

పూర్ణా ఆర్థీ వాక్యగతా యథా.—

ప్రాణాపహరణేనాసి తుల్యో హాలాహలేన మే
శశాఙ్క కేన ముగ్ధేన సుధాంశురితి భాషితః'.

పూర్ణా శ్రౌతీ సమాసగా యథా.—

'హరిచరణకమల నఖగణకిరణశ్రేణీవ నిర్మలా నితరామ్
శిశిరయితు లోచనం మే దేవవ్రతపుత్రిణీ దేవీ.'

అత్రేవేన సమాసః.

పూర్ణా ఆర్థీ సమాసగా యథా.—

"ఆనన్దనేన లోకానా మాతాపహరణేన చ
కలాధర యా చాపి రాజన్నిన్దూపమో భవాన్''.

పూర్ణా శ్రౌతీ ఆర్థీ చ తద్ధితగా యథా —

'నిఖిల జగన్మహనీయా యస్యాభా నవపయోధరవత్
అమ్బుజవద్విపులతరే నయనే తద్బ్రహ్మ సంశ్రయే సగుణమ్'.

అత్రపూర్వార్ధే వతేః 'తత్ర తస్యేవ' ఇతి సాదృశ్యే విధానా చ్ఛ్రౌతీ ఉత్తరార్ధే 'తేన తుల్యమ్' ఇతి విధానాత్సాదృశ్యవదర్థకతయా ఆర్థీ.

పూర్ణ ఆర్థి వాక్యగత—"ప్రాణములు నపహరించుటచే నావిషయమున హాలాహలముతో తుల్యమైనవాడవు. ఓ శశాంకుడా! ఏమూఢునిచే సుధాంశు వని చెప్పబడినావు ?"

పూర్ణ శ్రౌతి సమాసగత—"నారాయణుని పదకమలమునందలి నఖ శ్రేణియొక్క కిరణములవలె బాగా నిర్మలమైన భీష్మునిచే పుత్రవంతురాలగు దేవగంగ నాకన్నులను జల్లబరచుగాక."

పూర్ణ ఆర్థి సమాసగత—"లోకులను ఆనందబఱచుటచేతను, తాపమును పూర్తిగా హరించుటచేతను, కళాధరుడవగుటచేతను, రాజా! నీవు చంద్రు నితో సమానుడవు."

పూర్ణ శ్రౌతి ఆర్థి తద్ధితగత—"క్రొత్తమేఘమువలె ఎవనియొక్క కాంతి నిఖిలజగత్తుచేతను పూజింపదగినదో, ఎవనియొక్క నేత్రములు పద్మములవలె విశాలమైనవో ఆ సగుణమైన బ్రహ్మను ఆశ్రయించెదను."

ఇచట పూర్వార్థమున వత్ ప్రత్యయమును 'తత్ర తస్యేవ' అని సాదృ శ్యమునందు విధించుటచే శ్రౌతి.

ఉత్తరార్థమున "తేన తుల్యం" అని విధించుటవలన సాదృశ్యవదర్థకము గనుక ఆర్థి.

ఉపమానలుప్తా వాక్యగా యథా—

'యస్య తులామధిరోహసి లోకోత్తరవర్ణపరిమలోద్గారైః
కుసుమకులతిలక చమ్పక న వయం తం జాతు జానీమః".

యత్తులామధిరోహసీత్యాద్యచరణనిర్మాణే ఇయమేవ సమాసగా.

ఉపమానాభావేన సాదృశ్యాభావస్య పర్యవసానాత్సాదృశ్య పర్యవసానస్య చోపమాజీవితత్వాదలఙ్కారాన్తరమేవాత్ర నోపమా లుప్తేతి నాశఙ్కనీయమ్. యస్యతులామారోహసి న తం వయం

జానీమ ఇత్యుక్త్వా అస్మాకమసర్వజ్ఞత్వాదస్మదగోచరః కోఽపి తవోపమానం భవిష్యతీతి సాదృశ్యపర్యవసానమస్తీత్యుపమానలుప్తై వేయముపమా నాలఙ్కారాన్తరమ్.

ఏతేన—

“ఢుంఢుంణంతో హి మరీహసి కంటకకలిఆఇం కేఅఇవణాఇం
మాలఇకుసుమసరిచ్ఛం భమర భమంతో న పావహిసి”.

ఇత్యత్రాసమాలఙ్కారోఽయముపమాతిరిక్త ఇతి వదన్తోఽలఙ్కారరత్నాకరకారాదయః ప్రాస్తాః.

ఉపమానలుప్త, వాక్యగత—“లోకోత్తరమగు రంగు పరిమళోద్గారములచే ఎవరి సామ్యమును అధిరోహించుచున్నావో, కుసుమకులతిలకమా చంపకమా! అతనిని మేము ఎపుడునూ ఎఱుగము.” “యత్తుల్యతామధిరోహసి”—అని మొదటిచరణము నిర్మించగా నిదియే సమాసగత. ఉపమానములేదు గనుక-సాదృశ్యాభావము పర్యవసించినది గనుక, సాదృశ్యపర్యవసానము ఉపమాజీవితము గనుక, నిది మఱియొక అలంకారమే, ఇచట నుపమానలుప్తలేదు అని ఆశంకించరాదు. దేనిసామ్యమును బొందెదో దానిని మేమెరుగము, అనుటచేత మేము సర్వజ్ఞులముగాము గనుక మాకు తెలియరాని దేదో నీకు నుపమానముకావచ్చును అని సాదృశ్యమున పర్యవసాన మేర్పడును. గాన నిది యుపమానలుప్తయగు నుపమయే, మరొక యలంకారము గాదు.

దీనిచేత—

ఢుంఢుంకృత్వాహి మరిష్యసి, కంటకకలితాని కేతకవనాని,
మాలతీకుసుమసదృశం భ్రమర భ్రమన్న ప్రాప్స్యసి. (సంస్కృతము)

“ఢు ఢు అని చప్పుడుచేయుచు చనిపోయెదవు. మొగలితోటలు ముళ్లతో నిండియున్నవి. ఓ భ్రమరమా! జాజిపువ్వుతో సమానమైనదానిని తిరుగుచున్నను పొందలేవు.”—

అనుచో నసమాలంకారమిది, ఉపమాలంకారముకన్న వ్యతిరిక్తము, అను అలంకారరత్నాకరాదులు నిరాకృతులైరి.

ధర్మలుప్తా శ్రౌతీ వాక్యగతా యథా—

"కలాధరస్యేవ కలా విశిష్టా
విలూనమూలా లవలీలతేవ
అశోకమూలం పరిపూర్ణశోకా
సా రామయోషా చిరమధ్యువాస."

"గ్రీష్మచణ్డకరమణ్డల" ఇతి ప్రాగుదాహృతే పూర్ణాయా ఉదాహరణే ప్రావృషేణ్యో వారిధర ఇవ యో వృష్ణివరేణ్యః స మే వేదనాం హరత్వితి వృష్ణివరేణ్యమాత్రగతత్వేన వేదనాహరణకర్తృత్వం వివక్షితమ్. వారిధరసాదృశ్యం చ శ్యామత్వాదినా యది, తదా తత్రాప్యేషా బోధ్యా.

ఇయాంస్తు విశేషః యత్పూర్ణాయాం వృష్ణివరేణ్యమాత్ర ముద్దిశ్య ప్రావృషేణ్యవారిధరసాదృశ్యప్రయోజకం తాదృశవారిధరసాదృశ్యాభిన్నం వా వేదనాహరణకర్తృత్వం విధేయమిత్యుపమా విధేయికా ధీః. ధర్మలుప్తాయాం తు వారిధరసాదృశ్యావచ్ఛిన్న వృష్ణివరేణ్యముద్దిశ్య వేదనాహరణకర్తృత్వమాత్రం విధేయమిత్యుపమోద్దేశ్యతావచ్ఛేదికా.

ధర్మలుప్త శ్రౌతి వాక్యగత — "కళాధరునియొక్క — చంద్రుని యొక్క మిగిలిపోయిన కళ వలె, తలతెగగొట్టిన లవలీలతవలె ఆ రాముని భార్య శోకమునిండినదై అశోకము మొదటను చిరకాలమధిష్ఠించిపోయెను."

వెనుక నుదాహరింపబడిన "గ్రీష్మచండకరమండల" ఇత్యాది పూర్ణ ఉదాహరణములో, ప్రావృషేణ్యమగు వారి ధరమువంటి, ఏవృష్ణివరేణ్యుడు గలడో-అతడు నాయొక్కవేదనను హరించునుగాక, అని వృష్ణివరేణ్యమాత్రగతముగా వేదనాహరణ కర్తృత్వము వివక్షితమై వారిధర సాదృశ్యము శ్యామత్వాది ధర్మముతోనైనయెడల, అపు డదికూడా నిదియే అని తెలియవలెను. ఇదిమాత్రము విశేషము - పూర్ణలో వృష్ణివరేణ్యుని మాత్ర ముద్దేశించి ప్రావృషేణ్యమగువారిధరముతోటి సాదృశ్యమునకు ప్రయోజకముగాని, తాదృశవారిధర సాదృశ్యాభిన్నముగాని యగు వేదనా హారణకర్తృత్వము విధేయము; అని ఉపమావిధేయకమగు బోధ ధర్మలుప్త

యందైతే వారిధర సాదృశ్యనిష్ఠుడగు వృష్టిసరేణ్యునుద్దేశించి, వేసనా హారణకర్తృత్వము మాత్రము విశేషణము అని ఉపను ఉద్దేశ్యతానిర్ణాయక.

ధర్మలుప్తా ఆర్థీ వాక్యగతా యథా—
'కోపేఽపి వదనం తన్వి తుల్యం కోకనదేన తే
ఉత్తమానాం వికారేఽపి నాపైతి రమణీయతా".

ధర్మలుప్తా సమాసగా, శ్రౌత్యార్థీ తద్ధితగార్థీ చ యథా—
'సుధేవ వాణీ వసుధేవ మూర్తిః
సుధాకరశ్రీ సదృశీ చ కీర్తిః,
పయోధికల్పా మతిరాసఫేన్దో
ర్మహీతలేఽన్యస్య న హీతి మన్యే.'

ఈషదసమాప్తిరపి భఙ్గ్యన్తరేణ సాదృశ్యమేవ.

వాచకలుప్తా సమాసగా—'దలదరవిన్ద సున్దరమ్' ఇతి ప్రాగుదాహృతే పద్యే.

ధర్మలుప్త ఆర్థివాక్యగత—"కోపమునందైనను నీమొగము ఓ తన్వీ! కోకనదముతో తుల్యమైనది. ఉత్తములకు వికారమునందైనను రమణీయత పోదు."

ధర్మలుప్త సమాసగత శ్రౌత్యార్థి తద్ధితగతార్థియు — "అమృతమువంటిమాటయు, భూమివంటి మూర్తియు, చంద్రునికాంతితోసమానమైన కీర్తియు, సముద్రముతోసమానమైన వృద్ధియు, ఆసఫఖాన్ చంద్రుని కంటె నితరునకు లేదనియే తలంతును." ఈషదసమాప్తియైనను భంగ్యంతరముచే సాదృశ్యమే.

వాచకలుప్త సమాసగత—
గురుజన భయ మద్విలోకనాంతః
సముదయదాకులభావమావహంత్యాః
దరదలదరవిందసుందరం హా
హరిణదృశో నయనం న విస్మరామి.

అని ప్రాగుదాహృత పద్యమునందే.

కర్మాధారక్యఙ్గతా క్యఙ్గతా చ యథా—

'మలయానల మనలీయతి మణిభవనే కాననీయతి క్షణతః
విరహేణ వికలహృదయా నిర్జలమీనాయతే మహిలా.'

అత్రానలమివాచరతీత్యర్థేఽనలశబ్దాత్ 'ఉపమానాదాచారే' ఇతి సూత్రేణ, కానన ఇవాచరతీ త్యర్థేకాననశబ్దాచ్చ తత్సూత్రస్థేన అధికరణాచ్చ' ఇతి వార్తికేన క్యచ్, నిర్జలమీనశబ్దాచ్చ "కర్తుః క్యఙ్ సలోపశ్చ" ఇతి క్యఙ్.

ఆచారమాత్రార్థకతయా క్యచ్ క్యఙోః ప్రకృత్యైవ లక్షణయా స్వస్వార్థసాదృశ్యప్రతిపత్తిరితి నయే సాదృశ్యవాచకాభావాత్ వాచక లుప్తా, అనలీయతేత్యాదిసముదాయస్యైవానలాదిసాదృశ్య ప్రయోజకాచరణ కర్తృశక్తత్వమితి నయేఽపి సాదృశ్యసాదృశ్య విశిష్ట మాత్రవాచకాభావాద్వాచకలుప్తా.

కర్మాధారక్యఙ్గత-క్యఙ్గతయు—ఎట్లనగా—

"మలయానిలమును అగ్నివలె చూచుచున్నది, మణిభవనమున కాననమునందువలె అగుచున్నది, విరహములో వికలమైన హృదయముకలదై ఆ మహిళ నిర్జలస్థలమునందు చేపవలె అగుచున్నది."

ఇచట "అగ్నివలె నాచరించుచున్నది అను నర్థమందు అనలశబ్దము కన్న-"ఉపమానాదాచారే"అనుసూత్రముచేతను," కాననమునందువలె నాచరించుచున్నది అనునర్థమున" కాననశబ్దముకంటె నాసూత్రస్థమగు "అధికరణాచ్చ" అను వార్తికముచేత క్యచ్, నిర్జలమీనశబ్దముకంటే "కర్తుః క్యఙ్ సలోపశ్చ" అని క్యఙ్. క్యచ్, క్యఙ్లు ఆచారమాత్రార్థకములగుటచే, ప్రకృతులే లక్షణచే తమతమ యర్థములతోడి సాదృశ్యమును బోధించును, అను నయమున సాదృశ్యవాచకము లేనందున వాచకలుప్త, 'అనలీయతి' ఇత్యాది సముదాయమే అనలాది సాదృశ్యమునకు ప్రయోజకమగు నాచరణ కర్తయందు శక్తము అనునయమునందైనను సాదృశ్యసాదృశ్యవిశిష్టాన్యతర మాత్రవాచకము లేనందున వాచకలుప్త.

కర్తృకర్మణముల్ గతా యథా—

'నిరపాయం సుధాపాయం పయస్తవ పిబన్తి యే
జహ్నుజే నిర్జరావాసం వసన్తి భువి తే నరాః'

అత్ర సుధాపాయమితి, సుధామివ, నిర్జరాయమితి నిర్జరా ఇవేతి 'ఉపమానాత్ కర్మణి చ' ఇతి కర్మణి చకారాత్కర్తర్యుప మానే ఉపపదే ణముల్.

కర్తృకర్మణముల్ గత—"ఓ జాహ్నవీ! అడ్డములేకుండా అమృతమును త్రాగినట్లుగా నీజలమును ఎవరు త్రాగుచున్నారో, ఆ మానవులు భూమిపై, దేవతలవలె నివసింతురు."

ఇచట సుధాపాయమని, సుధామివ అని, నిర్జరాయం, అని నిర్జరాఇవ అని, "ఉపమానే కర్మణిచ" అని కర్మయు, చకారమువలన కర్తయగు నుప మానము, ఉపపదముగనుండగా ణముల్—

ధర్మోపమానలుప్తా వాక్యగా సమాసగా చ యథా—

"గాహితమఖిలం విపినం పరితో దృష్టాశ్చ విటపినః సర్వే
సహకార న ప్రపేదే మధుపేన తథాపి తే సమం జగతి."

'తథాపి తే సమమ్' ఇతి హిత్వా 'భవత్సమమ్' ఇతి యద్యార్యా క్రియతే తదేదమేవోదాహరణం సమాస గాయాః.

వాచకధర్మలుప్తా క్విబ్గతా యథా—

"కుచకలశేష్వబలానామలకాయామథ పయోనిధేః పులినే
క్షితిపాలకీర్తయస్తే హారన్తి హారన్తి హీరన్తి"

అత్ర హార హార హీర శబ్దా ఆచారార్థకే క్విపి లుప్తే ధాతవః. తత్ర హారాదిశబ్దా లక్షణయా హారాదిసాదృశ్యం బోధయన్తి, లుప్తోఽపి స్మృతః క్విబాచారమితి పక్షే వాచకధర్మలోపః స్పష్ట ఏవ. హారాది శబ్దా ఏవ లక్షణయా తాదృశసాదృశ్యాభిన్నమాచారమితి పక్షే సాదృశ్యస్యేవ ధర్మస్యాపి తన్మాత్రబోధకాభావాల్లోప ఏవ.

ధర్మోపమానలుప్త వాక్యగతయు, సమాసగతయు నెట్లన—

"అడవి యావత్తును గాలించబడినది. చెట్లన్నియు అంతటను చూడబడి నవి. ఓ సహకారమా! అట్లయిననూ తుమ్మెదచే యీలోకములో నీసమాన మైనది చూడబడలేదు."

"తథాపి తే సమం—అనుచోట 'భవత్సమం' అనిచేర్చి శుద్ధయను ఆర్యను రచించినచో అపు డిదియే సమాసగతమున కుదాహరణను.

వాచకధర్మలుప్త, క్విబ్గత యెట్లన—

"స్త్రీలకుచకలశమునందును అలకాపట్టణమునందును తరువాత సముద్రముయొక్క సైకతమునందును ఓ రాజా! నీయొక్క కీర్తులు హార ములవలెనూ శివునివలెనూ వజ్రమువలెనూ యగుచున్నవి."

కుచకలశేష్వబలానాం,—ఇచట హారహరహీరశబ్దములు ఆచారార్థక మగు క్విప్ లోపించగా ధాతువులు, అచట హారాదిశబ్దములు లక్షణచే హారాది సాదృశ్యమును బోధించును. లోపించినను స్మృతమై క్విప్ ఆచారమును బోధించును అనుపక్షమున వాచకధర్మలోపము స్పష్టమే. హారాదిశబ్దములే లక్షణచే నటువంటిసాదృశ్యముతో నభిన్నమగు నాచారమును బోధించును అనే పక్షములో సాదృశ్యమునకువలె ధర్మమునకుకూడ తన్మాత్రబోధకము లేదు గనుక లోపమేను.

వాచకధర్మలుప్తా సమాసగా యథా—

"శోణాధరాంశుసంభిన్నా స్తన్వి తే వదనామ్బుజే,
కేసరా ఇవ కాశన్తే కాన్తదన్తాలికా న్తయః"

అత్ర వదనాంబుజయోరభేదవివక్షయా విశేషణసమాసే దన్తాలికా న్తీనాం కేసరసాదృశ్యోక్తిరసఙ్గతా స్యాత్. యతో హ్యామ్బుజ తారాత్మ్యసాధకం దన్తాలికాన్తీనాం కేసరదాతాత్మ్యం న తు కేసర సాదృశ్యమ్. ఉపమిత సమాసేతు వదనాంబుజయోర్ధర్మిణోరౌపమ్యే కేసరదన్తాలికాన్తీనామపి తద్ధర్మాణామౌపమ్యోక్తిరుచితైవ. అతో౽ధికరణతావచ్ఛేదకోపమామాదాయ వాచకధర్మలుప్తోదాహృతా. విధేయతావచ్ఛేదికాతు పూర్ణైవ.

వాచకధర్మలుప్త, సమాసగత యెట్లన—

"శోణమగు అధరాంశువులతో కలసినదైన ముఖపద్మమునందు అంద మగు దంతకాంతులు కేసరములవలె ప్రకాశించుచున్నవి."

ఇచట వదనాంబుజములకు నభేదవివక్షతో విశేషణసమాసమొనరింపగా దంతాళికాంతులకు, కేసరసాదృశ్యోక్తి అసంగతమగును. ఎందువల్లననగా

నంబుజ ఆ దాస్యమునకు సంధానమగునది, దంతాళికాంతులకు కేసరతాదాత్మ్యము, అంతకాని కేసరసాదృశ్యముకాదు. ఉపమితసమాసమునందైతే ధర్ములగు వదనాంబుజములకు సామ్యమునందు కేసరదంతాళికాంతులకు గూడ వానిధర్మముల కౌపమ్యము చెప్పట యుచితమే. ఇందువలన అధికరణతాదాత్మ్యయోపమునుబట్టి ఇందు వాచకధర్మలుప్త యుదాహరింపబడినది. విధేయః నిర్ణాయకమిమమాత్రము ప్రాజ్ఞయే.

వాచకోపమేయలుప్తా క్యజ్గతా ధర్మోపమాన వాచకలుప్తా సమాసగా చ యథా—

"తయా తిలోత్తమీయన్త్యా మృగశావకచక్షుషా
మమాయం మానుషో లోకో నాకలోక ఇవాభవత్."

తిలోత్తమీయన్త్యేతి తిలోత్తమామివాత్మానమాచరన్త్యే త్యాచారార్థకే క్యచి తిలోత్తమాపదస్య తిలోత్తమాసాదృశ్యే లాక్షణికతయా వాచకస్య, స్ఫుటత్వేన ప్రతీయమానతయా ఆత్మన ఉపమేయస్య చానుపాదానాల్లోపః. స్వయం తు సా నోపమా. ఆచారకర్మణ ఉపమానస్య తిలోత్తమారూపస్య తత్కర్తర్యాముపమేయాయా ముపమానత్వా సజ్గతేః. అత ఆత్మైవాత్రోపమేయతయోన్నేయః. మృగశావక చక్షుషేతి మృగశావకస్య చక్షుషీ ఇవ చక్షుషీ అస్యా ఇతి 'సప్తమ్యుపమాన పూర్వస్య' ఇతి సమాసో త్తరపదలోపౌ. మృగశాబకపదస్య మృగశాబకచక్షుః సదృశలాక్షణికత్వ పక్షే వృత్తేర్విశిష్టార్థ వాచకతా పక్షేఽపి స్వస్వమాత్రబోధక పదాభావాత్త్రయాణాం లోపః ఇతి పఞ్చవింశతిరుపమాభేదాః.

వాచకోపమేయలుప్త క్యజ్గత ధర్మోపమానవాచకలుప్త సమాసగతయును ఎట్లన—

"తిలోత్తమవలె నాచరించుచున్న ఆ బాలమృగాక్షిచే నాకీ మనుష్యలోకము స్వర్గలోకమువలె ఆయెను "

తిలోత్తమీయంత్యా - అని తనను తిలోత్తమవలె నాచరించుచున్న అని ఆచారార్థకమగు క్యచ్ చేసినపిదప, తిలోత్తమాపదము తిలోత్తమాసాదృశ్యమున లాక్షణికమగుటచే, సాదృశ్యవాచకమును, ఉపమేయమగు

అత్ర స్పష్టముగ ప్రతీయమానమగుటచే ఆ ఉపమేయమును చెప్పలేదు గాన నిచట సాదృశ్యవాచకోపమేయవాచకము లకు లోపము ఆమె స్వయముగా నుపమేయముగాదు. ఆచారముకు కర్మయగు తిలోత్తమారూపమగు ఉపమానము ఆచారకర్త్రియగు నుపమేయమునకు ఉపమానమగుట అసంగతమగును. ఇందువలన తానే యిచట నుపమేయముగా నూహ్యము. మృగశాబకచక్షుషా-అనునపుడు, మృగశాబకముకన్నులవంటి కన్నులుగల ఈమెకు అని-'సప్తమ్యుపమాన పూర్వస్య' అని సమాసోత్తరపదలోపము లు మృగశాబకపదము మృగశాబక చక్షుఃసదృశమునందులాక్షణికమను పక్షమునను వృత్తికి విశిష్టార్థత్వవాచకతాపక్షమునసైనను తమ తమనుమాత్రము బోధించుపదములు లేవు గనుక మూడింటికి లోపము ఇవి ఇరువదియైదు ఉపమా భేదములు.

ఇహాన్యానపి భేదానన్యే నిగదన్తి-వాచకలుప్తా షడ్విధోపవర్ణితా. 'కర్తర్యుపమానే' ఇతి ణినౌ సప్తమ్యపి దృశ్యతే. కోకిల ఇవాలపతి కోకిలాలాపినీతి. తథాష్టమ్యపి-'ఇవే ప్రతికృతౌ' ఇతి కని 'లుమ్మనుష్యే' ఇతి లుపి చఞ్చేవేత్యర్థే 'చఞ్చా పురుషః సోయం యః స్వహితం నైవ జానీతే' ఇత్యత్ర. నవమ్యపి ఆచార క్విపి పదాన్తరేణ ప్రదిపాదితే సమానే ధర్మే దృశ్యతే- 'అహ్లాది వదనం తస్యాః శరచ్చన్ద్రాకామృగాఙ్కతి" ఇత్యాదౌ.

ఇచట ఇతరములగు భేదములనుగూడ ఇతరులు స్పష్టపరచుదురు.

వాచకలుప్త-ఆరువిధములుగా వర్ణింపబడినది, "కర్తర్యుపమానే" అని ణినిచేయగా నేడవదియును కనబడుచున్నది. కోకిలవలె నాలపించును-కోకిలాలాపిని అలా యెనిమిదవదియున్నూ-"ఇవే ప్రతికృతౌ"-అని కన్ ప్రత్యయమొనర్పగా "లుమ్మనుష్యే" అని లోపమునందు "చంచేవ" అను నర్థమున చంచాపురుషస్సోయం యః స్వహితం నైవజానీతే - అనుచోట తొమ్మిదవదియు, ఆచారక్విప్‌నందు పదాంతరముచేత సమానధర్మము ప్రతిపాదింపబడనపుడు కన్పడును. 'అహ్లాదివదనం తస్యాః శరచ్చన్ద్రాకామృగాంకతి'-ఇటువంటిచోట.

ఉపమానలుప్తా వాక్యసమాసయోర్ద్వివిధోపవర్ణితా, తృతీయాపి దృశ్యతే—

"యచ్చోరాణామస్య చ సమాగమో యచ్చైతై ర్వధోఽస్య కృతః
ఉపనత మేతదకస్మా దాసీ త్తత్కాకతాలీయమ్"

ఇత్యత్ర కాకతాలశబ్దయోర్లక్షణయా కాకాగమన తాలపతన బోధకయోరివార్థే 'సమాసాచ్చ తద్విషయాత్' ఇతి జ్ఞాపకాత్సమాసే కాక ఇవ తాల ఇవ కాకతాలమితి కాకతాలసమాగమ సదృశశ్చోరాణా మస్య చ సమాగమ ఇత్యర్థః. తతః కాకతాలమివేతి ద్వితీయ ఇవార్థే పూర్వోక్తేనైవ సూత్రేణ ఛప్రత్యయే తాలపతనజన్య కాకవధ సదృశశ్చోరకర్తృకో దేవదత్తవధ ఇత్యేవం స్థితే ప్రత్యయార్థోప మాయా ముపమానస్య తాలపతన జన్యకాకవధస్యానుపాదానాదుప మానలుప్తా.

వాచకోపమానలుప్తా తు నామ్నైవ న నిర్దిష్టా, సాప్యత్ర ప్రకృత్యర్థే దృశ్యతే.

ధర్మోపమానలుప్తా వాక్యసమాసయోర్ద్వివిధై వోక్తా. సాచా త్రాపి తృతీయచరణోక్త ధర్మనిరాసే ప్రత్యయార్థే దృష్టా. వాచక ధర్మలుప్తా క్విప్సమాసయోర్ద్వయోరేవ కథితా, సాపి 'చణ్డాల పురుషః సోఽయం యోఽత్యన్తం విషయవాసనాధీనః' ఇత్యత్ర స్వహితాకరణరూపస్య ధర్మస్యానుపాదానే కనో లోపే విలోక్యతే. ఏవం చ ద్వాత్రింశద్ భేదాః.

ఉపమానలుప్త వాక్యసమాసములందు రెండువిధములుగా వర్ణింప బడెను. మూడవదిగూడ గన్పట్టును.

"దొంగలకును యితనికిని యేసమాగమముగలదో వారిచేత యితని వధచేయబడినదో ఈ జరిగినదంతయూ యకస్మాత్తుగా కాకతాళీయమైనది." అనేచోట కాకతాళశబ్దములకు లక్షణచే కాకి వచ్చుటను తాళపతనమును బోధించుచుండగా నివార్థమున "సమాసాచ్చ తద్విషయాత్" అను జ్ఞాపక మున సమాసమొనర్పగా, కాకఇవ తాలఇవ కాకతాలం—అని కాకతాళ సమాగమసదృశమగు చోరులకును ఇతనికిని సమాగమము అని అర్థము. తరువాత కాకతాళమివ, అను రెండవ ఇవ అర్థమున పూర్వోక్తమగు సూత్రముచే ఛ ప్రత్యయమొనర్పగా తాళపతనజన్యమగు

కాకవధతో సమానమైనది చోరులొనర్చిన దేవదత్తునివధ అని ఈతీరున యుండగా ఛ ప్రత్యయమున కర్థమగు నుపమయం దుపమానమగు తాల పతనమువల్ల కలిగిన కాకవధను చెప్పలేదు కనుక ఉపమానలుప్త.

ఇచట ఉపమానలుప్తనైతే పేరుమాత్రముతో నిర్దేశింపలేదు అదియు నిచట ప్రకృత్యర్థమున గన్పట్టును. ధర్మోపమానలుప్త వాక్యసమాసముల యందు రెండువిధములుగానే చెప్పబడినది. అదియు నిక్కడకూడ మూడవపాద మున చెప్పబడినధర్మమును తోసివేయగా పై శ్లోకములోని తృతీయచరణమును మరియొకవిధముగ మార్చగా ప్రత్యయార్థమునగన్పడును, వాచకధర్మలుప్త క్విప్ సమాసములలో రెండింటియందే చెప్పబడెను. అదియు,

"చంచా పురుషస్సోయం యోత్యంతం విషయవాసనాధీనః—"

అనుచోట హితమును జేసుకొనకపోవుట అను ధర్మమును చెప్పకపోయినచో "కన్" ప్రత్యయమునకు లోపమువచ్చినపుడు గన్పడును. ఈతీరుగా ముప్పది రెండువిధములు.

అత్రేద మవధేయమ్—కర్మాధారక్యచి క్యజి చ వాచకలుప్తో దాహరణం ప్రాచా మసఙ్గతమివ ప్రతీయతే, ధర్మలోపస్యాపి తత్ర సంభవాత్. న చ క్యజాద్యర్థ ఆచార ఏవ సాధారణధర్మోఽస్తీతి వక్తవ్యమ్. ధర్మమాత్రరూపస్యాచారస్యోపమాప్రయోజకత్వాభావాత్. 'నారీయతే సపత్నసేనా' ఇత్యాదౌ వృత్త్యన్తరనివేదితైః కాతరత్వాదిభిరభిన్నతయాధ్యవసితస్యాచారస్యోపమానిష్పాదకత్వాత్. యది చ క్యజర్థ ఆచారమాత్రముపమానిష్పాదకం స్యాత్తదా 'త్రివిష్టపం తత్తలు భారతాయతే' ఇత్యాదౌ సుప్రసిద్ధత్వాది రూపాచారోపస్థితావప్యుపమాలఙ్కృతేరనిష్పత్తేః, తస్యైవ చ 'సుపర్వభిః శోభితమన్తరాత్రితైః' ఇతి చరణాన్తరనిర్మాణే తస్యానిష్పత్తేః క్యజాద్యర్థః సాధారణోఽపి నోపమాం ప్రయోజయతి ఉపమా ప్రయోజకతావచ్ఛేదకరూపేణ సాధారణధర్మ వాచక శూన్యత్వస్యైవ ధర్మలోపశబ్దేనాభిధానాత్. అన్యథా "ముఖరూపమిదం వస్తు ప్రఫుల్లమివ పఙ్కజమ్' ఇత్యాదౌ పూర్ణోపమాపత్తేరితి దిక్.

ఇచట ఇది శ్రద్ధతో గ్రహించవలెను.

కర్మాధార క్యచ్ నందు క్యజ్ నందును వాచకలుప్త ఉదాహరణము

అప్పయ్యదీక్షితులు - ఈ ప్రస్తావనలోనే—

"ధర్మలుప్త వాక్యసమాస తద్ధితలందు చూపబడినది, ద్విర్భావమునందు గూడ గన్పట్టును. "పటుపటుర్దేవదత్తః" అనుచోట, "ప్రకారే గుణవచనస్య" అని సాదృశ్యమునందు ద్విర్భావమును విధించుటవలన" అని నిగదించెను. అది తుచ్ఛము. ఇచట వాచకమునుగూడా యనుపాదాన మొనర్చుటవలన వాచక ధర్మలుప్తయందు ఈ యాధిక్యముద్భావన మొనర్చుటుచితము. అంతేగాని ధర్మలుప్తయందుగాదు. ధర్మమాత్రలుప్తయే, ధర్మలుప్తశబ్దముతో వారు వివక్షజేసిరి. అట్లుగానియెడల ఏకలుప్తయందే, ద్విలుప్తలను, త్రిలుప్తలను గ్రహించుటవలన పృథగుపాదానము అసంబద్ధమే అయ్యెడిది. ఇచట ద్విర్భావమే వాచకమైయున్నది గనుక వాచకలోపములేదు. అయితే ధర్మ మాత్రమునకేలోపము అనరాదు. ద్విర్భావము సాదృశ్యవాచకమనుట, భాష్య కైయ్యటాదులకు విరుద్ధముగనుక. అది కైయటుడు జెప్పెను. "ప్రకారే గుణవచనస్య" అనుసూత్రములో "సిద్ధంతు" అను ప్రతీకమును దీసుకొని ద్విర్వచనమునకు ప్రకృతి స్థాని; దానియర్థమును విశేషింపవలెను. ప్రకారము మాత్రముకాదు. అచ్చట సర్వమును గుణవచనముగనుక వ్యభిచారములేదు గనుక. దానిని గ్రహించుటవలన గుణమును జెప్పునదిగా యేశబ్దముస్పష్టముగా దెలియబడినదో దాని సాదృశ్యము ద్యోత్యమగునప్పుడు రెండు అగును. అని సూత్రార్థము అని.

ఇదం చాన్యత్తస్మిన్నేవ ప్రస్తావే చిత్రమీమాంసాకృద్భి రభ్య ధీయత-

—"నృణాం యం సేవమానానాం సంసారోఽప్యపవర్గతి
తం జగత్యభజన్ మర్త్యశ్చణ్డాచన్ద్రకలాధరమ్."

అత్ర క్విప్కనోర్లోపే ప్రత్యేకం వాచకధర్మలోప ఉభయత్రాపి" తదత మణీయమేవ. కనో వాచకస్యలోపేఽపి తం చన్ద్రికలాధరమభజన్నితి చన్ద్రికలాధరభజన రాహిత్యరూపస్య ధర్మస్య చణ్డాచమర్త్య సాధారణస్యోక్తత్వాత్కథం తావద్ధర్మస్య లోపః ?

న చోపమేయమర్త్య విశేషణతయోపాత్తస్య చన్ద్రికలాధర భజనరాహిత్యస్య సాదృశ్యోపసర్జనే చణ్డాచయామనన్వయాన్న సాధారణ్యమితి వాచ్యమ్.

" 'యద్భక్తానాం సుఖమయః సంసారోప్యపవర్గతి
తం శమ్భుమభజన్ మర్త్యః స్వాత్మహితాకృతేః'

ఇతి పాఠే ధర్మశ్రవణ ముభయత్రాపి సంభవతి" ఇతి స్వోక్తేరసంగత త్వాపత్తేః. ఇహాప్యుపమేయ సంసార విశేషణతయోపాత్తస్య సుఖమ యత్వస్య సాదృశ్యోపసర్జనేఽ పవర్గేఽన్వయాభావాత్కథఙ్కారం ధర్మస్య సాధారణ్యమ్ ?

ఇది మరొకటి యా ప్రస్తావనలోనే చిత్రమీమాంసాకారులు చెప్పిరి—

'నృణాం' (ఎవనిని సేవించు మనుజులకు సంసారమైనను మోక్షమగునో ఆ చంద్రకళాధరుని సేవించని మనుష్యుడు లోకమున వంచబడు) ఇత్యాది శ్లోకమున, క్విప్-కన్‌లకు లోపమున ప్రత్యేకముగా వాచకధర్మలోపము రెండుచోట్లను-అగు. అది బాగుగాలేదు కన్‌ప్రత్యయము వాచకముగనుక వాచకలోపమైనను-ఆ చంద్రకళాధరుని సేవించనివాడై, అని చంద్రకళాధరుని భజనరాహిత్యరూపమగు ధర్మము-వంచాపుత్వ సాధారణరూపమగు నది చెప్పబడినదిగనుక ధర్మమునకు లోపమెట్లు? ఉపమేయమగు మర్త్యునకు విశేషణముగా నుపాత్తమగు చంద్రకళాధరభజనరాహిత్యము సాదృశ్య మునుగూర్చి యుపసర్జనమగు వంచయందు అన్వయించకపోవుటవలన సాధా రణ్యములేదు అని అనరాదు

"యద్భక్తానాం" (ఎవని భక్తులకు సుఖమయమైన సంసారము కూడ మోక్షముగానున్నదో ఆశివుని సేవించని మనుష్యులు ఆత్మహితము చేసుకొనక పోవుటచే వంచనగును) అని పాఠమున్న దు, ధర్మశ్రవణము రెండుచోట్లను సంభవించును—అని తాము చెప్పుమాట యసంగతమగునవి కావచ్చును ఇక్క డనుగూడ ఉపమేయమగు సంసారమునకు విశేషణముగా నుపాత్తమగు సుఖ మయత్వమునకు సాదృశ్యమున నుపసర్జనమగు నపవర్గమున నన్వయము లేనం దున ధర్మమెట్లు సాధారణ్యమొందును?

ఉపమేయగతత్వేనోపమానగతత్వేన వోపాత్తస్య ధర్మస్య శాబ్ద ఉభయాన్వయేఽ సత్యపి వస్తుత ఉభయవృత్తిత్వజ్ఞానమేవ సాధా రణతాయా నియామకమితి చేత్, చన్ద్రకలాధరభజనరాహిత్యేఽపి దీయతా మేవమేవ దృష్టిః.

యది చోపమేయతావచ్ఛేదకతయైవ చన్ద్రికలాధరభజన రాహిత్యం మమ వివక్షితమ్, సాధారణధర్మశ్చ స్వాత్మహితాకరణ రూపః, స చాత్ర లుప్తపవేతి శపథేన స్వాభిప్రాయః ప్రకాశ్యతే తదా నివారితోఽ యం దోషః. తుష్యతు భవాన్.

ఉపమేయగతముగానీ, ఉపమానగతముగానీ ఉపాత్తమగుధర్మమునకు శాబ్దమగు నుభయాన్వయములేకపోయినను, సహజముగా నుభయవర్తిత్వ జ్ఞానమే సాధారణతకు నియామకమగునందురా—చంద్రకళాధరభజనరాహిత్యమునందును ఇలాగే దృష్టినుంచండి. ఉపమేయ నిర్ణాయకముగానే చంద్రకళాధరభజన రాహిత్యమును నేను వివక్షచేయుదును; సాధారణ ధర్మము, తనయాత్మకు హితమునొనరించుకొనకపోవుట, అదియు నిచట లోపించినది; అని శపథముతో స్వాభిప్రాయమును వెలువరించెదవో, అప్పుడు ఈ దోషమువారింపబడెను. ఇక సంతోషించుము.

ఇదమప్యన్యత్రైరేవ వాచకోపమేయలుప్తాయా ముదాహరణం నిరమీయత—

'రూపయౌవనలావణ్య స్పృహణీయతరాకృతిః,
పురతో హరిణాక్షీణా మేష పుష్పాయుధీయతి'

ఇదం చ పద్యమపశబ్దదుష్ట మవైయాకరణతాం కర్తుః ప్రకాశయతి. తథాహి - పురత ఇతి నగరవాచినః పురశబ్దాత్తసిలి హరిణాక్షీణాం నగరాదిత్యస్యార్థ స్యాసఙ్గతేః, నహి పూర్వవాచకః పురశబ్దః క్వాపి శ్రూయతే,పూర్వశబ్దాత్తు 'పూర్వాధరావరాణామసిపురధవశ్చైషామ్' ఇత్యసౌ పురాదేశే చ పుర ఇతి భావ్యమ్, నతు పురత ఇతి. అత ఏవ 'అముం పురః పశ్యసి దేవదారుమ్' ఇతి ప్రాయుఙ్క్త మహాకవిః. ఏవ మేవ 'ముఖస్య పురతశ్చన్ద్రోనిష్ప్రభః ఇత్యప్రస్తుతప్రశంసా' ఇతి ద్వితీయప్రకరణారమ్భేఽప్యపశబ్దితం తైః. తథా చాహుర్వైయాకరణాః - 'పత్యా పురతః పరతః', 'ఆత్మీయం చరణం దధాతి పురతో నిమ్నోన్నతాయాం భువి', 'పురతః సుదతీ సమాగతం మామ్' ఇత్యాదయః సర్వేఽపి వ్యాకరణాజ్ఞానమూలా అపశబ్దాః" ఇతి.

మరొకటి వారే వాచకోపమేయలుప్తయందు 'రూపయౌవన' (రూపము యౌవనము లావణ్యము వీనిచే మిక్కిలిస్పృహణీయమైన యాకా

రముగలవాడై యీతడు హరిణాక్షులయెదుట మన్మథు డగుచున్నాడు) ఇత్యాది ఉదాహరణమును నిర్మించిరి. ఈ పద్యము అపశబ్దదుష్టమై కర్త యవైయాకరణుడని ప్రకాశింపజేయును. పురతః అని—నగరవాచియగు పురశబ్దముకన్న తసిల్ ప్రత్యయమును చేయగా హరిణాక్షులకు నగరము నుండి యనునర్థ మసంగతము. పూర్వవాచకమగు పురశబ్ద మెక్కడను విన బడదే? పూర్వశబ్దముకన్న "పూర్వాధరావరాణామసిపురధవశ్చైషాం" అను సూత్రముచే అసి ప్రత్యయము, పురాదేశము నాగా, 'పురః' అని యగును; 'పురతః' అని కాదు. ఇందువల్లనే "అముం పురః పశ్యసి దేవదారుం" అని మహాకవి కాళిదాసు ప్రయోగించెను. అలాగే "ముఖస్య పురతః చంద్రో నిష్ప్రభః—ఇత్యప్రస్తుత ప్రశంసా" అని రెండవప్రకరణ ప్రారంభమున వారిచే నపశబ్దముచ్చరింపబడినది. ప్రాచీనులగు వైయాకరణులుచెప్పుదురు, "పశ్చాత్ పురతః పరతః" "ఆత్మీయం చరణం దధాతి పురతః నిమ్నోన్నతాయాం భువి" "పురతః సుదతీ సమాగతం"—ఈ మొదలగు శబ్దము లన్నియు వ్యాకరణమును సరిగా నెరుగమి గల్గిన యపశబ్దములు—అని.

ఇయం చైవం భేదోపమా వస్త్వలంకారరసరూపాణాం ప్రధాన వ్యఙ్గ్యానాం వస్త్వలఙ్కారయోర్వాచ్యయోశ్చోపస్కారకతయా పఞ్చధా.

తత్ర వ్యఙ్గ్యవస్తూపస్కారికా యథా—

'అవిరతపరోపకరణవ్యగ్రీభవదమలచేతసాం మహతామ్
ఆపాతకాటవాని స్ఫురన్తి వచనాని భేషజానీవ'.

అత్ర తాదృంశి వచనాన్యర్థద్వారా సేవమానస్య మనాగ వ్యథముత్పాద్య ఉత్తరః పరిణామే పరమం సుఖం భవతీతి ప్రాధాన్యేన వ్యఙ్గ్యస్య వస్తున ఉపస్కారికా భేషజోపమా.

వ్యఙ్గ్యాలఙ్కారోపస్కారికా యథా—

అఙ్కయమానమలికే మృగనాభిపఙ్కం
పఙ్కేరుహాక్షి వదనం తవ వీక్ష్య బిభ్రత్.
ఉల్లాసపల్లవిత కోమల పక్షమూలా
శ్చఞ్చూపుటం చపలయన్తి చకోరపోతాః'

అత్ర ప్రాధాన్యేన వ్యఙ్గ్యే ఆరోప్యమాణచన్ద్రికే భ్రాన్తిమత్యలఙ్కారే ఉపపాదకస్య భాలస్థమృగమదపఙ్కవిషయకస్యాఙ్కాభేదారోపస్యాఙ్కసాదృశ్యరూప దోషమూలకత్వాదుపమాప్రత్వాలఙ్కారః.

ఈ తీరులుగల యీ యుపమ; ప్రధానవ్యంగ్యములగు వస్త్వలంకార రసములకును, వాచ్యములగు వస్త్వలంకారములకున్ను, ఉపస్కారకము గనుక, అయిదు విధములు—అందు వ్యంగ్యవస్తూపస్కార మెట్లన—

'అవిరతపరోపకరణ' (ఎల్లప్పుడు యితరుల కుపకార మొనర్చుటయందే లక్ష్యమగుచున్న నిర్మలమగు మనసుగల గొప్పవారల ఆపాతకాటవములగు వచనములు మందువలె స్ఫురించును) ఇత్యాదిశ్లోకమున నటువంటి మాటలను అర్థముద్వారా సేవించుచూ స్వల్పముగానైనను క్షోభనొందని వానికి పరిణామమున గొప్పసుఖమగును; అను ప్రధానముగా వ్యంగ్యమగు వస్తువునకు భేషజోపమ ఉపస్కారిక.

వ్యంగ్యాలంకారోపస్కారిక యెట్లన—

'అంకాయమానమ్' (ఫాలమునందు అంకమువలెనున్న కస్తూరి తిలకమునువహించుచున్న నీ మొగమును చూచి యుల్లాసముతో పల్లవితమగు కోమలమైన పక్షమూలములుగానై చకోరపోతములు చంచువులను చపల మొనర్చుచున్నవి) ఇత్యాదిశ్లోకమున ప్రధానముగా వ్యంగ్యమై ఆరోపించబడు చంద్రుడుగల, భ్రాంతిమదలంకారమున కుపపాదకమగు ఫాలమందున్న మృగమదపంకమును గురించిన అంకాభేదారోపము అంకసాదృశ్యరూపదోష మూలకముగనుక ఇచ్చట నుపమాలంకారము.

రసోపస్కారికాతు 'దలదరవిన్ద' ఇత్యత్ర ప్రాగేవోదాహృతా. రసపదేనాసంలక్ష్యక్రమస్యోపలక్షణాద్భావాద్యుపస్కారికాప్యత్రైవాన్తర్భావ్యా. యథా - 'నైవాపయాతి హృదయాదధిదేవతేవ', 'వన్యకురఙ్గీవ వేపతే నితరామ్' ఇత్యాదిషు ప్రాగుదాహృతేషు.

వాచ్యవస్తూపస్కారికా యథా—

"అమృతద్రవ మాధురీభృతః సుఖయన్తి శ్రవసీ సఖే గిరః
నయనే శిశిరీకరోతు మే శరదిన్దుప్రతిమం ముఖం తవ."

అత్ర నయన శిశిరీకరణరూపే వస్తుని వాచ్యే ముఖస్య శరదిన్దూపమోపస్కారికా.

వాచ్యాలఙ్కారోపస్కారికా యథా—

'శిశిరేణ యథా సరోరుహం దివసేనామృతరశ్మిమణ్డలమ్,
న మనాగపి తన్వి శోభతే తవ రోషేణ తథేదమాననమ్'

అత్ర వాచ్యస్య దీపకస్యోపమోపస్కారికా. రసాదిస్తు న వాచ్య ఇతి ప్రాగేవాభిహితమ్.

రసోపస్కారిక ఐతే దలదర దరవింద సుందరమ్' అనుచోట నిదివరకే నుదాహరింపబడినది. రసపదముచే నసంలక్ష్యక్రమము నుపలక్షించుటవలన్, భావాద్యుపస్కారిక అయినను ఇక్కడనే అన్తర్భవింపజేసుకొనవలెను.

ఎట్లనగా—"నైవాపయాతి" "వన్యకురంగీవ" ఇత్యాది ప్రాగుదాహరణములందు,

వాచ్యవస్తూపస్కారిక యెట్లన— "అమృత"(అమృతరసముయొక్క మాధుర్యముఖరించి నాచెవులను నీమాటలు సుఖపెట్టుచున్నవి. ఓ మిత్రమా! శరత్కాలచంద్రునితో సమానమగు నీయొక్క ముఖము నాకనులను చల్లబఱచనుగాక) ఇత్యాదిశ్లోకమున కన్నులుచల్లజేయుట అనువస్తువు వాచ్యముకాగా ముఖమునకు శరదిందూపమ, ఉపస్కారిక.

వాచ్యాలంకారోపస్కారిక యెట్లనగా—"శిశిరేణ" మొ. (శిశిరముతో పద్మమువలెనున్ను, పగటితో అమృతరశ్మి (చంద్రుడు) మండలమువలెను ఓ తన్వీ నీ రోషముతో నీయీమొగము ప్రకాశించుటలేదు). ఇచట వాచ్యమగు దీపకమునకు ఉపమ ఉపస్కారిక—రసాదియగునదేదియు వాచ్యము కాదని ఇదివరకే చెప్పితిమి.

అథ కథమలఙ్కారస్యాలఙ్కారాన్తరోపస్కార్యత్వముచ్యతే, ప్రధానస్యైవాలఙ్కార్యత్వాదితిచేత్, మైవమ్, అలఙ్కారస్యోపమాదేర్ధ్వన్యమానతాయాం ప్రాధాన్యాద్రసాదివదలఙ్కారాన్తరోపస్కార్యత్వే న కోఽపి తావదస్తి విరోధః. ఏవమేవ ముఖ్యతయా వాచ్యతాయామపి. యథా హ్యాపణాదౌ విక్రీయమాణతాయాం

కనకతాటఙ్కస్య రత్నాద్యలఙ్కారాన్తరోపస్కార్యత్వే తస్యైవ చ కామినీ కర్ణాలఙ్కారతాయాం పునః ప్రధానాన్తరసాన్నిధ్యాత్తాట ఙ్కస్య తద్గతరత్నానాం చ సాక్షాత్పరమ్పరయాచ కర్ణాదిశోభో పస్కారకతయా యథా తదలఙ్కారత్వం, ఏవమేవ రసాదిసాన్నిధ్యే రూపకాదేస్తదుపస్కారకస్యాలఙ్కారాన్తరస్య చ రసాద్యలఙ్కా రతేతి.

అయితే—అలంకారముతో నలంకారాంతరమునకు నలంకార్యత్వము ఎట్లు చెప్పబడుచున్నది ? ప్రధానమైనదే అలంకార్యముగదా? అన్నచో - కాదు, ఆ ఉపమాది యగు నలంకారము ధ్వన్యమానతయందు ప్రధానమగుట వలన రసాదివలెనే అలంకారాంతరముచే నుపస్కరింపబడుటలో లేశమును విరోధములేదు. ఈలాగే ముఖ్యముగా వాచ్యమగునపుడుకూడాను. ఏలాగనగా- అంగడియందు విక్రయింపబడుటలో బంగారువస్తువులు (కమ్మలు) రత్నాద్య లంకారాంతరములచే నలంకార్యమగుటలేదా? దానికిగూడ కామినీకర్ణమున కలంకారమగుటలోనైతే మరొకప్రధానాంతరము సన్నిధియగుటవలన కమ్మలకు దానియందలి రత్నములకును సాక్షాత్తుగానున్ను పరంపరగానున్ను చెవులు మొదలగువానికాంతికి నలంకారకముగా నెట్లు దానికలంకారత్వమో అట్లే - ఈరీతిగా రసాదుసన్నిధిలో రూపకాదులకును తదుపస్కారకమగు నలంకారాంతరములకును రసాద్యలంకారత అని.

ఏవం చ ప్రాచాం మతే పఞ్చవింశతి భేదాయాః పునః పఞ్చ విధతాయాం సపాదశతం భేదాః. ద్వాత్రింశద్భేదవాదినాం తు షష్ట్యుత్తరం శతమ్. ఇతశ్చాన్యేఽపి ప్రభేదాః కుశాగ్రీయధిషణైః స్వయముద్భావనీయాః.

తత్ర క్వచిదనుగామ్యేవ ధర్మః, క్వచిచ్చ కేవలం బిమ్బప్రతి బిమ్బభావమాపన్నః, క్వచిదుభయమ్. క్వచిద్వస్తుప్రతివస్తుభావేన కరమ్బితం బిమ్బప్రతిబిమ్బభావమ్. క్వచిదసన్నప్యుపచరితః క్వచిచ్చ కేవలశబ్దాత్మకః. తత్రాద్యో యథా—

“శరదిన్దురివాహ్లాదజనకో రఘునన్దనః
వనస్రజా విభాతి స్మ సేన్ద్రచాప ఇవామ్బుదః”.

అత్ర పూర్వార్ధే సకృన్నిర్దేశాద్ధర్మోఽనుగామీ. కేవలబిమ్బప్రతిబిమ్బభావాపన్నః 'కోమలాతపశోణాభ్ర' ఇత్యత్ర బోధ్యః. ద్వితీయార్ధేతూభయమ్.

ఈతీరుగా ప్రాచీనుల మతము ననుసరించి, ఇరువదియైదు భేదములు మరల ఐదురకములు అగునపుడు నూటపాతిక భేదములు. ముప్పదిరెండు భేదములను వాదించువారికైతే నూటఅరువదిభేదములు. ఇంతకన్న నితరములగు ప్రభేదములు కుశాగ్రీయధిషణులకు స్వయముగా నుద్భావనము చేయవలసినవి. అందులో నొకయెడ ననుగామియే ధర్మము. మరొకచోట కేవలము బింబప్రతిబింబభావమునొందిన ధర్మము. ఇంకొకయెడ రెండింటిని, ఇంకొకయెడ వస్తుప్రతివస్తుభావముచే కరంబితమగు బింబప్రతిబింబభావమును పొందినది. ఒకచో నసలు లేకపోయినను ఉపచరితము. ఇంక మరొక్కయెడ కేవల శబ్దాత్మకము. వానిలో మొదటిది యెట్లనగా—

"శరదిందు" (శరత్కాలమునందలి చంద్రునివలె ఆహ్లాదమునుకల్గించు శ్రీరామచంద్రుడు వనమాలికచే ఇంద్రధనస్సుతో మేఘమువలె ప్రకాశించుచుండెను.) ఇత్యాదిశ్లోకమున పూర్వార్ధమున ఒక్కసారి నిర్దేశించుటవలన ధర్మమనుగామి యైనది.

కేవలబింబప్రతిబింబభావాపన్నమును "కోమలాతపశోణాభ్ర" అనుచోటను తెలియవలెను. ద్వితీయార్ధమున రెండున్ను.

తృతీయోఽపి త్రివిధః — విశేషణమాత్రయోర్విశేష్యమాత్రయోస్తద్యుగలయోర్వా వస్తుప్రతివస్తుభావేన కరమ్బితః. తత్రాద్యో యథా—

'చలద్భృఙ్గమివామ్భోజమధీరనయనం ముఖమ్.
కదీయం యది దృశ్యేత కామః క్రుద్ధోఽస్తు కిం తతః.'

అత్ర చలనాధరత్వయోర్విశేషణయోర్వస్తుత ఏకరూపయోరపి శబ్దద్వయేనోపాదానాద్వస్తుప్రతివస్తుభావః. తద్విశేషణకయోశ్చ భృఙ్గనయనయోర్బిమ్బప్రతిబిమ్బభావః ఇతి తత్కరమ్బితోఽయముచ్యతే.

మూడవది మూడువిధములు, విశేషణమాత్రములందు గానీ, విశేష్య మాత్రములందు గానీ నారెండు జంటలందు గానీ వస్తుప్రతివస్తుభావముచే మిశ్రితమైనది. అందు మొదటిది యెట్లనగా—"చకద్భృంగం" ఇత్యాదిశ్లోక మున చలనాధీరత్వములు విశేషణములు. అవి వస్తుతః ఏకరూపములైనను రెండుశబ్దములతో, నుపాదాన మొనర్చుటవలన వస్తుప్రతివస్తుభావము. అవి విశేషణములుగాగల భృంగనయనములకు బింబప్రతిబింబభావము, అని దానితో మిశ్రమముగానిది జెప్పబడును.

తత్ర ద్వితీయో యథా—

"ఆలిఙ్గితో జలధికన్యకయా సలీలం
లగ్నః ప్రియఙ్గులతయేవ తరుస్తమాలః.
దేహావసానసమయే హృదయే మదీయే
దేవశ్చకాస్తు భగవానరవిన్దనాభః."

అత్ర ఆలిఙ్గితత్వ లగ్నత్వయోర్వస్తుప్రతివస్తుభావః, తద్విశేష్యకయోశ్చ జలధికన్యాప్రియఙ్గులతయోర్బిమ్బప్రతిబిమ్బభావః. ఇత్యయమపి తత్కరమ్బిత ఏవ.

తత్ర తృతీయో యథా—

"దశాననేన దృప్తేన నీయమానా బభౌ సతీ
ద్విరదేన మదాన్ధేన కృష్యమాణేవ పద్మినీ."

అత్ర విశేషణయోర్దృప్తత్వమదాన్ధత్వయోర్విశేష్యయోశ్చ నీయమానత్వ కృష్యమాణత్వయో ర్వస్తుప్రతివస్తుభావేనోభయతః సమ్పుటితో దశాననద్విరదయోర్బిమ్బప్రతిబిమ్బభావః. ఇత్యయమపి తత్కరమ్బితః.

అందులో రెండవది యెట్లనగా-"ఆలింగితః" ఇత్యాది శ్లోకమునందు ఆలింగితత్వలగ్నత్వములకు వస్తుప్రతివస్తుభావము, అవి విశేష్యములుగాగల జలధికన్యాప్రియంగులతలకు బింబప్రతిబింబభావము, అని ఇదియు దానితో కరంబితమే.

అందు మూడవది యెట్లనగా— "దశాననేన" ఇత్యాది శ్లోకమున దశాననద్విరదముల బింబప్రతిబింబభావము, విశేషణములగు దృప్తత్వమదాంధ

త్వములకు, విశేష్యములగు నీయమానవ్వ-స్మర్యమాణత్వములకను, వస్తు ప్రతివస్తుభావముచే ఉపయత్సంపుటితమైనది అని ఇదియు దానితో కలదిలవమే.

"విమలం వదనం తస్యా నిష్కలఙ్క మృగాఙ్కతి" ఇత్యత్ర వైమల్య నిష్కలఙ్కత్వయోర్వస్తుత ఏకరూపయోర్బిమ్బ ప్రతిబిమ్బ భావనిర్ముక్తం వస్తుప్రతివస్తుభావమాపన్నయోరుపమానిష్పాద కత్వం యద్యస్తి తదా శుద్ధం వస్తుప్రతివస్తుభావమాపన్నోఽప్యేష షష్ఠో ధర్మః.

న చ "కోమలాతపశోణాభ్రసన్ధ్యాకాలసహోదరః" ఇత్యాదౌ యతిసన్ధ్యాకాలయో రుపమాయాం ధర్మాన్తరస్యానవగ మాత్ కఙ్కుమాలేపకషాయవసనయోః కోమలాతపశోణాభ్ర యోశ్చ బిమ్బప్రతిబిమ్బభావో యథావశ్య మభ్యుపేయః, ప్రకృతే తు న తథా వస్తుప్రతివస్తుభావః; వదనమృగాఙ్కయోః సౌన్దర్య రూపసాధారణధర్మస్య ప్రతీయమానత్వేన ధర్మాన్తరానపేక్షణాదితి వాచ్యమ్. ఏవం తర్హి "యాన్త్యా ముహుర్వలితకన్ధరమాననం తదా వృత్తవృన్తశతపత్రనిభం వహన్త్యా" ఇతి భవభూతిపద్యేఽపి ప్రతీయ మానేన సౌన్దర్యేణైవ సామాన్యేన నిర్వాహే కన్ధరావృన్తయో ర్బిమ్బప్రతిబిమ్బభావస్య వలితత్వావృత్తత్వయోర్వస్తుప్రతివస్తుభావస్య చ సకలైరాలఙ్కారికైః స్వీకారో విరుద్ధః స్యాత్. అతో యథాస్థితమేవ సాధు.

"విమలం వదనం తస్యాః నిష్కలంక మృగాంకతి" అనుచోట వైమల్య నిష్కలంకత్వములు వస్తుతః ఏకరూపములైనను బింబప్రతిబింబభావముతో వేరుబడిన వస్తుప్రతివస్తుభావమునొందిన వానికి ఉపమా నిష్పాదకత్వమున్న యెడల, అపుడు శుద్ధమగు వస్తుప్రతివస్తుభావమునొందిన ఇది ఆరవ ధర్మము.

"కోమలాతపశోణాభ్రసంధ్యాకాలసహోదరః" ఇత్యాదులందు యతి సంధ్యాకాలములకు నుపమయందు మఱియొక ధర్మమేదియు నవగతము కాలేదు. కనుక-కుంకుమాలేపకషాయవసనములకు, కోమలాతపశోణాభ్రములకును బింబప్రతిబింబభావమే యవశ్యమంగీకరింపవలెను. అట్లు ప్రకృత మందుమాత్రము వస్తుప్రతివస్తుభావముకాదు. వదనమృగాంకులకు సౌందర్య

రూపమగు సాధారణధర్మము తోచుచున్నది గనుక ధర్మాంతరము నపేక్షించ లేదు గనుక నందురా?

ఇలాగైతే—

"యాంత్యా" ఇత్యాది భవభూతిపద్యమందుకూడా స్ఫురించుచున్న సౌందర్యముచేతనే సమానధర్మముగా నిర్వాహకముకాగా కంధరా వృంతములకు బింబప్రతిబింబభావమున్ను-వలితత్వ-ఆవృత్తత్వములకు వస్తు ప్రతివస్తుభావమును నాలంకారికులందరున్ను స్వీకరించుట విరుద్ధముకావలసి వచ్చును. ఇందువలన ఉన్నదియున్నట్లు ఉండటమే సాధువు.

ఉపచరితో యథా—

"శతకోటి కఠినచిత్తః సోఽహం తస్యాః సుధైకమయమూర్తేః
యేనాకారిషి మిత్రం స వికలహృదయో విధిర్వాచ్యః".

ఏషా సీతాంవివాసితవతః స్వాత్మగతా రామస్యోక్తిః. అత్ర కాఠిన్యం పార్థివోధర్మశ్చిత్తే ఉపచరితః. కేవలశబ్దాత్మకో యథా—

"యత్ర వసన్తి సుమనసి మనుజపశౌచ శీలవన్తః, సర్వత్ర సమానా మన్త్రిణో మునయ ఇవ". అత్రోపమానోపమేయగతస్యార్థస్యైకస్యాభావాచ్ఛబ్ద ఏవ ధర్మః.

ఉపచరిత మెట్లనగా—"శతకోటి" ఇత్యాదికము సీతాదేవిని ప్రవాసమునకు పంపిన శ్రీరామచంద్రుని యాత్మగతమగుమాట. ఇచట కాఠిన్యము పార్థివమగుధర్మము చిత్తమునం దుపచరితము.

కేవలశబ్దాత్మక మెట్లనగా—"యత్ర" (ఎచట శీలవంతులై సుమనసునందును, మనుజ పశువునందును అంతటను సమానులై మునులవలె మంత్రులుందురో),—ఇత్యాదివాక్యమున నుపమానోపమేయగతమగు నొక్కయర్థము కానందున శబ్దమే ధర్మము.

ఏవమేషాం ధర్మాణాం వ్యామిశ్రణం చ సంభవతి. యథా-

"శ్యామలేనాఙ్కితం భాలే బాలే కేనాపి లక్ష్మణా
ముఖం తవాన్తరాసుప్తభృఙ్గ ఫుల్లామ్బుజాయతే."

అత్ర ఖాలగతాఙ్క ప్రసు ప్తభృఙ్గౌ బిమ్బప్రతిబిమ్బభావమాపన్నౌ కృఙ్గార్థే ఆచారేఽనుగామిన్యభేదమాపద్య స్థితౌ. యథా వా—

"సిన్దూరారుణవపుషో దేవస్య రదాఙ్కురో గణాధిపతేః
సన్ధ్యాశోణామ్బరగతనవేన్దులేఖాయితః పాతు".

అత్ర సిన్దూర సన్ధ్యాభ్యాం గణాధిప గగనాభ్యాఞ్చ బిమ్బప్రతిబిమ్బభావమాపన్నాభ్యాం (ధర్మాభ్యాం) సమ్పాదితాభేదేన విశిష్టధర్మేణాభేదేనావస్థితః కృఙ్గార్థోఽనుగామీ.

ఇలాగే—ఈధర్మములకు వ్యామిశ్రమణమున్నూ జరుగును. ఎట్లనగా—"శ్యామలేన" (ఓ పిల్లా! నల్లనైన ఏదో,గుర్తుతో ఫాలమున అంకితమగు నీముఖము నడుమ నిద్రపోయిన తుమ్మెదగల బాగుగావికసించిన పద్మమువలె నున్నది.) ఇత్యాది శ్లోకమునందు ఫాలగతాంకము, బాగుగా నిద్రించిన తుమ్మెదయు బింబప్రతిబింబభావాపన్నములై కృఙ్ నర్థమగునాచారమున అనుగామియందభేదము నొందియున్నవి.

ఇంకొకతీరు— "సిందూరారుణ" (సిందూరముచే నెఱ్ఱనైన శరీరము గల దేవుడగు గణాధిపతియొక్క దంతాంకురము సంధ్యాకాలముచే నెఱ్ఱనైన ఆకాశమందున్న క్రొత్తచంద్రరేఖవలె నున్నది కాపాడుగాక:) ఇత్యాదిశ్లోకమున బింబప్రతిబింబభావమునుపొందిన సిందూరసంధ్యలచేతను, గణాధిపగగనములచేతనున్నూ (ధర్మములచేత) సంపాదితమగు నభేదముగల విశిష్టధర్మముచేత అభేదముతో నిలచియున్న కృఙ్ అర్థము అనుగామి.

క్వచిద్ధేతుహేతుమద్భావేన యథా—

"ఖలః కాపట్యదోషేణ దూరేణైవ విసృజ్యతే
అపాయశఙ్కిభిర్లోకైర్విషేణాశీవిషో యథా."

అత్ర కాపట్యం విషం చ బిమ్బప్రతిబిమ్బతాం గతం దూరతో విసర్జనేఽనుగామిని హేతుః. యథా వా—

"రూపవత్యపి చ క్రూరా కామినీ దుఃఖదాయినీ
అన్తఃకాటవ సమ్పూర్ణా సుపక్వేవేన్ద్రవారుణీ."

అత్ర రూపవత్త్వ దుఃఖదాయిత్వయోరనుగామినోర్ధర్మయోః క్రౌర్యకాటవే బిమ్బప్రతిబిమ్బభావాపన్నే దుఃఖదాయిత్వేన సహ హేతుహేతుమద్భావేన మిశ్రితే; అపరేణ తు శుద్ధసామానాధికరణ్యేన. ఏవమన్యైరపి వ్యామిశ్రణం బోధ్యమ్.

ఒకయెడ హేతుహేతుమద్భావముచేత నెట్లనగా—"ఖలః" (ఖలుడు కాపట్యమను దోషముచే అపాయమును శంకించునట్టి లోకులవలన విషముచే సర్పమువలె దూరమునుండియే విడువబడును.) ఇత్యాదిశ్లోకమున కాపట్యము విషమున్ను, బింబప్రతిబింబభావమును పొందినవై, దూరముతో విసర్జనమున ననుగామియందు హేతువు.

ఇదియొక విధము— "రూపశాల్యపి" (సౌందర్యమున్నను క్రూరయగు కామినిలోపలనున్న కాటవమను దోషముచే సంపూర్ణయగు బాగుగా పక్వమైన ఇంద్ర వారుణివలె దుఃఖమును కలిగించును.) ఇత్యాది శ్లోకమున రూపత్వము దుఃఖదాయిత్వము రెండనుగామి ధర్మములు. వాటినడుమన క్రౌర్యకాటవములు బింబప్రతిబింబభావాపన్నములై, ఇవి దుఃఖదాయిత్వముతోగూడ హేతుహేతుమద్భావముతో మిశ్రితములు. ఇతరముతో మాత్రము శుద్ధసామానాధికరణ్యముతోను.

ఈతీరుగానే ఇతరములతో వ్యామిశ్రణము తెలియవలెను.

ప్రకారాన్తరం చ లక్ష్యానుసారేణ సుధీభిః స్వయమున్నేతుం శక్యమ్. యథా—

"యథా లతాయాః స్తబకానతాయాః
స్తనావనమ్రే నితరాం సమాసి.
తథా లతా పల్లవినీ సగర్వే
శోణాధరాయాః సదృశీ తవాపి."

అత్ర స్తనావనమ్రే ఽహం స్తబకానతాయా లతాయా ఉపమానమస్మీతి గర్వం మా విదధ్యాః. యతః శోణాధరాయా ఉపమేయాయాస్తవాపి పల్లవినీ లతోపమానం భవతీతి వాక్యార్థే. యథా తథా పదప్రతిపాద్యం కానోపమానికా లతోపమేయికా నిషా

దికా. అస్యాం చోపమాయాం నిరూపకతాసమ్బన్ధేనోపమేయగతే ద్వే ఉపమే సమసదృశ శబ్దాభ్యాం ప్రతిపాదితే బిమ్బప్రతిబిమ్బభావమాపన్నే సాధారణధర్మతయా స్థితే. తత్ర నిరూపకతాసంబన్ధేన ప్రధానీభూతోపమోపమానకాన్తాగతాయాముపమాయాం ప్రతిబిమ్బభూతాయాం గుచ్ఛస్తనయోర్వస్తుప్రతివస్తుభావాపన్ననమనసమ్రీభవనవిశేషణయోర్బిమ్బప్రతిబిమ్బభావమాపన్నయోః సాధారణధర్మత్వమ్. ఏవం తేనైవ సంబన్ధేన లతారూపోపమేయగతాయాం బిమ్బభూతాయాముపమాయామధరపల్లవయోః.

ప్రకారాంతరమున్ను లక్ష్యమునసనుసరించి బుద్ధిమంతులు స్వయముగా నూహించవలెను.

ఎట్లనగా—"యథా లతాయాః" మొ (స్తనములతోవంగిన ఓ గర్వితురాలా! నీవెట్లు పూలగుత్తులతో వంగిన లతతో సమానముగనున్నావో, చిగుళ్ళుగల లతగూడ అట్లే శోణాధరవగు నీతో సమానమైనది). ఇచట స్తనావనమ్రనగు నేను స్తబకానతయగు లతకు, నుపమానమైతి నని గర్వము నొందకుము. ఎందుకనగా. నుపమేయమగు శోణాధరముగల నీకుకూడ చిగురులతో తీవె యుపమానమగును; అను వాక్యార్థమున, యథా తథా-పదములచే ప్రతిపాదింపదగిన కాంత యుపమానముగా గలిగిన తీవె యుపమేయముగాగల్గు నుపమ నిష్పాదిక-ఈ యుపమయందు నిరూపకతాసంబంధముచే నుపమానోపమేయగతములగు రెండుపమలు, సమ-సదృశ, శబ్దముచే ప్రతిపాదింపబడి, బింబప్రతిబింబభావమునొందినవై సాధారణధర్మముగానే నిలచినవి. అందు నిరూపకతాసంబంధముచే ప్రధానభూతోపమయందు ఉపమానమగు కాంతయందు, బింబప్రతిబింబభావాపన్నములై ఏకత్వమును పొందిన గుచ్ఛస్తనములు సాధారణధర్మము. ఆ గుచ్ఛస్తనములు పదద్వయబోధ్యములును, వస్తుప్రతివస్తుభావాపన్నములును అగు నమనన్రమీభావములందు విశేషణీభూతములైనవి. అందుచే నిచట సాధారణధర్మము వస్తుప్రతివస్తుభావకరంబిత బింబప్రతిబింబభావాపన్నము. ప్రధానోపమలో ఉపమేయమగు లతయందు నిరూపకతాసంబంధముచే నున్నదియు, సదృశశబ్దప్రతిపాద్యయు, బింబభూతయునగు రెండవ ఉపమయందు, బింబప్రతిబింబభావాపన్నత్వముచే నైక్యమునుపొందిన అధరపల్లవములు సాధారణధర్మము.

న చ 'తేన సదృశః' ఇత్యాదౌ తన్నిరూపితసాదృశ్యాశ్రయ స్యోపమేయస్య. 'తస్య సదృశః' ఇత్యాదౌ చ తత్సమ్బన్ధి సాదృశ్యాశ్రయస్యోపమానస్య ప్రతీతేః సిద్ధత్వాత్ప్రకృతే చ సదృశీతి శబ్దాన్నివేద్యమానేఽప్యుపమానభావే కథం నామ లతాయా ఉపమేతి వాచ్యమ్. సదృశశబ్దప్రతిపాద్యధర్మభూతోపమాయాం ఉపమానత్వేపి యథా తథా శబ్దవేద్యోపమాయాం లతాయా ఉపమేయభావే బాధకాభావాత్.

అయితే—తేనసదృశః—ఇత్యాదులందు తన్నిరూపితసాదృశ్యాశ్రయమగు నుపమేయమునకు-తస్య సదృశః ఇత్యాదులందు తత్సంబంధి సాదృశ్యాశ్రయమగు నుపమానమునకు ప్రతీతి సిద్ధమగుటవలన, ప్రకృతమున, సదృశీ అను శబ్దమువలన ఉపమానభావము నివేదింపబడుచున్నప్పటికి తీవె కుపమేయత-ఎట్లు? సదృశశబ్దముచే ప్రతిపాద్యమగు ధర్మమైన ఉపమయందు ఉపమానమైనను యథా-తథా-శబ్దములవలన, వేద్యమగు నుపమయందు లత యుపమేయమగుటకు ఏమియు బాధకములేదుకదా?

ఏవమన్యేఽపి ప్రకారాః,

"యథా తవాననం చన్ద్ర స్తథా హాసోఽపి చన్ద్రికా
యథా చన్ద్రసమశ్చన్ద్ర స్తథా త్వం సదృశీ తవ."

ఏభిర్భేదైః ప్రాగుక్తానాం సధర్మాణాం భేదానాం యథా-సంభవం గుణనే బహుతరా భేదా భవన్తి. తథా ధర్మాణాం వాచ్యతాయాం వాచ్యధర్మా బహుధోక్తా. వ్యఙ్గ్యత్వే వ్యఙ్గ్యధర్మా ధర్మలోపే గదితైవ. లక్ష్యతాయాం యథా—

"సర్ప ఇవ శాన్తమూర్తిః శ్వేవాయం మానపరిపూర్ణః.
డింబ ఇవ సావధానో మర్కట ఇవ నిష్క్రియో నితరామ్".

ఇత్యత్రోపమాన మహిమ్నా శాన్తమూర్త్యాది శబ్దైర్విరుద్ధా ధర్మా లక్ష్యన్తే.

ఈ తీరుగా నితరప్రకారములన్నియును— "యథా" (నీమొగము ఎట్లు చంద్రుడో అట్లే నవ్వు కూడా వెన్నెల. ఎట్లు చంద్రుని సమానుడగు.

చంద్రుడో అట్లు నీవు నీకు సమానురాలవు.) ఈ భేదములచే వెనుక జెప్పిన సధర్మములగు భేదములను యథాసంభవముగా గుణించినచో ఎక్కువగా భేదములు సంభవించును. అలాగే ధర్మములు వాచ్యము లగునపుడు వాచ్య ధర్మోపమ అనేకవిధములుగా జెప్పబడినది. వ్యంగ్యమగునపుడు వ్యంగ్య ధర్మోపమయు ధర్మలుప్తోపమాప్రకరణమున జెప్పబడియే యున్నది.

లక్ష్యతయం దెట్లనగా— "సర్పఇవ" (ఇతడు పామువలె శాంత మూర్తి, కుక్కవలె గౌరవపూర్ణుడు, మత్తుడువలె జాగరూకుడు, కోతివలె ఎక్కువగా నిష్క్రియుడు.) ఇత్యాదిశ్లోకమున ఉపమానమహిమచేత శాంత మూర్త్యాదిశబ్దములచేతను విరుద్ధధర్మములు లక్షితములగును.

ఇయం చోపమా ముఖ్యార్థస్య క్వచిత్సాక్షాదుపస్కారిణీ క్వచిచ్చోపస్కారకాన్తరోపస్కరణద్వారా. తత్ర సాక్షాదుపస్కారిణీ ప్రాగ్ బహుధోదీరితా, పరమ్పరయా యథా—

నదన్తి మదదన్తినః పరిలసన్తి వాజివ్రజాః
పఠన్తి బిరుదావలీ మహితమన్దిరే బన్దినః.
ఇదం తదవధి ప్రభో యదవధి ప్రవృద్ధా న తే
యుగాన్తదహనోపమా నయనకోణశోణద్యుతిః."

అత్ర ముఖ్యార్థస్య రాజవిషయాయాః కవిరతేరుపస్కారకస్య యదైవ తవ కోపోదయస్తదైవ రిపూణాం సమ్పదో భస్మసాద్ భవిష్యన్తీతి వస్తున ఉపస్కారికా నయనకోణశోణద్యుతేర్యుగాన్త దహనోపమా.

ఈ యుపమయు ముఖ్యార్థమునకు నొకయెడ సాక్షాత్తుగా నుపస్కరించును. ఒకచోటనుపస్కారకాంతరమునకు ఉపస్కరణముద్వారా. వానిలో సాక్షాదుపస్కారిణి ఇదివరకే చాలావిధములుగా జెప్పబడినది

పరంపరగా నెట్లన— "నదంతి" (మదగజములు ఘీంకారములు చేయుచున్నవి. గుఱ్ఱములసముదాయము బాగాప్రకాశించుచున్నది. వందులు శత్రుమందిరమున బిరుదావళిని పఠింతురు. ఈ యంతయు నంతవరకే. ఎంతవరకైతే ఓ ప్రభువా! యుగాంతమునందలి అగ్నితో సమానమగు నయన కోణముయొక్క ఎఱ్ఱనికాంతివృద్ధిపొందదో.) ఇత్యాదిశ్లోకమున ముఖ్యార్థ

మగు. రాజవిషయమైన కవిప్రీతికి శోభాదాయకముగానున్న, 'ఎప్పుడైతే నీకు కోపముదయించునో అప్పుడే శత్రుసంపదలు భస్మములే' అనువస్తువున కుపస్కారకమైనది, నయనకోణశోణద్యుతికి యుగాంతదహనోపమ.

ఇయం చేవయథావాదిశబ్దైర్వాచకైః ప్రతిపాదితా వాచ్యా లఙ్కారః. లక్ష్యాపి చాలఙ్కార్యాణాం దృశ్యతే. యథా—

"నీవీం నియమ్య శిథిలాముషసి ప్రకాశ
మాలోక్య వారిజదృశః శయనం జిహాసోః
నైవాపరోహతి కదాపి చ మానసాన్మే
నాభేర్నిభా సరసిజోదరసోదరాయాః."

అత్రైకోదర ప్రభవత్వరూపస్య ముఖ్యార్థస్య బాధా త్తదీయ శోభాలక్షణసమానాంశహారత్వస్య ప్రయోజనస్య సత్త్వాత్సోదర పదేన సదృశో లక్ష్యతే. అర్థి చ తత్రోపమా ప్రతీయమానా. అప రోహతి లక్ష్యస్య విషయతయా స్మృతిశూన్యీభవనస్య నిషేధేన ప్రతీయమానాయాః స్మృతే రుపస్కారికా. ఏవం ప్రతిభటమల్లాది శబ్దానాం తదీయ న్యగ్భవన తదీయశోభారూప సర్వస్వాపహారణాదేః ప్రయోజనస్య సత్త్వాత్సాదృశ్యవతి లక్షణైవ, న వ్యఞ్జనా. ముఖ్యార్థస్య బాధాత్ ప్రయోజనే పునర్వ్యఞ్జనైవేతి.

ఈ యుపమయు, ఇవ-యథా-వాది వాచకశబ్దములచే ప్రతిపాదితమై వాచ్యాలంకారమగును. లక్ష్యమైనదిగూడా నలంకరించునదై కన్పడును.

ఎట్లనగా— "నీవీం" (తెలవారునపుడు శిథిలమగు నీవిని నియమించి ప్రకాశమును చూచి పక్కను విడువదలచుచున్న పద్మనేత్రియొక్క పద్మో దరమునకు సమానమైన నాభియొక్కకాంతి నామనసునుండి యెప్పుడునూ తొలగిపోదు) ఇత్యాది శ్లోకమున నొకతల్లికడుపున పుట్టుటయను రూపము గల ముఖ్యార్థము బాధితము కనుక తదీయశోభాలక్షణ సమానాంశహార త్వమను ప్రయోజనమునుండుటవలన సోదరపదముచేత సదృశము లక్షిత మగును. అక్కడ ప్రతీయమానమగు ఉపమ అర్థి. అపరోహతిపదము నకు లక్ష్యమగు విషయతచే స్మృతిశూన్యీభవనముయొక్క నిషేధముచే ప్రతీయమానమగు స్మృతి కుపస్కారిక. ఈ తీరుగా ప్రతిభట, ప్రతిమల్ల

మొదలగు శబ్దములకు తదీయమగు న్యగ్భవనము తదీయశోభారూపసర్వస్వము నపహరించుట మొదలగు ప్రయోజనము ఉండుటవలన సాదృశ్యము కలదాని యందుమాత్రము లక్షణయే, వ్యంజన కాదు. ముఖ్యార్థము బాధితము కనుక ప్రయోజనమునందుమాత్రము వ్యంజనయే.

క్వచిద్వ్యఙ్గ్యాపి చేయముపమాలఙ్కారః యథా—
"అద్వితీయం రుచాత్మానం మత్వా కిం చన్ద్ర హృష్యసి
భూమణ్డలమిదం మూఢ కేన వా వినిభాలితమ్."

కస్యచిద్విదేశస్థితస్య కిరణైరాత్మానం సన్తాపయన్తం చన్ద్రం ప్రత్యేషోక్తిః, అత్ర చ అస్తి మమ ప్రియాయాః కదాపి బహిరనిర్గతాయాః, అత ఏవ త్వయాప్యదృష్టాయా ఆననం త్వత్సదృశమితి ప్రతీయమానా ఉపమా మూఢపదేన ధ్వన్యమానాయాం చన్ద్రవిషయాయాం వక్తృగతాయామసూయాయామలఙ్కారః.

ఒక్కయెడ వ్యంగ్యముగూడ ఈ యుపమాలంకారము. ఎట్లనగా—
"చంద్రుడా! నిన్ను కాంతిచే అద్వితీయుడని తలచుకొని సంతసించుచున్నావు కాబోలు. ఓ మూఢుడా ఈ భువనమండలమంతయు నెవడు బాగుగా చూచినాడు". ఇది యొక విదేశస్థుడు కిరణములచే తనను తపింపజేయుచున్న చంద్రునిగూర్చి పల్కినమాట. ఇక్కడ నాప్రియురాలు ఎప్పుడును బయటికి వెడలనిది, కనుకనే నీవుకూడా నామెను చూచియుండవు. ఆమె మొగము నీతో సమానము అనిప్రతీయమానమగు ఉపమ మూఢపదముచే ధ్వన్యమానమగు చంద్రునిగురించిన వక్తయందున్న నసూయలో నలంకారము.

ఏతేనాప్పయదీక్షితై రుపమాలక్షణే దత్తమవ్యఙ్గ్యత్వ విశేషణమయుక్తమేవ. న హి వ్యఙ్గ్యత్వాలఙ్కారత్వయోరస్తి కశ్చిద్విరోధః. ప్రాధాన్యేన వ్యఙ్గ్యతాయాం తు ప్రధానత్వాలఙ్కారకత్వయోర్విరోధాదలఙ్కారలక్షణంతత్ర మాతిప్రసాఙ్క్షీ దిత్యుపస్కారకత్వేన పునర్విశేషణీయమ్. న వ్యఙ్గ్యత్వేన. ప్రాగుక్తాయామసూయాలఙ్కారోపమాయామవ్యాప్త్యాపత్తేః. విశిష్టోపమాదిస్థలే విశేషణాద్యుపమానాం వాచ్యసిద్ధ్యఙ్గతయా గుణీభూతవ్యఙ్గ్యత్వమ్, సిద్ధార్థస్యోపస్కరణాభావాత్తు నాలఙ్కారత్వమితి న కావ్యసఙ్గతిః.

దీనిచేత నప్పదీక్షితులు, ఉపమాలక్షణములో నిచ్చిన అవ్యంగ్యత్వ మను విశేషణ మయుక్తమేను. వ్యంగ్యమగుటకును-అలంకారమగుటకును ఏవిరోధములేదుకదా? ప్రధానముగా వ్యంగ్యమగునపుడు ప్రధానమగుటకును అలంకారమగుటకును విరోధమువలన అలంకారలక్షణములు ప్రసక్తింపకుండ వలెననే ఉపస్కారకత్వ మట విశేషణము వేయవలెను. అంతేకాని అవ్యంగ్య త్వముచే విశేషింపకూడదు. అట్లువేసినయెడల వెనుకజెప్పిన అసూయాలంకార మగు నుపమయందు నవ్యాప్తివచ్చును. విశిష్టోపమాది స్థలమున విశేషణా ద్యుపమలకు అవి వాచ్యసిధ్యంగములు గనుక గుణీభూతవ్యంగ్యత్వము సిద్ధా ర్థములోనుపస్కారణము లేదు కనుకనే అలంకారత్వములేదు అనిన నసంగతి యేమియును లేదు.

యచ్చాపి సేయముపమా సంక్షేపతస్త్రివిధా-క్వచిత్స్వ వైచిత్ర్యమాత్రవిశ్రాన్తా. యథా-'సచ్ఛిన్నమూలః క్షతజేన రేణుః' ఇత్యాదౌ. క్వచిదుక్తార్థోపపాదనపరా, యథా 'అనన్తరత్నప్రభవస్య' ఇత్యాదౌ. క్వచిద్వ్యఙ్గ్యప్రధానా సా" ఇతి తైరేవ ద్రవిడశిరోమణిభి రభ్యధీయత. తదప్యహృద్యమేవ. "నయనే శిశిరీకరోతు మే శరదిన్దు ప్రతిమం ముఖం తవ" ఇతి వాచ్యవస్తూపస్కారికాయాః శరదిన్దూ పమాయాః అక్రోడీకరణాత్. అలఙ్కారభూతోపమాసు స్వవైచిత్ర్య మాత్ర విశ్రాన్తాయా ఉపమాయాః సఙ్గ్రహే కో నామ ధ్వన్య మానాయాస్తస్యా నిరాసాయావ్యఙ్గ్యత్వ విశేషణ దానదురాగ్రహః? అహో మహాదేవేదమన్యాయ్యం, యదలక్షణీయాయాః సంగ్రహః లక్షణీయాయాశ్చాసంగ్రహ ఇతి! ప్రాచీనానాం తూపమాసామా న్యం లక్షయతాం ధ్వన్యమానాయా ఇవాస్యా అపి సంగ్రహో నానుచితః. న తు స్వస్య యత్నేన ధ్వన్యమానోపమాం నిరస్య కణ్ఠర వేణాలఙ్కారభూతోపమాలక్షకస్య.

అదిగాక-"ఈ ఉపమ సంక్షేపముగా మూడువిధములు. ఒక్కొక్కచోట స్వవైచిత్ర్యమాత్రవిశ్రాంత, ఎట్లనగా—"సచ్ఛిన్న మూలః క్షతజేన రేణుః" ఇత్యాది స్థలమున. మరొకచోట చెప్పిన యర్థమును ఉపపాదించుటకై ప్రవర్తించునది. ఎట్లనగా— "అనంతరత్న ప్రభవస్య" ఇటువంటి స్థలమున. ఒకచోటవ్యంగ్యప్రధాన" అని ద్రవిడశిరోమణులు జెప్పిరి. అదియు

హృద్యముగాలేదు. "నయనే" ఇత్యాది స్థలమున వాచ్యవస్తువు నుపస్కరించునట్టి శరదిందూపమను క్రోడీకరించలేదు. అలంకారములగు నుపమలలో స్వవైచిత్ర్యమాత్రమున విశ్రాంతయగు నుపమను సంగ్రహింపవుడు ధ్వనించునట్టి యుపమను నిరసించుటకై నవ్యంగత్వమను విశేషణము వేయు దురాగ్రహమెందులకో? ఇది చాలా యాశ్చర్యమే ఏమంటే-లక్షింపదగని దానిని సంగ్రహించుట, లక్షింపదగినదానిని విడుచుట. ప్రాచీనులు ఉపమా సామాన్యమును లక్షించువారు-ధ్వన్యమానమగు నుపమనువలె దీనినిగూడ లక్షించుట అనుచితముగానేరదు. నీకుమాత్ర మట్లుగాదు, ప్రయత్నముతో ధ్వనించు నుపమను నిరసించి యలంకారమగు నుపమను తనకంఠరవముతోడ లక్షించినవానికి ఇది తగునా?

యది చ ప్రబన్ధ వ్యఙ్గ్యోపస్కారకత్వే నేయం సఙ్గృహ్యేత ఇత్యుచ్యతే, తదా 'స్వవైచిత్ర్యమాత్రవిశ్రాన్తా' ఇతి స్వోక్తిర్విరుద్ధా స్యాత్. 'అనన్తరత్నప్రభవస్య' ఇత్యత్ర గుణసమూహ సమానాధికరణ ఏకోదోషో దోషత్వేన న స్ఫురతీత్యస్యార్థస్య పూర్వార్ధ ప్రతిపాదితార్థ సమర్థనాత్మకస్య సామాన్యరూపస్య విశేషరూపోదాహరణ ప్రదర్శనమన్తరేణ సమ్యగనాకలనాదిన్దుకిరణ సమానాధికరణోఽఙ్క ఉదాహృతః, న తూపమానతయా నిర్దిష్టః సామాన్యాద్విశేషస్యభేదాభావేనోపమితి క్రియాయా అనిష్పత్త్యా ఉపమాలఙ్కృతేరత్రానవతారాదుదాహరణాలఙ్కారోఽయమతిరిక్తః. యథా 'ఇకో యణచి' ఇతివాక్యార్థస్య సామాన్యస్య విజ్ఞానాయోదకోకారే దధీకారస్య య ఇతి వాక్యాన్తరేణ తద్విశేష ఉదాహ్రియతే తద్వదత్రాపీతి తత్రప్రసఙ్గే వివేచయిష్యామః.

ఒకవేళ ప్రబంధవ్యంగ్యమునకు నుపస్కరించునదిగనుక నిది సంగ్రహింపబడిన దన్నచో నపుడు స్వవైచిత్రీమాత్ర విశ్రాంతయగు నుపమ-అను తనమాట విరోధించును. "అనంతరత్న ప్రభవస్య" అనుచోట గుణసమూహ సమానాధికరణమగు నొకదోషము దోషముగా స్ఫురింపదన్నయర్థము, పూర్వార్థమున ప్రతిపాదితమగు నర్థమును సమర్థించు సామాన్యరూపము. విశేషరూప ఉదాహరణమును ప్రదర్శింపకుండా ఇది చక్కగా బుద్ధికెక్కదు. గనుక నిందునికిరణములతో సమానాధికరణమగు నంకము ఉదాహరింపబడి

నది. అంతేకాని-ఉపమానముగా నిర్దేశింపబడలేదు. సామాన్యముకన్న విశేషమునకు భేదములేదు కనుక నుపమితిక్రియ నిష్పన్నముగాజాలదు. కనుక నుపమాలంకార మిచట నవతరించదు. అందుచే నుదాహరణాలంకారము. ఇది అతిరిక్తము. ఎట్లనగా-"ఇకోయణచి" యను వాక్యార్థము సామాన్యమైనందున దానికి జక్కగా దెలియుటకై (ఉకారము పరమగునపుడు)దధి శబ్దేకారమునకు యకారముచచ్చునని వాక్యాంతరముచే దాని విశేషము నుదాహరించినట్లుగా నిక్కడను అని. అవిషయము నాప్రసంగమున వివేచింతుము

యచ్చాప్పయదీక్షితైః 'లుప్తాయాం తు నైవం భేదాః' తస్యాం సాధారణధర్మస్యానుగామితా నియమాత్' ఇత్యుక్తమ్, తన్న, 'మలయ ఇవ జగతి పాణ్డుర్వల్మీక ఇవాధిధరణి ధృతరాష్ట్రః' ఇత్యత్రానుగామిధర్మస్యాప్రత్యయా చ్చన్దనానాం పాణ్డవానాం, సర్పాణాం దుర్యోధనాదీనాం చ బిమ్బప్రతిబిమ్బభావస్యైవ ప్రతిపత్తేః.

న చ శబ్దేనోపాత్తత్వం బిమ్బప్రతిబిమ్బభావే తన్త్రమిత్యాగ్రహో విదుషాముచితః, శ్రౌతత్వార్థత్వాభ్యాం బిమ్బప్రతిబిమ్బభావస్య ద్వైవిధ్యౌచిత్యాత్. అత ఏవాప్రస్తుతప్రశంసాదౌ ప్రకృతాప్రకృతవాక్యార్థయో రౌపమ్యమవయవబిమ్బప్రతిబిమ్బభావమూలం సఙ్గచ్ఛతే.

అప్పయదీక్షితులు— "లుప్తయందు ఈ తీరుభేదములు లేవు, దానియందు సాధారణధర్మ మనుగామికావలెనను నియమమున్నది" అన్నారు.

అది తప్పు— "మలయ" ఇత్యాద్యుదాహరణమున ననుగామిధర్మము అప్రతీతముగనుక. చందనములకు పాండవులకు సర్పములకు దుర్యోధనాదులకు బింబప్రతిబింబభావమే స్ఫురించునుగదా? శబ్దముచే నుపాత్తత్వము బింబప్రతిబింబభావములో తంత్రము అని యాగ్రహము పండితుల కుచితము గాదు. శ్రౌతత్వము, అర్థత్వము అని రెండువిధములచేతను బింబప్రతిబింబభావ ముచితముగదా? ఇందువల్లనే యప్రస్తుతప్రశంసాదులందు ప్రకృతాప్రకృతములగు వాక్యార్థములకు నౌపమ్యము అవయవ బింబప్రతిబింబభావమూలము సంగతమగును.

ఇయమపి రూపకవత్కేవలనిరవయవా, మాలారూపనిరవయవా, సమస్తవస్తువిషయసావయవా, ఏకదేశవివర్తిసావయవా, కేవలశ్లిష్టపరమ్పరితా, మాలారూపశ్లిష్టపరమ్పరితా, కేవలశుద్ధపరమ్పరితా, మాలారూపశుద్ధ పరమ్పరితా చేత్యష్టవిధా. తత్రోపమాయాం కేవలత్వం మాలానన్తర్గతత్వం, నిరవయవత్వంచోపమాన్తర నిరపేక్షత్వమ్. ఇయఞ్చ శతశః ప్రాగేవోదాహృతా.

ఈ యుపమయు రూపకమువలెనే కేవల నిరవయవము మాలారూప నిరవయవము, సమస్తవస్తువిషయసావయవము, ఏకదేశ వివర్తిసావయవము, కేవలశ్లిష్టపరంపరితము, మాలారూపశ్లిష్టపరంపరితము, కేవల శుద్ధపరంపరితము, మాలారూపశుద్ధపరంపరితము అని ఎనిమిది విధములు. అందుపమయందు కేవలత్వము, మాలానంతర్గతత్వము నిరవయవత్వమున్ను, మరొక యుపమతో నిరపేక్షత్వము. ఇదియు ననేకముగా నిదివరకే యుదాహరింపబడినది.

మాలారూపనిరవయవా యథా—

"ఆహ్లాదినీ నయనయో రుచిరైన్దవీవ
కణ్ఠే కృతాతిశిశిరామ్బుజమాలికేవ
ఆనన్దినీ హృది గతా రసభావనేవ
సా నైవ విస్మృతిపథం మమ జాతు యాతి.

యథా వా—

'కలేవ సూర్యాదమలా నవేన్దోః కృశానుపుఞ్జాత్ప్రతిమేవ హైమీ.
వినిర్గతా యాతునివాసమధ్యా దధ్యాబభౌ రాఘవధర్మపత్నీ'.

పూర్వమనుగామినా ధర్మేణ భిన్నదేశకాలావచ్ఛేదేన, అత్ర తు బిమ్బప్రతిబిమ్బభావమాపన్నేనైక దేశకాలావచ్ఛేదేనేతి విశేషః. అత్రాధికదీప్తిరూపే వాక్యార్థే ఉపమే ఉపస్కారికే. ఆత్యన్తికవినాశహేతుత్వేన దేదీప్యమానత్వేన చ సాధారణ్యేన సూర్యమణ్డలస్య, నిష్కలఙ్కతాభివ్యఞ్జకత్వేన భస్మీభవనహేతుత్వేన కృశానుపుఞ్జస్య చ లఙ్కాప్రతిబిమ్బతా. మాలారూపత్వం చాత్రైకోపమేయకానేకోపమా సామానాధికరణ్యాత్.

మాలారూపనిరవయవము-ఎటన—'ఆహ్లాదిని' మొ. (కన్నులకు నానందింపజేయునట్టి చంద్రునికాంతివలెను కంఠమునందు స్పర్శంబడిన చల్లని పద్మమాలికవలెను హృదయమున నానందింపజేయునట్టి రసభావనవలెను ఆమె మరచిపోవుమార్గమున నెపుడును పోదు."

మరొకటి—'కలేవ' మొ. "సూర్యునినుండి నిర్మలమగు క్రొత్తచంద్రుని కళవలెను, నిప్పులరాశినుండి బంగారుప్రతిమవలెను రాక్షసుల నివాసమధ్యనుండి బయలువెడలినదై శ్రీరామునిధర్మపత్ని సీత బాగా ప్రకాశించెను".

వెనుకటి యుదాహరణము దేశకాలములు భిన్నములగుచుండునపుడు అనుగామియగు ధర్మముతో నిచటను బింబప్రతిబింబభావము నొందినదానితో ఏ దేశకాలాపచ్ఛేమున అచేదానితో లేడా. ఇచట నెక్కుడు ప్రకాశరూపమగు వాక్యార్థమున రెండుపమ లుపస్కారికలు—ఆత్యంతికమగు వినాశమునకు కారణమగుటయు బాగుగా ప్రకాశించుటయును సాధారణ్యముచేత సూర్యమండలమునకును నిష్కలంకతను వ్యక్తమొనర్చుటచేత భస్మీభవనమునకు కారణమగుటచేతను కృశానుపుంజమునకునూ లంకాప్రతిబింబత్వము.

ఇచట మాలారూపత్వ మెట్లనగా—ఒకటే యుపమేయముగల అనేక ఉపమలు సమానాధికరణములు గనుక.

సమస్తవస్తువిషయా సావయవా యథా—

'కమలతి వదనం యస్యా మలయ స్త్యలకా మృణాలతో బాహూ
శైవాలతి రోమావలిరద్భుతసరసీవ సా బాలా".

యథా వా:—

"జ్యోత్స్నాభమజ్జుహాసితా సకలకలాకాన్తకాన్తవదనశ్రీః
రాకేవ రమ్యరూపా రాఘవరమణీ విరాజతే నితరామ్".

అత్ర సర్వేషా ముపమానానాం శబ్దైరేవాభిధానాత్ సమస్తవస్తువిషయా, అఙ్గోపమాభినిష్పాద్యమానత్వాచ్చ సాఙ్గా భవతి.

సమస్తవస్తువిషయ సావయవ యెట్లనగా—'కమలతి' మొ. "ఎవతె మొగము కమలమువలెనున్నదో ముంగురులు అళులవలెనున్నవో బాహువులు

మృణాలములవలెనున్నవో రోమావలి శైవాలమువలె నున్నదో ఆ బాల అద్భుతమగు సరస్సువలెనున్నది ).

మరొకటి, 'జ్యోత్స్నాభ' మొ. (వెన్నెలవలె మంజువగు హాసము కలదియు, సకల కళాకాంతులకు చంద్రునివలె అందమైన వదనశోభ కలదియు, శాకవలె రమ్యమైన రూపముకలదియునై రాఘవ రమణి యెక్కువగా ప్రకాశించుచున్నది) ఇచట అన్ని యుపమానములను శబ్దములచేతనే చెప్పుటవలన సమస్తవిషయ అంగోపమంచే నభినిష్పాద్యమానమగుటచేతను సాంగమగును.

ఏకదేశవర్తినీ సావయవా యథా—

"మకర ప్రతిమైర్మహాభటైః కవిభీరత్నసమైః సమన్వితః
కవితామృతకీర్తిచన్ద్రియో_స్త్వమిహోర్వీరమణాసి కారణమ్."

అత్రోత్తరార్ధే ఉపమిత సమాస ఏవ, విశేషణసమాసవేద్యస్య తాదాత్మ్యస్య ప్రకృతేఽనుపయోగాత్. రాజ్ఞో జలధేరుపమా శబ్దేనానభిహితాప్యఙ్గోపమాభిరాక్షిప్తా ప్రతీయతే ఇత్యేకదేశవివర్తనాదేకదేశవివర్తినీ.

ఏకదేశవివర్తిని సావయవ యెట్లనగా—'మకర' మొ "మొసళ్లవంటి గొప్పయోధులచేతను రత్నములవంటి కవులచేతను కూడినవాడవై కవితామృతమునకును కీర్తిచంద్రికకును, ఓ ఉర్వీరమణుడా! నీవు యిక్కడ కారణమైతివి." ఇచట నుత్తరార్ధమున నుపమితసమాసమే. విశేషణసమాసముతో వేద్యమగు తాదాత్మ్యము ప్రకృతములో నుపయోగించదుగనుక. రాజునకు సముద్రముయొక్క ఉపమ శబ్దముచే చెప్పబడకపోయినను అంగోపముచే నాక్షేపింపబడుచునే స్ఫురించుచూ ఉన్నది. అని ఏకదేశవివర్తనమువల్లనే ఏకదేశవివర్తిత్వము.

కేవలశ్లిష్ట పరమ్పరితా యథా—

"నగరాన్తర్మహీన్ద్రస్య మహేన్ద్రమహితశ్రియః
సురాలయే ఖలు క్షీబా దేవా ఇవ విరేజిరే."

అత్ర శ్లేషోపస్థాపితేన సుమేరుణా మదిరాగారస్యోపమా క్షీబానాం దేవోపమాయా ఉపాయ ఇతి శ్లిష్టపరమ్పరితా. అన్యోన్యోపాయతారూపస్యైవ పరమ్పరితత్వస్యేహ పరిభాషణాత్ మాలారూపతావిరహాచ్చ కేవలా.

కేవలశ్లిష్ట పరంపరిత మెట్లనగా—

'నగరాంతః' మొ. (మహేంద్రునితో సమానమగు లక్ష్మిగల మహీంద్రునిపట్టణములో సురాలయమందు (కల్లంగడియందు-మేరువునందు) క్షీబులు దేవతలవలె ప్రకాశించిరి.) ఇచట శ్లేషచే నుపస్థాపింపబడిన సుమేరువుతో మదిరాగారమున కుపమ క్షీబులకు దేవోపమకు నుపాయమని పరంపరితము. పరస్పరము నుపాయతా రూపమేయైన శ్లిష్టపరంపరితత్వము, ఇక్కడ పరిభాషింపబడినది గనుక, మాలారూపత లేదుగనుక, కేవల.

మాలారూపశ్లిష్టపరమ్పరితా యథా—

"మహీభృతాం ఖలు గణే రత్నసానురివ స్థితః
త్వం కావ్యే వసుధాధీశ వృషపర్వేవ రాజసే."

అత్ర శ్లేషోపస్థితాభ్యాం పర్వతశుక్రాభ్యాం రాజకావ్యయోరుపమే మేరువృషపర్వాభ్యాం రాజ్ఞ ఉపమయోరుపాయః. నన్వత్ర పర్వతానామివ రాజ్ఞాం శుక్ర ఇవ కవిత్వే ఇత్యేవం రూపా ఉపమా కథం ప్రత్యేతుం శక్యా? ఉపమానోపమేయశబ్దయోః పార్థక్యాభావాదితి చేత్, శ్లేషేహ్యేకశబ్దోపాత్తత్వేన రూపేణాభేదాధ్యవసానస్యైవ తేనైవ సాధర్మ్యేణ సాదృశ్యాధ్యవసానస్యాపి సువచత్వాత్; తస్యైవ చ ప్రకృతే ప్రయోజ్యోపమానుకూలత్వాత్.

మాలారూపశ్లిష్ట పరంపరిత మెట్లనగా—

'మహీభృతాం' మొ.(ఓ భూపతీ! కొండలసమూహమువలెనున్న రాజుల సమూహమునందు మేరుపర్వతమువలెనున్న నీవు శుక్రునివలెనున్న కావ్యమున వృషపర్వునివలె ప్రకాశించుచున్నావు). ఇచట శ్లేషచే చెప్పబడిన పర్వత శుక్రులతో రాజ కావ్యముల యుపమలు రెండును మేరువృషపర్వులతో రాజుయొక్క ఉపమలకు ఉపాయము. అయితే - ఇచట పర్వతములకువలే, రాజులకు — శుక్రుడువలె కవిత్వమున, అని ఈరూపమైన యుపమను దెలిసి

కొనుటకు ఎటు వీలగును? ఉపమాన ఉపమేయశబ్దములు వేరుగా లేవుగదా? యన్నచో - శ్లేషయం దొక శబ్దముచేత నుపాత్తమగుట యను రూపముతో నభేదాధ్యవసానమువలె నా సాధర్మ్యముతో సాదృశ్యాధ్యవసానముగూడ సుఖముగానే చెప్పవచ్చును. అదియే ప్రకృతములో నుపయోగింప దగిన యుపమ కనుకూలముగదా?

కేవలశుద్ధపరమ్పరితా యథా—

'రాజా యుధిష్ఠిరో నామ్నా సర్వధర్మ సమాశ్రయః
ద్రుమాణామివలోకానాం మధుమాస ఇవా భవత్.'

మాలా శుద్ధ పరమ్పరితా యథా.—

"మృగతాం హారయన్మధ్యే వృక్షతాం చ పటీరయన్
ఋక్షతాం సర్వభూపానాం త్వమిన్దవసి భూతలే."

ఉపమానయోః పరస్పరముపమేయయోశ్చానుకూల్యే ఉపమయోరేషోపాయతా నిరూపితా. ప్రాతికూల్యే ఉపాయతా యథా-

"రాజా దుర్యోధనో నామ్నా సర్వసత్త్వభయఙ్కరః
దీపానామివ సాధూనాం ఝఞ్ఝావాత ఇవాభవత్."

అత్రోపమానయోర్దీపఝఞ్ఝావాతయోరన్యోన్యముపమేయయోశ్చ సాధుదుర్యోధనయోః ప్రాతికూల్యేప్యుపమయోః పరస్పరమానుకూల్యాదుపాయత్వైవ. ఏవమ్—

"సరోజతామథ సతాం శిశిరత్రవతాధునా
దర్భతాం సర్వధర్మాణాం రాజ్ఞానేన విదర్భితమ్".

ఇత్యాదౌ మాలారూపతాయామపి.

కేవలశుద్ధపరంపరిత మెట్లనగా—

'రాజా' మొ. (యుధిష్ఠిరుడను పేరుగలరాజు సర్వధర్మములకు సమాశ్రయుడై చెట్లకువలె లోకమునకు వసంతఋతువువలె నుండెను.)

మాలారూపశుద్ధపరంపరిత మెట్లనగా—

'మృగతాం' మొ. (నీవు మృగములవలె నాచరించు సర్వభూతముల నడుమ సింహమువలె నాచరించుచు వృక్షములవలె నాచరించు వారిమధ్య చందనవృక్షమువలె నాచరించుచు, నక్షత్రములవలె నాచరించు వారిమధ్య చంద్రుడువలె నాచరించుచున్నావు.) రెండు ఉపమానములకున్ను, రెండు

ఉపమేయములకును పరస్పరము అనుకూలతవలన నుపమకు ఇది ఉపాయత నిరూపితమైనది.

ప్రాతికూల్యమున ఉపాయత యెట్లనగా—

'రాజా' మొ. (దుర్యోధనుడను పేరుతో రాజు సర్వజంతువులకును భయంకరుడై దీపమునకువలె సాధువులకు ఝంఝామారుతమువలె అయ్యెను.)' ఇచట నుపమానములగు దీప ఝంఝావాతములకును అన్యోన్య ముపమేయములగు సాధు దుర్యోధనులకున్ను ప్రాతికూల్యమైనను ఉపమలకు పరస్పర మానుకూల్యము కనుక, ఉపాయత్వమే.

ఈ తీరుగానే—

'సరోజతామ్' (అనంతరము సరోజత్వమును ఆచరించుచున్న సత్పురుషులకు శిశిర ఋతువువలె నాచరించుచున్న ఈరాజు దర్భత్వము నాచరించు సర్వధర్మములకును విదర్భవలె నాచరించెను). ఇత్యాది స్థలమున మాలారూపత్వమందైనను.

ఉపమేయానాం స్వస్వోపమానానుపమానానాముపమానతాయాం రశనోపమా యథా—

"వాగివ మధురా మూర్తిర్మూర్తిరివాత్యన్తనిర్మలా కీర్తిః
కీర్తిరివ జగతి సర్వస్తవనీయా మతిరముష్య విభోః".

ఇయం ధర్మవిశేషే. ధర్మైక్యేతు—

"భూధరా ఇవ మత్తేభా మత్తేభా ఇవ సూనవః
సుతా ఇవ భటాస్తస్య పరమోన్నతవిగ్రహాః".

ధర్మలోపే తు తస్యేత్యస్యానన్తరం 'భటా ఇవ యుధి ప్రజాః' ఇతి గోధ్యమ్. ఇయమేవం భేదా ప్రాచీనైర్భేదైర్గుణనే వాగగోచరం భూమానం భజమానా నేయత్తా మర్హతీతి దిక్.

ఉపమేయములకు క్రమముగ యుపమాన అనుపమానములకున్ను ఉపమానములగుటయందు రశనోపమ యెట్లనగా—

'వాగివ' మొ. (వాక్కువలె రూపు మధురమైనది రూపువలె అత్యంత నిర్మలమైనది కీర్తి. కీర్తివలె లోకమున యందరిచేతను కొనియాడదగినది యీ ప్రభువుయొక్క బుద్ధి.) ఇది ధర్మభేదమున.

ధర్మైక్యముదం దన్నచో—

'భూధరాః' మొ.(కొండలవలె ఏనుగులను ఏనుగులవలె కుమారులను కుమారులవలె ఆతని భటులును ఆరాజును పరమోన్నత విగ్రహులు), ధర్మ లోపమునందైతే 'తస్య' అనేదాని తరువాత "భటా ఇవ యుధి ప్రజాః" అని కూర్చవలెను. ఈ యుపమ ఈతీరు భేదముగలదై వెనుకటి భేదములతో గుణించినపుడు వాగగోచరమగు నతిశయమును పొందుచు ఇంతయని చెప్పుటకు వీలులేకుండును అని దిక్.

ఏషైవ చ యదా సకలేన వాక్యేన ప్రాధాన్యేన ధ్వన్యతే తదా పరిహృతాలఙ్కారభావా ధ్వనివ్యపదేశహేతుః. అస్యాం చాలఙ్కారవ్యపదేశః కదాప్యలఙ్కారభావాప్రాప్తేషు మఞ్జూషాదిగతేషు కటకాదిష్వివాలఙ్కార్యాణ గత ధర్మమాత్ర స్పర్శనిబన్ధనః. క్వచిదసౌ శబ్దశక్తిమూలానురణన విషయః. క్వచిదర్థశక్తిమూలానుధ్వనన విషయః. ఆద్యో యథా—

"అవిరల విగలద్దానోదకధారాసారసిక్త ధరణితలః
ధనదాగ్రమహితమూర్తిర్జయతితరాం సార్వభౌమోయమ్."

యథావా—

"విమలతరమతిగభీరం సుపవిత్రం సత్త్వవత్సురసమ్
హంసావాసస్థానం మానసమిహ శోభతే నితరామ్."

అత్రానేకార్థానామపి శబ్దానాం ప్రకరణేన కృతేఽపి శక్తిసంకోచే తన్మూలకేన ధ్వననేన ప్రతీయమానస్య, సరోవరరూపస్యార్థాన్తరస్యాప్రస్తుతస్యాభిధానం మాభూదితి ప్రకృతాప్రకృతయోరుపమానోపమేయభావః ప్రధాన వాక్యార్థతయా కల్ప్యతే.

ఇదియే వాక్యమంతటిలో ప్రధానముగా ధ్వనించుచో నపు డలంకారత్వమును త్రోసివైచి ధ్వనియని చెప్పుట కలుగును. దీనినే అలంకారమనుట ఎపుడైనా అలంకారతనొందని పెట్టె మొదలగువానిలోనున్న కటకాదుల యందువలె, అలంకరించువానియందుండు ధర్మము మాత్రము సంస్పర్శయే హేతువుగాగలది. ఒకయెడ నిది శబ్దశక్తిమూలమగు ననుధ్వననమునకు విషయము. ఒకయెడ అర్థశక్తిమూలమగు అనుధ్వననమునకు విషయము.

మొదటిది యెట్లనగా.

'అవిరల' మొ. (ఎడతెగకుండ ప్రవహించు దాన ఉదకధారల జడివానలచే తడుపబడిన ధరణీప్రదేశముకల్గి ధనదాతలయొక్క (కుబేరునియొక్క) అగ్రమున పూజ్యమగు రూపముగల యీ సార్వభౌముడు బాగా జయించుచున్నాడు)

మరొకటి—

'విమలతరమ్' మొ.(బాగా నిర్మలమైనదియు మిక్కిలి గంభీరమైనదియు సత్త్వము మంచిరుచికలదియు హంసల నెలవగు స్థానమగుటచే నిక్కడ మానసము మిక్కిలి భాసించుచున్నది). ఇచట ననేకార్థములైనను శబ్దములకు ప్రకరణముచేత శక్తిసంకోచము చేయబడినను తన్మూలకమగు ధ్వననముచేత ప్రతీయమానమగు సరోవరరూపమగు నర్థాంతరమును అప్రస్తుతమును జెప్పుట ప్రసక్తింపకుండవలెనని ప్రకృతాప్రకృతములకు నుపమానోపమేయభావము ప్రధాన వాక్యార్థముగ గల్పించబడును.

ద్వితీయో యథా—

''అద్వితీయం రుచాత్మానం దృష్ట్వా కిం చన్ద్ర దృప్యసి
భూమణ్డలమిదం సర్వం కేన వా పరిశోధితమ్.''

అత్ర మూఢాది పదాప్రయోగాదసూయాదేరప్రత్యయాన్ముఖ్యతయోపమైవ వ్యఙ్గ్యా.

రెండవది యెట్లనగా (అర్థశక్తిమూలను)'—అద్వితీయం' మొ. (కాంతిచేనద్వితీయుడను అని నిన్నుచూచుకొని నీవు పొంగకుము. ఓ చంద్రుడా! వలయమంతయు ఎవనిచే శోధింపబడినది). ఇచట మూఢాది పదములు ప్రయోగించ పోవుటవలన అసూయ స్ఫురించక ముఖ్యముగా నుపమయే వ్యంగ్యము.

అథాస్య సాదృశ్యస్య పదార్థాన్తరత్వే బోధో విచార్యతే—అరవిన్ద సున్దరమిత్యత్రారవిన్ద నిరూపిత సాదృశ్య ప్రయోజకం లక్ష్యతే. తచ్చ సున్దరపదార్థైకదేశేన సౌన్దర్యేణాభేదసంసర్గేణాన్వేతి. తేనారవిన్దనిరూపిత సాదృశ్య ప్రయోజకాభిన్నసౌన్దర్యవదభిన్నమితి

ధీః. నిపాతాతిరిక్తనామార్థయోర్భేదాన్వయస్యావ్యుత్పన్నత్వాదవ భేదానుసరణమ్. ఏకదేశాన్వయస్తు 'దేవదత్తస్య నప్తా' ఇత్యాదావివాత్రాప్యభ్యుపేయః. 'సమాసస్యైవ విశిష్టార్థే శక్తిః' ఇత్యేకే. 'అరవిన్దపదమేవ లక్షణయా సర్వార్థబోధకం, సున్దర పదం తు తాత్పర్యగ్రాహకమ్' ఇత్యపరే.

తరువాత నిచట—సాదృశ్యము అను మరొక పదార్థమన్నచో శాబ్దబోధను విచారింతము—

"అరవిందసుందరం"-అనుచోట నరవిందనిరూపితమగు సాదృశ్యము నకు ప్రయోజకము లక్షితమగును. అదియు సుందరపదార్థైకదేశమగు సౌంద ర్యముతో నభేదసంబంధమున నన్వయించును. కాగా—అరవిందనిరూపిత సాదృశ్యప్రయోజకాభిన్న సౌందర్యవదభిన్నము అని బోధగల్గును. నిపా తాతిరిక్తములగు నామార్థములకు భేదసంబంధముతో నన్వయము నవ్యుత్ప న్నమగుటచేత నభేదమనుసరింపబడెను ఏకదేశమున నన్వయమైతే దేవదత్తుని మునిమనుమడు ఇత్యాదులందువలె నిచటగూడ స్వీకరింపనగును. సమాస మునకే విశిష్టార్థమున శక్తియని యొకరు. అరవిందపదమే లక్షణచే నర్థము నంతయు బోధించును, సుందరపదముమాత్రము తాత్పర్యగ్రాహకము అని మరియొకరు.

తథా 'అరవిన్దమివ సున్దరమ్' ఇత్యత్రేవార్థే సాదృశ్యేఽరవి న్దస్య నిరూపితత్వసంసర్గేణాన్వయః. తస్య చ ప్రయోజకతా సంసర్గేణ సౌన్దర్యే. ఏవం చారవిన్దనిరూపిత సాదృశ్యప్రయోజక సౌన్దర్యవద భిన్నమితి. 'అరవిన్ద మివ' ఇత్యత్ర త్వరవిన్దనిరూపితసాదృశ్యవదితి.

అలాగే—అరవిందమువలె సుందరము అనుచోటవలె (ఇవ) యర్థ మగు సాదృశ్యమున నరవిందమునకు నిరూపితత్వ సంసర్గముచే నన్వయము. దానికి ప్రయోజకసంబంధముచే సౌందర్యమునందు నన్వయము కాగా — అరవిందనిరూపితమగు సాదృశ్యమునకు ప్రయోజకమగు సౌందర్యముగల దానితో నభిన్నము అనిబోధ.

అరవిందమివ (వలె) అనుచోటనైతే అరవిందముచే నిరూపింపబడిన సాదృశ్యముగలదియని.

నిపాతజన్యోపస్థితిప్రయోజ్యప్రకారతానిరూపితవిశేష్యతా నిపాతజన్యోపస్థితిప్రయోజ్యవిశేష్యతాన్యతరభిన్నవిశేష్యతాసంసర్గేణ నామార్థప్రకారకబోధ ఏవ విశేష్యతయా విభక్తిజన్యోపస్థితే ర్హేతుత్వాదివార్థస్య నఞర్థస్యేవ భేదసంసర్గేణ నామార్థవిశేష్యత్వే విశేషణత్వే చ న దోషః.

నిపాతజన్యమగు నుపస్థితిచే ప్రయోజ్యమగు ప్రకారతచే నిరూపింప బడిన విశేష్యత, నిపాతజన్యోపస్థితి ప్రయోజ్య విశేష్యత్వము, ఈ రెంటిలో నేదో యొకటికి భిన్నమైన విశేష్యతాసంసర్గముచే నామార్థప్రకారకబోధ యందే విశేష్యతచే విభక్తిజన్యోపస్థితి హేతువగుటవలన ఇవార్థమునకు నఞర్థ మునకువలె భేదసంబంధముచే నామార్థమునకు విశేష్యమగుటయందు విశే షణమగుటయందు దోషమేమియును లేదు.

'అరవిన్దమివ భాతి' ఇత్యత్రారవిన్ద నిరూపితసాదృశ్యస్య ప్రకా రతాసంబన్ధేన ధాత్వర్థేఽన్వయాదరవిన్ద సాదృశ్యప్రకారకధీవిశేష్య ఇతి. తత్రైవ సౌన్దర్యేణేతి ధర్మోపాదానే తృతీయార్థః ప్రయోజ్య త్వం ధాత్వర్థే భానే ఇవార్థే సాదృశ్యే వాన్వేతి. తేన సౌన్దర్య ప్రయోజ్యారవిన్దనిరూపితసాదృశ్యప్రకారకధీవిశేష్య ఇతి.

తథా 'గజ ఇవ గచ్ఛతి' 'పిక ఇవ రౌతి' ఇత్యాదావుపమాన పదానాం తత్కర్తృకక్రియాయాం లక్షణయా గజాదిగమనాది సదృశగమనాద్యనుకూలకృతిమానితి.

అరవిందమువలె ప్రకాశించుచున్నది—అనుచోట అరవింద నిరూపిత మగు సాదృశ్యమునకు ప్రకారతాసంబంధముచే ధాత్వర్థము నన్వయమువలన అరవిందసాదృశ్యప్రకారకధీవిశేష్యమని.

అచటనే సౌందర్యముచేత అనేధర్మమున కుపాదాన మొనర్చినపుడు తృతీయయొక్క యర్థము ప్రయోజ్యత్వము ధాత్వర్థమగు భానమునగానీ, ఇవార్థమగు సాదృశ్యమునందుగానీ యన్వయించును. దానిచేత సౌందర్య ప్రయోజ్యమగు నరవిందనిరూపిత సాదృశ్యము ప్రకారముగాగల ధీయందు విశేష్యము అని. అలా 'ఏనుగువలె పోవుచున్నాడు'— 'కోయిలవలె కూయును'— ఇత్యాదులం దుపమానపదములకు అవిచేయు క్రియలందు

లక్షణచే, ఏనుగు మొదలగువాని నడక - మొదలగువానితో సమానమైన నడక మొదలగువానికి అనుకూలమగు ప్రయత్నముగలవాడని బోధ.

నను 'ఘటో న పశ్యతి' ఇత్యత్ర ఘటాన్వితాభావస్య దర్శనే కర్మతాసంసర్గేణాన్వయవారణాయ ధాత్వర్థనిష్ఠవిశేష్యతానిరూపితప్రకారతా సంసర్గేణ శాబ్దబోధం ప్రతి విశేష్యతయా విభక్త్యర్థోపస్థితేర్హేతుత్వమ్. ఏవం చ 'గజ ఇవ గచ్ఛతి', 'పిక ఇవ రౌతి' ఇత్యాదౌ నేవాద్యర్థస్య సాదృశ్యస్య ధాత్వర్థేఽన్వయః సంభవతి, తస్మాద్గజాదిసాదృశ్యస్య గమనాదికర్తర్యేవాన్వయః, స్వగమనాది సదృశ గమనాది కర్తృత్వేన సమానధర్మేణ. ఇత్థమేవ చాఖ్యాతవాద శిరోమణివ్యాఖ్యాతృభిరపి సిద్ధాన్తితమితి చేత్; మైవమ్. 'గజ ఇవ గచ్ఛతి' ఇత్యత్ర సాదృశ్యస్య విధేయతయా ప్రతీతేరపలాపాపత్తేః. 'గజ ఇవ యః పురుషః స గచ్ఛతి', 'పురుషో యః స గజ ఇవ గచ్ఛతి' ఇతి వాక్యాభ్యాం భిన్నప్రతీత్యోరానుభవికత్వాత్. ఏవం 'వనం గజ ఇవ గృహం దేవదత్తో గచ్ఛతి' ఇత్యాదౌ వనాదేః సర్వథైవానన్వయాపత్తేశ్చ. ఏవం బిమ్బప్రతిబిమ్బభూతస్య కారకమాత్రస్యాన్వయో బోధ్యః. తస్మాద్గజనిరూపిత సాదృశ్యప్రయోజక గమనాశ్రయ ఇత్యేవ గజ ఇవ గచ్ఛతీత్యత్ర ధీః, కారకోపాదానే తూపమానపదానాం తత్కర్తృకక్రియాయాం లక్షణేత్యేవ సాధు.

అయితే—ఘటో న పశ్యతి—అనుచోట ఘటాన్వితమగు నభావమునకు దర్శనమునందు కర్మతాసంబంధముచే నన్వయమును వారించుటకై ధాత్వర్థమునందున్న విశేష్యతాసంబంధముచే నిరూపింపబడినప్రకారతాసంసర్గమున శాబ్దబోధనుగూర్చి, విభక్త్యర్థోపస్థితి విశేష్యముగా హేతువు. కాగా ఏనుగువలెపోవుచున్నాడు-కోయిలవలె గూయుచున్నాడు, మొదలైనచోట్ల ఇవాద్యర్థమగు సావృశ్యమునకు ధాత్వర్థమున నన్వయము గుదురదు. కనుక— గజాది సాదృశ్యమునకు గమనాదికర్తయందే నన్వయము. తన నడక మొదలైన వానితో సమానమైన నడక మొదలైనవానిని చేయుటయను సమాన ధర్మముచేత. ఈలాగే అఖ్యాతవాదిశిరోమణి వ్యాఖ్యానించినవారు సిద్ధాంత మొదర్చిరి అన్నచో-నలాగాదు. ఏనుగువలె పోవుచున్నాడు-అనుచోట సాదృ

శ్యము విధేయముగానగు ప్రతీతికి యపలాపము ప్రసక్తించును. ఏనుగువంటి పురుషు డెవరో అతను వెళ్లుచున్నాడు; పురుషుడెవరో అతను ఏనుగువలె నడచుచున్నాడు - అను వాక్యములనుండి వేరువేరు ప్రతీతులు అనుభవమే గదా?

ఇలాగే—"వనమునకు ఏనుగువలె దేవదత్తుడు ఇంటికి పోవుచున్నాడు" మొదలగుచోట్ల వనాదులకన్నివిధముల ననన్వయము ప్రసక్తించును.

ఇలాగే ప్రతిబింబభూతమగు కారకమాత్రమున కనన్వయ మెరుగవలెను. అందువలన గజనిరూపిత సాదృశ్య ప్రయోజకమగు గమనమునకాశ్రయుడనియే "గజ ఇవ గచ్ఛతి" యనుచోట బోధ. కారక ముపాదాన మొనర్చుచో మాత్రము ఉపమానపదములకు నా యుపమానము లొనర్చు క్రియలయందు లక్షణయనియే సాధువు.

న చ ప్రాగుక్త కార్యకారణభావస్య ధాత్వర్థనిష్ఠేత్యాదేర్వ్యభిచారః, తస్యానఙ్గీకారాత్. అఙ్గీకారే చ తూష్ణీమ్, ఆరాత్, పృథక్, ఇత్యాద్యర్థానాం ధాత్వర్థాన్వయోఽనుభవసిద్ధోఽపలపనీయః స్యాత్.

కథం తర్హి 'ఘటో న పశ్యతి' ఇత్యాదౌ 'ఘటాభావం పశ్యతి' ఇతి నాన్వయబోధః? ధాత్వర్థనిష్ఠవిశేష్యతా నిరూపిత ప్రకారతా సంసర్గేణాన్వయబోధం ప్రతి నఞ్ జన్యోపస్థితిమాత్రస్య ప్రతిబన్ధకత్వకల్పనాత్. ధాత్వర్థస్య నామార్థభిన్నత్వేన విశేషణం తు ద్వయోస్తుల్యమ్. తేన 'పాకో న యాగః' ఇత్యాదౌ న వ్యభిచారః. ఇత్యలమప్రసక్తవిచారేణ.

వెనుక జెప్పిన కార్యకారణభావమునకు, ధాత్వర్థనిష్ఠేత్యాదికి వ్యభిచారముకదా అనరాదు. దానిని యంగీకరించలేదు కనుక. అంగీకరించుచో, తూష్ణీం - ఆరాత్ - పృథక్ ఇత్యాద్యర్థములకు ధాత్వర్థాన్వయ మనుభవసిద్ధమైనది, అపలాప మొనర్పవలసివచ్చును.

ఘటో న పశ్యతీత్యాదులందు ఘటాభావమును చూచుచున్నాడను అన్వయబోధ ఏలగలుగదు ? ధాత్వర్థ నిష్ఠమగు విశేష్యతచే నిరూపితమగు ప్రకారతా సంసర్గముచే నన్వయ బోధను గురించి నఞ్ జన్యోపస్థితి మాత్రము

ప్రతిబంధకమనే గల్పింతుము. ధాత్వర్థమున నామార్థ భిన్నత్వ విశేషణమైతే ఇరువురికిని సమానము. ఇందువలన "పాకము యాగముగాదు" మొదలగు చోట్ల వ్యభిచారములేదు. కనుక అప్రసక్తమగు విచారణ చాలును,

అథారవిన్దతుల్యో భాతీత్యత్ర కథం ధీః ? తుల్యపదార్థస్య నిపాతభిన్న నామార్థత్వేన ధాత్వర్థే భేదేనాన్వయాయోగాత్. తాదృశతుల్యత్వాదేర్భానోద్దేశ్యతావచ్ఛేదకత్వే భానమాత్రవిధేయతాయాం వివక్షితార్థప్రతీతిః. న చ తుల్యపదేన తుల్యత్వప్రకారకో లక్షణయోపస్థాపితోఽస్యాభేదేన ధాత్వర్థోఽన్వేష్యతీతి వాచ్యమ్. క్రియావిశేషణత్వేనారవిన్దతుల్యశబ్దస్య నపుంసకత్వాపత్తేరితి చేత్; వ్యాకరణస్య సిద్ధానువాదకత్వేన 'స్తోకం పచతి' ఇత్యాది మాత్రవిషయత్వేన "క్రియావ్యయవిశేషణానాం క్లీబతా ఇష్యతే" ఇత్యస్యోపపత్తేః. ధాతోరేవ లక్షణయా సకలార్థబోధకత్వ మితరస్య తాత్పర్యగ్రాహకతేత్యపి కేచిత్.

అయితే—అరవిందతుల్యో భాతి – అనుచోట బోధయెట్లు ? తుల్య పదము నర్థము నిపాతభిన్నమగు నామపుటర్థము కనుక ధాత్వర్థమునందు భేదముతో అన్వయము గుదురదుగదా ? అటువంటి తుల్యత్వాదికము భానోద్దేశ్యతా నియామక మగునపుడు భానమాత్రమునకు విధేయతయందు వివక్షితమగు నర్థము అప్రతీతము, తుల్యపదముతో తుల్యత్వ ప్రకారకమైన బోధ లక్షణచే నుపస్థాపిత మగునది యభేదముచే ధాత్వర్థమున నన్వయింప బోవునుగదా ? యనరాదు. క్రియా విశేషణము గనుక అరవింద తుల్య శబ్దము నపుంసకలింగ శబ్దము గావలసివచ్చునే యన్నచో వ్యాకరణము సిద్ధానువాదమగుటచే "స్తోకం పచతి" ఇత్యాదులే దానికి విషయముగాన 'క్రియావ్యయవిశేషములకు క్లీబత యంగీకరించబడును' అనుమాట ఉపపన్నమగును. ధాతువే సకలార్థబోధ లక్షణచే నొనర్చును, ఇతరమునకు తాత్పర్యమును గ్రహింప జేయుటయేనని కొందరు.

అరవిన్దవత్సున్దరమిత్యత్ర వతేః "తేన తుల్యం" ఇతి విహితస్య సాదృశ్యవదర్థకస్య సాదృశ్యే లక్షణా. తస్య చ సున్దరపదార్థైకదేశేన సున్దరత్వేనాన్వయాదరవిన్దమివ సున్దరమిత్యత్రేవ బోధః. ఏకత్ర

శక్త్యాఽపరత్ర లక్షణయా చ సాదృశ్య ప్రతిపాదనా చ్ఛ్రౌతీత్యార్థీ చ అరవిన్దవన్ముఖమిత్యత్ర త్వరవిన్ద నిరూపిత సాదృశ్యవదభిన్నమితి.

'అరవిందవత్సుందరం'— అనేచోట వతిప్రత్యయము, "తేన తుల్యం" అని విధింపబడినది సాదృశ్యము గలదియను నర్థమున. దానికి సాదృశ్యమున లక్షణ. దానికి సుందర పదార్థపు ఏకదేశమగు సుందరత్వముతో నన్వయించుట వలన "అరవిందమివ సుందరం" అనేచోటవలె బోధ. ఒకచోట శక్తిచేతను మరొక యెడల లక్షణచేతను సాదృశ్య ప్రతిపాదనముచేలన శ్రౌతియు-ఆర్థియు నగు నుపమ. 'అరవిందవన్ముఖమ్' అనుచోట—అరవింద నిరూపిత సాదృశ్య వదభిన్నమని యచటి బోధ.

అరవిన్దవత్సౌన్దర్య మస్యే త్యత్రారవిన్దశబ్దస్యారవిన్ద సౌన్దర్య లాక్షణికతయారవిన్దసౌన్దర్యనిరూపిత సాదృశ్యాధికరణమేతత్సమ్బన్ధి సౌన్దర్యమితి ముఖారవిన్ద సౌన్దర్యయోః సాదృశ్యబోధే శాబ్దే, తయోరభేదాధ్యవసాయాదభిన్న ధర్మమూలాం పశ్చాన్ముఖారవిన్దయో రపి సాదృశ్యధీః.

అరవిన్దేన తుల్యమిత్యత్ర తృతీయార్థో నిరూపితత్వమ్. తస్య చ సాదృశ్యేన్వయాదరవిన్ద నిరూపితసాదృశ్యాశ్రయాభిన్నమితి. తథైవ సౌన్దర్యేణేతి ధర్మనిర్దేశే తృతీయార్థః ప్రయోజ్యత్వమ్. తేనారవిన్దనిరూపిత సౌన్దర్యప్రయోజ్యసాదృశ్యవదభిన్నమితి.

'అరవిందమువలె సౌందర్యము దీనికి' అనుచోట అరవింద శబ్దమునకు నరవింద సౌందర్యమున లక్షణ జెప్పి, అరవింద సౌందర్య నిరూపిత సాదృశ్యాధికరణము దీనికి సంబంధించిన సౌందర్యము అని. ముఖారవింద సౌందర్యములకు సాదృశ్యము శబ్దబోధితము. ఆ రెంటికినీ అభేదము నధ్యవసించుటవలన అభిన్నమగు ధర్మము మూలముగాగల, తరువాత, ముఖారవింద ములకుగూడ సాదృశ్య బుద్ధి యేర్పడును.

'అరవిందముతో తుల్యము'—అనుచోట తృతీయార్థము నిరూపితత్వము. దానికి సాదృశ్యమునందు నన్వయించుటవల్ల అరవింద నిరూపిత సాదృశ్యాశ్రయాభిన్నము అని. అక్కడనే సౌందర్యేణ అని ధర్మమును నిర్దేశించి నపుడు తృతీయార్థము ప్రయోజ్యత్వము. కాగా-నరవింద నిరూపిత సౌందర్య ప్రయోజ్య సాదృశ్యవదభిన్నము అని.

అరవిన్దమాననం చ సమమిత్యత్ర ప్రథమం శబ్దాత్సాదృశ్య వదభిన్నమితి బోధే పశ్చాన్మానసీ వైయఞ్జనికీ వా పరస్పరనిరూపిత సాదృశ్యస్య ప్రతీతిః ప్రసిద్ధనిరూపితసాదృశ్యస్య వా.

బిమ్బప్రతిబిమ్బభావాపన్నే తు—

'కోమలాతపశోణాభ్రసన్ధ్యాకాలసహోదరః
కుఙ్కుమాలేపనో యాతి కాషాయవసనో యతిః.

ఇత్యాదౌ కుఙ్కుమాలేపనాది విశిష్టో యతిః కోమలాతపాది విశిష్ట సన్ధ్యాకాలసదృశాభిన్న ఇతి శక్త్యా బోధే పశ్చాత్సాదృశ్య ప్రయోజకధర్మాకాఙ్క్షాయాః శ్రుతానాం కోమలాతపాదీనాముప మానోపమేయవిశేషణానాం సాదృశ్యమూలే తాదాత్మ్యాధ్యవసానే సాధారణత్వ నిష్పత్తిః.

కుఙ్కుమాలేపకషాయవసనాభ్యామయం యతిరిత్యత్ర కుఙ్కుమా లేప వసనయో రసాధారణయోరపి సాధారణత్వజ్ఞానజననద్వారా కల్పనీయసాదృశ్యనిష్పత్తి ప్రయోజకత్వాత్ప్రయోజ్యత్వేన సాదృ శ్యేఽన్వయః. ఏకదేశాన్వయః పునరేషు పక్షేష్వగతికతయాశ్రీయత ఇత్యుక్తమేవ.

'అరవిందము ఆననము సమము' అనుచోట మొదట శబ్దమువల్ల సాదృశ్యవదభిన్నము అని బోధ. తరువాత మానసమైనదిగా గానీ, వైయంజనికమైనదిగా గానీ పరస్పర నిరూపితమగు సాదృశ్యమునకు ప్రతీతి; ప్రసిద్ధ నిరూపితమగు సాదృశ్యమునకుగాని. బింబ ప్రతిబింబ భావాపన్న మునందైతే 'కోమలాతపశోణాభ్ర' ఇత్యాది స్థలములయందును, కుంకుమాలే పనాది విశిష్టుడైన యతి, కోమలాతపాదివిశిష్ట సంధ్యాకాల సదృశాభిన్నుడు అని శక్తిచేత బోధగలుగగా, తరువాత సాదృశ్య ప్రయోజకమగు ధర్మము నాకాంక్షించినపుడు వినబడిన కోమలాతపాదులకు నుపమానోపమేయ విశేషణములకు, సాదృశ్యమూలమగు తాదాత్మ్యాధ్యవసానమున, సాధా రణత్వము నిష్పన్నమగును. కుంకుమాలేప కాషాయవసనములచేత నితడుయతి, అనుచోట కుంకుమాలేప కషాయవసనములు అసాధారణములైనప్పటికిని సాధారణములు అనే జ్ఞానము గలిగించుట ద్వారమున, గల్పించవలసిన

సాదృశ్య నిష్పత్తికి ప్రయోజకమగుటవలన ప్రయోజ్యముగా సాదృశ్యమున నన్వయము. ఏకదేశాన్వయము మాత్రము ఈ పక్షములందు అగతికముగా నాశ్రయింపబడెనని చెప్పబడియే యున్నది.

సాదృశ్యస్య సమానధర్మరూపత్వేతు అరవిన్దసున్దరం వదన మిత్యత్ర లక్షణయాఽరవిన్దవృత్తి సమానధర్మః ప్రతీయతే. తస్య చాభేదేన సున్దరపదార్థైకదేశేన సున్దరత్వేనాన్వయః.

అరవిన్దమివ సున్దరమిత్యత్రారవిన్దపదార్థ ఆధేయతయా సంసర్గేణ ఇవపదార్థేన సమానధర్మేణాన్వేతి. శేషం ప్రాగ్వత్.

సౌన్దర్యేణారవిన్దేన సమమిత్యత్ర సౌన్దర్యోత్తర తృతీయయా ధాన్యేన ధనీత్యత్రేవ అభేదార్థికయా అన్యయా చ నిరూపితత్వార్థికయా సౌన్దర్యాభిన్నమరవిన్దనిరూపితం యత్సాదృశ్యం తద్వదభిన్నమితి ధీః.

క్యజర్థాచారో ధర్మమాత్రమ్. తస్యచోపమానపదేన లక్షణయోపస్థితం తన్నిరూపితసాదృశ్యం ప్రయోజకతా సంసర్గేణాభేదేన వా విశేషణమ్. విశేష్యం చాశ్రయతయోపమేయమ్. క్యజర్థాచారశ్చానురూపక్రియాదిః. ఇతి దిక్.

సాదృశ్యము సమానధర్మ రూపమైనపుడు, "అరవింద సుందరం వదనం" అనేచోట లక్షణచే నరవిందవృత్తి సమాన ధర్మము స్ఫురించును, దానికి సుందరపదార్థైక దేశమగు సుందరత్వముతో అభేదమున నన్వయము.

'అరవింద మివ సుందరం'—అనుచోట అరవింద పదార్థము నాధేయత యను సంసర్గముచే నివపదార్థముతో, సమాన ధర్మముతో, నన్వయుంచును. మిగిలినది వెనుకవలె. 'సౌందర్యముచే అరవిందముతో సమానము' అనేచోట సౌందర్యోత్తర తృతీయచే 'ధాన్యముచే ధనవంతుడు' అనుచోటవలె నభేదార్థకమగు దానిచేతను, నిరూపితత్వము నర్థముగా గల మరొకదానిచేతను సౌందర్యాభిన్నమగు నరవింద నిరూపితమైన ఏ సాదృశ్యమున్నదో అది కల దానితో నభిన్నము అని బోధ. క్యజర్థము ఆచారము, ధర్మ మాత్రము. దానికి ఉపమాన పదముచే లక్షణతో నుపస్థాపింపబడిన తన్నిరూపితమగు

సాదృశ్యము ప్రయోజకతా సంసర్గముచే గాని అభేదముచే గాని విశేషణము. విశేష్య మాశ్రయత్వముచే నుపమేయము క్యజర్థమగు నాచారము అను రూపక్రియాదులు అని దిక్.

తత్రేవాదీనాం ద్యోతకత్వమేవ న వాచకత్వమ్. నిపాతత్వా దుపసర్గవత్. ద్యోతకత్వం చ స్వసమభివ్యాహృత పదాన్తరేణ శక్త్యా లక్షణయా వా తాదృశార్థబోధనే తాత్పర్యగ్రాహకత్వేనోప యోగిత్వమితి వైయాకరణాః. ఉపసర్గాణాం ద్యోతకత్వమావశ్య కమ్. అన్యథా ఉపాస్యతేగురుః, అనుభూయతే సుఖమ్- ఇత్యాదౌ గుర్వాదేర్లేనాభిధానం న స్యాత్. ధాత్వర్థ కర్మతా విరహాత్. ఇవా దీనాంతు వాచకత్వమ్, బాధకాభావాత్. ప్రాగుక్తహేతుస్త్వ ప్రయోజకత్వాన్న సాధకః. అన్యథా అవ్యయత్వాదితి హేతునా అవ్యయమాత్రస్యైవ ద్యోతకతాపత్తిరితి నైయాయికాః.

అందులో నివాదులకు ద్యోతకత్వమేగానీ వాచకత్వము లేదు; నిపాత ములుగనుక. ఉపసర్గలకువలె. ద్యోతకత్వమనగా స్వసమభివ్యాహృతమగు మరొక పదముచే శక్తితోగానీ, లక్షణతోగానీ, అటువంటి యర్థమును బోధించుట యందు తాత్పర్యము గ్రహింపచేయునదిగా నుపయోగించుట అని వైయాకరణులు.

ఉపసర్గలకు ద్యోతకత్వమావశ్యకము లేనిచో—'ఉపాస్యతే గురుః'— 'అనుభూయతే సుఖం'—ఇటువంటి చోటులందు గురువు మొదలగువారికి లకారముచే జెప్పబడుట లేకపోవును. ధాత్వర్థ కర్మత్వము లేదు కనుక. ఇవాదులకు వాచకత్వమే ; బాధకము లేదు గనుక : వెనుక జెప్పిన హేతు వప్రయోజకము గనుక సాధకముగాదు. అట్లు గానియెడల నవ్యయత్వమను హేతువుచే నవ్యయము లన్నియు ద్యోతకములు గాపలసివచ్చును అని నైయాయికులు.

అథాస్యా శ్చమత్కారస్యాపకర్షకం యావత్తత్సర్వమపిదోషః. కవిసమయప్రసిద్ధిరాహిత్యమ్ ఉపమానోపమేయయోర్జాత్యా ప్రమా ణేన లిఙ్గసంఖ్యాభ్యాం చాననురూప్యమ్; బిమ్బప్రతిబిమ్బభావే ధర్మాణాముపమానోపమేయగతానాం న్యూనాధికత్వమ్; అనుగామి

తాయామనుపపద్యమాన కాలపురుష విధ్యాద్యర్థకత్వమ్, ఏవమాది. క్రమేణ యథా—

'ప్రఫుల్లకహ్లారనిభా ముఖశ్రీ రదచ్ఛదః కుఙ్కుమరమ్యరాగః
నితాన్తశుద్ధా తవ తన్వి వాణీ విభాతి కర్పూరపరమ్పరేవ.

తరువాత, దీనికి చమత్కారము నపకర్షము కొనితెచ్చునట్టి దంతయు దోషము. కవిసమయప్రసిద్ధి లేకపోవుట, ఉపమానోపమేయములకు జాతిచేతను ప్రమాణముచేతను లింగసంఖ్యాదులచేతను, నాను రూప్యము లేకపోవుటయు, బింబ ప్రతిబింబ భావమున ధర్మములకు నుపమానోపమేయగతములగు వాటికి హెచ్చు తగ్గులు, అనుగామితలోగుదురని కాలపురుష విధ్యాద్యర్థకత్వము ఈ రకము మొదలైనది. క్రమముగా నెట్లనగా—

'ప్రఫుల్ల' మొ. (బాగుగా వికసించిన కహ్లారముతో సమానమైనది ముఖ కాంతి, పెదవి కుంకుమవలె అందమైన ఎఱ్ఱనైన రాగము గలది. ఓతన్వీ! నీ యొక్క మాట మిక్కిలి పరిశుద్ధమై కర్పూరపరంపరవలె ప్రకాశించు చున్నది)

"మునిః శ్వేవదయం భాతి సతతం పర్యటన్ మహీమ్,
వినివృత్తక్రియాజాతః శ్వాపి లోకే శుకాయతే"
"సరసి ప్లవదాభాతి జమ్బీరం సుపచేళిమమ్,
ఆదికారణతోయౌఘు ఇవ బ్రహ్మాణ్డ మణ్డలమ్."

ఏతస్యైవ కించిత్ పదవ్యత్యాసే బ్రహ్మాణ్డస్యోపమేయతాయాం చాయ మేవ దోషః.

"ద్రాక్షేవ మధురం వాక్యం చరితం కౌముదీ యథా
సద్వైవార్ద్రాణి చేతాంసి సుధేవ సుమహాత్మనామ్"
"వామాకల్పితవామాఙ్గో భాసతే భాలలోచనః
శమ్పయా సమ్పరిష్వక్తో జీమూత ఇవ శారదః."

అత్ర జీమూతగతో భాలస్థలోచనప్రతిబిమ్బో నోపాత్త ఇతి న్యూనత్వమ్. 'భగవాన్ భవః' ఇతి కృతే తు బిమ్బస్యైవా భావాన్న ప్రతిబిమ్బాపేక్షేతి సాధు.

'మునిః' మొ. (ఈ ముని యెల్లప్పుడు భూమియంతా దిరుగుచూ కుక్కవలె ప్రకాశించుచున్నాడు. ఏక్రియలులేని కుక్క కూడ లోకమున శుకుడువలె నున్నది)

'సరసి' మొ. (సరస్సులో తిరుగుచూ బాగా పండిన నిమ్మపండు జగత్తుకు ఆదికారణమైన నీళ్ళలో బ్రహ్మాండ మండలమువలె ప్రకాశించుచున్నది.) దీనికే కొంచము పదములు వ్యత్యాసమొనర్చి, బ్రహ్మాండమునుపమేయమొనర్చినను, ఇదియే దోషము—

'ద్రాక్షేవ' మొ. (ద్రాక్షవలె మధురమైనది వాక్యము. చరిత్రము వెన్నెల వలెనున్నది. మహానుభావుల మనస్సులు యెప్పుడునూ అమృతము వలే ఆర్ద్రములు.)

'వామా' మొ. (వామ చేత కూర్చబడిన అంగముగలవాడై ఫాలలోచనుడు మెఱుపుతో కౌగిలించుకొనబడిన శరత్కాల మేఘమువలె ప్రకాశించుచున్నాడు.)

ఇచట జీమూతమునందు ఫాలస్థలోచన ప్రతిబింబ ముపాదాన మొనర్పలేదనే న్యూనత.

'భగవాన్ భవః' అని చెపితే బింబమేలేదు గనుక ప్రతిబింబమున కపేక్షయేలేదని సాధువు.

"విష్ణువక్షఃస్థితో భాతి నితరాం కౌస్తుభో మణిః
అఙ్గారక ఇవానేక తారకే గగనాఙ్గణే."

అత్ర తారకాణాం బిమ్బాభావాదాధిక్యమ్. "విష్ణోర్వక్షసి ముక్తాలిభాసురే భాతి కౌస్తుభః" ఇత్యర్థే తు నదోషః. అత్ర విశేషణయోర్ముక్తాలితారకాగణయోర్బిమ్బప్రతిబిమ్బభావేన వక్షోగగనాఙ్గణయోర్విశేషణయోర్బిమ్బప్రతిబిమ్బభావః, తన్మాలా చోపమా.

"రరాజ రాజరాజస్య రాజహంసః కరస్థితః
హేమ్నా స్తనత్రసంసక్త ఇవ పూర్ణో నిశాకరః."

అత్ర రరాజేతి ప్రతిపాద్యే భూతకాలావచ్ఛిన్నక్రియావిశేషే రాజహంసస్యాన్వయ ఇవ న నిశాకరస్యేత్యనుపపద్యమానకాలఘటితత్వం ధర్మస్య.

'విష్ణు' మొ (విష్ణు వక్షస్థలమునయున్నదై కౌస్తుభమణి అనేక నక్షత్రములుగల ఆ కాశమునందు అంగారకుడువలె మిక్కిలి ప్రకాశించును.)

ఇచట తారకలకు బింబమేలేదు గనుక న్యాధిక్యము. 'విష్ణోర్వక్షసి ముక్తాళి భాసురే భాతి కౌస్తుభః'— అని అర్థమునందైతే దోషములేదు. ఇచట విశేషణ విశేష్యములగు ముక్తాళి తారకాగణములకు బింబప్రతిబింబ భావమున వక్షో గగనాంగణములకు విశేషణములకు బింబప్రతిబింబ భావము. దాని మూలముననే యుపమ.

'రరాజ' మొ. (కుబేరుని చేతియందున్న రాజ హంస హస్త నక్షత్రముతోకూడియున్న పూర్ణచంద్రునివలె ప్రకాశించెను) ఇచట 'ప్రకాశించెను'— అని భూతకాల విశిష్టమగు క్రియా విశేషమున రాజ హంసాన్వయమువలె నిశాకరునకు కాదు, అని కుదురని కాలముతో ధర్మము ఘటితమైనది.

"రణాఙ్గణే రావణవైరిణో విభోః
శరాః సమన్తాద్జ్వలితావిరేజిరే
నిదాఘమధ్యందినవర్తినోఽమ్బరే
సహస్రభానోః ప్రఖరాః కరాఇవ"

యథావా—

"ఆగతః పతిరితీరితం జనైః శృణ్వతీ చకితమేత్య దేహలీమ్
కౌముదీవ శిశిరీకరిష్యతే లోచనే మమ కదా మృగేక్షణా."

అత్ర శృణ్వతీతి శతృ ప్రత్యాయితేన శ్రవణ సమకాలమేవ ప్రియాయా దేహల్యాగమనమిత్యర్థేనాతిశయోక్త్యాత్మనా గమితస్త్వరాతిశయస్తద్గతమౌత్సుక్యాతిశయం పుష్ణాతి. కౌముద్యుపమా తు తత్పరిపోషితం ప్రధానీభూతం ప్రియగత మౌత్సుక్యమ్. చకిత మిత్యాగమనవిశేషణమపి వస్తుతో విచార్యమాణమీక్షణవిశేషణీభవత్తస్యైవానుకూలమ్. ఇతి స్థితే భవిష్యత్కాలావచ్ఛిన్న శిశిరీకరణస్య సాధారణధర్మస్యోపమేయాన్వితత్వమివ నోపమానాన్వితత్వమ్.

'రణాంగణే' మొ. (రావణ శత్రువగు ప్రభువు యొక్క శరములు యుద్ధప్రదేశమునందు అంతటను వలితములై తీక్ష్ణములై ఎండకాలమున

మధ్యందినమునందున్న ఆకాశమునందలి సూర్యుని యొక్క తీక్ష్ణములైన కిరణములవలె ప్రకాశించినవి )

మరొకటి—'ఆగతః' మొ (భర్తవచ్చినాడని జనులు చెప్పగా విను చున్నదై భయముగా గడపవద్దకు వచ్చి నా కన్నులను యెప్పుడు కురంగ లోచన వెన్నెలవలె చల్లనివి చేయబోవును.) శృణ్వతీ—యను శతృప్రత్యయ ముచే ప్రత్యాయితమగు, విన్నపుడే ప్రియురాలు గడపలోకి రావటమని అర్థముచే, అతిశయోక్తి రూపముచే, గమితమగు త్వరాతిశయము, తద్గతమగు ఔత్సుక్యాతిశయమును పోషించును. కౌముద్యుపమ అయితే దానిచేత పరిపోషితమగు ప్రధానీభూతమైన ప్రియతమం ఔత్సుక్యమును. "చకితం" అనునది యాగమన విశేషణమైనను వస్తుతః విచారింపబడి ఈ-క్షణమునకు విశేషణీభూతమై, దానికే యనుకూలము, అని యుండగా భవిష్యత్కాల నియత శిశిరీకరణమునకు, సాధారణ ధర్మమున కుపమేయా న్వితత్వమువలె ఉపమానాన్వితత్వములేదు

"ఏతావతి మహీపాలమణ్డలేఽవనిమణ్డన
తారకాపరిషన్మధ్యే రాజన్నాజేవ రాజసే"

అత్ర క్రియాయాం సమ్బోధ్యోపమేయాన్వయ ఇవ నోపమా నాన్వయః.

"రాజేవ సమ్భృతం కోషం కేదారమివ కర్షకః
భవన్తం త్రాయతాం నిత్యం భయేభ్యో భగవాన్ భవః".

అత్ర ప్రార్థ్యమానత్రాణకర్తృత్వముపమేయే భవ ఇవోప మానయో రాజకర్షకయోర్నాస్తి, తయోస్త్రాణకర్తృత్వస్య సిద్ధ త్వాత్. యది తు త్రాయతే ఇతి ప్రార్థనానిర్ముక్తం త్రాణకర్తృత్వ ముచ్యతే తదా ధర్మస్య సాధారణత్వాన్న దోషః.

'ఏతావతి' మొ (ఓ రాజా! యింత మహీమండలమునందునూ, భూ వలయాలంకారమా! నక్షత్రముల మండలమునందు చంద్రునివలె వెలుగొందు చున్నావు.) ఇచట క్రియయందు సంబోధ్యోపమేయాన్వయమువలె నుపమానాన్వయములేదు.

'రాజేవ' మొ (సమకూర్చబడిన ధనమును రాజువలెను పంటచేనును వ్యవసాయదారుడువలెనూ నిన్ను యెల్లప్పుడూ భయములనుండి భగవానుడగు భవుడు రక్షించుగాక.) ఇచట ప్రార్థ్యమాన త్రాణకర్తృత్వము ఉపమేయము అగు భవునందువలె, నుపమానములగు రాజకర్షకులందులేదు! వారికి త్రాణకర్తృత్వము సిద్ధము గనుక. అయితే— త్రాయతే అని ప్రార్థనా నిర్ముక్త త్రాణకర్తృత్వము చెప్పబడుచో నపుడు ధర్మము సాధారణము గనుక దోషములేదు.

అథ త్రాయత ఇతి ప్రార్థ్యమానతానిర్ముక్తేఽపి త్రాణకర్తృత్వే న సాధారణత్వమ్. ప్రార్థ్యమానతాయా ఇవ విధేయతానువాద్యత్వయోర్భేదకత్వాదితి చేత్-సత్యమ్. ఇహ హి ధర్మలోపరహితాయా ముపమాయాం ధర్మవాచక శబ్దప్రతిపాద్యైః ప్రార్థనాభూతభవిష్యద్వర్తమానత్వాదిభి ర్విశేషణై ర్విశిష్టధర్మస్యోపమానోపమేయ సాధారణ్యాభావే ప్రయోజకాభావాన్నోపమా నిష్పత్తిరితి నిర్వివాదమ్. తత్ర విధేయత్వానువాద్యత్వాభ్యాం శబ్దేనానివేదితాభ్యాం విషయతాభ్యాం విశిష్టస్య ధర్మస్య యది నాస్తి సాధారణ్యం మాస్తు నామ, నహ్యుదాసీనై ర్విశేషణై ర్విశిష్టస్య ధర్మస్య సాధారణ్యమపేక్షితమ్. అపి తు ధర్మవాచకశబ్దనివేదితైః. ఏవం చన్ద్రవత్సున్దరం ముఖమిత్యత్రాపి సున్దరత్వస్యోపమానేఽనువాద్యత్వే ఉపమేయే చ విధేయత్వేఽపి న సాధారణ్యహానిః.

అయితే—

'త్రాయతే' యని ప్రార్థ్యమానతా నిర్ముక్తమైనను త్రాణకర్తృత్వము సాధారణము కాదు. ప్రార్థ్యమానతవలె విధేయతానువాద్యత్వములు భేదకములు గనుక యన్నచో సత్యము. ఇచటను ధర్మలోపము లేని యుపమయందు ధర్మవాచక శబ్దముచే ప్రతిపాద్యములగు ప్రార్థనభూత భవిష్యద్వర్తమానత్వాదులను విశేషణములచేత విశిష్టమగు ధర్మమునకు నుపమానోపమేయ సాధారణ్యాభావమున, ప్రయోజకము లేకపోవుటచే నుపమ నిష్పన్నముగాదు అని నిర్వివాదమే. అచట విధేయత్వము అనువాద్యత్వము అను, శబ్దముచేత ననివేదితములైన విషయతలతో విశిష్టమైన ధర్మమునకు సాధారణ్యము లేకపోతే పోనీయండి? ఉదాసీనములగు విశేషణములతో విశిష్టమగు ధర్మమునకు సాధారణ్య మపేక్షితము గాదు.

ఇక నేమనగా ధర్మవాచక శబ్దములచే నివేదింపబడిన వానితో. ఈలాగు— "చంద్రవత్సుందరం ముఖం"—అనుచోటనుగూడ సుందరత్వమున కుపమానములో ననువాద్యత్వము ఉపమేయమున విధేయత్వమైనను సాధారణ్యమునకు హానిలేదు.

నను—

"నీలాఞ్చలేన సంవృతమాననమాభాతి హరిణనయనాయాః
ప్రతిబిమ్బిత ఇవ యమునాగభీరనీరాన్తరేణాఙ్కః"

ఇత్యత్రోపమానే చన్ద్రే యోగమర్యాదయా భాసమానఏణరూపోఽఙ్కః ఆననరూపోపమేయవిశేషణస్యబిమ్బాభావాత్కస్య ప్రతిబిమ్బః స్యాత్? అత ఆధిక్యాపాదకతయా దోషః. న చ హరిణనయనసదృశస్య నయనస్యోపాదానాత్తస్యైవ బిమ్బస్య ప్రతిబిమ్బః స్యాదితి వాచ్యమ్, తాదృశనయనస్య బహువ్రీహ్యర్థకాన్తావిశేషణతయా ఆననావిశేషణత్వేన బిమ్బత్వాభావాదితి చేత్. మైవమ్. శబ్దేనానన విశేషణత్వేన తాదృశనయనస్యాప్రతిపాదనేఽపి కాన్తావిశేషణత్వేనైవాననవృత్తిత్వస్యాపిప్రతిపత్తేః. నహ్యాననమవిషయీకృత్య కాన్తాం విశేష్టుమీష్టే నయనమ్, అనుభవవిరోధాత్.

అయ్యా ?—'నీలాంచలేన' (నల్లని పమిట చెంగుతో సంవృతమగు హరిణనయన ముఖము యమునయొక్క గంభీరమగు నీటిలోపల ప్రతిబింబితుడగు చంద్రునివలె ప్రకాశించుచున్నది). ఇత్యాది శ్లోకమున నుపమానమగు చంద్రునందు యోగమర్యాదతో భాసించుచున్న ఏణరూపమగు నంకముఆననరూపమగు నుపమేయమనకు విశేషణమగు తన బింబము లేదుగనుక దేని ప్రతిబింబమయ్యెను ? ఇందువల్ల నాధిక్యము నాపాదించును గనుక దోషము. హరిణనయన సదృశమగు నయన ముపాదాన మొనర్చుటవల్ల దానికే బింబమునకు ప్రతిబింబ మనరాదు. అటువంటి నేత్రము బహువ్రీహ్యర్థమగు కాంతకు విశేషణముగనుక, ఆననమునకు విశేషణము కాదు కనుక, బింబత్వము లేదు గదా ? అన్నచోనట్లు గాదు శబ్దముచే నాననమునకు విశేషణముగా నటువంటినయనమును ప్రతిపాదింపకపోయినను కాన్తా విశేషణముగానే ఆననవృత్తిత్వమున్ను ప్రతీతమగును ! మొగము గోచరించకుండా కాంతను విశేషింప జాలదు గదా నయనము ? అనుభవవిరోధము గదా !

తథాపి సమభివ్యాహారవిశేషమాపన్నేన శబ్దేనాప్రతిపాదనా చ్ఛాబ్దే బోధే నాననస్య నయనవిశిష్టత్వేన విషయత్వమితిచేత్. సంస ర్గత్వే బాధకాభావాత్ స్వవిశిష్టానన సంసర్గేణ తాదృశనయనస్య కాన్తా విశేషణత్వాత్ యథాకథఞ్చిదుపమేయవృత్తితాజ్ఞానస్య బిమ్బతా ప్రయోజకత్వాత్.

అలా అయినప్పటికి సమభివ్యాహార విశేషమును పొందిన శబ్దముచే ప్రతిపాదింపబడక పోవుటవలన శాబ్దమగు బోధయందు నాననము నయన విశిష్టముగా గోచరము గాదు, అన్నచో సంసర్గమగుచో బాధకము లేదు గనుక స్వవిశిష్టానన సంబంధముచే నటువంటి నయనము కాన్తా విశేషణము గనుక. ఏలాగోలాగు నుపమేయమందున్నదను జ్ఞానము బింబతా ప్రయో జకము గనుక.

యద్వా కాన్తావిశేషణతయా తాదృశనయనయోః శాబ్దే బోధే వృత్తే పశ్చాదాననస్య తద్విశేష్యతయా వైయఞ్జనికే మానసే వా బోధే బాధకాభావాత్. ఏవం చ తాదృశవాక్యప్రయోజ్యే జ్ఞానే ఉపమేయవిశేషణతయా భానస్య తాదృశనయనస్య బిమ్బస్యసత్వాత్తే దర్థం చ చన్ద్రగతస్యైణరూపస్యాఙ్కస్య ప్రతిబిమ్బతయోపాదాన మావశ్యకమేవేతి నాధిక్యం దోషః. కవిసమయసిద్ధతయా చమ త్కారాపకర్షకత్వాభావేన లిఙ్గభేదోఽపి నాత్ర దోషః.

అథవా—తాదృశనయనములకు కాంతా విశేషణములుగా శాబ్దమగు బోధ గలినపుడు, తరువాత మొగమునకు దానికి విశేష్యముగా వైయం జనికముగానీ, మానసముగానీ, బోధయందు బాధకము లేదు గనుక. ఈ తీరుగా తాదృశవాక్య ప్రయోజ్యము నగుజ్ఞానమునందు నుపమేయ విశేషణ ముగా భానమును, తాదృశనయన రూప బింబమును నున్నది గనుక దాని కొరకు చంద్రునందున్న ఏణరూపమగు నంకమునకు ప్రతిబింబముగా నుపాదాన మొనర్చుట యావశ్యకమేనని ఆధిక్యము దోషము గాదు. కవి సమయసిద్ధమగుటచేత చమత్కారము నపకర్షింపకపోవుటచేత లింగభేదమున్ను ఇచట దోషముగాదు.

ఏవం చ కవిసమయసిద్ధతయా ప్రకారాన్తరేణ వా ప్రాగుక్తానాం దోషాణాం చమత్కారానపకర్షకత్వే నాస్త్యేవ దోషత్వమ్. యథా—

"నవాఙ్గనేవాఙ్గణేఽపి గన్తుమేష ప్రకమ్పతే
ఇయం సౌరాష్ట్రిజా నారీ మహాభట ఇవోద్భటా"

ఏవమన్యత్రాపి జ్ఞేయమ్. శేషం స్మరణాలఙ్కారప్రకరణే వికల్పప్రకరణే చ వక్ష్యామః.

ఇత్యుపమానిరూపణ సంక్షేపః.

ఇలాగే కవిసమయసిద్ధమగుటచేగాని, మరొక తీరునగానీ, వెనుక జెప్పిన దోషములకు చమత్కారము నపకర్షము కానపుడు దోషత్వము లేనే లేదు.

ఎట్లనగా—'నవాంగణే' మొ. (ముంగిటిలోకి పోవుటకైననూ క్రొత్త కోడలువలె యితడు వణుకుచున్నాడు, ఈ సౌరాష్ట్రమునందలి కాంత మహాభటునివలె ఉద్భటమైనది.) ఈవిధముగా స్థలాంతరములందు దెలియవలెను. స్మరణాలంకార ప్రకరణమున వికల్ప ప్రకరణమునను మిగిలిన విషయమంతయును దెలుపుదుము.

ఇయ్యది ఉపమానిరూపణ సంక్షేపము.

## ఉపమేయోపమా ప్రకరణమ్

అథాస్యా ఏవ భేద ఉపమేయోపమా నిరూప్యతే.

ఇపుడు ఉపమయొక్క భేదమైన యుపమేయోపమ నిరూపింతుము

ఉపమ తరువాతనే యుపమేయోపమ నిరూపించుటకు, ఇది యుపమలోని యొకభాగమగుట హేతువు. ఇందువలన నలంకార రత్నాకరకారాదులు - శోభాకరుడు మొదలగువారి మతములు త్రోసివేసినట్లైనది.

వారంతా, కల్పితోపమయే, ఉపమలోనిది భాగమన్నారు. దీనిని (ఉపమేయోపమను) అనేకాలంకారముల తరువాత నిరూపించినారు.

శోభా రుడు మొదలగువారి - ఇట్లుపమావిభాగముగా దీని నంగీక రింపనివారి, మతము లన్నిటిని త్రోసివేయుతలంపు వ్యక్తపరుపబడినది. సాదృశ్యము సుందరమైనది అనునంతవరకు, నుపమాసామాన్య లక్షణము దీని స్వరూపమునందలి విశేషమేమి? అన్యోన్య ముపమానోపమేయభావము నొందిన - అనునంతవరకు.

ఇక ఫలమునందలి విశేషము—

సమానమైన మూడవదాని నిరాకరణము తోచుట ఉపమకు నుప మానగత ధర్మము లుపమేయమునం దున్నవని తోచుట ఫలము.

ఇట నుపమానోపమేయ భావము నొందిన రెండువస్తువు లనుటయేల? అనగా నుపమాలంకారములో నుపమానము ప్రసిద్ధగుణము. ఉపమేయ మట్టిదిగాదు. ఇట రెండును సమానగుణములే. కాగా నేదియు బ్రసిద్ధగుణము గాదు. కనుక నిట నుపమానత్వము వివక్షాధీనమని వ్యంగ్యపరచు తలంపు.

తృతీయసదృశవ్యవచ్ఛేదబుద్ధి ఫలకవర్ణనవిషయీభూతం పరస్పర ముపమానోప మేయభావమాపన్నయోరర్థయోః సాదృశ్యం సున్దర ముపమేయోపమా.

"తడిదివ తన్వీ భవతీ భవతీవేయం తడిల్లతా గౌరీ" ఇత్యత్ర పరస్పరోపమాయామతివ్యాప్తివారణాయ భూతాన్తమ్. అత్ర తానవ గౌరిమభ్యామనుగామిధర్మాభ్యాం ప్రయోజితముపమాద్వయం న తృతీయం సదృశం వ్యవచ్ఛినత్తి. ఏకేన ధర్మేణైకప్రతియోగికే పరానుయోగికే సాదృశ్యే నిరూపితేఽపరప్రతియోగికస్యైకాను యోగికస్యాపి తేనధర్మేణ సాదృశ్యస్యార్థతః సిద్ధతయా శబ్దేన పునస్త దుక్తిః స్వవైయర్థ్య పరిహారాయ తృతీయసదృశవ్యవచ్ఛేదమాక్షిపతి. ప్రకృతేచైకేన తానవరూపేణ ధర్మేణ తడిత్ప్రతియోగికే కామిన్యను యోగికే సాదృశ్యేనిరూపితే తేనైవధర్మేణ కామినీప్రతియోగికస్య తడిదనుయోగికస్య సాదృశ్యస్యార్థతః సిద్ధావపి న గౌరత్వేన ధర్మేణ సిద్ధిరితి తదర్థముపాత్తస్య ద్వితీయసాదృశ్యవచనస్య న తృతీయ సదృశవ్యవచ్ఛేదఫలకత్వమ్.

మూడవ సదృశవ్యవచ్ఛేదబుద్ధిఫలకమగు వర్ణనమునకు విషయీ భూతమై యన్యోన్యము ఉపమానోపమేయభావమును పొందిన, రెండువస్తువుల యొక్క సాదృశ్యము - సుందరమైనది ఉపమేయోపమ.

ఈ సాదృశ్యము వర్ణించుటవలన, ఈ రెంటికి మూడవ దేదియును సమానముగాదన్న బుద్ధి ఫలింపవలయును.

"తటిదివ తన్వీ భవతీ భవతీవేయం తటిల్లితా గౌరీ—"

"నీవు మెఱుపువలె పలుచనిదానవు - మెఱుపు, నీవలె గౌరవర్ణము గలది" — అనుచోటను పరస్పరోపమయం దతివ్యాప్తి నివారించుటకై భూతాంతము. మూడవ దేదియు సమానముగాదన్న బుద్ధి ఫలింపరలెను. అన్నాము.

ఇచట పలుచదనము - గౌరవర్ణము - అనుగామి ధర్మములు; వానినుండి యేర్పడిన, ఈ రెండుపనులు వర్ణించుటవలన, మూడవది సమానమైనది లేదు— అను బుద్ధి ఫలింపదు. అనగా నట్టిఫలం పేర్పడదు. ఒకదానితో-మెఱుపుతో-పోలిక, మరొకదానియందు—, వనితయందు, నొక ధర్మముతో నిరూపింపగా, మరొకదానితోడి, పోలిక, మొకటి దానియందునా ధర్మముతో నర్థసిద్ధమే, కనుక, తిరిగి దానిని మాటలతో చెల్పుట వ్యర్థము- అపుడది యనర్థమైపోకుండా నీరెంటితో సమానమైన మూడవవస్తువే లేదని తోచునట్లే చేయును.

అయితే—

ప్రకృతములో పలుచదనమను నొకధర్మముతో మెఱుపుతో సామ్యము వనితయందు, నిరూపించగా నాధర్మముతోనే వనితతో సామ్యము, మెఱుపునందు నర్థసిద్ధమైనది. ఆ సామ్యము గౌరత్వమను ధర్మముతో సిద్ధింపదు. కనుక నందుకై స్వీకరింపబడిన రెండవ సాదృశ్యపువర్ణనము, మూడవ సమానవస్తువుయొక్క వ్యవచ్ఛేదమును నిరాకరణను - స్ఫురింపజేయదు

"సదృశీ తవ తన్వి నిర్మితా విధినా నేతి సమస్తసమ్మతమ్
అథచేన్నిపుణం విభావ్యతే మతిమారోహతి కౌముదీ మనాక్"

ఇతి తృతీయసదృశవ్యవచ్ఛేదఫలకవర్ణనవిషయే సాదృశ్యేఽతి వ్యాప్తి వారణాయ పరస్పరమితి. లిఙ్గవచన భేదాది దుష్టసాదృశ్యవారణాయ సున్దరమితి. అథేయముదాహ్రియతే—

"కౌముదీవ భవతీ విభాతి మే కాతరాక్షి భవతీవ కౌముదీ
అమ్బుజేన తులితం విలోచనం లోచనేన చ తవామ్బుజం
సమమ్".

"సదృశీ" ఇత్యాది శ్లోకమున "ఓ తన్వీ? నీతోసమానమైనది బ్రహ్మ నిర్మించలేదని, అందరు నొప్పెదరు అయితే సూక్ష్మముగా విచారించినచో వెన్నెల కొంచము బుద్ధికెక్కును."

అని సాదృశ్యమును వర్ణించుటలో మూడవదిసమానములేదని బుద్ధిగల్గును. ఆ సాదృశ్యమున నతివ్యాప్తి నివారించుటకై "అన్యోన్యము"—అంటిమి.

లింగవచనములు వేరగుట, మొదలగు దోషములంటిన సాదృశ్యమును, వారించుటకై "సుందరమైనది" అని అన్నాము.

ఇక నిదిగో నుదాహరింతుము.

"కౌముదీవ" మొ.[1] (ఓ బిత్తరిచూపుల పిల్లా? నీవు నాకు వెన్నెల వలె తోచుచున్నావు వెన్నెలయు నీవలెతోచుచున్నది, నీ లోచనము తామర పూవువలె దోచుచున్నది. తామరపువ్వు నీలోచనమువలె తోచుచున్నది)".

---

1. నాగన్న ఇక్కడకూడ మరల మెలిక వేసుకొనెను. ఇచట - తులితం - సమం - అని సాదృశ్యవాచకములు రెండును వేరగనుక ముందు మూలముతో జెప్పబోవు క్విప్ - క్యజాదులవలె దోషమనెను. ఇది సరిగాదు - శ్రౌతత్వ - ఆర్థత్వములనుగూర్చి వాచకముల వైలక్షణ్యము - దోషము. ఇట్టిదేది? అయితే - క్విప్ - క్యజ్‌లగూడ అట్టివైలక్షణ్యము లేదుగదా? దోషమనుటెట్లు? కమలతి - వదనాయతే - అనుచోట వైలక్షణ్యము ప్రత్యయముల దర్శనాదర్శనములు సహృదయోద్వేజకమైన దోషము,
అట్లే - ఇచట నెట్టి సహృదయోద్వేగమును గల్గదుగదా? దోషలేశ మునులేదు! దీనివివరణ మిది, "క్విప్ సర్వతోపి క్యజ్" ఆయారూపముతో గన్పడును.
ఇక నర్థవిషయములో క్విప్ పూర్తిగా లోపించును. గనుక నది తన యర్థమును బోధింపజాలదు. క్విబంతము ప్రకృతితో సాదృశ్యమునుపలక్షిం

ఇయం చ తావద్ద్వివిధా — ఉక్తధర్మా వ్యక్తధర్మా చ. ఉక్తధర్మా తావదనుగామ్యాదిభిః ప్రాగుక్తైర్ధర్మైరనేకధా. అనుగామీ ధర్మో యథా—

"నిఖిలే నిగమకదమ్బే లోకేష్వప్యేష నిర్వివాదోఽర్థః
శివ ఇవ గురుర్గరీయాన్ గురురివసోఽయం సదాశివోఽపితథా"

ఇది రెండు విధములు—

ధర్మమును వాచ్యమొనర్చునది, వ్యంగ్యమొనర్చునదియు. వెనుక జెప్పబడిన యనుగామి మొదలగు ధర్మములతో ఉక్తధర్మ అనేకవిధములు.

అనుగామి ధర్మ మెట్లనగా—

"నిఖిలే" మొ. "వేదముల సమూహమునం దంతటను, లోకములోను గూడ నీ విషయమున వివాదములేదు. శివునివలె గురువు గొప్పవాడు ఆ యీ సదాశివుడుగూడ గురువువలె గొప్పవాడు"—

---

చును. క్యజ్ - అట్లుగాదు. అది తనయర్థమును. నాచారమును బోధింప గల్గును. లోపించినను "క్విప్" స్మరింపబడి తనయర్థమైన యాచారమును దెల్పగల్గునన్న పక్షములో లుప్తస్మరణము, తరువాతనే-అనగా వ్యవధాన ముతోనే-అర్థమును బోధింపగల్గును. క్యజ్-అట్లుగాను. వ్యవధానము లేకనే ఎదుట నుండి తన యర్థమునుబోధింపగల్గును, ఇట్టి వైలక్షణ్యము క్విప్-క్యజ్-లకు శబ్దగతముగా నర్థగతముగా నున్నది. ప్రకృతములో సమ-తులిత-అనువదముల కడ, నట్టి వైలక్షణ్యము లేదు. వర్ణముల బట్టి వైలక్షణ్యము వైయాకరణుల కాశంకనీయమేగాదు.

అట్లగుచో

సుధాసముద్రం తవ రమ్యవాణీ
వాచం క్షమా చంద్ర సుధాసముద్రః

అనుదానిలో గూడ వాణీ-వాచం-అను వైలక్షణ్యమున్నది, గనుక దోషమనవలసివచ్చును.

ఇట్లే స్థలాంతరముల యందును గమనింపవలెను-కనుక నుపాత్తములగు నుపమానోపమేయ వాచకములకడ ప్రతీతి వైలక్షణ్యము వలన ప్రతీతి ధారాభంగము గలుగకుండ జూచుకొనుటయే యత్యావశ్యకము.ఆవైలక్షణ్యము-సమ-తులితపదములకడ లేదుగనుక ప్రతీతి ధారాభంగము రాదు. క్విప్-క్యజ్-లకడ నది యున్నది. కనుక నది దోషము. దీనిని గ్రహింపని నాగన్నకు మెలికదుష్టమని మరొకరు చెప్పవలెనా ?

బిమ్బప్రతిబిమ్బ భావమాపన్నో యథా—

"రమణీయ స్తబకయుతా విలసితవక్షోజయుగలశాలిన్యః"
లతికా ఇవ తా వనితా వనితా ఇవ రేజిరే లతికాః"

అత్రరమణీయత్వవిలసితత్వాభ్యాం విశేషణాభ్యాం యుతత్వ శాలిత్వాభ్యాం చ విశేష్యాభ్యాం పరస్పరం వస్తుప్రతివస్తుభావ మాపన్నాభ్యాం పుటితః స్తబక స్తనరూపః పరస్పరం బిమ్బప్రతిబిమ్బ భావాపన్నో ధర్మః.

బింబప్రతిబింబభావము నొందిన ధర్మ మెట్లనగా—

"రమణీయ" మొ. "వనితలు అందమైన పూలగుత్తులతోగూడిన లతలవలెను, లతలు విలసిల్లు గుచయుగ మొప్పు వనితలవలెను ప్రకాశించెను". ఇచట అందమైన - విలసిల్లు - అను విశేషణములును, కూడిన - ఒప్పు - అను విశేష్యములును వస్తుప్రతివస్తుభావమునొంది, ఇరుప్రక్కల గ్రమ్మియుండగా స్తబకములును స్తనములును, తీరు ధర్మము - బింబప్రతిబింబభావమునొంది నది.

ఉపచరితో యథా—

"కులిశమివ కఠినమసతాం హృదయం జానీహి హృదయ
మివ కులిశమ్
ప్రకృతిః సతాం సుమధురా సుధేవ హి ప్రకృతిరివ చ సుధా."

కేవల శబ్దాత్మకో యథా—

"అవిరతిచిన్తో లోకే వృక ఇవ పిశునోఽత్ర
పిశున ఇవ చ వృకః.
భారతమివ సచ్చిత్తం సచ్చిత్తమివాథ భారతం సకృపమ్."

వ్యక్త ధర్మో యథా—

"వారిధిరాకాశసమో వారిధిసదృశ స్తథాకాశః,
సేతురివ స్వర్గఙ్గా స్వర్గఙ్గేవాన్తరా సేతుః."

అత్రాపారత్వాదిర్వ్యజ్యమానో ధర్మః. ఏషా సర్వాఽపి స్ఫుటె వాక్యభేదే ప్రపఞ్చితా.

ఉపచరితమైన ధర్మ మెట్లన—

"కులిశమివ" మొ. (చెడ్డవారికునసు వజ్రమువలె కఠినము, మనసు వలె వజ్రము గఠినము అని తెలియుము. సజ్జనులస్వభావము నమృతమువలె మిక్కిలి మధురము. ఆ యమృతమును సజ్జనుల స్వభావమువలె మిక్కిలి మధురము).

కేవల శబ్దైకరూప మెట్లనగా—

'అవిరత' మొ. (లోకములో కొండెగానికి తోడేలుకువలె నవిరత చింతయే. తోడేలుకన్నా కొండెగానికివలె నవిరతచింతయే. అనగా తోడేలుకు గొఱ్ఱెలం దవింతా సక్తమైనచింత. కొండెగాని కవిరత – ఎడ తెగని చింత – (ద్రోహతలంపు). ఇక సజ్జనులమనసు భారతమువలె సకృపము. భారతముకూడ సజ్జనుః మనసువలె సకృపము. భారతములో గృపాచార్యు లున్నారు. సజ్జనుల మనసులో గృపయున్నది.

వ్యక్తధర్మ మెట్లనగా—

"వారిధిః" మొ. (సముద్ర మాకాశముతో సమముగానున్నది. ఆకాశము సముద్రముతో సమముగానున్నది ఆకాశగంగ సేతువువలె నున్నది. సేతువాకాశగంగవలె నున్నది."

ఇచట అపారత్వము మొదలగునది వ్యంగ్యమగుధర్మము. ఇదియంతయు వాక్యభేదము స్ఫుటముగా నుండునపుడు విస్తరించి చూపబడినది.

అర్థేతు వాక్యభేదే—

"అభిరామతాసదన మమ్బుజాననే
నయనద్వయం జనమనోహరం తవ
ఇయతి ప్రపఞ్చ విషయేఽపి వైధసే
తులనాముదఞ్చతి పరస్పరాత్మనా."

అత్ర పరస్పరాత్మనా తులనాముదఞ్చతీతి సంక్షిప్తాద్వాక్యా దిదమేతే నైతచ్చానేన తులనాముదఞ్చతీతి వాక్యద్వయం విచారక ముల్లసతి. ఏవం పూర్ణాలుప్తాదయోఽప్యస్యా ఉపమాయా ఇవ ప్రాయశః సర్వేఽపి భేదాః సమ్భవన్తి, తేచాముయైవ చ దిశా సుబుద్ధిభిరున్నేతుం శక్యా ఇతి నేహ నిరూప్యన్తే.

-వాక్యభేదమర్థసిద్ధమగునపు డెట్లనగా—

"అభిరామతా" మొ. "కమలముపంటి మోముగల యోపిల్లా, చక్కదనమున కిక్కయై లోకుల మనసుల నాకర్షించు నీకనులజంట బ్రహ్మ నిర్మించిన యింతటి ప్రపంచములోను పరస్పరము పోలికతోనున్నది".

ఇచట పరస్పరము పోలికగానున్నదని సంగ్రహముగా నున్న వాక్యమునుండి దీనితో నది సమముగనున్నది, దానితో నిది సమముగనున్నది అని ఆలోచనగల్గించు రెండువాక్యములు బయటపడును. ఇట్లు పూర్ణ, లుప్త మొదలగు భేదములన్నియు నుపమకువలె సామాన్యముగా దీనికికూడ సంభవించును. అవియన్నియు నీ త్రోవనే విజ్ఞు లూహించగలరని ఇచట నిరూపించము.

చిత్రమీమాంసాకృతస్తు ప్రాచీనం లక్షణమవ్యాప్త్యతివ్యాప్త్యాది భిర్దూషయిత్వా—

అన్యోన్యేనోపమా బోధ్యా వ్యక్త్యా వృత్త్యన్తరేణ వా
ఏకధర్మాశ్రయా యాస్యాత్సోపమేయోపమా మతా"

ఇతి స్వయం లక్షణమాహుః. అస్యార్థః సంక్షేపేణ సపద కృత్యన్తదు క్తరీత్యా సహృదయానాం సౌకర్యాయోచ్యతే. అన్యో న్యేనేతి. అన్యోన్యప్రతియోగిత్వ విశిష్టా వ్యక్త్యా వ్యఞ్జనావ్యాపారేణ వృత్త్యన్తరేణ శక్త్యావా బోధ్యా వేద్యా ఏకధర్మాశ్రయా ఏకధర్మ ప్రయోజ్యా యా ఉపమా సా ఉపమేయోపమా మతేత్యన్వయః. అన్యోన్యేతి విశేషణాదిదం తచ్చ సమమిత్యుభయవిశ్రాన్తోపమాయా నిరాసః. అత్రానోన్యప్రతియోగికత్వస్య వ్యఞ్జనవ్యాపారమాత్ర గమ్యత్వేనోపమాయాశ్చ శక్తివేద్యతయా పరస్పరనిరపేక్షైకేన వ్యాపారేణానోన్యప్రతియోగికత్వవిశిష్టాయాస్తస్యా అబోధనాత్; పరస్పరనైరపేక్ష్యస్యాత్ర వాకారేణాభిధానాత్. ఏకధర్మాశ్రయేతి విశేషణాత్ 'రజోభిర్భూరివద్యౌర్ఘనసన్నిభైర్గజైశ్చ ద్యౌరివ భూః' ఇతి కస్యచిత్పద్యస్యార్థే పరస్పరోపమాయాంనాతివ్యాప్తిః, తత్రో పమాప్రయోజకధర్మైక్యాభావాత్ భూతలోపమానికాయాం ప్రయో జకస్య రజసామనుగామిధర్మస్య, నభస్తలోపమానికాయాం ప్రయోజ

కస్య ఘనసదృశగజానాం బిమ్బప్రతిబిమ్బభావాపన్నధర్మస్య చ భేదాత్. వ్యక్త్యేతి చ విశేషణం వ్యంగ్యోపమేయోపమానజ్గ్రిహార్థమితీద ముపమేయోపమాత్వప్రయోజకం లక్షణమితి.

చిత్రమీమాంసాకారులైతే ప్రాచీనలక్షణమును అవ్యాప్తి అతివ్యాప్తులతో దూషించి స్వయముగా 'అన్యోన్యేన' ఇత్యాది లక్షణమును జెప్పిరి.

ఈ శ్లోకపుటర్థము, వారు చెప్పినతీరుననే లక్షణములోని పదముల యుపయోగముతోగూడ సహృదయుల సౌకర్యమునకై జెప్పబడును.

అన్యోన్య-అని ఒకదానితో నొకదానికి ఇట్లు పరస్పరము, వ్యక్త్యా = వ్యంజనా వ్యాపారముతో, వృత్త్యంతరేణ వా = శక్తితోడనుగాని, బోధ్యా = తెలియదగినది, ఏకధర్మాశ్రయా = ఒకేధర్మముతో ప్రయోగింప బడినట్టి యుపమ, ఉపమేయోపమగా - మతా = సమ్మతమైనది. అని అన్వయము. ఇట్లు ఒకదానితో నొకదానికి, పరస్పరము, అని విశేషించుట వలన 'ఇదియు నదియు సమానము' అను నుభయ విశ్రాంతోపమయం దతి వ్యాప్తి తొలగును. ఎట్లనగా - లక్షణములోని 'వా' కారము వ్యంజనకును శక్తికిని పరస్పరము నిరపేక్షతను దెల్పును. ప్రకృతలక్ష్యములో నిదియు - నదియు, సమానమనుచోట "పరస్పరము" అను నర్థము, వ్యంజనచే లభించును. సామ్యమభిధచేలభించును. గనుక నిట వ్యాపారాన్తరము నపేక్షలేని వ్యాపారము అన్యోన్య ప్రతియోగికత్వవిశిష్టమగు ఉపమను బోధించుటలేదు. కనుక నిది లక్షణము ప్రసక్తింపదు. ఏకధర్మాశ్రయా - ఒకేధర్మముతో ప్రయోగింపబడినది, అను విశేషణమును ప్రయోగించుటవలన—

"రజోభిః స్యందనోద్ధూతైః గజైశ్చ ఘనసన్నిభైః
భువస్తలమివ వ్యోమ కుర్వన్వ్యోమేవ భూతలం.

దుమ్ముతో నేలవలె ఆకాశము, మబ్బులవంటి ఏనుగులతో నాకాశము వలె నేలయు, అను నొకానొకకవి (కాళిదాసు) పద్యార్థములోని పరస్పరోపమయందు నతి ప్రసక్తిరాదు. ఇట నుపమను ప్రయోగించునట్టిధర్మము, ఒక్కటికాదుగదా? నేల యుపమానముగానుండు ఉపమయందు ప్రయోజకమగు రజోరూపానుగామిధర్మమును, నభస్తలముపమానముగాగల ఉపమయందు ప్రయోజకమగు ఘనసదృశ గజరూప బింబప్రతిబింబ భావాపన్నధర్మ

మును భిన్నమైనవికాఁబట్టి. ఇక వ్యంజనావ్యాపారముతో నని విశేషించుట వలన వ్యంగ్యమైన యుపమేయోపమ సంగృహీతమైనదికాఁగా ఇది యుపమేయోపమకుఁ బ్రయోజకమగు లక్షణము – అనిరి.

తన్న,

"అహం లతా యాః సదృశీత్యఖర్వం
గౌరాఙ్గి గర్వం న కదాపి యాయాః,
గవేషణేనాలమిహాపరేషా
మేషాపి తుల్యా తవ తావదస్తి."

అత్రాన్యోన్యప్రతియోగికత్వవిశిష్టాయా ఉపమాయాస్తనుత్వాదిరూపైకధర్మాశ్రయాయా వృత్త్యన్తరేణ శక్త్యా బోధనాదుపమేయోపమాత్వాపత్తేః. న చాత్రాన్యోన్య ప్రతియోగికత్వముపమాయాం న ప్రతీయతే; లతాదిసమ్బన్ధిసాదృశ్యాశ్రయత్వస్యైవాస్మత్పదార్థేఽన్వయాదితి వాచ్యమ్. "ముఖస్య సదృశశ్చన్ద్రశ్చన్ద్రస్య సదృశం ముఖమ్" ఇత్యుపమేయోపమాయామవ్యాప్తేః.

అది సరిగాదు – ఏమంటే.

"అహం లతాయాః" (నేను తీవెకు సమురాలనని మిక్కిలి గర్వము నెన్నడు నొందకుము. ఓ గౌరాంగీ, వేరే వెదకుటయెందుకు? ఈతీవకూడ నీకు సమానముగా నున్నదిగదా?) ఇత్యాది శ్లోకమున పరస్పరము ప్రతియోగికత్వముతోగూడిన, నుపమకు తనుత్వరూప ఏకధర్మాశ్రయమగునది, వృత్త్యంతరమగు శక్తిచేబోధితమగుటవలన నిదియు నుపమేయోపమగావలసి వచ్చును.

అదికాదయ్యా;

ఇచట యుపమయందు పరస్పరము ప్రతియోగికత్వము స్ఫురించుట లేదు. లతాది సంబంధిసాదృశ్యాశ్రయత్వమే అస్మత్పదార్థమం దన్వయించుచున్నది; అనరాదు. అట్లన్నచో—

"మొగమునకు సముడు చంద్రుడు – చంద్రునకు సమానము మొగము" అను ఉపమేయోపమయం దతివ్యాప్తి వచ్చును.

నహి "అహం లతాయాః" ఇత్యత్రోపమేయోపమాభవితు మర్హతి. గర్వమాత్రనిరాసపరత్వేనోత్తరార్ధోపమాయా స్తృతీయ సదృశవ్యవచ్ఛేదాప్రతిపత్తేః. అతఏవాన్యాన్యపి తవ సదృశాని సన్త్యేవ, తేషాం గవేషణేనకిం ఫలమిత్యేతదర్థకం గవేషణేన్యేత్యుత్తరార్ధం సంగచ్ఛతే. తృతీయ సబ్రహ్మచారి వ్యవచ్ఛేదో హ్యుపమాజీవితమిత్యాలఙ్కారిక సిద్ధాన్తః, అన్యథా "భువ స్తలమివ వ్యోమ కుర్వన్వ్యోమేవ భూతలమ్" ఇత్యత్రాప్యుపమేయోపమాత్వనివారణవైయర్థ్యాపత్తేః.

"అహం లతాయాః"—అనుచోట నుపమేయోపమగాదుగదా? ఉత్తరార్ధమునందలి ఉపమ గర్వనిరాసమాత్ర పరమగుటచే, దానివలన మూడవ సమానవస్తువులేదని తెలియరాదు. కనుకనే నీలాంటి వింకను మరికొన్ని యుండనేయున్నవి. వాని వెదకుటలో లాభమేమి? అనునర్థము దెల్పు గవేషణేన అను ఉత్తరార్ధము సరికుదురును. సమానమైన మూడవవస్తువు నిరసించుటయేకదా ఉపమేయోపమకు జీవితము అని ఆలంకారికుల సిద్ధాంతము?

అట్లుగానిచో.

"భూమివలె నాకాశమును ఆకాశమువలె భూమియును జేయుచు"—అనుచోట నుపమేయోపమ కాదని నిరసించు ప్రయాసము నిరర్థకమే గావలసి వచ్చును.

న చ తృతీయ సదృశవ్యవచ్ఛేదఫలకత్వముపమా విశేషణం వాచ్యమ్. విశేషణాన్తరవైయర్థ్యాపత్తేః. విశేషణవ్యావర్త్యానామాధునికవిశేషణేనైవ వారణాత్. అన్యోన్యప్రతియోగికత్వవిశిష్టా ఉపమా ఏకవృత్తిమాత్రవేద్యేత్యయుక్తమేవ. 'ఖమివ జలం జలమివ ఖమ్' ఇత్యాదౌ ఖజలయోః సాదృశ్యాన్వయే ప్రతియోగిత్వస్య సంసర్గత్వేన వృత్త్యవిషయత్వాత్. వృత్తివేద్యానాం పదార్థానాం సంసర్గో వృత్తివేద్య ఇత్యభ్యుపగమాత్. అన్యథా ప్రకారతాపత్తేః

మూడవ సమానవస్తువును నిరాకరించుట ఫలముగాగల అని యుపమ విశేషింతుము - అనరాదు. అప్పుడైతే విశేషణాంతరములు వ్యర్థములు గావలసివచ్చును. వాటినుండి గావలసిన వ్యావృత్తి దీనినుండియే యేర్పడును

గదా? "అన్యోన్య ప్రతియోగికత్వముతోఁడి యుపమ ఒకవృత్తిమాత్రము చేతనే తెలియబడవలెను." అనుట యుక్తయుక్తమే.

"ఆకాశమువలె నీరు - నీరువలె ఆకాశము" ఇత్యాదులందు నాకాశము నీరులకు సాదృశ్య మన్వయించునపుడు, ఆకాశములో - నీటిలోను అనునర్థము సంబంధము - ప్రతియోగిత్వసంబంధము వృత్తి - (శక్తి) నుండి తెలియరాదుగదా? వృత్తిలో దెలియుపదార్థముల సంబంధము వృత్తి వలన దెలియరాదు అని అంగీకరించిరిగదా? అట్లుగానియెడల (ఆ సంబంధము) ప్రకారము గావలసివచ్చును 1

యదప్యలఙ్కారసర్వస్వకృతోక్తం—"ద్వయోః పర్యాయేణ తస్మిన్నుపమేయోపమా. తచ్ఛబ్దేనోపమానోపమేయత్వప్రత్యవమర్శః. పర్యాయో యౌగపద్యాభావః. అతఏవాత్ర వాక్యభేదః" ఇతి తన్న. అత్ర ద్వయోరితి వ్యర్థమ్. ఏకస్యోపమానోపమేయాత్మకత్వే 'గగనం గగనాకారమ్' ఇత్యాదౌ వాక్యభేదాభావేన పర్యాయాభావాదేవాప్రసక్తేః.

యది చ స్ఫుటత్వార్థముపమానోపమేయత్వయోగ్యతా సమ్పాదకలిఙ్గవచనభేదరాహిత్యప్రతిపత్త్యర్థం కవిసమయసిద్ధిస్ఫోరణార్థం

1. వివరణము

వృత్తిలోగానీ శక్తిలక్షణములలోగానీ. ఇక్కడ నాగన్న తీగమెలికలు బడుచున్నాడు. పై లక్షణశ్లోకమున ఒకటి ఒకవృత్తిమాత్రముతో దెలియదగియుండుట దాత్పర్యముగాదట. ఇక నేమంటే - రెండవ వృత్తిలో దెలియరాకుండుట వ్యక్త్యా వృత్త్యంతరేణవా బోధ్యా - అనే వాక్యానికి తాత్పర్యమట. తలకాయయున్నవా డెవ్వడు అట్లనడు. విధి "బోధ్యా" యని గన్పడుతుంటే నిషేధమున యబోధ్యత్వము తాత్పర్యమెట్లగును? వ్యంజనావృత్తిజన్యబోధలో నెట్లో భాసించుటయే - వ్యక్త్యావృత్త్యంతరేణవాబోధ్యా - అనేదాని కర్థమట. ఇదియు పైవలెనే నవప్రసంగమే. ఏమంటే - బోధ్యా అనేదానికి ఉపమతో నన్వయము. ఇపుడెట్లో వృత్తిజన్యతలో భాసించుట? అది దేనికన్వయము? ఉపమకా? కుదురదు - ఉపమాబోధశక్తి జన్యమైనచో లోపల సహజముగానే భాసించును. కనుక - ఎట్లెట్లో - అనుట కవకాశములేదు. అతివ్యాప్తిగానీ, అవ్యాప్తిగానీ దీని వల్ల వారింపబడదు.

వా ద్వయోరితి గ్రహణం స్యాత్, అథాపి ప్రాగుదీరితే 'అహం లతాయాః సదృశీత్యఖర్వమ్' ఇతి పద్యే ప్రతిపాద్యాయాముపమాయా మతివ్యాప్తేః.

"తద్వల్గునా యుగపదున్మిషితేన తావ-
త్సద్యః పరస్పరతులామధిరోహతాం ద్వే.
ప్రస్పన్దమానపరుషేతరతారమ న్త-
శ్చక్షు స్తవ ప్రచలితభ్రమరం చ పద్మమ్".

ఇతి కాలిదాసపద్యే ప్రతిపాద్యాయాముపమానోపమేయయో ర్యుగపదుపమేయోపమానభావాయాముపమేయోపమాయాం వాక్య భేదాభావాదవ్యాప్తేశ్చ.

అలంకార సర్వస్వకారుడన్నదియు దగదు. అతడన్న దిది - రెంటికది క్రమముగానున్నపుడు అది యుపమేయోపమ - అని. తచ్ఛబ్దముచే నుప మానోపమేయత్వము పరామర్శింపబడినది. క్రమము అనగా నొక్కసారే గాకుండుట, ఇందువలననే వాక్యభేదమని - ఇదంతయును దప్పే?

ఇక్కడ రెంటికి అని అన్న దెందుకు?

ఉపమానోపమేయభావము ఒకదానికే ఉండు "గగనం గగనాకారం" ఇత్యాదులందు వాక్యభేదము లేదుగనుకనే పర్యాయము - క్రమము సంభ వింపదు కాన నట నతివ్యాప్తిరాదు. కనుక రెంటికి అనునది నిరర్థకము.

అయితే - స్పష్టముగా దెలియుటకు, లింగవచనభేదములవలన నుపమా నోపమేయములగునట్టి యోగ్యత చెడిపోవును గనుక నవిలేకుండవలెను, అది తెలియుటకుగానీ, కవిసమయప్రసిద్ధిని స్ఫురింపజేయుటకుగానీ, రెంటికిని గ్రహణము, అనియన్నచో, నట్లైననూ - వెనుకజెప్పబడిన—

"అహం లతాయాస్సదృశీత్యఖర్వం"— అనుపద్యమున జెప్పబడు నుపమయం దతివ్యాప్తి యేర్పడును.

"తద్వల్గునా" (అందమైన ఒక్కసారిగానే తెఱువబడుటచే వెంటనే పరస్పరము ఒకదానితో నొకటి సామ్యము అధిష్ఠించునుకాత, అవి

యేమనగా లోపలకదలుచున్న అపరుపమైన కనుపాపగల కనులును బాగా కదులుచున్న తుమ్మెదలుగల పద్మములున్నా) ఇత్యాది కాళిదాసపద్యములో ప్రతిపాదింపబడు నుపమేయోపమయం దతివ్యాప్తి తప్పదుకూడా.

ఏమంటే?—

అక్కడ నుపమానోపమేయములకొక్కసారే ఉపమానోపమేయభావ మున్నది. వాక్యభేదము లేదుగదా?

నచాత్రాపాతతః శబ్దైక్యేఽపి పర్యవసితో వాక్యభేదోఽస్తీతి వాచ్యమ్, తథాపి—

"సవితా విధవతి విధురపి సవితరతి దినన్తి యామిన్యః
యామినయన్తి దినాని చ సుఖదుఃఖవశీకృతే మనసి."

ఇతి కస్యచిత్కవేః పద్యే పరస్పరోపమాయామతివ్యాప్తేః న చేయముపమేయోపమేతి శక్యతే వక్తుమ్. సుఖసమయే దుఃఖదోఽపి సుఖయతి దుఃఖ సమయేచ సుఖదోఽపి దుఃఖయతి ఇత్యేతావన్మాత్రస్యార్థస్య వివక్షితత్వా త్తృతీయసదృశ వ్యవచ్ఛేదాప్రతిపత్తేః. ఏవమ్—

"రజోభిః స్యన్దనోద్ధూతైర్గజైశ్చ ఘనసన్నిభైః
భువస్తలమివ వ్యోమ కుర్వన్ వ్యోమేవ భూతలమ్"

ఇత్యత్ర పరస్పరోపమాయా మతివ్యాప్తిః. సదృశాన్తరవ్యవచ్ఛేదఫలకత్వేన వివక్ష్యమాణే తు తస్మిన్నస్మదుక్త ఏవ పర్యవసానమ్.

అదికాదయ్యా?

ఇక్కడ పైకి వాక్యమొకటిగానే కన్పడుచున్నను పర్యవసానమునందు భేదమున్నదనరాదు.

"సవితా" (సూర్యుడు చంద్రుడగుచున్నాడు. చంద్రుడు సూర్యుడగుచున్నాడు రాత్రులు పగళ్లు అగుచున్నవి. సుఖదుఃఖములకు లోపడిన మనస్సునందు పగళ్లు రాత్రులగుచున్నవి.) అను నొకానొక కవిపద్యమునందు పరస్పరోపమయం దతివ్యాప్తివచ్చును, ఇది యుపమేయోపమ కాదు.

సుఖసమయము లో దుఃఖదాయియైనను సుఖింపజేయును. దుఃఖసమయములో నైతే సుఖదాయిగూడ దుఃఖదాయకమే అని.

ఇంతమాత్రపుటర్థమే నట జెప్పదలంచినది. గనుక సమానమైన మూడవదానిని వ్యవచ్ఛేదించుట తెలియదు.

ఇశ్లే— "రజోభిః" అనుచోట పరస్పరోపమయం దతివ్యాప్తి. వెనుక జెప్పిన సదృశాంతర వ్యవచ్ఛేదము ఫలముగా నుండవలెనని విశేషించినచో మేము జెప్పిన దానియందే పర్యవసానమగును.

యచ్చ విమర్శినీకారేణోక్తమ్ - "స చ వాక్యభేదః శాబ్ద ఆర్థశ్చ. తత్ర శాబ్దోయథా — 'రజోభిః స్యన్దనోద్ధూతైః' ఇత్యాదిః. అస్యాశ్చోపమానాన్తరతిరస్కారఏవ ఫలమ్. అత ఏవోపమేయేనోప మేత్యన్వర్థాభిధత్వమ్"—ఇతి తత్తుచ్ఛమ్. నహి "రజోభిః స్యన్దనో ద్ధూతైః" ఇత్యత్రోపమానాన్తరతిరస్కారః ప్రతీయతే. ద్వయో రుపమయోరేకధర్మకత్వాభావాత్. ఆద్యాయా ఉపమాయా అను గామిధర్మప్రయోజ్యత్వాత్ , ద్వితీయాయాశ్చ బిమ్బప్రతిబిమ్బ భావాపన్నధర్మప్రయోజ్యత్వాత్.

విమర్శనీ - (అలంకారసర్వస్వవ్యాఖ్య) కారుడు జయరథు డిట్లనెను.

"ఆవాక్యభేదము శాబ్దము - (శబ్దములనుండి యేర్పడునది) అనియు ఆర్థము (అర్థములనుండి యేర్పడునది) అనియు రెండువిధములు.

అందు శాబ్ద మెట్లనగా—

రజోభిస్స్యందనోద్ధూతైః - ఇత్యాదులు. దీనికి యుపమానాంతరమును దిరస్కరించుటయే ఫలము. ఇందువల్లనే - ఉపమేయముతో నుపమ - అని, సార్థకమైనపేరు" అని.

ఇది తప్పు—

రజోభిస్స్యందనోద్ధూతైః - అనుచోట నుపమానాంతరమను దిరస్కరిం చుటలేదుగదా? అటనున్న రెండుపమలును ఒకేధర్మముతో బ్రయోగింపబడి యుండుటలేదు గదా? మొదటి యుపమలో ననుగామిధర్మము బ్రయోజ కము. రెండవదానిలో బింబప్రతిబింబభావమునొందిన ధర్మము బ్రయోజకము.

యదపి “ పరస్పరముపమానోపమేయత్వముపమా ” ఇతి లక్షణం విధాయ “సవితా విధవతి—”ఇత్యాది ప్రాగుక్త పద్యం రత్నాకరేణోదాహారి. తచ్చ తదీయేనైవ “సచోపమానాన్తరనిషేధార్థః” ఇతి గ్రన్థేన విరుద్ధమ్. న హ్యస్మిన్ పద్యే ఉపమానాన్తర నిషేధః ప్రతీయతే ఇతి ప్రాగేవావేదనాత్. ప్రతీయత ఏవేతి చేత్, పునరపి పృచ్ఛ హృదయమేవ స్వకీయమ్ ఇత్యలం వివాదేన.

ఇయం చోపమేయోపమా యది కస్యాప్యర్థస్యోత్కర్షాధాయికా తదాలఙ్కారః. అన్యథా తు స్వవైచిత్త్ర్యమాత్రపర్యవసితేతి. ఏవమలఙ్కారాన్తరేఽపి జ్ఞేయమ్.

ఇక నలంకారరత్నాకరకారుడు శోభాకరుడు - “పరస్పరము ఉపమానోపమేయభావ ముపమేయోపమ” - అని లక్షణముచేసి 'సవితా విధవతి' అనుశ్లోకము నుదాహరించెను. అదియు నుపమానాంతరనిషేధార్థము, అని అతనిగ్రంథముతోడనే విరుద్ధము. ఈ పద్యములో నుపమానాంతరనిషేధము స్ఫురింపదుగదా? అని యిదివరకేచెప్పితిమి. స్ఫురించుచునేయున్నదందువా! మరల నీ హృదయమునన విచారించుకొనుము. తగాదా ఎందుకు? ఈ యుపమేయోపమ ఏదో నొక విషయమునకు నుత్కర్షమునుగొని తెగల్గినచో నలంకారము. గానిచో స్వవైచిత్రీమాత్రమంచే విశ్రాన్తమగును. మరొక యలంకారముకడకూడ నీతిరేగ్రహింపవలెను.

అథ ధ్వన్యమానేయ ముదాహ్రియతే—

“గామ్భీర్యేణాతిమాత్రేణ మహిమ్నా పరమేణ చ
రాఘవస్య ద్వితీయోఽబ్ధి రమ్బుధేశ్చాపి రాఘవః”

ద్వితీయశబ్దస్య సాదృశ్యవిశిష్టే శక్త్యభావాత్
వ్యక్తి రేవ. యది తు లక్షణా తదేదముదాహరణమ్—

“సుధాసముద్రం తవ రస్యవాణీ
వాచం క్షమాచన్ద్రి సుధాసముద్రః.
మాధుర్యమధ్యాపయితుం దధాతే
ఖర్వేతరామాన్తరగర్వముద్రామ్”.

అత్ర వాగాది కర్తృకస్య పరస్పరాధ్యాపనస్య బాధా న్మాధుర్య సంక్రాన్తి విశేషస్య లక్షణయా బుధ్యమానస్య ప్రయోజనం స్వప్రయోజ్యాన్యోన్యోపమానోపమేయభావః.

ఇక నీయలంకారధ్వని నుదాహరింతము.

"గాంభీర్యేణ" (ఎక్కువైన గాంభీర్యముచేతను అతిమాత్రమగు మహిమచేతను శ్రీరామునకు రెండవవాడు సముద్రుడు; సముద్రమునకు రెండవవాడు శ్రీరాముడు) ఇత్యాది శ్లోకమున 'ద్వితీయ' శబ్దమభిధతో సాదృశ్యము దెల్పజాలదు గనుక వ్యంజనయే.

అట లక్షణయేయన్నచో నపు డిది యుదాహరణము.:—

'సుధా' మొ. (ఓ రాజా! నీయందమైన మాట అమృతసముద్రమునకు నమృతసముద్రము నీమాటకును మాధుర్యము నేర్పుటకై లోన మిక్కిలి గర్వము బూనియున్నది). ఇట వాక్కు - సుధాసముద్రమును, ఒక దానికొకటి నేర్పుట బాధితము. అనగా నది చేతనధర్మము. అచేతనధర్మము గాదు. కనుక లక్షణచేత మాధుర్యము సంక్రమించుటయను విశేషము బోధింపబడును. స్వప్రయోజ్యమగు పరస్పరోపమేయభావము దాని ప్రయోజనము. (ధర్మము భిన్నములైనను తృతీయ సదృశవ్యవచ్ఛేదము స్ఫురించునని శోభాకరాది ప్రాచీనులమతము. దానిని నవీను లంగీకరింపరు)

అథ దోషాః — తత్ర తావత్ప్రాగుక్తా యావన్త ఉపమాయా దోషాః అనుక్తాశ్చ విస్తృతిభయాత్, తే సర్వేఽప్యుపమాత్వాక్రాన్తత్వా దస్యామపి బోధ్యాః. అయం పునరన్యోఽపి దోషః— యదేకోపమావైలక్షణ్య మపరస్యాముపమాయామ్. యథా— "కమలమివ వదనమస్యా వదనేన సమం తథా కమలమ్" అత్ర శ్రౌత్యార్థీకృతం వైలక్షణ్యమ్. "కమలతి వదనం తస్యాః కమలం వదనాయతే జగతి". క్విప్క్యఙ్ కృతమత్ర వైలక్షణ్యమ్. ఏవమత్రైవ 'పద్మం వదనాయతే' ఇతి నిర్మాణే 'వక్త్రీయతే' ఇతి వా ఉపమానోపమేయవాచక వైలక్షణ్యమ్. ఏవం ప్రకారైరనేకైర్వైలక్షణ్యం యది సహృదయోద్వేజకం తదా దోషః.

ఇతి రసగఙ్గాధరే ఉపమేయోపమాప్రకరణమ్,

ఇక దోషములు—

ఇదివరలో జెప్పిన యుపమాదోషములన్నియు, గ్రంథవిస్తరణభయము వలన జెప్పనివియు; నవియన్నియు దీనియందు గలవని గ్రహింపవలెను. ఇదియును నుపమయేగదా? ఈ జెప్పబోవునదిమాత్రము మరొక దోషము.

ఒకయుపమతో మరొకయుపమకు వైలక్షణ్యము. ఎట్లనగా:—

"ఈ మెమొగము కమలమువలె నున్నది, ఈవదనముతో నల్లే కమలము సమముగానున్నది" ఇట మొదట శ్రౌతియైన యుపమయు, రెండవచోట నార్థియైన యుపమయు అని వైలక్షణ్యము.

'కమలతి' ఇత్యాద్యుదాహరణమున క్విప్ - క్యఙ్ లచే వైలక్షణ్యము జేయబడినది. ఇలాగే 'పద్మం వదనాయతే' యనిగానీ 'వక్త్రాయితే' అని గానీ నిర్మించినచో నుపమానోపమేయ వాచకముల వైలక్షణ్యము. ఈ విధముగనే ననేకవిధముల వైలక్షణ్యములు, సహృదయులకు వెగటు గ్లించినచో నపుడు దోషము.

ఇది ఉపమేయోపమా ప్రకరణము.

## అనన్వయ ప్రకరణమ్

అథానన్వయః—

ద్వితీయసదృశవ్యవచ్ఛేద ఫలక వర్ణనవిషయీభూతం యదేకో పమానోపమేయకం సాదృశ్యం తదనన్వయః. స చ కస్యాప్యుప స్కారకత్వేఽలఙ్కారః. అన్యథా తు శుద్ధః.

"లోహితపీతైః కుసుమైరావృతమాభాతి భూభృతః శిఖరమ్
దావజ్వలన జ్వాలైః కదాచిదాకీర్ణమివ సమయే."

అత్ర లోహితపీత కుసమావృతం భూభృతః శిఖరం స్వేనైవ కస్మింశ్చిత్సమయే దావజ్వాలాకీర్ణేనోపమీయతే; ఇతి తత్సాదృశ్య వారణాయ భూతాన్తమ్. ఇదం వా ప్రత్యుదాహరణమ్—

నఖకిరణపరమ్పరాభిరామం
కిమపి పదామ్బురుహద్వయం మురారేః

అభినవసురదీర్ఘికా ప్రవాహ
ప్రకరపరీతమివ స్ఫుటం చకాసే.

అత్రాపి నఖకిరణ పరమ్పరాభిరామం హరేః పదామ్బుజం స్వాత్మనైవ సురదీర్ఘికాప్రవాహప్రకరపరీతే నోపమీయతే. సమ్ప్రతి సురదీర్ఘికాప్రవాహేణ భగవత్పాదామ్బురుహస్య సమ్బన్ధాభావాత్సురనిమ్నగోత్పత్తి కాలావచ్ఛిన్నస్య తస్యోపమానతావగమాయాభినవేతి ప్రవాహవిశేషణమ్. న హ్యత్ర సాదృశ్యవర్ణనస్య ఫలం ద్వితీయ సబ్రహ్మచారి వ్యవచ్ఛేదః, తస్యాప్రతిపత్తేః.

ఇపుడు అనన్వయము:—

ఒకవస్తువునే ఉపమానముగాను, ఉపమేయముగాను వర్ణించుటలో, మరొకటి సమానమైనది లేదని ఫలమును స్ఫురిపజేయు వర్ణనమునకు గోచరమగు సాదృశ్యము అనన్వయము. అది దేనినైనా నలంకరించినచో నలంకారము. లేనిచో వివిక్తము.

"లోహితపీతైః" మొ, "ఎఱ్ఱనివి పచ్చనివియైన పూవులచే నావరింపబడి కొండశిఖరము దావాగ్నిమంటలచేత ఒకప్పుడు ఆకీర్ణమైనటులుగా కన్పడుచున్నది". ఇచట నెఱుపు - పసుపు- పువ్వులు గ్రమ్మినచిన కొండశిఖరము ఒకప్పుడు దావజ్వాలాకీర్ణమైనప్పటి తనతో బోల్చబడినది. కనుక నాసాదృశ్యమున నతివ్యాప్తిని వారించుటకై స్ఫురింపజేయు నన్నంతవఱకు జెప్పబడినది. అథవా— ఇదియైనా ప్రత్యుదాహరణము.

"నఖకిరణ" మొ. "గోరుల కిరణములవరుస అందగింపగా, మురారి పాదపద్మములజంట క్రొంగ్రొత్త గంగాప్రవాహముయొక్క సమూహము వ్యాపించినట్లు స్ఫుటముగా ప్రకాశించెను." ఇచటగూడ గోళ్ళకిరణముల వరుస లందగించిన మురారి పాదపద్మయుగళము తనతోనే, గంగాప్రవాహములు వ్యాపించినవానితోనే బోల్చబడినది. భగవానుని పాదపద్మమునకు గంగాప్రవాహముతో సంబంధము ఇపుడు లేదు గనుక, గంగపుట్టినకాలము నాటి పాదపద్మముల సమానమని దెలియుటకై, 'క్రొంగ్రొత్త' యని ప్రవాహ పరంపరవిశేషింపబడినది. ఇట నీ సాదృశ్యవర్ణనమువలన రెండవ సమాన వస్తువు లేదని ఫలింపదు. అది స్ఫురింపమగదా?

"స్తనాభోగే పతన్ భాతి కపోలాత్కుటిలోఽలకః
సుధాంశు బిమ్బతో మేరౌ లమ్బమాన ఇవోరగః".

ఇతి కల్పితోపమానికాయా ముపమాయామతిప్రసఙ్గవారణాయైకోపమానోపమేయక మితి. అత్రాసత ఉపమానస్య కల్పనయా సదుపమానం నాస్తీతి ద్వితీయసదృశవ్యవచ్ఛేదస్యాస్తి ప్రతీతిః. ఉదాహరణ మమృత (పీయూష) లహర్యాఖ్యే మదీయే గఙ్గాస్తవే—

"కృతక్షుద్రాఘౌఘానథ సపది సన్తప్తమనసః
సముద్ధర్తుం సన్తి త్రిభువనతలే తీర్థనివహాః.
అపి ప్రాయశ్చిత్తప్రసరణపథాతీతచరితాన్
నరానూరీకర్తుం త్వమివ జనని త్వం విజయసే."

"స్తనాభోగే" ఇత్యాది శ్లోకమునందలి యుపమానమును గల్పించిన ఉపమలో నతివ్యాప్తి రాకుండుటకై ఒకటేయుపమానమును, నుపమేయమునుగా నుండవలె ననబడినది. ఇట నుపమానము గల్పితము. కనుక వాస్తవ మగు నుపమానములేదని రెండవ సమానవస్తువు లేదనుట స్ఫురించును. ఉదాహరణము (పీయూష) అమృతలహరియను నా గంగా స్తవములో—

"కృతక్షుద్రాఘౌఘాన్" మొ. "క్షుద్రములగు పాపములొనర్చి అప్పుడే పశ్చాత్తాపమునొందువారి నుద్ధరించుటకు తీర్థములు మూడులోకము లందున్నవి. గానీ - ప్రాయశ్చిత్తమార్గముదాటిన నడవడిగల మనుజుల నంగీకరింప (నీవలె నెవరున్నారు తల్లీ) నీవొకతవే నీవలె వెలసితివి"—

యథా వా—

"ఇయతి ప్రపఞ్చవిషయే తీర్థాని కియన్తి సన్తి పుణ్యాని
పరమార్థతో విచారే దేవి గఙ్గా తు గఙ్గేవ."

పూర్వపద్యే వాచ్యోఽనుగామీ ధర్మః. ఇహ తు వ్యఙ్గ్య ఇతి విశేషః. తు శబ్దోఽయం తీర్థాన్తరేభ్యో వైలక్షణ్యం ప్రతిపాదయంస్తత్ప్రయోజకం భగవద్వాసుదేవాత్మకత్వం ధర్మం శ్రీగఙ్గాయాం వ్యనక్తి ఉభయత్రాఽపి శ్రీగఙ్గా విషయక రత్యుపస్కారకత్వాదలఙ్కారోఽయమ్.

బిమ్బప్రతిబిమ్బభావాపన్నో ధర్మ స్త్వత్ర నాస్తి, తస్మింశ్చ సతి కిఞ్చిద్ధర్మావచ్ఛిన్నేన స్వేన సాదృశ్యస్య ధర్మాన్తరావచ్ఛిన్నే స్వస్మిన్నన్వయే బాధకాభావాత్సదృశాన్తరవ్యవచ్ఛేదాప్రతిపత్తేశ్చానన్వయ ఏవ న స్యాత్.

మరొకటి—

'ఇయతి' మొ. "ఇంత ప్రపంచములో పవిత్రములైన తీర్థములెన్ని లేవు? బాగుగా నాలోచించినచో దేవి గంగవంటిది గంగామాతయే."

పూర్వపద్యమందు వాచ్యమనుగామి ధర్మము - ఇట వ్యంగ్యము - అని విశేషము. ఇట 'తు' శబ్దము తీర్థాంతరములకన్నను వైలక్షణ్యమును దెల్పుచు దానికి మూలము శ్రీగంగ భగవద్వాసుదేవ స్వరూపురాలు అను ధర్మమును వ్యంజించుచున్నది. రెండుచోటులను శ్రీగంగను గూర్చిన గవి ప్రీతి నుపస్కరించునుగనుక నలంకారము. బింబప్రతిబింబభావమునొందిన ధర్మ మిటలేదు. అదియుండుచో నేదోయొక ధర్మముతోగూడిన తనతోడి సాదృశ్యము మరొకధర్మముతోనున్న దనయం దన్వయించుటలో భేదము లేదుగనుక మరొక సమానవస్తువు లేదనుట తెలియక ననన్వయమే లేక పోవును.

స చ పూర్ణో లుప్తశ్చేతి తావద్ద్వివిధః. పూర్ణస్తూపమావత్ షడ్విధోఽపి సమ్భవతి. యథా—

"గఙ్గా హృద్యా యథా గఙ్గా, గఙ్గా గఙ్గేవ పావనీ
హరిణా సదృశో బన్ధుర్హరితుల్యః పరో హరిః,
గురువద్గురురారాధ్యో గురువద్గౌరవం గురోః."

లుప్తేష్వపి ధర్మలుప్తః పఞ్చవిధోఽపి సమ్భవతి, ప్రాగుక్తే సార్ధపద్యే ధర్మవాచకపదమపహాయ పదాన్తరదానే.

అది పూర్ణమని - లుప్తమని రెండువిధములు. అందు పూర్ణము ఉపమ వలె నారురకములుగానున్న సంభవించును. ఎట్లన—

'గంగా' మొ. [1]లుప్తములోగూడ ధర్మలోపము ఐదువిధములు సంభవించును. వెనుకజెప్పిన నగముపద్యముతోడి పద్యములో ధర్మమును దెల్పు పదమును వదలి మరొకపదమునుగూర్పగా నవి యేర్పడను.

వాచకలుప్త :—

"రామాయమాణః శ్రీరామః సీతా సీతామనోహరా
మమాన్తఃకరణే నిత్యం విహరేతాం జగద్గురూ."

ఇత్యత్ర క్యఙ్ సమాసయోః.

"లఙ్కాపురాదతితరాం కుపితః ఫణీవ
నిర్గత్యజాతు పృతనాపతిభిః పరీతః,
క్రుద్ధం రణే సపది దాశరథిం దశాస్యః
సంరబ్ధ దాశరథిదర్శ మహో దదర్శ."

ఏవం కర్తృణములాదావప్యూహ్యామ్.

---

1. "గంగ గంగవలె హృద్యమైనది - గంగ గంగవలె పవిత్రమైనది. హరితో సదృశుడగు బంధువు హరి. హరి తుల్యుడగు పరముడు హరి. గురువు గురువువలె నారాధింపదగినవాడు. గురువుయొక్క గౌరవము గురువు యొక్క గౌరవమువంటిది. (పదాంతరాదానే)—

గంగారాజన్ యథా గంగా గంగా గంగేవ సర్వదా
హరిణా సదృశో విష్ణుః విష్ణుతుల్యః సదా హరిః
గురువద్గురురాస్తేఽస్మిన్ మండలే గురువద్గురోః.

ఇట మొదటిపాదములో, వాక్యగతము శ్రౌతము పూర్ణమగు అనన్వయము, రెండవపాదమున సమాసములోనిదేయది. మూడవపాదములో వాక్యగతము ఆర్థము; పూర్ణము. నాల్గవపాదమున సమాసగతమునట్టిది. ఐదవపాదమున తేనతుల్యం - అని వతి ప్రత్యయమున్నది. కనుక తద్ధిత గతమై పూర్ణమగు నార్థము. ఆరవపాదమున తత్రతస్యేవ – అని వతిప్రత్యయము గనుక శ్రౌతము తద్ధితగతమగు పూర్ణమైన అనన్వయము దెలియవలెను. వాక్యగతమగు నార్థము. సమాసగతమగు శ్రౌతము, సమాసగతమగు నార్థము, తద్ధితగతమగు శ్రౌతత, రెండువతిప్రత్యయములును, తద్ధితములేగనుక నావిభేద మొక్కటేనని,

అటులనే వాచకలుప్త

రామాయమాణః మొ. శ్రీరామునివలె [illegible] శ్రీరాముడును సీతవలె మనోహరయగు సీతామహాదేవియు జగద్గురువులగు వీరిద్దరు మనసులో నెల్లపుడు విహరింతురుగాక". ఇట క్యఙ్ సమాసములందు వాచకలోపము.

ఇలాగే—

'లంకాపురాత్' మొ. "సేనాపతులందరును తనను జుట్టుకొనిరాగా గోపించిన పామువలె మిక్కిలి కోపముతో లంకాపట్టణమునుండి బయల్వెడలిన రావణుడు శ్రీరామచంద్రుని యుద్ధములో క్రుద్ధుడగు శ్రీరామచంద్రుని చూచినట్లుగా జూచెను." ఈతీరుగా కర్తృణములాదులందుకూడ ఊహ్యము.

'అమ్బరత్యమ్బరం యద్వత్సముద్రోఽపి సముద్రతి
విక్రమార్కమహీపాల తథా త్వం విక్రమార్కసి'

అత్ర వాక్యార్థావయవేష్వనన్వయేషు ధర్మవాచకయోర్లోపః. ముఖ్యవాక్యార్థస్త్వనన్వయఫలేన నిరుపమత్వేన సమానధర్మేణ ప్రయోజితో మాలోపమైవ. ఏషా చ జ్ఞానసౌకర్యాయాత్రైవ నిరూపితా.

'అంబరత్యంబరం' మొ. "ఆకాశము నాకాశమువలె, సముద్రము సముద్రమువలెను ఎట్లున్నదో అట్లే విక్రమములో, మహారాజా నీవు విక్రమార్కునివలె నున్నావు."

ఇచట వాక్యార్థావయవములగు ననన్వయములందు ధర్మవాచకములు లోపించినవి. ముఖ్యవాక్యార్థమైనచో ననన్వయఫలమైన నిరుపమత్వముతో సమానధర్మముతో ప్రయోజితమైనది, మాలోపమయే ఇది. కష్టములేకుండ దెలియుటకై నిటనే నిరూపింపబడినది.

'ఏతావతి ప్రపఞ్చేఽస్మిన్ సదేవాసురమానుషే
కేనోపమీయతాం తద్ఞై రామో రామ పరాక్రమః.'

అత్ర వాచకధర్మోపమానానాం లోపః. అత్ర చోపమాన లుప్తాదయోఽన్యే భేదా అసమ్భవాదహృద్యత్వాచ్చ నోదాహృతాః.

'ఏతావతి' మొ. "దేవ అసుర మనుష్యులతోకూడిన యింతటి ప్రపంచమునందును రామునివంటి పరాక్రమముగల రాముని ఎవరితో పోల్చుదుము." ఇచట వాచకధర్మోపమానములు లోపించినవి. ఈ యలంకారములో నుపమానలుప్త మొదలగు ఇతర భేదములు సంభవింపవు-బాగుండవుగూడా. కనుక నుదహరింపము.

యత్తు - "తేన తదేకదేశేనావసితభేదేనవోపమానతయా కల్పితేన సాదృశ్యమనన్వయః. ఉపమేయేనైవోపమానతయా కల్పితే నోపమేయస్యా ముఖావభాసమానసాధర్మ్యోపాదనమేకోఽనన్వయః. ఉపమేయైకదేశస్య తథైవోపమానతాకల్పనమపరః. ఉపమేయస్యైవ ప్రతిబిమ్బత్వాదినా భేదేనావసితస్య తత్త్వకల్పనం తృతీయః. ఆద్యో యథా—

'యుద్ధేఽర్జునోఽర్జున ఇవ ప్రథితప్రతాపః' ఇత్యాది.

ద్వితీయో యథా—

'ఏతావతి ప్రపఞ్చే సున్దరమహిలా సహస్రభరితేఽపి
అనుహరతి సుభగతస్యా వామార్ధం దక్షిణార్ధస్య'.

తృతీయో యథా—

'గన్ధేన సిన్ధుర ధురన్ధర వక్త్రమైత్రీ
మైరావణప్రభృతయోఽపి న శిక్షితాస్తే
తత్త్వం కథం త్రినయనాచల రత్నభిత్తి
స్వీయప్రతిచ్ఛవిషు యూథపతిత్వమేషి.'

ఏషూపమానాన్తర విరహస్త్రిష్వపి భేదేషు గమ్యతే.

ఇత్యనన్వయస్త్రివిధః" ఇతి రత్నాకరేణోక్తమ్ —

అయితే - అలంకారరత్నాకరములో శోభాకారు డిట్లనెను—"దాని తోనేగాని, దాని యేకదేశముతోగానీ నిశ్చయముగా భేదముదెలిసిన దానితో, నుపమానముగా గల్పించి పోల్చుట అనన్వయము,

దీనివివరణము—ఉపమేయమునే ఉపమానముగాగల్పించి ఉపమేయమునకు నెట్టయెదుట భాసించు సామ్యమును నాపాదించుట యొకయనన్వయము. ఉపమేయైకదేశము నట్లే యుపమానముగా గల్పించుట రెండవది. ఉపమేయమునే ప్రతిబింబత్వము మొదలగు విశేషముతో భిన్నముగా నిశ్చయించినదానిని ఉపమానముగా గల్పించుట మూడవది.

మొదటి దెట్లనగా—

'యుద్ధేర్జునో' మొ. ("యుద్ధములో నర్జునుడు నర్జునునివలె ప్రతాపప్రసిద్ధుడైనాడు)."

రెండవది యెట్లనగా—

'ఏతావతి' మొ (సుందరమైన మహిళలు వేనకువేలు నిండియున్నను ఈప్రపంచమంతటిలోను, ఆమె ఎడమభాగము కుడిభాగమునకు సరిపోవును)

మూడవది యెట్లనగా—

'గంధేన' మొ. (గజాననా? ఐరావతము మొదలుకొని యే ఏనుగులకుగూడ కొంచెమైనను నీసామ్యము నేర్పబడలేదు. అట్టి నీవు, శివునికొండయందలి, రత్నభిత్తులయందలి, నీ బింబములందు, యూథపతిత్వము నెట్లు పొందుదువు?) మూడు ఉదాహరణములందును - వేరొక యుపమానము లేదని తోచును. ఇట్లు అనన్వయము మూడువిధములు" అని.

తన్న. ఉపమానాన్తరవిరహప్రతీతిమాత్రాదేవానన్వయత్వే 'స్తనాభోగే పతన్భాతి' ఇత్యత్రోపదర్శితాయాః కల్పితోపమాయా అపి తథాత్వాపత్తేః. యద్వ్యర్థాతిశయోక్త్యావళిప్రసక్తేశ్చ. తాదృశప్రతీతిఫలకైకోపమానోపమేయక సాదృశ్యస్య తత్త్వే పునః కథం నామ వామార్ధదక్షిణార్ధయోర్భిన్నయోః సాదృశ్యే తద్భేదత్వోపన్యాసః. న చ స తదేకదేశస్త త్ప్రతిబిమ్బశ్చేత్యేతదన్యతమ ప్రతియోగిక సాదృశ్యమనన్వయః ఇతి క్వావ్యాప్తిరతివ్యాప్తిర్వేతి వాచ్యమ్. నాస్త్యన్వయోఽస్యేతి యోగార్థవిరహేణ తదేకదేశసాదృశ్యస్యానన్వయపదార్థత్వాసమ్భవాత్. అపి చానన్వయే 'గగనం గగనాకారమ్' ఇత్యాదావుపమేయస్యైవోపమానత్వేనోపన్యాసాదుపమేయాతిరిక్తోపమాన విరహప్రతీతిద్వారా నిరుపమత్వముపమేయగతం సిద్ధ్యతి. అత్ర

చ వామార్ధస్యోపమేయస్య దక్షిణార్ధరూపోపమానకథనేన - నిరుపమత్వం విరుద్ధమేవ. కాన్తాగత నిరుపత్వప్రత్యయస్తు నానన్వయస్య ఫలం భవితుమర్హతి, తస్యా అనుపమేయత్వాత్.

అది సరిగాదు. మరొక యుపమానములేదని తోచినంతమాత్రముననే అనన్వయమగుచో - "స్తనాభోగే పతన్భాతి కపోలాత్పతితోఽలకః" అనే చోట చూపబడిన గల్పితోపమగూడ అనన్వయమే గావలసివచ్చును. యద్యర్థాతిశయోక్తిలో నతివ్యాప్తిగూడాను. అటువంటి ప్రతీతిని ఫలించునట్టి యొకటే ఉపమానముగాను ఉపమేయముగాను నుండు సాదృశ్యము అనన్వయము అగుచో వేరువేరగు వామార్ధ - దక్షిణార్ధములయొక్క సాదృశ్యము అనన్వయవిశేషమనుట ఎట్లు ?

అదియు; దానియొక యంశమున్ను; దాని ప్రతిబింబమున్ను వీనిలో నేదైనా నొకదానితోడి సాదృశ్యము అనన్వయము. కనుక నిక నతివ్యాప్తి యెక్కడ? అనరాదు. అపుడన్వయములేనిది అనన్వయము అను అవయవార్థము లేదుకనుక దానియేకదేశముతోడి సాదృశ్యము "అనన్వయము" అను పదమున కర్థమగుట యసంభవము మరియు అనన్వయమున - "గగనం గగనాకారం" - అను నీరీతి దానితో నుపమేయమునే ఉపమానముగా జెప్పుటవలన నుపమేయముకన్నను వేరుగా నుపమానములేదని ప్రతీతిగల్గి, దానిద్వారా నుపమేయమునందు తులలేకుండుట సిద్ధించును. ఇక్కడ వామార్ధము నుపమేయమునకు దక్షిణార్ధము నుపమానమును జెప్పుటవలన తులలేకుండుట విరుద్ధమే. ఆ స్త్రీయందు నిరుపమత్వము ప్రతీతి అయితే అది అనన్వయమునకు ఫలముగాజాలదు. ఆమె యుపమేయము గాదుగదా?

యదపి చాలఙ్కారసర్వస్వకృతా "అనన్వయ ధ్వనిత్వమత్ర భవిష్యతి. అన్యథాఽలఙ్కారధ్వనేర్విషయాపహారః స్యాత్" ఇత్యుక్తమ్, తదపి తుచ్ఛమ్. అన్యవ్యుపమాననిషేధ ఫలకమభిన్నోపమానోపమేయకంసాదృశ్యం స్వరూపమిత్యుక్తమ్. ప్రకృతే చ వామార్ధ దక్షిణార్ధయోస్తద్బాధితమిత్యుక్తమేవ. కాన్తాయాః పునరుపమాన నిషేధస్య వ్యఙ్గ్యత్వేఽపి అభిన్నోపమానోపమేయకసాదృశ్యస్య స్వరూపస్యాప్రత్యయాత్. నహి నిరుపమత్వప్రతీతిషు సర్వాస్వభిన్నోపమానోపమేయక సాదృశ్యప్రతీతిపూర్వకత్వమితి నియమోఽస్తి.

కల్పితోపమాతిశయోక్త్యోరసమాలఙ్కారధ్వనౌ చ వ్యభిచారాత్. తస్మాన్నాస్త్యేవాత్రానన్వయగన్ధోఽపి.

అలంకార సర్వస్వకారుడు. "అనన్వయధ్వని ఇచటగాగలదు. అట్లుగాదన్నచో నలంకారధ్వనియొక్క విషయమపహరింపబడిన దగును" అన్నాడు. అదియును సరిగాదు. ఈ యనన్వయమునకు నుపమానపు నిషేధము ఫలించునట్టి ఒకవస్తువే ఉపమేయముగాను - ఉపమానముగాను. కల్గిన సాదృశ్యమే రూపము అని చెప్పబడినది. ప్రకృతములో వామార్ధదక్షిణార్ధములకది - అట్టిసాదృశ్యము — బాధితమని చెప్పియేయుంటిమి. ఇక కాంతసంగతియా? ఆమెతో బోల్చదగినది లేదని వ్యంగ్యమైనను ఒకే వస్తువు ఉపమానోపమేయత్వము నొందిన సాదృశ్యము, (అనన్వయస్వరూపము) (ఇట) గోచరింపలేదుగదా? నిరుపమత్వములు స్ఫురించుచోటులందంతటను ఉపమానోపమేయములు వేరుగానుండని సాదృశ్యము మొదట స్ఫురించితీరవలెను అని నియమములేదుగదా? కల్పితోపమా తిశయోక్తులందును, అసమాలంకారధ్వనియందును అట్లు లేదుగదా? (ఆచోటులందు నిరుపమత్వము తప్పక స్ఫురించును). కనుక నిట అనన్వయగంధముగూడ లేదు.

యచ్చ-'అయమనన్వయో వ్యఙ్గ్యోఽప్యస్తి, యథా—

'అద్యయా మమ గోవిన్ద జాతా త్వయి గృహాగతే
కాలేనైషా భవేత్ప్రీతి స్తవైవాగమనాత్పునః.''

అత్రగృహాగతం శ్రీకృష్ణం ప్రతి విదురవాక్యే ఇయం త్వదాగమనప్రభవ ప్రీతిర్బహుకాలవ్యవహితేన పునరపిత్వదాగమనేనైవ భవేత్ నాన్యేన, ఇత్యుక్తిభఙ్గ్యా త్వదాగమన ప్రభవప్రీతేః సైవసదృశీ నత్వితరప్రభవా ఇతి వ్యజ్యతే, ఇత్యప్పయ దీక్షితైరభిహితం తదపి న. అముష్యాస్త్వదాగమన ప్రభవాయాః ప్రీతేర్వారాన్తర త్వదాగమన ప్రభవా ప్రీతిః సదృశీతి ప్రత్యయస్య సర్వజనసిద్ధతయా శ్రీకృష్ణాగమనజన్యప్రీతి సామాన్యావయవయోర్ద్వయోః ప్రీతివ్యక్త్యోః సాదృశ్యస్యాబాధితత్వాద్యోగ్యార్థాభావేనానన్వయ ఏవ నాయం భవితుమర్హతి 'స్వస్మిన్ సాదృశ్యస్యాన్వయాభావాదనన్వయః' ఇత్యుపమాప్రకరణే స్వయమేవాభిధానాత్. ఉపమేయస్య ప్రీతివ్యక్తి విశే

షస్యసదృశాన్తరవ్యవచ్ఛేదే బాధాత్. తాదృశప్రీతిసామాన్యస్య చావయవినో నిరుపమతయా ప్రతీయమానస్యానుపమేయత్వాత్ పూర్వోదాహరణతుల్యమేవైతత్. క్వచిదవయవయోరుపమాప్యవయవి గతనిరుపత్వవ్యఞ్జికేతి స్థితే సామాన్యస్య శ్రీకృష్ణాగమనజన్యప్రతీతేః సైవ సదృశీతి మధ్యే స్వసాదృశ్య ప్రత్యయకల్పనం పునర్న సహృదయహృదయమారోఢుమీష్టే, రత్నాకరోక్తస్యైవానన్వయప్రకారస్యాత్ర వ్యఙ్గ్యతేత్యపి న యుక్తమ్; తస్యప్రాగేవ దూషితత్వాత్, ప్రకృతేఽవాచ్యత్వాత్. స్వయమనన్వయప్రకరణే తస్యప్రతిపాదనవిరహాచ్చ.

ఇక అప్పయ్యదీక్షితులు- ఈ అనన్వయము వ్యంగ్యముగాకూడ నున్నది ఎట్లనగా—

"అద్య యా" (గోవిందుడా, నీవు ఇపుడింటికిరాగా ఏ ప్రీతి నాకు గల్గినదో, ఈ ప్రీతి నీ రాకవలననే బహుకాలానంతరమున గల్గును) ఇత్యాది శ్లోకమున, ఇంటికివచ్చిన శ్రీకృష్ణునిగూర్చి విదురునిమాటలలో, "నీ రాకవలన గల్గిన ఈ ప్రీతి చాలాకాలము తరువాత తిరిగి నీరాకవల్లనే గల్గును. మరొక దానివలనకాదు; అని వ్యక్తమగును"; అని అన్నాడు. అదియునుగాదు. నీ రాకవల్లగల్గిన ఈ ప్రీతికి మరొకప్పుడు నీరాకవల్లగల్గుప్రీతితో సమానమైనది. అని అందరికిని దెలిసినదేగనుక శ్రీకృష్ణుని రాకవలన గల్గుప్రీతి సామాన్యమునకు అవయవములగు ఈ రెండు ప్రీతివ్యక్తులకును సాదృశ్యమున బాధలేదు. కనుక అనన్వయపదవుటర్థము అగుటలేదు. కాగా ఇది అసలు అనన్వయమే కాదు.

"తనయందు సాదృశ్యము అన్వయింపదుగనుక అనన్వయము" అని ఉపమా ప్రకరణమునందు తానే జెప్పెను. ఉపమేయమైన ప్రీతివ్యక్తి విశేషమునకు సమానమైన మరొకవ్యక్తి లేదనుట బాధితము. అటువంటి ప్రీతి సామాన్యము,అవయవి, నిరుపమముగా స్ఫురించుచున్నది. ఉపమేయముగాదు. కాగా ఇదియు వెనుకటి యుదాహరణమువంటిదే. అవయవములకు ఒక చోటనుండు సాదృశ్యము అవయవియందు నిరుపమత్వమునకు వ్యంజకమగును అనియుండగా, శ్రీకృష్ణునిరాకవలన గల్గు ప్రీతిసామ్యమునకదియే సమానమని నడుమ తనసాదృశ్యమును దెల్పుటను గల్పించుట సహృదయుల హృదయముల కెక్కజాలదు.

రత్నాకరుడు చెప్పిన అనన్వయప్రకారము ఇట వ్యంగ్యమగును. అనుటయు యుక్తముగాదు. అది ఇదివరకే నిరాకరింపబడెను గాన ప్రకృత మున చెప్పదగదుకదా? తాను అనన్వయప్రకరణములో దానిని చెప్పనూ లేదు.

ఇదం పునరనన్వయధ్వన్యుదాహరణమ్—

'పృష్టాః ఖలు పరపుష్టాః పరితో దృష్టాశ్చ విటపినః సర్వే
భేదేన భువి న పేదే సాధర్మ్యం తే రసాలమధుపేన.''

అత్ర భేదేనేత్యుక్త్యాఽభేదే సాదృశ్యమనన్వయాత్మకం తు పేదే ఇతి ధ్వన్యతే. యథావా—

'నగేభ్యోయాన్తీనాం కథయ తటినీనాం కతమయా
పురాణాం సంహర్తుః సురధుని కపర్దోఽధిరురుహే.
కయావా శ్రీభర్తుః పదకమలమక్షాలి సలిలై
స్తులాలేశో యస్యాం తవ జనని దీయేత కవిభిః

అత్ర కయావా త్వదితరయా శ్రీభర్తుః పదం సలిలై రక్షాలి, యస్యామితరస్యాం కవిభిస్తవ తులాలేశోఽపి దీయేతేత్యర్థేన త్వయి పునః సలిలక్షాలిత శ్రీరమణచరణాయాం తవ తులాదీయేతై వేత్యర్థోఽనన్వయాత్మా శ్రీగఙ్గాగత నిరుపమత్వపర్యవసాయీ ఇతర పద మహిమ్నా వ్యజ్యతే.

ఇదిమాత్రము అనన్వయధ్వని కుదాహరణము.

"పృష్టాఃఖలు" (కోయిలలు అడుగబడినవి, చెట్లన్ని అంతటను జూడ బడినవి, ఓ రసాలమా! తుమ్మెదచేత భూమిలో భేదముతో నీకు సాదృశ్యము పొందబడలేదు.) ఇత్యాది శ్లోకమున భిన్నముగా ననుటవలన నభిన్నముగా సాదృశ్యము అనన్వయరూపమైనదిమాత్రము కనుగొన్నది; అని ధ్వనించును.

మరొక విధము—

'నగేభ్యోయాంతీనాం'(కొండలనుండి యెన్నియో యేరులుపారును వానిలో ఏ ఒక్కటైనను శివునిజటాజూటమును నెక్కగల్గినదా? శ్రీరమణుని పాదకమలముల నేదైనా తనజలముచే గడుగగల్గినదా? ఓ తల్లీ! కవులు

దేనియందు నీతోడి తులాలేశమైననుంచగలరు?) ఇత్యాది శ్లోకమున "నీవు గాక మరేది శ్రీరమణునిపాదమును జలముతో గడిగినది? "సలిలక్షాలిత శ్రీరమణ చరణయగు ఏ యితరనదియందు నీ తులాలేశమునైనను కవులు ఉంచగల్గుదురో?" అనుఅర్థముచే నీయందుమాత్రమే నీపోలికను గూర్చ నేర్తురు," అని అనన్వయరూపమైన, శ్రీగంగయందు నిరుపమత్వము పర్యవసింపజేయుఅర్థము ఇతరపదపు సామర్థ్యమువలన వ్యంగ్యమగును.

ఇది అనన్వయప్రకరణము.

## అసమాలంకారః

సర్వథైవోపమానిషేధోఽసమాఖ్యోఽలఙ్కారః. అయం చానన్వయే వ్యఙ్గ్యోఽపి తచ్చమత్కారానుగుణతయా రూపకదీపకాదావుపమేవ న పృథగలఙ్కార వ్యపదేశం భజతే, వాచ్యతాయాన్తు స్వాతన్త్ర్యేణ చమత్కారితయా పృథక్ వ్యపదేశభాక్. యథా—

"భూమినాథ శహాబదీన భవతస్తుల్యోగుణానాం గణై-
రేతద్భూత భవత్ప్రపఞ్చవిషయే నాస్తీతి కిం బ్రూమహే,
ధాతా నూతనకారణైర్యది పునః సృష్టిం నవాం భావయే-
న్న స్యాదేవ తథాపి తావక తులాలేశం దధానో నరః."

యథా వా—

'భువనత్రితయేఽపి మానవైః పరిపూర్ణే విబుధైశ్చ దానవైః.
న భవిష్యతి నాస్తి నాభవన్నృప యస్తే భజతే తులాపదమ్'

రాజస్తుత్యుత్కర్షకత్వాదత్రాసమాలఙ్కారః. ఆత్యన్తికః క్వాచిత్కశ్చ సదృశనిషేధోఽసమోపమానలు ప్తయోర్విషయః. సర్వథైవాసమాన నిషేధేన సాదృశ్యస్యాప్రతిష్ఠానాన్నోపమాగన్ధోఽపి.

అన్నితీరుల నుపమానిషేధము అసమమను నలంకారము. ఇయ్యదియు ననన్వయమున వ్యంగ్యమైనప్పటికిని అందలి చమత్కారమున కనుగుణమగుటచే రూపకదీపకములం దుపమవలె, ప్రత్యేకముగా నలంకారవ్యపదేశమును పొందదు. వాచ్యతాదశయందైతే స్వతంత్రముగా జమత్కారియగుటవలన ప్రత్యేకముగా వ్యపదేశమునుపొందును.

ఎట్లనగా—

"భూమీనాథ" మొ, (ఓ శహాబదీన మహారాజా! గుణములచే నీతో సమానమైనవాడు ఈ పంచమహాభూతనిర్మిత ప్రపంచమునందు లేడని చెప్పవలెనా? బ్రహ్మ నూతనకారణముచే నూతనసృష్టిచేసినచో అట్లయినను నీతో సమత్త్వలేశమును వహించునట్టి నరుడు ఉండనే ఉండడు)

మరియొకటి—

"భువనత్రితయేపి" మొ. (ఓరాజా! మనుష్యులతోను దేవతలతోను దానవులతోను పరిపూర్ణమగు భువనత్రయమునందును నీతోసామ్యము వహించువాడు ఉండబోడు, ఉంటుండలేదు, ఉండడు).

రాజస్తుతికుత్కర్షకముగనుక ఇచట అసమాలంకారము. చిట్టచివరిదియు, ఎక్కడో యొకచోట నేర్పడునట్టిదియునగు సదృశనిషేధము అసమాలంకారమునకు నుపమానలుప్తకును విషయము. అన్నివిధముల నుపమానమును నిషేధించుటచేత సాదృశ్యము నిలువదుగనుక నుపమాగన్ధముకూడ లేదు.

యత్తు—

"ఢుణ్డులన్తో మరీహాసి కణ్టక కలిఆఇం కే అ ఇవణాఇం
మాలఇ కుసుమసరిచ్ఛం భమర భమంతో న పావహిసి!" ఇతి.
నేయము పమావల స్తో పమా. తస్యాః సమ్భవదుపమానానుపాదాన విషయత్వాత్.అపిత్వసమాలఙ్కారః" ఇతి రత్నాకరేణోక్తమ్,తదసత్. మాలతీకుసుమసదృశం భ్రమర భ్రమన్నపి న ప్రాప్స్యసీత్యుక్త్యా వర్తతాంనామ తత్సదృశం క్వాపి, త్వయా తుదుష్ప్రాపమేవేతి ప్రత్యయాదాత్యన్తికోపమాననిషేధాభావాదుపమానలుప్తోపమైవేయం భవితుమర్హతి, నాసమాలఙ్కారః అన్యథా మాలతీకుసుమసదృశం నాస్తీత్యేవ బ్రూయాత్. నతు ప్రాప్స్యసీతి.

అయితే—

"ఢుండులంతో" ఇత్యాదిశ్లోకమున ఉపమానలుప్తయగు నుపమకాదు. అదిసంభవదుపమానానుపాదాన విషయముగనుక. ఇకనేమనగా – నసమాలంకారము అని రత్నాకరుడన్నాడు. అదియెంతయును దగదు. "మాలతీ

కుసుమముతో సదృశమును భ్రమరమా! తిరుగుచున్నను పొందబోవు'' అనుటచేత దానితోసమానమైనది ఎచటనైన నున్నచో నుండుగాక; నీకు మాత్ర మది దుష్ప్రాపమే నని తెలియుటవలన నాత్యంతికమగు నుపమా నిషేధములేదుగనుక నుపమానలుప్తయగు నుపమయే ఇదికాగలదు. అసమా లంకారము మాత్రముగాదు. అట్లుగాని యెడల మాలతీకుసుమసదృశము లేద నే చెప్పవలెను. అంతేగాని ప్రాప్తించలేవు అని చెప్పడు.

అథ అసమాలఙ్కారధ్వననేనైవ చమత్కారోపపత్తే రనన్వయస్య పృథగలఙ్కారతా కథమితి చేత్, సత్యమ్. దీపకాదేరప్యుపమాభివ్య క్త్యైవ చమత్కారోపపత్తౌ కథంనామ పృథగలఙ్కారత్వమితి తుల్యమ్. న చ దీపకాదావుపమాయా వ్యఙ్గ్యత్వేఽపి గుణీభావాత్ప్రకృతేతు స్వసాదృశ్యస్య స్వస్మిన్నతితమాం తిరస్కారేణాసమాలఙ్కార స్యైవముఖ్యతయా ధ్వననాత్ వైషమ్యమితి వాచ్యమ్. యథాహి దీపక సమాసోక్త్యాదౌ గుణీభూతవ్యఙ్గ్యసత్త్వేఽప్యలఙ్కారత్వం నహీ యతే ఏవమనన్వయే ప్రధాన వ్యఙ్గ్య సత్త్వేఽపీతి న కిఞ్చిద్విరుద్ధమ్. అనన్వయ శరీరస్య స్వసాదృశ్యమాత్రస్య వాచ్యత్వేన వాచ్యాల ఙ్కారవ్యపదేశోఽపి సుస్థ ఏవ. దీపకాద్యల ఙ్కారకావ్యే గుణీభూతస్య వ్యఙ్గ్యస్య సత్త్వాదస్తు నామ గుణీభూతవ్యఙ్గత్వమ్. ధ్వనిత్వం పునర్న క్వాప్యల ఙ్కృతి కావ్యే దృష్టమితిచేత్, పర్యాయోక్త సాదృశ్య మూలాప్రస్తుత ప్రశంసాది కావ్యే ధ్వనిత్వస్య స్ఫుటత్వాత్. ప్రాఞ్చస్తు నేదమలఙ్కారాన్తరమపీత్యాహుః.

అయ్యా? – అసమాలంకారమును ధ్వనింపచేయుచుండుట చేత నే చమత్కారముపపన్నమగుచుండగా ననన్వయము వేరుగా నలంకార మెట్లగును? నిజమే – దీపకాదులలో నుపమాభివ్యక్తిచేతనే చమత్కారము గుదురుచుండగా వేరుగా నలంకారత్వ మెట్లు, అనికూడ తుల్యమేకదా?

అదికాదయ్యా? దీపకాదులయం దుపమ వ్యంగ్యమైనను గుణీభూత మే గనుకను, ప్రకృతమునందు స్వసాదృశ్యము తనయందే అత్యంతముగా తిర స్కృతమగుటచే నసమాలంకార మే ముఖ్యముగా ధ్వనించును గనుకను వీటికి దృష్టాంతములో వైషమ్యమున్నదిగదా? అనరాదు. దీపకము సమాసోక్తి మొదలగుచోట్ల గణీభూతవ్యంగ్యత్వమున్నను అలంకారమగుట యెట్లు

రోదో, ఇట్లాగే అనన్వయముకడ ప్రధానవ్యంగ్యమున్నను నేమియు విరుద్ధములేదు. అనన్వయశరీరము, స్వసాదృశ్యమాత్రము, వాచ్యమగుట వల్ల వాచ్యాలంకార ప్రసిద్ధియు సుస్థమే. దీపకాద్యలంకారకావ్యమునందు గుణీభూతవ్యంగ్యమున్నది గనుక, గుణీభూతవ్యంగ్యత్వ ముండుగాక. ధ్వనిత్వముమాత్రము ఎక్కడను అలంకృతికావ్యములందు దృష్టముకాలేదు, అన్నచో - పర్యాయోక్తసాదృశ్యమూలా ప్రస్తుత ప్రశంసాదికావ్యమున ధ్వనిత్వము స్ఫుటముగదా? ప్రాచీనులుమాత్రము ఇది అలంకారాంతరము గాదనెదరు.

అయం చాసమాలఙ్కారో వ్యఙ్గ్యమానో యథా—

"మయి త్వదుపమావిధౌ వసుమతీశ వాచంయమే
న వర్ణయతి మామయం కవిరితి క్రుధం మాకృథాః.
చరాచరమిదం జగజ్జనయతో విధేర్మానసే
పదం నహి దధే తరాం తవ ఖలు ద్వితీయో నరః."

అత్ర య ఏతావన్తం సమయం విధాతు ర్మానసం నాధిరూఢః సోఽగ్రేఽపి మానా భావాన్నాధిరోహేత్, అతః సర్వథైవ నాస్తీతి గమ్యతే. ఏవం వ్యజ్యమానోఽప్య సమోఽత్ర ప్రధానీభూత రాజస్తుత్యుత్కర్షకతయాలఙ్కార ఏవ.

ఈ యసమాలంకారము వ్యంగ్యమగుట నెట్లనగా—

"మయిత్వ దుపమా విధౌ" మొ. (ఓ భూనాథుడా! నేను నీసామ్య విషయములో మౌనియైయుండగా యీ కవి నన్ను వర్ణించలేదని కోపము చేయకుము. యీ చరాచరజగత్తును బుట్టించునట్టి బ్రహ్మయొక్క మనస్సు నందు నీతో సమానమైన మనుష్యులు అడుగుబెట్టనేలేదు).

ఎవరింతకాలము విధాతమనసులోని కెక్కలేదో అత డికముందుగూడ నెక్కడు (ప్రమాణమేమియును లేదుగనుక). ఇందువల్ల నన్నివిధముల లేడ నియే దోచును. కాగా - ఇచట వ్యంగ్యమైతోచుచున్నను అసమమే ఇచట ప్రధానీభూతరాజస్తుత్యుత్కర్షకము గనుక నలంకారమే.

ముఖ్యతయా ధ్వన్యమానోఽయం యథా—

"సదసద్వివేకరసికై రాలోక్య సమస్తలోకమథ కవిభిః.
గణితా గగనలతాదేర్గణనాయాం తన్వి! తవ సదృశీ."

అయం క్వచి దుపమానస్య నిషేధాత్ క్వచిచ్చ సాక్షాదుపమాయా ఏవ. ఆద్యస్తూపదర్శితః. ద్వితీయో యథా—

'పూర్ణమసురై రసాతల మమరైః స్వర్గో వసుంధరా చ నరైః.
రఘువంశవీరతులనా తథాపి ఖలు జగతి నిరవకాశైవ.'

ఏవం పూర్ణతయా లుప్తతయా చాస్యాపి యథా సంభవం భేదా ఉన్నేయాః.

ముఖ్యముగా ధ్వనించునది యెట్లనగా—

"సదసద్వివేక" మొ. (మంచి చెడ్డల వివేచనయందు రసికులగు కవులచేత సమస్తలోకమును జూచి ఓ తన్వీ! నీకు సమానమైన వస్తువు, గగనలతాదులను గణించునపుడు లెక్కింపబడినది). ఇది ఒకయెడ నుపమానమును నిషేధించుటవలన, మరియొకయెడ సాక్షాత్తుగానే యుపమను నిషేధించుటవల్లను ఏర్పడును

మొదటిది చూపబడెను.

రెండవది యెట్లనగా—

"పూర్ణమ్" మొ. (అసురులచే రసాతలము పూర్ణమైనది దేవతలచేత స్వర్గము, భూమి మనుష్యులచేత పూర్ణమైనది అట్లాగైనను రఘువంశవీరుని తులన ప్రపంచమున నిరవకాశమైనది).

ఈ తీరున పూర్ణముగాను లుప్తముగాను యథాసంభవముగా దీనికిని భేదము లూహించవలయును.

ఇది అసమాలంకారప్రకరణము.

## ఉదాహరణమ్

సామాన్యేన నిరూపితస్యార్థస్య సుఖప్రతిపత్తయే తదేకదేశం నిరూప్య తయోరవయవావయవి భావఉచ్యమాన ఉదాహరణమ్. అర్థాన్తరన్యాస వారణాయోచ్యమాన ఇతి. వచనం చ ఇవ, యథా, నిదర్శన, దృష్టాన్తాది శబ్దైః కావ్యేషు స్ఫుటమ్. న చ ఇవ యథా శబ్దయోః సాదృశ్యవచనయోరవయవావయవిభావే విశేష సామాన్యాత్మకే నాస్తి వృత్తిరితి వాచ్యమ్, లక్షణాయాః సామ్రా జ్యాత్. అన్యథాహ్యుత్ప్రేక్షా బోధకతాపి దుర్ఘటా స్యాత్.

సామాన్యముగా నిరూపించబడిన యర్థము సుఖముగా బోధపరచుటకై దానిలోని యొకభాగమును నిరూపించి ఆ రెంటికిని యవయవావయవిభావ ముచ్యమానమగుచో నుదాహరణము.

అర్థాంతరన్యాసమును వారించుటకై "ఉచ్యమాన"మని చెప్పుట. వచనముకూడ ఇవ-యథా-నిదర్శన-దృష్టాంత ఆది శబ్దములచే గావ్యము లందు స్పష్టమే. అయితే- ఇవ-యథా-శబ్దములు సాదృశ్యవాచకములు గదా ? అవి అవయావయవిభావమునందు, విశేషసామాన్యాత్మకమునందు ఎట్లు బోధకములగును అందురా? లక్షణాసామ్రాజ్యమగుటచే చెల్లుబడి యగును. అట్లుగానిచో నుత్ప్రేక్షాబోధకతయున్నూ దుర్ఘటమగును గదా ।

ఉదాహరణమ్—

'అమితగుణోఽపి పదార్థో దోషేణైకేన నిన్దితో భవతి,
నిఖిల రసాయనరాజో గన్ధేనోగ్రేణ లశున ఇవ.''

న చాత్ర పదార్థ లశునయో రుపమా శక్యావక్తుమ్. తయోః సామాన్య విశేషభావేన సాదృశ్యస్యానుల్లాసాత్. తథాత్వే తు ఇవ శబ్దాదీనామివ సదృశాది శబ్దానా-మప్యలఙ్కారేఽస్మిన్ ప్రయోగః స్యాత్. యథావా—

"అతిమాత్రబలేషు చాపలం విదధానః కుమతిర్వినశ్యతి.
త్రిపురద్విషి వీరతాం వహన్నవలిప్తః కుసుమాయుధో యథా"

అత్ర త్రిపురద్విడ్వీరతే అతిమాత్రబలచాపలయోర్విశేషౌ. అవలేప కుసుమాయుధౌ చ కుమతిరిత్యత్ర గుణప్రధానయోః.

ఉదాహరణము:—

"అమిత గుణోఽపి" మొ. (చాలాగుణములు గలిగియున్నను పదార్థ మొక్క దోషముచే నిఖలరసాయనములకు రాజైనను ఉగ్రమగు వాసనచే వెల్లుల్లివలె నిందింపబడును) ఇచట పదార్థలశునములకు నుపమచెప్పుటకు వీలుగాదు. ఆ రెండింటికిని సామాన్యవిశేషణభావమువలన సాదృశ్య ముల్ల సించదుగదా? అలాగేనయినచో నివాదిశబ్దములకువలె సదృశాదిశబ్దములకు గూడ నీయలంకారమున ప్రయోగముండితీరవలయునుగదా?

మరియొకటి—

"అతిమాత్రబలేషు" మొ. (ఎక్కువ బలముగలవారియందు చాప ల్యము చేసిన కుమతి త్రిపుర శత్రువునందు వీరత్వమునువహించి బొగరెక్కిన కుసుమాయుధునివలె నశించును). ఇచట త్రిపుర ద్విట్ వీరతలు అతిమాత్ర బలచాపలముల విశేషములు, అవలేపకుసుమాయుధములును కుమతిః అనే చోట గుణప్రధానములకు.

యథా వా—

ఉపకారమేవ కురుతే విపద్గతః సద్గుణో నితరామ్.
మూర్ఛాం గతో మృతోవా నిదర్శనం పారదోఽత్ర రసః'

దృష్టాన్తో వా. ఇవాది శబ్దప్రయోగే సామాన్యార్థ ప్రాధాన్యం వాక్యైక్యమ్; నిదర్శనాది శబ్దప్రయోగే తు విశేష ప్రాధాన్యం వాక్యభేదశ్చేతి విశేషః.

తత్ర తావత్ 'అమితగుణః—' ఇతి పద్యే క్రియా ప్రధానమా ఖ్యాతమితి నయేఽమిత గుణపదార్థ కర్తృక మేకదోష హేతుకం నిన్దా విషయీభవనం నిఖిల రసాయనరాజ లశున కర్తృకోగ్రగన్ధ హేతుక నిన్దావిషయీభవనావయవకమితి ధీః. ప్రథమాన్త విశేష్యక బోధవాదినాం తూగ్రగన్ధ హేతుక నిన్దావిషయీభవ నాశ్రయ తాదృశలశునావయవకస్తాదృశపదార్థ ఏకదోష హేతుక నిన్దా విషయీభవనాశ్రయ ఇతి. తత్రాపి విశేషవాక్యార్థే క్రియాన్వ యో మృగ్యతే హేత్వన్తరాన్వయార్థమ్, అన్యథా తాదృశ లశునావయవకే తాదృశ పదార్థ ఏవ క్రియాన్వయోపపత్తిః స్యాత్.

ఏవం యథా శబ్దస్థలేఽపి. "ఉపకారమేవ—" ఇత్యత్రతు విపద్గతా భిన్నః సద్గుణ ఉపకారానుకూలకృతిమానితి పూర్వవాక్యార్థః, అత్రాస్మిన్నర్థే మూర్ఛాం గతో మృతోవా పారదో నిదర్శన మేకదేశ ఇత్యుత్తరవాక్యార్థే గుణ ఇతి కేషాఞ్చిత్. ఇతరేషాం తు తాదృశ కర్తృకా తాదృశక్రియేతి పూర్వవాక్యార్థే తాదృశః పారద ఏకదేశఇతి. ప్రధానావయవస్యేవ గుణావయవస్యాపి విశిష్టార్థావయవత్వాత్, ఘటమానయేత్యత్ర నీలఘటవత్.

మరియొకటి—

"ఉపకారమేవ" మొ. (సద్గుణుడు మిక్కిలి విపత్తునుబొందినను ఉప కారమునే చేయును. మూర్ఛపోయినను, మృతమైనను పాదరసము యీ విషయములో దృష్టాంతము). "దృష్టాంతః" అనికాని పాఠము. ఇవాది శబ్దములను ప్రయోగించినపుడు సామాన్యార్థము ప్రధానమగుట వాక్యై క్యము, నిదర్శనాదిశబ్దప్రయోగమునందు విశేషప్రాధాన్యము వాక్యభేద మున్నూ విశేషము.

అక్కడనైతే - 'అమితగుణః' అను పద్యములో · "క్రియా ప్రధాన మాఖ్యాతం" అనే నయములో సమిత గుణపదార్థకర్తృకము ఏకదోష హేతుకమగు నిందావిషయీభవనము, నిఖిలరసాయనరాజలశునకర్తృకోగ్ర గంధహేతుకనిందావిషయీభవనావయవక మని బోధ.

ప్రథమాంతవిశేష్యమే బోధ యనేవారి మతములో ఉగ్రగంధహేతుక నిందావిషయీభవనాశ్రయతాదృశలశునావయవక, తాదృశపదార్థము ఏక దోషహేతుకనిందావిషయీభవనాశ్రయము అని. అక్కడను విశేషవాక్యా ర్థమునందు క్రియాన్వయము హేత్వంతరాన్వయమునకై వెనుకబడుచున్నది. అలాలేనియెడల అటువంటి లశునావయవకమగు తాదృశపదార్థమునందు మాత్రమే క్రియాన్వయమున్నచో ఉపపత్తిలేకపోవును. ఈతీరుగానే యథాశబ్దముండిన స్థలమునందునుగూడ.

'ఉపకారమేవ కురుతే' అనేచోట 'విపద్గతాభిన్నుడగు సద్గుణుడు ఉపకారానుకూల కృతిమంతుడు' అను పూర్వవాక్యార్థము, "అత్ర మూర్ఛాంగతో మృతోవా పారదో నిదర్శన మేకదేశః" అను ఉత్తర వాక్యార్థమందు గుణమని కొందరు.

ఇతరులైతే—

"అటువంటివాడు కర్తగా గల్గినట్టి అట్టిక్రియ" అని పూర్వవాక్యార్థమున నటువంటి పాదరస మేకదేశమని. ప్రధానమగు నవయవమునకు వేరే గుణావయవమున్నూ విశిష్టార్థము యొక్క అవయవమేగదా? 'ఘటమానయ' అనుచోట నీలఘటమువలెనే.

'అర్థిభిశ్ఛిద్యమానోఽపి స ముని ర్న వ్యకమ్పత
వినాశేఽప్యున్నతః స్థైర్యం న జహాతి ద్రుమో యథా'

అత్ర దధీచ్యాలమ్బనాయాం తదీయలోకోత్తరచరితస్మరణోద్దీపితాయా మేతత్పద్యప్రయోగానుభావితాయా మేతత్పద్యనిర్మాతృగతాయాం రతౌ ప్రధానీభూతాయామర్థ్యాలమ్బనస్తత్కృత యాచ్ఞాశ్రవణోద్దీపితో గాత్రచ్ఛేదాభ్యనుజ్ఞానానుభావితో ధృత్యా సఞ్చారిభావేన పోషితో మునిగత ఉత్సాహో గుణః. తత్ర చాద్యర్థ తృతీయ చరణగతస్యార్థాన్తరన్యాసస్యోత్కర్షకతయాస్థితస్య వివేచనద్వారాలఙ్కరణం చతుర్థ చరణశకలగతముదాహరణమ్.

"అర్థిభిః" మొ. (అర్థులచేత భేదింపబడుచున్నను ఆ ముని (దధీచి) కంపించలేదు; ఉన్నతులైనవారు నాశమునందైనను స్థైర్యమును చెట్టువలె విడువరు). ఇచట దధీచి యాలంబనముగా నతని లోకోత్తరచరిత్రము స్మరించుటచే నుద్దీపితమై ఈ పద్యమును నిర్మించినవానియం దుండిన ప్రీతి యందు, ప్రధానభూతమగు దానిలో, యాచకు డాలంబనముగా గలదియు, నాత డొనర్చిన యాచ్న వినుటచే నుద్దీపితమైనదియు, దధీచిశరీరమును ఛేదించుట కనుజ్ఞ ఇచ్చుటచే ననుభావితమును, ధృతియను సంచారిభావముచే పోషింపబడిన మునిగతమగు నుత్సాహము గుణము. అందులో అర్ధచరణ సహితమగు మూడవపాదమున ఉత్కర్షకముగానున్న అర్థాన్తరన్యాసము యొక్క వివేచనముద్వారా నాల్గవచరణ శకలమునందలి ఉదాహరణము అలంకరణము.

ఏవమేవ—

'అనన్తరత్నప్రభవస్య యస్య
హిమం న సౌభాగ్యవిలోపి జాతమ్.

ఏకో హి దోషో గుణసన్నిపాతే
నిమజ్జతీన్దోః కిరణేష్వివాఙ్కః'

ఇతి కాలిదాసపద్యేఽపి బోధ్యమ్.

అస్మింశ్చాలఙ్కారేఽవయవావయవిభావబోధకస్యైవశబ్దాదేః ప్రయోగః, సామాన్యవిశేషయోరేకరూపవిధేయాన్వయశ్చార్థాన్తరన్యాసభేదాత్ వైలక్షణ్యాధాయక ఇతి తత్ప్రకరణే నిపుణతరముపపాదయిష్యామః.

ఇటులనే—

'అనంత' (అనంతములైన రత్నములకు ఉత్పత్తిస్థానమైన ఆ హిమవంతునకు మంచు సౌభాగ్యమును లోపింపజేయునదిగా లేదు. ఒకదోషము గుణములసమూహములో చంద్రకిరణములయందు కలంకమువలె మునిగిపోవునుగదా!) ఇత్యాదికముకు కాళిదాసుపద్యమునందును గ్రహించవలయును. ఈ యలంకారములో నవయవావయవిభావబోధకమగు ఇవాదికి ప్రయోగము, సామాన్యమునకును విశేషమునకును ఏకరూపమగు విధేయమునందు అన్వయమున్ను అర్థాంతరన్యాసభేదముకంటె వైలక్షణ్యమును గూర్చునది ఆ ప్రకరణమున నిపుణతరముగా నుపపాదింతుము.

ప్రాఞ్చస్తు 'నాయమలఙ్కారోఽతిరిక్తః. ఉపమయైవ గతార్థత్వాత్. న చ సామాన్యవిశేషయోః సాదృశ్యానుల్లాసాత్కథముపమేతి వాచ్యమ్. 'నిర్విశేషం న సామాన్యమ్' ఇతి సామాన్యస్య యత్కిఞ్చిద్విశేషం వినా ప్రకృతత్వాయోగాత్సాదృశవిశేషమాదాయ విశేషాన్తరస్య సాదృశ్యోల్లాసే బాధకాభావా దివాదిభిరాముఖే ప్రతీయమానస్యాపి సామాన్యవిశేషభావస్య పరిణామే సాదృశ్య ఏవ విశ్రాన్తేః ఇత్యప్యాహుః.

ప్రాచీనులైతే— ఈ యలంకార మతిరిక్తముగాదు. ఉపమచేతనే గతార్థముగాదా?అయితే సామాన్యవిశేషములకు సాదృశ్య ముల్లసించదుగనుక నుపమ యెట్లగునందురేమో—

“నిర్విశేషం న సామాన్యం” అని సామాన్యమునకు నేదో విశేషములేక ప్రకృతత్వము గుదురదు గనుక నటువంటివిశేషమును దీసుకొని మరియొక విశేషమునకు సాదృశ్య ముల్లసిల్లునపుడు బాధక మేమియునులేదు. కనుక నివాదిశబ్దములచే నెదుట తోచుచున్నను సామాన్యవిశేషభావమునకు పరిణామమున సాదృశ్యమునందే పర్యవసానముగనుక - అని చెప్పుదురు.

## స్మరణమ్

సాదృశ్యజ్ఞానోద్బుద్ధ సంస్కారప్రయోజ్యం స్మరణం స్మరణాలఙ్కారః. యథా—

దోర్దణ్డద్వయకుణ్డలీకృత లసత్కోదణ్డచణ్డధ్వని
ధ్వస్తోద్దణ్డవిపక్షమణ్డలమథ త్వాం వీక్ష్య మధ్యేరణమ్.
వల్గద్గాణ్డివముక్త కాణ్డవలయజ్వాలావలీతాణ్డవ
భ్రశ్యత్ఖాణ్డవరుష్టపాణ్డవమహో కో న క్షితీశస్స్మరేత్.

యథా వా—

భుజభ్రమిత పట్టిశోద్దలితదృప్త దన్తావలమ్
భవన్త మరిమణ్డలక్రథన పశ్యతః సఙ్గరే.
అమన్దకులిశాహతిస్ఫుట విభిన్నవిన్ధ్యాచలో
నకస్య హృదయం ఝుగిత్యధిరురోహ దేవేశ్వరః.

అనయోః పద్యయోః ప్రధానీభూతాయా రాజవిషయక కవినిష్ఠరతే రుత్కర్షకతయా స్మరణమలఙ్కారః, ఆద్యే వాచ్యమ్; ద్వితీయే తు లక్ష్యమితి విశేషః. వీరరసోఽపి చాత్ర ప్రధానోత్కర్ష కతయాలఙ్కార ఏవ.

సాదృశ్యజ్ఞానమువలన నుద్బుద్ధమగు సంస్కారముచే ప్రయోజ్యము స్మరణము, స్మరణాలంకారము.

ఎట్లనగా—

“దోర్దండ” మొ. (రెండుబాహువులచేతను కుండలీకృతమై విలసిల్లుచున్న విల్లుయొక్క తీక్ష్ణమైన ధ్వనిచే ధ్వంసముచేయబడిన ఉద్దండమైన శత్రుమండలముగల నిన్ను యుద్ధమధ్యలో జూచి ఆ అందమైన గాండీవముతో

విడువబడిన బాణముల సమూహము యొక్క మంటల సమూహము యొక్క తాండవముచే భ్రష్టమగుచున్న ఖాండవముగలిగి రోషించిన అర్జునుని ఎవ్వడు స్మరింపడు?)

మరియొకటి—

"భుజ భ్రమిత" మొ. (శత్రుమండలము నశింపజేయువాడా! భుజములతో తిప్పబడిన పట్టిశముచే ఖండింపబడిన మదించిన ఏనుగులుగల నిన్ను యుద్ధమునజూచు ఎవ్వనికి గొప్పవజ్రాయుధము యొక్క దెబ్బలచే స్ఫుటముగా విభిన్నమైన వింధ్యపర్వతముగల దేవేశ్వరుడు హృదయమును వెంటనే అధిష్ఠించ లేదు?)

ఈ రెండుపద్యములందును ప్రధానీభూతమైన రాజవిషయక కవినిష్ఠ రతి ఉత్కర్షకము గనుక స్మరణము అలంకారము. మొదటి పద్యమున వాచ్యము. రెండవ పద్యమున లక్ష్యము నని భేదము. వీరరసమున్న ఇచట ప్రధానమున కుత్కర్షము గనుక నలంకారమే.

ఏకీభవత్ప్రళయకాలపయోధికల్ప
మాలోక్య సఙ్గరగతం కురువీరసైన్యమ్
సస్మార తల్పమహిపుఙ్గవ కాయకాన్తం
నిద్రాం చ యోగ కలితాం భగవాన్ ముకున్దః.

అత్ర తల్పనిద్రయోః స్మరణం యద్యపి న తల్పనిద్రాసాదృశ్యదర్శనోద్బుద్ధ సంస్కారప్రయోజ్యమ్, తథాపి సైన్యగత పయోధిసాదృశ్యదర్శనోద్బుద్ధ పయోధివిషయక సంస్కారజన్య పయోధిస్మరణాధీనత్వాద్భవత్యేవ యత్కిఞ్చిత్సాదృశ్యదర్శనోద్బుద్ధ సంస్కారప్రయోజ్యమ్, నహి సాదృశ్యే స్మర్యమాణ సమ్బన్ధిత్వం వివక్షితమ్. ఏవం వాచ్యయోస్తల్పనిద్రాస్మరణయోః ఏతత్కారణతయా ఆక్షిప్తస్య పయోధిస్మరణస్య చావిశేషేణ సఙ్గ్రహాయ లక్షణే జన్యత్వమపహాయ ప్రయోజ్యత్వముపాత్తమ్. కేచిత్తు సదృశజ్ఞానోద్బుద్ధ సంస్కారజన్యం సదృశవిషయకమేవ స్మరణమలఙ్కారః, భుజగేన్ద్రనిద్రాస్మృతిస్తు నాలఙ్కార ఇత్యాహుః.

'ఏకీభవత్' (ఒకటిగానగుచున్న ప్రళయకాలమునందలి సముద్రముతో సమానమైన యుద్ధమునందున్న కురువీరులసైన్యము నుజూచి సర్పరాజు శరీరముతో అందమైన తల్పమును, యోగనుచేకూర్పబడిన నిద్రను భగవానుడగు ముకుందుడు స్మరించెను). ఇత్యాది శ్లోకమున తల్పనిద్రల స్మరణము విచారింపగా - తల్పనిద్రలతో సాదృశ్యమును జూచుటచేత నుద్బుద్ధమగు సంస్కారముచే ప్రయోజ్యముగాదు; అట్లైనను సైన్యగతమగు పయోధిసాదృశ్యమును జూచుటచే నుద్బుద్ధమగు పయోధివిషయకమగు సంస్కారమువలన జన్యమగు పయోధిస్మరణాధీనమగును గనుక యే కొంచమో సాదృశ్యదర్శనోద్బుద్ధమగు సంస్కారమువలన ప్రయోజ్యమే యగును. సాదృశ్యమున స్మర్యమాణసంబంధిత్వము వివక్షితముకాదే?

ఈ తీరుగా వాచ్యములగు, తల్పనిద్రాస్మరణములకు దీనికి కారణముగా నాక్షిప్తమగు పయోధిస్మరణమునకున్ను అవిశేషముగా సంగ్రహము కొఱకు లక్షణమందు జన్యత్వమునువిడచి ప్రయోజ్యత్వ ముపాత్తమైనది.

కొంతమంది సదృశజ్ఞానోద్బుద్ధమగు సంస్కారమువలన జన్యమైన సదృశవిషయకమైన స్మరణమే యలంకారము. భుజగేంద్రనిద్రాది స్మృతియైతే అలంకారము గాదన్నారు.

'ఇత ఏవ నిజాలయం గతాయా
వనితాయా గురుభిః సమావృతాయాః।
పరివర్తితకన్ధరం నతభ్రు
స్మయమానం వదనామ్బుజం స్మరామి'.

అత్ర స్మరణం చిన్తోద్బుద్ధ సంస్కారప్రయోజ్యత్వాన్నాలఙ్కారః; వ్యఙ్గ్యత్వవిరహాచ్చ న భావః, ఏవమ్—

'దరానమత్కన్ధర బన్ధమీష న్నిమీలిత స్నిగ్ధ విలోచనాబ్జమ్
అనల్పనిశ్వాసభరాలసాఙ్గ్యాః స్మరామి సఙ్గం చిరమఙ్గనాయాః'

ఇహాపి స్మృతిర్న భావో నాప్యలఙ్కారః, వ్యఙ్గ్యస్యైవ వ్యభిచారిణో భావత్వాత్. యథా — 'సావై కలఙ్కవిధురా మధురాననశ్రీః' అయంచాలఙ్కారికాణాం సమ్ప్రదాయో యత్సాదృశ్యమూలకత్వే స్మరణం నిదర్శనాదివదలఙ్కారః. తస్యాభావే వ్యఙ్గ్యతాయాం భావః తయోరభావేతు వస్తుమాత్రమ్

'ఇతఏవ' (ఇచ్చట నుండియే తనయింటికి బోవుచూఉన్న గురుదేవులచే ఆవరింపబడిన వనితయొక్క త్రిప్పబడిన మెడగలట్టియు వంగిన కనుబొమలు కలిగి నవ్వుచున్న ముఖపద్మమును స్మరించుచున్నాను.) ఇచట స్మరణము చింతోద్బుద్ధసంస్కారప్రయోజ్యమైనందున అలంకారముగాదు. వ్యంగ్యత్వములేదుగనుక భావమున్నుగాదు.

ఈ తీరుగా—

"దరానమత్" (కొద్దిగావంగుచున్న మెడగలట్టియు కొంచముగా మూయబడిన అందమైన పద్మమువంటి కనులుగలట్టియు గొప్ప నిట్టూర్పుల బరువుచే యందమైనశరీరముగలట్టి అంగనయొక్క చిరకాలమైన సంగమము స్మరించుచున్నాను ) ఇత్యాది శ్లోకమునందుగూడ స్మృతి భావముగాదు; అలంకారముగాదు; వ్యంగ్యమైనదే వ్యభిచారిభావము గనుక.

ఎట్లనగా"—స్మైవ కలంకవిధురా మధురాననశ్రీః". ఇదియే ఆలంకారికుల సంప్రదాయము - ఏమంటే - సాదృశ్యమూలమై స్మరణము నిదర్శనాదులవలె నలంకారము. అదిలేకపోయిన వ్యంగ్యమగుచో భావము. అవి రెండును లేకపోయినయెడల వస్తుమాత్రము.

అప్పయ్యదీక్షితాస్తు—

'స్మృతిః సాదృశ్యమూలా యా వస్త్వన్తరసమాశ్రయా
స్మరణాలఙ్కృతిః సాస్యాదవ్యఙ్గ్యత్వ విశేషితా'

యథా—

'అపి తురగసమీపాదుత్పతన్తం మయూరం
న స రుచిరకలాపం బాణలక్ష్యీచకార
సపది గతమనస్క శ్చిత్రమాల్యానుకీర్ణే
రతివిగలితబన్ధే కేశపాశే ప్రియాయాః'

యథా వా—

'దివ్యానామపి కృతవిస్మయాం పురస్తా
దమ్భస్తః స్ఫురదరవిన్ద చారుహస్తామ్
ఉద్వీక్ష్య శ్రియమివ కాంచిదుత్తరన్తీ
మస్మార్షీజ్జలనిధి మన్థనస్య శౌరిః'

ఏకత్ర సదృశదర్శనాత్త త్సదృశకర్మికాస్మృతిః ఇతరత్ర సదృశ దర్శనాత్త త్సదృశలక్ష్మీ సమ్బన్ధినో జలనిధి మన్థనస్య స్మృతిః, ఉభయ త్రాపి సాదృశ్యమూలక వస్త్వన్తరస్మృతిత్వ మవిశిష్టమ్. అతఏవ సదృశాసదృశ సాధారణ్యార్థతయా లక్షణే వస్త్వన్తర గ్రహణమర్థవత్.

"సౌమిత్రే నను సేవ్యతాం తరుతలం చణ్డాంశురుజ్జృమ్భతే
చణ్డాంశోర్నిశి కా కథా రఘుపతే చన్ద్రోయమున్మీలతి.
వత్సైతద్విదితం కథం ను భవతా ధత్తే కురఙ్గం యతః
క్వాసి ప్రేయసి హా కురఙ్గనయనే చన్ద్రాననే జానకి"

అత్ర శ్రుతకురఙ్గ సమ్బన్ధిన స్తన్నయనస్య స్మరణాత్తత్సదృశ సీతానయనస్మృతి స్తత్సమ్బన్ధి సీతాస్మృతిశ్చేతి. కిం త్వేషా వ్యఙ్గ్య అలఙ్కార్యభూతా చ. తదావ్యావృత్త్యర్థ మవ్యఙ్గ్యత్వ విశేషణమ్.

'అత్యుచ్చాః పరితః స్ఫురన్తి గిరయః స్ఫారాస్తథామ్భోధయ
స్తానేతానపి బిభ్రతీ కిమపి న శ్రాన్తాసి తుభ్యం నమః,
ఆశ్చర్యేణముహుర్ముహుః స్తుతిమితి ప్రస్తౌమి యావద్భువ
స్తావద్బిభ్రదిమాంస్మృత స్తవ భుజో వాచ స్తతోముద్రితాః"

అత్ర స్తూయమానభూసమ్బన్ధినో భూభృతః స్తుతిర్న సాదృ శ్యమూలేతి నాత్రస్మరణాలఙ్కారః, కింతు స్మృతేః సఞ్చారిభావస్య భూభృద్విషయక రతిభావాఙ్గత్వాత్ ప్రేయోఽలఙ్కారః. ఏతదావ్యా వృత్తయే సాదృశ్యమూలేతి విశేషణమ్" ఇత్యాహుః.

అప్పయ్యదీక్షితులైతే

"స్మృతిః" మొ. (సాదృశ్యమూలకమై వస్త్వంతరము నాశ్రయించిన స్మృతియే అవ్యంగ్యత్వవిశేషితమై స్మరణాలంకారమగును.) ఎట్లనగా.

"అపితురగ" మొ. (అప్పుడు గుఱ్ఱము సమీపమున నెగురుచున్న నెమలిపై, అందమైన కలాపముగలదానిపై, చిత్రమాల్యముచే ఆకీర్ణమైన రతిసమయమున విగలితమగు బంధముగల ప్రియురాలి కేశపాశమునం దప్పుడే మనసుగలిగినవాడై దశరథుడు బాణమును గురిపెట్టలేదు.)

మరొకటి—

"దివ్యానామ్" మొ. (దివ్యులకుకూడా ఆశ్చర్యముకలిగించునట్టియు, తనముందు స్ఫురించుచున్న అరవిందములతో సుందరమైన చేయిగలిగి లక్ష్మి వలెనున్న ఒకకాంతను నీటిలోనుండి పైకివచ్చుచుండగాజూచి శౌరి సముద్ర మథనమును స్మరించెను.) ఒకచోట సదృశదర్శనమువలన తత్సదృశకర్మికయగు స్మృతి ఇతరత్ర సదృశదర్శనమువలన తత్స దృశలక్ష్మిసంబంధియగు జలనిధి మంథనపు స్మృతి. రెండుతావులను సాదృశ్యమూలకమగు వస్త్వంతరస్మృతిత్వము తేడాలేనిదే? – ఇందువల్లనే సదృశాసదృశములకు సాధారణ్యముకొఱకు లక్షణములో వస్త్వంతర గ్రహణము సార్థకము.

"సౌమిత్రే"

(రా.– లక్ష్మణుడా చెట్టునీడకు నడువుము. సూర్యుడు విజృంభించు చున్నాడుగదా.

ల:– సూర్యునకు రాత్రిపూట ఏమి ప్రసక్తి? చంద్రుడు వీడు ప్రకాశించుచున్నాడు.

రా:– బాలుడా! ఇది నీకెట్లు తెలిసినది?

ల:– లేడినిధరించినాడు కనుక.

రా:– ఎక్కడనున్నావు లేడికన్నులదానా! చంద్రాననా జానకీ!)

ఇత్యాది శ్లోకమునందు విన్న లేడికి సంబంధించిన నానేత్రములు స్మరించుటవలన వానితో సమానమైన సీతకన్నులు జ్ఞప్తికివచ్చుటయు, నా కన్నులుగల సీత జ్ఞాపకమునకువచ్చుటయున్న అని. కాని ఇదివ్యంగ్యమగు టచే నలంకారము. దాని వ్యావృత్తికొఱకైన వ్యంగ్యత్వవిశేషణము.

"అత్యుచ్చాః" మొ. "బాగా ఎత్తైనవై అంతటను కొండలుప్రకా శించుచున్నవి. విశాలములై సముద్రములు గూడా స్ఫురించుచున్నవి. వాటిని ధాల్చుచు ఎంతమాత్రమును ఆయాసపడుటలేదు; నీకు నమస్కారము! ఇట్లు ఆశ్చర్యముతో భూమిస్తోత్రమును ప్రస్తావింపనుండగనే యీ భూమిని మోయుచున్న నీ భుజము జ్ఞప్తికిరావటంతోనే, మాటలు అంతలో ముద్రి తములైనవి." ఇచట స్తుతింపబడుచున్న భూమికి సంబంధించినరాజు

యొక్క స్మృతి సాదృశ్యమూలకముగాదని ఇచట స్మరణాలంకారముగాదు. ఇకనేమనగా? స్మృతి ఇచట సంచారిభావము, భూభృద్విషయమగు రతి భావమున అంగము అగుటవలన ప్రేయోలంకారము. దీని వ్యావృత్తికై "సాదృశ్యమూల" అను విశేషణము అని చెప్పిరి.

తదేతత్సర్వ మరమణీయమ్. యత్తావదుచ్యతే సదృశాస దృశయోః కేశపాశజలనిధిమన్థనయోః సఙ్గ్రహాయ లక్షణే వస్త్వన్తర గ్రహణమర్థవదితి, తత్ర సాదృశ్యమూలా స్మృతిః స్మరణాలఙ్కార ఇత్యేతావతైవ కేశపాశస్మరణస్యేవ జలనిధిమన్థన స్మరణస్యాపి సఙ్గ్రహా ద్వస్త్వన్తరసమాశ్రయత్వవిశేషణ మనర్థకమ్. ఏకత్ర సాదృశ్య దర్శనోద్బుద్ధ సంస్కారజన్యత్వేన, అపరత్రచ సాదృశ్యదర్శనోద్బుద్ధ సంస్కారజ ॰ క్ష్మీస్మరణోద్బుద్ధ సంస్కారజన్యత్వేనచ సాదృశ్య మూలత్వా విశేషాత్. నహి సాదృశ్యమూలేత్యుక్తే సదృశవిషయేతి లభ్యతే, యేన జలనిధి మన్థన స్మృతే రసఙ్గ్రహః స్యాత్. యదపి 'సౌమిత్రే నను సేవ్యతామ్' ఇత్యత్ర స్మృతిర్వ్యఙ్గ్యా అలఙ్కార్య భూతాచ తద్వ్యావృత్తయేఽవ్యఙ్గ్యత్వ విశేషణ మిత్యుక్తమ్; తత్ర నేయం స్మృతిరలఙ్కార్యభూతా, కిన్తు జానక్యాలమ్బనో నిశాస మయోద్దీపితః సన్తాపాదినానుభావిత ఉన్మాదేన సంచారిణా పరిపో షితో విప్రలమ్భః ప్రధానత్వేనాలఙ్కార్యః. తస్య చ స్మృతిరుత్కర్ష హేతుత్వాదలఙ్కార ఏవ. అతో నితరాం తద్వ్యావృత్త్యర్థ మవ్య ఙ్గ్యత్వ విశేషణోపాదానమనుచితమ్. నహి వ్యఙ్గ్యత్వాలఙ్కారత్వ యోర్విరోధ ఇతి వక్తుం శక్యమ్. నిత్యవ్య ఙ్గ్యానాం రసభావాదీనామపి పరాఙ్గతాయా మలఙ్కారత్వాభ్యుపగమాత్. ప్రధానవ్యఙ్గ్యవ్యా వృత్త్యర్థం పునరుపస్కారకత్వం సర్వేష్వలఙ్కారలక్షణేషు దేయ మితి ప్రాగేవావేదితమ్, యదప్యుక్తమ్ 'అత్యుచ్చాః పరితః స్ఫురన్తి గిరయః —' ఇత్యత్ర స్మృతేః సంచారిభావస్య భూభృద్విషయరతి భావాఙ్గత్వాత్ప్రేయోఽలఙ్కార ఇతి తన్న. భావస్య హి భావాఙ్గతా యాం ప్రేయోలఙ్కారత్వమ్. నహ్యత్ర స్మృతిర్భావః తస్యాః స్మరతినా వాచకేనాభిధానాత్. నహి వాచ్యస్య వ్యభిచారిణో భావత్వం వక్తుం యుక్తమ్ 'వ్యభిచార్యఞ్జితో భావః' ఇతి సిద్ధాన్త విరోధాత్.

తథాచోక్తం సర్వస్వకృతా — 'ప్రేయోఽలఙ్కారస్యతు సాదృశ్యవ్యతిరిక్తనిమిత్తోత్థాపితా స్మృతిర్విషయః. తత్రాపి విభావాద్యాగూరితత్వే. యథా — 'కోపేఽపి కాన్తం ముఖమ్' ఇతి. నతుస్వశబ్ద నివేద్యత్వే. యథా —

'అత్రానుగోదం మృగయానివృత్త
స్తరఙ్గవాతేన వినీతఖేదః,
రహస్త్వదుత్సఙ్గ నిషణ్ణమూర్ధా
స్మరామి వానీరగృహేషు సుప్తమ్" ఇత్యాదావితి."

అదియంతయు మంచిదిగాదు. ఏమంటే? సదృశాసదృశములైన కేశపాశజలనిధి మంథనములయొక్క సంగ్రహముకొఱకు లక్షణమందు వస్త్వంతరగ్రహణము నర్థవంతమైనదని ఏదిచెప్పబడుచున్నదో అచట "సాదృశ్యమూలకమగు స్మృతి స్మరణాలంకారము" ఇంతమాత్రముననే కేశపాశస్మరణమువలె జలనిధి మంథనస్మరణముగూడ సంగృహీతము కనుక వస్త్వంతరసమాశ్రయత్వవిశేషణ మనర్థకము. ఒకచోట సాదృశ్యదర్శనోద్బుద్ధ సంస్కారజన్యముగాను, మరియొకచోట సాదృశ్యదర్శనోద్బుద్ధ సంస్కారజలక్ష్మీస్మరణోద్బుద్ధసంస్కారజన్యముగాను సాదృశ్యమూలత్వమున విశేషములేదుగనుక. సాదృశ్యమూలము అనిచెప్పితే సదృశవిషయము అని తెలియరాదుగదా? అలా అయిననే జలనిధిమంథనస్మృతికసంగ్రహము వచ్చును.

మఱొకటి-సౌమిత్రే నను సేవ్యతాం - అనుచోట, స్మృతి - వ్యంగ్యము నలంకారభూతయు, దాని వ్యావృత్తికై నచట నవ్యంగ్యత్వ విశేషణ మన్నారు. అచట నీ స్మృతి అలంకార్యభూతముగాదు. ఇకనేమనగా - జానకి యాలంబనముగా గలదియు, రాత్రియగుటచే నుద్దీపితమైనదియు, సంతాపాదులచే అనుభావితమును, నున్మాదమను సంచారిచే పోషింపబడిన విప్రలంభము ప్రధానముగా నలంకార్యము. దానికి స్మృతి – యుత్కర్షహేతువుగా నలంకారమే. ఇందువల్ల నది వ్యావర్తించుటకై నవ్యంగ్యత్వ విశేషణము వేయుట మిక్కిలి యనుచితము. వ్యంగ్యత్వమునకు, అలంకారత్వమునకున్ను - విరోధము అనుట అయుక్తముగదా? ఎప్పుడును వ్యంగ్యములేయగు రసము భావము మొదలగువానికిగూడ పరాంగత్వప్రసంగములో నలంకారత్వ మంగీకృతమైనది. ప్రధానవ్యంగ్యవ్యావృత్తికిమాత్ర ముప

స్ఫారకత్వము అలంకారలక్షణమునం దంతటను వేయవలెనని ఇదివరకే చెప్పితిమి.

ఇంకొకటి - 'అత్యుచ్చాః పరితః స్ఫురంతి గిరయః' అనుచోట స్మృతి సంచారిభావము భూభృద్విషయకరతి భావాంగముగనుక ప్రేయోలంకారము అన్నారు. అదిగాదు. భావము భావాంగమగునపుడు ప్రేయోలంకారము అగును. ఇక్కడ స్మృతి భావముగాదే - అది 'స్మృ' ధాతువుచే చెప్పబడెను గదా? వాచ్యమగు వ్యభిచారభావమును భావమనరాదు "వ్యభిచార్యఞ్జితో భావః"—అని సిద్ధాంతముతో విరోధముగల్గును, అలంకారసర్వస్వకారు డట్లే చెప్పెను—

"ప్రేయోలంకారమునకు సాదృశ్యవ్యతిరిక్తమగు నిమిత్తమువలన నుత్థాపితమగు స్మృతివిషయము, అందును అది విభావాదులచే నాగూరిత మైనయెడలనే, ఎట్లనగా - "అహో కోపేఽపి కాంతం ముఖం" అనునపుడు. అంతేకాని స్వశబ్దముచే చెప్పబడినపుడుకాదు - ఎట్లనగా—

"అత్రాను గోదం" (ఇచట వేటనుంచి మరలివచ్చినవాడనై గోదావరీ నదీసమీపమున తరంగవాయువులచే ఆయాసము బోగొట్టబడినవాడనై వాణీరగృహములందు ఏకాంతమున నీయొక్క తొడమీద తలవుంచుకొని యేకాంతమందుపడుకొనుటను స్మరించుచున్నాను.)

ఇత్యాదులందు—

నను భావాద్యఙ్గీభూతభావత్వం న ప్రేయోలఙ్కార లక్షణమ్. అపితు భావాద్యఙ్గీభూత సంచారిత్వమాత్రమ్. తథాచ ప్రకృతే స్మరణస్య స్వశబ్దనివేద్యత్వేన భావత్వ విరహేఽపి సంచారిత్వేన పాయాత్ప్రేయోఽలఙ్కారత్వమవిరుద్ధమేవేతి చేత్, ఏవం తర్హీత రాఙ్గీభూతస్థాయిత్వ మాత్రం రసాలఙ్కారత్వమ్, నతు వ్యఙ్గ్యమా నత్వవిశిష్టమ్; ఇత్యస్యాపి సువచత్వాత్. ఏవం చ —

'చరాచరోభయాకార జగత్కారణ విగ్రహమ్.
కల్పాన్త కాలసంక్రుద్ధం హరం సర్వహరం నుమః'

ఇత్యత్ర క్రోధస్య స్వశబ్ద నివేదితత్వేఽపి దేవతావిషయక రతిభావాఙ్గీ భూతస్థాయిత్వానపాయాద్రసాలఙ్కారతా స్యాత్. నచేష్టా

పత్తిః, అపసిద్ధాన్తాత్. తస్మాత్ వ్యజ్యమానస్యైవ స్థాయినః పరాఙ్గత్వే యథా రసాలఙ్కారత్వమేవం వ్యజ్యమానస్యైవ స్థాయినః పరాఙ్గత్వే ప్రేయోఽలఙ్కారత్వమితి నాత్రస్మృతిమాదాయ ప్రేయోఽలఙ్కారతా వాచ్యా, కింతు భూవిషయకరతేః పూర్వార్ధ వ్యఙ్గ్యాయా ఉత్తరార్ధవ్యఙ్గ్య భూభృద్విషయ రతిభావాఙ్గత్వాద్యుక్తా ప్రేయోఽలఙ్కారతా వక్తుమ్. ఉక్తంచమమ్మటభట్టైః — 'అత్ర భూవిషయో రత్యాఖ్యోభావో రాజవిషయ రతిభావస్య' ఇతి, అపిచ మహాదిద మాశ్చర్యం యత్ స్వేనైవ నిర్మితః కువలయానన్దాఖ్యః సన్దర్భో విస్మృతః, ఉక్తంచ తత్ర — 'విభావానుభావాభ్యామభివ్యఞ్జితో నిర్వేదాదిర్భావః, స యత్రాపరస్యాఙ్గం స ప్రేయోఽలఙ్కారః' ఇతి.

అయ్యా? - భావాదుల కంగభూతమైన భావత్వము ప్రేయోఽలంకార లక్షణముగాదు. భావాదుల కంగమైన సంచారిత్వనుమాత్రమే. కాగా ప్రకృతములో స్మరణము స్వశబ్దముచే నివేదింపదగియుండుటచేత భావత్వము లేకున్నను సంచారిత్వము దొలగకుండుటవలన స్మరణమునకు ప్రేయోఽలంకారత్వము అవిరుద్ధమేను. అంటిరేని - ఇలాగైతే ఇతరాంగమగు స్థాయిత్వము మాత్రమే రసాలంకారత్వముకాని వ్యజ్యమానత్వవిశిష్టముకాదు; అనియు సువచమేకదా?

అట్లయినచో—

'చరాచరోభయాకార' (చరాచరాది ఉభయాకారములుగల జగత్తునకు కారణమగు స్వరూపముగలిగినట్టియు ప్రళయకాలమున గోపించిన సర్వస్వము హరించిన హరుని కొనియాడుదుము).

ఇత్యాది శ్లోకమున క్రోధము స్వశబ్దముచేత నివేదితమైనను, దేవతా విషయకరతి భావాంగస్థాయిత్వముండుటవలన రసాలంకారము కావలెను. పోతే — ఇష్టమేననరాదు. అపసిద్ధాంతముగాదా? కనుక వ్యంగ్యమగుచున్న స్థాయియే పరాంగమగుచో రసాలంకారమగుటయెట్లో నలాగే వ్యంగ్యముగానున్న సంచారికే భావాద్యంగత్వములో ప్రేయోఽలంకారమగుట సిద్ధించును. కనుక ఇచట స్మృతిని దీసుకొని ప్రేయోఽలంకారము చెప్పదగదు. ఇక నేమనగా - భూవిషయికరతి పూర్వార్ధమున వ్యంగ్యము. అది ఉత్తరార్ధమున వ్యంగ్యమగు భూభృద్విషయకరతిభావమున కంగముగనుక ప్రేయో

లంకారము చెప్పదగును. దానినే మమ్మటభట్టు చెప్పిరి. "ఇచట భూవిషయిక మగు రత్యాఖ్యమగుభావము రాజవిషయికరతిభావమునకు" అని. అదిగాక ఇది గొప్ప యాశ్చర్యము - తానే రచించిన కువలయానందసందర్భమును మరచిరి. అందులో విభావానుభావములచే నభివ్యంజితమగు నిర్వేదాది భావము ఎచట నితరమునకు నంగ మౌ నది ప్రేయోలంకారమనిచెప్పబడినది.

యదపి 'సదృశానుభవాద్వస్త్వన్తరస్మృతిః స్మరణమ్' ఇత్యలఙ్కారసర్వస్వ రత్నాకరయోః స్మరణాలఙ్కారలక్షణముక్తమ్, తదపి న. సదృశస్మరణాదుద్బుద్ధేన సంస్కారేణ జనితే స్మరణేఽవ్యాప్తేః. యథా —

'సన్త్యేవాస్మిన్ జగతి బహవః పక్షిణో రమ్యరూపా-
స్తేషాం మధ్యే మమ తు మహతీ వాసనా చాతకేషు.
యైరధ్యక్షైరథ నిజసఖం నీరదం స్మారయద్భిః
స్మృత్యారూఢం భవతి కిమపి బ్రహ్మ కృష్ణాభిధానమ్'

అత్ర చ చాతకదర్శనాదేకసమ్బన్ధిజ్ఞానాదుత్పన్నేనాపర సమ్బన్ధినో జలధరస్య భగవత్సదృశస్య స్మరణేన జనితం భగవతః స్మరణం భగవద్విషయరతి భావాఙ్గమ్. యదిచ 'సదృశానుభవాత్' ఇత్యపహాయ 'సదృశజ్ఞానాత్' ఇతి లక్షణే నివేశ్యతే తదాభవత్యస్యాపి సంగ్రహ ఇతి దిక్.

ఇంకొకటి—"సదృశానుభవాద్వస్త్వంతరస్మృతిః స్మరణమ్" - అని అలంకార సర్వస్వరత్నాకరములందు స్మరణాలంకారమునకు లక్షణము చెప్పబడినది. అదియును సరిగాదు. సదృశస్మరణమువలన నుద్బుద్ధమగు సంస్కారమువలన బుట్టిన స్మరణమున నవ్యాప్తి సంభవించును.

ఎట్లనగా—

'సంత్యేవాస్మిన్' మొ. (ఈజగత్తునందు అందమైన రూపములుగల యనేక పక్షులున్నవి. వాటినడుమ నాకు చాతకములనుగురించి గొప్ప వాసనగలదు; ఏవి కంటబడిన వెంటనే తమస్నేహితులైన మేఘమునుస్మరింపజేసినవై కృష్ణుడను పేరుగల నేదోయొక బ్రహ్మను జ్ఞప్తివచ్చునట్లుగా చేయునో) ఇచట చాతకమునుజూచుటవలన ఏకసంబంధిజ్ఞానమువలన నుదయించిన యపర

సంబంధియగు భగవత్సదృశజలధరముయొక్క స్మరణముచేగల్గిన భగవత్స్మరణము భగవద్విషయికరతిభావమున కంగము.

అయితే – 'సదృశానుభవమువలన' అని త్రోసివేసి, 'సదృశజ్ఞానమువలన' అని లక్షణముచేర్చినయెడల ఇదియు సంగ్రహణీయ మేనని దిక్.

అథాస్య ధ్వనిః యథా—

'ఇదం లతాభిః స్తబకానతాభి
ర్మనోహరం హన్త వనాన్తరాళమ్.
సదైవ సేవ్యం స్తనభారవత్యో
నచేద్యువత్యో హృదయం హరేయుః'

అత్ర స్తబకానతాభిర్లతాభిః స్తనభారవతీనాం యువతీనాం స్మరణమలఙ్కార్యస్యాన్యస్యాభావాదనుపసర్జనమ్, స్తన స్తబకరూపస్య బిమ్బప్రతిబిమ్బభావమాపన్నస్య సాధారణధర్మస్య వాచ్యత్వేఽపి తత్ప్రయోజిత సాదృశ్యమూలకస్య స్వస్య శబ్దవాచ్యత్వ విరహాత్ వ్యఙ్గ్యం చ. యువత్య ఇతిచ 'సర్వతోఽక్తిన్నర్థాత్' ఇతిఙీషి. సాధుః.

అనంతర మీయలంకారధ్వని యెట్లనగా—

'ఇదం లతాభిః' (స్తనభారముగల యువతులు హృదయమునాకర్షించకున్నచో పూలగుత్తులతోవంగినలతలతో మనోహరమగు వనమధ్యము ఎల్లప్పుడును సేవింపదగినది)". ఇచట స్తబకానతలగు లతలచేత స్తనభారవతులగు యువతులస్మరణము అలంకార్యమగు నితరములేనందున నుపసర్జనముగాదు. స్తన స్తబకరూపమగు బింబప్రతిబింబభావమ నొందిన సాధారణధర్మమునకు వాచ్యత్వమునందున్ను దానిచే ప్రయోజితమగు సాదృశ్యమూలముగాగల తనకు శబ్దవాచ్యత్వము లేనందున వ్యంగ్యమున్నూ అయినది. 'యువత్యః' అనునది "సర్వతోక్తిన్నర్థాత్" అని ఙీష్‌నందు సాధువు.

యథావా—

'ఇదమప్రతిమం పశ్య సరః సరసిజైర్వృతమ్'
సఖే మాజల్ప నారీణాం నయనాని దహన్తి మామ్;

అత్రాపి సరసిజజ్ఞానాధీన తత్సదృశ స్మృతిః ప్రాధాన్యేన ధ్వన్యతే.

అథాస్మిన్ స్మరణాలఙ్కారే ఉపమాదోషాః ప్రాయశః సర్వ ఏవ దోషాః, విశేషతశ్చ నియమే నాస్మిన్ వ్యజ్యమాన సాదృశ్యకే సాదృశ్యస్య శబ్దవాచ్యతాయాం దోషః. యథా—

'ఉపకారమస్య సాధోర్నైవాహం విస్మరామి జలదస్య
దృష్టేన యేన సహసా నివేద్యతే నవఘనశ్యామః'.

అత్ర స్మృత్యైవ ఘనసాదృశ్యం భగవతః ప్రతీయమానం వాచ్యవృత్త్యా కదర్థితం నివేద్యతే. దేవకీతనయ ఇతి తు సాధు.

మరొకటి—

'ఇదమప్రతిమం' (ఇదిగో తులలేని సరస్సు పద్మములావరించియున్నది చూడుము. ఓ మిత్రుడా! చెప్పకుము; స్త్రీలయొక్క నేత్రములు నన్ను కాల్చివేయుచున్నవి)'. ఇట సరసిజజ్ఞానాధీన తత్సదృశనయనస్మృతి ప్రధానముగా ధ్వనించుచున్నది.

ఈ స్మరణాలంకారమున ఉపమాదోషములు ప్రాయశః అన్నియు దోషములే. విశేషమేమనగా వ్యజ్యమానసాదృశ్యాత్మకమగు దీనియందు సాదృశ్యము శబ్దముచేత వాచ్యమగునపుడు దోషమే.

ఎట్లనగా—

'ఉపకారమస్య' (సాధువగు మేఘముయొక్క ఉపకారమును నేను మరచిపోను; అదికనబడగానే వెంటనే క్రొత్తమబ్బువలె శ్యాముడైన శ్రీకృష్ణుడు నివేదింపబడును.) ఇచట స్మృతిచేతనే మేఘసామ్యము భగవానునకు దోచుచున్నది. అది వాచ్యవృత్తిచే గతర్థితముగా స్ఫురించును. "నివేద్యతే దేవకీతనయః" ఐతేమాత్రము సాధువు.

అత్ర సాదృశ్యప్రయోజకస్య సాధారణధర్మస్య సాక్షాదుపాదానానుపాదానయో రుపమాయామివాత్రాపి వ్యవస్థా. తథాహి. ఉపమాయాం తావత్క్వచిద్ధర్మో నియమేన ప్రతీయమానః సాక్షాన్నోపాదేయ ఏవ. యథా 'శఙ్ఖవత్పాణ్డురచ్ఛవిః' ఇత్యత్ర పాణ్డురత్వమ్.

'శఙ్ఖవత్పాణ్డురోఽయమ్' ఇత్యాదౌ తు నానావిధేషు ధర్మేష్వనేనైవ ధర్మేణ సాదృశ్యమిత్యస్య దురవగమత్వాత్, సర్వత్రోపమానోపమేయ సాధారణస్య శ్లిష్టశబ్దాత్మకస్యాన్యస్య వా స్వానభిప్రేతస్య సాధారణ ధర్మస్యోపమాప్రయోజకత్వ సమ్భవాత్తద్వారణాయ పాణ్డురత్వాది ధర్మో వాచ్యతాం నీయతే, యథా వా 'అరవిన్దమివ సున్దరం ముఖమ్' ఇత్యాదౌ సున్దరత్వాదిః. న నీయతే చ క్వచిత్, వక్తురన్యస్యానుపస్థానాత్ప్రసిద్ధేః ప్రాబల్యాత్. యథా 'అరవిన్దమివ ముఖమ్' ఇత్యాదౌ స ఏవ. అప్రసిద్ధశ్చ ధర్మోఽవశ్యం సాక్షాదుపాదేయః. అన్యథా తస్యాప్రతిపత్తౌ కవేస్తదుపమా నిర్మాణప్రయాసవైయర్థ్యాపత్తేః. యథా 'నీరదా ఇవ తే భాన్తి బలాకా రాజితా భటాః' ఇత్యాదౌ శ్లిష్టశబ్దాత్మకః. ఇత్థం చ కశ్చిత్సాధారణో ధర్మః సాక్షాదనుపాదేయ ఏవ కశ్చిదుపాదేయోఽనుపాదేయశ్చ, కశ్చిదుపాదేయ ఏవేతి సహృదయసంమతః సమయః, ఏవమేవోపమాజీవాతుకేఽస్మిన్ స్మరణాలఙ్కారేఽపి బోధ్యమ్.

సాదృశ్యప్రయోజకమగు సాధారణధర్మమునకు సాక్షాత్తుగా నుపాదానమునందును అనుపాదానమునందును, ఉపమయందువలె నిచటను వ్యవస్థ. అదియుక్తమే – ఉపమయందైతే ఒకయెడ ధర్మము, నియమముగా ప్రతీయమానమైనది, సాక్షాత్తుగా నుపాదేయమేగాదు. ఎట్లనగా – "శంఖవత్పాండురచ్ఛవిః" అనుచోట పాండురత్వము. "శంఖవత్పాండురోయం" ఇత్యాదులందైతే నానావిధములగు ధర్మములందు ఈ ధర్మముతోనే సాదృశ్యమనేది దురవగమమగుటవల్లను, అన్నియెడల నుపమానోపమేయసాధారణమగు శ్లిష్టశబ్దాత్మకముగానీ ఇతరముగానీ, తనకిష్టముగానిదియైన సాధారణధర్మమునకుపమాప్రయోజకత్వము సంభవించును కనుక దాని నివారించుటకై పాండురత్వాదికమగు ధర్మము వాచ్యత్వమును పొందించబడుచున్నది. ఎట్లనగా – "అరవిందమివ సుందరం ముఖం" ఇత్యాదులయందు సుందరత్వాదికము. ఒకయెడ చెప్పబడదుకూడాను. ప్రసిద్ధియొక్క ప్రాబల్యము వలన వక్తకు మరియొకటి ఉపస్థితము కాదుకనుక. ఎట్లనగా "అరవిందమివ ముఖం" ఇత్యాదులందు నదియే ధర్మము అప్రసిద్ధమగుచో తప్పక సాక్షాతుగానే యుపాదేయము. అలాగానియెడల, సాధారణధర్మము దెలియక

పోయినచో కవి ఆ యుపమను నిర్మించుటలో పడు ప్రయాస వ్యర్థము గావలసివచ్చును. ఎట్లనగా-"నీరదా ఇవ తే భాంతి బలాకా రాజితాశ్శటాః" ఇత్యాదులందు శ్లిష్టశబ్దాత్మకము.

ఈరీతిగా నొకానొకటి సాధారణధర్మము సాక్షాత్తుగా ననుపాదేయమే. ఇంకొకటి యుపాదేయము అనుపాదేయమున్నూ. ఒకానొకధర్మము దప్పక యుపాదేయమేయని సహృదయ సంమతమగు సమయము. ఈ తీరుగానే ఉపమ ప్రాణప్రదముగాగల స్మరణాలంకారమునందును అని బోధపరచుకొనవలయును.

తత్రానుగామిని ధర్మే 'స్మృత్యారూఢం కిమపి' ఇత్యాదౌ పద్యే నివేదితమేవ స్మరణమ్. బిమ్బ ప్రతిబిమ్బ భావాపన్నే௨పి ధర్మే 'భుజభ్రమిత పట్టిశ-' ఇత్యాదిపద్యే నిరూపితమ్. కులిశపట్టిశయో ర్భూధరదన్తావలయోశ్చ బిమ్బ ప్రతిబింబభావాత్.

అచట ధర్మమనుగామియైనపుడు "స్మృత్యారూఢం భవతి కిమపి" ఇత్యాది పద్యమునందు స్మరణము నివేదింపబడియే యున్నది. బింబ ప్రతిబింబ భావాపన్నధర్మమునందుగూడా "భుజభ్రమితపట్టిస" ఇత్యాది పద్యమునందు నిరూపించబడినది! కులిశపట్టిశములును, భూధరదంతావళములున్ను బింబ ప్రతిబింబభావము పొందుటవలన.

ఉపచరితే యథా—

'క్వచిదపి కార్యేమృదులం
క్వాపిచ కఠినం విలోక్య హృదయం తే.
కో న స్మరతి నరాధిప
నవనీతం కించ శతకోటిమ్'.

యథావా—

'అగాధం పరితః పూర్ణమాలోక్య స మహార్ణవమ్
హృదయం రామభద్రస్య సస్మార పవనాత్మజః'

అత్ర మృదులత్వాదయో ధర్మా హ్యుపచరితాః ఇయాంస్తు విశేషః - యదేకత్రానుభూయమానే హృదయే స్మర్యమాణ

నవనీతాదేః సాదృశ్యస్య సిద్ధిః; అపరత్ర తు స్మర్యమాణే హృద యేఽనుభూయమానసముద్రస్యేతి, సాదృశ్యస్యోభయాశ్రయత్వాత్.

కేవల శబ్దాత్మకే యథా—

'ఋతురాజం భ్రమరహితం
యదాహమాకర్ణయామి నియమేన.
ఆరోహతి స్మృతిపథం
తదైవ భగవాన్ మునిర్వ్యాసః'.

అత్ర భ్రమరహితశబ్దో వ్యాసవసన్తయోః సాధారణః, ఏవ మన్యేఽపి ప్రభేదాః సుధీభిరున్నేయాః, ఇహ పునర్దిఙ్మాత్రముప దర్శితమ్.

ఉపచరిత మెట్లనగా—

"క్వచిదపి కార్యే" (ఒక పనియందు మృదువైనదియు మరియొకపని యందు కఠినమైనదియు నగు నీ హృదయమును జూచి ఓ రాజా! వెన్నను మరియు వజ్రాయుధమును యెవరు స్మరించరు ?)

మరియొకటి—

"అగాధం పరితః" (అగాధమైనట్టి యంతటను నిండినట్టి మహా సముద్రమును జూచి అగాధమైన రామభద్రుని హృదయమును వాయు పుత్రుడు స్మరించెను )

ఇచట మృదులత్వాది ధర్మములు హృదయమునం దుపచరితములు.

ఇదిమాత్రము విశేషము; ఏమనగా—

ఒకచోట ననుభవింపబడుచున్న హృదయమున స్మరింపబడుచున్న నవనీతాదికమునకు సాదృశ్యము సిద్ధించుట; మరియొకచోట విస్మరింపబడు చున్న హృదయమున అనుభవింపబడుచున్న సముద్రమునకు – అని. సాదృ శ్యముభయాశ్రితము గనుక.

కేవల శబ్దాత్మక మెట్లనగా—

"ఋతురాజం" (భ్రమరహితుడగు ఋతురాజును యెప్పుడు నేను విను

చుందునో అప్పుడె నాస్మృతిపథమును భ్రమరహితుడగు భగవానుడైన వ్యాసుడు తప్పక అధిరోహించును.)

ఇచట భ్రమరహితశబ్దము వ్యాసవసంతులకు సాధారణము. ఇటులనే నితరములగు ప్రభేదములు పండితు లూహించగలరు. ఇచటనైతే దిఙ్మాత్రముగా నుదాహరింపబడినది.

ఇది స్మరణాలంకారము

## రూపకమ్

అథాభేదప్రధానేషు రూపకం తావన్నిరూప్యతే. ఉపమేయతావచ్ఛేదక పురస్కారేణోపమేయే శబ్దాన్నిశ్చీయమాన ముపమాన తాదాత్మ్యం రూపకమ్. తదేవోపస్కారకత్వ విశిష్టమలఙ్కారః.

ఉపమేయతావచ్ఛేదక పురస్కారేణేతి విశేషణాదపహ్నుతి భ్రాన్తిమదతిశయోక్తి నిదర్శనానాం నిరాసః. అపహ్నుతౌ స్వేచ్ఛయా నిషిధ్యమానత్వాత్, భ్రాన్తిమతి చ తజ్జనకదోషైరేవ ప్రతిబధ్యమానత్వాదతిశయోక్తి నిదర్శనయోశ్చ సాధ్యవసాన లక్షణామూలకత్వాదుపమేయతావచ్ఛేదకస్య నాస్తి పురస్కారః. శబ్దాదితి విశేషణాత్ 'ముఖమిదం చన్ద్రః' ఇతి ప్రాత్యక్షికాహార్య నిశ్చయగోచరచన్ద్ర తాదాత్మ్య వ్యవచ్ఛేదః నిశ్చీయమాన విశేషణాత్సమ్భావనాత్మనో 'నూనం ముఖం చన్ద్రః' ఇత్యాద్యుత్ప్రేక్షాయా వ్యావృత్తిః. ఉపమానోపమేయ విశేషణాభ్యాం సాదృశ్య లాభాత్ 'సుఖం మనోరమా రామా' ఇత్యాది శుద్ధారోపవిషయ తాదాత్మ్య నిరాసః. సాదృశ్యమూలకమేవ చ తాదాత్మ్యం రూపకమామనన్తి. తథా చాహుః—

'తద్రూపకమభేదో య ఉపమానోపమేయయోః'
ఉపమైవ తిరోభూతభేదా రూపకముచ్యతే' ఇతి.

తచ్చయత్రవిషయవిషయిణోరేక విభక్త్యన్తత్వేన నిర్దేశస్తత్ర సంసర్గః. అన్యత్ర తు శబ్దార్థతయా క్వచిత్ విశేషణం విశేష్యం చేతి వివేచయిష్యతే.

అభేదప్రధానమగు నలంకారములలో రూపకాలంకారము నిరూపించబడుచున్నది. ఉపమేయతా నిర్ణాయకమును బురస్కరించుకొని యుపమేయమునందు శబ్దము వలన నిశ్చయింపబడుచున్న ఉపమానతాదాత్మ్యము రూపకము. ఉపస్కారకత్వముతో గూడిన యది యలంకారము. ఉపమేయతానిర్ణాయకమును పురస్కరించుకొని అని విశేషించుటవలన అపహ్నుతి భ్రాంతిమదతిశయోక్తి నిదర్శనలకు నిరాసము. అపహ్నుతియందు స్వేచ్ఛచే నిషేధింపబడుచున్నది గనుకను భ్రాంతిమత్తునందు దానిని పుట్టించు దోషము చేతనే ప్రతిబంధింపపడుచున్నది కనుకను, అతిశయోక్తి నిదర్శనలు సాధ్యవసానలక్షణామూలకమగుటవలనను ఉపమేయతానిర్ణాయకమునకు బురస్కారములేదు. శబ్దమువలన అని విశేషించుట వలన "మొగమిది చందురుడు" అని ప్రత్యక్షమైన యాహార్యనిశ్చయమున గోచరమగు చంద్రతాదాత్మ్యమునకు వ్యవచ్ఛేదము. నిశ్చయింపబడుచున్న అను విశేణమువల్ల సంభావనారూపమైన 'ఔను - మొగముచందురుడే' అను ఈతీరైన ఉత్ప్రేక్షకు నిరాకరణము. ఉపమానోపమేయ అను విశేషణములవలన సాదృశ్యము లాభించును గనుక "సుఖం మనోరమా రామాః" ఇత్యాదియగు శుద్ధారోపవిషయమగు తాదాత్మ్యమునకు నిరాసము. సాదృశ్యమూలకమగు తాదాత్మ్యమునే రూపకమనెదరు. ఆలాగున ప్రకాశకారాదులు జెప్పుచున్నారు—

"ఉపమానోపమేయములకభేదము రూపకము." "అంతర్హితమైన భేదము గల యుపమయే రూపకమనబడును." అదియును ఎచట విషయ విషయము లుండి ఒక విభక్త్యంతములుగ నిర్దేశింపబడియుండునో అచట సంసర్గము. స్థలాంతరమునసైతేశబ్దార్థము గనుక ఒకయెడ విశేషణము, విశేష్యమున్ను. అని వివేచింపబడబోవును.

యత్తు 'సాదృశ్యప్రయుక్తః సంబన్ధాన్తరప్రయుక్తోవా యోవా ద్భిన్నయోః సామానాధికరణ్యా నిర్దేశః స సర్వోఽపి రూపకమ్. సారోపలక్షణామూలకత్వస్య తుల్యత్వేన సాదృశ్యప్రయుక్తస్య తాదాత్మ్యస్యేవ సమ్బన్ధాన్తరప్రయుక్తస్యాపి తాదాత్మ్యస్య సంగ్రహీతు మౌచిత్యాత్, తస్మాత్ దురాగ్రహ ఏవాయం ప్రాచాం — 'ఉపమానోపమేయయోరభేదో రూపకమ్, న తు కార్యకారణయోః'" ఇతి రత్నాకరేణోక్తం, తన్న. అపహ్నుత్యాదా భిన్నయోః సామా

నాధికరణ్యస్య సత్త్వాత్తత్రాతివ్యాప్తేః. కిఞ్చ 'సాదృశ్యమూలకం స్మరణం స్మరణాలఙ్కారః, న తు చిన్తాదిమూలమ్' ఇతి భవతైవ పూర్వముదితమ్. తత్ర యది సాదృశ్యమూలకస్యాపి కార్యకారణాదికయోః కల్పితస్య తాద్రూప్యస్య రూపకత్వ మభ్యుపేయతే తదా సాదృశ్యామూలకస్య చిన్తాదిమూలస్య స్మరణస్యాప్యలఙ్కారత్వ మభ్యుపేయతామ్. న చ స్మరణస్య భావత్వముచ్యమానం నిర్విషయం స్యాదితి వాచ్యమ్, తస్య వ్యఙ్గ్యమాన విషయత్వోపపత్తేః.

అయితే—

సాదృశ్యప్రయుక్తముగానీ, సంబంధాంతర ప్రయుక్తము గానీ, భిన్నములకుఏర్పడే సామానాధికరణ్యనిర్దేశమున్నదో అదియంతయు రూపకము; సారోపలక్షణామూలకమగుట సమానము గనుక సాదృశ్యప్రయుక్తమగు తాదాత్మ్యమువలె సంబంధాంతరముచే నేర్పడినను తాదాత్మ్యమును సంగ్రహించుట యుచితమే. గనుక ప్రాచీనుల దురాగ్రహమే ఇది—'ఉపమానోపమేయముల యభేదమే రూపకము. కార్యకారణముల యభేదముగాదు అనుట' అని రత్నాకరకారుడు చెప్పెను. కాని అదికాదు.

అపహ్నుతి మొదలగువానిలో భిన్నములకు సామానాధికరణ్యమున్నది కనుక నక్కడ నతివ్యాప్తి గల్గును.

మఱియు—

'సాదృశ్యమూలకమగు స్మరణము స్మరణాలంకారము; చింతాదిమూలకమగు స్మరణము అలంకారముగాదు' అని నీవే యిదివరకు జెప్పితివి. అట్టి స్థితిలో సాదృశ్యమూలకము కానప్పటికి కార్యకారణాదికములకు గల్పితమగు తాద్రూప్యమును రూపకముగా అంగీకరించుచో నపుడు సాదృశ్యమూలమైన చింతామూలకమగు స్మరణముగూడ అలంకారమని యంగీకరించుము. అయితే — స్మరణము భావము, అనుమాటకు నవకాశము లేదే అనరాదు. అది వ్యఙ్గ్యమానమగు దాని విషయమని యుపపాదింతుము.

అప్పయ్య దీక్షితాస్తు—

'బిమ్బావిశిష్టే నిర్దిష్టే విషయే యద్యనిహ్నుతే
ఉపరఞ్జకతామేతి విషయీ రూపకం తదా',

అత్ర బింబావిశిష్ట ఇతి విషయవిశేషణాత్ —
'త్వత్పాదనఖరత్నానాం యదలక్తకమార్జనమ్
ఇదం శ్రీఖణ్డలేపేన పాండురీకరణం విధోః.'

ఇతి నిదర్శనాయా నిరాసః, తత్ర విషయస్య మార్జనస్యాలక్త కాదిరూప బింబవిశిష్టత్వాత్. నిర్దిష్ట ఇతి విశేషణాన్నిగీర్ణ విషయాయాం, 'కమలమనమ్భసి కమలే చ కువలయే తాని కనకలతికాయామ్' ఇత్యాద్యతిశయోక్తౌ నాతివ్యాప్తిః. అనిహ్నుతే నిషేధాస్పృష్ట ఇతి విశేషణాదపహ్నుతౌ నాతివ్యాప్తిః. ఉపరఞ్జకతామాహార్య తాద్రూప్యనిశ్చయ గోచరతా మేతీత్యనేన సన్దేహోత్ప్రేక్షా సమాసోక్తి పరిణామభ్రాన్తి మత్స్వతివ్యాప్తి నిరాసః, ససన్దేహోత్ప్రేక్షయోర్నిశ్చయస్యైవాభావాత్. సమాసోక్తి పరిణామయో ర్విషయ తాద్రూప్యస్యాగోచరత్వాత్, సమాసోక్తౌ వ్యవహారమాత్ర సమారోపాత్. పరిణామేచారోప్యమాణస్యైవ విషయతాద్రూప్య గోచరత్వాత్. భ్రాన్తిమతి చ సతః కల్పితస్య వా ప్రవృత్త్యాదిపర్యన్తిక స్వారసికభ్రమస్యైవ నిబన్ధనేన తస్యానాహార్యత్వాత్," ఇత్యాహుః.

అప్పయ్యదీక్షితులుమాత్రము—

"బింబవిశిష్టముగాకుండా నిర్దేశింపబడిన విషయ మనిహ్నుతము కాగా విషయి ఉపరంజకమైనపుడు రూపకమగును". ఇచట బింబావిశిష్టమని విషయ విశేషణము వలన "నీ పాదముల నఖరత్నములకు లక్కతో మార్జన మొనర్చుట యేదిగలదో ఇది చందనలేపముచే చంద్రుని పాండురీకరణమే" అను నిదర్శనకు నిరాసము. అచట విషయమగు మార్జనము అలక్తకాది రూపమైన బింబముతో విశిష్టము గనుక. నిర్దిష్టమని విశేషించుటవలన నిగీర్ణవిషయమగు "నీరులేనిచోట కమలము; కమలమునందు కువలయములు; అవి బంగారు తీగ యందు" అని ఇటువంటి యతిశయోక్తిలో నతివ్యాప్తి లేదు. 'అనిహ్నుతే'— నిషేధముచే స్పృశింపబడనిది, అని విశేషణమువలన నపహ్నుతియందతివ్యాప్తిలేదు. 'ఉపరంజకతాం' — ఆహార్యతాద్రూప్యనిశ్చయమునకు గోచరమగుటను 'ఏతి' — పొందుచున్నది, అనుటవలన సందేహము, ఉత్ప్రేక్ష, సమాసోక్తి, పరిమాణము, భ్రాంతిమత్ అలంకారములయం దతివ్యాప్తి

తొలగినది. ససందేహ- ఉత్ప్రేక్షలయందు నిశ్చయమే లేదుగదా? సమాసోక్తి పరిణామములలో విషయితాద్రూప్యము గోచరము కాదుగదా? సమాసోక్తి యందు వ్యవహారమాత్రమే ఆరోపించబడునుగదా? పరిణామమునం దారోపించబడునదే విషయతాద్రూప్యమునకు గోచరమగును. భ్రాంతిమత్తునందు, ఉన్నది గానీ, కల్పితమైనదిగానీ ఐన ప్రవృత్త్యాదిపర్యంతమైన స్వాగసిక భ్రమనేనిబంధించుటచేత నది యనాహార్యమేగదా?" అనిచెప్పిరి.

తన్న, 'త్వత్పాదనఖరత్నానామ్' ఇత్యాది నిదర్శనావ్యావృత్త్యర్థం బింబావిశిష్టత్వం విషయవిశేషణం తావదయుక్తమేవ, యద్యత్ర 'ముఖం చంద్రః' ఇత్యాదిరూపకాన్తర ఇవ సత్యపి శ్రౌతారోపే నేదం రూపకం, అపితు నిదర్శనేత్యుచ్యతే, తదా 'ముఖం చన్ద్రః' ఇత్యపి నిదర్శనేత్యుచ్యతామ్. నిరస్యతాంచ రూపకదాక్షిణ్యకాపీనమ్. కించ 'త్వత్పాద—' ఇత్యత్ర కిం పదార్థనిదర్శనా, ఆహో స్విద్వాక్యార్థనిదర్శనా ? నాద్యః, బింబప్రతిబింబభావాపన్న పదార్థ ఘటిత విశిష్టార్థయో రేవాత్రాభేదప్రతీతేః. కువలయానన్దగత నిదర్శనాప్రకరణే త్వయోక్తమార్గేణ, ధర్మ్యన్తరే పదార్థే తదవృత్తి ధర్మస్య పదార్థస్య భేదేనారోపస్యాభావాచ్చ, న ద్వితీయః. వాక్యార్థ రూపకోచ్ఛిత్త్యాపత్తేః. ఇష్టాపత్తౌ వైపరీత్యస్య సువచత్వాచ్చ. అస్మాభిర్నిదర్శనాప్రకరణే వక్ష్యమాణయా సరణ్యా అభేదస్య శ్రౌతత్వార్థత్వాభ్యాముద్దేశ్య విధేయభావాలిఙ్గనాలిఙ్గనాభ్యాం చ రూపకనిదర్శనయోర్వైలక్షణ్యేన సకలవ్యవస్థోపపత్తేః, తస్మాదత్ర వాక్యార్థరూపకమేవ, న వాక్యార్థ నిదర్శనా' తస్యాశ్చైవముదాహరణం నిర్మాతవ్యమ్.

> 'త్వత్పాదనఖరత్నాని యో రఞ్జయతి యావకైః,
> ఇన్దుం చన్దనలేపేన పాణ్డురీకురుతే హి సః;'

అత్ర కర్త్రోరభేదస్య శాబ్దత్వేఽపి క్రియయోరభేదస్యాశాబ్దత్వాత్తస్యైవ చ సమగ్రభర సహిష్ణుత్వాన్నిదర్శనైవ.

నను యదిదముదాహరణం నిదర్శనాయాం న స్యాత్తదా కథమలఙ్కారసర్వస్వకృతా తత్ప్రకరణ ఉదాహృతమితి చేత్, భ్రాన్తే

నైవ ప్రతారితోఽసి. న హి ప్రామాణికేన భవతా కదాపిపరేణా నుక్తం కించి దుచ్యతే. యదపి రూపకే బింబప్రతిబింబభావో నాస్తీ త్యుక్తం తదపి భ్రాన్త్యైవ. తథాచ సర్వస్వటీకాయాం విమర్శి న్యాముదాహృతం బింబప్రతిబింబభావేన రూపకమ్ —

"కన్దర్పద్విపకర్ణకమ్బుమలినై ర్దానామ్బుభిర్లాఞ్ఛితం
సంలగ్నాంజనపుంజ కాలిమకలం గండోపధానం రతేః.
వ్యోమానోకహపుష్పగుచ్ఛమలిభిః సంఛాద్యమానోదరం
పశ్యైతచ్ఛశినః సుధాసహచరం బింబం కలఙ్కాఙ్కితమ్".

అత్ర కలఙ్కస్య దానామ్బ్వాదిభిః ప్రతిబిమ్బనం, లాఞ్ఛితత్వాఙ్కితత్వయోః శుద్ధసామాన్యరూపత్వమిత్యుక్తం చేత్యాస్తాం తావత్.

అది యుక్తముగాదు — 'త్వత్పాదనఖరత్నానాం' మొదలైన నిదర్శనను వ్యావర్తించుటకై బింబావిశిష్టత్వము విషయ విశేషణమని యనుట యుక్తమే. ఇచట 'ముఖం చంద్రః' ఇత్యాది రూపకాంతరమునందువలె శ్రౌతమగు నారోప మున్నను, 'ఇది రూపకముగాదు, ఇక యేమనగా — నిదినిదర్శన' యని చెప్పినయెడల అపుడు - 'ముఖం చంద్రః' అనేదిగూడ నిదర్శనయేనని అనండి. రూపకమునందు దాక్షిణ్యమను కౌపీనమును తీసి వేయండి.

మఱియు— 'త్వత్పాద' అనేచోట పదార్థనిదర్శనయా లేక వాక్యార్థ నిదర్శనయా? అందు మొదటిదిగాదు, బింబప్రతిబింబభావమును బొందిన పదార్థములతో ఘటితములగు విశిష్టార్థములకు మాత్రమే ఇచట యభేదము స్ఫురించుచున్నది కనుక. కువలయానందము నందలి నిదర్శనాప్రకరణమునందు నీవు చెప్పిన మార్గమున మరొకధర్మియగు పదార్థమునందు దానియందుండని ధర్మమగు పదార్థమునకు భేదముతో నారోపము లేనుగూడా లేదు. రెండవ దియునుగాదు. (వాక్యార్థ నిదర్శనయుగాదు.) వాక్యార్థరూపకము ఉచ్ఛిన్నముగావలసివచ్చును. ఇష్టాపత్తియేయనుచో వైపరీత్యము సులభముగా చెప్పవచ్చును. మాచేత నిదర్శనాప్రకరణమునందు చెప్పబడబోపుచున్న మార్గముతో నభేదము శ్రౌతమని; ఆర్థికమని, ఉద్దేశ్యవిధేయభావమును స్వీక

రించుటయు, స్వీకరించకపోవుటయు వలన రూపకనిదర్శనలకు వైలక్షణ్యమంగీకరించుటవలన అన్నియు వ్యవస్థితములగును. అందువలన ఇచట వాక్యార్థరూపకమే వాక్యార్థ నిదర్శనగాదు వాక్యార్థనిదర్శనమున కుదాహరణము ఇట్లు నిర్మించవలెను—

"నీ పాదములయందలి నఖరత్నములను ఎవడు యావకముతో రంజించునో యతడు చంద్రుని చందనలేపముతో తెల్లబరచుచున్నాడుగదా!"

ఇచట కర్తలిద్దరికిని అభేదము శాబ్దికమైనను క్రియలకభేదము అశాబ్దికముగనుక నదియె యావత్కార్యభారమును సహించును. కనక నిదర్శనయేను. అయితే - నిదర్శనయందు ఇది యుదాహరణము గానిచో నపుడలంకార సర్వస్వకారుడు దీనినా ప్రకరణమునందెట్లు ఉదాహరించెను?-అనెదరా? భ్రాంతునిచేతనే మోసగింపబడితివి ; ప్రామాణికుడవగు నీవు, ఎపుడును, ఇతరులు చెప్పనిది యేకొంచము నుదహరింపవుగదా ?

మరియు - రూపకమునందు బింబప్రతిబింబభావము లేదని చెప్పబడినది. అదియు భ్రాంతియే. అలంకారసర్వస్వటీకయందు, విమర్శనియందు, బింబప్రతిబింబభావముతో రూపకముదాహరిపబడినది.

"కందర్పద్విపకర్ణకంబు" (దానోదకములచే చిహ్నితమైన మన్మథుని ఏనుగుయొక్క చెవియందలి శంఖమును, లగ్నమగు అంజనమాలిన్యము గల రతిగండోపధానమును, తుమ్మెదలచే కప్పబడిన మధ్యభాగముగల ఆకాశవృక్షపుష్పగుచ్ఛమును, కలంకచిహ్నితమును, అమృతతుల్యకాంతియు అగు ఈ చంద్రబింబమునుచూడుము.)

ఇచట కలంకమునకు దానాంబువులు మొదలైనవాటిచే ప్రతిబింబము. లాంఛితత్వ - అంకితత్వములకు శుద్ధసామాన్యరూపత్వమున్ను అని చెప్పబడినదిగూడాను. ఈ విషయ ముండనీడు—

తథా నిర్దిష్టే శబ్దేనాభిహితే ఇత్యస్య యేనకేనచిద్రూపేణ శబ్దేనాభిహిత ఇత్యర్థః, ఉతాహో ఉపమేయతావచ్ఛేదకరూపేణ శబ్దేనాభిహితే? ఆద్యే 'సున్దరం కమలం భాతి లతాయామిదమద్భుతమ్' ఇత్యత్రాతిప్రసఙ్గః, సున్దరపదేనసున్దరత్వేన రూపేణ ఇదంపదేన విషయస్యాననస్య ప్రతిపాదనాత్. న చాత్ర సున్దరపదార్థస్యారోప్యమాణ

కమలాన్వయ ఏవ, న తు వదనరూపవిషయాన్వయ ఇతి వాచ్యమ్. కమలపదేన కమలతాద్రూప్యేణానన్వయస్యైవ లక్షణయోపస్థానాత్తత్రైవ సున్దరాదిపదాన్వయో యుక్తః, న తు విశేషణీభూతే కమలే. అథ తాదృశం విషయముద్దిశ్య విషయితాద్రూప్యం యత్ర విధీయతే ఇత్యపి లక్షణవాక్యార్థః, ప్రకృతే చ సున్దరత్వావచ్ఛిన్నముద్దిశ్య కమలతాద్రూప్యస్యావిధానాన్నాతిప్రసఙ్గ ఇతి చేత్, న. 'ముఖచన్ద్రస్తు సున్దరః' ఇత్యాదిరూపకే సమాసగతయోర్విషయ విషయిణోః పృథగ్విభక్తిమన్తరేణోద్దేశ్య విధేయభావాభావాదవ్యాప్త్యాపత్తేః. ద్వితీయేత్వనిహ్నుత ఇతి విశేషణవైయర్థ్యమ్. అపహ్నుతావుపమేయతావచ్ఛేదక్యస్య నిషిధ్యమానతయా తేన రూపేణ విషయస్య నిర్దిష్టత్వాదేవ లక్షణస్యాప్రసక్తేః. నిశ్చయగతాహార్యత్వ విశేషణవైయర్థ్యంచ. భ్రాన్తిమతిదోషవిశేషేణ ప్రతిషిధ్యమానతయానాస్త్యుపమేయతావచ్ఛేదక సంస్పర్శ ఇతి తావత్తైవ వారణాత్. అపిచ 'నాయం సుధాంశుః కిం తర్హి సుధాంశుః ప్రేయసీముఖమ్' ఇతి కువలయానన్దోక్తాయామపహ్నుతావతిప్రసఙ్గః. అత్ర సుధాంశౌ సుధాంశుత్వ నిహ్నవేఽప్యారోప విషయస్యానిహ్నవాత్. న చేదం రూపకమేవేతి వాచ్యమ్, త్వదుక్తి విరోధాపత్తేః.

అలాగే 'నిర్దిష్టే' శబ్దముచేత జెప్పబడినది, అనుదానికి నేదోయొక రూపముతో శబ్దముచేత చెప్పబడుటయర్థమా, లేక – ఉపమేయతా నిర్ణాయక రూపముతో శబ్దముతో జెప్పబడుట యర్థమా? మొదటిపక్షములో —

'సుందరం కమలం భాతి లతాయామిదమద్భుతం' అనుచోట నతివ్యాప్తి. సుందరపదముతో సుందరత్వరూపముచేతను, ఇదంపదముతోనున్ను, విషయము – ఆననము – ప్రతిపాదింపబడినది గనుక. ఇక్కడ సుందర పదార్థమునకు నారోపింపబడుచున్న కమలముతోడనే అన్వయము, అంతేగాని వదనమను విషయముతో నన్వయములేదు–అనరాదు. కమలపదముచేత కమలతాద్రూప్యముతో మొగమే లక్షణచే నుపస్థితమగును గనుక అక్కడనే సుందరాది పదార్థముల యన్వయము. అంతేగాని విశేషణమగు కమలమునందుగాదు.

అయితే – "అటువంటి విషయము నుద్దేశించి విషయితాద్రూప్యము ఎచ్చట విధింపబడునో – అనియు లక్షణమున కర్థము. ప్రకృతమున సుందరత్వ

విశిష్టము నుద్దేశించి కమలతాద్రూప్యము విధించకపోవుటవలన అతివ్యాప్తి లేదు" అనుట యుక్తముగాదు. 'ముఖచంద్రుడుమాత్రము సుందరుడు' ఇత్యాది రూపకమునందు సమాసములోనున్న విషయ విషయులకు పృథక్పుగా విభక్తి లేకుండుటవలన అవ్యాప్తి గలుగును. ఇక రెండవపక్షమున "అనిహ్నుతే" అను విశేషణము వ్యర్థము, అపహ్నుతిలో నుపమేయతావచ్ఛేద్యము నిషేధింపబడుచుండుటవలన ఆ రూపకముతో విషయము నిర్దేశింపబడక పోవుటవలననే లక్షణము ఇట ప్రసక్తింపదు. నిశ్చయమునందున్న నాహార్యత్వ విశేషణము వ్యర్థమే. భ్రాంతిమత్తులో దోషవిశేషముచే ప్రతిబంధింపబడుటచేత నుపమేయతానిర్ణాయక స్ఫుర్తియేలేదు కనుక నంతమాత్రముచేతనే వారణము లభించునుగదా ?

అంతేగాక—

"నాయం సుధాంశుః కిం తర్హి సుధాంశుః ప్రేయసీముఖమ్" అని కువలయానందపద్యములో నీవు చెప్పినదావియందే నపహ్నుతి యందతి ప్రసంగము సంభవించును. ఇక్కడ సుధాంశువునందు, సుధాంశుత్వము నిహ్నవించినను నారోపవిషయమును నిహ్నవించలేదు గనుక. పోనీ - ఇది రూపకమేయనుటకును నీ మాటయే విరోధించును.

యచ్చాప్యుక్తమవ్యఙ్గ్యత్వ విశేషణాచ్చేదమేవాలఙ్కారభూతస్య రూపకస్య లక్షణమితి, తదపి న. నహి వ్యఙ్గ్యత్వాలఙ్కారత్వయోర్విరోధోఽస్తి. ప్రధానవ్యఙ్గ్యరూపకవారణాయ పునరుపస్కారకత్వం విశేషణముచిత మిత్యసకృదావేదనాత్. అనలఙ్కారత్వస్య తుల్యతయా ప్రధానవ్యఙ్గ్యరూపకస్యేవ ప్రధానవాచ్య రూపకస్యాపి వారణీయత్వేన తద్వారక విశేషణాభావేన తత్రాతిప్రసఙ్గాచ్చ.

"అవ్యంగ్యత్వ విశేషణమువలన. ఇదియే యలంకారమగు రూపకమునకు లక్షణము" అనుటయును దప్పే అగును. వ్యంగ్యమగుటకు, అలంకారమగుటకును విరోధము లేదుగగా? ప్రధానవ్యంగ్యరూపకమును వారించుటకై మాత్ర ముపస్కారకత్వ విశేషణము అవసరమని అసకృత్తుగా దెల్పితిమి. అలంకారము గాకపోవుట సమమే కనుక ప్రధానవ్యంగ్యరూపకమునువలె ప్రధానవాచ్యరూపకమును వారింపవలసినదే గనుక దానిని వారించువిశేషణము లేకపోవుటవలన నచట నవ్యాప్తియును గలుగును.

యచ్చ 'తద్రూపకమభేదో య ఉపమానోపమేయయోః' ఇత్యాది ప్రాచీనై రుక్తమ్, తచ్చిన్త్యమ్, అపహ్నుత్యాదావు - పమానోపమేయయోరభేదస్య ప్రతీతిసిద్ధతయా తత్రాతిప్రసఙ్గాత్. అథో వమానోపమేయయోరిత్యుక్త్యా ఉపమేయతావచ్ఛేదకంపురస్కృ త్యోపమానతావచ్ఛేదకావచ్ఛిన్నాభేద ఇత్యర్థలాభాదపహ్నుతౌ చోప మేయతావచ్ఛేదకస్య పురస్కారాభావాన్నాతిప్రసఙ్గ ఇతిచేత్; 'నూనం ముఖం చన్ద్రః' ఇత్యాద్యుత్ప్రేక్షాయాం తథాప్యతిప్రసక్తేః.

"ఉపమానోపమేయముల కభేదము రూపకము" - ఇత్యాదికము ప్రాచీనులుజెప్పిరి. అది ఆలోచనీయమే, అపహ్నుతిలో నుపమానోపమేయముల కభేదము ప్రతీతి సిద్ధముగనుక నచట నతిప్రసంగ మేర్పడును.

"అయ్యా ఉపమానోపమేయములనుటవలన ఉపమేయతానిర్ణాయక మును బురస్కరించుకొని ఉపమానతానిర్ణాయక విశిష్టములో నభేదమను నర్థము లభించుటచే నపహ్నుతిలో నుపమేయతానిర్ణాయకమునకు బుర స్కారము లేకపోవుటవలననే అతిప్రసంగముండదు"; అనరాదు. అట్లైనను- "ఈమొగము తప్పక చంద్రుడు" - అను నుత్ప్రేక్షలో నతివ్యాప్తి తప్పనిదే.

నచ—

'ప్రకృతం యన్నిషిధ్యాన్యత్సాధ్యతే సాత్వపహ్నుతిః'
'సమ్భావన మథోత్ప్రేక్షా ప్రకృతస్య సమేన యత్'

ఇత్యాద్యపహ్నుత్యుత్ప్రేక్షాదీనాం బాధకత్వాత్తత్పరిగృహీత విషయాతిరిక్తో రూపకస్య 'ముఖం చన్ద్రః' ఇత్యాదిర్విషయః స్యాత్. యథా 'శరమయం బర్హిః' ఇత్యేతద్విషయాతిరిక్తః 'కుశమయంబర్హిః' ఇత్యస్య; యథావా క్వాదేశవిషయాతిరిక్తో విషయః సిచః, లోకేఽపి యథా 'బ్రాహ్మణేభ్యో దధిదేయమ్', తక్రం కౌడిన్యాయ' ఇత్యత్ర తక్రసమ్ప్రదానాతిరిక్తం దధ్నః సంప్రదానమితి వాచ్యమ్. వైష మ్యాత్. విశేషశాస్త్రంహి స్వవిషయాతిరిక్తం విషయంగ్రాహయత్సా మాన్యశాస్త్రస్య బాధకమిత్యుచ్యతే. ప్రకృతేచ రూపకస్య లక్షణం ధర్మిః. సయద్యుత్ప్రేక్షాదివృత్తిః స్యాత్కస్తస్మాద్విషయాన్నిరస్య విష యాన్తరం గ్రాహయేత్. న హి ఘటత్వం స్వాధికరణాత్ పృథివీత్వం

ద్రవ్యత్వం వా నిరస్య విషయాన్తరం గ్రాహయితుమీష్టే. తస్మాదతి ప్రసక్తిర్లక్షణేఽస్మిన్దోషః. నను సమ్భావనాత్మికోత్ప్రేక్షా; కథం తస్యామ భేదత్వాత్మకరూపకలక్షణాతిప్రసక్తిరితి చేత్, న. వినిగమకాభావేన సంభావ్యమానాభేదస్యాప్యుత్ప్రేక్షాస్వరూపత్వాత్. విషయసంభావనాభేదాభ్యాముత్ప్రేక్షాయా మలఙ్కారద్వయవ్యవహారాపత్తేశ్చ, నిశ్చీయమానత్వేనాభేదో విశేషణీయ ఇతిచేదస్మదుక్త ఏవ తర్హి పర్యవసితిరితి దిక్!

ఒకవేళ – "ప్రకృతము నిషేధించి మరొకదానిని సాధించుట యపహ్నుతి", "ప్రకృతమునకు సమము గుదానితో సంభావన ముత్ప్రేక్ష" ఇత్యాదులగు నపహ్నుత్యుత్ప్రేక్షాదులు బాధకమగుటవలన వాటివిషయమున కన్న నతిరిక్తమగు "మొగము చంద్రుడు" ఇత్యాదికము రూపకమునకు విషయము గావచ్చును. ఎట్లనగా – "శరమయం బర్హిః—" అనుదాని విషయముకన్న నతిరిక్తమగునది "కుశయయం బర్హిః"— అనుదాని విషయము. శ్వాదేశవిషయాతిరిక్తమే విషయము సిచ్ నకు. లోకములోగూడ - "బ్రాహ్మణేభ్యో దధి దీయతాం తక్రం కౌండిన్యాయ" అనుచోట మజ్జిగ నిచ్చుటకంటె వ్యతిరిక్తమైనదే పెరుగును ఇచ్చుటకు నేర్పడలేదా? అని యందురా? ఇక్కడ వైషమ్యమున్నది. విశేషశాస్త్రము స్వవిషయమున కతిరిక్తమైన విషయమును గ్రహింపజేయుచున్నపుడే సామాన్యశాస్త్రమునకు బాధకమని చెప్పబడును. ప్రకృతమున రూపకమునకు లక్షణము ధర్మము. అది ఉత్ప్రేక్షాదులందున్నయెడల నేది అవిషయమునుండి నిరసించి, మరొక విషయమును గ్రహింపజేయును? ఘటత్వము తన యధికరణమునుండి పృథివీత్వమునుగాని ద్రవ్యత్వమునుగానీ నిరసించి విషయాంతరమును గ్రహింపజేయుటకు సమర్థముగాదు. కనుక అతిప్రసక్తి ఈలక్షణమునందు దోషమున్నది.

"అయ్యా! సంభావనాస్వరూపముతోనుండు నుత్ప్రేక్షయం దభేదాత్మకస్వరూపముగాగల రూపలకలక్షణమున కతివ్యాప్తి ఎట్లుండీ"— అనరాదు. విని గమకము లేదుగనుక సంభావ్యమానాభేదముగూడ నుత్ప్రేక్ష యొక్క స్వరూపమేగదా? విషయసంభావనాభేదములనుపట్టి యుత్ప్రేక్షలో నలంకారములు రెండున్నవని వ్యవహరించవలసియుండుటయు ప్రసక్తించును. ఈ యభేదము నిశ్చయింపబడుచున్నదని విశేషించునవసరమగుచో మేము చెప్పినదానిలోనే పర్యవసించినది; అని దిక్.

తదిదం రూపకం సావయవం నిరవయవం, పరంపరితం చేతి తావత్త్రివిధమ్. తత్రాద్యం సమస్తవస్తువిషయం, ఏకదేశవివర్తిచేతి ద్వివిధమ్. ద్వితీయమపి కేవలం మాలారూపకంచేతిద్వివిధమ్. తృతీయంచ శ్లిష్టపరంపరితం శుద్ధపరంపరితం చేతిద్వివిధం సత్ప్రత్యేకం కేవలమాలారూపత్వాభ్యాం చతుర్విధమిత్యష్టవిధతామాహుః

ఆ ఈ రూపకమంతయు సావయవమనియు, నిరవయవమనియు, పరంపరితమనియు మూడురకములు. అందు మొదటిది సమస్తవస్తువిషయము ఏకదేశవివర్తియని రెండురకములు. రెండవదిగూడ కేవలము మాలారూపకము అని రెండువిధములు - మూడవది శ్లిష్టపరంపరితమనియు, శుద్ధపరంపరితమనియు రెండురకములై ప్రత్యేకముగా కేవలమనియు మాలారూపమనియు విభాగములతో నాల్గురకములు అని ఎనిమిదివిధములయినది, అని చెప్పెదరు.

తత్ర పరస్పరసాపేక్ష నిష్పత్తికానాం రూపకాణాం, [illegible] సావయవమ్. తత్రాపి - సమస్తాని వస్తూన్యారోప్యమాణాని శబ్దోపాత్తానియత్ర తత్సమస్తవస్తు విషయమ్. యత్రక్వచిదవయవే శబ్దోపాత్తమారోప్యమాణం క్వచిచ్చార్థసామర్థ్యాక్షిప్తం తదేకదేశే శబ్దానుపాత్తవిషయకే అవయవరూపకే వివర్తనాత్స్వస్వరూప గోపనే నాన్యథాత్వేన వర్తనాదేకదేశవివర్తి. యద్వా - ఏకదేశే ఉపాత్తవిషయకే అవయవే విశేషేణ స్ఫుటతయా వర్తనాదేకదేశవివర్తి.

అందు - నిష్పత్తిలో నొకదానితో నొకదానికి అపేక్షగలరూపకముల సంఘాతము సావయవము. అచ్చటను ఆరోప్యమాణములగు సమస్తములగు వస్తువులును శబ్దముచే నుపాత్తమైనచో అది సమస్తవస్తువిషయము. ఎచ్చట, ఒక అవయవమున ఆరోప్యమాణము శబ్దముచే నుపాత్తమై, మరియొక అవయవమున అర్థసామర్థ్యముచే ఆక్షిప్తమైనచో అది ఏకదేశవివర్తిరూపకము. ఏకదేశే = శబ్దముచే గ్రహింపబడని ఉపమానముగల అవయవరూపకమునందు, వివర్తనాత్ = స్వస్వరూపగోపనముద్వారా మరియొకవిధము గనుండుటచే దీనికి 'ఏకదేశవివర్తి' యని పేరు. ఇంకొక విధము—ఏకదేశే = గ్రహింప ఉపమానముగల అవయవమున నెక్కుడు స్ఫుటముగానుండుటవలన ఏకదేశవివర్తి.

సమస్తవస్తువిషయం సావయవం యథా:—

'సువిమలమౌక్తికతారే ధవళాంశుకచంద్రికా చమత్కారే
వదన పరిపూర్ణచంద్రే సున్దరి రాకాసి నాత్ర సన్దేహః'

అత్ర సముదాయాత్మకస్య సావయవరూపకస్యావయవానాం సర్వేషామపి వస్తుతః సమర్థ్యసమర్థకభావస్య పరస్పరం తుల్యత్వేఽపి కవే రాకారూపస్యైవ సమర్థ్యత్వేనాభిప్రేతత్వా త్సమర్థకతయో పాదాన మితరేషామితి గమ్యతే. ఏవం స్థితే సమర్థకరూపకాణాం విషయవిషయిణోః పృథగ్విభక్తేరశ్రవణాత్ అనువాద్యత్వేఽపి సమర్థ్యరూపకస్య తయోః పృథగ్విభక్తి శ్రవణా ద్విధేయతయా తదాదాయ సఙ్ఘాతాత్మకస్య సావయవరూపకస్యాపి విధేయత్వమత్ర వ్యపదిశ్యతే. యథా భటసఙ్ఘాతా న్తర్గతస్య ముఖ్యస్య కస్యాపి భటస్య జయపరాజయాభ్యాం భటసఙ్ఘాతో జితః పరాజితశ్చేత్యుచ్యతే.

సమస్త వస్తువిషయము సావయవమెట్లనగా—

"సువిమలమౌక్తిక" మొ. (బాగా తెల్లనైన ముత్యములే నక్షత్రములు గలిగినట్టియు, తెల్లనివస్త్రమే వెన్నెల కలిగినట్టియు మొగమే పూర్ణచంద్రుడుగలట్టి సుందరీ నీవు రాకవే; ఇచట సందేహములేదు.) ఇచట సముదాయ స్వరూపమైన సావయవరూపకము యొక్క అవయవము లన్నిటికిని వాస్తవమున పరస్పరము సమర్థ్యసమర్థకభావము సమమైనను కవికి రాకారూపమైనదే సమర్థింపదగినదిగా ఇష్టమైనది గనుక ఇతరములు సమర్థకములుగా స్వీకరింపబడినవని గమ్యమగుచున్నది.

ఇట్లుండగా—సమర్థకరూపకములు, విషయ విషయులకు పృథక్కుగా విభక్తి వినబడకపోవుటవలన అనువాద్యములైనను, సమర్థింపదగిన రూపకమునందు, వానిలో వేరుగా విభక్తి వినపడుటవలన అది విధేయమగుటచేత దానిని తీసుకొని సంఘటితాత్మకమగు సావయవరూపకమునకు గూడ విధేయత్వము ఇచట వ్యపదేశించబడును. ఎట్లనగా— భటసంఘాతాంతర్గతుడగు నొక్కభటుడు ముఖ్యుడై నాతని జయపరాజయములచేత నాభటసంఘము జయించినది, పరాజితమైనది అనుటలేదా!

వ్యోమాఙ్గణే సరసి నీలిమదివ్యతోయే
తారావలీ ముకులమణ్డలమణ్డితేఽస్మిన్
ఆభాతి షోడశకలాదలమఙ్కభృఙ్గమ్
సూరాభిముఖ్యవికచం శశిపుణ్డరీకమ్.

అస్యతు సావయవరూపకస్యానువాద్యత్వమేవ. అత్ర వర్ణ్యస్య పూర్ణచంద్రస్య సూర్యాభిముఖ్యం జ్యోతిశ్శాస్త్ర సిద్ధమ్, తేన సూర్యాభిముఖ్యే చన్ద్రస్య కథం వికాస ఇతి న శఙ్కనీయమ్.

ఏకదేశవివర్తి సావయవం యథా—

'భవగ్రీష్మ ప్రౌఢాంతపనివహాసన్తప్తవపుషో
బలాదున్మూల్య ద్రాక్ నిగడమవివేకవ్యతికరమ్,
విశుద్ధేఽస్మిన్నాత్మామృతసరసి నైరాశ్యశిశిరే
విగాహన్తే దూరీకృతకలుషజాలాః సుకృతినః.

అత్ర సహచరైర్నిగడాదిరూపకైః సుకృతిషు గజరూపకమాక్షిప్యతే. యథావా—

'రూపజలా చలనయనా నాభ్యావర్తా కచావలీ భుజగా
మజ్జన్తి యత్ర సన్తః సేయం తరుణీతరఙ్గిణీ విషమా.'

పూర్వం తు కవేః సమర్థ్యత్వేనాభిమతస్య రూపకస్యాక్షేపః; ఇహతు సమర్థకత్వేనాభిమతస్య నయనయోర్మీనరూపకస్యేతి విశేషః.

"వ్యోమాంగణే" మొ. (నల్లదనమనెడు దివ్యమగు తోయము గలిగినట్టియు నక్షత్ర సమూహమనెడు మొగ్గల మండలముతో అలంకరింపబడిన యీ వ్యోమాంగణమనెడు సరస్సున పదునారు కళల నెడు దలములతో కూడినట్టియు, అంకమనెడు భృంగము గలిగినట్టి చంద్రపుండరీకము సూర్యాభిముఖ్యము చే వికసించినదై ప్రకాశించినది.)

ఈ సావయవరూపకమునన్నైతే ననువాద్యత్వమే. ఇచట వర్ణ్యుడగు పూర్ణచంద్రుడు సూర్యాభిముఖుండగుట జ్యోతిశ్శాస్త్రమున ప్రసిద్ధము. ఇందువలన చంద్రునకు సూర్యుడభిముఖుడై యుండగా వికాసమెట్లు గల్గును అనియాశంకింపరాదు. ఏకదేశవివర్తి సావయవమెట్లనగా.

"భవగ్రీష్మ" మొ. (సంసారమనెడు గ్రీష్మఋతువుయొక్క ప్రౌఢమైన యెండల యొక్కగుంపుచే సంతాపము నొందింపబడిన శరీరము గలవారై తొందరగా బలాత్కారముగా అవివేకసంబంధమనెడు నిగళము నున్మూలించి, విశుద్ధమైనట్టియు నైరాశ్యముతో చల్లనైన ఆత్మామృత సరస్సునందు దూరముగాజేయబడిన పాపసమూహము గలవారైన పుణ్యాత్ములు అవగాహనము చేయుచున్నారు). ఇచట సహచరములగునిగడాదిరూపకములతో తను సుకృతులయందు గజాదిరూపకము ఆక్షిప్తమగును.

మరొకటి—

"రూపజలా" మొ. (రూపమనే జలము కలదియు, చలించుచున్న కనులు గలదియు కేశసమూహమను సర్పము గలదియు, నాభి అను సుడిగలదియు, ఎచ్చట సత్పురుషులు మునుగుచున్నారో ఆ పడుచు విషమమైన నదియే.) వెనుకనైతే కవికి సమర్థింపవలసినదిగా నభిమతమైన రూపకమునకాక్షేపము. ఇక్కడనైతే సమర్థకముగా నభిమతమగు నేత్రములందు మీనరూపకమున కదియని విశేషము.

అత్ర చ చమత్కారవిశేషజనకతయా రూపకసంఘాతాత్మకమపి సావయవరూపకం రూపకాలంకృతిభేదగణనాయాం గణ్యతే. యథా మౌక్తికాలంకృతి భేదగణనాయామేకం నాసామౌక్తికమివ సంఘాతాత్మక మౌక్తికమంజర్యాదయోఽపి గణ్యన్తే. అన్యథా మాలారూపస్యోపమాదేస్తద్భేదగణనేఽగణనప్రసఙ్గాత్. ఏతేన 'గవాం సంఘాతో గోభేదానాం కపిలాదీనాం గణనాయాం యథా న గణ్యతే తథా రూపకభేదగణనాప్రస్తుతౌ న తత్సంఘాతాత్మకం సావయవం గణనీయమ్' ఇతి పరాస్తమ్. ఏవమస్మాత్సంఘాతాత్మకాత్సావయవాన్మాలారూపకస్య సంఘాతాత్మకత్వేనావిశేషేఽప్యేకవిషయకత్వపరస్పరనిరపేక్షత్వాభ్యామస్తి మహాన్ విశేషః.

ఇక్కడ చమత్కారవిశేషము గల్గించునదగుటచేత రూపకముల సంఘాతాత్మకమైనను సావయవరూపకము రూపకాలంకారముయొక్క భేదముల గణనయందు గణింపబడును. ఎట్లనగా - మౌక్తికాలంకారముల విశేషముల లెక్కలో నొక్క ముంగముత్యమువలె సంఘాతాత్మకములగు ముత్యముల గుత్తులుగూడ లెక్కింపబడును. ఇట్లుగానిచో మాలారూపమగు నుపమ

మొదలగువానికి తద్భేదములను లెక్కించునపుడు గణింప వీలు లేకపోవును. ఇందువలన – "గోవుల సమూహము గోవిశేషములగు గపిలాదుల లెక్కించుటయందు నెట్లు లెక్కకురాదో అట్లు రూపకభేదముల గణనాప్రస్తావనమున తత్సంఘాతాత్మకమగు సావయవము గణింపుకు రాకూడదు." అనుట త్రోసి వేయబడినది. ఈ సంఘాతాత్మకమగు సావయవముకన్నా మాలారూపకము సంఘాతాత్మకము గనుక తేడా లేకపోయినను, ఒక విషయము గలిగియుండుటయు, పరస్పర నిరపేక్షమగుటయు అను నీరెంటివలన గొప్ప భేదమున్నది.

నిరవయవం కేవలం యథా—

'బుద్ధిర్దీపకలా లోకే యయా సర్వం ప్రకాశతే
అబుద్ధిస్తామసీ రాత్రి ర్యయా కించిన్న భాసతే'.

అత్ర రూపకద్వయమపి సాపేక్షరూపక సంఘాతాత్మకత్వ విరహాన్నిరవయవమ్. మాలాత్మకత్వవిరహాచ్చ కేవలమ్.

నిరవయవం మాలా రూపకం యథా—

'ధర్మస్యాత్మా భాగధేయం క్షమాయాః
సారః సృష్టేర్జీవితం శారదాయాః,
ఆజ్ఞా సాక్షాద్ బ్రహ్మణో వేదమూర్తే—
రాకల్పాన్తం రాజతామేష రాజా.'

ఏకవిషయక నానాపదార్థారోపత్వా న్మాలారూపకమిదమ్, పరస్పరసాపేక్షత్వ విరహాచ్చ నిరవయవమ్.

కేవల నిరవయవము ఎట్లనగా—

"బుద్ధిర్దీపకలా" (బుద్ధియే దీపకళ దేనిచేనంతయూ ప్రకాశించునో; బుద్ధి లేకపోవుట తమోమయమగు రాత్రి – దేనిచే కొంచమునూ గనపడదో.) ఇచట రూపకద్వయము సాపేక్షకరూపక సంఘాతాత్మముగాదుగనుక నిరవయవము. మాలాత్మకముగాదు కనుక కేవలము. నిరవయవమాలా రూపకమెట్లనగా—

"ధర్మస్య" (ధర్మమునకు ఆత్మయు, భూమియొక్క భాగ్యము, సృష్టియొక్కసారము శారదయొక్క జీవితము, వేదమూర్తియగు బ్రహ్మ యొక్క సాక్షాత్తు ఆజ్ఞయు నైన యీ రాజు కల్పాంతము వరకును ప్రకాశించునుగాత!) ఇది ఒక విషయముగల అనేక పదార్థముల యారోప రూపమున నున్నది గనుక మాలారూపకము. ఒకదానితో నొకదానికి అపేక్ష లేదు గనుక నిది నిరవయవమును.

యత్రచారోప ఏవారోపాన్తరస్య నిమిత్తం తత్పరంపరితమ్. తత్రాపి సమర్థకత్వేన వివక్షితస్యారోపస్య శ్లేషమూలకత్వే శ్లిష్టపరంపరితమ్. యథా—

'అహితాపకరణభేషజ నరనాథ భవాన్ కరస్థితో యస్య
తస్య కుతో హి భయం స్యాదఖిలామపి మేదినీం చరతః.'

అత్ర ద్వయోరప్యారోపయోః సమర్థ్యసమర్థకభావస్య వస్తుతస్తుల్యత్వేఽప్యహితానామపకరణమేవాహీనాం తాపకరణమితి శ్లేషమూలకేనారోపేణ రాజని భేషజతాదాత్మ్యారోపస్య సమర్థనీయతయా కవేరభిప్రాయః. అత ఏవభఙ్గశ్లేషనివేదితోఽహి భయాభావోఽపి సఙ్గచ్ఛతే. ఇదమేవ మాలారూపం యథా—

'కమలావాస కాసారః క్షమాధృతి ఫణీశ్వరః
అయం కువలయస్యేన్దు రానన్దయతి మానవాన్.'

ఎక్కడనైతే నొకదానితో నారోపించుటయే మరొకదాని నారోపించుటకు నిమిత్తమో నయ్యది పరంపరితము. అందుకు సమర్థించునట్టిదిగా వివక్షితమగు నారోపము శ్లేషమూలకమగుచో శ్లిష్టపరంపరితము—

ఎట్లనగా—

"అహితాపకరణ" మొ. (అహితులకపకారము చేయుటయందు భేషజమైనవాడా! పాములకు దాపము చేయుటయందు భేషజమైనవాడా! ఓ రాజా! నీవు ఎవనిచేత నుందువో అతనికి భూమియంతా తిరుగుచున్నను భయమెక్కడిది? అతనికి భూమియంతా దిరుగుచున్నను సర్పభయము లేదు.) ఇచట నారోపములు రెంటికి సమర్థ్యసమర్థకభావము సమానమైనను నహితు

లకు నపకారమొనర్చుటయే పాములకు దాపమునొనరించుట యనే శ్లేష మూలకమగు నారోపముచేత రాజునందు శేషజతాదాత్మ్యము నారోపించుట సమర్థించదగినదని కవి యభిప్రాయము. ఇందువల్లనే సభంగశ్లేషచే నివేదింప బడిన అహిఖయాభావముగూడ సంగతమగును.

ఇదియే మాలారూపమెట్లనగా—

"కమలావాసకాసారః" మొ. (లక్ష్మిని వాసమను కమలముండుటకు సరస్సైనవాడును, ఓర్పును ధరించుటయను భూధరణమునందు శేషుడును, భూమండలమను కలువకు చంద్రుడును నైన యీ రాజు మానవులను ఆనందింపజేయుచున్నాడు.)

శుద్ధ పరమ్పరితం కేవలం యథా—

'దేవాః కే పూర్వదేవాః సమితి మనునరః సన్తి కేవా పురస్తా—
దేవం జల్పన్తి తావత్ ప్రతిభటపృతనావర్తినః క్షత్రవీరాః.
యావన్నాయాతి రాజన్నయనవిషయతామన్తకస్త్రాసి
మూర్తే
ముగ్ధారిప్రాణదుగ్ధాశనమసృణరుచిస్త్వత్కృపాణో భుజఙ్గః'

అత్రాపి భుజఙ్గారోపో దుగ్ధారోపసమర్థ్యత్వేనాభిమతః
తదేవ మాలారూపం యథా—

'ప్రాచీసన్ధ్యా సముద్యన్మహిమదినమణేర్మానమాణిక్యకాన్తి
ర్జ్వాలామాలాకరాలా కవలితజగతః క్రోధకాలానలస్య.
ఆజ్ఞా కాన్తాపదామ్భోరుహతలవిగలన్మఞ్జులాక్షారసాభా
క్షోణీన్ద్ర సఙ్గరే తే లసతి నయనయోరుద్భటా శోణిమశ్రీః.

యద్యపి సావయవేఽప్యారోప ఆరోపాన్తరస్యోపాయస్తథాపి తత్రారోపాతిరిక్తేన కవిసమయసిద్ధసాదృశ్యేనాప్యారోపాన్తరసిద్ధిః సమ్భవతి. యథా ప్రాగుక్తే 'సున్దరి రాకాసి నాత్ర సన్దేహః' ఇత్యత్ర మౌక్తికాదీనాం తారాత్వాద్యారోపం వినా ప్యౌజ్జ్వల్యమాత్రేణాపి సున్దర్యాం రాకారోపసిద్ధేః, ఇహ తు నయనశోణిమ్ని జ్వాలాద్యారోపోఽనలసమారోపం నియమేనాపేక్షతే. ఏవం 'కారుణ్యకుసుమా

కాశః ఖలః' ఇత్యత్రాకాశఖలయోః సాదృశ్యస్యాప్రసిద్ధతయారోప సిద్ధ్యర్థమారోప ఏవోపాయ ఇతి వైలక్షణ్యమ్, కశ్చిత్తు బహ్వారోపాత్మకాత్ సావయవాదారోపద్వయాత్మకమేవాస్య వైలక్షణ్యే బీజమిత్యాహ.

కావ్యం సుధా రసజ్ఞానాం కామినాం కామినీ సుధా
ధనం సుధా సలోభానాం శాన్తిః సన్యాసినాం సుధా'.

అత్ర విషయమాలాకృతో న కశ్చిచ్చమత్కారవిశేష ఇతి న పృథగ్భేదగణనాయాం గణ్యతే. ఆరోప్యమాణమాలా తు చమత్కారవిశేషశాలిత్వాద్గణ్యత ఏవ.

శుద్ధపరంపరితము కేవలము ఎట్లనగా.

"దేవాః కే పూర్వదేవాః" మొ. (దేవతలెవరు? పూర్వదేవతలెవరు? యుద్ధములో నాకు నెదురుగా మనుష్యులెవరున్నారు? ఈలాగునే ప్రతిపక్షములో నున్న సేనలో నుండునట్టి క్షత్రియవీరులు సంభాషించుచున్నారు; ఎంతవరకైతే యముని భయపెట్టునట్టి రూపము గల నీయొక్క ముగ్ధమైన శత్రువులయొక్క ప్రాణములన్నియు యుద్ధమున తినుటచేత మసృణమైన కాంతి గల యాకత్తియనెడు సర్పము ఎంతవరకు కళ్ళబడదో.) ఇచటను గూడ భుజంగారోపము దుగ్ధారోపముచే సమర్థించదగినదిగా నభిమతము.

అదియే మాలారూపమెట్లనగా—

''ప్రాచీసంధ్యా'' మొ. (బాగా ఉదయించుచున్న ప్రతాపసూర్యుని యొక్క ప్రాచీసంధ్యయు, అభిమానమనెడు మాణిక్యము యొక్క కాంతియు, జగత్తునంతయు మింగునట్టి క్రోధమనెడు కీలాగ్నియొక్క క్రూరమైన మంటల వరుసయు, ఆజ్ఞాకాంతయొక్క పాదపద్మదళమునుండి జారుచున్న మంజువగు లాక్షారసమువంటి కాంతికలదియు, ఓ భూచంద్రుడా! నీ ఎఱ్ఱని కనుల కాంతి యుద్ధమునందు ప్రకాశించుచున్నది.) విచారించగా సావయవము నందైనను ఒక ఆరోపము మరొక యారోపమున కుపాయము: అలాగైనప్పటికిన్నీ నచట యారోపాతిరిక్తమగు కవి సమయసిద్ధమగు సాదృశ్యము చేనైనను మరొక యారోపము సిద్ధించును. ఎట్లనగా - వెనుక జెప్పిన "సుందరి శాకాసి నాస్తి సందేహః" - అనుచోట మౌక్తికాదులందు తాదాత్మ్యాద్యా

రోపములేకపోయినను ఔజ్జ్వల్యము చేనైనను సుందరియందు రాకాద్యారోపము సిద్ధించును. ఇక్కడనైతే గన్నుల నెరవునందు జ్వాలాదుల యారోపము అనలసమారోపమును దప్పకుండ నపేక్షించును. అలాగే - "కారుణ్యకుసుమాకాశః ఖలః" - అనుచోట ఖలునకు నాకాశమునకు సాదృశ్యమప్రసిద్ధము గనుక నారోపము సిద్ధించుటకు నారోపమే యుపాయము అని తేడా. ఒకడుమాత్రము అనేకముల యారోపములు స్వరూపముగా గల సావయవముకన్న నారోపద్వయాత్మకత్వమే దీనికి వైలక్షణ్యమునకు బీజమని చెప్పెను.

"కావ్యం సుధా" (కావ్యమురసజ్ఞులకమృతము. కాముకులకు కామిని యమృతము. లోభులకు ధనము అమృతము. శాంతి సన్యాసుల కమృతము.) ఇత్యాదిశ్లోకమున విషయమాలాకృతమగు చమత్కార విశేషమేమియును లేదు. కనుక నిది పృథక్కుగా భేదముల గణనలో లెక్కింపబడలేదు. ఆరోప్యమాణమాలయైతే చమత్కారవిశేషశాలిని గనుక గణింపబడును.

అథ కథం నామ శ్లిష్టపరంపరితే 'కమలావాస కాసారః' ఇత్యాదావేకస్యారోపస్యారోపాన్తరోపాయత్వమ్. యతః శ్లేషేణ కమలానామావాసస్య కమలాయా వాసస్య చాభేదమాత్రమత్ర ప్రతీయతే, నైకత్రాప్యారోపః. తస్య స్వతన్త్రవిషయనిర్దేశాపేక్షత్వాత్. న చ శుద్ధాభేదప్రత్యయ ఏవారోపః, విషయనిగరణాత్మికాయాం మతిశయోక్తావపి తత్ప్రసఙ్గాత్. న చ శుద్ధాభేదప్రత్యయేనాత్రార్థః యత్సమ్బన్ధిని యత్సమ్బన్ధ్యభేదస్తస్మింస్తదభేద ఇతి 'కమలావాస కాసారః' ఇత్యాదౌ రాజని కాసారారోపో రాజసమ్బన్ధిని లక్ష్మ్యాశ్రయత్వే కాసారసమ్బన్ధిసరోజాశ్రయత్వాభేదారోపేణ సమర్థయితుం శక్యః. శ్లేషేణ తు పునర్లక్ష్మ్యాశ్రయత్వసరోజాశ్రయత్వయోరభిన్నత్వేన ప్రత్యయాదభిన్నధర్మనిబన్ధనో రాజకాసారయోరప్యభేదప్రత్యయః స్యాత్, న తు రాజని విషయే కాసారవిషయికస్యారోపస్య ప్రకృతస్య సిద్ధిః. ఇమావఖిన్నావిత్యాద్యాకారస్య శుద్ధాభేదప్రత్యయస్యాప్రకృతత్వాత్ప్రాగుక్త ఆరోపో మృగ్యః, స చ న శ్లేషసాధ్య ఇతి. సత్యమ్. శ్లేషేణ శుద్ధాభేదప్రతీతౌ సత్యాం ప్రకృతా

ర్థోపసమర్థ నాయాన్తరా మానసస్య రాజసమ్బన్ధిని కాసారసమ్బన్ధ్య భేదారోపస్య కల్పనాన్నానుపపత్తిః.

అయితే - శ్లిష్టపరంపరితమున, "కమలావాసకాసారః" అనునటువంటి చోట్ల, ఒక యారోపమున కారోపాంతర ముపాయమెట్లగును? శ్లేషచే గమలముల యావాసమునకు, కమల యొక్క ఆవాసమునకును అభేదము మాత్రమే నిట ప్రతీతమగు చున్నది. ఒకచోట మరొకదానియారోపము కాదే? అది స్వతంత్రమగు విషయనిర్దేశముతో సాపేక్షము. శుద్ధాభేదప్రత్యయమే నారోపమనుట సరిగాదు. విషయనిగరణస్వరూపమైన యతిశయోక్తిలోగూడ నాప్రసంగమేర్పడవలసివచ్చును. నిజమునకు శుద్ధాభేద ప్రత్యయముతో నిక్కడ ప్రయోజనము లేదు. దేనికి సంబంధించిన దానియందు దేనికిసంబంధించిన దాని యభేదమో దానియందు తదభేదము కనుక 'కమలావాస కాసారః' ఇత్యాదికమునందు రాజునందు కాసారారోపము రాజ సంబంధియగు లక్ష్మ్యాశ్రయత్వమున కాసారసంబంధియగు సరోజాశ్రయత్వముతోనభేదము నారోపించుటచేత సమర్థించుటకు వీలగును. శ్లేషచే మాత్రము లక్ష్మ్యాశ్రయత్వ సరోజాశ్రయత్వము లభిన్నములుగ ప్రతీతము లగుటవలన నభిన్నధర్మమూలకమై రాజకాసారములకు గూడ నభేదము ప్రతీతమగును. అంతేగాని రాజవిషయమందు కాసారవిషయికమగు నారోపము ప్రకృతము సిద్ధించదు. ఈ రెండు నభిన్నములని ఈరకమైన శుద్ధాభేదప్రత్యయమున ప్రకృతము గనుక వెనుకజెప్పిన యారోపము మృగ్యమే. అది శ్లేషవలన సాధింపబడతగినదిగాదు. నిజమే - శ్లేషచే శుద్ధాభేదప్రతీతి గలుగునపుడు ప్రకృతమగు నారోపమును సమర్థించుటకు నడుమ నుపమానమునకు రాజసంబంధియందు కాసారసంబంధితో నభేదారోపమును గల్పించెము. ఇవు డెట్టి యనుపపత్తియు లేదు.

కథం తర్హి పరమ్పరితరూపకే "సౌజన్యచన్ద్రికా చన్ద్రో రాజా" ఇత్యాదౌ రూపకత్వమ్, అభేదారోపస్య సత్త్వేఽపి తస్య సాదృశ్యమూలకత్వాదితి చేత్ న, సమర్థకారోపేణ ధర్మైక్య సమ్పాదనే సాదృశ్యస్య నిష్ప్రత్యూహత్వాత్.

అయితే పరంపరిత రూపకములో, "సౌజన్యచంద్రికాచంద్రః రాజా" ఇత్యాదులందు, రూపకత్వమెట్లు? అభేదారోపమున్నను నాయభేదారోపము

సాదృశ్యమూలకము గాదుగదా? అని అనరాదు. సమర్థకమగు నారోపముచే ధర్మముల నైక్యము సంపాదించినపుడు సాదృశ్యము నిష్ప్రత్యూహము

స్యాదేతత్. "సౌజన్యచన్ద్రికాచన్ద్రః" ఇత్యత్ర తత్పురుషావయవే సమానాధికరణతత్పురుషే చన్ద్రికాయామభేదసంసర్గేణ సౌజన్యస్య విశేషణత్వాత్ప్రతీయమానశ్చన్ద్రికాగతః సౌజన్యాభేదో న రాజని చన్ద్రాభేదాత్మకం రూపకం సమర్థయితుం ప్రభవతి, "యత్సమ్బన్ధిని యత్సమ్బన్ధ్యభేద" - ఇత్యాది ప్రాగుక్త న్యాయాత్. అపి తు సౌజన్యే విషయే చన్ద్రికాభేదః, యథా — "సౌజన్యం తే ధరాధీశ చన్ద్రికా త్వం సుధానిధిః". స చ దురుపపాద ఏవ. న చానయో స్సమానవిత్తివేద్యత్వాన్నానుపపత్తిరితి శక్యం వక్తుమ్, ప్రాత్యక్షికే హి సామగ్ర్యాస్తుల్యత్వాత్తత్. స తు శాబ్దబోధే వ్యుత్పత్తివైచిత్ర్యనియన్త్రితే. ఏవమన్యత్రాపి కథం సమాసగత శుద్ధపరమ్పరితద్వయో రారోపయోర్నిర్వాహ్యనిర్వాహకభావః. కథం చ శశిపుణ్డరీకమిత్యాదౌ పుణ్డరీకరూపకముచ్యతే? పుణ్డరీకాభేదాత్మకస్య పుణ్డరీకతాద్రూప్యస్యాభానాత్. శశ్యభేదప్రత్యయాచ్చ పుణ్డరీకం శశీత్యత్రేవ శశిరూపకముచ్యతామ్. ఏవం నీలిమదివ్యతోయే తారావలీముకుల మండలమండితే షోడశకలాదలమఞ్జుభృఙ్గ మిత్యత్రాప్యుత్తరపదార్థే పూర్వపదార్థాభేదస్యైవ భానాత్పూర్వపదార్థరూపకాపత్తిః. తథా—

"సువిమల మౌక్తికతారే ధవలాంశుక చన్ద్రికాచమత్కారే
వదనపరిపూర్ణచన్ద్రే సున్దరి రాకాసి నాత్ర సన్దేహః".

ఇత్యత్ర సున్దర్యాం విషయభూతాయాం రాకా తాదాత్మ్యావగమాత్ స్ఫుటమేవ తావద్రాకారూపకమ్. తత్ర చరణత్రయగతాని రూపకాణి రాకారూపకానుగుణతయోపాత్తాన్యపి నానుగుణ్యమాచరన్తి, తారాచన్ద్రికా పూర్ణచన్ద్రాణాం మౌక్తికధవలాంశుక వదనాభిన్నత్వే సిద్ధేఽపి న సున్దర్యాం రాకాతాదాత్మ్యం సేద్ధుమీష్టే, ప్రత్యుత విపరీతం రాకాయాం సున్దరీతాద్రూప్యం, తేషాం రాకాసమ్బన్ధిత్వాత్ సర్వమేవ వ్యాకులమితి.

అది అటు ఉంచుము. "సౌజన్యచంద్రికాచంద్రః" అనేచోట తత్పురుషావయవమైన సమానాధికరణతత్పురుష (కర్మధారయము)లోని చంద్రి

కతో నభేదసంసర్గముచే సౌజన్యము విశేషణము గనుక ప్రతీయమానమగు చంద్రికాగతమగు సౌజన్యాభేదము రాజునందు చంద్రాభేదాత్మకమగు రూపకమును సమర్థింపజాలదు. "యత్సంబంధియందు యత్సంబంధాభేదము"— ఇత్యాది పూర్వోక్తన్యాయమున. ఇక నేమనగా - సౌజన్యవిషయమున వెన్నెలతోడి యభేదమే. ఎట్లనగా "సౌజన్యం తే ధరాధీశ చంద్రికాత్వంసుధానిధిః." అది ఇచట సంపాదింపరానిదే ? ఈ రెండు సమానజ్ఞానములలో విషయములు కనుక అనుపపత్తి లేదనుటకు వీలులేదు. ప్రత్యక్షములో రెండు జ్ఞానములకును సామగ్రి సమానము గనుక అది అచట చెప్పవచ్చును. వ్యుత్పత్తి వైచిత్ర్యముచే నియమితమగు శాబ్దబోధయందుగాదు. ఈతీరున స్థలాంతరమునందైనను సమాసములోనున్న శుద్ధపరంపరితలో గూడ రెండారోపములకును నిర్వాహ్యానిర్వాహకభావమెట్లు ? 'శశిపుండరీకం' అనుచోట పుండరీక రూపకమనుటయెట్లు ? పుండరీకాభేదాత్మకమైన పుండరీకతాద్రూప్యము భాసించుట లేదుగనుక, శశ్యభేదప్రత్యయము కలుగుటచే "పుండరీకము చంద్రుడు" అనేచోటవలె శశిరూపకము చెప్పండి.

ఈతీరుగా "నీలిమదివ్యతోయము గల్గినట్టి తారావళీముకుళమండల మండితము నందు, షోడశకలాదలమంకభృంగ"మనుచోట కూడా నుత్తర పదార్థమునందు పూర్వపదార్థముయొక్క యభేదమే భాసించును కనుక పూర్వపదార్థరూపకము రావలసివచ్చును. అట్లాగే—

"సువిమలమౌక్తికతారే" ఇత్యాది శ్లోకమునందు విషయమగు సుందరి యందు రాకాతాదాత్మ్య మవగతము గనుక స్పష్టముగానే రాకారూపకమున్నది. అక్కడ మూడు చరణములందున్నటువంటివి రాకారూపకమున కనుగుణముగా స్వీకరింపబడినప్పటికి దానికనుకూలత్వ మాచరింపవు. తారా, చంద్రికా, పూర్ణచంద్రులు మౌక్తికధవళాంశుకవదనములతో నభిన్నములగుట సిద్ధమైనను సుందరికి రాకాతాదాత్మ్యము సిద్ధింపజాలదు. దానికి విపరీతముగా రాకయందు సుందరి తాదాత్మ్యమే సిద్ధించును. అవి రాకాసంబంధులు గనుక. ఇట్లు అంతయు వ్యాకులమే యగును.

అత్ర వదన్తి - అభేదస్త్వేవ ద్విశేషణస్య సంసర్గో భవతి. స చ యథా ముఖం చన్ద్ర ఇత్యాదౌ వాక్యగతే రూపకే స్వప్రతియోగిన శ్చన్ద్రస్య స్వానుయోగిని ముఖే విశేషణతాయా నిర్వాహక స్తథైవ

సమాసగతే ముఖచన్ద్ర ఇత్యాదౌ రూపకే స్వానుయోగినో ముఖస్య ప్రతియోగిని చన్ద్రే విశేషణతాయాః. ఏవం చోభయత్రాపి వస్తుతః చన్ద్రాభేద ఏవ సంసర్గః. క్వచిదనుయోగిత్వముఖః, క్వచిచ్చ ప్రతియోగిత్వముఖః; విశేషణవిశేష్యభావవైచిత్ర్యాత్. న తు ముఖచన్ద్ర ఇత్యత్ర ముఖాభేదః సంసర్గః. తథా సతి చన్ద్రరూపకానాపత్తేః, ముఖరూపకాపత్తేశ్చ, స్వప్రతియోగికాభేద ఏవ విశేషణసంసర్గో న తు స్వానుయోగికాభేద ఇతి తు దురాగ్రహః. ఏవం చ సౌజన్యచన్ద్రికే త్యాదౌ వస్తుతః సౌజన్యాభేదో న సౌజన్యస్య చన్ద్రికా విశేషణస్య సంసర్గః, అపి తు చన్ద్రికాభేద ఏవ. తథా చ సౌజన్య నిష్ఠాభేద ప్రతియోగినీ చన్ద్రికేతి పర్యవసితేఽర్థే, భఙ్గ్యన్తరేణ సౌజన్యే చన్ద్రికాభేద సిద్ధౌ జాతాయాం రాజని చన్ద్రాభేదోఽపి నిష్పద్యతే ఇతి పరంపరితే నానుపపత్తిః. శశిపుణ్డరీకమిత్యాదావపి శశినిష్ఠాభేద ప్రతియోగిపుణ్డరీకమితి పర్యవసితేఽర్థే పుణ్డరీకాభేదస్య భానాత్పుణ్డరీకరూపకమవ్యాహతమ్. ఏవమన్యేష్వప్యవయవరూపకేషు బోధ్యమ్. ఏవం "సువిమల మౌక్తికతారే" ఇత్యాదావపి తారాద్యభేద ఏవ మౌక్తికాదిగతో మౌక్తికాదీనాం తారాదివిశేషణానాం సంసర్గీభవన్ రాకారూపకస్య సమర్థకో భవతీతి సర్వంసుస్థమ్. సోఽయమభేదో యత్రానుయోగిత్వముఖస్తత్ర రూపకస్య విధేయతా. యత్ర చ ప్రతియోగిత్వ ముఖస్తత్రానువాద్యత్వమితి దిక్.

ఇక్కడ చెప్పుచున్నారు - అభేదము మాత్రము విశేషణమునకు సంసర్గమగును. ఎట్లు అది 'ముఖంచంద్రః' ఇత్యాదులయందు వాక్యగతమగు రూపకమునందు స్వప్రతియోగియగు చంద్రునకు స్వానుయోగియగు ముఖమునందు విశేషణత్వమును నిర్వహించునో అలాగే సమాసగతమగు "ముఖచంద్రః" ఇత్యాదిరూపకమునందు స్వానుయోగియగు ముఖమునకు ప్రతియోగియగు చంద్రునందు విశేషణత్వమునకు. ఈతీరుగా రెండుచోటులందును వస్తుతః చంద్రాభేదమే సంబంధము. ఒకచోట ననుయోగిత్వము అదియందుండును. ఒకచోట ప్రతియోగిత్వము అదియందుండును; విశేషణ విశేష్యభావములో వైచిత్ర్యమువలన.

"ముఖంచంద్రః" అనుచోట ముఖాభేదము మాత్రము సంసర్గము

గాదు. అట్లాగైనయెడల చంద్రరూపకము గాకపోవలసివచ్చును. ముఖ రూపకము కావలసివచ్చును. స్వప్రతియోగికభేదమే విశేషణ సంసర్గము, అంతేగాని స్వానుయోగికాభేదముగాదు అనుట దురాగ్రహమే. ఈతీరుగా 'సౌజన్యమను వెన్నెల' అనేచోట, వస్తుతః చంద్రికావిశేషణమగు సౌజన్యము యొక్క సంసర్గము సౌజన్యభేదముకాదు. ఇకనేమనగా చంద్రికాభేదమే. ఇలాకాగా, 'సౌజన్యచంద్రికా' యనేచోట 'సౌజన్యనిష్ఠాభేద ప్రతియోగినీ చంద్రికా' అని అర్థము పర్యవసానము కాగా భంగ్యంతరముచేత సౌజన్యమునందు చంద్రికాభేదము సిద్ధింపగా రాజునందు చంద్రునితో నభేదమున్ను నిష్పన్నమగును; అని పరంపరితములందు అనుపపత్తిలేదు. 'శశిపుండరీకము' ఇత్యాదులందుగూడ శశినిష్ఠాభేద ప్రతియోగియే పుండరీకమని యర్థము బర్యవసింపగా నందు పుండరీకాభేదము భాసించుటవలన పుండరీకరూపము అవ్యాహతము. ఈతీరుగా నితరములగు నవయవ రూపకములందుగూడ గ్రహింపవలెను. ఈ తీరుగా – "సువిమలమౌక్తికతారే" ఇత్యాదులయందును మౌక్తికాదిగతమగు తారాద్యభేదమే తారాదివిశేషణములగు మౌక్తికాదులకు సంసర్గమై రాకారూపమునకు సమర్థకమగునని అంతయును సుస్థమైనది. ఆయాయభేదము ఎచట అనుయోగిత్వముఖముగనుండునో నచట రూపకము విధేయము; ఎచట ప్రతియోగిత్వముఖముగ నుండునో నచట యనువాద్యమగును.

తత్ర "ప్రాచీ సన్ధ్యా సముద్యన్మహిమ దినమణేః" ఇత్యత్రారోప్యమాణయోః పరస్పరమారోప విషయయోశ్చానుకూల్యే రూపకయోరనుగ్రాహ్యానుగ్రాహకభావో దర్శితః. ప్రాతికూల్యేయథా—

"ఆనన్దమృగదావాగ్నిః శీలశాఖిమదద్విపః
జ్ఞానదీపమహావాయురయం ఖలసమాగమః"

యథావా—

"కారుణ్యకుసుమాకాశః శాన్తిశైత్యహుతాశనః
యశః సౌరభ్యలశునః పిశునః కేన వర్ణ్యతే.

ఏకత్ర నాశ్యనాశకభావరూప మపరత్ర చాత్యన్తికసంసర్గ శూన్యతారూపం ప్రాతికూల్యముపమానయోస్తథై వోపమేయ

యోశ్చ అనుగ్రాహ్యానుగ్రాహక భావః పునరారోపయోరవిశిష్ట ఏవ.

తథా —

"అయం సజ్జనకార్పాస రక్షణై కహుతాశనః
పరదుఃఖాగ్ని శమనమారుతః కేన వర్ణ్యతే."

అత్ర రక్షణశమనపదే విరోధిలక్షణయా విపరీతార్థబోధకే. ఏవం పదార్థరూపకం లేశతో నిరూపితమేవ.

అచట "ప్రాచీసంధ్యాసముద్యన్మహిమదినమణిః" అనుచోట నారోపింపబడుచున్నవాటికిని ఆరోపవిషయములకును అన్యోన్యమానుకూల్యమున రూపకములకు అనుగ్రాహ్యానుగ్రాహక భావము చూపబడినది.

ప్రతికూలత్వముతో నెట్లనగా—

"ఆనందమృగ" (ఆనందమను మృగమునకు కారిచిచ్చువన్ను, శీలమను చెట్టుకు మదించిన ఏనుగును, జ్ఞానమనే దీపమునకు గొప్ప వాయువును సుమా యీఖలుని సమాగమము.)

మరొకటి—

"కారుణ్య" మొ. (కారుణ్యమను పువ్వునకు ఆకాశమును, శాంతియనే శైత్యమునకు అగ్నియు, కీర్తియనెడు పరిమళమునకు లశునము నైన యీకొండెగాడు ఎవరిచేత వర్ణింపబడడు.) ఒకచోట నాశ్యనాశక భావరూపమైనదియు మరియొకచోట నాత్యంతిక సంసర్గశూన్యతారూపమైనదియు నగు ప్రాతికూల్యము, ఉపమానములకును ఉపమేయములకును గూడ నున్నది. అనుగ్రాహ్యానుగ్రాహ్యక భావము మాత్రము ఆరోపములయందవిశిష్టము.

అలాగే—'అయం' (సజ్జనులను దూదిని రక్షించుటయందు అగ్నియును, పరదుఃఖములనెడి యగ్నిని చల్లార్చుటకు గాలియు నైన యితడు ఎవరిచేత వర్ణించబడును." ఇత్యాదిశ్లోకమున రక్షణశమనపదములు విరోధిలక్షణచే విపరీతార్థమును బోధించును. ఇట్లే పదార్థరూపకము కొద్దిగా నిరూపింపబడినది.

వాక్యార్థే విషయే వాక్యార్థాన్తరస్యారోపే వాక్యార్థ రూపకమ్. యథా హి విశిష్టోపమాయాం విశేషణానా ముపమానోప

మేయభావ అర్థ స్తథాత్రాపి వాక్యార్థఘటకానాం పదార్థానాం రూపకమర్థావసేయమ్.

"ఆత్మనోఽస్య తపోదానై ర్నిర్మలీకరణం హి యత్
క్షాళనం భాస్కరస్యేదం సారస్వైః సలిలోత్కరైః."

అత్రాత్మని తపోదానేషు చారోప విషయవిశేషణతయా బిమ్బభూతేషు, భాస్కరస్య సలిలోత్కరాదీనాం చ విషయి విశేషణత్వేన ప్రతిబిమ్బానాం రూపకం గమ్యమానం ప్రధానీభూత విశిష్టరూపకాఙ్గమ్.

విషయమగు వాక్యార్థమున వాక్యార్థాంతరము నారోపించునపుడు వాక్యార్థ రూపకమగును. విశిష్టోపమయందు ఎట్లు విశేషణములకు నుపమానోపమేయభావము అర్థతః సిద్ధించునో అలా ఇచటగూడ వాక్యార్థఘటకము లగు పదార్థములకు రూపక మర్థతః సిద్ధించును.

"ఆత్మనోఽస్య" మొ. (ఆత్మను తపోదానములచే నిర్మలమొనర్చున దేది గలదో అది సూర్యునకు సరస్సునందలి నీటి సమూహములచే క్షాళనమే") ఇచట ఆరోపవిషయమునకు విశేషములగుటచే బింబభూతములైన ఆత్మయందును తపోదానములందును, విశేషణభావముచే ప్రతిబింబములగు భాస్కరునకును సలిలోత్కరాదులకును రూపకము దోచుచున్నది. అది ప్రధానమైన విశిష్ట రూపమున కంగము.

"నేదం రూపకమ్. రూపకే బిమ్బప్రతిబిమ్బభావో నాస్తి."

ఇతి కేనాప్యాలఙ్కారికంమన్యేన ప్రతారితస్య దీర్ఘశ్రవసో ద్రవిడస్యోక్తి ర్గశద్దైవ. యయోరివాదిశబ్దప్రయోగే ఉపమా తయోరేకత్రాన్యారోపే రూపకమితి నియమాత్. అత్ర యది రూపకం నాఙ్గీకురుషే మైవాఙ్గీకురు, తర్హి తత్రైవ యథాదిశబ్దప్రయోగే ఉపమామపి. ఏవం "త్వయి కోపో మహీపాల సుధాంశావివ పావకః" ఇత్యాదౌ స్వకల్పితేన విశిష్టేన ధర్మిణా సాదృశ్యస్య ప్రత్యయాదుపమాం బ్రూషే బ్రూహి తర్హి తత్రైవేవస్య నిరాసే 'త్వయి కోపో మహీపాల సుధాంశౌ హవ్యవాహనః' ఇత్యాదౌ రూపకమపి.

"ఇది రూపకముగాదు రూపకమునందు బింబప్రతిబింబభావములేదు" అని ఎవడో నాలంకారికంమన్యునిచే మోసగింపబడిన లంబకర్ణ ద్రవిడునిమాట అశ్రద్ధేయమేను. వేటికి ఇవాదిశబ్దప్రయోగమందు నుపమయో వాటికి ఒక దానియందు మరొకదాని నారోపించుట రూపకమని నియమ మున్నదిగదా?. ఇచట రూపకమునంగీకరింపనిచో నక్కడ, ఇవ యథాదిశబ్దములను ప్రయో గించినపుడు ఉపమనుగూడ త్రోసివేయుము.

తథా—

"కుఙ్కుమద్రవలిప్తాఙ్గః కాషాయవసనో యతిః
కోమలాతప బాలాభ్రః సంధ్యాకాలో న సంశయః".

ఇత్యాదావపి విశిష్టరూపకం బోధ్యమ్, 'త్వయికోప' ఇత్యత్ర విషయిణః స్వబుద్ధి కల్పితత్వా త్కల్పితం విశిష్టరూపకమ్, ఇహ తు న తథేతి విశేషః.

న చైవమాదౌ ప్రతీయమానోత్ప్రేక్షా వక్తుం శక్యా, అభేదస్య నిశ్చీయమానత్వాత్. ఉత్ప్రేక్షాయాం చ సత్యాం సంభావ్యమానతా స్యాత్. అన్యథా 'ముఖం చన్ద్రః' ఇత్యాదావపి ప్రతీయమానో త్ప్రేక్షాపత్త్యా రూపకవిలోపాపత్తేః.

ఇలాగే "త్వయికోపో మహీపాల సుధాంశావివ పావకః ఇత్యాదు లందు స్వకల్పితమైన విశిష్టమగు ధర్మితోసామ్యము ప్రతీతమగుటవల్ల ఉప మను అంగీకరింతువా, అయితే నక్కడనే ఇవశబ్దములేకపోయినపుడు— "త్వయి కోపో మహీపాల సుధాంశౌ హవ్యవాహనః" ఇత్యాదులందు రూపక మును గూడ అంగీకరింపుము.

అలాగే— "కుంకుమద్రవలిప్తాంగః" (కుంకుమద్రవముచే పూయబడిన శరీరముపలవాడై కాషాయవస్త్రము గల యతి కోమలాతపముతోకూడిన బాలాభ్రమగలిగిన సంధ్యాకాలమే; సంశయములేదు") ఇత్యాదులందు గూడ విశిష్టరూపకము నెరుంగవలెను.'త్వయికోపః' ఇత్యాదియందువిషయము స్వబుద్ధిగల్పితమగుట వలన విశిష్టరూపకమును కల్పితమైనది, ఇక్కడ అలాగా దని విశేషము. ఈ రకమైనవానిలో ప్రతీయమానమగు నుత్ప్రేక్షచెప్పదగదు. అభేదము నిశ్చయింపబడుచున్నది గనుక ఉత్ప్రేక్షయుండగా సంభావ్యమానత

యుండును. అలాగ నిచో— "ముఖం చంద్రః, ఇత్యాదులందుగూడ ప్రతీయ మానమగు నుత్ప్రేక్షగావలసియుండి రూపకలోపమే ప్రసక్తించును.

అథ బోధో విచార్యతే. తత్ర ప్రాఞ్చః—'విషయివాచకపదేన విషయివృత్తిగుణవతో లక్షణయా సారోపయోపస్థితా, విషయే తస్యాభేదేన సంసర్గేణ విశేషణతయాన్వయః ఏవం చ 'ముఖం చన్ద్రః' ఇత్యత్ర 'చన్ద్రవృత్తి గుణవదభిన్నం ముఖమ్' ఇతి ధీః. అత ఏవా లఙ్కారభాష్యకారః 'లక్షణా పరమార్థం యావతా రూపకమ్' ఇత్యాహ. న చ 'చన్ద్ర సదృశం ముఖమ్' ఇత్యుపమాతోఽస్య కో భేదః? బోధవైలక్షణ్యాభావేన విచ్ఛిత్తి వైలక్షణ్యాభావాత్. వృత్తి మాత్ర వైలక్షణ్యస్యాప్రయోజకత్వాత్ ఇతి వాచ్యమ్. లాక్షణిక బోధోత్తరం జాయమానేన ప్రయోజనీభూతేనాభేదబోధేనైవ వైలక్షణ్యాత్. నిరూఢలక్షణాతిరిక్తాయా లక్షణాయాః ప్రయోజన వత్తానియమాత్. అభేదబుద్ధేశ్చ వృత్త్యన్తరవిత్తి భావ్యత్వేన న బాధ బుద్ధిప్రతిబధ్యత్వమ్" ఇత్యాహుః,

తరువాత బోధను గురించి విచారింతము.

అక్కడ ప్రాచీనులు – విషయివాచక పదముచేత విషయవృత్తియగు గుణములు కలది సారోపలక్షణచేత నుపస్థితముకాగా విషయమునందు దాని కభేదము అనుసంబంధముచే విశేషణముగా నన్వయము, ఈ తీరుగా 'ముఖంచంద్రః' అనుచోట 'చంద్రునియందున్న గుణములు గల దానితో నభిన్నమైనది ముఖము' అని బుద్ధి. గనుకనే అలంకార భాష్యకారులు "లక్ష ణాపరమార్థము కావుననే రూపకమని చెప్పబడుచున్నది" అనిచెప్పెను. 'చంద్రునితో సమానమైన ముఖము' అను ఉపమకంటే ఈ రూపకము విశేష మేమి? బోధలో భేదము లేదుగనుక విచ్ఛిత్తి వైలక్షణ్యము లేదు గదా? వృత్తిమాత్ర వైలక్షణ్యముచే భేదము జెప్పుట యుచితము గాదు; అనరాదు. లాక్షణిక బోధ దర్వాత గల్గునట్టి ప్రయోజనమైన యభేద బోధచేతనే వైల క్షణ్యము గల్గును, నిరూఢలక్షణాతిరిక్తమైన లక్షణకు ప్రయోజన ముండ వలెనని నియమమున్నది కనుక. అభేదబుద్ధియు వ్యంజనాజ్ఞాన భావ్యమగుట చేత ప్రతిబంధింపబడదని చెప్పుదురు.

నవ్యాస్తు — "నామార్థయోరభేద సంసర్గేణాన్వయస్య వ్యుత్పత్తి సిద్ధత్వా చ్చన్ద్రా భిన్నం ముఖమితి లక్షణాం వినైవ బోధః. ఫలస్యాన్యథై వోపపత్తే ర్లక్షణాకల్పనస్యాన్యాయ్యత్వాత్. కిఞ్చ యది చ రూపకే లక్షణాస్యాన్ముఖచన్ద్ర ఇత్యత్రోపమిత విశేషణ సమాసయో రుత్తరపదస్య లాక్షణికత్వావిశేషాదేకస్యోపమాత్వ మన్యస్యరూపకత్వమితి వ్యాహతం స్యాత్. అపిచ "ముఖం న చన్ద్ర సదృశమ్; అపితు చన్ద్రః" ఇత్యాదౌ సాదృశ్యవ్యతిరేకమిశ్రితే సాదృశ్యబుద్ధేరయోగాత్. ఏవం "దేవదత్తముఖం చన్ద్ర ఏవ, యజ్ఞ దత్త ముఖం తు న తథా; అపితు చన్ద్రసదృశమ్" ఇత్యాదౌ నఞర్థస్య లక్ష్యమాణ చన్ద్ర సదృశాన్వయిత్వాత్ "న చన్ద్రసదృశశ్చన్ద్ర సదృశమ్" ఇతి బోధకదర్శనాపత్తేశ్చ. న హి న ఞః ఫలీభూతజ్ఞాన విషయేణాభేదేనాన్వయోయుక్తః. ఏతదన్వయ వేలాయాం తస్యా నుపస్థితేః. తాదృశాభేదబోధస్య చాహార్యత్వాన్న బాధబుద్ధి ప్రతి బధ్యత్వమ్.

యద్వా ఆహార్యాన్యత్వస్యేవ శాబ్దాన్యత్వస్యాపి బాధ నిశ్చయ ప్రతిబధ్యతావచ్ఛేదక కోటౌ నివేశః. సతి చ బాధనిశ్చయే తద్వత్తా శాబ్దబుద్ధేరనుత్పాదః, యోగ్యతాజ్ఞానవిరహాత్. సతి చ క్వచి దాహార్యే యోగ్యతాజ్ఞానే తద్బుద్ధేరిష్టత్వాత్. అత ఏవ యోగ్య తాజ్ఞానస్య బాధనిశ్చయపరాహతస్యాపి శాబ్దధీహేతుత్వమ్. తస్మా దన్యతరప్రకారేణ కావ్యే సర్వత్ర బోధోపపత్తిః.

అపి చ తద్గతధర్మవత్త్వబుద్ధేః తత్ర కథం తదభేదబుద్ధిః ఫలం స్యాత్. నహి సాధారణధర్మావచ్ఛిన్నాభేదజ్ఞానస్య తత్తదసాధారణ ధర్మావచ్ఛిన్నాభేదజ్ఞానే హేతుత్వం క్వాప్యవగతమ్. ఘటపటయో ర్ద్రవ్యత్వేనాభేదగ్రహేఽపి ఘటత్వాదినా భేదగ్రహాత్. తదభిన్నత్వేన జ్ఞానస్య పునస్తద్ధర్మప్రతిపత్తిః ఫలంస్యాత్ ప్రవాహాభిన్నజ్ఞానస్యేవ శైత్యపావనత్వాదిప్రతిపత్తిః. అత ఏవ—

"కృపయా సుధయా సిఞ్చ హరే మాం తాపమూర్ఛితమ్
జగజ్జీవన తేనాహం జీవిష్యామి న సంశయః."

ఇత్యాదావమృతాభిన్నత్వబోధే సత్యేవ కృపాయాః సేకే కరణత్వేనాన్వయః. తాదృశసేకస్య జీవనేహేతుత్వేనేతి దిక్.

నవ్యులైతే— నామార్థముల కభేదసంబంధముచే నన్వయము వ్యుత్పత్తి సిద్ధముగనుక 'చంద్రాభిన్నమైన దీ ముఖము' అని లక్షణ లేకయే బోధ గల్గును. ఫలము మరొకతీరుగానే యుపపన్నము గనుక లక్షణ గల్పించుట యన్యాయ్యము గదా? మరియు రూపకములో లక్షణ యున్న యెడల "ముఖచంద్రః" అనుచోట నుపమిత విశేషణ సమాసములలో నుత్తరపదము లాక్షణికమగుటలో భేదములేదు కనుక ఒకటి ఉపమాలంకారము, మరొకటి రూపకము అనుట వ్యాహత మగును. మరియు "ముఖము చంద్ర సదృశమైనది కాదు. కానీ చంద్రుడే" ఇత్యాదులయందు సాదృశ్యవ్యతిరేకముల మిశ్రణమున్న చోట సాదృశ్యబుద్ధి కుదరక పోవలసి వచ్చును.

అలాగే—

"దేవదత్తుని ముఖము చంద్రుడే, యజ్ఞదత్తుని ముఖమైతే అలాగాదు, కానీ చంద్రునితో సమానమైనది. ఇత్యాదులయందు నఞర్థము లక్షింపబడుచున్న చంద్ర సదృశముతో అన్వయించుచున్నది. కనుక 'చంద్ర సదృశము కాదు, చంద్ర సదృశము' అని హాస్యాస్పదమగు బోధ ఆపన్నమగును నఞ్కు ఫలీభూత జ్ఞానవిషయమగు నభేదముతో నన్వయము యుక్తము కాదుగదా? ఈ యన్వయవేళ నది యుపస్థితముగాదు అటువంటి యభేదబోధ మాహార్యమగుటచే బాధబుద్ధి చేత ప్రతిబంధింపబడదు.

యద్వా — ఆహార్యా భిన్నత్వమునకువలె శాబ్దాన్యత్వమునకు గూడా బాధ నిశ్చయ ప్రతిబధ్యతా నిర్ణాయకోటిలో నివేశము. బాధ నిశ్చయ ముండునపుడు అది గల్గియుండునను శాబ్దబుద్ధి పుట్టకుండుట యోగ్యతా జ్ఞానము లేదుకనుక ఆహార్యమగు యోగ్యతా జ్ఞానము గలిగినచోట మాత్రము తద్బుద్ధి ఇష్టమే. కనుకనే యోగ్యతాజ్ఞానము బాధనిశ్చయ పరాహతము అయినప్పటికిని శాబ్దబుద్ధికి కారణము అందువల్ల వీనిలో నొకతీరుచే కావ్యమునం దంతటను బోధ యుపపన్న మగును.

మఱియు — తద్గత ధర్మవత్త్వబుద్ధికి తదభేద బుద్ధి ఫలిత మెట్లగును? సాధారణ ధర్మావచ్ఛిన్నమగు అభేదజ్ఞానము. తత్తదసాధారణ ధర్మవిశిష్ట

ముతోడ నభేద జ్ఞానమునందు కారణమని యెక్కడను తెలియదు. ఘటపట ములకు ద్రవ్యత్వమునుబట్టి అభేదజ్ఞానమున్నను ఘటత్వాదులలో భేదము తెలియుచున్నది గదా? తదభిన్నముగా జ్ఞానమునకుమాత్రము తద్ధర్మ ప్రతి పత్తిఫలము కావచ్చును. కనుకనే – 'కృపయా' (ఓ హరీ! నీకృపతో అమృ తముతో తాప మూర్ఛితుడవగు నన్ను తడుపుము. జగత్తునంతా బ్రతికించు వాడా! దానిలో నేను బ్రతుకుదును. సంశయములేదు) ఇత్యాది స్థలముల యందు నమృతాభిన్నత్వ బోధయున్నపుడే కృపకు సేకమునందు కరణ ముగా నన్వయము. అటువంటి సేకము జీవనమునందు గారణ మగుటచేత అని దిక్.

అథ కథం 'గామ్భీర్యేణ సముద్రోఽయం సౌన్దర్యేణ చ మన్మథః' ఇత్యత్రబోధః? శృణు - ప్రాచాం తావల్లక్ష్యమాణైకదేశే సాదృశ్యే ప్రయోజ్యతాయా అభేదస్య వా తృతీయార్థస్యాన్వయా ద్గామ్భీర్యప్రయోజ్య సముద్రసాదృశ్యవదభిన్నోఽయమ్, గామ్భీ ర్యాభిన్న సముద్రవృత్తి ధర్మవదభిన్నోఽయమితి వా ధీః. లక్షణాం వినైవ అభేదసంసర్గేణాన్వయవాదినాం పునరిత్థమ్-కవినా స్వేచ్ఛామా త్రాదుపకల్పితా అసన్తోఽప్యన్తఃకరణపరిణామాత్మకా అర్థా ఉపని బధ్యన్తే ముఖచన్ద్రాదయః. తేషు చ సాధారణధర్మాణామస్త్యేవ ప్రయోజకత్వమ్. తద్ధర్మనాధీనత్వాత్తన్నిర్మితేః. ఏవం చ గామ్భీ ర్యాది ప్రయోజ్య సముద్రాద్యభిన్న ఇతి బుద్ధిరప్రత్యూహైవ. యద్వా జ్ఞానజన్య జ్ఞానప్రకారత్వం తృతీయార్థః, వహ్నిమాన్ ధూమాది త్యాదౌ పఞ్చమ్యర్థతయా తస్య కల్పనాత్. ఏవం చ గామ్భీర్య జ్ఞానజన్యజ్ఞానప్రకార సముద్రాభిన్న ఇత్యాదిర్బోధః.

తదిదం రూపకం విషయవిషయిణోః సామానాధికరణ్యే అపదార్థతయా సంసర్గః, యథా 'బుద్ధిర్దీపకలా–' ఇత్యాదౌ.

తరువాత —

'గాంభీర్యేణ' ఇత్యాది స్థలమున బోధయెట్లు గల్గును? వినుము. ప్రాచీ నుల కైతే-లక్ష్యార్థైక దేశమగు సాదృశ్యమునందు ప్రయోజ్యత్వమునకు గానీ, అభేదమునకు గానీ, తృతీయార్థమునకు, నన్వయమువల్ల గాంభీర్యప్రయోజ్య

సముద్ర సాదృశ్యము కలవానితో అభిన్నుడు ఇతడు', అనిగానీ గాంభీర్యా భిన్న సముద్రవృత్తి ధర్మవదభిన్నుడు ఇతడు అనిగాని బోధయగును. లక్షణ లేకుండానే యభేదసంబంధముచే నన్వయము గల్గునని వాదించు వారలకు మాత్రము ఇట్లు—

కవిచేత స్వేచ్ఛగా గల్పించ బడినవై లేకున్నను ముఖచంద్రాది పదార్థములు అంతఃకరణము యొక్క పరిణామ స్వరూపములై గూర్చ బడుచుండును. వాటియందు సాధారణ ధర్మములకు ప్రయోజకత్వము ఉండనే ఉన్నది. తద్ధర్మాధీనముగ కదా తన్నిర్మాణము సంభవించును, ఈ విధముగ గాంభీర్యాది ప్రయోజ్య సముద్రాద్యభిన్నుడను బుద్ధి నిరంతర్యంతరమని.

యద్వా—

జ్ఞానజన్య జ్ఞానప్రకారత్వమే తృతీయార్థము 'వహ్నిమాన్ధూమాత్' ఇత్యాదులయందు పంచమ్యర్థముగా దానిని గల్పించెదరు గనుక గాంభీర్య జ్ఞానజన్యజ్ఞాన ప్రకార సముద్రా భిన్నుడని బోధ కల్గును. ఆ ఈ రూపకము విషయ విషయులు సమానాధికరణములగు నెడ పదార్థము గాకుండా సంసర్గ మగును. ఎట్లనగా – 'బుద్ధిర్దీపకలా' ఇత్యాదులందు.

వైయధికరణ్యే చ శబ్దార్థతయా క్వచిత్ విశేష్యమ్. యథా—

కైశోరే వయసి క్రమేణ తనుతామాయాతి తన్వ్యాస్తనా
వాగామిన్యఖిలేశ్వరే రతిపతౌ తత్కాలమస్యాజ్ఞయా.
ఆస్యే పూర్ణశశాఙ్కతా నయనయోస్తాదాత్మ్యమమ్భోరుహాం
కించాసీదమృతస్య భేదవిగమః సాచిస్మితే తావకః.

అత్ర శశాఙ్కతా తాదాత్మ్య భేదవిగమశబ్దై రభిధీయమానం రూపకం ప్రథమాన్త విశేష్యతావాదినాం మతే విశేష్యమ్. క్రియా విశేష్యతావాదినాం తు తత్రైవకిఞ్చిత్వ్యత్యాసేననిష్ఠాన్తక్రియాదానే.

క్వచిచ్చ విశేషణమ్. యథా—

"అవిచిన్త్యశక్తివిభవేన సున్దరి ప్రథితస్య శమ్బరరిపోః ప్రభావతః
విధుభావమఞ్చితితమాం తవాననం నయనం సరోజదల-
నిర్విశేషతామ్,"

ఇహ ద్వితీయేఽర్థే విశేషణీభూతం విధుత్వాది విధ్యభేదాత్మకతయా రూపకమ్.

ఏవం ముఖచన్ద్రః ఇత్యాదావుపమితసమాసే తావదుపమైవ. విశేషణ సమాసేతు రూపకమ్. బోధశ్చ శశిపుణ్డరీక మిత్యాదావివ ప్రాక్ప్రతిపాదిత దిశా బోధ్యః.

వ్యధికరణములగునెడ శబ్దార్థముగా ఒకచోట విశేష్యము.

ఎట్లనగా —

"కైశోరేవయసి" మొ. 'కిశోరవయస్సు క్రమముగా క్షీణించుచుండగా తన్వియొక్క శరీరమునందు అఖిలేశ్వరుడు రతిపతి రాదలచుచుండగా ఆతని ఆజ్ఞచే మొగమునందు పూర్ణచంద్రత్వమును కనులయందు పద్మముల తాదాత్మ్యమును మఱియు అమృతమునకును దీనికిని భేదము పోవుటయు వాస్తవముగా సాచిస్మితము నందు సంభవించెను,' ఇచట శశాంకతా — తాదాత్మ్య భేదవిగమ శబ్దములతో చెప్పబడుచున్న రూపకము ప్రథమాంత విశేష్యత వాదించు మతమునందు విశేష్యము. క్రియా విశేష్యతా వాదుల మతములలో నైతే నచటనే కొంచెము వ్యత్యాసముచే నిష్పాంత క్రియా దానమునందు.

ఒకయెడ విశేషణము. ఎట్లనగా —

"అచింత్యశక్తి" మొ."ఓసుందరీ! ఊహింపరాని శక్తి సామర్థ్యములుకల ప్రసిద్ధుడైన మన్మథుని ప్రభావమువలన నీ యొక్క మొగము చంద్రత్వమును బొందుచున్నది. కనులు తామరరేకులతో భేదము లేకయున్నవి" ఇచట రెండవ సగమునందు విశేషణమైనటువంటి విధుత్వము మొదలైనది విధ్వభేదాత్మకమగుట చేత రూపకము.

ఈతీరుగా 'ముఖచంద్రః' ఇత్యాదులందు గూడ నుపమిత సమాసమునం దుపమయే. విశేషణ సమాసమైన యెడల రూపకము. శాబ్ద బోధయు శశి పుండరీకమిత్యాదుల యందు వలె వెనుకజెప్పిన తీరుగా తెలుసు కొనవలెను.

'మీనవతీ నయనాభ్యాం కరచరణాభ్యాం ప్రఫుల్లకమలవతీ,
శైవాలినీ చ కేశైః సురసేయం సున్దరీ సరసీ.'

ఇత్యాదౌ తృతీయాయా అభేదార్థకత్వా త్తస్య చ ప్రాగుక్త దిశా ప్రతియోగిత్వముఖస్యార్థవశాదన్వయే, నయననిష్ఠాభేద ప్రతి యోగి మీనవతీతి బోధః. మీనవత్త్వం చ స్వాభిన్నద్వారకమ్. ఏతత్ స్ఫోరణాయైవ నయనాభ్యామిత్యుక్తమ్. మీనాభిన్న నయనవతీతి తు పర్యవసితమ్. నయనాభేదే తు మీనేషు గృహ్యమాణే సరసీ రూపకాపోషణాదిత్యుక్తమేవ.

"మీనవతీ" మొ. "కనులతో మీనములు కలదియు, కరచరణములతో వికసించిన తామరపూలు గలదియు, కేశములతో శైవాలముగలదియు నైన యీ స్త్రీ సరసియే." ఇత్యాదులయందు తృతీయావిభక్తి యభేదార్థముగలది గనుక వెనుకచెప్పినతీరుగా ప్రతియోగిత్వ ముఖమగు నా అభేదమునకు నర్థ వశము వలన నన్వయము గాగా 'నయన నిష్ఠాభేద ప్రతి యోగి మీనవతి' యని బోధము. మీనవత్వమున్ను స్వాభిన్నద్వారక మైనది.

ఇది స్ఫురింపజేయుటకే నయనాభ్యాం అని చెప్పబడినది. 'మీనాభిన్న నయనవతి' యనియే పర్యవసితార్థము. నయనాభేదము మీనములందు గ్రహింపబడగా సరసీరూపక పోషణ కుదరదు అని చెప్పబడియే యున్నది.

సాధారణధర్మశ్చాత్రాప్యుపమాయా మివ క్వచిదనుగామీ, క్వచిద్బిమ్బప్రతిబిమ్బభావాపన్నః, క్వచిచ్చ కేవల శబ్దాత్మా. సోఽపి క్వచిచ్ఛబ్దేనోపాత్తః, క్వచిత్ ప్రతీయమానతయా నోపాత్తః. ఉపాత్తోఽనుగామీ యథా—

'జడానన్ధాన్ పఙ్గూన్ ప్రకృతిబధిరానుక్తివికలాన్
గ్రహగ్రస్తానస్తాఖిలదురిత నిస్తారసరణీన్.
నిలిమ్పైర్నిర్ముక్తానపి చ నిరయాన్తర్నిపతతో
నరానమ్బ త్రాతుం త్వమిహ పరమం భేషజమసి.'

అత్ర త్రాతు మితి తుమున్నన్తేన శబ్దేనోపాత్తం జడాన్ధాది త్రాణం భేషజభాగీరథ్యోః.

సాధారణ ధర్మమున్ను ఇచట కూడ నుపమ యందువలె ఒకచోట ననుగామి మరియొకచోట బింబప్రతిబింబభావము 'పొందినదియు' నింకొక

చోట నుపచరితము మరిఇంకొక చోట కేవల శబ్దోపాత్తము. ఇంకొక చోట తోచుచున్నదే గనుక యనుపాత్తము.

ఉపాత్తమైన యనుగామి యెట్లనగా —

"జడానంధాన్" మొ॥ (జడులును, అంధులును, కుంటివారు, సహజముగ చెవిటివారు, మూగవారు, గ్రహగ్రస్తులును, పాపములు పోవుటకు మార్గములేనివారు, దేవతలు విడచినవారు, నరకములో బడువారును నైనమనుష్యులను ఓతల్లీ కాపాడుటకు నీవు ఒకతే ఉత్తమమగు ఔషధమైతివి.") ఇక్కడ 'త్రాతుం' అని తుమున్నంతమగు శబ్దముచేత నుపాత్తమగుచున్న జడాంధబధిరత్రాణము భేషజ భాగీరథులకు అనుగామి.

అయమేవానుక్తో యథా—

'సమృద్ధం సౌభాగ్యం సకలవసుధాయాః కిమపి త
న్మహైశ్వర్యం లీలాజనితజగతః ఖణ్డపరశోః.
శ్రుతీనాం సర్వస్వం సుకృతమథ మూర్తం సుమనసాం
సుధాసామ్రాజ్యం తే సలిలమశివం నః శమయతు.'

అత్ర సౌభాగ్యభాగీరథ్యోః స్వాభావవ్యాపకదౌర్భాగ్యత్వ పరమోత్కర్షాధాయకత్వాది రనుపాత్తః ప్రతీయమానోధర్మః. ఏవమీశ్వరాసాధారణధర్మత్వ పరమగోప్యత్వ నిరతిశయసుఖ జనకత్వా న్యాపామర సకలజన జరామృత్యుహరణక్షమత్వంచోత్తరోత్తరారోపేష్వనుగామీతి. బిమ్బప్రతిబిమ్బభావమాపన్నో విశిష్టరూపకప్రసఙ్గే నిరూపితః. ఉపచరితో యథా—

'అవిరతం పరకార్యకృతాం సతాం మధురిమాతిశయేన
వచోమృతమ్
అపి చ మానస మమ్బునిధిర్యశో విమలశారదచన్ద్రిక చన్ద్రికా.'

అత్రామృతరూపకే విషయే వచస్యుపచరితో మధురిమాతిశయః శబ్దేనోపాత్తః. అమ్బునిధ్యాదిరూపకే చ గామ్భీర్యాద్యనుపాత్తమ్.

ఇదియే అనుక్తమెట్లనగా —

"సమ్మృద్ధం" మొ, (సమస్తభూమికి సమృద్ధమగు సౌభాగ్యమును, లీలచే జగత్తు నిర్మించిన శివునకు ఒకగొప్ప ఐశ్వర్యమును, వేదములకు సర్వస్వమును, దేవతల మూర్తీభవించిన పుణ్యమును, అమృత సామ్రాజ్యమునైన నీయొక్క ఉదకము మా అశుభమంతను అణచును గాక.) ఇచట సౌభాగ్య భాగీరథులకు స్వాభావవ్యాపక దౌర్భాగ్యత్వము,పర మోత్కర్షాధాయకత్వము మొదలైనది యుపాత్తముగాకుండా ప్రతీయమానమగు ధర్మము.

ఈతీరుగా నీశ్వర సాధారణ ధర్మత్వము, పరమగోప్యత్వము, నిరతిశయ సుఖజనకత్వము, పామరులు మొదలుకొని సమస్త జనులకు జరామృత్యువులు హరించుటయందు సామర్థ్యమున్ను ఉత్తరోత్తరారోపముల యందు ననుగామిధర్మము అని. బింబప్రతిబింబభావమును పొందినది విశిష్ట రూపక ప్రసంగమున నిరూపించబడినది.

ఉచరిత మెట్లనగా —

"అవిరత" మొ. (అనారతము పరకార్యమును జేయునట్టి సత్పురుషుల మాటయే మాధుర్యాతిశయముచే అమృతము. అంతేగాక మనసును సముద్రము. కీర్తి నిర్మలమగు శరత్కాలచంద్రుని వెన్నెల.) ఇచట నమృత రూపకమున విషయమగు వచస్సునం దుపరిచితమగు మాధుర్యాతిశయము శబ్దోపాత్తమయినది. అంబునిధ్యాదిరూపకమునందు గాంభీర్యాదిక మనుపాత్తము.

కేవలశబ్దాత్మకో యథా—

'అజితాన్యతనుసఙ్ఘాతైః సరోగాణి సదైవ హి
శరీరిణాం శరీరాణి కమలాని న సంశయః.'

అత్ర సరోగశబ్దాదిరుపాత్త ఏవ ప్రతీయతే న లుప్తః. ఆద్యో హ్యభఙ్గో ద్వితీయస్తు సభఙ్గః అయమేవ సాధారణో యత్ర యుక్తిరూపేణోపన్యస్యతే తద్ధేతురూపకమ్. యథా—

"పఞ్చశాఖః ప్రభో యస్తే శాఖా సురతరోరసౌ
అన్యథానేన పూర్యన్తే కథం సర్వమనోరథాః"

ఏవమ్—

"ప్రాణేశవిరహాక్లాన్తః కపోలస్తవ సున్దరి
మనోభవవ్యాధిమత్త్వాన్మృగాఙ్కః ఖలు నిర్మలః."

ఇహాశ్లేషేణ రసచన్ద్రయోః కపోలే తాద్రూప్యప్రత్యయా ద్ద్విరూపకం నిరవయవమ్. హేతుస్తు త్రిషు శ్లిష్టఏవ, ఏవమన్యేఽపి ప్రకారా జ్ఞేయాః.

కేవలశబ్దాత్మక మెట్లనగా—

"అంకితాన్యక్షసంఘాతైః" మొ. ఇచట సరోగత శబ్దాదు లుపాత్తము లగుచునే స్ఫురించును, లోపించి కాదు. మొదటిది అభగ్నము. రెండవది భగ్నము. ఈ సాధారణ ధర్మమే యుక్తిరూపముతో నెక్కడ నుపన్యసింప బడునో నది హేతురూపకము - ఎట్లనగా.

"పంచశాఖః" మొ. (ఓ ప్రభువా! నీ ఐదువేళ్లుగల హస్తము అది కల్ప వృక్షము యొక్క కొమ్మయే; అలా గానియెడల దీనిచేత అన్ని కోరి కలు నూ ఎట్లు పూరింపబడును?)

ఇలాగే —

"ప్రాణేశ" మొ. (ఓ సుందరీ! నీచెక్కిలి ప్రాణేశుని వియోగము వలన వాడినదై మనస్సునందు పుట్టు వ్యాధికలిగి యుండుట వలన నిర్మల మగు మృగాంకము (చంద్రుడు) గదా!) ఇచట శ్లేషచే రసచంద్రులకు కపోలమునందు తాద్రూప్యప్రత్యయమువలన ద్విరూపకము నిరవయవమైనది. హేతువుమాత్రము మూటియందును శ్లిష్టమైనదియే. ఈతీరుగా ఇతర ప్రకారము లు గూడ తెలియవలెను.

ఉల్లాసః ఫుల్లపఙ్కేరుహ పటలపతన్మత్తపుష్పంధయానాం
నిస్తారః శోకదావానలవికలహృదాం కోకసీమన్తినీనామ్.
ఉత్పాతస్తామసానాముఉరుహతమహసాం చక్షుషాం పక్షపాతః
సఙ్ఘాతః కోఽపి ధామ్నామయ ముదయగిరిప్రాన్తతః
ప్రాదురాసీత్.

అత్రోపమేయ ఉపమానస్య నారోపః, అపి తు కారణే కార్య స్యేతి రూపకం న భవతీతి ప్రాఞ్చః. ఏతన్మతానుసారేణైవ వాస్మాభిరపి లక్షితమ్. ఉచ్ఛృఙ్ఖలాః పునరారోపమాత్రం రూపకం వదన్త ఇహాపి రూపకమేవాచక్షత ఇతి ప్రాగేవ నిరూపితమ్.

"ఉల్లాసః" మొ. (వికసించిన పద్మముల యొక్క సమూహము నందు వ్రాలుచున్న మదించిన తుమ్మెదలకు ఉల్లాసమున్ను, శోకమనెడు కారుచిచ్చుచే వికలమైన హృదయముగల చక్రవాక స్త్రీలకు నిస్తారమున్ను, తేజస్సును అణచిన తమః పుంజములకు ఉత్పాతమున్ను కన్నులకు పక్షపాత మున్ను నైన యేదో తేజస్సులయొక్క సంఘాత మిదిగో ఉదయగిరి ప్రాంత ములనుండి యావిర్భవించెను.) ఇచట నుపమేయమునందు నుపమానమున కారోపము లేదు. ఇకనేమనగా కారణమున కార్యమునకని రూపకముగాదు, అని ప్రాచీనులు. ఈమతము ననుసరించియే మేముకూడా లక్షిత మొనర్చితిమి

ఉచ్ఛృంఖలులు మాత్రము ఆరోపమాత్రమును రూపకమని చెప్పుచు నిచట గూడ రూపకమునే జెప్పుదురని ఇదివరకే నిరూపించబడినది.

నను—

"యశః సౌరభ్యలశునః శాన్తిశైత్యహుతాశనః
కారుణ్యకుసుమాకాశః పిశునః కేన వర్ణ్యతే."

ఇత్యత్ర లశునహుతాశనాకాశైః కిం సాధర్మ్యమ్ యేన తేషా మస్మిన్ రూపకముచ్యతే ఇతిచేత్, యశః సౌరభ్యయోః శాన్తి శైత్యయోః కారుణ్యకుసుమయోశ్చ తాద్రూప్యే శబ్దాదుపస్థితేఽ నన్తరముపస్థితం యశోరూప సౌరభ్యాద్యభావవత్త్వమేతత్. ఏవమపి లశునఖలయోస్తాద్రూప్య సిద్ధౌ సత్యాం లశునరూపఖలావృత్తిత్వేన యశః సౌరభ్యయోస్తాద్రూప్యం సిధ్యేత్, యశః సౌరభ్యయో స్తాద్రూప్యసిద్ధౌ చ యశోరూప సౌరభ్యశూన్యత్వేన లశునఖలయో స్తాద్రూప్యమ్, ఇత్యన్యోన్యాశ్రయో నాశఙ్కనీయః. సకలసిద్ధేః కల్పనామయత్వేన, కల్పనాయాశ్చ స్వప్రతిభాధీనత్వాత్. శిల్పిభిః పరస్పరావష్టమ్భమాత్రాధీనస్థితికాభిః శ్లిష్టేష్టకాభిర్గృహవిశేష నిర్మా ణాచ్చ.

అయ్యా -

"యశః" ఇత్యాది శ్లోకమునందు లశునహుతాశనాకాశములతో కొండెగానికి సామ్యమేమున్నది? వారికి నీరూపకము జెప్పబడుచున్నదే? అనుచో యశః సౌరభ్యములకును శాంతిశైత్యములకును, గారుణ్యకుసుమము

లకను తాద్రూప్యము శబ్దముపలన నుపస్థాపింపబడగా తరువాత నుపస్థాపిత మైన యశోరూప సౌరభ్యాదులయొక్క అభావము గల్గియుండుటయే ఇది. ఇలాగైనను లశునఖలులకు తాద్రూప్యము సిద్ధించుచుండగా లశునరూపమగు ఖలునియందుండనివిగా యశః సౌరభ్యములకు తాద్రూప్యము సిద్ధించును. యశస్సౌరభ్యముల తాద్రూప్యము సిద్ధింపగా యశోరూపమగు సౌరభ్యముతో శూన్యులుగా లశునఖలులకు తాద్రూప్యమని అన్యోన్యాశ్రయమని శంకింప రాదు. సకలసిద్ధియు గల్పనామయమగుటచేత పరస్పరావష్టంభ మాత్రము వలన స్థితిగల్గు రాళ్ళు ఇటికలు మొదలగువాటిచే గృహావిశేషము నిర్మించ బడుట లేదా?

అథాస్య ధ్వనిః. తత్ర శబ్దశక్తిమూలో యథా—

"విజ్ఞత్వం విదుషాం గణే సుకవితాం సామాజికానాం కులే
మాఙ్గల్యం స్వజనేషు గౌరవమథో లోకేషు సర్వేష్వపి
దుర్వృత్తేఽశనితాం నృలోకవలయే రాజత్వమవ్యాహతం
మిత్రత్వం చ వహన్నకించనజనే దేవ త్వమేకో భువి."

అత్ర శక్తినియన్త్రితేఽపి బుధత్వశుక్రత్వాదినా బుధాద్య భేదరూపాణి రాజని వ్యజ్యన్తే. యథా వా—

"అవిరలవిగలద్దానోదకధారాసారసిక్త ధరణితలః
ధనదాగ్రమహితమూర్తిర్దేవ త్వం సార్వభౌమోఽసి."

అర్థశక్తిమూలో యథా—

"కస్తూరికాతిలకమాలి విధాయ సాయం
స్మేరాననా సపది శీలయ సౌధమౌలిమ్.
ప్రౌఢిం భజన్తు కుముదాని ముదాముదారా
ముల్లాసయన్తు పరితో హరితో ముఖాని."

అత్ర త్వదీయమాననం కలఙ్కవచ్చన్ద్రికావిశిష్టచన్ద్రాభిన్నమితి రూపకం కుముదాద్వికాసాదినా ధ్వన్యతే. న తు భ్రాన్తిమాన్. కుము దానాం హరితాం చాచేతనత్వాత్. నచాచేతనేషు ముదామసమ్భవా దవశ్యం కుముదాదిషు చేతనత్వారోపేణ భావ్యమ్, తేన చ భ్రాన్తిసిద్ధిరితి

వాచ్యమ్. ముఖ్యపదస్య వికాసే లాక్షణికత్వాత్. ఇదం వా వివిక్తముదాహరణమ్—

"తిమిరం హరన్తి హరితాం పురఃస్థితమ్
తిరయన్తి తాపమథ తాపశాలినామ్
వదనత్విషస్తవ చకోరలోచనే
పరిముద్రయన్తి సరసీరుహశ్రియః"

ఇహాఽపి వదనం చన్ద్ర ఇతి గమ్యతే.

తరువాత దీని ధ్వని—

అందు శబ్దశక్తి మూల మెట్లనగా—

"విజ్ఞత్వం" మొ. (పండితుల సమూహమునందు విజ్ఞానమున్ను, సామాజికుల కులమునందు మంచి కవిత్వమున్ను, బంధువులయందు మాంగల్యమును, తరువాత లోకములన్నిటియందును గౌరవమును, దుర్వృత్తికి అశనిత్వమును, భూలోకవలయమునందు అడ్డులేని రాజత్వమును, దీనులయందు మైత్రిని కలిగి భూమియందు దేవత్వము వహించుచున్నది నీవొకడవే.

ఇచట శబ్దశక్తి నియంత్రణ యున్నను బుధత్వ శుక్రత్వాదులు బుధాద్యభేదరూపములై రాజునందు వ్యక్తము లగుచున్నవి.

మరొకటి — "అవిరల" మొ.

అర్థశక్తి మూలమెట్లనగా—

"కస్తూరికాతిలకమాలి" మొ. (ఓ స్నేహితురాలా! సాయంకాలమునందు కస్తూరీతిలకమును చక్కగా రచించి చిఱునవ్వు మొగముగలదానివై మేడయొక్క అగ్రమును అలంకరింపుము. కలువలు ఉదారమగు సంతోషముయొక్క ప్రౌఢిని బొందును గాక! అంతటను దిక్కులు ఉల్లసించును గాక!)

ఇచట నీ ముఖము కళంకముతోను, వెన్నెలతోను గూడిన చంద్రునితో అభిన్నమని రూపకము కలువలు వికసించుట మొదలగువానిచేత ధ్వనించుచున్నది. అంతేగాని భ్రాంతిమత్తుగాదు. కుముదములును హరిత్తులును అచేతనములు కనుక. అచేతనములయందు సంతోషము సంభవించదు గనుక కుముదాదు

లందు తప్పక చేతనత్వమును ఆరోపింపవలెను. దానిచేత భ్రాంతి సిద్ధించు ననెదరేమో ? ముత్పదము వికాసమునందు లాక్షణికము కనుక.

అథవా ఇదియైనా వివిక్తమగు నుదాహరణము.

"తిమిరం" మొ. (దిక్కులకు ముందున్న చీకటిని హరించును. తాపము గలిగినవారి తాపమును బోగొట్టును. ఓచకోరలోచనా ! నీ ముఖకాంతులు పద్మముల కాంతులను చక్కగా మూయుచున్నవి.) ఇచటను వదనము చంద్రుడని తోచును.

ఆనన్దవర్ధనాచార్యాస్తు—

"ప్రాప్తశ్రీరేషకస్మాత్పునరపి మయి తం మన్థఖేదం విదధ్యా న్నిద్రామప్యస్యపూర్వామనలస మనసోనైవ సమ్భావయామి. సేతుం బధ్నాతి భూయః కిమితి చ సకలద్వీపనాథానుయాత స్త్వయ్యాయాతే వికల్పానితి దధత ఇవాభాతి కమ్పః-
పయోధేః"

అత్ర "రూపకాశ్రయేణ కావ్యచారుత్వ వ్యవస్థాపనాద్రూపక ధ్వనిః" ఇత్యాహుః. తచ్చిన్త్యమ్. అత్ర చ జలధికంపహేతుత్వేన వికల్పత్రయం కల్ప్యతే, తచ్చ ప్రకృతే రాజవిశేష్యికాం జలనిధిగతా మనాహార్య విష్ణుతాదాత్మ్యజ్ఞానరూపాం భ్రాన్తిమేవాక్షిపతి న రూపకమ్. తజ్జీవాతోరాహార్య విష్ణుతాదాత్మ్యనిశ్చయస్య కమ్పాజనకత్వాత్. కవి జలనిధిగతత్వేనవైయధికరణ్యాచ్చ, అజ్ఞాతమేవ కేవలం విష్ణుతాదాత్మ్యం జలధేః కమ్పేఽనుపయుక్తమేవ చమత్కారిణ్యపి చాత్ర భ్రాన్తిరేవేతి ధ్వనిరపి తస్యా ఏవ యుక్తః.

ఆనందవర్ధనాచార్యులైతే—

"ప్రాప్తశ్రీః" (లక్ష్మిని బొందిన యీతను తిరిగి నాయందు మంథ ఖేదమును యెందువలన జేయును ? మాంద్యములేని మనసుగలవానికి నిద్రను ఊహింపలేను. యావన్మంది ద్వీపనాథులతోను వెంటాడబడిన యీతను మరల సేతువు నెందుకు కట్టునని యీ తీరుగా వికల్పమును నీవు రాగా సముద్రుడు చేయుచున్నట్లు గనపడును.) ఇత్యాదిశ్లోకమున రూపకము నాశ్రయించుటచే గావ్యసౌందర్యము వ్యవస్థితమైనది గనుక రూపక

ధ్వని" యనిరి. అది చింత్యమే. ఇక్కడ జలధికంగ హేతువుగా మూడు వికల్పనములు గల్పింపబడుచున్నవి అది ప్రకృతమున రాజు విశేష్యముగాగల సముద్రమందున్న యనాహార్యమగు భ్రాంతినే యాక్షేపించుచున్నది. 'రూపకమును కాదు, దానికి జీవాతువు అగు నాహార్యవిష్ణుతాదాత్మ్య నిశ్చయము గంపనము పుట్టించక పోవుటవలన కవియందును జలనిధియందును ఉండుటవలన వ్యధికరణములుగదా? అజ్ఞాతమైనదియే కేవలమగు విష్ణుతాదాత్మ్యము సముద్రము వణుకుటయందు నుపయోగించనిదే చమత్కారము గలిగించునదైనను భ్రాంతియేనని దానికే ధ్వనియని చెప్పుట యుక్తము—

అథాస్యాపి కవిసమయవిరుద్ధతయా చమత్కారాపకర్షకా లిఙ్గభేదాదయో దోషాః సంభవన్తి. యథా—

"బుద్ధి రబ్ధిర్మహీపాల యశస్తే సురనిమ్నగా
కృతయస్తు శరత్కాల చారుచన్ద్రిర చన్ద్రికా."

అత్ర విషయవిషయిణోర్లిఙ్గాదికృతం వైలక్షణ్యం తయోస్తాద్రూప్యబుద్ధౌ ప్రతికూలమ్, క్వచిత్కవిసమయ సిద్ధతయా చమత్కారహానిరాహిత్యే తు నామీ దోషాః. యథా 'సన్తాపశాన్తికారిత్వాద్వదనం తవ చన్ద్రమాః' ఇత్యాదౌ హేతురూపమ్.

తరువాత - నీ యలంకారము గవిసమయసిద్ధమగుటచేత చమత్కారము దగ్గించు లింగభేదాదులు దోషములు సంభవించును. ఎట్లనగా—

"బుద్ధిః"మొ. 'ఓ రాజా! నీ బుద్ధి సముద్రము. నీ కీర్తి ఆకాశగంగ. నీ కృతులైతే శరత్కాలమునందలి అందమైన చంద్రుని వెన్నెలయే." ఇచట విషయ విషయులకు లింగభేదమువల్ల ఏర్పడిన వైలక్షణ్యము నా రెంటికి తాద్రూప్య బుద్ధియందు ప్రతికూలము - ఒక్కొక్కచోట కవి సమయసిద్ధము కనుక చమత్కారహాని లేనపుడు ఇవి దోషములు గావు. ఎట్లనగా—

"సంతాపశాంతికారిత్వాద్వదనం తవచంద్రమాః" "సంతాపమును శాంతిజేయును గనుక నీ వదనము చంద్రుడే". ఇత్యాదికమైన హేతు రూపకమునందు.

ఇది రూపకాలంకారము.

## పరిణామః

అథ పరిణామః—విషయీ యత్ర విషయాత్మతయైవ ప్రకృతోపయోగీ న స్వాతన్త్ర్యేణ స పరిణామః. అత్రచ విషయాభేదో విషయిణ్యుపయుజ్యతే. రూపకేతు నైవమితి భేదః. అయముదాహ్రియతే—

"అపారే సంసారే విషమవిషయారణ్యసరణౌ
మమ భ్రామం భ్రామం విగళితవిరామం జడమతేః,
పరిశ్రాన్తస్యాయం తరణితనయాతీరనిలయః
సమన్తాత్ సంతాపం హరినవతమాలస్తిరయతు."

అత్ర భగవదాత్మతయైవ తమాలస్య సంసారతాపనివర్తన క్షమత్వమ్. మార్గశ్రాన్త జనసన్తాపహారకత్వాద్రమణీయశోభాధారత్వాచ్చ తమాలో విషయితయోపాత్తః. అయం సమానాధికరణో వాక్యగః.

తరువాత పరిణామము.

విషయి యెచ్చట విషయాత్మతతోనే ప్రకృతమున నుపయోగియో, స్వతంత్రముగ గాదో - అది పరిణామము.

ఇచట విషయముతోడి యభేదము విషయియం దుపయోగించును. రూపకమునందు ఇట్లు కాదని రూపకము నుండి దీనికి భేదము.

ఇది ఉదాహరణము.

"అపారే" మొ. (అపారమగు నీసంసారమున విషమములగు విషయములనెడు అడవి త్రోవలో విరామము లేకుండ తిరిగి తిరిగి బుద్ధి మందగించగా అలసట బొందిన నాకు సూర్యకుమారికయొక్క తీరము నందున్నట్టి విష్ణువనెడు క్రొత్త తమాలవృక్షము అంతటను సంతాపము హరించును గాత!) ఇచట భగవత్తాదాత్మ్యముతోనే తమాలమునకు సంసారమందలి తాపము నివర్తింపజేయు శక్తిగల్గియుండుట. మార్గశ్రాంతమగు జనమునకు సంతాపమును హరించుటచేతను రమణీయమగు శోభగల్గుటచేతను తమాలము విషయిగా గ్రహింపబడినది. ఇది సమానాధికరణము వాక్యగతమైనది.

సమాసగో యథా—

"మహర్షేర్వ్యాసపుత్రస్య శ్రావం శ్రావం వచః సుధామ్.
ఉప (అభి) మన్యుసుతో రాజా పరాం ముదమవాప్తవాన్."

వ్యధికరణో యథా—

"అహీనచన్ద్రా లసతాననేన
జ్యోత్స్నావతీ చాపి శుచిస్మితేన.
ఏషా హి యోషా సితపక్షదోషా
తోషాయ కేషాం న మహీతలే స్యాత్"

అత్ర సర్వేషామేవ తోషాయ స్యాదిత్యనేన విరహిజనతోష కత్వమపి లభ్యతే తచ్చారోప్యమాణ శుక్లపక్ష రజన్యాః స్వాత్మనా బాధితమ్, యోషారూపేణ తు సంగచ్ఛత ఇతి భవతి పరిణామః. స చ పరస్పర సాపేక్ష బహుసంఘాతాత్మకతయా సావయవః; తత్రా ద్యార్ధగతౌ ద్వావవయవౌ వ్యధికరణౌ ద్వితీయార్ధగతశ్చైకః సమా నాధికరణః.

సమాస గతమున కుదాహరణము.

'మహర్షేః' మొ. (మహాఋషియగు వ్యాసపుత్రుని (శుకుని) మాట లనెడి యమృతమును విని విని అభిమన్యుకుమారుడు (పరిక్షిత్తు) గొప్ప సంతో షమును బొందెను.)

వ్యధికరణ మెట్లనగా -

"అహీన చంద్రా" మొ. (విలసిల్లుచున్న వదనముచే పూర్ణచంద్రుడు గల్గియు శుభ్రమగు చిఱునగవుచే వెన్నెల కలదియు నైనయీ స్త్రీ శుక్లపక్ష రాత్రి యెవని సంతోషము కొరకు గాదు. ఇచట నందరిని సంతసింప జేయును అనుటవలన వియోగి జనులకు నైనను తోషమును గల్గించును అనియు లభిం చును. అదియు నారోపించబడు శుక్లపక్షరాత్రికి స్వస్వరూపముచే బాధితము వనితారూపముచేనైతే సంగతమగును గనుక పరిణామము – అదియుపరస్పరా పేక్షములగు ననేకముల సంఘరూపమగుటచేత సావయవము. అందును మొదటి సగములో నుండునవి రెండును అవయవములు వ్యధికరణములు. రెండవ సగములోని యొకటి సమానాధికరణము.

యచ్చాప్యయదీక్షితై ర్వైయధికరణ్యేన పరిణామే ఉదాహృతమ్—

"తారానాయకశేఖరాయ జగదాధారాయ ధారాధర
చ్ఛాయాధారకకన్ధరాయ గిరిజాసఙ్గైకశృఙ్గారిణే.
నద్యా శేఖరిణే దృశా తిలకినే నారాయణే నాస్త్రిణే
నాగైః కఙ్కణినే నగేన గృహిణే నాథాయ సేయం నతిః"

యథా వా—

ద్వైధ్యాభావః పుష్పకేతో ర్విబుధవిటపినాం పౌనరుక్త్యం వికల్ప
శ్చిన్తారత్నస్య పిష్టో తపనతనుభువో వాసవస్య ద్విరుక్తిః.
ద్వైతం దేవస్య దైత్యాధిప మథనకలాకేలికారస్య కుర్వ
న్నానన్దం కోవిదానాం జగతి విజయతే శ్రీనృసింహక్షితీశః."

ఇతి. అత్ర చిన్త్యతే— తారానాయకశేఖరాయేతి పద్యే గిరిజాసఙ్గైకశృఙ్గారిణి భవే కవికర్తృకా నతిః ప్రక్రాన్తా. శృఙ్గారితా చ శేఖరాదీని భూషణాన్యపేక్షత ఇతి నద్యా ఆరోప్యమాణ శేఖరరూపతయైవోపయోగః న స్వరూపేణ. ఏవం దృశోఽపి తిలకరూపతయేతి రూపకమేవ శుద్ధం భవితు మర్హతి, నను పరిణామే విషయాభిన్నతయా విషయ్యవతిష్ఠత ఇత్యుక్తమ్; ప్రకృతే చ విషయవాచకేభ్యో నద్యాది శబ్దేభ్యః పరస్యాస్తృతీయాయా అభేదార్థకత్వాచ్ఛేఖరాదేశ్చ తదన్వయిత్వాత్ కథం నాత్ర పరిణామ ఇతి చేత్ న. విషయాభిన్నత్వేన విషయిణోఽభానేఽపి తేన రూపేణ తస్యానుపయోగాత్. ద్వైధ్యాభావః పుష్పకేతోరితి పద్యేఽపి కోవిదానన్ద జనన - జగదుత్కర్షా కథ్యేతే రాజ్ఞో నృసింహస్య. తత్ర కోవిదానన్ద జనకత్వమపి రాజ్ఞ ఆరోప్యమాణ ద్వితీయమన్మథాది తాద్రూప్యేణ యథా సంభవతి న తథా కేవలస్వరూపేణ. తథాహి - అహోఽనయనానా మస్మదీయానాం సాఫల్యం యదయమపరో మన్మథోఽస్మాభిరాలోక్యత ఇతి మన్యమానానాం తేషాం నయనానన్దస్తావత్పుష్పకేతునైవోపపద్యతే, నతు రాజ్ఞా. ఏవమపరోఽయం కల్పతరుశ్చిన్తామణిర్ద్వితీయః కర్ణ ఇన్ద్రశ్చ భూగతోఽయమనో దారిద్ర్యమస్మాకం పరిహరిష్యతి. హరిః

ఖల్వయం సంసారం హరిష్యతీత్యభిమానాజ్జాయమాన స్తేషామానన్దోఽ ప్యారోప్యమాణైః కల్పవృక్షాదిభి రేవేతి నవిషయాత్మనా విషయిణ ఉపయోగః, అపి తు స్వాత్మనైవేతి కుత్రాస్తి పరిణామః ?

అప్పయ్యదీక్షితులు వైయధికరణ్యమున పరిణామమునకు ఉదహరించెను.

"తారానాయక శేఖరాయ" మొ. (చంద్రుడు శేఖరముగగల్గి జగమునకాధారమై మేఘకాంతి ధరించిన కంఠము కల్గినట్టియు కొండకూతురిసంబంధమునందు శృంగారియు, నది చేత శేఖరము గలట్టియు చూపుతో తిలకము గలిగినట్టియు నారాయణునితో *అస్త్రము గలట్టియు, పాముఃచే కంకణము గలట్టియు, కొండచే గృహముగలట్టి ప్రభువగు నీకు ఇదియే నమస్కారము,"

మరొకటి—

"ద్వైర్భావః" మొ. (మన్మథునకు ద్వైర్భావమున్ను, కల్పతరువులకు పౌనరుక్త్యమును, చింతామణికి వికల్పమున్ను, కర్ణునకు పిష్టయును, ఇంద్రునకు ద్విరుక్తియును, దైత్యాధిపుని చంపుటయనెడు కళాకేలిని జేయునట్టి దేవునకు ద్వైతమున్ను, కోవిదులకు ఆనందమును చేయువాడును అగు నీ నృసింహరాజు లోకమున వెలయుచున్నాడు.)

ఇచట విచారింతము.

*నారాయణేనాస్త్రిణే — అనుచోట నారాయణునకు అస్త్రరూపమున యోగము లేదు గనుక రూపకము కాదన్నారు నాగేశులు. బొందిలి మొదలగు కొన్ని క్షత్రియ జాతులలో వివాహ సమయమున అస్త్రము ధరించుట యలవాటు. దానినెరుగక నీతడు ఆక్షేపించెను. కాగా నారాయణాభిన్నమగు నస్త్రమును గ్రహించెనని తాత్పర్యము శివుని పరమోత్కర్ష యర్థముగనుక నాగములు కటకరూపాదులః పొందినవి, అంతేగాని కంకణములు నాగతాద్రూప్యము నొందలేదు. కనుక నాగములు శివుని కంకణములయ్యెను. శివుడు స్వతఃతారానాయక శేఖరుడగు నాతడు నదిని శేఖరముగా చేసుకొనగల్గుటచేననే నద్యాదులకు శేఖరత్వేన ఉపయోగమే గనుక పరిణామము ఎచటనున్నది ?

ఇక రెండవ పద్యమున పరిణామము లేదని తానే ఒప్పుకొనెను. అనుభవములేదని యూహించవలెను, ప్రకరణము లేదుగనుక నర్థములేదని. అందువలన నాగేశుని ఇదంచిత్యం ఇత్యాదికమగుట్రవాత - అదితప్పు.

"తారానాయకశేఖరాయ" అను పద్యమున గిరిజాసంగైకశృంగారి అగుభవునికి కవిచే నమస్కారము ప్రకాంతమైనది. శృంగారిత నగల నపేక్షించును. గనుక నదికి నారోపించబడు శేఖరము రూపముతోనే నుపయోగము, నదీరూపముతోగాదు. ఈలాగే నేత్రమునకుగూడా తిలకరూపముననే అని రూపకమే శుద్ధమగుటకు తగును.

ఏమయ్యా? – పరిణామమున విషయాభిన్నముగా విషయియుండును అని చెప్పబడెను. ప్రకృతములో విషయవాచకములగు నద్యాది శబ్దముల కంటె పరమగు తృతీయ అభేదార్థమగుటవలన శేఖరము మొదలగు దానితో నన్వయించుటచే నిట పరిణామము ఏల కారాదు ?· అనరాదు. విషయాభిన్నముగా విషయి భాసించినను నా రూపముతో నది ప్రకృతములో నుపయోగించుట లేదు.

'ద్విరాభవః పుష్పకేతోః'—అను పద్యమునగూడ కోవిదుల కానందము గల్గించుట, జగత్తులో నెక్కువగా నుండుటయు, రాజగు నృసింహునకు జెప్పబడుచున్నవి. కోవిదానందజనకత్వముగూడ రాజునకారోపింపబడు ద్వితీయ మన్మథాధితాద్రూప్యముచే ఎట్లు సంభవించునో అలాగ కేవలస్వరూపముతో కాదు. "అహో? మా కనులకెంత సాఫల్యము! ఏమంటే – మరొక మన్మథుని మనము జూచుచున్నాము" – అని తలచుచున్నవారికి కన్నులకానందము అంతయు పుష్పకేతునితోనేగుదురును. అంతేగాని రాజుచేగాదు, ఇట్లే – ఈతడు మరొక కల్పవృక్షము. రెండవ చింతామణి, కర్ణుడు, ఇపుడు నేలకు దిగిన మరొక ఇంద్రుడు, మాయొక్క దారిద్ర్యమును పరిహరించును. ఈతడు హరియే. సంసారభారమును హరించును, అను అభిమానముచే గల్గునట్టివారి యానందముగూడా ఆరోపింపబడుచున్న కల్పవృక్షాదులచేత నేనని విషయస్వరూపముతో విషయికి ఉపయోగము లేదు. మరి యేమంటే స్వాత్మస్వరూపముతోనే. ఈ తీరున పరిణామ మెచట నున్నది?

అలఙ్కారసర్వస్వకారస్తు — "ఆరోప్యమాణస్య ప్రకృతోపయోగిత్వే పరిణామః" ఇతి సూత్రయిత్వా 'ఆరోప్యమాణం రూపకే ప్రకరణోపయోగిత్వాభావాత్ప్రకృతోపరఞ్జకత్వేనైవ కేవలేనాన్వయం భజతే. పరిణామే తు ప్రకృతాత్మతయారోప్యమాణస్యోపయోగ ఇతి ప్రకృతమారోప్యమాణతయా పరిణమతి' ఇతి వ్యాఖ్యా

తవాన్. అత్రాపి చిన్త్యతే. ఆరోప్యమాణస్య ప్రకృతోపయోగ ఇత్యస్య ప్రకృతకార్యే ఉపయోగ ఆహోస్విత్ ప్రకృతవిషయాత్మతయా ఉపయోగోఽర్థః ? న తావదాద్యః,

'దాసే కృతాగసి భవత్యుచితః ప్రభూణాం
పాదప్రహార ఇతి సున్దరి నాస్మి దూయే.
ఉద్యత్కఠోరపులకాఙ్కురకణ్టకాగ్రై
ర్యత్ఖిద్యతే తవ పదం నను సా వ్యథా మే."

ఇతి త్వదుదాహృతరూపకోదాహరణే ఆరోప్యమాణానాం కణ్టకానాం ప్రకృతఖేదవ్యథారూపకార్యే ఉపయోగేనాతిప్రసఙ్గాత్. న ద్వితీయః.

"అథ పక్ష్మలితాము పేయివద్భిః
సరసైర్వక్త్రపథాశ్రితైర్వచోభిః.
క్షితిభర్తురుపాయనం చకార
ప్రథమం తత్పరత స్తురఙ్గమాద్యైః"

ఇత్యత్ర స్వోక్తవ్యధికరణ పరిణామోదాహరణాసఙ్గత్యాపత్తేః. యతో రాజసంఘటనే హ్యుపాయనస్యారోప్యమాణస్య స్వాత్మనైవోపయోగః, న తు విషయవచోరూపతయా. వచసాంతు విషయాణామారోప్యమాణోపాయ న రూపత్వేన పరముపయోగ ఇతి ప్రత్యుత విపరీతమ్. తస్మాదస్మదుక్తమేవ వ్యధికరణ పరిణామస్యోదాహరణం సాధు. ఇదం తు పునర్వ్యధికరణరూపకం భవితుమర్హతి. తృతీయార్థాభేదోఽపి మీనవతీ నయనాభ్యా మిత్యత్రేవ ప్రకృతార్థానుయోగికో బోధ్యః.

అలంకారసర్వస్వకారుడైతే—"ఆరోపింపబడు దానికి ప్రకృతములో నుపయోగమున్నచో పరిణామము" అని సూత్రించి యారోపింపబడునది రూపకమున ప్రకృతోపయోగము లేనందున ప్రకృతోపరంజకత్వమాత్రము చేతనే అన్వయించుచున్నది. పరిణామమందైతే ప్రకృతాత్మతతో నారోపింపబడుదాని కుపయోగము గనుక ప్రకృతమారోప్యమాణముగ పరిణమించును అని వ్యాఖ్యానించెను. ఇచట విచారితము—

ఆరోప్యమాణమునకు ప్రకృతోపయోగము అనేచోట ఉపయోగమనగా ప్రకృతకార్యమున నుపయోగమా లేక ప్రకృతవిషయాత్మతతో నుపయోగమా? మొదటిపక్షముగాదు. నీవే ఉదాహరించిన

"దాసేకృతాగసి" (దాసుడు తప్పుచేయగా ప్రభువులు కాలితో ప్రతాడించుట యుచితమే కావున సుందరీ నేను పరితపించను, ఉదయించుచున్న కఠినమైన పులకాంకురమనెడు కంటకాగ్రములచే నీ అడుగు కష్టబడునేయని నాకు కష్టముజూమీ) ఇత్యాదిశ్లోకమున ఆరోపింపబడుచున్న కంటకములకు ప్రకృత ఖేదవ్యథారూపకార్యమున నుపయోగము గనుక నతిప్రసంగము సంభవించును. రెండవదియు కుదరదు.

"అథ పక్త్రిమతాం" (తరువాత పక్వదశను బొందినట్టి సరసములైన వక్త్రిపథము నాశ్రయించినమాటలచే రాజునకు కానుక జేసెను. తరువాత గుఱ్ఱముల మొదలగువాటిచే కానుకచేసెను.) ఇత్యాదిశ్లోకమునందు తానె జెప్పిన వ్యధికరణ పరిణామోదాహరణమసంగతము గావలెను. ఎందువల్ల ననగా - రాజసంఘటనమున ఆరోప్యమగు నుపాయనమునకు స్వరూపముతోనే యుపయోగము; అంతేకాని విషయమగు మాటలరూపమున నుపయోగము లేదు. మాటకైతేమాత్రము విషయములకు నారోపించబడు నుపాయనరూపమగుటచేతమాత్ర ముపయోగము, అని పైనదానికి విపరీతము. కావున మేము జెప్పినదే వ్యధికరణ పరిణామమున కుదాహరణము సరియైనది. ఇదిమాత్రము వ్యధికరణరూపకము కాదగును. తృతీయార్థాభేదముః కూడ "మీనవతీనయనాభ్యాం" అనుచోటవలె ప్రకృత్యర్థము అనుయోగితగాగలది; అని తెలియవలెను.

కేచిత్తు 'క్వచిత్కేవలో విషయః స్వాత్మనా న ప్రకృతోపయోగీత్యయమారోప్యమాణా భిన్నతయాఽవతిష్ఠతే, తత్రారోప్యమాణపరిణామః. యథా—'వదనేనేన్దునా తన్వీ శిశిరీకురుతే దృశౌ'. అత్రవదనమిన్ద్వభిన్నతయాఽవతిష్ఠతే, కేవలస్య వదనస్య దృక్శిశిరీకారకత్వాయోగాత్. క్వచిచ్చారోప్యమాణః స్వాత్మనా నప్రకృతకార్యోపయోగీత్యయం విషయాభిన్నతయాఽవతిష్ఠతే. తత్రవిషయపరిణామః. యథా - 'వదనేనేన్దునా తన్వీ స్మరతాపం విలుమ్పతి'. అత్రేన్దుర్వదనాభిన్నతయావతిష్ఠతే, కేవలస్యేన్దోః స్మరతాపాపనోదక

త్వాయోగాత్. ఏవం చ పరిణామధ్వయాత్మకమిదం రూపకమేవ భవితుమర్హతి. విషయతావచ్ఛేదక విషయితావచ్ఛేదకాన్యతర పురస్కారేణ నిశ్చీయమాన విషయి విషయాన్యతరత్వస్య తల్లక్షణత్వాత్. అత ఏవోక్తమ్ - "తద్రూపకమభేదో య ఉపమానోపమేయయోః" ఇతి తస్మాన్న రూపకాత్పరిణామోఽతిరచ్యతే" ఇతి వదన్తి.

కొంతమంది—

"ఒకచో కేవల విషయము స్వస్వరూపముతో ప్రకృతోపయోగి గాక పోవుటచే అది యారోపించబడుదానితో నభిన్నము గానుండును, అచట నారోప్యమాణ పరిణామము, ఎట్లనగా—

'వదనేనేన్దునా తన్వీ శిశిరీకురుతేదృశా' - ఇచట వదనము ఇందునితో నభిన్నముగానుండును. కేవలము మొగమునకు గన్నులు జల్లజేయుట పొసగదుగదా? ఒకయెడ నారోపించబడునది స్వస్వరూపముతో ప్రకృత కార్యమున నుపయోగింపదు గాన అది విషయాభిన్నముగా నుండును. అచట విషయపరిణామము. ఎట్లనగా—

"వదనేనేందునాతన్వీస్మరతాపం విలుంపతి." – ఇచట నిందుడు వదనాభిన్నుడుగానుండును. కేవలుడగు చంద్రుడు స్మరతాపమును పోగొట్ట జాలడుగదా ? కాగా పరిణామద్వయాత్మకమైన ఇది రూపకము గావలయును. విషయితానిర్ణాయక విషయతానిర్ణాయకాన్యతరరూపమును పురస్కరించుకొని నిశ్చయింపఁడు విషయి విషయాన్యతరత్వము దానిలక్షణము గనుక - ఇందువలననే జెప్పెదరు. "తద్రూపకమభేదో యః ఉపమానోపమేయయోః" అని. అందువలన రూపకముకన్న పరిణామము వ్యతిరిక్తముగాదు అని.

అథ బోధః. 'హరినవతమాలః' ఇత్యత్ర భగవదభిన్నతమాల ఇతి నిర్వివాదైవ ధీః. తథా 'శ్రావం శ్రావం వచః సుధామ్' ఇత్యత్ర విశేషసమాసగతపరిణామే వచనాభిన్నాం సుధామితి; "పాయం పాయం వచః సుధామ్'' ఇతి రూపకే తు వచోనిష్ఠాభేదప్రతియోగినీం సుధామితి బుద్ధిః. ఏవం చ "వదనేనేన్దునా తన్వీ స్మరతాపం విలుమ్పతి" ఇతి వ్యస్తపరిణామే. "వదనేనేన్దునా తన్వీ శిశిరీకురుతే దృశా" ఇతి వ్యస్తరూపకే చ బోధవైలక్షణ్యమ్. తథా—

"శాన్తిమిచ్ఛసి చేదాశు సతాం వాగమృతం శృణు
హృదయే ధారణాద్యస్య న పునః ఖేదసమ్భవః"

ఇతి పరిణామే,శృణ్వితి విహాయ పిబేతి కృతే తత్రైవ రూపకే;

"విద్వామర్మణి వాగ్బాణైర్ఘూర్ణన్తే సాధవః ఖలైః
సద్భిర్వచోఽమృతైః సిక్తాః పునః స్వస్థా భవన్తి తే."

ఇతి రూపకే చ బోధవ్యవస్థితిః. తథా "అహీనచన్ద్రాలసతాననేన జ్యోత్స్నావతీ చాపి శుచిస్మితేన" ఇతివ్యధికరణ పరిణామోఽభేదస్య తృతీయార్థత్వాల్లసదాననాభిన్నహీనేతర చన్ద్రయుక్తేతి ధీః. 'మీనవతీ నయనాభ్యామ్" ఇత్యత్ర తు సరసీతాదాత్మ్యారోపో బాధకాభావాత్తావత్సిద్ధః. తస్య చ మీనయోర్నయనాభేదారోపేణాసమర్థనాన్నయనయోర్మీనాభేదారోపో మృగ్యః. సచ తృతీయాయాః ప్రకృత్యర్థాభేదార్థకతాయాం న సంభవతీతి యథాకథంచిత్తస్యాః ప్రకృత్యర్థనిష్ఠాభేదప్రతియోగిత్వార్థకత్వం వాచ్యమ్. తేన నయననిష్ఠాభేద ప్రతియోగి మీనయుక్తేతి ధీః. ఏవం చారోప్యమాణే విషయప్రతియోగికాభేదస్యాభానాన్న పరిణామః; అపితు రూపకమేవ. ఇయమేవ సరణిః 'నద్యాశేఖరిణే దృశా తిలకినే' ఇతి ప్రాగుక్తాప్పయదీక్షితదత్తోదాహరణే 'వచోభిరుపాయనం చకార—' ఇత్యలఙ్కారసర్వస్వోదాహరణే చ బోధ్యా, యది పునరారోప్యమాణే యథాకథంచిద్విషయాభేద ప్రత్యయమాత్రాత్పరిణామతోచ్యతే నాద్రియతే చ ప్రకృతోపయోగ స్తదా 'ప్రవృత్తోఽస్యాః సేక్తుం హృది మనసిజః ప్రేమలతికామ్' ఇతి తదుదాహృతరూపకస్య పరిణామతాపత్తిః. ప్రేమలతికామితి సమాసే ప్రేమ్ణో విషయస్య లతికాయామారోప్యమాణాయా మభేదేన విశేషణత్వాదితి దిక్.

ఇక నిచట శాబ్దబోధ—

"హరినవతమాలః" అనుచోట 'భగవదభిన్నతమాలము' అనే బోధవిషయమున వివాదములేదు. అలాగే. "శ్రావంశ్రావం వచస్సుధాం" – అను చోట విశేషణసమాసగతపరిణామమున 'వచనాభిన్నమగు సుధను' అనియు, ''పాయంపాయం వచస్సుధాం' అనురూపకమునందు మాత్రము 'వచోనిష్ఠాభేద

ప్రతియోగినియైన సుధ' అను బుద్ధి. ఈతీరుగా వదనేనేందునా తన్వీ స్మర తాపంవిలుంపతి - అనువ్యస్తపరిణామమునందును, "వదనేనేందునా తన్వీశిశిరీ కురుతే దృశౌ" అను వ్యస్తరూపకమునను బోధ విలక్షణము.

అలాగే—

"శాంతిమిచ్ఛసి" (నీవు శాంతిని గోరినయెడల దొందరగా సత్పురుషుల వాగమృతమును వినుము. దానిని హృదయమున ధరించుటవలన తిరిగి ఖేదము గలుగదు.) అనే పరిణామమునందును శ్రృణు అనుదానిని మార్చి 'పిబ' అని చేర్చినచో అక్కడనే రూపకమునను.

"విద్ధామర్మణి" (మర్మములయందు సాధువులు ఖలులచే వాగ్బాణములచేత విద్ధులై ఘూర్ణిల్లుదురు. సత్పురుషుల వచనామృతముచే సిక్తులై దిరిగి వారు స్వస్థులగుదురు) ఇత్యాది రూపకమునను బోధ యేర్పడును.

అలాగే"—అహీనచంద్రాలసతానసేన జ్యోత్స్నావతీ చాపి శుచిస్మితేన" అని వ్యధికరణపరిణామమున అభేదము తృతీయావిభక్తి కర్థముగనుక 'లసదాననాభిన్నహీనేతరచంద్రయుక్తా' అని బోధ యేర్పడును.

'మీనవతీ నయనాభ్యాం' — అనుచోటనైతే సరసీశాబాత్మ్యారోపము బాధకమేమియు లేనందువల్ల సిద్ధమే. దానిని మీనములందు నేత్రములయభేదము నారోపించుటచేత సమర్థించకపోవుటవల్ల నేత్రములయందు మీనాభేదము నారోపించుట మృగ్యము. అది తృతీయకు ప్రకృత్యర్థాభేదార్థకత్వమున సంభవింపదు. కావున యేదోతీరున దానికి (తృతీయకు) ప్రకృత్యర్థమునందున్న నభేదమునకు ప్రతియోగియను నర్థము జెప్పవలెను, కాగా "నయననిష్ఠాభేదప్రతియోగి మీనయుక్తా" అని బోధ.

ఈ తీరుగా నారోపించబడు దానియందు విషయప్రతి యోగికాభేదము భాసించకపోవుటవల్ల పరిణామముగాదు, రూపకమే ఈ సరణియే "నద్యా శేఖరిణే దృశా తిలకినే" అని అప్పదీక్షితులు ఇచ్చిన యుదాహరణమునను 'వచోభిరుపాయనం చకార' అను అలంకార సర్వస్వకారుడిచ్చిన యుదాహరణమునను బోధ్యము. అయితే ఆరోప్యమాణమున ఏలాగోలాగు విషయాభేదప్రత్యయముమాత్రమున్నచో పరిణామము అనుచో, ప్రకృతోపయోగమ్మూదరింపనిచో, నపుడు ।ప్రవృత్తోఽస్యాః సేక్తుం హ్యాది మనసి జః । పేమ

లతికాం" అని వారుదాహరించిన రూపకము పరిణామమై పోవలయును. 'ప్రేమలతికాం' అనే సమాసమున విషయమగు ప్రేమ లతికయందు, నాథో ప్యమాఃమునందు, నభేదమున విశేషణము కదా?

అథ పరిణామధ్వనిర్విచార్యతే :—

తత్ర యత్తావదప్పయదీక్షితై ర్విద్యాధరోక్తం ధ్వన్యుదాహరణ మనూద్య దూషితమ్ - తథాహి—

"నరసింహ ధరానాథ! కే వయం తవ వర్ణనే
అపిరాజాన మాక్రమ్య యశో యస్య విజృమ్భతే".

అత్రరాజ పదేన చన్ద్రే విషయే నిర్దిష్టే తత్రారోప్యమాణస్య నృపస్యాక్రమణ రూపకార్యోపయోగినః ప్రతీతేః పరిణామో వ్యజ్యతే ఇతి, తదయుక్తమ్. తత్రహ్యారోప్యమాణస్య నృపస్య నృపాత్మనైవాక్రమణోపయోగః, న చన్ద్రాత్మనా ఇతి. తదసత్. అత్రవిజృమ్భణం నామ నకేవలంప్రాగల్భ్య మాత్రం కవేరభిప్రేతమ్, యేన యశః కర్తృకాక్రమణే నృపస్య నృపాత్మనైవ కర్మతారూప ఉపయోగః స్యాత్. అపితు నిరతిశయ నైర్మల్యగుణవత్తాయాం స్వసమాన జాతీయ ద్వితీయ రాహిత్యప్రయుక్తః ప్రౌఢి విశేషః, ఆక్రమణం తు న్యగ్భావ ఏవ. ఏవంచైవంవిధవిజృమ్భణే చన్ద్రకర్మ కమేవాక్రమణముపయుజ్యతే, నతు నృపకర్మకమితి విషయితయా వ్యజ్యమానస్యాపి నృపస్య చన్ద్రాత్మనైవాక్రమణోపయోగ ఇతి రమణీయ మేవ విద్యాధరేణోక్తం పరిణామవ్యఙ్గ్యతాయా ముదాహరణమ్.

ఇక పరిణామధ్వని విచారితము—

అక్కడ అప్పయ్యదీక్షితులు విద్యాధరుడు చెప్పిన ధ్వని యుదాహరణము ననువదించి దూషించిరి. అలాగేకదా—

"నరసింహ ధరానాథ" మొ. (ఓ నరసింహరాజా! నీ వర్ణనకు మేము ఎవ్వరము? రాజును గూడ ఆక్రమించి యెవ్వని కీర్తి విజృంభించునో) ఇచట రాజపదముచేత విషయమగు చంద్రుడు నిర్దేశింపబడెను. అచట నాథో

పింపబడు నృపుడాక్రమణరూపమగు కార్యమున నుపయోగించునట్లు స్ఫురించుటవలన పరిణామము వ్యంగ్యమగును అని. అది యుక్తముగాదు. అచట నారోపింపబడు నృపుడు నృపుడుగానే నాక్రమణలో నుపయోగించును. చంద్రుడుగాగాదు. అని" – అది సరికాదు. ఇచట విజృంభణ మనగా కేవల ప్రాగల్భ్యముమాత్రము అని కవి కథితమతముకాదు. అశ్లేయకుచో యశస్సునాక్రమించుటలో నృపుడు స్వరూపముతోనే కర్మగా నుపయోగించును. ఇక నేమనగా నిరతిశయనైర్మల్యగుణవత్త్వములో తనతో సమానుడగు రెండవవాడు లేకుండుటవల్ల నేర్పడు ప్రౌఢివిశేషము. ఆక్రమణమనగా తిరస్కారమే ఈ తీరున విజృంభణములో చంద్రునాక్రమించుటయే నుపయోగించును. అంతేకాని నృపునాక్రమించుట ఉపయోగించదు. కనుక విషయిగా వ్యంగ్యమగుచున్నను నృపుడు చంద్రుడుగానే నాక్రమణలో నుపయోగించును కనుక విద్యాధరుడు నుడివిన పరిణామధ్వన్యుదాహరణము రమణీయమే.

యదపి తైరేవ పరోక్తిం దూషయిత్వా స్వయం పరిణామస్య వ్యఙ్గ్యతాయాముక్తమ్—.

"చిరాద్విషహసే తాపం చిత్త చిన్తాం పరిత్యజ
నన్వస్తి శీతలః శౌరేః పాదాబ్జనఖ చన్ద్రమాః"

అత్ర చిరతాపార్తం ప్రతి హరిపాదనఖ చన్ద్ర సద్భావదర్శనేన తమేవ నిషేవస్వ, తన్నిషేవణాదయం తవ తాపః శాన్తిమేష్యతీతి పరిణామోవ్యజ్యతే" ఇతి తత్తుచ్ఛమ్. "ఆరోప్యమాణస్య విషయాత్మకత్వేన ప్రకృతకార్యోపయోగే పరిణామః" ఇతి స్వయమేవోక్తమ్. తత్ర ప్రకృతకార్యోపయోగమాత్రం న పరిణామశరీరమ్. అపితు విషయిగతాయాః ప్రకృతకార్యోపయోగితాయా అవచ్ఛేదకీభూతం విషయతాద్రూప్యమ్,ఏవంచాత్ర నఖచన్ద్రసద్భావప్రదర్శనేన తన్నిషేవణాదయం తవ తాపః శాన్తిమేష్యతీతి ప్రకృతోపయోగితాయా వ్యఙ్గ్యత్వేఽపి తదవచ్ఛేదకీభూతస్య విషయిణో విషయతాద్రూప్య రూపస్య పరిణామస్య వాక్యవాచ్యత్వాత్ శక్యసంసర్గత్వాద్వా సర్వథైవ వ్యఙ్గ్యత్వం వక్తుమనుచితమ్.

అదియుగాక వారే పరునిమాటను దూషించి తామే స్వయముగా పరిణామము వ్యంగ్యమగుట కుదాహరణము చెప్పిరి.

"చిరాద్విషహసే" మొ. (ఓ మనసా! చిరకాలమునుండి తాపము సహించుచున్నావు, చింతను విడువుము, చల్లని శౌరియొక్క పాదపద్మముల యందలి గోరులనెడి చంద్రుడున్నాడుగదా). ఇచట చిరతాపార్తమును గూర్చి "హరిపాదాబ్జనఖచంద్రసద్భావ ప్రదర్శనముచేత నాతనినే సేవిం చుము. ఆయనను సేవించుటవలన నీ తాపము శాంతినొందగలదు. అని పరిణామము ధ్వనించును" అని, అది తుచ్ఛము.

'ఆరోపింపబడునది విషయరూపమున ప్రకృతకార్యములో నుపయో గించిన పరిణామము' అని తానే స్వయముగా జెప్పెను. అందులో ప్రకృత కార్యమున నుపయోగపడుటమాత్రము పరిణామమునకు శరీరముగాదు. ఇకనేమనగా విషయి ప్రకృతకార్యమున, నుపయోగించుటకు నిర్ణాయకమగు విషయతాద్రూప్యమే. కాగా నిచట నఖచంద్రుడున్నాడని ప్రదర్శించుటచేత 'తన్నిషేవణమువలన నీతాపము శాంతి బొందగలదు' అని ప్రకృతోప యోగము వ్యంగ్యమైనను తన్నిర్ణాయకమైన విషయియందువిషయతాద్రూప్య రూపమగు పరిణామము వాక్యముచే, వాచ్యమగుటవలనగానీ, శక్యసంపర్గ మగుటవల్లగానీ ఏతీరుననైనను వ్యంగ్యమని చెప్పుట యుచితముకాదు.

ఇదం తూదాహరణం యుక్తమ్ —

"ఇన్దునా పరసౌన్దర్య సిన్ధునా బన్ధునా వినా
మమాయం విషమస్తాపః కేన వా శమయిష్యతే".

అత్ర వక్తుర్విరహితయా వ్యజ్యమానరమణీ వదనాభిన్నత్వేనేన్దు రభిప్రేతః, తేన రూపేణైవ తస్యప్రకృతవిరహసన్తాపశమనహేతు త్వాత్' నచాత్ర విషయనిగరణాత్మికాతిశయోక్తి ర్వక్తుం శక్యా, తస్యాం హ్యారోప్యమాణాభిన్నత్వేన విషయస్య ప్రత్యయాత్. యథా 'కమలం కనకలతాయామ్' ఇత్యాదౌ కనకలతాభిన్నాయాం వనితా యాం కమలాభిన్నం ముఖమితి. ఇహ తు ముఖస్యచన్ద్రాభిన్నత్వేన ప్రత్యయే నపునర్విరహతాప శమనరూప ప్రకృతకార్యసిద్ధిరితి చన్ద్ర స్యారోప్యమాణస్య ముఖవిషయాభిన్నత్వం మృగ్యమ్, తచ్చ వ్యఙ్గ్య

తాయామేవ భవతీతి పరిణామధ్వని రేవేయమ్; నాతిశయోక్తిః. అయం త్వర్థశక్తి మూలః.

ఇదిమాత్ర ముదాహరణము.

"ఇందునా" మొ. (గొప్ప సౌందర్యమునకు సముద్రమైన చంద్రుడనెడు బంధువులేకుండా నా యీతాపము యెవ్వనిచే చల్లార్పబడును.) ఇచట వక్త విరహాతురుడగుటచే వ్యంగ్యమగుచున్న రమణీవదనముతో నభిన్నుడుగా నిందు డభిమతుడు. ఆరూపముతో నీతడు ప్రకృతమగు రమణీవిరహాసంతాపము నణచగలడు. ఇచట విషయనిగీర్ణాత్మయగు నతిశయోక్తి యనరాదు, దానియం దారోప్యమాణాభిన్నముగా విషయము స్ఫురించవలెనుగదా? ఎట్లనగా— 'కమలం కనకలతాయాం' ఇత్యాదియందు కనకలతాభిన్నయగు వనితయందు కమలాభిన్నమగు ముఖము అని. ఇటనో ముఖము చంద్రునితో నభిన్నముగా దెలియుటలో విరహాతాపశమన రూపము ప్రకృతకార్యము సిద్ధింపదు. అందువలన నారోప్యమాణుడగు చంద్రునకు ముఖరూపవిషయములో నభిన్నుడగుట అన్వేషింపదగినది. అదియు వ్యంగ్యత్వములోనే యగును^కనుక పరిణామధ్వనియే ఇది. అతియోక్తిగాదు. ఇది అర్థశక్తి మూలమైనది.

శబ్దశక్తిమూల పరిణామధ్వనిర్యథా —

'పాన్థ మన్దమతే కింవా సన్తాపమనువిన్దసి
పయోధరం సమాశాస్వ యేన శాన్తిమవాప్స్యసి'.

అత్ర ఝటితి తాపశమహేతుత్వేనోపస్థితే పశ్చాన్మన్ద (మతి) పద బోధనీయ విశేష్యక స్మరతాపవత్త్వావైశిష్ట్య బుద్ధా సత్యాం సహృదయస్య తాదృశతాపశామకరమణీస్తనరూప విషయతాద్రూప్య బుద్ధి ర్భవతి. దోషాశ్చాత్ర పూర్వవదున్నేయాః

శబ్దశక్తిమూల పరిణామధ్వని యెట్లనగా—

"పాంథ" మొ. (ఓపాంథుడా! మందమతీ! ఎందుకు సంతాపము బొందెదవు? పయోధరమును ఆశించుము. దీనిచే శాంతిని బొందెదవు.) ఇచట ఝట్ అని తాపశమన హేతువుగా నుపస్థితమైనదానియందు, తరువాత

మందపదబోధనీయ విశేష్యకస్మరతాప వైశిష్ట్యబుద్ధి కలుగగా సహృదయునకు నటువంటి తాపము నుశమింపజేయునట్టి రమణీస్తనరూపమగు విషయముతో తాద్రూప్యబుద్ధి గల్గును. ఇచటగూడ దోషములు వెనుకటివలె యూహించవలెను.

ఇది పరిణామప్రకరణము.

## ససందేహః

స. ప్రసన్దేహః- సాదృశ్యమూలా భాసమాన విరోధకా సమబలా నానాకోట్యవగాహినీ ధీ రమణీయా ససన్దేహాలఙ్కృతిః.

'అధిరోప్య హరస్య హన్త చాపం
పరితాపం ప్రశమయ్య బాన్ధవానామ్
పరిణేష్యతి వా న వా యువాఽయం
నిరపాయం మిథిలాధినాథపుత్రీమ్.'

అత్ర మిథిలాస్థ జనకోక్తౌ తచ్చిన్తాభివ్యఞ్జకే సంశయమాత్రేఽతివ్యాప్తివారణాయ సాదృశ్యమూలేతి. సాదృశ్యజ్ఞానరూపదోషజన్యేత్యర్థః. తేన 'సింహవత్ ప్రాన్తరం గచ్ఛ గృహం సేవస్వ వా శ్వవత్' ఇత్యుపమావికల్పే వాకారప్రతీతి విరోధకప్రాన్తరగమన గృహసేవన రూప నానాధర్మావగాహిని సాదృశ్యవిషయకేఽపి నాతిప్రసఙ్గః. తస్య సాదృశ్యజ్ఞానరూపత్వాత్. మాలారూపక ప్రసంగ వారణాయ భాసమాన విరోధకేతి. ఉత్ప్రేక్షావ్యావృత్తయే సమబలేతి సమాన భాసకసామగ్రీ కత్వార్థకమ్. ఏతద్విశేషణద్వయప్రాప్తస్యైవానేకత్వస్య స్ఫుటత్వార్థం నానేతి. స్థాణుర్వా పురుషో వేతి లౌకిక సంశయనివృత్తయే రమణీయేతి; చమత్కారిణీత్యర్థః. ఏతచ్చ విశేషణం సామాన్యాలఙ్కార లక్షణప్రాప్తమేవ, ఏవముపస్కారకత్వమపి బోధ్యమ్. ఏతద్విశేషణద్వయస్య సాదృశ్యమూలత్వస్య చాభావే సంశయమాత్రమేవ.

సాదృశ్యమూలము, భాసించు విరోధము, సమబలము ననేకకోటుల నవగాహించునట్టి బుద్ధి రమణీయ, ససందేహాలంకృతి.

"అధిరోప్య" మొ. (హరుని విల్లునెక్కిడి బంధుల పరితాపమణచి యీ యువకుడు మిథిలాపురనాథుని కుమార్తెను - సీతను నిరపాయముగా పెండ్లి చేసుకొనునా ? లేదా !) ఇచట మిథిలయందుండు జనము మాటలలో వారి హృదయములందలి చింతను వ్యక్తపరచుచు సంశయమాత్రమునఁ దతివ్యాప్తి వారించుటకై సాదృశ్యమూలకమని సాదృశ్యజ్ఞానరూపకమగు దోషము నుండి కలిగినది అని అర్థము.

అందువలన

"సింహావత్రాప్వంతరంగచ్ఛ గృహం సేవస్వ పౌశ్వవత్" అని ఉపమా వికల్పమునందు, "వా" కారమున ప్రతీతమగు విరోధముగల ప్రాంతరగమన గృహసేవారూప నానాధర్మముల నవగాహించుదానిలో, సాదృశ్యవిషయ కమునం దతివ్యాప్తి రాదు. అది సాదృశ్యజ్ఞానరూపము కదా ? మాలా రూపకమున నతివ్యాప్తి వారించుటకై విరోధము భాసించునదియు నని. ఉత్ప్రేక్షయం దతిప్రసంగము వారించుటకై సమబలమని. సమానముగా భాసింప జేయు సామగ్రి కలదని యర్థము. ఈ విశేషణముల రెంటివల్ల ప్రాప్తమైనదే అనేకత్వము. అది స్ఫుటమగుటకే నానాకోటుల నవగాహించునది యని "స్థాణువా? పురుషుడా" అని లౌకికసంశయముల నివర్తించుటకై రమణీయ మని చమత్కారము గల్గించునది యని అర్థము. ఈ విశేషణము సామాన్యాలంకారలక్షణమునుండి ప్రాప్తమైనదే. ఇలాగే ఉపస్కారకత్వమున్ను తెలియవలెను. ఈ విశేషణములు రెండునూ సాదృశ్యమూలత్వమున్నూ లేనిచో సంశయమాత్రమే.

యద్వా 'సాదృశ్యహేతుకా నిశ్చయ సంశయాన్యతరభిన్నా ధీరమణీయా సంశయాలఙ్కృతిః'. సాచ శుద్ధా, నిశ్చయగర్భా, నిశ్చయాన్తా చేతి త్రివిధా, ఆద్యా యథా —

"మరకతమణి మేదినీధరో వా
తరుణతర స్తరురేష వా తమాలః,
రఘుపతి మవలోక్య తత్ర దూరా
దృషి నికరై రితి సంశయః ప్రపేదే".

ద్వితీయా యథా—

"తరణితనయా కింస్యాదేషా న తోయమయీ హి సా
మరకత మణిజ్యోత్స్నా వా స్యాన్న సా మధురా కుతః
ఇతి రఘుపతేః కాయచ్ఛాయా విలోకన కౌతుకై -
ర్వనవసతిభిః కైః కైరాదౌ న సన్దిదిహే జనైః".

తృతీయా యథా—

'చపలా జలదాచ్చ్యుతా లతా వా
తరుముఖ్యాదితి సంశయే నిమగ్నః.
గురునిఃశ్వసితైః కపిర్మనీషీ
నిరణైషీదథ తాం వియోగినీతి".

ఏషుసంశయేషు మఞ్జూషాదిగత కటకాదిష్వివాలఙ్కార వ్యప
దేశః, ఏవంచ—

'తం దృష్టవాన్ ప్రథమముద్భుతధైర్యవీర్య
గామ్భీర్య మతుణవిముక్త సమీపజానిమ్.
వీక్ష్యాథ దీనమబలావిరహవ్యథార్తం
రామోనవాఽయమితి సంశయమాప లోకః'

ఇత్యత్ర సత్యపి చమత్కారే సాదృశ్యమూలత్వాభావాన్న
సంశయస్యాలఙ్కారత్వమ్. ఏవమారోపమూలోఽయం సన్దేహాల
ఙ్కారః

అథవా - సాదృశ్యమూలకమై నిశ్చయ సంభావనాన్యతరభిన్నమైన
బుద్ధి, రమణీయము సంశయాలంకృతి.

ఆబుద్ధి శుద్ధయు - నిశ్చయగర్భయు - నిశ్చయాన్తయు అని మూడు
విధములు.

మొదటిది ఎట్లనగా—

"మరకత" మొ. (మరకత మణిభూధరమా, లేక మంచి నడుకారు
తమాలతరువా అని శ్రీరామచంద్రుని గురించి దూరమునుండి చూచి
ఋషులు సందేహమును పొందిరి.)

రెండవది యెట్లనగా—

"తరణితనయా" మొ. "ఇది సూర్యునికుమార్తె యగునా (యమునా నది యగునా) అలా కాదు అది తోయమయమేకదా! మరకతమణియొక్క కాంతి యగునా? అది కాదు. అది మధురమైనది యెందువలన? అని రాఘవుని శరీరకాంతిని చూచుటయందు కౌతూహలము గలిగిన, అడవిలో నున్న యెవరెవరు సంశయపడలేదు?"

మూడవది యెట్లనగా—

"చపలా" మొ. "మేఘమునుండి జారిన మెరుపుతీగయా! ముఖ్యమగు తరువునుండి జారిన తీవెయా? అనే సంశయమున మునిగి బుద్ధిమంతుడగు హనుమంతుఁడు గొప్ప నిట్టూర్పులచే ఆమె వియోగిని అని నిశ్చయించెను."

ఈ సంశయములందు మంజూషాది గతములగు కటకాదులందువలె నలంకార వ్యపదేశము-

ఈ తీరున—

'తం దృష్టవాన్' .(మొట్టమొదట అద్భుతమగు ధైర్యము వీర్యము గాంభీర్యము గలిగి ఒక్కనిముషముగూడ సమీపమును విడువని భార్యగల అతనిని జూచినదై యిప్పుడు దీనుడై స్త్రీవిరహ వ్యథచే ఆర్తుడైనవానిని చూచి యితడు రాముడగునా కాడా యని ప్రపంచము సంశయము బొందెను.)

ఇత్యాది శ్లోకమున చమత్కారమున్నను సాదృశ్యమూలకము గాక పోవుటవలన సంశయాలంకారత్వము లేదు.

ఈ తీరుగా నిది ఆరోపమూలక సందేహాలంకారము.

**అధ్యవసానమూలోఽపి దృశ్యతే. యథా —**
**"సిన్దూరైః పరిపూరితం కిమథ వా లాక్షారసైః క్షాలితం**
**లిప్తం వా కిము కుఙ్కుమద్రవభరైరేతన్మహీమణ్డలమ్.**
**సన్దేహం జనయన్నృణామితి పరిత్రాతత్రిలోకస్త్విషాం**
**వ్రాతః ప్రాతరుపాతనోతు భవతాం భవ్యాని భాసాంనిధేః."**
**అయం చ సంశయః సవితృవిషయకరతిపరిపోషకతయా కామినీకరగత కఙ్కణాదిరివ ముఖ్యతయాఽలఙ్కృతి వ్యపదేశ్యః.**

అత్ర చ వివక్షిత వివేచనే క్రియమాణే కిరణవ్రాతే సిన్దూరత్వాది కోటికః సంశయః పర్యవస్యతి. స చ న సారోపః; విషయ విషయిణో స్తదనుకూలవిభక్తేరభావాత్. అతః సిన్దూరత్వాదినా సంశయధర్మి కిరణవ్రాతో౽ధ్యవసీయత ఇతి. అత్రవిచార్యతే—సిన్దూరైః పరిపూరితం కిమథవేతి పద్యే భావత్సిన్దూరాదికరణక పరిపూరితత్వాది కోటికో జగన్మణ్డలధర్మికః సంశయః శబ్దాత్ప్రతీయతే. తస్మింశ్చ సంశయే కిమిదం సిన్దూరరజో వా స్యాత్, ఆహోస్విల్లాక్షారసః, ఉతాహో కుఙ్కుమద్రవః ఇతి సూర్యకిరణధర్మికం సంశయాన్తరమానుగుణ్యా మాధత్తే. యథా పురోవర్తిని తురగే స్థాణుర్వా పురుషోవేతి సంశయో భూతలమిదం స్థాణుమత్పురుషవద్వేతి సంశయే. ఏవఞ్చ సూర్యకిరణధర్మికః సంశయో గుణీభూతః వ్యఞ్జనాగమ్యత్వాద్విషయ విషయిణో రారోపానుకూల విభక్తికత్వాం నాపేక్షతే, అపేక్షతే.చ సాక్షాచ్ఛబ్దవేద్యతాయామితి కుత్రాధ్యవసానమూలితా సంశయస్య. ఏతేనాధ్యవసానమూలితాం సంశయస్య నిరూపయతో విమర్శినీకార స్యోక్తి రపాస్తా.

అధ్యవసానమూలముగాను కన్పట్టును. ఎట్లనగా—

"సిందూరైః" మొ. "ఈ మహీమండలము సిందూరముచే అంతటను నిండింపబడినదా! అథవా ద్రాక్షారసములచే కడుగబడినదా! కుంకుమ ద్రవముయొక్క సమూహములచే పూయబడినదా! అని సంశయమును మనుష్యులకు కలిగించుచూ మూడులోకములను కాపాడినదై సూర్యుని ప్రాతఃకాలమునందలి కాంతుల సమూహము మీకు శుభములను చేయుగాక!"

ఈ సంశయము సూర్యునిగురించి కవిప్రీతిని పోషించుచున్నందువల్ల కామినీకరమునందున్న కంకణమువలె ముఖ్యముగా నలంకృతియని వ్యప దేశము. ఇచట వివక్షితమగు వివేచనము క్రియమాణమగుచుండగా కిరణ వ్రాతమున సిందూరాదులు కోటిగాగల సంశయము తేలును. అది ఆరోపము గలది గాదు. విషయ విషయులకు నారోపమున కనుకూలమైన విభక్తి లేదు కనుక. ఇందువలన సిందూరత్వము మొదలైన దానిచేత సంశయమున విశే ష్యము కిరణవ్రాతము నధ్యవసాన మొనర్పబడును అని.

ఈ విషయము విచారించబడును.

"సిందూరైః పరిపూరితం కిమథవా" అను పద్యమునందు సిందూరాది కరణక పరిపూరితత్వాది కోటికము జగన్మండల ధర్మికము నగు సంశయము శబ్దమువలన స్ఫురించును.

ఆ సంశయమునందు ఇది సిందూర రజమగునా, లేక ద్రాక్షారసమా ? అథవా కుంకుమద్రవమా ? అని సూర్యకిరణములు విశేష్యముగా నుండు సంశయాన్తరము అనుగుణ్యమును వహించును. ఎట్లనగా - ముందుండు గుట్టమున స్థాణువా పురుషుడా అను సంశయము భూతలమది స్థాణువుగలదా, లేక పురుషుడు గలదా? అను సంశయమున.

ఈ తీరున సూర్యకిరణములు విశేష్యముగా నుండు సంశయము గుణీభూతమై వ్యంజనాగమ్యమగుటవలన విషయ విషయులకు నారోపమున కనుకూలమైన విభక్తుల నపేక్షింపదు. సాక్షాత్తుగా శబ్దమే చెప్పునపుడుమాత్ర మపేక్షించును. కనుక, సంశయమెక్కడ నధ్యవసానమువలన నేర్పడును ? ఇందువలన సంశయ మధ్యవసానమూలకము అని నిరూపించు విమర్శినీకారుని మాట నిరాకరించటమైనది.

అప్పయదీక్షితాస్తు —

"అస్యాః సర్గవిధౌ ప్రజాపతిరభూ చ్చన్ద్రోను కాన్తిప్రదః
శృఙ్గారైకరసః స్వయం ను మదనో మాసో ను పుష్పాకరః
వేదాభ్యాసజడః కథం స విషయవ్యావృత్తకౌతూహలో
నిర్మాతుం ప్రభవేన్మనోహరమిదం రూపం పురాణో మునిః"

ఇత్యత్ర చన్ద్రాదీనాం సన్దేహధర్మిణా మేవా నేకత్వమ్, ప్రకారస్తు వర్ణనీయ వనితాస్రష్టృత్వమేక మేవేత్యనేక కోటికత్వా భావాద్విరోధేన పరస్పర ప్రతిక్షేపకతయా నిబద్ధానేకకోట్యవగాహిత్వ రూపస్య సంశయ లక్షణస్యావ్యాప్తిమాహుః. తన్న. అత్ర హి అస్యాః సర్గవిధౌ యః ప్రజాపతిరభూత్స కిం చన్ద్రః, కిం ను మదనః, కింవా ను వసన్త ఇతి సంశయః ప్రజాపతిధర్మిక శ్చన్ద్రత్వాది నానాకోటిక ఏవేతి కుత్రావ్యాప్తిః? న చాత్ర చన్ద్రాదిధర్మికః సంశయో యుక్తో వక్తుమ్. ఏవం చ ప్రజాపతేః ప్రథమోద్దేశో న స్యాత్.

యదపి 'సామ్యాదప్రకృతార్థస్య యా ధీరనవధారణా' ఇతి ప్రాచాం లక్షణం మహతా ప్రబన్ధేన త ఏవ దూషితవన్తః, తదపి న. సామ్యనిమిత్తా నిశ్చయసంభావనాన్యతరభిన్నా యా ధీరితి తదర్థ కరణే దోషాభావాత్. నిశ్చయత్వం తు సంశయాఘటిత మేవ నిర్వాచనీయమ్.

అప్పయ్య దీక్షితులైతే —

'అస్యాస్సర్గవిధౌ' మొ. (ఈమెను సృష్టి జేయుటలో కాంతినిచ్చెడి చంద్రుడు ప్రజాపతి యైనాడా! శృంగారైకరసుడగు మన్మథుడే స్వయముగా నైనాడా, లేక వసంతుడా? వేదములను జదువుటచే జడుడై విషయ కౌతూహలము దొలగిపోయిన ఆ ముని (నారాయణుడు) అందమైన యీ రూపము నిర్మించుట కెట్లు సమర్థుడగును ?)

ఇత్యాది శ్లోకమునందు చంద్రాదులు సందేహమున ధర్ములే అనేకులు. ప్రకారమైతే వర్ణనీయ వనితా స్రష్టృత్వమొకటియే నని అనేక కోటులు లేవుగనుక విరోధముచేత ఒకదానిచే నొకటి త్రోసివేయబడినట్లుగా గూర్చబడిన అనేక కోట్యవగాహిత్వ రూపమగు సంశయలక్షణమునకవ్యాప్తిని జెప్పిరి. అది కూడదు. ఇక్కడ ఈమె సృష్టిలో నెవడు ప్రజాపతియో అతడు చంద్రుడా ? లేక మదనుడా ? అథవా వసంతుడా ? అని సంశయము. అందు ప్రజాపతి విశేష్యముగాను చంద్రత్వాదులు నానాకోటులుగానే యున్నవని అవ్యాప్తి యెక్కడ ? ఇచట చంద్రాది ధర్మికము అగు సంశయము కుదురదు. అలాగైతే - ప్రజాపతిని మొట్టమొదట నుద్దేశించుట కుదురదు అంతేగాక -

"సామ్యాదప్రకృతార్థస్య యా ధీరనవధారణా"—

(సామ్యమువలన ప్రకృతార్థమునకు అనిశ్చయము సంశయము) అని ప్రాచీనుల లక్షణమును గొప్ప పట్టుబట్టి వారే దూషించిరి. అదియు తప్పే? సామాన్య నిమిత్తమైన నిశ్చయ సంభావనాన్యతరభిన్నమగు బుద్ధి అని అర్థ మొనర్చినచో తప్పేమియు నట లేదే ? ఇట నిశ్చయత్వమును సంశయము గూర్చకయే నిర్వచింపవలెను.

ఉక్తేషూదాహరణేషు సోఽయం సంశయాలంకారః స్వశబ్ద వేద్యత్వా ద్వాచ్యః. లక్ష్యో యథా—

'సామ్రాజ్యలక్ష్మీరియమృష్యకేతోః సౌందర్యసృష్టేరధిదేవతా వా.
రామస్య రామామవలోక్య లోకై రితి స్మదోలారురుహే తదానీమ్"

అత్ర పర్యాయేణోభయకోట్యాలంబనతయా దోలాసాదృశ్యాత్ సంశయోఽత్రదోలాశబ్దేన లక్ష్యతే. వ్యంగ్యోఽయం యథా-

"తీరే తరుణ్యా వదనం సహాసం నీరే సరోజం చ మిల ద్వికాసమ్
ఆలోక్య ధావత్యుభయత్ర ముగ్ధా మరందలుబ్ధాలికిశోరమాలా."

అత్ర కమలధర్మికోఽభేదేన సంసర్గేణ పురోవర్తి వ్యక్తి ద్వయ ప్రకారకః కమలమిద మిదం వేతి భ్రమరగతః సంశయో వ్యంగ్యః. న చ కమలాభేదబుద్ధేర్ భ్రమరప్రవృత్త్యుపాయతయాపేక్షణాదిదం పదార్థాభేదబుద్ధిర్ నిరర్థకేతి వాచ్యమ్. ఏకపదార్థధర్మికాపర పదార్థాభేదబుద్ధేరపరపదార్థధర్మికైక పదార్థాభేదబోధప్రయోజకత్వేన కమలాభేదబోధసామ్రాజ్యాత్. కమలత్వమేతద్వృత్తి తద్వృత్తి వేతి సంశయాకారః. సోఽయం సంశయ ధ్వనిః.

"ఆజ్ఞా సుమేషోరవిలంఘనీయా
కిం వా తదీయా నవచాపయష్టిః,
వనస్థితా కిం వనదేవతా వా
శకుంతలా వా మునికన్యకేయమ్."

యద్యప్యత్రాపి వాచక శబ్దాభావాద్ వ్యంగ్య ఏవ భవితు మర్హతి సంశయః, తథాపి విషయనిరూపణేన స్ఫుట మావేదిత త్వాన్న ధ్వనివ్యపదేశహేతుః, అపి తు గుణీభూతవ్యంగ్యప్రభేదవ్యప దేశస్య, అనుగామీ చాత్ర ప్రతిప్రకారం పృథగేవ నిర్దిష్టః,

చెప్పిన యుదాహరణములలో ఈ సంశయాలంకారము స్వశబ్ద వేద్యముగాన వాచ్యము.

లక్ష్య మెట్లనగా—

"సామ్రాజ్య లక్ష్మీః" మొ. (మన్మథునియొక్క సామ్రాజ్యలక్ష్మియా సౌభాగ్యసృష్టియొక్క అధిదేవతయా యీామె యని రామునిభార్యను జూచి లోకులు డోల నధిష్ఠించిరి.)

పై శ్లోకమున క్రమముగా నుభయకోటుల నవలంబించుటచే డోలా సాదృశ్యమువల్ల సంశయము. ఇట డోలాశబ్దముచే లక్షింపబడును.

వ్యంగ్య మెట్లనగా—

"తీరే తరుణ్యాః" మొ. (తీరమునందలి పడుచుయొక్క నవ్వుతో కూడిన వదనమును, నీటియందుంచిన సరోజమును జూచి రెండుచోట్లకును మకరందమునందు లోభముగల తుమ్మెదలబారు మూఢమైనదై పరుగిడు చున్నది.)

ఇచట గమలమను ధర్మితో నభేద మను సంబంధముచే ముందున్న రెండువ్యక్తులు ప్రకారముగాగల్గిన కమలమదియా, ఇదియా యని భ్రమరము నకు గల్గిన సంశయ మిట వ్యంగ్యము. అయితే కమలాభేదబుద్ధి భ్రమర ప్రవృత్తికి ఉపాయముగా నపేక్షింపక దప్పదుగనుక ఇదంపదార్థాభేదబుద్ధి నిరర్థకము గాదనెదరా ? ఒక పదార్థమందు మరొక పదార్థముయొక్క అభేదబుద్ధి ఏకపదార్థ ధర్మికమగు అపరపదార్థ భేదబోధను ప్రయోగించును గనుక కమలాభేదబుద్ధి బాగా నుద్భవించునుగదా ? కమలత్వము దీని యందున్నదా, దానియందున్నదా అని సంశయమున కాకారము. ఇది సంశయధ్వని-

"ఆజ్ఞా సుమేషోః" మొ. (మన్మథునియొక్క దాటరాని ఆజ్ఞయా, లేదా అతని సంబంధించిన నవచాపయష్టియా; వనమునందుండు వనదేవతయా, శకుంతలయా; యీా మునికన్యక యెవరు ?)

ఇచటనుగూడ వాచకమగు శబ్దము లేదుగనుక సంశయము వ్యంగ్యమే గాదగియున్నది. అయినను విషయ నిరూపణముచే స్పష్టముగా దెల్ప బడినదిగనుక ధ్వనియని వ్యపదేశము రాదు. కాని ఈ స్థలమును గుణీభూత వ్యంగ్య ప్రభేదముగా గణింపదగును. ఇచట ననుగామియు, ప్రతిప్రకారము నందును వేరుగానే నిర్దేశింపబడెను.

యత్తు చిత్ర మీమాంసాయాం సంశయధ్వన్యుదాహరణప్రసంగే అప్పయదీక్షితాః —

"కాంచిత్ కాంచనగౌరాంగీం వీక్ష్య సాక్షాదివ శ్రియమ్.
వరదః సంశయాపన్నో వక్షః స్థలమవైక్షత."

అత్ర సంశయస్యశబ్దోపాత్తత్వేఽపి తావన్మాత్రస్యానలంకారత్వాత్తదలంకారతాప్రయోజకస్య వక్షఃస్థలే స్థితైవ లక్ష్మీస్తతోఽవతీర్య పురస్థితేత్యేవం సంశయాకారస్య వక్షఃస్థలమవైక్షతేత్యనేన వ్యంగ్యత్వాత్ సందేహాలంకారధ్వనిరత్రేతి. యథా—

"దర్పణే చ పరిభోగదర్శినీ పృష్ఠతః ప్రణయినో నిషేదుషః
వీక్ష్య బింబమనుబింబమాత్మనః కాని కాన్యపి చకార లజ్జయా"

ఇత్యత్ర కానికాన్యపీతి సామాన్యతో నిర్దిష్టానుభావవిశేష—ప్రతీత్యర్థం లజ్జాశబ్దప్రయోగేఽపి తస్యాః స్వవిభావానుభావాభ్యామ్ రసాన గుణాభివ్యక్తిరూపో ధ్వనిః" ఇత్యాహుః.

చిత్ర మీమాంసలో సంశయధ్వని నుదాహరించు ప్రసంగమున అప్పయ్య దీక్షితులు—

"కాంచిత్" (బంగారువలె గౌరవర్ణముగల శరీరముతో సాక్షాత్తు లక్ష్మివలె నున్న ఒక కాంతనుజూచి సంశయము బొందినవాడై వరదుఁడు వక్షస్థలమును జూచుకొనెను.)

ఇత్యాది శ్లోకమున సంశయము శబ్దముచే గ్రహింపబడినను అంత మాత్రము అలంకారము గాదుకావునను, ఆ యలంకారమునకు ప్రయోజకమగు "వక్షస్థలమున నున్నదే లక్ష్మి, అచటనుండి దిగి ముందున్నది" అను తీరున సంశయాకారము వక్షస్థలమును జూచెను అనుటచేత వ్యంగ్యముగనుక సందేహాలంకార ధ్వనియని ఎట్లనగా—

"దర్పణేచ" (అద్దమునందు పరిభోగమును చూచినదై పార్వతి వెనుక ప్రియుడు కూర్చొనియుండగా తనబింబము ననుసరించిన ఆతని బింబమును చూచి ఏవేవో సిగ్గుతో (పనులను) జేసెను.)

ఇత్యాది శ్లోకమున కానికాన్యపి అని సామాన్యముగా నిర్దేశింపబడిన అనుభావ విశేషముల ప్రతీతికొరకై లజ్జాశబ్దమును ప్రయోగించినను, దాని యొక్క విభావానుభావములచే రసానుగుణాభివ్యక్తిరూపమైన ధ్వని అనిరి.

తదేతద్ ధ్వనిమర్మాజ్ఞైరుపహాసనీయమేవ. తథాహి-సంశయా విష్ట ఇత్యత్ర సంశయపదే నైకస్మిన్ పదార్థే విరుద్ధనానాపదార్థ - సమ్బన్ధావగాహిజ్ఞానం సాక్షాదేవ నివేద్యతే. తత్ర కోఽసౌ విరుద్ధ నానార్థ ఇతి విశేషాకాంక్షాయామ్ వక్షఃస్థలావేక్షణేన వక్షస్థలస్థైవ లక్ష్మీస్తతోఽ వతీర్య కిం పురస్తిష్ఠతీత్యాదిరర్థో వ్యంజనావ్యాపారేణ బోధ్యమానః శక్త్యా సంశయశబ్దనివేదితజ్ఞానవిశేషణీభూతేన సామాన్యార్థేన సాకమభేదేన పర్యవస్యతి. ఏవంచ సంశయ మాత్రస్య శక్త్యా బోధనా ద్వక్షః స్థలస్థితైవేత్యాది విషయభాగస్యాపి విరుద్ధనానార్థత్వేన సామా న్యాకారేణావలీఢతయా తస్యైవ కవలీకరణా ద్వాచ్యార్థసంశయప ర్యవసాయకత్వాచ్చ న కస్యాపి ధ్వనివ్యపదేశహేతుత్వం యుక్తమ్. సర్వథా వాచ్యవృత్త్యచుంబితస్యైవ తథాత్వమితి ధ్వనిమార్గ ప్రవర్తకైః సిద్ధాంతితత్వాత్.

తథా చ ద్వితీయోద్ద్యోతే—

"శబ్దార్థ శక్త్యాక్షిప్తోఽపి వ్యంగ్యోఽర్థః కవినా పునః
యత్రావిష్క్రియతే స్వోక్త్యా సాన్యైవాలంకృతిర్ధ్వనేః."

ఇతి సూత్రయిత్వా—

"సంకేతకాలమనసం విటం జ్ఞాత్వా విదగ్ధయా,
హాసన్నేత్రార్పితాకూతం లీలాపద్మం నిమీలితమ్."

అత్ర సంకేతకాలమనసం జ్ఞాత్వా లీలాపద్మం నిమీలితమితి వదతా కవినా లీలాపద్మనిమీలనస్య ప్రదోషాభివ్యంజకత్వం స్వోక్త్యైవ నివేదితమితి ధ్వనిమార్గాదయమపర ఏవ గుణీభూతవ్యంగ్యస్య మార్గః. యథావా—

"అంబా శేతేఽత్ర వృద్ధా పరిణతవయసామగ్రణీరత్ర తాతో
నిఃశేషాగారకర్మశ్రమశిథిలతనుః కుంభదాసీ తథాత్ర.
అస్మిన్ పాపాహమేకా కతిపయదివసప్రోషితప్రాణనాథా
పాంథాయేత్థం తరుణ్యా కథితమవసరవ్యాహృతివ్యాజపూర్వమ్."

అత్ర నిఃశంకం రంతుమాయాహీత్యర్థశ్చరణత్రయ వ్యంగ్యోఽప్య వసరవ్యాహృతే ర్వ్యాజత్వమ్ బ్రువతా కవినా స్ఫుటం స్వోక్త్యా నివేదిత ఇత్యస్య మపి నధ్వనేర్మార్గః ఇత్యాహురానంద వర్ధనాచార్యాః

తృతీయోద్ద్యోతే చ గుణీభూత వ్యంగ్య నిరూపణే "వ్యంగ్య స్యార్థస్య యది మనాగప్యుక్త్యా ప్రకాశనం తదా గుణీభావ ఏవ శోభతే. తస్మాద్యత్రోక్తిం వినా వ్యంగ్యోఽర్థస్తాత్పర్యేణ ప్రతీయతే తత్ర తస్య ప్రాధాన్యాద్ ధ్వనిత్వమ్" ఇతి తద్వ్యుక్తి వివేచనేఽభినవగుప్త పాదాచార్యాః. ఏవం చైవంవిధేషు విషయేషు వ్యంజకత్వస్య వ్యంగ్యస్య వా మనాగుక్తిసంస్పర్శమాత్రేణ ధ్వనిత్వమ్ నిరాకుర్వాణాః "కాంచిత్ కాంచనగౌరాంగీం" ఇతి పద్యే శబ్దాభిహిత వ్యంగ్యే ధ్వనితం కథమివ స్వీకుర్వీరన్. ఏతేన "దర్పణే చ పరిభోగ దర్శినీ" ఇతి ప్రాగుక్తపద్యే లజ్జాధ్వనిత్వం యద్దీక్షితై రభ్యధీయత తదప్యపాస్తమితి దిక్.

ఆ ఇదియంతయు ధ్వనితత్త్వమును విశేషముగా నెరిగినవారు ఉప హసింపదగినదే. ఏమనగా—

"సంశయావిష్ట" అనుచోట సంశయపదముచే నొకపదార్థమున విరుద్ధ నానాపదార్థములకు సంబంధము నవగాహించునదై యగు దీనికి (సంశయము నకు) సంబంధము సాక్షాత్తుగానే నివేదింపబడును. అచట ఏమిటి విరుద్ధమగు నానార్థము అని విశేషము నాకాంక్షించుచో వక్షఃస్థలమును జూచుటచేత వక్షమునందున్న లక్ష్మియే దానినుండి దిగి ముందున్నదా ? అనే ఈ రీతిగా నున్న యర్థము వ్యంజనావ్యాపారముచే బోధింపబడుచు శక్తివలన సంశయ శబ్దముచే నివేదింపబడుచున్న జ్ఞానములో విశేషణమగు సామాన్యార్థముతో గూడ నభేదముతో బర్యవసించును.

ఇచట సంశయమాత్రము శక్తిచే బోధపడుటవలన వక్షఃస్థల విలసితమై నదే అను ఇత్యాది విషయభాగముగూడా విరుద్ధనానార్థత్వముచే, సామాన్యా

కారముచే నాక్రాంతమై దానిచేతనే మ్రింగబడుటవల్లను వాచ్యార్థమగు సంశయమున పర్యవసాయి యగుటవల్లనుగూడా దీనికిని ధ్వని అను వ్యపదేశము యుక్తముగాదు. అన్నితీరులను వాచ్యవృత్తిచే నచుంబితమైననే అలా (ధ్వని) అగుట తగునని ధ్వనిమార్గ ప్రవర్తకులు సిద్ధాంతించిరి గదా? అలాగే ధ్వన్యాలోకమున రెండవ యుద్యోతములో

"శబ్దార్థశక్త్యాక్షిప్తోపి" (శబ్దశక్తిచేగాని అర్థశక్తిచేగాని శబ్దార్థశక్తిచేగాని ఆక్షిప్తమగు వ్యంగ్యార్థమును కవి యెచట తన మాటచే వ్యక్తీకరించునో యది ధ్వనికంటె వేరైన యలంకారమే.) అని సూత్రించి, ఇట

"సంకేత కాలమనసం" (విటుడు సంకేతకాలమునందు మనసుగలవాడగుట దెలుసుకొని నిపుణురాలు నవ్వుచున్న నేత్రమునందుంచబడిన ఆకూతము గలిగినట్లుగా లీలాపద్మమును మూసెను.)

అను శ్లోకమున సంకేతకాల మనస్కునిగా నెరిగి, లీలాపద్మము నిమీలితమని చెప్పుచున్న కవిచే ప్రదోషాభివ్యంజకమని తన మాటలోనే నివేదించెనని ధ్వనిమార్గముకన్న వేరైన గుణీభూత వ్యంగ్యమునకది మార్గము.

మరొకటి—

"అంబా" (ముసలితల్లి యిచట పరుండును. పరిణతవయస్కులలో పెద్దవాడగు తండ్రిగారిచట పరుందురు. ఇంటిపనిని జేసి యలసటజెంది శిథిలమైన తనువుగల కుంభదాసి యిక్కడ- పాపురాలనై కొద్దిరోజులక్రిందనే దూరదేశమునకు బోయిన ప్రాణనాథుడుగల నేను యిచ్చట అని పాంథునకు యీ తీరుగా పడుచు అవసరమైన మాటలు అను మిషతో చెప్పెను.)

ఇత్యాది శ్లోకమున శంక యేమియు లేకుండ నాతో రమించుటకు రమ్ము- అను నర్థము మూడు చరణములలో వ్యంగ్యమైనను, అవసరవ్యాహృతికి వ్యాజత్వమని చెప్పిరి కనుక దీనిని స్ఫుటముగా కవి తనమాటతో తెలిపెను గనుక ఇదిగూడ ధ్వనికి మార్గము కాదు అని ఆనందవర్ధనాచార్యులనిరి.

తృతీయోద్ద్యోతమున గుణీభూతవ్యంగ్యనిరూపణమునందు "వ్యంగ్యమగు నర్థమును స్వల్పముగానైనను వచనమున వెలువరించుటలో

గుణీభావమే శోభించును. అందువలన మాటలులేక వ్యంగ్యార్థము తాత్పర్యముచే ప్రకాశించునో నచట నది ప్రధానముగనుక ధ్వని" అని వారి ఉక్తిని వివేచించునెడ నభినవగుప్త పాదులనిరి.

ఈ తీరుగా నిటువంటి విషయములందు వ్యంజకత్వమునకుగాని వ్యంగ్యత్వమునకుగాని స్వల్పముగా మాట స్పర్శయన్నచో ధ్వనిత్వము నిరాకరించువారు "కాంచిత్కాంచనగౌరాంగీం-" అను పద్యమున శబ్దముచే నుక్తమగు వ్యంగ్యమును వాచ్యముగా నొనర్చిసను ధ్వనిత్వము నెట్లు స్వీకరింతురు ? దీనిచేత-

"దర్పణే చ పరిభోగదర్శినీ" అనే పూర్వ పద్యములో లజ్జాధ్వని అని అప్పదీక్షితులు చెప్పినదిగూడ త్రోసివేయబడినది అని దిక్.

**అస్మింశ్చ సంశయే నానాకోటిషు క్వచిదేక ఏవ సమానో ధర్మః; క్వచిత్ పృథక్. సోఽపి క్వచిదనుగామీ, క్వచిద్ బింబప్రతిబింబభావమాపన్నః, క్వచిదనిర్దిష్టః, క్వచిన్నిర్దిష్టః. తత్ర "మరకతమణిమేదినీ ధరో వా" ఇతి ప్రాగుదాహృత పద్యే శ్యామాభిరామత్వమ్ ధర్మిణో రామస్య కోట్యోశ్చ తమాల మరకత భూధరయోరేక ఏవానుగామీ ధర్మః ప్రతీయమానత్వాదనిర్దిష్టః.**

ఈ సంశయములో నానాకోటులయందు ఒకచోట నొకటియే సమానమగు ధర్మము, మరొకచోట వేరువేరుగా నుండును. అదియును ఒకచోట ననుగామి. మరొకయెడ బింబ ప్రతిబింబ భావాపన్నము. వేరొకయెడ ననిర్దిష్టము. ఒకయెడ నిర్దిష్టము అందులో "మరకతమణిమేదినీధరోవా-" అని వెనుక నుదాహరించిన పద్యమున శ్యామాభిరామత్వము ధర్మియగు రామునకు రెండుకోటులగు తమాలమరకతభూధరములకు ఒకటే అనుగామి ధర్మము ప్రతీయమానము గనుక నిర్దేశింపబడలేదు.

**స ఏవ నిర్దిష్టో యథా -**

**"నేత్రాభిరామం రామాయా వదనం వీక్ష్య తత్క్షణమ్**
**సరోజం చంద్రబింబం వేత్యఖిలాః సమశేరత."**

అత్ర నేత్రాభిరామత్వరూపస్త్రిష్వేక ఏవానుగామీ ధర్మో నిర్దిష్టః. పృథగనుగామీ నిర్దిష్టో యథా ప్రాగుదాహృతే "ఆజ్ఞా సుమేషోః" ఇత్యాదౌ. యథా వా--

"సంపశ్యతాం తామతిమాత్రతన్వీం
శోభాభిరాభాసిత సర్వలోకామ్.
సౌదామినీ వా సితయామినీ వే
త్యేవం జనానాం హృది సంశయోఽభూత్."

అత్రాతిమాత్రతనుత్వం సౌదామిన్యా, శోభాభిరాభాసిత సర్వలోకాత్వం చ సితయామిన్యా సహ కాంతాయాః పృథగనుగామీ సమానో ధర్మః. అత్రైవ పూర్వార్ధగత విశేషణద్వయత్యాగే స ఏ వానిర్దిష్టః. బింబప్రతిబింబభావరూపనో యథా-"తీరే తరుణ్యా వదనం సహాసమ్" ఇత్యాదౌ ప్రాగుక్తే. యథా వా -

"సపల్లవా కిం ను విభాతి వల్లరీ
సఫుల్లపద్మా కిమియం ను పద్మినీ.
సముల్లసత్పాణిపదాం స్మితాననా
మితీక్షమాణైః సమలంభి సంశయః."

అత్ర పల్లవఫుల్లపద్మే పాణ్యాననయోః ప్రతిబింబకోట్యోః పృథఙ్నిర్దిష్టే.

"ఇదముదధేరుదరం వా నయనం వాత్రేరుతేశ్వరస్య మనః
దశరథగృహే తదానీమేవం సంశేరతే స్మ కవయోఽపి."

అత్ర తదానీమితి ప్రకరణ సహాయ్యవశాద్దశరథగృహేణ ధర్మిణాక్షిప్తస్య తత్కాలజాతస్య భగవతో రామస్య జలధ్యుదరాది సంశయకోటిత్రయానుగామీ శుప్తః సాధారణశ్చంద్రః ప్రతిబింబః. ఇమౌ చ బింబప్రతిబింబావనిర్దిష్టావపి ప్రతీయమానౌ సాదృశ్యం ప్రయోజయతః. ఏతేన "అనుగామ్యేవ ధర్మో లుప్తః సంభవతి, న తు బింబితః" ఇతి వదంతః పరాస్తాః ఇతి దిక్.

ఆ అనుగామి ధర్మమే నిర్దిష్టమెట్లనగా—

"నేత్రాభిరామం" మొ. (నేత్రాభిరామమగు స్త్రీ మొగమును జూచి

ఆ క్షణమునందు సరోజమా ! చంద్రబింబమా ! యని యావన్మందియూ సంశ యించిరి.) ఇచట నేత్రాభిరామత్వ రూపమగు ననుగామిధర్మము మూడింటి యందును ఒక్కటియే నిర్దేశింపబడెను.

పృథగనుగామి ధర్మము నిర్దిష్టమెట్లనగా -

"ఆజ్ఞానుమేరోః"- ఇత్యాదులందు.

మరొకటి —

"సంపశ్యతాం" మొ. (కాంతిచే అంతటనూ ప్రకాశింపజేయబడిన లోకము గలిగినట్టి యామెను చూచుచున్నవారికి మెఱుపుతీవెయా ! శుక్ల పక్షయామినియా అని మనసునందు సంశయము కలిగెను.)

ఇచట అతిమాత్రతనుత్వము సౌదామినితోడను, శోభాభాసిత సర్వలో కత్వము సితయామినితోగూడను కాంతకు పృథగనుగామియైన సమాన ధర్మము ఇచటనే పూర్వార్ధమునందున్న రెండు విశేషణములును విడచిన అదియే ననిర్దిష్టము.

బింబ ప్రతిబింబ భావాపన్న మెట్లనగా-

"తీరే తరుణ్యా వదనం సహాసమ్" అని వెనుక జెప్పినచోటునందే.

మరొకటి—

"సపల్లవా" మొ. (చిగుళ్ళతోనున్న తీగెయా, వికసించిన పద్మము గల తామరతీవయా యీమె అని బాగా విలసిల్లుచున్న కరచరణములు గలిగి చిఱునగవుతోనున్న మొగముగల యీమెను చూచువారికి సంశయము కలిగెను.)

ఇచట చివురులును వికసించిన పద్మములును, పాణ్యాననములకు ప్రతిబింబ కోటులందు పృథక్కుగా నిర్దిష్టములు.

"ఇదమ్" మొ. (ఇది సముద్రపు కడుపా ! అత్రియొక్క నేత్రమా! ఈశ్వరుని మ॰స॰ ! అని దశరథుని యింటిలో అప్పుడు కవులుగూడా సంశయ పడిరి.)

ఇచట తదానీం అని ప్రకరణ సాహాయ్యవశమున ధర్మియగు దశరథ గృహముచే నాక్షేపింపబడిన తత్కాల జాతుడగు భగవానుడైన రామునకు

జలధ్యుదరాది సంశయకోటిత్రయాశ్లిష్టుడగు సాధారుణుడైన చంద్రుడు ప్రతిబింబము. ఈ రెండు బింబ ప్రతిబింబములు అనిర్దిష్టములైనను స్ఫురించుచున్నవై సాదృశ్యమును ప్రయోగించును. ఇందువల్ల "అనుగామియైననే ధర్మము లుక్తమె సంభవించును. అంతేకాని బింబితముగాదు" అని మాటాడువారును త్రోసివేయబడిరి. అని దిక్.

అయం చ క్వచిదనాహార్యః క్వచిదాహార్యః యత్ర హి కవినా పరనిష్ఠః సంశయో నిబధ్యతే ప్రాయస్తత్రానాహార్యః. యథా "తీరే తరుణ్యాః" "మరకతమణిమేదినీధరో వా" ఇత్యాదిషు ప్రాగుదాహృతేషు పద్యేషు. తత్ర భ్రమరాదీనాం సంశయానానాం గ్రాహ్యానిశ్చయాభావత్. యత్ర చ స్వగత ఏవ తత్రాహార్యః. యథా -

"అలిర్మృగో వా నేత్రం వా యత్ర కించిద్ విభాసతే
అరవిందం మృగాంకో వా ముఖం వేదం మృగీదృశః."

అత్ర వక్తుః కవేస్తత్త్వజ్ఞతయా సంశయావాహార్యావేవ. పరంపరితోఽపి చాయం సంభవతి -

"విద్వద్దైన్యతమస్త్రిమూర్తిరథవా వైరీంద్రవంశాటవీ-
దావాగ్నిః కిమహో మహోజ్జ్వలయశః శీతాంశుదుగ్ధాంబుధిః,
కిం వానంగభుజంగదష్టవనితాజీవాతురేవం నృణాం
కేషామేష నరాధిపో న జనయత్యల్పేతరాః కల్పనాః."

అత్రాప్యాహార్యః.

ఇదియు మరియొకయెడ ననాహార్యము. ఇంకొకయెడ నాహార్యము. సామాన్యముగా పరనిష్ఠమగు సంశయమును కవి నిబంధించుచోట ననాహార్యసంశయము. ఎట్లనగా — "తీరే తరుణ్యా వదనం సహాసమ్" "మరకతమణి మేదినీధరో వా-" ఇత్యాదులగు వెనుక నుదాహరించిన పద్యములందు.

అచట సంశయమునొందుచున్న భ్రమరాదులకు గ్రాహ్యానిశ్చయము లేదుకదా? ఇక స్వగతమే యగుచో నచట నాహార్య (సంశయ)ము. ఎట్లనగా–

"అలిర్మృగోవా" మొ. (అలియో? మృగమో? నేత్రమో? ఎక్కడ కొంచెము ప్రకాశించునో! అరవిందమో? మృగాంకుడో? స్త్రీ మొగమో.)

ఇచట వక్తయగు కవి తత్త్వజ్ఞుడగుటచే సంశయము లాహార్యములే.

ఈ సంశయాలంకారము పరంపరితముగాకూడ నుండును.

"విద్వద్దైన్యతమ స్త్రి మూర్తిః" మొ. (విద్వాంసులయొక్క దైన్యమను చీకటికి సూర్యుడా? అథవా శత్రుశ్రేష్ఠునియొక్క వంశములనెడు వెదుళ్ళకు దావాగ్నియా? మహోజ్జ్వలమగు కీర్తియనెడు శీతాంశునకు పాల సముద్రమా? లేదా మన్మథుడనెడు సర్పముచేత కఱువబడిన స్త్రీలకు జీవనౌషధమా? అని యీ తీరుగా మనుష్యు లెవరికి యీరాజు గొప్ప కల్పన కల్పించడు.) ఇచటనుగూడ నాహార్యమే.

**క్వచిత్ పరనిష్ఠోపి కవినా నిబధ్యమాన ఆహార్యో భవతి. యథా--**

**"గగనాద్ గలితో గభస్తిమానుత వాయుం శిశిరో విభావసుః**
**మునిరేవమరుంధతీపతిః సకలజ్ఞః సమశేత రాఘవే."**

**అత్ర మునేర్వసిష్ఠస్య సర్వజ్ఞత్వేనోపాత్తస్య సంశయ ఆహార్య ఏవ. యద్యప్యత్ర "మునీనాం చ మతిభ్రమః" ఇత్యుక్త్యా తస్యానాహార్య ఏవ సంశయో వక్తుమ్ శక్యః, తథాపి కోటితావచ్ఛేదకయోః శిశిరత్వ గగన గలితత్వయోరగ్నిసూర్యరూపకోటిద్వయే ఆహార్యబోధస్యైవావశ్యవాచ్యతయా పురోవర్తిని కోటిద్వయాభేదాంశేఽపి తస్యైవ న్యాయ్యత్వాత్. ఇహ చ కోట్యోర్ధర్మిసాదృశ్యదార్ఢ్యాయోష్ణత్వ గగనగలితత్వరూప వైధర్మ్యనిరాసకమవిద్యమానమపి గగనగలితత్వం చారోప్యతే వక్త్రా). ఏవమాదయోఽన్యేపి ప్రకారాః సుధీభిః స్వయమున్నేయాః.**

ఒకచోట పరనిష్ఠమైనను కవి నిబంధించునెడల సంశయము ఆహార్యమే యగును. ఎట్లనగా–

"గగనాద్" మొ. (ఆకాశమునుండి జారిన సూర్యుడా, లేక చల్లని అగ్నియా అని అరుంధతీభర్తయగు ఋషి రామునియందు సకలజ్ఞుడైనను సంశయము బొందెను.)

ఇచట ముని వశిష్ఠుడు సర్వజ్ఞుడగుట వలన స్వీకరింపబడిన సంశయమాహార్యమే. ఇచట "మునీనాంచ మతిభ్రమః"- అనుటచేత నతనికి నవాహార్యమే సంశయమనవచ్చును.

అయినను కోటితానిర్ణాయకములు, శిశిరత్వ - గగనగలితత్వములకు అగ్నిసూర్య రూపములగు కోటిద్వయమునందు నాహార్యబోధయే చెప్పవలసియుండుటవల్ల ముందుండు దానియందు నభేదముతో కోటిద్వయాభేదాంశమునందైనను అదియే న్యాయముగదా ? ఇక్కడ కోటులందు ధర్మిసాదృశ్య దార్ఢ్యమునకై ఉష్ణత్వ గగనగలితత్వ రూపమగు వైధర్మ్యమును నిరసింపజేయునది లేకున్నను గగనగలితత్వము శిశిరత్వమున్ను వక్తచే నారోపింపబడుచున్నది.

ఈ తీరుగానున్న ఇతరములగు రీతులుగూడ మంచి బుద్ధిమంతులూహింపవలెను.

ఇది ససన్దేహ ప్రకరణము

## భ్రాంతిమదలఙ్కారః

అథ భ్రాంతిమాన్ - సదృశే ధర్మిణి తాదాత్మ్యేన ధర్మ్యంతరప్రకారకోఽనాహార్యో నిశ్చయః సాదృశ్యప్రయోజ్య శ్చమత్కారీ ప్రకృతే భ్రాంతిః. సా చ పశుపక్ష్యాదిగతా యస్మిన్ వాక్యసందర్భేఽనూద్యతే స భ్రాంతిమాన్.

అత్ర చ భ్రాంతిమాత్రమలంకారః. భ్రాంతిమానలంకార ఇతి వ్యవహారస్త్వౌపచారికః. తథా చాహుః -

"ప్రమాత్రంతరధీర్భ్రాంతిరూపా యస్మిన్ననూద్యతే
స భ్రాంతిమానితి ఖ్యాతోఽలంకారే త్వౌపచారికః" ఇతి.

తరువాత భ్రాంతిమాన్—

సమానమగు ధర్మియందు తాదాత్మ్యమున ధర్మ్యంతరము ప్రకారముగాగల అనాహార్యమగు నిశ్చయమే సాదృశ్యప్రయోజ్యమై చమత్కార మొనరించినచో ప్రకృతమున భ్రాంతి.

అది పశుపక్ష్యాదులయం దున్నది. వాక్సందర్భమున ననువదింపబడిన నది భ్రాన్తిమత్తు.

ఇచట భ్రాంతిమాత్ర మలంకారము. భ్రాంతిమత్తు నలంకారమనుట యౌపచారికము. అటుల జెప్పుదురు.

"ప్రమాత్రంతరధీః" మొ. 'మరియొక తెలుసుకొనువాని బుద్ధి ఎక్కడ భ్రాంతిరూపమై అనువదింపబడునో అది భ్రాంతిమత్తని ప్రసిద్ధము. అలంకారమునందు ఔపచారికము."

లక్షణే మీలిత-సామాన్య-తద్గుణ-వారణాయ ధర్మిగ్రహణ ద్వయమ్. రూపకవిత్తివారణాయానాహార్య ఇతి కవిభిన్నగత ఇతివా. సంశయ వారణాయ నిశ్చయ ఇతి. ఇదం రజతమితి రంగవిశేష్యక బోధవారణాయ చమత్కారీతి. కవిప్రతిభానిర్వర్తిత ఇత్యర్థః. రంగే రజతమితి బుద్ధేః లౌకికతయా న కవిప్రతిభానిర్వర్తితత్వమ్.

"అకరుణహృదయ
ప్రియతమ ముంచామి త్వామితః పరం నాహమ్.
ఇత్యాలపతి కరాంబుజ-
మాదాయాలీజనస్య వికలా సా."

ఇత్యత్ర నాయికాసందేశహరస్యోక్త్యా వ్యజ్యమానస్యోన్మాదస్య వారణాయ సాదృశ్యప్రయోజ్య ఇతి. నచాత్రోన్మాదస్య ప్రాధాన్యాత్ సకలాలంకారసాధారణేనోపస్కారకత్వవిశేషణేనైవ వారణమితి వాచ్యమ్, తస్యాపి పార్యంతికవిప్రలంభోపస్కారకత్వాత్. యద్వా సందేశహారాత్ సందేశం శ్రుతవతో నాయకస్య స్వమిత్రమ్ ప్రతి యదేదం వాక్యం "అకరుణహృదయ—" ఇత్యాది తదాస్మిన్నేవ పద్యే సేతి పదవ్యంగ్యాయాః స్మృతేరుపస్కారకే ఉన్మాదే తథాప్యతి ప్రసంగాపత్తేః సాదృశ్య ప్రయోజ్యత్వ మావశ్యకమ్. లక్షణే చాతైకత్వం వివక్షితమ్. అన్యథా వక్ష్యమాణానేకగ్రహీతృకానేకప్రకార

కైకవిశేష్యకభ్రాంతిసముదాయాత్మన్యుల్లేఖేఽతిప్రసంగాపత్తేః. అత ఏవైకవచనమపి సార్థకమ్.

మీలిత - సామాన్య - తద్గుణములను నివారించుటకై లక్షణమందు ధర్మిగ్రహణాద్వయము. రూపకవిత్తి నివారించుటకై అనాహార్యము అని గాని, కవి భిన్నగతము అనిగాని. సంశయమును వారించుటకై నిశ్చయమని.

'ఇదం రజతం' అని రంగవిశేష్యకబోధను వారించుటకై చమత్కారి యని. ఇట కవి ప్రతిభచే నిర్వహింపబడినది అని అర్థము. రంగమునందు 'రజతం' అనుబుద్ధి లౌకికవిషయమగుటచేత కవి ప్రతిభానిర్వర్తితత్వములేదు.

'అకరుణహృదయ' (కఠినహృదయా! ప్రియుడా! ఇంకను తరువాత నేను నిన్ను వదిలి పెట్టనని చెలికత్తెయొక్క కరాంబుజమునుబట్టుకొని వికల హృదయయైన యామె పలుకుచున్నది.) అను శ్లోకమున నాయికా సందేశ హారుని మాటలలో వ్యంగ్యమగుచున్న యున్మాదము నివారించుటకై 'సాదృశ్య ప్రయోజ్యః' అని. ఇచట సకలాలంకార సాధారణమగు చమత్కారము నొదవించుట అను విశేషణమువలననే ఇచట ఉన్మాదము ప్రధానము గనుక వారింపబడును అనుకొనరాదు. అదియు పార్యంతికమగు విప్రలంభమున కుపస్కారమే.

అథవా— సందేశహారునివలన సందేశమును విన్న నాయకుడు తన మిత్రునిగూర్చి యెప్పుడైతే 'అకరుణ హృదయ' ఇత్యాదికమును బల్కెనో అపుడీ పద్యమునందే 'సా' అనుపదమున వ్యంగ్యమగు స్మృతికుపస్కారక మగు నున్మాదమున నగ్లైనను నతివ్యాప్తి అపాదించును గనుక, సాదృశ్య ప్రయోజ్యత్వమనుట యావశ్యకము. లక్షణమున నిచట నేకత్వమే వివక్షి తము. అట్లు గానిచో ననేకులు గ్రహీతలుగానుండి యనేక ప్రకారకమై ఏక విశేష్యకభ్రాంతి సముదాయాత్మకమైన ఉల్లేఖమునందు, ముందు చెప్పబడ బోవునన్నదాని యందు, నతిప్రసంగము సంభవించును. కనుక ఏకవచన మున్ను సార్థకము.

**ఉదాహరణమ్ :—**

**"కనకద్రవకాంతికాంతయా మిలితం రామముదీక్ష్య కాంతయా**
**చపలాయుతవారిదభ్రమాన్ననృతే చాతకపోతకైర్వనే."**

**అత్ర చాతకగతహర్షోపస్కారకతయాతద్గతా భ్రాంతిరలంకారః. యది "పరిఫుల్లపతత్త్రిపల్లవైర్ముముదే చాతకపోతకైర్వనే" ఇత్యుత్తరార్ధం నిర్మీయతే తదాయమేవ భ్రాంతిధ్వనిః.**

ఉదాహరణము:- "కనకద్రవకాంతి కాంతయా" మొ. (బంగారపు ద్రవముయొక్క కాంతితో సుందరమైనట్టి స్త్రీతో కలసియున్న రాముని జూచి మెఱుపుతీగతో కలసిన మేఘమనే భ్రమతో చాతకపక్షులు అడవిలో నృత్యముచేసెను." ఇచట, చాతకమందున్న హర్షమున కుపస్కారకముగా దానియందున్న భ్రాంతి యలంకారము. ఇచటనే "పరిఫుల్ల పతత్రపల్లవైః ముముదే చాతకపోతకైర్వనే" అని ఉత్తరార్ధము నిర్మాణము చేయగా నదియే భ్రాంతిమత్ధ్వని.

**యచ్చాప్పయదీక్షితైర్లక్షణముక్తమ్—**

**"కవిసమ్మత సాదృశ్యాద్విషయే పిహితాత్మని**
**ఆరోప్యమాణానుభవో యత్ర స భ్రాంతిమాన్ మతః"—ఇతి.**

తత్ర "కవిసమ్మత సాదృశ్యప్రయోజ్యే విషయే ఆరోప్యమాణానుభవో యత్ర వాక్సందర్భే స భ్రాంతిమాన్" ఇతి భ్రాంతిమతో లక్షణం విధాయ రూపకవ్యావృత్త్యర్థమ్ పిహితాత్మనీత్యుచ్యతే. న చైతద్యుక్తమ్. నహి రూపకవాక్యే ఆరోప్యమాణస్యానుభవో వర్ణ్యతే కిన్తు తస్మాజ్జాయతే. న చాత్రానుభవాంతం భ్రాంతేర్లక్షణ మగ్రిమం చ భ్రాంతిమతః,తత్ర భ్రాతిలక్షణే రూపకేఽతివ్యాప్తే ర్వారణాయ విషయే పిహితాత్మనీతి విశేషణమితి వాచ్యమ్. అనుభవత్వఘటితస్య భ్రాంతిలక్షణస్యానుభూయమానాభేదాత్మకే రూపకే కథమప్యప్రవృత్తేః, యది చ రూపకపదం రూపకబుద్ధి పరమితి గ్రంథసామంజస్యం విధీయతే తథాపి విషయతావచ్ఛేదకానవగాహిని "మరకతమణిమేదినీధరో వా తరుణతరస్తరురేష వా తమాలః" ఇతి సంశయేఽతిప్రసంగాత్. "కమలమితి చంచరీకాశ్చంద్ర ఇతి చకోరాస్త్వన్ముఖమనుధావంతి" ఇతి భ్రాంతిసముదాయాత్మన్యుల్లేఖేఽతివ్యాప్తేశ్చ. అత్ర భ్రాన్త్యా సంకీర్ణ ఉల్లేఖ ఇతి చేత్ నహ్యేతావతోల్లేఖాంశాతి వ్యాప్తిర్న దోషః. నహి దుగ్ధజలభాగానాం

**వ్యామిశ్రతాస్తీతి దుగ్ధలక్షణమ్ జలాంశాతివ్యాప్తికం కర్తుం యుక్తమ్.**

అప్పయ్యదీక్షితులు ఈలక్షణమును జెప్పిరి,

"కవిసమ్మత" మొ. (కవులకు సమ్మతమగు సాదృశ్యము వలన విషయము పిహితము కాగా ఆరోపించబడిన దానియొక్క అనుభవము ఎచ్చటనో అది యే భ్రాంతిమదలంకారము."

కవిసమ్మతమగు సాదృశ్యము వలన ప్రయోగింపబడిన విషయము నందు నారోపింపబడు దాని యనుభవము ఏ వాక్య సందర్భముననో అది భ్రాంతిమత్తు అని లక్షణమును జేసి రూపక వ్యావృత్తికై పిహితాత్మని యని చెప్పబడినది అన్నచో—

ఇది యుక్తముగాదు. ఏమనగా— రూపక వాక్యమున ఆరోప్యమాణము యొక్క అనుభవము వర్ణింపబడదు. దానివలన గల్గును. "ఇచట యను భావాన్తము భ్రాన్తికి లక్షణము. ముందు లక్షణము భ్రాన్తిమత్తుకు లక్షణము. అందు భ్రాంతి లక్షణమున, రూపకమున నతిప్రసంగమును వారించుటకై విషయము పిహితాత్మనియని విశేషణము" అనెదరేమో ? అనుభవత్వమును గూర్చిన భ్రాన్తిలక్షణము అనుభవింపబడుచున్న దానితో సభేదమే స్వరూపముగా గల రూపకమున నెట్లును వర్తింపదు గదా !

అయితే రూపకపదము రూపకబుద్ధిపరమని గ్రంథమును సాగింతురా? అప్పటికినీ విషయతా నిర్ణాయకము నవగాహింపని—

"మరకతమణిమేదినీధరోవా
తరుణతరుస్తరురేష వా తమాలః"

అను సంశయమున నతిప్రసంగము సంభవించును ! "కమలమని చంచరీకములు—చంద్రుడని చకోరములు—నీ మొగముపై పరువెత్తు చున్నవి' అను భ్రాన్తిసముదాయ స్వరూపమగు నుల్లేఖమున నతివ్యాప్తిగూడ నేర్పబడును. ఇచట భ్రాన్తితో సంకీర్ణముల్లేఖమనుచో నింతమాత్రముతో నుల్లేఖాంశమున నతివ్యాప్తిదోషము లేకపోదు. పాల భాగమును నీటి భాగమును కల్పి యు-

న్నవిగదా అని పాల లక్షణమును జలాంశమందతివ్యాప్తి కలదానినిగ నొనర్చుట యుక్తము గాదు గదా?

యచ్చాపి భిన్నకర్తృకోత్తరోత్తరభ్రాంతావుదాహృతమ్—

"శింజానైర్మంజరీతి స్తనకలశయుగం చుంబితం చంచరీకై-
స్తత్రాసోల్లాసలీలాః కిసలయమనసా పాణయః కీరదష్టాః,
తల్లోపాయాలసంత్యః పికనినదధియా తాడితాః కాకలోకై-
రిత్థం చోళేంద్రసింహ త్వదరిమృగదృశాం నాప్యరణ్యం
శరణ్యమ్" ఇతి.

తత్ర విచార్యతే - స్తనకలశయుగే హి న తావన్మంజరీసాదృశ్యం కవిసమయసిద్ధమ్, యేన తన్మూలా చంచరీకాణాం భ్రాంతిరుపనిబధ్యేత. దోషాంతరమూలా తు సా నాలంకార ఇత్యనుపదమేవ నిరూపితమ్. అపి చ ధర్మిణి కలశరూపకానువాదేన మంజరీభ్రాంతిరూపమలంకారాంతర ముపనిబధ్యమాన ముద్వేజకమేవ సహృదయానామ్. నహి సాదృశ్యమూలైకాలంకారావచ్ఛిన్నే సాదృశ్యమూలాలంకారాంతరం శోభతే, యథా "ముఖకమలం తవ చంద్రవత్ ప్రతిమః" ఇతి ప్రాగేవ నివేదనాత్. ప్రత్యుత కలశరూపకేణ మంజరీసాదృశ్యతిరస్కారాచ్చ. "తత్రాసోల్లాసలీలాః కిసలయమనసా పాణయః కీరదష్టాః" ఇత్యత్ర విధేయావిమర్శాద్విధేయాంతరమాకాంక్షితమ్. 'కీరైర్దష్టాః' ఇతి తు భావ్యమ్. జాతా ఇత్యధ్యాహారేఽపి వివక్షితస్యావిధేయత్వమవివక్షితస్య చ విధేయత్వం ప్రసజ్యేత. ఏవం "తల్లోపాయాలసంత్యః పికనినదధియా, తాడితాః కాకలోకైః" ఇత్యత్ర న తావత్పికనినదాస్తాడనయోగ్యాః కాకానామ్, యేన తద్ధియా అలసంత్యస్తైస్తాడ్యేరన్. నాపి పికనినదభ్రమ అలసంతీషు సంభవతి. సంభవన్వా న సాదృశ్యమూలః. పికనికరధియేతి తు భావ్యమ్. అథ తదాలాపేషు పికనినదబుద్ధేరపి తాసు పికబుద్ధ్యుత్పాదనద్వారా సంభవత్యేవ తాడనోపయోగ ఇతి ప్రయోజ్యత్వార్థకతృతీయయా పికనినదధీప్రయోజ్యకాకకర్తృకతాడన కర్మత్వమాలపంతీనాం సుప్రతిపాదమేవేతి చేత్, నైవమ్. తథా ప్రతీతేరసిద్ధేః. "చౌరబుద్ధ్యా హతః, సాధుః" ఇత్యాదౌ చౌరబుద్ధిహననయోః

సామానాధికరణ్యేన హేతు హేతుమద్భావగమకత్వవ్యుత్పత్తేః. ఏవం "దంతిబుద్ధ్యా హతః శూరైర్వరాహో వనగోచరః" ఇత్యత్రాపి విశేష్యతయా వరాహవృత్తేర్దంతిబుద్ధేర్వరాహవృత్తిహననహేతుభావావగమః. త్వదుక్తరీత్యా దంతబుద్ధ్యేతి కృతే బోధకదర్ధనైవ. కిం చ పికానాం హి కూజితాదిశబ్దైరేవ శబ్దో వర్ణ్యతే, న తు నినాదాదిశబ్దః సింహదుందుభ్యాదిశబ్దప్రయోగయోగ్యః. తథా ప్రథమద్వితీయచరణస్థయోః స్తనపాణ్యోర్యథాకథంచిత్ వ్యవహితమపి జాతాన్వయమపి త్వదరిమృగదృశామితి షష్ఠ్యంతమన్వేతుం శక్నుయాత్, న తు తృతీయచరణస్థే ఆలపంత్య ఇత్యస్మిన్ విశేషణే విశేష్యాభావేనేతి తాసాం తాటస్థ్యమేవ స్యాత్. విభక్తివిపరిణతావపి ప్రక్రమభంగాసంస్థులత్వాభ్యాం స్థితమేవేతి పద్యమవ్యుత్పన్ననిర్మితమేవ. దీక్షితైస్తు భ్రాంత్యలంకారాంశమాత్రమాదాయోదాహృతమితి దిక్.

ఇంకొకటి — భిన్న కర్తృకమగునుత్తరోత్తరభ్రాంతియుం దుదాహరింప బడినది—

"శింజానైర్మంజరీతి" మొ. " మంజరి యని ధ్వని చేయుచున్న తుమ్మెదలచే స్తనకలశము చుంబించబడినది. దాని భయము వలన ఉల్లాసలీల గల చేతులు చిగురులను మనసుచే చిలుకలచే కొఱకబడినవి. దానిలోపము కొరకు ఆలపించుచు చిలుక ధ్వనియను బుద్ధితో కాకుల గుంపులచే తాడింపబడిరి. ఈ తీరుగా చోళరాజా! నీ శత్రుస్త్రీలకు అరణ్యముగూడా రక్షకముగాలేదు."

ఇచట విచారింతము—

స్తనకలశయుగమున మంజరీ సాదృశ్యము కవిసమయసిద్ధము గాదు. కవిసమయసిద్ధమైననే తన్మూలకముగా చంచరీకములకు భ్రాంతి నిర్వహింపబడును. దోషాంతరమూలకమైన అదిఅలంకారము కాబోదని ఇంతకుముందే నిరూపించబడినది. అంతేగాక, ధర్మియందు కలశ రూపము ననువదించుటలో మంజరీ భ్రాంతిరూపమగు యలంకారాంతరము గూర్చబడినచో నది తప్పక వెగటునే సహృదయులకు గల్గించును. సాదృశ్యమూలకమగు నొక యలం

కారముతో విశిష్టమున సాదృశ్యమూలకమగు నలంకారాంతరము శోభింపదు.

ఎట్లనగా— "నీ ముఖ కమలమును చంద్రనివలె భావింతుము" అని ఇదివరకే నివేదించితిమి. అదీగాక కలశరూపకముచేత మంజరీ సాదృశ్యము తిరస్కృతమైనది గూడాను.

"తత్రాసోల్లాస లీలాః కిసలయమనసా పాణయః కీరదష్టాః "అను చోటను విధేయమును విస్మరించకపోవుటవలన మరొక విధేయము నాకాంక్షిత మైనది. కీరైః దష్టాః" అని యుండదగును. "జాతాః" అని అధ్యాహార మొనర్చినను వివక్షిత మవిధేయమగుటయు అవివక్షితము విధేయమగుటయు ప్రసంక్తించును.

ఈ తీరుగానే— "తల్లోపాయాలపంక్త్యాః పికనినదధియా తాడితాః కాకలోకైః" అనుచోట పికనినాదములు కాకలోకములకు తాడన యోగ్యములు గావు. అట్లగుచో నాబుద్ధిచే నాలపించువారు వానిచే తాడింపబడుదురు. అంతేగాక నాలపించెడివారియందు పికనినద భ్రాంతికలుగదు. సంభవించినచో నది సాదృశ్యజ్ఞానమూలమున గాదు. "పికనికరధియా" అని యుండ దగును. అయితే "వారి యాలాపములందు పికనినదబుద్ధి కనిపించుటద్వారా వానియందు పికబుద్ధి నుత్పాదించుటద్వారమున తాడనోపయోగము గల్గు నని ప్రయోజకములు కనుక తదర్థకతృతీయతో పికనినదధీ ప్రయోజ్యకమైన కాకకర్తృక తాడనకర్మత్వము నాలపించువారికే సుఖముగానే ప్రతిపాదించ నగును"—

అనినచో నటులైనను ప్రకృతములో నా ప్రతీతి యప్రసిద్ధమగును.

"చోరబుద్ధ్యా హతస్సాధుః" ఇత్యాదులలో చోరబుద్ధిహననములకు సామానాధికరణ్యముచేత హేతుహేతుమద్భావమునకు గమకము అని వ్యుత్పత్తియే గల్గినదిగదా ?

ఈ విధముగా—

"దన్తిబుధ్యా హతశ్శూరైః వరాహో వనగోచరః"

అనే చోటను గూడా విశేష్యముగా వరాహమునందుండు దంతి బుద్ధికి వరాహమునందుండు హననమునకు హేతుభావము అవగతము. నీవు చెప్పిన విధమున 'దంతబుద్ధ్యా' అనిచేసినచో బోధను పాడుచేయుటయే.

ఇంకొకటి—

పికముల శబ్దము కూజితాది శబ్దములచేతనే వర్ణింపబడుచున్నది. అంతేగాని నినదాది శబ్దములచేత, సింహాదుందుభ్యాది శబ్దముల విషయమున ప్రయోగించుటకు దగిన వానిచేత గాదు. అలా ఒకటి రెండు చరణము లందున్న స్తనపాణులకు నెలాగోలాగు వ్యవహితమైనను'త్వదరిమృగదృశాం, అను షష్ఠ్యంత మన్వయించుటకు వీలుపడును. కానీ మూడవ పాదమందున్న 'ఆలపంత్యః' అను విశేషణమందు విశేష్య భావముతో నన్వయించుటకు వీలుగాదు. కనుక వానికి తటస్థత్వమే అగును. విభక్తిని మార్చినను ప్రక్రమభంగము అసంష్ఠులత్వమున్ను రెండు ఉండేయున్నవి కావున పద్యము అవ్యుత్పన్న నిర్మితమే అగును. దీక్షితులు భ్రాన్త్యలంకారాంశమును మాత్రము తీసుకొని యుదాహరించెను అని దిక్!

య త్త్వలంకారసర్వస్వకృతా లక్షితమ్, "సాదృశ్యాద్వస్త్వంతర ప్రతీతిర్భ్రాంతిమాన్" ఇతి తన్న. ప్రాగుక్తే సంశయాలంకారే వక్ష్యమాణాయాముత్ప్రేక్షాయాం చాతిప్రసంగాత్. ప్రతీతిపదస్య నిశ్చయ పరత్వే రూపకవిత్తావతిప్రసంగాత్. విషయతావచ్ఛేదకానవగాహిత్వేన నిశ్చయో విశేషణీయ ఇతి చేత్, విశేష్యతామ్; తథాప్యతిశయోక్తి విత్తావతిప్రసక్తిరవారితైవ. అనాహార్యత్వేన నిశ్చయవిశేషణత్వే పునరస్మదుక్త ఏవ పర్యవసితిః, మతుబర్థాసంగతిశ్చ.

తత్ర " కనకద్రవకాంతికాంతయా " ఇత్యత్ర సీతాతడితోర్బింబప్రతిబింబభావః. యుతత్వమిలితత్వయోశ్చ శుద్ధసామాన్యరూపతా.

"రామం స్నిగ్ధతరశ్యామం విలోక్య వనమండలే,
ధారాధరధియా ధీరం నృత్యంతి స్మ శిఖావలాః".

అత్ర స్నిగ్ధత్వశ్యామత్వయోరనుగామిత్వమ్.

అలంకార సరస్వకారులు. 'సాదృశ్యము వలన వస్త్వంతరము తోచుట భ్రాన్తిమత్'అని అనిరి. అదికాదు—

వెనుక జెప్పిన సంశయాలంకారము నందును, ముందు జెప్పబోవు సుత్ప్రేక్షయందును అతి ప్రసంగము సంభవించును. ఇచట ప్రతీతి పదమునకు నిశ్చయమర్థమగుచో రూపకవిత్తియం దతివ్యాప్తి. విషయతా నిర్ణాయకా నవగాహియని నిశ్చయమును విశేషించ నిండు; అట్లయినను అతిశయోక్తి విత్తియందును అతిప్రసక్తి వారింపనేలేదు. అనాహార్యత్వమని నిశ్చయము నకు విశేషణ మగుచో మరల మేము చెప్పిన వానియందే పర్యవసానము. 'మతుప్' ప్రత్యయము నర్థము కుదరకుండుటయు సంభవించును. అచట 'కనకద్రవకాన్తికాన్తయా' అన్నచో సీతాతటిత్తులకు బింబప్రతిబింబభావము యుతత్వమిలితత్వములకు శుద్ధసామాన్యరూపత్వము.

'రామం స్నిగ్ధతరశ్యామం'(నున్నగా నల్లగానున్న రాముని వనమం డలమునందు జూచి మేఘబుద్ధితో నెమళ్ళు నెమ్మదిగా నృత్యము చేసినవి".)

ఇత్యాది శ్లోకమున స్నిగ్ధత్వశ్యామలత్వములు అనుగాములు.

ఇది భ్రాంతిమదలంకారము.

## ఉల్లేఖాలఙ్కారః

అథోల్లేఖః . ఏకస్య వస్తునో నిమిత్తవశాత్ యదనేకై ర్గ్రహీతృభిరనేకప్రకారం గ్రహణం తదుల్లేఖః.

'అధరం బిమ్బమాజ్ఞాయ ముఖమబ్జం చ తన్వి తే,
కీరాశ్చ చఞ్చరీకాశ్చ విన్దన్తి పరమాం ముదమ్'.

అత్ర కీరచఞ్చరీకాభ్యా మధరవదనయోర్బిమ్బత్వేన పద్మత్వేన చ గ్రహణే భ్రాన్తిరూపేఽతి ప్రసఙ్గవారణాయైకస్య వస్తున ఇతి. 'ధర్మస్యాత్మా భాగధేయం క్షమాయాః' ఇత్యాదిమాలారూపకేఽతి-ప్రసఙ్గవారణాయానేకైర్గ్రహీతృభిరిత్యవివక్షితబహుత్వకం గ్రహణ విశేషణమ్.

"నృత్యత్త్వద్వాజిరాజి ప్రకరఖురపుటప్రోద్ధతైర్ధూలిజాలై రాలోకాలోక భూమీధరమతులనిరాలోకభావం ప్రయాతే.

విశ్రాన్తిం కామయన్తే రజనిరితి ధియా భూతలే సర్వలోకాః
కోకాః క్రన్దన్తి శోకానలవికలతయా కిం చ నన్దత్యులూకాః".

అత్ర ధూలిజాలరూపస్యైకస్య వస్తునోఽనేకైర్లోకకోకోలూకైర్గ్రహీతృభిరేకేనైవ రజనీత్వరూపేణ ప్రకారేణ గ్రహణమితి అత్రాతిప్రసఙ్గవారణాయానేకప్రకారకమితి. గ్రహణమితి గ్రహణసముదాయో వివక్షితః. ఏకత్వం జాతౌ. తేన ద్వయోర్బహూనాం వా గ్రహణం నిమిత్తవశాదితి తు వస్తుకథనమాత్రమ్.

ఉల్లేఖాలంకారము —

ఒక వస్తువును నిమిత్తముల వశమున ననేక గ్రహీతలచే ననేక ప్రకారముల గ్రహించుట నుల్లేఖము అందురు.

'అధరం' (అధరమును దొండపండనియు వదనమును పద్మమనియు గుర్తించి చిలుకలు తుమ్మెదలును ఓ తన్వీ. గొప్ప సంతసముబొందుచున్నవి).

ఇచట చిలుకలు తుమ్మెదలును అధరమును వదనమును గాను పద్మమును బింబమునుగాను గ్రహించుటలో భ్రాన్తియేగనుక నట నతిప్రసంగమును వారించుటకై ఒక వస్తువు అనబడినది.

'ధర్మస్యాత్మా భాగధేయం కుమార్యాః' ఇత్యాది మాలారూపకమున నతిప్రసంగవారణకై అనేక గ్రహీతలని అవివక్షిత బహుత్వకముగా గ్రహణ విశేషణము.

'నృత్యత్త్వద్వాజిరాజి' మొ. "నాట్యముచేయుచున్న గుఱ్ఱముల బారుయొక్క మిక్కిలి తీక్ష్ణమైన గిట్టలచే పైకి లేచినటువంటి ధూళి సమూహముతో లోకాలోక పర్వతము వరకు నిరుపమముగా వెలుతురు లేకపోగా భూతలమున సర్వులు రాత్రి యనేబుద్ధితో విశ్రాంతిని గోరుచున్నారు. చక్రవాక పిట్టలు శోకాగ్ని వికలతచేత యేడ్చుచున్నవి. గుడ్లగూబలు సంతసించుచున్నవి".

ఇచట ధూళిజాల రూపమగు నొకవస్తువు లోకకోకోలూకములు ననేకులగు గ్రహీతలు రజనీత్వము అను నొక ప్రకారముతోనే గ్రహించిరి గనుక నట నతిప్రసంగమును వారించుటకై ననేకప్రకారముల గ్రహణ

సముదాయమని వివక్షితము. జాత్యేకత్వము గ్రాహ్యము. అనేకులు కర్తగా గల్గిన ఒకే గ్రహించుట యప్రసిద్ధముగాదా ? అందుచేత నిద్దరుగానీ చాలా మందిగానీ గ్రహించుట నిమిత్తము వల్లనని వస్తుకథన మాత్రమే యగును.

ఉదాహరణమ్:—

"నరైర్వరగతిప్రదేత్యథ సురైః స్వకీయాపగే-
త్యుదారతరసిద్ధిదేత్యఖిలసిద్ధసంఘైరపి.
హరేస్తనురితి శ్రితా మునిభిరస్తసఙ్గైరియం
తనోతు మమ శం తనోః సపది శన్తనోరఙ్గనా".

అత్ర చ లిప్సారుచిభ్యాం నిమిత్తాభ్యామస్యానేకగ్రహీతృక వరగతిప్రదాత్వాద్యనేకప్రకారకగ్రహణసముదాయో గఙ్గావిషయక రతిభావోపస్కారకః. శుద్ధ ఏవాయముల్లేఖాలఙ్కారః, రూపకాద్య మిశ్రణాత్. సఙ్కీర్ణోఽపి దృశ్యతే. యథా —

'ఆలోక్య సున్దరి ముఖం తవ మన్దహాసం
నన్దన్త్యమన్దమరవిన్దధియా మిలిన్దాః.
కిఞ్చాలిపూర్ణ మృగలాఞ్ఛన సమ్భ్రమేణ
చఞ్చూపుటం చటు లయన్తి చిరం చకోరాః'.

అత్రైకైకగ్రహణరూపయా భ్రాన్త్యా సముదాయాత్మక ఉల్లేఖః సఙ్కీర్ణః.

'వనితేతి వదన్త్యేతాం లోకాః సర్వే వదన్తు తే.
యూనాం పరిణతా సేయం తపస్యేతి మతం మమ.'

అత్ర విషయతావచ్ఛేదకస్య పరసమ్మతత్వేన నిషేధ్యతయో-పన్యాసాదపహ్నుత్యా సఙ్కీర్ణః.

ఉదాహరణము—

'నరైర్వరగతి ప్రదేతి' మొ. "మనుష్యులచే మంచిగతి యిచ్చున దనియు, దేవతలచేత మనదియనియు, సిద్ధ సంఘములన్నిటిచేతను గొప్పసిద్ధి నిచ్చుచున్నదనియు, ఇతర సంగము నంతయు విడచిన మునులచే విష్ణుని శరీరమనియు ఆశ్రయింపబడిన శంతను భార్య (గంగానది) నా శరీరమునకు

వెంటనే శుభమును కలుగ జేయుగాక !"

ఇచట లిప్సారుచులను నిమిత్తములవలన, అనేక గ్రహీతలొనర్చిన వరగతి ప్రదయని మొదలగు నీ యనేక తీరుల గ్రహణసముదాయము గంగవిషయమున ప్రీతిని ప్రోత్సహించును. ఇచటయుల్లేఖను శుద్ధమే. రూప కాదులేమియు కలియలేదు గదా !

సంకీర్ణమైనదియు గన్పడును. ఎట్లనగా—

"ఆలోక్య" మొ. "ఓ సుందరీ ! చిఱునగవుగల యీ మొగమును జూచి పద్మ మనేబుద్ధితో తుమ్మెదలు యెక్కువగా సంతసించుచున్నవి. మరియు ఓ స్నేహితురాలా ! పూర్ణచంద్రుడనెడు సంభ్రమముతో చకోర పిట్టలు జంచువును కదల్చుచున్నవి."

ఇచట నొక గ్రహణరూపమగు భ్రాన్తితో సముదాయాత్మకమగు నుల్లేఖము సంకీర్ణమైనది.

'వనితేతి' మొ. "ఈమెను లోకులందరును వనితయని చెప్పిన చెప్పనిమ్ము. యువకులయొక్క ఫలించిన తపస్సే ఈమెయని నా అభిప్రాయము"

ఇక్కడ విషయనిర్ణాయకమును పరసమ్మతముగా నిషేధ్యమని చెప్పుటవలన యపహ్నుతితో సంకీర్ణమైనది.

**అప్పయదీక్షితాస్తు—'ఏవమపి యది—**

**'కాన్త్యా చన్ద్రం విదుః కేచి త్సౌరభేణాంబుజం పరే**
**వక్త్రం తవ వయం బ్రూమ స్తపసైక్యం గతం ద్వయమ్.'**

**ఇత్యపహ్నవోదాహరణవిశేషేఽతి వ్యాప్తిః శఙ్క్యా, తదానీ-మనేకధోల్లేఖనం నిషేధాస్పృష్టత్వేన విశేషణీయమ్. తత్రాద్యోల్లేఖన ద్వయం పరమతత్వోపన్యాససామర్థ్యాద్గమ్యమాననిషేధమితి నాతి వ్యాప్తిః, ఇత్యాహుః తన్న, 'ద్వివిధశ్చాయ ముల్లేఖః—శుద్ధోఽల ఙ్కారాన్తరసఙ్కీర్ణశ్చ' ఇత్యుక్త్వా "శ్రీకణ్ఠజనపదవర్ణనే—'యస్త**

పోవనమితి మునిభిరగృహ్యతే' ఇత్యాదౌ శుద్ధః, 'యమనగరమితి శత్రుభిః, వజ్రపఞ్జరమితి శరణాగతైః' ఇత్యాదౌ భ్రాన్తిరూపకాది సఙ్కీర్ణః" ఇతి స్వయమేవోక్తత్వాత్. ఇహాప్యపహ్నుత్యాఽసఙ్కీర్ణ ఉల్లేఖ ఇత్యస్య సువచత్వాత్. యది చైవంవిధాపహ్నుతివారణాయ నిషేధాస్పృష్టత్వం విశేషణముచ్యతే తదా—

"కపాలే మార్జారః పయ ఇతి కరాంల్లేఢి శశిన
స్తరుచ్ఛిద్రప్రోతాన్ బిసమితి కరీ సఙ్కలయతి.
రతాన్తే తల్పస్థాన్ హరతి వనితాప్యంశుకమితి
ప్రభామత్తశ్చన్ద్రో జగదిదమహో విభ్రమయతి"

ఇతి త్వదుదాహృతభ్రాన్తావపి ప్రసఙ్గః కథం నామ వార్యేత. మార్జారాద్యనేకగ్రహీతృకానేకధోల్లేఖనస్య తత్రాపి సత్త్వాత్ 'స్వస్వప్రియాహారలిప్సారూపనిమిత్తభేదాచ్చ. తస్మాత్ సఙ్కీర్ణనివారణాయ యత్నో ఽనర్థకఏవ.'

అప్పయ్య దీక్షితులు మాత్రము "ఇత్లైనను

"కాంత్యా చంద్రం"(కొంతమంది కాంతిచే చంద్రుడనుకొందురు. సౌరభముచే పద్మమని గొందరు. మేము అనెదము గదా! తపస్సుచే రెండును ఏకత్వము పొందినవని)

అను నపహ్నవోదాహరణ విశేషమున నతివ్యాప్తి శంకించినచో అపుడనేకముగా నుల్లేఖించుటను నిషేధస్పర్శలేదని విశేషించవలెను. అందులో మొదటి యుల్లేఖనములు రెండును పరమతములుగా నుపన్యసించు సామార్థ్యము వలన నిషేధము గమ్యమగుచున్నదని అతివ్యాప్తి లేదని వ్రాసిరి.

అదికాదు— ఈ ఉల్లేఖములు రెండు విధములు—శుద్ధము. అలంకారాన్తర సంకర్ణము అనిచెప్పి శ్రీ కంఠదేశవర్ణములో "నేది తపోవనమని మునులచే గ్రహింపబడెనో" ఇత్యాదులందు శుద్ధము "యమనగరమని శత్రువులు; వజ్రపంజరమని శరణాగతులు తలంతురో–" ఇత్యాదులందు భ్రాంతిరూపకాదులతో సంకీర్ణమనియు తానే జెప్పెను. గనుక-ఇక్కడకూడ నపహ్నుతి

సంకీర్ణమగు ఉల్లేఖమని సులభముగానే చెప్పవచ్చునుగదా? అదిగాక నిటువంటి యపహ్నుతి నివారణకై "నిషేధస్పర్శ లేదు"అనుచో నపుడు—

'కపాలే మార్జాలః' (పిల్లి కపాలమునందు చంద్రుని కిరణమును పాలని నాకుచున్నది. చెట్లమధ్య నుండి ప్రవర్తించిన వాటిని ఏనుగు తామరతూడని సంకలనము చేయుచున్నది. వనితయును రతాంతమున తల్పమునందున్న వస్త్రమని తీసికొనుచున్నది. యీతీరుగా ప్రభామత్తుడగు చంద్రుడు ఈ జగత్తును భ్రమింప జేయుచున్నాడు.")

అని నీవుదహిరించిన భ్రాన్తిలోనే నతివ్యాప్తి నెట్లు వారింతువు? మార్జాలాదులగుననేక గ్రహీతలుగల ననేక ప్రకారముల నుల్లేఖన మచట గూడ నున్నదే? తమకు నిష్టములగు నాహారములు లభించవలయుననే కోర్కెలు నిమిత్తము లున్న భిన్నములేగదా?గావున సంకీర్ణములను వారించుటకై యత్నము నిరర్థకమే.

సంశయసఙ్కీర్ణో యథా—

"భానురగ్నిర్యమో వాయం ఖలిః కర్ణోఽథవా శిబిః
ప్రత్యర్థినశ్చార్థినశ్చ వికల్పన్త ఇతి త్వయి."

అత్ర ద్వయోర్గ్రహణయోః ప్రత్యేకం సంశయత్వం సముదాయస్య తూల్లేఖతా. అయం చ స్వరూపమాత్రోల్లేఖే స్వరూపోల్లేఖః ప్రాగేవనిరూపితః. ఫలానాముల్లేఖే ఫలోల్లేఖో యథా—

"అర్థినో దాతుమేవేతి త్రాతుమేవేతి కాతరాః,
జాతోఽహం హన్తుమేవేతి వీరాస్త్వాం దేవ జానతే."

హేతూనాముల్లేఖే హేతూల్లేఖో యథా—

'హరిచరణనఖరసఙ్గాదేకే హరమూర్ధస్థితేరన్యే
త్వాం ప్రాహుః పుణ్యతమామపరే సురతటిని
వస్తుమాహాత్మ్యాత్.'

సంశయసంకీర్ణ మెట్లనగా -

"భానురగ్నిర్యమోవాయం" మొ (ఓ రాజా! నిన్ను గురించి సూర్యుడా అగ్నియా, యముడా, బలియా, శిబియా అని శత్రువులును యాచకులును వికల్పమును జేయుచున్నారు.)

ఇచట రెండు గ్రహణములును ప్రత్యేకముగా సంశయములే. సముదాయము మాత్రము ఉల్లేఖము, ఇది స్వరూపమాత్ర ముల్లేఖించుటవలన స్వరూపోల్లేఖనము, ఇదివరకే నిరూపించబడినది. ఇక ఫలముల నుల్లేఖించుట ఫలోల్లేఖ మెట్లనగా,

"అర్థినో దాతుమేవేతి" మొ.(యాచకులు యిచ్చుటకే ననియు,భీతులు కాపాడుటకే అనియు వీరులుచంపుటకే జన్మించినా డనియు, ఓ ప్రభువా!నిన్నెరుగుదురు )

హేతువుల నుల్లేఖించుట హేతూల్లేఖము - ఎట్లనగా.

"హరిచరణ" మొ.విష్ణువుయొక్క పాదముల గోరులతో సంబంధము వలన అని కొందరును, శివుని శిరస్సున నుండుటవలన అని కొందరును, వస్తుమాహాత్మ్యమువలననే యని కొందరును ఓ గంగా! పుణ్యతమగా నిన్ను చెప్పుచున్నారు."

**అత్ర ప్రకారాన్తరేణాప్యుల్లేఖో దృశ్యతే - యత్రాసత్యపి గ్రహీత్రనేకత్వే విషయాశ్రయసమానాధికరణాదీనాం సమ్బన్ధినామన్యతమానేకత్వప్రయుక్తమేకస్య వస్తునోఽనేకత్వప్రకారత్వమ్. అయమపి ద్వివిధః—శుద్ధోఽలఙ్కారాన్తరసఙ్కీర్ణశ్చ,**

**శుద్ధో యథా—**

**"దీనవ్రాతే దయార్ద్రా నిఖిలరిపుకులే నిర్దయా కించ మృద్వీ**
**కావ్యాలాపేషు, తర్కప్రతివచనవిధౌ కర్కశత్వం దధానా,**
**లుబ్ధా ధర్మేష్వలుబ్ధా వసుని పరవిపద్దర్శనే కాందిశీకా**
**రాజన్నాజన్మరమ్యా స్ఫురతి బహువిధా తావకీ చిత్తవృత్తిః",**

**అత్ర దీనవ్రాతాదీనాం విషయాణామనేకత్వాచ్చిత్తవృత్తేరనేకవిధత్వమ్. రాజవిషయకరతి భావోపస్కారకోఽయముల్లేఖః. యద్యపి**

చిత్తవృత్తివ్యక్తీనామత్రైక్యం నాస్తి, తదీయచిత్తవృత్తిత్వేన సామాన్యేన తాసామేకత్వం వివక్షితమ్.

యథావా—

"కాతరాః పరదుఃఖేషు, నిజదుఃఖేష్వకాతరాః
అర్థేష్వలోభా యశసి సలోభాః సన్తి సాధవః"

అత్రాపి సాధవః సన్తీత్యనేన మృతా అపి న మృతాస్తే, ఇతరే పునరమృతా అపి మృతా ఏవేత్యర్థాభివ్యక్తిద్వారా వ్యజ్యమానే సాధూత్కర్ష విశేషే ఉపస్కారకోఽయమ్.

ఇట మరొకతీరులో కూడ నుల్లేఖము గన్పడును, గ్రహీత లనేకులు లేకున్నను విషయము, ఆశ్రయము, సమానాధికరణము మొదలైన సంబంధులు అనేకములగుటవల్ల వస్తువొకటియైనను అనేక ప్రకారములగునుగదా?

ఇదియు రెండురకములు — శుద్ధము, అలంకారాంతర సంకీర్ణము.
శుద్ధ మెట్లనగా—

"దీనవ్రాతే" మొ.(ఓ రాజా! నీయొక్క మనోవృత్తి దీనవ్రాతమున జాలిగలదై, యావన్మంది శత్రుసమూహమున నిర్దయమై కావ్యాలాపమునందు మృదువై, తర్కముతోడి ప్రతివచన విధియందు కాఠిన్యము వహించినదై, ధర్మమునందు లోభముకలదై, ధనమునందు లోభములేనిదై యితరుల విపత్తుచూచుటయందు భయపడినదై పుట్టినది మొదలుకొని రమమయినదై, నానావిధములుగా నుండి స్ఫురించుచున్నది."

ఇచట దీనవ్రాతాదులు విషయములు అనేకములగుటచే చిత్తవృత్తియు ననేకవిధము. రాజవిషయమగు రతిభావోపస్కారమగు నుల్లెఖము. ఏమైనా వ్యక్తిగతముగా చిత్తవృత్తులకు నైక్యములేదు. అయినను అతనికి సంబంధించిన చిత్తవృత్తిత్వ సామాన్యముచే వాటి కన్నటిని నైక్యము వివక్షితము.

మరొకటి —

"కాతరాః"మొ పరుల దుఃఖములు గురించి భీతులును, తమ దుఖఃము

నందు అభీతులును ధనములయందు అలుబ్ధులును, యశస్సునందు లుబ్ధులైన సాధువులుందురు).

ఇక్కడగూడ సాధువులున్నారనుటచేత మృతులైనను వారు మృతులు కారు. ఇతరులు మరణింపకున్నను చచ్చినవారే-అను నర్థము నభివ్యక్తి ద్వారా వ్యజ్యమానమగు సాధుత్వ విశేషోత్కర్షమున కుపస్కారకమైనది.

**యథా వా-**

**"తుషారాస్తాపసవ్రాతే తామసేషు చ తాపినః**
**దృగన్తాస్తాటకాశత్రోర్భూయాసుర్మమ భూతయే."**

**పూర్వపద్యయోర్విషయానేకత్వప్రయుక్తం, ఇహ త్వాశ్రయానేకత్వప్రయుక్తమనేకవిధత్వం దృగన్తానామ్.**

**'విద్వత్సు విమలజ్ఞానా విరక్తా యతిషు స్థితాః.**
**స్త్రీయేషు చ గరోద్గారా నానాకారాః క్షితౌ ఖలాః'**

**అత్ర విద్వదాదిసహచరభేదప్రయుక్తం ఖలానామనేకవిధత్వమ్. ఏవమన్యేషాం సమ్బన్ధినాం భేదో௨ప్యూహ్యః.**

మరొకటి—

"తుషారాః" మొ. ("తాటకారియగు శ్రీరాముని దృగంతములు తాపసుల సమూహమునందు చల్లనివై తామసులయందు తాపము గలిగినవై నాయొక్క సంపదకొఱకు అగునుగాత !)

వెనుకటి రెండు పద్యములందును విషయముల అనేక విధత్వము వలన నేర్పడినది. ఇచటమాత్రము దృగంతములకు నాశ్రయానేకత్వమువల్ల నేర్పడినది అనేకవిధత్వము.

"విద్వత్సు" మొ. (పండితులలో విమలమైన జ్ఞానముగలవారును, యతులలో విరక్తులును, తమవారియందు విషమును వెదజల్లువారును, భూమియందు ఖలులు నానాకారముగా నున్నారు.)

ఇచట విద్వాంసులు మొదలగు సహచరుల భేదమువల్ల ఖలుల భేద మేర్పడినది. ఈ విధముగా నితరములగు సంబంధుల భేదమునుగూడ నూహింపవలెను.

సఙ్కీర్ణో యథా—

'గగనే చన్ద్రికాయన్తే హిమాయన్తే హిమాచలే
పృథివ్యాం సాగరాయన్తే భూపాల తవ కీర్తయః.'

అత్రోపమయా ఆపాతతః ప్రతీయమానయా, పర్యవసితయా చోత్ప్రేక్షయా.

"ఉపరి కరవాలధారాకారాః క్రూరా భుజఙ్గమపుఙ్గవాత్
అన్తఃసాక్షాద్ద్రాక్షాదీక్షాగురవో జయన్తి కేఽపి జనాః."

అత్రోపమావ్యతిరేకాభ్యాం తయోః సముచ్చయేనోత్ప్రేక్షయా చ సఙ్కీర్ణః.

సంకీర్ణమెట్లనగా—

"గగనే చంద్రికాయంతే" మొ. (ఓ రాజా! నీ కీర్తులు ఆకాశమున వెన్నెల లగుచున్నవి. హిమాచలమున హిమమగుచున్నవి. పృథివియందు సముద్రమగుచున్నవి.)

ఇచట నుపమావముతోను (నాపాతతః తోచు), పర్యవసిత యగు నుత్ప్రేక్షతోను.

"ఉపరి" మొ. (కొంతమంది జనులు పైకి కత్తి యంచువలె నున్న వారై సర్పముకంటె క్రూరులై యుందురు. లోపల సాక్షాత్తుగా ద్రాక్షా దీక్షయందు గురువులై యుందురు."

ఇచట నుపమావ్యతిరేకముల్తోను, వాటి సముచ్చయముతోను ఉత్ప్రేక్షలతోను సంకీర్ణము.

"యమః ప్రతిమహీభృతాం హుతవహోఽసి తన్నివృతామ్
సతాం ఖలు యుధిష్ఠిరో ధనపతి ర్ధనాకాఙ్క్షిణామ్.
గృహం శరణమిచ్ఛతాం కులిశకోటిభిర్నిర్మితం
త్వమేక ఇహ భూతలే బహువిధో విధాత్రా కృతః"

అత్ర కవినా యమత్వాదినా రూపేణ రాజ్ఞో రూపవతః కరణాద్రూపకేణ, విపక్షభూపాలాదినా మేతస్మిన్నాయాతే యమత్వాదినా భ్రాన్తిరపి సమ్భవతీతి భ్రాన్తిమతా, విపక్షభూపాలాదిభిరనేకై ర్గృహీతృ

ఖిర్యమత్వాదిభిరనేకైర్ధర్మై రుల్లేఖనాత్ ప్రాగుక్తోల్లేఖప్రకారేణ చ సహ సఙ్కీర్ణోఽయం సమ్బన్ధిషష్ఠ్యన్త భేదప్రయుక్తవర్ణ్యానేకవిధత్వాక ఉల్లేఖః.

"యమః ప్రతిమహీభృతామ్" మొ. (ఓ రాజా! నీవు ప్రత్యర్థులకు యముడవు. వారి దేశములకు అగ్నివైతివి. సత్పురుషులకు యుధిష్ఠిరుడవు ధనమును కోరువారలకు ధనపతివై యుంటివి. శరణము కోరువారలకు వజ్రముచే నిర్మించిన గృహమవుదువు. ఇట్లు నీ వొక్కడవే యీభూతలమున అనేక రకములుగా బ్రహ్మచే నిర్మింపబడితివి.)

ఇచట కవి యమాదికమగు రూపముచేత రాజును రూపవంతుని జేయుటవలన రూపకముతోను, శత్రురాజులు మొదలగువారికి ఇతడురాగా యము డనే భ్రాంతి సంభవించును అని భ్రాంతిమత్తుతోను, శత్రురాజులు మొదలగు ననేక గ్రహీతలచేత యమత్వాదులగు ననేక ధర్మములవల్ల నుల్లేఖనమొనర్చుటచేత వెనుక జెప్పిన నుల్లేఖప్రకారముచేతనుగూడా సంకీర్ణమై సంబంధిషష్ఠ్యంత భేదప్రయుక్త వర్ణ్యానేక విధత్వముఏర్పడినది యుల్లేఖము.

అత్రేదం బోధ్యమ్—ప్రథమ నిరూపితోల్లేఖప్రకారే 'యం మహావిష్ణురితి వైష్ణవాః, శివ ఇతి శైవాః, యజ్ఞపురుష ఇతి యాజ్ఞికాః, స్వభావ ఇతి లోకాయతికాః, బ్రహ్మేత్యౌపనిషదాః వదన్తి సోఽయమాదిపురుషో హరిః' ఇత్యాదౌ తత్తద్గ్రహీతృక తత్తత్ప్రకారక జ్ఞానసముదాయస్య చమత్కారజనకతాయా అనుభవసిద్ధత్వేనాలఙ్కారత్వమ్. ద్వితీయే తు ప్రకారే "యః శిష్టేషు సదయః దుష్టేషు కరాలః' ఇత్యాదౌ తత్తద్విషయభేదభిన్నస్య ప్రకారసముదాయమాత్రస్య తథాత్వమ్. న తు విద్యమానస్యాపి జ్ఞానాంశస్య. చమత్కారిత్వేనాననుభవాత్. చమత్కారనిబన్ధనో హ్యలఙ్కారభావ ఉపమాదీనామ్. అత ఏవాస్మాభిః 'విషయాద్యన్యతమానేకత్వప్రయుక్తమేకస్య వస్తునోఽనేకప్రకారత్వమ్' ఇతి ద్వితీయ ఉల్లేఖో లక్షితః. ఏవం చ 'లక్షణద్వయాన్యతరత్వముల్లేఖసామాన్యలక్షణతావచ్ఛేదకమ్' ఇత్యాహుః పరే తు "ప్రకారద్వయేఽపి వర్ణ్యవృత్తిత్వేన భాసమానప్రకారసముదాయ ఏవోల్లేఖః" ఇత్యపి వదన్తి.

ఇచట నీవిషయము దెలియవలెను,. మొదట నిరూపించిన యుల్లేఖప్రకా

రములలో "యెవనిని మహావిష్ణువని వైష్ణవులు, శివుడని శైవులు, యజ్ఞ పురుషుడని యాజ్ఞికులు, స్వభావమని లోకాయతికులు, బ్రహ్మయని ఔపనిషదులు చెప్పుదురో, ఆయనే ఆదిపురుషుడగు హరి" ఇత్యాదులందు నానాగ్రహీతలు నానాప్రకారముల గ్రహించిన జ్ఞానసముదాయము చమత్కారము గల్గించుట యనుభవసిద్ధమగుటవలన నట నదియే అలంకారము.

ఇక రెండవప్రకారములో "ఎవడు సజ్జనులయందు సదయుడో, దుర్జనులయందు క్రూరుడో" ఇత్యాదికమునందు నానా విషయముల భేదముచే భిన్నమగుప్రకారముల సముదాయమాత్రమునకు అలాగుండుట. అంతేకాని ఉన్న జ్ఞానాంశమునకున్నుగాదు. చమత్కారకమగుట అనుభవములో లేదుగదా? ఉపమాదులు అలంకారములగుట చమత్కారమూలకమేగదా?

ఇందువల్లనే 'విషయాద్యన్యతమము లనేకములగుట వలన ఒక వస్తువు అనేక ప్రకారములగుట అని ద్వితీయోల్లేఖ లక్షణమును జెప్పితిమి.

ఈ తీరుగా — లక్షణద్వయాన్యతరత్వమే ఉల్లేఖలక్షణతా నిర్ణాయకము అని అందురు. ఇతరులు ప్రకారద్వయమునందును వర్ణ్యవృత్తిగా భాసించు ప్రకారసముదాయమే ఉల్లేఖమనియును అందురు.

అథోల్లేఖస్య ధ్వనిః—యథా—

అనల్పతాపాః కృతకోటిపాపా గద్రైకశీర్ణా భవదుఃఖజీర్ణాః
విలోక్య గఙ్గాం విచలత్తరఙ్గామమీ సమస్తాః సుఖినో భవన్తి."

అత్ర పూర్వార్ధోదితానాం చతుర్ణాం విలోకనకర్తౄణాం సుఖితోక్త్యా క్రమేణ తాప-పాప-రోగ-భవ—నాశకత్వప్రకారకాణి గ్రహణాన్యాక్షిప్యన్తే. అయం చ శుద్ధస్యోల్లేఖస్య ధ్వనిః.

సఙ్కీర్ణస్య యథా—

'స్మయమానాననాం తత్ర తాం విలోక్య విలాసినీమ్
చకోరాశ్చఞ్చరీకాశ్చ ముదం పరతరాం యయుః."

అత్ర ధ్వన్యమానయా ఏకైకగ్రహణరూపయా భ్రాన్త్యా తదుభయసముదాయాత్మా ఉల్లేఖః సఙ్కీర్ణః. న చాత్రభ్రాన్తేరేవ చమత్కార ఇతి శక్యాపహ్నవ ఉల్లేఖః, అనేకకర్తృకానేకధాగ్రహణస్యాలఙ్కారాన్తరవివిక్తవిషయస్య చమత్కృతేరిహాపి సత్త్వాత్.

అనంతర ముల్లేఖధ్వని—

"అనల్పతాపాః" మొ. (గొప్ప తాపములుగలవారును చేయబడిన అనేక పాపములు గలవారును, రోగములచే శీర్ణులైనవారును, సంసారదుఃఖమున జీర్ణులును, కదలుచున్న తరంగములు గల యీ గంగను జూచి యీ సమస్తజనులును సుఖులగుదురు)

ఇచట మొదటి సగమునందు జెప్పబడిన చూచువారు నలుగురిని సుఖవంతులగుదురనుటవలన క్రమముగా, తాప పాప రోగభవములకు నాశకత్వములు ప్రకారములు గల గ్రహణములు ఆక్షేపింపబడుచున్నవి: ఇది శుద్ధోల్లేఖమునకు ధ్వని.

సంకీర్ణ మెట్లనగా—

"స్మయమానాననాం" మొ. (ఆ విలాసిని నవ్వుచునుండగా చూచి చకోరములును చంచరీకములును చాలా సంతసమును బొందినవి.)

ఇచట ధ్వనించుచున్న నైకైకగ్రహణరూపమగు భ్రాన్తితో తదుభయ సముదాయాత్మకమగు నుల్లేఖము సంకీర్ణము ఇచట భ్రాంతియే చమత్కారము గల్గించునని యుల్లేఖమపహ్నవించరాదు. అనేకమంది కర్తలు అనేక రూపములుగా గ్రహించుట అలంకారాన్తరముకన్న వివిక్తవిషయమగునది, చమత్కారకమగుట ఇచటనుగూడ నున్నదే.

**ద్వితీయోల్లేఖస్య ధ్వని ర్యథా—**

**'భాసయతి వ్యోమగతా జగదఖిలం కుముదినీర్వికాసయతి**
**కీర్తిస్తవ ధరణిగతా సగరసుతాయాసమఫలతాం తనుతే.'**

**అత్రాధికరణభేదప్రయుక్త మేకస్యామేవ కీర్తౌ చన్ద్రికాత్వసాగరత్వరూపానేకవిధత్వం రూపకసఙ్కీర్ణం ధ్వన్యతే.**

ద్వితీయోల్లేఖధ్వని యెట్లనగా—

"భాసయతి" మొ. (ఓ రాజా! యీ కీర్తి ఆకాశమునందున్నదై జగత్తంతనూ ప్రకాశింపజేయుచున్నది. కలువతీవెలను వికసింప జేయుచున్నది భూమియందున్నదై సగరపుత్రుల ఆయాసమును వ్యర్థము చేయుచున్నది.) ఇచట అధికరణ భేదప్రయుక్తమగు నొక కీర్తియందే చంద్రికాత్వసాగరత్వ రూపమగు ననేక విధత్వము రూపకసంకీర్ణము ధ్వనించును.

ఇది ఉల్లేఖాలంకారము

## అపహ్నుతిః

అథాపహ్నుతిః. ఉపమేయతావచ్ఛేదకనిషేధ సామానాధికరణ్యే నారోప్యమాణముపమానతాదాత్మ్యమపహ్నుతిః. రూ ప క వా ర ణాయ తృతీయాన్తమ్. అస్యాం చోపమేయతావచ్ఛేదకస్య నిషేధా దుపమేయతావచ్ఛేదకోపమానతావచ్ఛేదకయోర్విరోధో గమ్యతే. రూపకే తు తయోః సామానాధికరణ్య ప్రత్యయాత్ స నివార్యతే, ఉదాహరణమ్—

'స్మితం నైతత్ కిన్తు ప్రకృతిరమణీయం వికసితం
ముఖం బ్రూతే మూఢః కుముదమిద ముద్యత్పరిమలమ్.
స్తనద్వన్ద్వం మిథ్యాకనకనిభమేతత్ఫలయుగం
లతా రమ్యా సేయం భ్రమరకులనమ్యా న రమణీ.'

ఇయంచానుగ్రాహ్యానుగ్రాహకభావాపన్నావయవసఙ్ఘాతాత్మ కతయా సావయవా. నిరవయవేయం యథా—

'శ్యామం సితం చ సుదృశో న దృశోః స్వరూపం
కింతు స్ఫుటం గరలమేతదథామృతం చ.
నో చేత్ కథం నిపతనాదనయో స్తథైవ
మోహం ముదంచ నితరాం దధతే యువానః.

అత్ర ప్రతిజ్ఞాతార్థవైపరీత్యే బాధకోపన్యాసాద్ద్వేత్వపహ్నుతిః.

అపహ్నుతి—

"ఉపమేయతానిర్ణాయకమును నిషేధించి ఆ నిషేధమునకు సమానాధి కరణముగా నారోపించబడు నుపమానతాదాత్మ్యము అపహ్నుతి."

రూపకమును వారించుటకై సమానాధికరణముగా ననునంతవరకు అనబడినది. ఈ పయపహ్నుతిలో నుపమేతాయవచ్ఛేదకమును నిషేధించుటవలన ఉపమేయతావచ్ఛేదకమునకు నుపమానతావచ్ఛేదకమునకును విరోధము తోచును. రూపకములో నా రెంటికిని ఏకాధికరణత్వము స్ఫురించును గనుక విరోధము నివర్తించును.

ఉదాహరణము—

"స్మితం నైతత్కింతు" మొ. (ఇది చిఱునగవుకాదు, ఏమనగా సహజ

ముగా నందమైన వికాసము. మూఢులు వదనమందురు; ఇది ఉదయించు చున్న పరిమళముగల కలువపువ్వు. స్తనద్వంద్వము మిథ్య; బంగారువంటిది యిది పండ్లజత. భ్రమరకులముచే వంచదగిన తీగె యిది. రమణికాదు)

ఇది యనుగ్రాహ్యానుగ్రాహకభావము నొందిన యవయవముల సమూహమే స్వరూపముగా గల్గియుండుటవలన సావయవము.

నిరవయవమెట్లనగా——

"శ్యామం సితం చ" మొ. (నల్లగాను తెల్లగాను ఉన్న ఇది స్త్రీకనుల యొక్క స్వరూపముకాదు. కాని స్ఫుటమైన గరళమును అమృతమున్ను: అలా కానియెడల యీ రెండును పడుటవలన అప్పుడే మోహమును సంతోషమును లోకులు ఏల ఎక్కువగా బొందుచున్నారు?)

ఇచట ప్రతిజ్ఞాతమగు నర్థమునకు వైపరీత్యమునకు బాధకము నుపన్యసించుటవల్ల హేత్వపహ్నుతి.

**అస్యాం చం నఞాదిభిః సాక్షాత్. పరమతసిద్ధత్వాద్యుపన్యాసైశ్చ కిఞ్చిత్ వ్యవధానేన విషయస్య నిషేధే బోధ్యమానే ప్రాయశో వాక్యస్య భేదః. మిష-చ్ఛల-చ్ఛద్మ-కపట-వ్యాజ-వపురాత్మాదిశబ్దైస్తు తస్మింస్తస్యైక్యమ్. క్వచిదపహ్నవపూర్వకత్వం, క్వచిచ్చారోపపూర్వకత్వం, క్వచిద్విషయితాద్రూప్యవిషయనిషేధయోరేకస్య శాబ్దత్వమేకస్యార్థత్వం, క్వచిదుభయోః శాబ్దత్వమథోభయోరార్థత్వం విధేయత్వమనువాద్యత్వం చేతి. ఏవమనేకే ప్రకారాః సమ్భవన్తి. పరం న తే వైచిత్ర్యవిశేషమావహన్తీత్యగణనీయాః, ఏవమపి దిఙ్మాత్రముపదర్శ్యతే——**

దీనియందు నఞ్ మొదలగువానిచే సాక్షాత్తుగాను 'ఇతరుల యభిమతముచే సిద్ధ అని యుపన్యసించుటచే గొంచెము వ్యవధానముతో విషయనిషేధము బోధించుటవలన తరచుగా వాక్యమునకు భేదమేర్పడును మిష - ఛల - ఛద్మ - కపట - వ్యాజ - వపుః - ఆత్మాదిశబ్దములచే ఉపమేయనిషేధము చేయబడినచో వాక్యమునకైక్యము. ఒకచో నపహ్నవ పూర్వకత్వము మరొకచోట నారోపపూర్వకత్వము, మరొకచోటను విషయితాద్రూప్య విషయనిషేధములలో నొకదానికి శాబ్దత్వము, ఇంకొకదాని కార్థత్వము;

ఒకచోటను రెంటికి శాబ్దత్వము, మరొకచోట నార్థత్వము, విధేయత్వము అనువాద్యత్వమున్ను. ఈ తీరుననే అనేకరీతులు సంభవించును. అవి యేవిధమైన వైచిత్ర్యాది విశేషమును ఆవహింపలేవు గనుక ఇవి లెక్కలోనికిరావు. అయినను దిఙ్మాత్రముగా జూపబడును.

తత్ర ప్రాగుక్తాయాం సావయవాపహ్నుతౌ ప్రథమావయవేఽపహ్నవపూర్వకత్వముభయోః శాబ్దత్వం విధేయత్వం వాక్యభేదశ్చ. ద్వితీయావయవే తు వక్త్రగత మూఢతోక్త్యా తద్గతభ్రాన్తిప్రతిపత్తివ్యవహితా నిషేధప్రతిపత్తిరితి నిషేధ ఆర్థః. తాద్రూప్యం శాబ్దమ్. విధేయత్వ వాక్యభేదాపహ్నవపూర్వకత్వాని పూర్వవత్. చతుర్థావే పునరారోపపూర్వకోఽపహ్నవః. ఉభయోః శాబ్దత్వ విధేయత్వే వాక్యభేదశ్చ ప్రథమవదేవ.

"వదనే వినివేశితా భుజఙ్గీ పిశునానాం రసనామిషేణ ధాత్రా
అనయా కథమన్యథావలీఢా నహి జీవన్తి జనా మనాగతన్త్రాః"

అత్రైకవాక్యత్వం నిషేధ తాద్రూప్యయోరార్థత్వమనువాద్యత్వంచ; నివేశనస్య విధేయత్వాత్. ఏవమన్యదప్యూహ్యమ్.

అచట వెనుకజెప్పిన సావయవాపహ్నుతిలో ప్రథమావయవమున నపహ్నవపూర్వకత్వమగుట, రెంటికి శాబ్దత్వము, విధేయత్వము, వాక్యభేదమున్ను. రెండవ యవయవములో మూఢుడని చెప్పుటతో అతనియందలి భ్రాంతి ప్రతిపత్తివలన వ్యవహితమైన నిషేధ ప్రతిపత్తి అని నిషేధము ఆర్థము శబ్దమే తాద్రూప్యమును దెల్పును. విధేయత్వము, వాక్యబేధము అపహ్నవపూర్వకత్వమున్ను వెనుకటివలెనే. నాల్గవ యవయవమునందుమాత్రము నారోపపూర్వకమగు నపహ్నవము. ఈ రెంటికి శాబ్దత్వవిధేయత్వములు వాక్యభేదమున్ను మొదటిదానికివలెనే.

"వదనే వినివేశితా" మొ (పిశునుల వదనమునందు సర్పమును నాలికయనే మిషతో బ్రహ్మ ప్రవేశపెట్టెను. లేకపోయినయెడల దీనిచేత అవలీఢులై జనులు మంత్రమే లేక ఏల మరణింతురు ?)

ఇచట నేకవాక్యత్వము నిషేధతాద్రూప్యములకు ఆర్థత్వము అనువాద్యత్వమున్ను. నివేశనము విధేయము గనుక. ఈ తీరుగా నితరమునూహింపవలెను.

అత్ర చ లక్షణే ఆరోప్యమాణ మిత్యస్యాహార్యనిశ్చయవిష యీ క్రియమాణమిత్యర్థః. తేన —

'సఙ్గ్రామాఙ్గణ సమ్ముఖాహతకియద్విశ్వమ్భరాధీశ్వర
వ్యాదీర్ణీకృతమధ్యభాగవివరోన్మీలన్నభోనీలిమా.
అఙ్గారప్రఖరైః కరైః కవలయన్ సర్వం జగన్మణ్డలం
మార్తణ్డోఽయముదేతి కేన పశునా లోకే శశాఙ్కీకృతః'

అత్ర చ విరహిజనవాక్యే నాయం శశాఙ్కః, అపితు సచ్ఛిద్రో మార్తణ్డ ఇతి చ్ఛాయామాత్రమపహ్నుతేః, న త్వపహ్నుత్యలఙ్కారః, తద్జ్ఞానస్య దోషవిశేషజన్యత్వేనానాహార్యత్వాత్, కిన్తు భ్రాన్త్యలఙ్కార ఏవ.

'అలిర్మృగో వా నేత్రం వా యత్ర కిఞ్చిద్విభాసతే,
అరవిన్దం మృగాఙ్కో వా ముఖం వేదం మృగీదృశః."

ఇత్యత్ర ముఖమరవిన్దం వేతి కవినిష్ఠాహార్యసంశయే ముఖనిషేధ సామానాధికరణ్యేన విషయీభవతోఽరవిన్ద తాదాత్మ్యస్య నిశ్చయ విషయత్వాభావాన్న సఙ్గ్రహః. న చాత్ర విషయనిషేధస్యా- పదార్థత్వం శఙ్క్యమ్, వాశబ్దార్థత్వాత్.

ఈ లక్షణములో నారోప్యమాణ మనగా నాహార్యనిశ్చయమునకు గోచరీక్రియమాణమని యర్థము. దానిచేత—

"సంగ్రామాంగణ" (యుద్ధప్రదేశమునందు నెదురుగా జంపబడిన కొంతమంది రాజులచే చీల్చబడిన మధ్యభాగమున ప్రకాశించుచున్న ఆకాశపు నల్లదనముగలవాడై నిప్పు బొగ్గులవలె క్రూరమైన కిరణములచే జగన్మండలమును భక్షించుచు సూర్యు డుదయించుచున్నాడు. ఏ పశువు లోకమున ఇతనిని చంద్రునిగా జేసెను?)

ఇత్యాది విరహిజనవాక్యములో 'నితడు చంద్రుడుగాదు, మధ్యరంధ్ర ముగల సూర్యుడు' అని యపహ్నవచ్ఛాయమాత్రము అంతేకాని అపహ్నవాలంకారముగాదు. ఆ జ్ఞానము దోషవిశేషమున గల్గినది గనుక ననాహార్యము, ఇక నేమనగా భ్రాన్త్యలంకారమే.

"అలిర్మృగో వా" అనుచోట 'ముఖము అరవిందమా' అని కవినిష్ఠా

హార్యసంశయము లేకుండ మనస్సున సమానాధికరణముగా గోచరమగు చున్న యరవిందతాదాత్మ్యము నిశ్చయగోచరముగాదు గనుక నది సంగృహీతముగాదు. ఇచట విషయనిషేధము నపదార్థమని శంకింపరాదు. వాశబ్దార్థమే అది.

యత్తు కువలయానన్దాఖ్యే సన్దర్భే అప్పయదీక్షితైరపహ్నుతి ప్రభేదకథనప్రస్తావే పర్యస్తాపహ్నుత్యాఖ్యం భేదం నిరూపయద్భిరభిహితమ్—

'అన్యత్ర తస్యారోపార్థః పర్యస్తాపహ్నుతిస్తు సః
నాయం సుధాంశుః కిం తర్హి సుధాంశుః ప్రేయసీముఖమ్'.

ఇతి అత్ర చిన్త్యతే-నాయమపహ్నుతేర్భేదో వక్తుంయుక్తః. అపహ్నుతిసామాన్య లక్షణానాక్రాన్తత్వాత్. తథాహి - 'ప్రకృతం యన్నిషిధ్యాన్యత్సాధ్యతే సా త్వపహ్నుతిః; ఉపమేయమసత్యం కృత్వా ఉపమానం సత్యతయా యత్ స్థాప్యతే సాఽపహ్నుతిః' ఇతి కావ్యప్రకాశోక్తలక్షణబహిర్భావస్తావత్ స్ఫుట ఏవ. ఏవం 'విషయాపహ్నవే వస్త్వన్తరప్రతీతావపహ్నుతిః' ఇత్యలఙ్కారసర్వస్వోక్తం లక్షణమపి నాత్ర వర్తతే.

'ప్రకృతస్య నిషేధేన యదన్యత్వప్రకల్పనమ్
సామ్యాదపహ్నుతిర్వాక్య భేదాభేదవతీ ద్విధా.'

ఇతి చిత్రమీమాంసాగతం తన్నిర్మితమపి లక్షణమిహ తథైవ. తస్మాత్ 'నాయం సుధాంశుః కిం తర్హి సుధాంశుః ప్రేయసీముఖమ్' ఇత్యత్ర దృఢారోపం రూపకమేవ భవితుమర్హతి, నాపహ్నుతిః. ఉపమేయతోపమానతావచ్ఛేదకయోః సామానాధికరణ్యస్య నిష్ప్రత్యూహం భానాత్. తదుక్తం విమర్శిన్యామ్ - 'న విషం విషమిత్యాహుర్బ్రహ్మస్వం విషముచ్యతే'. అత్ర విషస్య నిషేధపూర్వం బ్రహ్మస్వవిషయే ఆరోప్యమాణత్వాత్ దృఢారోపం రూపకమేవ నాపహ్నుతిః' ఇతి. యదిచ ప్రాచీనమతము పేక్ష్యాలఙ్కారరత్నాకరేణేవ మయాప్యయం ప్రకారోఽపహ్నుతిమధ్యే గణిత ఇత్యుచ్యతే తదా ఆహార్య తాద్రూప్యనిశ్చయస్య సమానత్వాద్రూపక భేద ఏవాపహ్నుతి

రిత్యప్యుచ్యతామ్. నిరస్యతాం చ ప్రాచీనమతముదాహృతమ్. ఏవమపి చిత్రమీమాంసాగత త్వన్నిర్మితాపహ్నుతి లక్షణస్యాత్రావ్యాప్తిః స్థితైవ అపిచ యది 'నాయం. సుధాంశుః కింతర్హి సుధాంశుః ప్రేయసీ ముఖమ్' ఇత్యత్ర పర్యస్తాపహ్నుతిరిత్యుచ్యతే, తదా తస్యామేవ త్వత్కృత చిత్రమీమాంసాగతస్య—

'బిమ్బావిశిష్టే నిర్దిష్టే విషయే యద్యనిహ్నుతే
ఉపరఞ్జకతామేతి విషయీ రూపకం తదా.'

ఇతి రూపకలక్షణస్యాతివ్యాప్తిర్వజ్రలేపాయితా స్యాత్, విషయిణోనిహ్నవేఽపి విషయస్యానిహ్నుతత్వాత్. అథాపి చిత్రమీమాంసాయాం ప్రాచీన మతానుసారేణ రూపకలక్షణమ్, కువలయానన్దే చర త్వాకరాద్యనుసారేణాపహ్నుతిత్వోక్తిరితియథాకథంఞ్చిత్ సామఞ్జస్యం విధేయమితి దిక్!

అప్పయ్యదీక్షితులు కువలయానందసందర్భమున అపహ్నుతి ప్రభేదములను ప్రస్తావించు ప్రస్తావమున పర్యస్తాపహ్నుతి భేదమును నిరూపించుచు నుడివిరి—

"అన్యత్ర" మొ, అన్యత్రతస్యారోపార్థః = మరియొకయెడ దాని వారోపించుటకైనచో పర్యస్తాపహ్నుతి అని. ఈతడు సుధాంశుడు గాదు, సుధాంశువు ప్రేయసీముఖము – అని.

ఇచట విచారింతము—

ఇది యపహ్నుతి భేదమనుట యుక్తముగాదు. అపహ్నుతి సామాన్య లక్షణముచే ననాక్రాంతము గనుక – అట్లాగే చూడండి.

'ఉపమేయమును అసత్యముగాజేసి ఉపమానసత్యత్వమేది సాధింపబడునో అది అపహ్నుతి' అని కావ్యప్రకాశలక్షణమునుండి బహిర్భావము స్పష్టమేను.

ఇలాగే – 'విషయాపహ్నవే' ఇత్యాది అలంకార సర్వస్వకారుని లక్షణమున్ను ఇచట ప్రవర్తించదు.

"ప్రకృతము నిషేధించి యితరవస్తురూపత్వము కల్పించుట సామ్యము వలన అపహ్నుతి, వాక్యభేదాభేదములు గలదియై రెండువిధములు" అని

చిత్రమీమాంసాగతమగు తన్నిర్మిత లక్షణమున్ను నిక్కడ అలాగే. కనుక-"నాయం సుధాంశుః కిం తర్హి సుధాంశుః ప్రేయసీముఖం" అనుచోట దృఢారోపరూపక మేయగుటకు దగియున్నది. అంతేగాని యపహ్నుతిగాదు. ఉపమేయతానిర్ణాయకమును ఉపమానతా నిర్ణాయకమును నిరభ్యంతరముగా సమానాధికరణములై ఈచోట భాసించుచున్నవిగదా ?

ఈ విషయమే విమర్శినియందు జెప్పబడినది.

"నవిషం విషమిత్యాహుః బ్రహ్మస్వం విషముచ్యతే' ఇచట విషము నిషేధపూర్వకముగా బ్రహ్మస్వవిషయమున నారోపింపబడుచున్నది గనుక దృఢారోపమగు రూపకమే యిది. అపహ్నుతి మాత్రముగాదు." అని.

అయితే ప్రాచీనమతము నుపేక్షించి అలంకార రత్నాకరునివలె నేనుగూడా ఈ ప్రభేదమును అపహ్నుతి నడుమను గణించెదను. అని అన్నచో - ఆహార్యతాద్రూప్యనిశ్చయము సమానమే గనుక రూపక భేదమే అపహ్నుతి యనండి. ప్రాచీనుల ముఖమందు దాక్షిణ్యమును త్రోసి వేయండి.

ఇలాగైతే - చిత్రమీమాంసాగతమగు నీవు చెప్పిన యపహ్నుతి లక్షణమున కవ్యాప్తి తప్పనిదే. మరియు

"నాయం సుధాంశుః కింతర్హిసుధాంశుః ప్రేయసీముఖం" అనుచోట పర్యస్తాపహ్నుతి యనెదవేని అపుడు నీవొనర్చిన చిత్రమీమాంసాగతమగు

"బింబావిశిష్టే"

ఇత్యాది రూపక లక్షణమునకు దానియం దతివ్యాప్తి వజ్రలేపమువలె యంటుకొనును. విషయిని నిహ్నవించినను విషయము అనిహ్నుతమే గదా ?

అయితే రూపకలక్షణము ప్రాచీనుల మతము ననుసరించి చిత్రమీమాంస యందును, కువలయానందమున రత్నాకరాద్యనుసారమున నపహ్నుతిత్వమని యేలాగో ఒకలాగు సరిపెట్టుకొనవలసియున్నది.

'అనల్పజామ్బూనదదానవర్షం
తథైవ హర్షం జనయజ్జనేషు.
దారిద్ర్యఘర్మక్షపణక్షమోఽయం
ధారాధరో నైవ ధరాధినాథః.'

సావయవారోపేయమపహ్నుతిః ఆరోపమాత్రోపాయత్వే పరమ్పరితాప్యేషా సమ్భవతి. యథా—

'మనుష్య ఇతి మూఢేన ఖలః కేన నిగద్యతే
అయం తు సజ్జనామ్భోజవనమత్తమతఙ్గజః

"అనల్పజాంబూనద" మొ. (ఇది అనల్పమగు బంగారు వర్షమును, జనులయందు సంతోషమును గలిగించునట్టి దారిద్ర్యమనెడి వేసవికాలమును నశింపజేయుట యందు సమర్థమగు ధారాధరము గాని ధరాధినాథుడు కాడు.

ఇచట సావయవారోపమగు నపహ్నుతి. ఆరోపమాత్ర ముపాయమగుచో పరంపరితమైగూడా నిది సంభవించును. ఎట్లనగా-

"మనుష్యః" మొ. ("మనుష్యుడని ఖలుని మూఢుడెవడు చెప్పును? యితడు మాత్రము సజ్జనులనెడు పద్మపు తోటకు మదించిన ఏనుగు").

అస్యాశ్చ ధ్వనిర్యథా—

'దయితే రదనత్విషాం మిషాదయి తేఽమీ విలసన్తి కేసరాః
అపి చాలకవేషధారిణో మకరన్దస్పృహయాలవోఽలయః'

అత్ర 'నైతా రదనత్విషః కిం తు కిఞ్జల్క పరమ్పరాః. నచైతేఽలకాః, అపితు అలయః' ఇతి పూర్వోత్తరార్ధాభ్యాం ద్వే అపహ్నుతీ శాబ్దత్వేనైవ నివేదితే తాభ్యాంచ 'న త్వం నారీ, కింతు కమలినీ' ఇతి తృతీయాపహ్నుతిర్వ్యఞ్జనవ్యాపారేణ ప్రాధాన్యేన నివేద్యతే, తత్సమ్బన్ధవస్తునిషేధారోపయోస్తన్నిషేధారోప నివేదకత్వస్య న్యాయ్యత్వాత్. తుల్యయోగితా తు గుణతయా స్థితా.

దీని ధ్వని యెట్లనగా-

"దయితే" మొ. ఇచట "ఇవి రదన కాంతులు గావు, ఇకనేమనగా కింజల్క పరంపరలు"; "ఇవి ముంగురులు గావు, ఇంకేమన తుమ్మెదలు" అని పూర్వోత్తరార్ధములనుండి రెండపహ్నుతులు ప్రకటముగానే నివేదితమైనవి. వానిచేత "నీవు స్త్రీవి గాదు ఇంకనేమన తామరతీగెవు" అను మూడవ యపహ్నుతి వ్యక్తమగుచున్నది. ఈ వ్యంజనా వ్యాపారము

దానిని ప్రధానముగా వ్యక్తపరచును, దానికి సంబంధించిన వస్తువుయొక్క నిషేధారోపములు తన్నిషేధారోపములను నిషేధించుట న్యాయమే కనుక ఇచట తుల్యయోగిత అప్రధానముగా నున్నది.

యత్త్వప్పయదీక్షితైరపహ్నుతిధ్వనావుక్తమ్—

'త్వదాలేఖ్యే కౌతూహలతరలతన్వీవిరచితే
విధాయైకాచక్రం రచయతి సుపర్ణీ సుతమపి,
అపి స్విద్యత్పాణిస్త్వరిత మపమృజ్యైతదపరా
కరే పౌష్పం చాపం మకరముపరిష్టాచ్చ లిఖతి'

ఇత్యాదావపహ్నుతిధ్వనిరుదాహర్తవ్యః. అత్ర హి చక్రసుపర్ణ లేఖనేన 'నాయం సాధారణః పురుషః, కింతు పుండరీకాక్షః' ఇతి కయాచిత్ వ్యఙ్జితమ్. అన్యయా తు 'తస్యైతాదృశం రూపం న సంభవతీత్యాశయేన' 'నాయం పుణ్డరీకాక్షోఽపి, కింతు మన్మథః' ఇతి తదుభయమపమృజ్య పుష్పసాయక మకరధ్వజ లేఖనేన వ్యఙ్జితమ్ ఇతి.

అప్పయ్య దీక్షితులు అపహ్నుతి ధ్వనిలో నుదహరించెను.

"త్వదాలేఖ్యే" మొ. కుతూహలముచే చపలురాలగు తన్విచే రచింపబడిన చిత్రము నందొక స్త్రీ చక్రమును రచించి గరుత్మంతుని రచించుచున్నది, ఆ తరువాత చమర్చుచున్న చెయ్యిగలదై పై వాటిని తొందరగా తొలగించి మరొక కాంత చేతిలో పుష్పధనస్సును, మొసలిని వ్రాయుచున్నది.

ఇత్యాదులందు నపహ్నుతి ధ్వని ఉదాహరింపబడును. ఇచట చక్రసుపర్ణములు వ్రాయుటచేత "ఇతడు సాధారణ పురుషుడు కాదు, ఇకనేమనగా పుండరీకాక్షుడే" నని యొకతె వ్యక్తపరచెను. మరొకతె "అతనికి ఈ రూపము సంభవించదు" అను నాశయముతో "నితడు పుడరీకాక్షుడు కాడు, కేవలము మన్మథుడే" నని చక్రసుపర్ణముల రెంటిని తుడిచివైచి పుష్ప సాయక మకరధ్వజములను వ్రాసినది. ఈ వ్రాయుటచేత నితడు మన్మథుడేనని వ్యక్తపరచినది" అని.

తదేతదాపాతరమణీయమ్. యత్తావదుచ్యతే — "చక్రసువర్ణలేఖనేన నాయం సాధారణః పురుషః, కింతు పుండరీకాక్షః" ఇతి కయాచిద్ వ్యంజితమితి—తత్రాపహ్నుతేర్ద్వౌ భాగౌ-ఉపమేయనిషేధః, ఉపమానారోపశ్చేతి. తయోస్తావదుపమానారోపభాగః పుండరీకాక్షోఽయ మిత్యాకారశ్చక్రసువర్ణలేఖనేనాభివ్యఙ్క్తుం శక్యః. చక్రసువర్ణయో స్తత్సంబంధిత్వాత్. న తు నాయం సాధారణః పురుష ఇత్యుపమేయ నిషేధభాగోఽపి, వ్యంజకస్యారోప మాత్ర వ్యంజన సమర్థస్య తాదృశనిషేధవ్యంజనే సామర్థ్యాభావాత్. నాప్యనుభవసిద్ధః సః, యేన తద్వ్యంజనోపాయో గవేష్యేత. నాపి గవేష్యమాణోఽపి తద్వ్యంజనోపాయః శబ్దోఽర్థో వా ఉపలభ్యతే, యేనానుభవకలహోఽపి స్యాత్. న చ సాధారణపురుషనిషేధమంతరేణ పుండరీకాక్ష తాదాత్మ్యారోపో దుర్ఘట ఇతి సోఽపి వ్యజ్యత ఇతి వాచ్యమ్, రూపకోచ్ఛేదాపత్తేః. "ముఖం చంద్రః" ఇత్యాదౌ ముఖనిషేధమంతరేణ చంద్రత్వం దురారోపమిత్యస్యాపి సువచత్వాత్. తత్రాపి ముఖనిషేధావగమే జితమపహ్నుత్యా.

అథ "ముఖం చంద్రః" ఇతి రూపకే ముఖత్వసామానాధికరణ్యేన చంద్రతాద్రూప్యస్యారోప్యమాణతయా న ముఖనిషేధాపేక్షేతి చేత్, ప్రకృతేఽపి తర్హి తాదృశసాధారణపురుషత్వసామానాధికరణ్యేన పుండరీకాక్షతాదాత్మ్యారోపరూపమసౌ రాజా పుండరీకాక్ష ఇత్యాకారకరూపకమేవ భవితు మీష్టే, నాపహ్నుతిః.

ఇది యంతయు నాపాత రమణీయమే. చక్రమును సువర్ణుని వ్రాయుట వలన ఇతడు మామూలు మనిషిగాడు, ఇకనేమంటే పుండరీకాక్షుడు అని యొకతె వ్యంగ్య పరచినది అని కదా చెప్పుచున్నావు ? ఇచట అపహ్నుతిలో రెండు భాగములు- ఉపమేయ నిషేధము. ఉపమానము నారోపించుట. వానిలో నుపమానారోప భాగము "పుండరీకాక్షు డితడు" అనునది చక్రసువర్ణులను వ్రాయుటచేత వ్యంగ్య మొనర్చుటకు వీలగును; చక్రసువర్ణములు పుండరీకాక్షునకు సంబంధించినవి కనుక. అంతేగాని ఇతడు మామూలు మనిషి గాడు అను నుపమేయ నిషేధభాగము గూడా వ్యంగ్యముగాదు. ఆరోప మాత్రమును వ్యంజనమొనర్చుటకు సమర్థమైన వ్యంజ

కమునకు అటువంటి నిషేధమును వ్యంగ్యమొనర్చుటలో సామర్థ్యములేదు. పోనీ–అనుభవసిద్ధమా గాదు. అట్లగుచో తదవ్వ్యంజనోపాయమును వెదకుదుము. వెదకినను వానిని వ్యంజనమొనర్చుట కుపాయము శబ్దముగాని అర్థముగాని దొరకదు. అపుడు అనుభవమును గూర్చి కలహమైనా ఉండేది. సాధారణ పురుషత్వ నిషేధము లేకపోయినచో పుండరీకాక్షతా దాత్మ్యారోపము కుదరదు. కనుక వ్యంగ్య మందురేమో? అటయిన రూపకముచ్ఛిన్నముగా వలసివచ్చును. "మొగము చంద్రుడు" అనునటువంటిచోటులందు మొగము యొక్క నిషేధము లేకుండా చంద్రత్వమారోపించుటకు వీలులేదు, అని సులభముగా సననమ్మను గదా? అక్కడ గూడా మొగము నిషేధము తెలియవచ్చుచున్నచో నపహ్నుతియే నంతటను జయించినది.

అయితే "మొగము చంద్రడు" అను రూపకమున ముఖత్వమునకు సామానాధికరణ్యముగా చంద్రతాదాత్మ్య మారోపించ బడుచున్నది. గనుక ముఖనిషేధమపేక్షింపబడదు అనెదరా, అయితే ప్రకృతమున తాదృశ సాధారణ పురుషత్వముతో సమానాధికరణముగా పుండరీకాక్షతాదాత్మ్యారోపరూపమైన "ఈ రాజు పుండరీకాక్షుడు"– అను నాకారముగల రూపకమే గావలయును అపహ్నుతి మాత్రము గాదు.

యదపి చోచ్యతే "నాయం పుండరీకాక్షః, అపి తు మన్మథః" ఇత్యాది. తత్ర యద్యపి చక్రసుపర్ణదూరీకరణేన నాయం పుండరీకాక్ష ఇతి నిషేధః, పుష్పచాప—ధ్వజగతమకరయోర్లేఖనేన చ మన్మథోఽయ మిత్యుపమానారోపశ్చ వ్యంగ్యౌ భవితుమర్హతి; తథాపి నాసావపహ్నుతిః. "ప్రకృతస్య నిషేధేన యదన్యత్వప్రకల్పనమ్" ఇతి త్వత్కల్పితలక్షణస్యాప్యప్రాప్తత్వాత్. అత్ర హి నిషేధ్యస్య భగవతః పుండరీకాక్షస్యావర్ణ్యత్వేనాప్రకృతతయా ప్రకృతనిషేధాభావాత్. న హి పూర్వారోపితతామాత్రేణ ప్రకృతత్వం వక్తుం శక్యమ్. ప్రకృతపదస్యారోపవిషయపరతయా "నిషిధ్య విషయమ్" ఇత్యాదినా క్వాపి ప్రక్రియా ఫలం బ్రువతా భవతైవ తత్ర స్ఫుటీకరణాత్. కావ్యప్రకాశకృతాపి "ప్రకృతం యన్నిషిధ్యాన్యత్ సాధ్యతే సా త్వపహ్నుతిః" ఇతి సూత్రం వ్యాచక్షాణేన "ఉపమేయమసత్యం కృత్వా" ఇత్యాదినా ప్రకృతపదస్యోపమేయపరతయైవ వ్యాఖ్యానాచ్చ.

ప్రాచీనమతసిద్ధేయమపహ్నుతిర్వ్యంగ్యత్వేనాస్మాభిరిహోచ్యత ఇత్యపి కుశకాశావలంబనమాత్రమ్, 'ప్రకృతస్య నిషేధేన' ఇత్యాది లక్షణం కుర్వతా భవతైవ తస్యా బహిఃకరణాత్.

ఏవమప్యుక్తపద్యే కోలంకారో వ్యంగ్య ఇతి చేత్ ?

విచ్ఛిత్తివైలక్షణ్యేఽతిరిక్తః,అన్యథా త్వపహ్నుతిరేవాస్తు.లక్షణం తు తదా ప్రసక్త యత్కించిద్వస్తునిషేధసామానాధికరణ్యేన క్రియమాణవస్త్వంతరారోపత్వమేవ. తస్మాత్ సర్వమేవేదమహృదయంగమం సహృదయానామ్.

మరొక విషయము-

"ఈతడు పుండరీకాక్షుడు గాదు మన్మథుడే" ఇత్యాదికము చెప్పితివే. అచట చక్రసుపర్ణ దూరీకరణముచే నితడు పుండరీకాక్షుడు కాదు అని నిషేధము, పూవుల విల్లును, ధ్వజమందు మకరమును వ్రాయుటచే నితడు మన్మథుడను నుపమానారోపమున్ను వ్యంగ్యము కాదగియున్నది. అయినను ఇది అపహ్నుతిగాదు. ప్రకృత నిషేధముచేత అన్యత్వ ప్రకల్పన (ప్రకృతము నిషేధించి మరొక దానినిగా గనపరుచుట) అని నీవు చెప్పిన లక్షణమున్ను ఇచట లేదు గదా ?

ఇచట నిషేధ్యుడగు భగవానుడు పుండరీకాక్షుడు వర్ణ్యుడుకాడు. కనుక, నప్రకృతుడు గనుక, ప్రకృతనిషేధము లేదు, పూర్వము ఆరోపించబడినంత మాత్రమున ప్రకృతుడనుటకు వలనుగాదే ?

ప్రకృత పదమునకు నారోపవిషయపరముగా "నిషిద్ధ విషయమ్" ఇత్యాదిచేత, 'క్త్వా' ప్రత్యయఫలము చెప్పిన నీ చేతనే అచట స్పష్టపరుపబడెను గదా?-

"ప్రకృతం యన్నిషిద్ధాన్యత్ సాధ్యతే సా త్వపహ్నుతిః" అను సూత్రమును వ్యాఖ్యానించుచు కావ్యప్రకాశకారుడును 'ఉపమేయమును అసత్యముగా జేసి' ఇత్యాదికముచే ప్రకృతపదము నుపమేయముగానే జెప్పినాడు.

"ఈ యపహ్నుతి ప్రాచీనుల మతమున సిద్ధించును. వ్యంగ్యముగామే మిచట చెప్పుచున్నాము." అనుటయు కుశకాశాలవలంబనమాత్రము.

ప్రకృతస్య నిషేధేన' ఇత్యాది లక్షణము చేయుచు నీవే దానిని బహిష్కరించితివి.

ఈలాగైనను ఈ చెప్పిన 'త్వదాలేఖ్యే' అను పద్యములో నేయలంకారము వ్యంగ్యము అన్నచో విచ్ఛిత్తి వైలక్షణ్య మున్నచో నతిరిక్తము. అట్లు గానిచో నపహ్నుతియే గానిండు. అపుడు లక్షణము మాత్రము— ప్రసక్తించినయత్కించిద్వస్తునిషేధ సామానాధికరణ్యముచే క్రియమాణ వస్త్వంతరారోపత్వమే. కాబట్టి ఇదియంతయు సహృదయుల కహృదయంగమ మైనదే.

ఇది అపహ్నుతి ప్రకరణము సంపూర్ణము.

## ఉత్ప్రేక్షాలఙ్కారః

**అథోత్ప్రేక్షాప్రకరణమ్ — తద్భిన్నత్వేన తదభావవత్త్వేన వా ప్రమితస్య పదార్థస్య రమణీయతద్వృత్తి - తత్సమానాధికరణాన్యతరతద్ధర్మసంబంధనిమిత్తకం తత్త్వేన తద్వత్త్వేన వా సంభావనముత్ప్రేక్షా.**

**'లోకోత్తరప్రభావ! త్వాం మన్యే నారాయణం పరమ్' ఇత్యత్ర తాదృశప్రభావస్య నారాయణత్వవ్యాప్యతాసంభావనాదశాయాం సామగ్ర్యభావేనానుమిత్యనుదయాజ్జాయమానాయాం నారాయణేనానేన ప్రాయశో భవితవ్యమితి సంభావనాయా మతి ప్రసంగవారణాయ తద్భిన్నత్వేన ప్రమితస్యేతి సంభావనాయా మాహార్యతాం గమయతి.**

అనంతర ముత్ప్రేక్షా ప్రకరణము.

తద్భిన్నముగా గాని తదభావవత్తుగాగాని ప్రమితమగు పదార్థమునకు, రమణీయమగు దానియందుండు ధర్మము; లేక దానితో సమానాధికరణమైన ధర్మము, వానిలో నేదో నొకదాని సంబంధము నిమిత్తముగా నదిగా గానీ, అది గల్గియున్నట్టిదిగా గావీ సంభావన ముత్ప్రేక్ష.

"లోకోత్తర ప్రభావా! నిన్ను పరుడగు నారాయణుడని తలతును" అను నీయెడనట్టి ప్రభావము నారాయణత్వమునకు వ్యాప్యమని సంభావనా దశయందు, సామగ్రి లేకపోవుటచేత ననుమితి గలుగదు గనుక 'నీతడు ప్రాయశః నారాయణుడై యుండును, అను సంభావనయం దతివ్యాప్తి

నివారించుటకై తద్భిన్నముగా ప్రమితమనునది సంభావనయందు ఆహార్యత నవగమింప జేయును.

ఏతేన—

"రామం స్నిగ్ధతరశ్యామం విలోక్య వనమండలే
ప్రాయో ధారాధరోఽయం స్యాదితి నృత్యంతి కేకినః."

ఇత్యత్ర సంభావనాయామ్, 'ధారాధరధియా ధీరం నృత్యంతి స్మ శిఖావలాః' ఇత్యత్ర భ్రాంతౌ చ నాతిప్రసంగః.

"వదనకమలేన బాలే స్మితసుషమాలేశమావహసి యదా
జగదిహ తదైవ జానే దశార్ధబాణేన విజితమితి."

అత్ర జగజ్జయసంభావనాయామతిప్రసంగవారణాయ రమణీయతద్ధర్మనిమిత్తకమితి. స్మితస్య సంభావనోత్థాపకత్వేఽపి జగద్విజితత్వరూప విషయ విషయి సాధారణత్వాభావాన్న దోషః.

దీని చేత "స్నిగ్ధతరముగా శ్యాముడైన రాముని వనమండలమున జూచి సామాన్యముగా నిది మేఘమగునని నెమళ్ళు నృత్యము చేయుచున్నవి" అను నీ సంభావనయందును, 'ధారాధరధియా' అనునెడ భ్రాన్తి యందున్ను అతివ్యాప్తిలేదు.

"వదనకమలేన" మొ. (ఓపిల్లా ! మొగమనెడు కమలములో చిఱునగ వనెడు సుషమాలేశమును ఎప్పుడు వహించుచున్నావో, అప్పుడే పంచబాణునిచే యీ జగత్తుజయింపబడినదని యనుకొనుచున్నాను.)

ఇచట జయసంభావనయందలి వ్యాప్తి నివారించుటకై రమణీయమగు దీనియందుండు ధర్మము నిమిత్తముగాగలది అని చిఱునగవు సంభావనను గలిగించినను, జగద్విజితత్వ రూపవిషయ విషయి సాధారణ్యములేదు. కనుక దోషములేదు.

ఏతేన—

"ప్రాయః పతేద్ ద్యౌః శకలీభవేద్ గ్లౌః
సహాచలైరంబుధిభిః స్థలేద్ గౌః.

నూనం జ్వలిష్యంతి దిశః సమస్తా
యద్ ద్రౌపదీ రోదితి హా హతేతి."

అత్రాపి రోదనకారణీభూత కేశగ్రహణాదిజన్యపాప నిమిత్తోత్థా పితాయాం స్వర్గపతన సంభావనాయాం నాతిప్రసంగః. ప్రాయః స్థాణు నానేన భవితవ్యమ్, నూనం పురుషేణానేనభావ్యం. దూరస్థోయం దేవదత్త ఇవాభాతి, ఇత్యాదౌ నిశ్చలత్వ చంచలత్వాది సాధారణ ధర్మ నిమిత్తాయాం సంభావనాయా మతిప్రసంగఃస్యాత్; అతో రమణీయ త్వం ధర్మగతముపాత్తమ్. రూపకవిత్తావతి ప్రసంగవారణాయ సంభావనమితి.

ఇందువల్ల "ప్రాయఃపతేద్ద్యౌః"మొ. "ఆకాశము పడియుండవచ్చును, చంద్రుడు తునకలు గావచ్చును కొండలతోను సముద్రముతోను గూడ భూమి తొట్రుపడియుండును. దిక్కులు అంతటను మండిపోవును. 'ద్రౌపది అయ్యో చచ్చితి' నని రోదించుచున్నది."

ఇత్యాది శ్లోకమునందుగూడ రోదనకారణములగు కేశగ్రహణాదుల వలన పుట్టిన పాపనిమిత్తమువలన నుత్థాపితమగు స్వర్గపతన సంభావన యందతిప్రసంగము లేదు. "ప్రాయశః- ఇది స్థాణువై యుండవలెను" "తప్పకుండా నితడు పురుషుడై యుండవలెను"."దూరమునందు ఇతడు దేవ దత్తునివలె తోచుచున్నాడు" ఇత్యాదులందు నిశ్చలత్వము చంచలత్వము మొదలగు సాధారణ ధర్మములు నిమిత్తములుగాగల సంభావనయందతి ప్రసంగము గల్గును. ఇందువల్ల ధర్మగతముగా రమణీయత్వ ముపాత్త మైనది. రూపకవిత్తియం దతివ్యాప్తి వారించుటకై సంభావనమని.

అత్ర చ తాదాత్మ్యేన సంసర్గేణ ధర్మ్యుత్ప్రేక్షాయాః, సంసర్గాంతరేణ ధర్మోత్ప్రేక్షాయాశ్చ సంగ్రహాయైకోక్త్యా లక్షణ ద్వయం వివక్షితమ్.

సా చోత్ప్రేక్షా ద్వివిధా — వాచ్యా, ప్రతీయమానా చ. ఇవ, నూనమ్, మన్యే, జానే, అవైమి, ఊహే, తర్కయామి, శంకే, ఉత్ప్రేక్షే ఇత్యాదిభిః, క్యఙాచారక్విబాదిభిః. ప్రతిపాదకైః సహితా

యత్రోత్ప్రేక్షాసామగ్రీ, తత్ర వాచ్యోత్ప్రేక్షా. యత్ర చ ప్రతిపాదక శబ్దరహితం తత్సామగ్రీమాత్రం తత్ర ప్రతీయమానా. యత్ర తత్సామగ్రీరహితం ప్రతిపాదకమాత్రం,తత్ర సంభావనమాత్రమేవ, నోత్ప్రేక్షా. సాపి ప్రత్యేకం త్రివిధా–స్వరూపోత్ప్రేక్షా, హేతూత్ప్రేక్షా, ఫలోత్ప్రేక్షా చేతి. తత్ర జాతిగుణక్రియాద్రవ్యరూపాణాం తదభావరూపాణాం చ పదార్థానాం తాదాత్మ్యేనేతరేణ వా సంబంధేన జాతిగుణక్రియాద్రవ్యాత్మకైర్వ్యస్తైః, సముచ్చితై రుపాత్తైరనుపాత్తైర్నిష్పన్నైర్నిష్పాద్యైర్వా నిమిత్తభూతైర్ధర్మైర్యథాసంభవం జాతిగుణక్రియాద్రవ్యాత్మకేషు విషయేషూత్ప్రేక్షణం స్వరూపోత్ప్రేక్షా. తత్రాభేదేన సంసర్గేణ ధర్మి స్వరూపోత్ప్రేక్షా, సంసర్గాంతరేణ ధర్మస్వరూపోత్ప్రేక్షేతి చోచ్యతే. ఉక్తవిధేషు పదార్థేషు ప్రాగుక్త ప్రకారాణాం పదార్థానాం తథావిధైరేవ నిమిత్తైర్యథాసంభవం హేతుత్వేన ఫలత్వేన చ సంభావనం హేతూత్ప్రేక్షా ఫలోత్ప్రేక్షా చోచ్యతే. ఏతాశ్చ క్వచిన్నిష్పన్నశరీరాః, క్వచిన్నిష్పాద్యశరీరాశ్చేత్యేవమాద్యనల్పవికల్పాః సంపద్యంతే. తథాపి దిఙ్మాత్రముపదర్శ్యతే-

ఇచట తాదాత్మ్య సంబంధముచే ధర్మినుత్ప్రేక్షించుటను, సంసర్గాంతరముచే ధర్మమునుత్ప్రేక్షించుటను గ్రహించుటకై నొకమాటతో లక్షణద్వయము వివక్షితమైనది. ఆ యుత్ప్రేక్షయు రెండు రకములు-

వాచ్యయు, ప్రతీయమానయు. "ఇవ, నూనం, మన్యే, జానే, అవైమి, ఊహే, శంకే, తర్కయామి, ఉత్ప్రేక్షే" ఇత్యాదులతోను, క్యఙ్ ఆచారక్విప్ మొదలగు ప్రతిపాదక ప్రత్యయములతో గూడిన యుత్ప్రేక్షా సామగ్రి యుండినది వాచ్య. ఎచట ప్రతిపాదక శబ్దము లేకుండా నా సామాగ్రి మాత్రముండునో అచట ప్రతీయమాన. ఎచట నా సామగ్రి లేక ప్రతిపాదక మాత్రముండునో అచట సంభావన మాత్రమే ఉత్ప్రేక్షకాదు.

ఆ యుత్ప్రేక్షయు ప్రత్యేకముగా మూడు విధములు—— స్వరూపోత్ప్రేక్ష, హేతూత్ప్రేక్ష, ఫలోత్ప్రేక్ష, అందులో జాతి గుణ క్రియా ద్రవ్య స్వరూపములును, తదభావరూపములునునైన పదార్థములకు తాదాత్మ్య సంబంధముచేగాని, ఇతర సంబంధముచేగాని జాతి, గుణ, క్రియా, ద్రవ్య రూపములును, వ్యస్తములుగాని, సముచ్చితములుగాని, ఉపాత్తములుగాని,

అనుపాత్తములుగాని, సిద్ధములుగాని, సాధ్యములుగాని అయిన, నిమిత్తభూతములగు ధర్మములచే, యథాసంభవముగా జాతి గుణక్రియా ద్రవ్యాత్మకములగు విషయములయం దుత్ప్రేక్షణము స్వరూపోత్ప్రేక్ష. అట అభేద సంబంధముతో ధర్మిస్వరూపోత్ప్రేక్షయు ఇతరసంబంధముతో ధర్మస్వరూపోత్ప్రేక్షయునని చెప్పబడును. చెప్పబడినతీరులు గల పదార్థములందు వెనుక జెప్పిన విధములైన పదార్థములకు, ఎదేతీరులు గల నిమిత్తములతో యథాసంభవముగా, హేతువుగా, ఫలముగా, నుత్ప్రేక్షణము హేతూత్ప్రేక్ష, ఫలోత్ప్రేక్షయునని చెప్పబడును. ఇవియు నొకచోట నిష్పన్నశరీరములు, మరొకయెడ నిష్పాద్య శరీరములును అయి, ఈ తీరుగా ననేకవికల్పములు గలిగియుండును. అయినను దిఙ్మాత్రముగా నుదాహరింపబడును.

ఆఖ్యాయికాయాం జాత్యవచ్ఛిన్నస్వరూపోత్ప్రేక్షా యథా—.

'తనయమైనాకగవేషణలంబీకృత జలధిజఠరప్రవిష్ట హిమగిరి భుజాయమానాయా భగవత్యాభాగీరథ్యాః సఖీ' ఇతి. అత్రభాగీరథ్యాం ద్రవ్యే జాతౌ వా హిమగిరిసంబంధీ భుజత్వ జాత్యవచ్ఛిన్నస్తాదాత్మ్యే నోత్ప్రేక్ష్యతే. తత్ర చ భాగీరథీగతానాం శ్వైత్యశైత్యలంబత్వజలధి జఠరప్రవిష్టత్వానాం ధర్మాణాం నిమిత్తతాసిద్ధయే విషయి హిమ గిరిభుజగత్వమవశ్యం సంపాదనీయం. తేషాం చ మధ్యేనుపాత్తయోః శ్వైత్యశైత్యయోర్హిమగిరిసంబంధిత్వాదేవ భుజగతత్వం సంపన్నమ్. ఇతరయోరపి సంపాదనాయ తనయమైనాకగవేషణం ఫలముత్ప్రేక్షితమ్. తత్సాధనతాజ్ఞానస్య లంబత్వజలధిజఠరప్రవేశానుకూలయత్నజనకత్వాత్. ఏవంచ విషయగతతాదృశగవేషణఫలకలంబత్వ జలధిజఠర ప్రవిష్టత్వాభ్యాం విషయగతయోః సామాజికలంబత్వజలధిజఠరప్రవిష్టత్వయోరభేదాధ్యవసానాతిశయోక్త్యా సాధారణ్యసంపత్త్యా నిమిత్తతా. న చాత్ర ఫలస్యాప్యుత్ప్రేక్షేతి వక్తుం శక్యమ్. ఉత్ప్రేక్ష్యమాణ ఫల నిష్పాదిత నిమిత్తోత్థాపితాయాం స్వరూపోత్ప్రేక్షాయామేవ విధేయత్వాచ్చమత్కృతేర్విశ్రామాత్. ఉత్ప్రేక్షాప్రతిపాదకస్య ప్రత్యయస్య ఫలేనానన్వయాచ్చ, తయైవాత్ర వ్యపదేశో యుక్తః. అనిగీర్ణ విషయా చేయముపాత్తానుపాత్తగుణక్రియాత్మకనిమిత్తా నిష్పాద్య విశిష్టశరీరా జాత్యుత్ప్రేక్షాహిమగిరిభుజస్య కవినైవ నిష్పాదితత్వాత్.

ఆఖ్యాయికయందు జాత్యవచ్ఛిన్న స్వరూపోత్ప్రేక్ష ఎట్లనగా—

"తనయమైనాక" మొ. ఇట భాగీరథీ ద్రవ్యమందుగాని జాతియందుగాని హిమగిరికి సంబంధించిన భుజత్వజాతి విశిష్టము, తాదాత్మ్యముతో నుత్ప్రేక్షింపబడును. అందును భాగీరథి యందున్న తెల్లదనము, చల్లదనము, ప్రేలుచుండుట, సముద్రము పడుపులో ప్రవేశించుట యను ధర్మములకు నిమిత్తత్వము సిద్ధించుటకై విషయి హిమగిరి భుజమందుండుటయు నవశ్యముగా సమకూర్పవలయును. వానిలో నడుమ చెప్పబడని శ్వైత్యశైత్యములకు హిమగిరి సంబంధులు గనుకనే భుజగతములగుటయును సమకూడినది. ఇతరములుగూడ సంపాదించుటకై తనయ మైనాక గవేషణము ఫలముత్ప్రేక్షితమైనది. దానికి సాధనమును జ్ఞానము ప్రేలుటను, జలధి జఠర ప్రవేశానుకూలయత్నమును నొదవించును గనుక. ఈ తీరుగా విషయియందున్నటువంటి అన్వేషణఫలకమగు, ప్రేలుటతోడ, జలధి జఠరమున ప్రవేశించుటతోడను, విషయగతమగు నహజ లంబత్వ జలధిజఠర ప్రవిష్టత్వములకు నభేదాధ్యవసానరూపమగు నతిశయోక్తిచే సాధారణ్యము సంపన్నమగుటలో నిమిత్తమగును. ఇచట ఫలముగూడ నుత్ప్రేక్షించుట వలన ఫలోత్ప్రేక్షణయనరాదు. ఉత్ప్రేక్షింపబడు ఫలముచే నిష్పాదింపబడు నిమిత్తముచే నుత్థాపింపబడు స్వరూపోత్ప్రేక్షయే విధేయమగుటవలన దానియందే చమత్కృతి విశ్రాంతమయ్యెనుగదా? ఉత్ప్రేక్షాప్రతిపాదకమగు ప్రత్యయము ఫలముతో నన్వయించుటలేదుకూడా. కనుక నలాగే వ్యపదేశింపబడుటయు క్తము. అనిగీర్ణవిషయయు, ఉపాత్తానుపాత్త గుణ క్రియాత్మక నిమిత్తయునగు ఈ జాత్యుత్ప్రేక్ష నిష్పాద్యవిశిష్టశరీరయైనది. హిమగిరి భుజమును కవియే నిష్పాదించెను గదా?

తాదాత్మ్యేన గుణస్వరూపోత్ప్రేక్షా యథా—

"అంభోజినీబాంధవనందనాయాం
కూజద్బకానాం సమజో విరేజే
రూపాంతరాక్రాంతగృహః సమంతాత్
పుంజీభవన్ శుక్ల ఇవాశ్రయార్థీ."

అత్రైకాధికరణ్యాపన్నే కూజనవిశిష్టే బకత్వజాత్యవచ్ఛిన్నే

విషయే పుంజీభవనవిశిష్టః శుక్లగుణస్తాదాత్మ్యేనోత్ప్రేక్ష్యతే. తత్ర బకగతానాం కూజననైర్మల్యపుంజీభవనానాం శుక్లగుణగతత్వ మంతరేణ బకశుక్లయోరభేదస్య దురుపపాదత్వాత్తత్సిద్ధయే తేషాం విషయిగతత్వం సాధ్యమ్. తత్ర నైర్మల్యస్యానుపాత్తస్య యథాకథం చిదుత్ప్రేక్ష్యమాణే విషయిణి సిద్ధత్వాత్ కూజన పుంజీభవనయోర్ని ష్పాదనాయ రూపాంతరాక్రాంతగృహత్వమాశ్రయార్థిత్వం చ హేతుత్వేనోత్ప్రేక్షితమ్. ఇహాపి ప్రాగ్వత్ సాహజికయోః కల్పితా భ్యామభేదాధ్యవసానాత్ సాధారణ్యమ్. ఏవమన్యత్రాప్యూహ్యమ్. పూర్వం హి యథా ఫలస్యోత్ప్రేక్షణేఽపి న ఫలోత్ప్రేక్షా తథేహాపి హేతోరితి.

తాదాత్మ్యముచే గుణస్వరూపోత్ప్రేక్ష యెట్లనగా—

“అంభోజినీ” మొ. “తామర తీగకు బంధువగు సూర్యుని కుమార్తె యందు అఱచుచూ కొంగల సమూజము రూపాంతరముచే ఆక్రమింపబడిన యిల్లు గలదై అంతటను బోవగుచు ఆశ్రయమును కోరుచున్న తెలుపువలె ప్రకాశించెను”.

ఇచట నొకచోటచేరిన, కూయుచున్న బకత్వజాతి విశిష్టమైన విషయ మున గుంపుగాగూడియున్న తెల్లదనము తాదాత్మ్యముతో నుత్ప్రేక్షింప బడుచున్నది. అచట బక గతములగు గూయుటయు నైర్మల్యమును గుంపులుగా కూడియుండుటయు, శుక్లగుణగతములు కాకుండ బక శుక్లముల యభేదము కుదురదు కనుక నది సిద్ధించుటకై అవి విషయిగతము లగుట సాధింపవలయును. అందులో అనుపాత్తమైన నైర్మల్యము ఏదో ఒకవిధముగా ఉత్ప్రేక్ష్యమాణమగు విషయియందు సిద్ధముగనుక, కూయుట, పోగుపడియుండుట నిష్పాదనమునకును మరియొక రూపముచే నాక్రమింప బడిన ఇల్లుకలిగియుండుటయు, ఆశ్రయమునర్థించుటయు కారణముగా నుత్ప్రేక్షితమైనది.

ఇక్కడనుగూడ వెనుకటివలె సహజములకు గల్పితములతోగూడ నభేదాధ్యవసానము వలన సాధారణ్యము. ఈ తీరుగా స్థలాంతరముల గూడ నూహించుకొనవలెను. పూర్వమున ఎట్లు ఫలమునుత్ప్రేక్షించినను ఫలోత్ప్రేక్ష కాదో, అలాగే నిచట కూడ హేతువును అని.

క్రియాస్వరూపోత్ప్రేక్షా యథా—

"కలిందజానీరభరేఽర్ధమగ్నా
బకాః ప్రకామం కృతభూరిశబ్దాః।
ధ్వాంతేన వైరాద్వినిగీర్యమాణాః
క్రోశంతి మన్యే శశినః కిశోరాః"॥

అత్ర ప్రథమాంతవిశేష్యకబోధవాదినామభేదసంసర్గేణ కలిందజానీరార్ధమగ్నకృతభూరిశబ్దోభయవిశిష్టేషు బకేషు విషయేషు ధ్వాంతకర్తృకవైరహేతుకనిగరణకర్మభిన్నోత్ప్రేక్షితశశికిశోరతాదాత్మ్యోత్ప్రేక్షణపూర్వకం క్రోశనకర్తృత్వం ధర్మ ఉత్ప్రేక్ష్యతే. తత్ర తాదాత్మ్యోత్ప్రేక్షణే ధర్మ్యుత్ప్రేక్షాయాం సాధారణో ధర్మః, సంబంధాంతరేణోత్ప్రేక్షణే ధర్మోత్ప్రేక్షాయాం తత్సమానాధికరణో ధర్మశ్చ విషయగతో నిమిత్తమితి స్థితే ప్రకృతే క్రోశనకర్తృత్వరూప ధర్మోత్ప్రేక్షాయాం తత్సమానాధికరణ కర్మత్వరూప ధర్మస్య విషయగతత్వసిద్ధయేఽనువాద్యతయా శశికిశోరతాదాత్మ్యమనుపాత్త నైత్యనిమిత్తకముత్ప్రేక్ష్యతే. తత్ర యథా విశిష్టోపమాయాముపమానోపమేయ విశేషణతద్విశేషణానామార్థమౌపమ్యం, ఏవమత్రాపి విషయబకవిశేషణ . తద్విశేషణయోరర్ధమజ్జనయమునాజలయోర్మ్మలోత్ప్రేక్షావిషయి శశికిశోరవిశేషణ తద్విశేషణాభ్యాం నిగరణధ్వాంతాభ్యామభేద అర్థః, తతశ్చ ధ్వాంతకర్తృకనిగరణే సిద్ధే ముఖ్యోత్ప్రేక్షానిర్వాహః. క్రోశనశబ్దయోరపి బింబప్రతిబింబభావేనాభేదః. తేన కలిందజానీరార్ధమగ్నకృతభూరిశబ్దోభయాభిన్నా బకా ధ్వాంతనిగీర్యమాణశశికిశోరోభయాభిన్నాః క్రోశనక్రియానుకూలవ్యాపారవంత ఇవేతి బోధాకారః. ఆఖ్యాతే భావప్రధానే త్వభేదేన క్రోశనక్రియోత్ప్రేక్షా. తత్ర శాబ్దే వృత్తే బకవిశేషణతయా ప్రతీయమానమపి శబ్దమవిషయతయావతిష్ఠతే, అధ్యవసానవశాత్. క్రోశనక్రియాయాం చ తాదృశబకా విశేషణమ్, తాదృశబకేషు చాభేదేన తాదృశశశికిశోరాః, న తు శశికిశోరా ఏవ సాక్షాత్ క్రియాయామ్. ఏవం చ బకానామనన్వయాపత్తేః. విషయ విషయి విశేషణానాం ప్రాగ్వదేవ బింబప్రతిబింబభావేనాభేదప్రతిపత్తిః.

క్రియాస్వరూపోత్ప్రేక్ష యెట్లనగా—

"కలిందజానీరభరే" మొ. (యమునానది నీటి సమూహములో సగము మునిగినవై యెక్కువగా జేయబడిన శబ్దముగల కొంగలు చీకటితో విరోధమువలన మ్రింగబడుచున్న చంద్రుని పిల్లలు అఱచుచున్నవని తలంచెదను.)

ఇచట ప్రథమాంత విశేష్యక బోధవాదుల మతములో నభేదసంసర్గము చేత, కళిందజానీరార్ధమగ్నకృతభూరిశబ్దోభయ విశిష్టములగు బకములనెడు విషయములందు, చీకటి కర్తగాగల, వైరము హేతువుగాగల నిగరణ కర్మగానున్న వాటి కభిన్నములుగా నుత్ప్రేక్షితములగు శశికిశోరముల తాదాత్మ్యము నుత్ప్రేక్షించుట మొదలుగా క్రోశన కర్తృత్వమను ధర్మము ఉత్ప్రేక్షింపబడినది. అందులో తాదాత్మ్యము నుత్ప్రేక్షించుటలో—ధర్మ్యుత్ప్రేక్షయందు, సాధారణమగు ధర్మము. సంబంధాంతరముచే నుత్ప్రేక్షించుటలో- ధర్మోత్ప్రేక్షయందు, తత్సమానాధికరణమగు ధర్మమును విషయగతమగునది నిమిత్తమని నిలువగా, ప్రకృతములో క్రోశనకర్తృత్వరూపమగు ధర్మము నుత్ప్రేక్షించుటయందు తత్సమానాధికరణమగు నిగరణ కర్మత్వరూపమగు ధర్మమునకు విషయమునందుండుట సిద్ధించుటకై ననువాద్యముగా శశికిశోరతాదాత్మ్యము, శ్వైత్యమను నిమిత్తము నుపాదాన మొనర్పకయే యుత్ప్రేక్షింప బడుచున్నది. అచట ఎట్లు విశిష్టోపమయందు, ఉపమానోపమేయ విశేషణములకు, వాని విశేషణములకు నౌపమ్యము అర్థమో అట్లే ఇచటనుగూడ విషయములగు బకముల విశేషణములును వాని విశేషణములును అగు అర్ధమజ్జనయమునా జలములకు, మూలోత్ప్రేక్షలో విషయులగు శశికిశోర విశేషణతద్విశేషణములగు నిగరణధ్వాంతములతో అభేదము అర్థము. అందువలన ధ్వాంత కర్తృక నిగరణము సిద్ధముగాగా ముఖ్యమగు నుత్ప్రేక్ష నిర్వహింపబడును. క్రోశనశబ్దములకున్ను బింబ ప్రతిబింబభావముచే నభేదము. దానిచే- కలిందజానీరార్ధమగ్నకృతభూరిశబ్దోభయాభిన్నములగు బకములు ధ్వాంతనిగీర్యమాణ శశికిశోరోభయాభిన్నములై క్రోశనక్రియానుకూల వ్యాపారము కలవివలె నున్నవి అని బోధయొక్క ఆకారము.

ఆఖ్యాతమున భావమునకు ప్రాధాన్యమునందైతే అభేదమున క్రోశనక్రియకు నుత్ప్రేక్ష. అచట శాబ్దబోధమున బకములకు విశేషణముగా

తోచుచున్నను శబ్దనము అధ్యవసానవశమువలన విషయముగా నిల్చును. క్రోశనక్రియయందు తాదృశబకములు విశేషణము. అటువంటి బకముల యందు నభేదమున తాదృశ శశికిశోరములు. అంతేకాని శశికిశోరములు సాక్షాత్తుగా క్రియలో విశేషణముకాదు. అట్లగుచో బకముల కన్వయము లేకపోవును విషయ విషయి విశేషణములకు వెనుకటివలెనే బింబప్రతిబింబ భావమున అభేదప్రతిపత్తి.

తథా—

"రాజ్యాభిషేకమాజ్ఞాయ శంబరాసురవైరిణః
సుధాభిర్జగతీమధ్యం లింపతీవ సుధాకరః."

అత్రాపి చంద్రే విషయే తాదృశలేపనకర్తృత్వరూపధర్మోత్ప్రేక్షేత్యేకం దర్శనమ్. కిరణవ్యాపనే విషయే చంద్రకర్తృకసుధాకరణకలేపనస్య తాదాత్మ్యేనోత్ప్రేక్షణమితి ద్వితీయమ్. తత్ర ప్రథమే మతే ధవలీకారకత్వరూపనిమిత్తానుపాదానాదనుపాత్తనిమిత్తా, విషయస్యోపాదానాదుపాత్తవిషయా. ద్వితీయేఽపి తస్యైవ నిమిత్తస్యానుపాదానాదనుపాత్తనిమిత్తా, విషయస్య నిగీర్ణతయానుపాత్తవిషయేతి విశేషః.

అలాగే-"రాజాభిషేక" మొ. (శంబరాసురుని వైరియగు (మన్మథుని) రాజ్యాభిషేకమును తెలిసికొని సుధలతో భూమధ్యమును సుధాకరుడు పూయుచున్నట్లున్నాడు.)

ఇచటనుగూడ విషయమగు చంద్రునందు అటువంటి లేపన కర్తృత్వ రూపమగు ధర్మమునకు నుత్ప్రేక్షయని యొక దర్శనము. విషయమగు కిరణ వ్యాపనమునందు, చంద్రుడు కర్తగాను సుధ కరణముగాను గల లేపనమును తాదాత్మ్యమున నుత్ప్రేక్షించుట యని రెండవది. అందులో మొదటి మతమున తెల్లదనముగల్గించుట రూపమగు నిమిత్తము నుపాదానమొనర్పక పోవుటవలన అనుపాత్త నిమిత్త. విషయమును తెలుపుటవలన నుపాత్త విషయ. రెండవదాని యందుకూడ నా నిమిత్తమునే యుపాదాన మొనర్పక పోవుటవలన యనుపాత్త నిమిత్తత,విషయము నిగీర్ణము గనుక ననుపాత్తవిషయత అనివిశేషము.

తాదాత్మ్యేన ద్రవ్యస్వరూపోత్ప్రేక్షా యథా—

"కలిందశైలాదియమాప్రయాగం
కేనాపి దీర్ఘా పరిఖా నిఖాతా.
మన్యే తలస్పర్శవిహీనమస్యా
మాకాశమానీలమిదం విభాతి."

అత్ర యమునాయాం నీలత్వదీర్ఘత్వనిమిత్తకమాకాశతాదాత్మ్యోత్ప్రేక్షణమ్. ఆకాశస్య స్వరూపాత్మకత్వాద్ద్రవ్యస్వరూపోత్ప్రేక్షేయమ్ అత ఏవాకాశపదాచ్ఛబ్దాశ్రయత్వాద్యనుపస్థితిదశాయామప్యాకాశధీః. నీలత్వరూపనిమిత్తస్య విషయిణి సిద్ధ్యర్థం తృతీయచరణోపాదానమ్ దీర్ఘత్వరూపనిమిత్తసిద్ధ్యర్థంచ పూర్వార్ధమ్.

తాదాత్మ్యేన ద్రవ్య స్వరూపోత్ప్రేక్ష ఎట్లనగా.

"కళింద శైలాత్" మొ. "కలిందపర్వతమునుండి ప్రయాగవరకు యెవరిచేతనో పెద్ద అగణిత తవ్వబడినది. దీనియందు తల స్పర్శ లేకుండా ఆకాశము నల్లగా ప్రకాశించుచున్నదనుకొందును."

ఇచట యమునయందు నల్లదనము, పొడవు నిమిత్తముగా నాకాశపు తాదాత్మ్యము నుత్ప్రేక్షించుట. ఆకాశము స్వరూపాత్మకము గనుక నిది ద్రవ్యోత్ప్రేక్ష. ఇందువల్లనే ఆకాశపదమునుండి శబ్దాశ్రయత్వాదులుపస్థితములు కాకపోయినను ఆకాశబుద్ధి గలుగుచున్నది, నీలత్వరూపమను నిమిత్తము విషయియందు సిద్ధించుటకై మూడవపాదము స్వీకరింపబడినది. పొడవు రూపైన నిమిత్తము సిద్ధించుటకై పూర్వార్ధము.

జాత్యాదీనామభావోత్ప్రేక్షా యథా—

"బాహుజానాం సమస్తానామభావ ఇవ మూర్తిమాన్,
జయత్యతిబలో లోకే జామదగ్న్యః ప్రతాపవాన్".

అత్ర జాత్యవచ్ఛిన్నాభావో విరోధిత్వనిమిత్తేన తాదాత్మ్యేనోత్ప్రేక్ష్యతే. వినాశ ఇవేత్యుక్తౌ తు ధ్వంసః. 'సమస్తలోకదుఃఖానాం' ఇతి ప్రథమ చరణే కృతే గుణాభావః.

"ద్యోరంజన కాళీభిర్జలదాలీభిస్తథా వవ్రే
జగదఖిలమపి యథాసీన్నిర్లోచనవర్గ సర్గమివ".

అత్రాపి చాక్షుషజ్ఞానశూన్యత్వేన నిమిత్తేన పార్యంతికః క్రియాభావధర్మః. ఏవం ద్రవ్యాభావోత్ప్రేక్షాపి స్వయమూహ్యా.

జాత్యాదుల యభావోత్ప్రేక్ష ఎట్లనగా –

"బాహుజానాం" మొ. (మూర్తీభవించిన సమస్త శత్రువుల అభావము వలె నున్నవాడును, యెక్కువ బలముగలవాడును ప్రతాపవంతుడును అగు పరశురాముడు లోకమున ప్రకాశించుచున్నాడు.)

ఇచట జాత్యవచ్ఛిన్నుల అభావము విరోధిత్వమను నిమిత్తముచే తాదాత్మ్యమున నుత్ప్రేక్షింపబడుచున్నది. 'వినాశమువలె' నన్నచో ధ్వంసము. "సమస్తలోక దుఃఖానాం" అని మొదటి చరణ మొనర్చుచో గుణాభావము.

"ద్యౌరంజన" మొ, "ఆకాశము అంజనమువలె నల్లనైన మేఘముల సమూహములచే అట్లు ఆచ్ఛాదింపబడెను, జగత్తు యేావత్తును, నేత్రముల సమూహముల యొక్క సృష్టిలేనిదివలె ఎట్లు అయ్యెనో."

ఇచటను గూడ చాక్షుషజ్ఞానసామాన్య శూన్యత్వమనెడు నిమిత్తముచే పార్యంతికమగు క్రియాభావము ధర్మము ఉత్ప్రేక్షింపబడుచున్నది. ఇలాగే ద్రవ్యాభావమునకు నుత్ప్రేక్షయు నూహించుకొనవలయును.

మాలారూపాప్యేషా సంభవతి– యథా —

"ద్వినేత్ర ఇవ వాసవః కరయుగో వివస్వానివ
ద్వితీయ ఇవ చంద్రమాః శ్రితవపుర్మనోభూరివ.
నరాకృతిరివాంబుధిర్గురురివ క్షమామాగతో
మతో నిఖిలభూసురైర్జయతి కోఽపి భూమీపతిః''.

అత్ర రాజగతానాం ద్వినేత్రత్వాదీనాం వాసవాదితాదాత్మ్య విరోధినాం విరోధనివర్తనాయ విషయిషు వాసవాదిష్వారోపేణ సాధారణీకరణమ్ న చాత్రోపమా శక్యనిరూపణా, ద్వినేత్రత్వాదీనాముక్తేర్నిష్ప్రయోజనకత్వాపత్తేః, న చోపమాయా నిష్పాదకం .తేషాం సాధారణ్యమ్, తదభావేఽపి పరమైశ్వర్యాదిభిః ప్రతీయమానైస్తస్యా నిష్పత్తేః. అసుందరత్వాదుపమానిష్పాదకత్వేన కవేరనభిప్రేతత్వాచ్చ. నహ్యత్ర ద్వినేత్రత్వాదిభిర్ధర్మైర్వాసవాది సాదృశ్యం రాజ్ఞః కవేరభిప్రాయ విషయః. ఏవం ద్వితీయత్వాదీనాం

చంద్రాదిష్వారోపోఽప్యుపమాయాం సత్యామనర్థక ఏవ స్యాత్. అభేద ప్రతిపత్తౌ తు సహస్రనేత్రేణ, సహస్రకరేణ, విధిసృష్టావేకేన, వపుర్విహీనేన, జలాకారేణ, స్వర్గగతేన, చ తేన తేన కథమస్యాభేదః స్యాదితి ప్రతికూలధియమపసారయతాం విషయిగతానాం ద్వినేత్రత్వాద్యారోపాణాము పయోగః. అత్రై వేవశబ్దస్యాభావే దృఢారోపం రూపకమ్. విషయిగత విశేషణానామభావే ఉపమా. ఉభయేషామేకతరస్యాప్యభావే శుద్ధరూపకమితి వివేకః. ఏవం స్వరూపోత్ప్రేక్షాదిగుపదర్శితా.

మాలారూపముగ గూడ ఇది సంభవించును. ఎట్లనగా

"ద్వినేత్ర ఇవ"మొ. (రెండు కన్నులున్న ఇంద్రునివలె, రెండుచేతులు గల సూర్యునివలె, రెండవవాడైన చంద్రునివలె, శరీరము ధరించిన మన్మథునివలె, మనుష్యుని ఆకారముగల సముద్రునివలె, భూమికి వచ్చిన బృహస్పతివలె, నిఖిల విప్రులచేతను కొనియాడబడినవాడై ఒకానొక రాజు ప్రకాశించుచున్నాడు.)

ఇచట రాజు నందున్న ద్వినేత్రత్వాదులకు, వాసవాదులతోడి తాదాత్మ్య విరోధులకు, విరోధము నివర్తింపజేయుటకై విషయులగు వాసవాదులందు నారోపముచేత సాధారణముగా జేయుట. పోనీ – ఇక్కడ నుపమ నిరూపించుటకు వీలుగాదా? అపుడు ద్వినేత్రాదులను జెప్పుట నిష్ప్రయోజనమేమో? వాని సాధారణ్యా ముపమను నిష్పాదనము చేయును అనరాదు. అది లేకున్నను పరమైశ్వర్యాదులు స్ఫురించును గనుక వానితోనే ఉపమసరిపోవునుకదా? ఇవి అసుందరములు, ఉపమానిష్పాదకముగా కవికి అనభీష్టములుగూడ. ఇచట ద్వినేత్రత్వాదులగు ధర్మములచే రాజునకు వాసవాదులతో సాదృశ్యము కవికభిమతముగాదే. ఈలాగే ద్వితీయత్వాదులకు చంద్రాదులయందు ఆరోపమున్నూ ఉపమయైనచో నిరర్థకమేయగును అభేదప్రతిపత్తిలో సహస్రనేత్రుడును, సహస్రకరుడును, బ్రహ్మసృష్టిలో ఒక్కడుగనే ఉన్నవాడును, శరీరము లేనివాడును, జలాకారుడును, స్వర్గగతుడును అగు ఆయావ్యక్తితో నెట్లు ఈతని కభేదము గల్గును అను ప్రతికూలబుద్ధి తొలగించు విషయియందున్న ద్వినేత్రత్వారోపముల కుపయోగ ముండనే యున్నది. ఇచటనే

ఇవశబ్దము లేనిచో దృఢారోప మగు రూపకము, విషయి గత విశేషణములు లేకున్నచో నుపమ. రెండింటిలో నొకటియు లేకున్నచో శుద్ధరూపకమని ఆలోచనము. ఇలా స్వరూపోత్ప్రేక్ష మార్గము చూపబడినది.

అథ హేతూత్ప్రేక్షా యథా—

"త్వత్ప్రతాపమహాదీపశిఖావిపులకజ్జలైః
నూనం నభస్తలే నిత్యం నీలిమా నూతనాయతే".

అత్ర నీలిమ సామానాధికరణ్యేనోత్ప్రేక్షితస్య హేతుత్వేనోత్ప్రేక్షణమ్.- 'కజ్జల లేపనైః' ఇతి కృతే ఇయమేవ క్రియాహేతూత్ప్రేక్షా.

గుణహేతూత్ప్రేక్షా యథా—

"పరస్పరాసంగసుఖాన్నతభ్రువః
పయోధరౌ పీనతరౌ బభూవతుః
తయోరమృష్యన్నయమున్నతిం పరా
మవైమి మధ్యస్తనిమానమంచతి".

అత్ర పూర్వార్ధే సుఖస్య గుణస్య హేతుత్వం తావత్ పంచమ్యైవ నిర్దిష్టమ్. అపరార్ధే ధర్మివిశేషణతయా అనూద్యమానస్య గుణాభావస్య త్వార్థమ్. యథా 'భోక్తా భుంజానో వా తృప్యతి' ఇత్యాదౌ భోజనాదేః. యథావా —

"వ్యాగుంజన్మధుకరపుంజమంజుగీతా
మాకర్ణ్య స్తుతిముదయత్త్రపాతిరేకాత్.
ఆభూమీతలనతకంధరాణి మన్యేఽ
రణ్యేఽస్మిన్నవనిరుహాం కుటుంబకాని."

తరువాత హేతూత్ప్రేక్ష యెట్లనగా —

"త్వత్ప్రతాప" మొ. (నీయొక్క ప్రతాప మనెడు గొప్పదీపశిఖ యొక్క అత్యధికమగు కాటుకలచే ఆకాశ ప్రదేశమునందు నీలిమ నిత్యముగా నూతనమగుచున్నది, నిశ్చయము.)

ఇచట నీలిమతో సమానాధికరణముగా నుత్ప్రేక్షిత మైన దానికి హేతువుగా నుత్ప్రేక్షణము. కజ్జల లేపనైః - అని చేసినచో ఇదియే క్రియా హేతూత్ప్రేక్ష -

గుణహేతూత్ప్రేక్ష యెట్లనగా -

"పరస్పరాసంగ" మొ. (ఒకదానితో నొకదాని ఆ సంగమువలని సుఖమువలన, వంగిన కనుబొమలుగల స్త్రీయొక్క స్తనములు స్థూలములై..... వాటియొక్క గొప్పదనమును సహించనిదై నడుము అల్పత్వమును బొందుచున్న దనుకొందును )

ఇచట పూర్వార్ధమున సుఖమునకు, గుణమునకు హేతుత్వము పంచమితో నిర్దేశింపబడినది. అపరార్ధమున ధర్మివిశేషణముగా ననువదింపబడిన గుణాభావమునకు మాత్రము అర్థము. ఎట్లనగా-"భోక్త గాని భుజించుచున్న వాడు గాని తృప్తినొందును" అను ఇటువంటి చోటుల భోజనము మొదలైన దానికి.

మరొకటి -

"వ్యాగుంజన్మధుకర" మొ. (జుమ్మని మ్రోగుచున్న తుమ్మెదల సమూహముచే కమ్మగా పాడబడుచున్న స్తోత్రమును విని, ఉదయించుచున్న సిగ్గువలన ఈ అడవియందు వృక్షముల కుటుంబములు భూమితలము వరకు వంగినవని అనుకొందును )

క్రియాహేతూత్ప్రేక్షా యథా—

'మహాగురుకలిందమహీధరోదరవిదారణాదిర్భవన్ మహాపాతకావలివేల్లనాదివ శ్యామలితా' ఇతి.

ద్రవ్యహేతూత్ప్రేక్షా యథా—

"వరాకా యం రాకారమణ ఇతి వల్గంతి సహసా
సరః స్వచ్ఛం మన్యే మిలదమృతమేనన్మఖభుజామ్
అముష్మిన్యా కాపి ద్యుతిరతిఘనా భాతి మిషతా—
మియం నీలచ్ఛాయాదుపరి నిరపాయాద్భగవతః."

అత్రామృత సరోరూపతేనోత్ప్రేక్షితే చంద్రమసి నీలత్వేనాధ్యవసితే కలంకే ఉపరివర్తినభోహేతుకత్వముత్ప్రేక్ష్యతే. ఏతేన ద్రవ్యస్య హేతుత్వేనోత్ప్రేక్షణం నాస్తీతి ప్రాచాం ప్రవాదో నిరస్తః

క్రియాహేతూత్ప్రేక్ష యెట్లనగా -

"మహాగురు" మొ. (గొప్పబరువైన కలింద మహీధరము యొక్క

ఉదరమును చీల్చుకొని ఆవిర్భవించుటవలన మహాపాపము చుట్టుకొనుటవలన నల్లబడినదివలె."

[illegible]గా —

'వరాకా' షెఉ. "పిచ్చివారు ఎవనిని రాకారమణుడని ఆకస్మికముగా చెప్పుచున్నారో దానిని నేను అమృతముతో కలిసిన దేవతలయొక్క స్వచ్ఛమైన సరస్సు అనుకొందును. దీనియందేదో యొక కాంతి మిక్కిలి ఘనమైనదై చూచుచున్న వారలకు నీలచ్ఛాయ మగు నిరపాయమగు గగనమునుండి పైన ప్రకాశించుచున్నది."

ఇచట నమృత సరోరూపుడుగా నుత్ప్రేక్షితుడగు చంద్రునందు నల్లగా నధ్యవసాన మొనర్చబడిన కలంకమునందు పైనున్న నభోమండలము హేతువుగా గల్గియుండుట ఉత్ప్రేక్షింప బడినది. ఇందువలన ద్రవ్యమునకు హేతువుగా నుత్ప్రేక్షణము లేదనెడు ప్రాచీనుల సంప్రదాయము నిరస్తము.

ఏషామేవాభావానాం హేతూత్ప్రేక్షా యథా—

"నితాంతరమణీయాని వస్తూని కరుణోజ్ఝితః
కాలః సంహరతే నిత్యమభావాదివ చక్షుషః".

అత్ర కాలస్య సాహజికే సంహారకత్వే చక్షురభావస్య హేతుత్వేనోత్ప్రేక్షా.

'నిఃసీమశోభాసౌభాగ్యం నతాంగ్యా నయనద్వయమ్
అన్యోన్యాలోకనానందవిరహాదివ చంచలమ్."

అత్ర గుణాభావస్య,

"జనమోహకరం తవాలి మన్యే
చికురాకారమిదం ఘనాంధకారమ్-
వదనేందురుచామిహాప్రచారా-
దివ తన్వంగి నితాంతకాంతికాంతమ్,"

ఇహ ద్వితీయార్ధే క్రియాభావస్య. ప్రథమార్ధే తు జాత్యవచ్ఛిన్నస్య జాత్యవచ్ఛిన్నాభావస్య వా స్వరూపోత్ప్రేక్షైవ.

అనుచోట పర్యస్తాపహ్నుతిగర్భమగు నతిశయోక్తిని జెప్పుదురు; అది చింత్యము. పర్యస్తాపహ్నుతికి అపహ్నవత్వము ప్రామాణికసమ్మతముగాదని పూర్వమే చెప్పితిమి గదా?

మరియును వారే చెప్పిరి. "సంబంధాతిశతియోక్తిః" మొ. (సంబంధము లేనప్పుడు ఉన్నట్లు కల్పించుట సంబంధాతిశయోక్తి యగును. మేడల చివర భాగములు, ఈ పట్టణమునకు సంబంధించినవి, చంద్రమండలమును తాకుచున్నవి.)

అది యుక్తముగాదు. ఇక్కడ. "స్పృశంతీవేందుమండలం" అని చేస్తే ఏయలంకారము? ఉత్ప్రేక్ష అని అంటే ఇవాదులు లేనపుడు గమ్యోత్ప్రేక్ష ఉచితము. ఇవాదులుంటే వాచ్యోత్ప్రేక్ష. అదియే ఇవాదులు లేనిచో గమ్యోత్ప్రేక్ష అని నియమము సర్వసంమతము గనుక.

"త్వత్కీర్తిః భ్రమణ శ్రాంతా వివేశ స్వర్గ నిమ్నగామ్" – అని నీవు చెప్పిన గమ్యోత్ప్రేక్షకు, 'సౌధాగ్రాణి పురస్యాస్య' అను దానికిన్నీ ఉత్ప్రేక్షాంశమున విశేషము ఉపలబ్ధము కాకపోవుటవల్ల. "త్వత్కీర్తిః" ఇత్యాదికమున చాలదూరము వెళ్ళుటయందుగానీ, స్వర్గమునకు పోవుటయందుగానీ, స్వర్గంగాప్రవేశతాదాత్మ్యమున కుత్ప్రేక్ష యను మతమున స్వర్గసంబంధిత్వరూపమైన నిమిత్తధర్మము నుపాదానముచేయని యుత్ప్రేక్ష ఇది. కీర్తియందు స్వర్గంగా కర్మక ప్రవేశకర్తృత్వమున కుత్ప్రేక్ష అను సిద్ధాంతమున తాదృశగమన రూపానుపాత్త ధర్మనిమిత్తక. విశేషణీభూతభ్రమణముచే శ్రాంతత్వరూప హేతూత్ప్రేక్ష అను మతమున తాదృశ గమన తాదాత్మ్యముచే నధ్యవసితమగు, స్వర్గంగా ప్రవేశరూపమైన నిమిత్తధర్మము నుపాదాన మొనర్చిన యుత్ప్రేక్ష యని ఇచట యుత్ప్రేక్ష సర్వథా గమ్యమే. 'సౌధాగ్రాణి' యను చోట పరమగు నూర్ధ్వదేశముయొక్క సంయోగమున చంద్రమండల స్పర్శ తాదాత్మ్యము నుత్ప్రేక్షించుటయందు పరమోర్ధ్వదేశవృత్తిత్వరూపమైన అనుపాత్తధర్మమునిమిత్తముగాగల యుత్ప్రేక్ష. తాదృశస్పర్శకర్తృత్వోత్ప్రేక్ష యందైతే పరమోర్ధ్వదేశసంయోగరూపానుపాత్తధర్మనిమిత్త అని ఇది గమ్యోత్ప్రేక్షయే. కనుక ఉత్ప్రేక్షాసామగ్రి యెచట లేదో అటువంటి యుదాహరణ ముచితము. ఎలాగనగా—నా తాలూకు "ధీరధ్వనిభిః" ఇత్యాదికము. సుందరమై అందమును కల్గించునది అని అలంకారసామాన్యలక్షణమనుట ఇక్కడను మరచిపోవలదు.

ఇయం చాతిశయోక్తిర్వేదేఽపి దృశ్యతే యథా—

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వ-
త్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి."

స్మృతౌ చ—

"యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః"

ఈయతిశయోక్తి వేదమునందును కనపడును. ఎట్లనగా—

"ద్వాసుపర్ణా" మొ. (రెండు పక్షులు, కలిసియుండునవి, మిత్రులై ఒకేవృక్షము కౌగిలించుకొనుచున్నవి. వానిలో నొకటి పిప్పలము (కర్మ ఫలము) పూర్తిగా అనుభవించుచున్నది, అన్యము అనుభవించకనే బాగుగా ప్రకాశించును.)

స్మృతిలోకూడ—

"యానిశా" మొ. (సర్వభూతములకునూ ఏది రాత్రియో దానియందు సంయమి మేల్కొని యుండును. సర్వభూతములును దేనియందు మేల్కొని యుండునో అది చూచు మునికి రాత్రి.)

అథాస్య ధ్వనిః—

"దేవ త్వద్దర్శనాదేవ లీయంతే పుణ్యరాశయః
కిం చాదర్శనతః పాపమశేషమపి నశ్యతి."

పుణ్య పాపయోః సుఖదుఃఖ భోగమాత్రనాశ్యతయా దర్శనా దర్శనాభ్యాం తజ్జన్య సుఖదుఃఖయోః, రాశ్యశేషశబ్దాభ్యాం చ జన్మశతోపభోగ్యయోస్తయోరేవాతిపాదగ్రిమాభ్యాం పూర్వయో ర్నిగరణం వ్యజ్యతే. న చ పూర్వాభ్యామగ్రిమయోరేవ నిగరణం కిం న స్యాత్ ఇది వాచ్యమ్, నాశోక్తిసామంజస్యాయ నాశకతావచ్ఛేద కావచ్ఛిన్నత్వేన ప్రత్యయస్యావశ్యకతయా తన్నిగరణాసంభవాత్.

ఉపమానేన మహతా క్షుద్రస్యోపమేయస్య మహత్త్వాధానాయ తన్నిగరణస్యౌచిత్యాచ్చ. ఏతేన "తదప్రాప్తిమహాదుఃఖ—" ఇత్యాది కావ్యప్రకాశో వ్యాఖ్యాతః.

ఇతి రసగంగాధరేఽతిశయోక్తి ప్రకరణమ్.

తరువాత దీని ధ్వని—

"దేవ" మొ. (ఓ రాజా! నీ దర్శనమువలనే పుణ్యరాశులు క్షీణము లగుచున్నవి. నీవు కనపడనందు వలన పాపమంతయు నశించుచున్నది.)

పుణ్యపాపములు సుఖదుఃఖముల యుపభోగములచే నశింపదగినవి గనుక దర్శనాదర్శనములచే తజ్జన్య సుఖదుఃఖములకు, 'రాశి' 'అశేష' శబ్దములచేత జన్మశతము లందనుభవించదగిన వాటికే ఆక్షేపమువలన, చివరి వానిచే మొదటివానికి నిగరణము వ్యక్తమగును మొదటిదానిచే చివరి వాటికే నిగరణమనరాదు. నాశోక్తిసామంజస్యముకొరకు నా శకతానిర్ణాయక నిర్ణీతత్వముచే ప్రత్యయ మావశ్యకము గనుక తన్నిగరణము అసంభవము గనుక గొప్ప ఉపమానముతో క్షుద్రమగు నుపమేయమునకు గొప్పదనము నాధాన మొనర్చుటకై నిగరణమే యుచితము. దీనిచేత "తదప్రాప్తి మహాదుఃఖ" ఇత్యాది కావ్యప్రకాశ గ్రంథసందర్భము వ్యాఖ్యాతమైనది.

ఇతి అతిశయోక్తి ప్రకరణము

## తుల్యయోగితా

అథ తుల్యయోగితాన్వప్రకృతానామేవాప్రకృతానామేవ వా గుణక్రియాదిరూపైకధర్మాన్వయస్తుల్యయోగితా. ఔపమ్యం చాత్ర గమ్యమ్, తత్ప్రయోజకస్య సమానధర్మస్యోపాదానాత్, వాచకాభావాచ్చ. అత ఏవాలంకారికాణామపి సాదృశ్యం పదార్థాంతరమ్, న తు సాధారణధర్మరూపమితి విజ్ఞాయతే. అన్యథా ఔపమ్యస్యాత్ర గమ్యత్వోక్తేరనుపపత్తేః

తరువాత తుల్యయోగిత—

ప్రకృతములేగానీ, అప్రకృతములేగానీ, గుణక్రియా రూపమైన నొక ధర్మమున నన్వయించుట తుల్యయోగిత.

ఔపమ్యము ఇచట గమ్యము. ఉపమాప్రయోజకమగు సమానధర్మము నుపాదాన మొనర్చుటవలన. వాచకము లేదు కనుకనున్ను, ఇందువల్లనే నాలంకారికులకుగూడ సాదృశ్యము పదార్థాంతరము, అంతేగాని సాధారణ ధర్మరూపముగాదు అని తెలియుచున్నది. అలా గానియెడల ఔపమ్యము ఇచట గమ్యము అనుట అసంగతమేను.

కేచిత్తు—"సాదృశ్యభావ ఏవాతిరిక్తః, సాదృశ్యం తు తత్సాధారణ ధర్మాత్మకమేవ. స చేవాదిపదానాం శక్యతావచ్ఛేదకః. తత్తత్సాధారణధర్మవాచకైస్తు తత్తత్సాధారణధర్మస్య స్వశక్యతావచ్ఛేదకతద్ధర్మరూపేణ బోధనేఽపి సాదృశ్యభావరూపేణ బోధో వ్యంజనసాధ్య ఏవ" ఇత్యపి వదంతి. ఉదాహరణమ్—

"ప్రియే విషాదం జహిహీతి వాచం
ప్రియే సరాగం వదతి ప్రియాయాః.
వారామముదారా విజగాల ధారా
విలోచనాభ్యాం మనసశ్చ మానః-"

అత్ర మానిన్యా వర్ణ్యత్వాత్తదీయత్వేన ప్రకృతయోః కర్తృత్వేన రాజమానయోర్విగలనక్రియా సమానధర్మత్వేనోపాత్తా, విలోచన మనసోరపాదానయోశ్చ. కారకాణాం సర్వేషామపి క్రియాన్వయస్య తుల్యత్వాత్. ఏవం చతుర్ణాం క్రియారూప ధర్మైక్యేఽపి ద్వయోర్ద్వయోరేవౌపమ్యం ప్రతీయతే; న పరస్పరంచతుర్ణామ్ తదపాదానత్వ తత్కర్తృత్వరూపే విశేషే సామాన్యస్య పర్యవసానాత్. శేషము-పరిష్టాద్బోధ్యమ్.

కొందరు- "సాదృశ్యముయొక్క భావమే యతిరిక్తము. సాదృశ్యమో ఆయా సాధారణ ధర్మరూపమే. అది ఇవాదిపదములకు శక్యతానిర్ణాయకము, ఆయా సాధారణ ధర్మవాచకములచేత నాయా సాధారణ ధర్మము స్వశక్యతా నిర్ణాయకములైన ఆయా ధర్మములరూపముతో బోధింపబడినను, సాదృశ్యభావముతో బోధ వ్యంజనవల్లనే గల్గును అనియు జెప్పెదరు.

ఉదాహరణము.

"ప్రియే విషాదం" మొ. (ఓ ప్రియురాలా! దుఃఖము విడు

వుము అని మాటను ప్రియుడు అనురాగముతో చెప్పుచుండగా ప్రియురాలి లోచనముల నుండి కన్నీటి ప్రవాహమును మనస్సునుండి అభిమానమును తొలగినది )

ఇచట మానిని వర్ణ్యురాలు గనుక నామెకు సంబంధించినవిగా ప్రకృతములైన, కర్తలగు అశ్రుమానములకు విగలనక్రియ సమానధర్మముగా నుపాత్తమైనది. అపాదానములగు కన్నులకును మనస్సునకునుకూడ. కారకములన్నిటికిని క్రియతో నన్వయము సమానమె కావున. ఈ తీరుగా నాల్గింటికి క్రియారూపమగు ధర్మమొక్కటియైనను, రెండు రెండింటికే యౌపమ్యము స్ఫురించును. అంతేగాని పరస్పరము నాల్గింటికి కాదు. సామాన్యము తదపాదానత్వ తత్కర్తృత్వ రూపమగు విశేషమున పర్యవసించును గనుక. మిగిలినది పైన తెలియవలెను.

"న్యంచతి వయసి ప్రథమే
సముదంచతి కిం చ తరుణిమని సుదృశః.
ఉల్లసతి కాపి శోభా
వచసాం చ దృశాం చ విభ్రమాణాం చ"

**అత్ర గుణః. యది చ "విలసంత్యహమహమికయా వాచో గతయశ్చ విభ్రమాశ్చ భృశమ్" ఇత్యుత్తరార్ధమ్, తదా క్రియా. యది "దధతి స్మ మధురిమాణం వాచో గతయశ్చ విభ్రమాశ్చ భృశమ్" ఇతి క్రియతే తదా గుణవిశిష్టా క్రియా. కేవలగుణేన సాదృశ్యాత్సమ్బన్ధాభావాత్, కేవలక్రియాయాశ్చా హృద్యత్వాత్.**

"న్యంచతి" మొ. (స్త్రీ యొక్క మొదటి వయస్సు అంతర్హితమగుచుండగా, మరియు తారుణ్యము ఉద్భవించుచుండగా ఆమె మాటల యొక్కయు చూపుల యొక్కయు విలాసముల యొక్కయు కాంతి బాగా ప్రకాశించుచున్నది.)

ఇచట గుణము, అయితే—

"విలసంత్యహమహమికయా వాచో గతయశ్చ విభ్రమాశ్చ భృశం" అని ఉత్తరార్థము చేసినచో క్రియ. కాని "దధతిస్మ మధురిమాణాం వాచోగతయశ్చ

విభ్రమాశ్చ భృశం" అని రచించినచో విశిష్టగుణమగు క్రియ. కేవలము గుణముతో సాక్షాత్తుగా సంబంధము లేకపోవుటవలన కేవలము క్రియ హృద్యముగాదు కనుకనున్ను.

అప్రకృతానామేవ యథా—

"న్యంచతి బాల్యే సుదృశః సముదంచతి గండసీమ్ని పాండిమని
మాలిన్య మావిరాసీద్రాకాధిపలవలికనకానామ్".

అత్ర గుణః, ఆవిర్భావక్రియాయాః సాక్షాద్ధర్మిభిరనన్వయాత్. "న్యంచతి రాకాధిపతిర్లవలీ పురటం చ పుండరీకం చ" ఇతి కృతే క్రియా. "ధవలీభవత్యనుదినం లవలీ కనకం కలానిధిశ్చాయమ్" ఇతి కృతే గుణవిశిష్టక్రియా.

"త్వయి పాకశాసన సమే
శాసతి సకలం వసుంధరావలయమ్.
విపినే వైరివధూనాం
వర్షంతి విలోచనాని చ దినాని."

అత్రోభయసాధారణయోర్గుణక్రియయోరభావాచ్ఛబ్ద మాత్రమ్.
శ్లేషమూలేనాభేదాధ్యవసానేన పిండీకృతోఽర్థో వా

అప్రకృతములకే ఎట్లనగా—

"న్యంచతి" మొ. (స్త్రీ బాల్యము పోవుచుండగా, చెక్కిలియందు తెల్లదనము ఆవిర్భవించుచుండగా రాకాచంద్రునకును, లవలితీగకును బంగారమునకును, మాలిన్యము ఆవిర్భవించెను.)

ఇచట గుణము. ఆవిర్భావక్రియ సాక్షాత్తుగా ధర్ములతో నన్వయింపదు గనుక.

"న్యంచతి రాకాధిపతిర్లవలీ పురటంచ పుండరీకం చ" అని చేసినచో క్రియ.

"ధవలీభవత్యనుదినం లవలీ కనకం కలానిధిశ్చాయం" అని చేసినచో గుణ విశిష్టక్రియ.

"త్వయి" మొ. "ఇంద్రునితో సమానమైన నీవు సమస్త భూమిని శాసించుచుండగా అడవులందలి వైరికాంతలయొక్క నేత్రములును, రోజులును వర్షించుచున్నవి" (రోజుల పక్షమున సంవత్సరములవలె అగుచున్నవి అని యర్థము)

ఇచట నుభయ సాధారణగుణక్రియలు లేనందున శబ్దమాత్రము. లేదా శ్లేషమూలకమగు నభేదాధ్యవసానముతో పిండీకృతమైన అర్థము.

యత్త్వలంకార సర్వస్వకృతా, తదనుగామినా కువలయానంద కృతా చ "గుణక్రియాభిః సంబద్ధత్వే'' ఇతి, ''గుణక్రియారూపైక ధర్మాన్వయః" ఇతి చోక్తమ్, తదాపాతతః.

''శాసతి త్వయి హే రాజన్నఖండావనిమండలమ్
న మనాగపి నిశ్చింతే మండలే శత్రుమిత్రయోః.''

ఇత్యత్రాభావరూపస్యైవ ధర్మస్యాన్వయాత్. గుణక్రియే త్యుపలక్షణం వా ధర్మమాత్రస్య. ఏవం "ఏకస్త్వం దానశీలోఽపి ప్రత్యర్థిషు తథార్థిషు'' ఇత్యాదావపి దానశీలరూపైకాన్వయాల్లక్షణ ప్రవృత్తిః. యథా కథంచిదనేకత్రైకాన్వయస్య చమత్కారిణోఽపేక్షితత్వాత్.

అలంకార సర్వస్వకారుడు, తదనుగామి యగు కువలయానందకారు డున్ను "గుణక్రియలతో సంబంధించితే" అనియు, "గుణక్రియారూపమగు నొకధర్మముతో నన్వయము" అనియు అన్నారు. అది యాపాతతః అన్న మాటే.

"శాసతి" (ఓరాజా! అఖండ మగు నీ భూమండలమును నీవు శాసించుచుండగా శత్రు మిత్ర మండలము ఎ కొంచెమైనను నిశ్చింతములుగ లేవు)

ఇత్యాది శ్లోకమున అభావరూపమగు ధర్మమునకే నన్వయ మున్నది గదా? గుణక్రియలనేవి ధర్మమాత్రమునకు నుపలక్షణ మని యైనా యంగీక రింపవలెను. ఇదే విధముగా 'ఏకస్త్వమ్' అను నీరకపుచోటు లందుగూడ దాన శీలమనునొకటి అన్వయించుటవలన లక్షణ మట ప్రవర్తించును. ఏదియో విధ ము,గ చమత్కారజనకమగు,అనేకములం దేకాన్వయము అపేక్షితము గనుక.

ఏతేన—

"హితాహితే వృత్తితౌల్యమపరా తుల్యయోగితా
ప్రదీయతే పరాభూతిర్మిత్రశాత్రవయోః సమా."

ఇత్యాదినా తుల్యయోగితాయాః ప్రకారాంతరం యత్ కువలయానందకృతా లక్షితముదాహృతం చ తత్‌పరాస్తమ్. అస్యా అపి "వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా". ఇతి పూర్వలక్షణాక్రాంతత్వాత్. ఏకానుపూర్వీబోధితవస్తుకర్మక దాన పాత్రత్వస్య, పరంపరయా తాదృశశబ్దస్య, ప్రాగుక్తమార్గేణార్థస్య వా ధర్మస్యైక్యాత్.

"యశ్చ నింబం పరశునా యశ్చైనం మధుసర్పిషా
యశ్చైనం గంధమాల్యాద్యైః సర్వస్య కటురేవ సః."

ఇత్యత్రాపి కటుత్వ విశిష్టస్య నింబస్యైవ పరంపరయా ఛేదక–సేచక-పూజక ధర్మత్వసంభవాత్. న చాత్ర వృత్తినియామక సంబంధేన ధర్మివృత్తిత్వం వివక్షితం ధర్మస్య, వక్ష్యమాణకారకదీపకాదావవ్యాప్త్యాపత్తేః.

దీనిచేత –

"హితాహితే". హితులయందు అహితులయందును వృత్తి తౌల్యము తుల్యయోగిత. నీ స్నేహితులకును, నీ శత్రువులకును సమముగ పరాభూతి ఈయబడుచున్నది.)

ఇత్యాదిచే కువలయానందకారుడు లక్షణము చెప్పి ఉదాహరించిన తుల్యయోగితయొక్క ప్రకారాన్తరము పరాస్తమైనది. ఇది కూడా—

"వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా" అని వెనుకటి లక్షణముచే నాక్రమింపబడ్డదే గదా? ఒకేయానుపూర్విచే బోధింపబడిన, వస్తువు కర్మగాగల దానపాత్రత్వముగాని, పరంపరగా నటువంటి శబ్దము గాని, వెనుకజెప్పిన త్రోవనే అర్థము గానీ ఒకధర్మముగా నున్నది కనుక.

"యశ్చనింబం" (ఎవరు వేపచెట్టును గొడ్డలిచేతను ఎవరైతే దీనిని

తేనెతోను నెయ్యితోను, ఎవరైతే దీనిని గంధము పూలదండ మొనతైనవాటి తోను, అందరికి ఇది చేదేను.)

ఇత్యాది శ్లోకమునందుగూడ కటుత్వవిశిష్టమునకు నింబమునకే పరంపరగా భేదక-సేచక-పూజక-ధర్మత్వము సంభవించును గనుక. వృత్తినియామక సంబంధముచేత ధర్మమునకు ధర్మివృత్తిత్వము వివక్షిత మనరాదా? అట్లన్నచో చెప్పబోవుకారక దీపకాదులందు అతివ్యాప్తి ప్రసక్తించును.

అథ చంద్ర ఇవ సుందరం ముఖ మిత్యాద్యుపమాయాం చంద్రముఖయోరేకధర్మాన్వయాదతివ్యాప్తిః. న చాత్ర ప్రకృతానామేవేత్యుక్తత్వాన్న తథేతి వాచ్యమ్. ప్రాగుక్తే "ప్రియే విషాదమ్" ఇతి పద్యే "జగాల మానో హృదయాదముష్యా విలోచనాభ్యామివ వారిధారా" ఇత్యుత్తరార్ధే కృతే ప్రకృతయోర్మానవారిధారయోరుపమాయాం తథాప్యతివ్యాప్తేః. చంద్ర ఇవ సుందరం ముఖమిత్యత్రాపి వక్ష్యమాణదీపకే ఉపమాతివ్యాప్తేశ్చ. న చౌపమ్యస్య గమ్యత్వే సతీత్యపి విశేషణీయమితి వాచ్యమ్.

"చంద్రాంశునిర్మలం వారి చంద్రో హంససమద్యుతిః
హంసాస్తు శరదః స్మేరపుండరీకమనోరమాః".

ఇత్యత్ర వాచకాభావాద్గమ్యోపమాయాం తథాప్యతిప్రసంగాత్. యది చాత్ర న వ్యంగ్యా ఉపమా, కింతు సమాసస్య వాచ్యా, పూర్వపదస్య లక్ష్యా చేతి సూక్ష్మమిత్యుచ్యతే తథాపి "హంసాస్తు మానసభువః శస్త్రా ఏవ న సంశయః" ఇత్యాదిరూపకాదిష్వతిప్రసంగః. న హ్యత్రాపి చంద్రసాదృశ్య విశిష్టే చంద్రాదిపదానాం లాక్షణికత్వాదుపమా లక్ష్యైవేతి శక్యతే వక్తుమ్. రూపకే లక్షణా నాస్తీతి ప్రాగేవ ప్రతిపాదనాత్- ఇతి చేత్ న. యత్ర యథోక్తానాం ధర్మిణాం యథోక్తధర్మాన్వయ ఏవ చమత్కారీ, తత్ర తుల్యయోగితా, దీపకం వా. యత్ర తాదృశధర్మాన్వయప్రయుక్తం సాదృశ్యమభేదో వా, తత్రోపమారూపకాదికమేవాలంకారతాప్రయోజకమ్. సుందరత్వే సత్యుపస్కారకత్వమిత్యసకృదావేదనాత్. అన్యథా సాదృశ్యస్యాత్ర ప్రత్యయాత్తదాదాయోపమావ్యవహారస్యాప్యాపత్తేరితి దిక్.

అయితే -

"చంద్ర ఇవ సుందర ముఖం"-ఇత్యాద్యుపమలయందు చంద్రముఖముల కేకధర్మాన్వయమున్నది కనుక నతివ్యాప్తి. ఇచట ప్రకృతములకేగాని నప్రకృతములకేగాని అని చెప్పబడినది గనుక నలా కాదందురా? వెనుక చెప్పిన 'ప్రియేవిషాదం-' అనుపద్యమున 'జగాల మానో హ్యాదయాదముష్యా విలోచనాభ్యామివ వారిధారా" అను ఉత్తరార్ధముచేయగా ప్రకృతములగు మానవారిధారల కుపమయందు, అటయినను అతివ్యాప్తియే. 'చంద్రుని వలె చక్కని దీ మొగము' అన్నచోటను గూడ చెప్పబోవు దీపక లక్షణమున కతివ్యాప్తియేను. 'ఔపమ్యము గమ్యమగుచుండగా' ననే విశేషణము వేయవలెను అని అందుము అనరాదు.

"చంద్రాంశు నిర్మలం" (ఉదకము చంద్రకిరణముల వలె నిర్మలమైనది. చంద్రుడు హంసతుల్యమైన కాంతి గలవాడు. హంస శరత్కాలమున వికసించిన పుండరీకముతో సమానమైన అందము గలది.)

ఇత్యాది శ్లోకమునందుగూడ వాచకము లేదుగనుక గమ్యోపమలో నలాగైనను అతివ్యాప్తియే. ఇచట నుపమ వ్యంగ్యముగాదు, సమాసమునకు వాచ్య పూర్వపదమునకు లక్ష్య, అని సూక్ష్మముగా జూచినచో అట్లయినను "హంసాస్తు మానసభువశ్చంద్రా ఏవ న సంశయః" ఈ తీరుగా నున్న రూపకాదులయందు నతిప్రసంగము. ఇక్కడకూడా చంద్రాదిసాదృశ్య విశిష్టమున చంద్రాదిపదములు లాక్షణికము లగుటవలన నుపమ లక్ష్యయే అని చెప్పుటకు వీలు గాదు. రూపకములో లక్షణ లేదని ఇదివఱకు ప్రతిపాదించితిమి గదా? అనెదరేని-అట్లాకాదు. యథోక్తములగు ధర్ములకు ఎక్కడ యథోక్తములగు ధర్మములతో అన్వయము చమత్కారము గల్గించునో అక్కడ తుల్యయోగితగానీ, దీపకముగానీ. ఎక్కడ తాదృశ ధర్ముల అన్వయమువలన ప్రయుక్తమగు సాదృశ్యమో అభేదమో అచట ఉపమ రూపకము మొదలైనవే అలంకారతాప్రయోజకములు. 'సుందరత్వే సతి ఉపస్కారకత్వమ్' అని అనేకపర్యాయములు చెప్పితిమి. అలాగానిచో సాదృశ్య మిచట ప్రతీతము గనుక దానినే ఇచట దీసుకొని యుపమ యనే వ్యవహారము ప్రసక్తించునుఅని దిక్.

ఏవం చ—

''దధీచి బలి కర్ణేషు హిమ హేమాచలాబ్ధిషు
అదాతృత్వమధైర్యం చ దృష్టే భవతి భాసతే".

ఇత్యాదౌ రశనారూపైషా యథాసంఖ్యావష్టబ్ధా.

"దృష్టః సదసి చేదుగ్రాశ్చంద్ర చందన చంద్రికాః
అథ త్వం సంగరే సౌమ్యాః శేషకాలానలాబ్ధయః".

ఇత్యత్ర చ స్వరూపద్వయేన రాజవిషయకరతిభావభూషణ తయా స్థితా. యత్ర చ ప్రకృతానామేవాప్రకృతానామేవ వా క్రియాణామేకకారకాన్వయః సా కారకతుల్యయోగితా. యథా—

"వసు దాతుం యశో ధాతుం, విధాతు మరిమర్దనమ్
త్రాతుం చ సకలాం పృథ్వీమతీవ నిపుణో భవాన్"

అత్ర రాజ్ఞః స్తావకవాక్యే ప్రకృతానాం క్రియాణామేకేన కర్త్రా సాధారణేన ధర్మేణౌపమ్యమ్. యథా వా—

"మూరీకరోతి కుమతిం విమలీకరోతి
చేతశ్చిరంతనమఘం చులుకీకరోతి.
భూతేషు కిం చ కరుణాం బహులీకరోతి
సంగః సతాం కిము న మంగలమాతనోతి."

ఇలాగున—

"దధీచిర్బలికర్ణేషు" (బలి కర్ణుల యందును, మంచు, బంగారపుకొండ, సముద్రము వీటియందును, నీవు కన్పడగానే అదాతృత్వము అధైర్యమును ప్రకాశించును.)

ఇత్యాది స్థలమున రశనా రూపముగా నిది యథాసంఖ్యముచే నవష్టబ్ధమైనది.

"దృష్టః" (సభయందు నీవు కన్పడినయెడల చంద్రుడు,చందనము, వెన్నెలయు ఉగ్రములుగా నుండును యుద్ధమున నీవు కన్పడినయెడల శేషుడు కాలాగ్నియు సముద్రమును సౌమ్యులగుదురు.)

ఈ చోటున రెండురూపములచేత రాజును గూర్చిన రతిభావమునకు నలంకారముగా నున్నది.

ఎక్కడ ప్రకృతములేగాని అప్రకృతములేగానీ అయిన క్రియలకు నొకేకారకముతో నన్వయమో అది కా``కతుల్యయోగిత.

ఎట్లనగా —

"వసు దాతుం" మొ.(నీవు ధనము నిచ్చుటకు, కీర్తిని సమకూర్చుటకు శత్రుమర్దన మొనర్చుటకు, యావత్తు భూమిని రక్షించుటకు, చాల సమర్థుడవు.)

ఇట రాజును స్తుతించు నీ వాక్యమున ప్రకృతములైన క్రియలకు సాధారణమైన ధర్మమైన ఒక కర్తతో నన్వయముగాన నౌపమ్యము.

మరియు,

'దూరీకరోతి' మొ. (దుర్వృత్తిని దూరముగాచేయును, మనసును నిర్మలమొనర్చును, ప్రాచీనదురితమును క్షమించును, భూతములయందు జాలిని విస్తరింపజేయును. సత్పురుషుల సహవాసము ఏమి శుభము నొనర్పదు?)

ఇచట నర్థాంతరన్యాసముతో గలసినది.

"కేఽపి స్మరంత్యనుసరంతి చ కేచిదన్యే
పశ్యంతి పుణ్యపురుషాః కతి చ స్పృశంతి.
మాతర్మురారిచరణాంబుజమాధ్వి గంగే
భాగ్యాధికాః కతిపయే భవతీం పిబన్తి."

అత్రైకం కర్మ క్రియాణాం సాధారణమ్. వ్యంగ్యైషా యథా—

"అయే లీలాభగ్నత్రిపురహరకోదండమహిమన్!
కథా యత్రోదంచత్యతులబలధైర్యస్య భవతః.
అయం కో వా తత్ర ప్రసృమరఫణాకోణనిహిత-
క్షితిః శేషః శ్రీమాన్ కమఠకులచూడామణిరపి."

అత్ర కో వా ఇత్యనేన వాచ్యలక్ష్యవ్యతిరిక్తహ్యాగణనీయత్వస్య

శేషకమఠాభ్యామప్రకృతాభ్యామన్వయః ప్రతీయతే.

ఇతి రసగంగాధరే తుల్యయోగితాప్రకరణమ్.

"కేఽపి స్మరంతి" మొ.(కొంతమంది స్మరింతురు, మరికొందరు అనుసరింతురు, పుణ్యపురుషులు చూతురు, మరికొందరు స్పృశింతురు, మురహారుని పాద పద్మముల యందలి మకరందమా! తల్లీ! గంగా! అదృష్టవంతులు కొందరు నిన్ను త్రాగెదరు.)

ఇచట ఒకేకర్మ, క్రియలకు సాధారణము.ఇది వ్యంగ్యమగుట ఎట్లనగా-

"అయే లీలా" (లీలగా భగ్నమగు త్రిపురారి కోదండ సామర్థ్యము గల ఓ రాముడా! తులలేని బలధైర్యములు గల నీ యొక్క ప్రసంగము ఎక్కడ నడచునో అక్కడ వ్యాపించిన ఫణాకోణమునందుంచబడిన భూమిగల శేషుడుగాని, శ్రీమంతుడైన కమఠాధిపతిగాని ఎంతటివాడు?)

ఇచట 'ఎవడో' అనేదానిచే, వాచ్యలక్ష్యవ్యతిరిక్తమైన అగణనీయత్వమునకు నప్రకృతములగు శేషకమఠములతో నన్వయము స్ఫురించును.

ఇది తుల్యయోగితాప్రకరణము.

## దీపక ప్రకరణమ్

అథ దీపకమ్—ప్రకృతానామప్రకృతానాం చైకసాధారణధర్మాన్వయో దీపకమ్. ప్రాగ్వదేవాత్రాప్యౌపమ్యస్య గమ్యత్వమ్. ప్రకృతార్థముపాత్త ధర్మః ప్రసంగాదప్రకృతమపి దీపయతి ప్రకాశయతి సుందరీకరోతీతి దీపకమ్. యద్వా దీప ఇవ దీపకమ్. సంజ్ఞాయాం కన్. దీపసాదృశ్యం చ ప్రకృతాప్రకృతప్రకాశకత్వేన బోధ్యమ్.

ఉదాహరణమ్—

"అమృతస్య చంద్రికాయా లలితాయాశ్చాపి కవితాయాః
సుజనస్య చ నిర్మాణం జనయతి నహి కస్య సంతోషమ్"

యథా వా—

"సుధాయాశ్చంద్రికాయాశ్చ సంజీవిన్యా మహౌషధేః
దయాదృష్టేశ్చ తే రాజన్ విశ్వసంజీవనం గుణః."

యథా వా—

"మృతస్య లిప్సా కృపణస్య దిత్సా
విమార్గగాయాశ్చ రుచిః స్వకాన్తే
సర్పస్య శాంతిః కుటిలస్య మైత్రీ
విధాతృసృష్టౌ న హి దృష్టపూర్వా.

అత్రాభావః సాధారణో ధర్మః. కస్యచిత్ ప్రకృతత్వే దీపకమ్, అన్యథా తుల్యయోగితైవ.

తరువాత దీపకము.

ప్రకృతములకు అప్రకృతములకును ఏకమగు సాధారణ ధర్మమున అన్వయము దీపకము.

వెనుకటివలెనే ఇచట గూడ ఔపమ్యము గమ్యమగును. ప్రకృతము నకై స్వీకరింపబడిన ధర్మము ప్రసంగ మూలమున అప్రకృతమును కూడ ప్రకాశింపజేయును, సుందరముగా జేయును, గాన దీపకము.

అథవా - దీప ఇవ దీపకమ్. సంజ్ఞయందు "కన్" ప్రత్యయము. దీప సాదృశ్యమున్న ప్రకృతములను, అప్రకృతములను బ్రకాశింపజేయుటచే నని గ్రహించవలయును.

ఉదాహరణము.

"అమృతస్య" (అమృతమును, వెన్నెలను, లలితమగు కవితను, సుజనుని, నిర్మించుట ఎవరికి సంతోషము కలిగించదు?)

మరియొకటి.

"సుధాయాం" (అమృతమునకును, వెన్నెలకును, మహౌషధియగు సంజీవినికిని, ఓ రాజా ! నీ దయాదృష్టికిని, ప్రపంచము బ్రతికించుట గుణము )

ఇంకొకటి -

"మృతస్య" (మృతునకు పొందవలెనను కోర్కెయు, లోభికి యివ్వవలెనను కోర్కెయు, తప్పుడు దోవలు బోవుదానికి తన భర్త యందు ప్రీతియు, సర్పమునకు శాంతియు, కుటిలునకు మైత్రియు, బ్రహ్మ సృష్టిలో యిదివరకు చూడలేదు).

ఇచట అభావము సాధారణ ధర్మము.

ఒకటి ప్రకృతమైనచో దీపకము; లేకపోయిన తుల్యయోగితయే,

యత్ర క్రియా సాధారణో ధర్మస్తత్ర యావతాం కర్త్రాదికారకాణాం సంవిధానం తేషాం స్వసజాతీయేనాన్యేన సహ తుల్యయోగితా దీపకం వా పృథక్ పృథగ్ భవతి, ఔపమ్యస్యాపి పృథగేవ భాసమానత్వాత్. యథా—

"సుజనాః పరోపకారం శూరాః శాస్త్రం ధనం కృపణాః
కులవత్యో మందాక్షం ప్రాణాత్యయ ఏవ ముఞ్చన్తి".

అత్ర కర్తృకర్మణోః. ఏవం వక్ష్యమాణే "లావణ్యేన ప్రమదా—"ఇత్యత్ర కర్తృకరణయోః. "దివి సూర్య—" ఇత్యత్ర కర్త్రధికరణయోః. అమునైవ న్యాయేనానేకానాం క్రియాణామేకకారకాన్వయే కారకదీపకమ్. యథా—

"వసు దాతుం యశో ధాతుం విధాతుమరిమర్దనమ్
త్రాతుం చ మాదృశాన్ రాజన్నతీవ నిపుణో భవాన్".

అత్ర వృత్తిహీనస్య కస్యచిద్దీనస్య వచనే వసుదాన స్వత్రాణలక్షణయోః క్రియయోః ప్రకృతయోః అరిమర్దనస్య చాప్రకృతస్య, యశోధానస్య చోభయాత్మనః సాధారణం కర్తృకారకమ్.

ఎక్కడ క్రియ సాధారణ ధర్మమో, అచట కర్త్రాది కారకములు ఎన్ని సన్నిహితములగునో వాటికి స్వసజాతీయమగు నితరముతో గూడ తుల్యయోగితగానీ దీపకముగానీ వేరువేరుగా నగును. ఔపమ్యము కూడ పృథక్కుగానే ప్రకాశించును కనుక. ఎట్లనగా-

"సుజనాః" మొ. (సుజనులు పరోపకారమును శూరులు శస్త్రమును, లోభులు ధనమును, సత్కులప్రసూతలు సిగ్గును ప్రాణావసానమునందే విడిచెదరు.)

ఇచట కర్తృ కర్మలకు. ఇలాగే చెప్పబోవు "లావణ్యేన ప్రమదా" అనుచోట కర్తృ కరణములకు. "దివిసూర్యః" - అనుచోట కర్త్రధికరణ ములకు.

ఈ న్యాయముతోనే ననేకములగు క్రియలకు నొక్క-కారకముతో ననన్వయమున కారకదీపకము - ఎట్లనగా.

"వసు దాతుం" మొ (ధనము నిచ్చుటకు, యశస్సును ఆధానము చేయుటకు, శత్రుమర్దన మొనరించుటకు, మాబోటివారిని కాపాడుటకు, ఓ రాజా ! ఎక్కువ నిపుణుడవు నీవు).

ఇచట వృత్తిహీనుడగు నొకానొక దీనుని వచనమునందు వసుదానము స్వత్రాణము ఈ లక్షణములగు ప్రకృతములైన క్రియలకు నప్రకృతమగు నరిమర్దనమునకును ఉభయాత్మకమగు యశోధానమునకును కర్తృకారకము సాధారణము.

యథా—

**"వాసయతి హీనసత్త్వానతిసత్త్వానుద్ధతాన్ వివాసయతి**
**త్రాసయతి సకలశత్రూన్నీతివిదామగ్రణీర్నరాధిపతిః."**

**అత్ర కస్యచిద్దీనసత్త్వస్య సత్త్వాధికమసహమానస్య వా శత్రుపరిపీడితస్య వా కస్యచిద్రాజానం కంచిత్ప్రత్యుక్తౌ సామాన్య విశేషరూపాయామప్రస్తుతప్రశంసాయామేకస్యాః క్రియాయాః ప్రకృతాయాః ఇతరయోశ్చాప్రకృతయోః సాధారణం తత్. యది తు ప్రాగుక్తవక్తృభిన్నస్య కస్యచిద్రాజస్తోతుర్నీతిమాత్రబోధకస్య చేయముక్తిస్తదా క్రియాణాం ప్రకృతాప్రకృతరూపత్వాభావాత్తుల్య యోగితైవ.**

ఎట్లనగా—

"వాసయతి" మొ. (నీతివేత్తలలో శ్రేష్ఠుడగు రాజు హీనసత్త్వులను కాపురముంచును. ఎక్కువ బలముకల ఉద్ధతులను నివాసహీనులను చేయును సకల శత్రువులను భయపెట్టును).

ఇచట హీనసత్త్వుడుగాని, సత్త్వాధికుని సహించనివాడు గాని, శత్రు పీడితుడైనవాడు గాని అగు ఒకానొకని, రాజు నొకనిని గురించిన జవాబులో

సామాన్య విశేష రూపమగు నప్రస్తుత ప్రశంసయందు ఒక క్రియకు ప్రకృత మగు దానికి, అప్రకృతములగు రెండు ఇతరక్రియలకు నది సాధారణమైనది.

వెనుక జెప్పబడిన వక్తకంటే భిన్నుడగు నొకానొక రాజస్తోతగాని, నీతిమాత్రము బోధించువాడు కాని ఈ మాట చెప్పినట్లయితే అప్పుడు క్రియ లకు ప్రకృతాప్రకృత రూపత్వము లేదు కనుక తుల్యయోగితయే యగును.

యత్తు—

"సకృద్వృత్తిస్తు ధర్మస్య ప్రకృతాప్రకృతాత్మనామ్
సైవ క్రియాసు బహ్వీషు కారకస్యేతి దీపకమ్."

ఇతి లక్షణముక్త్వా—

"స్విద్యతి కూణతి వేల్లతి
విచలతి నిమిషతి విలోకయతి తిర్యక్
అంతర్నందతి చుంబితు-
మిచ్ఛతి నవపరిణయా వధూః శయనే."

ఇతి ద్వితీయం దీపకముదాహృతం కావ్యప్రకాశకృద్భిః, తత్ర విచార్యతే—ప్రథమార్ధగతలక్షణేనైవ దీపకద్వయస్యాపి సంగ్రహాద్ ద్వితీయం లక్షణం వ్యర్థమ్. గుణీనాం కారకాణాం చ గుణక్రియా రూపధర్మస్యేవ క్రియాణామపి కారకరూపధర్మస్య సకృద్వృత్తేః సామ్రాజ్యాత్. న చ క్రియాణాం ప్రకృతాత్మతావిరహేఽపి శుద్ధ ప్రకృతత్వే శుద్ధాప్రకృతత్వేఽపి వా కారకస్య సకృద్వృత్తేర్దీపకత్వమ్, క్రియాభిన్నానాం తు ప్రకృతాప్రకృతాత్మతాయామేవ క్రియాదేర్ధర్మ స్యేతి వై లక్షణ్యాల్లక్షణద్వయమితి వాచ్యమ్; కారకతుల్యయోగి తోచ్ఛేదాపత్తేః, సకలాలంకారికసిద్ధాంత విరోధాపత్తేశ్చ. లక్షణద్వయ స్యాననుగతత్వాచ్చ. తాదృశలక్షణద్వయాన్యతరవత్త్వస్య లక్షణత్వే గౌరవాదుపప్లవప్రసంగాచ్చ. ఏవం చ "స్విద్యతి కూణతి—" ఇత్యాద్యుదాహరణమపి న సంగచ్ఛతే, క్రియాణాం శుద్ధప్రకృత త్వాత్. కిం చ దీపక తుల్యయోగితాదా గమ్యమానమౌపమ్యం జీవాతురితి సర్వేషాం సంమతమ్. న చాత్ర స్వేదనకూణనాదీనామే కకారకాన్వితానామప్యౌపమ్యం కవిసంరంభగోచరః. తస్మాత్సముచ్చ

యాలంకారచ్ఛాయాత్రోచితా. అస్మదుదీరితానాం వసుకానాదీనాం హీనస త్త్వవాసనాదీనాం చ రాజక ర్తృకాణాం పద్యద్వయగతానామౌ పమ్య ప్రతీతౌ సహృదయహృదయమేవ ప్రమాణమితి న ప్రతిబంధి దానావసరః. యది తు స్వేదనాదీనామౌపమ్యం ప్రతీయత ఏవేత్యాగ్రహ స్తథాపి క్రియాణాం శుద్ధప్రకృతత్వాత్తుల్యయోగితా స్యాదపి, న తు దీపకమిత్యాస్తాం తావత్.

అయితే-

"సకృద్వృత్తిస్తు" (ప్రకృతా ప్రకృతాత్మలకు ధర్మము యొక్క ఒక్కసారి యునికియు, అనేక క్రియల యందు కారకమునకు ఒకసారి ఉనికియు దీపకము)

ఇత్యాది లక్షణమును జెప్పి—

"స్విద్యతి" మొ. (క్రొత్తగా పెండ్లాడిన కోడలు పక్కయందు చెమటకార్చు చున్నది. కూణన మొనర్చు చున్నది, తిట్టుకొను చున్నది, అనేక రకములుగా తిరుగుచున్నది, కనులు మూయుచున్నది. అడ్డముగా కనులు తెఱుచు చున్నది, తనలోపల ఆనందించుచున్నది. ముద్దుపెట్టుకొనదలచు చున్నది.)

అని రెండవ దీపకమును కావ్యప్రకాశకారు డుదాహరించెను. అచట విచారింతము—

మొదటి సగమందున్న లక్షణముచేతనే రెండు దీపకములును సంగ్రహింపబడినవి. రెండవ లక్షణము వ్యర్థము. గుణములకును, కారకములకును గుణక్రియా రూపమగు ధర్మమునకువలె క్రియలకున్ను కారకరూపమగు ధర్మమునకు సకృద్వృత్తి సర్వత్రా యున్నదే ? అయితే - క్రియలకు ప్రకృతాప్రకృత స్వరూపత్వము లేకున్నను, శుద్ధప్రకృతత్వమైనప్పటికిన్నీ శుద్ధాప్రకృతత్వమైనప్పటికిన్నీ, కారకమునకు సకృద్వృత్తి వలన దీపకత్వము. క్రియలకంటే వేరగువాటికి మాత్రము క్రియాది ధర్మముల ప్రకృతా ప్రకృతాత్మతలోనే అను భేదమున్నది కనుక రెండు లక్షణములు, అనెదరా? అట్లయినచో కారకతుల్యయోగిత లేకపోవలసి వచ్చును. సకలాలంకారిక సిద్ధాంతమునకు విరోధము గావలసివచ్చును. లక్షణద్వయము అననుగతము కూడ. అటువంటి రెండు లక్షణములలో నొక లక్షణముండుట యనినచో గౌరవ ముపప్లవప్రదమగును.

ఈతీరుగా, "స్విద్యతి కూణతి" ఇత్యాద్యుదాహరణమున్ను సంగత ముగా లేదు. క్రియలు శుద్ధప్రకృతములు గనుక. మఱియు దీపకము, తుల్య యోగిత మొదలగు వాటిలో గమ్యమాన మౌపమ్యము సర్వసమ్మతము.

ఇచటను స్వేదన కూణనాదులు ఒక్క కారకముతో నన్వయించినను ఔపమ్యము కవిప్రయత్న గోచరము కాదు. అందువలన సముచ్చయాలం కారచ్ఛాయ ఇచట తగినది అందువలన వెనుక చెప్పిన వసుదానాదులకు హీనసత్త్వ వాసనాదులకు రాజకర్తృకములైన వాటికి, రెండు పద్యము లందున్న వాటికి, ఔపమ్య ప్రతీతి యందు సహృదయ హృదయమే ప్రమాణ మని ఇందు ప్రతిబంది ఇవ్వవలసిన యవసరము లేదు. అయితే - స్వేదనాదు లకు ఔపమ్యము తోచుచున్నదే అని పట్టుదలతో నున్నను క్రియలకు శుద్ధ ప్రకృతత్వము వలన తుల్యయోగిత కావచ్చును కాని దీపకము మాత్రము కాదు ఉండనీయండి.

యదపి విమర్శనీకృతోదాహృతమ్—

"ఆలింగితుం శశిముఖీం చ సుధాం చ పాతుం
కీర్తిం చ సాధయితుమర్జయితుం చ లక్ష్మీమ్
త్వద్భక్తిమద్భుతరసాం హృదయే చ కర్తుం
మందాదరం జనమహం పశుమేవ మన్యే."

అత్రాలింగనాద్యనేకక్రియాకర్తృత్వేనైక ఏవ జనో నిర్దిష్ట ఇతి. తదపి చిన్త్యమ్. ఆలింగనాదీనాం క్రియాణాం మందాదరత్వేనైకా శ్రయకత్వస్యావశ్యకత్వేఽపి పరస్పరమేకాశ్రయకత్వస్యానావశ్యక- త్వాత్. యః శశిముఖీమాలింగితుం, యశ్చ సుధాం పాతుం, యోఽపి కీర్తిం సాధయితుం, యశ్చ లక్ష్మీమర్జయితుం, యశ్చాపి త్వద్భక్తిం కర్తుం మందాదరస్తం సర్వమపి జనం పశుం మన్యే ఇతి తుమున్నంతా నాం భిన్నకర్తృత్వేఽప్యుపపత్తేరేకకారకాన్వయకృతం క్రియాణా మౌపమ్యం చమత్కారీతి న శక్యతే వక్తుమ్. కిం తు శశిముఖీసుధా కీర్తిలక్ష్మీత్వద్భక్తీనాం బింబప్రతిబింబభావకృతమ్. నాపి చాత్రైక కర్తృత్వే కాచిదర్థస్యాస్తి పరిపుష్టిః. ప్రత్యుత ప్రాతికూల్యమ్. సర్వేషాం పశుత్వోక్త్యపేక్షయా సకలతాదృశక్రియాకరణమందాదర స్యైకస్య పశుత్వోక్తేరరమణీయత్వాత్.

విమర్శనీకారులును ఉదాహరించిరి-

"ఆలింగితుం" మొ. (చంద్రముఖిని ఆలింగన మొనర్చుకొనుటకును, అమృతము పానముచేయుటకును, కీర్తిని సాధించుటకును, లక్ష్మిని సంపాదించుటకును, అద్భుతమైన రసముగల నీ భక్తిని హృదయమునందు చేయుటకును ఆదరములేని మనిషిని పశువనియే తలంచెదను).

ఇచట నాలింగనాదులగు ననేక క్రియల కర్తృత్వముచేత నొకనినే నిర్దేశించుట అని. అదియు చింత్యమే. ఆలింగనము మొదలగు క్రియలకు మందాదరత్వముతో నేకాశ్రయత్వమావశ్యకమైనను పరస్పర మేకాశ్రయకత్వము అనావశ్యకమగుట వలన ఎవడు శశిముఖిని యాలింగనము జేసుకొనుటకు, ఎవడు అమృతమును పానము జేయుటకు, యెవడు కీర్తిని సాధించుటకు, యెవడు ధనమును సంపాదించుటకు, యెవడు నిన్ను భక్తిచే నారాధించుటకు మందాదరుడగునో వానిని పశువుగా దలంతును; అని తుమున్నర్థములు భిన్నకర్తృకములైనను భాసగుచున్నది. కనుకనే నేకకారకాన్వయములగు క్రియల కౌపమ్యము చమత్కారజనకమనియు చెప్పుట తగదు. ఇకనేమనగా, ఈ శశిముఖీ సుధాకీర్తిలక్ష్మీత్వద్భక్తులకు బింబప్రతిబింబభావముచే చేయబడినది

మరియు నిక్కడ ఒక్కడే కర్తయగుచో నర్థమున పరిపుష్టి యేమియు లేదు. పైపెచ్చు ప్రతికూలత్వమే యున్నది. అందరికిని పశుత్వము చెప్పుటకంటె అటువంటి సమస్త క్రియాశీలుడగుటయందు మందాదరుడగు నొకనిని పశువని చెప్పుట అసుందరము గనుక.

**యది తు విమర్శినీకారోక్తిరవశ్యం సమర్థనీయేత్యాగ్రహస్తదేత్థం సమర్థ్యతామ్-క్రియాణాం కర్తురేకత్వాభావేఽపి కర్తృతావచ్ఛేదకస్య మందాదరత్వస్యైక్యాత్తస్యైవ చ పరంపరాసంబంధేనానేకక్రియాసాధారణ ధర్మస్య సకృద్వృత్తిరస్తీతి న దోషః. కారకస్యైవ కారకవిభాజకోపాధ్యవచ్ఛేదకస్యాపి సకృద్వృత్తేః కారకదీపకత్వేన పరిభాషితుం శక్యత్వాత్. కారకసకృద్వృత్తేస్త్వస్మాభిరుక్త మేవోదాహరణమనుసర్తవ్యమ్.**

అయితే - విమర్శనీ కారుని మాటలు అవశ్యము సమర్థనీయములను పట్టుదల యుండినచో నపుడు ఇట్లు సమర్థింపవలయును. క్రియలను చేయు వాడొకడు గాకపోయినను కర్తృతానిర్ణాయకమగు మందాదరత్వమున కైక్యమువలన దానికే పరంపరాసంబంధముచేత ననేకక్రియాసాధారణ ధర్మమునకు సకృద్వృత్తి యున్నది కనుక దోషములేదు. కారకమునకు వలె కారకమును విభజించునట్టి ఉపాధి నిర్ణాయకమునకును సకృద్వృత్తియే గారకదీపకమని పరిభాషించుటకు వీలగును. గనుక కారకసకృద్వృత్తికి ఉదాహరణము మాత్రము వెనుక మేము జెప్పినదే అనుసరింపవలెను

అత్రేదం బోధ్యమ్-తుల్యయోగితాతో దీపకం న పృథగ్భావమర్హతి, ధర్మసకృద్వృత్తిమూలాయా విచ్ఛిత్తేరవిశేషాత్. విచ్ఛిత్తివైలక్షణ్యస్యైవాలంకారవిభాగహేతుత్వాత్. న చ ధర్మస్య సకృద్వృత్తేరవిశేషేపి ధర్మిణాం ప్రకృతత్వాప్రకృతత్వాభ్యాం ప్రకృతాప్రకృతత్వేన చ తుల్యయోగితాయా దీపకస్య విశేష ఇతి వాచ్యమ్. తథాపి తుల్యయోగితాయాం ధర్మిణాం కేవల ప్రకృతత్వస్య కేవలాప్రకృతత్వస్య చ విశేషస్య సత్త్వాదలంకారద్వైవిధ్యాపత్తేః శ్లేషేఽపి ద్వైవిధ్యాపత్తేశ్చ. సర్వేషామప్యలంకారాణాం ప్రభేదవైలక్షణ్యాద్వైలక్షణ్యాపత్తేశ్చ. న చ దీపకే వాస్తవమౌపమ్యం గమ్యమ్, ఉపమానోపమేయయోః ప్రకృతాప్రకృతరూపయోస్తత్ర సత్త్వాత్; తుల్యయోగితాయాం చ వైవక్షికమ్, ఉపమానోపమేయస్వరూపాభావాత్; అతో వైలక్షణ్యమితి వాచ్యమ్. ఉపమేయోపమానత్వయోః ప్రకృతాప్రకృతరూపత్వే మానాభావాత్. "ఖమివ జలం జలమివ ఖమ్" ఇత్యాద్యుపమేయోపమాయాం ప్రతీపే చౌపమ్యానాపత్తేశ్చ-తస్మాత్తుల్యయోగితాయా ఏవ త్రైవిధ్యముచితమ్ - ప్రకృతానామేవ ధర్మస్య సకృద్వృత్తిః, అప్రకృతానామేవ, ప్రకృతాప్రకృతానాం చేతి. ఏవం చ ప్రాచీనానాం తుల్యయోగితాతో దీపకస్యపృథగలంకారతామాచక్షాణానాం దురాగ్రహమాత్రమితి నవ్యాః.

ఇచట దీనిని తెలియవలెను. తుల్యయోగితకంటె దీపకము వేరుగాదు. ధర్మసకృద్వృత్తి మూలముగా గల విచ్ఛిత్తియందు విశేషము లేదు. విచ్ఛిత్తి వైలక్షణ్యమే అలంకారపు ఏర్పాటుకు హేతువు గనుక, ధర్మము

నకు సకృద్వృత్తి అవిశిష్టమైనను ధర్ములకు ప్రకృతత్వాప్రకృత్వముల చేతను, కేవల ప్రకృతత్వ కేవలాప్రకృతత్వములచేతను తుల్యయోగిత కంటె దీపకమునకు విశేషమని చెప్పకూడదు. నీకైనను తుల్యయోగిత యందు ధర్ములకు కేవల ప్రకృతత్వము కేవలాప్రకృతత్వము అను విశేషము ఉండుటవలన అలంకార ద్వయము గావలసి వచ్చును. శ్లేషయందును ద్వైతాపత్తి వచ్చును. అన్ని యలంకారములకును ప్రభేదవైలక్షణ్యము వలన వైలక్షణ్యము రావలసివచ్చును. అయితే-దీపకమునందు వాస్తవౌపమ్యము గమ్యము; ఉపమానోపమేయములు. ప్రకృతాప్రకృత రూపములు; అక్కడ యున్నవి కనుక. తుల్యయోగిత యందు వివక్షాధీనమైనది, ఉపమానోప మేయ స్వరూపము లేదు గనుక. ఇందువలన వైలక్షణ్యమున్నది-అనరాదు. ఉపమేయోపమానత్వములు ప్రకృతాప్రకృత రూపము లనుటలో ప్రమాణము లేదు గనుక. "ఖమివ జలం జలమివ ఖం" ఇత్యాదులలో నుపమేయోపమయందును, ప్రతీపమందును, ఔపమ్యము లేకుండవలెను. గనుక తుల్యయోగితయే - ప్రకృతములకే ధర్మమునకు సకృద్వృత్తి అప్రకృతములకే ధర్మ సకృద్వృత్తి ప్రకృతాప్రకృతములకు ధర్మ సకృద్వృత్తి అని మూడు విధము లనుట ఉచితము. ఈ తీరుగా ప్రాచీనులు తుల్యయోగిత కంటే దీపకమునకు వేరుగా నలంకారత్వము చెప్పుచున్నచో అది వారల యొక్క దురాగ్రహము మాత్రము అని నవ్యులు.

**అముం చాలంకారం ధర్మస్య గుణక్రియాద్యాత్మకస్యాది మధ్యావసానగతత్వేన త్రివిధమామనంతి. యథా—**

"న భాతి రమణీయోఽపి వైభాగ్యేణ వినా యతిః.
వైదుష్యేణ వినా విప్రో నరలోకస్త్వయా వినా"

"**లావణ్యేన ప్రమదా మదాతిరేకేణ వారణాధిపతిః
భాతి విభవేన భవకాన్ రాజన్ భవతా చ వసుమతీవలయమ్.**"

"**ఆఖండలేన నాకః కుండలికులకుండలేన పాతాలమ్
నరమండన రిపుఖండన భవతా భూమండలం విభాతితమామ్**"

ఏవం తుల్యయోగితాయామప్యూహ్యమ్.

ఈ యలంకారమున ధర్మము, గుణక్రియాద్యాత్మక మగునది ఆది మధ్యావసానగతమగుటచే నిది మూడు విధములని చెప్పుదురు. యెట్లనగా —

"న భాతి" మొ. "చక్కని వాడైనను వైరాగ్యము లేకున్నచో యతి ప్రకాశింపడు, పాండిత్యము లేకున్నచో బ్రాహ్మణుడు (ప్రకాశింపడు), మనుష్యలోకము నీవులేకున్న (ప్రకాశింపదు)".

"లావణ్యేన" "లావణ్యముచే స్త్రీయు, మదాతిరేకముచే గజరాజు, ప కాశించును. ఓ రాజా ! వైభవముచే నీవు ప్రకాశించు చున్నావు, నీచే భూమండలము (ప్రకాశించుచున్నది)".

"ఆఖండలేన" మొ. (ఇంద్రునిచేత స్వర్గము సర్పముచే (శేషునిచే) పాతాళము, ఓ నరమండనా ! ఓ శత్రుఖండనా ! నీచేత భూమండలము బాగుగా ప్రకాశించుచున్నది)

ఇలాగే తుల్యయోగిత యందును ఊహించవలెను

వస్తుతస్తు ధర్మస్యాదిమధ్యాంతగతత్వేఽపి చమత్కార వైలక్షణ్యాభావాత్ త్రైవిధ్యోక్తిరాపాతమాత్రాత్. అన్యథా ధర్మస్యోపాద్యుపమధ్యోపాంత్యగతత్వే తతోఽపి కించిన్న్యూనాధికదేశవృత్తిత్వే చానంతభేదప్రసంగాత్. ఏవం కేవలానుగామిసాధారణ ధర్మతాయాం దర్శితం దీపకమ్. బింబప్రతిబింబభావేనాప్యేతత్ సంభవతి. యథా —

"శీలభారవతీ కాంతా పుష్పభారవతీ లతా
అర్థభారవతీ వాణీ భజతే కామపి శ్రియమ్."
"లతా కుసుమభారేణ శీలభారేణ సుందరీ
కవితా చార్థభారేణ శ్రయతే కామపి శ్రియమ్."

ఇదమేవ లతాదిష్వన్యతమస్య ప్రాకరణికత్వే దీపకస్యోదాహరణమ్. అన్యథా తుల్యయోగితాయాః.

వస్తుతః అయితే ధర్మము ఆదిమధ్యాంత గతమైనప్పటికిని చమత్కార వైలక్షణ్యము లేదు గనుక మూడు రకములని చెప్పుట యుక్తము గాదు. అలా గాని యెడల ధర్మమునకు ఆదికి దగ్గరగను, మధ్యకు దగ్గరగను, అంతము

నకు దగ్గరగను ఉండుటచేతను, అంతకంటెను కొంచెము తక్కువగాను హెచ్చుగా గాని యుండుటచేతను అనంతభేదములు గలుగుచుండును.

ఈ రీతిగా కేవలానుగామి సాధారణ ధర్మమున్నపుడు దీపకము చూపబడినది. బింబ ప్రతిబింబ భావముతో గూడ నిది సంభవించును. ఎట్లనగా–

"శిల భారవతీ" మొ. (శిలభారము గల కాంతయు, పుష్పభారము గల తీవెయు, అర్థభారముగల వాణియు, విలక్షణమైన శోభకలిగి యుండును).

"లతాకుసుమ భారేణ" మొ. (తీవె పూలభారముచేతను, సత్స్వభావముచే కాంతయు, అర్థభారముచే కవితయు, విలక్షణమైన శోభగలిగి యుండును).

ఇదియే లతాదుల యందు నొకటి ప్రాకరణికమైన యెడల దీపకమునకుదాహరణము. అలా కానియెడల తుల్యయోగితకు ఉదాహరణము.

**అత్ర బింబప్రతిబింబతాయాం న కేవలం క్రియారూపమనుగామిమాత్రం చమత్కారకారణమ్, అపి తు కుసుమాదిబింబప్రతిబింబకరంబితమ్. ఇయాంస్తు విశేషః–యత్ కేవల బింబప్రతిబింబభావేనాప్యుపమాదీనాం భవతి నిష్పత్తిః. యథా "కోమలాతపశోణాభ్ర" ఇత్యాదౌ. ప్రకృతే తు న తథా, అనుగామినం వినా ధర్మస్వరూపస్యైవానిష్పత్తేః. నహి బింబప్రతిబింబమాత్రేణ ధర్మస్య సకృద్వృత్తిః సంభవతి. తథా "మృతస్య లిప్సా" ఇత్యాదిప్రాగుక్తే మృతాదీనామ్, కారకదీపకే కారకతుల్యయోగితాయాం చ "వసు దాతుమ్-" ఇత్యాదౌ క్రియాణాం ధర్మిత్వాత్తద్విశేషణానాం వస్వాదీనాం చ బింబప్రతిబింబతా బోధ్యా.**

ఇట బింబ ప్రతిబింబ భావమునందు కేవలముగా క్రియారూపమగు ననుగామి మాత్రము చమత్కార కారణము గాదు. ఇక ఏమంటే, కుసుమాది బింబప్రతిబింబ భావకరంబితము. ఏకొంచెము బింబప్రతిబింబభావముచేతనైనను ఉపమాదుల నిష్పత్తి యగును. ఎట్లనగా – "కోమలాతపశోణాభ్ర" ఇత్యాదులందు ప్రకృతమునం దట్లుగాదు, అనుగామి లేకున్నచో ధర్మస్వరూపమునకే నిష్పత్తి యుండదు కన్నుక. బింబ ప్రతిబింబ మాత్రముచే

ధర్మమునకు సకృద్వృత్తి సంభవించదు కదా. అలాగే "మృతస్య లిప్సా" ఇత్యాదులందు, వెనుక చెప్పినయెడ, మృతాదులకును, 'వసు దాతుమ్' మొదలగు కారకదీపకము నందును, కారకతుల్యయోగిత యందును, క్రియలకును, ధర్ములగుట వలన వాటి విశేషణములగు వస్త్రాదులకును బింబ ప్రతిబింబిత తెలుసుకొనవలెను.

**ఉత్తరోత్తరస్మిన్ పూర్వపూర్వస్యోపకారకతాయాం మాలా** దీపకమ్. యథా —

**''ఆస్వాదేన రసో రసేన కవితా కావ్యేన వాణీ తయా**
**లోకాంతఃకరణానురాగరసికః సభ్యః సభా చామునా.**

**దారిద్ర్యానలదహ్యమానజగతీపీయూషధారాధర!**
**క్షోణీనాథ! తయా భవాంశ్చ భవతా భూమండలం భాసతే."**

**ఏతచ్చ ప్రాచామనురోధాదస్మాభిరిహోదాహృతమ్. వస్తుతస్త్వేతద్దీపకమేవ న శక్యం వక్తుమ్, సాదృశ్యసంపర్కాభావాత్. కింత్వేకావలీప్రభేద ఇతి వక్ష్యతే**

ఉత్తరోత్తరమందు పూర్వపూర్వమునకు నుపకారకత్వమగునపుడు మాలాదీపకము ఎట్లనగా —

"ఆస్వాదేన" మొ. (ఆస్వాదముచే రసము రసముచే కవితయు, కావ్యముచే వాణియు, దానిచే లోకాంతఃకరణానురాగరసికుడగు సభ్యుడు, ఇతనిచే సభయు, దారిద్ర్యానలముచే తగలబెట్టబడుచున్న భూమి యందు అమృత మేఘమా! ఓ రాజా! దానిచే నీవున్ను, అట్లు నీచే భూ మండలమును ప్రకాశించుచున్నది.)

ఇదియును ప్రాచీనుల యనురోధము వలన ఇక్కడ నుదాహరించితిమి. వస్తుతః ఇది దీపకమని చెప్పుటకే వల్లగాదు; సాదృశ్యమునకు సంబంధము లేదు గనుక. ఏకావళిలో భేదమని చెప్పబడగలదు.

**అస్మింశ్చాలంకారద్వయే క్రియాదేర్ధర్మస్యైకరూపేణ ధర్మిష్వనన్వయో దోషః. యథా ప్రాగుక్తే పద్యే "రసికాః సామాజికాస్తైః సభా" ఇతి కృతే ఏకవచనాంతైర్ధర్మిభిరైకరూప్యేణాన్వయేఽపి**

సామాజికై రసన్వయాత్. వచనవిపరిణామేనాన్వయే ఉపమాయామివ స్యాదేవ దోషః ఏవం జహల్లింగనామార్థస్య ధర్మస్య సకృద్వృత్తౌ లింగభేదోఽపి దోషః. యథా —

"జగతి నరజన్మ తస్మిన్వైదుష్యం తత్ర సత్కవితా
కవితాయాం పరిణామో దుష్ప్రాపః పుణ్యహీనేన."

యది తు "తపసా నాల్పేన శక్యతే లబ్ధుమ్" ఇత్యాఖ్యాతాంతం క్రియతే తదా లింగభేదో న దూషణమ్. ఏవమజహల్లింగనామార్థస్య సకృద్వృత్తావపి న దోషః. యథా - "ఫలమతిశయితం తపస్యాయాః" ఇతి చతుర్థచరణనిర్మాణే. పురుషస్యైకరూప్యాభావే దోషః. యథా —

"దివి సూర్యో భువి త్వం చ పాతాలే పన్నగాగ్రణీః.
దిక్షు దిక్పాలవర్గశ్చ రాజపుంగవ రాజతే."

యది త్వమిత్యత్ర భవానితి క్రియతే తదా న దోషః. ఏవమ్ కాలభేదేఽప్యూహ్యమ్.

ఈ యలంకారములు రెంటి యందును క్రియాది యగు ధర్మమునకు ఏకరూపముతో ధర్ములందు నన్వయము చేయవలయును. అట్లు లేకుండుట దోషము. ఎట్లన వెనుక చెప్పబడిన పద్యము నందు, "రసికాః సామజికాస్తైస్సభా" అని చేసినచో నేకవచనాంతములగు ధర్ములతో నేకరూపములో నన్వయించినను సామాజికులతో నన్వయములేదు గనుక. వచన విపరిణామముతో నన్వయము నందు ఉపమ యందు వలె దోషమే యగును. ఈ తీరుగా — జహల్లింగ నామార్థము అగు ధర్మమునకు సకృద్వృత్తి యందు లింగభేదమున్ను దోషము. ఎట్లనగా—

"జగతి" మొ (జగత్తున మనుష్య జన్మయు, మనుష్య జన్మలో విద్వత్త్వము, దాని యందు సత్కవిత్వమున్ను, కవిత్వము నందు పరిణామము పుణ్యహీనులచే పొందరానిది)

అయితే—"తపసానాల్పేన శక్యతే లబ్ధుమ్" అని ఆఖ్యాతాంతము చేయబడిన యెడల అప్పుడు లింగభేధము దోషము గాదు. ఈ తీరుగా నజహల్లింగనామార్థమునకు సకృద్వృత్తి యందును దోషము లేదు. ఎట్లనగా—"ఫలమతి

శయితం తపస్యాయాః" అని నాల్గవ చరణము నిర్మాణము చేయగా. ఇటుల పురుషమునకు ఏకరూపత్వాభావ మందు దోషము. ఎట్లనగా-

"దివి సూర్యః" మొ. (ఆకాశమునందు సూర్యుడు, భూమి యందు నీవు, పాతాళమున శేషుడు, దిక్కుల యందు దిక్పాలక సమూహమును, రాజశ్రేష్ఠుడా, ప్రకాశించు చున్నది).

ఇచట 'త్వం' అను చోట 'భవాన్' అని చేసిన దోషము కాదు. ఇటులనే కాలభేద మందును ఊహించవలెను.

ఏతేన —

"సంగ్రామాంగణమాగతేన భవతా చాపే సమాసాదితే
దేవాకర్ణయ యేన యేన సహసా యద్యత్సమాసాదితమ్,
కోదండేన శరాః శరై రరిశిర స్తేనాపి భూమండలం
తేన త్వం భవతా చ కీర్తిరతులా కీర్త్యా చ లోకత్రయమ్,
ఇతి ప్రాచీనానాం పద్యం దీపకాంశేఽపి సదోషమేవ.

ఇతి రసగంగాధరే దీపకప్రకరణమ్.

దీనిచేత -

"సంగ్రామాంగణ మాగతేన" మొ. (యుద్ధభూమికి వచ్చిన నీచేత విల్లు ఎక్కుపెట్టబడగా, ప్రభువా ! వినుము, ఎవరెవరిచే వెంటనే ఎదియేది పొందబడినదో - విల్లుచే శరములును, బాణములచే శత్రు శిరస్సులును, శిరస్సుచే భూమండలమును, భూమండలముచే నీవును నీచే నిర్మలమైన కీర్తియును, కీర్తిచే ముల్లోకములును పొందబడినవి).

అను ప్రాచీనులు దీపకోదాహరణముగా చెప్పినది సదోషమే.

ఇది దీపక ప్రకరణము

## ప్రతివస్తూపమా

అథ ప్రతివస్తూపమా —

తత్ర తావత్సాదృశ్యస్య యత్ర చమత్కారితా తత్రోపమే త్యుక్తమ్. తస్యాం చ సాధారణధర్మస్య సర్వేపి ప్రకారా యథా -

సంభవం నిరూపితాః. సాదృశ్యోపస్కృతస్య వస్త్వంతరస్య చమత్కారితాయాం భేదాభేదాన్యతరప్రధానా అన్యేఽలంకారాశ్చ. తేష్వపి సాధారణధర్మాణాం యథావసరం యథాసంభవం చ స్థితిః ప్రదర్శితైవ. ఇదానీం వస్తుప్రతివస్తుభావాపన్నసాధారణధర్మోత్థాపితా వాక్యార్థగతా ప్రతివస్తూపమా నిరూప్యతే

అనంతరము ప్రతివస్తూపమ.

సాదృశ్యము ఎచట చమత్కారము గల్గించునో అక్కడ నుపమ యనబడినది. ఆయుపమయందు సాధారణ ధర్మమునకు నున్న ప్రకారము లన్నియు యథాసంభవముగా నిరూపింపబడినవి. సాదృశ్యాలంకృతమగు వస్త్వంతరము చమత్కారి యగునపుడు భేదాభేదములలో నేదేనొకటి ప్రధానముగా గల ఇతర అలంకారములు నిరూపించబడినవి. వానిలోను సాధారణ ధర్మములకు యథావసరముగ, యథాసంభవముగ, స్థితి ప్రదర్శింపబడినది. ఇప్పుడు వస్తు ప్రతివస్తు భావమును బొందిన సాధారణధర్మము వలన నుత్థాపితమైనట్టి వాక్యార్థగత మగు ప్రతివస్తూపమ నిరూపించబడుచున్నది.

న చాస్యా వాక్యార్థగతత్వేనైవోపమాతో భేద ఇతి భ్రమితవ్యమ్. "దివి భాతి యథా భానుస్తథా త్వం భ్రాజసే భువి" ఇత్యాదౌ వాక్యార్థేఽప్యుపమాయాః సంభవాత్. అత ఏవ భిన్నశబ్దోపాత్తైకధర్మకత్వేనాపి న వైలక్షణ్యం వక్తుం శక్యమ్. ప్రకృతే భాతిభ్రాజతిభ్యాం ధర్మస్యైకస్యైవ ప్రతిపత్తేః. తస్మాల్లక్షణానుసారేణాలంకారాంతరేభ్యో వైలక్షణ్యమస్యా బోధ్యమ్.

ఇక్కడ దీనికి వాక్యార్థము నొందిన దగుటచేతనే నుపమకంటె భేదము అని భ్రాంతిపడవలదు. "దివి భాతి యథా భానుః తథా త్వం భ్రాజసే భువి" ఇత్యాదులు వాక్యార్థమైనప్పటికిని ఉపమ యేర్పడును కదా? ఇందువలననే వేరు వేరు శబ్దములచే స్వీకరింపబడిన ధర్మముగల్గి యుండుటచేతనైనను వైలక్షణ్యము చెప్పుటకు వీలులేదు. ప్రకృతములో భాతి, భ్రాజతులచేత నొక ధర్మమే తెలియబడు చున్నది. అందువలన లక్షణము ననుసరించి ఇతరాలంకారముల నుండి దానికి వైలక్షణ్యము తెలియవలెను.

అథ కిమస్యా లక్షణమ్—"వాక్యార్థగతోపమాత్వమ్" ఇతి చేత్, ప్రాగుక్తవాక్యార్థోపమాయామతివ్యాప్తేః. న చార్థత్వేన తద్విశేషణీయ మితి వాచ్యమ్. దృష్టాంతాలంకారే తథాత్యతిప్రసంగాత్. వస్తు ప్రతివస్తు భావాపన్న సాధారణధర్మకత్వేనాపి తద్విశేషణీయమితి చేత్. తథాపి—

"తావత్ కోకిల విరసాన్ యాపయ దివసాన్ వనాంతరే నివసన్
యావన్మిళదలిమాలిః కోఽపి రసాలః సముల్లసతి."

ఇత్యప్రస్తుతప్రశంసాయామతిప్రసంగాదితి. మైవమ్. అప్రస్తుత ప్రశంసాయాం వస్తుప్రతివస్తుభావస్య భిన్నశబ్దోపాత్తైకప్రతిపాద్యరూపస్యాసంభవాత్. ఏవంచ—

వస్తుప్రతివస్తుభావాపన్నసాధారణధర్మకవాక్యార్థయోరార్థమౌపమ్యం ప్రతివస్తూపమా.

"ఆననం మృగశాబాక్ష్యా వీక్ష్య లోలాలకావృతమ్
భ్రమద్భ్రమరసంభారం స్మరామి సరసీరుహామ్"

ఇత్యత్ర స్మరణాలంకారేఽతి ప్రసంగవారణాయ వాక్యార్థగతమితి. అత్రౌపమ్యస్యార్థత్వేఽపి పదార్థగతత్వమేవ నతు వాక్యార్థగతత్వమ్, స్మరణస్య తదసంపర్కాత్. పదాంతరకృత్యం తూక్తమేవ.

తరువాత నీప్రతివస్తూపమకు లక్షణమేమి ? "వాక్యార్థమునం దున్న యుపమాత్వము" అన్నట్లు అయితే వెనుక జెప్పిన వాక్యార్థోపమ యందతివ్యాప్తి. అది ఆర్థమని విశేషణము వేయదగినది అన్నచో నటులైనను దృష్టాంతాలంకారమున నతిప్రసంగము. వస్తు ప్రతివస్తు భావము నొందిన సాధారణ ధర్మముగల్గి యుండుటచేతనని విశేషణము వేయదగినది అన్నచో, అల్లైనను-

"తావత్కోకిల" (ఓ కోకిలమా ! విరసమైన రోజులను వనములోపల నివసించుచూ అంత పర్యంతము గడుపుము, ఎంతవరకైతే తుమ్మెదల మాలతోకూడిన ఏదో యొక తియ్యమామిడిచెట్టు బాగా విలసిల్లునో) ఇత్యాద్యప్రస్తుత ప్రశంసయందు నతివ్యాప్తి అనినచో నిట్లు చెప్ప

దగును. అప్రస్తుతప్రశంసయందు వస్తుప్రతి వస్తుభావము, భిన్నశబ్దములచే నుపాత్తమగు నొక్క ప్రతిపాద్యము కల్గుట యను రూపము గలది సంభవించదు గనుక. ఇలాగున "వస్తు ప్రతివస్తు భావము నొందిన సాధారణ ధర్మముగల వాక్యార్థములకు ఆర్థికమగు నౌపమ్యము ప్రతివస్తూపమ"

"ఆననం" మొ. ("లోలములగు అలకములచే ఆవరింపబడిన పిల్లలేడి కంటియొక్క మొగమును చూచి తిరుగుచున్న తుమ్మెదల సంభారముగల పద్మమును స్మరించెదను).

అనేచోట స్మరణాలంకారమునందతిప్రసంగము నివారించుట కొరకై వాక్యార్థగతమని. అక్కడ ఔపమ్యము అర్థమైనప్పటికిని పదార్థగతమగుటయే, వాక్యార్థగతమగుట గాదు. స్మరణమునకు దానితోటి సంపర్కములేదు గనుక. ఇతర పదముల పని చెప్పబడియే యున్నది.

ఉదాహరణమ్—

"ఆపద్గతః ఖలు మహాశయచక్రవర్తీ
విస్తారయత్యకృతపూర్వముదారభావమ్.
కాలాగురుర్దహనమధ్యగతః సమంతా
ల్లోకోత్తరం పరిమలం ప్రకటీకరోతి."
అత్ర విస్తారప్రకటనే వస్తుత ఏకరూప్యేణాభిమతే.
యథా వా—
"విశ్వాభిరామగుణగౌరవగుమ్ఫితానామ్
రోషోఽపి నిర్మలధియాం రమణీయ ఏవ.
లోకంపృణైః పరిమలైః పరిపూరితస్య
కాలాగురోః కఠినతాపి నితాంతరమ్యా."

ఉదాహరణము-

"ఆపద్గతః" మొ. (మహాశయ చక్రవర్తి ఆపత్తిలో నున్నప్పుడు యిదివరకు చేయనట్టి ఔదార్యమును విస్తరింపజేయును. కాలాగురువు అగ్ని మధ్యమునందున్నను అంతటనూ లోకోత్తరమగు పరిమళమును ప్రకటించును.

ఇచట విస్తార ప్రకటనములు వస్తుతః ఏకరూపముచే నభిమతములు.

మరొకటి-

"విశ్వాభిరామ" మొ. (ప్రపంచమున అందమగు గుణముల గౌరవముచే గుంభితులగు నిర్మలులైన వారియొక్క కోపమును నందమైనది. లోకము పూరించు పరిమళములచే పరిపూర్ణమైనట్టి కాలాగురు యొక్క కాఠిన్యమైనను మిక్కిలి అందమైనదే).

వైధర్మ్యేణాప్యేషా సంభవతి—

"వంశభవో గుణవానపి సంగవిశేషేణ పూజ్యతే పురుషః
నహి తుంబీఫలవికలో వీణాదండః ప్రయాతి మహిమానమ్".

యథా వా—

"గిరిభిర్గురూణాం పరుషాక్షరాభి-
స్తిరస్కృతా యాంతి నరా మహత్త్వమ్.
అలబ్ధశాణోత్కషణా నృపాణాం
న జాతు మౌలౌ మణయో వసన్తి".

అత్ర శాబ్దేన దృష్టాంతేన తద్గతః సామాన్యావచ్ఛిన్నవ్యతిరేకసహాచార ఆక్షిప్యతే. తేన చ సామాన్యావచ్ఛిన్నాన్వయనియమసిద్ధిద్వారా ప్రకృతో విశేషావచ్ఛిన్నాన్వయనియమః సిధ్యతీతి ప్రాయశః సర్వత్ర వైధర్మ్యే స్థితిః. ఏవమన్వయేన ప్రతివస్తూపమాయామపి నియమవిశేషస్య ప్రకృతవాక్యార్థత్వేఽన్వయదృష్టాంతేన సామాన్యాన్వయనియమసిద్ధిద్వారా తత్సిద్ధిః.

నియమవిశేషరహితకేవలార్థ మాత్రస్య ప్రకృతత్వేత్వప్రకృతవాక్యార్థనిరూపితమౌపమ్యమాత్రం గమ్యమ్, న తు నియమః; అప్రయోజకత్వాత్. యథా "శైరభ్రే భాసతే చంద్రో భువి భాతి భవాన్ బుధైః" ఇత్యాదౌ.

ఇది వైధర్మ్యముచే నైనను సంభవించును.

"వంశభవః మొ. "వంశమున బుట్టినను (వెదురున బుట్టినను) గుణవంతుడైనను (తీగలుగలది యైనను) విశిష్టమగు సంబంధముచే పురుషుడు

పూజింపబడును. తుచ్ఛీభవికల [illegible] మహిమను పొందనేరదు కదా).

మరొకటి-

"గీర్భిర్గురూణాం" మొ. (పరుషాక్షరములగు గురువుల మాటలచే తిరస్కరింపబడినవారై మనుష్యులు గొప్పదనమును బొందుదురు. సాన ఒరిపిడిని బొందని మణులు రాజుల శిరస్సునందెన్నడును ఉండవు)

ఇచట శాబ్దమగు దృష్టాంతముచేత తద్గతమగు సామాన్యావచ్ఛిన్నమగు వ్యతిరేక సహచారము ఆక్షేపించబడును, దానిచేత సామాన్యావచ్ఛిన్నాన్వయ నియమసిద్ధి ద్వారా ప్రకృతమగు విశేషావచ్ఛిన్నాన్వయ నియమము సిద్ధించునని ప్రాయశః అంతటను వైధర్మ్యమునందు స్థితి. ఈ తీరుగా నన్వయముతో ప్రతిపస్తూపమ యందైనను నియమవిశేషము ప్రకృత వాక్యార్థమైన యెడల నన్వయ దృష్టాంతముచే సామాన్యాన్వయ నియమ సిద్ధి ద్వారా నది సిద్ధించును. నియమ విశేషము లేని కేవలార్థము మాత్రము ప్రకృతమైనపుడు అప్రకృత వాక్యార్థముచే నిరూపితమగు నౌపమ్యము మాత్రము గమ్యమగును; అంతేకాని నియమము గాదు; అప్రయోజకము "గనుక. ఎట్లనగా "శైరభ్రే భాసతే చంద్రో భువి భాతి భవాన్ బుధైః." ఇత్యాదులందు.

నను కథమస్మిన్నలంకారే సర్వత్రౌపమ్యం గమ్యమిత్యుచ్యతే? యావతా ప్రాగుపదర్శితాయాం వైధర్మ్యప్రతివస్తూపమాయాం వాక్యార్థయోరౌపమ్యస్య బాధాత్. న హి పచతి న పచతీతి వాక్యార్థయోః పాకక్రియామాత్రసామ్యాదౌపమ్యం గమ్యతే. నిషేధప్రతియోగిత్వేనోత్తరవాక్యార్థే తస్యా అప్రరోహాదితిచేత్, న ప్రకృతవాక్యార్థాక్షిప్తస్య స్వవైపరీత్యస్యైవౌపమ్యాశ్రయత్వాత్. న చ వ్యాకార్థయోరౌపమ్యమితి యదుక్తం తత్ కథం సంగచ్ఛతామితి. వాక్యవేద్యస్యైవ ప్రకృతే వాక్యార్థత్వేనేష్టత్వాత్ తథాహి—

"తత్త్వం కిమపి కావ్యానాం జానాతి విరలో భువి
మార్మికః కో మరందానామంతరేణ మధువ్రతమ్."

అత్ర విరలో జానాతీతి విధిముఖోఽపి ప్రకృతవాక్యార్థః "పురుష విశేషం వినా న సర్వే జానంతి" ఇత్యర్థవిశేషమాదాయైవ పర్యవసితో భవతీతి నిషేధవాక్యార్థస్య తాదృశేనైవ ద్వితీయవాక్యార్థేన సహ గమ్యతే సాదృశ్యం స్ఫుటమేవ. యత్ర తు "వంశభవః" ఇత్యాదౌ ప్రాగుదాహృతే ప్రకృతవాక్యార్థో విధిరూపః సంగవిశేషహేతుకత్వస్య పూజనాదౌ విధేయత్వాదవసీయతే, తత్రాపి హేతుతాఘటకవ్యతిరేకస్య గుణతయా ప్రతీయమానస్యౌపమ్యం నిర్బాధమితి న దోషః. ఇయం చ వాక్యార్థయోః సామాన్యవిశేషభావానాపన్నయోర్భవతి; తత్రైవౌపమ్యస్య గమ్యత్వాత్. సామాన్యవిశేషయోస్త్వౌపమ్యాప్రతీతేః సమర్థ్యసమర్థకయోరర్థాంతరన్యాసో వక్ష్యతే.

అయ్యా-ఈ యలంకారమునం దంతటను ఔపమ్యముతోచునందురు ఎట్లు ? వెనుకజూపిన వైధర్మ్య ప్రతివస్తూపమయందు వాక్యార్థముల ఔపమ్యమునకు బాధఉన్నది గనుక-"పచతి", "నపచతి" అనే వాక్యార్థములకు పాకక్రియామాత్ర సామ్యము వలన ఔపమ్యముతోచదు గదా ? నిషేధమునకు ప్రతియోగి గనుక నుత్తర వాక్యార్థమందు అది బుద్ధిపైకెక్కదు కదా? అనినచో నటులగాదు. ప్రకృత వాక్యార్థముచే నాక్షిప్తమగు తన వైపరీత్యమే యౌపమ్యమున కాశ్రయముగనుక, వాక్యార్థముల రెంటికిని ఔపమ్యమున్నదని నేది చెప్పినారో అది యెట్లు సంగతమగును ? వాక్యవేద్యమైనదే ప్రకృతమున వాక్యార్థముగా నిష్టముగనుక అలాగే. కదా-

"తత్త్వం" "మొ. (కావ్యముల తత్త్వమును, లోకోత్తరమైనదానిని, ప్రపంచములో విరలులు తెలుసుకొందురు;, తుమ్మెద తప్ప మకరందముల మార్మికులు ఎవడు కలడు?)

ఇచట ఎవడో ఒకడు మాత్రమే ఎఱుగునని విధిముఖమైనను ప్రకృత వాక్యార్థము, విశిష్టపురుషుడు గాకుండా అందరు ఎరుగరు, అను నర్థ విశేషమున్ను తీసుకొనియే పర్యవసించునని నిషేధ రూపమగు వాక్యార్థమునకు నటువంటిదే యగు రెండవ వాక్యార్థముతో గూడ సాదృశ్యము స్ఫుటముగానే తోచుచున్నది. ఎక్కడైతే 'వంశభవః' ఇత్యాదులగు వెనుక నుదాహరింపబడిన వాటియందు, సంగవిశేషహేతుకత్వము పూజనాదుల

యందు విధేయమగుటవలన ప్రకృత వాక్యార్థము విధిరూపమని నిశ్చయింప బడుచున్నదో, అచటనైనను, హేతుత్వమునందు ఘటకమగు వ్యతిరేకమునకు, గుణముగా ప్రతీయమానమునకు ఔపమ్యము నిర్బాధమని దోషములేదు. ఈతీరు సామాన్యవిశేష భావమును పొందని వాక్యార్థములకు మాత్రమే నిదియగును; అచటనే ఔపమ్యము గమ్యము గనుక సమర్థ్య సమర్థకములగు సామాన్య విశేషములకు నౌపమ్యము ప్రతీతముగాకపోవుటవలన నర్థాంతర న్యాసము జెప్పబడును.

**యత్తు కువలయానందకృతా వైధర్మ్యముదాహృతమ్—**

**"విద్వానేవ హి జానాతి విద్వజ్జన పరిశ్రమమ్**
**న హి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనామ్"**
**యది సంతి గుణాః పుంసాం వికసన్త్యేవ తే స్వయమ్**
**న హి కస్తూరికామోదః శపథేన విభావ్యతే."**

**తత్ర "విద్వానేవ హి జానాతి" ఇతి పద్యాం భవతు నామ యథా కథంచిద్వైధర్మ్యస్యోదాహరణమ్ "యది సంతి" ఇతి తు న యుక్తమ్. వైధర్మ్యోదాహరణం హి ప్రస్తుతధర్మివిశేషోపారూఢార్థదార్ఢ్యాయ స్వావిష్ట స్వవ్యతిరేకసమానజాతీయస్య ధర్మ్యంతరారూఢస్యాప్రకృతస్య కథనమ్. ప్రకృతే చ 'యది సంతి తదా స్వయమేవ ప్రకాశంత' ఇత్యర్థస్య ప్రస్తుతస్య వ్యతిరేకస్తు అసంత ఉపాయాంతరేణాపి న ప్రకాశంత ఇతి. న హ్యత్ర ద్వితీయార్ధేన తత్సజాతీయార్థో నిబధ్యతే. శపథేన న విభావ్యతే, కిం తు స్వయమేవేతి ప్రకృతార్థానురూపత్వైయైవ పర్యవసానాత్.**

కువలయానందకారుడు వైధర్మ్యము నుదాహరించెను.

"విద్వానేవ" మొ. (విద్వాంసుడే విద్వాంసులగు జనుల పరిశ్రమను ఎరుగును గొడ్రాలు గొప్పదియగు ప్రసవవేదనను ఎరుగదు గదా)

"యది సంతి" మొ. (గుణములున్న యెడల అవి స్వయముగానే వికసించును. కస్తూరి పరిమళముచే గ్రహింపబడదు గదా!)

ఇచట "విద్వానేవ విజానాతి"-అను పద్యము ఏలాగోలాగున వైధర్మ్యమునకు ఉదాహరణము అయిన అగుగాక, 'యది సంతి' అనునది మాత్రము

యుక్తము కాదు. వైధర్మ్యోదాహరణ మనగా, ప్రస్తుత ధర్మివిశేషమునం దుపారూఢమగు నర్థము యొక్క దార్ఢ్యము కొరకు స్వాక్షిప్తమైన స్వవ్యతిరేకముతో సమాన జాతీయమగు ధర్మ్యంతరారూఢమైన నప్రకృతార్థమును చెప్పుట, ప్రకృతమునందు-'ఉన్నట్లయితే స్వయముగా ప్రకాశించును' అను ప్రస్తుతార్థమునకు వ్యతిరేకము "అసలు లేనట్లయితే నేయుపాయాంతరము చేతను ప్రకాశింపవు" అని ఇక్కడ ద్వితీయార్థమున తజ్జాతీయ మగు అర్థము కూర్పబడలేదు. కూర్పబడుచున్నది గదా-"స్వయముగా ప్రకాశించు చున్నది ఇతరులచేత గాదు" అనే అర్థము, ప్రస్తుతమునకే సజాతీయమైనది. శపథముచేత విభావితము గాదు. గాన స్వయముగనే అని ప్రకృతార్థమునకు ననురూపముగానే పర్యవసించునది గనుక.

నహి వైధర్మ్యే ప్రకృతానురూప్యం జాతుచిద్ఘటతే,వ్యాఘాతాత్. తస్మాత్సాధర్మ్యైకవేదము దాహరణం సంగతమ్, న వైధర్మ్యేణ. న చోపాయాంతరనివృత్త్యా ఘటితప్రస్తుతవాక్యార్థేన కథం నామ తద్ఘటిత ఉత్తర వాక్యార్థః సాధర్మ్యమర్హతీతి వాచ్యమ్. స్వయమిత్యత్రాకృష్టేన ఏవకారేణైవోపాయాంతరనివృత్తేః. ప్రస్తుత వాక్యార్థే నివేశితత్వాత్. అత్యంతాయోగవ్యవచ్ఛేదస్యోత్తర వాక్యార్థాననుగృహీతత్వేన క్రియాసమభివ్యాహారాయోగాత్.

"సంతః స్వతః ప్రకాశంతే గుణా న పరతో నృణామ్
ఆమోదో న హి కస్తూర్యాః శపథేనానుభావ్యతే"

అత్ర స్వతోనుభూయత ఇత్యత్ర పర్యవసితేనోత్తరవాక్యార్థేన పూర్వ వాక్యార్థస్య యథా సాధర్మ్యమేవ, న వైధర్మ్యమ్, తథా "యది సంతి—" ఇతి పద్యేఽపీతి నఞ్మాత్రాశ్రయణాదేవ వైధర్మ్యం జగదే, న తు నిపుణతరం నిరీక్షితమాయుష్మతా. యది తు "యది సన్తి" ఇతి పద్యస్య "న హి కస్తూరికా—" ఇత్యాద్యుత్తరార్ధం దూరీకృత్య "వాచా వాచస్పతేరోష్ఠ్యమ్మి విలసంతి న వల్లయః" ఇతి క్రియతే, తదా వైధర్మ్యం ప్రకృత విపరీతార్థఘటనాద్యుక్తమ్.

వైధర్మ్యమునందు ప్రకృతమునకు ఆనుగుణ్యము నొక్క యెడను గుదురదు వ్యాఘాతము వలన. అందువలన సాధర్మ్యముచేతనే ఈ యుదాహరణము సంగతమగును. వైధర్మ్యముతో గాదు. ఉపాయాంతరము నుండి మరలుటతోడ గూర్చబడని ప్రస్తుత వాక్యార్థముతో నెట్లు తద్ఘటితోత్తర వాక్యార్థము సామ్యమును బొందును అని అనెదరేమో - స్వయం అనుచోట నాకర్షింపబడిన ఏవకారముచేతనే ఉపాయాంతర నివృత్తి ప్రస్తుత వాక్యార్థము నందు నివేశితము గనుక. అత్యంతాయోగవ్యవచ్ఛేదము ఉత్తరవాక్యార్థముచే అనుగృహీతము గానందున క్రియాసమభివ్యవహారము సమకూడదు కదా.

“సంతః”మొ. (మనుష్యులకున్న గుణములు స్వతఃగానే ప్రకాశించును పరతఃకాదు, కస్తూరి యొక్క పరిమళము శపథముచే అనుభవింపబడదు,)

ఇచట “స్వతోఽనుభూయతే” అనుచోట పర్యవసితమైన ఉత్తర వాక్యార్థముతో పూర్వ వాక్యార్థమునకు ఎట్లు సాధర్మ్యమో, వైధర్మ్యము లేదో, అట్లు “యది సన్తి” అనే పద్యము నందును. నఞ్ మాత్రము నాశ్రయించుటచేతనే వైధర్మ్యము చెప్పబడెను. కాని నిపుణముగా నాయుష్మంతునిచే నిరీక్షింపబడలేదు ‘యది సన్తి’ అనే పద్యమునకు, ‘న హి కస్తూరికా’ అనే ఉత్తరార్ధము దీసివేసి “వాచావాచస్పతేర్వ్యోమ్ని విలసంతి న వల్లయః” అని కూర్చిన యెడల అపుడు వైధర్మ్యము ప్రకృత విపరీతమగు అర్థమును గూర్చుట వలన యుక్తము.

అథ—

“ఖలాస్తు కుశలాః స్వీయహితప్రత్యూహకర్మణి
నిపుణాః ఫణినః ప్రాణానపహర్తుం నిరాగసామ్.”

ఇత్యత్రోభయసంప్లుతవాక్యార్థేఽతిప్రసంగః, కుశలనిపుణపదాభ్యామేకస్యైవ ధర్మస్యోపాదానాత్. న చాత్రౌపమ్యం న గమ్యమితి వక్తుం శక్యమ్; నిపుణకుశలపదాభ్యాం ప్రతిపాదితేన శబ్దసామాన్యాత్మనా ధర్మేణ ఖలఫణినోరౌపమ్యస్య ప్రత్యయాత్. నాపి ధర్మిణోరౌపమ్యేఽపి విశిష్టవాక్యార్థయోస్తన్న తథేతి వాచ్యమ్, అవయవద్వారా తయోరపి తస్య తథాత్వాత్. స్వభావసిద్ధత్వేనానుపాత్త

ధర్మేణౌపమ్యస్య గమ్యత్వాచ్చేతి చేత్, మైవమ్, సాధారణధర్మస్య వస్తుప్రతివస్తుభావోక్త్యా తదితరపదార్థానాం బింబప్రతిబింబభావో ఘటనాయా ఆనురూప్యం చ వివక్షితమ్. ప్రకృతే చ ఖలఫణినోః ప్రాణహితయోశ్చ సత్యపి బింబప్రతిబింబభావే హరణ ప్రత్యాహరణయోర్నాశ ప్రాగభావపర్యవసితయోరనానురూప్యాన్న బింబ ప్రతిబింబ భావ ఇతి న దోషః. యద్వా అస్త్వత్ర ప్రతివస్తూపమా, పరం త్వసంస్థులతారూపస్య వాక్యార్థసామాన్యదోషస్య సత్త్వాదచమత్కారిణీ, దుష్టోపమాదివత్. వాక్యార్థో హి గాఢతరవ్యుత్పత్తి నిపుణీకృతాంతఃకరణైర్నానావిధపదార్థరచనాపరిష్కృతిపటుభిరేవ కవిభిః రచితః కామపి కమనీయతామాధత్తే, నేతరః.

అయితే-

"ఖలాస్తు" మొ. (దుర్మార్గులు తమ హితులకు విఘ్నమొనర్చుట యందు కుశలులు. పాములు నిర్దోషుల యొక్క ప్రాణములపహరించుటకు నిపుణములు)

అనేచోట అసంస్థుల వాక్యార్థమందు నతిప్రసంగము - కుశల నిపుణ పదములచేత ఒకే ధర్మ ముపాత్తము గనుక, మరియు ఇచట ఔపమ్యము గమ్యము గాదు. అని చెప్పుటకు వీలుగాదు. నిపుణ కుశల పదములచేత ప్రతిపాదింపబడిన శబ్ద సామాన్య రూపమగు ధర్మముచే ఖల, ఫణులకు నౌపమ్యము స్ఫురించుచున్నది గనుక. పోనీ-ధర్ములకు నౌపమ్యమున్నను విశిష్టవాక్యార్థములకు అది లేదని చెప్పుటకు వీలులేదు. అవయవ ద్వారా వాటికిని అది అలా ఉన్నది గనుక. స్వభావ సిద్ధమగుటచేత ధర్మోపాదానము చేయకున్నను ఔపమ్యము గమ్యమగును గనుక కూడ, అనినచో-నట్లనరాదు. సాధారణ ధర్మమునకు వస్తు ప్రతివస్తుభావము చెప్పుటచేత తదితర పదార్థములకు బింబప్రతిబింబ భావము ఘటనకానురూప్యమున్ను వివక్షితము. ప్రకృతమునందు ఖల ఫణులకు ప్రాణహితములకును బింబప్రతిబింబభావమున్నప్పటికిని హరణ ప్రత్యాహరణములకు నాశ ప్రాగభావ పర్యవసితములకు. అనురూప్యము లేకపోవుటవలన బింబప్రతిబింబ భావము లేదని దోషములేదు. అథవా-ఇక్కడ ప్రతివస్తూపమ యుండనీయండి; అయితే అసంస్థులతా రూప

మగు వాక్యార్థము యొక్క సామాన్యదోష ముండుటవలన చమత్కారము కల్గింపలేదు. దుష్టోపమాదికమువలె. వాక్యార్థమున్న దే-గాఢతరమగు వ్యుత్పత్తిచే నిపుణీకృతాంతఃకరణముగల. నానావిధములగు పదార్థముల యొక్క రచనల పరివృత్తి యందు సామర్థ్యము గలవారగు కవులచే మాత్రమే రచింపబడినదై, విలక్షణమగు కమనీయతను గూర్చగలదు. ఇతరముగాదు.

తథా హి—

"ఉపాసనామేత్య పితుః స రజ్యతే
దినే దినే సావసరేషు బందినామ్.
పఠత్సు తేషు ప్రతిభూపతీనలం
వినిద్ర రోమాజని శృణ్వతీ నలమ్."

అస్మిన్నైషధీయపద్యే ద్వయోః క్రియయోరుద్దేశ్యవిధేయ భావేన గుణప్రధానభావమకుర్వతా, బందినః షష్ఠ్యంతతయా సప్తమ్యంతతయా చ ద్విః పరామృశతా కవినా వాక్యార్థః క్రమేలకపదసంస్థులతాం ప్రాపితః.

యది చ స ఏవ వాక్యార్థః ప్రకారాంతరేణ నిర్మీయతే—

"ఉపాసనార్థం పితురాగతాపి సా
నివిష్టచిత్తా వచనేషు బందినామ్.
ప్రశంసతాం ద్వారి మహీపతీనలం
వినిద్రరోమాజని శృణ్వతీ నలమ్".

ఇతి, తదా లలనాంగసన్నివేశ ఇవ కీదృశీం కమనీయతామావహేదితి సహృదయైరాకలనీయమ్.

అలాగే-

"ఉపాసనామేత్య" (దమయంతి ప్రతిరోజును వందుల అవసరములందు తండ్రి యొక్క సేవను పొంది సంతసించు చుండెడిది. వారు ఇతర రాజులను ఎక్కువగా కొనియాడుచుండగా నలుని వినుచూ రోమాంచము గలది అయినది).

ఇత్యాది నైషధ పద్యమందు రెండు క్రియలకు నుద్దేశ్య విధేయ భావముచే గుణప్రధాన భావమునుజేయక, వందులను షష్ఠ్యంత పదము తోడను సప్తమ్యంత పదముతోడను, రెండుసారులు పరామర్శించిన కవిచే వాక్యార్థము ఒంటెవలె ఎగుడు దిగుడుగా రచింపబడినది. ఆ వాక్యార్థము

"ఉపాసనార్థం" (తండ్రి ఉపాసనకొరకు వచ్చిననూ ఆ దమయంతి వందులమాట యందు హృదయము నుంచినదై వారు రాజులను బాగా ప్రశంసించుచుండగా, నలుని వినుచు రోమాంచిత యైనది)

ఇత్యాది విధముగ మరొక తీరుగా రచింపబడిన యెడల అప్పుడు లలనాంగ సన్నివేశమువలె, ఎటువంటి కమనీయతను గూర్పగలదో యని సహృదయులు గ్రహింపవలెను.

ఏవమ్—

"తవామృతస్యన్దిని పాదపంకజే
నివేశితాత్మా కథమన్యదిచ్ఛతి.
స్థితేఽరవిందే మకరందనిర్భరే
మధువ్రతో నేక్షురకం హి వీక్షతే."

ఇతి కువలయానందోదాహృతే ఆలవందారుస్తోత్రపద్యే వీక్షణమాత్రస్యావర్జనీయస్య ప్రతిషేధానర్హత్వాదిచ్ఛాపూర్వక వీక్షణప్రతిషేధస్య చ "సవిశేషణే హి—" ఇతి న్యాయేనేచ్ఛా ప్రతిషేధధర్మపర్యవసాయితయా యద్యపి ధర్మైక్యం సుసంపాదమ్, అస్తు వా దృష్టాంతాలంకారః, తథాపి పాదపంకజే నివేశితాత్మేత్యా ధారసప్తమ్యాః స్థితేఽరవిందే ఇతి సతిసప్తమీ వస్తుప్రతివస్తు బింబ ప్రతిబింబ భావయోరన్యతరేణాపి ప్రకారేణ నానురూపా, ఇత్య సమ్బులితా స్థితైవ. "స్థితేఽరవిందే మకరందనిర్భ" ఇతి చేత్క్రియతే తదా తు రమణీయమ్. తస్మాదేవంజాతీయకేష్వలంకారేషు పూర్వ వాక్యార్థఘటకతామార్థానురూపైర్వాక్యార్థైస్తద్ఘటకవిభక్త్యను రూపాభిర్విభక్తిభిస్తదన్వయానురూపేణ చాన్వయేన భావ్యమితి సహృదయహృదయం ప్రష్టవ్యమ్.

ఈతీరుగా—

"తవామృతస్యందిని" మొ (అమృతము స్రవించునట్టి నీపాద పద్మమున బుద్ధినుంచినవాడు ఎట్లు యితరులను గోరును? మకరంద పూర్ణమగు అరవింద ముండగా తుమ్మెద గొబ్బి పువ్వును చూడదు గదా!)

అని కువలయానందమున నుదాహరించబడిన అళువందారుస్తోత్ర పద్యమందు (అసంస్థులత ఉన్నది). అవర్జనీయమగు వీక్షణమాత్రము నిషేధించుటకు వీలుగాదుగదా ! ఇచ్ఛాపూర్వకేక్షణ ప్రతిషేధమున్ను "సవిశేషణే" యను న్యాయముచే ఇచ్ఛా ప్రతిషేధ ధర్మము నందు పర్యాసించుటచే ఏమైనా ధర్మైక్యము సులభముగా సంపాదించవచ్చును. లేదా దృష్టాంతాలంకార ముండనీయండి. అయినను "పాదపంకరుహామందు నివేశితమగు నాత్మగలవాడై " అను ఆధారసప్తమికి "స్థితే అరవిందే" అని సతిసప్తమి వస్తు ప్రతివస్తు బింబప్రతిబింబ భావములలో నొక ప్రకారముచే నైనను అనురూపముగాదు. గాన అసంస్థులత ఉండనే యున్నది. "స్థితే అరవిందే మకరంద నిర్భరే" అని చెప్పిన యెడల అపుడు రమణీయము.

అందువలన ఈ రకములైన అలంకారముల యందు వెనుకటి వాక్యార్థములో ఘటకములగు నామార్థములకు ననురూపములైన నామార్థములును, తద్గతవిభక్తుల కనురూపములైన విభక్తులును తదన్వయానురూపమగు అన్వయమును నుండవలయునని సహృదయ హృదయము అడుగవలసింది.

"వహతి విషధరాన్పటీరజన్మా
శిరసి మషీపటలం దధాతి దీపః.
విధురపి భజతేతరాం కలంకం
పిశునజనం ఖలు బిభ్రతి క్షితీంద్రాః."

అత్ర వహనాధానభజనభరణానాం వస్తుత ఐకరూప్యాత్ప్రతివస్తూపమేయమేవం మాలారూపా.

ఇతి రసగంగాధరే ప్రతివస్తూపమాప్రకరణమ్.

"వహతి" మొ. (చందనవృక్షము విషము ధరించువాటినే (పామునే) (శిరస్సునందు) వహించును. దీపము మసిని ధరించును. చంద్రుడును కలంకమును ధరించును. సామాన్యముగా రాజులు కొండెగాండ్రనే వహింతురు.)

ఇక్కడ వహనాధానభజనధరణములు వస్తుతః ఏకరూపములగుటవలన ప్రతివస్తూపమ, మాలారూపమైనది.

ఇది ప్రతివస్తూపమాప్రకరణము

## దృష్టాంతాలఙ్కారః

అథ దృష్టాంతాలఙ్కారః —

ప్రకృతవాక్యార్థఘటకానాముపమానాదీనాం సాధారణధర్మస్య చ బింబప్రతిబింబభావే దృష్టాంతః. తదుక్తమ్—"దృష్టాంతః పునరేతేషాం సర్వేషాం ప్రతిబింబనమ్." ఇతి.

ఉదాహరణమ్—

'సత్పూరుషః ఖలు హితాచరణైరమంద-
మానందయత్యఖిలలోకమనుక్త ఏవ.
ఆరాధితః కథయ కేన కరైరుదారై-
రిందుర్వికాసయతి కైరవిణీకులాని.'

అత్రానందనవికాసయోరపి బింబప్రతిబింబభావః. అస్య చాలంకారస్య ప్రతివస్తూపమయా భేదకమేతదేవ యత్తస్యాం ధర్మో న ప్రతిబింబితః, కింతు శుద్ధసామాన్యాత్మనైవ స్థితః. ఇహ తు ప్రతిబింబితః.

అనంతరము దృష్టాంతము.

ప్రకృత వాక్యార్థమున ఘటకములగు నుపమానాదులకును, సాధారణ ధర్మమునకున్ను, బింబ ప్రతిబింబభావము దృష్టాంతము. ఇది చెప్పిరి,— "ఇవి యన్నియు ప్రతి బింబించుటయే దృష్టాంతము" అని.

ఎట్లన-

"సత్పూరుషః" మొ. (సత్పురుషులు హితమును చేయుటచే లోకము నంతయూ చెప్పబడకనే ఎక్కువగా నానందింపజేయుదురు. చంద్రుడు కలువకు లములను ఉదారమగు కిరణములచే ఎవనిచే అరాధింపబడి వికసింపజేయు చున్నాడు?

ఇచట నానందవికాసములకు బింబ ప్రతిబింబభావము. ఈ యలంకారమునకు ప్రతివస్తూపమకును ఇదియే భేదకము-దానియందు ధర్మము ప్రతిబింబితము గాదు. శుద్ధ సామాన్య రూపముతోనే నిలచినది. ఇక్కడనో ప్రతిబింబితమైనది.

విమర్శినీకారస్తు — "ప్రతివస్తూపమాయామప్రకృతార్థోపాదానం తేన సహ ప్రకృతార్థస్య సాదృశ్యప్రతిపత్త్యర్థమ్. దృష్టాన్తే తు తదుపాదానమేతాదృశోఽర్థోఽన్యత్రాపి స్థిత ఇతి ప్రకృతార్థప్రతీతేర్విశదీకరణ మాత్రార్థమ్, న తు సాదృశ్యప్రతిపత్త్యర్థమ్, అతః సాదృశ్యప్రతీత్యప్రతీతిభ్యామనయోరలంకారయోర్భేదః" ఇత్యాహ తన్న. ప్రకృతాప్రకృతవాక్యార్థయోరుపాదానస్యాలంకారద్వయేఽప్యవిశిష్టత్వాదేకత్ర సాదృశ్యప్రత్యయః, అన్యత్ర నేత్యస్యాజ్ఞామాత్రత్వాత్. వైపరీత్యస్యాపి సువచత్వాచ్చ. ఏతాదృశోఽర్థోఽన్యత్రాపి స్థిత ఇతి ప్రకృతార్థప్రతీతివిశదీకరణస్య త్వదభిహితస్య సాదృశ్యాపర పర్యాయత్వాచ్చ. అత ఏవ ప్రాయశః సత్కవినిర్మితేషు లక్ష్యేషు ప్రకృతవాక్యార్థఘటకప్రకృతిప్రత్యయార్థానురూపప్రకృతిప్రత్యయార్థఘటిత ఏవాప్రకృతవాక్యార్థో దృశ్యతే.

విమర్శినీకారుడుమాత్రము- "ప్రతివస్తూపమలోన ప్రకృతార్థమును స్వీకరించుట, దానితోగూడ ప్రకృతార్థమునకు సాదృశ్య ప్రతిపత్తి కొరకు. దృష్టాంతములో దానిని స్వీకరించుట ఇటువంటి యర్థము మరొకచోటను గూడ నున్నదని ప్రకృతార్థ ప్రతీతిని విశదీకరించుటకు మాత్రమే. అంతే కాని సాదృశ్యము ప్రతిపన్నమగుటకు గాదు. అందువలన సాదృశ్య ప్రతీతి అప్రతీతులచే నీ రెండలంకారములకు భేదము" అనెను. అదిగాదు. ప్రకృతాప్రకృత వాక్యార్థముల రెంటినీ స్వీకరించుట రెండలంకారములయందును సమానమైనపుడు ఒకచో సాదృశ్య ప్రతీతి, మరొకచోట గాదనుట, నాజ్ఞా

మాత్రమే. విపరీతముగా నేల చెప్పకూడదు? ఇటువంటి యర్థము ఇతర స్థలములయందు గూడ యున్నది, అని ప్రకృతార్థ ప్రతీతిని విశదీకరించుట నీవు చెప్పినది సాదృశ్యమునకు మరొక పర్యాయమే గదా ? ఇందువల్లనే తరచుగా సత్కవులచే నిర్మింపబడిన లక్ష్యములయందు ప్రకృత వాక్యార్థ ఘటకములగు ప్రకృతి ప్రత్యయముల యర్థముల కనురూపమగు ప్రకృతి ప్రత్యయముల యర్థముతో ఘటితమైనదియే అప్రకృత వాక్యార్థ మగుపడు చున్నది.

న చ భవదుక్తమపి వైలక్షణ్యం నానయోః పృథగలంకారతాయాం ప్రయోజకమ్. ఔపమ్యాఖ్యసామాన్యలక్షణాక్రాంతతయా ఉపమాభేదేష్వవేనాలంకారభేదత్వాపత్తేరితి వాచ్యమ్, తథాపి దీపకతుల్యయోగితయోరేకభేదత్వాపత్తేః. ఇష్టాపత్తిరితి చేత్తర్హి సా త్రాపి దృశ్యతామ్. ప్రాచీన విభాగస్య భవతైవ శిథిలీకృతత్వాత్. ఔపమ్యరూపసామాన్యలక్షణసత్త్వాద్బహూనామలంకారాణాముపమావాంతరభేదత్వాపత్త్యా సకలాలంకారికసిద్ధాంతభంగ ప్రసంగాచ్చ. "—'అబ్ధిర్లఘింత ఏవ వానరభటైః' ఇత్యాది మురారిపద్యే యద్యపి జ్ఞానార్థ ఏకో ధర్మో నిర్దిష్టః పిస్తథా నైతన్నిబంధనమౌపమ్యం వివక్షితమ్. యన్నిబంధనం చ వివక్షితం తత్రాబ్ధిలంఘనాదావస్త్యేవ దివ్యవాగుపాసనాదినా ప్రతిబింబనమ్" ఇతి త్వన్మూల గ్రంథవిరోధాచ్చ. న చ యన్నిబంధనం చ వివక్షితమిత్యత్రార్థాలంకారత్వం విశేష్యం శేషపూరణేన యోజ్యమ్, న పునరౌపమ్యమితి వాచ్యమ్. ఔపమ్యం న వివక్షితమిత్యత్రైకవారం నిష్ఠయా పరామృష్టస్యైవ పునస్తయా పరామర్శస్య వ్యుత్పత్తేః. 'న చైత్రార్థ మోదనః పక్వః; యదర్థం చ పక్వః స మైత్రః' ఇత్యాదౌ ద్వితీయ పక్వాదిశబ్దానామధ్యాహృత శాకాదిపరత్వే అసంగతేః స్ఫుటత్వాత్. తస్మాదస్మదుక్తేనైవ పథా ప్రాచీనైర్వివిక్తయోరలంకారయోరనయోర్విభాగః సంగమనీయః.

పరే నీవు చెప్పు వైలక్షణ్యము గూడ ఈ రెండును వేరుగా నలంకారములగుటలో ప్రయోజకము గాదు, ఔపమ్యమను పేరుగల సామాన్య లక్షణముచే నాక్రమింపబడుటవలన నుపమాలంకార ప్రభేదమువలె, నొక

యలంకార భేదమగుట సంభవించవలసివచ్చునే ? నీకును దీపకతుల్యయోగి తలు ఒకదాని భేదములే యనవలసివచ్చునే? ఇష్టాపత్తి యనినచో నదియె నిచట నొప్పెదము. ప్రాచీనుల విభాగము నీవే శిథిలము నొనర్చితివి గదా ? ఔపమ్యమను సామాన్య లక్షణమున్నది కనుక చాలా యలంకారములు ఉపమలో అవాంతర భేదములగుట కల్గవలసినదే కనుక ఆలంకారికులందరి సిద్ధాంతములును భగ్నములు గావలసివచ్చును. "అబ్ధిర్లంఘిత ఏవ వానర భటైః" అని మొదలైన మురారి పద్యమున జ్ఞానార్థమగు నొక్క ధర్మమే నిర్దేశింపబడినది. అయినను ఏతన్మూలకమగు నౌపమ్యము వివక్షితముగాదు. దేనిమూలమగునది వివక్షితమో నాయబ్ధిలంఘనాదులయందు, దివ్య వాగుపాసనాదికముచేత ప్రతిబింబన ముండనే యున్నది." అనే నీమూల గ్రంథముతో విరోధమున్నా. 'యన్నిబంధనముగా వివక్షితమో.'—అనేచోట నర్థాలంకారత్వము విశేష్యముగా శేషపూరణముతో గూర్పదగినది;అంతేగాని ఔపమ్యము అను నది గాదు అనుటయును దగదు. ఔపమ్యము వివక్షితము గాదు, అనుచోట నొక పర్యాయము నిష్ఠచే పరామృష్టమునకే తిరిగి, దానిచే పరామర్శ వ్యుత్పన్నము గనుక. "చైత్రార్థమై అన్నము పక్వము గాలేదు, ఎవనికొరకు పక్వము అయ్యెనో నతడు మైత్రుడు" అని ఈ మొదలైన వానిలో రెండవ పక్వాదిశబ్దములు నధ్యాహరింపబడిన శాకాదులను బోధించుచో నసాంగత్యము స్పష్టముగనుక. అందువలన మేము జెప్పినమార్గము తోనే ప్రాచీనులు చేసిన ఈ రెండలంకారముల విభాగమున్ను సమర్థ నీయము.

యది తు న తేషాం దాక్షిణ్యం తదైకస్యైవాలంకారస్య ద్వౌ భేదౌ - ప్రతివస్తూపమా, దృష్టాంతశ్చ. యచ్చానయోః కించి ద్వైలక్షణ్యం తత్ప్రభేదతాయా ఏవ సాధకమ్, నాలంకారతాయా ఇతి సువచమ్. వైధర్మ్యేణాయం యథా-

"జనయంతి పరప్రీతిం నరాః సత్కులసంభవాః
నహి కారస్కరః క్వాపి తాపనిర్వాపణక్షమః."

యథా వా—

"తాపత్రయం ఖలు నృణాం హృది తావదేవ
యావన్న తే వలతి దేవ కృపాకటాక్షః

ప్రాచీ లలాట పరిచుంబిని భానుబింబే
పంకేరుహోదరగతాని కుత స్తమాంసి."

ప్రీతిజనన తాపనిర్వాపణాభావయోః, తాపత్రయావస్థాన తమోదూరీకరణయోశ్చ వైధర్మ్యేణాత్ర బింబప్రతిబింబభావః.

ఇతి రసగంగాధరే దృష్టాంతప్రకరణమ్.

అయితే వారి విషయమున దాక్షిణ్యము లేకపోయినచో నపుడొక యలంకారమునకే ప్రతిపస్తూపను, దృష్టాంతము అను రెండు భేదములు; వీటికున్న కొంచము భేదమున్ను, తత్ప్రభేదమగుటకే సాధనము, ఇది అన్యాలంకారమగుటకు గాదు, అని సులభముగానే చెప్పవచ్చును.

వైధర్మ్యముతో నెట్లనగా

"జనయన్తి" మొ. (సత్కుల ప్రసూతులగు మనుష్యులు ఇతరులకు ప్రీతిని గలిగింతురు. కారస్కరము ఎక్కడనూ తాపమును పోగొట్టుటకు సమర్థమైనది కాదు గదా!).

మరొకటి -

తాపత్రయం" మొ. (ఓ దేవా! మనుష్యులకు తాపత్రయము అంత వరకే యుండును, ఎంతవరకైతే నీ యొక్క కృపా కటాక్షము వ్యాపించదో సూర్యబింబము ప్రాచీలలాటమును స్పృశించుచుండగా పద్మములోపల నుండునట్టి చీకటులు ఎక్కడివి?).

ప్రీతిజననతాపనిర్వాపణాభావములకును తాపత్రయావస్థానతమో దూరీకరణములకును వైధర్మ్యముచే నిచట బింబప్రతిబింబ భావము.

ఇది దృష్టాంతప్రకరణము

## నిదర్శనా ప్రకరణమ్

అథ నిదర్శనా—

**ఉపాత్తయోరర్థయోరార్థాభేద ఔపమ్యపర్యవసాయీ నిదర్శనా. అతిశయోక్త్యాదీనాం, ధ్వన్యమానరూపకస్య చ వారణాయ ఉపాత్తయోరితి. వాచ్యరూపక వారణాయ ఆర్థ ఇతి. ఆర్థత్వం చ ప్రాథమికాన్వయబోధా విషయత్వమ్. యది చ విశిష్టో**

పమాయాం విశేషణయోరభేదః ప్రతీయతే తదా బింబప్రతిబింబ భావానాపన్నత్వమపి ప్రధాన విశేషణమ్. తద్విశేషణానాం తు బింబప్రతిబింబభావో న నివార్యతే. ఇదం చ శ్రౌత్యా నిదర్శనాయా లక్షణమ్. ఆర్థీ సాధారణం లక్షణం తు లలితాలంకారప్రకరణే వక్ష్యతే.

ఉపాత్తములగు రెండు అర్థములకు ఆర్థమగు అభేదము, ఔపమ్య పర్యవసాయి, నిదర్శనము.

అతిశయోక్తి మొదలైనవాటిని, ధ్వన్యమానమగురూపకమును వారించుటకు, ఉపాత్తములగు నని. వాచ్యరూపకమును వారించుటకై, ఆర్థమగునని. ఆర్థత్వమనగా మొదటి యన్వయబోధలో గోచరము గాక పోవుట. అయితే విశిష్టోపమయందు విశేషణములకభేదము ప్రతీతమగుచో "బింబప్రతిబింబభావమును పొందకయుండుట" గూడ ప్రధానమగు విశేషణము.

తద్విశేషణములకు మాత్రము బింబప్రతిబింబభావము వారింపబడదు. ఇది శ్రౌతీనిదర్శనకు లక్షణము. ఆర్థికి గూడ సాధారణమగు లక్షణము లలితాలంకార ప్రకరణమున జెప్పెదము.

ఉదాహరణమ్—

"త్వామన్తరాత్మని లసన్తమనన్త మజ్ఞా-
స్తీర్థేషు హన్త మదనాంతక శోధయన్తః.
విస్మృత్య కంఠతటమధ్యే పరిస్ఫురన్తం
చింతామణిం క్షితిరజస్సు గవేషయన్తి."

అత్ర తవాన్యత్ర పరిశోధనం కంఠస్థస్య చింతామణేర్బాహ్య పాంసుషు గవేషణం చాభిన్నమితి తత్సాదృశ్యమూలా ధీః.

యథా వా—

"అన్యైః సమానమమరై ర్జగదంతరాత్మన్,
యే చంద్రశేఖర వదన్తి భవన్త మజ్ఞాః
తే కిం న హన్త తులయన్తి నభో నిరన్తం
వాతాయనోదరగతైర్వివరాన్తరాలైః."

పూర్వత్రైకవాక్యగతః, ఇహ తు భిన్నవాక్యగతః. పూర్వత్ర వస్తుమాత్రయోరౌపమ్యమూలోఽభేదః, ఇహ త్వౌపమ్యయోరౌపమ్యమూలః స ఇతి విశేషః. ఏషా వాక్యార్థనిదర్శనేత్యుచ్యతే. విశిష్టార్థయోః ప్రకృతైకధర్మిగతయోరార్థాభేదే వాక్యార్థనిదర్శనాయా ఇష్టేః. అస్యాం చ ఘటకపదార్థానాం బింబప్రతిబింబభావ ఆవశ్యకః.

ఉదాహరణము.

"త్వామంతరాత్మని" మొ. (అంతరాత్మయందు ప్రకాశించుచున్న అనంతుడవు నిన్ను, అజ్ఞులు తీర్థములయందు, మదనాంతకుడా! వెదుకుచున్న వారు, కంఠ తటమధ్యమందు ప్రకాశించుచున్న చింతామణిని మరచిపోయి నేల దుమ్ములో వెదుకుచున్నారు).

ఇచట నిన్ను మరొకయెడ పరిశోధించుటయు, మెడలోనున్న చింతామణిని నేల దుమ్ములో వెదకుటయు నభిన్నమని తత్సాదృశ్యమూలమగు బుద్ధి.

మరియు—

"అన్యైః" మొ. (జగదన్తరాత్మా, నిన్ను ఇతరులలో సమానముగా ఎవరు చూచెదరో, ఓమదనాంతకా, వారు అంతులేని ఆకాశమును కిటికీ సందులతో సమానముగా చూడరాయేమి ?).

వెనుకటి చోట నొక వాక్యమందున్నది. ఇక్కడైతే వేరు వాక్యములందున్నది. వెనుకటిచోట రెండు వస్తువులకు మాత్రము ఔపమ్యమూలకమగు నభేదము. ఇచట నౌపమ్యములకు నౌపమ్యమూలమైనదది అని విశేషము. దీనినే వాక్యార్థనిదర్శన అందురు. విశిష్టార్థములకు, ప్రకృతైకధర్మిగతములకు, ఆర్థికమగు నభేదమున వాక్యార్థ నిదర్శన ఇష్టము గనుక. దీనియందు ఘటకములగు పదార్థములకు బింబప్రతిబింబభావ మావశ్యకము.

పదార్థనిదర్శనా యథా—

"అగణ్యైరింద్రాద్యైరిహ పరమపుణ్యైః పరిచితో
జగజ్జన్మస్థాన ప్రలయరచనాశిల్ప నిపుణః.
ప్రసర్పత్పీయూషాంబుధిలహరి లీలావిలసితో
దృగన్తస్తేఽమందం మమ కలుషబృన్దం దళయతు."

అత్ర దృగన్తాంబుధి లహరీలీలయోరాశ్రయభేదాద్ భిన్న యోరపి సాదృశ్యమూలస్తాదూప్యాభిమానః. ఆరోపో వా దృగన్తే లహరిలీలాయాః.

యథా వా—

"పాణౌ కృతః పాణిరిలాసుతాయాః
సస్వేదకంపో రఘునందనేన.
హిమాంబుమందానిల విహ్వలస్య
ప్రభాతపద్మస్య బభార శోభామ్."

అత్ర హిమాంబుజనితవిహ్వలతా హిమకణాకీర్ణతారూపా, వాతజనితవిహ్వలతా చ విధుతిరూపా. ఏతాభ్యాం చ సస్వేదతా సోత్కంపితత్వయోః ప్రతిబింబనమితి పూర్వస్మాదుదాహరణాద్భేదః. ప్రభాతపదసాన్నిధ్యాచ్చ పద్మస్యైవపద్వికాసముద్రణయోః ప్రత్యయాత్పాణావపి తత్సిద్ధిః. అస్యాం చోపమానోపమేయగతధర్మయోరార్థాభేదప్రతిపత్తిః. అతః పదార్థనిదర్శనోచ్యతే. బింబ ప్రతిబింబ భావస్తూపమానోపమేయయోః సవిశేషణత్వే భవతి, అన్యథా తు న ఇతి వివేకః.

పదార్థ నిదర్శన యెట్లనగా –

"అగస్త్యాః" మొ. (లెక్కలేనట్టి పరమపుణ్యులైన ఇంద్రాదులకు పరిచితమైనదియు జగత్తు యొక్క జన్మస్థితి ప్రళయముల రచనా శిల్పమునందు నిపుణమైనట్టిదియు, ప్రసరించుచున్న అమృత సముద్రము యొక్క లహరీ లీలతో విలసిల్లుచున్న, నీ దృగంతము నా పాపబృందమును శమింపజేయునుగాక !).

ఇచట దృగన్తాంబుధిలహరీలీలలు ఆశ్రయభేదముచే భిన్నములైనను, సాదృశ్యమూల తాదృప్యాభిమానము. దృగంతమునందు లహరీలీల యొక్క నారోపముగాని.

మరొకటి-—

"పాణౌకృతః" మొ. (రామునిచే హస్తమునందు గ్రహింపబడినదియు, స్వేదకంపములతో కూడినదియు అగు భూపుత్రి యొక్క హస్తము

హిమాంబుమందానిలములచే విహ్వాలమగు ప్రాతఃకాల పద్మముయొక్క-శోభను ధరించెను.)

ఇచట హిమాంబువులవలన బుట్టిన విహ్వాలత హిమకణములచే వాకీర్ణతారూపమైనది. వాతజనిత విహ్వాలతయున్ను విధుతిరూపమైనది. ఈ రెంటిచేతను సస్వేదతా సోత్కంపితత్వములకు ప్రతిబింబనము అని వెనుకటి యుదాహరణము కంటె భేదము. ప్రభాత పదము దగ్గఱ నుండుట వలన పద్మము కొంచము వికసించుట, కొంచము ముకుళించుట, వీటి ప్రత్యయము వలన చేతియందు నది సిద్ధించును. దీని యందు ఉప మా నో ప మే య ము లందున్న ధర్మముల కర్థసిద్ధమగు నభేదప్రతిపత్తి. ఇందువలన పదార్థ నిదర్శన యందురు. బింబప్రతిబింబ భావమున్నదే, ఉపమానోపమేయములు సవిశేషము లైనచో ఉండును. మరొక విధమైతే యుండదు, అని వివేకము.

**నను వాక్యార్థనిదర్శనాయాం విశిష్టవాచకశబ్దాభ్యాం విశేషణయోరప్యుపాదానాత్ అస్తు నామ ఉపాత్తయోరార్థోఽభేదః. పదార్థనిదర్శనాయాం తూపమానశోభాదేరన్యతరస్యైవోపాత్తత్వమ్, న ద్వయోరితి చేత్, శోభాశబ్దేన శోభాత్వేన ద్వయోరప్యుపాత్తత్వాత్. నహ్యుపమానోపమేయతావచ్ఛేదకరూపేణోపాత్తత్వం వివక్షితం యేనావ్యాప్తిః స్యాత్. యద్వా ప్రాగుక్తలక్షణం వాక్యార్థనిదర్శనాయా ఏవ, న పదార్థనిదర్శనాయాః. అస్యాస్తు ఉపమానోపమేయయోరన్యతరధర్మస్యాన్యతరత్రారోపో లక్షణమస్తు.**

సరే-వాక్యార్థ నిదర్శనలో రెండు విశిష్ట వాచక శబ్దములచే రెండు విశేషణముల నుపాదాన మొనర్చుట వలన ఉపాత్తముల కార్థమగు నభేదముండు గాక! పదార్థ నిదర్శనయందైతే, నుపమాన శోభ మొదలైన వాటిలో నన్యతరమునే స్వీకరించుట, రెంటిని గాదు; అనినచో—శోభాశబ్దముచే శోభాత్వముగా, రెండింటిని స్వీకరించితిమి కనుక. ఉపమానోపమేయతా నిర్ణాయకరూపముతో స్వీకరణము వివక్షితము గాదు. అట్లైన నవ్యాప్తి గల్గును. యద్వా—వెనుకజెప్పిన లక్షణము వాక్యార్థ నిదర్శనకే పదార్థ నిదర్శనకు గాదు. దీనికైతే నుపమానోపమేయములలో యేదే నొకదాని ధర్మమునకు రెండింటిలో నొకచోట నారోపించుట లక్షణమగు గాక.

నన్వేవమపి వాక్యార్థనిదర్శనాయాం రూపకధ్వనినా, పదార్థనిదర్శనాయాం చ నిగీర్యాధ్యవసానరూపయాతిశయోక్త్యా గతార్థతేతి చేత్ న. వాక్యార్థనిదర్శనాయాం రూపకస్య గుణీభూతత్వేన తద్ధ్వనిత్వాయోగాత్. అన్యథా గుణీభూతయోపమయా రూపకస్యాపి గతార్థతాపత్తేః. కిం చ అస్యాశ్చ శరీరం తాదృశపదార్థయోః పరస్పరాభేదమాత్రముభయత్ర విశ్రాంతమ్. రూపకస్య తూపమేయగత ఉపమానాభేదః, అతిశయోక్తేశ్చ. నిగరణానిగరణాభ్యాం చ తయోర్విశేష ఇత్యన్యత్.

ఏవం చ స్ఫుటమేవాస్యా రూపకాతిశయోక్తిభ్యాం వైలక్షణ్యమ్. అత ఏవ, 'త్వామంతరాత్మని—' ఇతి పద్యే గవేషయన్తీత్యత్ర గవేషయన్త ఇత్యనూద్య శోధయన్త ఇత్యత్ర శోధయన్తీతి విధానే, అర్థయోః పౌర్వాపర్యే చ న సౌందర్యహానిః. రూపకాదావుచ్యమానే వ్యంగ్యకక్షోద్దేశ్య విధేయభావస్యాపి వాచ్యకక్షోద్దేశ్య విధేయభావానుసారితయా ఉపమానే ఉపమేయాభేదసిద్ధావసామంజస్యాపత్తేరితి సుధీభిరాకలనీయమ్.

అయితే-ఇలాగైనను వాక్యార్థ నిదర్శన రూపకధ్వనిచేతను పదార్థ నిదర్శన నిగీర్యాధ్యవసానరూపమగు నతిశయోక్తి చేతను గతార్థమే కదా ? అట్లనవద్దు వాక్యార్థ నిదర్శన యందు రూపకము అప్రధాన మగుటచేత, దానికి ధ్వనిత్వము కుదరదు. అలా గానియెడల గుణీభూతోపమచే రూపకము కూడ గతార్థము కావలసివచ్చును. మరియు దీనికి శరీరము అటువంటి పదార్థముల పరస్పరాభేద మాత్రమై, రెండు యెడలను విశ్రాంతమైనది. రూపకమునకైతే ఉపమేయము నందున్న ఉపమానాభేదము, (శరీరము), అతిశయోక్తికిన్నీ. నిగరణా నిగరణములచేత వాటి రెంటికి భేదమనునది విషయాంతరము. ఈతీరుగా దీనికి రూపకాతిశయోక్తుల నుండి వైలక్షణ్యము స్ఫుటమే. ఇందునలననే "త్వామన్తరాత్మని" అనే పద్యమునందు "గవేషయంతి" అనుచోట "గవేషయన్తః" అని అనువదించి, "శోధయన్తః" అనే చోట "శోధయన్తి" అని చేసినను, అర్థములను వెనుక ముందుగ కూర్చినను, సౌందర్యమునకు హాని లేదు. రూపకాదులు చెప్పునపుడు, వ్యంగ్యకక్షలోని ఉద్దేశ్య విధేయ భావము గూడ వాక్య కక్ష యందలి ఉద్దేశ్య విధేయభావ

మును అనుసరించుటచేత, నుపమానమందు ఉపమేయాభేదము సిద్ధించినచో అసామంజస్యము ప్రసక్తించునని పండితులు గ్రహించవలెను.

అలంకారసర్వస్వ కారస్తు—

"త్వత్పాదనఖరత్నానాం యదలక్తకమార్జనమ్
ఇదం శ్రీఖండలేపేన పాండురీకరణం విధోః".

ఇతి పద్యం వాక్యార్థనిదర్శనాయాముదాజహార. ఆహ చ —'యత్ర తు ప్రకృతవాక్యార్థే వాక్యార్థాంతరమారోప్యతే సామానాధికరణ్యేన తత్ర సంబంధానుపపత్తిమూలా నిదర్శనైవ యుక్తా' ఇతి తన్న వాక్యార్థరూపకస్య దత్తజలాంజలిత్వాపత్తేః. న చేష్టాపత్తిః. వాక్యార్థనిదర్శనైవ నిర్వాస్యతామ్, స్వీక్రియతాం చ వాక్యార్థరూపకమితి పర్యనుయోగస్యాపి తుల్యత్వాత్. యుక్తం చైతత్. పదార్థరూపకే 'ముఖం చంద్ర' ఇత్యాదౌ క్లృప్తస్య శ్రౌతస్యాభేదారోపస్య రూపకజీవాతుత్వకల్పనాయా ఔచిత్యాత్, 'ఇందుశోభాం వహత్యాస్యమ్' ఇత్యాది పదార్థనిదర్శనాయామభేదారోపస్యాభావాత్. తజ్జీవాతుత్వాయోగాచ్చ, రూపకే బింబనం నాస్తీతి తు శపథమాత్రమ్, యుక్త్యభావాత్. అస్మదుక్తోదాహరణే వాక్యార్థనిదర్శనాయాః సావకాశత్వాచ్చ.

అలంకార సర్వస్వకారుడైతే—

"త్వత్పాదనఖరత్నానాం" అనే పద్యమును వాక్యార్థ నిదర్శనయందు నుదాహరించెను. చెప్పెను కూడాను-"ఎక్కడ ప్రకృత వాక్యార్థమునందు ఇంకొక వాక్యార్థము, సమానాధికరణ్యముతో నారోపింపబడునో, అక్కడ సంబంధాను పపత్తి మూలక మగు నిదర్శనయే ఉంచబడినది" అని. కానీ అదికాదు. వాక్యార్థ రూపకము దత్తజలాంజలియై తీరును. ఇష్టాపత్తి యనరాదు. వాక్యార్థ నిదర్శనమే త్రోసివేయుడు, వాక్యార్థ రూపకమును స్వీకరింపుడు. అను ప్రశ్న కూడా సమానమే గదా ? అది యుక్తము కూడాను. పదార్థ రూపకమున, "ముఖము చంద్రుడు" అను నిటువంటి చోట క్లృప్తమై, శ్రౌతమగు నభేదారోపమును రూపకజీవాతువుగా కల్పించుట ఉచితము గనుక "ఇందుశోభాం వహత్యాస్యం" ఇత్యాది పదార్థ నిదర్శనయందు అభేదారోపము లేకపోవుట వలన తజ్జీవాతుత్వము కుదురదు గనుక.

రూపకము నందు బింబనము లేదనుట శపథ మాత్రమే. యుక్తి లేదు గనుక. మేము చెప్పిన ఉదాహరణమందు వాక్యార్థ నిదర్శన సావకాశము గనుక.

**యత్తు తేనైవ లక్షణం నిర్మితమ్—'సంభవతా అసంభవతా వా వస్తుసంబంధేన గమ్యమానమౌపమ్యం నిదర్శనా' ఇతి తదపి న· రూపకాతిశయోక్త్యాదిష్వతివ్యాపనాత్.**

అయితే—అతనే లక్షణము నిర్మించెను.

"సంబంధించునట్టి గాని, సంబంధించనట్టి గాని, వస్తు సంబంధముచేత గమ్యమానమగు నౌపమ్యము నిదర్శన" అని. అదియును గాదు. రూపకము, అతిశయోక్తి మొదలగు వాటియం దతివ్యాప్తివలన.

**యత్త్వలంకారసర్వస్వకారానుసారిణా కువలయానందకృతోక్తమ్—**

**"వాక్యార్థయోః సదృశయోరైక్యారోపో నిదర్శనా**
**యద్దాతుః సౌమ్యతా సేయం పూర్ణేందోరకలంకతా" ఇతి.**

**తత్తు తన్మతదూషణేనైవ నివేదితరహస్యమితి న పునరాకులీక్రియతే.**

**యది తు—**

**"త్వత్పాదనఖరత్నాని యో రంజయతి యావకైః**
**ఇందుం చందనలేపేన పాండురీకురుతే హి సః".**

**ఇతి పద్యం నిర్మీయతే తదా నిదర్శనా యుక్తా. న చాస్మదుక్తా వాచ్యా నిదర్శనా, ఇయం తు ప్రతీయమానేతి వాచ్యమ్.**

**"ముఖం చంద్ర ఇవ" ఇతి వాచ్యోపమా, "ముఖం చంద్రః" ఇతి ప్రతీయమానా, నత్వలంకారాంతరమ్; ఇత్యస్యాపి సువచత్వాత్, ఏవం చారోపాధ్యవసానమార్గబహిర్భూత ఆర్థ ఏవాభేదో నిదర్శనాజీవితమ్. స చ కర్త్రాద్యభేద ప్రతిపాదనద్వారా ప్రతిపాద్యతే వాక్యార్థనిదర్శనాయామ్. అత ఏవ మమ్మటభట్టైరుదాహృతమ్—**

**"క్వ సూర్యప్రభవో వంశః క్వ చాల్పవిషయా మతిః**
**తితీర్షుర్దుస్తరం మోహాదుడుపేనాస్మి సాగరమ్." ఇతి.**

**నన్వత్ర నిదర్శనా నైవ సంగచ్ఛతే. విషయిణ ఉపాదానేఽపి విషయస్యానుపాత్తత్వాత్. ఉభయోపాదానం హి తత్రావశ్యకమ్. అతో లలితాలంకార ఉచిత ఇతి చేత్, లలితాలంకారనిరాకరణావసర ఏవై తద్ వ్యక్తముపపాదయిష్యామః.**

అలంకార సర్వస్వకారుల ననుసరించు కువలయానందకారుడు ఇట్లు చెప్పెను—"సమానమగు వాక్యార్థమునకు ఐక్యము నారోపించుట నిదర్శన. దాతకు సౌమ్యత యనేది యేది గలదో అది పూర్ణచంద్రునకు కళంకము లేక పోవుటయే." అని. ఆ మతదూషణముచేతనే దాని రహస్యము నివేదించ బడినది. మరల దానిని వ్యాకులము చేయము.

అయితే-

"త్వత్పాద నఖరత్నాని" ఇత్యాది విధముగ పద్యనిర్మాణము చేసినచో నిదర్శన సరిపోవును. మేము చెప్పినది వాచ్యయగు నిదర్శన, ఇది ప్రతీయమాన అని చెప్పరాదు. 'ముఖం చంద్ర ఇవ' అని వాచ్యోపమ. 'ముఖం చంద్రః' అనునది ప్రతీయమాన; అంతేకాని అలంకారాంతరముగాదు; అని కూడ చెప్పవచ్చునే. ఈతీరుగా ఆరోపాధ్యవసానమార్గముల బహిర్భూత మగు నార్థమైన యభేదమే నిదర్శన యొక్క జీవితము. అది కర్త్రాద్యభేదము జెప్పుట ద్వారా వాక్యార్థ నిదర్శనయందు ప్రతిపాదింపబడును. ఇందువలననే మమ్మటభట్టుచే నుదాహరింపబడెను-

"క్వ సూర్యప్రభవో వంశః" మొ. (సూర్యునివలన కలిగిన వంశ మెక్కడ, అల్పము గోచరించు బుద్ధి యెక్కడ! దుస్తరమగు సముద్రము దాటదలచినవాడనై అజ్ఞానమువలన తెప్పకట్టతో ప్రయత్నించితిని.) అని.

అయ్యా, ఇచట నిదర్శన కుదరనే కుదరదు. విషయిని తీసుకొన్నను విషయము తీసుకొనలేదు కనుక. ఇద్దరిని తీసుకొనుట నక్కడ నావశ్యమైనది. అందువలన లలితాలంకారము తగినది; అనిన యెడల లలితాలంకారమును నిరాకరించు సమయముననే దీనిని స్పష్టముగా నుపపాదించబోయెదము.

**పరే తు "త్వత్పాదనఖరత్నానామ్—" ఇత్యత్ర దృష్టాంతాలంకార మాహుః. తదప్యసత్. బింబప్రతిబింబ భావాపన్న పదార్థఘటితస్య నిరపేక్షవాక్యార్థద్వయస్యైవ దృష్టాంతత్వాత్. తస్మాత్ 'త్వత్పాదనఖ రత్నానామ్—' ఇత్యత్ర వాక్యార్థరూపకమేవ, న నిదర్శనేతి స్థితమ్.**

**ఏవమసంభవద్వస్తుసంబంధనిబంధనా పదార్థవాక్యార్థనిదర్శనా దర్శితా.**

ఇతరులైతే 'త్వత్పాదనఖరత్నానాం' అనుచోట దృష్టాంతాలంకారమును చెప్పుచున్నారు. అది మంచిది కాదు. బింబప్రతిబింబభావమును పొందిన పదార్థద్వయముతో కూర్పబడిన నిరపేక్షమగు వాక్యార్థద్వయమే దృష్టాంతము కనుక. అందువలన "త్వత్పాదనఖరత్నానాం" అనేచోట వాక్యార్థరూపకమే వాని నిదర్శనగాదు అని యేర్పడినది.

ఈతీరుగా అసంభవద్వస్తుసంబంధనిబంధనయగు పదార్థవాక్యార్థ నిదర్శన చూపబడినది.

**"చూడామణిపదే ధత్తే యోఽంబరే రవిమాగతమ్**
**సతాం కార్యాతిథేయీతి బోధయన్ గృహమేధినః"**

**అత్ర "కారీషోఽగ్నిరధ్యాపయతి" "భిక్షా వాసయన్తి" ఇతివదానుకూల్యే ణిచః ప్రయోగాత్ గిరేశ్చ సూర్యోదయదేశావచ్ఛిన్నశిరస్కతారూపస్య గృహమేధిగతసదాతిథ్యకరణవిషయకబోధానుకూలాచరణస్య సంభవాత్ మయా ఇవాన్యైనాప్యతిథిసేవా కార్యా ఇత్యౌపమ్యస్య సద్భావాచ్చ సంభవద్వస్తుసమ్బన్ధమూలాపి నిదర్శనా సంభవతి. న చ బోధయన్నివ బోధయన్నితి ప్రతీయమానేయముత్ప్రేక్షా "వ్యాలింపతి తమోంగాని నభో వర్షతి కజ్జలమ్" ఇత్యాదావివేతి వాచ్యమ్. వస్తుతః సంభవేనైవ తస్యా అప్రసక్తేరిత్యాహుః,**

"చూడామణిపదే" మొ. (చూడామణి స్థానమునందు ఆకాశమున వచ్చిన సూర్యుని, సత్పురుషులకు అతిథి సత్కారము చేయదగినదని గృహస్థునకు బోధించుచు, ఎవడు ధరించుచున్నాడో.)

ఇచట "కారీషోఽగ్నిరధ్యాపయతి" "భిక్షా వాసయన్తి" ఇత్యాదియందువలె నానుకూల్యమున ణిచ్ ప్రయోగించుటవలనను కొండకును సూర్యోదయ ప్రదేశముచే నియమితమగు శిరస్సుగల్గియుండుట రూపమైన గృహమేధియందున్న సదాతిథ్యమును చేయుటను గురించిన బోధకు ననుకూలమగు నాచరణము సంభవించుటవలనను, నావలెనే ఇతరులుగూడ అతిథి సేవ చేయవలెను అని ఔపమ్యముండుటవలనను. సంభవద్వస్తు సంబంధమైన నిదర్శనకూడ సంభవించును.

ఇది—"బోధించుచున్నవానివలెనే బోధించుచు" అని ప్రతీయమానమగు ఉత్ప్రేక్ష "వ్యాలింపతి తమోంగాని నభోవర్షతి కజ్జలం" ఇత్యాది యందువలె - నని చెప్పరాదు. వస్తువు సంభవి యగుటచే అది ప్రసక్తించదు కనుక అని చెప్పుదురు.

**ఇదం చ "ధాతునోక్తక్రియే నిత్యం కారకే కర్తృతేష్యతే" ఇత్యుక్తపథేన ధాతూపాత్తవ్యాపారాశ్రయత్వం కర్తృత్వమితి మతే సంగచ్ఛతే. యది తు కృతాకృతవిభాగానుపపత్తేర్యత్నార్థకాత్కృఞ స్తృచి సవిషయార్థకధాతూత్తరకర్తృప్రత్యయస్యాశ్రయత్వే నిరూఢలక్షణయా యత్నాశ్రయః కర్తృపదార్థః, స ఏవ చ కర్తృప్రత్యయానాం ముఖ్యార్థః, అచేతనస్తు భాక్త ఇతి నయపథేన నిరీక్ష్యతే తదా బోధయన్నిత్యత్ర ప్రతీయమానోత్ప్రేక్షా సంభవత్యేవ.**

ఇదియు "ధాతునోక్తక్రియే నిత్యం కారకే కర్తురిష్యతే" అని చెప్పిన మార్గముగా ధాతూపాత్తమగు వ్యాపారమునకు నాశ్రయమగుటయే కర్తృత్వమని మతమునందు కుదురును. అయితే - కృతాకృత విభాగము కుదరకపోవుటవలన యత్నార్థకమగు "కృఞ్" నకు "తృచ్" ప్రత్యయము చేర్చుగా, సవిషయార్థక ధాతూత్తర కర్తృ ప్రత్యయమునకు నాశ్రయత్వము నందు నిరూఢలక్షణగాన, యత్నాశ్రయము కర్తృపదార్థము. అదియే కర్తృప్రత్యయమునకు ముఖ్యార్థము. అచేతనము భాక్తము-అను నైయాయిక మార్గముచే చూచినట్లైతే అపుడు, "బోధయన్" అనేచోట ప్రతీయమానమగు నుత్ప్రేక్ష సంభవించియే తీరును.

**అముమేవ చాశయం మనసి కృత్వా మమ్మటభట్టైః "స్వస్వహేత్వన్వయస్యోక్తిః—" ఇత్యాదిలక్షణం నిదర్శనాంతరస్య కృత్వా ఉదాహృతే—**

**"ఉన్నతం పదమవాప్య యో లఘు-**
**ర్హీలయైవ స పతేదితి ధ్రువమ్.**
**శైలశేఖరగతో దృషత్కణ**
**శ్చారుమారుతధుతః పతత్యధః".**

ఇతి పద్యే ఇతిపదో_త్తరం బోధయన్బోధయితుం వా ఇత్యస్యా భావాదుత్ప్రేక్షాయా అసంభవే బోధననిదర్శనా యుక్తా.

ఈ యభిప్రాయమునే మనసులో నుంచుకొని, మమ్మటభట్టుచే "స్వస్వహేత్వన్వయస్యోక్తిః" ఇత్యాది లక్షణము నిదర్శనాంతరమునకు చేసి ఉదాహృతమగు—

"ఉన్నతం" (ఉన్నత స్థానమును బొందియు, ఎవడు లఘువగునో అతడు అవలీలగా పడిపోవుట నిశ్చయము అని కొండ శిఖరమునందున్న రాతిముక్క మంచి గాలిచే కదల్పబడినదై క్రింద పడుచున్నది.)

ఇత్యాది పద్యమున ఇతి యను మాట తరువాత-"బోధయన్" లేక "బోధయితుం" అనునది లేకపోవుటవలన ఉత్ప్రేక్ష సంభవించనపుడు బోధన నిదర్శన యుక్తమైనది.

"హాలాహలం ఖలు పిపాసతి కౌతుకేన
కాలానలం పరిచుచుంబిషతి ప్రకామమ్.
వ్యాలాధిపం చ యతతే పరిరబ్ధుముద్ధా
యో దుర్జనం వశయితుం కురుతే మనీషామ్"
యథా వా—
"వ్యోమని బీజాకురుతే చిత్రం నిర్మాతి సుందరం పవనే
రచయతి రేఖాః సలిలే యస్తు ఖలే చరతి సత్కారమ్".
బీజాకరణం బీజప్రక్షేపపూర్వకం కర్షణమ్.
ఇదం చాపరం బోధ్యమ్—
'యాన్తీ గురుజనైః సాకం స్మయమానాననాంబుజా
తిర్యగ్గ్రీవం యదద్రాక్షీత్తన్నిష్పత్రాకరోజ్జగత్'.

అత్ర 'భావప్రధానమాఖ్యాతమ్' ఇతి యాస్కోక్తరీత్యా క్రియావిశేష్యకబోధవాదినాం శాబ్దపవాభేదారోపః క్రియయోరితి 'ముఖం చంద్ర' ఇత్యాద్యావివ రూపకముచితమ్.

ప్రథమాంతవిశేష్యకబోధవాదినాం త్వార్థః స ఇతి నిదర్శనేతి భేదః. నిష్పత్రాకరణం చ సపుఙ్ఖశరస్యాపరపార్శ్వే నిర్గమనాత్ పత్రరాహిత్యకరణమ్.

ఇతి రసగంగాధరే నిదర్శనా ప్రకరణమ్.

"హాలాహలం" మొ. (ఎవడు దుర్జనుని స్వాధీనపరుచుకొనుటకు తల చునో అతడు హాలాహలమును కుతూహలముతో త్రాగదలచుచున్నాడు; కాలాగ్నిని మిక్కిలి ముద్దుపెట్టుకొన నిచ్ఛయించుచున్నాడు; సర్పశ్రేష్ఠమును ఆలింగనమొనర్చుకొనుటకు నిజముగ ప్రయత్నించుచున్నాడు.)

మరొకటి - "వ్యోమని" మొ. (ఎవరు ఖలునియందు సత్కారము చేయుచున్నాడో, అతను ఆకాశమునందు బీజమును ఉంచుచున్నాడు. గాలిలో సుందరము అగు చిత్రమును ప్రదర్శించుచున్నాడు. నీటిలో రేఖలను రచించుచున్నాడు."

బీజాకరణము బీజ ప్రక్షేపపూర్వకమైన కర్షణము.

ఇది మరియొకటి తెలిసికొనవలెను :-

"యాస్తి" మొ. (గురుజనులతో గూడబోవుచు నవ్వుచున్న ముఖ పద్మ ముకలమై మెడను ప్రక్కగాబెట్టి ఏది చూచెనో అది ప్రపంచమునం తనూ నిష్పత్రముగా చేసెను.)

ఇచట "భావప్రధానమాఖ్యాతం" అని యాస్కుడు చెప్పినరీతిగా క్రియావిశేష్యక బోధవాదులకు శాబ్దమైనదియే నభేదారోపము రెండు క్రియలకును అని, "ముఖంచంద్రః" ఇత్యాదులందువలె రూపకము తగినది. ప్రథమాన్త విశేష్యకబోధవాదులకు మాత్రము ఆర్థమైనదే అది. అని నిదర్శన, అని భేదము. నిష్పత్రాకరణమున్ను సపుంఖశరమునకు నపరపార్శ్వమునందు నిర్గమనమువలన రెక్కలు లేకుండ చేయుటయే.

ఇది నిదర్శనా ప్రకరణము

## వ్యతిరేకః

అథ వ్యతిరేకః — ఉపమానాదుపమేయస్య గుణవిశేషవత్త్వే నోత్కర్షో వ్యతిరేకః. ప్రతీపాదివారణాయ తృతీయాంతం వైధర్మ్య పరమ్. తత్ర చోపమానతామాత్రకృత ఏవోత్కర్షః, న వైధర్మ్య కృతః, సాధర్మ్యస్యైవ ప్రత్యయాత్. అధిక గుణవత్త్వమాత్రమ్, ఉపమానగతాపకర్షమాత్రం వా న వ్యతిరేకస్వరూపమ్, తయోరుప మేయోత్కర్షాక్షేపమంతరేణాసుందరత్వాత్. అతఏవ న సాదృశ్యా

భావమాత్రమ్ ఉపమానాదుపమేయస్యాపకర్షేఽపి తత్సంభవాత్, తస్య చ వాస్తవత్వేనాసుందరత్వాత్. ఉపమేయోత్కర్షవిశిష్టత్వేన సాదృశ్యాభావవిశేషణే తస్యైవాలంకారత్వాచిత్యాత్.

తరువాత వ్యతిరేకము.

ఉపమానముకన్న నుపమేయమునకు గుణవిశేషములు కలిగియుండుట చేత నుత్కర్షము వ్యతిరేకము.

ప్రతీపాదులను వారించుటకై ద్వితీయాన్తము, వైధర్మ్యపరము. అందులో నుపమానతామాత్రముచే చేయబడినదే యుత్కర్షము, వైధర్మ్యమువలన చేయబడినది గాదు సాధర్మ్యము మాత్రమే ప్రతీతము గనుక, అధికగుణవత్త్వము మాత్రముగాని, ఉపమానగతమగు నపకర్ష మాత్రముగానీ వ్యతిరేక స్వరూపముగాదు. ఆ రెండును నుపమేయము యొక్క గొప్పదనపు ఆక్షేపము లేనిచో సుందరములు కావు గనుక. ఇందువలననే సాదృశ్యము యొక్క అభావ మాత్రము గాదు. ఉపమానము కన్న నుపమేయము తక్కువైయున్నను అది సంభవించును గనుక; అది వాస్తవమగుటచేత నసుందరము గదా? ఉపమేయము యొక్కగొప్ప దనముతో గలసి యుండుట, సాదృశ్యాభావమునకు విశేషణమగు నపుడు నదియే నలంకారమగుట ఉచితము గదా?

ఉదాహరణమ్ —

"అనిశం నయనాభిరామయా
రమయా సంమదినో ముఖస్య తే.
నిశి నిఃసరదిందిరం కథం
తులయామః కలయాపి పంకజమ్".

అయం చోపమేయోత్కర్షకోపమానాపకర్షకయోర్వైధర్మ్యయోర్ద్వయోరప్యుపాదానానుపాదానాభ్యామేకతరానుపాదనేన చ భావచ్చతుర్ధా. సోఽప్యుపమాయాః శ్రౌతీత్వార్థీత్వాభ్యాం ద్వైవిధ్యాదష్టవిధో భవన్ శ్లేషనిఃశ్లేషత్వాభ్యాం చతుర్వింశతిప్రకార ఇతి ప్రాఞ్చః.

ఉదాహరణము :

"అనిశం" మొ. (ఎల్లప్పుడును కనుల కింపైన లక్ష్మితో సమ్మదియైన

నీముఖమునకు రాత్రియందు తొలగిపోవుచున్న లక్ష్మిగల పద్మమును కలలో నైనను ఎట్లు తులయొనరింతుము ?)

ఇది ఉపమేయము నుత్కర్షించునదియు, ఉపమానము నపకర్షించు నట్టియునగు వైధర్మ్యములు రెండును స్వీకరించుటయు స్వీకరించకపోవు టయు చేతను, ఏదో ఒక దానిని స్వీకరించకపోవుటచేతను నాలుగురకములు.

అదియు నుపమకు, శ్రౌతీత్వ, ఆర్థీత్వ, ఆక్షిప్తత్వములచేతను పన్నెండు రకములై, సశ్లేషత్వముచేత నిశ్లేషత్వముచేతను, ఇరువది నాల్గు విధములని ప్రాచీనులు.

ఉదాహరణమ్—

'కటు జల్పతి కశ్చిదల్పవేదీ
యది చేదీదృశమత్ర కిం విదధ్మః.
కథమిందురివాననం త్వదీయం
సకలంకః స కలంకహీనమేతత్'.

అత్రోభయోరుపాదానమ్. ఉపమా చ శ్రౌతీ. అత్రైవ 'కథమిందురివాననం తవేదం ద్యుతిభేదం న దధాతి యత్కదాపి' ఇతి కృతే 'ద్యుతిభేదం ఖలు యో దధాతి నిత్యమ్' ఇతి వా కృతే ఏకత రానుపాదానమ్. సా చ. 'కథమిందురివాననం మృగాక్ష్యా భవితుం యుక్తమిదం విదంతు సంతః' ఇతి కృతే హేతుసామాన్యానుపాదా నమ్. సా చ. హేతుద్వయే హి యస్యైవానుపాదానం తస్యాక్షే పేణావగతిః. ఉభయోరప్యనుపాదానే త్వైవ, నత్వనవగతిః, వ్యతిరేక స్యోత్కర్షాపకర్ష రూపత్వాత్. తయోశ్చ ప్రయోజకజ్ఞానమంతరేణా నవబోధాత్.

ఉదాహరణము.

"కటు జల్పతి" మొ. (కొద్దిగా తెలిసినవాడు కటువగు ఇట్టి మాటను పలికిన యెడల నేమి చేయుదుము ? నీ ముఖము చంద్రునివలె నెట్లగును ? అతడు కలంకముతో కూడినవాడు; ఇది కలంక హీనము.)

ఇచట రెండింటిని స్వీకరించుట. ఉపమయును శ్రౌతి. ఇచటనే — "కథమిందురివాననం తవేదం ద్యుతిభేదం న దధాతి యత్కదాపి" అని గానీ,

'ద్యుతిభేదంఖలు యో దధాతి నిత్యం' అని గాని చేసిన ఒకదానిని స్వీకరించక పోవుట. అదియున్ను. "కథమిందురివాననం మృగాక్ష్యాః భవితుం యుక్త మిదం విదంతు సంతః" అని చేసిన హేతుసామాన్యము ఉపాదానము చేయ కుండుట. అదియు. హేతుద్వయమునందు దేనికైతే యుపాదానము లేదో దానికి నాక్షేపముచేత నవగతి ఆ రెంటికిన్ని యనుపాదానమందు నట్లాగే. అనవగతి మాత్రము లేదు. వ్యతిరేకము ఉత్కర్షాపకర్ష రూపముగనుక. వాటి రెంటికి ప్రయోజకజ్ఞానము లేకుండా బోధముండదు కనుక.

ఏవమ్—

"నయనాని వహంతు ఖంజనానా
మిహ నానావిధమంగభంగభాగ్యమ్.
సదృశం కథమాననం సుశోభం
సుదృశో భంగుర సంపదాంబుజేన."

అత్రోభయోపాదానమ్. ఆర్థీ చ. 'వదనం తు కథం సమాన శోభం సుదృశో భంగుర సంపదాంబుజేన' (ఇతి) 'శాశ్వతసమ్పదంబు జేన' ఇతి చ కృతే ఏకతరానుపాదానమ్. సా చ. 'సదృశం కథ మాననం మృగాక్ష్యా భవితా హంత నిశాధినాయకేన' ఇతి కృతే ఉభయానుపాదానమ్. సా చ. పూర్వార్ధేతు నిదర్శనైవ.

'కతిపయదివసవిలాసం నిత్యసుఖాసంగమంగలపవిత్రీ
ఖర్వయతి స్వర్వాసం గీర్వాణధునీతటస్థితిర్నితరామ్'.

అత్రేవాదేః సాదృశ్యమాత్రశక్తస్య సదృశాదేశ్చ తద్విశిష్ట శక్తస్య శబ్దస్యాభావాచ్ఛ్రౌత్యర్థమార్గోల్లఙ్ఘినీ ఖర్వీకరణేనాక్షిప్తైవో పమా. అత్రైవ 'నిః సంగైరభిలషితా' ఇత్యాద్యచరణ నిర్మాణే 'సంతాపదురంతచింతయాకులితమ్' ఇతి ద్వితీయచరణనిర్మాణే వా ఏకతరానుపాదానమ్. సా చ. 'సర్వానర్వాచీనాన్నిర్వాస్య మనోరథానవన్యజుషామ్' ఇతి పూర్వార్ధే తదనుపాదానమితి.

ఈతీరుగా—

"నయనాని" మొ. (కాటుకపిట్టల యొక్క నానావిధమగు అంగ భంగముల భాగ్యమును నేత్రములు వహించుగాక! అసుదృక్ యొక్క

మొగము, మంచి కాంతి గలది భంగర సంపత్తగు అంబుజముతో ఎట్లు సమానమగును ?)

ఇచట రెంటిని గ్రహించుట. అర్థియున్ను. "వదనంతు కథం సమాన శోభం సుదృశో భంగురసంపదాంబుజేన" అనియు, "శాశ్వత సంపదంబుజేన" అనియును చేసినచో రెంటిలో నొక దానిని స్వీకరించకపోవుట అదియును. "సదృశం కథమాననం మృగాక్ష్యాః భవతా హన్త నిశాధినాయకేన" అని చేసిన, రెంటికిని యనుపాదానము. అదియు. పూర్వార్ధమందు మాత్రము నిదర్శనయే.

"కతిపయదివసవిలాసం" మొ. (నిత్య శుభసంబంధముగల మంగళమును గలిగించు గంగానది యొక్క ఒడ్డు నందలి స్థితి, కొన్ని రోజుల విలాసమేయైన స్వర్గవాసమును తక్కువదానినిగ చేయుచున్నది.)

ఇచట సాదృశ్యమాత్రమున శక్తమగు ఇవాదియు, తద్విశిష్టమునందు శక్తమగు సదృశాదియు లేకపోవుటచే శ్రౌతార్థ మార్గముల నుల్లంఘించునట్టి, ఖర్వీకరణముచేత నాక్షిప్తమైనదే యుపమ ఇచటనే 'నిస్సంగైరభిలషితా' అని ఆద్యపాద నిర్మాణమందుగాని, "సంపాతదురంతచింతయాకులితం" అని ద్వితీయ చరణ నిర్మాణమందుగానీ ఒక దానిని ఎత్తుకొనక పోవుట. అదియు-

"సర్వానర్వాచీనాన్నిర్వాస్య మనోరథాననన్యజుషాం" అని పూర్వార్ధమందు దానిని తీసుకొనకపోవుట. అని.

'క్రూరసత్త్వాకులో దోషాకరభూస్తోయధిర్యథా
న తథా త్వం యతో భూప స్థిరధీరసి నిర్మలః.'
అత్రోపమా శ్రౌతీ శ్లేషస్తు స్ఫుట ఏవ.
'రాజన్ ప్రచండమార్తాండమండలోద్దండశాసన
కథమక్రూర సత్త్వస్త్వం పయోధిరివ గీయసే'. ఇతి.

'కథం వార్ధిరివాపి త్వం యతః స విషభాగయమ్' ఇతి వా కృతే ఏకతరానుపాదనమ్.

"క్రూరసత్త్వాకులః" మొ. (ఓ రాజా! క్రూరసత్వముల కనుకూలమైనదియు దోషాకరుని (చంద్రుని) ఉత్పత్తి స్థానమును అగు సముద్రము ఎటులనో అట్లు కావు ఏలనన, స్థిరబుద్ధి గలిగిన నీవు నిర్మలుడవు.)

ఇచట నుపమ ప్రశాలి. శ్లేషైతే స్ఫుటమే.

"రాజన్" మొ. (మిక్కిలి తీక్ష్ణమైన సూర్యమండలమువలె ఉద్దండ మగు శాసనముగలవాడా! ఓ రాజా! అక్రూరసత్త్వుడవగు నీవు సము ద్రమువంటి వాడవని ఏల గానము చేయబడుచున్నావు?)

అనిగాని, "కథం వార్ధిరివాసి త్వం యతః న విషభాగయం" అని గాని చేసినచో నొకదాని ఉపాదానము చేయకపోవుట)

'మహేంద్రతుల్యం కవయో భవంతం
వదంతు కిం తానిహ వారయామః
భవాన్ సహస్రైః సముపాస్యమానః
కథం సమానస్త్రిదశాధిపేన'.

అత్రార్థి. త్రిర్దశ త్రిదశాస్త్రింశత్, తేషామధిపః. "సంఖ్యయావ్యయాసన్నాదూరాధికసంఖ్యాః సంఖ్యేయే" ఇతి బహువ్రీహౌ 'బహువ్రీహౌ సంఖ్యేయే" ఇత డచి చ తత్పురుషః. గతార్థత్వాత్సుచో న ప్రయోగః. త్రయో వా దశ వా ఇతి బహువ్రీహిర్వా. 'భవాన్ సదా రక్షితగోత్రపక్షః సమానకక్షః కథమస్య యుక్తః' ఇతి, 'కథం నిరస్తాఖిలగోత్రపక్షః సమానపక్షస్తవ యుజ్యతే సః' ఇతి వా కృతే ఏకతరానుపాదానమ్.

"మహేంద్రతుల్యం" మొ. (నిన్ను కవులు మహేంద్రునితో సమానుడవని చెప్పుదురు గాక. వారిని నివారించుట ఎట్లు? సహస్రములచే ఉపాస్యుడవగు నీవు త్రిదశాధిపునితో సమానుడ వెట్లగుదువు?)

ఇచట నార్థి. త్రిర్దశ త్రిదశాః – ముప్పది. వారి ప్రభువు. "సంఖ్యయా" – అని బహువ్రీహి, 'బహువ్రీహౌ" అని డచ్ ప్రత్యయము. పిమ్మట తత్పురుషము. వృత్తియందు గతార్థమగుటవలన సుచ్‌కు ప్రయోగము లేదు. త్రయోవా దశవా అని బహువ్రీహి. అయినా చేయవచ్చును.

"భవాన్సదా" మొ. (నీవు ఎల్లప్పుడు రక్షింపబడిన గోత్ర పక్షము గల వాడవు కనుక ఇతనికి సమాన కక్షుడవు ఎట్లగుదువు?) అనిగాని,

"కథం" మొ. (నిరసింపబడిన యావత్తు గోత్ర పక్షములగల యింద్రుడు నీతో సమకక్షుడు ఎట్లగును?)

అని గాని చేసినచో ఏకతరానుపాదానము.

ఇదం తు బోధ్యమ్—ఇహోభయానుపాదానభేదత్రయం దురుపపాదమ్ వైధర్మ్యానుపాదానే హి కిమాశ్రయః శ్లేషః స్యాత్? న చ యత్ర ద్విజ సురాలయ మాతరిశ్వాదిశబ్దవేద్యేషహ్పమానోపమేయేషు స్వశబ్దోపాత్త ఏవ శ్లేషో వ్యతిరేకోత్థాపక స్తత్రై తదుదాహరణం సూపపాదమితి వాచ్యమ్. తత్ర స్వశబ్దవేద్యస్యైవ వైధర్మ్యస్య సంభవాత్. ఇత్థం చ చతుర్వింశతీర్భేదా ఇతి ప్రాచాముక్తిర్విపులోదాహరణాభిజ్ఞైర్యథా కథంచిదుపపాదనీయా. కిం చోపమాప్రభేదాః సర్వ ఏవాత్ర సంభవతీత్యలం చతుర్వింశతిభేదగణనయా.

ఇది మాత్రము తెలియదగినది.

ఇచట నుభయమును ఉపాదానముచేయని భేదత్రయము దురుపపాదము. వైధర్మ్యము నుపాదానము చేయనపుడు శ్లేష దేనినాశ్రయించి యేర్పడును? ఎచట ఉపమానోపమేయములు ద్విజులు, సురాలయము, మాతరిశ్వ మొదలగు శబ్దములచే దెలియదగినవగునపుడు స్వశబ్దోపాత్తమైన శ్లేషమే వ్యతిరేకోత్థాపకమో, అచట ఈ యుదాహరణము సులభముగా నుపపాదించవచ్చునని చెప్పెదరేమో ? అదియును గాదు. అచట స్వశబ్దవేద్యమైన వైధర్మ్యము సంభవము గనుక. కావున నిరువదినాల్గు భేదములు కలవని ప్రాచీనుల వాక్యము విపులమగు నుదాహరణములను తెలసిన వారలచే నెలాగోలాగున సరిపెట్టబడవలెను. మరియు ఉపమా ప్రభేదము లన్నియు ఇచట సంభవించును గాన ఇరువదినాల్గు భేదములు లెక్కించుట గూడ చాలును.

నన్వస్యాలంకారస్య వైధర్మ్యమూలస్యోపమాప్రతికూలత్వమేవోచితమ్, న తూపమాగర్భత్వమ్. తస్యాః సాధర్మ్యమూలకత్వాత్. అస్య చ తన్నిషేధరూపేణైవ ప్రవృత్తేః. న చేష్టాపత్తిః, సిద్ధాన్తభఙ్గప్రసంగాత్. సత్యమ్. యద్గుణపురస్కారేణ యస్య యత్సాదృశ్యనిషేధ ఉత్కర్షపర్యవసాయీ తస్య తద్గుణపురస్కారేణ తత్సాదృశ్యస్యాప్రతిష్ఠానేఽపి గుణాన్తరేణ సాదృశ్యప్రత్యయస్య దుర్వారత్వాత్. యది చ తత్సాదృశ్యసామాన్యనిషేధో వివక్షితః స్యాత్ గుణవిశేషపురస్కారోఽనర్థకః స్యాత్. 'ధనేనాయమస్మాదధిక' ఇత్యుక్తే విద్యయా రూపేణ కులేన చ సమ ఇతి సర్వజనీన

ప్రత్యయాత్. ఏవం చ ప్రతీయమానమపి సాదృశ్యం గుణాన్తర కృతనిషేధోత్థాపితేనోత్కర్షేణ హతప్రభమివ బందీకృతమివ న చమత్కారవిశేషమాధాతుం ప్రభవతీతి ప్రాచామాశయః.

అయితే నీయలంకారమునకు, వైధర్మ్య మూలమునకు, ఉపమాప్రతికూలత్వమే తగినది; అంతే కాని ఉపమాగర్భత్వముదగదు; అది సాధర్మ్య మూలము గనుక. ఇది తన్నిషేధరూపముతోనే ప్రవర్తించును గనుక. ఇష్టాపత్తి యనరాదు. సిద్ధాంతము భంగమగును నిజము; ఏగుణమును పురస్కరించుకొని దేనికి దేనితో సాదృశ్య నిషేధముత్కర్షపర్యవసాయియో దానికి ఆ గుణమును పురస్కరించుకొని ఆ సాదృశ్యము నిలబడకపోయి నప్పటికినీ మరియొక గుణముతో సాదృశ్య ప్రత్యయము, దుర్వారము గనుక. దాని సాదృశ్య సామాన్య నిషేధము వివక్షితమైనచో గుణవిశేషమును పురస్కరించుకొనుట వ్యర్థమగును. 'ధనముచే నితడు అతని కంటె నధికుడు' అని చెప్పగా విద్యతో, రూపముతో, కులముతో, సమానుడు అని సర్వజనీనమగు ప్రత్యయమువలన. ఈ తీరుగా తోచుచున్నను సాదృశ్యము గుణాంతరములచే జేయబడిన నిషేధముచే నుత్థాపితమగు నుత్కర్షచే కొంత ఛాయ తొలగిన దానివలె, బందీకృతమైనదివలె చమత్కారవిశేషమును సమకూర్పజాలదని ప్రాచీనుల యభిప్రాయము.

అత్ర చాలంకారే క్వచిచ్ఛాబ్దసాదృశ్యనిషేధాక్షిప్తావుపమేయోత్కర్షోపమానాపకర్షౌ, క్వచిచ్ఛాబ్దేనోపమేయోత్కర్షేణాక్షిప్తావుపమానాపకర్ష సాదృశ్యాభావౌ, క్వచిత్తాదృశేనోపమానాపకర్షేణాక్షిప్తావుపమేయోత్కర్షతదభావౌ తథా. తత్రాద్యః ప్రాచీనరీత్యా సభేద ఉదాహృతః. ద్వితీయతృతీయావపి ప్రాయశస్తావద్భేదావేవ.

ఇచట నలంకారమునందు ఒకచోట ఉపమేయోత్కర్షోపమానాపకర్షములు శాబ్దమగు సాదృశ్య నిషేధముచే ఆక్షిప్తములు. ఒకచోట శాబ్దమైన ఉపమేయోత్కర్షముచే నుపమానాపకర్ష సాదృశ్యాభావములు ఆక్షిప్తములు. ఒకచోటను అటువంటి ఉపమానాకర్షముచే ఉపమేయోత్కర్షతదభావములు ఆక్షిప్తములు. అచట మొదటిది ప్రాచీనరీతిలో, దానిభేదము

లతో యుదాహరింపబడెను. రెండు మూడులును తరచుగ నన్ని భేదములు గలవి.

తత్ర దిఙ్మాత్రముదాహ్రియతే —

"నిశాకరాదాలి కలంకపంకిలా
ద్గుణాధికం నిర్మలమాననం తే.
అనల్పమాధుర్యకిరోఽధరాదిమా
గిరోఽధరా గుప్తరసాః కవీనామ్".

అత్ర పూర్వార్ధే ఉపమేయోత్కర్షః శాబ్దః. ఉపమానాపకర్ష సాదృశ్యాభావావాక్షిప్తౌ. ద్వితీయార్ధే ఉపమానాపకర్షః శాబ్దః. ఉపమేయోత్కర్ష సాదృశ్యాభావావాక్షిప్తౌ. ఏవం క్వచి ద్ద్వయోస్త్రయాణాం వా శాబ్దత్వం సంభవదపి నాతీవ హృద్యమితి నోదాహృతమ్.

ఇచట దిఙ్మాత్రముగ నుదాహరింతుము.

"నిశాకరాదాలి" మొ. (ఓ సఖీ ! కలంకపంకిలుడగు చంద్రునికంటె నీ నిర్మలమగు మొగము గుణాధికమైనది, అధిక మాధుర్యము వెదజల్లునట్టి అధరముకంటె యీ గుప్తరసములైన కవుల యొక్క యీ మాటలు అధరములు.)

ఇచట పూర్వార్ధమున ఉపమేయోత్కర్షము శాబ్దము. ఉపమానాపకర్షము, సాదృశ్యాభావము నాక్షిప్తములు. ద్వితీయార్ధమందు నుపమానాపకర్షము శాబ్దము, ఉపమేయోత్కర్ష సాదృశ్యాభావము లాక్షిప్తములు. ఈతీరుగా నొకచోట రెంటికి మూడిటికి గాని శాబ్దత్వము సంభవించినను మిక్కిలి హృద్యము గాదని ఉదాహరించము.

క్వచిచ్చ త్రయమప్యాక్షిప్తమేవ. యథా—

"అపారే కిల సంసారే విధినైకోఽర్జునః కృతః
కీర్త్యా నిర్మలయా భూప త్వయా సర్వేఽర్జునాః కృతాః"

"అశీతలోగ్రశ్చండాంశురనుగ్రశిశిరః శశీ
ఉగ్రశీతస్త్వమేకోఽసి రాజన్నోకపప్రసాదయోః".

**యథా వా—**

**"స తు వర్షతి వారి వారిద**
**స్త్వముదారాశయ రత్నవర్షణః**
**స కుహూ రజనీ మలీమస**
**స్త్వమిహాన్తర్బహిరేవ నిర్మలః".**

**అత్రోపమాన తద్విశేషణోపాదానసామర్థ్యాదాక్షిప్త ఏవ వ్యతిరేకః, న తు వ్యఙ్గ్య ఇతి కదాపి భ్రమితవ్యమ్. సత్యనుపపత్తిలేశే వ్యంజనాయా అప్రరోహాత్. ఇహ చ రాజవిశేషణస్య యథా కథంచిత్స్తుత్యర్థత్వేఽప్యుపమానతద్విశేషణోపాదానస్య నృపోత్కర్షమంతరేణానుపపత్తేర్జాగరూకత్వాత్.**

ఒకచోట మూడును ఆక్షిప్తములే. ఎట్లనగా—

"అపారే" మొ. (అపారమగు సంసారమునందు బ్రహ్మచే ఒక అర్జునుడే చేయబడినాడు. ఓ రాజా! నిర్మలమగు కీర్తిచే అందరూ నీచేత అర్జునులుగ చేయబడిరి.)

"అశీతలోగ్రః" మొ. (చండాంశుడు అశీతలుడు, ఉగ్రుడును. చంద్రుడు అనుగ్రుడు, శీతలుడను. నీవొక్కడవే కోపానుగ్రహములయందు ఉగ్ర శీతలుడవు.)

మరొకటి-

"స తు వర్షతి" మొ. (మేఘుడైతే నీరును వర్షించును, ఓ ఉదారాశయా! నీవు రత్నములను వర్షింతువు. అతడు కుహూరాత్రివలె మలినుడు. నీవు బైట లోపల గూడ నిర్మలుడవు.)

ఇచట ఉపమా తద్విశేషణోపాదాన సామర్థ్యముచే వ్యతిరేకము నాక్షిప్తమే; వ్యంగ్యము కాదని ఎన్నడు భ్రమించవద్దు. అనుపపత్తిలేశమున్నచో వ్యంజన యేర్పడదు గనుక. ఇక్కడ రాజ విశేషణము ఎలాగోలాగున స్తుతికైనను, ఉపమానమును, తద్విశేషణము నుపాదాన మొనర్చుట నృపోత్కర్షము లేకుండా కుదరకుండుట జాగరూకము గనుక.

**యత్ర తూపమానతద్విశేషణోపాదానమంతరేణైవోపమేయవిశేషణైః 'సుందరో దేవదత్తః' ఇత్యాదావివ వస్తుస్థితి ప్రకాశ**

న్యేన కృతార్థైరప్యాకూతవిశేషేణ స్వవిలక్షణ విశేషణావిశిష్టధర్మ్యంత రాపేక్షయా వర్ణ్యస్యోత్కర్షః ప్రతీయతే స వ్యంజనావిషయః. యథా—

"న మనాగపి రాహురోషశంకా
న కలంకానుగమో న పాండుభావః.
ఉపచీయత ఏవ కాపి శోభా
పరితో భామిని తే ముఖస్య నిత్యమ్".

అయం వ్యతిరేకధ్వనిరర్థశక్తిమూలః.

ఎక్కడైతే ఉపమానములు తద్విశేషణములు ఉపాదాన మొనర్చుట లేకుండగనే, "సుందరుడు దేవదత్తుడు" అనునటువంటి వానియందువలె, వస్తుస్థితిని ప్రకాశింపజేయుటచేతనే కృతార్థములైన ఉపమేయ విశేషణములచేత ఆకూత విశేషణముచే, స్వవిలక్షణమగు విశేషములతో గూడిన మరియొక ధర్మినపేక్షించి, వర్ణ్యలయొక్క నుత్కర్షము, ప్రతీయమానము అగుచున్నదో నది వ్యంజనకు గోచరమగును ఎట్లనగా—

"నమనాగపి" మొ. (రాహువునకు రోషము గలుగునను శంక లేదు. కలంకమును అనుసరించుట లేదు. తెల్లదనము లేదు. ఓ భామినీ! నీ ముఖమునకు నిత్యమును అంతటనూ ఒక విచిత్రమైన కాంతి పెరుగుచునే యున్నది.)

ఈ వ్యతిరేక ధ్వని యర్థశక్తి మూలమైనది.

యత్త్వలంకారసర్వస్వకార ఉపమానాదుపమేయస్య న్యూనత్వేఽపి వ్యతిరేకమాహ వైలక్షణ్యమాత్రస్య వ్యతిరేకత్వాత్. ఉదాజహార చ—

"క్షీణః క్షీణోఽపి శశీ భూయో భూయోఽపి వర్ధతే సత్యమ్
విరమ ప్రసీద సుందరి యౌవన మనివర్తి యాతం తు".

యచ్చ తద్వ్యాఖ్యాతా విమర్శినీకారః సపూర్వపక్షసిద్ధాంతం వ్యాచఖ్యౌ, తథాహి— "నన్వత్రోపమానాదుపమేయస్య న్యూనత్వం వ్యతిరేక ఇతి న యుక్తమ్. తస్య హి వాస్తవత్వేనాహార్యత్వాత్. యౌవనస్య చాస్థిరత్వే ప్రతిపాద్యే చంద్రాపేక్షయాధికగుణత్వమేవ

వివక్షితమ్—యదేతచ్చన్ద్రివద్ యాతం సన్న పునరాయాతీతి. అసదేతత్. యతోఽత్ర చంద్రవద్గతం సద్యౌవనం యది పునరాగచ్ఛేత్తత్త్రియం ప్రతి చిరమీర్ష్యాద్యనుబంధో యుజ్యతే. ఇదం పునర్యాత యౌవనం యాతం సత్పునర్నాగచ్ఛతీతీర్ష్యాద్యంతరాయపరిహారేణ నిరంతరతయైవ ప్రియేణ సహ జనుః సఫలయితవ్యమ్. ధిగీర్ష్యామ్, త్యజ ప్రియం ప్రతి మన్యుమ్. కురు ప్రసాదమ్. ఇతి ప్రియవయస్యోపదేశే ప్రియం ప్రతి కోపోపశమాయి చంద్రాపేక్షయా యౌవనస్యాపునరాగమనం న్యూనగుణత్వేన వివక్షితమితి న్యూనత్వమపి వ్యతిరేకః. రసపోషకతయా చాస్యాపి హృద్యత్వమ్' ఇతి.

అలంకార సర్వస్వకారుడు ఉపమానముకన్న నుపమేయము తక్కువైనను వ్యతిరేకమని చెప్పెను; వైలక్షణ్యము మాత్రమే వ్యతిరేకమగుట వలన. ఉదహరించెను—

"క్షీణః క్షీణోఽపి" మొ. (బాగా క్షీణపీణుడైనను చంద్రుడు తిరిగి తిరిగి వృద్ధిపొందుచున్నాడు; సత్యము. ఓ సుందరీ ! చాలించుము; ప్రసన్నురాల వగుము; గడచిపోయిన యవ్వనము మాత్రము తిరిగి రానేరదు.)

ఏదైతే - దానిని, వ్యాఖ్యానమునందు విమర్శనీకారుడు పూర్వపక్ష సిద్ధాంతములతో వ్యాఖ్యానమొనర్చెను అలాగే —"ఓయి ? ఇక్కడ ఉపమానముకన్న నుపమేయమునకు తక్కువదనము వ్యతిరేకమనుట యుక్తము గాదు. అది వాస్తవమగుటచేత అహృద్యము గనుక. యౌవనము అస్థిరమగుట ప్రతిపాద్యమగునపుడు చంద్రాపేక్షయా అధికగుణత్వమే వివక్షితము. ఏదైతే చంద్రునివలె పోవునదై మరల తిరిగి రాదో" — అని. ఇది అ యుక్తము. ఎందువలననగా, నిచట చంద్రునివలె పోయినదగుచూ యౌవనము మరల తిరిగివచ్చుచో ప్రియుని గురించి చిరకాలము ఈర్ష్యాదుల యనుబంధము తగును. ఇది మాత్రము, పాడు యౌవనము, పోవుచున్నదై తిరిగి వచ్చుటలేదు. అని ఈర్ష్యాద్యంతరాయములను పరిహరించి నిరంతరముగానే ప్రియునితో గూడ జన్మను సఫలమొనర్పవలెను. ఈర్ష్యను గురించి ఛీ ! ప్రియుని గురించి కోపము వదలివేయుము. అనుగ్రహింపుము. అని ప్రియ వయస్య లుపదేశించి నప్పుడు ప్రియుని గురించి కోపము చల్లారుటకు చంద్రాపేక్షయా యౌవనము తిరిగి రాకుండుట న్యూనగుణముగా వివక్షిత

మని న్యూనత్వమైనను వ్యతిరేకమే రసపోషణముచేత ఇదియును హృద్యతమము గనుక" అని.

**తదుభయమప్యసత్.** అస్మిన్ హి ప్రియహితకారిణ్యా వచనే చంద్రాదప్యధికగుణత్వమేవ వివక్షితమ్, న న్యూనగుణత్వమ్. చంద్రో హి పునః పునరాగమనేన లోకే సులభః. అత ఏవ న తాదృశ మాహాత్మ్యశాలీ. ఇదం చ పునర్యౌవనమపునరాగమనేనాతిదుర్లభతరత్వాదత్యుత్కృష్టమితి మానాదిభిరంతరాయైః శతజనశ్లాఘనీయైర్విదగ్ధయా భవత్యా ముధా గమయితుమసాంప్రతమితి తావదుపాత్తగుణకృతముత్కృష్టత్వం స్ఫుటమేవ. సకలసుఖనిదానత్వాద్యనుపాత్తగుణకృతోఽప్యుత్కర్షోఽత్ర వాక్యార్థపరిపోషాయ సహృదయహృదయసరణిమవతరతి. అన్యథా కిమిత్యస్య కదర్యయౌవనస్య కృతే మయా మానాద్విరంస్యత ఇతి, యాతు నామ యౌవనమితి ప్రతికూలేనార్థేన ప్రకృతార్థస్యాపుష్టతాపత్తేః.

ఆ రెండును మంచివి కావు. ప్రియహితకారి యొక్క ఈ వచనమునందు చంద్రుని కంటెను అధికగుణత్వమే వివక్షితము. న్యూనగుణత్వము వివక్షితముగాదు. చంద్రుడు మాటి మాటికి వచ్చుటచేత లోకమున సులభుడు. ఇందువలననే అటువంటి మాహాత్మ్యము కలవాడు కాదు. ఈ యౌవనమైతే తిరిగి రాకపోవుటచేత మిక్కిలి దుర్లభతరమగుటవలన మిక్కిలి గొప్పదని, అభిమానము మొదలగు విఘ్నములచేత, శతజన శ్లాఘ్యముల చేత, నిపుణురాలగు నీవు ముగ్ధవై వృథా గడపుట తగదని ఉపాత్తగుణములచే చేయదగిన ఉత్కృష్టత్వము స్ఫుటమే. అన్ని సుఖములకు నిదానమగుట మొదలగు ననుపాత్త గుణములచే కృతమైన ఉత్కర్ష కూడ ఇచట వాక్యార్థ పరిపోషణమునకై సహృదయ హృదయ మార్గమును ప్రవేశించుచున్నది. అట్లు గాని యెడల — ఈ కుత్సితమగు యౌవనము కొఱకు నా యభిమానమును ఎందుకు చాలించుకొందును. యౌవనము పోనీయండి; అని ప్రతికూలమగు నర్థముతో ప్రకృతార్థమునకు నపుష్టత గలుగవలసివచ్చును.

**కిం చ యత్ర క్వాపి శాబ్ద ఉపమేయస్యాపకర్షస్తత్రాపి స తస్య వాక్యార్థపర్యవసాయితయోత్కర్షాత్మనా పరిణమతి యథా—**

"ద్రోహో నిరాగసాం లోకే హీనో హాలాహలాదపి
అయం హంతి కులం సాగ్రం భోక్తారం కేవలం తు సః."

అత్ర హీన ఇత్యపకర్షో దారుణతాధిక్యరూపోత్కర్షాత్మనా పరిణమతి. ఏవమ్—

"ఇన్దుస్తు పరమోత్కృష్టో యః క్షీణో వర్ధతే ముహుః
ధిగిదం యౌవనం తన్వి క్షీణం న పునరేతి యత్."

ఇత్యాదావుపాత్తస్యాపునరావర్తిత్వస్య తద్ధర్మస్య మానప్రతికూలతయా ద్వేషేణైవ ధిక్కారాదికథనమ్, న తు వాస్తవాపకర్షేణ, దుర్లభత్వస్య ప్రియసమాగమోల్లాసకత్వస్య చోత్కర్షస్య స్ఫుటత్వాత్.

మరియు ఎక్కడ, కొన్నిస్థలములలో శాబ్దమగు నుపమేయాపకర్షమోనచటనైనను నది వాక్యార్థమున పర్యసించును గనుక దాని ఉత్కర్షరూపముగానే పరిణమించును.

ఎట్లనగా-

"ద్రోహోనిరాగసాం" మొ. (నిరపరాధులకు ద్రోహము చేయుట లోకమున హాలాహలము కంటె హీనమైనది. ఇది కులమును సాగ్రముగా నాశనము చేయును; అది తినెడువాని నొక్కనినే నాశనము చేయును )

ఇచట "హీనః" యను నపకర్షము దారుణత్వాధిక్యరూపమగు నుత్కర్షగా పరిణమించును.

ఇలాగే "ఇందుస్తు" మొ. (చంద్రుడైతే పరమోత్కృష్టుడు, ఎవడు క్షీణుడైననూ మళ్ళీ పెరుగుచున్నాడో. ఓతన్వీ! ఈ యౌవనము నింద్యమైనది; ఏది క్షీణమై తిరిగిరాదో.)

ఇత్యాదులయం దుపాత్తమైనటువంటి యపునరావర్తిత్వమునకు, దాని ధర్మమునకు, మానప్రతికూలతచేత ద్వేషముచేతనే ధిక్కారాదులు చెప్పుట; అంతేకాని వాస్తవపు యపకర్షచేతకాదు. దుర్లభత్వము, ప్రియసమాగమోల్లాసకత్వము అను ఉత్కర్షము స్ఫుటము గనుక.

యదపి కువలయానందకృతాలంకారసర్వస్వోక్తార్థానువాదకేన న్యూనతాయాముదాహృతమ్—

"రక్తస్త్వం నవపల్లవై రహమపి శ్లాఘ్యైః ప్రియాయా గుణై
స్త్వామాయాన్తి శిలీముఖాః స్మరధనుర్ముక్తాః సఖే మామపి.
కాంతాపాదతలాహతి స్తవ ముదే తద్వన్మమాప్యావయోః
సర్వం తుల్యమశోక కేవలమహం ధాత్రా సశోకః కృతః."

అత్ర "సశోకత్వేనాశోకాపేక్షయాపకర్షః పర్యవస్యతి" ఇతి, తదపి చిన్త్యమ్; రత్యాద్యనుకూలతయా కుతశ్చిదంగాద్ భూషణాపసారణం యథా శోభావిశేషాయ భవతి, ఏవం ప్రకృతే ఉపమాలంకారదూరీకరణమాత్రమేవ రసానుగుణతయా రమణీయమ్, న వ్యతిరేకః. అత ఏవాసమాలంకారం ప్రాంచో న మన్యంతే. అన్యథా తవాలంకారాంతరతయా తత్స్వీకారాపత్తేః

యథా—

"భువనత్రితయేపి మానవైః పరిపూర్ణే విబుధైశ్చ దానవైః
న భవిష్యతి నాస్తి నాభవన్నృప యస్తే భజతే తులాపదమ్."

అత ఏవ ధ్వనికృతా సహృదయధురంధరేణ 'సుకవిస్తు రసానుసారేణ క్వచిదలంకారసంయోగం క్వచిదలంకారవియోగం చ కుర్యాత్' ఇత్యుక్త్వా 'రక్తస్త్వమ్'— ఇతి పద్యమ్ సాదృశ్యదూరీకరణే ఉదాజహ్రే. అత ఏవ చ మమ్మటభట్టైః 'ఆధిక్యమాత్రం వ్యతిరేకః' ఇత్యుక్తమ్. నిరస్తం చ న్యూనత్వం వ్యతిరేక ఇతి. తస్మాదుపమానాదుపమేయస్యోత్కర్ష ఏవ వ్యతిరేకాలంకారః, నాపకర్ష ఇతి స్థితమ్.

యది తు న్యూనత్వమపి వ్యతిరేక ఇత్యాగ్రహస్తదేదముదాహార్యమ్—

"జగత్త్రయత్రాణధృతవ్రతస్య క్షమాతలం కేవలమేవ రక్షన్.
కథం సమారోహసి హన్త రాజన్ సహస్రనేత్రస్య తులాం
ద్వినేత్రః."

అత్ర ధర్మద్వయేనైవ న్యూనోఽపి,ధర్మాంతరేణ తు సమ ఇతి ప్రతీతికృత విచ్ఛిత్తి విశేషాదలంకారతా. ఏవం చ లక్షణేఽపకర్షోఽప్యేవం జాతీయో దేయః.

కువలయానందకారులు అలంకార సర్వస్వకారులు చెప్పిన యర్థము ననువదించువాడగుచేత న్యూనతయం దుదాహరించెను.

"రక్తస్త్వం" మొ. (నీవు నవపల్లవములచే రక్తుడవు; నేనును శ్లాఘ్యమగు ప్రియాగుణములచేత. నిన్ను శిలీముఖములు చేరుచున్నవి; స్మర ధనుర్ముక్తము లైనవి నన్నును. కాన్తాపాద ప్రహారము నీకు ఆనందకరము; నాకును అంతే ఓ మిత్రమా ! అశోకమా ! మన ఇరువురకును అన్నియు సమానమే; కాని బ్రహ్మచే నాకు సశోకత్వము చేయబడినది )

"ఇచట సశోకత్వముచే నశోకాపేక్షవలన నపకర్షము పర్యవసించును" అని. అదియు చింత్యము. రత్యాదులకు ననుకూలముగ యెదేనొక యవయవము నుండి నగలు దొలగించుట యెట్లు శోభావిశేషమున కగునో, ఈ తీరుగా ప్రకృతమున ఉపమాలంకారమును దూరముచేయుట మాత్రమే రసానుగుణముగ నందమైనది వ్యతిరేకము గాదు. ఇందువలననే నసమాలంకారమును, ప్రాచీనులు తలచలేదు. లేకపోయిన యెడల, నలంకారాంతరముగా దానిని నీవు స్వీకరింపవలసి వచ్చును ఎట్లనగా-

"భువన త్రితయేఽపి" మొ. (మూడు లోకము లందును మానవుని చేతను దేవతల చేతను దానవుల చేతను పరిపూర్ణము కాగా ఓ రాజా ! ఎవరు నీకు సామ్యమునకు స్థానమో అట్టివాడు కలుగబోడు, యిప్పుడులేడు, పూర్వము లేడు )

ఇందువలననే సహృదయధురంధురలగు ధ్వనికారులచేత "సుకవి యైతే రసము ననుసరించి యొకచోట నలంకారమును గూర్చును; ఒకచోట అలంకారమును వ్యవధానము జేయును" అని జెప్పి, "రక్తస్త్వం" అను పద్యము సాదృశ్య దూరీకరణమునం దుదాహరింపబడినది. ఇందువలననే-మమ్మటభట్టు "ఆధిక్య మాత్రం వ్యతిరేకః" అని చెప్పెను. వ్యతిరేకము నందు న్యూనత్వమును నిరసించెను అందువలన ఉపమానముకన్న నుపమేయము యొక్క నుత్కర్షయే వ్యతిరేకాలంకారము, అపకర్ష కాదని నిలచినది

అయితే-న్యూనత్వము గూడ వ్యతిరేకమును పట్టుదలయైతే నిట్లుదాహరించవలె.

"జగత్త్రయత్రాణ" మొ. (మూడు లోకములను రక్షించుటయందు

కంకణము గట్టుకొన్న సహస్రనేత్రునకు భూమినే ఒక్కదానినే రక్షించుచూ రెండు కన్నుల కలవాడవు నీవు ఎట్లు సామ్యమును బొందెదవు?)

ఇచట ధర్మద్వయముచేతనే తక్కువైతివి; ధర్మాన్తరముచేతనైతే సమానుడవు; అని ప్రతీతివలన యేర్పడిన విచ్ఛిత్తి విశేషమువల్ల నలంకారత. ఈతీరుగా లక్షణమునందు నపకర్షయైనను ఈ జాతిలోనిదే యివ్వవలెను.

యదపి కువలయానందకృతానుభయపర్యవసాయినో వ్యతిరేకస్యోదాహరణముక్తమ్-

"దృఢతరనిబద్ధముష్టేః కోశనిషణ్ణస్య సహజమలినస్య
కృపణస్య కృపాణస్య చ కేవలమాకారతో భేదః"

తన్న నిపుణం నిరీక్షితమాయుష్మతా. తథాహి — కిమత్రోపమానాదుత్కర్షరూపో వ్యతిరేకోఽనుభయపర్యవసాయీ, ఆహోస్విత్సర్వస్వకారాద్యుక్తదిశాపకర్షరూపః. నాద్యః. ఉత్కర్షప్రయోజకధర్మస్యాత్రానుపస్థితేః. న చ శ్లేషేణ దీర్ఘాక్షరస్యోపస్థితిరస్త్యేవేతివాచ్యమ్. తస్యోపమానవృత్తిత్వేనోపమేయానుత్కర్షకత్వాత్. అర్థాంతరేఽప్యాకృతిరూపేణ సహ శ్లేషమూలకాభేదాధ్యవసాయేన సాధారణీకరణాచ్చ. అన్యథా శ్లేషమూలకోపమోచ్ఛేదాపత్తేః 'చంద్రబింబమివ నగరం సకలకలమ్' ఇత్యాదావపి కలకలసహితత్వ కలాసాకల్యయోర్వస్తుతో వైధర్మ్యరూపత్వాత్. న చ సకలకలమిత్యత్రోపమాయామేవ కవేర్నిర్భరః, ప్రకృతే తు భేదశబ్దోక్త్యా వైలక్షణ్యే స ఇతి భ్రమితవ్యమ్. యద్యత్రోపమాదిఘటనరూపో వ్యతిరేకో నిర్భరసహః స్యాత్ ఆకారశబ్దశ్లేషోఽనపేక్షః స్యాత్, కృపణస్య కృపాణస్య భేదో దీర్ఘాక్షరాదేవేత్యేవ బ్రూయాత్ న హ్యత్ర వ్యతిరేకే శ్లేషోఽనుకూలః ప్రత్యుత ప్రతికూల ఏవ. ఉపమాయాం. పునరనుకూలః ప్రతికూలస్య దీర్ఘాక్షరరూపవైధర్మ్యస్య సాధారణీకరణాత్. ఆకృతిభేదస్యచోపమానోపమేయయోరపిసత్త్వాత్. ఏవం హి కవేరాశయః — యత్కృపణకృపాణయోస్తుల్యతైవ. దృఢతరేత్యాది విశేషణసామ్యాత్. అక్షరభేదస్త్వాకారభేదత్వాదవిరుద్ధ ఏవేతి సహృదయైరాకలనీయమ్.

న ద్వితీయః. తస్యోక్తిమాత్రేణాప్యసంగతేః, అహృద్యత్వాచ్చ. తస్మాదత్ర గమ్యౌపమ్యైవ సుప్రతిష్ఠితేత్యాస్తాం కూటకార్షాపణోద్ఘాటనమ్. ప్రకృతమనుసరామః.

మరియు కువలయానందకారులచే ననుభయపర్యవసాయియగు వ్యతిరేకమునకు నుదాహరణ మివ్వబడినది—

"దృఢతర" మొ. (దృఢముగా రచింపబడిన ముష్టికల్గినట్టియు, కోశమునందున్నట్టియు, సహజముగా మాలిన్యముగల కృపణునకును కృపాణమునకను ఆకారము మాత్రముననే భేదము.)

అది నిపుణముగ నాయుష్మంతునిచే నిరీక్షింపబడలేదు. అట్లాగే కదా ? ఇక్కడ ఉపమానముకంటే ఉత్కర్ష రూపమగు వ్యతిరేకము అనుభవ పర్యవసాయియా, లేక సర్వస్వకారులు చెప్పిన రీతిగా నపకర్ష రూపమా ? మొదటిది గాదు; ఉత్కర్ష ప్రయోజకమగు ధర్మము ఇక్కడ నుపస్థితము కాలేదు గనుక. శ్లేషచేత దీర్ఘాక్షరము యొక్క నుపస్థితి యున్నదే—యనరాదు. అది ఉపమానమునందు ఉన్నది గనుక ఉపమేయమునకు నుత్కర్షకము గాదు. ఆకృతి రూపమగు నర్థాంతరముతో గూడ శ్లేష మూలకమగు నభేదాధ్యవసాయముచే సాధారణముగా జేయబడినది గనుక నున్ను. అట్లు కానిచో శ్లేషమూలకమగు ఉపమయే ఉచ్ఛిన్నము గావలసి వచ్చును.

"చంద్రబింబమువలె పట్టణము సకలకలము" ఇత్యాదులందును కల కల సహితత్వము కలాసమగ్రత్వమును వాస్తవమున వైధర్మ్య రూపములు గనుక. అయితే – 'సకలకలము' అనేచోట నుపమయందే కవికి నిర్భరము గలదు; ప్రకృతమునందన్నచో, భేదశబ్దము చెప్పుటచే వైలక్షణ్యమునందు నిర్భరమని భ్రాంతిపడవలదు. ఇచట నుపమావిఘటన రూపమగు వ్యతిరేకము నిర్భరమును సహించునదైతే ఆకారశబ్దశ్లేష అనర్థకము. కృపణునకు కృపాణమునకు భేదము దీర్ఘాక్షరమువలననే అనియే చెప్పియుండును. ఇచట వ్యతిరేక శ్లేష అనుకూలము గాదు. దానికెదురుగా ప్రతికూలమే. ఉపమ యందైతే అనుకూలము. ప్రతికూలమగు దీర్ఘాక్షర రూప వైధర్మ్యమునకు సాధారణీకరణమువలన; ఆకృతిభేదము ఉపమానోపమేయములకు నుండుట వలన. ఈలాగే కదా కవి యభిప్రాయము – కృపణ కృపాణములకు సమానతయె. 'దృఢతర' మొదలైన విశేషణములు సమానమగుటవలన. అక్షర

భేదమైతే నాకారభేదము గనుక అవిరుద్ధమేనని సహృదయులు గ్రహించవలెను.

రెండవది గాదు. అది మాటమాత్రముతోనైనను సంగతము గాదు గనుక; హృద్యము గూడ కాకపోవుటవలన. అందువలన అక్కడ గమ్యోపమయే సుప్రతిష్ఠితమైనదని కూటకార్షాపణోద్ఘాటనముచాలును. ప్రకృతము ననుసరింతము.

**అలంకారాంతరోత్థాపితాఽప్యయం సంభవతి. యథా—**
**'ఈశ్వరేణ సమో బ్రహ్మా పితా సాక్షాన్మహేశ్వరః**
**పార్వత్యా సదృశీ లక్ష్మీర్మాతా మాతుః సమా భువి.**
**పితాస్య కాష్ఠసదృశః స్వయం పాతకసంనిభః'**

**అత్ర రూపకానన్వయోపమా ఉపమేయోత్కర్షస్యోపమా ఏవోపమానాపకర్షస్య చ హేతవః.**

అలంకారాన్తరముచే నుత్థాపన జేయబడినదిగాను ఇది యగును. ఎట్లనగా—

"ఈశ్వరేణ" మొ. (ఈశ్వరునితో సమానుడు బ్రహ్మ. తండ్రి సాక్షాత్తు మహేశ్వరుడు. పార్వతితో సమానురాలు లక్ష్మీదేవి. తల్లితో సమానమైనది తల్లి. వీని తండ్రి కాష్ఠముతో సమానుడు. తాను స్వయముగా పాపకునితో సమానుడు.)

ఇచట, రూపక - అనన్వయ - ఉపమలు ఉపమేయోత్కర్షమునకును, ఉపమలే ఉపమానాపకర్షమునకును హేతువులు.

అస్య చాలంకారస్య సాదృశ్యగర్భత్వాత్ సాదృశ్యస్య చ త్రివిధ ధర్మోత్థాపితత్వాత్ అత్రాపి తత్ప్రకారానుగమో బోధ్యః. తత్రానుగామిని ధర్మే యథా—

'అరుణమపి విద్రుమద్రుమం మృదులతరం చాపి కిసలయం బాలే
అధరీకరోతి నితరాం తవాధరో మధురిమాతిశయాత్'.

అత్రారుణ్యమ్రదిమానావనుగామినౌ. బింబప్రతిబింబ భావాపన్నే యథా—

'జలజం లలితవికాసం సుందరహాసం తవాననం హసతి'.

అత్ర హాసవికాసయోర్బింబప్రతిబింబభావః, లాలిత్య సౌంద ర్యయోః శుద్ధ సామాన్యతా. శ్లేషోపాత్తం జడజత్వం స్వాశ్రయాప కర్ష హేతుః. ఏవం సాదృశ్య నిషేధాలీఢ వ్యతిరేకో నిరూపితః. అభేద నిషేధాలీఢోఽప్యేష సంభవతియథా,—

'నిష్కలంక నిరాతంక చతుః షష్టికరధరా
సదాపూర్ణ మహీప త్వం చంద్రోసీతి మృషాఽ వచః'

ఇతి రసగంగాధరే వ్యతిరేక ప్రకరణమ్.

ఈ యలంకారము సాదృశ్యగర్భము గనుక, సాదృశ్యమున్ను త్రివిధ ధర్మములచే నుత్థాపితము గనుక నిచటను తత్ప్రకారముల అను గమము తెలియవలెను.

అచట ధర్మ మనుగామి యగునపుడు ఎట్లనగా—

"అరుణమపి" మొ. (అరుణముగా నున్న పగడపు చెట్టును, మృదుల తరమైన చిగురుటాకును, ఓ బాలా! నీ యొక్క అధరము, మాధుర్యాతి శయమువలన మిక్కిలి తక్కువగా జేయుచున్నది.)

ఇచట ఆరుణ్య మ్రదిమ లనుగామి ధర్మములు బింబప్రతిబింబభావము పొందినపు డెట్లనగా—

"జలజం" మొ. (లలితమైన వికాసముగలట్టి జలజమును సుందర హాసముగల నీ వదనము నవ్వుచున్నది.)

ఇచట హాస వికాసములకు బింబ ప్రతిబింబ భావము. లాలిత్య సౌంద ర్యములకు శుద్ధ సామాన్యత. శ్లేషోపాత్తమగు జడత్వము స్వాశ్రయాపకర్ష హేతువు.

ఈతీరుగా సాదృశ్య నిషేధముచే నాక్రాంతమైన వ్యతిరేకము నిరూ పిత మైనది.

అభేదావలీఢమైనది కూడా ఇది సంభవించును ఎట్లనగా—

"నిష్కలంక" మొ. (నిష్కళంకుడా! నిరాతంకా! అరువదినాలుగు కళలు ధరించినవాడా! ఎప్పుడు సంపూర్ణముగా నుండువాడా! ఓ రాజా! నీవు చంద్రుడవైతి వనుమాట అబద్ధము.)

ఇది వ్యతిరేకప్రకరణము

## సహోక్తిః

అథ సహోక్తిః—గుణప్రధానభావావచ్ఛిన్నసహార్థసంబంధః సహోక్తిః. హృద్యత్వం చాలంకారసామాన్య లక్షణగతం సకలాలంకారసాధారణమేవేత్యసకృదుక్తమ్. తచ్చాత్ర కార్య కారణ పౌర్వాపర్యవిపర్యయాత్మికయా శ్లేషభిత్తికాభేదాధ్యవసానాత్మికయా కేవలాభేదాధ్యవసానాత్మికయా చాతిశయోక్త్యాను ప్రాణనే భవతీతి వదన్తి.

"అనుకూలభావమథవా పరాఙ్ముఖత్వం సహైవ నరలోకే
అన్యోన్య విహితమంత్రౌ విధి దిల్లీవల్లభౌ వహాతః"

ఇత్యాదావతిప్రసంగవారణాయావచ్ఛిన్నాన్తమ్.

అనంతరము సహోక్తి.

గుణప్రధాన భావముతో గూడిన పదార్థముల సహార్థాత్మక సంబంధము సహోక్తి. హృద్యత్వము, అలంకార సామాన్య లక్షణ గతము సమస్తాలంకారములకు సాధారణమేనని అనేక పర్యాయములు చెప్పినాము. అది ఇక్కడ కార్యకారణములవలె వెనుక ముందుల వ్యత్యాస రూపమగునట్టియు, శ్లేషభిత్తికాభేదాధ్యవసానాత్మకమైనట్టియు, కేవలాభేదాధ్యవసానాత్మికయు నగు అతిశయోక్తి చేతను ప్రతికించుటయం దగునని చెప్పుచున్నారు.

"అనుకూల" మొ. (నరలోకమునందుకూడా అనుకూలభావమును పరాఙ్ముఖత్వమును, పరస్పరము కార్యాలోచనము కల దైవము ఢిల్లీవల్లభుడు ఇద్దరునూ వహించుచున్నారు)

ఇత్యాదుల నతిప్రసంగము వారించుటకై నవచ్ఛిన్నాంతము.

**ఉదాహరణమ్**—

"క్షైర్వధూనామథ సర్వకోషైః
ప్రాణైశ్చ సాకం ప్రతిభూపతీనామ్
త్వయా రణే నిష్కరుణేన రాజం
శ్చాపస్య జీవా చకృషే జవేన."

అత్ర చాపాకర్షణకార్యాణాం కేశాకర్షణాదీనాం పౌర్వాపర్యవిపర్యయేణానుప్రాణితః సహభావః. నిష్కరుణత్వేన చ పౌర్వాపర్య విపర్యయః. యథా వా—

"భాగ్యేన సహ రిపూణాము త్తిష్ఠసి విష్టరాత్క్రుధావిష్టః
సహసైవ పతసి తేషు క్షితిశాసన మృత్యునా సాకమ్."

పూర్వం తు కర్మణః సహోక్తిః, ఇహ కర్తురితి భేదః.

ఉదాహరణము.

"కేశైర్వధూనామ్" మొ. (స్త్రీల యొక్క వెంట్రుకలతోను, తరువాత సమస్త ధనములతోను, శత్రురాజుల యొక్క ప్రాణములతోను గూడా, రాజా! నిష్కరుణుడవగు నీచే వింటినారి వేగముగా లాగబడెను)

ఇచట చాపాకర్షణ కార్యములగు కేశకర్షణాదులకు వెనుక ముందల వ్యత్యాసముచేత ననుప్రాణితమైనది సహభావము. నిష్కరుణత్వముచే వెనుక ముందుల వ్యత్యాసము.

ఇంకొకటి.

"భాగ్యేన" మొ. (శత్రువుల యొక్క భాగ్యముతో గూడ పీఠము నుండి కోపావిష్టుడవై లేచుచున్నావు. భూపతీ! మృత్యువుతోగూడా వాళ్ళ యందు వెంటనే పడుచున్నావు.)

ఇదివరలో కర్మకు సహోక్తి, ఇక్కడ కర్తకని భేదము.

"త్వయి కుపితే రిపుమండలఖండనపాండిత్యసంపదుద్దండే
గిరిగహనేఽరివధూనాం దివసైః సహ లోచనాని వర్షంతి."

అత్ర వర్షణ వర్షవదాచరణయోః శ్లేషేణాభేదాధ్యవసితిః. యథా వా—

"బహు మన్యామహే రాజన్న వయం భవతః కృతిమ్
విపద్భిః సహ దీయంతే సంపదో భవతా యతః"

పూర్వాః కర్తృసహోక్తిః, ఇయం తు కర్మసహోక్తిర్వ్యాజస్తుతిసంవలితా.

"పద్మస్యైతైర్దృఢైర్ణాం నేత్రైః సహ లోకత్రయశ్రియా
ఉన్మీలన్తో నిమీలన్తో జయన్తి సవితుః కరాః."

అత్రోన్మీలన నిమీలనయోః పద్మపత్త్రాద్యాశ్రయభేదేన భిన్నయోరపి ప్రకటత్వాప్రకటత్వాద్యేకోపాధ్యవచ్ఛిన్నతయా భిన్నీకృతయోరుపాదానమిత్యస్త్యేక క్రియాసంబంధః. అత ఏవ న శ్లేషః. తస్య ప్రతిపాద్యతావచ్ఛేదకభేద ఏవ స్వీకారాత్. ఏషూదాహరణేషు సహయోగతృతీయాప్రయుక్తో గుణప్రధానభావః. ప్రాధాన్యేన క్రియాన్వయే తు యథాయథం తుల్యయోగితా దీపకం వా భవతి.

"త్వయి" మొ (శత్రు మండలమును ఖండించు పాండిత్యము నందు ఉద్దండుడవగు నీవు కోపించగా కొండ అడవుల యందు శత్రు స్త్రీల లోచనములు రోజులతో కూడా వర్షించు చున్నవి (వర్షము అగుచున్నవి.)

ఇక్కడ వర్షించుటకును, వర్షమువలె నాచరించుటకు నభేదాధ్యవసితము.

మరియు నెట్లనగా-

"బహుమన్యామహే" మొ. (ఓ రాజా ! నీ యొక్క పనిని మేము గౌరవించము; ఎందువలననగా-నీచేత సంపదలు ఆపదలతో గూడా యివ్వబడుచున్నవి (ఖండింపబడుచున్నవి).

వెనుకటిది కర్తృ సహోక్తి. ఇది వ్యాజస్తుతితో గలిసిన కర్మసహోక్తి.

"పద్మపత్త్రైః" మొ. (తామర రేకులతోను, మనుష్యుల కనులతోను మూడు లోకము లందలి సంపదతో గూడాను, సూర్యుని కిరణములు ఉన్మీలననిమీలనములు కలవై జయించుచున్నవి )

ఇక్కడ ఉన్మీలన నిమీలనములకు, పద్మపత్రములు మొదలగు నాశ్రయముల యొక్క భేదముచే భిన్నములైనను ప్రకటత్వము అప్రకటత్వము మొదలగు నొక యుపాధిచే అవచ్ఛిన్నమగుటచే అభిన్నములుగా జేయబడినట్టి వానికి, ఉపాదానమని దీనికి ఒక క్రియతో సంబంధమున్నది ఇందువలననే శ్లేషగాదు. దానిని ప్రతిపాద్యతా నిర్ణాయక భేదమందే స్వీకరించుటవలన. ఈ యుదాహరణము లందు సహయోగత్వమువలన యేర్పడిన, గుణప్రధానభావము. ప్రధానముగా క్రియ నన్వయించినప్పుడు యథాయథముగా తుల్యయోగిత కాని దీపకము గాని కాగలదు.

సహాదిశబ్దప్రయోగాభావేఽప్యేషా సంభవతి. 'వృద్ధో యూనా-' ఇతి నిర్దేశేన తృతీయాయాః సామ్రాజ్యాత్. పరన్త్వివాదిశబ్దరహితోత్ప్రేక్షాదివద్గమ్యా.

అప్రధానభావస్తు శాబ్ద ఏవ.

సహాదిశబ్ద ప్రయోగము లేనప్పటికిని ఇది సంభవించును.

"వృద్ధో యూనా" అని సూత్రనిర్దేశముచే తృతీయకు నచటను ప్రసక్తియే ఇక నేమనగా-ఇవాదిశబ్దములులేనట్టి ఉత్ప్రేక్షాదులవలె గమ్యమగును. అప్రధానభావము శాబ్దమే.

నను కథమప్రధానభావః శాబ్ద ఇత్యుచ్యతే? యావతా ఆర్థః క్రియాద్యన్వయిత్వరూపః స స్యాత్ పదార్థాన్తరరూపో వా. ఉభయథాప్యస్య వాచకశబ్దాభావాదశాబ్దత్వమేవేతి చేత్ న. అస్తి తావత్ సఖండమఖండం వా ప్రధానత్వమ్, యద్వశాత్ అయమస్మిన్నగరే ప్రధానం ముఖ్య ఇత్యాదయో వ్యవహారా ఆపామరముల్లసన్తి. తదభావరూపే చాప్రధానత్వే 'సహయుక్తేఽప్రధానే' ఇతి శాస్త్రేణ తృతీయాయాః శక్తేర్బోధనాత్తస్య కథమశాబ్దత్వమ్? న చ సహార్థేన యుక్తే వస్తుతోఽప్రధానే తృతీయేతి తస్యార్థః, న త్వప్రధానేఽర్థే వాచ్యే ఇతి; తథా చ నోక్తార్థసిద్ధిరితి వాచ్యమ్. ఏవం చాప్రధాన గ్రహణవైయర్థ్యాపత్తేః. "పుత్రేణ సహాగతః పితా" ఇత్యాదౌ పిత్రాదిభ్యోఽన్తరంగత్వాత్ప్రథమోత్పత్తేస్తేవౌచిత్యాత్. 'పుత్రేణ సహ పితురాగమనమ్' ఇత్యాదౌ కారకవిభక్తేః ప్రాబల్యాచ్చ. అన్యథా 'షష్ఠీ శేషే' ఇత్యత్రాపి విశేషణగ్రహణాపత్తేః. తస్మాద్యథా 'హేతౌ తృతీయా' ఇత్యాది శాస్త్రం హేతుశక్తిగ్రాహకమేవం 'సహయుక్తేఽప్రధానే' ఇత్యప్రధానశక్తిగ్రాహకమ్. యథైవ తత్ర ప్రకృత్యర్థస్యాభేదేన విభక్త్యర్థేఽన్వయస్తథేహాపి శక్యో వక్తుమ్. ధర్మిశక్తావపి కర్మత్వాదీనామివాప్రాధాన్యస్యాపి శాబ్దత్వమవ్యాహతమేవ. షష్ఠీస్థలే తు విశేషణశబ్దాభావాన్నైవమితి స్ఫుటమేవ వైలక్షణ్యమ్. ఏతేన 'అప్రధానగ్రహణం శక్యమకర్తుమ్' ఇతి వదన్తో మనోరమాకారాః పరాస్తాః. ఉక్తప్రకారేణ సార్థక్యసిద్ధౌ మునివచనస్య వైయర్థ్యకల్పనాయా అన్యాయ్యత్వాత్.

అయితే-ఎట్లు అప్రధాన భావము శాబ్దమని చెప్పుచున్నారు? అది ఆర్థమగు క్రియాదులతో నన్వయించుట, అను రూపము గలది గాని లేదా పదార్థాన్తర రూపము గాని అగును. ఈ రెండు విధములైనను దీనికి వాచకశబ్దము లేకపోవుట వలన అశాబ్దత్వమె కదా-అని అన్నచో నది సరి కాదు. సఖండము లేక అఖండము అగు ప్రధానత్వ ముండితీరినది. దానివలననే "ఇది ఈ పట్టణమున ప్రధానము, ముఖ్యము" ఇత్యాదులగు వ్యవహారములు పామరుల నుండియు నుల్లసించుచున్నవి. తదభావరూపమగు నప్రధానత్వము నందు "సహాయుక్తేఽప్రధానే" అనే శాస్త్రమున తృతీయకు శక్తిని బోధించుట వలన దానికి అశాబ్దత్వము ఎట్లు ? సహార్థముతో యుక్తమైనది, వస్తుతః అప్రధానమైనప్పుడు తృతీయ అని దానియొక్క అర్థము; అప్రధానమగు నర్థము వాచ్యమైనపుడని కాదు. కాగా-ఉక్తార్థము యొక్క సిద్ధి లేదని చెప్పుట సరికాదు.

అట్లయితే అప్రధాన గ్రహణమునకు వైయర్థ్యము వచ్చును. "పుత్రేణ సహాగతః పితా" ఇత్యాదుల యందు పిత్రాదులకంటె నంతరంగము గనుక ప్రథమోత్పత్తియే యుచితము. "పుత్రేణ సహ పితురాగమనం" ఇత్యాదులందు కారక విభక్తికి ప్రాబల్యమువలననున్ను; అలాకాకపోయిన యెడల 'షష్ఠీ శేషే' అనేచోట కూడా విశేషణ గ్రహణము ప్రసక్తించును అందువలన ఎట్లు "హేతౌతృతీయా" అనే శాస్త్రము హేతువునందు శక్తిని గ్రహింపజేయునదియో ఈతీరుగా "సహాయుక్తేఽప్రధానే" అనునది గూడా అప్రధాన శక్తి గ్రాహకము. ఎట్లైతే నచట ప్రకృత్యర్థమున కభేదముతో విభక్త్యర్థమందన్వయమో అలాగే ఇక్కడను చెప్పుటకు వీలగును. ధర్మిశక్తియందైనను కర్మత్వాదులకువలె అప్రాధాన్యమునకును గూడా శాబ్దత్వము అవ్యాహతమే. షష్ఠీ స్థలమునందైతే విశేషణశబ్దము లేదు కనుక ఇలాగాదని వైలక్షణ్యము స్ఫుటమే. దీనిచేత "అప్రధాన గ్రహణము శక్యము జేయకుండుటకు" అని చెప్పుచున్న మనోరమాకారులు పరాస్తులైరి. చెప్పిన తీరుగా సార్థక్యము సిద్ధించుచుండగా ముని వచనమునకు వైయర్థ్య కల్పనము అన్యాయమగుటవలన.

న చ 'పుత్రేణ సహాగతః పితా' ఇత్యాదౌ పుత్రాభిన్నాప్రధానసహిత ఇతి బోధస్యాప్రామాణికత్వాన్నోక్తార్థ సిద్ధిరితివాచ్యమ్.

'దండేన ఘటః' ఇత్యాదౌ 'దండజన్యతావాన్ ఘట' ఇతి హి సర్వ జనీనే బోధే 'హేతౌ తృతీయా' ఇతి మునివచనావలంబేన 'దండాభిన్న హేతుకో ఘటః' ఇతి బోధం వదతా భవతైవాస్యాః సరణే ర్దర్శితత్వాత్. 'భావ ప్రధానమాఖ్యాతమ్' ఇత్యాద్యనేకై ర్మునివచనై స్తత్ర తత్ర త్వత్కృతబోధవై రీత్యస్యానుపపత్తేశ్చేతి కృతమప్ర సక్తవిచారేణ.

"పుత్రేణ సహాగతః పితా" ఇత్యాదులందు, పుత్రాభిన్నా ప్రధాన సహితుడు' అని బోధ అప్రామాణికము గనుక మీరు చెప్పిన యర్థము సిద్ధింపదనరాదు. 'దండేన ఘటః' ఇత్యాదుల యందు 'దండజన్యతావాన్ ఘటః' (దండమువలన జన్యత గలది ఘటము) అని సర్వజనీనమగు బోధ కల్గుచుండగా, "హేతౌతృతీయా" అని ముని వచనాధారముచే "దండాభిన్న హేతుకము ఘటము" అని బోధను చెప్పునట్టి నీచేతనే ఈ మార్గము చూప బడినది కనుక. "భావప్రధానమాఖ్యాతం" ఇత్యాదులగు ననేకములైన ముని వచనములచే నచ్చటచ్చట నీవు చేసిన బోధ వైపరీత్యము అనుపపన్న మగుటవలన కూడా; అని అప్రసక్త విచారణము చాలును

ప్రకృతత్వాప్రకృతత్వే ప్రాయేణోపమేయతోపమానతయో ర్నిర్ణాయకే ఇత్యుక్తత్వాదిహ న తాభ్యాం తయోర్నిర్ణయః, ప్రకృ తయోరపి సాహిత్యసంభవాత్. కిం తు ప్రాధాన్యాప్రాధాన్యాభ్యా మితి. హృద్యత్వం చాస్యా అతిశయోక్తి కృతమిత్యుక్తమ్. యత్ర తు సా నాస్తి తత్ర 'పుత్రేణ సహాగతః పితా' ఇత్యాదౌ న సహోక్తి రలంకారః.

ప్రకృతత్వాప్రకృతత్వములు ప్రాయికముగా ఉపమేయతోపమాన తలను నిర్ణయించునవి అని చెప్పబడుటచే ఇక్కడ వాటితో నిర్ణయము గాదు; ప్రకృతములైనప్పటికినీ సాహిత్యము సంభవించును గనుక. కాని ప్రాధాన్యా ప్రాధాన్యములచేతనని. దీనికి హృద్యత్వము కూడా నతిశయోక్తికృతమని చెప్పబడినది. ఎక్కడైతే నతిశయోక్తి లేదో "పుత్రేణసహ ఆగతః పితా" ఇత్యాదులయందు, సహోక్తి అలంకారముగాదు.

అత్ర విచార్యతే — 'కేశైర్వధూనామ్' ఇత్యాదౌ పౌర్వా పర్యవిపర్యయానుప్రాణితా సహోక్తి 'రలఙ్కారశ్చేతి న యుక్తమ్.

అతిశయోక్తేరేవాత్ర చమత్కృత్యాధాయకత్వేన సహోక్తేర్నామమాత్రత్వాత్, 'తవ కోపోఽరినాశశ్చ జాయతే యుగపన్నృప' ఇత్యస్మాదతిశయోక్త్యలంకారాత్ 'తవ కోపోఽరినాశేనసహైవ నృప జాయతే' ఇత్యత్ర గుణభావమాత్రకృత వైలక్షణ్యేఽపి విచ్ఛిత్తేరవిశేషాత్, తస్యైవ చాలంకారవిభాజకత్వాత్. న చ సాదృశ్యానుప్రాణితస్య రూపకాదేరప్యపృథగ్ భావాపత్తిః. 'నిశాకర సమానోఽయమయం సాక్షాన్నిశాకరః' ఇత్యాదౌ విచ్ఛిత్తివైలక్షణ్యస్య జాగరూకత్వాత్. అన్యథా తత్ప్రయుక్తస్య వ్యతిరేకస్యానుత్థానాపత్తేః. అపి చ సాదృశ్యప్రయుక్తరూపకాదిషు సాదృశ్యస్య గుణత్వాచ్చమత్కృతి విశ్రాంతిధామభ్యో రూపకాదిభ్యో యథా న పృథగ్వ్యపదేశ్యత్వం తథా సహభావోక్త్యావిర్భూతాయాః కార్యకారణ పౌర్వాపర్యవిపర్యయాత్మికాయా అతిశయోక్తేః సకాశాదస్యాః సహోక్తేరపృథగ్ భావ ఏవోచితః.

ఇక్కడ విచారింతము-

"కేశైర్వధూనాం" ఇత్యాదులయందు వెనుక ముందుల వ్యత్యాసముచే ప్రతికించబడిన సహోక్తి అలంకారమనుట యుక్తముగాదు. అతిశయోక్తియె నిచట చమత్కృతిని సమకూర్పగలదు. కనుక సహోక్తి నామమాత్రమగును. "తవ కోపోఽరినాశశ్చ జాయతే యుగపన్నృప" అను అతిశయోక్తియలంకారముకన్న "తవ కోపోఽరినాశేన సహైవ నృప జాయతే" అను చోట గుణభావకృత వైలక్షణ్యమున్నను విచ్ఛిత్తిలో తేడా లేనందున; దానికే యలంకార విభాజకత్వము గనుక. సాదృశ్యానుప్రాణితమగు రూపకము మొదలైన వానికి అపృథగ్భావము వచ్చునే-అనరాదు "నిశాకరసమానోఽయమయం సాక్షాన్నిశాకరః" ఇత్యాదులలో విచ్ఛిత్తి వైలక్షణ్యము జాగరూకము గనుక. అలా కాక పోతే తత్ప్రయుక్తమగు వ్యతిరేకమున కనుత్థానాపత్తి యగును

మఱియు-సాదృశ్య ప్రయుక్తమగు రూపకము మొదలగు వానియందు సాదృశ్యము గుణమగుటవలన చమత్కార విశ్రాంతి స్థానములగు రూపకాదుల కంటె పృథగ్భావమున దానికి వ్యవదేశ్యత్వ మెట్లులేదో అట్లాగే సహభావోక్తి వలన నావిర్భవించిన కార్యకారణముల ముందువెను

కల వ్యత్యాస స్వరూపమైన నతిశయోక్తి నుండి ఈ సహోక్తికి అపృథగ్భావమే యుచితమైనది.

నన్వేవం సతి సహోక్తేర్నిర్విషయత్వం స్యాత్. సహోక్త్యన్తరస్యాప్యభేదాధ్యవసాయరూపాతిశయేన కవలీకారాదితి చేన్న. అభేదాధ్యవసానమూలాయాం హి సహోక్తావభేదాధ్యవసానేన సహోక్తిరుపస్క్రియత ఇతి న గుణేన ప్రధానస్య తిరస్కారః, అపి తు ప్రధానేన గుణస్యేత్యుక్తదిశా సాఙ్కర్యైవ సహోక్తిః గుణప్రధానభావశ్చ నిరాగ్రహైః సూక్ష్మదృశావధానీయః. కిం చ పరస్పరాధ్యవసానమాత్రమతిశయ ఏవ, నాతిశయోక్తిః; తస్య శ్లేషాదావపి సత్త్వాత్, సా తూపమానేనోపమేయస్య నిగరణమ్. ఏవం చ 'వర్షన్తి' 'ఉన్మీలన్తో నిమీలన్తః' ఇత్యాదిష్వేకేనాపరనిగరణాభావాన్నాతిశయోక్తిగన్ధోఽపి. అతిశయమాత్రం తు ప్రాయశః సాధారణధర్మాంశే బహూనామలంకారాణాముపస్కారకమ్, న హి 'శోభతే చంద్రవన్ముఖమ్' ఇత్యాదౌ చంద్రముఖశోభయోర్వస్తుతో భిన్నయోరభేదాధ్యవసానమంతరేణోపమా సముల్లసతి. తస్మాత్ 'కార్యకారణ పౌర్వాపర్యవిపర్యయమూలః సహోక్తేరేకః ప్రకారః' ఇతి సర్వస్వకారాదీనాముక్తిరాగ్రహమూలైవ. అభేదాధ్యవసానమూలస్తు ప్రకారో భవతు నామ సహోక్తేర్విషయః. యది తు దీపకే తుల్యయోగితాయాం చోపమానోపమేయయోః ప్రాధాన్యేన క్రియాదిరూపధర్మాన్వయః, ఇహ తు గుణప్రధానభావేనైవేతి విశేషః సన్నపి విచ్ఛిత్తివిశేషణాధాయకతయా నాలంకారాంతరతాప్రయోజకః, అపి తు తదవాంతరభేదతాయాః ఇతి విభావ్యతే, నిరస్యతే చ ప్రాచీనముఖదాక్షిణ్యం తదా నివిశతామిదమప్యుక్తాలంకారేష్వేవ. కించిద్వైలక్షణ్యమాత్రేణైవాలంకారభేదే వచనభఙ్గీనామానంత్యాదలంకారాణామానంత్యప్రసంగాదితి సత్యమ్; గుణప్రధానభావాలిఙ్గితస్య సహభావస్యాలంకారాంతరాద్విచ్ఛిత్తి విశేషమనుభవన్తః ప్రాచీనా ఏవ సహోక్తేః పృథగలంకారతాయాం ప్రమాణమ్, అన్యథా ఏవంజాతీయోపప్లవేన బహువ్యాకులీ స్యాత్. నైవ ప్రమాణీకుర్మహే వయం మృషా ముకులితలోచనాన్ప్రాచః, నివేశ్యతాం చేయమలంకారాంతరభవనోదరం వరాకీ ఇతి తు ప్రభుతైవ కేవలా. న సహృదయత్వమ్

ఏవం క్రియాయాః సాధారణ ధర్మత్వే ఇయముదాహృతా.

అయ్యా, అలాగైతే సహోక్తికి విషయమే లేకపోవును. సహోక్త్యన్త రమైనను అభేదాధ్యవసాన రూపమగు నతిశయోక్తిచే నాక్రాంతము గనుక. అలాకాదు. అభేదాధ్యవసాయము కారణముగాగల సహోక్తియం దభేదా ధ్యవసానముచేత సహోక్తియలంకరించబడునని-అప్రధానముచే ప్రధానము నకు తిరస్కారము గాదు, ఇక నేమనగా ప్రధానముచే గుణమునకు-అని చెప్పినరీతిగా సహోక్తి సావకాశమే. గుణప్రధాన భావమున్ను నిరాగ్రహు లచేత సూక్ష్మదృష్టితో నవధానించ దగినది

మరియు పరస్పరాభేదాధ్యవసాయ మాత్రము అతిశయమే; అతిశ యోక్తి కాదు. అది శ్లేష మొదలగు దానియందైనను యున్నది కనుక. అది ఉపమానముచే నుపమేయము యొక్క నిగరణము

ఇలాగా-'వర్షంతి, ఉన్మీలన్తో నిమీలన్తః' ఇత్యాదులందు, ఒకదానిచే నితరమునకు నిగరణము లేకపోవుటవలన అతిశయోక్తిగంధమైనను లేదు అతిశయము మాత్రమైతే సామాన్యముగా సాధారణ ధర్మాంశమునందు అనేకాలంకారములకు ఉపస్కారక మగుచున్నది. "చంద్రునివలె మొగము ప్రకాశించుచున్నది" ఇత్యాదులందు చంద్రిముఖ శోభలకు, వస్తుతః భిన్నము లకు భేదాధ్యవసానము లేకుండా నుపమ ప్రకాశించదు కదా ? అందువలన "కార్యకారణముల యొక్క ముందు వెనుకల వ్యత్యాస మూలకమగునది. సహోక్తి యొక్క ఒక్క ప్రకారము" అని అలంకార సర్వస్వకారులు మొదలైన వారి ఉక్తి అగ్రహమూలకమేను.

అభేదాధ్యవసాన మూలకమగు ప్రకారము సహోక్తికి విషయము అయితే గావచ్చు గాక. అయితే దీపకమునందు తుల్యయోగిత యందును ఉపమానోపమేయములకు ప్రధానముగా క్రియారూపమగు ధర్మముల అన్వ యము. ఇక్కడనైతే గుణప్రధాన భావముచేతనని విశేషమున్నను విచ్ఛిత్తి విశేషమును సమకూర్ప లేకపోవుటచే నలంకారాన్తరత్వమునకు ప్రయోజ కముగాదు, తదవాంతర భేదత్వమునకు మాత్రమే అని భావించి, ప్రాచీ నుల ముఖదాక్షిణ్యము గూడ నిరసింపబడినచో అప్పుడిది కూడా నుక్తాలం కారములందే ప్రవేశించనీయండి కొంచెము భేదము మాత్రము చేనేం యలంకారములకు భేదముండుచో మ టలతీరు లనేకములు కనుక నలంకా

రము లనేకములు గావలసివచ్చును నిజము. గుణప్రధాన భావాలింగిత మైన సహభావమునకు నలంకారాన్తరము కంటె విచ్ఛిత్తి విశేషమనుభవించు నట్టి ప్రాచీనులే సహోక్తికి పృథగలంకారత్వము నందు ప్రమాణము. అలా కాకపోతే, ఇటువంటి విప్లవముతో చాలా వ్యాకుల మగును. మేము మృషగా కన్నులు మూసుకొనిన ప్రాచీనులను ప్రమాణముగా జేయము; ఈ పిచ్చిది అలంకారాన్తర భవనోదరమందు ప్రవేశించుగాక; -అనుట కేవ లము ప్రభుత్వమే కాని సహృదయత్వము కాదు గదా. క్రియ సాధారణ ధర్మమైనపుడు ఇది యుదాహరణము.

గుణస్య తథాత్వే యథా—

'మాంథర్యమాప గమనం సహ శైశవేన
రక్తం సహైవ మనసాధర బింబమాసీత్.
కిం చాభవన్మృగకిశోరదృశో నితంబః
సర్వాధికో గురురయం సహ మన్మథేన'.

అత్ర యద్యపి క్రియాపి గుణేన సహ సమానధర్మతామను భవతి తథాపితస్యానాంతరీయకత్వేనా సుందరత్వాత్ గుణస్యైవ పర్య వసానే సమగ్రభరసహిష్ణుత్వమ్. శోణత్వాసక్తత్వాభ్యామధికభార త్వోప దేశకర్తృత్వాభ్యాం చ భిన్నయోరప్యుప మేయోపమానగత యోర్నిరుక్త గుణయోః శ్లేషేణ పిండీకరణాత్సహభావోపపత్తిః. ఏవం శ్లేషాభావేఽపి కేవలాధ్యవసానేన బోధ్యమ్.

గుణములు అలాగైన యెట్లనగా—

"మాంథర్య మాప" మొ (చిన్నతనముతో గూడా నడక మంథర మాయెను. మనసుతో గూడా అధరబింబము రక్తమయ్యెను. మరియు మృగ కిశోరాక్షి యొక్క నితంబము సర్వాధికమై మన్మథునితో గూడా గురువయ్యెను).

ఇట విచారించగా క్రియయును గుణముతో కూడ సమాన ధర్మత్వ మనుభవించుచున్నది; అయినప్పటికిని ఆ క్రియ అంతరీయక మగుటచే నసుంద రము గనుక గుణమే పర్యవసానమందు పూర్ణమైన బరువు సహింపగల్గు చున్నది. శోణత్వాసక్తత్వములచేతను, అధిక భారవత్వోపదేశ కర్తృత్వముల

చేతను, ఉపమానోపమేయగత నిర్ముక్త గుణములు భిన్నములైనను శ్లేషచే పిండీకరణమగును గావున, సహభావోపపత్తి. ఇటులనే శ్లేషాభావమందును కేవలాధ్యవసానముచేత తెలియవలెను.

యత్రైకమేవోపమేయం విలక్షణసహోక్త్యాలంబనం సా మాలాసాదృశ్యాన్మాలాసహోక్తిః. వైలక్షణ్యం చ సహోక్తేః స్వసమానాధికరణ సహోక్త్యన్తరాపేక్షయా బోధ్యమ్. 'కేశైర్వధూనామ్' ఇత్యత్ర కేశైః సహ కోపైః సహ ప్రాణైః సహేత్యుపమాన భేదేన సాహిత్యస్యానేకత్వేఽపి కర్షణైక్యాత్సహోక్తేరభేదః. సతి వా కథంచిద్భేదే న వైలక్షణ్యమ్, ధర్మైక్యాత్. ధర్మోపమానోభయకృత వైలక్షణ్యస్య చాత్ర వివక్షణాత్. 'ఉన్మీలంతో నిమీలంతః" ఇత్యత్ర చ ధర్మవైలక్షణ్యేఽప్యున్మీలనధర్మోత్థాపితసహోక్తిఘటకోపమానానాం పద్మపత్రాదీనామేవ నిమీలన ధర్మోత్థాపితాయామపి సహోక్తౌ ఘటకత్వాన్న మాలారూపత్వమ్. 'భాగ్యేన సహ రిపూణామ్' ఇతి తూదాహరణమేవ.

యథా వా —

'ఉన్మూలితః సహ మదేన బలాద్బలారే-
రుత్థాపితో బలభృతాం సహ విస్మయేన.
నీలాతపత్రమణిదండరుచా సహైవ
పాణౌ ధృతో గిరిధరేణ గిరిః పునాతు".

అత్ర నీలాతపత్రమణిదండరుచో గిరిధారణోత్తరకాలికత్వాదుత్తరార్ధగతా పౌర్వాపర్యవిపర్యయానుప్రాణితైవ సహోక్తిర్నిదర్శనాప్రాణితా చ. పూర్వార్ధగతే తు ప్రకారద్వయేనాపి సంభవతః.

ఇతి రసగంగాధరే సహోక్తి ప్రకరణమ్.

ఎచట ఒకటియే ఉపమేయము, విలక్షణమగు సహోక్తి కాధారమో, అది మాలతో పోలికవలన మాలాసహోక్తి. వైలక్షణ్యమున్ను, సహోక్తికి స్వసమానాధికరణమగు సహోక్త్యంతర మపేక్షించి, గ్రహించవలెను. 'కేశైర్వధూనాం" అనుచోట "కేశైస్సహ", "కోపైస్సహ" "ప్రాణైస్సహ", అను ఉపమాన భేదముచే సాహిత్య మనేకమైనప్పటికిని కర్షణైక్యము వలన సహోక్తికి అభేదము. యథాకథంచిద్భేద మున్నను ధర్మమొకటిగాన వైల

క్షణ్యము లేదు. ధర్మోపమానముల రెంటిచే చేయబడిన వైలక్షణ్యమిచట వివక్షితము గావున. "ఉన్మీలన్తో నిమీలన్త్యః" అనుచోట ధర్మము విలక్షణమైనను ఉన్మీలన ధర్మముచే నుత్థాపితమగు సహోక్తిలో ఘటకమైన ఉపమానములగు పద్మపత్త్రాదులకే నిమీలనధర్మముచే నుత్థాపితమైనను సహోక్తి యందు ఘటకత్వము గనుక మాలారూపమిది గాదు "భాగ్యేన సహా రిపూణామ్" అని అయితే ఉదాహరణమేను.

మరియొకటి-

"ఉన్మీలితః" మొ. (ఇంద్రుని యొక్క మదముతో గూడా ఉన్మీలితమైనదియు, బలవంతుల ఆశ్చర్యముతో గూడా లేపబడినట్టియు, నల్లని గొడుగుయొక్క మణిదండము కాంతితో గూడ గిరిధరునిచేతి యందు ధరింపబడిన కొండ మిమ్ములను పవిత్రులనుచేయు గాక!)

ఇచట నీలాతపత్రమణిదండకాన్తి గిరిధారణమున కుత్తరకాలికమగుట వలన ఉత్తరార్ధమందున్న ముందు వెనుకల వ్యత్యాసముచే ననుప్రాణితమైనదే సహోక్తి నిదర్శనచే గూడ ననుప్రాణితమైనది. పూర్వార్ధగతమైనంత్రైతే రెండు తీరులచేతను గూడా సంభవించునవి.

ఇది సహోక్తి ప్రకరణము

## వినోక్తిః

అథ వినోక్తిః — వినార్థసంబంధ ఏవ వినోక్తిః.

హృద్యత్వం చానువర్తతే. తచ్చ వినాకృతస్య వస్తునో రమణీయత్వారమణీయత్వాభ్యాం భవతి. అరమణీయత్వే యథా—

'సంపదా సంపరిష్వక్తో విద్యయా చానవద్యయా
నరో న శోభతే లోకే హరిభక్తిరసం వినా'.

యథా వా—

'వదనం వినా సుకవితాం సదనం సాధ్వీం వినా వనితామ్
రాజ్యం చ వినా ధనితాం న నితాంతం భవతి కమనీయమ్'.

తరువాత వినోక్తి.

వినార్థ సంబంధమే వినోక్తి. హృద్యత్వ మనువర్తించును. అదియు

వినాకృతయగు వస్తువునకు రమణీయత్వ, అరమణీయత్వములచే నగుచున్నది.

అరమణీయత్వమున నెట్లనగా-

"సంపదా" మొ (సంపత్తిచే కౌగలించుకొనబడి అనవద్య యగు విద్యతో కూడినవాడైన నరుడు లోకమున హరిభక్తి లేక పోయిన చో ప్రకాశించడు.)

మరియొకటి-

"వదనం" మొ (వదనము మంచికవిత లేకను, సదనము పతివ్రత లేకను, రాజ్యము ధనికత లేకను, యెక్కువగా అందమైనది గాదు.)

రమణీయత్వే యథా——

"పంకైర్వినా సరో భాతి సదః ఖలజనైర్వినా
కటువర్ణైర్వినా కావ్యం మానసం విషయైర్వినా".

పూర్వా తు కేవలా, ఇయం తు దీపకానుకూలా. మిశ్రితా యథా——

"రాగం వినా విరాజంతే మునయో మణయస్తు న
కౌటిల్యేన వినా భాతి నరో న కబరీభరః."

అత్ర ప్రతివస్తూపమానుకూలా.

రమణీయత్వమున నెట్లనగా-

"పంకైర్వినా" మొ. (బురద లేకుండా సరస్సును, సభ ఖలులు లేకను, కావ్యము కఠినాక్షరములు లేకను, మనస్సు విషయములు లేకను ప్రకాశించును.)

వెనుకటిది కేవల, ఇది దీపకానుకూల. మిశ్రిత యెట్లనగా-

"రాగం వినా" మొ. (రాగము లేక మునులు ప్రకాశించుదురు, మణులు మాత్రము అట్లుకాదు, కౌటిల్యము లేక నరుడు ప్రకాశించును, కబరీభరమట్లు ప్రకాశింపదు)

ఇచట ప్రతివస్తూపమ యనుకూలము.

"త్రాసైర్వినా విరాజంతే శూరాః సన్మణయో యథా
న దానేన వినా భాంతి నృపా లోకే ద్విపా ఇవ".

అత్ర శ్లేషమూలోపమానుకూలా.

"యథా తాలం వినా రాగో యథా మానం వినా నృపః
యథా దానం వినా హస్తీ తథా జ్ఞానం వినా యతిః".

పూర్వం క్రియాగుణాదిసంబంధ ఆవశ్యకః ఇహ తూపమామాహాత్మ్యాదవగమ్యతే స ఇతి న తథా.

"త్రాసైః" మొ. (భయములు లేకుండా శూరులు సన్మణులవలె ప్రకాశింతురు. రాజులు దానము లేక (త్యాగము, మదోదకము) ఏనుగులవలె లోకమున ప్రకాశింపరు.)

ఇచట శ్లేషమూల ఉపమ అనుకూల.

"యథా తాలం" మొ. (రాగము లేక తాళమెటులో, గౌరవమును విడిచి రాజులు నెటులనో, మదము లేక ఏనుగెటులనో, జ్ఞానములేక యతి అట్లే )

ఇదివరలో క్రియాగుణాది సంబంధ మావశ్యకము; ఇచటనైతే అది ఉపమామాహాత్మ్యమువలన తెలియుచున్నది గాన అలాకాదు

ఇయం చ న కేవలం వినాశబ్దస్య సత్త్వ ఏవ భవతి, అపి తు వినాశబ్దార్థవాచకమాత్రస్య. తేన నఞ్ నిర్ - వి - అంతరేణ - ఋతే రహిత - వికల ఇత్యాదిప్రయోగే ఇయమేవ.

"నిర్గుణః శోభతే నైవ విపులాడంబరోపి నా
ఆపాదరమ్య పుష్పశ్రీ శోభితః శాల్మలిర్యథా".

అలంకారభాష్యకారస్తు 'నిత్యసమ్బన్ధానామసమ్బన్ధవచనం వినోక్తిః' ఇత్యాహ. తస్య మతే తు నైతాన్యుదాహరణాని.

ఇదం తూదాహరణమ్—

"మృణాలమన్దానిలచన్దనానాముశీరశైవాలకుశేశయానామ్,
వియోగదూరీకృతచేతనాయా వినైవ శైత్యం భవతి ప్రతీతిః"

అత్ర శైత్యస్యావినాభావేఽపి వినాభావో నిబద్ధః. యథా వా—

'శైత్యం వినా న చంద్రశ్రీర్న దీపః ప్రభయా వినా
న సౌగన్ధ్యం వినా భాతి మాలతీకుసుమోత్కరః'.

**అలఙ్కారాన్తరసమాలిఙ్గనాదిర్యాభ్యతవే వాస్యా హృద్యత్వమ్, న స్వతః. తేనాలంకారాంతరత్వమపి శిథిలమేవేత్యాపి వదన్తి.**

ఇదియు వినాశబ్దముంచేనే కాదు; ఇకనేమన వినాశబ్దము యొక్క అర్థమును చెప్పునట్టిది ఏది ఉన్నను. అందుచేత అది చెప్పెడి శబ్దములు, నఞ్‌--నిర్‌-వి-అంతరేణ-ఋతే-రహిత-వికల-మొదలగునవి ప్రయోగించినను, ఇదియే.

"నిర్గుణః" మొ (ఎక్కువ ఆడంబరము గలిగియున్నను నిర్గుణుడైన మనుష్యుడు ఆపాతరమ్యమైన పుష్పశోభతో ప్రకాశించెడు బూరుగుచెట్టువలె ప్రకాశింపడు.)

అలంకార భాష్యకారుడైతే-"నిత్యసంబంధములకు అసంబంధము జెప్పుట వినోక్తి" అని చెప్పెను. అతని మతము నందైతే ఇవి ఉదాహరణములు కావు. ఇది యుదాహరణము:-

"మృణాల" మొ. (తామర తూడులు, మందానిలములు, చందనములు, వట్టివేళ్లు, నాచు, పద్మములు, వాటి ప్రతీతి, వియోగముచే బుద్ధి తొలగిన దానికి, చల్లదనము లేకుండగానే కలుగుచున్నది.)

ఇచట శైత్యమున కవినాభావమునందైనను వినాభావము కూర్పబడినది.

మరొకటి—

"శైత్యం వినా" మొ. (చల్లదనము లేకుండా చంద్రశోభయు, ప్రభ లేక దీపమును, సుగంధములేక జాజిపువ్వుల సమూహమును ప్రకాశింపదు.)

దీని కాలంకారాన్తర సమాలింగనమున్ననే హృద్యత్వము. తన్వః లేదు. అందుచే దీని కలంకారాన్తరత్వము శిథిలమగుననియు చెప్పుదురు.

**అథాస్యా ధ్వనిః. యథా—**

**"విశాలాభ్యామాభ్యాం కిమిహ నయనాభ్యాం ఫలమసౌ**
**న యాభ్యామాలీఢా పరమరమణీయా తవ తనుః,**
**అయం తు న్యక్కారః శ్రవణయుగలస్య త్రిపథగే**
**యదన్తర్నాయాతస్తవ లహరిలీలాకలకలః."**

"అత్ర త్వద్దర్శనం వినా నయనయోః, త్వల్లహరీకోలాహల-శ్రవణం వినా శ్రవణయోశ్చారమణీయత్వం ఫలప్రశ్న ధిక్కారాభ్యాం వ్యజ్యతే. తస్య చ భావధ్వన్యనుగ్రాహకత్వేఽపి ధ్వనివ్యపదేశ్యత్వమ వ్యాహతమ్, అన్యథానుగ్రాహకత్వలక్షణసంకరోచ్ఛేదాపత్తేః.

తరువాత దీని ధ్వని ఎట్లనగా-

"విశాలాభ్యామాభ్యాం" మొ. (విశాలమగు నేత్రములతో నేమి ఫలము; వేనితో పరమ రమణీయమగు నీ శరీరము ఆలీఢముకాలేదో. ఇది మాత్రము చెవుల జోడుకు తిరస్కారమేను; ఓ గంగా ! నీ లహరులయొక్క లీలా కలకలము దేనిలోపలికి ప్రవేశించలేదో.)

ఇచట నీ దర్శనము లేకపోయినచో నేత్రములును, నీలహరీకోలాహలము వినక చెవులును, రమణీయతను పొందవు, అని-ఫల-ప్రశ్న-ధిక్కారములచే వ్యంగ్యము. దానికిభావధ్వన్యనుగ్రాహకత్వమున్నను ధ్వని యని పేరు అవ్యాహతము. అలా కానియెడల అనుగ్రాహకత్వ లక్షణమగు సంకరము లేకపోవలసివచ్చును.

'నిరర్థకం జన్మ గతం నలిన్యా
యయా న దృష్టం తుహినాంశుబిమ్బమ్
ఉత్పత్తిరిన్దోరపి నిష్ఫలైవ
కృతా విబుద్ధా నలినీ నయేన'

ఇతి కస్యచిత్కవేః పద్యం వినోక్తిధ్వనిరేవ. పరం తు పరస్పర వినోక్తివశాద్వైలక్షణ్యశాలి.

ఇతి రసగంగాధరే వినోక్తి ప్రకరణమ్.

ఈ తీరుగా- "నిరర్థకం" మొ. (తామరతీవె యొక్క జన్మ నిరర్థకముగా బోయినది; దేనిచేత చంద్రబింబము చూడబడలేదో. చంద్రుని జన్మము నిరర్థకమే; దేనిచేత తామరతీగ వికసింప చేయబడలేదో.)

అను ఒకానొక కవి పద్యము వినోక్తిధ్వని కుదాహరణము. కాని పరస్పర వినోక్తి వశమున వైలక్షణ్యము అతిశయించినది.

ఇది వినోక్తి ప్రకరణము.

## సమాసోక్తిః

అథ సమాసోక్తిః

యత్ర ప్రస్తుతధర్మికో వ్యవహారః సాధారణవిశేషణమాత్రోపస్థాపితాప్రస్తుతధర్మికవ్యవహారాభేదేన భాసతే సా సమాసోక్తిః. సాధారణ విశేషణమాత్రశ్రుత్యుపస్థాపితాప్రకృతధర్మికవ్యవహారాభిన్నత్వేన భాసమానప్రకృతధర్మిక వ్యవహారత్వమితి చైకోక్తిః. శబ్దశక్తిమూలధ్వనివారణాయ మాత్రేతి తత్ర విశేష్యస్యాపి శ్లిష్టతయా ప్రకృతేతర ధర్మ్యుపస్థాపనద్వారా తాదృశధర్మికవ్యవహారోపస్థాపకత్వాత్.

అనంతరము సమాసోక్తి—

ఎచట ప్రస్తుతధర్మికమగు వ్యవహారము సాధారణ విశేషణ మాత్రము చేత నుపస్థాపింపబడిన యప్రస్తుత ధర్మికమగు వ్యవహారము యొక్క నభేదముతో భాసించునో నయ్యది సమాసోక్తి. సాధారణ ధర్మవిశేషణ మాత్ర శ్రుత్యుపస్థాపితాప్రకృతధర్మికవ్యవహారముతో నభిన్నము గా భాసమానమగు ప్రకృత ధర్మిక వ్యవహారత్వమనియు నొక వాక్యము.

శబ్దశక్తిమూలధ్వనివారణకై మాత్రపదము. అచట విశేష్యము గూడ శ్లిష్టమగుటచే ప్రకృతేతరధర్మి యుపస్థాపన ద్వారా అటువంటి ధర్మి కల వ్యవహారము ఉపస్థాపన చేయునది గనుక.

ఏవమపి —

'ఆబధ్నాస్యలకాన్నిరస్యసి తమాం చోలం రసాకాంక్షయా
లంకాయా వశతాం తనోషి కురుషే జంఘాలలాటక్షతమ్
ప్రత్యంగం పరిమర్దనిర్దయమహో చేతః సమాలంబసే
వాహానాం విషయే నృపేంద్ర భవతః ప్రాగల్భ్యమత్యద్భుతమ్.''

ఇత్యత్ర ప్రకృతధర్మికప్రకృతాప్రకృతవ్యవహారవిషయకే శ్లేషేఽతివ్యాప్తేర్వారణాయప్రస్తుతాప్రస్తుతత్వే ధర్మివిశేషణతయో పాత్తే. వ్యవహారవిశేషణత్వేన తయోరుపాదానే తు సాధారణవిశేషణమాత్ర శ్రుత్యుపస్థాపితా ప్రకృతశృంగారవృత్తాంతాభిన్నత్వేన స్థిత ఏవాత్ర ప్రకృతో వీరవృత్తాంత ఇతి స్యాదేవాతిప్రసంగః. న చాత్ర రాజ్ఞో

వర్ణనస్య ప్రస్తుతత్వాత్తద్గతయోర్ద్వయోరపి వృత్తాంతయోః, ప్రస్తుతత్వమితి కథమతిప్రసంగ ఇతి వాచ్యమ్. న స్యాదతిప్రసంగః యది వర్ణనమాత్రం ప్రస్తుతం స్యాత్. తత్సంగ్రామాదౌ వీరతామాత్రవర్ణన ప్రస్తావే తు స్యాదేవాతిప్రసంగః.

ఇలాగైనను

"ఆబధ్నాస్యలకాన్" మొ. (ఓ రాజా! రసేచ్ఛచే (భూమియందు లేక వీరరసము నందు లేక శృంగారము నందు) ఇచ్ఛచే అలకాపట్టణమును (ముంగురులను ముడివేయుచున్నావు) బంధించుచున్నావు; చోలరాజును (రవికెను) నిరసించుచున్నావు లంకను స్వాధీనముచేసుకొనుచున్నావు. శరీర మును అవశములుగా చేయుచున్నావు. జఘనమునందు లలాటమందు క్షత ములు చేయుచున్నావు పరిగెత్తి పోవుచున్న లాటరాజును క్షతమొనర్చు చున్నావు, అంగదేశమును గూర్చి (ప్రతి అవయవమునందు) మర్దించుటచేత నిర్దయమైన చేతస్సును సమాలంబింతువు. శత్రువుల దేశములందును (స్త్రీల విషయములలోను) నీ యొక్క ప్రౌఢిమ అత్యంతమైనది)

అనుచోట ప్రకృత ధర్మిక ప్రకృతాప్రకృతవ్యవహార విషయకమైన శ్లేషయందు నతివ్యాప్తి వారించుటకై ప్రస్తుతాప్రస్తుతత్వములు ధర్మివిశే షణములుగా స్వీకరించబడినది వ్యవహారవిశేషణములుగా నారెంటిని స్వీకరించిన యెడల సాధారణ విశేషణ మాత్ర శ్రుతివలననుపస్థాపిత మగు నప్రకృత శృంగార వృత్తాంతముకంటె నభిన్నముగా స్థిత మైనదియే ఇచట ప్రకృతమగు వీరవృత్తాంత మని అతివ్యాప్తి కానగును. ఇచట రాజు యొక్క వర్ణనము ప్రస్తుతము గనుక తద్గతములగు రెంటికినీ వృత్తాంతములకు ప్రస్తుతత్వమని అతివ్యాప్తి యెట్లు గల్గును అనరాదు. వర్ణన మాత్రము ప్రస్తుతమైన యెడల నతివ్యాప్తి లేకపోవును. తత్సంగ్రా మాదుల యందు వీరత్వము మాత్రము యొక్క వర్ణన ప్రస్తావమునందైతే అతిప్రసంగము కానేయగును.

"మలినేఽపి రాగపూర్ణాం వికసితవదనామనల్పజల్పేఽపి
త్వయి చపలేఽపి చ సరసాం భ్రమర కథం వా
సరోజినీం త్యజసి"

ఇత్యాద్యప్రస్తుతప్రశంసాయామప్రకృతవ్యవహారః సాక్షాదు-

పాత్తత్వాద్విశేష్యేణాప్యుపస్థాపిత ఏవేతి న తత్రాతివ్యాప్తిః. యది తు జలక్రీడాదౌ భ్రమరవృత్తాంత ఏవ ప్రస్తుతస్తదా భవత్యేవేయం సమాసోక్తిః.

"మలినేఽపి" మొ. (మలినుడవైనను నీయందు అనురాగముతో నిండినదియు, నీవు ఎక్కువగా వాగుచున్నను విప్పారిన మోముగలదియు, నీవు చపలుడవైనను సరసమైనదియు నగు తామర తీవెను, తుమ్మెదా! నీ వెట్లు వదులుదువు?)

ఇలాంటి అప్రకృత ప్రశంసయందు అప్రకృత వ్యవహారము సాక్షాత్తుగా నుపాత్తమగుట వలన విశేష్యముచేనైనను ఉపస్థాపింపబడినదేను, అని అచట నతివ్యాప్తి లేదు అయితే-జలక్రీడాదుల యందు భ్రమరవృత్తాంతమే ప్రస్తుతమగుచో నపుడు ఇది సమాసోక్తి అగును.

తత్ర తావత్ —

'విబోధయన్ కరస్పర్శైః పద్మినీం ముద్రితాననామ్
పరిపూర్ణానురాగేణ ప్రాతర్జయతి భాస్కరః.'

ఇత్యత్ర కిరణస్పర్శకరణక ముకులితపద్మినీకర్మకవికాసానుకూల వ్యాపారవదభిన్నో భాస్కరో జయతీతి వాక్యార్థః శక్త్యైవ తావత్ ప్రతీయతే హస్తస్పర్శకరణక నాయికావిశేషకర్మకానునయానుకూల వ్యాపారవదభిన్న ఇత్యాకారశ్చాపరోఽర్థ ఉభయత్రానుషక్తయా తయైవ శక్త్యా, శక్త్యంతరేణ, వ్యక్త్యా వా సర్వథైవ ప్రతీయత ఇత్యత్ర సహృదయా ఏవ ప్రమాణమ్. ఏవం చ ద్వావిమౌ వాక్యార్థౌ సవ్యేతరగోవిషాణవదత్యంతాసంస్పృష్టౌ యది స్యాతాం తదా భగవతో భాస్కరస్య కాముకత్వం కమలిన్యా నాయికాత్వం చ సకలప్రతీతిసిద్ధం విరుద్ధం స్యాత్.ద్విఃప్రధానత్వేన,వాక్యభేదశ్చాపద్యేత యది చాపరోఽర్థః ప్రకృతకర్తర్యారోప్యతే తదా కమలినీవికాసకర్తా నాయికానునయ కర్తా చ సూర్య ఇత్యేకత్ర ద్వయమితి విషయతాశాలీ బోధః స్యాత్, న తు పూర్వోక్తానుపపత్తిపరిహారః. యది చ శ్లేషమూలాభేదాధ్యవసానేన కమలిన్యాదీనాం నాయికాత్వాదిప్రత్యయ ఉపపాద్యతే తథాప్యశ్లిష్టపదోపస్థాపితో భగవాన్నాయకత్వేనాఘ్రాత ఏవ పద్మినీశబ్దస్థానే నలినీశబ్దోపాదానే సాపి నాయికాత్వేన, కథం నామ ప్రతీతి పథమి

యాత్? తస్మాద్విశేషణసామ్యమహిమ్నా ప్రతీతో ప్రకృతవాక్యార్థః, స్వానుగుణం నాయకాదిమర్థమాక్షిప్య తేన పరిపూర్ణవిశిష్టశరీరః సన్ ప్రకృతవాక్యార్థే స్వావయవతాదాత్మ్యాపన్నతదవయవోఽభేదే నావతిష్ఠతే. స చ పరిణామ ఇవ ప్రకృతాత్మనైవ కార్యోపయోగీ, స్వాత్మనా చ రసాద్యుపయోగీ. అత్ర చాప్రస్తుతార్థస్య పృథక్ శబ్దానుపాదానాద్రూపకాద్వాక్యార్థసంబంధినో వైలక్షణ్యమ్, పదార్థరూపకాత్తు స్ఫుటమేవ. ఆక్షిప్తార్థఘటితత్వాచ్చ వాక్యార్థశ్లేషాత్. ఏవం చాత్ర శక్త్యపేక్షాభ్యాం సర్వార్థనిర్వాహ ఇతి భామహోద్భటప్రభృతీనాం చిరంతనానామాశయః.

అక్కడనైతే-

"విబోధయన్" మొ. (కిరణ స్పర్శచే ముద్రితానన యగు తామరతీవెను బోధించుచూ, అనురాగ పూర్ణతతో ప్రొద్దున భాస్కరుడు గొప్పగానున్నాడు.)

ఇచట కిరణస్పర్శ కరణము గాను, ముకుళితపద్మిని కర్మగానుండి వికాసానుకూల వ్యాపారవదభిన్నుడగు భాస్కరుడు సర్వోత్కర్ష కారుడని వాక్యార్థము శక్తిచేతనే స్పష్టముగా ప్రతీతమగును. హస్తస్పర్శ కరణకమును నాయికా విశేషకర్మకమును నగు ననునయానుకూల వ్యాపార వదభిన్నుడు ఇత్యాదియగు మరియొక అర్థము రెండుచోట్ల ననుషక్తమగు నాశక్తిచేతను గాని శక్త్యన్తరముచేతను గానీ, వ్యంజనచే గానీ అన్నివిధముల ప్రతీతమగుచున్నదను విషయములో సహృదయులే ప్రమాణము.

ఈ విధముగా నీ రెండు వాక్యార్థములు కుడియెడమల కొమ్ములవలె నొకదానితో నొకటి కలియక యున్న యెడల అప్పుడు భగవంతుడగు సూర్యుని కాముకత్వము కమలిని నాయకత్వమున్ను సకల ప్రతీతి సిద్ధమైనది విరుద్ధమగును రెంటి యొక్క ప్రాధాన్యముతో వాక్యభేదమున్ను వచ్చి పడును. అదియునుగాక-మఱియొక యర్థము ప్రకృతకర్తయం దారోపించబడుచో నపుడు, కమలినీవికాసకర్తయు, నాయికానునయకర్తయు, సూర్యుడు అనే ఒకచోట రెండు అని విషయత్వముతో గూడిన బోధయగును. అంతేకాని వెనుక జెప్పబడిన అనుపపత్తికి పరిహారము కాదు అయితే-శ్లేషమూలకమగు నభేదాధ్యవసానముచే కమలిన్యాదులకు నాయికాత్వము

మొదలగువాని ప్రత్యయము కుదిరినదైనను శ్లేషించని పదముచే నుపస్థితు డైన భగవానుడు నాయకత్వముచే ననాఘ్రాతుడే అగును. 'పద్మినీ' శబ్దము చోట 'నళినీ' శబ్దము ఉపాత్తమైనపుడు అదియు నాయికగా ప్రతీతిపథమును ఎట్లు పొందును ? అందువలన విశేషణ సామ్యమహిమచేత ప్రతీతమైన అప్రకృత వాక్యార్థము తన కనుకూలమగు నాయకాదియగు యర్థమును ఆక్షేపించి దానితో పరిపూర్ణమైన విశిష్ట శరీరమగుచు ప్రకృత వాక్యార్థము నందు తన యవయవములతోడి తాదాత్మ్యముపొందిన తదవయవములు కలదై అభేదనుతో నవస్థితమగును. అది పరిణామమునందువలె ప్రకృత స్వరూపముతోనే కార్యమున నుపయోగించును. స్వస్వరూపముతో రసాదుల కుపయోగించును. ఇక్కడ నప్రకృతార్థము ప్రత్యేకముగా శబ్దముచే ననుపాత్తమగుటవలన వాక్యార్థ సంబంధి రూపకముకంటె వైలక్షణ్యము. పదార్థ రూపకము కంటె స్పష్టముగానే విలక్షణత యున్నది. ఆక్షిప్తమగునర్థ ముతో ఘటితమగుటవలన వాక్యార్థ శ్లేష కంటెను వైలక్షణ్యము. ఇలాగు నిచట శక్త్యాక్షేపముచే అన్ని విధముల యర్థముల నిర్వాహమని చిరం తనులైన భామహోద్భటాదుల యాశయము.

'నిశాముఖం చుంబతి చంద్ర ఏషః' ఇత్యాదౌ నిశాచంద్రశబ్ద యోరశ్లిష్టత్వాన్ముఖచుంబనమాత్రస్య చ పుత్రాదిసాధారణ్యేన కథం తావన్నియతనాయికాక్షేపకత్వమ్, కథం వాఽఽక్షిప్తస్యాపి నాయకా దేర్నిశాచంద్రయోరేవాభేదేనాన్వయః, న భేదేన చుంబనాదౌ. తథాత్వే చ తయోర్నాయకతాతాటస్థ్యే రసానుద్బోధాపత్తేః. తస్మాత్ 'నిశాముఖం చుంబతి చంద్రికైషా' 'అహర్ముఖంచుంబతి చండ భానుః' ఇత్యాదావప్రతీయమానం నాయకత్వం ప్రకృతే టాప్ప్రథ మాభ్యాం ప్రతిపాదితేన ప్రకృత్యర్థగతేన స్త్రీత్వేన పుంస్త్వేన చ స్వాధికరణ ఏవాభివ్యజ్యతే. ఏవం చ నిశాశశినోర్నాయకత్వసిద్ధిః. శ్లిష్టవిశేషణైః వ్యంజనవ్యాపారేణైవాప్రకృతార్థబోధనమ్, శక్తేః ప్రకరణాదినా నియంత్రణాత్. తదిత్థం వ్యంజనమాహాత్మ్యాదేవా ప్రకృతవాక్యార్థతాదాత్మ్యేన ప్రకృతవాక్యార్థోఽవతిష్ఠతే. గుణీభూత వ్యంగ్యభేదశ్చాయమితి తు రమణీయః పంథాః.

"నిశాముఖం చుంబతి చంద్ర ఏషః" ఇత్యాదులయందు నిశాచంద్ర శబ్దములు శ్లేషించకపోవుటవలన, ముఖచుంబన మాత్రము పుత్రాది సాధారణమగుటచేత, నియతముగ నాయకాక్షేపకత్వము ఎట్లు కుదురును? ఆక్షేపింపబడినను ఆ నాయకాదులకు నిశాచంద్రులయందే అభేదముతో నన్వయమే ఏల కల్గును? భేదముతో చుంబనాదులయిందు ఏల లేదు? అలా అయినచో నా రెంటికిని నాయకతాటస్థ్యమునందు రసోద్భేదము కుదరదు. అందువలన "నిశాముఖం చుంబతి చంద్రికైషా" "అహర్ముఖం చుంబతి చండభానుః" ఇత్యాదులందు తోచనట్టి నాయకత్వము ప్రకృతమునందు 'టాప్' చేతను, ప్రథమావిభక్తిచేతను ప్రతిపాదింపబడిన ప్రకృత్యర్థమందున్న స్త్రీత్వముచేతను పుంస్త్వముచేతను స్వాధికరణమునందే యభివ్యక్తమగును. ఈతీరుగా నిశాముఖ చంద్రులకు నాయకత్వసిద్ధి. శ్లేషించిన విశేషములు వ్యంజనావ్యాపారముచేతనే అప్రకృతార్థమును బోధించును. శక్తిని ప్రకరణాదులు నియంత్రించును కనుక. ఈవిధముగా వ్యంజనమాహాత్మ్యము వలననే ప్రకృత వాక్యార్థము అప్రకృత వాక్యార్థతాదాత్మ్యముతో నిలుచును. ఇది గుణీభూత వ్యంగ్య భేదము అని రమణీయమార్గము.

అలంకారసర్వస్వకారస్తు - "విశేషణసామర్థ్యాద్ధి ప్రతీయమానమ ప్రస్తుతం ప్రస్తుతావచ్ఛేదకత్వేన ప్రతీయతే. అవచ్ఛేదకత్వాచ్చ వ్యవహారసమారోపః, న తు రూపసమారోపః. రూపసమారోపే త్వవచ్ఛాదితత్వేన అప్రకృతరూపరూపిత్వాద్రూపకమేవ స్యాత్" ఇత్యాహ. తదేతదుక్తిమాత్రరమణీయమ్, అప్రకృతవ్యవహారః ప్రకృతకర్తరి నాయకాదికస్వకర్తృవిశేషిత ఆరోప్యతే తదవిశేషితో వా? నాద్యః. ఏవం చ సతి చంద్రాదేర్నాయకవ్యవహారాశ్రయత్వేన నాయకసామ్యం సిధ్యేత్. తచ్చ శ్లేషాదిభిత్తికాభేదాధ్యవసాయేన వ్యవహారభేదం ప్రతిపిపాదయిషతః కవేరనభిప్రేతమేవ. అభిప్రేతం తు నాయకత్వమ్. తచ్చ నాయకస్య వ్యవహారవిశేషణత్వే న సిధ్యతి.

కిం చ "నిశాముఖం చుంబతి చంద్రః" ఇత్యత్ర చంద్రే నాయకవ్యవహారసమారోప ఏవ, న నాయకత్వారోపః. ఏవమేవ నిశాయామపి ననాయికాత్వారోపః, తుల్యన్యాయత్వాత్. ఏవం చ ముఖచుంబన మాత్రస్య నాయికానిరుక్తస్యాసుందరత్వాన్నాయకాసాధారణ

వ్యవహారత్వాయోగాచ్చ కిమారోపేణ? యది చ నిశాయాం స్త్రీలింగవ్యంగ్యం నాయికాత్వమితి నిరీక్ష్యతే, తదా చంద్రగతపుల్లింగ వ్యంగ్యం నాయకత్వమపి నిరీక్ష్యతామ్.

న ద్వితీయః. నాయకసంబంధిత్వేనాజ్ఞాతస్య ముఖచుంబన మాత్రస్యాహృద్యత్వాత్. "తితీర్షుర్దుస్తరం మోహాదుడుపేనాస్మి సాగరమ్" ఇతి నిదర్శనాతో వైలక్షణ్యాయాస్మదుక్తవైధర్మ్యస్యైవాన్వేయత్వాచ్చ. శిష్టమనుపదమేవ వక్ష్యామః.

అలంకారసర్వస్వకారుడైతే— "విశేషణ సామ్యముచేత ప్రతీయమాన మగు నప్రస్తుతము ప్రస్తుత నిర్ణాయకముగానే స్ఫురించును నిర్ణాయకమగుట వలన వ్యవహార సమారోపమే; రూపసమారోపము గాదు రూపసమారోప మైతే అవచ్ఛాదితత్వము వలన అప్రకృతరూపరూపిత్వముచే రూపకమే అగును" అని చెప్పెను. ఆ ఇది ఉక్తిమాత్ర రమణీయమైనది. అప్రకృత వ్యవహారము ప్రకృత కర్తయందు నాయకుడు మొదలగు తన కర్తలచేత విశేషింపబడి యారోపింపబడునా; తదవిశేషితమై ఆరోపింపబడునా ? మొదటిది కాదు. ఇలాగైతే చంద్రాదులు నాయకత్వ వ్యవహారమున కాశ్రయ మగుటచేత వాటికి నాయకునితో సామ్యము సిద్ధించును. అది శ్లేషాది భిత్తికాభేదాధ్యవసాయముతో వ్యవహారాభేదమును ప్రతిపాదింపదలచుచున్న కవికి అభిమతము కానేకాదు. అభీప్సితమైనది నాయకత్వము. అదియు నాయకుడు వ్యవహార విశేషణమగు నపుడు సిద్ధించదు. మఱియు 'నిశాముఖం చుంబతి' అనుచోట చంద్రుని యందు నాయక వ్యవహారమే కాని నాయకత్వారోపము లేదు. అలాగే నిశయందు కూడా నాయికాత్వమునకు నారోపము లేదు; న్యాయము సమానమగుటవలన. ఈలాగ నాయిక లేకుండ ముఖ చుంబనము మాత్రము అసుందరము గావునను, నాయకా సాధారణ వ్యవహార మగుట కుదరకపోవుటవలనను, ఆరోపమేమి ప్రయోజనకారి ? మఱియు, రాత్రియందు స్త్రీలింగముచే నాయికాత్వము వ్యంగ్యమని నిరీక్షించినట్లైతే అప్పుడు చంద్రునియందున్న పుంలింగముచే వ్యంగ్యమగు నాయకత్వమును నిరీక్షింపబడుగాక.

రెండవది కాదు. నాయక సంబంధిగా దెలియని ముఖచుంబన మాత్రము అహృద్యము గనుక.

"తితీర్షుర్దుస్తరం మోహాదుడుపేనాస్మి సాగరం"- అను నిదర్శన కంటే వైలక్షణ్యము కొరకు మేము చెప్పిన వైధర్మ్యమే యాశ్రయింప వలయును గూడ గనుక. మిగిలిన విషయము వెంటనే చెప్పగలము.

యత్తు సర్వస్వకారాజ్ఞానువర్తినా కువలయానందకృతా సపూర్వ పక్ష సిద్ధాంతముక్తమ్-"అత్ర విశేషణసామ్యాత్సారూప్యాద్వా యద ప్రస్తుతవృత్తాన్తస్య ప్రత్యాయనం తత్ప్రకృతే విశేష్యే తత్సమా రోపార్థమ్, సర్వత్రైవ ప్రస్తుతానన్వయినః కవిసంరంభగోచరత్వా-యోగాత్. తతశ్చ సమాసోక్తావ ప్రస్తుతవ్యవహార సమారోపశ్చారుతా హేతుః. న తు రూపక ఇవ ప్రస్తుతే అప్రస్తుతసమారోపోఽస్తి. "ముఖం చంద్రః" ఇత్యత్ర ముఖే చంద్రత్వారోపహేతుచంద్రశబ్దసమభి వ్యాహారవత్ 'రక్తశ్చుంబతి చంద్రమాః' ఇత్యాదౌ సమాసోక్త్యుదా హరణే చంద్రాదౌ జారత్వాద్యారోపహేతోస్తద్వాచకపదసమభివ్యా హారస్యాభావాత్. న చేహ "నిరీక్ష్య విద్యున్నయనైః పయోదో ముఖం నిశాయామభిసారికాయాః" ఇత్యత్ర నిరీక్షణానుగుణనయనో పాదానం యథా పయోదస్య ద్రష్టృపురుషత్వస్య గమకం తథా కించి జ్జారత్వస్యాస్తి. నవా "త్వయ్యాగతే కిమితి వేపత ఏష సిన్ధుస్త్వం సేతుమన్థకృదతః కిమసౌ బిభేతి" ఇత్యత్ర సేతుమన్థకృత్త్వం విష్ణోః కార్యం యథా రాజ్ఞో విష్ణుత్వస్య తథా కించిదస్తి. తస్మాద్విశేషణ సమర్పితాప్రస్తుత వ్యవహారసమారోపమాత్రమిహ చారుతాహేతుః. యద్యపి విశేషణ సమర్పితయోర్ద్వయోరవిశిష్టం ప్రాధాన్యమ్, తత్రాప్యన్యతరాశ్రయే ధర్మిణ్యన్యతరారోపస్యావశ్యకత్వే, శ్రుతే ప్రకృతవ్యవహారధర్మిణ్యేవా ప్రకృత వ్యవహారస్యారోప ఉచితః. తస్య చ స్వరూపతో జ్ఞాతస్యారోపే చారుత్వాభావాత్కాముకాద్య ప్రస్తుత ధర్మి సంబన్ధిత్వేనావగమ్యమానస్య రసానుగుణత్వాదారోపః. కాముకాదేశ్చ పదాదనుపస్థితస్యాపి చుంబనాదినా వ్యఞ్జితస్య వ్యవ హార విశేషణత్వమ్. తస్మాత్ "అయమైంద్రీముఖం పశ్య రక్తశ్చుంబతి చంద్రమాః" ఇత్యత్ర జారసంబన్ధితాదృశచుంబనరూపవ్యవహా రాశ్రయశ్చంద్ర ఇత్యేవ బోధః" ఇతి.

సర్వస్వకారుని యాజ్ఞ అనువర్తించుచున్న కువలయానందకారునిచే

పూర్వపక్ష సిద్ధాన్త పూర్వకముగా చెప్పబడినది- "ఇచట విశేషణ సామ్యము వలనగాని, సారూప్యమువలనగానీ, అప్రస్తుత వృత్తాంతమును ప్రత్యాయన మొనర్చుట ప్రకృత విశేష్యమునందు దానికి సమారోపము కొరకే. అన్ని తీరులను ప్రస్తుతమున అన్వయించని దానికి కవి ప్రయత్న గోచరత్వము అయుక్తము గనుక. అందువలన సమాసోక్తియందు నప్రస్తుత వ్యవహార సమారోపము సౌందర్య హేతువు. రూపకమునందువలె ప్రస్తుతమునందు నప్రస్తుత సమారోపము లేదు. "ముఖం చంద్రః" అనే చోట ముఖమునందు చంద్రత్వారోపమునకు హేతువగు చంద్రశబ్ద సమభి వ్యవహారమువలె "రక్తః చుంబతి చంద్రమాః" ఇత్యాది సమాసోక్త్యుదాహరణములందు, చంద్రాదులయందు జారత్వాదుల నారోపించుటకు హేతువగు తద్వాచక పద సమభి వ్యవహారము లేకపోవుటవలన.

పోనీ- ఇక్కడ "నిరీక్ష్య" మొ. (మేఘుడు మెరపులను కన్నులతో అభిసారిక యొక్క మొగమును చూచి.)అనేచోట నిరీక్షణమునకు అనుకూల మగు నేత్రముల ఉపాదానము మేఘమునకు ద్రష్టృపురుషత్వమునకు ఎట్లు గమకమో అలాగు జారత్వమునకు గమకము ఏదియు లేదు గదా?

"త్వయ్యాగతే" మొ (నీవు రాగా ఈ సముద్రము ఏల వణకు చున్నది ? నీవు సేతుమంథన కృతివి. అందువలననా ఇట్లు భయపడుచున్నది?)

అనుచోట విష్ణుకార్యమగు సేతు మంథన కృత్త్వము ఎట్లు రాజునకు విష్ణుత్వ గమకమో అట్లు కొంచమును లేదు. అందువలన విశేషణముచే సమర్పింపబడిన అప్రస్తుత వ్యవహార సమారోపము మాత్రమే ఇక్కడ సౌందర్యమునకు హేతువు. నిజమునకు విచారించగా విశేషణ సమర్పితము లగు రెండర్థములకును ప్రాధాన్యము సమానమే, అయినను అన్యతరమున కాశ్రయమగు ధర్మియందు నన్యతరారోపము ఆవశ్యకమగుచుండగా, శబ్ద ముచే చెవినిపడిన ప్రకృత వ్యవహార ధర్మియందు నప్రకృత వ్యవహారము యొక్క ఆరోపము దగియున్నది స్వరూపముతో జ్ఞాతమైన దాని ఆరోపము నందు చారుత్వము లేదు కనుక, కాముకాదులైన అప్రస్తుత ధర్ములకు సంబంధించినట్లుగా తెలియబడు దానికి రసానుగుణమగుటవలన, ఆరోపము. పదముచే అనుపస్థితులైనప్పటికిని చుంబనాదికముచే వ్యంజితులు కనుక.

కాముకాదులకు వ్యవహార విశేషణత్వము. అందువలన - "అయ మైన్ద్రీముఖం పశ్యర క్తశ్చుంబతి చన్ద్రమాః" అనేచోట 'జారసంబంధి యైనటువంటి చుంబన రూప వ్యవహారాశ్రయము చంద్రుడు' అనియే బోధ" అని.

తదేతత్సర్వమసంగతమ్. యత్తావదుచ్యతే "ముఖం చంద్రః" ఇత్యత్ర ముఖే చంద్రత్వారోప ఇతి, తత్ర నామార్థ యోరభేదేనై వాన్వయాన్ముఖే చంద్రస్యారోపః, న చంద్రత్వస్య చంద్ర విశేషణస్య. యదప్యుచ్యతే— జారాఽపదసముఖివ్యావహారస్య హేతోర్వ్యిరహాన్న చంద్రాదౌ జారత్వారోప ఇతి, తత్ర శ్రౌతారోపే తాదృశసముఖివ్యావహారస్య హేతుత్వమ్, నత్వార్థారోపే. అన్యథా రూపకధ్వనేరుచ్ఛేదాపత్తేః. నచ రూపకధ్వనావారోప్యమాణాసాధా రణ ధర్మోక్తి రారోప్యమాణ తాదాత్మ్య వ్యంజికా, న చేహ తథా కించిదస్తీతి వాచ్యమ్. ఇహాపి పరనాయికాముఖచుంబనస్య శ్లేషమర్యా దయా వ్యంజన మర్యాదయా వా ప్రతీతస్య ప్రకృతధర్మిణి చంద్రే ఆరోప్యమాణస్య జారాసాధారణధర్మత్వేన జారత్వవ్యంజకతాయాః స్ఫుటత్వాత్. ఏతేన "విద్యున్నయనైః" ఇత్యత్ర "త్వం సేతుబంధన కృత్" ఇత్యత్ర చ యథా ద్రష్టృత్వ విష్ణుత్వగమకం తథేహ నాస్తీతి నిరస్తమ్. న చ జారత్వస్య చంద్రాదావారోపమంతరేణాపి జార వ్యవహారారోపః సిధ్యన్ననుపప త్తేరభావాన్న జారత్వం గమయేదితి వాచ్యమ్. గమకం హి ద్వివిధమ్— ఆక్షేపకం వ్యంజకం చ. తత్రా క్షేపకమనుపపద్యమానమేవ గమయతి. వ్యంజకం తు నానుపప త్తి మపేక్షతే. 'గతోఽ స్తమర్కః' ఇత్యాదౌ తథైవ దర్శనాత్. అన్యథా అర్థాపత్త్యా గతార్థత్వేన వ్యంజనావై యర్థ్యప్రసంగాత్. కిం చ త్వయాపి హి జారాదేరప్రకృతధర్మిణః ప్రతీతిరవశ్యం వాచ్యా. ఆరోప్యమాణ వ్యవహారవిశేషణార్థమ్. అన్యథా స్వరూపతో వ్యాప్రకృతవ్యవహారారోపే చారుతానాప త్తేః.

ఏవం చావశ్యోపస్థాప్యస్య జారాదేస్తాదృశచుంబనక ర్తరి చంద్రాదావేవ తాదాత్మ్యేన విశేషణత్వముచితమ్, న తు వ్యవ హారే భేదేన. చంద్రస్య జారభిన్నతావగమే పరనాయికావదన చుంబనస్యాహృద్యత్వాత్.

అది యంతయు నసంగతము.

'ముఖం చంద్రః' అనేచోట ముఖమునందు చంద్రత్వమునకారోప మనునది కాదు. నామార్థముల కభేదముతోనే అన్వయమున ముఖమునందు చంద్రున కారోపము అంతేకాని చంద్ర విశేషణమగు చంద్రత్వమునకు ఆరోపము కాదు. జారత్వాది పదముతో సమభిహారము హేతువగునది, లేదు కనుక చంద్రాదులయందు జారత్వారోపములేదని యెవ్వరైతే చెప్పుచున్నారో అది కాదు. అచట శ్రౌతమగు (శాబ్దము) ఆరోపములో నటువంటి సమభి వ్యాహారము హేతువు గావచ్చును కాని అర్థారోపముతో గాదు. అలా కాక పోతె రూపకధ్వని విచ్ఛేదాపత్తి. రూపకధ్వనియందు నారోప్యమాణా సాధా రణమైన ధర్మము చెప్పుట ఆరోప్యమాణ తాదాత్మ్యమును వ్యంజనము చేయునది; ఇచట అలా ఏదియు లేదని చెప్పుటకును వీలులేదు. ఇక్కడకూడా పరనాయికా ముఖచుంబనమునకు, శ్లేష మర్యాదచేతగాని వ్యంజన మర్యాద చేతగాని స్ఫురించు దానికి, ప్రకృత ధర్మియగు చంద్రునందు నారోపించ బడుచున్న దానికి జారాసాధారణధర్మముగా జారత్వము వ్యంజనము చేయుట స్ఫుటమగుటవలన. దీనిచేత 'విద్యున్మయనే' అనేచోట, ''త్వం సేతు బంధకృత్'' అనేచోటను ఎట్లు ద్రష్టృత్వ విష్ణుత్వములకు గమకమున్నదో అటుల నిచట లేదనుట నిరసించబడినది. జారత్వమునకు చంద్రాదులయం దారోపము లేకున్నను జారత్వ వ్యవహారారోపము సిద్ధించుచు, అనుపపత్తి లేకపోవుటవలన జారత్వమును అవగమింపజేయజాలదని చెప్పరాదు. గమ కము రెండు విధములు- ఆక్షేపకము, వ్యంజకము ఆక్షేపకమనునది కుదరక యుండునపుడే గమింపజేయును. వ్యంజకమైతే అనుపపత్తిని ఆపేక్షింపదు. 'గతోస్త మర్కః' ఇత్యాదులయందు అట్లే కనపడుచున్నది గనుక. అలా కానిచో అర్థాపత్తివలననే గతార్థమగుటవలన వ్యంజన వ్యర్థము గావలసి వచ్చును. మఱియు నీవైనను జారాదులగు, అప్రకృత ధర్మిల యొక్క ప్రతీతి నవశ్యముగా జెప్పవలెను, ఆరోపించబడుచున్న వ్యవహారమును విశేషించుటకొఱకు. అట్లు కాకపోయినచో స్వరూపతః అప్రకృత వ్యవహారా రోపమునందు చారుత్వము లేకపోవలసివచ్చును. ఈ తీరుగా నవశ్యోపస్థాప్యు లగు జారాదులకు తాదృశ చుంబనకర్తలగు చంద్రాదులయందే తాదాత్మ్య ముచే విశేషణత్వ ముచితము; వ్యవహారము నభేదముతోగాదు. చంద్రుడు

జార భిన్నుడు అని తెలియునపుడు పరనాయికా వదన చుంబనము అసుందరము గనుక.

అపి చ 'నిశాముఖం చుంబతి చంద్ర ఏషః' ఇత్యత్ర స్త్రీలింగ పుంలింగాభ్యాం ముఖచుంబనరూపార్థసచివాభ్యాం నాయికాత్వం నాయకత్వం చ వ్యజ్యత ఇతి హి నిర్వివాదమ్. అన్యథా 'నిశాముఖం చుంబతి చంద్రికైషా' 'అహర్ముఖం చుంబతి భానుబింబమ్' ఇత్యత్రాపి నాయకప్రతీత్యాపత్తేః. ఏవం చ సామానాధికరణ్యేనైవ సంసర్గేణ వ్యజ్యమానం నాయకత్వం నిశాశశినోర్నాయకత్వారోప ఏవ పర్యవసతి. "అపరిత్యక్తస్వరూపయోర్నిశాశశినోర్నాయకతాఖ్యధర్మవిశిష్టయోః ప్రతీతేః" ఇతి త్వదుపజీవ్యగ్రంథవిరోధశ్చ 'అవినాభావాదప్రకృతవ్యవహారేణాక్షిప్తేన ధర్మిణైవ ప్రస్తుతో ధర్మ్యవచ్ఛిద్యతే' ఇతి తట్టీకావిరోధశ్చ.

కించ "చుంబనాది వ్యవహారేణాభివ్యక్తస్య నాయకస్య వ్యవహారవిశేషణత్వమేవ, న త్వభేదేన చంద్రాదివిశేషణత్వమ్. చంద్రాదిపద సమానాధికరణపదానుపస్థాపితత్వాత్" ఇత్యుక్తం తత్ర తుల్యన్యాయత్వాన్నిశాయామపి న నాయికాత్వారోపః, అపి తు నాయకపదభివ్యక్తాయా నాయికాయా అపి వ్యవహారసంబంధిత్వేనైవావస్థానమితి వక్తవ్యమ్. తచ్చ బాధితమ్, నాయికాత్వానాలీఢ కేవలరాత్రిముఖచుంబనరూపస్య వ్యవహారస్య నాయికాసంబంధిత్వాత్. నహి రాత్రితాదాత్మ్యం వినా నాయికాయాః పృథఙ్ముఖం విశేషయితుమస్తి సామర్థ్యమ్.

మఱియు "నిశాముఖం చుంబతి చంద్రఏషః" అనుచోట స్త్రీలింగ పుంలింగములచే, ముఖ చుంబన రూపమైన యర్థము తోడ్పాటువలన నాయికాత్వమున్ను నాయకత్వమున్నూ వ్యక్తమగుచున్నవనుట నిర్వివాదమైనది. అలా కాకపోతే— "నిశాముఖం చుంబతి చంద్రికైషా" 'అహర్ముఖం చుంబతి భానుబింబం" అనేచోటులందు గూడ నాయక ప్రతీతి కలుగవలసివచ్చును. ఇలా సామానాధికరణ్యమనే సంబంధముచేతనే వ్యక్తమగుచున్న నాయకత్వము నిశాశశులందు నాయకత్వపు టారోపమునందే పర్యవసించును. "అపరిత్యక్త స్వరూపులగు నిశాశశులకు నాయకత్వాఖ్య ధర్మవిశిష్టులుగా

ప్రతీతి అగుట వలన" అను నీ కుపజీవ్యమగు గ్రంథము అగు అలంకార సర్వస్వమునకు విరోధమున్ను వచ్చును. "అవినాభావమున నప్రకృత వ్యవ హారముచే నాక్షిప్తమగు ధర్మిచేతనే ప్రకృతుడగు ధర్మి నిర్ణయింపబడును" అని దాని టీకా గ్రంథ విరోధమున్ను సంభవించును.

మఱియు— "చుంబనాది వ్యవహారముచేత నభివ్యక్తమైన నాయకునికి వ్యవహార విశేషణత్వమేను; అభేదముచేత చంద్రాది విశేషణత్వముగాదు. చంద్రాది పదములతో సమానాధికరణములగు పదములచే ననుస్థాపితము గనుక" అని చెప్పబడినది. అచట తుల్యన్యాయమువలన రాత్రియందు కూడ నాయికాత్వమారోపింపరాదు; ఇక నేమనగా నాయకునివలె నభివ్యక్తురాలైన నాయికకైనను వ్యవహార సంబంధిగానే స్థితి అని చెప్పవలెను. అదియు బాధిత మైనది. నాయికాత్వముచే అనాలీఢమగు కేవలరాత్రి ముఖచుంబన రూపమగు వ్యవహారము నాయికా సంబంధి కాదు కనుక. రాత్రి తాదాత్మ్యము లేకుండ నాయికకు ముఖమును పృథక్కుగా విశేషించుటకు సామర్థ్యము లేదు కదా ?

అపి చ—

"నిర్లక్ష్మీకాభవత్ప్రాచీ ప్రతీచీం యాతి భాస్కరే
ప్రియే విపతురమణీరక్తే కా ముదమంచతి."

ఇత్యత్ర పూర్వార్ధగతాయాం సమాసోక్తౌ భాస్కరాదీనాం నాయకత్వాప్రతీతావుత్తరార్ధే ప్రియత్వాదినా సమర్థనాయాః సర్వథైవానుపపత్తేః. అన్యచ్చ — అప్రకృతవ్యవహారః ప్రకృతవిశేష్యే ప్రకృతవ్యవహారతాటస్థ్యేనారోప్యతే తదభిన్నతయా వా ? నాద్యః. ఏవం చ ప్రకృతవిశేష్యే ప్రకృతాప్రకృతవ్యవహారయోరేకత్ర ద్వయమితి విషయతాశాలీ బోధః స్యాత్. స చాసిద్ధ ఇత్యుక్తమేవ. న ద్వితీయః ఇతోఽపి ప్రకృతవ్యవహార ఏవాప్రకృతవ్యవహారస్యాభేదే నారోపో వరీయాన్, న తు భేదసంసర్గేణ ప్రకృతవిశేష్యే, అభేదాంశే వ్యవహారాంశే చారోపస్వీకార ప్రసంగాత్. మమ త్వభేదాంశ మాత్ర ఇతి స్ఫుట ఏవ విశేషః. తస్మాదప్రకృతాభిన్నతయా వ్యవసితః, ప్రకృతవ్యవహారః స్వవిశేష్యే తద్విశేష్యాభిన్నతయావస్థితే

భాసతే. తత్రాప్రకృతార్థ ఉపస్కారకతయా గుణ ఇతి ప్రకార ఏవ రమణీయః స చ న వాక్యార్థరూపకే 'త్వత్పాదనఖరత్నానామ్' ఇత్యత్రేవ విశిష్టస్య విశిష్టే. సమాసోక్తౌ తయోః పృథక్ఛబ్దవేద్యత్వా భావాత్. కిం తు ప్రకృత వాక్యార్థఘటకాః పదార్థాస్తాదాత్మ్యేనా ప్రకృతఘటకపదార్థాలీఢా ఏవ వైశిష్ట్యమనుభవంతో మహావాక్యార్థ రూపేణ పరిణమంతీతి సూక్ష్మమీక్షణీయమ్. అతిశయోక్తావివాప్రకృ తేన ప్రకృతస్య నిగరణం తు న వాచ్యమ్. తస్య శబ్దావాచ్యత్వాత్.

మఱియు—

"నిర్లక్ష్మీకా" మొ (భాస్కరుడు ప్రతీచిని చేరుచుండగా ప్రాచి శోభాశూన్య అయ్యెను. ప్రియుడు సవతియం దాసక్తుడగు నపుడు ఎవతె సంతోషమును పొందును ?)

అనుచోట పూర్వార్ధగతమగు సమాసోక్తియందు భాస్కరాదులకు నాయకత్వము అప్రతీతమగునపుడు, ఉత్తరార్ధమునందు ప్రియత్వము మొద లగు వానిచే సమర్థించుట ఏతీరునైనను అనుపపన్నమేకదా ? మఱి యొకటియును —

అప్రకృత వ్యవహారము ప్రకృత విశేష్యమునందు ప్రకృత వ్యవహార తాటస్థ్యముతో నారోపింపబడునా, తదభిన్నత్వముచే నారోపింపబడునా ? మొదటిది గాదు. ఈలాగైతే - ప్రకృత విశేష్యమందు ప్రకృతా ప్రకృత వ్యవహారములకు, ఒకచోట రెండు, అనేకవిషయతాశాలియగు బోధ యగును. అది అసిద్ధమని చెప్పియే యుంటిమి. రెండవది గాదు. ఇంతకంటెనున్న ప్రకృత వ్యవహారమునందు అప్రకృత వ్యవహారమునకు నభేదముచే నారో పమే శ్రేష్ఠమైనది. కానీ భేద సంసర్గముచే ప్రకృత విశేష్యమునందు కాదు. అభేదాంశమునందునూ, వ్యవహారాంశమునందును నారోపస్వీకారప్రసంగము వచ్చును నాకైతే అభేదాంశము మాత్రమందని విశేషము స్ఫుటమే. అందువలన అప్రకృతాభిన్నముగా వ్యవస్థితమైన ప్రకృత వ్యవహారము తద్విశేష్యాభిన్నముగ నవస్థితమగు స్వవిశేష్యమునందు భాసించును. అందు నప్రకృతార్థ ముపస్కారకముగా గుణమను ప్రకారమే రమణీయమైనది.

అదియు వాక్యార్థ రూపకమున, "తృత్వాదనఖరత్వానాం" అనే చోట వలె విశిష్టమునకు విశిష్టమునందు కాదు. సమాసోక్తియందు నా రెంటికీ పృథక్కుగా శబ్దవేద్యత్వము లేదు గనుక. ఇక నేమంటే ప్రకృత వాక్యార్థమున ఘటకమైన పదార్థములు తాదాత్మ్యముతో నప్రకృత ఘటక పదార్థములచేత నాలీఢములయియే వైశిష్ట్యమనుభవించుచు, మహావాక్యార్థ రూపముతో పరిణమించుచున్నవని సూక్ష్మముగా జూడవలెను. అతిశయోక్తి యందువలె నప్రకృతముచే ప్రకృతమునకు నిగరణము చెప్పకూడదు; అది శబ్దవాచ్యము గనుక.

అథాస్యాః కే చన భేదా నిరూప్యంతే —

విశేషణసామ్యం శ్లేషేణ భవతి శుద్ధసాధారణ్యేన వా, తదపి ధర్మాంతరపురస్కారేణ కార్యపురస్కారేణ వేతి ప్రత్యేకం ద్వివిధమ్. తత్ర 'విబోధయన్ కరస్పర్శైః' ఇత్యత్ర ధర్మాంతర పురస్కారేణ శ్లేషే సముదాహృత మపి విశేషణసామ్యం పునరు దాహ్రియతే —

"ఉత్సంగే తవ గంగే పాయం పాయం పయోఽతిమధురతరమ్
శమితాఖిలశ్రమభరః కథయ కదాహం చిరాయ శయితాహే"

అత్ర శిశుజననీవృత్తాంతాభేదేన స్థితః ప్రకృతవృత్తాంతః. శ్లిష్టకార్యపురస్కారేణాప్యుదాహృతమ్ 'ఆబధ్నాస్యలకాన్నిరస్యసి—' ఇత్యత్ర.

తరువాత దీనికి కొన్ని భేదములు జెప్పబడుచున్నవి—

విశేషణ సామ్యము శ్లేషతోనగును, శుద్ధ సాధారణ్యముతోడనుగాని. అదియు ధర్మాంతర పురస్కారముచేతగాని, కార్యపురస్కారముచేతగాని అని ప్రత్యేకముగా రెండు విధములు

అచట— "విబోధయన్కరస్పర్శైః" అనుచోట ధర్మాంతర పుర స్కారముచేత శ్లేషయందు నుదహరింపబడినను విశేషణ సామ్యము మరల నుదాహరింపబడుచున్నది.

"ఉత్సంగే" (ఓ గంగా ! నీ ఉత్సంగమున అతిమధురమగు నీ జలము త్రాగి యావత్తు ఆయాసము తొలగించుకొని ఎప్పుడు నేను సుఖముగా చాలా కాలము పడుకొందునో చెప్పుము.)

ఇచట శిశుజననీ వృత్తాంతాభేదముతో నున్న ప్రకృత వృత్తాంతము. శ్లిష్టకార్యపురస్కారముతో కూడ "అబధ్నాస్యలకాన్నిరస్యసి" అను చోట నుదాహరింపబడినది

శుద్ధసాధారణ్యేన ధర్మాంతరపురస్కారేః యథా—

"అలంకర్తుం కర్ణౌ భృశమనుభవన్త్యా నవరుజాం
ససీత్కారం తిర్యగ్వలితవదనాయా మృగదృశః.
కరాబ్జవ్యాపారానతిసుకృతసారాన్ రసయతో
జనుః సర్వశ్లాఘ్యం జయతి లలితోత్తంస భవతః"

అత్ర నవకాంతయా క్లేశేన కర్ణే క్రియమాణస్యోత్తంసస్య వృత్తాంతః ప్రత్యగ్రఖండితాధరకాముకవృత్తాంతాభేదేన స్థితః. యథా వా—

"అంధేన పాతభీత్యా సంచరతా విషమవిషయేషు
దృఢమివ మయాగృహీతా హిమగిరిశృంగా దుపాగతా గంగా

అత్ర గిరిశృంగప్రభవవేణుయష్టివ్యవహారాభేదేన.

శుద్ధ సాధారణ్యముతో ధర్మాంతర పురస్కారముతో నెట్లనగా.

"అలంకర్తుం" మొ. (లలితమగు ఓకర్ణావతంసమా! కర్ణములనలంకరించుకొనుటకు మిక్కిలి నూతన పీడను అనుభవించు చున్నట్టియు, సీత్కారముతో అడ్డముగా త్రిప్పబడిన ముఖముగల మృగేక్షణ యొక్క, సకల పుణ్యసారభూతములగు హస్తపద్మచాలనములను ఆస్వాదించుచున్న నీ యొక్క జన్మ సర్వశ్లాఘ్యము కదా !).

ఇచట నూతన ప్రియురాలిచే కష్టముచే చేయబడిన కర్ణావతంసము యొక్క వృత్తాంతము నూతనముగా ఖండితాధరుడగు కాముకుని వృత్తాంతముతో నభేదముతో నున్నది. - మరియు.

"అంధేన" మొ. (గ్రుడ్డివాడనై పడిపోయెదనను భయముతో విషమములగు విషయములందు సంచరించు చున్న నాచే దృఢముగా హిమగిరి

శృంగమునుండి వచ్చిన గంగ అవలంబింపబడినది.)

ఇచట హిమగిరి శృంగమున బుట్టిన వేణుయష్టివ్యవహారాభేదమున.

కార్యసాధారణ్యేన యథా—

"దేవ త్వాం పరితః స్తువంతు కవయో లోభేన, కిం తావతా
స్తవ్యస్త్వం భవితాసి, యస్య తరుణశ్చాపప్రతాపోఽధునా.
క్రోడాంతః కురుతే తరాం వసుమతీమాశాః సమాలింగతి
ద్యాం చుంబత్యమరావతీం చ సహసా గచ్ఛత్యగమ్యామపి."

కార్యధర్మాంతరయోః సంకరేణ సాధారణ్యం యథా—

"ఉత్క్షిప్తాః కబరీభరం వివలితాః పార్శ్వద్వయం న్యక్కృతాః
పాదాంభోజయుగం రుషా పరిహృతా దూరేణ చేలాంచలమ్.
గృహ్ణంతి త్వరయా భవత్ప్రతిభటక్ష్మాపాలవామభ్రువామ్
యాంతీనాం గహనేషు కంటకచితాః కే కే న భూమీరుహాః."

అత్ర కంటకచితత్వేన కబరీగ్రహణాది సంకీర్ణమ్.

కార్యసాధారణ్యముతో నెట్లనగా-

"దేవ త్వాం" మొ (ఓ ప్రభువా! నిన్ను కవులు లోభముచే స్తోత్రము చేయుదురు గాక ! ఏమైనను నీవు స్తోత్రము చేయుటకు తగియున్న వాడ వగుదువా ? ఏలననగా నీ యొక్క తరుణమగు వింటి ప్రతాపమిపుడు భూమిని రొమ్ములోపల జేర్చుకొనుచున్నది. దిక్కులను కౌగలించుకొను చున్నది. ఆకాశమును చుంబించు చున్నది. అగమ్యయైన అమరావతి దగ్గరకు గూడ బోవుచున్నది.)

కార్యధర్మాంతరములకు సంకరముచే సాధారణ్యమెట్లనగా-

"ఉత్క్షిప్తాః" మొ. ఇచట కంటకచితత్వముతో కబరీగ్రహణాదికము సంకీర్ణమైనది

సమాసోక్తౌ వ్యంజమానస్యాప్రకృతవ్యవహారస్యోపస్కారకత్వమేవ న ప్రాధాన్యమ్. తదుపస్కృతవాచ్యస్యైవ ప్రాధాన్యమిత్యుక్తమ్. తత్ర యది వ్యంగ్యస్యైవ ప్రాధాన్యం స్యాత్, న వాచ్యస్య, తదా 'దేవ త్వాం పరితః స్తువంతు —' ఇతి ప్రాగుదా

హ్యాృతపద్యే నిందావ్యాజేన స్తుతౌ పర్యవసానం న స్యాత్. స్తుతి నిందయోః ప్రకృతాప్రకృతవ్యవహారాశ్రయత్వాదితి ధ్యేయమ్.

సమాసోక్తి యందు వ్యజ్యమానమైన ప్రకృత వ్యవహారమునకు నుప స్కారకత్వమేను; ప్రాధాన్యము లేదు. తదుపస్కృతమైన వాచ్యమునకే ప్రాధాన్యమని చెప్పబడినది వ్యంగ్యమునకే ప్రాధాన్యమగుచో, వాచ్యము నకు లేకున్నచో, "దేవ త్వాం పరితః స్తువంతు" అని పూర్వమందు చెప్పబడిన పద్యమున నిందావ్యాజమున స్తుతియందు పర్యవసానము కాకుండెడిది, స్తుతి నిందలకు ప్రకృతాప్రకృత వ్యవహారాశ్రయత్వము వలన; అని తెలియ దగినది.

"—'తన్వీ మనోహరా బాలా పుష్పాక్షీ పుష్పహాసినీ
వికాసమేతి సుభగ భవద్దర్శనమాత్రతః'.

అత్ర తనుత్వాది విశేషణ సామ్యాల్లోలాభ్యాం లతావ్యవ హారప్రతీతిః. తత్ర లతైకగామివికాసాఖ్య ధర్మసమారోపః కారణమ్. అన్యథా విశేషణ సామ్యమాత్రేణ నియతలతావ్యవహారస్యాప్రతీతేః. వికాసశ్చ ప్రకృతే ఉపచరితో జ్ఞేయః" ఇత్యలంకారసర్వస్వకార ఆహ, తత్ర విచార్యతే-నాత్ర విశేషణ సామ్యమాత్రేణ లతావ్యవహార-ప్రతీతిః,అపి తు లతారూపాప్రకృతాసాధారణవికాసారోపమహిమ్నేతి భవతైవోక్తమ్. తథా చ విశేషణ సామ్యాదప్రస్తుతస్య గమ్యత్వ మితి త్వదుక్తసమాసోక్తిలక్షణస్య కథమత్ర ప్రవృత్తిః? న చ లక్షణే విశేషణ సామ్యమాత్ర గమ్యత్వం న వివక్షితమ్, అపి తు విశేషణ సామ్యగమ్యత్వమ్. ప్రకృతే చ వికాసస్యాప్యధికస్య గమకత్వమ్; న త్వేతావతా విశేషణసామ్యస్య గమకతాహానిరితి వాచ్యమ్. శ్లేషేఽతివ్యాప్త్యాపత్తేః. న చ విశేషణమాత్ర సామ్యగమ్యత్వం వివక్షితమ్. ఏవం చ న శ్లేషేఽతివ్యాప్తిః. నాపి 'తన్వీ మనోహరా' ఇత్యత్ర లక్షణస్యావర్తనమితి వాచ్యమ్- 'తన్వీ మనోహరా' ఇత్యత్ర సమాసోక్తేరేవాభావాత్. యత్ర సాధారణ విశేషణ మహిమ్నాఽప్రకృతస్య స్ఫూర్తిస్తత్ర సమాసోక్తిః. యత్ర త్వసాధా రణ మహిమ్నా తత్ర వ్యంగ్యరూపకమితి విషయవ్యవస్థాపనాత్. ఏవం చ ప్రకృతే సాధారణ విశేషణసత్త్వేపి న తన్మహిమ్నా లతాయా

స్ఫూర్తిః, అపి తు వికాసమహిమ్నేతి వ్యంగ్యరూపక ముచితమ్‌. యథా—

'చకోరనయనానందికహ్లోరాహ్లాదకారణమ్
తమసాం కదనం భాతి వదనం సుందరం తవ'.

ఇత్యాదౌ సుందరమితి సాధారణవిశేషణసత్త్వేఽపి రూపకమేవ, తథేహాపి. క్వచిద్‌గుణీభూతం క్వచిత్ప్రధానమిత్యన్యదేతత్‌. సాధారణ్యేన విశేషణసామ్యా మూలాయాః సమాసోక్తేస్తు 'అంధేన పాతభీత్యా సంచరతా —' ఇత్యాదిః ప్రాగస్మాభిరుదాహృతో విషయ ఇతి న నిరవకాశత్వమ్‌. తత్ర హ్యసాధారణధర్మారోప మంతరేణ సాధారణ విశేషణమహిమ్నైవాప్రకృత ప్రతీతేః ఏతేన 'తదేవం సాధారణ్యేన సమాసోక్తేర్విశేషణసామ్యేఽప్యప్రకృత సంబంధిధర్మకార్యసమారోపమంతరేణ తద్వ్యవహార ప్రతీతిర్న భవతి' ఇతి విమర్శినీ కృతా యదుక్తం తన్నిరస్తమ్‌. తస్మాదేవం సంభవతి విషయ విభాగే 'తన్వీ మనోహరా—' ఇత్యత్ర సమాసోక్తి వచనమహృద్యమ్‌

"తన్వీ" మొ. (ఓ సుందరుడా! మనోహారియు, బాలయు, తన్వియు పుష్పాఢ్యయు, పుష్పహాసినియు నగు ఈమె నీవు కనుబడినంత మాత్రమున వికాసమును బొందుచున్నది.)

ఇచట తనుత్వాది విశేషణ సామ్యమువలన లోలాక్షియందు లతావ్యవహారము ప్రతీతమగును. అచట లతయందు మాత్రమే సంబంధించునటు వంటి వికాసమను ధర్మము యొక్క సమారోపణము కారణము. అలాకాని యెడల విశేణముల సామ్యము మాత్రముచే నియమితమగు లతా వ్యవహారము ప్రతీతముకాదు కనుక. వికాసమున్ను ప్రకృతమం దుపచరితముగ తెలియవలెను." అని అలంకార సర్వస్వకారుడనెను. అక్కడ విచారింతము.

ఇచట విశేషణ సామ్యమాత్రముచే లతా వ్యవహారము ప్రతీతము గాదు. ఇకనేమనగా లతారూపాప్రకృతాసాధారణ వికాసారోప మహిమచేనని నీవే చెప్పితివి. అలాగ "విశేషణ సామ్యము వలన అప్రస్తుతము గమ్యము" అని నీవు చెప్పిన సమాసోక్తి లక్షణమునకు ఎట్లు ఇచట ప్రవృత్తి? లక్షణమునందు విశేషణ సామ్యమాత్రముచే గమ్యత్వము వివ

క్షితముగాదు; ఏమనగా- మరి విశేషణ సామ్యముచేత గమ్యత్వము. ప్రకృత మునందు వికాసమునకన్న గమకత్వమధికము. అంతటితో విశేషణ సామ్యము నకు గమకతాహానిలేదు-అనరాదు. శ్లేషయందతివ్యాప్తి యాపాదించును. "అదికాదు; విశేషణ మాత్రసామ్యమున గమ్యత్వము వివక్షింపబడినది; అట్లయినచో శ్లేషయందతివ్యాప్తి లేదు. "తన్వీ మనోహరా" అనుచోట లక్షణా ప్రవృత్తియు లేదు;" అనరాదు. "తన్వీ మనోహరా" అను చోట సమాసోక్తియే లేదు కనుక.

ఎక్కడ సాధారణ విశేషణ మహిమచే అప్రకృతస్ఫూర్తి అగునో, అక్కడ సమాసోక్తి ఎక్కడ అసాధారణ మహిమచే నగునో అక్కడవ్యంగ్య రూపకమని విషయను వ్యవస్థాపితమైనది కనుక ఇలాగ ప్రకృతమునందు సాధారణ విశేషణ మున్నను. ఆ మహిమచే లనకు స్ఫూర్తి లేదు, ఇక వికాస మహిమచేత నని వ్యంగ్య రూపకము ఉచితము ఎట్లనగా—

"చకోరనయనా" (చకోరనయనములకు కల్హారములకు ఆహ్లాదము గలిగించునట్టిదై చీకట్లకు నాశకమైనదై సుందరమై నీమొగము ప్రకాశించు చున్నది.)

ఇత్యాదుల యందు సుందరమని సాధారణ విశేషణమున్నప్పటికిని రూపకమే యగును. అటులనే ఇచటను గూడ—

ఒకచోట గుణీభూతము ఒక చోట ప్రధానము అనునది విషయాన్తరము. సాధారణ్యముచేత విశేషణసామ్యమూలమగు సమాసోక్తికైతే- "అంధేన పాతభీత్యా సంచరతా" ఇత్యాది, ఇదివరకు మాచే నుదాహరింపబడినది విషయ మని నిరవకాశత్వము లేదు. అచట నసాధారణ ధర్మారోపము లేకుండా, సాధారణ విశేషణ మహిమచేతనే అప్రకృతము ప్రతీతము కనుక.

దీనిచేత—

"తదేవం" (కనుక ఈ తీరుగా సాధారణ్యముచేత సమాసోక్తికి విశేషణముల సామ్యమున్నను అప్రకృత సంబంధి ధర్మకార్యముల యొక్క సమారోపములేనిచో వాని వ్యవహారము యొక్క ప్రతీతి కలుగదు)

ఇత్యాది విమర్శనీకారులచే నేమి చెప్పబడినదో అది నిరస్తమైనది. అందువలన విషయ విభాగము ఇలా సంభవించుచుండగా "తన్వీ మనోహరా" అనుచోట సమాసోక్తి యనుట హృద్యము గాదు.

యదపి "ఔపమ్యగర్భత్వేనాపి విశేషణసామ్యం సంభవతి.
యథా—

"దంతప్రభాపుష్పచితా ప్రాణిపల్లవశోభినీ
కేశపాశాలివృందేన సువేషా హరిణేక్షణా"

అత్ర హరిణేక్షణామాత్రవృత్తేః సువేషత్వస్య విశేషణస్య మహిమ్నా దంతప్రభాసదృశాని పుష్పాణీత్యాదియోజనాం విహాయ దంతప్రభాః పుష్పాణీవేత్యాద్యుపమితసమాసాశ్రయేణ కృతే యోజనే ప్రకృతార్థ సద్ధౌ సత్యాం వృత్త్యంతరేణ త్యక్తాయా ఏవ యోజనాయాః పునరుజ్జీవనే పుష్పపల్లవాలి వృందైరుపమేయై రాక్షిప్తాయా లతాయాః ప్రత్యయాన్న తద్వ్యవహారారోపః. ఏవం సువేషేత్యపహాయ పరీక్షితే కృతే ఉపమారూపక సాధక బాధక ప్రమాణాభావాత్తదుభయసంశయరూపసంకరాశ్రయేణ కృతే యోజనే పశ్చాత్పూర్వోక్తరీత్యా లతాప్రతీతేః సమాసోక్తిరేవ. సమాసభేదేనార్థభేదేపి శబ్దైక్యమాదాయ శ్లిష్టమూలాయామివ విశేషణసామ్యం బోధ్యమ్. అథాపంతే వా రూపకాశ్రయేణ దంతప్రభా ఏవ పుష్పాణీతి యోజనే కృతే తు హరిణేక్షణాంశే అక్షిప్తలతాతాదాత్మ్యకేనైక దేశవివర్తిరూపకేణైవాప్రకృతార్థప్రత్యయోపపత్తేర్నార్థః సమాసోక్తేరత్ర"—ఇతి తేనైవోక్తమ్. తదపి న విచారసహమ్. దంత ప్రభాః పుష్పాణీవేత్యుపమాగర్భత్వేనాప్యాదౌ యోజకే కృతే హరిణేక్షణాంశే అక్షిప్తలతోపమానికయా ఏకదేశవివర్తిన్యా ఉపమయైవ గతార్థత్వాత్సమాసోక్తేరానర్థక్యాదత్రాప్రసక్తేః. న చోద్భట మతే ఏకదేశవివర్తినో రుపమాసంకరయోరస్వీకారాత్తథోక్తమితి వాచ్యమ్. అనుపదమేవ స్వయంతేన తత్స్వీకారాత్.

అయితే, "ఔపమ్య గర్భత్వముతోనైనను విశేషణ సామ్యము సంభవించును ఎట్లనగా—

"దంత ప్రభా" మొ. (దంతప్రభా పుష్పచితయు, పాణిపల్లవశోభిని యునగు హరిణేక్షణ కేశపాశాలి వృందముచే సువేష.)

ఇచట హరిణేక్షణా మాత్రవృత్తి యగు సువేషత్వమను విశేషణము

యొక్క మహిమచేతను దంతప్రభలతో సమానమగు పుష్పములను యోజనను విడిచి దంతప్రభలు పుష్పముల వంటివి అని ఉపమిత సమాసము చేయగా ప్రకృతార్థ సిద్ధియగుచుండగా, వృత్త్యంతరముచే విడచిన యోజననే పునరు జ్జీవించుటలో, పుష్పపల్లవాళిబృందోపమేయములచే నాక్షిప్తమగు లత యొక్క ప్రత్యయము వలన దాని స్వాహారము యొక్క ఆరోపము లేదు. ఈ తీరుగా "సువిశేష" అను దానిని విడిలివైచి పరీతా అని చేసిన యెడల ఉపమా రూపకములను సాధించునట్టియు బాధించునట్టియు ప్రమాణములు లేవు కనుక తదుభయ సంశయ రూపమైన సంకరమును ఆశ్రయించుటచేత యోజనముచేయగా తరువాత వెనుక చెప్పిన తీరుగా తీగయొక్క ప్రతీతి వలన సమాసోక్తియే. సమాస భేదముచేత నర్థభేదమైనప్పటికిని శబ్దైక్యమును తీసుకొని శ్లిష్టమూల యందు వలె విశేషణ సామ్యమును గ్రహించవలెను. మొదటగానీ చివరగానీ రూపకము నాశ్రయించుటచే "దంత ప్రభలే పూవులని" యోజన చేయగా హరిణేక్షణాంశమునందు నాక్షేపించబడిన లతా తాదాత్మ్యము గల్గిన ఏకదేశి వివర్తి రూపకముచేతనే అప్రకృతార్థ ప్రత్యయము ఉపపన్నమగుట వలన ఇచట సమాసోక్తి ప్రయోజనములేదు"-అని అతడే చెప్పెను అదియు విచార సహముకాదు. "దంతప్రభలు పుష్పాల వంటివి" అని ఉపమాగర్భత్వముతోనైనను మొదట యోజనమొనర్పగా హరిణేక్షణా భాగమున నాక్షిప్తమగు లతతో పోలికగల ఏకదేశి వివర్తియైన ఉపమతోనే గతార్థమగుటవలన సమాసోక్తి వ్యర్థమగును కావున ఇట నది ప్రసక్తింపదు. ఉద్భటుని మతమందు ఏకదేశ వివర్తులగు ఉపమాన సంకరము లను స్వీకరించరు గనుక నట్లు చెప్పితి మనరాదు అనుపపనమే అది తనచే స్వయముగా స్వీకరింపబడెను గదా ?

"హేలాహాలసమో మన్యు రనుకంపా సుధోపమా
కీర్తిస్తే చంద్రసదృశీ భటాస్తు మకరోద్భటాః"

ఇత్యాదౌ గత్యంతరాభావాత్తేనాప్యేకదేశ వివర్త్యుపమాయా ఏవ స్వీకరణీయత్వాచ్చ. అవశ్యక్లృప్తేనోపపత్తౌ భేధాంతరకల్పనా- నౌచిత్యాత్. తస్మాదౌపమ్యగర్భవిశేషణోత్థాపితః సమాసోక్తి ప్రకారో న సంగచ్ఛతే.

యత్ర శ్లిష్టవిశేషణేన శుద్ధసాధారణ విశేషణేన వా సహచరిత మౌపమ్యగర్భవిశేషణం తత్ర యద్యప్యస్తి సమాసోక్తిస్తథాపి నాసావౌపమ్యగర్భవిశేషణోత్థాపిత స్తృతీయః ప్రభేదో భవితుమీష్టే, స్వతంత్ర విషయత్వాభావాత్.

'నిర్మలాంబరరమ్యశ్రీః కించిద్దర్శిత తారకా
హంసావలీహారయుతా శరద్ విజయతే తరామ్,'

అత్ర పూర్వార్ధగతశ్లిష్టవిశేషణోత్థాపితైవ సమాసోక్తిరుత్తరార్ధ గతే నౌపమ్యగర్భవిశేషణేన విద్వదుత్థాపితా యుక్తిస్తదనుగామినా మూర్ఖేణైవానుమోద్యతే. ఏవం 'దత్తానందా సమస్తానాం ప్రఫుల్లోత్పల మాలినీ' ఇతి పూర్వార్ధే కృతే శుద్ధసాధారణ విశేషణోత్థాపితైవ.

"హాలాహల సమః" మొ. (నీ యొక్క కోపము హాలాహలముతో సమానమైనది; నీ యొక్క దయ అమృతముతో సమానమైనది; నీ యొక్క కీర్తి చంద్రసమానమైనది; నీ యొక్క భటులు మొసళ్ళవలె భయంకరులు) ఇత్యాదులందు గత్యంతరములేక అతడు కూడ ఏకదేశవివర్త్యుపమనే స్వీకరించవలయును గూడా. ఇట్లు తప్పక క్లృప్తమగు దానితోనే ఉపపన్నము కాగా భేదాంతరమును గల్పన మొనర్చుట యుచితము గాదు. అందువలన ఔపమ్యగర్భవిశేషణముచే నుత్థాపితమగు సమాసోక్తి ప్రకారము సంగతముకాదు. ఎచట శ్లిష్టవిశేషణముచే గాని, శుద్ధ సాధారణ విశేషముచేగాని సహచరితమగు నౌపమ్య గర్భవిశేషణ ముండునో నచట విచారించగా సమాసోక్తియున్నను, అది ఔపమ్య గర్భములగు విశేషణములచేత నుత్థాపితమగు మూడవ ప్రభేదమగుటకు శక్తి చాలదు; స్వతంత్ర విషయము కాదు గనుక. ఎట్లనగా—

"నిర్మలాంబరరమ్యశ్రీః" మొ. (నిర్మలాంబర రమ్యశోభయు, కించిద్దర్శిత తారకయు, హంసావళీహారయుతయునగు శరదృతువు బాగుగా ప్రకాశించుచున్నది.)

ఇచట పూర్వార్ధగతయగు శ్లిష్టవిశేషణోత్థాపిత యగు సమాసోక్తి ఉత్తరార్ధగతమగు నౌపమ్యగర్భ విశేషణముచేత విద్వదుత్థాపితమగు యుక్తి

అతనిని అనుసరించు మూర్ఖునిచేతను వలె అనుమోదిత మగుచున్నది.

ఇలాగే—"దత్తానందా సమస్తానాం ప్రఫుల్లోత్పల మాలినీ" అని పూర్వార్ధముచేయగా శుద్ధసాధారణ విశేషణోత్థాపితయే యగును.

ఏవం చ—

'పరిఫుల్లాబ్జనయనా చంద్రికా చారుహాసినీ
హంసావలీ హారయుతా శరద్ విజయతే తరామ్'

ఇత్యత్రోపమారూపకయోః సాధకస్య బాధకస్య చాభావాత్సంకరాలంకారస్వీకర్తృనయే తదుభయ సంశయాత్మక ఏకదేశవివర్తి సంకరాలంకార ఏవ. తదస్వీకర్తృనయే చ యదోపమిత సమాసస్ఫూర్తిస్తదైకదేశవివర్తిన్యుపమా, విశేషణ సమాసస్ఫూర్తౌ తథావిధమేవ రూపకమితి ప్రథమయోజనయైవాప్రకృతార్థావగతేర్ద్వితీయ యోజనాయాః పరిఫుల్లాబ్జానీవ నయనాని ఇత్యుపమాగర్భాయా వైయర్థ్యాదనుత్థానమేవ. యదా తు 'శరద్వర్షాసఖీ బభౌ' ఇతి చతుర్థచరణం నిర్మీయతే తదా తు శరన్మాత్రవృత్తేర్వర్షాసఖీత్వస్యోపాదానాదబ్జచంద్రికాహాస ప్రధానస్యోపమిత సమాసస్యావశ్యకత్వాత్ప్రథమప్రాదుర్భూతయా నయనహాసహారాదివృత్తకామినీ-రూపోపమానికయా అత ఏవైకదేశ వివర్తిన్యుపమయైవ నిర్వాహ ఇతి నివేదితమపి సహృదయప్రీతయే పునర్నివేదితమ్.

'అథోపగూఢే శరదా శశాంకే
ప్రావృడ్యయౌ శాంతతడిత్కటాక్షా.
కాసాం న సౌభాగ్యగుణోంగనానాం
నష్టః పరిభ్రష్టపయోధరాణామ్'.

ఇతి కస్యచిత్పద్యే ప్రావృష ఏకదేశ వివర్తిరూపకేణాంగనాత్వసిద్ధిరితి నోత్తరార్ధగతార్థాంతరన్యాసానుపపత్తిః. ప్రథమచరణే తూపగూహన సామర్థ్యాదస్తు నామ సమాసోక్తిః.

ఇలాగే—"పరిఫుల్లాబ్జనయనా" (మొ పరిఫుల్లాబ్జనయనయు, చంద్రికా చారుహాసినియు హంసావళీహారయుతయు నగు శరత్తు బాగుగా ప్రకాశించుచున్నది)

ఇచట ఉపమారూపకములకు సాధకబాధకములు లేనందున సంకరాలంకారమును స్వీకరించిన వారి మతము నందు నారెంటి యొక్క సంశయాత్మకమైన ఏకదేశి వివర్తియగు సంకరాలంకారమేను. దానిని స్వీకరించని వారి మతము నందు ఎప్పుడు ఉపమిత సమాసము యొక్క స్ఫూర్తిగలుగునో నప్పుడు ఏకదేశి వివర్తియగు నుపమ, విశేషణసమాసస్ఫూర్తియందు నటువంటిదే యగు రూపకమని మొదటియోజనతోనే అప్రకృతార్థము తెలియుటవలన రెండవ యోజనకు -"పరిఫుల్లాబ్జానీవ నయనాని" అని ఉపమాగర్భకు, వైయర్థ్యమువలన అనుత్థానమే. "శరద్వర్షా సఖీ బభౌ" అని నాల్గవ పాదముచేసిన, అపుడు శరన్మాత్రమందున్నటువంటి వర్షాసఖీత్వమును స్వీకరించుటవలన, పద్మములు, వెన్నెల, హంసలు, ఇవి ప్రధానముగా గల ఉపమిత సమాసము ఆవశ్యకమగుట వలన మొదట పుట్టినటువంటి కన్నులు, నవ్వులు, హారములు, వీటిచేత నాక్షిప్తమగు కామినీ రూపమగు నుపమానము కలదియు, నందువలననే ఏకదేశి వివర్తినియునగు ఉపమచేతనే నిర్వాహము అని నివేదింపబడినను సహృదయ ప్రీతికై తిరిగి నివేదింపబడినది.

"అథోపగూఢే" మొ. (తరువాత శరత్కాలముచే శశాంకుడు కౌగలించుకొనబడగా, వర్షకాలము మెరుపుతీగలనెడు కటాక్షములు శాంతించగా వెడలిపోయెను, పరిభ్రష్టములగుపయోధరములుగలదైన స్త్రీయొక్క సౌభాగ్య గుణము నష్టము కాలేదు?)

అని ఒకరియొక్క పద్యము నందు వర్షఋతువునకు ఏకదేశ వివర్తి యగు రూపకముతో నంగనాత్వసిద్ధి యని, ఉత్తరార్ధ మందున్న అర్థాంతర న్యాసమున కనుపపత్తి లేదు. మొదటిచరణమునందైతే ఉపగూహన సామ్యము వలన సమాసోక్తి అయితే కావచ్చును

యత్తు కువలయానందే "సారూప్యాదపి సమాసోక్తిర్దృశ్యతే· యథా-

'పురా యత్ర స్రోతః పులినమధునా తత్ర సరితామ్
విపర్యాసం యాతో ఘనవిరలభావః క్షితిరుహామ్.
బహోర్దృష్టం కాలాదపరమివ మన్యే వనమిదం
నివేశః శైలానాం తదిదమితి బుద్ధిం ద్రఢయతి'.

అత్ర వనవర్ణనే ప్రస్తుతే తత్సారూప్యాత్కుటుంబిషు ధన

సంతానాదిసమృద్ధ్యసమృద్ధి విపర్యాసం ప్రాప్తస్య తత్సమాశ్రయస్య గ్రామనగరాదేర్వృత్తాంతః ప్రతీయతే" ఇత్యుక్తమ్, తదసత్. సమాసోక్తిజీవాతోర్విశేషణసామ్యమాత్రస్యాభావేన సమాసోక్తితాయా ఏవానుపపత్తేః. నచ విశేషణసామ్యాత్సాదృశ్యాద్వా యత్రాప్రస్తుత వ్యవహారః ప్రస్తుతేన వ్యజ్యతే సా సమాసోక్తిరితి లక్షణం నిర్మాస్యత ఇతి వాచ్యమ్. సమాసోక్తౌ హి ప్రకృతవృత్తాంతోఽప్రకృతవృత్తాంతాభేదేన స్థిత ఇతి సర్వసమ్మతమ్ త్వయాపి చ "ప్రకృత ధర్మిణ్యప్రకృత వ్యవహార ఆరోప్యతే" ఇత్యుక్తమ్. ఏవం స్థితే నహ్యత్ర స్రోతో వృక్షాదివిపర్యాసో ధనసంతాన విపర్యాసాద్యభేదేన ప్రతీయతే. నాపి వనాదౌ ధనసంతానవిపర్యాస ఇతి సమాసోక్త్యా తలాత్సత్యపి వైలక్షణ్యే యద్యసౌ సమాసోక్తిరితి శపథః క్రియతే తదా అలంకారాంతరమపి సమాసోక్తికుక్షావేవ నిక్షిప్యతామ్.

ఏవం తర్హి 'పురా యత్ర స్రోతః పులినమధునా తత్రసరితామ్' ఇత్యత్ర కోఽలంకారః? అప్రకృతేన వాచ్యేన ప్రకృతవ్యవహారాభివ్యక్తి రూపాయా అప్రస్తుతప్రశంసాయా అత్రాసంభవాత్ప్రకృతస్యైవ వాచ్యత్వాదితి చేత్, సాధు పృష్టమాయుష్మతా, సమాధానమస్య సప్రపంచ మప్రస్తుతప్రశంసాప్రకరణ ఏవ నివేదయిష్యామ ఇతి. కిం చాలంకారసర్వస్వకృతా 'సాదృశ్యగర్భవిశేషణోత్థాపితా సాదృశ్యమూలా సమాసోక్తిః' ఇత్యుక్తమ్. తత్ర హి విశేషణసామ్యసత్త్వాదుక్తిసంభవోఽప్యస్తి, న తు త్వదుక్తాయామితి మూలగ్రంథానవబోధస్తద్విరోధో వా స్ఫుట ఏవేతి దిక్.

అయితే కువలయానందము నందు—"సారూప్యము చేతనైనను సమాసోక్తి కనపడును; ఎట్లనగా—

"పురా యత్ర" మొ. (పూర్వమునందు ఎచట నదుల ప్రవాహ ముండెనో యిప్పుడు అచట ఇసుకతిన్నెలున్నవి. వృక్షముల యొక్క ఘనత్వము విరలత్వమున్ను విపర్యాసమును పొందినది. చాలా కాలమునకు చూచిన వనమును మరియొక దానినిగా తలపవలసియున్నను కొండల యునికి మాత్రము ఆవన మిదియేనని బుద్ధిని దృఢపరచు చున్నది"

ఇచట అడవి వర్ణనము ప్రస్తుతమైనపుడు దానితోటి సారూప్యమువలన

కుటుంబవంతుల యందలి ధనము సంతానము మొదలగువాని సమృద్ధ్య సమృద్ధి విపర్యాసములు పొందినటువంటి, వారికి ఆశ్రియమగు గ్రామము పట్టణము మొదలగు దాని యొక్క వృత్తాంతము తోచును" అని చెప్పబడి నది. అదిఅయుక్తము. సమాసోక్తిని బ్రతికించునట్టి విశేషణ సామ్యమాత్రము ఇక్కడ లేకపోవుటచేత సమాసోక్తిత్వమే దీనికి కుదరదు. పోనీ - విశేషణ సామ్యమువలనగానీ, సాదృశ్యమువలనగానీ, ఎక్కడ అప్రస్తుత వ్యవహారము ప్రస్తుతముచే వ్యక్తమగునో అది సమాసోక్తియని లక్షణము నిర్మించ బోయెదము, అని అనరాదు. సమాసోక్తియందు ప్రకృత వృత్తాంతము నప్రకృత వృత్తాంతా భేదముతో నున్నదని అందరు అంగీకరించినదే. నీవు కూడా 'ప్రకృత ధర్మియందు అప్రకృత వ్యవహారము ఆరోపింపబడుచున్నది,' అని చెప్పితివి. ఇలా యుండగా, ఇచట ప్రవాహము, చెట్లు, మొదలైనవాని విపర్యాసము ధనసంతానము మొదలగువానియొక్క విపర్యాసము మొద లగు వానితో నభేదము స్ఫురించుటలేదు. మరియు వనాదులయందు ధన సంతాన విపర్యాసమున్ను స్ఫురించుటలేదు కనుక ఇతర సమాసోక్తులకంటె వైలక్షణ్యము ఉన్నప్పటికినీ ఇది సమాసోక్తి యని శపథము జేసినయెడల, అప్పుడలంకారాన్తరముగూడ సమాసోక్తి కుక్షియందే యుంచుడు

అలాగైతే-'పురా యత్ర స్రోతః పులిన మధునా తత్ర సరితాం" అనుచోట నే యలంకారము? అప్రకృతమగు వాచ్యముచే ప్రకృత వ్యవ హారముయొక్క అభివ్యక్తిరూపమగు నప్రస్తుత ప్రశంస ఇక్కడ యసంభ వము గనుక ప్రకృతమే వాచ్యముగదా?- అనినచో, నాయుష్మంతుడు బాగుగా నడిగినాడు! దాని సమాధానము సవిస్తరముగా నప్రస్తుత ప్రశంసా ప్రకరణమునందే నివేదనము చేయబోయెదము అని

మరియు నలంకార సర్వస్వకారులు-"సాదృశ్యగర్భమగు విశేషణము లచే నుత్థాపితమగు సమాసోక్తి సాదృశ్యమూలము" అని చెప్పినారు. అచట విశేషణ సామ్యముండుటవలన మాత్రమైన సంభవించును. నీవుచెప్పినదాని యందేమీ లేదు మూలగ్రంథము దెలియకపోవుటగానీ, దానికి విరోధము గానీ స్పష్టమేనని దిక్.

సేయం లౌకికే వ్యవహారే లౌకికస్య వ్యవహారస్య, శాస్త్రీయే శాస్త్రీయస్యారోపేణ ఏతద్విపర్యయేణ చ చతుర్ధా. తత్రాద్యా

ప్రాగభిహితైవ. ద్వితీయా యథా -

'గుణ వృద్ధీ పరే యస్మిన్నైవ స్తః ప్రత్యయాత్మకే
బుధేషు సదితి ఖ్యాతం తద్ బ్రహ్మ సముపాస్మహే.'

అత్ర వేదాంతశాస్త్రసిద్ధవ్యవహారే వ్యాకరణసిద్ధస్య శతృశానజ్ వ్యవహారస్య.

ఇది లౌకిక వ్యవహారమందు లౌకికమగు వ్యవహారమునకు, శాస్త్రీయమునందు శాస్త్రీయమునకు ఆరోపముచేతను, దీనికి వ్యత్యాసముచేతను నాల్గు విధములు. అందు మొదటిది పూర్వమే చెప్పబడినది. రెండవది యెట్లనగా—

"గుణవృద్ధీ మొ" (జ్ఞానాత్మకమగు ఏ పరబ్రహ్మయందు గుణవృద్ధులు లేవో, అట్టి పండితులలో సత్తుగా ప్రసిద్ధమగు పరబ్రహ్మను సేవించుచున్నాము". ("ప్రత్యయరూపమగు ఏది పరముగ నున్నపుడు గుణవృద్ధులు రావో పండితులలో 'సత్' అను పేరుతో ప్రసిద్ధమగు (శతృశానప్రూపమగు) నా శబ్దబ్రహ్మను సేవించుచున్నాము"- అని రెండవ అర్థము)

ఇచట వేదాంతశాస్త్ర సిద్ధమగు వ్యవహారమందు వ్యాకరణసిద్ధమగు శత్రుశానచ్ వ్యవహారమునకు.

లౌకికే శాస్త్రీయస్య యథా -

'పరార్థవ్యాసంగాదుపజహదథ స్వార్థపరతా -
మభేదైకత్వం యో వహతి గుణభూతేషు సతతమ్.
స్వభావాద్యస్యాన్తః స్ఫురతి లలితోదాత్తమహిమా
సమర్థో యో నిత్యం స జయతి తరాం కోపి పురుషః'

అత్ర సమర్థసూత్రగతమహాభాష్యార్థస్య. తత్ర హి 'అథ యే వృత్తిం వర్తయంతి కిం ఆహుః' ఇత్యాదినా జహత్స్వార్థా వృత్తిరజహత్స్వార్థా వృత్తిరితి పక్షద్వయమ్ నిరూపితమ్. తత్రైవోపసర్జనార్థే అభేదైకత్వ సంఖ్యాపి ధ్వనితా. ప్రకటితా చ హరిణా -

'యథౌషధిరసాః సర్వే మధున్యాహితశక్తయః
అవిభాగేన వర్తంతే తాం సంఖ్యాం తాదృశీం విదుః'. ఇతి, సామర్థ్యమప్యేకార్థీభావబోధకతారూపం తత్రైవోక్తమ్.

లౌకికమునందు శాస్త్రీయమున కెట్లనగా —

"పరార్థ" మొ. ("పరార్థ వ్యాసంగముల న స్వార్థపరత్వము వదిలి, ఏది (ఎవడు) గుణభూతములగు వానియందు ఎల్లప్పుడునూ అభేదమున నేకత్వము వహించుచున్నదో (చున్నాడో), స్వభావముగానే యెవ్వనిలోపల (దేనిలోపల) లలితోదాత్తమహిమ స్ఫురించుచున్నదో, ఎల్లప్పుడును ఎవరు (ఏది) సమర్థుడో (సమర్థమో) ఆ పురుషుడుత్కర్షతో నున్నాడు."

ఇచట సమర్థ సూత్రమందున్న మహా భాష్యార్థమునకు. అక్కడ "అథ యే వృత్తిం వర్తయంతి కింత ఆహుః" ఇత్యాదిచే జహత్స్వార్థావృత్తి, అని అజహత్స్వార్థావృత్తి అని రెండు పక్షములు చెప్పబడినవి. అచటనే ఉపసర్జనార్థమందు నభేదైకత్వసంఖ్యయు వ్యంజితమైనది. ప్రకటపరచబడినదియు హరిచేత—

"యథౌషధి రసాః" మొ. ("ఓషధి రసములన్నియు ఎట్లు తేనెయందు శక్తిని ఆధాన మొనర్చినవై అవిభాగముగా వర్తించుచున్నవో, ఆ సంఖ్యను ఆ విధముగ నెరుగుదురు."

ఏకార్థీ భావరూపమైన సామర్థ్యముకూడ అచట చెప్పబడినది.

శాస్త్రీయే లౌకికస్య యథా -

"కృత్వా సూత్రైః సుగూఢార్థైః ప్రకృతేః ప్రత్యయం పరమ్
ఆగమానాగమాన్ భాతి వైయాకరణపుంగవః"

అత్ర రాజవ్యవహారస్య. ఏవం శాస్త్రాంతరవ్యవహారేఽపి బోధ్యమ్.

శాస్త్రీయమున లౌకికమునకు ఎట్లనగా-

"కృత్వా" మొ. (వైయ్యాకరణ శ్రేష్ఠుడు బాగా గూఢార్థములుగల సూత్రములచే ప్రకృతికి ప్రత్యయము పరముగా చేసి, ఆగమములను భావించుచు ఉత్కర్షగా నున్నాడు).

ఇచట రాజవ్యవహారమునకు—

ఇటులనే శాస్త్రాన్తర వ్యవహారమునందును తెలియవలెను.

ఇయం చాలంకారాంతరేషు బహుష్వనుగుణ్యేన స్థితా.

"స్థితేఽపి సూర్యే పద్మిన్యో వర్తంతే మధుపైః సహ
అస్తంగతే తు సుతరాం స్త్రీణాం కః ప్రత్యయో భువి."

అత్ర సమర్థ్యత్వేన స్థితార్థాంతరన్యాసానుగుణ్యా మాధత్తే.

"ఉత్తమానామపి స్త్రీణాం విశ్వాసో నైవ విద్యతే
రాజప్రియాః కైరవిణ్యో రమంతే మధుపైః సహ."

ఇహ సమర్థకత్వేన.

ఇది యలంకారాంతరములందు, ననేకములందు నానుగుణ్యముతో నున్నది. ఏలాగనగా—

"స్థితేఽపి" మొ. (సూర్యుడున్నను తామరతీవెలు మధుపములతో (మధువులతో) కూడా యున్నవి. అస్తమించినయెడల యింకనూ ఎక్కువగా. స్త్రీల విషయమై నమ్మకము ఎట్టిది !)

ఇచట సమర్థకత్వముతో నున్నదై అర్థాన్తర న్యాసమునకు నను గుణత్వము నొనర్చుచున్నది.

"ఉత్తమానామపి" మొ (ఉత్తమ స్త్రీలలోకూడా విశ్వాసము ఉండదు. రాజ (చంద్ర) ప్రియలైనను కలువతీవెలు మధుపములతో (మధువులతో) కూడా క్రీడించుచున్నవి )

ఇచట సమర్థకత్వముతో.

"వ్యాగుఞ్జన్మధుకరపుంజమంజుగీ-
మాకర్ణ్య స్తుతిముదయత్త్రపాతి
ఆభూమీతలనతకంధరాణి మన్యే-
రణ్యేస్మిన్నవనిరుహాం కుటుంబకాని"

అత్ర హి పరకృతనిజస్తుత్యాకర్ణనకన్ధరానమనాది విశేషణ సామ్యోత్థాపితయా సమాసోక్త్యా సజ్జనవ్యవహారాభిన్నతయా స్థిత ఏవ తరువ్యవహారే భూశాఖాసంబంధాభేదాధ్యవసితమస్తకమూలనమన నిమిత్తోత్థాపితా త్రపారూపహేతూత్ప్రేక్షా సంభవతి అన్యథా కితవ కృత గ్రీవానమనస్యాపి త్రపోత్థాపకతాపత్తేః. ఇత్యుత్ప్రేక్షానుగుణా సమాసోక్తిః.

"వ్యాగుంజన్మధుకర" మొ (బాగా ధ్వనిచేయుచున్న తుమ్మెదలచే బాగా పాడబడిన స్తుతిగీతమును విని ఉపయించుచున్న సిగ్గుచే మెడలు నేల వరకు వంగినవని అడవిలోని చెట్లను తలంతును)

ఇచట ఇతరులు తనను స్తుతించగా వినుట, మెడ వంచుట మొదలగు విశేషణముల సామ్యమువలన నుత్థాపితమగు సమాసోక్తిచే సజ్జన వ్యవహారాభిన్నముగా నిలచినదే అయిన తరు వ్యవహారమునందు, భూశాఖా సంబంధము యొక్క నభేదముచే నధ్యవసితమైన, మస్తకమూలనమననిమిత్తముచే నుత్థాపితమగు త్రపారూప హేతూత్ప్రేక్ష సంభవించును. అలా కానియెడల, కితవుడొనర్చిన గ్రీవానమనమున కైనను త్రపోత్థాపకత్వ మాపన్నమగును. కావున ఉత్ప్రేక్షానుగుణ సమాసోక్తి.

ఏవమ్ -

'రాజ్యాభిషేకమాజ్ఞాయ శంబరాసురవైరిణః,
సుధాభిర్జగతీమధ్యం లింపతీవ సుధాకరః'

ఇత్యత్రాపి స్వామిసేవకవ్యవహారమూలా సుధాలేపనోత్ప్రేక్షా. అమునైవ దిశా అచేతనవ్యవహారే ప్రకృతే చేతనవ్యవహార సంబంధిస్వరూప-హేతు-ఫలోత్ప్రేక్షాయాం చేతనవ్యవహారే ప్రకృతే చా చేతనవ్యవహార సంబంధి స్వరూప-హేతు-ఫలోత్ప్రేక్షాయాం చ సమాసోక్తి రేవ మూలమ్.

ఇతి రసగంగాధరే సమాసోక్తి ప్రకరణమ్

ఇలాగా-

"రాజ్యాభిషేకమ్" మొ. (శంబరాసురునికి వైరియగు మన్మథునకు రాజ్యాభిషేకమును తెలుసుకొని సుధలచే భూమండల మధ్యమును సుధాకరుడు పూయుచున్నట్లున్నది).

ఇచట స్వామిసేవక వ్యవహారమూలకమైన సుధాలేపనోత్ప్రేక్ష.

ఈ ప్రకారముగానే అచేతన వ్యవహారము ప్రకృతమైనపుడు చేతన వ్యవహారసంబంధి స్వరూప హేతు ఫలోత్ప్రేక్ష యందును అచేతన వ్యవహారము ప్రకృతమగునపుడు చేతన వ్యవహార సంబంధి స్వరూప హేతు ఫలోత్ప్రేక్ష యందున్ను సమాసోక్తియే మూలము-

ఇది సమాసోక్తి ప్రకరణము

## పరికరః

అథ పరికరః—విశేషణానాం సాభిప్రాయత్వం పరికరః. తచ్చ ప్రకృతార్థోపపాదకచమత్కారివ్యంగ్యకత్వమ్.

అత ఏవాస్య హేత్వలంకారాద్వైలక్షణ్యమ్. తత్ర వ్యంగ్యస్యావశ్యకత్వాత్. ఉపపాదకతా చోపస్కారక నిష్పాదక సాధారణీ. వ్యంగ్యస్య గుణత్వాచ్చ న ధ్వనిత్వం వ్యపదిశ్యతే

యథా—

"మంత్రైర్మీలితమౌషధైర్ముకులితం త్రస్తం సురాణాం గణైః
స్త్రస్తం సాంద్ర సుధారసైర్విదలితం గారుత్మతగ్రావభిః.
వీచి క్షాలిత కాలియాహిత పదే స్వర్లోక కల్లోలిని
త్వం తాపం తిరయాధునా భవభయవ్యాలావలీఢాత్మనః."

అత్రాత్మనో భాగీరథీకర్తృకస్య భవవ్యాలదంశజనితతాప దూరీకరణస్యాశంసనం హి వాక్యార్థః. తత్ర భగవత్యా భవతాపనాశికాత్వస్య సుప్రసిద్ధత్వాత్పరిణామేన భవరూపవిషయతాదాత్మ్యాపత్త్యా వ్యాలజనితసంతాపనాశికాత్వం తావత్సూపపాదమేవ. 'స్థాస్నుజంగమ సంభూతవిషహన్త్ర్యై నమో నమః' ఇత్యాద్యాగమబలాచ్చ విషయ తాదాత్మ్యం వినాపి శుద్ధవ్యాలజనితసంతాపనాశికాత్వమపి స్వభావసిద్ధమేవ. ఏవం వాచ్యార్థస్య సత్యామపి నిష్పత్తౌ సౌందర్య విశేషాధానాయ సాకూతం విశేషణం వీచిక్షాలితేత్యాది. అత్ర నామాంతరస్య సత్త్వేఽపి కాలియాహితశబ్దోపాదానసామర్థ్యాద్భగవతశ్చరణే ఫణాగణనృత్య నిఃసారీకృతకాలియే లోకోత్తరవిషహారణ శక్తిరుత్పత్తి సిద్ధైవాసీత్. సా చ తయోర్వీచిభిః క్షాలనాద్ గంగాయాం స్వాశ్రయరేణుద్వారా సంక్రాన్తేతి గమ్యతే. న చ శక్తేః పూర్వమేవ క్షాలనాత్కథం చరణేనార్వాకాలియస్య విషహారణం శక్తిరహితేన సంభవతీతి వాచ్యమ్. క్షాలితావశిష్టా లేశరూపా శక్తిశ్చరణే కాచిత్స్థితాసీత్ యయా సంప్రతి కాలియస్య విషమహారిత్వ స్యాకూతాంతర్గతమేవేతి నానుపపత్తిః ఏవం హి వాచ్యోపస్కారకతయాత్ర గుణీభావః, న వాచ్యసిద్ధ్యంగతయా,

తరువాత పరికరము—

విశేషణములు సాభిప్రాయములగుట పరికరము. సాభిప్రాయము లగుట యనగా ప్రకృతార్థముల నుపపాదనము చేయునట్టి చమత్కారము గల వ్యంగ్యముతో నుండుట. ఇందువలననే ఈ యలంకారమునకు హేత్వలంకారముకంటె భేదము అక్కడ వ్యంగ్యము ఆవశ్యకముగాదు. ఉపపాదకత్వము రెండు తీరులు-ఉపస్కారకము, నిష్పాదకము-కావచ్చును వ్యంగ్యము లప్రధానములు గనుక ధ్వనిత్వము దీనికి చెప్పబడదు.

ఎట్లనగా—

"మంత్రైర్మీలితమ్" మొ. (మంత్రములు కనులుమూసుకొనెను. ఔషధములు ముకులించెను. దేవతా సమూహములు భయపడినవి. చిక్కని సుధారసములు పలుచబడినవి. గారుత్మతమణుల సమూహము విదళితమైనది. తరంగములచే కడుగబడిన కాళియ శత్రువు యొక్క పాదము కలదానా! ఓ స్వర్గలోక నదీ! నీవు సంసార భయమనెడు సర్పముచే అవలీఢాత్ముడ నగునా తాపమును అంతర్హితము చేయుము.)

తనకు భాగీరథి జేయు భవవ్యాల దంశనమువలన కలిగినట్టి తాపమును దూరముచేయుట నాశించుట ఇక్కడ వాక్యార్థము. అచట భగవతి భవతాపము నశింపజేయునదియగుట సుప్రసిద్ధముగనుక పరిణామముచే సంసార రూపమగు విషయముతోడి తాదాత్మ్యప్రత్తిచేత పామువలనకలిగిన సంతాప నాశము చేయట సులభముగానే కుదుర్చవచ్చును. "స్థాస్నుజంగమసంభూత విషహాంత్ర్యై నమోనమః" ఇత్యాదాగమమూలమున విషయతాదాత్మ్యము లేకపోయినను శుద్ధమగు దుష్టోరగమువలన గలిగిన సంతాపమును నాశముచేయుటయును స్వభావసిద్ధమే. ఈతీరుగా వాచ్యార్థమునకు నిష్పత్తి యున్నప్పటికిని, సౌందర్య విశేషమును కూర్చుటకై, సాభిప్రాయమగు విశేషణము 'వీచిక్షాళిత' ఇత్యాది. ఇక్కడ నామాంతరమున్నను 'కాళియాహిత'శబ్దోపాదన సామర్థ్యమువలన భగవానుని ఫణాగణములందు నృత్యమొనర్చుటచేత నిస్సారీకృత కాళియుడుగల్గు చరణమునందు లోకోత్తర విషహారణశక్తి ఉత్పత్తిసిద్ధమైనదే అయ్యెను. అదియు వాటిని తరగలచే కడుగుటవలన గంగయందు తన నాశ్రయించుకొన్న రేణువుల ద్వారా సంక్రమించినదని తోచుచున్నది.

అయ్యా — శక్తిని పూర్వమే కడిగివేయుటవలన, తరువాత శక్తి రహితమగు చరణముచే కాళీయుని యొక్క విషహారణము ఎట్లు సంభవించును, అనియెదరా? కడుగగా మిగిలిన లేశరూపమగుశక్తి, చరణమున ఒకానొకటి యున్నది; దీనిచేత ఇప్పుడు కాళీయుని విషము హరింపబడినది; అనియు నాకూతాన్తర్గతమేనని అనుపపత్తి లేదు. ఇలాగు వాచ్యమునకు ఉపస్కారకమగుటచేత నిక్కడ గుణీభావము; అంతేకాక వాచ్యసిద్ధ్యంగముగా కాదు.

యథా వా—

'మదకామవిమోహామత్సరా రిపవస్త్వత్పుర ఏవ తావకమ్
ధృతశార్ఙ్గగదారినందక ప్రతికర్షన్తి కథం న వీక్షసే.'

అత్రాప్యపేక్షానౌచిత్యస్య తావకశబ్దప్రతిపాదితేన స్వామిభృత్యభావేనైవ నిష్పన్నశరీరస్య ప్రకర్షకం ధృతశార్ఙ్గేత్యాది విశేషణ మమోఘ శస్త్రాస్త్రసంపన్నస్య సమక్షమేవ రిపుభిః కృష్యమాణం దాసముపేక్షమాణస్యాకీర్తిర్భవిత్రీ తవేత్యాకూతగర్భమ్. నను నిష్ప్రయోజన విశేషణోపాదానేఽపుష్టార్థదోషస్యోక్తత్వాత్సప్రయోజనవిశేషణం దోషాభావమాత్రం కష్టత్వాద్యభావవద్భవితుమర్హతి, న త్వలంకార ఇతి.

అత్ర విమర్శినీకారాదయ ఆహుః – 'విశేషణానాం బహుత్వమత్ర వివక్షితమ్. సాభిప్రాయవిశేషణబహుత్వకృత ఏవ చాత్ర వైచిత్ర్యాతిశయః. ఏకవిశేషణం తు దోషాభావమాత్ర స్యావకాశః' ఇతి; తదసత్, విశేషణానేకత్వం హి వ్యంగ్యాధిక్యాధాయకత్వాద్వైచిత్ర్య విశేషాధాయకమస్తు నామ, న తు ప్రకృతాలంకారశరీరమేవ తదితి శక్యం వక్తుమ్. 'వీచిక్షాలితకాలియాహితపదే' ఇతి ప్రాగుక్తే ఏకస్యైవ విశేషణస్య చమత్కారితాయాఽనపహ్నవనీయత్వాత్.

'అయి లావణ్యజలాశయ తస్యా హా హంత మీననయనాయాః
దూరస్థే త్వయి కిం వా కథయామో విస్తరేణ లమ్'

అత్రైకైకవిశేషణమాత్రేణైవ సకలవాక్యార్థసంజీవనాచ్చ.

మరియు ఎట్లనగా—

"మదకామ" మొ. (మదము, కామము, విమోహము, మాత్సర్యము అనెడు శత్రువులు, శార్ఙ్గధారి నందకములను ధరించినవాడా! నీ యెదుటనే, నీవాడనగు నన్ను లాగుచున్నవి, ఎట్లు చూడవు!)

అనే ఈచోట కూడ ఉపేక్షచేయుట యనుచితమగుటకు, తావక శబ్ద ప్రతిపాదితమగు స్వామి భృత్యభావముచేతనే నిష్పన్నశరీరమైనట్టి దానికి, 'ధృతశార్ఙ్గ' ఇత్యాది విశేషణము, అమోఘశస్త్రాస్త్ర సంపన్నుడవగు నీ యెదురుగానే శత్రువులచేత నాకర్షింపబడుచున్న దాసుని ఉపేక్షించు నీకు దుష్కీర్తి రానున్నది అనే గూఢమగు నభిప్రాయముతో కూడినది, ప్రకర్ష కల్గించునది.

అయ్యా, నిష్ప్రయోజనమగు విశేషణము నుపాదానము చేసినపుడు అపుష్టార్థ దోషము చెప్పబడినది కనుక సప్రయోజనమగు విశేషణము కష్టత్వాద్యభావమువలె దోషాభావము మాత్రము కాన్యైయున్నది; కానీ అలంకారము కాదు; అనినచో - విమర్శనీకారాదులు ఇట్లనిరి - "విశేషణములు అనేకములగుట ఇక్కడ వివక్షితము. సాభిప్రాయ విశేషణములందలి బహుత్వమువలన చేయబడినదే ఇక్కడ వైచిత్ర్యాతిశయము ఒక్క విశేషణమైతే దోషాభావమాత్రమునకు నవకాశము" అని. అది మంచిది కాదు. అనేక విశేషణములుండుట వ్యంగ్యాధిక్యమును సమకూర్చుటవలన వైచిత్ర్య విశేషమును సమకూర్చునదై ఉండవచ్చును గాక; ప్రకృతాలంకారశరీరమే అది అని చెప్పుటకు తగదు. "తరంగములచేత కడుగబడిన కాళియాహితుని పదము కలదానా" అని వెనుక చెప్పబడినచోట, నొకటియేయగు విశేషణమునకు చమత్కారిత్వము నిరాకరింప శక్యముకాదు కనక.

"అయిలావణ్యజలాశయ" మొ. (ఓయీ! సౌందర్య సరస్సా! ఆ మీననేత్రికి నీవు దూరస్థుడవైనప్పుడు ఏమి చెప్పుదుము? విస్తరించి చాలును)

ఇచట ఒక్కొక్క విశేషణ మాత్రము చేతనే సకల వాక్యార్థమునకు సంజీవనము గలుగుచున్నది కనుక.

**యత్తు కువలయానందకార ఆహ - "శ్లేషయమకాదిష్వపుష్టార్థదోషాభావేన తత్రైకస్యాపి విశేషణస్య సాభిప్రాయస్య**

విన్యాసే విచ్ఛిత్తి విశేషసద్భావాత్పరికరత్వోపపత్తిః. యథా - 'క్షితి భృత్యైవ సదైవతకా వయం వనవతానవతా కిమహిద్రుహా' ఇతి గోవర్ధనపర్వతవిషయకే నందాదీన్ప్రతి భగవద్వాక్యే" ఇతి. తదప్యసత్. యో హీమమలంకారం దోషాభావాన్తఃపాతి తయాలంకారమధ్యాద్ బహిర్భావయతి ' స కిం త్వదుక్తశ్లేష యమకాదిశబ్దచిత్రాతిరిక్తస్థలే సాభిప్రాయ విశేషణేషు విచ్ఛిత్తి విశేషం మన్యతే, న వా? ఆద్యే దోషాభావమాత్రేణ విచ్ఛిత్తివిశేష స్యాలంకారప్రయోజ్యస్యాలంకారమంతరేణానిష్పత్తేః సిద్ధం సర్వత్ర పరికరస్యాలంకారత్వమ్. ద్వితీయే అన్యత్రేవ యమకాదిష్వపి 'విచ్ఛిత్తి విశేషో నాస్తీతి తేన సువచత్వాత్.

తథా హి—

'అనాపది వినా మార్గమనిశాయామనాతురః
మృత్తికాశౌచహీనస్తు నరో భవతి కిల్బిషీ.'

ఇత్యత్ర 'పర్యుదస్తేప్యాపత్కాలాదౌ యథా కేనచిన్మృత్తి కాశౌచాది క్రియమాణం న కేనాపి ప్రతిషిధ్యతే, కర్తుః సామర్థ్య గమకం చ భవతి, తథా, ప్రకృతేఽపి దోషనిషేధవిధౌ పర్యుదస్తేఽపి యమకాదౌ పుష్టతారూపదోషాభావః కవినా సంపాద్యమానో న దోషాయ భవిష్యతి, అపి తు రసపోషాయైవేతి. యది చ యమకేఽను భవం విచ్ఛిత్తివిశేషే ప్రమాణం బ్రూషే, బ్రూహి తదాన్యత్రాపి తమేవ ప్రమాణమితి యమకపర్యంతానుధావనం నిరర్థకమేవ.

ఇచట కువలయానందకారుడు చెప్పెను —

"శ్లేషయమకాదులయందు అపుష్టార్థము దోషము కాదు. కనుక నక్కడ ఒక్క విశేషణమునకైనను, సాభిప్రాయమునకు, విన్యాసమునందు విచ్ఛిత్తి విశేషముండుటవలన పరికరత్వమునకు నుపపత్తి. ఎట్లనగా—

"క్షితి భృత్యైవ......ద్రుహా" అని గోవర్ధన పర్వత విషయమందు నందాదులను గురించి భగవంతుని వాక్యమున" అని. అదియును సరికాదు.

ఎవడైతే ఈ యలంకారమును దోషాభావము లోపల పడినదానినిగా ఎంచి అలంకారముల నడుమనుండి వెలువరింపజేయునో వాడు నీవు చెప్పిన శ్లేషయమకాది శబ్దచిత్రములకన్న నతిరిక్తమగు స్థలమునందు సాభిప్రాయ

విశేషణములకు చమత్కార విశేషము ఉన్నదనుకొనునా, లేదా ?— మొదటి పక్షములో దోషాభావమాత్రముచే విచ్ఛిత్తి విశేషమునకు, నలంకారప్రయోజ్యమునకు, అలంకారమును విడచి, సిద్ధిలేదు కాన, అన్ని చోట్లను అలా పరికరమునకు అలంకారత్వము సిద్ధమైనది. రెండవ పక్షములో నితర స్థలము లందువలె యమకాదుల యందును విచ్ఛిత్తి విశేషము లేదని యతడే సులభముగా ననవచ్చును గదా ? అలాగే —

"అనాపది" మొ. (ఆపద లేనప్పుడు, తోవ కానప్పుడు, రాత్రికానప్పుడు, అనార్తుడగువాడు, మృత్తికాశౌచ హీనుడైనచో పాపముబొందును )

అనేచోట పర్యుదస్తమైనను యాపత్కాలము మొదలగుదానియందు, ఎట్లు ఎవరిచేతనైనను మృత్తికాశౌచము చేయబడుచున్నను. ఎవరిచేతను ప్రతిషేధింపబడకుండెనో, కర్త యొక్క సామర్థ్యమునకు గమకమున్న అగునో, అలా ప్రకృతమునందు కూడా దోషనిషేధవిధి, పర్యుదస్తమైనను, యమకాదులయందు పుష్టత్వ రూపమగు దోషాభావము కవిచే సంపాదింపబడుచు దోషము కాదు; ప్రత్యుత రసపోషణమున కగును అని. అయితే యమకమునందలి అనుభవమును విచ్ఛిత్తి విశేషణనందు ప్రమాణముగా జెప్పుచుంటివా, అపుడు దానినే మరియొకచోట నైనను ప్రమాణముగా చెప్పుము. యమక పర్యంతమును, అనుధావనము జేయుట నిరర్థకమే.

తస్మాత్పుష్టార్థతారూపేణ దోషాభావేన పరికరాలంకారస్య విషయవిభాగో దుఃశక ఇతి ప్రాప్తే బ్రూమః. సుందరత్వే సత్యుపస్కారకత్వమలంకారత్వమ్. చమత్కారాపకర్షకాభావత్వం చ దోషాభావత్వమ్. తదేతద్ధర్మద్వయం వివిక్తవిషయం యది దైవాదేకస్మిన్విషయవిశేషే సమావిశేత్తదా కా హానిః స్యాత్? ఉపధేయసంకరేప్యుపాధ్యసంకరాత్. యథా బ్రాహ్మణస్య మూర్ఖత్వం దోషః, విద్యా తు దోషాభావశ్చ భవతి గుణశ్చ; తథేహాప్యుపపత్తిః. న తు దోషాభావతయా ప్రాప్తస్యాపి పరికరస్య కిమిత్యలంకారేషు గణనాగౌరవమితి వాచ్యమ్. ఉభయాత్మకత్వే నేతరవైలక్షణ్యజ్ఞాపనార్థతయా గణనోపపత్తేః. యథా గుణీభూతవ్యంగ్యభేదతయా సంగృహీతాపి సమాసోక్తిరలంకారగణనాయాం పునర్గణ్యతే. యథా వా ప్రాసాదవాసిషు గణితోఽప్యుభయవాసీ భూవాసిగణనాయాం పునర్గణ్యతే తథేహాపీతి

న కశ్చిద్దోషః. అన్యథా ప్రాచాం కావ్యలింగ మప్యలంకారో న స్యాత్. తస్యాపి నిర్హేతురూపదోషాభావాత్మ కత్వాత్.

"ద్విజరాజ కలాధార విశ్వతాపనివారణ
కథం మామబలాం క్రూరైః కరైర్దహసి నిర్దయ"

ఇత్యాదౌ విశేషణాధిక్యాద్ వ్యంగ్యాధిక్యే చమత్కారాధిక్యమ్.

అందువలన పుష్టార్థత్వరూపమగు దోషాభావముచేత పరికరాలంకారమునకు విషయ విభాగము దుశ్శకమని ప్రాప్తముకాగా, చెప్పుచున్నాము. సుందరమై యుండగా నుపస్కారకత్వమే అలంకారత్వము. చమత్కారమును తగ్గించకపోవుట, దోషము లేకపోవుట. ఈ ధర్మములు, విడివిడియగు విషయములు కలవి, రెండును దైవవశమువలన ఒక విషయ విశేషమునందు సమావిష్టమగుచో నపుడు ఏమి హాని జరుగును ?

ఉపధేయ సంకరమున్నను ఉపాధికి సంకరములేదు కనుక. ఎట్లనగా- బ్రాహ్మణునకు మూర్ఖత్వము దోషము; విద్య దోషాభావముగను,గుణముగను కూడ అగును. అట్లే ఇచట నుపపత్తి. అయితే - దోషాభావముగా ప్రాప్తమైనను పరికరమునకు అలంకారములయందు గణనచేయు గౌరవము ఎందుకు అనరాదు. ఉభయాత్మకము గనుక ఇతర వైలక్షణ్యము తెలియిజేయుటకై గణన ముపపన్నమగును. గుణీభూత వ్యంగ్య భేదముగా సంగ్రహింపబడినను సమాసోక్తి అలంకార గణనయందు తిరిగి ఎట్లు గ్రహింపబడునో అట్లే. ఎలాగైతే మేడలో నుండు వారిలో గణింపబడినను, రెండు చోట్ల నుండు వారు, భూవాసుల లెక్కయందు తిరిగి గణింపబడునో అలాగే ఇచటనుగూడా ఏమియు దోషము లేదు. ఇట్లు కాని యెడల ప్రాచీనుల కావ్యలింగముకూడా నలంకారము కాకపోవును. ఇదియు నిర్హేతుకత్వ రూపదోషాభావాత్మకము కనుక.

"ద్విజరాజ" మొ. (ద్విజరాజా ! కలాధరుడా ! ప్రపంచ తాపమును నివారించువాడా ! అబలనగు నన్ను క్రూరమగు కిరణములచే, దయలేనివాడా ! ఎట్లు దహించుచున్నావు?)

ఇత్యాదులందు విశేషణాధిక్యమువలన వ్యంగ్యాధిక్యమునందు చమత్కారాధిక్యము.

అయం చ వాచ్యసిద్ధ్యంగవ్యంగ్యగర్భత్వేనోపస్కారకవ్యంగ్య గర్భత్వేన ద్విధా భవన్ వ్యంగ్యస్య వాచ్యాయమానత్వతద్విపర్యయాభ్యాం చతుర్ధా. ఆద్యో యథా—

"విహాయ సంసార మహామరుస్థలీ
మలీకదేహాదిమిలన్మరీచికామ్.
కృపాతరంగాకుల మన్మనోమృగో
విగాఢు మీశ త్వయి గాఢమీహతే."

అత్ర గాహన సిద్ధ్యంగకృపేత్యాదేః సముద్రరూపం వ్యంగ్యం వాచ్యాయమానమ్.

ఇదియు వాచ్యసిధ్యంగ వ్యంగ్యగర్భముగాను, ఉపస్కారక వ్యంగ్య గర్భముగాను, రెండు విధములగుచు వ్యంగ్యమునకు వాచ్యాయమానత్వము, తద్విపర్యయములచేత నాల్గు విధములు —

"విహాయ" మొ. (అసత్యములైన, దేహాదు లనెడు మరీచిక కలిగినట్టి సంసారమను మహామరుస్థలిని విడచి, ఓ కృపాతరంగములచే వ్యాప్తుడా! నా మనస్సు అనెడు మృగము నీలో ప్రవేశించుటకు ప్రయత్నించుచున్నది)

ఇచట కృపేత్యాదివలన కల్గు సముద్రరూపమగు వ్యంగ్యము గాహన సిద్ధ్యంగముగాన వాచ్యాయమానము.

ద్వితీయో యథా—

"ఖర్వీకృతేంద్రగర్వ త్వరయా చక్రేణ భిన్ననక్రముఖ
లీలాత్తకోలమూర్తే మాముద్ధర్తుం కథం న శక్తోఽసి."

అత్ర గోవర్ధనగజేంద్రవసుంధరాణాముద్ధారో వాచ్యతాస్పర్శ శూన్య ఏవోపాలంభసిద్ధ్యంగమ్. తృతీయస్తు "ధృతశార్ఙ్గగదారి నందక" ఇత్యత్ర. చతుర్థః "వీచిక్షాలితకాలియాహితపదే" ఇత్యత్ర చ బోధ్యః.

ఇతి రసగంగాధరే పరికరాలంకార ప్రకరణమ్.

రెండవది యెట్లనగా —

"ఖర్వీకృతేంద్ర గర్వ" మొ. (ఇంద్రుని యొక్క గర్వమును తగ్గించిన వాడా! వేగముగా చక్రముతో మొసలి యొక్క మొగమును భేదించిన

వాడా! విలాసముగా వరాహ రూపమును ధరించిన వాడా! నన్నుద్ధరించుటకు ఎట్లు నీవు సమర్థుడవు కావు ?)

ఇచట గోవర్ధన, గజేంద్ర వసుంధరల ఉద్ధారము వాచ్యతా స్పర్శశూన్యమై ఉపాలంభ సిద్ధికి అంగము. మూడవదైతే – "ధృతశార్ఙ్గగదారి సందక" అనుచోట, నాల్గవది "వీచిక్షాళిత కాళియాహితపదే" అనుచోటను తెలియవలెను.

ఇది పరికరాలంకార ప్రకరణము.

## శ్లేషః

అథ శ్లేషః —

శ్రుత్యైకయానేకార్థప్రతిపాదనం శ్లేషః. తచ్చ ద్వేధా-అనేకధర్మపురస్కారేణైకధర్మపురస్కారేణ చ. ఆద్యం ద్వేధా, అనేకశబ్ద ప్రతిభానద్వారా ఏకశబ్ద ప్రతిభానద్వారా చేతి త్రివిధః శ్లేషః. తత్రాద్యః సభంగో ద్వితీయో ఽభంగ ఇతి వదంతి. తృతీయస్తు శుద్ధః. ఏవం త్రివిధోఽప్యయం ప్రకృతమాత్రాప్రకృతమాత్ర ప్రకృతాప్రకృతోభయాశ్రితత్వేన పునస్త్రివిధః. అత్రాద్యే భేదే ద్వితీయే చ విశేష్యస్య శ్లిష్టతాయాం కామచారః. తృతీయభేదే తు విశేషణవాచకస్యైవ శ్లిష్టత్వం న విశేష్యవాచకస్య. తథాత్వే తు శబ్దశక్తిమూలధ్వనేరుచ్ఛేద ఏవ స్యాత్. విశేషణమాత్రశ్లిష్టతాయామపి ప్రకృతాప్రకృతధర్మిణోరుపాదాన ఏవ శ్లేషః. ప్రకృత ధర్మిమాత్రస్యోపాదానే తు సమాసోక్తేరేవ విషయః. తదిత్థం ప్రకృతమాత్రవిశేష్యకానేకార్థవిశేషణం యత్ర స ఏకః. ఏవమప్రకృతేత్యాదిర్ద్వితీయః. పృథుగుపాత్తప్రకృతాప్రకృతోభయవిశేష్యకనానార్థవిశేషణం తృతీయః. ఏతదన్యతమత్వం చ లక్షణం పర్యవసితమ్.

అనంతరము శ్లేష –

ఒక శ్రుతిచేత ననేకములగు నర్థములను ప్రతిపాదించుట శ్లేష. అది రెండురకములు— అనేక ధర్మపురస్కారము చేతను, ఏక ధర్మపురస్కారము చేతను. మొదటిది అనేక శబ్ద ప్రతిభానము ద్వారాను ఏక శబ్ద ప్రతిభానము ద్వారాను రెండు విధములు. ఈ విధముగ శ్లేష మూడు విధములు. అందు

మొదటిది సభంగము, రెండవది అభంగము అని అందురు మూడవది శుద్ధము ఇటుల మూడు విధములగు శ్లేషయు ప్రకృతమాత్రాప్రకృత మాత్ర, ప్రకృతాప్రకృతోభయాశ్రితముగా మరల మూడు విధములు. ఇచట మొదటి భేదమునందును రెండవ భేదమునందును విశేష్యము శ్లేషించుటలో కామచారము. మూడవ భేదమునందైతే విశేషణ వాచకమునకే శ్లిష్టత్వము; విశేష్య వాచకమునకు లేదు అశ్లైనచో శబ్ద శక్తి మూలమగు ధ్వనికి నుచ్ఛేదమగును విశేషణము మాత్రము శ్లేషించినప్పుడు కూడా ప్రకృతాప్రకృత ధర్ములకు నుపాదానమందే శ్లేష. ప్రకృతధర్మి మాత్రమునకు స్వీకరించుటయైతే సమాసోక్తియే యచట విషయము. కనుక యీ తీరుగా. ఎచట ప్రకృతము మాత్రము విశేష్యముగ నుండి అనేకార్థ విశేషణముండునో అచట ఒక శ్లేష. ఈతీరుగా నప్రకృత మాత్ర విశేష్యకమగు ననేకార్థ విశేషణత్వమున మరొక శ్లేష. పృథగుపాత్త ప్రకృతాప్రకృతోభయ విశేష్యకమైన నానార్థ విశేషణత్వమున మూడవ శ్లేష. ఏతదన్యతమత్వమే లక్షణముగా పర్యవసించినది.

క్రమేణోదాహరణాని—

"సంభూత్యర్థం సకలజగతో విష్ణునాభిప్రపన్నమ్
యన్నాలం స త్రిభువనగురుర్వేదనాథో విరించిః.
ధ్యేయం ధన్యైరలిభిరలితరాం స్వప్రకాశస్వరూపమ్
పద్మాఖ్యం తత్కిమపి లలితం వస్తు వస్తుష్టయేఽస్తు."

అత్రాశీః ప్రకరణే తుష్టిజననసమర్థత్వేన లక్ష్మీభగవన్నాభికమలయోరుభయోరపి ప్రకృతత్వాత్ ప్రకృతమాత్రాశ్రితోఽయమేకయా శ్రుత్యా పదద్వయప్రతిభానద్వారా భిన్నధర్మపురస్కారేణానేకార్థప్రతిపాదనాత్సభంగః. విశేష్యయోరశ్లిష్టత్వేప్యయం సంభవతి. యథా తత్రైవ "పాయాదాద్యం కమలమథవా యోగమాయాస్వరూపమ్" ఇతితురీయచరణ నిర్మాణే.

క్రమముగా నుదాహరణములు.

"సంభూత్యర్థం" మొ. (సకల జగదుత్పత్తినిమిత్తమై విష్ణునాభిని పొందినదేనినాలమును త్రిభువన గురువగు బ్రహ్మ తెలిసికొనజాలడో,

ఏది ధన్యములగు తుమ్మెదలచే ధ్యానింపఁదగినదో, స్వప్రకాశ స్వరూపమో అట్టి పద్మమనెడు ఒకానొక సుందరమైన వస్తువు మీ ఆనందము కొరకు అగుగాక!

(త్రిభువన గురువును, వేదనాథుడును అగు బ్రహ్మకూడ జగత్తుయొక్క ఐశ్వర్యముఁకొరకు ఏకారణముచే సమర్థుడుకాడో ఆకారణముచే ఏది విష్ణువుచే స్వీకరింపబడినదో, ధనవంతుల సముదాయముచే మిక్కిలి ధ్యేయమో, స్వప్రకాశ స్వరూపమో అట్టి పద్మ (లక్ష్మి) యనెడు ఒకానొక సుందరమైన వస్తువు మీకు ఆనందమును కలిగించుగాక!)

ఇచట ఇది ఆశీః ప్రకరణములో సంతోషమును గలిగించుట యందలి సామర్థ్యముచేత లక్ష్మి భగవన్నాభి కమలములు రెండును ప్రకృతములు గనుక ప్రకృతమాత్రాశ్రితమగు, ఒక శ్రుతితో పదద్వయ ప్రతిభానము ద్వారా, భిన్న ధర్మపురస్కారముతో, ననేకార్థములను ప్రతిపాదించుట వలన, సభంగ శ్లేష. రెండు విశేష్యములు శ్లేషించ నపుడును ఇది సంభవించును. ఎట్లనగా నిచటనే "పాయాదాద్యం కమలమథవా యోగమాయా స్వరూపం" అని నాల్గవ చరణ నిర్మాణమునందు.

అయమేవాభంగాత్మకో యథా —

"కరకలితచక్రఘటనో నిత్యం పీతాంబరస్తమోరాతిః
నిజసేవిజాడ్యనాశనచతురో హరిరస్తు భూతయే భవతామ్."

విశేష్యయోరశ్లిష్టత్వే యథా – "జాడ్యహారణో విష్ణుః సూర్యశ్చ వః పాతు" ఇతి తస్యైవ శేషే కృతే.

అర్థశ్లేషో యథా—

"అర్జునస్య గురుర్మాయామనుజః పరమః పుమాన్
గుంజాపుంజధరః పాయాదపాయాదివా కోఽపి వః."

ఏవమేతే త్రయోఽపి ప్రకృతవిషయా ఏవ భేదాః.

"హరికరసంగాదధికం రమణీయాప్యతులరాగసంవలితా
సుందరి తవాననాగ్రే కమలాభా విగలితప్రతిభా."

అయమప్రకృతమాత్ర విషయః. ప్రకృతస్యాననస్య శ్లేషావిషయత్వాత్. కమలాభేతివిశేష్యాంశే. అధికమితి విశేషణాంశే

సభంగః, అన్యత్రా భంగః. అప్రకృతయోర్విశేష్యయోరశ్లిష్టత్వే యథా- అత్రైవ "కమలాయాః కమలస్య చ శోభా గలితా తవానన స్యాగ్రే" ఇత్యుత్తరార్ధనిర్మాణే.

ఇది అభంగాత్మక మెట్లనగా-

"కరకలిత" మొ. (కరకలిత చక్రఘటనుడును, ఎల్లప్పుడు పీతాంబరుడును, తమోరాతియు, సేవించు జనుల జాడ్యమును నాశనము చేయుట యందు నిపుడునగు హరి నీకు సంపదలను కలుగజేయుగాక !)

విశేష్యములు శ్లేషించనపుడు యెట్లనగా-

'జాడ్యహరణోవిష్ణుః సూర్యశ్చ వః పాతు' అని దానికే శేషము చేయగా.

అర్థశ్లేష మెట్లనగా—

"అర్జునస్య" మొ. (అర్జునునకు గురువును, మాయామనుష్యుడును, గురుగింజల సమూహమును ధరించిన వాడును అయిన ఒకానొక పరమ పురుషుడు మిమ్ములను రక్షించు గాక !)

ఇటుల నీ మూడును ప్రకృత విషయములగు భేదములు -

"హరికర" మొ. (హరికర సంబంధము వలన మిక్కిలి (ఉదకముపై) అందమైనను మిక్కిలి రాగముతో సంవలితమైనట్టి కమలాభ ఓ సుందరీ ! నీ మొగము ముందు విగళిత ప్రతిభయైనది.)

ఇది అప్రకృతమాత్ర విషయము. ప్రకృతమగు మొగము శ్లేషలో విషయము కాదు గనుక. 'కమలాభా' అను విశేష్యాంశమునందును 'అధికమ్' అను విశేషణాంశము నందును సభంగము ఇతర స్థలములందు అభంగశ్లేష. అప్రకృతములగు విశేష్యములు శ్లేషించనపుడు ఎట్లనగా — ఇచటనే "కమలాయాః కమలస్యచ శోభా గలితా తవాననస్యాగ్రే" అని ఉత్తరార్ధనిర్మాణము నందు

ప్రకృతా ప్రకృతోభయవిషయో యథా—

"అలం హిమానీపరిదీర్ణగాత్రః
సమాపితః ఫాల్గునసంగమేన
అత్యంతమాకాంక్షితకృష్ణవర్త్మా
భీష్మో మహాత్మాజని మాఘతుల్యః"

అత్ర ప్రకృతాప్రకృతయోర్భీష్మమాఘయోరశ్లిష్టత్వా ద్విశేషణానాఞ్చ శ్లిష్టత్వాద్భవతి తృతీయో భేదః. పరం తూపమయా సంకీర్ణః. యది చ "మాఘో మహాత్మాజని హంత భీష్మః" ఇత్యప్రకృతాంశమపి శ్లేషగ్రస్తం కృత్వా రూపకం క్రియతే, తథాపి ప్రకృతవిశేష్యస్య మాఘస్యాశ్లిష్టత్వాదఖండిత ఏవ శ్లేషః. న చాత్ర సమాసోక్తిరితి భ్రమితవ్యమ్, ప్రకృతధర్మిణోఽపి శబ్దవాచ్యత్వాత్. యత్ర త్వప్రకృతవ్యవహార ఏవ శబ్దశక్తిం సహేతాపి, న త్వప్రకృతధర్మీ, తత్ర సమాసోక్తేరిష్టేః.

ప్రకృతాప్రకృతోభయ విషయ మెట్లనగా—

"అలం హిమానీ" మొ. (మిక్కిలి మానవంతుడును, (హిమానిచే పరిదీర్ణమగు గాత్రము గలదియు) ఫాల్గుణ సంగముచే సమాపితుడును (సమాపితమును)మిక్కిలి ఆకాంక్షితమగు కృష్ణవర్త్మ గలవాడును(కలదియు) మహానుభావుడును అగు భీష్ముడు మాఘతుల్యుడుగా అయ్యెను,)

ఇచట ప్రకృతాప్రకృతములగు భీష్మ మాఘములు శ్లేషించనందున, విశేషణములు శ్లేషించినందున మూడవ భేద మేర్పడును. కానీ ఉపమతో సంకీర్ణమైనది. అయితే- 'మాఘో మహాత్మా జని హన్త భీష్మః' అని అప్రకృతాంశమును కూడ శ్లేషగ్రస్తముగా జేసి రూపకము చేయబడినచో నట్లైనను ప్రకృత విశేష్యమగు మాఘము శ్లేషించక పోవుటవలన అఖండితమైనదే శ్లేష. ఇచట సమాసోక్తి యని భ్రమింపరాదు. అప్రకృత ధర్మి కూడ శబ్దవాచ్యము గనుక. ఎచటనైతే నప్రకృతమైన వ్యవహారమే శబ్ద శక్తినిన్ని సహించునో, అప్రకృత ధర్మి సహించజాలదో, అచటనే సమాసోక్తి యిష్టమగుటవలన.

అత్ర విచార్యతే- అయం చాలంకారః ప్రాయేణాలంకారాంతరస్య విషయమభినివిశతే, తత్ర కిమస్య బాధకత్వం స్యాదాహోస్విత్సంకీర్ణత్వముతాహో బాధ్యత్వమితి. అత్రాహురుద్భటాచార్యాః- "యేన నాప్రాప్తే య ఆరభ్యతే స తస్య బాధకః" ఇతి న్యాయేనాలంకారాంతరవిషయ ఏవాయమారభ్యమాణోఽలంకారాంతరం బాధతే. న చాస్య వివిక్తః కశ్చిదస్తి విషయో యత్ర సావకాశో నాన్యం బాధేత. తథాహి - అప్రకృతమాత్రయోః ప్రకృతమాత్రయోర్వా తావత్తుల్యయోగితైవ జాగర్తి. ప్రకృతాప్రకృత

యోస్తు దీపకమ్, తదనుమోదితా ఉపమాదయశ్చ. న చ—

"దేవ త్వమేవ పాతాల మాశానాం త్వం నిబంధనమ్
త్వం చామరమరుద్భూమి రేకో లోకత్రయాత్మకః."

ఇత్యాది కావ్యప్రకాశోక్తో వివిక్తో విషయ ఇతి వాచ్యమ్. రూపకస్యైవాత్ర స్ఫుటత్వాత్. శ్లేషోపస్థాపిత పాతాలాద్యర్థస్యా భేదారోపమంతరేణ లోకత్రయాత్మకత్వస్య దురుపపాదత్వాత్ కథం తర్హి 'నదీనాం సంపదం బిభ్రద్రాజాయం సాగరో యథా' ఇత్యాదా వుపమాయాః ప్రత్యయః? కథం వా తత్రైవ యథాశబ్దస్థానే కిము శబ్దదానే ఉత్ప్రేక్షాయాః? అపర ఇతి కృతే చ రూపకస్యేతి చేత్, న. అత్ర హి ఉపమాదీనాం ప్రతిభాన మాత్రం న తు వాస్తవీ స్థితిః. న హి శైత్యేన శుక్తౌ రజతత్వం ప్రతీయమానమపి వస్తుతోఽస్తి. తస్మాదుపమాదిప్రతిభోత్పత్తిహేతుః శ్లేష ఏవ స్వవిషయే సర్వత్రా లంకారః ఇతి.

ఇచట విచారించబడుచున్నది—

ఈ యలంకారము తరచుగా నలంకారాన్తరము యొక్క విషయ మును ప్రవేశించును. అచట దీనికి బాధకత్వమా, లేదా సంకీర్ణత్వమా, లేనిచో బాధ్యత్వమా అని. ఇక్కడ ఉద్భటాచార్యులు చెప్పుదురు-

"యేన నాప్రాప్తే యః ఆరభ్యతే తస్య స బాధకః" అను న్యాయముచే నలంకారాన్తర విషయముగనే ఆరంభింపబడుచున్న ఈ అలంకారము అలం కారాన్తరమును బాధించును. దీనికి వివిక్తమగు విషయమేదియు లేదు, ఎచట సావకాశమై ఇతరముల బాధింపదో. అది యుక్తమే కదా-

అప్రకృత మాత్రములైనను ప్రకృత మాత్రములైనను తుల్యయోగి తయే యుండును ప్రకృతాప్రకృతములైతే దీపకము, తదనుమోదితము లగు నుపమాదులు ఉండును-

అయితే—

"దేవత్వ మేవ" మొ. (ఓ దేవా ! నీవే పాతాళము (బాగా రక్షించు వాడవు) నీవే దిక్కులకు (ఆశలకు) నిబంధనము నీవే అమరమరుద్భూమి (చామర వాయువులకు స్థానము). ఒక్కడవే మూడు లోకములకు ఆత్మయైన వాడవు.)

ఇత్యాది కావ్యప్రకాశోక్తియందు వివిక్తమగు విషయమున్నదే అనతగదు. రూపకమే అక్కడ స్ఫుటము గనుక. శ్లేషోపస్థాపితములగు పాతాళాద్యర్థమున కభేదారోపమును విడచి ఇది లోకత్రయాత్మకమగుట నుపపాదింపరాదు కదా? అయితే– "నదీనాం సంపదం బిభ్రత్ రాజాయం సాగరో యథా" ఇత్యాదులం దుపమ ఎట్లు ప్రతీతమగును? అక్కడనే 'యథా' శబ్దస్థానమున 'కిము' శబ్దము పెట్టిన ఉత్ప్రేక్ష ఎట్లు ప్రతీతమగును? 'అపరః' అని చేసిన యెడల రూపకము ఎట్లు? అది సరికాదు. ఇచట నుపమాదులకు ప్రతిభానము మాత్రమే కాని వాస్తవి యగు స్థితి కాదు. తెల్లదనముచే శుక్తియందు రజతత్వము ప్రతీయమానమైనను వస్తుతః లేదు కదా? అందువలన ఉపమాది ప్రతిభోత్పత్తి హేతువు శ్లేషయే స్వవిషయమునందంతటను అలంకారము" అని.

ఏతచ్చాపరే న క్షమంతే. తథా హి – యత్తావదుచ్యతే 'యేన నాప్రాప్త' ఇత్యాది, తత్ర ప్రాగుదాహృతే 'పద్మాక్ష్యం తత్కిమపి లలితం' ఇత్యస్మత్పద్యే, 'సర్వదో మాధవః పాతు యో గంగాం సమదీధరత్' ఇత్యాది పరకీయపద్యే చ శ్లేషాతిరిక్తః కోఽలంకారః? తుల్యయోగితా తు సాదృశ్యప్రత్యయనియతా కథమత్ర శక్యతే వక్తుమ్? నహి లక్ష్మీకమలయోర్హరిహారయోర్వా ప్రకృతే సాదృశ్యం ప్రతిపిపాదయిషితమ్. నాపి చాత్రైకశ్రుత్యార్థద్వయోపాదానం వినాన్యత్కించిచ్చమత్కారజనకం యేనాలంకారాంతర మభ్యుపగచ్ఛేమ. ఏకశ్రుత్యార్థద్వయోపాదానం తు శ్లేష ఏవ. ఏవంచ సావకాశత్వాచ్ఛ్లేషస్యాలంకారాంతరాపవాదకత్వం న యుక్తమ్. అత ఏవోపమాదీనాం ప్రతిభానమాత్రమితి యదుక్తం తదపి న సంగతమ్. గుణక్రియాదేరివ శబ్దమాత్రస్యాపి సమానధర్మత్వేనోపమాయాం తావద్బాధకాభావాత్. ఏవమలంకారాంతరస్యాపి శ్లేషవిషయే పారమార్థిక్యేవ సత్తా న ప్రాతిభాసికీ. ప్రత్యుత శ్లేషస్యైవ ప్రతిభానమాత్రమితి వక్తుం యుక్తమ్. పూర్ణోపమాయా విషయస్య సర్వస్యాపి త్రివిధశ్లేషేణాక్రాంతత్వాన్నిరవకాశతయాఽస్య సావకాశస్య స్వవిషయే బాధౌచిత్యాత్. తథా 'సమరార్చితోఽప్యసమరార్చితః' ఇత్యాదౌ శ్లేషస్య తైమిరికచంద్రద్వయవత్ప్రతిభానమాత్రమేవ. న త్వలంకారత్వమ్. తజ్జీవాతోర్ద్వితీయార్థస్యాప్రతిష్ఠానాత్. విరో

ధస్య త్వాభాసరూపస్యాప్యలంకారత్వమ్, న తు శ్లేషస్యేతి స్ఫుట మేవ. తస్మాదేవమాదౌ శ్లేషప్రతిభయోద్భావ్యో విరోధ ఏవాలంకారః న తు విరోధ ప్రతిభయోద్భావ్యః శ్లేషః. కించ ప్రత్యేకం తత్తద్రూప పురస్కారేణ కస్యాప్యలంకారస్య నాస్తి శ్లేషవిషయే నాప్రాప్తత్వమ్, అలంకారాంతరత్వపురస్కారేణేతి చేత్, ఏవం తర్హి బాధ్యసామాన్య చింతయా స్వవిషయే ప్రాప్తస్య సర్వస్యాపి బాధాపత్తౌ శ్లిష్టపరం పరితరూపకస్య శ్లిష్టసమాసోక్తేశ్చోచ్ఛేద ఏవ స్యాత్. తస్మాచ్ఛ్లేషస్య నాపవాదకత్వమ్. సంకీర్ణత్వం తు స్యాత్ ఇతి.

దీనిని ఇతరులు సహింపరు. అలాగే కదా ? ఏది చెప్పుచున్నారో— "యేన నాప్రాప్త" ఇత్యాదికము, అచట వెనుక నుదాహరించిన "పద్మా క్ష్యం తత్కిమపి లలితం" అను మా పద్యమునందును, "సర్వదో మాధవః పాతు యో గంగాం సమదీధరత్" ఇత్యాది పరకీయ పద్యమునందును, శ్లేషాతిరిక్తమగు నలంకారమేది ? తుల్యయోగిత అయితే సాదృశ్యజ్ఞాన నియతమైనది దాని నిక్కడ ఎట్లు చెప్పుటకు వీలగును ? లక్ష్మీకమలములకు గానీ, హరిహరులకుగానీ ప్రకృతమునందు సాదృశ్యము చెప్పదలంపబడ లేదే ? ఇచట నేకశ్రుతిచే రెండర్థములు స్వీకరించుటను విడచి వేరే యేకొంచ మున్ను చమత్కారమును గల్గించునది లేదే ? అట్లైనచో నలంకారాన్తరము నంగీకరింతుము. ఏకశ్రుతితో నర్థద్వయమును స్వీకరించుట శ్లేషయేను. ఇలాగ సావకాశము గనుక శ్లేషమునకు నలంకారాన్తరాపవాదకత్వము యుక్తము గాదు. ఇందువలననే యుపమాదులకు ప్రతిభాన మాత్రమేనని మీరు చెప్పుటయు సంగతము గాదు. గుణక్రియాదులవలె శబ్ద మాత్రమును సమాన ధర్మమగుటచేత నుపమయందైతే బాధకము లేదు కనుక. ఇలాగే నలంకారాన్తరమునకున్ను శ్లేషవిషయమునందు పారమార్థికమైనదే సత్త. ప్రాతిభాసికి కాదు. ప్రత్యుత, శ్లేషమునకు ప్రతిభాస మాత్రము అని చెప్పుట తగును. పూర్ణోప యొక్క విషయమంతయున్ను మూడు విధములగు శ్లేషచే నాక్రమించబడుటవలన నిరవకాశమగుటచే సావకాశమగు దీనికి స్వవిషయము నందు బాధ ముచితము గనుక—

అలాగే "సఘరార్చితోఽప్యమరార్చితః" ఇత్యాదులయందు శ్లేషము

నకు తైమిరిక చంద్రద్వయమువలె ప్రతిభాన మాత్రమే. కాని అలంకార త్వము లేదు. దానిని బ్రతికించునట్టి ద్వితీయార్థమునకు నిలుకడలేదు కనుక. విరోధమునకైతే, ఆభాసరూపమునకైనను నలంకారత్వము మాత్రమే, శ్లేషకు లేదు; అని స్ఫుటమే. అందువలన ఇటువంటి వానియందు శ్లేష ప్రతిభ చేత నుత్పాద్యమగు విరోధమే అలంకారము; విరోధ ప్రతిభోత్పాదక్లేషము కాదు. మరియు, ప్రత్యేకముగా నాయారూపలములను పురస్కరించుకొని ఏయలంకారమునకైనను శ్లేషవిషయమున నాప్రాప్తత్వము లేదు. అలంకా రాన్తరత్వమును పురస్కరించుకొని - అన్నట్లైతే, ఇలాగైతే ఇప్పుడు బాధ్య సామాన్యమును గూర్చిన చింతచే స్వవిషయమునందు ప్రాప్తమగునంతకును బాధాపత్తియందు శ్లిష్ట పరంపరిత రూపకమునకును, శ్లిష్ట సమాసోక్తికిని ఉచ్ఛేదమే యగును. అందువలన శ్లేషమునకు అపవాదకత్వము లేదు. సంకీర్ణత్వమే యగును" అని.

అన్యే తు—"అలంకారా హి ప్రాధాన్యేన చమత్కారా ధాయకాః స్వాం స్వామాఖ్యాం లభన్తే. త ఏవ పరోపకారకతయా వర్తమానాస్తాం త్యజంతి. యథా—'రరాజ భూమౌ వదనం మృగా క్ష్యా నభోవిభాగే హరిణాంకబింబమ్' ఇత్యత్ర ప్రకృతాప్రకృతాత్మ నామేకధర్మసంబంధో దీపకాఖ్యాం భజతే; త్యజతి చ 'రాజతే వదనం తన్వ్యా నభసీవ నిశాకరః' ఇత్యత్ర. అత ఏవోచ్యతే—'ప్రాధాన్యేన వ్యపదేశా భవంతి' ఇతి. ఏవం చాలంకారాన్తరోపస్కారకతయా స్థితః శ్లేషః కథంకారం స్వగృహస్థ ఇవ శ్లేషాలంకారవ్యపదేశం వోఢుమీష్టా మితి బాధ్యప్రాయ ఏవ" ఇత్యప్యాహుః.

ఇతరులైతే—"అలంకారములు ప్రధానముగా చమత్కారాధాన మొన ర్చునవై తమతమ పేళ్ళను పొందుచున్నవి. అయితే అవియే పరోపకారక ముగ వర్తించుచున్నవై దానిని త్యజించు చున్నవి. ఎట్లనగా—"రరాజ భూమౌ వదనం మృగాక్ష్యా నభోవిభాగే హరిణాంకబిన్నం" అను చోట ప్రకృతాప్రకృతములకు ఏక ధర్మసంబంధము దీపకమను పేరు పొందు చున్నది. "రాజతే వదనం తన్వ్యాః నభసీవ నిశాకరః" అనే చోట విడచు చున్నది కూడాను. ఇందువలననే చెప్పెదరు. ప్రాధాన్యముచే వ్యప దేశములగుచున్నవి అని. ఈ తీరుగా నలంకారాన్తరమునకు నుపస్కారక

ముగా నిలిచిన శ్లేషము ఎట్లు తన ఇంటిలోనున్నవాటివలే శ్లేషాలంకార వ్యప దేశము వహించుటకు సమర్థమగును ? కనుక బాధింప దగిన దానివంటిదే అనియు చెప్పెదరు.

తదిత్థం సంక్షేపేణ శ్లేషస్య దిక్ప్రదర్శితా. యత్ర తు ప్రకృతాప్రకృతోభయవిశేష్యయోరపి శ్లిష్టపదోపాత్తత్వం స తు ధ్వనేర్విషయ ఇత్యుక్తమ్. స చ యథా—

"అవిరలవిగలద్దానోదకధారాసిక్తధరణీతలః
ధనదాగ్రమహితమూర్తిర్జయతి తరాం సార్వభౌమోఽయమ్."

అత్ర రాజని ప్రస్తుతే ఉదగ్దిగ్గజోఽప్రస్తుతోఽపి వ్యంజనమర్యాదయా ప్రతీయతే. తత్రాప్రస్తుతాభిధానం మా ప్రసాంక్షీదితి ప్రస్తుతాప్రస్తుతయోరుపమానోపమేయభావే తాత్పర్యం కల్ప్యతే. ఇమం చ శబ్దశక్తిమూలానురణనరూపం ధ్వనిమాహుః.

ఉదాహృతశ్చ ధ్వనికారైః—

"ఉన్నతః ప్రోల్లసద్ధారః కాలాగురుమలీమసః
పయోధరభరస్తస్యాః కం న చక్రేఽభిలాషిణమ్."

మమ్మటభట్టైశ్చ—

"భద్రాత్మనో దురధిరోహతనోర్విశాల
వంశోన్నతేః కృతశిలీముఖసంగ్రహస్య.
యస్యానుపప్లుతగతేః పరవారణస్య
దానాంబుసేకసుభగః సతతం కరోఽభూత్."

కనుక ఈతీరుగా సంక్షేపముగా శ్లేషయొక్క మార్గము చూపబడినది.

ఎక్కడనైతే ప్రకృతాప్రకృతోభయ విశేష్యములకును శ్లిష్టపదోపాత్తత్వముండునో అది ధ్వని విషయము అని చెప్పబడినది, అదియు నెట్లనగా—

"అవిరళ" మొ. (ఎడతెరపి లేకుండా స్రవించుచున్న దానోదకము యొక్క ధారాసారముచే తడుపబడిన ధరణీతలము కలవాడును (కలదియు), ధనదాగ్ర మహితమూర్తియు నగు యీ సార్వభౌముడు (సార్వభౌమము) సర్వోత్కర్షగా నున్నది).

ఇచట రాజు ప్రస్తుతుడు కాగా ఉత్తర దిగ్గజము అప్రస్తుతమై నను వ్యంజనా మర్యాదచే స్ఫురించును. అచట అప్రస్తుతమును జెప్పుట ప్రసక్తింప రాదని ప్రస్తుతాప్రస్తుతములకు ఉపమానోపమేయభావమునందు తాత్పర్యము గల్పించబడుచున్నది దీనినే శబ్దశక్తి మూలమగు అనురణన రూప ధ్వని యందురు. ధ్వనికారులచే నుదాహరింపబడినది కూడాను.

"ఉన్నతః" మొ. (ఉన్నతమును ప్రోల్లసద్ధారమును కాలాగురు మలినమును అగు ఆమె యొక్క పయోధరభరము ఎవనిని కోరికగల వానినిగా చేయలేదు)

మమ్మట భట్టుచేత నున్న—

"భద్రాత్మనః" మొ. (భద్రమైన స్వరూపముగలిగినట్టియు, దురధిరోహమగు తనువుగలట్టియు విశాల వంశోన్నతిగలట్టియు, శిలీముఖములను సంగ్రహించు నట్టియు, అనుపప్లుతమగు గతిగలట్టియు, యితరులు వారించునట్టి (పరవారణమగు) ఎవ్వని యొక్క (దేనియొక్క) కరము దానాంబుసేకముచే సుభగమై అయ్యెనో)

కువలయానందకారస్తు— "యదత్ర ప్రకృతాప్రకృతశ్లేషోదాహరణే శబ్దశక్తిధ్వనిమిచ్ఛంతి ప్రాంచస్తత్తు ప్రకృతాప్రకృతాభిధానమూలస్యోపమాదేరలంకారస్య వ్యంగ్యత్వాభిప్రాయం, నత్వప్రకృతార్థస్యైవ వ్యంగ్యత్వాభిప్రాయమ్. అప్రకృతార్థస్యాపి శక్త్యా ప్రతిపాద్యస్యాభిధేయత్వేన వ్యక్త్యనపేక్షత్వాత్. యద్యపి ప్రకృతార్థే ప్రకరణవశాఝ్జటితి బుద్ధిస్థితే సత్యేవ పశ్చాన్నృపతితద్గ్రాహ్యాదనాదివాచినాం రాజకరాదిపదానా మన్యోన్యసంనిధాన బలాత్తద్విషయశక్త్యంతరోన్మేషపూర్వకమప్రకృతార్థః స్ఫురేత్, నైతావతా తస్య వ్యంగ్యత్వమ్. శక్త్యా ప్రతిపాద్యమానే సర్వథైవ వ్యక్త్యనపేక్షణాత్. పర్యవసితే ప్రకృతార్థాభిధానే స్ఫురతి చేత్కామం గూఢశ్లేషోఽస్తు. అస్తి చాన్యత్రాపి గూఢః శ్లేషః. యథా—

"అయమతిజరఠాః ప్రకామగుర్వీ
రలఘువిలంబిపయోధరోపరుద్ధాః
సతత మసుమతామగమ్యరూపాః
పరిణతదిక్కరికాస్తటీర్బిభర్తి"

అత్ర హి సమాసోక్త్యుదాహరణే వృద్ధవేశ్యావృత్తాంతః ప్రతీయతే. తత్రాభంగశ్లేష ఇతి సర్వేషామభిమతమ్. ఏవంచాప్రకృతార్థో న వ్యంగ్యః. ఇత్యాహ.

కువలయానందకారులైతే—ఏది ఇచట ప్రకృతాప్రకృత శ్లేషోదాహరణమునందు శబ్దశక్తి మూలమగు ధ్వనిని ప్రాచీనులు కోరుచున్నారో అది ప్రకృతాప్రకృతాభిధానమూలమగు నుపమాద్యలంకారమునకు వ్యంగ్యత్వాభిప్రాయము, అప్రకృతార్థమునకే వ్యంగ్యత్వాభిప్రాయము కాదు. అప్రకృతార్థమునకును, శక్తిచేత ప్రతిపాదింపబడు దానికి నభిధేయత్వముండుటచేత, వ్యక్త్యపేక్ష లేదు కనుక. విచారించగా ప్రకృతార్థము ప్రకరణవశమువలన, శీఘ్రముగా బుద్ధి స్థితమైన పిమ్మటనే రాజు, అతడు గ్రహింప వలసిన ధనము మొదలయిన వాటిని చెప్పునట్టి రాజకరాది పదముల పరస్పర సన్నిధాన బలమువలన తద్విషయమగు మరియొక శక్తి యొక్క ఉన్మేషము ద్వారా అప్రకృతార్థము స్ఫురించును, ఇంతమాత్రముచే దానికి, వ్యంగ్యత్వము లేదు; శక్తిచే ప్రతిపాదింపబడునపుడు అన్ని విధములను వ్యక్త్యపేక్ష లేదు గనుగ. ప్రకృతార్థాభిధానము ముగియ పిమ్మట స్ఫురించిన యెడల గూఢశ్లేష కానిండు. మరియొకచోటకూడ ఇట్టి గూఢమగు శ్లేష యున్నది, యెట్లనగా—

"అయమతి" మొ. (అతి కఠినమైనట్టియు, ఎక్కువగా వ్రేలుచున్న పయోధరములచే అడ్డగింపబడినట్టియు, ప్రాణులకెప్పుడునూ గమ్యముగాని రూపముగలవియు, పరిణత దిక్కరికలును అగు తటులను ఇది ధరించుచున్నది)

ఇచట సమాసోక్త్యుదాహరణమందు వృద్ధ వేశ్యావృత్తాంతము ప్రతీతమగుచున్నది. ఇచట యభంగ శ్లేషయని సర్వుల యభిమతము, ఇలాగ అప్రకృతార్థము వ్యంగ్యము గాదు అని చెప్పెను.

తత్ర విచారయామః – యత్తావదుచ్యతే ఉపమాదేరలంకారస్యైవ వ్యంగ్యత్వం ప్రాచీనాభిప్రేతం న త్వప్రకృతార్థస్యేతి, ఏవం సతి—

"అనేకార్థస్య శబ్దస్య వాచకత్వే నియంత్రితే
సంయోగాద్యైరవాచ్యార్థధీకృద్ వ్యాపృతి రంజనమ్."

ఇత్యాది స్తేషాం గ్రంథః కథమాయుష్మతా సమర్థితః? ఉప

మాదేర్వ్యంగ్యత్వస్య వాచకతానియంత్రణానపేక్షత్వాత్. నహ్యనేకార్థస్యాపి శబ్దస్యోపమాదివాచకత్వం ప్రసక్తం యేన తన్నియంత్రణాయ సంయోగాద్యనుసరణమర్థవత్స్యాత్; ద్వితీయార్థవాచకతాయామనియంత్రితాయామప్యుపమాదేర్వ్యంగ్యత్వస్య నిష్ప్రత్యూహత్వాత్. తస్మాత్తద్గ్రంథానాకలననిబంధనం తదభిప్రాయవర్ణనమితిస్ఫుటమేవ.

అచట విచారింతము—ఏదయితే చెప్పుచున్నావో ఉపమాద్యలంకారములకే వ్యంగ్యత్వము ప్రాచీనుల కిష్టమైనది, అప్రకృతార్థమునకు కాదు అని, ఇలాగయితే—అనేకార్థస్య ఇత్యాదియగు వారి గ్రంథము ఆయుష్మంతునిచే నెట్లు సమర్థింప బడినది? ఉపమాదుల వ్యంగ్యత్వము వాచకతానియంత్రణ మపేక్షింపదుగదా. అనేకార్థమైనను శబ్దమునకు ఉపమాదివాచకత్వము ప్రసక్తము కాదు. అందువలన తన్నియంత్రణకై సంయోగాదుల ననుసరించుట కర్థవత్త్వమగును. ద్వితీయార్థవాచకత నియమింపబడ నప్పటికిని, ఉపమాదులు వ్యంగ్యమగుట నిరభ్యంతరము. అందువలన యా గ్రంథాభిప్రాయము సరిగా గ్రహించక దానిని చెప్పుట అని స్పష్టమేను,

యదప్యుచ్యతే అప్రకృతార్థస్య శక్త్యా ప్రతిపాద్యస్యేత్యాది తత్ర కథమప్రకృతార్థస్య శక్త్యా ప్రతిపాదనమ్? తద్విషయే శక్తేర్నియంత్రణస్య తైరేవోక్తత్వాత్. అథ నియంత్రణం నామ ప్రథమం బోధాజననమాత్రం న తు చరమమపి ఏవంచ ప్రకృతశక్త్యా ప్రకృతార్థబోధే జాతే సత్యప్రకృతార్థయా ద్వితీయశక్త్యా ప్రకృతేతరార్థబోధే న కించిద్బాధకమితి చేత్. న. ప్రథమం హ్యప్రకృతార్థబోధస్యాజననమేవ కస్య హేతోః? ప్రకరణాదిజ్ఞానేన ప్రతిబంధాదితి చేత్, ప్రకృతార్థబోధోత్తరం సా ప్రతిబంధకతా కేనాపహృతా ప్రకరణాదిజ్ఞానస్య? న చ జ్ఞానస్యాశువినాశిత్వాత్తదానీం ప్రకరణజ్ఞానమేవ నష్టమితి వాచ్యమ్. జ్ఞానాంతరస్యోత్పత్తౌ బాధకాభావాత్. సైవ జ్ఞానవ్యక్తిః ప్రతిబంధికేతి తు తత్తద్వ్యక్తి సహస్రగతప్రతిబంధకత్వ సహస్రకల్పనా గౌరవగ్రస్తమేవ. తదనేనయాన్యత్ర క్లృప్తవ్యంజనాఖ్యవ్యాపారస్యైవ కల్పయితుం యుక్తత్వాత్. 'జైమినీయమలం ధత్తే రసనాయాం మహామతిః' ఇత్యాదౌ బాధితార్థబోధస్య శక్త్యా దురుపపాద

త్త్వాచ్చ. యది తు యథాకథంచిదుపపత్తిః స్యాదేవమపి తస్య దేవ దత్తాదౌతత్పుత్రవాక్యాదప్రాదుర్భావ స్తచ్ఛ్యాలకాద్యుపహాసవాక్యాత్ ప్రాదుర్భావశ్చ న స్యాత్. వక్తృబోద్ధవ్యాదివైశిష్ట్యస్య వ్యంగ్య ప్రతిభామాత్రహేతుత్వాదితి ప్రాచామాశయః. తత్రకిముచ్యతే అప్ర కృతార్థస్య శక్త్యా ప్రతిపాదనమితి.

మరియు నేది చెప్పబడుచున్నదో-"అప్రకృతార్థమునకు శక్తిచే ప్రతి పాద్యమగు ధానికి", మొదలగునది-అచట అప్రకృతార్థమును శక్తితో ప్రతి పాదించుటయెట్లు ? ఆ విషయమునందు శక్తి నియంత్రణమని వారే చెప్పిరి కదా? అట్లు కాదు; నియంత్రణము అనగా మొట్టమొదట బోధకముకాకుం డుట మాత్రమే; అంతేకాని, చివరకూడ బోధగలిగించకుండుటకాదు; ఇలాగ ప్రకృత శక్తిచే ప్రకృతార్థబోధకలుగగా కృతార్థము కాని రెండవ శక్తిచే ప్రకృతేతరమగు నర్థబోధయందు బాధమేదియునులేదు - అనినచో—నదియు క్తము కాదు. మొట్టమొదట యప్రకృతార్థ బోధపుట్టకుండుటయేఎందువలన? ప్రకరణాది జ్ఞానముచే ప్రతిబంధము అగుటవలన అన్నచో-ప్రకృతార్థబోధ తరువాత నా ప్రతిబంధకత్వము, ప్రకరణాది జ్ఞానమునకు, ఎవరు అపహ రించిరి ? జ్ఞానము ఆశువినాశికముగ నపుడు ప్రకరణాదిజ్ఞానమే నష్టమయ్యెను- అనరాదు. మరి యొక జ్ఞానము పుట్టుటకు బాధకములేదుగదా ? అదియే జ్ఞాన వ్యక్తి ప్రతిబంధకము; అనుట మాత్రము ఆయావ్యక్తి సహస్రమందున్న ప్రతిబంధకత్వ సహస్రము యొక్క కల్పనా గౌరవముచే గ్రస్తమే. దాని కంటె మరియొక్క-చోటక్లప్తమైన వ్యంజనవ్యాపారమే కల్పించుట యుక్తము కనుక.

"జైమనీయమలంధత్తేః రసనాయాం మహామతిః,"— ఇత్యాదులందు బాధితమగు నర్థమును బోధించుట శక్తిచేతవీలులేదు కదా. ? అయితే- ఎలాగోలాగు నుపపత్తిఅగును అనుకొనుము ఇలాగైనను, అది దేవ దత్తాదులయందు తత్పుత్రవాక్యమువలన పుట్టక పోవుటయు అతని బావ మరది యొక్క యెగతాళి మాటనుండి పుట్టుటయు లేకపోవును. వక్తృ బోద్ధవ్యాదివైశిష్ట్యము వ్యంగ్యప్రతిభా మాత్రమునకు కారణమగుటవలన అని ప్రాచీనుల యభిప్రాయము. అట్లుండగా, అప్రకృతార్థము శక్తిచే ప్రతి దిపాంపబడును, అని ఎట్లు చెప్పుదవు ?

యచ్చాప్యుచ్యతే "—'అయమతిజరఠాః' ఇత్యాది సమాసో క్తావివ గూఢశ్లేషోఽస్తు" ఇతి తదపి గర్భస్రావేణ గలితమ్. శ్లిష్టవిశేషణాయాం సమాసోక్తావపి వ్యక్త్యైవాప్రకృతార్థ ప్రతీతిస్వీకారాత్. అత ఏవ ధ్వనికృతా 'గుణీభూతవ్యంగ్యభేదః సమాసోక్తిః' ఇత్యుక్తమ్. 'సమాసోక్త్యా శ్లేషో బాధ్యతే' ఇత్యుద్భటప్రభృతిభిశ్చ. బాధో హి శ్లేషస్య తత్రాప్రవృత్తిమాత్రమ్, శ్లిష్టశబ్దప్రయోగస్తు తత్రోభయార్థతామాత్రేణోపపాదనీయ ఇతి న కించిదేతత్.

"మరియు అయమతి జరఠాః"-ఇత్యాది సమాసోక్తియందువలె గూఢ శ్లేష అగుగాక-అని పలుకుచున్నావో, అదియు గర్భస్రావంతో జారిపోయింది. శ్లిష్టవిశేషణమగు సమాసోక్తియందును వ్యక్తిచేతనే యప్రకృతార్థ ప్రతీతిని స్వీకరించుటవలన. ఇందువలననే ధ్వనికారులు - "గుణీభూతవ్యంగ్య భేదము సమాసోక్తి" అనిరి. 'సమాసోక్తిచే శ్లేషబాధింపబడును' అని ఉద్భటుడు మొదలైనవారనిరి. బాధయనగా శ్లేష యక్కడ ప్రవర్తించక పోవటమే. శ్లిష్టప్రయోగమైతే నచట నుభయార్థతామాత్రముతో నుపపాదనము చేయవలెను; ఇది పెద్ద విషయముగాదు.

వయం తు బ్రూమః — అనేకార్థస్థలే హ్యప్రకృతాభిధానే శక్తేరుక్తిసంభవోఽప్యస్తి. యోగరూఢిస్థలే తు సాపి దూరాపాస్తా. యథా —

"చాంచల్యయోగి నయనం తవ జలజానాం శ్రియం హరతు
విపినేఽటి చంచలానామపి చ మృగాణాం కథం ను తాం హరతి."

అత్ర నైవాశ్చర్యకారీ చాంచల్యగుణరహితానాం కమలానాం చాంచల్యగుణాధికేన తవ లోచనేన శోభాయాస్తిరస్కారః, ఆశ్చర్యకారీ తు హరిణానాం తద్గుణయుక్తానాం తిరస్కార ఇతి వాచ్యార్థే పర్యవసన్నేఽపి రూఢినిర్ముక్తకేవలయోగ మర్యాదయా—మూర్ఖపుత్రాణాం ధనహరణం నేతృభిశ్చారైః సుకరం న తు గవేషకాణామితి జలజ, నయన మృగశబ్దేభ్యః ప్రతీయమానోఽర్థః కథం వినా వ్యంజనావ్యాపారముపపాదయితుం శక్యతే? యతో యోగశక్తే రూఢ్యాదృఢ నిగడనియంత్రితాయా నాస్తి స్వాతన్త్ర్యమ్. అత ఏవ పంకజాదిపదేభ్యః పంకజనికర్తృత్వేన కుముదశైవలాదేబోధో లక్షణ

ద్యైవ. తాదృశశక్తిజ్ఞానానాం పద్మత్వప్రకారబోధస్యైవ కార్యతా వచ్ఛేదకత్వాదిత్యుక్తం నైయాయికైః. అత ఏవ చ "ఈశానో భూత భవ్యస్య స ఏవాద్య స ఉ శ్వః" ఇతి వేదాంతవాక్యే కిమైశ్వర్యవిశిష్టః కశ్చిజ్జీవః ప్రతిపాద్య ఈశ్వరో వేతి సంశయే ప్రాప్తే — 'శబ్దాదేవ ప్రమితః' ఇతి సూత్రితముత్తరమీమాంసాకారై ర్భ్యాసచరణైః. తస్మాత్త్వాగుక్తపద్యేఽప్రకృతచోరవ్యవహారో వ శక్తివేద్యః. అపి తు వ్యక్తివేద్య ఏవ ముఖ్యార్థ బాధాద్యభావాల్లక్ష్యోపి న శక్యతే వక్తుమ్. తాత్పర్యార్థబాధస్తు తాత్పర్యార్థబోధోత్తరబోధ్యః స ఏవ తు కథం స్యాదితి వ్యంజనైవ శరణీకరణీయా. న హి చోరవ్యవ హారోఽత్ర వక్తుర్వివక్షిత ఇతి జ్ఞానే శ్రోతుః కశ్చిదుపాయోఽస్తి ఋతే సహృదయతోన్మిషితాదస్మాద్ వ్యాపారాత్.

మేము చెప్పుచున్నాము అనేకార్థస్థలములందు నప్రకృతార్థాభి ధానమున శక్తి మాట సంభవించుట యున్నది. యోగరూఢి స్థలమందైతే నదియు దురాపాస్తమే–ఎట్లనగా—

"చాంచల్య యోగి" మొ. ఇచట చాంచల్య గుణరహితములగు కమలములకు చాంచల్య గుణాధికమైన నీ నేత్రములచే కాంతి యొక్క తిరస్కారము ఎక్కువయాశ్చర్యకారియేకాదు. ఆశ్చర్యకారి యయిన దేది యనగా–హరిణములకు. చాంచల్యగుణ సహితములగు వానికి, తిరస్కారము; అని వాక్యార్థము పర్యవసన్నమైనను–రూఢనిర్ముక్తమగు కేవలయోగమర్యా దచే–మూర్ఖపుత్రుల ధనహరణము నాయకులగు చోరులచేత సులభమగును. గవేషకులకు యేమాత్రముగాదు; అని మృగ, జలజ, నయన, శబ్దములనుండి స్ఫురించుచున్న యర్థము వ్యంజనా వ్యాపారములేకుండా నుపపాదించుటకు ఎట్లు వీలగును? ఎందువలననగా–యోగశక్తికి, రూఢిచే గట్టిగొలుసులతో గట్టి వేయబడిన దానికి స్వాతంత్ర్యములేదు. అందువలన పంకజాది పదములనుండి, పంకజని కర్తగా కుముదశైవాలాది బోధలక్షణచేతనే. అటువంటి శక్తి జ్ఞాన ములకు, పద్మత్వ ప్రకారనుగు బోధయే, కార్యతా నిర్ణాయకమగుటవలన, అని నైయాయికులచే చెప్పబడినది అందువలననే "ఈశానో భూతవ్యస్య స ఏవాద్య స ఉశ్వః" అనే వేదాంత వాక్యమునందు ఐశ్వర్య విశిష్టుడగు జీవుడు

ప్రతిపాద్యుడా, ఈశ్వరుడా, అని సంశయమునందు, 'శబ్దాదేవ ప్రమితః' అని ఉత్తర మీమాంసాకారులగు వ్యాసపాదులు సూత్రించిరి. అందువలన వెనుక జెప్పిన పద్యములో నప్రకృత చోర వ్యవహారము శక్తి వేద్యము గాదు; ఇక నేమనగా వ్యక్తివేద్యమే. ముఖ్యార్థ బాధాదులు లేవు కనుక లక్ష్యము మను కాదు. తాత్పర్యార్థ బాధయైతే తాత్పర్యాబోధోత్తరకాలమున తెలియదగినది, అదియే. ఇచట నెట్లు అగును-అనినచో వ్యంజనే శరణముగా స్వీకరింపవలసినది. చోర వ్యవహారము ఇచట చెప్పు వానికి వివక్షితమని, తెలియుటకు వినువానికి సహృదయతవలన ఉన్మిషితమగు నీ వ్యంజనా వ్యాపారముకన్న వేరుగా నే చిన్న ఉపాయమున్ను లేదు కదా.

ఇదం పునరిహావధేయమ్ – 'రాగావృతో వల్గుకరాభిమృష్టం శ్యామాముఖం చుంబతి చారు చంద్రః' ఇత్యాదౌ తావత్సమాసోక్తిరితి నిర్వివాదమ్. చంద్రపదస్థానే రాజేతి కృతే తు శబ్దశక్తిమూలో ధ్వనిరితి చ. తదత్రోభయత్రాపి శ్లిష్టవిశేషణమహాత్మ్యాదప్రకృత వ్యవహారస్య ప్రతీయమానస్య తుల్యత్వాత్కథమేకత్ర గుణీభావోఽన్యత్ర ప్రాధాన్యం చ స్యాత్. ప్రకృతస్య ప్రాధాన్యాదప్రకృతస్య తు తదుపస్కారకత్వేనోభయత్రాపి గుణీభావౌచిత్యాత్. న హి విశేష్యస్య శ్లిష్టతామాత్రేణ వ్యంగ్యస్య ప్రాధాన్యమ్, అశ్లిష్టత్వే చాప్రాధాన్యం శక్యం సంపాదయితుం. నాయకత్వప్రతీతిరపి క్వచిదర్థశక్తిమూలేన వ్యంజనేన, క్వచిచ్ఛబ్దశక్తిమూలేన తుల్యైవ. ద్వయోరపి సమాసోక్తౌ ప్రకృతధర్మిణి నాయకత్వాదేః ప్రత్యయో నాభ్యుపేయతే, అపి తు నాయకాదివ్యవహారస్యైవ. ధ్వనౌ చాభ్యుపేయతే తేషామపి వ్యంగ్యస్యైకత్ర గుణత్వమన్యత్ర ప్రాధాన్యం చ కస్య హేతోః స్యాత్ ? ప్రకృతాప్రకృతయోరౌపమ్యం గమ్యముచ్యతామభేదో వా, సర్వథైవ తస్య ప్రకృతోపస్కారకత్వాద్ గుణీభావ ఏవోచితో న ప్రాధాన్యమ్. అన్యథా సమాసోక్తావపి వ్యంగ్యస్య ప్రాధాన్యాపత్తేః తస్మాచ్ఛ్లిష్టాశ్లిష్టవిశేష్యా సమాసోక్తిరేవేయమ్. పరాంగరూపగుణీభూతవ్యంగ్యభేద ఇత్యపి శక్యతే వక్తుం యది ప్రాంచో న కుప్యంతి.

ఇదిమాత్ర మవధాన ముంచదగినది–

"రాగావృతం" మొ.( వల్గువులగు కరములచే నంతటను పరామ

ర్శింపబడు శ్యామయొక్క మొగమును రాగావృతుడై యీ చంద్రుడు చుంబించు చున్నాడు,"

ఇత్యాదులందు, అయితే సమాసోక్తియని నిర్వివాదమే. చంద్రపద స్థానమందు 'రాజా'యని చేసినట్లైతే శబ్దశక్తి మూలకమగు ధ్వని యనియు. అందువలన ఇచట రెండు చోట్లయందును శ్లిష్టవిశేషణ మాహాత్మ్యము వలన అప్రకృత వ్యవహారమునకు, తోచుచున్న దానికి, సమానత్వము వలన ఒక చోట గుణీభావము మరి యొకచోట ప్రాధాన్యమును ఎట్లగును ? ప్రకృతము ప్రధానముగనుక అప్రకృతము తదుపస్కారక మగుటచేతను రెండు చోట్లను గుణీభావ ముచితము. విశేష్యము శ్లిష్టమైనంతమాత్రముచే వ్యంగ్యమునకు ప్రాధాన్యమున్ను, శిష్టముకానంతమాత్రమున అప్రాధాన్యమున్ను, సంపాదించుట శక్యముకాదు కదా ? నాయకత్వ ప్రతీతియున్ను ఒక చోట నర్థశక్తి మూలకమగు వ్యంజనచేతనేను, ఒక చోట శబ్దశక్తి మూలకమగు వ్యంజన చేతను, అని సమానమేను. ఎవరు సమాసోక్తిలో ప్రకృత ధర్మి యందు నాయకత్వా దుల యొక్క ప్రత్యయమంగీకరింపరో,-మరేమనగా నాయికాదుల వ్యవహారము యొక్క నారోపము మాత్రమే అంగీకరింతురో, ధ్వనియందు నంగీకరింతురో, వారికిని వ్యంగ్యమునకు ఒక చోట, గుణత్వము, మరియొకచోట ప్రాధాన్యము, ఏ కారణమువలన? ప్రకృతాప్రకృతములకు ఔపమ్యము గమ్యము అని చెప్పెదరుగాక, లేదా అభేదమైనను చెప్పెదరుగాక; అన్ని తీరులను దానికి ప్రకృతోపరస్కార మగుటవలన గుణీభావమే యుచితము, ప్రాధాన్యము కాదు. అలా కాని యెడల సమాసోక్తియందును వ్యంగ్యము ప్రధానము గావలసివచ్చును, అందువలన శ్లిష్టాశ్లిష్ట విశేష్యమగు సమాసోక్తియే ఇది. ప్రాచీనులు కోప పడకపోయిన యెడల, ఇతరముల కంగరూపమగుగుణీభూతవ్యంగ్యముయొక్క భేదమనియున్ను చెప్పుటకు వీలగును.

సోఽయం శ్లేషః, సభఙ్గోఽభఙ్గశ్చార్థాలంకారప్రభేదా శ్చేత్యాద్యటాః. ఉభావప్యేతే శబ్దాలంకారౌ, శబ్దస్య పరివృత్త్యసహత్వాదన్వయ వ్యతిరేకాభ్యాం తదాశ్రితత్వావధారణాత్. తృతీయస్త్వర్థాలంకారః, అర్థ మాత్రాశ్రితత్వాత్, ఇతి మమ్మటభట్టాః. అన్వయవ్యతిరేకాభ్యాం హి

హేతుత్వావగమో ఘటం ప్రతి దండాదేరివాస్తు, న త్వాశ్రయత్వావగమః. స తు పునస్తద్వృత్తిత్వజ్ఞానాధీనః. ఇహ హి సభంగశ్లేషస్య శబ్దద్వయవృత్తిత్వం జతుకాష్ఠన్యాయేన, అభంగస్య చార్థద్వయవృత్తిత్వమేకవృంతగతఫలద్వయవచ్చ స్ఫుటమేవేత్యేకస్య శబ్దాలంకారత్వమపరస్యార్థాలంకారత్వమ్ యద్యపి ద్వితీయస్యాపి 'ప్రతిప్రవృత్తినిమిత్తం శబ్దభేదః' ఇతి నయే శబ్దద్వయవృత్తిత్వాచ్ఛబ్దాలంకారత్వముచితమ్, తథాపి శక్తతావచ్ఛేదకానుపూర్వ్యా భేదాదభేదాధ్యవసానాచ్ఛబ్దద్వయవృత్తిత్వజ్ఞానం దుఃశకమ్ అన్యథా 'ప్రత్యర్థం శబ్దనివేశః' ఇతి నయే పరాభిమతోఽర్థశ్లేషోఽపి శబ్దాలంకార ఏవ స్యాత్, ఇత్యలంకారసర్వస్వకారాదయః. అయం చోపమేవ స్వతంత్రోఽపి తత్ర తత్ర సకలాలంకారానుగ్రాహకతయా స్థితః సరస్వత్యా నవం సౌభాగ్యమావహన్నానావిధేషు లక్ష్యేషు సహృదయైర్విభావనీయ ఇతి.

ఇతి రసగంగాధరే శ్లేషప్రకరణమ్.

"ఆ ఈ శ్లేషము, సభంగము, అభంగము కూడ అర్థాలంకారమే"నని ఉద్భటానుయాయులు, "ఈ రెండును శబ్దాలంకారములే; శబ్దము పరివృత్తి సహము కాదు కనుక నన్వయ వ్యతిరేకములచే దాని నాశ్రయించి యుండుట నిశ్చయమే గనుక. మూడవది యర్థాలంకారమే; అర్థమాత్రము నే యాశ్రయించును గనుక" అని మమ్మటభట్టు: అన్వయ వ్యతిరేకములచేత, హేతుత్వావగమము, ఘటము గురించి దండాదులకువలె నగుగాక, ఆశ్రయత్వావగమము కాదు. అదైతే తద్వృత్తిత్వ జ్ఞానాధీనమైనది ఇక్కడ సభంగశ్లేషము రెండు శబ్దములందుండుట జతుకాష్ఠ న్యాయముచేత. అభంగశ్లేషకు అర్థద్వయవృత్తిత్వము ఏకవృంతమునందున్న ఫలద్వయమునకు వలె నని స్ఫుటమే కనుక ఒక దానికి శబ్దాలంకారత్వము, మరొకదానికి అర్థాలంకారత్వమును. విచారించగా రెండవ దానికిన్నీ— "ప్రతి ప్రవృత్తి నిమిత్తం శబ్దభేదః" అనే మతమునందు శబ్దద్వయమునందుండుట వలన శబ్దాలంకారత్వముచితము; అలా అయినను శక్తతా నిర్ణాయకమగు ఆనుపూర్వి యొక్క అభేదమువల్ల, నభేదాధ్యవసానమువలన, శబ్దద్వయ వృత్తిత్వజ్ఞానము దుశ్శకము. అలా కానియెడల 'ప్రత్యర్థం శబ్దనివేశః' అనే

మతమునందు పరాభిమతమగు నర్థ శ్లేషమున్ను శబ్దాలంకారమే. అగును, అని అలంకార సరస్వకారాదులు అనిరి.

ఈ యలంకారము ఉపమవలె స్వతంత్రమైనను అక్కడక్కడ సర్వా లంకారములను అనుగ్రహించుటకు తగినదిగా నుండి సరస్వతికి నూతన సౌభాగ్యమును గల్గించునదివలె నానా విధములగు లక్ష్యములందు సహృదయులచే పరిశీలింప బడవలసి యున్నది.

ఇది శ్లేషప్రకరణము

## అప్రస్తుత ప్రశంసా

అప్రస్తుతేన గమ్యేన వాచ్యస్య ప్రస్తుతస్యోపస్కరణే సమాసోక్తిరుక్తా. తద్వైపరీత్యేనాప్రస్తుత ప్రశంసోచ్యతే—

అప్రస్తుతేన వ్యవహారేణ సాదృశ్యాదివక్ష్యమాణప్రకారాన్యతమప్రకారేణ ప్రస్తుతవ్యవహారో యత్ర ప్రశస్యతే సాప్రస్తుతప్రశంసా. ప్రశంసనం చ వర్ణనమాత్రమ్, న తు స్తుతిః 'ధిక్ తాలస్యోన్నతతా యస్య చ్ఛాయాపి నోపకారాయ' ఇత్యాదావవ్యాప్త్యాపత్తేః.

అప్రస్తుతము గమ్యమై వాచ్యమగు ప్రస్తుతమునకు నుపస్కరణము చేయునపుడు సమాసోక్తి జెప్పబడినది. దానికి విపరీతముగా నప్రస్తుత ప్రశంస చెప్పబడుచున్నది. అప్రస్తుత మగు వ్యవహారముచే, సాదృశ్యము మొదలగు జెప్పబోవు ప్రకారములలో నొక వ్యవహారము కల దానిచే, ప్రస్తుత వ్యవహారము ప్రశంసింపబడినచో నది యప్రస్తుత ప్రశంస. ప్రశంస మనగా వర్ణనము మాత్రమే. స్తుతికాదు. "ధిక్ తాల స్యోన్నతతాం" ఇత్యాదుల యందు నవ్యాప్తి వలన.

ఇయం చ పంచధా - అప్రస్తుతేన స్వసదృశం ప్రస్తుతం గమ్యతే యస్యామిత్యేకా. కార్యేణ కారణమిత్యపరా. కారణేన కార్యమితి తృతీయా. సామాన్యేన విశేష ఇతి చతుర్థీ. విశేషేణ సామాన్యమితి పంచమీ. ఆద్యా యథా —

''దిగంతే శ్రూయంతే మదమలినగండాః కరటినః
కరిణ్యః కారుణ్యాస్పద మసమశీలాః ఖలు మృగాః.

ఇదానీం లోకేస్మిన్ననుపమశిఖానాం పునరయం
నఖానాం పాండిత్యం ప్రకటయతు కస్మిన్మృగపతిః."

యథా వా—

"యస్మిన్ ఖేలతి సర్వతః పరిచలత్కల్లోలకోలాహలై
ర్మంథాద్రిభ్రమణభ్రమం హృది హరిద్యూథాధిపాః పేదిరే.
సోఽయం తుంగతిమింగిలాంగగిలనవ్యాపారకౌతూహలః,
క్రోడే క్రీడతు కస్య కేలిరభసత్యక్తార్ణవో రాఘవః"

యథా వా—

'పురా సరసి మానసే వికచసారసాలిస్ఖల
త్పరాగసురభీకృతే పయసి యస్య యాతం వయః.
స పల్వలజలేఽధునా మిలదనేకభేకాకులే
మరాలకులనాయకః కథయ రే కథం వర్తతామ్'.

ఇది ఐదు విధములు—

అప్రస్తుతముచే తనతో సమానమైన ప్రస్తుతము తోచుట ఒకటి. కార్యముచే కారణము తోచుట రెండవది. కారణముచే కార్యము తోచుట మూడవది. సామాన్యముచే విశేషము తోచుట నాల్గవది. విశేషముచే సామాన్యము తోచుట నైదవది.

మొదటిది యెట్లనగా —

"దిగంతే" మొ. (మదముచే మలినములగు చెక్కిళ్ళుగల ఏనుగులు దిగంతములందు వినబడుచున్నవి. ఆడు ఏనుగులు జాలిదలపదగినవి. మృగములు సమశీలములు కావుగదా! ఇప్పుడూ తులలేని శిఖలు గల గోళ్ళ యొక్క పాండిత్యమును లోకమునందు, మృగపతి, దేనియందు ప్రకటించును?)

మరొకటి —

"యస్మిన్" (ఎవరు క్రీడించుచుండగా అంతటనూ బాగా కదలుచున్న తరంగముల చప్పుళ్ళచే మంథర పర్వతము తిరుగుట యను భ్రమను హృదయమునందు దిగ్గజ శ్రేష్ఠములు పొందినవో ఆయీ గొప్పవైన తిమింగలముల యొక్క శరీరములను మ్రింగుటయను వ్యాపారమునందు కౌతూహలము

గలగినట్టి రాఘవుడు క్రీడోద్వేగముచే త్యజింపబడిన సముద్రము గలవాడై వేనిక్రోడమునందు క్రీడించును!)

మరొకటి —

"పురా సరసి" మొ. (పూర్వము మానస సరస్సున వికసించిన పద్మముల సమూహము నుండి తొలగుచున్న పరాగముచే పరిమళింప చేయబడిన ఉదకమునందు ఎవని వయస్సు గడచినదో అమరాళకులనాయకుడు ఇప్పుడు కలియుచున్న అనేకములగు కప్పలచే ఆ కులమైన బురదనీటియందు ఎట్లుండునో చెప్పుము.)

శ్లిష్టవిశేషణాప్యేషా దృశ్యతే—

"నితరాం నీచోఽస్మీతి త్వం ఖేదం కూప మా కదాపి కృథాః
అత్యంతసరసహృదయో యతః పరేషాం గుణగ్రహీతాసి."

సమాసోక్తిరత్రానుగ్రాహికేతి తు న వక్తవ్యమ్. తస్యాః ప్రకృతాలంకారవిరుద్ధాత్మికాత్వేనానుగ్రాహికాత్వాయోగాత్. యత్తు— "—'యేనాస్యభ్యుదితేన చంద్ర గమితః క్లాంతిం రవౌ తత్ర తే, యుజ్యేత ప్రతికర్తుమేవ న పునస్తస్యైవ పాదగ్రహః' ఇత్యత్ర సమాసోక్తిరనుగ్రాహికా" ఇతి మమ్మటభట్టైరుక్తమ్, తత్ర విచార్యతే—అత్ర విశేషణ సామ్యమహిమ్నా ప్రతీయమానః కాపురుష వృత్తాంతః కిం ప్రస్తుత ఆహోస్విదప్రస్తుతః ? ఆద్యే సమాసోక్తేర్విషయ ఏవ నాస్తి. 'పరోక్తిర్భేదకైః శ్లిష్టైః సమాసోక్తిః' ఇతి సమాసోక్తేర్లక్షణస్య తైరేవాభిధానాత్. పరస్యాప్రకృతస్యేతి తదర్థాత్. ద్వితీయేఽప్రస్తుత ప్రశంసాయా నాస్తి విషయః, 'అప్రస్తుత ప్రశంసా యా సైవ ప్రస్తుతాశ్రయా' ఇతి తల్లక్షణాత్. ప్రస్తుత ఆశ్రయః ప్రధానం యస్యా ఇతి తదర్థాత్. తస్మాచ్ఛ్లిష్టవిశేషణో పతిఃప్ర ద్వితీయార్ధమాత్రం సమాసోక్తిరిత్యభిప్రాయేణ యథాకథంచిత్ సంగమనీయమ్.

ఇది శ్లిష్ట విశేషణముగాను కనుపించుచున్నది —

"నితరాం" మొ. (మిక్కిలి నీచమైతినని, ఓ కూపమా ! నీవు కష్టమును ఎప్పుడునూ చేయకుము నీవు అత్యంత సరసమగు హృదయము కలిగి యితరుల యొక్క గుణము గ్రహించువాడవు.)

ఇచట సమాసోక్తి అనుగ్రాహిక అని అనరాదు. అది ప్రకృతమగు నలంకారమునకు విరుద్ధ స్వభావముగల దగుటచే ననుగ్రహించుట పొసగదు.

యేదైతే —

"యేనాసి" (ఓ చంద్రుడా! ఉదయించిన ఏరవిచేత నీవు కాంతి విహీనుడవుగ చేయబడితివో ఆరవి విషయమున ప్రతీకారము చేయుట యుక్తము కాని అతని పాదములనే గ్రహించుట యుక్తముకాదు.)

అనుచోట సమాసోక్తి అనుగ్రాహిక యని మమ్మటభట్టు చెప్పిరో, అచట విచారింతము — ఇచట విశేషణ సామ్యమహిమచే ప్రతీయమానమగు కాపురుషవృత్తాంతము ప్రస్తుతమా. లేక అప్రస్తుతమా? అప్రస్తుతమన్న పక్షమందు సమాసోక్తికి విషయమేలేదు.

"పరోక్తి ర్భేదకై శ్లిష్టైస్సమాసోక్తిః" అని సమాసోక్తి లక్షణము. వారే చెప్పిరికదా?. పరమనగా నప్రస్తుతమని దాని యర్థమువలన. రెండవ పక్షమందు అప్రస్తుత ప్రశంసకు విషయము లేదు.

"అప్రస్తుత ప్రశంసా సా యా సైవ ప్రస్తుతాశ్రయా" అని దాని లక్షణము గనుక. ప్రస్తుతమగునది ఆశ్రయము (ప్రధానము) దేనికో అని దానికర్థము గనుక. అందువలన శ్లేషించిన విశేషములచే ఉపక్షిప్తమగు ద్వితీయార్థము మాత్రమే సమాసోక్తియని అభిప్రాయముతో ఏలాగో ఒక లాగున సమన్వయించనగును.

ఇయం చ సాదృశ్యమూలాప్రస్తుత ప్రశంసోచ్యతే. అస్యాం చ వాక్యార్థః క్వచిత్ప్రతీయమానార్థతాటస్థ్యేనైవావతిష్ఠతే—యథోక్తోదాహరణేషు. క్వచిచ్చ స్వగతవిశేషణాన్వయయోగ్యతామాసాదయితుం ప్రతీయమానాభేదమపేక్షతే. యథా—

'సముపాగతవతి దైవాదవహేలాం కుటజ మధుకరే మా గాః
మకరంద తుందిలానామరవిందానామయం మహామాన్యః'

యథా వా—

"తావత్కోకిల దివసాన్యాపయ విరసాన్వనాంతరే నివసన్.
యావన్మిలదలిమాలః కోఽపి రసాలః సముల్లసతి."

అత్ర వృక్ష పక్షిణోః సంబోధనానుపపత్త్యా ప్రతీయమానాంశతాదాత్మ్యమపేక్ష్యతే.

'మలినేఽపి రాగపూర్ణాం
వికసిత వదనామనల్పజల్పేఽపి
త్వయి చపలేఽపి చ సరసాం
భ్రమర కథం వా సరోజినీం త్యజసి'.

అత్ర త్యాగానౌచిత్యహేతుత్వేన కమలిన్యాః స్తుతిరూపం విశేషణముపాత్తమ్. తచ్చ న సంభవతి. నహి భ్రమరే శ్యామత్వాది ర్దోషః, కమలిన్యాః శోణత్వాదిర్వా గుణః, యేన స్తుతిః స్యాత్. అతో వాచ్యార్థస్య ప్రతీయమాన తాదాత్మ్యం విశేష్యాంశే చాపే క్ష్యతే. పూర్వత్రాంశేన, ఇహ తు సాకల్యేనేతి విశేషః.

ఇది సాదృశ్య మూలమగు నప్రస్తుత ప్రశంసయని జెప్పబడెను. దీని యందు వాక్యార్థము ఒకయెడ తోచునట్టి యర్థము యొక్క తాటస్థ్యము తోనే నిలబడును. ఎట్లనగా వెనుక జెప్పిన యుదాహరణము లందు. మరొక చోట స్వగతములగు విశేషములతో నన్వయ యోగ్యతను పొందుటకు ప్రతీయమానముతో నభేద మాకాంక్షించును.

ఎట్లనగా —

"సముపాగతవతి" మొ. (ఓ కుటజమా! దైవమువలన తుమ్మెద రాగా అందును ఎగతాళిని వహించకుము మకరందముతో పూర్ణములైన అరవిందములకు ఇది మిక్కిలి గౌరవించ దగినది.)

మరొకటి —

"తావత్కోకిల" మొ (ఓ కోకిలమా! అంతవరకూ వనమున నివ సించుచు విరసములగు రోజులను గడుపుము. ఎంతవరకు తుమ్మెద బారు కలియగా ఏదైనా తియ్యమామిడి బాగా విలసిల్లునో )

ఇచట వృక్ష పక్షులను సంబోధనము జేయుట కుదురదు గనుక ప్రతీయమానమైన యంశ తాదాత్మ్యమును కోరును

"మలినేఽపి" మొ.

ఇచట త్యాగానౌచిత్యహేతువుగా కమలిని యొక్క స్తుతిరూపమగు విశేషణము స్వీకరింపబడినది. అదియు సంభవించదు. తుమ్మెదయందు నల్ల దనము మొదలగునది దోషముకాదు గదా ? కమలినికి శోణత్వాదులు గుణ ములు కావుగదా—దేనిచేత స్తుతియగునో ? ఇందువలన వాచ్యార్థమునకు

ప్రతీయమానతాదాత్మ్యము విశేషణాంశమునందును, విశేష్యాంశమునందును కోరబడును. పూర్వము అంశముచేత, ఇక్కడనైతే సంపూర్ణముగావే అని విశేషము.

క్వచిచ్చ ప్రతీయమానమపి కించిదంశే వాచ్యతాదాత్మ్యమ్, వాచ్యం చ కించిదంశే ప్రతీయమానతా దాత్మ్యమపేక్షతే. యథా-

"సరజస్కాం పాండువర్ణాం కంటకప్రకరాంకితామ్
కేతకీం సేవసే హంత కథం రోలంబ నిస్త్రపః."

అత్ర యథా 'సరజస్కత్వం వాచ్యప్రతీయమానయోరపి సేవనా వౌచిత్యే నిమిత్తమ్, న తథాపాండువర్ణత్వకంటకితత్వే;యతః పాండువర్ణత్వం కేతక్యాం న దోషః, ప్రత్యుత గుణ ఏవేతి పాండురత్వాంశే కేతక్యాం నాయికాతాదాత్మ్యమపేక్ష్యతే. నాయికాయాం చ కంటకితత్వాంశే కేతకీతాదాత్మ్యమ్. పులకితత్వస్య కామినీత్యాగానునుగుణత్వాత్ప్రత్యుత తత్సేవనానుగుణత్వాత్.

కార్యేణ కారణం గమ్యం యథా-

"కిం బ్రూమస్తవ వీరతాం వయమమీ యస్మిన్ధరాఖండల
క్రీడాకుండలితభ్రు శోణనయనే దోర్మండలం పశ్యతి.
నానాభూషణరత్నజాల జటిలాస్తత్కాల మేవా భవన్
వింధ్యక్ష్మాధర గంధమాదనగుహాసంబంధినో భూరుహాః."

అత్ర వింధ్యారణ్యతరుభూషణేవారిపలాయనం గమ్యతే. యది తు వక్ష్యమాణదారీత్యా పర్యాయోక్తాలంకారస్యాయం విషయ ఇత్యుచ్యతే తదేదం వివిక్తముదాహరణమ్-

"నితరాం పరుషా సరోజమాలా
నమృణాలాని విచారపేశలాని.
యది కోమలతా తవాంగకానా
మథ కా నామ కథాపి పల్లవానామ్"

అత్ర పల్లవాదితిరస్కారేణ కార్యేణ తదంగానాం సౌకుమార్యాతిశయః కారణమ్, కార్యకారణభావశ్చేహ జ్ఞానయోః.

తేన పారుష్యస్య మృణాలగతత్వేన జ్ఞాయమానస్య స్వరూపత స్తదంగ సౌకుమార్యాజన్యత్వేఽపి న క్షతిః.

ఒక యెడల ప్రతీయమానము కూడ కొంచము అంశమునందు వాచ్యతాదాత్మ్యమును, వాచ్యమున్ను కొంచమంశమున ప్రతీయమాన తాదాత్మ్యమును అపేక్షించును. ఎట్లనగా -

"సరజసాం" మొ. (రజస్వలయు తెల్లని వర్ణము గలదియు కంటక ప్రకరములచే అంకితమైన కేతకిని, ఓరోలంబమా నీవు సిగ్గులేక సేవించు చున్నావు)

ఇచట సరజస్కత్వము వాచ్య ప్రతీయమానములు రెండిటి యొక్క సేవించుటలో అనౌచిత్యమునందు ఎలా నిమిత్తమో అట్లు పాండు వర్ణత్వ కంటకితత్వములు కావు. ఎందువల్ల ననగా పాండు వర్ణత్వము కేతకి యందు దోషముగాదు; ప్రత్యుత గుణమేనని పాండురత్వాంశమునందు కేతకికి నాయికాతాదాత్మ్యమపేక్షింపబడును. నాయికయందున్న కంటకితత్వాంశమునందు కేతకీతాదాత్మ్యము. పులకితత్వము కామినీత్యాగమునకు అనుగుణము కాకపోటవలన ప్రత్యుత అనుగుణమగుటవలన.

కార్యముచేత కారణము గమ్యమగుట యెట్లనగా -

"కింబ్రూమః" మొ. ("ఓ భూమీంద్రుడా! నీ వీరత్వము ఏమని చెప్పుదుము! క్రీడచేతకుండలితమైన కనుబొమలు కలిగినట్లుగా దోర్మండలమును నీవు చూచుచుండగా అనేక విధములగు నగలయొక్క రత్న జాలముచే జటిలములైనవిగా వింధ్య పర్వతము యొక్కయు గంధ మాదనము యొక్కయు సంబంధించిన వృక్షములు ఆ సమయమునందే అయినవి)

ఇచట వింధ్యారణ్యమందలి చెట్లను అలంకరించుటవలన శత్రువుల పలాయనము తోచుచున్నది. అయితే, చెప్పబోవు రీతిగా పర్యాయోక్త్య లంకారమునకు ఇది విషయము అని చెప్పిన యెడల అప్పుడిది వివిక్తమగు నుదాహరణము—

"నితరాం" మొ. (పద్మముల దండ మిక్కిలి పరుషమైనది. తామర తూడు విచారించగా పేశలము కాలేదు. నీ అవయవముల కోమలత్వము చెప్పినట్లయితే చివురుల కథ కూడా ఎటువంటిది.)

ఇచటపల్లవములు మొదలైనవాటియొక్క తిరస్కారమనెడి కార్యము చేత నా స్త్రీల యవయవముల యొక్క సౌకుమార్యాతిశయము కారణము గమ్యము. కార్యకారణభావము ఇక్కడజ్ఞానములకు. అందుచేత పారుష్యము, మృణాలమందుండునట్లు తెలియబడుచున్నది స్వరూపతః తదంగసౌకుమార్యా జన్యమైనను క్షతిలేదు.

కారణేన కార్యం గమ్యం యథా—

"సృష్టః సృష్టికృతా పురా కిల పరిత్రాతుం జగన్మండలం
త్వం చండాతప నిర్దయం దహసి యజ్జ్వాలా జటాలైః కరైః.
సంరంభారుణలోచనో రణభువి ప్రస్థాతుకామోఽధునా
జానీమో భవతా న హంత విదితో దిల్లీధరావల్లభః."

అత్ర రాజవర్ణనాంగత్వేన రవేర్భయోత్పాదనే వర్ణ్యత్వేన ప్రస్తుతే సాక్షాత్తదననుగుణత్వాదప్రస్తుతేన ప్రస్థానేన సాక్షాత్తదను గుణం రిపుకర్తృకసూర్యమండలభేదనం గమ్యతే.

కారణముచే కార్యము గమ్యమగుట యెట్లునగా—

"సృష్టః" మొ. (సృష్టికర్తచే పూర్వమునందు జగన్మండలము కాపాడుటకు సృష్టిచేయబడిన ఓ చండాతపా! జ్వాలా జటాలములగు కిరణములచే నిర్దయగా దహించుచున్నావు. సంరంభముచే ఎఱ్ఱనైన కనులుకలవాడు దిల్లీపతి యుద్ధభూమియందు బయలదేరదలంచుకొనినాడని నీకు తెలియదేమో!)

ఇచట రాజవర్ణనాంగముగా రవికి భయోత్పాదనము వర్ణ్యముగా ప్రస్తుతము కాగా సాక్షాత్తుగా తదననుగుణమగుటవలన అప్రస్తుతమగు ప్రస్థానముచే సాక్షాత్తుగా దాని కనుగుణమగు శత్రువులోనర్చెడి సూర్యమండల భేదనము తోచుచున్నది.

యది చాత్ర కారణం యథాకథంచిత్ప్రస్తుతమేవేత్యుచ్యతే తదేదముదాహరణమ్ -

"అనమ్య వల్గువచనైర్విని వారితేఽపి
రోషాత్ప్రయాతుముదితే మయి దూరదేశమ్.

బాలా కరాంగులినిదేశవశంవదేన
క్రీడాబిడాలశిశునాశు రురోధ మార్గమ్ "

అత్ర ప్రవాసాన్నివృత్తోఽస్మీతి ప్రస్తుతమప్రస్తుతేన కారణేన గమ్యతే.

ఇచట కారణమేదో ఒక విధముగా ప్రస్తుత మన్నచో నపుడిది యుదాహరణము :—

"ఆనమ్య" మొ. (నమస్కరించి మృదువైన మాటలచే నివారించ బడినను రోషమువలన ప్రయాణమగుటకు నేను సిద్ధము కాగా, ఆ పిల్ల చేతి ప్రేళ్ళ ఆజ్ఞక లోబడినటువంటి ఆటకొఱకైన పిల్లిపిల్లచే నాదోవను అడ్డగించెను)

ఇచట ప్రవాసమునుండి నివృత్తడనైతిని, అను ప్రస్తుతము అప్రస్తుత మగు కారణముచే తెలియుచున్నది.

సామాన్యేన విశేషో యథా —

"కృతమపి మహోపకారం పయ ఇవ పీత్వా నిరాతంకః
ప్రత్యుత హంతుం యతతే కాకోదరసోదరః ఖలో జగతి"

అత్రసామాన్యార్థేన ప్రస్తుతో విశేషో గమ్యతే ఉపమాప్యస్యా ఆనుగుణ్యేన స్థితా

సామాన్యముచే విశేషమెట్లనగా—

"కృతమపి" మొ.(మహోపకారముచేసిననూ పయస్సునువలె పానము చేసి అడ్డులేని వాడయి ఎదురుతిరిగి చంపుటకే కాకోదర సోదరుడగు ఖలుడు జగత్తునందు ప్రయత్నించుచున్నాడు)

ఇచట సామాన్యార్థముచే ప్రస్తుత విశేషము గమ్యము. ఉపమయు దీనికి అనుకూలముగా నున్నది.

విశేషణ సామాన్యం యథా —

"పాండిత్యం పరిహృత్య యస్య హి కృతే పందిత్వమాలంబితం
దుష్ప్రాపం మనసాపి యో గురుతరైః క్లేశైః పదం ప్రాపితః.
రూఢస్తత్ర స చేన్నిగీర్య సకలాం పూర్వోపకారావలీం
దుష్టః ప్రత్యవతిష్ఠతే తదధునా కస్మై కిమాచక్ష్మహే"

అత్ర దుష్టేషు కృత ఉపకారః పరిణామే న సుఖం జనయతీతి ప్రస్తుతం విశేషేణ సామాన్యం గమ్యతే. యథా వా -

"హారం వక్షసి కేనాపి దత్తమజ్ఞేన మర్కటః
లేఢి జిఘ్రతి సంక్షిప్య కరోత్యున్నతమాసనమ్"

అత్ర మర్కటవృత్తాంతే నాప్రస్తుతేన ప్రస్తుతమనభిజ్ఞేషు రమణీయవస్తు సమర్పణం నాశాయ భవతీతి సామాన్యం గమ్యతే ఏవం పంచప్రకారేయమప్రస్తుతప్రశంసా ప్రాచామనుసారేణ నిరూపితా.

విశేషము చేత సామాన్యమెట్లనగా—

"పాండిత్యం" మొ. (పాండిత్యమును వదిలివేసి ఎవనికొఱకు వంది త్వము అవలంబింపబడెనో, మనస్సుతోనైనను గ్రుప్రాప్యమగు పదమును కష్టములచే ఎవరు పొందింపబడనో, అతడు పూర్వోపకారావళి అంతయూమింగి, అక్కడ స్థిరమై, దుష్టుడై ఎదురు తిరుగుచున్నాడు. దానిని యిప్పుడు ఎవరికి ఏమని చెప్పుదుము?)

ఇచట దుష్టులకు చేయబడిన యుపకారము పరిణామమందు సుఖము కలిగించదని ప్రస్తుతమగు సామాన్యము విశేషముచే తోచుచున్నది.

మరొకటి—

"హారం" మొ. (అజ్ఞుడగు నెవనిచేతనో హారము వక్షస్థలము నందు వేయబడగా, మర్కటము నాకుచున్నది. వాసన చూచుచున్నది. సంక్షేపించి ఉన్నతమగు నాసనము చేయుచున్నది.)

ఇచట నప్రస్తుతమగు మర్కటవృత్తాంతముచే ప్రస్తుత వృత్తాంతము, అనభిజ్ఞుల యెడ రమణీయవస్తు సమర్పణము వినాశకమగును. అను సామాన్యము తోచును. ఇవ్విధముగ నైదువకములైన యప్రస్తుత ప్రశంస ప్రాచీనుల ననుసరించి నిరూపించితిమి.

వస్తుతస్తు ప్రథమస్యాప్రస్తుత ప్రశంసాప్రకారస్య నానావిధత్వం సంభవతి. యత్రాత్యంతమప్రస్తుతేన వాచ్యేన ప్రస్తుతం గమ్యతే స ప్రకారో నిగదిత ఏవ. యత్ర చ స్థలవిశేషే వృత్తాంతద్వయమపి ప్రస్తుతం సోఽన్యైకః. యథా జలక్రీడాప్రకరణే భ్రమరకమలిన్యాదిషు పురఃస్థితేషు, నాయకే చ స్వనాయికాయామననురక్తే పార్శ్వవర్తిని

నాయికాసఖ్యాః కస్యాశ్చిదుక్తౌ 'మలినేఽపి రాగపూర్ణామ్—' ఇత్యాది ప్రాగుదాహృతే పద్యే.

అథాత్ర కథమప్రస్తుతప్రశంసా? వాచ్యార్థస్య ప్రస్తుతత్వేనైతల్లక్షణానాలీఢత్వాదితి చేత్, న. అప్రస్తుతశబ్దేన హి ముఖ్యతాత్పర్యవిషయీభూతార్థాతిరిక్తోఽర్థో వివక్షితః స చ క్వచిదత్యన్తాప్రస్తుతః క్వచిత్ప్రస్తుతశ్చేతి న కోఽపి దోషః; న చ ధ్వనిమాత్రస్యాప్రస్తుతప్రశంసాత్వాపత్తిరితి వాచ్యమ్. అత ఏవాత్ర సాదృశ్యాన్యతమప్రకారేణేతి విశేషణముపాత్తమితి విభావనీయమ్.

వస్తుతః మొదటి యప్రస్తుత ప్రశంసా ప్రకారమునకు నానావిధత్వము సంభవించును ఎచట మిక్కిలి యప్రస్తుతమగు వాచ్యముచే ప్రస్తుతము గమ్యమగునో నా ప్రకారము స్పష్టముగా జెప్పబడినది. ఎక్కడనైతే స్థల విశేషమందు రెండు వృత్తాంతములను ప్రస్తుతములో నటయు దీనిప్రభేదమే. ఎట్లనగా జలక్రీడా ప్రకరణమునందు తుమ్మెదలు తామరతీగెలు మొదలైనవి ఎదుటనుండగా, నాయకుడు స్వనాయికయందు నను రాగములేకుండా ప్రక్కనుండగా నాయికా సఖి ఒకామె పలుకునందు. "మలినేఽపి రాగపూర్ణామ్"అని పూర్వము చెప్పిన పద్యమందు. అయితే ఇది అప్రస్తుతప్రశంసయెట్లు- వాచ్యార్థము ప్రస్తుతమగుటచేత ఈ లక్షణముచే ననాలీఢము గదా ?— అనరాదు. అప్రస్తుతశబ్దముచే ముఖ్యతాత్పర్యమునకు గోచరీభూత మగు నర్థముకంటె నతిరిక్తమగు నర్థము వివక్షిత మైనది. అదియు నొకయెడ మిక్కిలి యప్రస్తుతము, మరి యొకయెడ ప్రస్తుతమున్ను, అని దోషము లేదు. ధ్వని మాత్రమునకు నప్రస్తుత ప్రశంసాత్వము రావచ్చునేమో ? - అనరాదు. ఇందువలననే యచట "సాదృశ్యాద్యన్యతమ ప్రకారముచేత"నని విశేషణ ముపాత్తమైనది అని భావించవలెను.

ఏతేన 'ద్వయోః ప్రస్తుతత్వే ప్రస్తుతాంకురనామాన్యోఽలంకారః' ఇతి కువలయానందాద్యుక్తముపేక్షణీయమ్. కించిద్వైలక్షణ్యమాత్రేణైవాలంకారాన్తరతాకల్పనే వాగ్భంగీనామానన్త్యాదలంకారానన్త్యప్రసంగ ఇత్యసకృదావేదితత్వాత్. ఇదం తు బోధ్యమ్ —

అత్యన్తాప్రస్తుతస్య వాచ్యతాయాం తస్మిన్నపర్యవసితయాభిధయా ప్రతీయమానార్థస్య బలాదాకృష్టత్వేన ధ్వనిత్వం న నిరా

ధమ్. ద్వయోః ప్రస్తుతత్వే తు ధ్వనిత్వం నిర్వివాదమేవ. ఏవం సాదృశ్యమూలప్రకారే ద్వైతమ్. కార్యకారణ భావసామాన్యవిశేషభావ మూలాస్తు చత్వారో గుణీభూతవ్యంగ్యస్యైవ భేదాః. అభిధాదిస్పర్శలేశశూన్యస్య కేవలాగూరణమాత్రస్య ధ్వనిత్వాప్రయోజకత్వాత్.

దీనిచేత "రెండును ప్రస్తుతమైనచో ప్రస్తుతాంకురమను మరియొక అలంకారము" అని కువలయానందకారులు చెప్పినది ఉపేక్షించవలసినదే కొంచము వైలక్షణ్యము మాత్రముచే నలంకారాన్తరత్వము గల్పించిన యెడల, వాక్యభంగులు అనంతములు కనుక నలంకారము లనేకములు కావలసివచ్చును అని అనేక పర్యాయములు చెప్పితిమి

ఇది మాత్రము దెలియవలెను—

అత్యంతాప్రస్తుతము వాచ్యమగునపుడు దానియందు నపర్యవసితమగు నభిధచే తోచు నర్థము బలాత్కారముగా నాకర్షింపబడుటచే ధ్వనిత్వము నిర్బాధముగాదు రెండర్థములు ప్రస్తుతమగునపుడన్ననో ధ్వనిత్వము నిర్వివాదమే. ఇలాగ సాదృశ్యముల ప్రకారమునందు ద్వైతము. కార్యకారణభావసామాన్యవిశేషభావమూల మగునపుడు నాలుగు విధములు మాత్రము గుణీభూత వ్యంగ్యము యొక్క భేదములే. అభిధాదుల యొక్క స్పర్శలేశమున్ను లేనట్టి కేవలాగూరణ మాత్రము ధ్వనిత్వమునకు ప్రయోజకము కనుక.

అథ —

"ఆపేదిరేంబరపథం పరితః పతంగా
భృంగా రసాల ముకులాని సమాశ్రయంత.
సంకోచమంచతి సరస్త్వయి దీన దీనో
మీనో ను హంత కతమాం గతిమభ్యుపైతు"

అత్ర క్షీణరాజాదితదేశావలంబపురుషాదివృత్తాంతే ప్రస్తుతేఽప్రస్తుత ప్రశంసైవేతి నిర్వివాదమ్ యదా తు సరోవృత్తాన్తో రాజవృత్తాంతశ్చేత్యుభయం ప్రస్తుతం తదాపి ప్రాగుక్తదిశా సైవ యదా తు సరోవృత్తాంత ఏవ ప్రస్తుతస్తదా గుణీభూతరాజవృత్తాంత ర్వ్యావ్యంగ్యేఽస్మిన్పద్యే కోఽలంకారః? న తావదియమ్. ప్రస్తుతస్యైవప

ప్రశంసనాత్. నాపి సమాసోక్తిః. తజ్జీవాతోర్విశేషణసామ్యస్య సకలాలంకారికసమ్మతస్యాత్రాభావాత్. న చ విశేషణసామ్యప్రకార ఇవ శుద్ధసాదృశ్యమూలో౽పి తస్యా ఏవ ప్రకారో వాచ్యః. ఏకధర్మావలీఢత్వమంతరేణైకాలంకారత్వే సర్వేషామేకాలంకారత్వాపత్తేః. వ్యవస్థాపకైస్తద్భేదతాయా అనుక్తేశ్చ. అత ఏవాలంకారసర్వస్వకారాదిభిర్విశేషణవాచిశబ్దసామ్యం సంరక్ష్యైవ సమాసాంతరాశ్రయేణ సాదృశ్యమూలత్వం ప్రదర్శితమ్, న తు తదుపేక్ష్యేతి చేత్ ?

మరియు —

"ఆపేదిరే" మొ. (ఓ సరస్సా! ఆకాశమంతటనూ పక్షులు చేరినవి; తుమ్మెదలు సాలముకుళమును ఆశ్రయించినవి. నీవు సంకోచమును రోజు రోజుకు పొందుచుండగా, దీనదీన మగు మీనము ఏమి గతిని పొందును?)

ఇచట క్షీణరాజాదిశదేశావలంబన పురుషాది వృత్తాంతము ప్రస్తుతమైనపుడు అప్రస్తుత ప్రశంసయే నని నిర్వివాద మే. ఎప్పుడైతే సరోవృత్తాంతము, రాజవృత్తాంతము అని రెండును ప్రస్తుతమో, అప్పుడు వెనుకజెప్పిన తీరుగా నిదియే. ఎపుడైతే సరోవృత్తాంతము మాత్రమే ప్రస్తుతమో, అపుడు గుణీభూత రాజవృత్తాంత రూపమైన వ్యంగ్యము ఈ పద్యమునందున్నపుడు, ఏ యలంకారము? అపు డిది (అప్రస్తుత ప్రశంసా లంకారము) కాదు. ప్రస్తుతమే ప్రశంసింపబడుచున్నది గనుక సమాసోక్తియుగాదు. తజ్జీవాతువగు విశేషణ సామ్యము, సకలాలంకారికులకు సంమతమైనది, ఇక్కడ అసంభవము గనుక. విశేషణ సామ్యము యొక్క ప్రకారమువలె శుద్ధ సాదృశ్యమూలమైనది కూడా ప్రకారమేనని చెప్పరాదు. ఏక ధర్మావలీఢత్వములేకుండా నొక యలంకారమైనచో నన్నియు నొకే యలంకారముగావలసివచ్చును. వ్యవస్థాపకులచే తద్భేదత్వము చెప్పబడలేదు కూడాను. ఇందువలననే అలంకార సర్వస్వకారాదులచే విశేషణముల చెప్పు శబ్దముల సామ్యమును సంరక్షించియే మరియొక సమాసము నాశ్రయించుటచే సాదృశ్యమూలత్వము ప్రదర్శింపబడినది; అంతేకాని దానినుపేక్షించి కాదు.

ఉచ్యతే — అప్రస్తుతప్రశంసైవాత్రాలంకారః. అప్రస్తుతస్య ప్రశంసేతి న తదర్థః కింత్వప్రస్తుతేనేతి సా చార్థాత్ప్రస్తుతస్యైవ. ఏవం చ వాచ్యేన వ్యక్తేన వా అప్రస్తుతేన వాచ్యం వ్యక్తం వా

ప్రస్తుతం యత్ర సాదృశ్యాద్యన్యతమప్రకారేణ ప్రశస్యతే సాఽప్రస్తుతప్రశంసేతి. న తు వాచ్యైవ వ్యంగ్యమేవేతి.

స్యాదేతత్. 'కమలమనంభసి కమలే చ కువలయే తాని కనకలతికాయామ్' ఇత్యాదావివాత్రాపి నిగీర్యాధ్యవసానేనైవోపపత్తిః శక్యా కర్తుమ్. తచ్చ పదార్థేన పదార్థస్య, వాక్యార్థేన వాక్యార్థస్య వా ఇత్యన్యదేతత్, అన్వయానుపపత్తిరివ ప్రస్తావానుపపత్తిరపి లక్షణాబీజమ్. ఏవం చాతిశయోక్త్యైవోపపత్తౌ కిం సాదృశ్యమూలాప్రస్తుతప్రశంసయేతి. నను నిగీర్యాధ్యవసానం హి న తావదత్ర సంభవతి తత్ర హి వాచ్యతావచ్ఛేదకరూపేణ లక్ష్యస్య ప్రతీతిః, ఇహ తు వాచ్యతాటస్థ్యేనార్థాంతరస్యేతి విశేషాత్. యత్ర తు శ్లేషాదినా విశేషణసామ్యం తత్ర తనావహ్మైకాత్మ్యాదస్తు నామాభేదాధ్యవసాయ ఇతి చేత్, ఇహాపి వాచ్యవ్యవహారాభిన్నతయైవ చ ప్రస్తుతవ్యవహారప్రత్యయ ఇత్యవైలక్షణ్యమేవేతి. సత్యమ్ 'యస్మిన్ ఖేలతి' 'దిగంతే శ్రూయంతే' ఇత్యాదౌ వాచ్యార్థతాటస్థ్యేనైవ వ్యంగ్యస్య ప్రతీతేః సర్వసహృదయసమ్మతత్వాత్. క్వచిత్తు సంబోధనస్య తత్తద్విశేషణస్య చానుపపత్త్యా అభేదాంశోఽప్యపేక్ష్యతే, న తావతా సర్వత్రాభేదేన ప్రతీతిః. కిం చాప్రస్తుతప్రశంసాయాం ప్రస్తుతం వ్యంగ్యమితి నిర్వివాదమ్. నిగీర్యాధ్యవసానే తు లక్ష్యం స్యాత్. అపి చ యత్ర వాచ్యస్యాత్యంతాప్రస్తుతత్వం తత్రాభిధాయా అపర్యవసానాత్స్యాదపి కదాచిల్లక్షణాయా అవకాశః. యదా తు ద్వయోరప్యర్థయోః ప్రాగుక్తదిశా ప్రస్తుతత్వం తదా తు బాధలేశాస్ఫురణాల్లక్షణాగంధోఽపి నాస్తి, కుతః పునర్నిగరణం లక్షణైకదేశః; కింత్వాగూరణమేవేతి, తత్రాప్రస్తుతప్రశంసాయాః సాదృశ్యమూలాయా ఆవశ్యకత్వాదన్యత్రాపి తజ్జాతీయస్థలే సైవోచితా. యది తు ప్రకారస్యాస్య ధ్వనిప్రభేదత్వాత్ ధ్వనేశ్చాలంకార్యస్యాలంకారత్వానుపపత్తిరితి సూక్ష్మమీక్ష్యతే, తదాప్రస్తుత ప్రశంసాయా భేదాంతరమేవ విషయ ఇత్యపి వదంతి.

ఇతి రసగంగాధరే అప్రస్తుతప్రశంసాప్రకరణమ్.

అనినచో చెప్పెదము—

అప్రస్తుత ప్రశంసయే నిచట యలంకారము· అప్రస్తుతము యొక్క ప్రశంసయని దాని యర్థము గాదు ఇక నేమనగా—నప్రస్తుతము చేత నని. అదియు నర్థమువలన ప్రస్తుతమునకే ఈ తీరుగా వాచ్యముగానీ, వ్యక్తముగానీ అగు అప్రస్తుతముచే ఎక్కడ వాచ్యముగాని వ్యక్తముగాని ప్రస్తుతము సాదృశ్యాన్యతమ ప్రకారముచే ప్రశంసచేయబడునో అది అప్రస్తుత ప్రశంస; అంతేకాని, వాచ్యముచేతనే, వ్యంగ్యమే, యని కాదు.

ఇది కావచ్చును.—

"కమలమనంభసి" ఇత్యాదులందువలె ఇచటను నిగీర్యాధ్యవసానము చేతనే నుపపత్తి చేయుటకు వీలగును అదియు పదార్థముచే పదార్థమునకు గాని, వాక్యార్థముచే వాక్యార్థమునకుగానీ, అని, విషయాన్తరము. అన్వయానుపపత్తివలె ప్రస్తావానుపపత్తి గూడ లక్షణాబీజమే. ఇట్లాకాగా, నతిశయోక్తిచేతనే నుపపత్తియగునపుడు సాదృశ్యమూలక మగు నప్రస్తుత ప్రశంసతో పని యేమి ?

అయితే-"నిగీర్యాధ్యవసానమున్నదే ఇచట సంభవించదు; - అచట వాచ్యతా నిర్ణాయక రూపముతో లక్ష్యము యొక్క ప్రతీతి; ఇచటనైతే వాచ్యతాటస్థ్యముతో నర్థాన్తరమునని విశేషమున్నది కనుక. ఎక్కడైతే శ్లేషాదులతో విశేషణ సామ్యమో అచట తన్మాహాత్మ్యమువలన నభేదాధ్యవసానముండునుగాక"—అనినచో, ఇచటనున్న వాచ్య వ్యవహారముతో నభిన్నముగానే ప్రస్తుతవ్యవహారమునకు ప్రత్యయము అని అవైలక్షణ్యామే. సత్యమే "యస్మిన్ ఖేలతి," 'దిగంతే శ్రూయంతే' ఇత్యాదులయందు వాచ్యార్థ తాటస్థ్యముతోడనే వ్యంగ్యప్రతీతి సర్వసహృదయ సమ్మతము కనుక.

ఒకచోట మాత్రము సంబోధనమునకు నాయా విశేషణముకున్ను ననుపపత్తిచే నభేదాంశమున్ను అపేక్షింపబడును. తావన్మాత్రముచే సర్వత్ర అభేదముతో ప్రతీతి లేదు. మరియు అప్రస్తుతప్రశంసయందు ప్రస్తుతము వ్యంగ్యమని నిర్వివాదము నిగీర్యాధ్యవసానమందైతే లక్ష్యము కావలసి వచ్చును- మరియు నెక్కడ వాచ్యము అంత్యంత మప్రస్తుతమోనచట; నభిధకు నపర్యవసానమువలన, ఒకప్పుడు లక్షణకు నవకాశము కల్గిన కల్గవచ్చును ఎప్పుడైతే

రెండర్థములకు వెనుక జెప్పిన తీరుగా ప్రస్తుతత్వమున్నదో నప్పుడైతే బాధ కొంచమున్న స్ఫురించక పోవుటవలన లక్షణాగంధమైనను లేదు. అట్టిచో లక్షణలో నేకదేశమైన నిగరణము ఎట్లు సంభవించును? ఇక నేమనగా, నాగూరణమేను. అచట నప్రస్తుత ప్రశంస, సాదృశ్యమూలము, ఆవశ్యమగుటవలన ఇతరమగు తజ్జాతీయ స్థలమునందును నదియే తగినది. అయితే ఈ ప్రకారము ధ్వని ప్రభేదమగుటవలన, అలంకార్యమగు ధ్వనికి చున్నారు- అలంకారత్వము కుదరకపోవునని సూక్ష్మముగా చూచినట్లైతే నపుడు అప్రస్తుత ప్రశంసకు భేదాన్తరమే విషయమనియున్నచెప్పుచున్నారు.

ఇది అప్రస్తుతప్రశంసాప్రకరణము.

## పర్యాయోక్తమ్

అథ పర్యాయోక్తమ్—

వివక్షితస్యార్థస్య భంగ్యంతరేణ ప్రతిపాదనం పర్యాయోక్తమ్ యేన రూపేణ వివక్షితోఽర్థస్తదతిరిక్తః ప్రకారో భంగ్యంతరమ్ ఆక్షేపో వా. యథా—

"త్వాం సుందరీనివహానిష్ఠురధైర్యగర్వ
నిర్వాసనైకచతురం సమరే నిరీక్ష్య.
కేషామరిక్షితిభృతాం నవరాజ్యలక్ష్మీః
స్వామిప్రతీత్వమపరిస్ఖలితం బభార."

అత్ర సర్వాపి శత్రూణాం రాజ్యసంపత్త్వాం ప్రాప్తేతి వివక్షితోఽర్థో న తాద్రూప్యేణాభిహితః, అపి తు స్ఖలత్పాతివ్రత్యా బభూవేత్యాకారేణ.

యథా వా—

'సూర్యాచంద్రమసౌ యస్య వాసో రంజయతః కరైః
అంగరాగం సృజత్యగ్నిస్తం వందే పరమేశ్వరమ్.

అత్రాపి గగనాంబర ఇతి సూర్యచంద్రకరరజ్యమానవస్త్ర ఇత్యాకారేణ, భస్మాంగరాగ ఇత్యగ్నిసృజ్యమానాంగరాగ ఇత్యాకారేణ చ నిరూపితః.

అనన్తరము పర్యాయోక్తము:

చెప్పదలచిన యర్థమును భంగ్యన్తరముతో ప్రతిపాదించుట పర్యాయోక్తము-ఏరూపముతో నర్థము వివక్షితమో తదతిరిక్త ప్రకారము భంగ్యంతరము. ఆక్షేపమైనను నగును.

ఎట్లనగా—

"త్వాం సుందరీ" మొ. (స్త్రీల సమూహము యొక్క నిష్ఠురమైన ధైర్యగర్వమును వెళ్ళగొట్టుట యందు ముఖ్యముగా నిపుణుడవైన నిన్ను యుద్ధమున చూచి ఏ శత్రువు యొక్క క్రొత్త రాజ్యలక్ష్మి స్వామివ్రతాత్వమును తొలగిపోని దానినిగా భరించెను ?)

ఇచట సర్వమగు శత్రురాజుల సంపదయు నిన్ను చేరినది అని వివక్షితమగు నర్థము, ఆ రూపముతో జెప్పబడలేదు. ఇక నేమనగా పాతివ్రత్యము స్ఖలితమైనది అనే తీరున నుక్తము.

మరొకటి—

"సూర్యాచంద్రమసౌ" మొ. (సూర్య చంద్రాదులు ఎవని వస్త్రమును కరములచే రంజింపచేయుచున్నారో అగ్ని ఎవని మైపూతను సృజించుచున్నాడో, అట్టి పరమేశ్వరుని నమస్కరించెదను)

ఇచటను గూడా, గగనాంబరు డనునది చంద్రకరరజ్యమానవస్త్రుడు, అనే ఆకారముతోను, భస్మాంగరాగుడు అనే విషయము అగ్ని సృజ్యమానాంగరాగుడనే యాకారముతోను నిరూపించబడెను.

'అస్యాం చ గమ్యస్య యేనాకారేణ గమ్యతా తదతిరిక్తాకారేణ వాచ్యతా. తేన పర్యాయేణ భంగ్యంతరేణోక్తమభిహితం వ్యంగ్యం యత్రేతి ప్రాచీనైర్నిర్మితం **లక్షణం** వ్యంగ్యత్వవాచ్యత్వయోర్విరోధాదసంగతమితి నాశంకనీయమ్ ఏకస్యైవ ప్రకారభేదేన వాచ్యత్వవ్యంగ్యత్వయోరవిరోధాత్. యథా యావకమహారజనదాడిమీజపాకుసుమాదిషు పాటలాంతర్గతత్వాదినా వాచ్యత్వేఽపి తత్తద్వైజాత్యరూపేణ ప్రత్యక్షత్వమేవ న తు వాచ్యత్వమ్. ఏవమిహాపి' **ఇతి మమ్మటభట్టాః.**

దీనియందు గమ్యమునకు నేయాకారమున గమ్యతయో తదతిరిక్తమగు నాకారముతో వాచ్యత.

అందుచే 'పర్యాయముతో-భంగ్యన్తరముతో నుక్తమైన (అభిహిత మైన) వ్యంగ్యము ఎచ్చటనో' అని ప్రాచీనులు నిర్మించిన లక్షణము వ్యంగ్యత్వ వాచ్యత్వముల విరోధము-అవలన నసంగతమని శంకింపవలదు.

ఒక్కదానికే ప్రకారభేదముచేత వ్యంగ్యత్వ వాచ్యత్వములయందు విరోధము లేదు గనుక.

ఎట్లనగా - యావకము (లక్క) మహారజనము, దాడిమ జపాకుసుమములు మొదలగువాని రూపములు రక్తత్వాదికముచేత వాచ్యమైనను నాయావైజాత్యరూపముచేత ప్రత్యక్షమగుటయేకానీ వాచ్యత యెట్లు లేదో నటులనే ఇచటను - అని మమ్మటభట్టు.

అలంకార స్వరస్వకారస్తు — 'గమ్యస్యాపి భంగ్యంతరేణాభిధానం పర్యాయోక్తమ్. గమ్యస్యైవ సతః కథమభిధానమితి చేత్, కార్యాదిద్వారేణ' ఇత్యాహ. తస్యాయమాశయః —

"చక్రాభిఘాతప్రసభాజ్ఞయైవ
చకార యో రాహువధూజనస్య.
ఆలింగనోద్దామవిలాసవంధ్యం
రతోత్సవం చుంబనమాత్రశేషమ్."

ఇతి ప్రాచీనపద్యే రాహుశిరశ్ఛేదకారీతి వ్యంగ్యం రాహువధూజన సంబంధి చుంబనమాత్రావశిష్టరతోత్సవనిర్మాతృత్వేన రూపేణ ప్రకారాంతరేణాభిధీయత ఇత్యస్యాపి వివేచనే క్రియమాణే రాహుశిరచ్ఛేదకర్తృత్వరూపో ధర్మః స్వసమానాధికరణేన తాదృశరూపాంతరేణ సాక్షాదుపాత్తేన గమ్యత ఇత్యేవ పర్యవస్యతి. భగవతస్తు పూర్వప్రక్రాంతత్వాద్యచ్ఛబ్దేనాభిహితత్వాచ్చ న వ్యంగ్యత్వమ్.

అలంకార సరస్వకారులైతే - గమ్యములైనను భంగ్యన్తరముచే చెప్పుట పర్యాయోక్తము; గమ్యమైయుండగా నభిధానమెట్లందురా — కార్యము మొదలగువాని ద్వారా; అని చెప్పెను.

అతని యభిప్రాయమిది —

"చక్రాభిఘాత" మొ. (చక్రపు దెబ్బ యొక్క బలాత్కారము చేతనే ఎవరు రాహుస్త్రీల యొక్క రతోత్సవమును ఆలింగనోద్దామ విలా

సములతో శూన్యముగాను, చుంబనము మాత్రమే మిగిలియున్నట్లుగాను జేసెనో.)

అను ప్రాచీనుల పద్యమునందు రాహు శిరచ్ఛేదకారి అనే వ్యంగ్యము రాహు వధూజనమునకు సంబంధించిన చుంబన మాత్రావశిష్ట రతోత్సవ నిర్మాతృత్వమను రూపముతో, ప్రకారాన్తరముచే జెప్పబడెను. దీనినే వివేచించినచో రాహుశిరచ్ఛేదకర్తృత్వ రూపమగు ధర్మము స్వసమానాధికరణమగు తాదృశరూపాంతరముతో, సాక్షాత్తుగా నుపాత్తమైన దానితో, తోచుచున్నది అనియే పర్యవసించుచున్నది. భగవానుడైతే పూర్వ ప్రక్రాంతుడగుటవల్లను, యచ్ఛబ్దముతో జెప్పబడెను కనుకను అతనికి వ్యంగ్యత్వము లేదు.

ఏవమ్ —

"యం ప్రేక్ష్య చిరరూఢాపి నివాసప్రీతిరుజ్ఝితా
మదేనైరావణముఖే మానేన హృదయే హరేః"

ఇతి ప్రాచీనపద్యేఽపి శక్రైరావణౌ మానమదముక్తౌ జాతావితి వ్యంగ్యమపి మాన మద మోక మాత్రస్య వ్యంగ్యత్వే పర్యవస్యతి, ధర్మ్యంశస్యాభిధాగోచరత్వాత్. ఏవం చ యో వ్యంగ్యాంశః స న కదాపి రూపాంతరపురస్కారేణాభిధీయతే. యశ్చాభిధీయతే ధర్మీ స తు తదానీమభిధాశ్రయత్వాద్వ్యంజనవ్యాపారానాశ్రయ ఏవేతి వ్యంగ్యస్య ప్రకారాంతరేణాభిధానమసంగతమేవ. తస్మాత్కార్యాదిముఖేనోక్తమివ పర్యాయోక్తమ్. తేనాభిహితమిత్యేవార్థః. ప్రాచీనైః ధర్మిణోఽపి యద్వ్యంగ్యత్వముక్తం తద్వ్యైయంజనికబోధ విషయస్య సమస్తవాక్యార్థస్యైవ వ్యంగ్యత్వమిత్యభిప్రాయేణ. తత్ర చ వివేకే క్రియమాణే కేచిదభిధామాత్రస్య గోచరాః పదార్థాః కేచిచ్చ వ్యక్తిమాత్రగోచరా ఇతి.

ఇలాగే —

"యం ప్రేక్ష్య" (ఎవనిని చూచి చిరకాలమునుండి యున్నను ఐరావణ ముఖమునందలి మదముచేతను, ఇంద్రుని హృదయమునందు అభిమానముచేతనూ, ఉండుటయందలి ప్రీతి విడువబడినదో.)

అనే ప్రాచీనుల పద్యములోనైనను, శక్రైరావణములు మానమదముల నుండి ముక్తులు అయిరి అనే వ్యంగ్యమున్ను మానమద మోకమాత్రము యొక్క వ్యంగ్యమగుటయందు పర్యవసించును ధర్మ్యంశము అభిధాగోచరము గనుక.

కావున ఏది వ్యంగ్యాంశము అది ఎపుడును ఏ రూపాన్తర పురస్కారము తోనైనను చెప్పబడదు. ధర్మి ఏది చెప్పబడునో అదిమాత్ర మపుడు అభిధా గోచరము గనుక వ్యంజనా వ్యాపారమునకు ఆశ్రయము గానేగాదు; అని వ్యంగ్యమును ప్రకారాన్తరముచే చెప్పుట యసంగతమే. అందువలన కార్యాది ముఖమున చెప్పబడినది వలె నున్నది పర్యాయోక్తము-అందువలన నాక్షిప్తమనియే అర్థము, ప్రాచీనులు ధర్మికూడ వ్యంగ్యమని చెప్పుట వైయంజనిక బోధ విషయమగు సమస్తవాక్యార్థమునకే వ్యంగ్యత్వము అనే నాశయముతోనే. అచట వివేచనమొనర్పగా, కొన్ని అభిధామాత్రము నకు గోచరములు అగు పదార్థములు; కొన్నివ్యక్తి మాత్ర గోచరములని.

అభినవగుప్తపాదాచార్యాస్తు – 'పర్యాయేణ వాచ్యాదతిరిక్త ప్రకారేణ వ్యంగ్యేనోపలక్షితముక్తమభిహితం పర్యాయోక్తమ్' ఇతి యోగార్థం లక్షణం చాహుః. తేషామయమాశయః – యది పర్యాయశబ్దేన ప్రకారాన్తరం ధర్మాంతరముచ్యతే తదా వివక్షితార్థావచ్ఛేదకాతిరిక్తధర్మ పురస్కారేణాభిహితమితి యోగార్థః స్యాత్. తథా చ 'దశవదనవిధనకారీ దాశరథిః పుండరీకాక్షః' ఇత్యాదౌ రామత్వాదతిరిక్తధర్మపురస్కారేణ రామస్యైవాభిధానాత్పర్యాయోక్త ప్రసంగః. న చ వ్యంగ్యం యత్ర తేన ప్రకారేణోక్తం తత్పర్యాయోక్తమితి వాచ్యమ్. వ్యంగ్యస్య యోగార్థానంతర్గతత్వాత్. న చ యోగార్థానంతర్గతత్వేపి లక్షణాంతర్గతత్వం తస్యేతి వాచ్యమ్, ఏవం తర్హి వ్యంగ్యస్య లక్షణప్రవేశావశ్యకత్వే పర్యాయశబ్దేన వ్యంగ్యస్యైవ గ్రహీతుముచితత్వాత్. వ్యంగ్యేన హ్యుపలక్షితముక్తం ప్రకారాంతరేణైవ భవతీతి ప్రకారాంతరగ్రహణం నావశ్యకమితి. అతఏవాస్మాభిరాక్షేపో వేతి పక్షాంతరమప్యుక్తమ్.

అభినవగుప్త పాదాచార్యులైతే—

పర్యాయేణ, వాచ్యవ్యతిరిక్తమగు ప్రకారముచేత వ్యంగ్యముచేత

నుపలక్షితమై, ఉక్తమ్, అభిహితము, పర్యాయోక్తము అని యోగార్థమును లక్షణమును జెప్పిరి. వారి యభిప్రాయ మిది. పర్యాయ శబ్దముచే ప్రకారాన్తరము; ధర్మాంతరము, చెప్పబడినచో నప్పుడు వివక్షితార్థ నిర్ణాయకాతిరిక్త ధర్మ పురస్కారముచే నభిహితమైనదని యోగార్థమగును. అట్లన్నచో రావణుని నిధన మొందించినవాడగు. దశరథుని పుత్రుడు పుండరీకాక్షుడు, ఇత్యాదులందు రామత్వాతిరిక్తమగు ధర్మపురస్కారముతో రాముడే చెప్పబడుటవలన పర్యాయోక్త ప్రసంగము ఎచ్చట వ్యంగ్యము ఆ ప్రకారముతో చెప్పబడినచో అది పర్యాయోక్తమనరాదు. యోగార్థమున వ్యంగ్యమనంతర్గతము కనుక. వ్యంగ్యము యోగార్థాన్తర్గతము కాకున్నను లక్షణాన్తర్గతార్థమనరాదు.

అలాగైనచో వ్యంగ్యమునకు లక్షణ ప్రవేశమావశ్యక మైనచో పర్యాయశబ్దముచే వ్యంగ్యమునే గ్రహించుట తగునుగదా ? వ్యంగ్యముతో నుపలక్షితమై చెప్పబడినది. ప్రకారాన్తరముతోనే యగునని ప్రకారాన్తర గ్రహణము ఇచట ఆవశ్యకముగాదు అని. ఇందువలననే మాచేత 'ఆక్షేపము గానీ' అని పక్షాన్తరము చెప్పబడినది.

**ఇదం పునరవశిష్యతే — 'వాపీం స్నాతుమితో గతాసి న పునస్తస్యాధమస్యాంతికమ్' ఇతి సకలప్రసిద్ధధ్వన్యుదాహరణేఽధమనికటగమననిషేధరూపేణ తన్నికటగమనవిశిష్టాయాః, అధమత్వేన రూపేణ వా దూతీసంభోగకర్తురభిధానాత్పర్యాయోక్తప్రసంగః ప్రాచీనపక్షఇవాస్మిన్నపి పక్షే భవతి. న చ వ్యంగ్యవిశేషగ్రహణేన తైరివైతైరపి నిరసనీయః. మధ్యస్థపక్షే తు నేదమపి దూషణమ్.**

ఇది మాత్రము మిగిలియున్నది.

"వాపీం స్నాతుమితోగతాసి న పునస్తస్యాధమస్యాన్తికం"-అనిసకల ప్రసిద్ధ ధ్వన్యుదాహరణమందు. నధమనికటగమననిషేధరూపముతో గూడిన దానిని గాని, అధమత్వ రూపముతో దూతీసంభోగము చేసిన దానిని గాని; చెప్పుటవలన పర్యాయోక్తప్రసంగము, ప్రాచీన పక్షమునందువలె, ఈ పక్షమునందును అగును. అదియును వ్యంగ్య విశేషగ్రహణముచే వారి చేతనువలె నితరులచేతను నిరసింపబడదగినది. మధ్యస్థపక్షమునం దిది కూడా దూషణము కాదు.

తదేవం పక్షాణాం నిష్కర్షే స్థితే యదస్మిన్ప్రకరణే కువలయానందకారేణోక్తం తత్సర్వమవిచారితరమణీయమేవ. తథా హి- యత్తావదుచ్యతే, "—'నమస్తస్మై కృతౌ యేన ముధా రాహువధూకుచౌ', అత్ర భగవాన్వాసుదేవః స్వాసాధారణరూపేణ గమ్యో రాహువధూకుచవైయర్థ్యకారకత్వేన రూపాంతరేణాభిహితః" ఇతి, తన్న. అత్ర హి రాహువధూకుచౌ యేన ముధా కృతావిత్యభిహితేన రాహువధూకుచవైయర్థ్యకారిత్వేన రాహుశిరశ్ఛేదకారిత్వం వ్యజ్యత ఇతి తావన్నిర్వివాదమ్. భగవద్వాసుదేవత్వం తు విశేషణమర్యాదాలభ్యం న కావ్యమార్గీయవ్యంగ్యకక్షామారోఢుం ప్రభవతి.

అన్యథా 'నమో రాహుశిరశ్ఛేదకారిణే' ఇత్యత్రాపి భగవద్వాసుదేవత్వవ్యంగ్యతాప్రయుక్తం పర్యాయోక్తమలంకారః స్యాత్. విశేషణమర్యాదలభ్యస్య చ ధర్మిస్య కించిద్ వ్యంగ్యతాస్పర్శః సన్నపి న స కావ్యమార్గే గణ్యతే, అసుందరత్వాత్, అన్వితాభిధానే అతి విశేషవపుష ఇవ సామాన్యరూపాణాం పదార్థానామన్వయే. కించ 'రాహుస్త్రీకుచవైఫల్యకారిణే హరయే నమః' ఇత్యత్ర భగవతః స్వశబ్దేనాభిధేయస్య స్వాసాధారణరూపేణాప్యగమ్యత్వాద్రాహుశిరశ్ఛేదకారిత్వేనైవ వ్యంగ్యత్వమేష్టవ్యమ్. న స్వాసాధారణరూపేణ. న చాత్ర పర్యాయోక్తం నాస్తీతి కస్యాపి సంమతమ్.

ఈతీరుగా పక్షముల నిష్కర్షయుండగా నీ ప్రకరణమున కువలయానందకారులు చెప్పినదంతయు నవిచారితరమణీయమే. చూడుడు-ఇక్కడేమి చెప్పుచున్నారో -

'నమః' మొ. (ఎవనిచేత రాహుభార్యస్తనములు వ్యర్థము చేయబడినవో అతనికి నమస్కారము).

ఇచట భగవాన్ వాసుదేవుడు స్వాసాధారణరూపముతో గమ్యుడు రాహువధూకుచవైయర్థ్యకారకత్వమను రూపాన్తరముతో చెప్పబడెను; అని - అది కాదు.

ఇచట రాహువధూకుచములు ఎవనిచేత వ్యర్థములుగా జేయబడినవో అని చెప్పబడిన, రాహువధూకుచవైయర్థ్యకారిత్వముచే రాహుశిరచ్ఛేదకారిత్వము వ్యక్తమగుచున్నదని నిర్వివాదము. భగవద్వాసుదేవత్వమైతే విశేషణ మర్యాదాలభ్యమని అది కావ్యమార్గమందలి వ్యంగ్యకక్ష నధిష్ఠించ సమర్థముకాదు. అలాకానియెడల- "నమో రాహుశిరచ్ఛేదకారిణే దుఃఖహారిణే"

అనుచోట భగవద్వాసుదేవత్వ వ్యంగ్యతా ప్రయుక్తము పర్యాయోక్త్యలంకారము గావలసి వచ్చును. విశేషణమర్యాదచే లభ్యమగు ధర్మమునకు కొంచము వ్యంగ్యత్వ స్పర్శయున్నను కావ్యమార్గమునందది గ్రహింపబడదు. అసుందరము గనుక. నన్వితాభిధానమందు, సామాన్యరూపములగు పదార్థముల నన్వయమునందు అతివిశేషశరీరము కలదానికి వలె.

మరియు -

"రాహుస్త్రీకుచవైఫల్యకారిణే హరయే నమః," అనుచోట భగవంతుడు స్వశబ్దముచే చెప్పబడుచు, తన అసాధారణరూపముతోనైనను. అగమ్యుడు కనుక, రాహుశిరశ్ఛేదకారిగానే వ్యంగ్యత్వమునంగీకరింపవలయును; అంతేకానీ తనయొక్క అసాధారణధర్మరూపముచే గాదు. పోనీ ఇక్కడ పర్యాయోక్తి లేదని ఒక్కరికిని ఇష్టముగాదు.

యదప్యుక్తమ్ 'సర్వస్వకారస్య లోచనకర్తుశ్చ సర్వోఽప్యయం క్లేశః కిమితి న విద్మః' ఇతి, తత్ర యదర్థం తేషాం క్లేశస్తత్తు తన్మతనిష్కర్షావసర ఏవ నిరూపితమ్.

యదప్యుక్తమ్ " - 'చక్రాభిఘాత ప్రసభాజ్ఞయా' ఇతి ప్రాచీనోదాహరణే యద్రాహు శిరశ్ఛేదావగమనం తత్ర ప్రాగుక్తరీత్యాప్రస్తుతాంకుర ఏవ. యత్తు ప్రస్తుతేన రాహోః శిరోమాత్రావశేషేణాలింగన వంధ్యాత్వాద్యాపాదనరూపే వాచ్యే భగవతో రూపాంతరే ఉపాదితే భగవద్రూపేణావగమనం తత్పర్యాయోక్తస్య విషయః" ఇతి, తదపి న.

యది రాహుశిరశ్ఛేదావగమనం త్వత్కల్పితస్య ప్రస్తుతాంకురస్య విషయః స్యాత్తదా కిం పర్యాయోక్తేన ? భగవద్రూపేణావగమనం తు విశేషణమర్యాదాలభ్యత్వేనాసుందరమ్. 'నమో రాహుశిరశ్ఛేదకారిణే' ఇత్యాదావివ న కస్యాప్యలంకారస్య విషయ ఇత్యుక్తమేవ. ప్రస్తుతాంకురస్య ప్రాచీనైరస్వీకారాచ్చ. స్వీకారే వా ప్రస్తుతేన స్వసదృశో వాక్యార్థః ప్రస్తుత ఏవ యత్ర వ్యజ్యతే, స తస్య విషయోఽస్తు. న తు కార్యేణ ప్రస్తుతేన కారణావగమనమ్. అన్యథా 'హ్యప్రస్తుతేన కార్యేణ ప్రస్తుతకారణావగమనే అప్రస్తుతప్రశంసైవ. ప్రస్తుతేన కార్యేణ ప్రస్తుతస్యైవ కారణస్యావగమనం తు పర్యాయోక్తస్య విషయః' ఇత్యలంకారసర్వస్వకారాదిభిః ప్రాచీనైః కృతో విషయవిభాగ ఉచ్ఛిన్న ఏవ స్యాత్, 'రాహువధూగతేవ విశి

ష్టేన రతోత్సవేన రాహుశిరశ్ఛేదః కారణరూపో గమ్యతే. ఏవమన్య త్రాపి పర్యాయోక్తం జ్ఞేయమ్' ఇతి త్వదుపజీవ్యగ్రంథవిరోధాచ్చ. తస్మాదత్ర రాహుశిరశ్ఛేదకారిత్వేనావగమః పర్యాయోక్తస్య విషయః, న తు భగవద్రూపేణేతి సహృదయైరాకలనీయమ్.

మరియు – "సర్వస్వకారులకు, లోచనకారులకును ఈ కష్టమంతయు నెందుకని మే మెరుగము," అని అచటనే యన్నారు. అచట ఎందుకొరకై వారికి ఈ కష్టమో అది అంతయు తన్మతనిష్కర్షయవసర మందే నిరూపించబడినది.

మరల ఏమి చెప్పిరనగా – "చక్రాభిఘాతప్రసభాజ్ఞయా" అనుప్రాచీనోదాహరణమందు, రాహుశిరశ్ఛేదావగమనమున్నదే అచట వెనుక జెప్పిన రీతిగా ప్రస్తుతాంకురమేను. యేదైతే ప్రస్తుతముచే రాహువునకు శిరోమాత్రావశేషముచే నాలింగనవంధ్యత్వాద్యాపాదాన రూపమగు వాచ్యమందు భగవంతునియొక్క రూపాంతర ముపపాదింపబడగా భగవద్రూపముతో నవగమనమున్నదో అదిపర్యాయోక్తమునకు విషయము" అని. అదియును గాదు.

రాహుశిరశ్ఛేదావగమనము నీవు కల్పించిన ప్రస్తుతాంకురమునకు విషయమైనచోఅప్పుడు పర్యాయోక్తమునకు ప్రయోజనమేమి? భగవద్రూపముతో నవగమనము మాత్రము. విశేషణమర్యాదచే లభ్యమగుటవలన, అసుందరము, "నమో రాహుశిరచ్ఛేదకారిణే" ఇత్యాదియందువలె, నేయలంకారమునకును విషయముగాదు. అని చెప్పితిమి గదా? ప్రస్తుతాంకురమును ప్రాచీనులు స్వీకరించలేదుగదా ? ఒకవేళ స్వీకరించినను, ప్రస్తుతముచే తనతో సమానమగువాక్యార్థము ప్రస్తుతమే, ఎక్కడ వ్యక్తమగునో నదివిషయమగుగాక, కానీ ప్రస్తుతమగు కార్యముచే కారణావగమనముగాదు, అలా గానియెడల "అప్రస్తుతకార్యముచే ప్రస్తుతకారణమున కవగమనమునందు, నప్రస్తుతప్రశంసయే. ప్రస్తుతమగుకార్యముచే ప్రస్తుతకారణమునకే అవగమనమైతే పర్యాయోక్తమునకు విషయము" అని అలంకార సర్వస్వకారాదులు, ప్రాచీనులు చేసిన విషయవిభాగము ఉచ్ఛిన్నమైపోవును. రాహువధూగత మగు విశిష్టమైన సురతోత్సవముచే రాహుశిరచ్ఛేదము, కారణరూపమైనది తోచుచున్నది. ఈ తీరుగా నితరత్రయున్ను పర్యాయోక్తము దెలియవలెను'' అను మీ ఉపజీవ్యమగు గ్రంథముతో విరోధమున్ను తటస్థమగును. అందువలన ఇచట రాహుశిరచ్ఛేదకారిత్వావగమము పర్యాయోక్తమునకు విషయముగాని భగవద్రూపముతోగాదు అని సహృదయులు గ్రహించవలెను.

అస్మింశ్చాలంకారే వ్యంగ్యం వాచ్యపరమ్. అప్రస్తుత ప్రశంసాయాం తు వాచ్యం వ్యంగ్యపరమ్. తేనాయమలంకారో వాచ్య సిద్ధ్యంగ గుణీభూత వ్యంగ్యభేద ఇతి ధ్వనికారానుయాయినః. యత్తు-

—"స్వసిద్ధయే పరాక్షేపః పరార్థం స్వసమర్పణమ్
ఉపాదానం లక్షణం చేత్యుక్తా శుద్ధైవ సా ద్విధా"

ఇత్యుక్తయుక్త్యా లక్షణాద్వయాశ్రితత్వాదనయోరవాంతరోఽపి విషయభేదోఽస్తి ఇతి స్వమూలగ్రంథాశయం వర్ణయతా విమర్శినీకారేణోక్తమ్, తన్న. నహి 'చక్రాభిఘాత ప్రసభాజ్ఞయైవ—' ఇతి పద్యే చుంబనమాత్రశేషరతోత్సవాంశే బాధోఽస్తి, యేనలక్షణా స్యాత్. ఏవమప్రస్తుత ప్రశంసాయామప్యప్రస్తుతస్య ప్రస్తుతే న లక్షణా, కింతు వ్యంజనైవేతి సర్వసమ్మతమ్. అన్యథా పర్యాయోక్తే వాచ్యస్య ప్రాధాన్యమ్, అప్రస్తుతప్రశంసాయాం తు గమ్యస్యేతి సిద్ధాంతస్య భంగః స్యాత్. లక్షణాయాం హి లక్ష్యస్యైవ ప్రాధాన్యం స్యాత్, న వాచ్యస్య. 'యత్ర వాచ్యోఽర్థోఽర్థాంతరం స్వోపస్కారకత్వే నాగూరయతి తత్ర పర్యాయోక్తమ్, యత్ర స్వాత్మానమేవాప్రస్తుతత్వాత్ప్రస్తుత మర్థాంతరం ప్రతి సమర్పయతి తత్రాప్రస్తుతప్రశంసా' ఇతి తన్మూలగ్రంథవిరోధాచ్చ. నహి లక్షణా ఆగూరణం భవతి. తస్మాత్పర్యాయోక్తే వాచ్యస్య ప్రాధాన్యమ్, అప్రస్తుతప్రశంసాయాం తు నేతి తన్మూల గ్రంథస్య తాత్పర్యమ్.

ఈ యలంకారమునందు వ్యంగ్యము వాచ్యపరము. అప్రస్తుతప్రశంస యందైతే, వాచ్యము వ్యంగ్యపరము. అందుచేత నీ అలంకారము వాచ్యసిధ్యంగమగు గుణీభూత వ్యంగ్యభేద మని ధ్వనికారుల యనుయాయుల మతము.

అయితే -

" 'స్వసిద్ధయే' మొ. (తను సిద్ధించుటకొఱకు యితరముల నాక్షేపించుటయు, ఇతరముకొఱకు తనను సమర్పించుటయు, ఉపాదానం లక్షణం అని చెప్పబడిన అది రెండురకములుగా శుద్ధమైనదే.)

అని చెప్పిన యుక్తిచే లక్షణాద్వయము నాశ్రయించుటవలనను వీటి రెంటికి నవాంతరమైన విషయభేదము గలదు అని మూలగ్రంథాశయమును వర్ణించుచూ విమర్శినీకారుడును చెప్పెను. అదికూడదు.

'చక్రాభిఘాతప్రసభాజ్ఞయైవ' అనేపద్యమునందు చుంబనమాత్రశేష రతోత్సవాంశమునందు బాధ లేదే. అప్పుడుకదా లక్షణ యగును. ఈ తీరుగా

నప్రస్తుతప్రశంసయందును అప్రస్తుతమునకు ప్రస్తుతమునందు లక్షణ లేదు. ఇక నేమనగా వ్యంజనయే నని అందరు అంగీకరించినదే అలా కాకపోతే- పర్యాయోక్తము నందు వాచ్యమునకు ప్రాధాన్యము, అప్రస్తుతప్రశంస యందు గమ్యమునకే ప్రాధాన్యము, అనే సిద్ధాంతము భగ్నమైపోవును లక్షణ యందైతే లక్ష్యమునకే ప్రాధాన్యమగును. వాచ్యమునకు కాదు.

"ఎక్కడ వాచ్యార్థము అర్థాంతరమును స్వోపస్కారకముగా నాగూరణ మొనర్చునో నచట పర్యాయోక్తము, ఎచట తననే అప్రస్తుతమగుట వలన ప్రస్తుతమగునర్థాంతరమును గురించి సమర్పించునో అచట నప్రస్తుతప్రశంస" అని తన్మూలగ్రంథముతో విరోధమున్నది. లక్షణ ఆగూరణము కాదుగదా? అందువలన పర్యాయోక్తమునందు వాచ్యమునకు ప్రాధాన్యము; అప్రస్తుత ప్రశంసయందైతే లేదని తన్మూల గ్రంథముయొక్క తాత్పర్యము.

**ఇతం తు బోధ్యమ్—ధ్వనికారాత్ప్రాచీనైర్భామహోద్భట ప్రభృతిభిః స్వగ్రంథేషు కుత్రాపి ధ్వనిగుణీభూతవ్యంగ్యాదిశబ్దా న ప్రయుక్తా ఇత్యేతావతైవ తైర్ధ్వన్యాదయో న స్వీక్రియంత ఇత్యాధునికానాం వాచోయుక్తిరయుక్తైవ. యతః సమాసోక్తివ్యాజస్తుత్యప్రస్తుతప్రశంసాద్యలంకారనిరూపణే కియంతోఽపి గుణీభూత వ్యంగ్యభేదాస్తైరపి నిరూపితాః అపరశ్చ సర్వోఽపి వ్యంగ్యప్రపంచః పర్యాయకుక్షౌ నిక్షిప్తః నహ్యనుభవసిద్ధోఽర్థో బాలేనాప్యపహ్నోతుం శక్యతే. ధ్వన్యాదిశబ్దైః పరం వ్యవహారో న కృతః. నహ్యేతావతానంగీకారో భవతి. ప్రాధాన్యాదలంకార్యో హి ధ్వనిరలంకారస్య పర్యాయస్య కుక్షౌ కథంకారం నివిశతామితి తు విచారాంతరమ్.**

ఇది తెలియవలసినది. ధ్వనికారులకంటే ప్రాచీనులు భామహ ఉద్భటాదులు తమగ్రంథములందు ఎచ్చటను, ధ్వని గుణీభూతవ్యంగ్యాది శబ్దములు ప్రయోగించలేదు అని, ఇంతమాత్రముచేతనే వారు ధ్వన్యాదులను స్వీకరించలేదని ఆధునికుల వాదము యుక్తమైనదే. ఎందువల్లననగా సమాసోక్తి వ్యాజస్తుతి, అప్రస్తుతప్రశంస మొదలగు నలంకారముల నిరూపణమందు, గుణీభూతవ్యంగ్యభేదము లెన్నియో వారును నిరూపించిరి. మిగిలిన వ్యంగ్యప్రపంచమంతయును పర్యాయోక్తికుక్షియందే యుంచబడినది. అనుభవసిద్ధమగు నర్థమును బాలుడైనను కాదని కనుమూయలేడు కదా! ధ్వన్యాది శబ్దములచేమాత్రము వ్యవహారముచేయలేదు. ఇంత మాత్రముచేత అనంగీకారము కాజాలదు. ప్రధానమగుటచే నలంకరింప

దగినది ధ్వని పర్యాయోక్తాలంకారము యొక్క కుక్షియందు ఎట్లు ప్రవేశించును అనునది విచారణీయ మగు నర్థాంతరము.

అయం చాలంకారః క్వచిత్కారణేన వాచ్యేన కార్యస్య గమ్యత్వే, క్వచిత్కార్యేణ కారణస్య, క్వచిదుభయోదాసీనేన సంబంధిమాత్రేణ సంబంధిమాత్రస్య చేతి విపులవిషయః.

తత్ర 'త్వాం సుందరీనివహ—' ఇతి పద్యే పాతివ్రత్యస్ఖలనేన కారణేన తం ప్రతి ప్రాప్తిః, కార్యం గమ్యతే సమాసోక్తిరత్రోత్థాపికా. ఏతేన 'కార్యాత్కారణ ప్రతీతివత్కారణాత్కార్యప్రతీతేర్వైచిత్ర్యాభావాత్' ఇతి టీకాకారోక్తమపాస్తమ్.

"అపకుర్వద్భిరనిశం ధృతరాష్ట్ర తవాత్మజైః
ఉప్యంతే మృత్యుబీజాని పాండుపుత్రేషు నిశ్చితమ్'

అత్ర బీజావాపేన కారణేన కులక్షయః కార్యరూపో గమ్యతే.

ఈ యలంకారము ఒకచోట కారణము వాచ్యముకాగా కార్యమునకు గమ్యత్వముచేతను, ఒకయెడ కార్యముచే కారణమునకును, ఇంకొకచోట నుభయోదాసీనమగు సంబంధిమాత్రముచే సంబంధిమాత్రమునకును, అని విపులవిషయమైనది.

అచట " త్వాం సుందరీనివహ" అను పద్యమందు పాతివ్రత్యస్ఖలనరూపమగు కారణముచే నతనిని పొందుట అనుకార్యము తోచుచున్నది. ఇచట సమాసోక్తి, ఉత్థాపకము, ఇందుచేతను "కార్యమునుండి కారణప్రతీతియందు వలె కారణమువలన కార్యప్రతీతి యందు వైచిత్ర్యము లేకపోవుటవలన"అని టీకాకారులు చెప్పినది త్రోసివేయబడినది.

"అపకుర్వద్భిః" మొ. (ఓ ధృతరాష్ట్రుడా! ఎప్పుడును అపకారము చేయుచున్న నీ కుమారులచే పాండుపుత్రులయందు నిశ్చితముగా మృత్యుబీజములు చల్లబడినవి.)

ఇచట బీజావాప మను కారణముచే కులక్షయము, కార్యరూపము, తోచుచున్నది.

కార్యేణ కారణస్య గమ్యత్వే యథా—

"త్వద్విపక్షమహీపాలాః స్వర్బాలాధరపల్లవమ్
పీడయంతి తరాం తీవ్రదారుణై ర్దశనక్షతైః"

అత్ర వైరిణాం సురవధూసంభోగేన కార్యేణ మరణం కారణం గమ్యతే. తదుభయోదాసీనేన యథా—'సూర్యాచంద్రమసౌ యస్య—' ఇతి పూర్వోదాహృతే పద్యే సూర్యచంద్ర కరరజ్యమానవస్త్రత్వేన, న కార్యేణ, నాపి కారణేన, కేవలం సహచరితేన గగనాంబరత్వం గమ్యతే.

కార్యముచేత కారణమునకు గమ్యత్వము ఎట్లన -

"త్వద్విపక్ష" మొ. (నీ శత్రురాజులు స్వర్గమునందలి బాలికలయొక్క అధరపల్లవమును తీవ్రమును దారుణమును అగు దంతక్షతముచే మిక్కిలి పీడించుచున్నారు.)

ఇచట శత్రువుల సురవధూసంభోగ మను కార్యముచేత మరణము తోచుచున్నది.

అది ఉభయోదాసీనము ఎట్లనగా -

"సూర్యాచంద్రమసౌ యస్య" అని పూర్వోదాహృతపద్యమందు ఇచట కార్యముచే కాదు. కారణముచేతను గాదు; కేవలముగా సహచరితమగు సూర్యచంద్ర రజ్యమాన వస్త్రత్వముచేత గగనాంబరత్వము తోచుచున్నది.

ఏవమ్—

'యశ్చరణత్రాణీకృతకమలాసన పన్నగేంద్రలోకయుగః
సర్వాంగావరణపటీకృతకనకాండః స వామనో జయతి'

ఇత్యత్ర చ్విప్రత్యయేన తద్భేదావగమాద్రూపకాసంభవేన పర్యాయోక్తం భవితుమర్హతి. గమ్యం చాంతర్వ్యాప్త చరణకత్వమంతర్వ్యాప్తాంగకత్వం చ.

ఈ విధముగా

"యశ్చరణ" మొ. (ఎవరు చరణత్రాణముగా చేయబడిన బ్రహ్మలోక శేషలోకములు రెండును కలవాడో, స్వరాంగావరణపటముగా చేయబడిన బ్రహ్మాండముగలవాడో ఆ వామనుడు సర్వోత్కర్షగా నున్నాడు.)

అనుచోటను చ్విప్రత్యయముచేత తద్భేదము అవగమించుటవలన, రూప

కము కుదరకపోవుటచే, పర్యాయోక్తమగుటకు దగియున్నది. అంతర్వ్యాప్త చరణకత్వము, అంతర్వ్యాప్తాంగకత్వమున్ను ఇచట గమ్యము.

తదేవం సంక్షేపత స్త్రివిధః. వాగ్భంగీనాం తు పర్యాలోచనే ఏకస్మి న్నేవ విషయేఽనంత ప్రకారః సంపద్యతే, కిముత విషయభేదే. యథా 'ఇహ భవద్భిరాగంతవ్యమ్' ఇతి విషయే "అయందేశోఽలంకర్తవ్యః" ఇతి, 'పవిత్రీకర్తవ్య' ఇతి, 'సఫలజన్మా కర్తవ్య' ఇతి, 'ప్రకాశనీయ' ఇతి, 'దేశస్యాస్య భాగ్యాన్యుజ్జీవనీయాని' ఇతి, 'తమాంసి తిరస్కా రణీయాని' ఇతి, 'అస్మన్నయనయోః సంతాపో హారణీయః' ఇతి, 'మనోరథః పూరణీయః' ఇత్యాదిః. కార్యాదీనాం త్వారోపేణ నిష్పత్తిరన్వేష్టవ్యా.

కనుకను, ఈ తీరున సంక్షేపముగా మూడు విధములు. వాగ్భంగిమల పర్యాలోచించినట్లైతే ఒకవిషయమునందే ననంతప్రకారములుగా సిద్ధమ గును; విషయభేద మున్నపు డేమి చెప్పవలెను? ఎట్లనగా - "ఇహ భవద్భిరా గంతవ్యం"-అను విషయమునందు. 'అయందేశోఽలంకర్తవ్యః' మొదలగునవి. కార్యాదులకైతే నారోపముచే నిష్పత్తి వెదుకవలసినది.

ఏవం చ పర్యాయోక్తస్య కార్యరూపాప్రస్తుతప్రశంసయా విషయాపహారమాశంక్య కార్యకారణయోరపి ప్రస్తుతత్వే పర్యాయో క్తమ్, కార్యస్యాప్రస్తుతత్వే కారణస్య చ ప్రస్తుతత్వే కార్యరూపాప్రస్తు తప్రశంసేతి యో విషయవివేకః సర్వస్వకృతా కృతః, తత్ర న్యూన విషయ యా కార్యరూపాప్రస్తుతప్రశంసయా బహువిషయస్యాస్య విషయాపహారో న సంగచ్ఛత ఏవ. పరం త్వనేన తస్యా విషయాప హారమాశంక్య విషయవిభాగః కర్తుముచితః.

ఇతి రసగంగాధరే పర్యాయోక్తప్రకరణమ్.

ఈ తీరుగా - పర్యాయోక్తమునకు కార్యరూపమగు నప్రస్తుత ప్రశం సచే విషయాపహారమును శంకించి కార్యకారణములు ప్రస్తుతమైనపుడు పర్యాయోక్తి యనియు, కార్యమప్రస్తుతమైన యెడల కారణము ప్రస్తుత మైనచో కార్యరూపా ప్రస్తుతప్రశంసయనియు ఏ విషయవివేకము సర్వస్వకా రులచే చేయబడినదో - అచట న్యూనవిషయము కార్యరూపాప్రస్తుతప్రశం

నచే బహువిషయ మగు దీనికి విషయాపహారము సంగతమేకాదు కాని వీనిచేత దానికి విషయాపహారమును నాశంకించి విషయవిభాగము జేయ దగినది.

ఇది పర్యాయోక్తిప్రకరణము

## వ్యాజస్తుతిః

అథ వ్యాజస్తుతిః— ఆముఖప్రతీతాభ్యాం నిందాస్తుతిభ్యాం స్తుతినిందయోః క్రమేణ పర్యవసానం వ్యాజస్తుతిః.

తృతీయాతత్పురుషకర్మధారయాభ్యాం యోగార్థద్వయేన ద్వయోరపి శబ్దార్థత్వమ్. ఆముఖేత్యాదివిశేషణేన తయోః పర్యవసానాభావం వదన్బాధితత్వమభిప్రైతి అత ఏవ నాస్యా ధ్వనిత్వమ్. ధ్వనౌహి నిర్బాధేన వాచ్యేనాగూరణమహిమ్నార్థాంతరమవగమ్యతే న చైవం ప్రకృతే.

అనంతరము వ్యాజస్తుతి—

ఆముఖమున స్ఫురించు నిందాస్తుతులచేత స్తుతి నిందల క్రమముగా పర్యవసానము వ్యాజస్తుతి.

తృతీయాతత్పురుష - కర్మధారయలచేత యోగార్థ ద్వయముచే రెంటికిని శబ్దార్థత్వము. ఆముఖేత్యాది యగువిశేషణముచేత రెంటికిని పర్యవసానము లేక పోవుటను చెప్పుచూ బాధితత్వము నభిప్రాయపడుచున్నాడు. అందువలననే దీనికి ధ్వనిత్వములేదు. ధ్వనియందు బాధలేని వాచ్యముచే నాగూరణమహిమచే నర్థాన్తరము స్ఫురించును. అట్లు ప్రకృతమునకాదు!

ఆద్యా యథా—

"ఉర్వీం శాసతి మయ్యుపద్రవలవః కస్యాపి న స్యాదతి
ప్రౌఢం వ్యాహరతో వచస్తవ కథం దేవ ప్రతీమో వయమ్.
ప్రత్యక్షం భవతో విపక్షనివహైర్ద్యాముత్పతద్భిః క్రుధా
యద్వ్యస్మత్కులకోటి మూలపురుషో నిర్భిద్యతే భాస్కరః"

అత్ర రాజవర్ణనప్రస్తావే నిందా బాధితా స్తుతౌ పర్యవస్యతి.

మొదటిది యెట్లనగా-

"ఉర్వీం" మొ. (నేను భూమిని పాలించుచుండగా యెవనికిని ఉపద్రవల వము కూడా కారాదు అని ప్రౌఢముగా చెప్పుచున్న నీ మాటను ఓ ప్రభువా! నేనెట్లు విశ్వసింతును? నీకు ప్రత్యక్షముగా ఆకాశమున కెగురుచు నీ శత్రువులచే కోపముతో మీ కులమునకు మూలపురుషుడు భాస్కరుడు ఛేదింపబడుచున్నాడు"

ఇచట రాజవర్ణనయందు నింద బాధించబడినదై స్తుతి యందు పర్యవసించినది.

ద్వితీయా యథా—

"కిమహం వదామి ఖల దివ్యమతే గుణపక్షపాతమభితో భవతః
గుణశాలినో నిఖిలసాధుజనాన్యదహర్నిశం న ఖలు విస్మరసి॥"

అత్ర దుశ్చరితోత్కీర్తనప్రస్తావే స్తుతి స్తథాభూతా నిందాయామ్. అత్ర చైక ఏవార్థః కేనచిదాకారేణాదౌ స్తుతేర్నిందాయా వా విషయో భూత్వా ప్రకరణాదిమహిమ్నా ప్రకారాంతరేణ నిందాయాః స్తుతేర్వా విషయో భవతి. తత్ర యావానంశో బాధితస్తావానేనాన్యథాత్వేన పర్యవస్యతి. అంశాంతరం తు స్వభావే నైవావతిష్ఠతే.

రెండవది యెట్లనగా—

"కిమహం" మొ. (ఓ దివ్యమతీ! ఖలుడా! అంతటనూగల గుణపక్షపాతమును నే నేమని చెప్పుదును? గుణశాలులగు యావన్మంది సాధు జనులను రాత్రింబగళ్లు ఎప్పుడునూ మరచిపోవు.)

ఇచట దుశ్చరితోత్కీర్తనప్రస్తావనమునందు స్తుతి బాధితమై నింద యందు పరిణమించినది.

ఇచట నొకేయర్థము ఏదే నొకయాకారముతో మొదట స్తుతికిగానీ నిందకుగానీ విషయమై ప్రకరణాది మహిమచే ప్రకారాన్తరమున నిందకో, స్తుతికో విషయమగును. అచట నెంతయంశము బాధితమైనదో నంతయే మరియొకతీరగా బర్యవసించును, అంశాన్తరమన్ననో స్వభావముతోనే నిలుచును.

ఇయం చాలంకారాంతరసంకీర్ణా యథా—

"దేవ త్వాం పరితః స్తువంతు కవయో లోభేన, కిం తావతా
స్తవ్యస్త్వం భవితాసి యస్య తరుణశ్చాపప్రతాపోఽధునా.
క్రోడాంతః కురు తేతరాం వసుమతీమాశాః సమాలింగతి
ద్యాం చుంబత్యమరావతీం చ సహసా గచ్ఛత్యగమ్యామపి.

అత్ర చాపప్రతాపస్య సమాసోక్త్యా విటధారేయవ్యవహారాశ్రయత్వ ప్రతీతిః. తన్మూలా చ నిందా స్తుతౌ పర్యవస్యతి.

ఇది యలంకారాన్తరములతో సంకీర్ణమగును -

ఎట్లనగా -

"దేవ త్వాం" మొ.

ఇచట చాపప్రతాపమునకు సమాసోక్తిచే విటధారేయవ్యవహారాశ్రయత్వప్రతీతి : తన్మూలమగు నిందయు స్తుతియందు పర్యవసించుచున్నది

యథా వా—

"అయే రాజన్నాకర్ణయ కుతుకమాకర్ణనయన
స్ఫురంతీ హస్తాంభోరుహి తవ కృపాణీ రణముఖే
విపక్షాణాం వక్షస్యహహ! తరుణానాం నిపతతి
ప్రగల్భాః శ్యామానామనుపరతకామాః ప్రకృతయః."

అత్రార్థాంతరన్యాస పోషితా.

మరొకటి -

'అయే' మొ. (ఓ రాజా! కర్ణాంతనేత్రుడా! వినవలసిన విషయమును వినుము. నీ హస్తపద్మమునందున్న కృపాణి (కత్తి) రణమున పడుచు శత్రువులయొక్క వక్షస్థలమునందు పడుచున్నది. యౌవనవంతులగు స్త్రీలయొక్కస్వభావములు చల్లారని కామములు కలవి.)

ఇచట నర్థాన్తరన్యాసముచేతను పోషింపబడినది.

నను కథమత్ర వాచ్యాభ్యాం వ్యాజస్తుతిః? వాచ్యాభ్యామేవ నిందాస్తుతిభ్యాం స్తుతినిందయోర్గమ్యత్వే తస్యా అభ్యుపగమాత్. నహ్యత్ర చాపప్రతాపస్య కేవలస్య కేవలవసుమత్యాద్యాలింగనం వాచ్యభూతం

నిన్దాస్పదం భవతి. సమాసోక్త్యా త్వావిర్భూతో విటవ్యవహారో నిన్దాస్పదమపి న వాచ్యః. అపి తు రమ్య ఇతి చేత్, అముఖ ప్రతీతపదేన హి ప్రతీతావపర్యవసితత్వమాత్రమత్ర వివక్షితమ్. న తు వాచ్యత్వ పర్యంతమ్: గౌరవాత్, ప్రకృతే చ కిం తావతా స్తవ్య స్త్వమిత్యాదినా నిఃదాయా ఏవోపోద్బలనాత్సమాసోక్తి సాచివ్యేన సైవ ప్రథమం ప్రరూఢా పశ్చాచ్చ స్తుతిరితి న కోఽపి దోషః.

అయితే-ఇచట వ్యాజస్తుతి యెట్లగును? వాచ్యములగు నిందాస్తుతుల చేతనే స్తుతినిందలు గమ్యములగుచో వ్యాజస్తుతిని యంగీకరింతురు గదా? ఇచట చాపప్రతాపమునకు, కేవలమునకు, కేవలము వసుమత్యాదుల నాలింగనము, వాచ్యమైనది, నిందాస్పదము కాదుకదా? సమాసోక్తిచే నావిర్భవించిన విట వ్యవహారము నిందాస్పదమైనను వాచ్యముకాదు; ఇక నేమనగా గమ్యమేను అన్నచో అముఖప్రతీత పదముచేత ప్రతీతియందపర్యవసితత్వము మాత్రము. ఇచట వివక్షితము. వాచ్యత్వపర్యంతము కాదు. గౌరవమువలన. ప్రకృతము నందును. 'ఆంతమాత్రముచేత నీవు స్తవ్యుడవా?' అని మొదలగు వానిచే నిందకే ఉపోద్బలమగుటవలన, సమాసోక్తి తోడ్పాటుతో, నదియే మొదట ప్రరూఢముకాగా తరువాతను స్తుతి అని ఏమియు దోషము లేదు.

ఏవం చ—

"భాగ్యం తే శాల్మలితరో వద కిం పరికథ్యతే
ద్విజైః ఫలాశయా యుక్తైః సేవ్యసే యదహర్దివమ్"

ఇత్యత్రాప్రస్తుత ప్రశంసాసంకీర్ణాప్యేషా భవతి ఏతేన—

"కిం వృత్తాంతైః పరగృహగతైః కిం తు నాహం సమర్థ
స్తూష్ణీం స్థాతుం ప్రకృతిముఖరో దాక్షిణాత్యస్వభావః
దేశే దేశే విపణిషు తథా చత్వరే పానగోష్ఠ్యా
మున్మత్తేవ భ్రమతి భవతో వల్లభా హంత! కీర్తిః"

ఇత్యత్ర ప్రాచీన పద్యే "ప్రక్రాంతాపి స్తుతిపర్యవసాయినీ నిందా 'హంత కీర్తిః' ఇతి భణిత్యోన్మీలితా న తు ప్రరోహం గమితా" ఇతి యత్సర్వస్వకృతోక్తమ్; యచ్చాపి తద్వ్యాఖ్యాయాం విమర్శి

వ్యామ్ 'అనుదాహరణమేవైతత్పద్యం వ్యాజస్తుతేః' ఇతి ధ్వన్యాలోక లోచనకారోక్తిం కటాక్షేణ లక్ష్యీకృత్యోక్తమ్, తన్నిరస్తమ్ 'కిం వృత్తాంతైః' ఇత్యాదినా నిందాయా ఏవ ప్రథమమన్వయనాత్సమాసోక్తేరుద్గతేర్వాచ్యత్వస్యాతంత్రత్వాత్. అన్వయక్రమేణాదౌ వల్లభయైవాన్వయే తస్యాశ్చ కీర్త్యభిన్నత్వేనావస్థానే సతి పశ్చాత్ప్రకరణాది పర్యాలోచనవశాద్వ్యుత్క్రమేణాన్వయబోధాచ్చ. తస్మాద్ ధ్వన్యాలోకలోచనకారైరుక్తముదాహరణం సంగతమేవ.

ఇలాగ –

“భాగ్యం తే” మొ. (ఓ బూరుగువృక్షమా! నీయొక్క అదృష్టమును ఏమని చెప్పుదును? ద్విజులు ఫలాశచే అందరూకూడి నిన్ను రాత్రింబగళ్ళు సేవింతురు.)

అనే చోట అప్రస్తుత ప్రశంసతో సంకీర్ణముగూడ ఇది యగును. దీనిచేత “కింవృత్తాంతైః” మొ (ఇతరుల గృహముల యందలి కబురులతో నేమి ప్రయోజనము? కానీ నేనూరుకొనలేను స్వభావము ముఖరమగు దాక్షిణాత్య స్వభావము; ప్రతిదేశమునందును అంగళ్ళయందును పానగోష్ఠియందును పిచ్చెక్కినదానివలె నీకు ప్రియురాలైన కీర్తి ఓ ప్రభువా! తిరుగుచున్నది.)

ఇత్యాది ప్రాచీనపద్యమందు. 'ప్రక్రాంతమైనను స్తుతి పర్యవసాయిని యగు నింద 'హన్త కీర్తిః' యని భణితిచే నున్మీలింపబడినది; అంతేకానీ అభివృద్ధిపొందింపబడలేదు, అని అలంకారసర్వస్వకారులచే నేది చెప్పబడినదో, అదియు, దాని వ్యాఖ్యయగు విమర్శినియందు—

“అనుదాహరణమేవ ఏతత్పద్యం వ్యాజస్తుతేః” అని ధ్వన్యాలోక లోచనకారుని ఉక్తిని కటాక్షముతోనే లక్ష్యీకరించి ఏది చెప్పబడినదో, నదియును నిరస్తమైనది. 'కింవృత్తాన్తైః' ఇత్యాదితో నిందయె మొట్టమొదట పైకి తీసుకరాబడుటవలన. సమాసోక్తి యొక్కనుద్గతిచే వాచ్యమగుట తంత్రముగాదు గనుక. అన్వయక్రమముచే మొదటవల్లభతోనే యన్వయము చేసినపిమ్మట, అది కీర్త్యభిన్నముగా నిలచియుండగా తరవాత, ప్రకరణాది పర్యాలోచనవలన వ్యుత్క్రమముచే నన్వయము బోధితమగుచున్నది కనుక. అందువలన ధ్వన్యాలోకలోచనకారులు చెప్పిన యుదాహరణము సంగతమేను.

ఇయం చ వ్యాజస్తుతిర్యస్యైవ వస్తునః స్తుతి నిందే ప్రథమము పక్రమ్యేతే తస్యైవ చేన్నిందాస్తుత్యోః పర్యవసానం భవేత్తదా భవతి. వై యధికరణ్యే తు న, ఇతి ప్రాచామలంకారశాస్త్రప్రవర్తకానాం సమయః. అత ఏవ, యత్ర శబ్దేనాభిధీయమానా స్తుతిర్నిందా వా బాధితస్వరూపా నిందాయాం స్తుతౌ చ స్వసమర్పణేన పర్యవస్యతీతి తైస్తత్ర తత్ర స్వగ్రంథేషూపనిబద్ధమ్.

"పరోపసర్పణానంత చింతానలశిఖాశతైః
అచుంబితాంతఃకరణాః సాధు జీవంతి పాదపాః"

ఇత్యాదిషు సాంసారికజననిందాపర్యవసాయిన్యామపి పాదపస్తుతౌ న వ్యాజస్తుతిత్వమ్. ప్రథమప్రతీయమానస్తుతేరబాధితత్వాత్. ఏవం నిందయా స్తుతేర్గమ్యత్వేఽపి. తథా అన్యస్య స్తుత్యాన్యస్తుతౌ, అన్యనిందాయాం వాన్యనిందాయాం గమ్యమానాయాం నాస్యా అలంకృతేర్విషయః. పూర్వోక్తాదేవ హేతోః. యథా—

"యే త్వాం ధ్యాయంతి సతతం త ఏవ కృతినాం వరాః
ముధా గతం పురారాతే భవదన్యధియాం జనుః"

అత్ర పూర్వార్ధోత్తరార్ధగతాభ్యాం ధ్యాతృస్తుతి నిందాభ్యాం ధ్యేయస్తుతినిందయోరవగమః.

ఈవ్యాజస్తుతి, ఏ వస్తువునకు స్తుతినిందలు మొట్టమొదట నుపక్రమింపబడెనో, దాని నిందాస్తుతులలో బర్యవసానమైనయెడల నపుడగును; వైయధికరణ్యమందుకాదు అని ప్రాచీనాలంకారికులయొక్క సిద్ధాంతము. ఇందువలననే ఎచటశబ్దముచే జెప్పబడినస్తుతిగానీ నిందగానీ బాధింపబడిన స్వరూపము గలదై నిందయందుగానీ, స్తుతియందుగాని తనను సమర్పించుకొనుటచేత, బర్యవసించునో-అని అక్కడక్కడ వారిచేత స్వగ్రంథములయందు వ్రాయబడినది.

ఈ తీరుగా —

"పరోపసర్పణానన్త" మొ. (ఇతరుల నుపసర్పించుట అను అనంత చింతాగ్నియొక్క అనేక శిఖలచే స్పృశించబడని హృదయముకలవై చక్కగా చెట్లు జీవించుచున్నవి.)

ఇత్యాదులందు సాంసారికనిందాపర్యవసాయినియైనను పాదవస్తుతి

యందు వ్యాజస్తుతిత్వములేదు; ప్రథమప్రతీయమానస్తుతి బాధితము గాదు. కనుక, ఈ తీరుగా, నిందచే స్తుతి గమ్యమై నప్పటికిని అలా మరొకరి స్తుతిచే మరొకరి స్తుతి యేర్పడి నప్పటికిని, ఒకరి నిందచే మరొకరి నింద యేర్పడి నప్పటికినీ, ఈ అలంకారముకాదు. వెనుక జెప్పిన హేతువువలననే ఎట్లనగా-

"యే త్వాం" మొ. (ఎవరు నిన్ను ఎల్లప్పుడూ ధ్యానము చేయుదురో, వారే కుశలులలో శ్రేష్ఠులు ఓ పరమేశ్వరా నీకంటె నితరమైన వారియందు బుద్ధిగలవారల జన్మ వ్యర్థముగా బోయినది.)

ఇచట పూర్వోత్తరార్థగతములగు ధ్యాతృస్తుతినిందలచే ధ్యేయస్తుతి నిందలు నవగతమగును.

ఏవం స్థితే కువలయానందకర్త్రా స్తుతినిందాభ్యాం వైయధికరణ్యేన నిందాస్తుత్యోః స్తుతినిందయోర్వావగమే ప్రకారచతుష్టయం వ్యాజస్తుతేర్యదధికముక్తం తదపాస్తమ్ యది తు ప్రాచీనసంకేతసేతుం నిర్భిద్య స్వరుచిరమణీయా సరణిరాద్రియతే తదా నివేశ్యంతాం సర్వేఽపి వ్యంగ్యప్రకారా గుణీభూతవ్యంగ్యప్రకారా వా అలంకారోదరేషు, నివేశ్యతాం వా వ్యాజస్తుతిరపి యోగార్థాలీఢత్వాదప్రస్తుతప్రశంసాయామ్. నిరస్యతాం చ కార్యకారణాదివిషయకత్వదురాగ్రహస్తస్యా ఇతి బహువ్యాకులీ స్యాత్.

ఏవం తర్హి పూర్వోక్తం ప్రకారచతుష్టయం కుత్రాంతర్భవతు, ఇతి చేద్వ్యంగ్యభేదేష్వితి గృహాణ. నహి వ్యంగ్యభేదాః సర్వేఽప్యపరిమితా అలంకారప్రకారగోష్పదే అంతర్భావయితుం శక్యంతే.

ఇట్లుండగా కువలయానందకారునిచే స్తుతినిందలచేత వ్యధికరణముగా నిందాస్తుతులుగానీ స్తుతినిందలుగానీ అవగతములగునపుడు నాల్గుప్రకారములును వ్యాజస్తుతికి యాధిక్యము ఏదిచెప్పబడెనో నది త్రోసివేయబడినది. ప్రాచీనసంకేతముల సేతువును భేదించి తనకు ఇష్టమువచ్చిన త్రోవ నాచరించిన యెడల అప్పుడు అన్నివ్యంగ్య ప్రకారములు గుణీభూతవ్యంగ్య ప్రకారములుగాని యలంకారోదరమున నివేశిపబడుగాక. వ్యాజస్తుతియను యోగార్థముచే నాక్రాంతమగుటవలన అప్రస్తుతప్రశంసయందు ప్రవేశింపజేయబడుగాక. దానికి కార్యకారణాది విషయకత్వమను దురాగ్రహము నిరసింపబడుగాక. ఇట్లు బహువ్యాకులీ భావమగును. ఇలాగైతే పూర్వముజెప్పిన

ప్రకారచతుష్టయము ఎక్కడ యన్తర్భావము జెందును, అంటే వ్యంగ్యభేదములలో నని గ్రహించుము. పరిమితములైన వ్యంగ్యభేదము లన్నియు అలంకార గోష్పదమందు నంతర్భావము నొందజేయుటకు వీలుపడవుగదా?

యచ్చాపి కువలయానందకృతా నిందాయా గమ్యత్వే ఉదాహృతమ్—

"అర్ధం దానవవైరిణా గిరిజయాప్యర్థం శివస్యాహృతం
దేవేత్థం జగతీతలే స్మరహరాభావే సమున్మీలతి.
గంగా సాగరమంబరం శశికలా నాగాధిపః క్ష్మాతలం
సర్వజ్ఞత్వమధీశ్వరత్వమగమత్త్వాం, మాం చ భిక్షాటనమ్"

అత్ర సర్వజ్ఞః సర్వేశ్వరోఽసీతి రాజ్ఞః స్తుత్యా వ్యాజరూపయా మదీయవైదుష్యాది దారిద్ర్యాది జానన్నపి బహు ప్రదానేన రక్షితుం శక్తో మహ్యం కిమపి న దదాసీతి నిందా వ్యజ్యతే" ఇత్యుక్తం చ; తన్న.

"సాధు దూతి పునః సాధు కర్తవ్యం కిమతః పరమ్
యన్మదర్థే విలూనాసి దన్తైరపి నఖైరపి."

ఇత్యనుపదమేవ త్వదుదాహృతపద్యేనాస్యాతితమాం వైలక్షణ్యాత్. తత్ర హి సాధు కిమతః పరం కర్తవ్యమితి వర్ణైరుదీరితా సాధుకారిణీత్వరూపా స్తుతిః శ్రుతమాత్రైవ బాధితా సతీ విపరీతేఽర్థే స్వాత్మసమర్పణేన పర్యవస్యతి. ఇహ తు సర్వజ్ఞత్వమధీశ్వరత్వం చ న తథా. రాజపర్ణసప్రస్తావే రాజగతాజ్ఞత్వపామరత్వయోరవివక్షితత్వాత్. అత ఏవ సర్వజ్ఞోఽపి మాం న రక్షితవానసి ఇత్యుపాలంభరూపాపి నిందా యత్ర వివక్షితా. సర్వజ్ఞస్య సమర్థస్య తవ దరిద్రోఽహం రక్షితుం యోగ్య ఇతి స్వవిజ్ఞాపనాయా ఏవ ప్రత్యుత వివక్షితత్వాత్· అస్తు వా త్వదుక్తోపాలంభరూపా నిందాత్ర గమ్యా. తుష్యతు భవానేవమపి: 'సాధు దూతి పునః సాధు' ఇతి పద్యే సాధుకారిణీత్వమివ నాస్మిన్పద్యే సర్వజ్ఞత్వమధీశ్వరత్వం చ విద్యుద్భంగురప్రతిభమితి శక్యం వక్తుమ్. ఉపాలంభరూపాయా నిందాయా అనుత్థానాపత్తేః ప్రతీతివిరోధాచ్చేతి సహృదయైరాకలనీయం కిముక్తం ద్రవిడపుంగవేనేతి.

ఇతి రసగంగాధరే వ్యాజస్తుతిప్రకరణమ్

మరియు కువలయానందకారుఁడు నిందగమ్యమగుటలో నుదాహరించెను—

"అర్ధం దానవవైరిణా" మొ. (శివుని సగము విష్ణువు చేతనూ సగము పార్వతి చేతనూ, హరింపబడినది. ఓ ప్రభువా! యీ తీరుగా భూతలమందు శివుడు లేక పోవుటయే ప్రకాశముగాగా గంగ సముద్రమును, ఆకాశమును చంద్రకళయు, శేషుడు భూతలమును, సర్వజ్ఞత్వము నిన్ను నన్ను భిక్షాటనము పొందెను.)

ఇచట సర్వజ్ఞుడవు, సర్వేశ్వరుడవు అయితివి అను వ్యాజరూపమగు రాజస్తుతిచే నా యొక్క పాండిత్యమును, దారిద్ర్యమును తెలిసినవాడవైనను, బహుప్రదానముచే నన్ను రక్షింప శక్తి కలవాడవైనను, నాకేమియు నివ్వవైతివి— అను నింద తోచుచున్నది అని చెప్పెను. అది తగదు.

"సాధు దూతి" మొ. (ఓ దూతీ! చాలా మంచిది! తిరిగి మంచిది! ఇంతకంటే ఏమి చేయవలెను! ఎందువలననగా నా కొఱకై దంతముల చేతనూ గోళ్ళ చేతనూ పలువబడితివి.)

అని వెంటనే నీవే యుదహరించిన పద్యముతో దీనికి మిక్కిలి వైలక్ష్యము వలన. అచట 'సాధు కిమతఃపరం కర్తవ్యం' అను వర్ణములచే చెప్పబడిన సాధుకారిణీత్వ రూపమగు స్తుతి వినినంతనే బాధింపబడినదై విపరీతార్థమున స్వాత్మ సమర్పణముచే పర్యవసించుచున్నది. ఇచటనైతే సర్వజ్ఞత్వము అధీశ్వరత్వము అట్లుగాదు. రాజవర్ణన ప్రస్తావమందు రాజగతమగు నజ్ఞత్వ పామరత్వములు అవివక్షితములు గనుక. ఇందువల్లనే సర్వజ్ఞడవైనను నన్ను రక్షించకపోతివి అని ఉపాలంభరూపమైన నింద కూడా ఇక్కడ వివక్షితముగాదు. సర్వజ్ఞుడవై సమర్థుడవగు నీవు దరిద్రుడవగు నన్ను కాపాడుటకు యోగ్యుడవు అని తన విజ్ఞాపనమే ప్రత్యుత వివక్షితమగుట వలన. నీవు చెప్పిన నింద ఇచట గమ్యమగుగాక— ఇలాగైనా నీవు సంతసించుము. అయితే 'సాధు దూతి పునః సాధు' అను పద్యమునందు సాధుకారిణీత్వమువలె ఈ పద్యమందు, సర్వజ్ఞత్వము అధీశ్వరత్వమున్ను విద్యుద్భంగుర ప్రతిభములు అని చెప్పుటకు వీలుగాదు. ఉపాలంభనరూపమగు నిందకు నను త్థాన మాపన్నము అగుటవలన; ప్రతీతి విరోధమువల్లను కూడా; అని ద్రవిడ పుంగవుడు ఏమి చెప్పెనని సహృదయులు విచారింపవలెను.

ఇది వ్యాజస్తుతి ప్రకరణము

## ఆక్షేపః

**అథా**క్షేపః- 'ఉపమేయస్యోపమానసంబంధిసకలప్రయోజననిష్పా దనక్షమత్వాదుపమానకై మర్థ్యముపమానాధిక్షేపరూపమాక్షేపః' ఇతి కేచిదాహుః. తన్మతే చేత్థముదాహరణం నిర్మాణీయమ్—

"అభూదప్రత్యూహః కుసుమశరకోదండమహిమా
విలీనో లోకానాం సహ నయనతాపోఽపి తిమిరైః.
తవాస్మిన్పీయూషం కిరతి పరితస్తన్వి వదనే
కుతో హేతోః శ్వేతో విధురయముదేతి ప్రతిదినమ్."

యథా వా—

"వసుధావలయపురందర విలసతి భవతః కరాంభోజే
చింతామణి కల్పద్రుమకామగవీభిః కృతం జగతి."

ఆద్యే ఉపమానప్రయోజననిష్పాదనం శాబ్దమ్, ద్వితీయే త్వార్థమితి భేదః.

అనంతర మాక్షేపము.

"ఉపమేయము ఉపమానగత సకల ప్రయోజన నిష్పాదన సమర్థ మగుటవలన ఉపమానము యొక్క కైమర్థ్యము ఉపమానాధిక్షేప రూపము ఆక్షేపము" అని కొందరు చెప్పుదురు. వారి మతమున నీ విధముగా ఉదాహరణమును నిర్మించవలెను.

"అభూదప్రత్యూహః" మొ. (మన్మథుని యొక్క వింటి మహిమ విఘ్నము లేనిదయ్యెను. లోకము యొక్క చీకట్లతో కూడా నయన తాపము కూడా విలీనమైనది. ఓ తన్వీ! నీ మొగము అమృతము నంతటనూ వెదజల్లు చుండగా ఏకారణమున తెల్లని చంద్రుడు ప్రతిదినమున ఉదయించు చున్నాడు?)

మరొకటి—

'వసుధావలయ' మొ. (భూమండలమునకు ఇంద్రుడా! నీ యొక్క కరాంబుజము ప్రకాశించుచుండగా చింతామణి కల్పతరువు కామధేనువు వీటిచే నేమిప్రయోజనము?)

మొదటిదానియందు ఉపమాన ప్రయోజన నిష్పాదనము శాబ్దము; రెండవదానియం దార్థము అని భేదము

అపరే తు — 'పూర్వోపన్యస్తస్యార్థస్య పక్షాంతరాలంబన ప్రయుక్తో నిషేధ ఆక్షేపః'. ఇత్యాహుః. తేషాం మతే ఇదముదాహరణీయమ్—

'సురాణామారామాదిహ ఝగితి ఝంఝానిలహతాః
పతేయుః శాఖీన్ద్రా యది తదఖిలో నందతి జనః.
కిమేభిర్వా కార్యం శివ శివ వివేకేన వికలై
శ్చిరం జీవన్నాస్తామధిధరణి దిల్లీనరపతిః.'

అత్ర కిమేభిరిత్యుత్తరార్ధేన పూర్వార్ధోక్తపక్షప్రతిక్షేపమాత్రం పక్షాంతరాలంబనేన క్రియతే. యథా వా—

"కిం నిఃశంకం శేషే శేషే వయసి త్వమాగతో మృత్యుః.
అథవా సుఖం శయీథా జననీ జాగర్తి జాహ్నవీ నికటే."

ఇతరులైతే — "పూర్వోపన్యస్తమగు నర్థమునకు పక్షాంతరాలంబన ప్రయుక్తమగు నిషేధమాక్షేపము" అని చెప్పుదురు. వారి మతమందు నిది యుదాహరింపదగినది.

"సురాణామ్" మొ. (దేవతల ఉద్యానవనము నుండి యీ లోకము నందు ఱటుక్కున ఝంఝానిలముచే దెబ్బతిన్న వైశాఖ శ్రేష్ఠములు పడిన యెడల యావత్తు జనమున్ను సంతోషించును. శివశివా! వివేకములేని యీ చెట్లవలన ఏమి ప్రయోజనము? డిల్లీపతి చిరకాలము జీవించుచు భూమినం దుండు గాక!)

ఇచట 'కిమేభిః' అని ఉత్తరార్ధముచేత పూర్వార్ధోక్త పక్షప్రతిక్షేప మాత్రము పక్షాంతరాలంబనముచేత చేయబడుచున్నది.

మరొకటి—

"కిం నిశ్శంకం" మొ. (నిశ్శంకముగా వయస్సు మిగిలి యుండగా శయనించెదవేమి? మృత్యువు దగ్గఱకువచ్చినది. అథవా సుఖముగా పడుకొనుము. తల్లి జాహ్నవి నీసమీపమున మేల్కొని యున్నది.)

అన్యే తు—

'—'నిషేధో వక్తుమిష్టస్య యో విశేషాభిధిత్సయా
వక్ష్యమాణోక్తవిషయః స ఆక్షేపో ద్విధా మతః'

విశేషం వ్యంగ్యరూపమర్థవిశేషం వక్తుం వివక్షితస్య ప్రకృతా

ర్థస్య నిషేధో నిషేధ సదృశః కథనాది ప్రత్యాఖ్యానరూపః. స వక్ష్యమాణవిషయ ఉక్తవిషయశ్చేతి ద్వివిధః" ఇత్యాహుః. తేషాం మతే ఇత్థముదాహార్యమ్.—

"రీతిం గిరామమృతవృష్టికిరాం త్వదీయాం
తాం చాకృతిం కృతివరైరభినందనీయామ్.
లోకోత్తరామథ కృతిం కరుణారసార్ద్రాం
జ్ఞాతుం న కస్యచిదుదేతి మనః ప్రసారః."

అత్ర కరిష్యమాణస్య మనః ప్రసారస్య నిషేధో వర్ణనీయస్యానిర్వాచ్యతాం బోధయితుమ్.

"శ్వాసోఽనుమానవేద్యః శీతాన్యంగాని నిశ్చలా దృష్టిః
తస్యాః సుభగ కథేయం తిష్ఠతు తావత్కథాంతరం కథయ"
ఇతరుత్రైతే—

"నిషేధో" మొ. (చెప్పదల్చుకొన్న దానికి విశేషము చెప్పు నిచ్ఛతో, నిషేధము ఆక్షేపాలంకారము. అది వక్ష్యమాణ విషయము, ఉక్తవిషయము అని రెండు విధములుగా నుండును.)

విశేషమును, వ్యంగ్య రూపమగు నర్థవిశేషమును జెప్పుటకై వివక్షితమగు ప్రకృతార్థమునకు నిషేధము. నిషేధసదృశము, కథనాది ప్రత్యాఖ్యాన రూపమైనది. అదియును చెప్పబోవునది విషయముగా గలది, చెప్పబడినది విషయముగాగలది అని రెండు విధములు" అని చెప్పుదురు. వారి మతములో నిట్లుదాహరణము-

'రీతిం' మొ (అమృత వృష్టిని వెదజల్లునట్టి నీ యొక్క మాటల రీతిని కవివరులచే అభినందింపదగిన ఆ ఆకృతిని లోకోత్తరమై కరుణారసార్ద్రమగు కృతినిన్ని తెలుసుకొనుటకు ఎవరికిని మనః ప్రసారము ఉదయించదు?)

ఇచట చేయబోవు మనః ప్రసారమునకు నిషేధము వర్ణనీయమునకు ననిర్వాచ్యత్వము దెలుపుటకు.

"శ్వాసోఽనుమాన వేద్యః"(నిట్టూర్పు అనుమానముచే తెలియదగినది. అవయవములు చల్లబడినవి. దృష్టి నిశ్చలమైనది. ఓ సుభగుడా! ఆమె యొక్క కథ ఇది ఉండనిమ్ము. మరియొకటి చెప్పుము.)

అలంకార సర్వస్వకారాదయస్తు—

"ప్రాకరణికస్యార్థస్య నిషేధోఽప్రతిష్ఠితత్వాదాభాసమాత్ర రూపః కస్యచిదర్థవిశేషస్య విధానం వ్యనక్తి స ఏకః. యశ్చాప్రాకరణికస్య విధిస్తాదృశ ఏవ సన్నిషేధే పర్యవస్యతి సోఽపర ఇత్యుభయ విధోఽప్యయమాక్షేపః.

తత్ర నిషేధాభాసరూప ఆక్షేపస్తావద్ ద్వివిధః-ఉక్తవిషయో వక్ష్యమాణవిషయశ్చేతి. ఉక్తవిషయోఽపి ద్వివిధః—క్వచిద్వస్తుమాత్ర నిషేధాత్ క్వచిద్వస్తు కథననిషేధాత్. వక్ష్యమాణవిషయస్తు వస్తు కథన నిషేధాత్మక ఏవ సామాన్యధర్మావచ్ఛిన్న ప్రతియోగితాకః శబ్దాత్సమర్ప్యమాణోఽపి విశేష రూపేష్టనిషేధాత్మనా స్థితో నిషిధ్యమానగతం విశేషాంతర మాధత్తే. సోఽపి ద్వివిధః—సామాన్యాశ్రయయత్కించిద్విశేషనిరూపణా నిరూపణాభ్యామ్.

తత్ర నిరూపితేషు యత్కించిద్విశేషేషు ప్రయోజనాభావాద ప్రవర్తమానో నిషేధో వక్ష్యమాణేష్టవిషయ ఏవ సంపద్యతే. అనిరూపితేషు తు సుతరామ్. చతుర్విధేఽప్యస్మిన్నాక్షేపే ఇష్టోఽర్థః, తస్య చ నిషేధః తస్యాప్యసత్యత్వమ్, అర్థగతవిశేషప్రతిపాదనం చేతి చతుష్టయముపయుజ్యతే. తేన నాత్ర నిషేధవిధిః, న వా విహిత నిషేధః, అపి తు నిషేధేనాసత్యేన విధేరాక్షిప్యమాణత్వాదన్వర్థాదాక్షేపః. స చ ప్రాగుక్తదిశా చతుర్విధః.

విధినా త్వసత్యేన నిషేధస్యాక్షేపే అపరోఽయమాక్షేపః. అత్రాపి అనిష్టోఽర్థః, తస్య విధిః, తస్యాప్యాభాసత్వమ్, అర్థగతవిశేష ప్రతిపాదనం చేతి చతుష్టయముపయుజ్యతే" ఇత్యాహుః.

అలంకార సర్వస్వకారాదులైతే—

ప్రాకరణిక మగు నర్థమునకు నిషేధము అప్రతిష్ఠమై ఆభాసమాత్ర రూప మగుచు నొక యర్థవిశేషరూపము యొక్క విధానమును వ్యక్తము జేయును; అది ఒకటి— ఏది యప్రాకరణి విధియైకమునకు అటువంటిదే అగుచు నిషేధమున పర్యవసించునో అది మరొకటి—ఈ రెండు విధములున్న ఆక్షేపము. అచట నిషేధాభాసరూపమగు నాక్షేపము రెండు విధములు. ఉక్తవిషయము, వక్ష్యమాణ విషయమని. ఉక్త-విషయమును రెండు

విధములు ఒక చోట వస్తుమాత్ర నిషేధముచేత, మరి యొకచో వస్తుకథన నిషేధమువలన. వక్ష్యమాణ విషయమైతే, వస్తుకథన నిషేధాత్మకమేను. సామాన్య ధర్మావచ్ఛిన్న ప్రతియోగితాకమై. శబ్దముచే సమర్పింప బడినదైనను విశిష్టరూపేష్ట నిషేధాత్మకముగా నిలచి నిషిధ్యమానమున నున్న విశేషాన్తరమును గూర్చును. అదియు రెండు రకములు: సామాన్యాశ్రయమగు యత్కించిద్విశేషము నిరూపణముచేతను, అనిరూపణము చేతను.

అచట నిరూపితములగు యత్కించిద్విశేషములందు ప్రయోజనాభావము వలన ప్రవర్తించకున్న నిషేధము వక్ష్యమాణేష్ట విషయమయియే సమకూరును. అనిరూపితములందు సుతరాం అగును. ఈ నాల్గు విధములు అయిన ఆక్షేపమునందు ఇష్టార్థము, తన్నిషేధము, తదసత్యత్వము అర్థగత విశేష ప్రతిపాదనమున్నూ అని నాల్గు విధములున్నూ ఉపయోగించును. దాని చేత నిచట నిషేధ విధి లేదు. విహిత నిషేధమున్నూ లేదు. అయితే అసత్యమైన నిషేధమువలన విధి ఆక్షిప్యమానమగుటవలన యోగార్థముబట్టి ఆక్షేపము. అదియు పూర్వము చెప్పిన రీతిగా నాల్గు విధములు. అసత్యమగు విధితో నిషేధాక్షేపమునందు, ఇది మరొక యాక్షేపము. ఇచట నర్థమనిష్టము, దానికి విధి, దానికా భాసత్వము, అర్థగతవిశేష ప్రతిపాదనమున్నూ అని నాల్గు విధములు ఉపయోగించును" అని చెప్పుదురు.

ఏతేషాం మతే చేత్థముదాహరణం నిర్మాణీయమ్——
'న వయం కవయస్తవ స్తవం
నృప కుర్వీమహి యన్మృపాతురమ్
రణసీమ్ని తవావలోకనే
తరుణార్కే దినకౌశికాయతే.'
'మాం పాహీతి విధిర్విధేయవిషయో వాచ్యః స్వతంత్రే కథం
నోపేక్ష్యో భవతాస్మి దీన ఇతి గీః శ్లాఘ్యా న సంఖ్యావతామ్.
ఏవం దోషవిచారణాకులతయా దేవ త్వయి ప్రోన్ముఖే
వక్తవ్యప్రతిభాదరిద్రమతయః కించిన్నహి బ్రూమహే.'
'రే ఖల తవ ఖలు చరితం విదుషామగ్రే వివిచ్య వక్ష్యామి.
అలమథవా పాపాత్మన్కృతయా కథయాపి తే హతయా.'

'శ్వాసోఽనుమానవేద్యః శీతాన్యంగాని నిశ్చలా దృష్టిః
తస్యాః కిం వా పృచ్ఛసి నిర్దయ తిష్ఠత్వసౌ హతా వార్తా.'

వీరల మతములో నిట్లుదాహరించవలెను.

"నవయం" మొ (ఓ రాజా! అసత్యమైనస్తుతిని చేయుటకు మేము కవులముకాము యుద్ధభూమియందు నిన్ను చూడగనే తరుణమైన సూర్యుడు పగటి గుడ్లగూబవలె యుండును )

"మాం పాహీతి" మొ (నన్ను కాపాడుము అను విధేయ విషయ మగు విధి స్వతంత్రుని ముందు ఎట్లు చెప్పుదుము? నీ చేత నేను ఉపేక్షింపదగిన వాడను గాను, దీనుడను, అను మాట విద్వాంసులుకు శ్లాఘింపదగినది గాదు. యీ తీరుగా దోషవిచారణచేత ఆకులు డగుటచే, ఓ ప్రభువా! నీవు ప్రోన్ముఖుడువుకాగా, చెప్పదగినదాని విషయములో ప్రతిభలేనట్టి బుద్ధిగలవారమై కొంచమున్ను మేము మాట్లాడలేము,)

"రే ఖల తవ" మొ. (ఓ ఖలుడా! నీ యొక్క చరిత్రము పండితుల యెదుట వివేచించిచెప్పుకునుస్తే అథవా చాలును; ఓ పాపాత్ముడా! నిన్ను గురించిన పాడుకథ చాలును )

'శ్వాసోఽనుమానవేద్యః' మొ. (శ్వాసము అనుమానముచే తెలుసుకొన దగినది. అవయవములు చల్లనైనవి; దృష్టి నిశ్చలమైనది. ఆమె విషయములో ఏమడిగెదవు! ఓ నిర్దయుడా! ఆ పాడుకథ నుండనిమ్ము )

తత్రాద్యపద్యే కవేరుక్తౌ కవిత్వనిషేధో బాధితో మిథ్యావాదిత్వనిషేధాత్మనా పర్యవస్యన్నుత్తరార్ధగతస్యార్థస్య సత్యత్వరూపం విశేషం వ్యనక్తి. ఏవం ద్వితీయపద్యే రక్షణదానయోః కథనస్యేష్టత్వాన్నిషేధో బాధితస్తయోర్వివక్షితత్వే పర్యవస్యన్నవశ్యానుష్ఠేయతామ్. తృతీయే ఖలసంబంధివృత్తాంతకథనత్వేన సామాన్యరూపేణ ప్రకృతపైశున్యాదివృత్తాంతకథనస్య వక్ష్యమాణస్య నిషేధః కథ్యమానస్తస్య చింతితదుఃఖప్రదతామ్. చతుర్థే కంచన తత్సంబధిన్యా వార్తాయా అంశం శ్వాసతానవాదికం కథయిత్వా క్రియమాణో నిషేధో వక్ష్యమాణమరణవార్తావిషయః సంస్తస్యా ముఖాదనిఃసరణీయతామ్. ఏషు నిషేధస్యాప్రతిష్ఠానాన్న విహిత నిషేధః, నాపి నిషేధ విధిః.

మొదటి పద్యమందు, కవి ఉక్తియందు, కవిత్వ నిషేధము బాధితమై మిథ్యావాదిత్వ నిషేధముగా బర్యవసించుచూ, నుత్తరార్ధగతమగు నర్థమునకు సత్యత్వరూపమగు విశేషమును తెలుపుచున్నది. ఈతీరుగా రెండవ పద్యమందు రక్షణదానముల కథనము ఇష్టమగుటచేత నిషేధము బాధితమై వాటిరెంటి వివక్షితత్వమున పర్యవసించుచు అవశ్యానుష్ఠేయత్వను వ్యక్తీకరించును. మూడదానియందు. ఖలసంబంధి వృత్తాంత కథనత్వముచేత, సామాన్యరూపముచేత, ప్రకృతమై ఖస్యాది వృత్తాంత కథనమునకు వక్ష్యమాణమునకు, నిషేధము కథ్యమానమై అది చింతిత దుఃఖప్రదమగుటను వ్యక్తీకరించును.

నాల్గవ దానిలో, తత్సంబంధి యగు వార్తయొక్క నంశమున నొకదానినైనను శ్వాసతానవము మొదలైనదానిని చెప్పి చేయబడుచున్న నిషేధము చెప్పబోవు మరణవార్త విషయ మగుచు దానికి ముఖమునుండి అనిస్సరణీయత్వమును వ్యక్తీకరించును. వీనియందు నిషేధము నిలువదు గనుక విహిత నిషేధమునుకాదు. నిషేధ విధియును గాదు.

"తపోనిధే కౌశిక రామచంద్రం
నినీషసే చేన్నయ కిం వికల్పైః.
నిరంతరాలోకన పుణ్యధన్యా
భవంతు వన్యా అపి జీవభాజః."

అత్ర పుత్రస్నేహాకులస్య దశరథస్య వాక్యే నయేతి విధిర్బాధితో మా నయేతి నిషేధే పర్యవసితోఽన్యథా తు మమ ప్రాణ-వియోగో భవిష్యతీత్యర్థం వ్యనక్తీతి విధ్యాభాసరూపోఽయమాక్షేపః. ఏవముదాహరణేషు స్థితేషు ప్రాచీనమతానుసారిణ్యాక్షేపోదాహరణాన్యేతేషాం మతేఽనుదాహరణాన్యేవ. ఇత్థం చ ప్రాథమిక మతసిద్ధ ఆక్షేపః ప్రతీపప్రభేదః. ద్వితీయమతసిద్ధస్తు విహిత నిషేధ ఏవ, న పునరాక్షేపః. తత్ర నిషేధస్యానాభాసరూపత్వాత్. ఇతి తదాశయః.

"తపోనిధే" మొ. (ఓ తపోనిధీ! విశ్వామిత్రుడా! రామచంద్రుని తీసుకొని పోవ దల్చుకొన్నయెడల తీసుకుపొమ్ము; సందేహమెందుకు? విడువకుండా శ్రీరాముని చూచెడు పుణ్యముచే ధన్యులుగా, వనమునందలి జీవులైనను అవుదురుగాక!)

ఇచట పుత్రస్నేహాకులుడగు దశరథుని వాక్యమందు, 'తీసుకొని వెళ్ళుము' అను విధి బాధితమై, "తీసుకుని వెళ్ళకు" అని నిషేధమందు పర్యవసితమైనదై, మరొక విధముగనైతే నా ప్రాణము వియోగము కానున్నది, అనునర్థము ప్రకటించగలదని విధ్యాభాసరూపమగు నాక్షేపము.

ఈ తీరుగా నుదాహరణములుండగా ప్రాచీన మతముననుసరించునట్టి యాక్షేపోదాహరణములు వీరి యొక్క మతమునందు ఉదాహరణలు గావు. ఇవ్విధముగా ప్రాథమిక మత సిద్ధమైన యాక్షేపము ప్రతీపభేదము ద్వితీయ మత సిద్ధమైతే విహిత నిషేధమే; ఆక్షేపముగాదు అచట నిషేధము అనాభాస రూపమగుటవలన అని వారి యభిప్రాయము.

ఇతరే తు—

"—'నిషేధమాత్రమాక్షేపః.'

చమత్కారిత్వం చాలంకారసామాన్యలక్షణప్రాప్తమేవ. తచ్చ వ్యంగ్యార్థే సతి సంభవతీతి. సవ్యంగ్యో నిషేధః సర్వోఽప్యాక్షేపాలంకారః. ఏవం చోపమేయకృతోపమానకైమర్థక్య పక్షాంతరాలంబనకృతప్రాచీనపక్షకైమర్థక్య విశేషప్రతిపాదనప్రయోజకోక్త వక్ష్యమాణకథనకైమర్థక్యానామనుపదోక్తనిషేధ విధ్యాభాసయోశ్చ సంగ్రహః" ఇత్యప్యాహుః.

ఇతరులైతే—

నిషేధమాత్ర మాక్షేపము. చమత్కారిత్వము అలంకార సామాన్య లక్షణ ప్రాప్తమేను; అదియును వ్యంగ్యార్థముండగా సంభవించునని. వ్యంగ్యము కలసిన నిషేధము అంతయు నాక్షేపాలంకారము:. ఇలాగ ఉపమేయ కృతమగు ఉపమాన కైమర్థక్యమునకును, పక్షాంతరాలంబన కృత ప్రాచీనపక్షకైమర్థక్యమునకును, విశేష ప్రతిపాదన ప్రయోజకోక్త వక్ష్యమాణ కథన కైమర్థక్యములకును, ననుపదోక్తములగు నిషేధ విధ్యాభ్యాసములకును సంగ్రహామనియు చెప్పుదురు.

అథాక్షేపధ్వనిస్తన్మతానుసారేణోదాహ్రియతే —

"త్వామవశ్యం సిసృక్షున్యః సృజతి స్మ కలాధరమ్
కిం వాచ్యం తస్య వై దుష్యం పురాణస్య మహామునేః"

అత్ర యేషాముపమానకైమర్థ్యమాక్షేపస్తేషాం త్వయి సతి కిం కలాధరేణేత్యంశమాదాయ, యేషాం చ నిషేధమాత్రమాక్షేప

స్తేషాం వృద్ధస్య బ్రహ్మణో వైదుష్యం నాస్తీత్యంశమాదాయ చ ధ్వనిః.

తరువాతను ఆక్షేప ధ్వని వారి మతానుసారమున నుదాహరింపబడు చున్నది.

"త్వామవశ్యం మొ. (నిన్ను తప్పకుండా సృష్టింపదలచుకొన్నవాడై ఎవడైతే చంద్రుని సృజించెనో ఆ పురాతనుడగు ముని యొక్క పాండిత్యము ఏమి చెప్పుదుము?;

ఎవరికి ఉపమానకైమర్థ్య మాక్షేపమో, వారికి 'నీవుండగా కలాధరుడెందుకు' అనే అంశము తీసుకొనియు ఎవరికి నిషేధము మాత్రమే నాక్షేపమో వారికి "ముసలివాడైన బ్రహ్మకు పాండిత్యములేదు" అనే అంశము తీసుకొనియును ధ్వని

నను కిం వాచ్యం తస్య వైదుష్యమితి వైదుష్యోక్తేః సబాధాయాః ఝటితి వైదుష్యాభావే పర్యవసానాత్, ఉపమానకైమర్థ్యస్యాపి ఝగిత్యేవ ప్రతీతేర్వాచ్యకల్పత్వాత్కథం నామ ధ్వనిత్వం స్యాదితి? నైష దోషః, బ్రహ్మణో హి త్వాం సిసృక్షుతః కరణపాటవసంపత్త్యర్థమాదౌ పాండులేఖవదిందుం నిర్మితవతః కిం వైదుష్యం వాచ్యమితి వైదుష్యోక్తిర్నిర్బాధత్వాదాదౌ సత్యాం విశ్రాంతౌ పశ్చాదవశ్యం పురాణస్యేత్యేతదర్థపర్యాలోచనేన వైదుష్యాభావచంద్రకైమర్థ్యయోః పర్యవసానమితి న ధ్వనిత్వస్ఖలనమ్.

అయ్యా "కిం వాచ్యం తస్య వైదుష్యం" అని వైదుష్యోక్తికి బాధతో గూడిన దానికి, వెంటనే పాండిత్యము లేకపోవుట యందు పర్యవసానము గనుక, ఉపమాన కైమర్థ్యమునకు గూడ వెంటనే ప్రతీతివలన వాచ్యముతో సమానత్వముగనుక ధ్వని యెట్లగును?

ఇది దోషముకాదు, బ్రహ్మ నిన్ను సృష్టింపదలచినపుడు కరణపాటవ సంపత్తి కొరకు మొదట పాండులేఖవలె చంద్రుని నిర్మించగా నేమి పాండిత్యము చెప్పవలసి యున్నది అని వైదుష్యోక్తి నిర్బాధము కనుక మొట్టమొదట విశ్రాంతి యుండగా తరువాత 'పురాణస్య' అనుదాని అర్థము పర్యాలోచించుటచే పాండిత్యాభావ చంద్రకైమర్థ్యములందు పర్యవసానము అని ధ్వనిత్వము స్ఖలితము కాలేదు.

యేషాం త్వాభాసరూప ఏవ నిషేధ ఆక్షేపస్తేషాం న ప్రాగుక్త ఆక్షేపధ్వనిః; అపి త్వయమ్ —

"త్వాం గీర్వాణగురుం సర్వే వదంతు కవయస్తు తే
సమానకక్ష స్తేనాసీత్యేషోఽర్థస్తు మతో మమ."

అత్ర కవేర్వాక్యే బాధితత్వాదాభాసరూపో నాహం కవిరితి నిషేధో గమ్యమానో మిథ్యావాదిత్వాభావరూపేణ పర్యవస్యన్నుత్తరార్ధస్య సత్యతారూపం విశేషం గమయతి.

ఎవరికైతే నాభాసరూపమైనదే నిషేధము ఆక్షేపమో వారికి జెప్పినది యాక్షేపధ్వనికాదు. కాని ఇది—

"త్వాం గీర్వాణగురుం" మొ. (నిన్ను గీర్వాణగురువుగా చెప్పనిండు; వారు కవులు. గురువుతో సమానకక్ష్యుడవు నీవైతివి అను అర్థము మాత్రము నాకిష్టమైనది.)

ఇచట కవి వాక్యమున బాధితమగుటవలన ఆభాసరూపమగు 'నేను కవిని గాను' అను నిషేధము గమ్యమానమై మిథ్యావాదిత్వము యొక్క నభావరూపముతో పర్యవసించుచు నుత్తరార్ధము యొక్క అర్థమునకు సత్యత్వ రూపమైన విశేషము నవగమింప జేయును.

ఇత్థం స్వస్వాభిమానభేదాదాక్షేపాణాం భేదాత్తద్ధ్వనీనాం స్థితే వివేకే.

"స వక్తుమఖిలాన్ శక్తో హయగ్రీవాశ్రితాన్ గుణాన్
యోఽంబుకుంభైః పరిచ్ఛేదం జ్ఞాతుం శక్తో మహోదధేః"

ఇతి పద్యం ధ్వనికారైరాక్షేపధ్వనిత్వేనోదాహృతమ్ 'స్వాభిమతాక్షేపానభివ్యక్తేరనుదాహరణమేవైతత్' ఇతి నిర్యుక్తికం వదన్నలంకారసర్వస్వకృత్పరాస్తః. న హ్యాభాసరూప ఏవ నిషేధ ఆక్షేప ఇత్యస్తి వేదస్యాజ్ఞా,నాపి ప్రాచామాచార్యాణామ్. న చాపి యుక్తిః యేన ధ్వనికారోక్తముపేక్ష్య త్వదుక్తం శ్రద్ధధీమహి. ప్రత్యుత వైపరీత్యమేవోచితమ్. ధ్వనికృతామాలంకారికసరణివ్యవస్థాపకత్వాత్. న హ్యస్మిన్ శాస్త్రే ఆక్షేపాదిశబ్ద సంకేతగ్రాహకం ప్రమాణాంతరమస్తి, ఋతే ప్రాచీనవచనేభ్యః. అన్యథా సకలవిపర్యాసాపత్తేః.

ఇలాగ స్వస్వాభిమాన భేదమువలన నాక్షేపముల భేదమువలన నాయా ధ్వనులకు వివేచనముండగా —

"స వక్తుం" మొ. (ఎవడైతే నీటి కడవలతో సముద్రపు ప్రమాణమును తెలుసుకొనశక్తుడో వాడు హయగ్రీవు నాశ్రయించునట్టి అన్ని గుణములను చెప్పుటకు సమర్థుడు.)

అను పద్యమును, ధ్వనికారులచేత నాక్షేప ధ్వనిగా నుదాహరింపబడిన దానిని, స్వాభిమతాక్షేపానభివ్యక్తిచే ఇది అనుదాహరణమే అని నిర్యుక్తికముగా జెప్పుచున్న నలంకార సర్వస్వకారుడు త్రోసివేయబడినాడు.

ఆభాసరూపమే అయిన నిషేధమాక్షేపము, అని వేదవాక్యము లేదు. ప్రాచీనుల యాజ్ఞయులేదు యుక్తియును లేదు. అది యున్న యెడల ధ్వని కారులు చెప్పిన దాని నుపేక్షించి నీ పలుకులే విశ్వసించెడివారము. ప్రత్యుత వైపరీత్యమే యుచితమైనది. ధ్వనికారులు ఆలంకారికుల మార్గమునకు వ్యవస్థాపకులు గనుక. ఈ శాస్త్రమునం దాక్షేపాది శబ్దముల యొక్క సంకేతమును గ్రహింపజేయునట్టి ప్రమాణాంతరము లేదు. ప్రాచీనుల మాటలే ఇట ప్రధానము: అలా గానియెడల సర్వము తాఱుమాఱై పోవును.

యత్తు —

"న రేంద్రమౌలే న వయం రాజసందేశహారిణః
జగత్కుటుంబిన స్తేఽద్య న శత్రుః కశ్చిదీక్ష్యతే."

ఇతి పద్యమలంకారసర్వస్వకారమతేనోదాహృత్యైతదుక్తం కువలయానందకృతా—'అత్ర సందేశహారిణాముక్తౌ న వయం' సందేశహారిణ ఇతి నిషేధోఽనుపపన్నః, సంధికాలోచితకైతవవచనపరిహారేణ యథార్థవాదిత్వే పర్యవస్యన్సర్వ జగతీపాలకస్య తవ న కశ్చిదపి శత్రుభావేనావలోకనీయః; కిం తు సర్వేఽపి రాజానో భృత్యభావేన సంరక్షణీయా ఇతి విశేషమాక్షిపతి' ఇతి. తన్న. త్వదుక్తస్య విశేషస్య నిషేధావ్యంగ్యత్వాత్. నహి 'న వయం రాజసందేశహారిణ' ఇత్యుక్తే 'తవ న కశ్చిదపి శత్రుభావేనావలోకనీయః, కిం తు సర్వేఽపి రాజానో భృత్యభావేన సంరక్షణీయా' ఇతి విశేషోఽవగమ్యతే. అవగమ్యతే చ జగత్కుటుంబిన ఇత్యాద్యుత్తరార్ధే ప్రయుక్తే. యో హి నిషేధమాత్రసామర్థ్యాక్షిప్తో విశేష స్తం నిషేధ ఆక్షిపతీతి యుక్తం వక్తుమ్, న తు పరకీయం విశేషమ్. తథా హి-రాజసందేశహారిణా ప్రయుక్తే 'న వయం రాజసందేశహారిణః' ఇతి వాక్యే స్వస్మిన్స్వనిషేధస్య

బాధా(ద్రాజసందేశహారిపదేన లక్షణయా రాజసందేశహారినిష్ఠకైతవవచన ప్రయోక్తృత్వాదిధర్మవంత ఉపస్థాప్యంతే. ప్రయోజనం చ తన్నిషేధే సతి స్వగతస్య సత్యవక్తృత్వాదేః, స్వవచనగతస్య సత్యత్వాదేర్వా ప్రత్యయః. అయమేవ చ విశేషస్యాక్షేపః. ఏవం స్థితే కిముచ్యతే తవ న కశ్చిదపి శత్రుభావేనేత్యాది?

ఏదైతే—

"నరేంద్రమౌళే" మొ. (ఓ రాజశ్రేష్ఠుడా మేము రాజు యొక్క కబురు తీసుకువచ్చిన వారముకాము. జగత్కుటుంబకుడగు నీకు యిక్కడ శత్రువు ఎవ్వడునూ కన్పడడు.)

ఈ పద్యము అలంకార సర్వస్వకారులమతాను సారముగా నుదాహరించి కువలయానందకారులు ఇట్లనిరి. "ఇచట సందేశహారుల వాక్యములో మేము సందేశహారులము కామని నిషేధము అనుపపన్నమై సంధికాలమునకు తగిన కపట వచనములను పరిహరించి యథార్థవాదిత్వమున పర్యవసించుచు, సర్వజగత్పాలకుడవగు నీకు ఒకడును శత్రుభావనచే చూడదగడు; ఇక నేమనగా రాజులందరును భృత్యభావముతో సంరక్షింపదగిన వారేను అని విశేషము నాక్షేపించును" అని. అదికాదు

నీవు చెప్పిన విశేషము నిషేధముచే వ్యంగ్యముకాదు గనుక, మేము రాజసందేశ హారులముగాము అని చెప్పగా, ఒకడును శత్రుభావముచే చూదదగిన వాడుకాడు; ఇక నేమనగా రాజులందరును భృత్యభావముతో సంరక్షింపదగిన వారే, అను విశేష మవగతము కాదుగదా? 'జగత్కుటుంబినః' అను ఉత్తరార్ధము ప్రయోగించగా నాయర్థము దెలియుచున్నది. ఏది నిషేధమాత్రము యొక్క సామర్థ్యముచేత నాక్షిప్తమగు విశేషమో దానిని నిషేధము ఆక్షేపించునని చెప్పదగియుండును. అంతియేకాని పరకీయమగు విశేషమును కాదు. చూడుడు—రాజసందేశ హారిచే ప్రయుక్తమగు "మేము రాజసందేశ హారులము గాము" అను వాక్యమునందు తనయందు తన నిషేధము బాధితము గనుక, రాజసందేశహారి పదముచే లక్షణచేత రాజసందేశహారి యందుండు కైతవ వచనములను ప్రయోగించువాడగుట మొదలగు ధర్మములు గలవారు ఉపస్థాపింపబడుదురు. వీనికి ప్రయోజనమును ఆ నిషేధముండగా, స్వగతమగు సత్యవక్తృత్వాదులకు గాని. తన మాటల

య౦దున్న సత్యత్వాదులకుగానీ ప్రత్యయ ముండుట ఇదియే విశేషము యొక్క నాక్షేపము ఇట్లా యుండగా— "నీ క ఎవరును శత్రుభావముతో జూడదగిన వాడు లేడు" ఇత్యాది విషయము చెప్పెద వేమి?

యది తు పూర్వోక్తాదేవ బాధాద్రాజపదస్య శత్రులక్షణయా న వయం శత్రుసందేశహారిణ ఇతి ప్రాప్తేనార్థేనాస్మత్స్వామినః శత్రవ ఏవ న భవంతి, కిం తు భృత్యభావేన పాలనీయా ఇతి విశేషోఽవగ మ్యత ఇత్యుచ్యతే, తదా తృతీయ కక్ష్యారూఢో నాస్మత్స్వామిన ఇతి నిషేధ ఆక్షేపః స్యాత్, న తదుత్థాపక స్త్వదుక్తో యథాశ్రుతనిషేధః, యది తు పరంపరయా యథాకథంచిద్విశేషోత్థాపకోఽప్యాక్షేప ఇత్యుచ్యతే, తథాపి 'సంధికాలోచితకైతవవచనపరిహారేణ యథార్థవాదిత్వే పర్యవస్యన్' ఇత్యాదేస్త్వద్వచనస్యాసంగతిరేవ. నహి యథార్థవాది త్వేన కేవలేన త్వదుక్తో విశేష ఆక్షేప్తుం శక్యతే, కింతూత్తరార్థే నాక్షిప్తః పరిపోష్టుమ్. తస్మాద్యత్ర త్వయా నిషేధస్య పర్యవసాన ముక్తం స ఏవ విశేష స్తస్యాక్షేప్యః, న తు విశేషాన్తరమ్ అత ఏవ "—'బాలక నాహం దూతీ—'ఇత్యత్ర దూతీత్వస్య వస్తునో నిషేధేన వస్తువాదిత్వాదిర్విశేషో వ్యజ్యతే" ఇత్యలంకారసర్వస్వకృతోక్తం సంగచ్ఛతే.

ఇతి రసగంగాధరే ఆక్షేపప్రకరణమ్

అయితే— పూర్వోక్తమగు బాధవలననే రాజపదమునకు శత్రులక్షణచే మేము రాజసందేశహారులము కాము అని ప్రాప్తమగు నర్థముచే మా ప్రభువునకు శత్రువులేలేరు. ఇక నేమనగా భృత్యభావముతో పాలింపదగినవారు, అను విశేష మవగత మగుచున్నది— అని చెప్పిన యెడల అప్పుడు 'నాస్మత్స్వామినః' ఇత్యాది నిషేధము తృతీయ కక్షనధిరోహించిన ఆక్షేపమగును; అంతేకాని తదుత్థాపకమగు త్వదుక్తమైన యథాశ్రుత నిషేధముగాదు. అయితే— పరంపరగా యథాకథంచిత్ విశేషోత్థాపకము కూడా ఆక్షేపము అని చెప్పబడినచో అయినను సంధికాలమున దగిన కపట వాక్యములను పరిహరించి యథార్థమును చెప్పుటయందే పర్యవసించు- ఇత్యాదియగు నీ వచనమునకు అసంగతియే అగును. కేవల యథార్థవాదిత్వముచే నీవు చెప్పిన విశేష మాక్షేపించుటకు వీలుగాదు కదా? ఇక నేమనగా— ఉత్తరార్థముచే నా

క్షేపింపబడినది పరిపోషించుటకు నగును ఆందువలన ఎక్కడ నీవు నిషేధమునకు పర్యవసానము చెప్పితివో ఆ విశేషమే దాని కాక్షేప్యము; విశేషాంతరముకాదు. అందువలననే—"బాలక నాహం దూతీ" అనుచోట "దూతీత్వాది విశేషము వ్యంగ్యమగుచున్నది" అని అలంకార సర్వస్వకారులు చెప్పినది సంగతమగుచున్నది

ఇది ఆక్షేపాలంకార ప్రకరణము

## విరోధః

అథ విరోధమూలాలంకారాః —

ఏకాధికరణసంబద్ధత్వేన ప్రతిపాదితయోరర్థయోర్భాసమానైకాధికరణాసంబద్ధత్వమ్, ఏకాధికరణాసంబద్ధత్వభానం వా విరోధః. యద్వా - ఏకాధికరణాసంబద్ధత్వేన ప్రసిద్ధయో రేకాధికరణసంబద్ధత్వేన ప్రతిపాదనం సః.

స చ ప్రరూఢోఽప్రరూఢశ్చ. ప్రరోహశ్చ బాధబుధ్యనభిభూతత్వమ్. తద్వైపరీత్యమప్రరోహః. తత్రాద్యో దోషస్య విషయః, ద్వితీయశ్చాలంకారస్య. అత ఏవేమం విరోధాభాసమాచక్షతే. ఆ ఈషద్ భాసతే ఇత్యాభాసః. విరోధశ్చాసావాభాసశ్చేతి. ఆముఖ ఏవ ప్రతీయమానో ఝగితి జాయమానావిరోధబుద్ధితిరస్కృత ఇతియావత్. తత్రాపి కార్యకారణాదిబుధ్యనాలీఢో విరోధాభాసో విరోధాలకారః. తద్వాలీఢస్తు విభావనాదిర్వక్ష్యమాణః.

అస్య చ జాతి గుణ క్రియా ద్రవ్యాణాం పదార్థానాం మధ్యే జాతేర్జాతిగుణక్రియాద్రవ్యైః, గుణస్య గుణక్రియాద్రవ్యైః, క్రియాయాః క్రియాద్రవ్యాభ్యామ్, ద్రవ్యస్య ద్రవ్యేణేత్యపునరుక్తా దశభేదాః.

క్రియా చాత్ర న వైయాకరణానామివ శుద్ధా భావనా. నాపి నైయాయికానామివ స్పందరూపా. కిం తు తత్తద్ధాతువాచ్యా విశిష్టవ్యాపారరూపా.

**అనంతరము విరోధమూలాలంకారములు:-**

**'ఏకాధికరణముతో సంబద్ధ' మగునట్లుగా ప్రతిపాదితము లగు నర్థములకు, ప్రకాశించు నేకాధికరణముతో నసంబంద్ధత్వము కానీ, ఏకాధికరణా**

సంబద్ధత్వ భానముగానీ, విరోధము. లేక—ఏకాధికరణముతోనసంబద్ధములుగా ప్రసిద్ధములకు ఏకాధికరణముతో సంబంధించినట్లుగా ప్రతిపాదనము విరోధము. అదియు ప్రరూఢము, అప్రరూఢమున్ను ప్రరోహమనగా బాధ బుద్ధిచే నభిభూతముగాకుండుట తద్వైపరీత్యము అప్రరోహము। అచట మొదటిది దోషమునకు విషయము రెండవది యలంకారమునకు. అందువలననే దీనిని విరోధాభాసమందురు.

విరోధాభాసమనగా ఆముఖమునందే ప్రతీయమానమై ఝటితి పుట్టుచున్న అవిరోధబుద్ధిచేత తిరస్కరింపబడ్డది అని తాత్పర్యము - అచటనున్న కార్య కారణాది బుద్ధిచేత ననాలీఢమైన విరోధాభాసము విరోధాలంకారము. తదాలీఢమైతే విభావనాదులు వక్ష్యమాణములు. దీనికి జాతి గుణక్రియా ద్రవ్యములకు, పదార్థములకు, నడుమ జాతికి జాతిగుణక్రియా ద్రవ్యములతోడను, గుణమునకు గుణక్రియా ద్రవ్యములతోడను, క్రియకు క్రియాద్రవ్యములతోడను. ద్రవ్యమునకు. ద్రవ్యముతోను అని అపునరుక్తములగు పదిభేదములు.

ఇక్కడ క్రియ వైయాకరణులకువలె శుద్ధమగు భావన కాదు నైయాయికులకు వలె స్పందరూపమైనది కాదు.

ఇకనేమనగా- నాయాధాతువుచే వాచ్యమైన విశిష్టవ్యాపారరూపమైనది.

ఉదాహరణమ్ —

"కుసుమాని శరా మృణాలజాలాన్యపి కాలాయసకర్కశాన్యభూవన్
సుదృశో దహనాయతే స్మ రాకా భవనాకాశమథాభవత్పయోధిః"

అత్ర పురః స్ఫురన్నపి జాత్యాదీనాం విరోధో విరహిణీదుఃఖ జనకత్వవిమర్శనా న్నివర్తతే.

'త్వయి దృష్టే త్వయా దృష్టే భవంతి జగతీతలే
మహాంతో వ్యణవో రాజన్నణవశ్చ మహత్తరాః'
'ఖలానాముక్తయో హంత కోమలాః శీతలా అపి
హృదయానీహ సాధూనాం ఛిందంత్యథ దహంతి చ'
'విచారితే మహిమని త్వదీయే నిత్యనిర్మలే
పరమాత్మన్ గగనమప్యాధత్తే పరమాణుతామ్.'

'హర్షయంతి క్షణాదేవ క్షణాదేవ దహంతి చ
యూనః స్మరపరాధీనాన్నిర్దయా హంత యోషితః.'
'కాంతారే విలపంతీనాం త్వదరాతిమృగీదృశామ్
దేవనాని సమాకర్ణ్య హరిద్భిరపి చుక్షుభే.'
ఇత్యాది స్వయమూహ్యామ్.

ఉదాహరణము-

"కుసుమాని" మొ. (పుష్పములు బాణములైనవి, తామరకాడల తుంపురులున్ను నల్లనియినుమువలెనే కఠినములైనవి ఆ స్త్రీకి పున్నమ అగ్ని అయ్యెను. గృహావకాశమంతయు సముద్రమయ్యెను).

ఇచట మొదట స్ఫురించుచున్నను జాత్యాదులవిరోధము విరహిణీ దుఃఖజనకత్వ విమర్శవలన నివర్తించుచున్నది.

"త్వయి" మొ. (నీవు కన్పడగా, నీచే చూడబడగా, భూమియందు మహత్తరములు అణువు లగుచున్నవి అణువులున్ను మహత్తరము లగు చున్నవి)

"ఖలానాం" మొ. (ఖలుల యొక్క మాటలు, అయ్యో! కోమలములు శీతలములు అయ్యును సాధువుల హృదయములను భేదించును దహించును కూడాను)

"విచారితే మొ. (నిత్యనిర్మలమగు నీమహిమను విచారించగా, ఓ పర మాత్మా! గగనమైనను పరమాణుత్వము ధరించును)

"హర్షయంతి" మొ. (క్షణకాలమైన సంతోషింప చేయుదురు, క్షణ కాలమున దహించెదరు స్మరపరాధీనులగు యువకులను నిర్దయలైన స్త్రీలు అలా చేతురు)

"కాంతారే" మొ. (కాంతారమునందు రోదించునట్టి నీ శత్రుస్త్రీల యొక్క రోదనము విని దిక్కులు కూడా క్షోభనొందెను)

ఇత్యాదులు స్వయమూహ్యములు-

అత్ర జాత్యాదిరితి ధర్మమాత్రం వివక్షితమ్, ఉపలక్షణపరత్వాత్. తేన 'యః కిల బాలకోఽపి పురాణపురుషః', 'విశుద్ధమూర్తిరపి నీలాం బుదనిభః', 'జగద్ధితకృదపి జగదహితకృత్', 'అగోద్ధారకోఽపి నాగో

ద్ధారకః', ఇత్యాదౌ సఖండోపాధేరభావస్య చ పరిగ్రహః. వస్తుతో జాత్యాదిభేదానామహృద్యత్వాచ్ఛుద్ధత్వశ్లేషమూలత్వాభ్యాం ద్వివిధో జ్ఞేయః. నను 'హితకృదప్యహితకృత్', 'అగోద్ధారకోఽపి నాగోద్ధారకః, ఇత్యాదౌ విరోధస్య ప్రతిభామాత్రమ్, శ్లేష ఏవ త్వలంకారః. తస్య స్వవిషయే ప్రాయశః సర్వాలంకారాపవాదకత్వాదితి చేత్, కవిః శృణోతి.

ఇచట జాత్యాదులు అని ధర్మమాత్రము. వివక్షితము ఉపలక్షణపరము గనుక—అందుచేత.

'యః కిల' మొ. (ఎవడు చిన్నవాడైనను పురాణపురుషుడో, విశుద్ధరూపుకలవాడైననూ నల్లనివాడో, జగత్తునకు హితకృత్ అయినను జగత్తుకు అహితకృత్తో, అగోద్ధారకుడైనను నాగోద్ధారకుడో)

ఇత్యాదుల యందు సఖండోపాధికిని, నభావమునకును పరిగ్రహము. వస్తుతః జాత్యాదిభేదములు అహృద్యములు కనుక శుద్ధత్వ శ్లేషమూలత్వముల చేత రెండు విధములుగా తెలియదగినది.

అయ్యా- 'హితకృదపి-అహితకృత్' 'అగోద్ధారకోపి నాగోద్ధారకః' ఇత్యాదులందు విరోధమునకు ప్రతిభామాత్రమే; శ్లేషమేయలంకారము. అది స్వవిషయమునందు తరచుగా సర్వాలంకారముల కపవాదము గనుక అనిన యెడల కవి వినుచున్నాడు!

ఇదం తు బోధ్యమ్ - యత్రాపిశబ్దాదిర్విరోధస్య ద్యోతకస్తత్ర విరోధః శాబ్దః, అన్యత్ర త్వార్థ ఇతి తావత్ప్రాచాం సిద్ధాంతః. తత్ర శాబ్దత్వం శబ్దకరణకప్రతీతిగోచరత్వం విరోధస్య న ఘటతే 'త్రయోఽప్యత్రయః' ఇత్యాదౌ నియతేషు విశేషణవిశేష్య సంసర్గేషు విరోధస్య కుత్రాప్యసమావేశాత్. న చ తదధికరణావృత్తిత్వమివ తత్ప్రతియోగికత్వమపి విరోధః: తథా చ ప్రకృతే నఞర్థోత్తరపదార్థయోః ప్రతియోగిత్వస్య సంసర్గత్వాత్సంసర్గ ఏవ విరోధస్య సమావేశ ఇతి వాచ్యమ్.

'సుప్తోఽపి ప్రబుద్ధః' ఇత్యాదౌ తథాప్యసమావేశాత్. నహి సుప్తః 'సుప్తత్వవిరుద్ధప్రబుద్ధత్వవదభిన్న" ఇతి శాబ్దధీరనుభవసిద్ధా, యేన లక్షణాదికుస్పృష్టా యతేమహి. అత్రాహుః-'సుప్తోఽపి ప్రబుద్ధః', 'త్రయోఽప్యత్రయః'ఇత్యాదిషు విరోధోదాహరణేషు శబ్దద్వయేనశయి

తత్వజాగరితత్వాదిధర్మద్వయస్యాదావుపస్థితౌ సంబంధిజ్ఞానాదపిశబ్దసా చివ్యాత్తద్గతో విరోధోఽపి స్మర్యతే. అనంతరం చ ప్రతిబంధకజ్ఞాన సామగ్ర్యా బలవత్త్వాద్విరుద్ధావిమౌ ధర్మావితి మానసే వైయంజనికే వా విరోధబోధే జాతే తేన ప్రతిరోధాచ్ఛయితజాగరితయోరభేద బుద్ధేరనుత్పాదాద్ ద్వితీయశక్త్యా ప్రాదుర్భావితం ద్వితీయార్థమాదా యాన్వయబోధః, న తు విరుద్ధార్థమ్. విరోధధీశ్చ శిథిలమూలా నివర్తమానాపి కవిసంరభగోచరతయా చమత్కారకారణమితి ప్రాచాం నిష్కర్షః.

ఇది తెలియవలసినది—

ఎక్కడనైతే శబ్దాదులు విరోధమునకు ద్యోతకములో, అక్కడ విరోధము శాబ్దము, అన్యస్థలములందు నార్థము అని ప్రాచీనుల సిద్ధాంతము. అక్కడ శాబ్దత్వము, శబ్దకరణమగు ప్రతీతికి గోచరమగుట, విరోధమునకు కుదురదు. "త్రయోఽప్యత్రయః" ఇత్యాదులందు నియతములగు విశేషణ విశేష్య సంసర్గములందు, విరోధము ఎక్కడను సమావేశము కాదు కనుక. "తదధికరణమునందు ఉండక పోవుటవలె తత్ప్రతియోగికత్వమున్ను విరోధము: అలాకాగా-ప్రకృతమున నఞర్థమునకు నుత్తర పదార్థమునకును ప్రతియోగిత్వము సంసర్గము గనుక సంసర్గమునందే విరోధమునకు సమావేశ ము" అని అనరాదు. 'సుప్తోఽపి ప్రబుద్ధః' ఇత్యాదులయందు అలాగైనను సమావేశము లేకపోవుటవలన, సుప్తుడు సుప్తత్వ విరుద్ధమగు ప్రబుద్ధత్వము కల వారితో నభిన్నుడు అను శాబ్దజ్ఞానము అనుభవసిద్ధముగాదుగదా. అట్లైనచో లక్షణాదుల కుసృష్టిలో యత్నించెడివారము.

ఇచట చెప్పుదురు 'సుప్తోఽపి ప్రబుద్ధః' 'త్రయోఽపి అత్రయః" ఇత్యాదులందు, విరోధోదాహరణములందు శబ్దద్వయముచే శయితత్వము, జాగరితత్వము, మొదలగు ధర్మద్వయములు మొదట నుపస్థితములుకాగా, సంబంధిజ్ఞానమువలన 'అపి' శబ్ద సహాయముచే తద్గతమగు విరోధమున్ను స్మరింపబడును. అనంతరమున ప్రతిబంధకజ్ఞాన సామగ్రిబలవంతమగుట వలన "విరుద్ధములు ఈ రెండు ధర్మములు' అని మానసికము.గాని వైయంజనికము గానీ, అగు విరోధబోధ కలుగగా దానిచేత ప్రతిరోధమువలన, పండుకొను వారికిని, మేల్కొనువారికిని, అభేదబుద్ధి గలుగక పోవుటవలన ద్వితీయశక్తిచే

బుట్టింపబడిన రెండవ యర్థమును తీసుకొని అన్వయబోధ గాంచగును విరుద్ధార్థమునుగాదు విరోధబుద్ధియున్ను శిథిలమై మురణించున్నను కవిసంరంభ గోచరమగుటచేత చమత్కారమునకు కారణమని ప్రాచీనుల నిష్కర్షము

నవ్యాస్తు — 'అర్థద్వయప్రాదుర్భావం వినా విరోధాభాస ఏవ న సంభవతి. తత్రై కో విరోధస్యోల్లాసకః ద్వితీయశ్చాన్వయబోధ విషయ ఇతి తత్సత్యమ్. పరం తు అన్వయబోధవిషయే ద్వితీయార్థే విరోధోల్లాసకోఽప్యర్థో భేదేఽపి శ్లేషభిత్తికాభేదాధ్యవసాయ ఇత్యుక్త దిశా అభిన్నతయా భాసతే. ఏవం చావిరుద్ధం ద్వితీయార్థమాదాయాన్వయబోధే సత్యపి స్వోత్పాదీభూతస్య విరుద్ధార్థస్య నిఃశేషతయా నివృత్తేరభావాదర్ధమృతః శ్వసన్నివ విరోధోఽపి మానసం బోధాంతర మారోహతి. అత ఏవ చమత్కారీత్యుచ్యతే. నహి నిఃశేషతయా నివృత్తశ్చమత్కారం జనయితుమీష్టే. న చాంతరేణ చమత్కార జనకతామలంకారో భవతి. తస్మాద్విరోధధియో నాతీవశిథిలమూలత్వమ్, నాపి చాత్యంతికీ నివృత్తిః' ఇత్యాహుః —

నవీనులైతే—

రెండర్థముల ప్రాదుర్భావము లేకుండా విరోధాభాసమే సంభవించదు. అందులో నొకటి విరోధమునకు ఉల్లాసకము, రెండవదియు నన్వయబోధవిషయ మని సత్యము. కాని అన్వయబోధవిషయమగు ద్వితీయార్థమునందు విరోధోల్లాసకమైన అర్థముకూడ. భేదమున్నను శ్లేషభిత్తికా భేదాధ్యవసాయము అని చెప్పినరీతిగా నభిన్నముగా భాసించును. ఈతీరుగా నవిరుద్ధమగు ద్వితీయార్థము తీసుకొని అన్వయబోధగల్గినను జనకస్థానమైన విరుద్ధార్థమునకు నిశ్శేషముగా నివృత్తత్వము లేకపోవుటవలన సగము చచ్చినదై ఊపిరివిడుచు చున్నదానివలె విరోధమున్ను మానసమగు బోధాంతరము నారోహించును ఇందువలననే చమత్కారి యని చెప్పబడును. నిశ్శేషముగా నివృత్తమైనది చమత్కారము గల్గించుటకు సమర్థము గాదుగదా? చమత్కార జనకత్వము లేకుండా నలంకారము కాదుకదా? అందువలన విరోధజ్ఞానమునకు మిక్కిలిగా శిథిలమూలత్వములేదు. ఆత్యంతికమగు నివృత్తియును లేదు" అని చెప్పుదురు.

నను అపిశబ్దాదీనాం ప్రయోగే శాబ్దో విరోధో భాసత ఇతి తథాప్యసంగతమ్. నిపాతానాం శాబ్దికనయే శక్తేరస్వీకారాదితి చేత్,

న. నిరూఢలక్షణాయా ఇవ నిరూఢద్యోతనాయా అపి శక్తిసమ కక్షత్వాత్ .

అయ్యా,

అపి శబ్దాదుల ప్రయోగమునందు శాబ్దముగ విరోధము ప్రకాశించు ననుట అసంగతమే. నిపాతములు శాబ్దికమతమునందు శక్తిస్వీకరింపలేదు కనుక; అని అన్నచో సరి సరి గాదు, నిరూఢ లక్షణవలె నిరూఢద్యోతనమున్ను శక్తితో సమానత్వముకున్నది గనుక.

అథ జాత్యోర్ద్రవ్యయోశ్చ విరోధోఽలంకారో న భవితుమీష్టే. 'కుసుమాని శరాశ్చంద్రో వాడవో దుఃఖితే హృది' ఇత్యాదావారోప మూలస్య రూపకస్యైవోల్లాసాత్ . యది చ సత్యప్యారోపే విరోధా భాస ఉచ్యతే, ఉచ్యతాం తర్హి 'ముఖం చంద్రః' ఇత్యత్రాపి స ఏవ. న చ రూపకవిషయస్య సర్వస్యాపి విరోధేనాక్రాంతత్వాన్నిర్విషయ త్వాపత్త్యా స్వవిషయే రూపకం విరోధస్య గుణాదౌ సావకాశస్యాప వాద ఇతి వాచ్యమ్. 'కుసుమాని శరాః' 'మృణాలవలయాది దవ దహనరాశిః, 'చంద్రోవాడవః' 'శంకరచూడాపగా కాలిందీ' ఇత్యాదౌ త్వదభీష్టవిరోధస్యాసిద్ధిప్రసంగాదితి చేత్, సత్యమ్. ఇహ హి అలంకారవర్గే యో యత్ర సహృదయచమత్కృతి పథమవతరతి స ఏవ తత్రాలంకార ఇతి నిర్వివాదమ్. ఏవం చ రూపకే 'ముఖం చంద్రః' ఇత్యాదౌ యద్యప్యస్తి విరోధస్తథాపి న స తత్ర ప్రతిపిపాదయిషితః. అపి తు చంద్రనిష్ఠాహ్లాదకత్వాదిసకలగుణానాం ముఖే ప్రతిపత్త్యర్థం చంద్రాభేద ఏవేతి స చమత్కారీ, న విరోధః. ప్రత్యుత సన్నపి విరోధో వివక్షితార్థాననుగుణత్వానుదూషిత ఇతి నాలంకారః, విద్యమానతాయా అకించిత్కరత్వాత్. 'కుసుమాని శరాః' ఇత్యాదౌ తు విరహిణ్యాదీనామవస్థాయా అత్యద్భుతత్వస్య వివక్షితత్వాత్తదానుగుణ్యాంతర్గర్భితోఽప్యార్థో విరోధః సముల్లసతీతి స ఏవాలంకారః. న చైవమపి రూపకస్థలే విరోధోఽవివక్షితత్వాన్మా నామాభూదలంకారః, విరోధస్థలే తు 'కుసుమాని శరాః' ఇత్యాదౌ విరోధోత్థాపనార్థమభేదస్యావశ్యం వివక్షణీయత్వాద్రూపకాపత్తిరితి వాచ్యమ్. విరోధవివక్షానాలింగితత్వస్య రూపకలక్షణే నివేశ్యత్వాత్ .

అయితే.

జాత్యాదులకున్ను ద్రవ్యములకున్ను విరోధము అలంకారమగుటకుః శక్తి లేదు. "కుసుమాని" ఇత్యాదులయందారోపమూలమగు రూపకమే ఉల్ల సించుటవలన. ఆరోపమున్నను విరోధాభాసము చెప్పవచ్చో అయితే 'ముఖం చంద్రః' అనుచోటను అదియే చెప్పండి. అయితే రూపక విషయమంతయును, విరోధముచే నాక్రమించ బడుటవలన నిర్విషయత్వాపత్తిచే స్వవిషయము నందు రూపకము గుణాగులలో సాపకాశమగు విరోధమునకు నపవాదమని అందురా ? 'కుసుమాని శరాః'-'మృణాలవలయాది దవదహనరాశిః' 'చంద్రో బాడబః' 'శంకరచూడాపగా కాళిందీ' ఇత్యాదులందైతే నీయభీష్టమగు విరోధము సిద్ధించదే-అన్నచో సత్యము. ఇక్కడనైతే, అలంకార సమూహ ములోనేది ఎక్కడ సహృదయులకు చమత్కృతి మార్గమున నవత రించునో, నదియే నక్కడ నలంకారమని నిర్వివాదము. ఈ తీరుగా రూపకము నందు 'ముఖంచంద్రః' ఇత్యాదియందు, విచారించగా విరోధమున్నను అది అక్కడ ప్రతిపాదింపదలచినది గాదు. ఇకనేమంటే చంద్రుని యందున్న నాహ్లాదకత్వాది సకలగుణములకు ముఖమున బోధగలుగుటకై చంద్రా భేదమేనని అది చమత్కరించును; విరోధముగాదు ప్రత్యుత విరోధమున్నను వివక్షితార్థమునకు ననుగుణము కాకపోవుటవలన దూషింపబడినది అని అలం కారముగాదు. విద్యమానత అకించిత్కరము కనుక. 'కుసుమాని శరాః'ఇత్యా దులందైతే విరహిణ్యాదుల యవస్థకు నత్యద్భుతత్వము వివక్షిత మగుటవలన తదానుగుణ్యముకొరకు నంతర్గర్భితమైనను అర్థమగు విరోధ ముల్లసించునని అదియే నలంకారము.

ఈలాగైనను రూపక స్థలమునందు విరోధము అవివక్షితము గనుక నలంకారము కాకపోనీ; విరోధ స్థలమునందైతే 'కుసుమాని శరాః' ఇత్యాదు లందు విరోధోత్థాపనకై అవశ్యముగా నభేదము వివక్షణీయము గనుక రూపక మచట నాపాదింపవలయునే యనినచో-విరోధ విపక్షచే అనాలింగితత్వము, విశేషణము, రూపకలక్షణమున వేయవలెను గనుక

యద్వా అభేదస్యాత్ర విరోధోత్థాపనార్థముపాత్తస్యాచమ- రిత్వాద్రూపకాలంకారత్వమయుక్తమ్. తత్తదలంకారలక్షణేషు అలం కారసామాన్యలక్షణే వా చమత్కారిత్వ స్యోక్తత్వాత్. యది తు

విరహిణ్యాద్యవస్థాయా అత్యద్భుతత్వాది న వివక్షితమప్యర్థశ్చ న గర్భీకృతః, కిం తు పీడాజనకత్వ శ్యామత్వాద్యతిశయమాత్రం వివక్ష్యతే, తదాత్ర రూపకమేవ. యది వా నగరవిశేషస్థితేరద్భుతత్వవివక్షయా యత్ర హి నారీణాం ముఖం చంద్ర ఇత్యుచ్యతే, తదా విరోధాభాస ఏవేతి ధ్యేయమ్.

యద్వా-అభేదము, ఇక్కడ విరోధము లేవదీయుటకై స్వీకరింపబడినది, చమత్కారి కాదు కనుక రూపకాలంకారత్వ మయుక్తము. ఆయా అలంకార లక్షణమందుగాని, అలంకార సామాన్య లక్షణమందుగాని, చమత్కారిత్వము చెప్పబడినది గను. అయితే- విరహిణ్యాదుల యవస్థకు అత్యద్భుతత్వాదులు వివక్షితముకాక, అప్యర్థమున్ను గర్భితముకాక, పీడాజనకత్వ శ్యామత్వాద్యతిశయ మాత్రము వివక్షింపబడినదగుచో, అప్పుడు ఇచట రూపకమే. నగర విశేషస్థితికి అద్భుతత్వ వివక్షచే నెచటనైతే స్త్రీల మొగము చంద్రుడని చెప్పబడునో, అప్పుడు విరోధాభాసమే నని గ్రహింపవలెను.

నను 'సుప్తోఽపి ప్రబుద్ధః' ఇత్యాదౌ యథైకేనార్థేన విరోధస్యోత్థాపనమపరేణ చ నివృత్తిః, ఏవమ్ 'గంగాయాం ఘోషః' 'మంచాః క్రోశంతి', 'కుంతాః ప్రవిశంతి' ఇత్యాదావపి శక్యేన తస్యోత్థాపనం లక్ష్యేణ చ నివృత్తిరితి విరోధాభాసప్రసంగః. న చ దృష్టాంతే విరోధోత్థాపక నివర్తకయోరర్థయోః శక్త్యైవోపస్థితిః, దార్ష్టాంతికే తు పృథగ్వృత్త్యేతి వైలక్షణ్యమితి వాచ్యమ్. సత్యపి వైలక్షణ్యే త్వదుక్తవిరోధాభాసలక్షణాతిప్రసంగస్యానివారణాత్. న హి లక్షణే విరోధోత్థాపక నివర్తకయోరేకవృత్తివేద్యత్వమేకజాతీయవృత్తివేద్యత్వం వా వివక్షితమ్. తథా సతి 'కుసుమాని శరాః' ఇత్యాదౌ ప్రాచీనరీత్యావ్యాప్తిప్రసంగాదితి చేత్, విరోధస్యాత్ర ప్రతిభానేఽపి కవిసంరంభాగోచరత్వేనాచమత్కారిత్వాత్.

అయ్యా- 'సుప్తోఽపి ప్రబుద్ధః' ఇత్యాదులందు ఒక యర్థముచే విరోధమునకుత్థాపనము, మరొకదానిచే నివృత్తియు నెట్లో, అలాగే "గంగాయాం ఘోషః'- 'మంచాః క్రోశంతి' - 'కుంతాః ప్రవిశంతి' ఇత్యాదులందు శక్యార్థముచే దాని యొక్కుత్థానము, లక్షణచేత నివృత్తియని, విరోధా

భాసమేర్పడును. అయితే- దృష్టాంతమునందు విరోధోత్థాపక నివర్తకము లగు నర్థములు రెండును శక్తిచేతనే యుపస్థితములు, దార్ష్టాంతికమునం దన్ననో వేరువృత్తిచేతనని వైలక్షణ్యము అన్నచో, వైలక్షణ్యమున్నను నీవు చెప్పిన విరోధాభాసము లక్షణము యొక్క అతిప్రసంగము వారింపబడలేదు కదా? లక్షణమునందు విరోధోత్థాపక నివర్తకములు, ఏకవృత్తి వేద్యము లగుటగాని, ఏకజాతివృత్తి వేద్యములగుటగానీ వివక్షితముగాదే. అలాగైనచో- 'కుసుమాని శరాః' ఇత్యాదులయందు ప్రాచీనరీతిచే నవ్యాప్తి ప్రసక్తించును; అనిన యెడల—విరోధము ఇక్కడ ప్రతిభాసించినను కవిసంరంభాగోచర మగుటచే చమత్కారకము కాదు.

అయం చ విరోధాలంకారః కువలయానందకృతా ఉత్ప్రేక్షా శిరస్కోఽప్యుదాహృతః. యథా—

"ప్రతీపభూపైరివ కిం తతో భియా
విరుద్ధధర్మైరపి భేత్తృతోజ్ఝితా.
అమిత్రజిన్మిత్రజిదోజసా స య
ద్విచారదృక్చారదృగప్యవర్తత." ఇతి.

విరోధప్రతీత్యనంతరం యత్రార్థాంతరప్రతిపత్త్యా విరోధస్య సమాధానం తత్ర విరోధాభాస ఇష్యతే. యథా — 'రిపురాజిరసభావభంజనోఽప్యరిపురాజిరసభావభంజనః' ఇత్యాదౌ. ఇహ తూత్ప్రేక్షయా విరోధ సమాధానాత్మికయా ముఖస్థితయా విరోధస్యోత్థానమేవ భగ్నమితి కథమనుత్తిష్ఠన్నేవ విరోధశ్చమత్కారమూలమలంకారభావం వహేత్?

ఇతి రసగంగాధరే విరోధప్రకరణమ్.

కువలయానందకారులు ఈ విరోధాలంకారమును ఉత్ప్రేక్షాశిరస్కముగా నుదాహరించిరి,

ఎట్లనగా —

'ప్రతీపభూపైః' మొ. (అతని వలన భయముచే శత్రురాజులవలెనే విరుద్ధ ధర్మములచేతగూడ భేదకత్వము వదలిపెట్టబడినది! ఎందుచేత ననగా తేజస్సుచే మిత్రజిత్తగు అతడు అమిత్రజిత్తుగను, చారదృక్ ఐన విచార దృక్‌గను ఉండెను.)

విరోధప్రకీతి తరువాత ఇచట అర్థాంతరము ప్రతిపత్తిచే విరోధమునకు నెచట సమాధానమో నచట విరోధాభాస మంగీకరింపబడును. ఎట్లనగా- "రిపురాజి" ఇత్యాదులందు. ఇక్కడనైతే ముఖస్థితియను ఉత్ప్రేక్షచే, విరోధ సమాధానాత్మికచే, విరోధమునకు నుత్థానమే భగ్నమగు, లేవకుండానే విరోధము చమత్కారమూల మగు నలంకారభావము ఎట్లు వహించును ?

ఇది విరోధాలంకారము

## విభావనా

అథ విభావనా-కారణవ్యతిరేకసామానాధికరణ్యేన ప్రతిపాద్యమానా కార్యోత్పత్తిర్విభావనా. తదుక్తమ్—'క్రియాయాః ప్రతిషేధేఽపి ఫలవ్యక్తిర్విభావనా' ఇతి. క్రియాశబ్దేనాత్ర కారణం వివక్షితమ్. అత్ర కారణవ్యతిరేకసామానాధికరణ్యేన కార్యోత్పత్తౌ నిబధ్యమానాయామాపాతతో విరోధః ప్రతిభాసమానోఽపి తదితరకారణకల్పనయా నివర్తతే.

యథా —

"వినైవ శస్త్రం హృదయాని యూనాం
వివేకభాజామపి దారయంత్యః.
అనంతమాయామయవల్గులీలా
జయంతి నీలాబ్జదలాయతాక్ష్యః".

అత్ర హి దారణే శస్త్రం కారణమ్. తదభావేఽపి దారణము పనిబధ్యమానమాపాతతో విరుద్ధమపి కామినీవిలాసరూప హేతుకతయా పర్యవస్యతి.

తరువాత విభావనము—

కారణ వ్యతిరేకముతోడి సామానాధికరణ్యమున చెప్పబడుచున్న కార్యోత్పత్తి విభావన. అది చెప్పబడినది—

"క్రియాయాః" మొ. క్రియాశబ్దముచే నిచట కారణము వివక్షితము. ఇచట కారణవ్యతిరేకము యొక్క సామానాధి కరణ్యముతో కార్యోత్పత్తి నిబంధింపబడుచుండగా నా పాతతః సామాన్యముగా విరోధము ప్రతిభాసమానమైనను, తదితర కారణ కల్పనచే నివర్తించును, ఎట్లనగా—

"వినైవ శస్త్రం" మొ (శస్త్రము లేకుండానే వివేకవంతులై నను యువకుల హృదయమును చీల్చుచున్నవారలై అనంతమగు మాయలతో నిండిన అనంతమగు లీలలతో నిండినవారై నల్లని పద్మములవలె ఆయ ములైన నేత్రములుగలిగిన స్త్రీలు అందరికంటె ఉత్కర్షతో నున్నారు.)

ఇచట దారణమునందు శస్త్రము కారణము అదిలేకున్నను, దార ణము నిబంధింపబడుచున్నదై ఆపాతతః విరుద్ధమైనను కామినీ విలాసరూప హేతుకముగా పర్యవసించుచున్నది

నన్వత్ర యస్య కార్యస్యోత్పత్తిర్నిబధ్యతే నహి తదీయకారణ త్వేనావగతస్య వ్యతిరేకః ప్రతీయతే, యదీయకారణవ్యతిరేకశ్చ ప్రతీ యతే నహి తస్య కార్యస్యోత్పత్తిర్నిబధ్యతే. దారణం చేహ పీడావి శేషో వివక్షితః, న తు ద్విధాభావః. శస్త్రం చ న కామపీడాయాః కారణమ్, అపి తు ద్వైధీకరణస్యేతి చేత్, న.

ముఖ్యం హి దారణం ద్విధాభావనమ్. గౌణం చ కామాది జనితపీడావిశేషః. తయోర్గౌణముఖ్యయోర్దారణయోః సాదృశ్యమూ లేనాభేదాధ్యవసానరూపేణాతిశయేన సతి భేదస్థగనే, ద్విధాభావనకా రణమపి శస్త్రం కామపీడాకారణం సంపద్యతే. తదభావే చాత్ర కార్యా భిన్నతయాధ్యవసితస్య పీడావిశేషస్యోపనిబంధనాన్న దోషః.

ఏవం చాస్మిన్నలంకారే సర్వత్రాపి కార్యాంశే అభేదాధ్యవ సానరూపాతిశయోక్తిరనుప్రాణకతయా స్థితా. తయా చ పాయ సాదిపిండవదేకీకృతస్య వస్తుతః సదృశవస్తుద్వయస్యైకావయవ సంబంధి కారణవ్యతిరేక సామానాధికరణ్యేనాపరావయవమాదాయ పర్యవ సానం భవతి. తత్ర చ కార్యాంశః కారణాభావరూపవిరోధినో బాధ్యత యైవ స్థితః, న బాధకతయా. కార్యాంశస్య కల్పితత్వాత్కారణా భావస్య చ స్వభావసిద్ధత్వాత్.

అత ఏవ కార్యాంశో రూపాంతరేణ పర్యవస్యతి. అత ఏవ చ సమబలవిరోధిద్వయఘటితాద్ విరోధాలంకారాదస్య వైలక్షణ్యమ్. తథా చోక్తమ్ —

"కారణస్య నిషేధేన బాధ్యమానః ఫలోదయః
విభావనాయామాభాతి విరోధోఽన్యోన్యబాధనమ్" ఇత్యాహుః.

అయ్యా,

ఇచట, ఏ కార్యము యొక్క ఉత్పత్తి నిబంధింపబడునో దానియొక్క కారణముగా జ్ఞాతమైనదాని యొక్క వ్యతిరేకము స్ఫురించుట లేదు. దేని యొక్క కారణ వ్యతిరేకము ప్రతీతమో ఆ కార్యము యొక్క ఉత్పత్తి నిబంధింపబడుట లేదు. దారణ మనగా ఇక్కడ పీడావిశేషమే వివక్షితము; అంతేకానీ ద్విధాభావము కాదు శస్త్రమున్ను కామపీడనకు కారణము కాదు; ఇకనేమనగా ద్వైధీకరణమునకు కారణము-అన్నచో నదిగాదు. ముఖ్యమగు కారణము ద్వైధీభవనము. గౌణము కామాదిజనితపీడా విశేషము. గౌణ ముఖ్యములగు నారెండుదాహరణములకు సాదృశ్యమూలమగు నభేధాధ్యవసానరూపమైన యతిశయముతో భేదము స్థగన మైనప్పుడు ద్విధాభవన కారణమైనను శస్త్రము కామపీడా కారణముగా నగును. అది లేని చోట కార్యాభిన్నముగ నధ్యవసితమగు పీడావిశేషమును నిబధించుటవలన దోషములేదు అలా కాగా నీయలంకారమునందు కార్యాంశమునందంతటను అభేధాధ్యవసానరూపమగు నతిశయోక్తియను ప్రాణముగ నిలచినది. అలా కాగా దానిచే పాయసాదిపిండమువలె ఒకటిగా జేయబడిన దానికి, వస్తుతః సదృశ వస్తుద్వయమునకు, ఏకావయవమునకు సంబంధించిన కారణ వ్యతిరేక సామానాధికరణ్యముచే అపరావయవమును తీసికొని పర్యవసాన మగును. అక్కడ కార్యాంశము కారణాభావరూప విరోధికి బాధ్యముగానే నిలచినది; కాని బాధకముగకాదు కార్యాంశము కల్పితమగుటవలన కారణాభావము స్వభావ సిద్ధము గనుక. ఇందువలననే కార్యాంశము రూపాంతరముతో పర్యవసించును ఇందువలననే సమబలమగు విరోధి ద్వయముతో గూర్పబడిన విరోధాలంకారముకంటె దీనికి వైలక్షణ్యము. అలా చెప్పిరి కూడాను :-

"కారణస్య" మొ (కారణము యొక్క నిషేధముచే బాధింపబడు ఫలోదయము విభావనయందు భాసించును· విరోధము అన్యోన్యబాధన రూపము )

అథాతిశయోక్తిర్న సర్వస్యాం విభావనాయామనుప్రాణికా. కింతు క్వచిత్.

'నిరుపాదానసంభారమభిత్తావేవ తన్వతే
జగచ్చిత్రం నమస్తస్మై కలాశ్లాఘ్యాయ శూలినే.'

ఇత్యత్ర విభావనాయామతిశయోక్తేరధ్యవసానమూలాయా అననుప్రాణకత్వాదితి. నను కారణాభావే కార్యోత్పత్తిరసంభవంతీ కవినా అభిప్రాయవిశేషేణ నిబధ్యమానా హి విభావనా. న చాత్రో పాదానాంతరాభావే జగత ఉత్పత్తిః పరమేశ్వరాదసంభవంతీ; యేన విభావనా స్యాత్. 'నాసదాసీత్', 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్', 'ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్', 'అసద్వా ఇదమగ్ర అసీ త్తతో వై సదజాయత' ఇత్యాది శ్రుతిభ్యః, 'అహమేవాసమేవాగ్రే నాన్య ద్యత్సదసత్పరమ్' ఇత్యాదిస్మృతిభ్యశ్చ సృష్టికాలే భగవదతిరిక్తవస్తు జాతప్రతిషేధావగమాత్. తస్మాదత్ర విభావనాయా ఏవ సంభావనా నాస్తి, క్వ పునరతిశయోక్త్యనుప్రాణితత్వవ్యభిచార ఇతి చేత్, న. అత్ర హి భగవతః సకాశాత్కేవలస్య జగత ఉత్పత్తిర్న కవేరభిప్రేతా. యేన తస్యా ఉపాదానాంతరవ్యతిరేకేఽపి భగవతః సకాశాత్సంభవా దసంభవమూలా విభావనా న స్యాత్. కిం తు జగద్రూపస్య చిత్రస్య. చిత్రస్య చ కేవలస్యోపాదానానాం మపీ హరితాలాదీనామాధారస్య భిత్త్యాదేశ్చాభావే కేవలాకాశే జాగర్త్యేవోత్పత్తేరసంభవః. స చ తస్య జగద్రూపతానుసంధానా త్తత్కారణతదాశ్రయవ్యతిరేకమాదాయ నివర్తతే ఇతి 'నిరుపాదాన సంభారమ్' ఇత్యత్ర నిష్ప్రత్యూహైవ విభావనేతి భవత్యతిశయోక్త్యనుప్రాణితత్వవ్యభిచారః. ఏతేన 'విభావనాయాం సర్వత్రాతిశయోక్తిరనుప్రాణికా' ఇతి సర్వస్వకారోక్తిర పాస్తా. తథా "—'నిరుపాదానసంభారమ్' ఇత్యత్ర విభావనాయా ఏవాభావాత్కుత్ర వ్యభిచారః" ఇతి వదన్ విమర్శినీకారోఽపి ప్రత్యుక్త ఇతి. ఉచ్యతే—మా స్మ భూత్సర్వత్ర విభావనాయామతిశయోక్తిరనుప్రాణికా. ఆహార్యాభేదబుద్ధిమాత్రమేవానుప్రాణకమ్. తచ్చ క్వచిదతిశయోక్త్యా, క్వచిచ్చ రూపకేణేతి న దోషః.

అనంతరము — అతిశయోక్తి విభావనయందంతటను అనుప్రాణకము గాదు; ఇకనేమనగా నొక్కొకచోట.

'నిరుపాదాన' మొ. (ఉపాదాన సంభారము లేకుండగనే, గోడ కాని స్థలమునందే జగత్తను చిత్తరువును విస్తరింపజేయుచున్న శ్లాఘ్యుడగు ఆ శివునికి నమస్కారము.)

అను నీచోట విభావనయందు అతిశయోక్తి, నధ్యవసానమూలమగు నది. అను ప్రాణకముగాదు కినక అని. అదేమయ్యా, కారణము లేకుండగనే కార్యోత్పత్తి, యసంభవమగుచు, కవిచేతను నభిప్రాయ విశేషముచేత నిబంధింపబడినది, విభావనకదా? ఇచట నుపాదానాన్తరము లేకపోవుటలో జగత్తుయొక్క నుత్పత్తి పరమేశ్వరుని వలన సంభవించనిదికాదు. అట్లైన విభావన అయిఉండెడిది "నాససీదాత్"ఇత్యాది శ్రుతులనుండియు,"అహమేవ"ఇత్యాది స్మృతుల నుండియును సృష్టి కాలమందు, భగవదతిరిక్త వస్తుజాతము యొక్క నిషేధము అవగతమగుటవలన. అందువలన ఇచట విభావన యొక్క సంభావనయేలేదు; ఇక నెక్కడ నతిశయోక్త్యనుప్రాణితత్వము యొక్క వ్యభిచారము? అన్నచో నది సరికాదు. ఇచట భగవంతుని సన్నిధినుండి కేవలమగు జగత్తు యొక్క నుత్పత్తి కవి కభిమతము గాదు; ఎందుచేత దానికి నుపాదానాంతర వ్యతిరేకమందైనను భగవంతుని సకాశమునుండి సంభవించుటవలన అసంభవ మూలకమగు విభావన లేకపోవునో. ఇక నేమనగా జగద్రూపమగు చిత్రముయొక్క. కేవలమగు చిత్రమునకు నుపాదానములగు మషి హరితాళము మొదలైనవియు, నాధారమగు భిత్త్యాదులును లేకపోవుటవలన కేవలమాకాశమందు ఉత్పత్తి యొక్క అసంభవము ఉండనే ఉన్నది. అదియు దానికి జగద్రూపత్వము యొక్క ననుసంధానము వలన తత్కారణ తదాశ్రయ వ్యతిరేకమును తీసుకొని వర్తించును అని 'నిరుపాదాన సంభారం' అనుచోట విభావన నిష్ప్రత్యూహమే అగుచున్నది అని, అతిశయోక్త్యనుప్రాణితత్వమునకు వ్యభిచారమగును. దీనిచేత విభావనయందంతటను అతిశయోక్తి అనుప్రాణిక అని సర్వస్వకారుని మాట అప్రాప్తమైనది. అటులనే "నిరుపాదానసంభారం" అనుచోట విభావనమే లేనందున వ్యభిచారమెక్కడిది? అని చెప్పు విమర్శనీకారుడున్ను పత్యస్తమైనాడు.

చెప్పుదుము— విభావన యందంతటను అతిశయోక్తిఅనుప్రాణిక కాకపోయిన కాక పోవచ్చును. ఆహార్యమగు నభేదబుద్ధిమాత్రమే ననుప్రాణకము అదియు ఒక యెడల నతిశయోక్తిచేతను, ఇంకొక యెడల రూపకముచేతను, అని దోషములేదు.

యత్తు—"కారణం వినా కార్యోత్పత్తిరేకా విభావనా. కారణానామసమగ్రత్వే ద్వితీయా. సత్యపి ప్రతిబంధకే కార్యోత్పత్తిస్తృ

తీయా. అకారణాత్కార్యోత్పత్తిశ్చతుర్థీ. విరుద్ధాత్కార్యజన్మ పంచమీ. కార్యాత్కారణజన్మ షష్ఠీ. క్రమేణోదాహరణాని —

'అప్యలాక్షారసాసిక్తం రక్తం తన్వ్యాః పదాంబుజమ్'
'అస్త్రైరతీక్ష్ణకఠినైర్జగజ్జయతి మన్మథః.'
'సాతపత్రం దహత్యాశు ప్రతాపతపనస్తవ.'
'శంఖాద్వీణానినాదోఽయముదేతి మహదద్భుతమ్.'
'శీతాంశోః కిరణా హంత దహంతి సుదృశో దృశౌ.'
'యశః పయోధిరభవత్ కరకల్పతరోస్తవ.'

ఇతి షట్ప్రకారాం విభావనాముదాజహార కువలయానందకృత్. తత్రేదం వక్తవ్యమ్ —

'కార్యోత్పత్తిస్తృతీయా స్యాత్సత్యపి ప్రతిబంధకే.'
'అకారణాత్కార్యజన్మ చతుర్థీ స్యాద్విభావనా.'

ఇత్యాదిభిర్విభావనాప్రకారాణాలక్షయతా వినాపి కారణం కార్యోత్పత్తిరిత్యేకో విభావనాప్రకార ఇత్యుక్తం భవతి. అన్యథా చతుర్థీత్వాద్యసంగతేః. ఏవం చ యథా—'సాదృశ్యముపమా భేదే,' 'తద్రూపకమభేదో య ఉపమానోపమేయయోః' ఇత్యాదిభిర్లక్షితస్యోపమా రూపకాదిసామాన్యస్య పూర్ణాదయః సావయవాదయశ్చ భేదా ఉక్తాస్తథేహ కిం తద్విభావనాసామన్యలక్షణమ్, యల్లక్షితస్య విభావనాసామాన్యస్యామీ భవతోక్తాః ప్రకారా ఉపపద్యేరన్. కారణం వినా కార్యోత్పత్తేస్తు ప్రకారాంతః పాతితత్వాత్. అథాతిశయోక్త్యాదిష్వివ తాదృశసకలప్రకారాన్యతమత్వం సామాన్యలక్షణమున్నేయమితి చేత్, ఏవమపి ప్రథమప్రకారాద్ ద్వితీయప్రకారస్య వైలక్షణ్యం దురుపపాదమేవ. కారణాభావేఽపి కార్యోత్పత్తిరిత్యత్ర కారణతావచ్ఛేదకసంబంధేన కారణతావచ్ఛేదకావచ్ఛిన్నప్రతియోగితాకాభావస్య వివక్షితత్వాత్. ప్రకారాంతరస్వీకారాపేక్షయా తాదృశ వివక్షాయా ఏవ లఘుత్వాత్. ఏవం ప్రతిబంధకమపి కారణాభావ ఏవ; ప్రతిబంధకాభావస్య కారణత్వాత్, ఇతి తృతీయోఽపి భేదో న విలక్షణః. చతుర్థేఽపి భేదే కారణాభావ అర్థః. 'శంఖాద్వీణానినాదోఽయమ్' ఇత్యుక్తే వీణాం వినైవేతి ప్రత్యయాదవైలక్షణ్యమ్. తస్మాదాద్యేన ప్రకారేణ ప్రకారాంతరాణామాలీఢత్వాత్షట్ప్రకారా ఇత్యనుపపన్నమేవ.

ఏదైతే- కారణము లేకుండా కార్యోత్పత్తి ఒక విభావన కారణ ములు సంపూర్ణముగా లేనియెడల రెండవది; ప్రతిబంధకమున్నను కార్యో త్పత్తి మూడవది అకారణమువలన కార్యోత్పత్తి నాల్గవది. విరుద్ధమైన కార్యజన్మ ఐదవది కార్యము వలన కారణజన్మ ఆరవది క్రమముగా నుదా హరణములు—

(లాక్షారసముచే తడుపబడకున్నను తన్వి యొక్క పదాంబుజము రక్తమైనది.)

(తీక్ష్ణము కానివియు కఠినములు కానివియునైన అస్త్రములచే మన్మథుడు జగత్తును జయించుచున్నాడు.)

(నీ యొక్క ప్రతాపమనెడు సూర్యుడు గొడుగుతో గూడా శీఘ్ర ముగా తగులబెట్టుచున్నాడు.)

(శంఖము నుండి వీణాధ్వని ఉదయించుచున్నది. ఇది చాలా గొప్ప అద్భుతము.)

(చంద్రుని యొక్క కిరణములు, అయ్యో! సుదృక్ యొక్క కనులను కాల్చివేయుచున్నవి )

(నీ యొక్క చేయియనెడు కల్పతరువునుండి కీర్తియనెడు సము ద్రము కలిగెను )

అని కువలయానందకారులు ఆరువిధములుగా విభావన లుదాహరించిరి. అక్కడ చెప్పవలసినది—

" కార్యోత్పత్తిః " మొ. (ప్రతి బంధకమున్నను కార్యోత్పత్తి మూడవదగును. అకారణము వలన కార్యము పుట్టుట నాల్గవ విభావన.)

ఇత్యాదులచే విభావనా ప్రకారములను లక్షించుచూ, "వినాపి కార ణం కార్యోత్పత్తిః" అనియు నొకవిభావనా ప్రకారమని చెప్పినట్లు అగు చున్నది అలా కానియెడల చతుర్థీత్వాది యసంగతమగును. ఇలాగ— 'సాదృశ్యముపమా భేదే' "తద్రూపకమభేదో యః ఉపమానోపమే యయోః" ఇత్యాదులచేతను లక్షింపబడిన ఉపమారూపకాది సామాన్య మునకు, పూర్ణాదులు, సావయవాదులును, భేదములు ఎట్లు చెప్పబడినవో- అలా ఇచట విభావనా సామాన్యలక్షణమేది? దేనిచే లక్షితమైన విభావనా సామాన్యమునకు నీవు చెప్పిన ప్రకారము ఉపపన్నములగునో. కారణము

లేకుండా కార్యోత్పత్తి ప్రకారాన్తఃపాతి కనుక అయితే- అతిశయోక్త్యాదులయందువలె ఏతాదృశ సకలప్రకారాన్వతమత్వము సామాన్యలక్షణమని ఊహించవలెననిన యెడల ఇలాగైనను మొదటి ప్రకారముకంటే రెండవ ప్రకారమునకు వైలక్షణ్య మునపాదించుట కష్టమే. కారణములేనప్పటికిని కార్యోత్పత్తి అనే ఈచోట కారణత్వాది నిర్ణాయక సంబంధముతో కారణతా నిర్ణాయక నిర్ణీత ప్రతియోగికాభావము వివక్షితమగుటవలన. ప్రకారాన్తరమును స్వీకరించుటకన్నను అటువంటిదాని వివక్షయే లఘువుగనుక. ఈ తీరుగా ప్రతిబంధకమను కారణాభావమే. ప్రతిబంధకాభావము కారణము కనుక; అని మూడవ భేదమన్న ప్రకృత్తదికాదు. నాల్గవ దానియందైనను, భేదమునందు, కారణాభావము అర్థము. 'శంఖాద్వీణానినాదోయం' అని చెప్పగా వీణలేకుండగనే అను జ్ఞానమువలన, వైలక్షణ్యములేదు. అందువలన మొదటి ప్రకారముచే ప్రకారాన్తరము లాలీఢములు గనుక షట్ప్రకారమని చెప్పుట యనుపపన్నమే.

యది తు యథాకథంచిత్కువలయానందోక్తిః సమర్థనీయేత్యాగ్రహస్తర్హేత్థం సమర్థ్యతామ్—తథా హి—వినాపి కారణం కార్యజన్మేతి విభావనాయాః సామాన్యలక్షణమ్. ఇయం చ తావద్ద్వేధా — శాబ్దీ, ఆర్థీ చ. శాబ్దీ త్రివిధా — ప్రతిబంధకాతిరిక్త కారణవ్యక్తి ప్రతియోగికాభావోక్తి పూర్వికా, సత్యామపి కారణ వ్యక్తౌ యదవచ్ఛిన్నత్వ వైకల్య ప్రయుక్తః కార్యాభావస్తద్వైకల్యోక్తిపూర్వికా, స చ కారణతావచ్ఛేదక ధర్మః క్వచిత్కారణతావచ్ఛేదకసంబంధశ్చ, ప్రతిబంధకోక్తి పూర్వికా చేతి. ఆర్థ్యపి త్రివిధా—ప్రకృతకార్య సమానజాతీయ కార్యాంతరస్య కారణాత్, ప్రకృతకార్యవిరుద్ధ కార్యస్య కారణాత్, స్వకార్యాద్ వా ప్రకృత కార్యస్యోత్పత్తిరితి, ఏతదర్థకమేవ హ్యకారణాదిత్యాది.

అయితే- ఏలాగోలాగు కువలయానందకారునిమాట సమర్థనీయమని పట్టుదలయున్న యెడల ఈ తీరుగా సమర్థింపవలసినది. చూడుడు- కారణము లేకుండా కార్యము పుట్టుటయని విభావనకు సామాన్య లక్షణము. ఇది రెండు రకములు- శాబ్దము, అర్థము, అని. శాబ్దిమూడు విధములు—ప్రతిబంధకాతిరిక్తమగు కారణవ్యక్తి ప్రతియోగిగా గల అభావము యొక్క-

ఉక్తిపూర్వమందు గలది ఒకటి కారణవ్యక్తియున్నప్పటికినీ కార్యాభావము యదవచ్ఛిన్నత్వ వైకల్య ప్రయుక్తమో తద్వైకల్యోక్తిపూర్విక రెడు అదియు ఒకయెడ కరణతానియామక ధర్మము, మరి ఒక యెడ కారణతా నిర్ణాయక సంబంధమున్ను. ప్రతిబంధకోక్తి పూర్వికయున్ను అని మూడు విధములు—ఆర్థియు మూడువిధములు—ప్రకృత కార్యసమాన జాతీయ కార్యాంతరమునకు కారణమువలన, ప్రకృత కార్యవిరుద్ధకార్యమునకు కారణము వలన, లేదా స్వకార్యమువలన ప్రకృత కార్యోత్పత్తి అని. ఏతదర్థము కలదియే కదా 'అకారణాత్' ఇత్యాదికము?

ఇయం చ విభావనా ద్వివిధా—ఉక్తనిమిత్తానుక్తనిమిత్తా చ. తత్రానుక్తనిమిత్తా 'వినైవ శస్త్రం' ఇత్యత్ర దర్శితా. విలాసానాం మన్మథపీడాజనకానామనుపాత్తత్వాత్. ఉక్తనిమిత్తా యథా—

"యదవధి విలాసభవనం
యౌవనముదియాయ చంద్రవదనాయాః.
దహనం వినైవ తదవధి
యూనాం హృదయాని దహ్యంతే."

అత్ర హి ఉపాత్తే యౌవనే దాహహేతుత్వం పర్యవస్యతి.

ఈ విభావన రెండు విధములు ఉక్తనిమిత్త, అనుక్తనిమిత్త అని. అనుక్తనిమిత్త "వినైవ శస్త్రం" అనుచోట నుదాహరింపబడినది. విలాసములకు, మన్మథ పీడాజనకములకు నుపాదానములేదు కనుక. ఉక్తనిమిత్తము యెట్లనగా—

"యదవధి" మొ. (ఎప్పటినుండి విలాసభవనమగు యౌవనము చంద్రునివంటి మొగముగల స్త్రీకి ఉదయించెనో అప్పటినుంచియు అగ్నిలేకనే యువకుల హృదయములు తగులబెట్టబడు చున్నవి)

ఇచట యౌవనము ఉపాత్తముకాగా అది దాహహేతువగుట పర్యవసించును.

యత్తు—

"—'అసంభృతం మండనమంగయష్టే-
రనాసవాఖ్యం కరణం మదస్య.
కామస్య పుష్పవ్యతిరిక్తమస్త్రం
బాల్యాత్పరం సాథ వయః ప్రపేదే."

అత్ర ద్వితీయచరణే ఆసవాభావేఽపి మదస్య ప్రతిపాదనా ద్యౌవనస్య చోక్తత్వాదుక్తనిమిత్తా విభావనా. న తు ప్రథమతృతీయ చరణయోః, సంభరణపుష్పయోర్మండనమస్త్రం చ ప్రత్యాహేతు త్వాత్." ఇత్యలంకారసర్వస్వకారాదిభిరుక్తం తత్ర విచార్యతే — విరోధమూలా హి విభావనాద్యలంకారాః. విరోధస్యైవ విద్యుత్ప్ర భావదాపాతతః ప్రతిభాసమానస్య చమత్కారబీజత్వాత్. అత్ర హ్యాసవ భిన్నత్వవిశిష్టం మదకారణత్వం యౌవనస్యోక్తమ్. ఏవం చ యౌవనస్య మదకారణతాయాః శబ్దేనైవోపాత్తత్వాత్ యాగే వ్రీహియవయోరివ మదే యౌవనాసవయోః పరస్పర నిరపేక్షకారణత్వావగతేర్విరోధస్య లేశతోఽప్యప్రతిభానాద్విభావనైవ నాస్తి. కుతః పునరుక్తనిమిత్తా విభావనా? న చాసవస్య ప్రసిద్ధమదకారణత్వాత్తేన వినా మదోత్పత్తి వర్ణనే విరోధప్రతిభా భవత్యేవేతి వాచ్యమ్. భవేత్స్యాత్, యది యౌవ నస్య మదకారణత్వం కవినా సాక్షాన్న ప్రతిపాద్యేత. ప్రతిపాదితే తు అస్మిన్నప్రసిద్ధకారణాతిరిక్తతయా కవినా ప్రతిపాదితమిదమపి ప్రసిద్ధకారణ మివ కారణాంతరం భవిష్యతీతి వైకల్పికకారణతాప్రతిభానాన్న విరోధ ప్రతిభానం భవితుమర్హతి. తస్మాదత్ర ప్రథమతృతీయచరణయోర్వ్యా నాభేదరూపకమ్. ద్వితీయచరణే తు ప్రతీయమానోత్ప్రేక్షేతి వివేకః. అస్మన్నిర్మితే తూదాహరణే దహనస్యైవ ప్రసిద్ధదాహకారణత్వా ద్యౌవనస్య దాహకారణతాయా అశ్రుతత్వాద్దహనమంతరేణ దాహో త్పత్తివర్ణనే విరోధ ఆపాతతః ప్రతీయత ఏవేతి సహృదయైరాకల నీయమ్.

ఏదైతే-

"అసంభృతం" మొ. (శరీరమునకు సమకూర్చబడని అలంకారమున్ను ఆసవమను పేరులేని మదసాధనమున్ను, కామునకు పుష్ప వ్యతిరిక్తమగు అస్త్రమును నైన బాల్యముకంటే తరువాతదగు వయస్సును ఆ పార్వతి పొందెను.)

అను శ్లోకములోని రెండవచరణమునందు ఆసవములేకున్నను మదమును ప్రతిపాదించుటవలనను, యౌవనము చెప్పబడెను కనుకను, ఉక్తనిమిత్తయగు విభావన. అంతేకాని ప్రథమ తృతీయ చరణములందుగాదు. సంభరణ పుష్ప ములు మండనమును అస్త్రమును గురించి కారణముకావు గావున; అని అలం

కారసర్వస్వకారాదులు చెప్పిరో అక్కడ విచారితము. విరోధమూలములు గదా విభావనాద్యలంకారములు! విరోధమునకే, విద్యుత్ప్రభ వలె నాపాతతః ప్రతీయమానమునకు, చమత్కార బీజత్వము అగుటవలన ఇచట అనవఛిన్నత్వవిశిష్టమగు మదకారణత్వము యౌవనమునకు చెప్పబడినది ఇలాగ యౌవనమునకు మదకారణత్వము శబ్దముచేతనే ఉపాత్తము గనుక, యాగమునందు వ్రీహియవలకువలె మదమునందు యౌవనాసవములకు పరస్పర నిరపేక్షమగు కారణత్వము అవగతముకాగా విరోధము లేశముగానైనను ప్రతిభాసించక పోవుటవలన విభావనయే లేదు· అట్టిచో ఉక్తనిమిత్తయగు విభావన యెట్లు వచ్చును? ఆసవము ప్రసిద్ధమగు మదకారణమగుటవలన అది లేకుండా మదోత్పత్తి గల్గెనను వర్ణనయందు విరోధ ప్రతిభ కానేయగుచున్నది అందురా? అది యౌవనమునకు మదకారణత్వము కవిచే సాక్షాత్తుగా చెప్పబడని యెడల అయ్యేదే. అది చెప్పబడగా ప్రసిద్ధకారణాతిరిక్తముగా కవిచే ప్రతిపాదింపబడిన ఇదియును ప్రసిద్ధకారణమువలె కారణాంతరము, గానున్నది అని వైకల్పిమగు కారణత్వము యొక్క ప్రతిభానమువలన విరోధ ప్రతిభానమగుటకు నర్హతలేదే? అందువలన ఇక్కడ ఒకటి మూడు చరణములయందు న్యూనాభేధ రూపకమగును. రెండవచరణమునందైతే ప్రతీయమానయగు నుత్ప్రేక్షయని వివేకము. మేము నిర్మించిన యుదాహరణమున అగ్నికే ప్రసిద్ధ దాహకారణత్వమువలనను, యౌవనము దాహకారణమని విననందునను, అగ్నిలేకుండా దాహోత్పత్తి వర్ణనమున విరోధము ఆపాతతః ప్రతీయమానమే యగును అని సహృదయులు విచారించుకొనవలెను.

అథ 'లుబ్ధకధీవరపిశునా నిష్కారణవైరిణో జగతి' ఇత్యత్ర విభావనాపత్తిః? నన్వస్తు, కిం నశ్ఛిన్నమితి చేత్; ఆలంకారికైరత్ర తస్యా అనంగీకారాత్. నను కారణతావచ్ఛేదకరూపావచ్ఛిన్న ప్రతియోగితాకత్వేన కారణాభావో విశేషణీయః. ప్రకృతే చ కారణత్వావచ్ఛిన్నప్రతియోగితాకః ప్రసిద్ధకారణత్వావచ్ఛిన్నప్రతియోగితాకో వాభావో న తాదృశరూపావచ్ఛిన్న ప్రతియోగితాక ఇతి చేత్, 'ఖలా వినైవాపరాధం భవంతి ఖలు వైరిణః' ఇత్యత్ర తథాత్వాత్. న చ కార్యాంశోఽతిశయోక్త్యాలీఢత్వేనాభేదనిశ్చయాలీఢత్వేన వా విశేషణీయ ఇతి వాచ్యమ్, 'ఖలా వినైవాపరాధం దహంతి ఖలు సజ్జనాన్' ఇత్యాదౌ తథాపి దోషానుద్ధారాదితి చేత్.

మైవమ్. కార్యాంశే యద్విషయితావచ్ఛేదకం తదవచ్ఛిన్న కార్యతానిరూపితాయాః కారణతాయా అవచ్ఛేదకమిహ గ్రాహ్యమ్. దాహత్వం చేహ విషయితావచ్ఛేదకమ్. తదవచ్ఛిన్నాభిన్నత్వేన పీడాయా అధ్యవసానాత్. నహి దాహత్వావచ్ఛిన్నకార్యతానిరూపితకారణతాయా అవచ్ఛేదకమపరాధత్వమ్. అపి తు దాహత్వావచ్ఛిన్నాభిన్నత్వేనాధ్యవసితా యా పీడా తన్నిష్ఠకార్యతానిరూపితకారణతాయా ఇతి తదవచ్ఛిన్నప్రతియోగితాకాభావసామానాధికరణ్యేన కార్యోత్పత్తి వర్ణనేఽపి నాత్ర విభావనాప్రసంగః.

అయితే—

"లుబ్ధక ధీవర పిశునులు జగమున నిష్కారణ శత్రువులు" అనుచోట విభావనాపత్తి? పోనీ ఉండనిమ్ము, మాకేమీ పోయిందిలేదు కదా? అని అన్నచో నలంకారికులు ఇచట దానిని అంగీకరించ లేదుకదా? అయ్యా కారణతానిర్ణాయక రూప నిర్ణీత ప్రతియోగితాకత్వముచే కారణతా భావము విశేషణీయము; ప్రకృతమునందు కారణత్వ విశిష్ట ప్రతియోగితాకము గాని, ప్రసిద్ధకారణత్వ విశిష్ట ప్రతియోగితాకముకాని అయిన అభావము తాదృశ రూప విశిష్ట ప్రతియోగితాకము కాదు, అనిన యెడల "ఖలులు అపరాధము లేకుండగనే శత్రువులగుదురు" అనుచోట నలాగైనను అతివ్యాప్తి గల్గును. అపరాధాభావము అటువంటిది గనుక. కార్యాంశము అతిశయోక్త్యాక్రాంతత్వముచేగాని అభేదనిశ్చయాక్రాంతత్వముచేగాని విశేషణీయము అని అనెదరా, "ఖలులు అపరాధము లేకుండగనే సజ్జనులను దహింతురు" ఇత్యాదులందు నలాగైనను దోషములను దొలగించ లేదు; అన్నచో—అలా అనవద్దు. కార్యాంశమందు ఏది విషయితా నిర్ణాయకమో తద్విశిష్ట కార్యతా నిరూపితమగు కారణతకు అవచ్ఛేదకము ఇచట గ్రహింపవలెను. దాహత్వము, ఇక్కడ విషయితా నిర్ణాయకము. తద్విశిష్టాభిన్నముగా పీడనుధ్యవసించుట వలన, దాహత్వ విశిష్టకార్యతానిరూపిత కారణత్వమునకు అవచ్ఛేదకము అపరాధత్వముగాదు. ఇకనేమనగా దాహత్వావచ్ఛిన్నాభిన్నముగానధ్యవసితమగు నే పీడకలదో దాని యందున్న కార్యతా నిరూపిత కారణతకునని తదవచ్ఛిన్న ప్రతియోగితాకాభావ సమానాధికరణత్వముతో కార్యోత్పత్తి వర్ణించినను ఇచట విభావనాప్రసంగము లేదు.

యది తు 'ఖలా విన్నైవ దహనం దహంతి జగతీతలమ్' ఇతి క్రియతే తదా భవత్యేవ విభావనా. ఏవమ్ —

"కమలమనంభసి కమలే
చ కువలయే తాని కనకలతికాయామ్.
సా చ సుకుమారసుభగే-
త్యుత్పాతపరంపరా కేయమ్."

ఇతి పరకీయపద్యేఽతిశయోక్త్యుదాహరణేఽస్త్యేవ విభావనా. పరం తు 'కమలమనంభసి' ఇత్యంశే శాబ్దీ; 'కమలే చ' ఇత్యాదావార్థీతి సంక్షేపః.

ఇతి రసగంగాధరే విభావనా ప్రకరణమ్

అయితే —

"ఖలులు అగ్ని లేకుండగనే ప్రపంచమును దహింతురు" అని చేసినచో అప్పుడు విభావన యగును. ఈ తీరుగా

"కమలమనంభసి" మొ. (నీరులేనిచోట కమలమున్ను కమలమునందు కువలయములును, అవి బంగారు తీవెయందును, అదియు సుకుమార సుభగ మని ఈ ఉత్పాతపరంపర ఏమిటి!)

అనుఅతిశయోక్త్యుదాహరణమగు పరకీయ పద్యమునందు, విభావన యున్నది. కానీ "కమలమనంభసి" అను నంశమునందు శాబ్దము 'కమలే చ' ఇత్యాదులం దార్థము అని సంగ్రహము.

ఇది విభావనాప్రకరణము

## విశేషోక్తిః

అథ విశేషోక్తిః —

ప్రసిద్ధకారణకలాపసామానాధికరణ్యేన వర్ణ్యమానా కార్యానుత్పత్తిర్విశేషోక్తిః. తత్ర సత్యపి కారణసమవధానే కార్యస్యానుత్పత్త్యా విరోధః ప్రతిభాసమానః ప్రసిద్ధేతరకారణవైకల్యధియా నివర్తతే. యథా —

"ఉపనిషదః పరిపీతా గీతాపి చ హంత మతిపథం నీతా
తదపి న హా విధువదనా మానససదనాద్ బహిర్యాతి."

యథా వా —

"ప్రతిఫలమఖిలాన్ లోకాన్మృత్యుముఖం ప్రవిశతో నిరీక్ష్యాపి
హా హతకం చిత్తమిదం విరమతి నాద్యాపి విషయేభ్యః."

అత్రోపనిషదర్థవిమర్శే సకలలోకానిత్యత్వజ్ఞానే ప్రసిద్ధవిరతిహేతౌ సత్యపి విరత్యనుత్పత్తివర్ణనాద్రాగాధిక్యరూపం ప్రతిబంధకం ప్రతీయతే. ఇయమనుక్తనిమిత్తా. విరత్యనుత్పత్తినిమిత్తస్య ప్రతిబంధకస్యానుపాత్తత్వాత్. అత్రైవ 'రాగాంధం చిత్తమిదమ్' ఇతి నిర్మాణే ఉక్తనిమిత్తా.

అనంతరము విశేషోక్తి —

ప్రసిద్ధకారణకలాపములకు సామానాధికరణ్యముతో వర్ణించబడుచున్న కార్యానుత్పత్తి విశేషోక్తి. అక్కడ కారణసమవధానమున్నప్పటికిని కార్యము పుట్టకపోయిన విరోధము ప్రతిభాసించుచు ప్రసిద్ధేతరమగు కారణముల యొక్క వైకల్యబుద్ధిచే వర్తిల్లుచున్నది॥ ఎట్లనగా—

"ఉపనిషదః" మొ. (ఉపనిషత్తులు బాగా పానము చేయబడినవి; గీతయు అయ్యో బుద్ధిమార్గము పొందింప బడినది; అటులైనను ఆ చంద్రవదన మనస్సనే గృహమునుండి వెలుపలికి పోదు)

మరొకటి—

"ప్రతిపలమఖిలాన్" మొ. ప్రతినిముషము మృత్యుముఖమును ప్రవేశించుచున్న లోకములను నిరీక్షించియు అయ్యో పాడు చిత్తము యిప్పటికిని విషయములనుండి విరమించదు).

ఇచట నుపనిషత్తుల యర్థ విమర్శనయందు "అన్నిలోకములును అనిత్యము''లను జ్ఞానము, ప్రసిద్ధమగు విరతి హేతువున్నప్పటికిని విరతియుదయించక పోవుటను వర్ణించుటవలన రాగాధిక్య రూపమగు ప్రతిబంధకము తోచుచున్నది. ఇది చెప్పబడని నిమిత్తము గలది. అనుక్త నిమిత్త. విరతి ఉదయించక పోవుటకు గారణము అగు ప్రతిబంధకము అనుపాత్తము గనుక. ఇక్కడనే "రాగాంధం చిత్తమిదం" అని నిర్మాణమునందు ఉక్తనిమిత్త.

కేచిదచింత్యనిమిత్తాం తృతీయామాహురనంతి; ఉదాహరంతి చ—

"స ఏకస్త్రీణి జయతి జగంతి కుసుమాయుధః
హరతాపి తనుం యస్య శంభునా న బలం హృతమ్."

అనుక్తనిమిత్తాయాం నిమిత్తం నిమిత్తతావచ్ఛేదకరూపేణ చింత్యమానం ప్రతీయతే. ఇహ తు న తథా. కిం తు భవిష్యతి కించిన్నిమిత్తమిత్యాకారేణేత్యనుక్తనిమిత్తాతోఽచింత్యనిమిత్తాయా భేద ఇతి వ్యాఖ్యాతౄణామాశయః. అన్యే తు—'నానుక్తనిమిత్తాయాం చింత్యత్వం నిమిత్తవిశేషణమ్, భేదాంతరకల్పనాగౌరవప్రసంగాత్. కిం తు చింత్యమచింత్యం చేతి ద్విప్రకారకమపి నిమిత్తం యత్రనోక్తం సానుక్తనిమిత్తా. తేనాచింత్యనిమిత్తా అనుక్తనిమిత్తాతో న పృథగ్భావమర్హతి ఇత్యాహుః.

కొంతమంది అచింత్యనిమిత్తను మూడవదానిగా చెప్పుచున్నారు, ఉదాహరించెదరు కూడాను—

"స ఏకస్త్రీణి" మొ. (అతనొక్కడే ముల్లోకములను, మన్మథుడు, జయించుచున్నాడు. శరీరమును హరించినను ఎవని బలము శివునిచే హరింపబడలేదో")

అనుక్త నిమిత్తయందు నిమిత్తము నిమిత్తతానిర్ణాయక రూపముతో చింతించబడుచు తోచుచున్నది. ఇచట నట్లుకాదు. ఏదో నిమిత్తమచట నుండగలదనే ఆకారముతో అనుక్తనిమిత్తకంటె నచింత్య నిమిత్తకు భేదమని కదా వీరి యాశయము. ఇతరులైతే—అనుక్తనిమిత్తయందు చింత్యత్వము నిమిత్తవిశేషణము కాదు. భేదాంతర కల్పనయందు గౌరవము ప్రసక్తించును కనుక; ఇక నేమనగా చింత్యము, అచింత్యము అని రెండు ప్రకారములు గల్గియున్నను నిమిత్త మెక్కడ చెప్పబడలేదో నది అనుక్త నిమిత్త. అందుచే చింత్యనిమిత్తకంటె వేరుకాదని చెప్పుదురు.

అత్ర చ కారణసమవధానం కార్యానుత్పత్తేర్బాధ్యమితి బహవః వస్తుతస్తు కార్యానుత్పత్తిరేవాస్మిన్నలంకారే బాధ్యా.

'కర్పూర ఇవ దగ్ధోఽపి శక్తిమాన్యో జనే జనే
నమోఽస్త్వవార్యవీర్యాయ తస్మై మకరకేతవే.'
'స ఏక స్త్రీణి జయతి జగంతి కుసుమాయుధః
హరతాపి తనుం యస్య శంభునా న బలం హృతమ్.'

ఇతి ప్రాచీనప్రసిద్ధోదాహరణేషు కారణసమవధానస్య కామ శరీరనాశరూపస్య ప్రమాణసిద్ధత్వేన బాధ్యత్వాయోగాత్. యతః

కామస్య శరీరనాశేఽపి శక్తిబలయోర్నాశః కుతో న జాత ఇత్యేవ సర్వ జనీనః ప్రత్యయః న తు శక్తిబలయోః సతోః కథం శరీరనాశ ఇతి.

ఇచట కారణ సమవధానము కార్యము పుట్టకుండుటకు బాధ్యము అని చాలామంది. వస్తుతః అయితే కార్యానుత్పత్తియే నీయలంకారమున బాధింప బడినది.

"కర్పూర" మొ. (కర్పూరమువలె దగులబెట్ట బడినను ప్రతిజనుని యందును ఎవడు శక్తిమంతుడో అవార్యమగు వీర్యముగల ఆ మన్మథునకు నమస్కార మగు గాక.)

"స ఏక స్త్రీణి" అని, ప్రాచీన ప్రసిద్ధోదాహరణములందు కారణ సమవధానము, కామశరీరనాశరూపము, ప్రమాణ సిద్ధము గనుక బాధ్యత్వ మయుక్తమగుట వలన. ఎందుచేతననగా కామునకు శరీర నాశమున్నను శక్తి బలములయొక్క నాశము ఎందువలన కలుగలేదు అనియే సార్వజనీనమగు ప్రత్యయము, శక్తి బలముండగా శరీర మెట్లు నశించినది అని కాదు.

"దృశ్యతేఽనుదితే యస్మిన్నుదితే నైవ దృశ్యతే
జగదేతన్నమస్తస్మై కస్మైచిద్బోధభానవే."

ఇత్యత్రోదయాభావే జగద్దర్శనస్య, ఉదయత్వే దర్శనాభావస్య వర్ణనేఽపి న విభావనావిశేషోక్తీ. న హ్యత్ర సాహజికసూర్యోదయో వర్ణ్యతే. యేన తయోః ప్రసంగః స్యాత్. తథాత్వే తూక్తి సంభవ ఏవ న స్యాత్. కింతు బ్రహ్మాత్మైక్యబోధసూర్యోదయః. తస్య చ జగదదర్శనమేవ కార్యమ్. న తు జగద్దర్శనమ్. తథాత్వే తు సూర్యోదయస్యైవాస్యాప్యుక్తిసంభవో న స్యాత్. అత ఏవ వ్యతిరేకోల్లాసస్తాద్రూప్యరూపకాలీఢే సంగచ్ఛతే.

"దృశ్యతే" మొ. (ఎవడు ఉదయించనపుడు జగత్తు కనబడుచున్నదో ఎవడు ఉదయించినప్పుడు కనబడదో అటువంటి విలక్షణుడగు బోధ భానువుకు నమస్కారము)

అనే ఈస్థలమున ఉదయము లేకపోయినయెడల జగత్తు కనపడుటకు, ఉదయము ఉండినప్పుడు దర్శనాభావమునకును వర్ణనము నందుగూడా విభావనా విశేషోక్తులు రెండును లేవు. ఇచట సహజ మగు సూర్యోదయము వర్ణింప బడుట లేదు గదా. అట్లైన వాటి రెంటికిని ప్రసంగ ముండెడిది.

అలాగైనచో నుక్తి సంభవమే లేకపోవును. ఇక నేమన "బ్రహ్మాత్మై క్యబోధ సూర్యోదయము. దానికిని జగత్తు కనబడక పోవుటయే కార్య మగును. జగత్తు కనబడుటగాదు. అలాగైనయెడల సూర్యోదయమునకు వలె దీనికిని ఉక్తి సంభవము కలుగక బోవును. ఇందువలననే వ్యతిరేకో ల్లాసము, తాద్రూప్యరూపకము చేత నాళీథమునందు సంగతమగును.

కారణాభావకార్యాభావయోర్యత్ర ప్రతియోగితావచ్ఛేదక విశిష్టవైశిష్ట్యేన శ్రుత్యా ప్రతిపాదనం తత్ర విభావనావిశేషోక్త్యోః శాబ్దత్వమ్. యథా.

"భగవద్వదనాంభోజం పశ్యంత్యా అప్యహర్నిశమ్
తృష్ణాధికముదేతి స్మ గోపసీమంతినీ దృశః."

లోకే హ్యాసంనికర్ష స్తృష్ణాకారణమ్. తదభావే సంనికర్షేఽపి తృష్ణోపనిబద్ధా. తథా సంనికర్ష స్తృప్తికారణమ్. తస్మిన్సత్యపి తృప్త్యభావో బోధితః. పరం తు కారణాభావ–కార్యాభావయోర్న ప్రాగుక్త ప్రకారేణ ప్రతిపాదనమిత్యార్థత్వమేవ తదుభయ సంశయసంకరస్య. అముమేవ చార్థం మనసికృత్య మమ్మటభట్టైః 'యః కౌమారహరః' ఇతి పద్యముదాహృత్యోక్తమ్—'అత్ర స్ఫుటో న కశ్చిదలంకారః' ఇతి.

కారణాభావ కార్యాభావములకే ఎచట ప్రతియోగితావచ్ఛేదక విశిష్ట వైశిష్ట్యముచే శ్రుతితో ప్రతిపాదనమూ అచట విభావనా విశేషోక్తులకు శాబ్దత్వము–ఎట్లనగా—

"భగవద్" మొ. (భగవంతుని వదనపద్మము రాత్రింబగళ్లు చూచు చున్ననూ ఆగోప సీమంతినికి తృష్ణ ఎక్కువగా ఉదయించెను.)

లోకమున సన్నికర్ష లేకపోవుట తృష్ణకు కారణము. అది లేనపుడు సన్నికర్షమునందును తృష్ణ ఉప బద్ధమైనది అలాగే సన్నికర్షము తృప్తి కారణము తృప్తి కారణమున్నప్పటికిని తృప్తి లేకపోవుట బోధింపబడినది. కానీ కారణాభావ కార్యాభావములకు వెనుక జెప్పిన ప్రకారముగ ప్రతిపాదన లేదని అర్థత్వమే నాయుభయ సంశయ సంకరమునకు. ఈ యర్థమునే మనసులో పెట్టుకొని మమ్మటభట్టులు—'యః కౌమారహరః' అని పద్యము ముదాహరించి చెప్పిరి—'ఇచట ఏ యలంకారము స్ఫుటము గాదు' అని—

వామనస్తు — 'ఏకగుణ హానికల్పనాయాం సామ్యదార్ఢ్యం విశేషోక్తిః' ఇత్యాహ. ఉదాజహార చ — 'ద్యూతం హి నామ పురుషస్యాసింహాసనం రాజ్యమ్' ఇతి. అత్ర హి—ద్యూతే రాజ్యం తాదాత్మ్యేనారోప్యతే. తత్ర సింహాసనరహితం హి ద్యూతం సింహాసన సహితరాజ్యతాదాత్మ్యం కథం వహేదిత్యారోపోన్మూలకయుక్తినిరా సాయారోప్యమాణే రాజ్యేఽపి సింహాసనరాహిత్యం కల్ప్యతే. తేన దృఢారోపం రూపకమేవేదమ్, న విశేషోక్తిః.

ఏవం చ —

'అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః
అభాలలోచనః శంభుర్భగవాన్బాదరాయణః'

ఇతి పౌరాణపద్యేఽపి రూపకమేవ, తథా గుణాధిక్యకల్ప నాయామపి తదేవ. యథా —

'ధర్మో వపుష్మాన్భువి కార్తవీర్యః' ఇత్యాదౌ. ఏతేన 'ఏక గుణహాన్యుపచయాదికల్పనాయాం సామ్యదార్ఢ్యం విశేషణమ్' ఇతి విశేషాలంకారం లక్షయంతోఽపి ప్రత్యుక్తాః.

ఇతి రసగంగాధరే విశేషోక్తి ప్రకరణమ్

**వామనుడైతే—**

"ఒక గుణమునకు హాని కలిగించునపుడు సామ్యదార్ఢ్యము విశేషోక్తి" అనిచెప్పెను ఉదాహరించెనుకూడాను—"జూదమనగా పురుషునికి సింహాసనము లేని రాజ్యము"అని. ఇచట జూదమునందు రాజ్యము తాదాత్మ్యముచే నారో పింప బడుచున్నది. అచట సింహాసనము లేని జూదము సి హాసన సహితమగు రాజ్యముతో తాదాత్మ్యమును ఎట్లు వహించును, అని ఆరోపమును ఉన్మూ లించు యుక్తిని నిరసించుటకు నారోపించబడునట్టి రాజ్యమునందును సింహా సన రాహిత్యము గల్పించ బడుచున్నది దానిచేత నిది దృఢారోపమగు రూపకమేయిది; విశేషోక్తి కాదు. ఈలాగే—

"అచతుర్వదనః" మొ. (భగవంతుడగు బాదరాయణుడు నాలుగు మోములు లేని బ్రహ్మ. రెండు బాహులుగల మరియొక హరి. ఫాలలోచన ములు లేని శంభువు)

అనే పౌరాణిక పద్యము నందును రూపకమేను. అలాగ గుణాధిక్యమును గల్పించినప్పుడును అదియే. ఎట్లనగా—"రూపొందించిన ధర్మము కార్తవీర్యుడు"-ఇత్యాదులందు. దీనిచేత "సకగుణహాని ఉపచయాదుల కల్పనయందు సామ్యదార్ఢ్యము విశేషణము" అని విశేషాలంకారమును లక్షిత మొనర్చువారును నిరస్తులైరి.

ఇది విశేషోక్తి ప్రకరణము

## అసంగతిః

అథాసంగతిః — విరుద్ధత్వేనాపాతతో భాసమానం హేతుకార్యయోర్వైయధికరణ్యమసంగతిః.

"స్పృశతి త్వయి యది చాపం
స్వాపం ప్రాపన్న కేఽపి నరపాలాః.
శోణే తు నయనకోణే
కో నేపాలేంద్ర తవ సుఖం స్వపితు."

అత్ర చాపస్పర్శ నయనశోణిమ్నోర్హేత్వోః స్వాపనాశరూపకార్యవైయధికరణ్యేఽతిప్రసంగవారణాయ విరుద్ధేత్యాది. ఇహ చ భిన్నదేశస్థయోరేవ తయోః కార్యప్రయోజకతయా విరోధానవకాశాత్.

నను శోణిమాభివ్యక్తస్య రోషస్య కాలికసంబంధేన హేతుత్వాదస్తు నామ కార్యభిన్నదేశత్వమ్; చాపస్పర్శస్య తు లీలయా కృతస్య స్వరూపతో హేతుత్వాభావాత్తద్జ్ఞానం స్వాపనాశే హేతుత్వేనాభ్యుపగంతవ్యమ్. ఏవం చ తస్య కథం వైయధికరణ్యమితి చేత్, న. ప్రయోజకస్యాపి హేతుపదేనాత్ర గ్రహణాదదోషః. ప్రయోజకత్వం చ చాపస్పర్శస్య భ్రమాత్మకరోషానుమితిలింగత్వాత్.

అనంతర మసంగతి—

(విరుద్ధముగా నాపాతతః భాసించు కార్యకారణముల వైయధికరణ్యము అసంగతి.

"స్పృశతి" మొ. ("నీవు చాపమును ముట్టుకొనగా ఏ రాజులును నిద్రపోలేదు. ఓ నేపాలేశా; నీనయన కోణము ఎఱ్ఱబడగా ఎవడు సుఖముగా నిద్రించును?)

ఇచట హేతువులగు చాపస్పర్శ నయన శోణిమల స్వాపనాశ కా॥ కార్య వైయధికరణ్యమున నతిప్రసంగ వారణకు 'విరుద్ధ' మొ॥ లగునది. ఇచట విభిన్న దేశస్థములైన ఆరెండే కార్యప్రయోజకములగుట విరోధావకాశము లేదు. అయ్యా, శోణిమచే నభివ్యక్తమగు రోషము కాలిక సంబంధముచే హేతువగుట వలన కార్యభిన్న దేశత్వముండును గాక. చా॥ స్పర్శమాత్రమునకు, లీలతో జేసిన దానికి, స్వరూపతః హేతుత్వము లేనందున తద్జ్ఞానము స్వాపనాశనమున హేతువుగా నంగీకరింపవలెను. అ తీరుగా దానికి వైయధికరణ్యమెట్లు అనినచో కాదు ప్రయోజకముగూడ హేతుపదముచే నిచట గ్రహించుటలో దోషములేదు. ప్రయోజకత్వమును చాపస్పర్శ భ్రమాత్మకమైన రోషానుమితికి లింగమగుట వలన.

ఉదాహరణమ్ —

"అఙ్గైః సుకుమారతరైః సా కుసుమానాం శ్రియం హరతి
ప్రహరతి హి కుసుమబాణో జగతీతలవర్తినో యూనః."

యథా వా —

"దృష్టిర్మృగీదృశోఽత్యంతం శ్రుత్యంతపరిశీలినీ
ముచ్యంతే బంధనాత్కాశా విచిత్రా వైధసీ గతిః."

అత్రాద్యోదాహరణే శుద్ధా, ద్వితీయే తు శ్లేషోపబృంహితేతి విశేషః. ప్రహరతీత్యత్రాభేదాధ్యవసాయలక్షణేనాతిశయేనాపరాధ నిమిత్తకతాడనరూపతయావస్థితే కామపీడనే విషయ్యంశమాలంబ్య తం ప్రతి సమానాధికరణతయా ప్రసిద్ధస్య హేతోరపరాధరూపస్య వైయధికరణ్యజ్ఞానాత్పురః స్ఫురన్విరోధో విషయాంశవిమర్శో ... రమ్, తం ప్రతి కుసుమశ్రీహరణాభివ్యక్తశోభావిశేషస్య భావనోప... తస్య తద్భావనాయా వా హేతుత్వస్య ప్రతిసంధానాన్నివర్తత ఇత్య... భేదాధ్యవసానమనుప్రాణకమ్, విరోధాభాసశ్చోత్కర్షకః. ఏవమన్య... త్రాపి బోధ్యమ్.

ఉదాహరణములు—

"అఙ్గైః" మొ. (సుకుమారతరములగు నవయవములతో నావె కుసుమముల సిరిని హరించును. పూవిల్తుడు భూతలమందున్న యువకుల ప్రహరించును గదా!)

మరొకటి—

"దృష్టిః మొ. (ఆమెకంటియొక్క చూపు మిక్కిలిగా శ్రుత్యంతమును పరిశీలించునది. వెంద్రుకలు బంధమునుండి ముక్తములగుచున్నవి. బ్రహ్మ యొక్క గతి విచిత్రము)

ఇచట మొదటి యుదాహరణమున శుద్ధ, రెండవ దానిలో శ్లేషోపబృంహిత అని విశేషము. 'ప్రహరించు చున్నాడు' అనుచోట నభేదాధ్యవసాయ లక్షణమగు నతిశయముచే నపరాధ నిమిత్తక తాడన రూపముగానున్న కామపీడనమున విషయియగు నంశము నవలంబించి దానినిగూర్చి సమానాధికరణముగా ప్రసిద్ధమగు హేతువుకు. అపరాధ రూపమగుదానికి, వ్యధికరణత్వజ్ఞానముకన్నను ముందుగా స్ఫురించు విరోధము విషయాంశమును విమర్శించిన యనంతరము దానినిగూర్చి పువ్వుల శోభ నపహరించుట వలన నభివ్యక్తమగు శోభావిశేషమునకు, భావనోపనీతమునకు గానీ, తద్భావనకుగానీ, హేతుత్వమును ప్రతిసంధాన మొనర్చుటవలన నివర్తించునని అభేధాధ్యవసానము అనుప్రాణకము. విరోధాభాసయున్ను ఉత్కర్షకము. ఈ తీరుగా నితరస్థలముల యందును బోధపరచు కొనవలెను.

అస్యాం చ విభావనాయామివ కార్యాంశేఽతిశయోక్త్యనుప్రాణనమావశ్యకమ్. అన్యథా విరోధో దుష్పరిహర ఏవ స్యాత్, ఇత్యలంకారసర్వస్వకారాదీనాం మతమ్. తచ్చ 'దృష్టిర్మృగీదృశః' ఇత్యస్మన్నిర్మితోదాహరణే వ్యభిచారాదసంగతమ్. నహి 'ముచ్యంతే బంధనాత్కేశాః' ఇత్యత్ర కేశబంధనముక్త్యంశేఽతిశయోక్తిరస్తి. కింతు శ్లేషభిత్తికాభేదాధ్యవసానమాత్రమ్. తస్మాద్ యేన కేనాపి ప్రకారేణ కార్యాంశేఽభేదాధ్యవసానమావశ్యకమితి తు సంగతమ్.

దీనియందు విభావనయందువలె కార్యాంశమునందు నతిశయోక్త్యనుప్రాణనమావశ్యకము; అలాకాకపోయిన యెడల విరోధము పరిహరింపరానిది అగునని అలంకార సర్వస్వకాదుల మతము. అదియు "దృష్టిఃమృగీదృశః" అను మా యుదాహరణమందు వ్యభిచారభావమువలన అసంగతము. 'ముచ్యంతే బంధనాత్కేశాః' అనునీచోట కేశబంధన ముక్త్యంశమందు అతిశయోక్తి లేదు కదా? ఇక నేమనగా శ్లేషభిత్తికమగు నభేదాధ్యవసాన మాత్రము అందువలన ఏదోఒక ప్రకారముతో గార్యాంశమందు నభేధాధ్యవసానమాత్ర మావశ్యకము అని సంగతము.

యద్యపి 'దృష్టిర్మృగీదృశః' ఇత్యాదౌ కారణాంఽపి శ్లేషాది నాభేదాధ్యవసాయః సంభవతి, తథాపి నాసౌ తదంశే నియతః.

ఖిద్యతి సా పథి యాంతీ కోమలచరణా నితంబభారేణ
స్విద్యంతి హంత పరిత స్తద్రూపవిలోకిన స్తరుణాః."

ఇత్యాదౌ భారజనితఖేదాంశే తదభావాత్. న చ తత్రాపి జలపూర్ణఘటాదిభారజనితఖేదేన సహ నితంబభారజనితఖేదస్యాభేదాధ్యవసాయోఽ స్త్యేవేతి వాచ్యమ్. నితంబభారజనితఖేదస్య స్వరూపేణాపి స్వేదజనకత్వేన భారాంతరజనితఖేదాధ్యవసాయానపేక్షణాత్. 'సా బాలా వయమప్రగల్భమనసః సా స్త్రీ వయం కాతరాః' ఇతి ప్రాచీనానాం పద్యే బాలత్వస్త్రీత్వాద్యంశే తల్లేశస్యాప్యసంభవాచ్చ.

విచారించగా—

'దృష్టిః మృగీదృశః' ఇత్యాదులందు కారణాంశమందును శ్లేషతో నభేదాధ్యవసాయము సంభవించును; అయినను ఇది ఆయంశమందే నియతముగా లేదు.

"ఖిద్యతి" మొ. (మృదువగుపాదముగల ఆమె తోవనపోవుచు పిరుదల బరువుచే కష్టపడుచున్నది. ఆమె యొక్క రూపముచే విమోహితులగు తరుణులు చుట్టూరా చమర్చుచున్నారు)

ఇత్యాదులందు భారజనిత ఖేదాంశ మందు నది లేదు గదా ? అక్కడ కూడను జలపూర్ణమగు ఘటాదుల భారమువలన గలిగిన యాయాసముతో కూడ నితంబభారమువలన గలిగిన ఖేదమునకు నభేదాధ్యవసాయ మున్నదనెదరెమో? నితంబభారమువలన గలిగిన ఖేదము స్వస్వరూపముతోనైనను స్వేదజనకమగుటచేత భారాన్తరమువలనవుట్టిన ఖేదము యొక్క నధ్యవసాయమపేక్షించదుకదా ? "సా బాలా వయ మప్రగల్భమనసః సా స్త్రీ వయం కాతరాః"అని ప్రాచీనుల పద్యమునందు బాలాత్వ, స్త్రీత్వాద్యంశమునందు తల్లేశమైనను లేనందున కూడా.

యత్తు 'విరోధాలంకారే హ్యేకస్మిన్నధికరణే ద్వయోః సంబంధాద్విరోధప్రతిభానమ్, అసంగతౌ త్వధికరణద్వయ ఇతి తస్మాదస్య వైలక్షణ్యమ్' ఇతి విమర్శినీకార ఆహ, తదసత్. ఇహాపి తత్తత్కార్యతావచ్ఛేదకధర్మత త్తత్కారణవైయధికరణ్య రూపయోర్ధర్మయోరేక

స్మిన్కార్యరూపేఽధికరణే సంబంధాదేవ విరోధప్రతిభానమ్, ఇహ తూత్పత్తివిమర్శపూర్వికైవ విరోధప్రతిభోత్పత్తిః ఇతి వైలక్షణ్యమితి.

ఏదైతే

"విరోధాలంకారమున ఒకయధికరణమునందు రెంటికి సంబంధము వలన విరోధము ప్రతిభాసించుటయు అసంగతియందు అయితే అధికరణద్వయమునందు అని దానికంటెు దీనికి వైలక్షణ్యము" అని విమర్శనీకారుడు చెప్పెను, అది తప్పు.

ఇక్కడ కూడ తత్తత్కార్యతానిర్ణాయక ధర్మ తత్తత్కారణవైయధికరణ్యరూపములగు, ధర్మములకు నొక కార్యరూపమగు. నధికరణమునందు, సంబంధము వలననే విరోధ ప్రతిభానము ఉదయించును అందువలన, విరోధాలంకారమునందు ఉత్పత్తి విమర్శలేకుండగనే విరోధము ప్రతిభానము. ఇక్కడనైతే నుత్పత్తి విమర్శపూర్వకమైనదే విరోధప్రతిభోత్పత్తి అని వైలక్షణ్యము, అని.

వస్తుతస్తు—వ్యధికరణత్వేన ప్రసిద్ధయోః సమానాధికరణత్వేనోపనిబంధనే విరోధాలంకారః. సమానాధికరణత్వేన ప్రసిద్ధయోర్వైయధికరణ్యేనోపనిబంధనేఽసంగతిః.

ప్రాగుక్తాఽసంగతిలక్షణే హేతుకార్యయోరితి చ సమానాధికరణమాత్రోపలక్షణమ్. తేన 'నేత్రం నిరంజనం తస్యాః శూన్యాస్తు వయమద్భుతమ్' ఇత్యత్ర నిరంజనత్వ శూన్యత్వయోరుత్పాదోత్పాదకభావలక్షణ సంబంధానంతర్భావేణ శుద్ధసమానాధికరణత్వేన ప్రసిద్ధయోరప్యసంగతిః సంగచ్ఛతే; యథాశ్రుతే తు సా న స్యాత్. ఇత్థం చ స్ఫుట విరోధాలంకారాదసంగతేర్భేదః.

వస్తుతః—వ్యధికరణములుగా ప్రసిద్ధములను సమానాధికరణములుగా నుపనిబంధించుట విరోధాలంకారము సమానాధికరణముగా ప్రసిద్ధమగు రెంటిని వైయధికరణ్యముతో నుపనిబంధించిన అసంగతి. వెనుకజెప్పబడిన అసంగతి లక్షణమందు 'హేతుకార్యయోః,' అనునది సమానాధికరణము మాత్రమున కుపలక్షణము .

అందుచేత, "నేత్రం" మొ. అనుచోట నిరంజనత్వశూన్యత్వములకు నుత్పాద్యోత్పాదకభావలక్షణ మగు సంబంధమునం దంతర్భవించకుండుటచేత

శుద్ధసమానాధికరణత్వముతో ప్రసిద్ధమునైనను, అసంగతి సంగత మగును. యథాశ్రుతము నందైతే అది లేకపోవును. ఈ తీరుగా విరోధాలంకార ములకన్న అసంగతికి భేదము స్పష్టమేను.

యస్తు పునర్విరోధాలంకారాదతిరిక్తః శుద్ధవిరోధాంశో విరోధ మూలేషు సర్వేష్వలంకారేష్వనుస్యూతః, ఔపమ్యాంశ ఇవోపమా మూలేషు,సోఽలంకారాణాం కతిపయానాం నిర్వర్తకః, న తు స్వయం పృథగలంకారాస్పదమ్, అలంకారాణాం భణితివిశేషమాత్రరూపత్వాత్. ఏవం చ (యది) విమర్శినీకారోక్తమపి పద్యమనయైవ దిశా నీయతే తదా న దోషః.

ఏదైతే విరోధాలంకారముకన్న నతిరిక్తమగు శుద్ధవిరోధాంశము ఉపమామూలమునందు ఔపమ్యాంశముపలె విరోధమూలములగు అన్ని అలంకారములందును అనుస్యూతముగా నున్నదో, అది కొన్ని యలంకార ములకు నిర్వర్తకము; కానీ స్వయముగా పృథగలంకారములకు నాస్పదము గాదు; అలంకారములు భణితి విశేషమాత్రరూపములగుటవలన. ఈ రీతిగా విమర్శినీకారుడు చెప్పిన పద్యము ఈ త్రోవలో తీసుకొనబడినచో నప్పుడు దోషములేదు.

యత్తు —

"—'అన్యత్ర కరణీయస్య తతోఽన్యత్ర కృతిశ్చ సా
అన్యత్కర్తుం ప్రవృత్తస్య తద్విరుద్ధకృతిస్తథా.
అపారిజాతాం వసుధాం చికీర్షుర్ద్యాం తథాఽకృథాః
గోత్రోద్ధారప్రవృత్తోఽపి గోత్రోద్భేదం పురాకరోః"

అత్ర శ్రీకృష్ణం ప్రతి శక్రస్యోపాలంభవాక్యే భువి చికీర్షిత-తయా తత్ర కరణీయమపారిజాతత్వం దివి కృతమిత్యేకాసంగతిః. పురా గోత్రాయా ఉద్ధారే ప్రవృత్తేన వరాహరూపిణా తద్విరుద్ధం గోత్రా ణాం దలనం ఖురకుట్టనైః కృతమితి ద్వితీయా.

యథా వా —

'త్వత్ఖడ్గఖండితసపత్నవిలాసినీనామ్
భూషా భవంత్యభినవా భువనైకవీర.
నేత్రేషు కంకణమథోరుషు పత్రవల్లీ
ఛోలేంద్రసింహ! తిలకం కరపల్లవేషు

'మోహం జగత్త్రియభువామపనేతు మేత-
దాదాయ రూపమఖిలేశ్వరదేహభాజామ్.
నిఃసీమకాంతిరసనీరధినాముసైవ
మోహం ప్రవర్ధయసి ముగ్ధవిలాసినీనామ్.'

అత్రాద్యోదాహరణే కంకణాదీనామన్యత్ర కరణీయత్వం ప్రసిద్ధమితి నోపన్యస్తమ్. భవతినా భావనారూపాన్యత్ర కృతిరాక్షిప్యతే ఇతి లక్షణానుగతిః' ఇతి కువలయానందకృతాసంగతేరన్యద్ భేదద్వయం లక్షయిత్వోదాహృతమ్. తన్న. తత్ర తావత్ 'అపారిజాతాం వసుధాం చికీర్షన్ద్యాం తథాఽకృథాః' ఇత్యత్ర పారిజాతరాహిత్యచికీర్షయా కారణభూతయా సహ పారిజాతరాహిత్యస్య కార్యస్య విరుద్ధవైయధికరణ్యోపనిబంధనాత్, 'విరుద్ధం భిన్నదేశత్వం కార్యహేత్వోరసంగతిః' ఇతి ప్రాథమికాసంగతితో వైలక్షణ్యానుపపత్తేః. ఆలంబనాఖ్యవిషయతా సంబంధేన చికీర్షాయాః సామానాధికరణ్యేన కార్యమాత్రం ప్రతి హేతుత్వస్య ప్రసిద్ధేః.

ఏదైతే—

"ఒకచోట చేయదగిన దానిని మరియొకయెడ చేయుటయు అదియే. ఒకదానిని చేయుటకు ప్రారంభించినవాడు దానికి విరుద్ధముచేయుటయు. అట్లే భూమిని అపారిజాతముగా జేయదలచుకొన్నవాడవై స్వర్గమును అట్లుచేసితివి. పూర్వము గోత్రోద్ధారమునందు ప్రవృత్తుడవైనను గోత్రోద్భేదమును చేసితివి."

ఇచట శ్రీకృష్ణుని గురించి ఇంద్రుని యుపాలంభనవాక్యములలో భూమియందు, చికీర్షితముగాన నచటచేయదగిన యపారిజాతత్వము నాకాశమునందుచేయబడినదని ఒక అసంగతి పూర్వమున భూమి యొక్క నుద్ధారమున ప్రవృత్తుడగు వరాహరూపిచేత తద్విరుద్ధములగు గోత్రముల దలనము ఖురకుట్టనములచేత చేయబడినదని రెండవది.

మరొకటి—

"త్వత్ఖడ్గ'' మొ (ఓచోళేంద్రసింహుడా! నీ ఖడ్గముచే ఖండింపబడిన శత్రువులయొక్క కాంతలకు కొంగ్రొత్త నగలగుచున్నవి. ఓ భూనాయకా! నేత్రములయందు కంకణము, తొడలయందు మకరికాదిపత్రములున్ను, చిగురుటాకువంటిచేతులయందు తిలకమున్ను).

"మోహం" మొ. (మూడులోకములందు పుట్టిన దేహధారులగువారికి మోహము పోగొట్టుటకై, ఓ అఖిలేశ్వరుడా! యీ రూపమునే తీసుకొని నిస్సీమకాంతిరస సముద్రమగు దీనిచేతనే ముగుదల విలాసినులకు మోహమును వృద్ధిపొందించుచున్నావు).

ఇచట మొదటియుదాహరణమున కంకణాదులకు మరియొకచోట కరణీయత్వము ప్రసిద్ధమని ఉపన్యసింపబడలేదు. భవతిచే భావనారూపమై మరియొకచోట చేయుట నాతి ప్తమగుచున్నది, అని లక్షణానుగమన మని కువలయానందకారులు అసంగతి యొక్క మరియొక భేదద్వయమును లక్షించి ఉదాహరించెను. అదికాదు-

అచనైతే—

"అపారిజాతాం వసుధాం చికీర్షన్ద్యాంతథాకృథాః" అనుచోట కారణభూతమైన పారిజాతరాహిత్యమును చేయుదలంపుతో కూడ, పారిజాత రాహిత్యమునకు, కార్యమగుదానికి, విరుద్ధమగు వైయ్యధికరణ్యమును నిబంధించుటవలన. "కార్యకారణ విరుద్ధమగు భిన్నదేశత్వము అసంగతి" అను మొదటి అసంగతికంటె వైలక్షణ్యము కుదురలేదు ఆలంబనాఖ్యమగు విషయతా సంబంధముచే చికీర్షకు సామానాధికరణ్యముచేత కార్య మాత్రమును గురించి హేతుత్వము ప్రసిద్ధము గనుక.

న చ పారిజాతరాహిత్యస్యాభావరూపస్య నిత్యత్వాత్కారణా ప్రసిద్ధిరితి వాచ్యమ్. ఆలంకారికనయే తస్యాపి జన్యత్వస్యేష్టేః. లక్షణే కార్యకారణపదయోరుపలక్షణత్వస్యోక్తత్వాచ్చ. 'గోత్రోద్ధారప్రవృత్తోఽపి' ఇత్యుదాహరణే తు 'విరుద్ధాత్కార్యసంపత్తిర్దృష్టా కాచిద్ విభావనా' ఇతి పంచమవిభావనాలక్షణాక్రాంతత్వాద్విభావనయైవ గతార్థత్వాదసంగతిభేదాంతరకల్పనానుచితా. గోత్రోద్ధారవిషయక ప్రవృత్తేర్గోత్రోద్భేదరూపకార్యే విరుద్ధత్వాత్. సిద్ధాంతేఽపి విభావనా విశేషోక్త్యోః సంకర ఏవాత్రోచితః. 'నేత్రేషు కంకణమ్' ఇత్యాదౌ కంకణత్వనేత్రాలంకారత్వయోర్వ్యధికరణత్వేన ప్రసిద్ధయోః సామానాధికరణ్యావర్ణనాద్విరోధాభాసత్వముచితమ్. ఏవం మోహనివర్తకత్వ మోహజనకత్వయోరపీతి. నను తథాపి విరోధాభాసేనైవోపపత్తేర్వి

భావనాదికల్పనానర్థక్యమితి చేత్, న. దత్తోత్తరత్వాత్.
ఇతి రసగంగాధరేఽసంగతి ప్రకరణమ్

పారిజాతరాహిత్యము స్వభావరూపము గనుక నిత్యమగుటవలన కారణా ప్రసిద్ధియనరాదు అలంకారికమతమునందు నదియు జన్యమగుట ఇష్టము కనుక. లక్షణమందు కార్యకారణపదములు ఉపలక్షణము అని చెప్పబడినది కనుకనున్ను.

"గోత్రోద్ధార ప్రవృత్తోఽపి" అనే ఉదాహరణమందైతే 'విరుద్ధాత్' ఇత్యాది పంచమవిభావనాలక్షణాక్రాంతమగుటవలన విభావనతోనే గతార్థముగనుక అసంగతి భేదాన్తరకల్పన ముచితముగానేకాదు; గోత్రోద్ధారవిషయక మగు ప్రవృత్తి గోత్రోద్భేద రూపమగు కార్యమున విరుద్ధముకనుక. సిద్ధాంతమునందైనను ఇచట విభావనా విశేషోక్తులకు సంకరమే యుచితము.

"నేత్రేషు కంకణం" ఇత్యాదులందు కంకణత్వనేత్రాలంకారత్వాదులు, వ్యధికరణములుగా ప్రసిద్ధములుగనుక, వానికి సామానాధికరణ్యము వర్ణితమైనది గనుక విరోధాభాసయనుట ఉచితము. అలాగే మోహనివర్తకత్వము మోహజనకత్వమును విరుద్ధములుగనుక వాటికిన్నీ ఇట్లే తెలియవలెను.

అయితే- నీకు గూడా విరోధాభాసతోనే కుదురుచుండగా విభావనాది కల్పన నిరర్థకము కాదా, అందురా దానికి జవాబు నిదివరకే చెప్పితిమి.
ఇది అసంగతి ప్రకరణము

## విషమాలంకారః

అథ విషమాలంకారః—

అననురూపసంసర్గో విషమమ్. అనురూపమితి యోగ్యతా యామవ్యయీభావః. అనురూపం యత్ర న విద్యత ఇతి విగ్రహేతేన బహువ్రీహిణా యోగ్యతారహితముచ్యతే. యోగ్యతా చ యుక్తమిదమితి లౌకికవ్యవహారగోచరతా. సంసర్గశ్చ తావద్ ద్వివిధః— ఉత్పత్తిలక్షణః సంయోగాదిలక్షణశ్చ. తత్రోత్పత్తిలక్షణస్య సంసర్గస్యాయోగ్యత్వం కారణాత్స్వగుణవిలక్షణగుణ కార్యోత్పత్త్యా, ఇష్టసాధనతయా నిశ్చితాత్కారణాదనిష్టకార్యోత్పత్తిభిః. సంయోగాది

లక్షణస్యాపి సంసర్గిణోరన్యతరగుణస్వరూప తిరస్కార్యాన్యతరగుణ స్వరూపతయా అయోగ్యత్వమ్. ఏవంచానను రూపసంసర్గత్వేన సామాన్యేనోక్తా వక్ష్యమాణాశ్చ సర్వేప్రభేదాః సంగృహ్యంతే.

అనంతరము విషమాలంకారము –

అననురూపసంసర్గము విషమాలంకారము అనురూపమని యోగ్యత యందవ్యయీభావము. అనురూపము ఎచటలేకున్నదో, అని విగ్రహము, చేయబడిన బహువ్రీహిచే యోగ్యతారహితము. చెప్పబడను యోగ్యత అనగా యుక్తమిదియని లౌకికవ్యవహారమునకు గోచరత్వము. సంసర్గము రెండు విధములు – ఉత్పత్తిలక్షణము, సంయోగాదిలక్షణమును. అచట ఉత్పత్తిలక్షణమగు సంసర్గమునకు అయోగ్యత్వము కారణమువలన స్వగుణ విలక్షణగుణములుకల కార్యము ఉత్పత్తిచేత, ఇష్టసాధనముగా నిశ్చితమగు కారణమునుండిఅనిష్టకారోత్పత్తులచేతనున్న సంయోగాదిలక్షణమునకున్న సంసర్గులకు నన్యతర గుణస్వరూపతిరస్కార్యన్యతర గుణస్వరూపము లగుట చేత నయోగ్యత్వము. ఇలాగ అననురూపమగు సంసర్గత్వముచే సామాన్య ముగా చెప్పబడినదియు చెప్పబడపోవునదియును అగు నన్ని ప్రభేదములు సంగ్రహింపబడినవి.

క్రమేణోదాహరణాని—

"అమృతలహరీచంద్రజ్యోత్స్నా రమా వదనాంబుజా
న్యధరితవతో నిర్మర్యాదప్రసాద మహాంబుధేః.
ఉదభవదయం దేవ త్వత్తః కథం పరమోల్బణ—
ప్రలయదహనజ్వాలాజాలాకులో మహసాం గణః.

అత్ర మాధుర్య శైత్యాహ్లాదకత్వప్రసాదాద్యనేకగుణయు క్తాత్కారణాత్తద్విరుద్ధగుణయుక్తస్య ప్రతాపస్యోత్పత్తిరిత్యనను రూపః కార్యకారణభావః. అభేదాధ్యవసానలక్షణేనాతిశయేన సమ వాయికారణరూపతయా స్థితే నిమిత్తకారణే సమవేతకార్యరూపతయా స్థితే నిమిత్తకార్యే వా విషయ్యంశమవలంబ్య స్ఫురితో విరోధో విషయాంశవిమర్శోత్తరం నివర్తతే ఇతీహాప్యభేదాధ్యవసానస్యాను ప్రాణకత్వమ్, తదుత్థాపితవిరోధాభాసస్య చ పరిపోషకత్వమ్. అయ మేవ చాంశోఽత్ర కవిప్రతిభానిర్మితత్వాదలంకారతాబీజమ్.

క్రమముగా నుదాహరణములు -

"అమృతలహరీ" మొ. (అమృతప్రవాహము, చంద్రుని వెన్నెల, లక్ష్మీముఖ పద్మము, వాటిని తక్కువచేసి నట్టియు, అవధిలేని అనుగ్రహ మహాసముద్రమైన నీ నుండి ఓ దేవా! మిక్కిలి ఉల్బణమైన ప్రళయాగ్ని యొక్క మంటలచే వ్యాకులమైన తేజస్సు సమూహము ఎట్లు కలిగినది?)

ఇచట మాధుర్యశైత్యాహ్లాదకత్వ ప్రసాదాద్యనేకగుణయుక్తమగు కారణమునుండి తద్విరుద్ధగుణయుక్తమైన ప్రతాపముయొక్క ఉత్పత్తి అని అననురూపమగు కార్యకారణభావము. అభేదాధ్యవసాన లక్షణమగు నతిశ యముతో సమవాయికారణరూపముగా నిలచిన నిమిత్తకారణమునందుగాని, సమవేతకార్యరూపముగ నిలచిన నిమిత్తకార్యమునందుగాని విషయాంశ మును దీసుకొని స్ఫురించిన విరోధము విషయాంశవిమర్శనము తరువాత నివర్తించును, అని ఇక్కడకూడ నభేధాధ్యవసానమునకు, ననుప్రాణకత్వము; తదుత్థాపితమగు విరోధాభాసమునకు పరిపోషకత్వము. ఇదియే అంశమిచట కవి ప్రతిభానిర్మితమగుటవలన అలంకారతాబీజము.

ఇష్టసాధనతయా జ్ఞాతాత్కారణాదనిష్టకార్యోత్పత్తిభిరిత్య త్రైకశేషఘటిత ఏకశేషో బోధ్యః. న ఇష్టమనిష్టమ్ అనర్థః. తాదృశ కార్యోత్పత్తిశ్చ, న ఇష్టకార్యోత్పత్తిరనిష్టకార్యోత్పత్తిః సా చేత్య నిష్టకార్యోత్పత్తీ. తే చ అనిష్టకార్యోత్పత్తిశ్చ. అనిష్టకార్యోత్ప త్తయః తాభిరితి. అనేనేష్టకార్యానుత్పత్త్యనిష్టకార్యోత్పత్తీ మిలితే ఏకో భేదః. ప్రత్యేకం చ భేదద్వయమ్, ఇతి త్రయో భేదాః సం గృహీతా భవంతి. ఇష్టం చ — స్వస్య కించిత్సుఖసాధనవస్తు ప్రాప్తిర్దుఃఖసాధనవస్తునివృత్తిశ్చ పరస్య దుఃఖసాధనవస్తు ప్రాపణమ్ సుఖసాధవనివృత్తిశ్చేతి చతుర్విధమ్. తేనేష్టాప్రాప్తిఘటితే భేదద్వ యేఽపి చాతుర్విధ్యమ్. అనిష్టం చ - స్వస్య దుఃఖసాధన వస్తు ప్రాప్తిః, పరస్య సుఖసాధన వస్తుప్రాప్తిః, దుఃఖసాధన వస్తునాశశ్చేతి త్రివిధమ్. స్వస్యేష్టాప్రాప్తిస్తు గణితేతి నానిష్టే గణ్యతే. తేనానిష్ట ప్రాప్తిఘటితే భేదద్వయేఽపి త్రైవిధ్యమ్.

ఇష్టసాధనముగా దెలియబడిన కారణమునుండి అనిష్టకార్యోత్పత్తుల చేతనని ఏకశేషఘటితమైన ఏకశేషము దెలియవలెను. న + ఇష్టం = అనిష్టమ్.

అనర్థము. అటువంటి కార్యోత్పత్తియున్ను, న+ఇష్టకార్యోత్పత్తిః, అనిష్ట కార్యోత్పత్తిః' ఆ రెండును అనిష్టకార్యోత్పత్తియున్ను అనిష్టకార్యోత్పత్తులు, వాటిచేత నని ఈ విధముగ ఇష్టకార్యానుత్పత్తి, అనిష్టకార్యోత్పత్తి ఈ రెంటికలయిక ఒకభేదము. ప్రత్యేకముగా రెండు భేదములు, అని మూడుభేదములు సంగ్రహింపబడుచున్నవి. ఇష్టమున్ను తనకు సుఖసాధనవస్తుప్రాప్తియు దుఃఖసాధనవస్తునివృత్తియును, శత్రువుకు దుఃఖసాధన వస్తుప్రాపణము, సుఖసాధనవస్తు నివృత్తియును అని నాల్గువిధములు. అందుచేత ఇష్టప్రాప్తిగలసిన రెండుభేదములును నాల్గువిధములు.

అనిష్టమున్ను తనకు దుఃఖసాధన వస్తుప్రాప్తి, శత్రువుకు సుఖసాధన వస్తుప్రాప్తియు, దుఃఖసాధనవస్తునాశనమున్ను అని మూడువిధములు; తన యిష్టప్రాప్తియైతే గణితమైనదిగాన అనిష్టమునందు గణింపబడదు. దానిచేత అనిష్టప్రాప్తి ఘటితమగు భేదద్వయమును మూడువిధములు.

దిఙ్మాత్రం తూపదర్శ్యతే, ఉదాహరణమ్—

'దూరీకర్తుం ప్రియం బాలా పద్మేనాతాడయద్రుషా.
స బాణేనాహతస్తేన తామాశు పరిషస్వజే'

అత్ర ప్రియదూరీకరణరూపేష్టార్థం ప్రయుక్తేన పద్మతాడనరూపేణ కారణేన ప్రియదూరీ కరణం తు దూరాపాస్తమ్, ప్రత్యుత తత్కర్తృక పరిష్వంగరూపానిష్టస్యోత్పత్తిః, యథా వా—

'ఖంజనదృశా నికుంజం గతవత్యా గాం గవేషయితుమ్
అపహారితాః సమస్తా గావో హరివదనపంకజాలోకాత్'.

పూర్వోదాహరణే వాస్తవమేవానిష్టమ్, ఇహ తు సకలేంద్రియ హరణం యద్యపి లోకేఽనిష్టప్రాయమేవ తథాపి తత్పురస్కారేణేహ చమత్కృతిరాహిత్యా ద్గోహరణపురస్కారేణైవ చమత్కారాత్ శ్లేషమూలకాభేదాధ్యవసానే సకలసురభిహరణరూపానిష్టాత్మనా స్థితం తదితి విశేషః.

గవేష్యమాణగవీరూపేష్టాప్రాప్తేరనుక్తత్వాత్కేవలానిష్టప్రాప్తేరిదముదాహరణమ్, పూర్వం తూభయస్యేతి విశేషో న వాచ్యః సమస్తగవీహరణేవ సామాన్యేన గవేష్యమాణాయా అపి గోరపహారస్య ప్రత్యయాత్.

ది జ్ఞాత్రమే కనబరచబడుచున్నది -

ఉదాహరణము.

"దూరీకర్తుం" మొ. (ప్రియుని దూరమొనర్చుటకై బాల పద్మముతో కోపముచే కొట్టెను వాడు బాణముచే కొట్టబడినవాడై దానిని శీఘ్రముగా కౌగలించుకొనెను )

ఇచట ప్రియ దూరీకరణరూపమగు ఇష్టముకొరకును ప్రయోగించిన పద్మతాడనరూపమగు కారణముచేత, ప్రియదూరీకరణము మాట అటుంచి ప్రత్యుత తత్కర్తృకపరిష్వంగరూపమగు అనిష్టోత్పత్తి.

మరొకటి --

"ఖంజన దృశా" మొ. (కాటుకపిట్టవంటి చూపులుగల స్త్రీ ఆవును వెదుకుటకు పొదరింటిలోనికిపోగా కృష్ణుని ముఖపద్మమును చూచుటవలన సమస్తములగు గోవులును అపహరింప చేయబడినవి.)

పూర్వోదాహరణమందు వాస్తవమే యనిష్టము, ఇచటనైతే సకలేంద్రియహరణము. అయితే లోకములో ననిష్టప్రాయమే అయినను దానిపురస్కారముతో నిచట చమత్కృతి రాహిత్యమగుటవలన గోహరణ పురస్కారముచేతనే, చమత్కారము ఘటనలన శ్లేషమూలకాభేదాధ్యవసానమందు సకల సురభిహరణరూపమగు అనిష్టాత్మగా నదియున్నది అని విశేషము. వెదకబడుచున్న గవీరూపమగు నిష్టముయొక్క అప్రాప్తిచెప్పబడలేదు కనుక కేవలానిష్టప్రాప్తి కిది యుదాహరణము, ఇదివరకు చెప్పినది రెంటికిని అని విశేషము చెప్పకూడదు సమస్తగవీహరణమగు సామాన్యముచే గవేష్యమాణమైన గోవునపహరణము కూడ ప్రతీతమైనది కదా?

ఏవమిష్టాప్రాప్త్యనిష్టప్రాప్త్యుభయకృతా సంసర్గస్యానమరూపతా సామాన్యేనోక్తా. పూర్వోక్త చతుర్భేదాయా ఇష్టాప్రాప్తేః పూర్వోక్తత్రి భేదేనానిష్టేవ సంసృష్టావియమేవ ద్వాదశవిధా. తత్ర స్వస్య సుఖ సాధన వస్త్వప్రాప్తి దుఃఖసాధన వస్తు ప్రాప్తిరూప ఉభయభేద స్తావదుదాహ్రియతే. స్వస్య దుఃఖ సాధన వస్త్వనివృత్తిదుఃఖాంతర సాధనావాప్తిరూపద్వయం యథా --

'రూపారుచిం నిరసితుం రసయంత్యా హరిముఖేందులావణ్యమ్
సుదృశః శివ శివ సకలే జాతా సకలేవరే జగత్యరుచిః'

అత్ర యద్యపి బ్రహ్మదర్శనోత్తరం జాతాయామపి జగతి వైరాగ్యలక్షణాయామరుచౌ భగవద్వదనలావణ్యాదర్శనాద్రూపారుచిర్విలక్షణా యా కాచిత్సా నివృత్తైవేతి వక్తుం శక్యతే, తథాపి జగదరుచిత్వేన సకలారుచీనామభేదాధ్యవసాయాద్రూపారుచినివృత్తేరప్రత్యయ ఏవ. అన్యథా సుఖహేతోర్వైరాగ్యలక్షణాయా అరుచేర్దుఃఖాంతరసాధనత్వం దురుపపాదం స్యాదితి భవత్యుభయోదాహరణమ్.

ఈ తీరుగా నిక్కడను ఇష్టాప్రాప్త్యనిష్టప్రాప్త్యుభయకృతమగు సంసర్గమునకు అననురూపత్వము సామాన్యముగా చెప్పబడినది.

వెనుక జెప్పబడిన నాల్గుభేదములుగల ఇష్టప్రాప్తికి పూర్వోక్తత్రిభేదములగు ననిష్టముతో సంసృష్టియందు నిదియే పన్నెండు విధములు. అక్కడ తనకు సుఖసాధన వస్త్వప్రాప్తి దుఃఖసాధన వస్తుప్రాప్తి రూపోభయభేదమున్ను ఉదాహరింపబడినది. తనకు దుఃఖసాధనవస్త్వనివృత్తి దుఃఖాన్తరసాధనావాప్తి రూపమగు ద్వయము ఎట్లనగా –

"రూపారుచిం" మొ. (రూపములందలి అప్రీతిని నిరసించుటకు కృష్ణుని ముఖేందులావణ్యములు ఆస్వాదించుచుండిన వనితకు శివ! శివ ! శరీరముతో కూడిన యీ జగమున నంతటను అరుచి కల్గెను )

ఇచట విచారించగా బ్రహ్మదర్శనానన్తరము జగత్తునందు వైరాగ్యలక్షణమగు నరుచికలిగినను, భగవద్వదనలావణ్య దర్శనమువలన రూపారుచి, విలక్షణమైనది ఏ ఒకటి కలదో నది నివృత్తమైనదేనని చెప్పుటకు వీలగును. అలాగైనను జగదరుచిగా సకలారుచులకు నభేధాధ్యవసానము వలన రూపారుచి నివృత్తి కప్రప్యయమే అలా గానియెడల సుఖహేతువగు వైరాగ్యలక్షణమైన యరుచికి దుఃఖాన్తర సాధనత్వము నుపపాదించుటకు వీలుగావని ఇది ఉభయోదాహరణమగును.

పరస్య దుఃఖసాధనానవాప్తిః స్వస్య దుఃఖాంతరసాధనప్రాప్తిరిత్యుభయం యథా ——

'పురో గీర్వాణానాం పులకితకపోలం ప్రథయతో
భుజప్రౌఢిం సాక్షాద్ భగవతి శరం సంముఖయితుమ్.
స్మరస్య స్వర్బాలా నయనసుమమాలార్చితమహో
వపుః సద్యో భాలానలభసితజాలాస్పదమభూత్.'

పరస్య సుఖసాధనానివృత్తిః స్వస్య దుఃఖసాధనప్రాప్తిరిత్యుభయం యథా —

'న మిశ్రయతి లోచనే సహాసితం న సంభాషతే
కథాసు తవ కిం చ సా విరచయత్యరాలాం భ్రువమ్.
విపక్షసుదృశః కథామితి నివేదయంత్యా పురః
ప్రియస్య, శిథిలీకృతః స్వవిషయోఽనురాగగ్రహః'

అత్ర కయాచిత్ప్రౌఢనాయికయా సపత్న్యాం ప్రియేణాజ్ఞాతయౌవనాత్వేనైవ విదితాయాం తదనురాగప్రతిబంధార్థం ప్రియస్య పురస్తదీయదుర్గుణానావేదయంత్యా చికీర్షితోఽర్థో న సంపాదితః. స్వస్మిన్ననురాగక్షతిశ్చ సంపాదితేతి యద్యపి సుఖసాధననివృత్తేర్దుఃఖసాధనరూపత్వాన్న పృథగ్గణనోచితా, తథాపి దుఃఖసాధననివృత్తౌ సుఖస్యేవ సుఖసాధననివృత్తౌ ప్రతినియతకారణజన్యత్వేన దుఃఖస్యానైయత్యాత్పృథగుపాదానమ్. ఏవమష్టావన్యేప్యుభయభేదా ఊహ్యాః.

పరులకు దుఃఖసాధనా ప్రాప్తి తనకు దుఃఖాన్తర సాధన ప్రాప్తి అని ఉభయము. ఎట్లనగా -

"పురో గీర్వాణానాం" మొ. (దేవతలముందర, చెక్కిళ్లు పులకరించగా సాక్షాత్తు భగవంతునియందు శరముసంధిముఖమును గా నొనర్చుటకు భుజప్రౌఢిని ప్రకటించుచున్న మన్మథునియొక్క, స్వర్గలోక స్త్రీలయొక్క నేత్రము లనెడు పూలదండలచే అర్థింపబడిన శరీరము అవెంటనే ఫాలనేత్రమునందలి అగ్నిలో భస్మముయొక్క ప్రోవునకు స్థానమయ్యెను)

పరులకు దుఃఖసాధనా నివృత్తి, తనకు దుఃఖసాధనప్రాప్తి యని. ఉభయ మెట్లనగా.

"న మిశ్రయతి" మొ. (కనులను కలుపదు; నవ్వుతో మాట్లాడదు, నీ కథలయందు ఆమె కుటిలమగు కనుబొమ్మను రచించును; అని ఈ తీరుగా సవతియొక్క కథను ప్రియునిముందు చెప్పుచుండగా తన విషయమునందు అనురాగపుబిగము శిథిలీకృతమయ్యెను)

ఇచట నొకానొక ప్రౌఢనాయిక, సవతియందు, ప్రియునిచే యౌవ్వనము వచ్చినదని తెలియకపోవుటచేతనే తెలియబడిన దానియందు, తదనురాగ

ప్రతిబంధార్థమై ప్రియనిముందు తదీయదుర్గుణముల దెల్పుచుండగా, చేయదలచుకున్న ప్రయోజనము సంపాదితముగాలేదు; తనయందనురాగక్షతియు సంపాదింపబడినది. అని సుఖసాధననివృత్తి, దుఃఖసాధనరూపమగుటవలన పృథగ్గణనము చిత్రముగాదు; అయినను దుఃఖసాధన నివృత్తియందు సుఖమునకువలె సుఖసాధన నివృత్తియందు ప్రతి నియతమగు కారణములచే జన్యమగుటచేతను దుఃఖమునకు నసైయ్యత్వము గనుక పృథగుపాదానము. ఈ తీరుగా నెనిమిది ఇతరనులగు నుభయభేదము లున్ను ఉదాహరించవలెను.

కేవలేష్టాప్రాప్తిర్యథా —

'ప్రభాతసమయప్రభాం ప్రణయిని హ్నువానా రసా-
దముష్య నయనాంబుజం సపది పాణినామీలయత్.
అనేన ఖలు పద్మినీ పరిమలాలిపాటచ్చరైః
సమీరశిశుకైశ్చిరాదనుమితో దినేశోదయః'

అత్ర ప్రియతమకర్తృకప్రభాతవిషయకజ్ఞానాభావః కామిన్యాః సుఖసాధనతయేష్టః. స చ తయా సాధ్యమానోఽపి న సిద్ధ ఇతీష్టాప్రాప్తిరేవ. యద్వా తాదృశజ్ఞానం తస్యా దుఃఖసాధనమ్, తన్నివృత్తిరూపం చేష్టం సాధ్యమానమపి న తథేతి సైవ. ఏవం చ ద్విప్రకారాపీష్టాప్రాప్తిరేవాత్ర సంభవతి. ప్రకారాంతరం చాస్యా అప్యూహ్యమ్. కేవలానిష్టప్రాప్తిర్యథా —

'ముకులిత నయనం కరిణో గండం కండూయతో విషద్రుతలే
ఉదభూదకాండదహనజ్వాలాజాలాకులో దేహః'

అత్ర నేష్టాప్రాప్తిః, ముకులితనయనమిత్యనేన కండూయనజన్యసుఖస్య ప్రాప్తేః. కిం త్వనిష్టప్రాప్తిరేవ. అస్యా అపి భేదద్వయం యథాయథమూహ్యమ్. గ్రంథవిస్తరభయాన్నేహోదాహ్రియతే. ఏతేచేష్టసాధనత్వేన నిశ్చితాత్కారణాదనిష్టకార్యోత్పత్తీనాం సర్వేఽపి ప్రభేదా వక్ష్యమాణవిషాదనాలంకారసంకీర్ణా ఏవేతి తత్ప్రకరణే నిరూపయిష్యామః.

కేవలేష్టాప్రాప్తి యెట్లనగా —

"ప్రభాత" మొ. (తెల్లవారు నప్పటికాంతిని ప్రేమగల యువకుని యందు కప్పిపుచ్చుచున్నదై ప్రీతివలన యితని నేత్రాంబుజమును వెంటనే

చేయితో మూసెను. ఇతనిచేత తామరతీవెయొక్క పరిమళసమూహమునకు దొంగలైనట్టి పిల్లగాలులచే చాలా కాలమునకు సూర్యోదయము ఊహింప బడినది.)

ఇచట ప్రియతమకర్తృక ప్రభాతవిషయక జ్ఞానాభావము కామినికి సుఖ సాధనమగుటచే ఇష్టము. అదియు ఆమెచే సాధింపబడుచున్నను సిద్ధము గాలేదు. అది ఇష్టాప్రాప్తియే. అథవా, తాదృశజ్ఞానము ఆమెకు దుఃఖసాధనము; త న్నివృత్తిరూపమగు నిష్టమున్ను సాధింపబడుచున్నను అలా గాలేదు అని అదియే ఈ తీరుగా రెండు తీరులైనను ఇష్టాప్రాప్తియే ఇచ్చట సంభవించు చున్నది. ప్రకారాన్తరము దీనికి నూహింపవలయును

కేవలా నిష్టప్రాప్తి యెట్లనగా —

“ముకుళితనయనం” మొ. (ఏనుగు చెక్కిలిని కనులు మూసుకొని విషవృక్షతటమునందు గోకుకొనుచుండగా దేహము అకాండదహన జ్వాలల జాలముచే వ్యాప్తమయ్యెను.)

ఇట ఇష్టాప్రాప్తిలేదు; ముకుళితనయనమనుటచేత గోకుటవలన గలి గిన సుఖము ప్రాప్తించుటవలన ఇక నేమనగా అనిష్టప్రాప్తియే; దీనికి రెండు భేదముల యథాసంభవముగనూహించవలె. గ్రంథవిస్తరభీతిచే నుదాహరిం చుట లేదు. ఈ ఇష్టసాధనత్వముచే నిశ్చితమైన కారణమునుండి అనిష్టకార్యో త్పత్తులన్నిటికి ప్రభేదములు చెప్పబోవు విషాదనాలంకారముతో సంకీర్ణములే అని ఆప్రకరణములో నిరూపించెదము.

యత్తు—‘అనిష్టస్యాప్యవాప్తిశ్చ తదిష్టార్థసముద్యమాత్’ ఇతి విషమభేదలక్షణం నిర్మాయ అపిశబ్దసంగృహీతతయా ఇష్టానవాప్తి శ్చేతి ప్రత్యేకమపి విషమపదేనాన్వయః’ ఇత్యుక్తం కువలయానంద కృతా, తన్న, అవ్యుత్పత్తేః. అస్మిన్‌గ్రామే దేవదత్తస్య ద్రవ్యస్యాపి లాభోఽస్తీత్యాదౌ ద్రవ్యశబ్దోత్తరాపిశబ్దసముచ్చితస్యవిద్యాదేర్ద్రవ్యా న్వయిన్యేవాన్వయాద్ ద్రవ్యస్య లాభో విద్యాయాశ్చ లాభ ఇతి ధీరితి నిర్వివాదమ్. ప్రకృతే త్వనిష్టస్యాపీతినాన్వయః, ఇష్టానవా ప్తేశ్చ తచ్ఛబ్దపరామృష్టేన విషయేణేతి వైషమ్యాత్. ప్రత్యుత లక్షణ

వాక్యేఽపిశబ్దోఽనిష్టాం ధియముత్పాదయతి. అనిష్టస్యావాప్తిరిష్టస్య చేతి ప్రతీతేః. చకారసముచ్చితయా ఇష్టానవాప్త్యా అనిష్టావాప్తేరేక వారం మిలితాయా స్తత్పదపరామృష్టేన విషయేణాన్వయాద్వాక్యా వృత్త్యా వారాంతరే చ ప్రత్యేకమన్వయాద్భేదత్రయసంగ్రహ ఇతి తు స్యాదపి. న త్వపిశబ్దవికత్థనమ్.

ఏదైతే —

"అనిష్టస్యాప్యవాప్తిశ్చ తదిష్టార్థసముద్యమాత్" అని విషమాలంకార భేద లక్షణము చెప్పి "అపిశబ్దసంగృహీతతయా ఇష్టానవాప్తిశ్చేతి ప్రత్యేకమపి విషమ పదేనాన్వయః" అపిశబ్దముచేత సంగ్రహింపబడినది గనుక ఇష్టాన వాప్తియున్ను అని ప్రత్యేకముగా నైనను విషమపదముతో నన్వయము అని కువలయానందకారులు చెప్పిరి. అదియు క్తము కాదు. వ్యుత్పత్తి విరోధమువలన "ఈ గ్రామమునందు దేవదత్తునకు ద్రవ్యము యొక్క లాభమున్నది" మొదలగు దానియందు ద్రవ్యశబ్దమునకు నుత్తర మందున్న అపిశబ్దముచే సముచ్చితములగు విద్యాదులకు ద్రవ్యముతో నన్వ యించునట్టి దానితోడనే నన్వయించుటవలన ద్రవ్యమునకు లాభము, విద్య కున్ను లాభము అని బుద్ధి అని నిర్వివాదము. ప్రకృతములోనైతే అనిష్టము నకు "ఆప్నోతి"తో నన్వయము. ఇష్టానవాప్తికిన్ని తచ్ఛబ్దముద్వారా పరామృష్టమగు విషమాలంకారముతోనని వైషమ్యము ఉన్నదిగనుక. ప్రత్యుత లక్షణవాక్యమందు అపిశబ్దము అనిష్టమగుబుద్ధిని పుట్టించుచున్నది. అనిష్టము యొక్క ప్రాప్తి ఇష్టముయొక్కయూ, అని ప్రతీతివలన. చకారసముచ్చిత మగు ఇష్టాప్రాప్తి ఒకసారి మిలితముకాగా, తత్పదముచే పరామృష్టమగు విషమముతో నన్వయించుటవలన వాక్యావృత్తిచే వారాంతరమందున్ను ప్రత్యేకముగా నన్వయమువలన భేదత్రయమును సంగ్రహింపబడినది అని కావ చ్చును. అంతేకాని అపిశబ్దము వికత్థనము యుక్తము కాదు.

యదపి తేనైవోదాహృతమ్— 'భక్ష్యాశయాహిమంజూషాం దృష్ట్వాఖుస్తేన భక్షితః' ఇతి. అత్ర క్త్వాప్రకృతిక్రియాకర్తృకర్తృకోత్తర కాలవర్తిక్రియాంతరస్యాప్రయుక్తత్వాదగమ్యమానత్వాచ్చ ప్రవిష్ట ఇతి పదాకాంక్షితయా న్యూనపదత్వమ్.

యదపి కేవలేష్టానవాప్తౌ తేనైవోదాజహ్రే —

"ఖిన్నోఽసి ముంచ శైలం బిభృమో వయమితి వదత్సు

శిథిలభుజః.

భరభుగ్నవితతబాహుషు గోపేషు హసన్హరిర్జయతి."

ఇతి. తదపి న రమణీయమ్. అత్ర భరభుగ్నవితతేత్యాదినా బాహుగతాస్థిసంధిభంగరూపానిష్టప్రాప్తేః సాక్షాదుపాత్తత్వాత్స ర్వాంగచూర్ణీభావ గర్వాపహారరూపాయాశ్చ స్ఫుటం గమ్యమానత్వాత్ కథమిష్టాప్రాప్తిమాత్రమిత్యుచ్యతే. ఏతేన 'శైలపతనరూపానిష్టావాప్తిస్తు భగవత్కరాంబుజస్పర్శమహిమ్నా న జాతా' ఇతి యదుక్తమ్ తదప్యసారమేవ. అనిష్టానాముక్తత్వాత్.

ఏవముత్పత్తిలక్షణసంసర్గస్యాననురూపత్వం నిరూపితమ్.

మరియు అతడే ఇట్లు ఉదాహరించెను —

"భక్ష్యాశయాహిమంజూషాం దష్ట్వాఖుః తేన భక్షితః" అని—

ఇచట క్త్వాప్రకృతి క్రియాకర్తృ కర్తృకోత్తర కాలవర్తి క్రియాంతరము ప్రయోగించనందునను, గమ్యము కానందునను 'ప్రవిష్టః' అను పదము నాకాంక్షించుటచే న్యూనపదత్వము. ఇంకను ఏదైతే కేవల ఇష్టానవాప్తియందు ఆయనచేత నుదహరింపబడెనో—

"ఖిన్నోఽసి" ము (అలసిపోయితివి; కొండను విడువుము; మేము మోసెదము; అని గోపకులు పలుకుచుండగా భుజము పట్టువదిలి బరువుచే భంగమునొందిన విస్తారమైన చేతులుగలిగిన గొల్లలను జూచుచు నవ్వుచున్న హరి జయించుచున్నాడు)

అని అదియును రమణీయముగా లేదు! ఇచట 'భరభుగ్న వితత' ఇత్యాదిచే బాహువులందున్న ఎముకలసందుల యొక్క భంగరూపమగు ననిష్టప్రాప్తి సాక్షాత్తుగా నుపాత్తమగుటవలన సర్వాంగ చూర్ణభావ గర్వాపహార రూపముగు నదియును సుబోధముగా భాసమానమగుటవలనను, ఎట్లు ఇష్ట అప్రాప్తి మాత్రమేనని చెప్పుదురు?

ఇందుచే "శైలపతనరూపానిష్టప్రాప్తియు భగవత్కరాంబుజ స్పర్శ మహిమచే కలగలేదు" అని చెప్పినదియు అసారమే; అనిష్టములను జెప్పితిమి గదా?

ఇట్లు ఉత్పత్తిలక్షణమగు సంసర్గము యొక్క నననురూపత్వము నిరూపింపబడినది

సంయోగాదిలక్షణసంసర్గస్యాననురూపత్వం యథా —

'వనాంతః ఖేలంతీ శశకశిశుమాలోక్య చకితా
భుజప్రాంతం భర్తుః శ్రయతి భయహర్తుః సపది యా.
అహో సేయం సీతా శివ శివ పరీతా శ్రుతిచలత్ -
కరోటీకోటీభిర్వసతి ఖలు రక్షోయువతిభిః'

అత్ర సతీశిఖామణేర్భగవత్యా రాఘవధర్మపత్న్యాః పరమప్రభావయుక్తత్వాద్రాక్షసీభిరనాశ్యత్వేఽపి రక్షఃకర్తృకనాశస్వరూపయోగ్యతావచ్ఛేదకమనుష్యత్వజాతియోగేన స్వరూపస్య, రక్షోదర్శనేన సౌందర్యసౌకుమార్యాదీనాం గుణానాం చ నాశ్యత్వేన విరుద్ధత్వాత్సమానాధికరణసంయోగరూపః సంసర్గోఽననురూపః.

సంయోగాది లక్షణమగు సంసర్గముయొక్క అననురూపమెట్లన—

"వనాన్తః" మొ (ఏ సీత అడవిలోపల క్రీడించుచు కుందేటిపిల్లనుజూచి భయపడినదై, భయమును పోగొట్టునట్టి భర్త యొక్క భుజప్రాంతమును వెంటనే ఆశ్రయించుచున్నదో, ఆ సీత చెవులయందు వ్రేలుచున్న కరోటీకోటులుగల రక్షః స్త్రీలచే చుట్టుకొనబడినదై ఉన్నది గదా!)

ఇచట పతివ్రతా శిఖామణియగు, భగవతియగు, రాఘవ ధర్మపత్ని ప్రభావము గలదిగాన రాక్షస స్త్రీలచే నశింపజేయబడకున్నను, రక్షఃకర్తృక నాశస్వరూపయోగ్యతావచ్ఛేదకమగు మనుష్యత్వ జాతితో సంబంధముచే స్వరూపమును, రక్షోదర్శనముచేత సౌందర్య సౌకుమార్యాదులగు గుణములును, నశింపజేయదగినవగుటచేత—విరుద్ధమగుటవలన సమానాధికరణ రూపమైన సంయోగ రూపమైన సంసర్గ మననురూపము.

నను —

'క్వ శుక్తయః క్వ తా ముక్తాః క్వ పంకః క్వ చ పంకజమ్
క్వ మృగాః క్వ చ కస్తూరీ ధిగ్ విధాతుర్విదగ్ధతామ్.'

ఇత్యాదౌ వస్తుకథనమాత్రే విషమాలంకారప్రసంగః. న చేష్టాపత్తిః. వస్తువృత్తస్య లోకసిద్ధత్వేనాలంకారత్వాయోగాత్. యతో బహిరసంతః కవిప్రతిభామాత్రకల్పితా అర్థాః కావ్యేఽలంకారపదాస్పదమ్. న చ 'యథా పద్మం తథా ముఖం' ఇత్యాదౌ సాదృశ్యస్య లోకసిద్ధత్వాత్కవిప్రతిభానుత్థాపితత్వేఽపి కథమలంకారత్వమితి

వాచ్యమ్. సాదృశ్యరూపే సాదృశ్యోత్థాపకే వా అభిన్నధర్మేఽభేదాంశస్య కవిప్రతిభామాత్రాధీనత్వాత్. నహి పద్మముఖయోః శోభారూపో ధర్మో జాత్యాదివద్వస్తుత ఏకోఽస్తి. యో హి జాత్యాదిరూపో వస్తుత ఏకస్తదుత్థాపితం సాదృశ్యమలంకార బహిర్భూతమేవ. యథా—'పద్మమివాస్యా ముఖం ద్రవ్యమ్' ఇత్యాదౌ. ఏవం చ 'వనాంతః ఖేలంతీ' ఇతి పద్య ప్రతిపాద్యాయాః సీతా రాక్షసవధూసంసర్గాననురూపతాయా లౌకికీత్వేన కవిప్రతిభానపేక్షత్వాన్నాలంకారత్వమ్. ఏతేన—

'అరణ్యానీ క్వేయం ధృతకనకసూత్రః క్వ స మృగః
క్వ ముక్తాహారోఽయం క్వ చ స పతగః క్వేయమబలా.
క్వ తత్కన్యారత్నం లలితమహిభర్తుః క్వ చ వయం
స్వమాకూతం ధాతా కమపి నిభృతం పల్లవయతి.'

ఇత్యలంకారసర్వస్వకృతోదాహృతమపి ప్రత్యుక్తమ్. ఇయమేవ చ పద్యాంతరేఽపి కవిప్రతిభానుత్థాపితార్థకీ సరణిరితి.

అయ్యా—

"క్వ శుక్తయః" మొ. (ముత్యపుచిప్పలెక్కడ ముత్యములెక్కడ? బురద యెక్కడ పంకజ మెక్కడ? మృగము లెక్కడ కస్తూరి యెక్కడ! విధాత నైపుణ్యమా ఇది ఛీ ఛీ!)

ఇత్యాదులందు వస్తుకథన మాత్రమున, విషమాలంకారము చెప్పవలసి వచ్చును ఇష్టాపత్తియైన అనుటకు వీలులేదు. వస్తువృత్తము లోకసిద్ధమగుట వలన అలంకారమగుటకు వీలులేదు కదా? ఎందువల్లననగా—బయట నుండని వస్తువులు కవి ప్రతిభామాత్రముచేత కల్పితములై కావ్యమున అలంకార పదాస్పదము లగుచున్నవి.

"యథాపద్మం తథా ముఖం" ఇత్యాదులందు సాదృశ్యము లోకసిద్ధమగుటవలన కవి ప్రతిభానుత్థాపితమైనను ఏల అలంకారమందురో అలాగే నిదియు అనరాదు. సాదృశ్యరూపమందుగాని సాదృశ్యోత్థాపకమందుగాని అభిన్నధర్మమందు నభేదాంశము కవి ప్రతిభామాత్రాధీనమగుట వలన. పద్మముఖములకు శోభారూపమగు ధర్మము జాత్యాదులవలె వస్తుతః ఒకటిగా లేదు. ఏదైతే జాత్యాదిరూపమై వస్తుతః ఒకటియే యున్నదో తదుత్థా

పితమగు సాదృశ్యము అలంకార బహిర్భూతమె. 'పద్మమువలె నీమె మ ఖము ద్రవ్యము'. ఇత్యాదులయంద వలె. ఇలాగే—"వనాన్తఃఖేలన్తీ" అను పద్యమునందు ప్రతిపాదింపబడిన సీతా రాక్షసవధూ సంపర్గాననురూపత లౌకికమగ టచే గవిప్రతిభానపేక్షముగనుక నలంకారత్వములేదు దీనిచేత—

"అరణ్యానీ" మొ. (ఈ అరణ్య సమూహము లెక్కడ? బంగారు దారమును ధరించిన మృగము ఎక్కడ? ఈ ముత్యాల హారమెక్కడ? ఈ పతంగ మెక్కడ? ఈ అబల యెక్కడ? అహిభర్త యొక్క లలితమగు ఆ కన్యారత్న మెక్కడ? మేమెక్కడ? బ్రహ్మ తన యభిప్రాయమును ఏదో గూఢముగా చలింపజేయును)

అని అలంకార సర్వస్వకారుని ఉదాహరణము నిరసింపబడెను. ఇలాగే పద్యాంతమంద ను కవి ప్రతిభానుత్థాపితార్థకమునందు మార్గము అని.

సత్యమ్.

ఏవం తర్హి—

'క్వ సా కుసుమసారాంగీ సీతా చంద్రకలోపమా
క్వ రక్షః ఖదిరాంగారమధ్యసంవాసవైశసమ్.'

ఇతి పద్యముదాహరణం గృహాణ.

అత్ర హి కేవలసీతాయాః కేవలరాక్షసీనాం చ సంసర్గస్యాననురూపతాయాం సత్యామపి న సా కవేర్వివక్షితా. కింతు యా కుసుమసారఖదిరాంగారసంసర్గస్యాననురూపతా సేతి స్ఫుటమేవాస్యామలౌకిక త్వాత్కవిప్రతిభాపేక్షత్వమ్.

ఇతి రసగంగాధరే విషమాలంకారప్రకరణమ్.

సత్యము—ఇట్లాగైతే—

"క్వ సా" మొ. (కుసుమసారాంగియు, చంద్రకలోపమయునగు ఆ సీత ఎక్కడ? రాక్షసస్త్రీలనెడు చంద్రనిప్పుల నడుమన ఉండడమనెడు క్రౌర్య మెక్కడ?)

అను పద్యము నుదాహరణముగా గ్రహించుము. ఇక్కడ కేవల సీతకు కేవల రాక్షసస్త్రీలకున్ను సంబంధ మననురూపమగుట యున్నప్పటికిని అది కవికి వివక్షితముగాదు. ఏమనగా—కుసుమసారఖదిరాంగార సంసర్గమునందు అననురూపత అట్లని స్ఫుటమే దీనియందు నలౌకికమగుటవలన కవి ప్రతిభనపేక్షించుట.

ఇది విషమాలంకారము

హారిభావన జంఘలను జానువులను, ఊరువులను, నాభిని, హృదయమును ఆశ్లేషించి ఇపుడు విష్ణువు యొక్క ముఖపద్మపుశోభయ ందు క్రీడించునుగాక.)

ఇచట పర్యాయము మాత్రము గాదు. ఉత్తరోత్తరసంబంధము పూర్వపూర్వత్యాగపూర్వకమగుట అవివక్షితమగుటవలన. ఎందుచేతననగా, ఇచట వక్తకు ముఖవిషయకభావనలో సర్వాంగ విషయకత్వము అభిప్రేత మైనది, ముఖమాత్రవిషయకత్వముగాదు అందువలననే 'ఖేలతు' అని చెప్పెను. 'మజ్జతు' అని గాదు. అటులనే.

"పూర్వం" మొ. (మొదట కనులలోలగ్నమై పిమ్మట మనసున మగ్న యయ్యెను. తరువాత ప్రియుని సర్వానుభవమునకును నామెయే గోచర మయ్యెను.)

ఇత్యాది శ్లోకమునందు కూడ. ఇది సారాలంకారము కూడ **గాదు;** ఉత్తరోత్తరములలోనుత్కర్షాపకర్షములులేనందున. అందుచేతను ఇట్టి తావులలో శుద్ధక్రమాలంకారము అతిరిక్తమని చెప్పుదురు.

ఇహాన్యదప్యవధేయమ్ - యత్రాధారాధేయతత్సంబంధక్రమేషు క్వచిదపి కవికల్పనాపేక్షా తత్రైవాయమలంకారః. యత్ర తుసర్వాంశే లోకసిద్ధత్వం న తత్ర క్వచిదలంకారః, అత ఏవ"శ్రోణీబంధస్త్యజతి తనుతాం సేవతే మధ్యభాగః, పద్భ్యాం ముక్తాస్తరలగతయః సంశ్రితా లోచనాభ్యామ్' ఇతి కావ్యప్రకాశకృతా, 'ప్రాగర్ణవస్య హృదయే వృషలక్ష్మణోఽథ కంఠేఽధునా వససి వాచి పునః ఖలానామ్' ఇతి సర్వస్వకృతా చ నిదర్శితమ్. అత్రోభయత్రాప్యాధారభేదాద్భిన్న ఆధేయః కవినా ఏకతాధ్యవసానేనైకీకృతః. అస్మద్దత్తోదాహరణేషు తు క్రమోఽపి కల్పితః, న హి బ్రహ్మలోకస్థయా దేవతయా, పయోధిస్థయా సుధయా చ, వాచో వాఙ్మాధుర్యస్య చాభేదో లోకసిద్ధస్తాదృశః క్రమో వా. ఏవం స్థితే 'అధునా పులినం తత్ర యత్ర స్రోతః పురాభవత్" ఇతి కువలయానందగతముదాహరణం 'యత్ర పూర్వం ఘటస్తత్రాధునా పటః' ఇతి వాక్యవల్లౌకికోక్తి మాత్రమిత్యనుదాహార్యమేవ.

ఇతి రసగంగాధరే పర్యాయప్రకరణమ్.

ఇక్కడమరియొకటి శ్రద్ధజేయవగియున్నది. ఎచట ఆధారాధేయత త్సంబంధక్రమములందు నొకచోటయందైనను కవికల్పనాపేక్షయో నచటనే నీయలంకారము. ఎక్కడనైతే సర్వాంశములందులోకసిద్ధత్వమున్నదో నక్కడనలంకారము లేదు. కనుకనే, "శ్రోణీబన్ధ స్త్యజతి తనుతాం సేవతే మధ్యభాగః పద్భ్యాం ముక్తా స్తరళగతయః సంశ్రితా లోచనాభ్యామ్" అని కావ్యప్రకాశకారులు, "ప్రాగర్ణవస్యహృదయే వృషలక్ష్మణోఽథ కంఠేఽధునా వసతి వాచి పునః ఖలానామ్" అని సర్వస్వకారులున్ను చెప్పిరి.

ఇచట రెండు చోట్లనున్ను, ఆధారభేదమువలన భిన్నమగు ఆధేయమును కవి ఏకతాధ్యవసానముతో నేకీకరణము జేసి స్వీకరించెను. మేమిచ్చిన ఉదాహరణములలో క్రమమున్ను గల్పించబడినది. బ్రహ్మలోకమందున్న దేవతతోడను సముద్రమునందున్న నమృతముతోడను, వాక్కునకును వాక్కుయొక్క మాధుర్యమునకున భేదము గాని, అట్టిక్రమమ్ముగాని, లోకసిద్ధమైనది కాదుగదా? ఇలాయుండగా "అధునా పులినం తత్రయత్రస్రోతః పురాభవత్" అని కువలయానందకారుడిచ్చిన యుదాహరణము "యత్ర పూర్వం ఘటః తత్రాధునా పటః" అను వాక్యమువలె లౌకికోక్తిమాత్రమని అనుదాహార్యమేను.

ఇది పర్యాయ ప్రకరణము

## పరివృత్త్యలఙ్కారః

అథ పరివృత్తిః —

పరకీయయత్కించిద్వస్త్వాదానవిశిష్టం పరస్మై స్వకీయయత్కించిద్వస్తుసమర్పణం పరివృత్తిః. క్రయ ఇతి యావత్.

సా చ తావద్ద్వివిధా-సమపరివృత్తిర్విషమపరివృత్తిశ్చేతి. సమపరివృత్తిరపి ద్వివిధా—ఉత్తమైరుత్తమానాం, న్యూనైర్న్యూనానాం చేతి. విషమపరివృత్తిరపి తథా—ఉత్తమైర్న్యూనానాం, న్యూనైరుత్తమానాం చేతి.

క్రమేణోదాహరణాని—

'అంగాని దత్త్వా హేమాంగి ప్రాణాన్ క్రీణాసి చేన్నృణామ్
యుక్తమేతన్న తు పునర్లోచనాంబురుహద్వయమ్.'

అత్ర పూర్వార్ధ ఏవ సమపరివృత్తిః, ఉత్తరార్ధే తు విషమైవ.

'అస్థిమాలామయీం దత్త్వా ముండమాలామయీం తనుమ్
గృహ్ణాతాం త్వత్పురస్థానాం కో లాభః స్మరశాసన!

"గరిమాణమర్పయిత్వా
లఘిమానం కుచయుగాత్కురంగదృశామ్.
స్వీకుర్వతే నమస్తే
యూనాం ధైర్యాయ నిర్వివేకాయ."

'కిమహం కథయామి యోషితా
మధరం బింబఫలం సమర్ప్య యాః.
సురసాని హరంతి హంత హే
విదుషాం పుణ్యఫలాని సత్వరమ్.'

ఏషు దానాదానవ్యవహారః కవికల్పిత ఏవ, న తు వాస్తవః, యత్ర వాస్తవస్తత్ర నాలంకారః. యథా—

'క్రీణంతిప్రవికచలోచనాః సమంతా -
న్ముక్తాభిర్బదరఫలానియత్ర బాలాః.'

అనంతరము పరివృత్తి. పరకీయయత్కించిద్వస్త్వాదానపూర్వకముగా ఇతరులకొరకు స్వకీయమగువస్తువును సమర్పించుట పరివృత్తి. క్రయమని తాత్పర్యము అదియు రెండు విధములు. సమపరివృత్తి, విషమపరివృత్తి అని సమపరివృత్తియు రెండురకములు - ఉత్తమములచే నుత్తమములకు, అధమములచేనధమములకు అని. విషమపరివృత్తియును రెండురకములు - ఉత్తమములచే నధమములకు నధమములచే నుత్తమములకని. క్రమముగా నుదాహరణములు.

"అంగాని" మె. (ఓ హేమాంగీ! అవయవములనొసగి ప్రాణము గొన దలచినచో అది యుక్తమే కాని కనుదామరలదోయినిమాత్రము కాదు)

ఇచట పూర్వార్ధమందు సమపరివృత్తి; ఉత్తరార్ధమందు విషమ పరివృత్తియే.

"అస్థిమాలామయీం" మొ (ఎముకలమాలవంటి దేహమునొసగి ముండమాలామయియగు శరీరమునుగొను నీపురముననుండువారికి, ఓ స్మర శాసనుడా? ఏమి లాభము?)

"గరిమాణమ్" మొ. (స్త్రీలకుచయుగము నుండి గౌరవము అర్పించి లాఘవమునుగొను వివేకరహితమగు యువకుల ధైర్యమునకు నమస్కారము )

"కిమహం" మొ. (ఆడువాళ్ళను గురించి నేనేమిచెప్పుదును? అధర మును దొండపండును ఇచ్చిత్వరగా సురసములగు విద్వాంసుల పుణ్యఫలము-లను తీసికొందురు.)

వీటియందు దానాదానవ్యవహారమంతయు గవికల్పితమేను వాస్తవ మైనదిగాదు. ఎచటవాస్తవమో నచట అలంకారముగాదు. ఎట్లనగా — "క్రీడంతి ప్రవికచలోచనాః సమన్తాన్ముక్తాభిర్బదరఫలాని యత్ర బాలాః".

ఇదం చాపరం బోధ్యమ్ - అత్ర పరస్మై స్వకీయయత్కించి ద్వస్తుసమర్పణమిత్యేతావత్పర్యంతం లక్షణే వివక్షితమ్, న తు స్వకీయ యత్కించిద్వస్తుత్యాగమాత్రమ్. 'కిశోరభావం పరిహాయ రామా బభార కామానుగుణాం ప్రణాలీమ్' ఇత్యత్రాతివ్యాప్త్యాపత్తేః. న చేదం లక్ష్యమేవేతి వాచ్యమ్, పూర్వావస్థాత్యాగపూర్వకముత్తరా వస్థాగ్రహణస్య వాస్తవత్వేనానలంకారత్వాత్. ఏవం స్థితే 'వినిమ యోఽత్ర కించిత్త్వక్త్వా కస్య చిదాదానమ్' ఇత్యలంకారసర్వస్వ కృతా యల్లక్షణం పరివృత్తేః కృతమ్, యచ్చ 'కిమిత్యపాస్యాభరణాని యౌవనే ధృతం త్వయా వార్ధకశోభి వల్కలమ్' ఇత్యుదాహృతమ్, తదుభయమప్యసదేవ.

ఇతి రసగంగాధరే పరివృత్తిప్రకరణమ్.

ఇదియు మరొకటి దెలియవలెను—

ఇచట ఇతరులకు స్వకీయమగు యత్కించిద్వస్తువు సమర్పణమనునంత వరకు మాత్రము లక్షణమున వివక్షించబడినది స్వకీయమగు యత్కించి ద్వస్తుత్యాగము మాత్రముగాదు.

"కిశోరభావం" మొ. (చిన్నతనమును వీడి కామానుగుణమగు ప్రణాలిని కన్యక స్వీకరించెను.)

అనుచోట నతివ్యాప్తివచ్చును ఇదియు లక్ష్యమే అనరాదు పూర్వా వస్థాత్యాగపూర్వకమైన ఉత్తరావస్థాగ్రహణము వాస్తవమగుటచేత నలంకా రముగాదుగదా ? ఇలా ఉండగా "వినిమయ మిచట, కొంచము త్యజించి

ఒకదానిని దీసుకొనుట" అని అలంకార సర్వస్వకారులు ఏలక్షణము చెప్పిరో, "క్షమిత్యపాస్యాభరణాని" అని ఉదాహరించిరో ఆ రెండును నసంగతమైనవి.

ఇది పరివృత్తిప్రకరణము

## పరిసంఖ్యాలఙ్కారః

అథ పరిసంఖ్యా—

సామాన్యతః ప్రాప్తస్యార్థస్య కస్మాచ్చిద్విశేషాద్వ్యావృత్తిః పరిసంఖ్యా. నియమోఽప్యస్మిన్దర్శనే నిరుక్తలక్షణాక్రాంతత్వాత్పరిసంఖ్యైవ. పాక్షికప్రాప్తియుగపత్ప్రాప్తిరూపస్యావాంతరవిశేషస్యావివక్షణాత్. అత ఏవ వైయాకరణానాం మతే పరిసంఖ్యాపి నియమశబ్దేనోచ్యతే. తథా హి— 'కృత్తద్ధితసమాసాశ్చ' ఇత్యత్ర సమాసగ్రహణం నియమార్థమితి హి తేషాం సిద్ధాంతః. తత్ర హి సమాసే పాక్షిక్యాః ప్రాతిపదికసంజ్ఞాయాః ప్రాప్తేరభావాత్కథం నామ పరాభిమతో నియమ ఉపపద్యతే. యుగపద్ధి సమాససమాసేతరసపదంఘాతయోః 'అర్థవత్'— సూత్రం ప్రాప్తమితి పరిసంఖ్యా భవితుమర్హతి.

అనంతరము పరిసంఖ్య సామాన్యముగా ప్రాప్తమగునర్థమునకు ఒకానొకవిశేషము వలన వ్యావృత్తి పరిసంఖ్య ఈ దర్శనమందు నియమమున్ను నిరుక్తలక్షణాక్రాంతమగుట వలన పరిసంఖ్యయే. పాక్షిక ప్రాప్తి, యుగపత్ప్రాప్తిరూపమగు నవాంతరవిశేషము వివక్షచేయకపోవుట వలన. ఇందువలననే వైయాకరణులయొక్క మతమున పరిసంఖ్యయును నియమశబ్దముచే చెప్పబడును. ఎట్లాగేగదా? "కృత్తద్ధిత సమాసాశ్చ" అనేచోట సమాసగ్రహణము నియమార్థమని వారియొక్క సిద్ధాంతము. అక్కడ సమాసమందు పాక్షికమగు ప్రాతిపదిక సంజ్ఞకు ప్రాప్తిలేకపోవుటవలన ఏలాగు పరాభిమతమగు నియమముగుదురును? ఒక్కపారిగా సమాస, సమాసేతరపదపదసంఘాతముల విషయమున అర్థవత్సూత్రము ప్రాప్తముగాన పరిసంఖ్యయే యగుటకు దగును

పూర్వతంత్రే తు నియమపరిసంఖ్యయోర్భేదేన పరిభాషణమ్. యదాహుః—

'విధిరత్యంతమప్రాప్తే నియమః పాక్షికే సతి.
తత్ర చాన్యత్ర చ ప్రాప్తే పరిసంఖ్యేతి గీయతే'

విధిః - 'స్వర్గకామో యజేత' ఇత్యాదిః. యాగాదేః ప్రకారాంతరేణాప్రాప్తేః. నియమః — "వ్రీహీనవహంతి," "సమే దేశే యజేత" ఇత్యాదిః. పురోడాశనిర్మాణఫలోపధాయకతావచ్ఛేదకకోటిప్రవిష్టాయా వితుషతాయాః సంపాదకత్వేనావహననస్య ప్రాప్తేర్నఖవిదలనసమవధానకాలావృత్తిత్వేన చ పాక్షికత్వాత్. పరిసంఖ్యా — 'ఇమామగృంణ్ణన్రశనామృతస్యేత్యశ్వాభిధానీమాదత్తే', 'పంచ పంచనఖా భక్ష్యాః' ఇత్యాదిః. రశనాగ్రహణలింగేనాశ్వాభిధానీగర్దభాభిధాన్యోరాదానస్య యుగపత్ప్రాప్తత్వాత్. ఇత్యలమప్రకృతచింతయా.

పూర్వతంత్రమునందైతే, నియపరిసంఖ్యలకు భేదముతో పరిభాషించుట ఉన్నది. ఎట్లనగా—

"విధిః" మొ. (అత్యన్తముగా ప్రాప్తముకానిచో విధి, పక్షమున ప్రాప్తించుచో నియమము, అచ్చటను మరియొక యెడను ప్రాప్తించుచో పరిసంఖ్య యనబడును.)

విధి'స్వర్గకామో యజేత' ఇత్యాదులు. యాగాదులు ప్రకారాన్తరమున నప్రాప్తములగునుగనుక. నియమము — 'వ్రీహీనవహంతి', 'సమే దేశే యజేత' ఇత్యాదులు. పురోడాశనిర్మాణ ఫలోపధాయకతావచ్ఛేదకకోటిప్రవిష్టమగు వితుషత్వమునకు సంపాదకముగా నవహననము యొక్క ప్రాప్తికి నఖవిదలన సమవధానకాలావృత్తిత్వము చేతను, యాగాధికరణముగా సమదేశప్రాప్తికి విషమదేశసమవధానకాలావృత్తిత్వముచేతను పాక్షికత్వముగనుక "ఇమామగృభ్ణన్రశనామృతస్యేత్యశ్వాభిధానీమాదత్తే" "పంచపంచనఖా భక్ష్యాః" ఇత్యాదికముపరిసంఖ్య, రశనాగ్రహణలింగముచే నశ్వాభిధాన గర్దభాభిధానుల ఆదానము ఒక్కసారిగా ప్రాప్తించుటవలన. ఇక చాలును అప్రకృత విచారము.

ఇయం తావద్ ద్వివిధా — శుద్ధా ప్రశ్నపూర్వికా చ.
ద్వివిధాప్యార్థీ శాబ్దీ చేతి చతుర్విధా. యథా —

'సేవాయాం యది సాభిలాషమసి రే లక్ష్మీపతిః సేవ్యతాం
చింతాయామసి సస్పృహం యదిచిరం చక్రాయుధశ్చింత్యతామ్
ఆలాపం యది కాంక్షసే మధురిపోర్గాథా తదాలప్యతాం
స్వాపం వాంఛసి చేన్నిరర్గలసుఖే చేతః సఖే సుప్యతామ్.'

అత్ర యదిఘటితవాక్యైర్నివేదితస్య రాగప్రాప్తస్య సేవాదేః కర్మతాయాః పరమేశ్వరే విషయాంతరే చ ప్రాప్తత్వేన లోడర్థఘటితవాక్యార్థవైయర్థ్యప్రసంగాద్విషయాంతరం న సేవ్యమిత్యాదిరూపా విషయాంతరే తత్తత్క్రియాకర్మత్వవ్యావృత్తిస్తాత్పర్యవిషయతయా కల్ప్యమానత్వాదార్థీ శుద్ధా చ.

'కిం తీర్థం హరిపాదపద్మభజనం కిం రత్నమచ్ఛా మతిః
కిం శాస్త్రం శ్రవణేన యస్య గలతి ద్వైతాంధకారోదయః.
కిం మిత్రం సతతోపకారరసికం తత్త్వావబోధః సఖే
కః శత్రుర్వద ఖేదదానకుశలో దుర్వాసనాసంచయః.

అత్ర హరిపాదభజనాదికమేవ తీర్థాదికం నాన్యదిత్యర్థస్తాత్పర్యమర్యాదయా ప్రతీయత ఇత్యార్థీ ప్రశ్నపూర్వికా చ.

'తీర్థం గంగా తదితరదపాం నిర్మలం సంఘమాత్రం
దేవో తస్యాః ప్రసవనిలయో నాకినోఽన్యే వరాకాః.
సా యత్రాస్తే స హి జనపదో మృత్తికామాత్రమన్యత్
తాం యో నిత్యం నమతి స బుధో బోధశూన్యస్తతోఽన్యః.

అత్ర మాత్రాదిపదైస్తీర్థత్వాదివ్యావృత్తిః ప్రతీయత ఇతి శాబ్దీ శుద్ధా.

'కిం మిత్రమంతే సుకృతం న లోకాః
కిం ధ్యేయమీశస్య పదం న తోకాః.
కిం కామ్యమవ్యాజసుఖం న భోగాః
కిం జల్పనీయం హరినామ నాన్యత్'

అత్ర శాబ్దీ ప్రశ్నపూర్వికా చ. ఇతి ప్రాచాం మతమ్.

ఇదియు రెండు విధములు - శుద్ధయు ప్రశ్నపూర్వికయును అని. ఈ రెండు విధములును ఆర్థియు శాబ్దియునని నాల్గు విధములు. ఎట్లనగా—

"సేవాయాం" మొ. (ఓ మిత్రమా! చిత్తమా! సేవయందు కోరిక గల్గిన లక్ష్మీపతిని సేవించుము. చింతయందు ఆస యున్న చక్రాయుధుడు

చింతింపబడుగాక. ఆలాపము కావలయుననన్న మధురిపుగాథ నాలాపము మొనర్చుము. స్వాపమును కోరెదవేని, నిరర్గల సుఖమునందు సుప్తిని బొందుము )

ఇచట 'యది' ఘటితవాక్యముచే నివేదితమైన, రాగప్రాప్తమగు సేవాదికమునకు కర్మత్వము పరమేశ్వరుని యందును, విషయాంతరము నందును ప్రాప్తమగుటచే లోడర్థఘటిత వాక్యార్థమై యర్థప్రసంగమువలన "విషయాంతరము సేవించతగనిది," అనే రూపమైన, విషయాన్తరమునందు తత్త్రిత్కతయాకర్మత్వవ్యావృత్తి తాత్పర్య విషయముగా గల్పింపబడుట వలన యార్థియు, శుద్ధయున్ను.

"కింతీర్థం" మొ. (తీర్థమేది ? హరిపాద పద్మభజనము. 'రత్నమేది ? స్వచ్ఛమైనమతి. శాస్త్రమననేది? ద్వైతాంధకారోదయమును నివర్తించునది. ఎల్లప్పుడు ఉపకారముచేయ నభిలషించు స్నేహితు డెవ్వరు ? మిత్రుడా ! తత్వజ్ఞానోదయము. శత్రులెవ్వరు ? కష్టముల నీయగల్గు దుర్వాసనాసము దాయము)

ఇచట హరిపాదసేవాదికమే తీర్థాదికము, ఇతరముగాదు అనునర్థము తాత్పర్యమర్యాదవలన తోచుచున్నది; అని ఆర్థి ప్రశ్నపూర్వికయున్నూ.

"తీర్థం"మొ. (తీర్థము గంగ, వేరైనది నిర్మలమగు నీటిరాశిమాత్రము. దేవులు దాని ఉత్పాదక నివాసభూతులు, దేవతాన్తరములు వరాకులు. అది యెక్కడున్నదో అదే దేశము. కడమది మన్ను మాత్రమే. దానికి నిత్యము నమస్కరించువాడు పండితుడు; తదితరుడు జ్ఞానశూన్యుడు)

ఇచటమాత్రాది పదములచేత తీర్థత్వాది వ్యావృత్తి ప్రతీతమగు చున్నది గనుక శాబ్ది శుద్ధయు.

"కింమిత్రం" మొ (అంతకాలమున మిత్రుడెవడు ? పుణ్యము కాని లోకములుకావు. ధ్యానించదగినదేది ? ఈశ్వరుని పాదము, కాని బిడ్డలు కారు. కోరదగినదేది ? అవ్యాజసుఖము, కాని భోగములుకావు. ఏది జపించదగును ? నారాయణునినామమే కాని వేరేదికాదు)

ఇచట శాబ్ది ప్రశ్నపూర్వికయు. ఇట్లు ప్రాచీనులమతము.

అన్యే తు "వ్యావృత్తేరార్థత్వ ఏవ పరిసంఖ్యాలంకారః,అన్యథా హేతుత్వస్యార్థత్వ ఏవ హేత్వలంకారః, అన్యథా హేతుమాత్రమ్. అతో భేదద్వయమేవాస్యాః" ఇత్యాహుః.

అపరే తు "వ్యావృత్తేరార్థత్వేపి నాలంకారత్వమ్. 'పంచ పంచనఖా భక్ష్యాః', 'సమే యజేత', 'రాత్రస్య', ఇత్యాదావపి తదాపత్తేః. కింతు కవిప్రతిభానిర్మితా యా తాదృశవాద్యవృత్తిస్తస్యాః. యథా—'యస్మిన్ శాసతి వసుమతీపాకశాసనే మహానసేషు సంతాపః, శరధిహృదయేషు సశల్యతా, మంజీరేషు మౌఖర్యమ్, భేరీషు తాడనమ్, కామినీనాం కుంతలేషు కౌటిల్యమ్; గతిషు మాంద్యమ్' ఇత్యాదౌ. అత్ర హి ప్రథమాంతార్థః కవిప్రతిభయా ఏకీకృతః తద్ద్వారా తత్ప్రతియోగిగవ్యావృత్తిర్నిర్మితా. ఏవం చ 'సేవాయాం యది సాభిలాషమసి' ఇత్యత్ర నాన్యః సేవ్య ఇత్యర్థస్య ప్రతీతేః పరిసంఖ్యాస్తు, న పరిసంఖ్యాలంకారః. వ్యావృత్తేర్వాస్తవత్వేన కవిప్రతిభానపేక్షణాత్. 'కిం తీర్థం హరిపాదపద్మభజనమ్' ఇత్యత్ర తు ప్రశ్నపూర్వకం దృఢారోపరూపకమ్, అన్యథా 'న విషంవిషమిత్యాహుర్బ్రహ్మస్వం విషముచ్యతే' ఇత్యత్రాపి పరిసంఖ్యాపత్తేః. 'కిం శాస్త్రమ్' ఇత్యంశే తు పరిసంఖ్యామాత్రమ్ 'తీర్థం గంగా తదితరదపాం నిర్మలం సంఘమాత్రమ్' ఇత్యత్రాపి పరిసంఖ్యైవ శుద్ధా. ప్రాగుక్తాద్ధేతోరనార్థత్వాత్. తస్మాత్ 'మహానసేషు సంతాపః' ఇత్యాదికమేవాస్యా ఉదాహరణమ్" ఇత్యాహుః.

ఇతి రసగంగాధరే పరిసంఖ్యాప్రకరణమ్.

ఇతరులైతే-వ్యావృత్తి ఆర్థికమైననే పరిసంఖ్యాలంకారము; అట్లు కానిచో శుద్ధపరిసంఖ్యయే. ఎట్లనగా—హేతుత్వము అర్థమగునపుడే హేత్వలంకారము; అలాకాని యెడల హేతువు మాత్రమే. ఇందువలన భేదద్వయమే దీనికని చెప్పుదురు. ఇతరులైతే వ్యావృత్తి యొక్క నార్థిత్వమునందును అలంకారత్వములేదు "పంచపంచనఖా భక్ష్యాః" 'సమే యజేత' 'రాత్రస్య' ఇత్యాదులందును నది కాలసివచ్చును. ఇక నేమన కవిప్రతిభానిర్మితమైనటువంటి ఏ అట్టి వ్యావృత్తికలదో దానికే అలంకారత్వము. ఎట్లనగా—

"యస్మిన్ శాసతి" మొ.(ఏ భూమీంద్రుడు భూమిని పాలించుచుండగా, మహానసమందు సంతాపమున్ను, అంబులపొదియందు సశల్యత్వమున్ను, మంజీరములందుఁ ముఖరత్వమున్ను, భేరులయందు తాడనము, స్త్రీలకుంతలములందు కౌటిల్యము, నడకలయందు మాంద్యము.)

ఇత్యాదులందు. ఇచట ప్రథమాంతార్థము కవిప్రతిభచేనొకటిగా జేయ బడినదని తద్ద్వారా తత్ప్రతియోగికమగు వ్యావృత్తి నిర్మించబడినది. కావున- "సేవాయాం యది సాభిలాషమసి" అనుచోట 'ఇంకొకడు సేవింపవలసినవాడు కాడు' అను అర్థము ప్రతీతమగుటవలన పరిసంఖ్యఅగుగాక; కానీ పరిసంఖ్యా లంకారము మాత్రముగాదు. వ్యావృత్తి వాస్తవమగుటచే కవిప్రతిభ యన పేక్షితముగనుక.

'కిం తీర్థం హరిపాదపద్మభజనం' అనుచోటనైతే ప్రశ్నపూర్వకమగు దృఢారోపకమగు రూపకము. అలాగానియెడల "నవిషం విషమిత్యాహుః బ్రహ్మస్వం విషముచ్యతే" అనేచోటగూడ పరిసంఖ్య ఆపన్నమగును. 'కిం శాస్త్రం' అనే అంశమందైతే పరిసంఖ్య మాత్రమే. "తీర్థం గంగా తదితర దపాం నిర్మలం సంఘమాత్రం", అనేచోటగూడ శుద్ధపరిసంఖ్యయే. ప్రాగుక్త హేతువు అర్థము గాదు గనుక. అందువలన "మహానసేషు సంతాపః" ఇత్యాదిక ములే దీనికి ఉదాహరణము అని జెప్పుదరు.

ఇది పరిసంఖ్యాప్రకరణము

## అర్థాపత్త్యలఙ్కారః

అథార్థాపత్తిః —

కేనచిదర్థేన తుల్యన్యాయత్వాదర్థాంతరస్యాపత్తిరర్థాపత్తిః, న్యాయశ్చ కారణమ్. సా చ ప్రకృతేన ప్రకృతస్య, అప్రకృతేనా ప్రకృతస్య ప్రకృతేనాప్రకృతస్య, అప్రకృతేన ప్రకృతస్యేతి తావచ్చతు ర్భేదా. ప్రత్యేకమర్థాంతరస్య సామ్యన్యూనాధిక్యైర్ద్వాదశవిధా. తతో భావాభావత్వాభ్యాం చతుర్వింశతిభేదా. దిఙ్మాత్రేణోదాహ్రి యతే—

'లీలాలుంఠితశారదాపురధియామస్మాదృశానాం పురో
విద్యాసద్మవినిర్గలత్కణముషో వల్గంతి చేద్బాలిశాః.
అద్య శ్వః ఫణినాం శకుంతశిశవో దంతావలానాం శశాః
సింహానాం చ సుఖేన మూర్ధని పదం ధాస్యంతి శాలావృకాః'

అత్ర ప్రకృతేనాప్రకృతస్యాపాద్యమానస్య సామ్యం మాలా రూపతా చ.

అనంతరమర్థాపత్తి.

ఏదో నొక యర్థముతో తుల్యన్యాయమగుటవలన అర్థాన్తరమునకాపత్తి అర్థాపత్తి

న్యాయమున్న కారణము. అదియు ప్రకృతముతో ప్రకృతమునకు, నప్రకృతముతో నప్రకృతమునకు, ప్రకృతముతో నప్రకృతమునకు, అప్రకృతముతో ప్రకృతమునకు, అని నాల్గు రకములు.

ప్రత్యేకముగా నర్థాంతరమునకు సామ్యన్యూనత్వాధిక్యములతో ద్వాదశవిధము లగును. భావత్వా భావత్వములచే చతుర్వింశతి భేదము లగును. దిఙ్మాత్రముగా నుదాహరించబడును.—

"లీలాలుంఠిత" మొ. (లీలగా దోచుకోబడిన సరస్వతీ నగరముగల బుద్ధిగల మాబోటివారల ముందర విద్యాస్థానమునుండి బయలువెడలుచున్న కణములను దొంగిలించిన బాలిశులు తిరుగుచున్నయెడల నేడు రేపు పాముల తలమీద పిల్లపిట్టలును, ఏనుగుల తలమీద కుందేళ్ళును, సింహముల తలమీద శాలావృకములు సుఖముగా అడుగుబెట్టగలవు.)

ఇచట ప్రకృతముతో నప్రకృతమునకు నాపాద్యమగుదానికి సామ్యము మాలారూపకతయున్న.

యది తే చరణాంబుజం హృదా
వహతో మే న హతో విపద్గణః.
అథ చండకరేణ మండితే
దినమధ్యేఽపి జితం తమోగణైః'

అత్ర న హత ఇతి విద్యమానతారూపాత్ప్రకృతార్థాజ్జితమిత్యాపాద్యమానస్యాప్రకృతార్థస్య సర్వోత్కర్షేణ వర్తనరూపస్యాధిక్యమ్. న చాత్ర విపద్గణస్యావస్థానమాత్రేణ తమోగణానామవస్థానమాపాదయితుముచితమ్, న తు జయః, అనానురూప్యాత్, ఇతి శక్యమ్. భగవచ్చరణసన్నిధానే యద్యేకస్య విపద్గణస్య స్వాస్థ్యం తదా సముచిత ఏవ బహూనాం తమోగణానాం సూర్యసన్నిధానే జయ ఇతి న దోషః.

'సదైవ స్నేహార్ద్రే సురతటిని నిష్కించనజనే
యది త్వం నాథత్సే సురభిరివ వత్సే మయి కృపామ్,

తదా చింతారత్న త్రిదశపతిభూమీరుహముఖా
దదీరన్నర్థిభ్యః కిమితి కణభిక్షామపి జడాః'

అత్రాభావేనాభావాపాదనమ్. స్నేహార్ద్రీజాహ్నవీరూపప్ర కృతార్థాపేక్షయా చింతారత్నాదీనాం జడత్వేన న్యూనత్వం చ. ఏతేష్వాపాద్యమానమప్రకృతమ్.

"యది తే" మొ. (నీ పాదపద్మము హృదయములో ధరించిన నాకు ఆపదల సమూహము నశించకపోయినయెడల చండభానునిచేత ప్రకాశించు చున్న పగటియందును చీకట్లు జయించును.)

ఇచట 'న హతః' అని విద్యమానతారూపసుగు ప్రకృతార్థముకంటె 'జితం' అని ఆపాదింపబడుచున్న నప్రకృతార్థమునకు, సర్వోత్కర్షముగ వర్తనరూపమునకు నాధిక్యము. ఇచట విపద్గణమున కవస్థానమాత్రముచేత తమోగణములుండుట నాపాదించుట యుక్తము, అంతేకాని జయము గాదు; అనానురూప్యమువలన-అని శంకించరాదు. భగవచ్చరణ సన్నిధాన మందొక విపద్గణమునకు స్వాస్థ్యమున్నచో నపుడు సముచితమే. అనేక తమో గణములకు సూర్యసన్నిధానమందు జయము అని దోషము లేదు.

"సదైవ" మొ. (ఓ దేవనదీ! ఎల్లప్పుడును స్నేహార్ద్రీమైనదానా! నాయందు, దూడయందు ధేనువువలె నీవు దయను చేయకపోయిన యెడల అప్పుడు చింతామణియు కల్పవృక్షము మొదలగునవి, జడములు, కణభిక్ష యైనను ఎట్లు యాచకుల కొరకు ఇవ్వగలవు?)

ఇచట నభావముచే నభావాపాదనము. స్నేహార్ద్రీజాహ్నవీరూప ప్రకృతార్థముకంటె చిన్తారత్నాదులకు జడత్వముచే న్యూనత్వమున్న. వీటిలో నాపాద్యమాన మప్రకృతము.

'మామనురక్తాం హిత్వా యదిరాజన్పురుషసింహ యాతోఽసి
ముక్త్వా వనమిదమేష్యతి వనలక్ష్మీర్మమత్ర కిం చిత్రమ్.'

ఇయం రాజ్ఞా నలేన ముక్తాయా అరణ్యే దమయంత్యా ధ్యానోపనీతం తమేవ ప్రత్యుక్తిః. అత్రాపాద్యమానో వనవృ త్తాంతోఽపి సంనిహితత్వాత్ప్రకృత ఏవేతి ద్వయమపి ప్రకృతమ్. పురుషసింహాపేక్షయా వనస్య నపుంసకత్వాన్న్యూనత్వమ్. అత ఏవ కిం చిత్రమిత్యుక్తమ్,

'ఉదుంబరఫలానీవ బ్రహ్మాండాన్యత్తి యః సదా
సర్వగర్వాపహః కాలస్తస్య కే మశకా వయమ్.'

అత్రాప్రకృతేన బ్రహ్మాండాదనేన సమస్తభూతానామనిత్యత్వం కైముతికన్యాయేన ప్రకృతం ప్రతిపాద్యతే.

'న భవానిహ మే లక్ష్యః క్షత్రవర్ణవిలోపినః
కే వా విటపినో రామ కులాచలభిదః పవేః.'

రామం ప్రతి జామదగ్న్యస్యేయముక్తిః. అత్ర ప్రతివస్తూపమా మహావాక్యార్థః. తస్యాశ్చ దలద్వయముపమేయవాక్యార్థ ఉపమానవాక్యార్థశ్చ. తత్రోపమేయవాక్యార్థగతాయామర్థాపత్తావాపాద్యమానస్తన్నిమిత్తభూతశ్చేత్యుభావప్యర్థౌ ప్రకృతౌ. ఉపమానవాక్యార్థగతాయాం త్వప్రకృతావితి. అనయా దిశాన్యదప్యూహ్యమ్.

"మామనురక్తాం" మొ. (ఓ పురుష శ్రేష్ఠుడా! నీయందనురాగము గల నన్ను వదలి నీవు పోయిన యెడల యీ వనలక్ష్మిని వదిలి వనమును పోగలదు; ఇందు ఆశ్చర్యమేమి?)

ఇది నలమహారాజు అరణ్యమునందు విడచిన దమయన్తి ధ్యానోపవీతు డగు నతనిని గురించి పల్కిన ప్రత్యుక్తి. ఇచట నాపాద్యమానమగు వన వృత్తాన్తమున్ను సన్నిహితమగుటవలన ప్రకృతమేయని రెండును ప్రకృతములే. పురుష సింహాముకంఠెను వనమునకు నపుంసకత్వముండుట వలన న్యూనత్వము కనుకనే 'కిం చిత్రం' అని చెప్పబడెను.

"ఉదుంబరఫలానీవ" మొ. (మేడిపండునువలె బ్రహ్మాండములను తిను నట్టి సర్వ గర్వవినాశకమగు కాలమునకు దోమలమైన మనమెంత?)

ఇచట నప్రకృతమైన బ్రహ్మాండాదనమువలన, సమస్త భూతములకు ననిత్యత్వము, ప్రకృతము, కైముతికన్యాయముచేత ప్రతిపాదింపబడుచున్నది.

"నభవానిహ" మొ. (ఓ రామా! క్షత్రియజాతిని లోపింపజేయునట్టి నాకు నీవు లక్ష్యముకావు. కులాచలముల బేధించునట్టి వజ్రములకు చెట్లు ఎంత?)

రామునితో జామదగ్న్యుడు పలికిన మాట ఇది. ఇచట ప్రతివస్తూపమ మహావాక్యార్థము. దానికి రెండు దలములు-ఉపమేయవాక్యార్థము;

ఉపమానవాక్యార్థమున్ను. అచట నుపమేయ వాక్యార్థగతమగు నర్థాపత్తి యందు నాపాద్యము, తన్నిమిత్తభూతమైనదియు అని రెండర్థములున్ను ప్రకృతములు. ఉపమానవాక్యార్థగతమందైతే నప్రకృతములు. ఈ తీరుగనే ఇతరములైనవి దెలుసుకోనవలెను.

అత్ర విచార్యతే-నేయం వాక్యవిత్సంమతాయామర్థాపత్తౌ నివిశతే. ఆపాదకస్యార్థస్యాపతితమర్థం వినానుపపత్తేరత్రాభావాత్. నాప్యనుమానే, ఆపతతోఽర్థస్యాపాదకాసమానాధికరణత్వేన వ్యాప్యత్వపక్షధర్మత్వయోర్దూరాపాస్తత్వాత్. న చ యేన కారణేనైకార్థసిద్ధిస్తేనైవ లింగేనాపరార్థానుమానమితి వాచ్యమ్. అర్థాంతరసిద్ధేరనుమిత్యాత్మకతావిరహాత్. యతోఽయమర్థోఽపి భవితుమర్హతీతి బుద్ధేరాకారః న తు భవత్యేవేతి. నాపి యద్యర్థాతిశయోక్తౌ; తస్యా విపరీతార్థ ఏవ ద్వయోర్విశ్రాంతేః. న చేహ తథా, ఆపాదకస్య సిద్ధత్వాదాపతతశ్చ సంభావ్యమానత్వాద్యథాశ్రుత ఏవ విశ్రాంతేః. తస్మాద్యేన న్యాయేనైకోఽర్థః సిద్ధస్తేనైవ న్యాయేనాపరోఽప్యర్థః సేద్ధుమర్హతీత్యేవం రూపేయమర్థాపత్తిః.

ఇక్కడ విచారింపబడుచున్నది.

ఇది వాక్యవేత్తలకు సంమతమగు నర్థాపత్తిలో ప్రవేశింపదు. ఆపాదకమగు అర్థమునకు నాపాదింపబడిన యర్థములేనిచో అనుపపత్తి లేనందున. అనుమానమునందును ఇది ప్రవేశింపదు. ఆపాద్యమగు అర్థము ఆపాదకాసమానాధికరణమగుటచే వ్యాప్యత్వ పక్షధర్మత్వములు దూరాపాస్తములు గనుక. ఏ కారణముచేత ఒక అర్థము సిద్ధించునో అదే లింగముచేత నపరార్థముయొక్క ననుమానమని చెప్పరాదు. అర్థాంతర సిద్ధికి అనుమిత్యాత్మకత్వములేదు కనుక. ఎందువలన అనగా 'ఈ విషయము కూడ కావచ్చును' అనియే బుద్ధియొక్క ఆకారము; ఇంతేగాని 'అయి తీరును' అని గాదు. యద్యర్థాతిశయోక్తియందును నివిష్టముకాదు. దానిలో రెంటికిని విపరీతార్థమునందే విశ్రాంతి వలన. ఇక్కడ అలా గాదు; నాపాదకము సిద్ధమైనదగుటవలన, ఆపాద్యము సంభావ్యమానమగుటవలన, యథాశ్రుతమునందే విశ్రాంతి గనుక. అందువలన నేన్యాయముచేత ఒక యర్థము సిద్ధించుదో నదే న్యాయముచేత రెండవ యర్థమున్ను సిద్ధించుటకు దగియున్నది అని రూపముగలది ఈ యర్థాపత్తి.

అస్యాం చార్థాంతరం లోకేఽవిద్యమానమపి కవినా, స్వప్రతిభయా కల్పయిత్వా యద్యాపాద్యతే తదాలంకారత్వమ్. యథా 'ఫణినాం శకుంతశిశవః' ఇత్యాదౌ. అన్యథా తు 'కైముతిక' న్యాయతామాత్రమ్.

యథా 'ఉదుంబర ఫలానీవ' ఇత్యాదౌ. ప్రాచీనరీత్యా తు ప్రాగిదముదాహృతమస్మాభిః. అత ఏవ తత్ర కైముతికన్యాయే నేత్యుక్తమ్. ఏవం చ "కమపరమవశం న విప్రకుర్యుర్విభుమపి తం యదమీ స్పృశంతి భావాః," 'అవస్థేయం స్థాణోరపి భవతి సర్వామర గురోర్విధౌ వక్రే మూర్ధ్ని స్థితవతి వయం కిం పునరమీ' ఇత్యాది సర్వస్వకృతా యదుదాహృతం, తన్నాతీవ హృదయంగమమ్.

దీనియందర్థాన్తరము లోకమునందు దొరకకపోయినను కవి స్వప్రతిభ చేత గల్పించినది యాపాదన చేయబడినచో నలంకారత్వము. ఎట్లనగా — 'ఫణినాం శకుంతశిశవః' ఇత్యాదులందు. అలాగానియెడల కైముతికన్యాయ మాత్రము. ఎట్లనగా — 'ఉదుంబరఫలానీవ' ఇత్యాదులందు. కాన్ని ప్రాచీనుల మతమునమసరించి మేము దీనిని ఇదివరకు ఉదాహరించితిమి. అందువలననే "కైముతి కన్యాయము చేత" అని అచట చెప్పబడెను. ఇలాగ—

"కమపరమవశం" మొ. (ఈ భావములు ప్రభువగు శివుని ఇట్లు స్పృశించుచున్నవనగా యితరు లెవరిని వికారము నొందింపవు?)

"అవస్థేయం" మొ. (సర్వదేవతలకునూ గురువైన శివునియొక్క అవస్థ యిట్టిదనగా! విధి వక్రుడై యుండగా (విధుడు వక్రుడై శిరస్సున యుండగా) మన మెవరము?)

ఇత్యాదులు, సర్వస్వకారులు చెప్పినవి, అంతగా హృదయంగమములు కావు.

యత్తు—'కైముత్యేనార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తిరిష్యతే' ఇతి కువలయానందకృతా అస్యా లక్షణం నిర్మితం తదసత్. కైముతిక న్యాయస్య న్యూనార్థవిషయత్వేనాధికార్థాపత్తావవ్యాప్తేః.

యథా—

'తవాగ్రే యది దారిద్ర్యం స్థితం భూప ! ద్విజన్మనామ్
శనైః సవితురప్యగ్రే తమః స్థాస్యత్యసంశయమ్.'

అత్ర శనైః శబ్దమహిమ్నా రాజాగ్రే దారిద్ర్యస్థిత్యపేక్షయా సూర్యాగ్రే తమోఽవస్థానం దుఃశక మేవేత్యవగతమపి న్యాయసామ్యా దాపాద్యతే, న తు కైముతికన్యాయేనేతి.

ఇతి రసగంగాధరే అర్థాపత్తిప్రకరణమ్.

మరియు

"కైముత్యేనార్థ సంసిద్ధిః కావ్యార్థాపత్తిరిష్యతే—" అని కువలయా నందకారుడు దానికి లక్షణము నిర్మించెను, అది అసంగతము. కైముతిక న్యాయమునకు న్యూనార్థము విషయముగాన నధికార్థాపత్తియందు నవ్యాప్తియగును. ఎట్లనగా—

"తవాగ్రే" మొ. (ఓ రాజా! నీ యెదుట దారిద్ర్యమున్న యెడల సూర్యుని ముందర కూడా మెల్లగా చీకటి అడుగు నుంచగలదు.)

ఇచట శనైశ్శబ్దమహిమచే, రాజు నెదుట దారిద్ర్యస్థిత్యపేక్షయా సూర్యుని యెదుట చీకట్లు ఉండుట దుశ్శకమని తెలిసినను న్యాయసామ్య ముతో నాపాదింపబడుచున్నది; కైముతికన్యాయముచే మాత్రముగాదు.

ఇది అర్థాపత్తి ప్రకరణము.

## వికల్పాలఙ్కారః

అథ వికల్పః —

విరుద్ధయోః పాక్షికీ ప్రాప్తిర్వికల్పః

ఏకస్మిన్ధర్మిణి స్వస్వప్రాపకప్రమాణప్రాప్తయోరతఏవ తుల్య బలయోర్విరుద్ధయోర్విరుద్ధత్వాదేవ యుగపత్ప్రాప్తేరసంభవాత్పాక్షి క్యేవ ప్రాప్తిః పర్యవసన్నా.

అయం చ సముచ్చయస్య ప్రతిపక్షభూతో, వ్యతిరేక ఇవో పమాయాః. అత్ర చ వికల్ప్యమానయో రౌపమ్యమలంకారతా బీజమ్, తదాదాయైవ చమత్కారస్యోల్లాసాత్. అన్యథా తు వికల్పతామాత్రమ్. యథా—'జీవనం మరణం వాస్తు నైవ ధర్మం త్యజామ్యహమ్' ఇత్యాదౌ. అత్ర జీవనమరణయో రౌపమ్యస్య ప్రతీతిః.

విరుద్ధములకు పాక్షికప్రాప్తి వికల్పము. ఒక ధర్మియందు స్వస్వప్రాపకములగు ప్రమాణముచే ప్రాప్తములైనట్టియు ఇందువలననే తుల్యబలములగు విరుద్ధములకు విరుద్ధములు గనుకనే ఒకసారి ప్రాప్తించుట అసంభవమగుట వలన పాక్షికమే ప్రాప్తిపర్యవసించును. ఇదియున్ను ఉపమకు వ్యతిరేకము వలె సముచ్చయమునకు ప్రతిపక్షము. ఇచట వికల్పింపబడుచున్నవాటికి ఔపమ్యము అలంకారత్వమునకు బీజము; దానిని తీసుకొనియే చమత్కారముల్లసించునుగాన. అలాగానియెడల వికల్పతా మాత్రమే. ఎట్లనగా—

"జీవనం మరణం వాస్తు నైవ ధర్మ్యం త్యజామ్యహం" ఇత్యాదులందు. ఇచట జీవన మరణముల కౌపమ్యప్రతీతి లేదు.

ఉదాహరణమ్—

'ప్రాణానర్పయ సీతాం వా గృధ్రాంస్తర్పయ వా ద్విజాన్
యమం భజస్వ రామం వా యథేచ్ఛసి తథాచర'.

అత్రార్పణతర్పణభజనేషు మానరక్షణప్రమాణేన యథాక్రమం కర్మతయా ప్రాణగృధ్రయమానామ్, జీవనరక్షణప్రమాణేన సీతాద్విజరామాణాం ప్రాప్తానాం యౌగపద్యాసంభవాత్పర్యాయేణ ప్రాప్తిః. కర్మణోః క్రియాఫలేనైవ సమానధర్మేణౌపమ్యమ్.

నన్వత్ర యథార్పితరావ్యదిధాత్వర్థఫలరూపధర్మైక్యాత్కర్మణోరౌపమ్యం గమ్యతే, తథా 'జీవనం మరణం వా' ఇత్యాదౌ సత్తారూపధర్మైక్యాజ్జీవనమరణయోః కర్త్రోరపి తద్ గంతుం యుజ్యతే ఇతి చేత్, యుజ్యతే, నతు గమ్యతే. అథ తత్కుతో హేతోః? కవితాత్పర్యవిరహాదితి గృహాణ. నహ్యత్ర మరణం జీవనం చ సమానమితి కవేరభిప్రేతమ్. కింతు 'విషం భుఙ్క్ష్వ మా చాస్య గృహే భుఙ్క్థాః' ఇతివత్, ధర్మాద్ధేతోర్మరణమపి జ్యాయః, న తు ధర్మత్యాగ ఇతి నిషిద్ధగతద్వేషాధిక్యమ్. తదర్థం చ మరణస్యోపాత్తత్వాదవివక్షితాధికరణకతయా ఔపమ్యస్యానిష్పత్తిరేవ.

ఉదాహరణము-

"ప్రాణానర్పయ" మొ. (

ఇచట అర్పణ తర్పణ భజనములయందు మానరక్షణ ప్రమాణముచేత యథాక్రమముగా కర్మత్వముచేత ప్రాప్తమగు ప్రాణగృధ్రయములకును,

జీవన రక్షణ ప్రమాణముచే ప్రాప్తులగు సీతాద్విజరాములకును యోగపద్యము సంభవింపదు కనుక పర్యాయముచే ప్రాప్తి కర్మలకు క్రియాఫలమగు సమాన ధర్మముతోనే నౌపమ్యము ఓయి, ఇచట ఎట్లు అన్వితర్వాద్యదిధా త్వర్థఫలరూప ధర్మైక్యమువలన కర్మలకౌపమ్యము తోచునో అలాగే 'జీవనం మరణం' వా ఇత్యాదులందును సత్తారూప ధర్మైక్యమువలన జీవనమరణము లకు కర్తలకు అది గమ్యమగుట యుక్తముకదా, అన్నచో— యుక్తమేగాని గమ్యమగుటమాత్రములేదు. అయితే అది యెందువలన? కవికి తాత్ప ర్యము లేకపోవుటవలన అని, గ్రహింపుము. ఇచట మరణము జీవనమున్న సమానమని కవి దలంచుటలేదు. ఇకనేమనగా— "విషము దినుము; అతని ఇంటిలో మాత్రము దినవద్దు" అన్నట్లుగానే, ధర్మమనే కారణము వలన మరణమైనను మంచిదే కాని ధర్మత్యాగము మాత్రముగాదు, అని నిషిద్ధ వస్తుగత ద్వేషాధిక్యము. దానికొరకై మరణము ఉపాత్తమగుటవలన, నవివక్షితాధికరణకమగుటచే నౌపమ్యమునకు నిష్పత్తి గానేగాదు.

క్వచిల్లుప్తం సమానధర్మమాదాయౌపమ్యస్య గమ్యత్వేఽ యమలంకారః. యథా భగవద్గీతాసు- 'హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్'. అత్ర మహీభోగస్వర్గప్రాప్త్యో- రుత్తమత్వేనౌపమ్యం వివక్షితమ్. తథా చ ధాత్వర్థయోరయం వికల్ప ఇత్యేకే. ఆఖ్యాతార్థయోరిత్యపరే. సర్వథైవ న మహీస్వర్గ యోరితి స్థితమ్. తయోః కారకత్వేనైవ క్రియాన్వయం వినా వికల్పాసంగతేః. న చ ధాత్వర్థయోరేకస్య కర్తృరూపసాధారణ ధర్మస్యోక్తత్వాత్కథం లుప్తతేతి వాచ్యమ్, కర్తృరూపసాధారణ ధర్మమాదాయౌపమ్యస్యాత్ర సుందరస్యానిష్పత్తేః. అన్యథా 'హతో వా నరకం గన్తా జిత్వా వా భోక్ష్యసే మహీమ్' ఇత్యత్రాప్యౌపమ్య ప్రత్యయాపత్తేః.

ఒకచోట లుప్తమైన సమాన ధర్మమును తీసుకొనియైనను ఔపమ్యము - గమ్యమగునపుడు ఈ యలంకారము. ఎట్లనగా— భగవద్గీతయందు "హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వావా భోక్ష్యసేమహీం" ఇచటమహీభోగస్వర్గ ప్రాప్తులుత్తమములుగాన నౌపమ్యము వివక్షితము. ఈ విధముగ ధాత్వర్థ ములకు ఈ వికల్పమని గొందరు చెప్పిరి. ఆఖ్యాతార్థములని మరికొందరు.

ఏ విధముగానైనను మహీస్వర్గములకు కాదని యేర్పడినది. ఆ రెండింటికిని కారకత్వముచేతనే క్రియాన్వయములేక వికల్పము సంగతముగాదు గనుక. ధాత్వర్థములకు నొక కర్తృరూప సాధారణ ధర్మము చెప్పబడుట వలన లుప్తత యెట్లు అనెదరా? కర్తృరూపసాధారణము తీసుకొని ఔపమ్యము సుందరముగా నిష్పత్తిగాదు గనుక. అలాగాని యెడల "హతోవా నరకం గన్తాజిత్వా వా భోక్ష్యసే మహీం" అనుచోటనుగూడ ఔపమ్యముయొక్క ప్రత్యయము ఆపాదించును.

యత్తు—

"—'భక్తిప్రహ్వవిలోకనప్రణయినీ నీలోత్పలస్పర్ధినీ
ధ్యానాలంబనతాం సమాధినిరతైర్నీతే హితప్రాప్తయే.
లావణ్యస్య మహానిధీ రసికతాం లక్ష్మీదృశోస్తన్వతీ
యుష్మాకం కురుతాం భవార్తిశమనం నేత్రే తనుర్వా హరేః'.

అత్ర వికల్పః. ఉత్తమత్వాచ్చ తుల్యప్రమాణశ్లిష్టత్వమ్" ఇత్యలంకారసర్వస్వకృతోక్తమ్, తచ్చింత్యమ్. భవార్తిశమనే తనునేత్రద్వంద్వయోర్ద్వయోరపి యుగపత్కర్తృత్వే విరోధాభావాద్వికల్పానుత్థానాత్.' విరోధే వికల్పః' ఇతి హి తేనైవోక్తమ్. న చ తనుమధ్యే నేత్రయోః ప్రవిష్టత్వాత్పృథగభిధానౌచిత్యేఽపి యత్పృథగభిధానం తద్వక్తుస్తను నేత్రద్వంద్వయోర్విరోధమభిప్రేతం గమయతీతి వాచ్యమ్. వాస్తవస్యైవ విరోధస్య వికల్పోత్థాపకత్వేన వైవక్షికస్యాప్రయోజకత్వాత్, వికల్పస్యాత్రాసుందరత్వాచ్చ. వస్తుతస్తు-'సకలకలం పురమేతజ్జాతం సంప్రతి సుధాంశుబింబమివ' ఇత్యాదావివాత్రాపి శ్లేషమూలోపమైవాలంకారః. తనుర్వేతి తనురివేత్యర్థః. 'వా స్యాద్వికల్పోపమయోః' ఇతి వాశబ్దస్యేవార్థకత్వాభిధానాత్. న చ లింగవచనభేద ఉపమాయాం దోష ఇతి వాచ్యమ్. సాధారణధర్మస్యోపమానసామానాధికరణ్యే ఉపమేయసామానాధికరణ్యే చ యత్ర వైరూప్యం తత్రైవ లింగవచనభేదస్య దోషతాయా అభ్యుపగతేః. యథా 'హంసీవ ధవలశ్చంద్రః సరాంసీవామలం నభః'. అత్ర హంసీ ధవలా, చంద్రో ధవలః, సరాంస్యమలాని, నభో హ్యామలమితి సాధారణధర్మస్యోపమానే ఉపమేయే

చ ద్వైవిధ్యేనైవ ప్రతీతేరుపమాయాః సమ్యగనిష్పత్తేః. నన్వేవం సతి 'సరాంసీవ నభః' ఇత్యాదౌ లుప్తోపమాయాం కథం వచనభేదో దోష ఇతి చేత్, తత్రాపి ప్రతీయమానసాధారణధర్మస్య వైరూప్యాదేవేత్యభ్యుపగమాత్. న చ ప్రతీయమానస్య ధర్మస్య స్వశబ్దానాలింగితతయా సుతరాం లింగానాలింగనేన నాస్తి వైరూప్యమితి శంక్యమ్. శబ్దాలింగితస్యైవార్థస్య ప్రతీతేరిష్టేః. యథాహుః—'న సోఽస్తి ప్రత్యయో లోకే యః శబ్దానుగమాదృతే' ఇతి. యద్వా శ్రుతార్థాపత్తావభ్యుపగమ్యమానాయాం శబ్ద ఏవ కల్ప్యతే, అర్థస్తు తేనాభిధీయత ఇత్యస్తి వైరూప్యమ్. ఏవం స్థితే రాజతే, భాసతే, ఇత్యాది తిజంత ప్రతిపాద్యే సాధారణధర్మే యథా లింగవచనభేదో న దోషస్తథాత్రాపీతి. అత ఏవ 'యస్మిన్నతిసరసో జనో జనపదాశ్చ' ఇతి తుల్యయోగితాపి సంగచ్ఛతే. అన్యథా ఉపమాగర్భత్వాత్తస్యా ఉపమాయా దుష్టత్వే దుష్టతాపత్తేః. శ్లిష్టే ధర్మలింగసంఖ్యాభేదాదినైవ దూషణమితి ప్రతిప్రసవాచ్చేతి దిక్.

ఇతి రసగంగాధరే వికల్పప్రకరణమ్.

అయితే—

"భక్తి" మొ. (భక్తితో నమ్రులైనవారి దర్శనమునందు ఆసక్తి కలిగినట్టియు, నల్లకలువతో పోటీ చేయునట్టియు, యోగులచే హితప్రాప్తికొరకై ధ్యానాలంబనముగ చేయబడినట్టియు, లావణ్యమునకు గొప్ప నిధియైనట్టియు, లక్ష్మీ నేత్రములకు రసికత్వమును కూర్చునట్టి విష్ణువుయొక్క నేత్రములుగాని శరీరముగాని మీకు సంసార బాధను తొలగించుగాక.)

ఇచట వికల్పము. ఉత్తమములగుటవల్లను తుల్యప్రమాణములచే శ్లిష్టత్వము" అని అలంకార సర్వస్వకారులు. జెప్పిరి. అది చింత్యము భవార్తిశమనమునందు తనువు నేత్రద్వంద్వములు రెండింటికిని యుగపత్కర్తృత్వమునందు విరోధములేదు గనుక వికల్పముదయించదు "విరోధే వికల్పః" అనియు నతడే చెప్పెను కదా? అయితే-తనుమధ్యమందు నేత్రములు ప్రవేశించుట వలన వేరుగా జెప్పుట అనుచితమైనను పృథగభిధానము జెప్పెడివానికి తను నేత్ర ద్వంద్వములయందు విరోధమభిప్రేతమని దెలియజేయుచున్నది అని అన్నచో-వాస్తవమే అయిన విరోధమునకే వికల్పోత్థాపకత్వము కనుక వైవక్షికమప్రయోజకమగును. వికల్ప మిచట అసుందరము గూడ. వస్తుతః అయితే. "సకలకలం పురమేతజ్జాతం సంప్రతి సుధాంశుబింబమివ" ఇత్యాదులయందువలె ఇచటను శ్లేషమూలమగు నుపమయే యలంకారము.

'తనుర్వా' అనగా 'తనురివ' అని అర్థము. "వా స్యాద్వికల్పోపమయోః"అని, 'వా' శబ్దము ఇవార్థము గనుక. లింగవచన భేదము ఉపమయందు దోషమని యన్నచో-సాధారణ ధర్మమునకు ఉపమాన సమానాధికరణ్యమునందును, ఉపమేయ సమానాధికరణ్యమునందును ఎచట వైరూప్యమో నచటనే లింగ వచన భేదము దోషమని యంగీకరించబడినది.

ఎట్లనగా— "హంసవద్ధవళశ్చంద్రః సరాంసీవామలం నభః" ఇచట హంసీ ధవలా, చంద్రః ధవలః, సరాంసి అమలాని, నభో నిర్మలమ్, అని సాధారణ ధర్మమునకు నుపమానమునందు నుపమేయమునందు ద్వైవిధ్య ముచేతనే ప్రతీతి యుండుటవలన ఉపమ సరిగా నిష్పన్నము కానేరదు. అయ్యా—ఈ తీరుగానైన "సరాంసీవ నభః" ఇత్యాది లుప్తోపమలో వచన భేదము యేల దోషము? అన్నచో-నచటనైనను ప్రతీయమానమగు సాధారణ ధర్మమునకు వైరూప్యమువలననే; అని అంగీకరించినాము కదా? అచట ప్రతీయమానమగు ధర్మము స్వశబ్దముచే ననాలింగితమగుటచే నేమాత్రము లింగముచేత ననాలింగితమగుటచే వైరూప్యములేదని శంకింపవలదు. శబ్దాలింగితమగు నర్థమునకే ప్రతీతి ఇష్టము గనుక. ఇట్లు జెప్పిరి గూడాను— "న సోఽస్తి ప్రత్యయో లోకే యః శబ్దానుగమాదృతే" అని. లేదా-శ్రుతార్థాపత్తి అంగీకరింపబడినపుడు శబ్దమే గల్పించబడును; అర్థమైతే దానిచే చెప్పబడును అని వైరూప్యమున్నది. ఇలా యుండగా-'రాజతే' 'భాసతే' ఇత్యాది తిఙన్తప్రతిపాద్యమైన సాధారణ ధర్మమందు లింగ వచన భేదము దోషమెట్లు కాదో, అటులనే ఇచట గూడాను. ఇందువలననే-"యస్మిన్నతిసరసో జనో జనపదాశ్చ" అనే తుల్యయోగితయున్ను సంగతమగును. అలాగాని యెడల నుపమానగర్భమగుటచే నాయుపమయున్ను దుష్టము గనుక దుష్టత్వము ప్రాప్తించును. శ్లేషయందు ధర్మలింగ సంఖ్యాభేదాదులు దోషములు కావని ప్రతిప్రసవము ఉన్నది కూడా.

ఇది వికల్ప ప్రకరణము.

## సముచ్చయాలఙ్కారః

అథ సముచ్చయః —

యుగపత్పదార్థానామన్వయః సముచ్చయః. యుగపదితి క్రమవ్యావృత్త్యర్థమ్, న త్వేకతుణప్రతిపత్త్యర్థమ్. తేన కించిత్కాల

భేదేఽపి న సముచ్చయభంగః. స తావద్ ద్వివిధః —ధర్మిభేదధర్మైక్యాభ్యామ్. ధర్మైక్యేఽపి ద్వైవిధ్యమ్—కారణత్వాతిరిక్త సంబంధేనైకధర్మాన్వయే, కారణతయా ఏకధర్మాన్వయే చేతి. ఏవం త్రివిధేఽస్మిన్నాద్యభేదయోర్గుణానాం క్రియాణాం గుణక్రియాణాం చ, తృతీయే రమణీయానామరమణీయానాం రమణీయారమణీయానాం సమన్వయః.

అనంతరము సముచ్చయము.

ఒకసారిగా పదార్థముల అన్వయము సముచ్చయము క్రమము. దొలగుటకై యుగపత్తని; ఏకక్షణమని దెలియుటకుకాదు. దానిచే గొంచము కాలభేదమైనను సముచ్చయభంగము లేదు. అది రెండువిధములు-ధర్మిభేద ధర్మైక్యములచేత. ధర్మైక్యము నందును రెండువిధములు - కారణత్వాతిరిక్త సంబంధముచేత, నేకధర్మాన్వయమునందును, గారణత్వముచే నేకధర్మాన్వయమునందును అని. ఈతీరుగా మూడువిధములైన దీనియందు మొదటి రెండుభేదములందు గుణములకును, క్రియలకును, గుణక్రియలకును, మూడవ దానియందు రమణీయములకును అరమణీయములకును, రమణీయారమణీయములకును సమన్వయము.

న చాస్మిన్వక్ష్యమాణసమాధ్యలంకారత్వమాశంక్యమ్. సమాధౌ హి ఏకేన కార్యే నిష్పాద్యమానేఽప్యన్యేనాకస్మికమాపతతా కారణేన సౌకర్యాదిరూపోఽతిశయో యత్ర సంపాద్యతే, స విషయః. అస్మింస్తు సముచ్చయప్రభేదే యత్రైకకార్యం సంపాదయితుం యుగపదనేకే ఖలే కపోత ఇవాహమహమికయా సంపతంతి, కార్యస్య చ న కోఽప్యతిశయః సః.

అయితే దీనియందు జెప్పబోవు సమాధ్యలంకారత్వము శంకించ కూడదు. సమాధియందు నొకదానిచేత గార్యము నిష్పాద్యమగుచున్నను నాకస్మికముగా వచ్చిపడినను మరియొక గారణముచే సౌకర్యాది రూపమగు నతిశయము ఎచట సంపాదింపబడునో నది విషయము. ఈ సముచ్చయ ప్రభేదమునందైతే, ఎచట నొకకార్యమును సంపాదించుటకు నొకసారి కళ్ళము నందు పావురములవలె కారణము అహమహమికగా, వచ్చిపడునో; కార్యమున అతిశయ మేదియు ఉండదో, అది విషయము.

క్రమేణోదాహరణాని—

'ప్రాదుర్భవతి ప్రయోదే కజ్జలమలినం బభూవ నభః
రక్తం చ పథికహృదయం కపోలపాలీ మృగీదృశః పాండుః'
'ఉదితం మండలమిందోరుదితం సద్యో వియోగివర్గేణ
ముదితం చ సకలయువజనచూడామణిశాసనేన మదనేన'.

అత్రాద్యే గుణానాం ద్వితీయే క్రియాణాం చ యౌగపద్యేన భిన్నధర్మాన్వయః.

'ఆతామ్రా సింధుకన్యాధవచరణనఖోల్లాసికాంతచ్ఛటాభి—
ర్జ్యోత్స్నాజాలైర్జటానాం త్రిపురవిజయినో జాతజాంబూనదశ్రీః.
స్వాభావ్యాదచ్ఛముక్తాఫలరచితలసద్గుచ్ఛసచ్ఛాయకాయా
పాయాదాయాసజాలాదమరసరిదఘవ్రాతజాతశ్రమాన్నః'

'దేవ త్వాం పరితః స్తువంతు కవయో లోభేన కిం తావతా
స్తవ్యస్త్వం భవితాసి యస్య తరుణశ్చాపప్రతాపోఽధునా'
క్రోడాంతః కురుతేతరాం వసుమతీమాశాః సమాలింగతి
ద్యాం చుంబత్యమరావతీం చ సహసా గచ్ఛత్యగమ్యామపి'.

అత్రాద్యే గుణానాం ద్వితీయే క్రియాణామేకధర్మాన్వయః.

యద్యపి హరిచరణనఖసంసర్గసమయే నాస్తి హరజటాసంసర్గ ఇతిరక్తపీతవర్ణయో ర్యౌగపద్యాసంభవః, తథాపి సాహజికత్వేన సహ తయోః ప్రత్యేకం తస్య సంభవోఽస్త్యేవేతి న దోషః.

క్రమముగా నుదాహరణములు.

"ప్రాదుర్భవతి" మొ. (మేఘుడు ఉదయించగా ఆకాశము కాటుక వలె మలినమైనది. పథికుని హృదయము రక్తమైనది. స్త్రీయొక్క కపోల పాళి తెల్లగానైనది.)

"ఉదితం" మొ.

ఇచట మొదటిపద్యమందు గుణములకు, రెండవపద్యమందు క్రియల కున్ను యుగపత్తుగా (నొక్కసారిగా) భిన్నధర్మములతో అన్వయము.

"ఆతామ్రా" మొ. (సముద్రకన్యయొక్క ధవుని పదములయొక్క గోళ్ళమయందు ప్రకాశించు కాంతి సమూహముచే బాగా ఎఱ్ఱనైనదియు,

శివునియొక్క జటలయొక్క సాన్నిధ్యముచే బంగారుకాంతి గలిగినదియు, స్వభావమువలన నిర్మలమైన ముత్యములవలె స్వచ్ఛమైన కాంతిగలదియు నగు గంగానది పాపసమూహముచే గలిగిన ఆయాసమునుండి మమ్ములను గాపాడుగాక !)

"దేవత్వం" మొ.

ఇచట మొదటిపద్యమందు గుణములకు రెండవపద్యమునందు క్రియలకు నేకధర్మియందన్వయము. హరిచరణనఖసంసర్గమునందు హరజటా సంసర్గములేదు గాన రక్తపీతవర్ణములకు యౌగపద్యమున కసంభవము; అలాగైనను, సహజమగు దెల్లదనముతోగూడ వాటి రెంటికి ప్రత్యేకముగా యుగపద్భావసంబంధ మున్నదికాన దోషముగాదు.

'సముత్పత్తిః పద్మారమణపదపద్మామలనఖా-
న్నివాసః కందర్పప్రతిభటజటాజూటభవనే.
అథాయం వ్యాసంగః పతితజననిస్తారణవిధే-
ర్న కస్మాదుత్కర్షస్తవ జనని జాగర్తి జగతః'.

అత్ర త్రిష్వేకేనాప్యుత్కర్షజనన సంభవే త్రయోఽప్యుత్కర్షజననార్థం స్పర్ధయేవాపతంతో రమణీయాః.

'పాటీరద్రుభుజంగపుంగవముఖోద్భూతా వపుస్తాపినో
వాతా వాంతి దహంతి లోచనమమీ తామ్రారసాలద్రుమాః.
శ్రోత్రే హంత కిరంతి కూజితమిమే హాలాహలం కోకిలా
బాలా బాలమృణాలకోమలతనుః ప్రాణాన్కథం రక్షతు.'

అత్రాపి జీవనాశార్థమాపతంఽతో రమణీయాః.

'జీవితం మృత్యునాలీఢం సంపదః శ్వాసవిభ్రమాః
రామాః క్షణప్రభారామా శల్యాన్యేతాని దేహినామ్'.

అత్ర జీవితాదయ స్స్వాభావ్యాద్రమణీయా ఇతి నిఃసారయితుమశక్యాః, విశేషణమహాత్మ్యాచ్చారమణీయా ఇతి దుఃఖజనకాశ్చ, అత ఏవ శల్యతుల్యాః.

"సముత్పత్తిః" మొ. (లక్ష్మీపతియొక్క పాదపద్మములనుండి పుట్టుక నీ నివాసము మన్మథ శత్రువగు శివుని జటాగృహమునందు నీ వ్యాపారము

పతితులగు జనులను తరింపజేయుటయే. ఓ జననీ! జగత్తుకళంకె నీ గొప్పదనము ఎట్లుగల్గదు?)

ఇచట మూడింటియందు నొకదానిచేతనైనను ఉత్కర్షగలిగించుట సంభవించినపుడు రమణీయములగు మూడును ఉత్కర్షమొందించుటకొరకై స్పర్ధతోవలె వచ్చిపడుచున్నవి.

"పాటీర" మొ. (చందనవృక్షము లందలి సర్పముల ముఖముల నుండి బయల్వెడలిన శరీరతాపజనకములగు వాయువులు వీచుచున్నవి. ఎఱ్ఱనైన ఈ రసాలద్రుమములు నేత్రమును కాల్చివేయుచున్నవి. అయ్యో! ఈ కోకిలలు శ్రోత్రమునందు కూజితహాలాహలమును చిమ్ముచున్నవి. లేదామరతూడువలె సుకుమారమైన శరీరముగల బాల ప్రాణముల నెట్లు రక్షించుకొనునో?)

ఇచట మూడును అరమణీయములు జీవుని నశించుటకొరకు వచ్చిపడుచున్నవి.

"జీవితం" మొ. (బ్రతుకు మృత్యువుచే ఆక్రాంతమైనది. నిట్టూర్పులు వంటివి సంపదలు. స్త్రీలు మెరుపులవంటివారు ప్రాణుల కివన్నియు శల్యములేను.)

ఇచట జీవితాదులు స్వభావమువలన రమణీయములు అని వెళ్ళగొట్టుటకు వీలుగానివి. విశేషణ మాహాత్మ్యమువలన అరమణీయములు అని దుఃఖజనకములుగూడ. ఇందువలననే శల్యతుల్యములు.

రమణీయారమణీయశబ్దే కర్మధారయ ఆశ్రీయతే, న ద్వంద్వః, సహచరభిన్నత్వాపత్తేః. ఏవమరణీయరమణీయానామస్యైకకార్యజననార్థమాపతతాం సముచ్చయః సంభవతి.

'శరీరం జ్ఞానజననం రోగో విష్ణుస్మృతిప్రదః
విపద్వైరాగ్యజననీ త్రయం సుఖకరం సతామ్.

శరీరాదయో హి స్వాభావ్యాదరమణీయా అపి భేదకమాహాత్మ్యాద్రమణీయాః.

రమణీయారమణీయ శబ్దమందు గర్మధారయము ఆశ్రయింపబడును; ద్వంద్వముగాదు; సహచరభిన్నత్వము అనుదోషముగల్గును గాన. ఈ తీరుగా అరమణీయ రమణీయములకు నేక కార్యజననార్థమై వచ్చిపడు వాటికి, సముచ్చయము సంభవించుచున్నది.

"శరీరం" మొ.

శరీరాదులు స్వాభావికముగా నరమణీయములైనను విశేషణమాహాత్మ్యమువలన రమణీయములు.

న చ రమణీయానాం సముచ్చయే అరమణీయానాం చ సమాలంకారేణ, రమణీయారమణీయానాంచ విషమాలంకారేణ చ సంకీర్ణత్వాన్నైతే ప్రభేదా యుక్తాః సముచ్చయస్య. సంకరస్య ప్రభేదతాప్రయోజకత్వవిరహాత్, అన్యథా సర్వేషామలంకారణామనంతభేదత్వాపత్తేరితి వాచ్యమ్. 'సముత్పత్తిః పద్మారమణ—' ఇత్యత్ర, 'పాటీరద్రుభుజంగ—' ఇత్యత్ర చ సమాలంకారస్యావివక్షితత్వాత్. న హి హరిచరణనఖసంభూతి, హరజటాజూటనివాస, పతితనిస్తారణవ్యాసంగానాం పరస్పరం యోగో యోగ్య ఇతి కవేరభిప్రేతమ్. కింతు భగవత్యా భాగీరథ్యా ఉత్కర్షం జనయితుం త్రయోఽపి జాగరూకా ఇతి. నాపి మలయానిల రసాలద్రుమకోకిలకూజితానామ్. కింతు త్రయోఽపి బాలాయాః ప్రాణనాశార్థం బద్ధపరికరా ఇతి. అత ఏవ హంతేతి ఖేద ఉపపద్యతే. సమాలంకారస్యాభిప్రేతత్వే తు త్రయాణాం యోగస్య యుక్తత్వాత్ఖేదోఽనుపపన్న ఏవ స్యాత్. అథ బాలాయా మారకత్రితయయోగోఽననురూప ఇతి విషమాభిప్రాయేణ ఖేదోపపత్తిరితి చేత్, ఏవమపి త్రయాణాం యోగాంశే సమాలంకారస్యాత్యంతమప్రతీతేర్విషమస్య చ బాహ్యాబాలాంశమాదాయ ప్రతిష్ఠానాత్సముచ్చయస్యాసంకీర్ణతైవ. ఏవం 'జీవితం మృత్యునాలీఢమ్' ఇత్యాదౌ జీవితాదే రమణీయస్య మృత్యులీఢత్వాదినా అరమణీయత్వేఽపి న మృత్యాద్యవలీఢత్వాదికమయుక్తమితి కవేరిహ వివక్షితమ్. రమణీయానామచిరస్థాయిత్వస్యోత్సర్గతః సిద్ధేస్తస్య చ స్వాభిలతానానుగుణత్వాచ్ఛల్యత్వప్రయోజకత్వమ్ః అతస్తృతీయ ప్రభేదస్యాపి న విషమసంకీర్ణత్వే నాన్యథాసిద్ధిః ఏతేన 'సద్యోగాసద్యోగసదసద్యోగైర్న సముచ్చయః ప్రభేదవాన్. సమవిషమ సంకరేణైవాన్యథా సిద్ధేః' ఇతి రత్నాకరోక్తమపాస్తమ్.

ఇతి రసగంగాధరే సముచ్చయప్రకరణమ్.

అయితే రమణీయములకు సముచ్చయ మందును, అరమణీయముల సముచ్చయమునందును, సమాలంకారముచేతను, రమణీయారమణీయముల సముచ్చయమునందు విషమాలంకారము చేతనున్న సంకీర్ణమగుటవలన ఈ ప్రభేదములు సముచ్చయమునకు యుక్తములుగావు, సంకరమునకు ప్రభేద త్వాప్రయోజకత్వము లేదుగనుక; మరొకవిధమైన యెడల అన్ని అలంకారము లకు లెక్కలేనన్ని భేదములు సంభవించవచ్చును, అన్నచో అట్లుకాదు. "సము త్పత్తిః పద్మారమణ" అనుచోట, "పాటీరద్రుభుజంగ" అనుచోటనున్ను సమా లంకారము అవివక్షితముగనుక. హరిచరణనఖసంభూతి, హరిజటాజూట నివాస పతితని స్తరణవ్యాసంగములకు పరస్పరము యోగము యోగ్యమని కవికి ఇష్ట మైనదిగాదు. ఇకనేమనగా - భగవతియగు భాగీరథియొక్క ఉత్కర్షను పుట్టించుటకు మూడును జాగరూకములు అని. మలయానిలరసాలద్రుమకోకిల కూజితములకును కాదు. ఇక నేమనగా - మూడున్ను బాల ప్రాణమ యొక్క నాశనముకొరకు నడుముకట్టినవి అని. ఇందువలననే 'హన్త' అని ఖేదముపపన్నమగును. సమాలంకార మభిప్రేతమైనపుడు మాత్రము మూడిం టికి యోగము యుక్తమగుటవలన ఖేదమనుపపన్నమగును. అయితే - 'బాల-కు మారకత్రితయయోగము అనురూపముగాదని విషమాభిప్రాయముతో ఖేదముపపన్నము గావచ్చును కదా; అన్నచో ఏలాగైనను మూడింటి యోగాంశమునందు సమాలంకారమునకు నత్యంతము అప్రతీతివలనను, విష మము బాహ్యాబాలాంశమును దీసుకొని ప్రతిష్ఠితమగుటవలనను సముచ్చ యాలంకారమునకు అసంకీర్ణతయేను. ఈతీరుగా "జీవితం మృత్యునాలీఢం" ఇత్యాదులయందు జీవితాదులగు రమణీయములగునవి మృత్యులీఢత్వాదులచే నరణీయములైనను, మృత్యాల్యీఢత్వాదికము అయుక్తమని కవికి ఇక్కడ వివక్షితముకాదు. రమణీయములకు అచిరస్థాయిత్వము సామాన్యముగా సిద్ధ మైనదిగాన, అది స్వాభిలాషకు అననుగుణమగుటవలనను శల్యత్వప్రయోజక త్వము సంభవించును. ఇందువలన తృతీయ ప్రభేదమునకున్ను విషమాలంకా రముతో సంకీర్ణమగుటచేత నన్యథాసిద్ధిలేదు. ఇందుచేతను—

"సదోౄగ అసదోౄగసదసదోౄగములచే సముచ్చయము ప్రభేదములు గలది గాదు. సమవిషమ సంకరముచేతనే అన్యథాసిద్ధించునుగాన" అని అలం కార రత్నాకరకారుడు చెప్పినది పరాస్తమైనది —

ఇది సముచ్చయ ప్రకరణము

# సామాధ్యలఙ్కారః

అథ సమాధిః :—

ఏకకారణజన్యస్య కార్యస్యాకస్మికకారణాంతరసమవధానాహితసౌకర్యం సమాధిః. తచ్చ కార్యస్యానాయాసేన సిద్ధ్యా సాంగసిద్ధ్యా చ. పూర్వాపేక్షయా విశేషస్తూక్త ఏవ. ఉదాహరణమ్—

'అయాతైవ నిశా మనో మృగదృశామున్నిద్రమాతన్వతీ
మానో మే కథమేష సంప్రతి నిరాంతకం హృది స్థాస్యతి.
ఊహాపోహమిమం సరోజనయనా యావద్విధత్తేతరాం
తావత్కామనృపాతపత్రసుషమం బింబం బభాసే విధోః,

అత్ర రాత్రిసన్నిధానాదపి సిద్ధ్యతో మానవినాశస్య చంద్రోదయాదనాయాసేన సిద్ధిః. యథా వా—

'స్మరదీపదీప్తదృష్టేర్ఘనాంధకారేఽపి పతిగృహం యాంత్యాః.
ఝటితి ప్రాదురభూవన్సఖ్యాదివ చంచలాః పరితః',

ఇహాకస్మికే నిష్ప్రత్యూహపతిగృహయానస్య కారణాంతరసమవధానే హేతోరుత్ప్రేక్షణాదుత్ప్రేక్షాలీఢః. పూర్వస్తు శుద్ధః.

'నవప్రసంగం దయితస్య లోభాదంగీకరోతి స్మ యదా నతాంగీ
శ్లథం తదాలింగనమప్యకస్మాద్ ఘనో నినాదైర్ఘనతాం నినాయ,

అత్ర ఘనధ్వనిభిరాలింగనస్య సాంగతాసిద్ధిః. పూర్వపద్యద్వయే-త్వనాయాసేన కార్యసిద్ధిః.

అనంతరము సమాధి.

ఒక కారణమునఁబుట్టిన కార్యమునకు నాకస్మికమగు కారణాన్తరము సమకూరుటవలన సౌకర్యము సమాధి. అదియు కార్యమనాయాసముగ సిద్ధించుటయు సంపూర్ణముగా సిద్ధించుటయు నని రెండు విధములు. వెనుకటి దానికన్న భేదము జెప్పబడినది.

ఉదాహరణము—

"అయాతైవ" మొ. (మృగనేత్రల మనస్సును ఉన్నిద్రము చేయుచు రాత్రి రానే వచ్చినది. ఇపుడు నా మానము హృదయము ఎట్లు నిరాతంకముగ

ఉండును? అని సరోజనయన ఊహాపోహములు చేయుచుండగనే మన్మథ మహా ఛత్రమువంటి చంద్రబింబము ప్రకాశించెను.)

ఇచట రాత్రి సన్నిధానమువల్లనే సిద్ధించుచున్న మానవినాశమునకు చంద్రోదయముచే ననాయాసమున సిద్ధి.

మరొకటి —

"స్మరదీప" మొ. (మన్మథుడనెడు దీపముచే దీప్తమగు చూపు గలిగి నదై దట్టమగు చీకటియందుసూ భర్తృగృహమునకు బోవుచున్న ఆమెకు స్నేహమువలనవలె చుట్టుప్రక్కల మెరుపుతీగెలు శీఘ్రముగా ఉదయించినవి.)

ఇచట నిమ్నవృత్త్యాహపతిగృహయానమునకు నాకస్మికమగు కారణాన్తరసమవధానమున హేతువునుత్ప్రేక్షించుటవలన నుత్ప్రేక్షాలీఢమైనది. వెనుకటిది శుద్ధము. వెనుకటి రెండు పద్యములందును అనాయాసముగా కార్యసిద్ధి.

"నవప్రసంగం" మొ. (నతాంగి ప్రియుని నూతన ప్రసంగమును ఎవుడు మెల్లగా అంగీకరించుచుండెనో అపుడు మేఘుడు ఉరుములచే, శిథిలమగు ఆమెయొక్క ఆలింగనమును అకస్మాత్తుగా ఘనముచేసెను.)

ఇచ్చట మేఘధ్వనులచేత నాలింగనమునకు సాంగత్యము సిద్ధించెను.

"కథయ కథమివాశా జాయతాం జీవితే మే
మలయభుజగవాంతా వాంతి వాతాః కృతాంతాః.
అయమపి బత గుంజత్యాలి! మాకందమౌలౌ
మనసిజమహిమానం మన్యమానో మిలిన్దః".

అత్ర జీవితనాశం ప్రతి వాతవానచంచరీకగుంజితయోరహమహమికయా హేతుత్వాదేకస్యాకస్మికత్వాభావాన్న ప్రకృతాలంకారస్య విషయః, కింతు కర్తృరూపభిన్నధర్మికేణ వానగుంజనక్రియయోః సముచ్చయః సంకీర్ణః.

ఇతి సమాధిప్రకరణమ్.

"కథయ" మొ. (నాకు జీవితమునందు ఆసక్తి ఎట్లు గల్గును? మలయ సర్పములచేత కక్కబడినవై యములవంటి వాయువులు వీచుచున్నవి. ఇదియును, తియ్యమామిడియొక్క శిరస్సున మన్మథుని మహిమను వెలువరించుచు తుమ్మెద మ్రోయుచున్నది)

ఇచట జీవిత నాశమునుగూర్చి వాతవానచంచరీక గుంజితములు నహామహమికచే కారణమగుటవలన నొకటియు నాకస్మికమగుటలేదు గనుక ప్రకృతాలంకారమునకు విషయముగాదు. ఇకనేమనగా — భిన్నధర్ములగు కర్తలుగల వానగుంజనములనెడి క్రియల సముచ్చయముచేత, జీవిత నాశాత్మకమైన ఏకకార్యాత్మకమగు నేకధర్మికమగు, ఆ రెండు కారణములకు సముచ్చయము సంకీర్ణము.

ఇది సమాధ్యలంకారము.

## ప్రత్యనీకాలఙ్కారః

అథ ప్రత్యనీకమ్—

ప్రతిపక్షసంబంధిన స్తిరస్కృతిః ప్రత్యనీకమ్. అనీకేన సదృశం ప్రత్యనీకమ్. సాదృశ్యస్య యథార్థత్వేనైన సంగ్రహే పునః సాదృశ్యాగ్రహణాద్ గుణభూతేఽపి సాదృశ్యేఽవ్యయీభావః.లోకే ప్రతిపక్షస్య తిరస్కారాయానీకం ప్రయుజ్యతే.తదశక్తౌ ప్రతిపక్షసంబంధినఃకస్యచి త్తిరస్కారః క్రియతే. స చానీకసదృశతయా ప్రయుజ్యమానత్వాత్ప్రత్యనీకముచ్యతే. అత్ర చ ప్రతిపక్షగతం బలవత్త్వమ్, ఆత్మగతం దుర్బలత్వం చ గమ్యతే. సంబంధీ చ తదుపజీవ్యోపజీవకమిత్రాది భేదాదనేకవిధః.

యథా—

'రే రే మనో మమ మనోభవశాసనస్య
పాదాంబుజద్వయమనారతమానమంతమ్.
కిం మాం నిపాతయసి సంస్కృతిగర్తమధ్యే
నైతావతా తవ గమిష్యతి పుత్రశోకః'.

'జితమౌక్తికసంపదాం రదానాం
సహవాసేన పరాంముదం దధానామ్.
విరసాదధరీకరోతి నాసా-
మధునా సాహసశాలి మౌక్తికం తే'.

పూర్వత్రోపజీవ్యస్య, ఇహ తూపజీవకస్య తిరస్కారాద్వైరస్యార్థత్వశాబ్దత్వాభ్యాం చ వైలక్షణ్యమ్. ఏవమన్యదప్యూహ్యమ్.

అనంతరము ప్రత్యనీకము.

ప్రతిపక్ష సంబంధికి తిరస్కృతి ప్రత్యనీకము. అనీకముతో సమానము ప్రత్యనీకము. సాదృశ్యమునకు యథార్థత్వముచేతనే సంగ్రహము గలుగగా మరల సాదృశ్యగ్రహణమువలన గుణీభూతమైనప్పటికి సాదృశ్యమునం దవ్యయీభావము. లోకమునందు ప్రతిపక్షమును దిరస్కరించుటకై అనీకము ప్రయోగించబడును. శక్తిచాలనపుడు ప్రతిపక్ష సంబంధియగు నొకానొకని తిరస్కరించుట జేయబడును. అది అనీగాక సదృశము, ప్రయుజ్యమానమగుటవలన ప్రత్యనీకమగును. ఇచటను ప్రతిపక్షగతమగు బలవత్త్వము, దనయందుండు దుర్బలత్వమును దోచుచున్నది. సంబంధియును తదుపజీవ్యోపజీవక-మిత్రాది భేదముచేత అనేక విధములు. ఎట్లనగా-

"రేరే" మొ. (ఓ మనసా ! శివునియొక్క పాదాంబుజద్వయమును నిరంతరము స్మరించుచున్న నన్ను సంసారమనెడు గుంటమధ్య పడవేయుచున్నావా? ఇంతమాత్రముచే నీకు పుత్రశోకముపోదు.)

"జితమౌక్తిక" మొ. (ముత్యముల సంపదను జయించిన దంతముల సహవాసముచే గొప్ప సంతోషమును ఇచ్చుచున్న ముక్కును వైరస్యమువలన, సాహసముతోకూడిన నీ ముత్యము దిగువభాగమున యుంచినది)

వెనుకచోట నుపజీవ్యమునకు ఇక్కడనైతే ఉపజీవకమునకు తిరస్కారమువలన, వైరస్యమునకు ఆర్థత్వశాబ్దత్వములచే వైలక్షణ్యము. ఇలాగే నితరములు గూడ నూహించవలెను.

అత్ర విచార్యతే—హేతూత్ప్రేక్షయైవ గతార్థత్వాన్నేదమలంకారాంతరం భవితుమర్హతి. తత్ర ద్వితీయోదాహరణే తావద్ధేత్వంశః శాబ్దః ఉత్ప్రేక్షాంశమాత్ర మార్థమ్. ప్రథమోదాహరణే ద్వయమప్యార్థమ్. పుత్రమారక సేవకత్వేన కారణేన వైరస్య తస్య స్వాత్మకర్మక గర్తమధ్యనిపాతనేన కార్యేణ హేతుతాయాశ్చ స్ఫుటం ప్రతీతేః. అస్మిన్నలంకారే హేతుత్వం నిశ్చీయమానమ్, హేతూత్ప్రేక్షాయాం తు సంభావ్యమానమిత్యస్తి విశేష ఇతి చేత్, ప్రతీయమానహేతూత్ప్రేక్షాయా అనుత్రేక్షాత్వాపత్తేః. వాచకస్యేవాదేరభావాద్ధేతుత్వస్య నిశ్చీయమానతాయాస్తత్రాపి వక్తుం శక్యత్వాత్.

'యస్య కించిదపకర్తుమక్షమః కాయనిగ్రహగృహీతవిగ్రహః.
కాంతవక్త్రసదృశాకృతిం కృతీ రాహురిందుమధునాపి బాధతే'

ఇత్యలంకారసర్వస్వకృతోదాహృతే ప్రాచీనపద్యేఽపి భగవద్వైరానుబంధాదివ భగవద్వక్త్ర సదృశమిందుం రాహుర్బాధత ఇతి ప్రతీతేరుత్ప్రేక్షైవ గమ్యమానా.

'మమ రూపకీర్తిమహరద్ భువి య-
స్తదనుప్రవిష్టహృదయేయమితి.
త్వయి మత్సరాదివ నిరస్తదయః
సుతరాం క్షిణోతి ఖలు తాం మదనః'.

ఇతి కువలయానందకారేణోదాహృతే తు పద్యే హేత్వంశ ఉత్ప్రేక్షాంశశ్చేత్యుభయమపి శాబ్దమితి కథంకారమస్యాలంకారస్యోదాహరణతాం నీతమిదమాయుష్మతేతి న విద్మః. ప్రతిపక్షగతబలవత్త్వ స్వాత్మగతదుర్బలత్వయోః ప్రతీతేర్హేతూత్ప్రేక్షాంతరాదస్య వైలక్షణ్యమ్. నైతావతా హేతూత్ప్రేక్షాయా బహిర్భవితుమిదమీష్టే, తదవినాభావిత్వాత్. కింతు తదవాంతరవిశేషీభవితుమ్. నహి పృథివ్యవాంతరభేదాద్ఘటాత్పటో విలక్షణ ఇతి పృథివ్యా బహిర్భవతీత్యపి వదంతి.

ఇతి రసగంగాధరే ప్రత్యనీకప్రకరణమ్

ఇచట విచారింతము—హేతూత్ప్రేక్షచేతనే గతార్థమగుటవలన ఇది అలంకారాంతరమగుటకు దగదు. ద్వితీయోదాహరణమునందు హేత్వంశము శాబ్దము, ఉత్ప్రేక్షాంశము మాత్రము ఆర్థము. మొదటి యుదాహరణమందైతే రెండును ఆర్థములు. పుత్రమారక సేవకత్వమను కారణముచేత విరోధమును, దానికి స్వాత్మకర్మకగర్త మధ్యనిపాతనమను కార్యముచేత హేతుత్వమును స్ఫుటముగా బ్రతీతమగుచున్నవి కనుక. ఈ యలంకారమునందు హేతుత్వము నిశ్చయింపబడుచున్నది; హేతూత్ప్రేక్షయందైతే సంభావ్యమానమని విశేషమున్నది—అన్నచో—ప్రతీయమానమగు హేతూత్ప్రేక్షకు అనుత్ప్రేక్షాత్వమాపన్నమగును. వాచకములగు నివాదులు లేకపోవుటవలన హేతుత్వము నిశ్చయింపబడుట నక్కడనైనను జెప్పుటకు వీలగును గనుక.

"యస్య" మొ (ఎవనికి కొంచముగానైనను అపకారము చేయుటకు శక్తిచాలనివాఁడై, శరీరము నిగ్రహించుటచేత విరోధము వహించినవాఁడై, రాహువు సుందరమగు మొగముతో సమానమైన చంద్రుని ఇప్పటికిని బాధించుచున్నాఁడో.)

అని అలంకార సర్వస్వకారు లుదాహరించిన ప్రాచీన పద్యమునందు గూడ "భగవద్వైరానుబంధమువలనవలె భగవద్వక్త్ర సదృశుడగు చంద్రుని రాహువు బాధించుచుండెను," అని ప్రతీతి కల్గుచున్నది గాన గమ్యమగు ఉత్ప్రేక్షయే.

"మమ" మొ. (నా రూపకీర్తి నెవడపహరించెనో వానియందు ప్రవేశించిన హృదయముగల దీమె యని నీ మీది మాత్సర్యముతో నామెను మదనుడు బాధించుచున్నాఁడు.)

అని కువలయానందకారు లుదహరించిన పద్యమునందు హేత్వంశమునుత్ప్రేక్షాంశమున్ను రెండును శాబ్దములని ఎట్లు ఈ యలంకారమునకు నుదాహరణమగునని నాయుష్మంతుడు తలంచెనో ఎరుగము!

ప్రతిపక్షగత బలవత్వస్వాత్మగత దుర్బలత్వములకు ప్రతీతి వలన హేతూత్ప్రేక్షాంతరముకంటె దీనికి వైలక్షణ్యము. ఇంతమాత్రముచే హేతూత్ప్రేక్షకంటె భిన్నమగుటకు దీనికి శక్తి చాలదు; దానితో అవినాభావి గనుక. ఇకనేమనగా—తదవాన్తర విశేషమగుటకు సమర్థమగును. పృథివ్యవాంతర భేదమగు ఘటముకంటె పటము విలక్షణము అని పృథివికి భహిర్భూతముగాదు గదా అనిన్నీ చెప్పుచున్నారు.

ఇది ప్రత్యనీక ప్రకరణము.

## ప్రాతీపాలఙ్కారః

అథ ప్రతీపమ్—

ప్రసిద్ధౌపమ్యవైపరీత్యేన వర్ణ్యమానమౌపమ్యమేకం ప్రతీపమ్. తద్వైపరీత్యం చ తదుపమానోపమేయయోరుపమేయోపమానత్వకల్పనయా, న తు ప్రకారాంతరేణ. ఉపమానోపమేయయోరన్యతరస్య కించిద్ గుణప్రయుక్తమద్వితీయతోత్కర్షం ప్రతిహర్తుం ద్వితీయప్రధర్మనేనోల్లాస్యమానం సాదృశ్యమపరం ద్వివిధమ్. ఉపమానస్య కైమర్థ్యం చతుర్థమ్. సాదృశ్యవిఘటనం పంచమమ్. తత్రాద్యే

ప్రభేదే ప్రసిద్ధౌపమ్యే యదుపమేయం తస్యైవోపమానత్వాదాధిక్యస్య, యచ్చోపమానం తస్యోపమేయత్వాన్న్యూనత్వస్య చ ప్రత్యయః ఫలమ్. ఇదమేవ చౌపమ్యస్యావిశేషేఽ ప్యుపమాలంకారాదస్య వైలక్షణ్యే బీజమ్. ఔపమ్యప్రతిష్ఠానం చ నిషిధ్యమాన సాదృశ్యాద్వ్యతిరేకాత్.

అనంతరము ప్రతీపము ప్రసిద్ధౌపమ్యమునకు విపరీతముగ వర్ణింపబడుచున్న ఔపమ్యము ఒక ప్రతీపము.

ఆ వైపరీత్యమున్ను తదుపమానోపమేయములకు నుపమేయోపమానత్వ కల్పనచే అంతేకాని, ప్రకారాన్తరముచేగాదు. ఉపమానోపమేయములలో నన్యతరమునకు కించిద్గుణప్రయుక్తమైన అద్వితీయతోత్కర్షమును పరిహరించుటకై ద్వితీయ ప్రదర్శనముచే నుల్లాస్యమానమగు నపర సాదృశ్యము రెండు విధములు ఉపమానమునకుకై మర్థ్యము నాల్గవది. సాదృశ్య విఘటనము ఐదవది.

అచట మొదటి ప్రభేదములో ప్రసిద్ధౌపమ్యమునందు ఏది యుపమేయమో అదియేయుపమానమగుటవలన ఆధిక్యముయొక్కయు, ఏది ఉపమానమో అది ఉపమేయమగుటవలన న్యూనత్వముయొక్కయు ప్రత్యయము ఫలము. ఇదియే ఔపమ్యము విశేషము లేనిదైనను ఉపమాలంకారముకంటె దీని వైలక్షణ్యమునందు బీజము. ఔపమ్యముయొక్క ప్రతిష్ఠానమును నిషేధింపబడుచున్న సాదృశ్యము గల వ్యతిరేకముకంటె.

నన్వౌపమ్యస్యోపమానోపమేయసాధారణ్యేఽపి యదేకస్యాధిక్యమపరస్య న్యూనత్వం చ గమ్యతే తత్కస్య హేతోరితి చేత్ శృణు. ఉపమానే హి సాధారణధర్మ సంబంధోఽనూద్యోపమేయే విధీయత ఇతి తావన్నిర్వివాదమ్. విధ్యనువాదౌ చ సాధ్యత్వసిద్ధత్వాభ్యామ్. తే చ క్రమేణ న్యూనత్వాధిక్యే ఉపమానోపమేయయోః ప్రయోజయతః. లోకేఽపి నిశ్చితవిద్యో యథా పూజ్యతే తథా నానిశ్చితవిద్య ఇతి స్ఫుటమేవ. తే చ సాధ్యత్వసిద్ధత్వే వక్తృవివక్షాధీనే ఇతి నాత్ర దోషః.

ద్వితీయ తృతీయయోర్భేదయోస్తు ఫలం స్ఫుటమేవ. చతు

ర్థస్య తు నిషిధ్యమానవస్తుగతసకలగుణవత్త్వప్రతిపత్తిః పంచమస్య ప్రథమవదితి.

అయితే-ఔపమ్యము ఉపమానోపమేయములకు సాధారణమైయుండగా ఒకదాని యాధిక్యము, మరొకదానియొక్క న్యూనత్వము ఏది తోచుచున్నదో నది ఎందువలన యన్నచో — వినుము. ఉపమానమునందు, సాధారణ ధర్మ సంబంధము, అనువదించి ఉపమేయమునందు విధింపబడుచున్నదని మాత్రము నిర్వివాదము. విధ్యనువాదములు సాధ్యత్వ సిద్ధత్వములచేత. అవియును క్రమముగా న్యూనత్వాధిక్యములను ఉపమానోపమేయములకు ఏర్పరచును. లోకమునందు గూడ నిశ్చిత విద్యులు ఎట్లు పూజింపబడుదురో అట్లు అనిశ్చిత విద్యులు పూజింపబడరు అని స్ఫుటమేగదా ? ఆ సాధ్యత్వ సిద్ధత్వములు వక్తృవివక్షాధీనములు అని ఇక్కడ దోషములేదు. ద్వితీయ తృతీయ భేదముల ఫలము స్ఫుటమేగదా ? నాల్గవదానికైతే సిధ్యమానవస్తుగతసకల గుణవత్వ ప్రతిపత్తి. ఐదవదానికి మొదటిదానికివలెనే యని.

ఉదాహరణమ్—

'కిం జల్పసి ముగ్ధతయా
హంత మమాంగం సువర్ణవర్ణమితి.
తద్ యది పతతి హుతాశే
తదా హతాశే తవాంగవర్ణం స్యాత్'.

అత్ర పూర్వార్ధోపమాగమ్యాం సువర్ణవర్ణాధిక్యాం తిరస్కృత్య ద్వితీయార్ధే ప్రతీపం బాలాంగ వర్ణస్యాధిక్యం గమయతి. హుతాశ పాతం వినా ప్రతీపమపి దుర్లభమ్. ఉపమా తు స్వప్నేఽపి న సంభవతీతి ముగ్ధత్వ హతాశత్వాభ్యాం గమ్యతే.

ఉదాహరణము—

"కిం జల్పసి" మొ. (ముగుదతనముచే నాశరీర వర్ణము సువర్ణవర్ణమని అనుచుంటివేమి ? అది అగ్నియందు పడినచో నపుడు, హతాశురాలా ! నీ శరీరముతో సమానవర్ణమగును )

ఇచట పూర్వార్ధోపమాగమ్యమగు సువర్ణ వర్ణాధిక్యమును తిరస్కరించి ద్వితీయార్ధమునందు ప్రతీపము బాలాంగవర్ణముయొక్క యాధిక్యము నవగమింపజేయును. హుతాశపాతమును విడచి ప్రతీపమున్ను దుర్లభము

ఉపమైతే స్వప్నమందైనను సంభవించదు' అని ముగ్ధాత్వహాతాశత్వములచే తోచును.

'మాహాత్మ్యస్య పరోఽవధిర్నిజగృహం గంభీరతాయాః పితా
రత్నానామహమేక ఏవ భువనే కో వా పరో మాదృశః.
ఇత్యేవం పరిచింత్య మా స్మ సహసా గర్వాంధకారం గమో
దుగ్ధాబ్ధే భవతా సమో విజయతే దిల్లీధరావల్లభః'.

'నిభాల్య భూయో నిజగౌరిమాణం
మా నామ మానం హృదయే విధాసీః.
గృహే గృహే పశ్య తవాంగవర్ణా
ముగ్ధే సువర్ణావలయో లుఠంతి.'

ఉపమానకైమర్థ్యస్య తూదాహరణమాక్షేపప్రకరణ ఏవ గదితమ్ 'అభూదప్రత్యూహః' ఇత్యాది.

పంచమో యథా—

'కరికుంభతులామురోజయోః
క్రియమాణాం కవిభిర్విశృంఖలైః.
కథమాలి శృణోషి సాదరం
విపరీతార్థవిదో హి యోషితః'

అత్ర కథం శృణోషీత్యనేన తులైవ న సంభవతీతి గమ్యతే. అర్థాంతరన్యాసోఽప్యము మేవార్థం పుష్ణాతి. తదేవం పంచవిధం ప్రతీపం ప్రాచామనురోధాన్నిరూపితమ్.

"మహాత్మ్యస్య" మొ. (మాహాత్మ్యమునకు పరావధియు, గంభీరతకు సొంత యిల్లు, రత్నములకు పుట్టినిల్లును నేనొక్కడనే; నాతోసముడు వేరెవ్వడునులేడు. ఇట్లు తలంచి శీఘ్రముగా గర్వాంధకారమునొందకుము. ఓ పాలసముద్రమా! నీతో దుల్యుడు దిల్లీపతి యున్నాడు సుమా!)

"నిభాల్య" మొ. (నీ శరీరము గౌరిమను తలచి గర్వమునొందకుము; ఓ ముగుదా! ప్రతియింటను చూడుము; నీ శరీర వర్ణముగల బంగారు కాఱు లున్నవి.)

ఉపమానకైమర్థ్యమునకు నుదాహరణము ఆక్షేప ప్రకరణమునందు చెప్పబడినది—"అభూదప్రత్యూహః" ఇత్యాదికము.

ఐదవది యెట్లనగా—

"కరికుంభ" మొ. ఓ సఖీ! నీ ఉరోజములకు విశృంఖలులగు కవులు కల్పించు కరికుంభ సాదృశ్యమును ఆదరముతో ఏల వినుచున్నావు? మూగుడలు విపరీతార్థజ్ఞానము కలవారు కదా!)

ఇచట "కథంశృణోషి" అనుటచేత సామ్యమే సంభవించదని తోచు చున్నది. అర్థాంతరన్యాసముగూడ నీయర్థమునే పోషించుచున్నది. కనుక ఈతీరుగా పంచవిధములైన ప్రతీపము ప్రాచీనుల ననుసరించి నిరూపించ బడినది.

వస్తుతస్తు — ఆద్యా(స్త్ర)యోఽప్యుపమాయామేవాంతర్గతా భేదాః. చతుర్థః కేషాంచిదాక్షేపః. పంచమస్త్వనుక్తవైధర్మ్య వ్యతిరేకే. తథాహి—నిష్పాద్యమానం సుందరం వా సాదృశ్యము పమా. నహ్యాద్యే ప్రతీపే 'ముఖమివ కమలమ్' ఇత్యాదౌ సాదృశ్యస్యా నిష్పత్తిరసౌందర్యం వాస్తి యేనోపమాంతో బహిర్భావః స్యాత్, సౌందర్యవిశేషస్య త్వయాప్యభ్యుపగమాత్. విశేషస్య సామాన్యానివా రకత్వాత్. న చ ప్రసిద్ధకమలాదిప్రతియోగికమేవ సాదృశ్యముపమేతి రాజ్ఞామాజ్ఞాస్తి, న చోపమావిరుద్ధవాచినః ప్రతీపశబ్దస్య మాహాత్మ్య దేవ తాదృశం సాదృశ్యముపమేతి శక్యం వక్తుమ్, ఉపమావిశేషవిరుద్ధ వాచకత్వేనాపి తదుపపత్తేః. ఏవం చాద్యం ప్రతీపం ప్రసిద్ధోపమావదు పమావిశేష ఏవ. అత ఏవ ద్వితీయతృతీయావపి భేదావుపమావిశేషా వేవ. ఉపమానోపమేయయోస్తిరస్కారస్తూపమాంతరాద్వైలక్షణ్యం ప్రయోజయేత్, న తూపమాసామాన్యాత్; తదనుస్యూతత్వేనైవ తత్ప్రతీతేః. న హి ద్రాక్షా మాధుర్యాతిశయేన పార్థివాంతరాద్వైల క్షణ్యేత్యపార్థివీ భవతి. అపి చ యద్యుపమానోపమేయయోస్తిరస్కా రోఽలంకారతాప్రయోజకః స్యాత్, పురస్కారోఽపి తథా స్యాత్. యథా—

'ఏకో విశ్వసతాం హరామ్యపఘృణః ప్రాణానహం ప్రాణినా-
మిత్యేవం పరిచింత్య మా స్మ మనసి వ్యాధానుతాపం కృథాః.
భూపానాం భవనేషు కించ విమలక్షేత్రేషు గూఢాశయాః
సాధూనామరయో వసంతి కతి న త్వత్తుల్యకక్షాః ఖలాః'

అత్రౌపమ్యప్రదర్శనస్య నోపమానతిరస్కారః ఫలమ్, తస్య గర్వితత్వేనావివక్షణాత్. కిం తు తదనుతాపనాశః. ఏవం చ ఫలవైలక్షణ్యమాత్రేణాలంకారాంతరత్వం బ్రువతా అస్యాప్యలంకారాంతరత్వమభ్యుపేయం స్యాత్, ప్రతీపషష్ఠభేదత్వం వా. కిం చ త్వదుక్తప్రతీపభేదానామపి పరస్పవైలక్షణ్యేన పృథగలంకారత్వం స్యాత్, న ప్రతీపభేదత్వమ్. ప్రతీపస్య సకలప్రభేదసాధారణసామాన్యలక్షణాభావాత్. అన్యతమత్వం తు దూషణసహస్రగ్రస్తత్వాదలక్షణమేవేత్యసకృదుక్తమ్. ఉపమాలక్షణం తు సకలసాధారణమ్. చతుర్థః ప్రభేదస్తు యేషాం మతే నాక్షేపస్తేషామస్తు నామ ప్రతీపాలంకారః. పంచమస్య తు గతిరుక్తైవ ప్రభేదస్య.

ఇతి రసగంగాధరే ప్రతీపప్రకరణమ్.

వస్తుతః—మొదటి మూడును ఉపమయందే యంతర్భూతమగు భేదములు. నాల్గవది కొందరికి యాక్షేపము. ఐదవదైతే — ననుక్తవైధర్మ్యమగు వ్యతిరేకమున. అది యుక్తమే కదా. నిష్పాద్యమానమగునది గాని, సుందరమైనదిగాని సాదృశ్యముపమ. ఆద్యమగు ప్రతీపమున "ముఖమివ కమలం" ఇత్యాదులందు— సాదృశ్యముయొక్క అనిష్పత్తిగాని, అసౌందర్యముగాని, లేదుకదా; ఎందుచేత ఉపమకంటె బహిర్భావమగునో. సౌందర్య విశేషమును నీవును అంగీకరించితివిగదా ? విశేషము సామాన్యమునకు ననివారకము గనుక. ప్రసిద్ధకమలాది ప్రతియోగికమగు సాదృశ్యమే ఉపమ అని రాజాజ్ఞలేదు. ఉపమావిరుద్ధవాచియగు ప్రతీప శబ్దము యొక్క మాహాత్మ్యముచేతనే అట్టి సాదృశ్యము ఉపమ అని చెప్పుటకు వీలులేదు; ఉపమా విశేషవిరుద్ధవాచకము అని చెప్పినప్పటికిని అది కుదురును గనుక. ఈతీరుగా మొదటిదైన ప్రతీపము ప్రసిద్ధ ఉపమవలె ఉపమా విశేషమే.

కనుకనే ద్వితీయ తృతీయములగు భేదములును ఉపమా విశేషములే. ఉపమానోపమేయముల తిరస్కారమైతే ఉపమాంతరముకన్న వైలక్షణ్యమును ప్రయోగించును; ఇంతేకాని ఉపమాసామాన్యముకన్నగాదు. తదనుస్యూతముగానే తత్ప్రతీతివలన. ద్రాక్ష మాధుర్యాతిశయముచే పార్థివాంతరముకంటె విలక్షణమైనదని అపార్థివి కాదు గదా ?

మరియు— ఉపమానోపమేయములకు తిరస్కారము అలంకారతా ప్రయోజకమైనచో పురస్కారమున్ను ఈరీతిగా నగును. ఎట్లనగా—

"ఏకో" మొ. (నమ్మించి ప్రాణములను నిర్దయుడనై అపహరించు వాడను అని యాలోచించి వ్యాధుడా అను తాపపడకుము; రాజుల యిండ్ల యందును విమలక్షేత్రములందును గూఢాశయముతో సాధువులకు శత్రువులై నీతో సమకక్షులగు ఖలులెందరు లేరు)

ఇచట నౌపమ్యప్రదర్శనమునకు నుపమాతిరస్కారము ఫలముగాదు. ఆతడు గర్వితుడుగా వివక్షచేయబడలేదు గనుక. ఇది యేమనగా—శదనుతాప నాశము. ఈ తీరుగా ఫలవైలక్షణ్యమాత్రముచే నలంకారాన్తరత్వమును చెప్పుచున్నవారు దీనిని అలంకారాన్తరత్వమంగీకరించవలెను; ప్రతీపములో నారవ ప్రతీపమనియైనా చెప్పవలెను

మరియును—నీవు చెప్పిన ప్రతీపభేదములకును పరస్పర వైలక్షణ్యముచే వేరువేరుగా నలంకారాన్తరత్వముండవలెను కాని ప్రతీప ప్రభేదత్వము గాదు. ప్రతీపమునకు సకల ప్రభేద సాధారణమగు సామాన్య లక్షణము లేదు కనుక. అన్యతమత్వము లక్షణము అయితే దూషణ సహస్రముచే గ్రస్తమగుట వలన అలక్షణమేనని అసకృత్తుగా జెప్పబడెను

ఉపమా లక్షణమైతే సకల సాధారణము. నాల్గవ ప్రభేదము యెవరి మతములో నాక్షేపము లేదో వారికి ప్రతీపాలంకారమైనచో కావచ్చును. ఐదవ దానికైతే గతి చెప్పనే చెప్పితిమి. అనుక్త వైధర్మ్యమగు వ్యతిరేకమున నన్తర్భావమని.

ఇది ప్రతీపాలంకార ప్రకరణము

## ప్రౌఢోక్త్యలఙ్కారః

అథ ప్రౌఢోక్తిః :—

కస్మింశ్చిద్ధర్మే కించిద్ధర్మకృతాతిశయప్రతిపిపాదయిషయా ప్రసిద్ధ తద్ధర్మవతా సంసర్గస్యోద్భావనం ప్రౌఢోక్తిః సంసర్గశ్చ సన్నసన్ వా సాక్షాత్పరంపరయా వా.

'వల్మీకోదరసంభూత కపికచ్ఛూసహోదరాః
హా పీడయిత్వా నిఘ్నంతి సజ్జనాన్దుష్టదృష్టయః'.

అత్ర కపికచ్ఛూసహోదరత్వేన మారకత్వం న ప్రాప్నోతి, అపి తు పీడాజనకత్వమాత్రమ్. కవేస్తు పీడాం జనయిత్వా మారయన్తీ-

త్యేవంరూపోఽతిశయో వివక్షితః. అతో వల్మీకోదరసంభూతత్వం సర్వాధికరణవృత్తితారూపం కపికచ్ఛూవిశేషణం మారకతావచ్ఛేదకత్వేన స్వప్రతిభయా కవినా కల్పితమ్.

అనంతరము ప్రౌఢోక్తి.

ఒక అర్థమునందు కొంచెము ధర్మముచే చేయబడిన అతిశయమును ప్రతిపాదించు తలంపుతో ప్రసిద్ధమగు తద్ధర్మముగల దానితో సంసర్గము యొక్క ఉద్భావనము ప్రౌక్తి. సంసర్గమున్ను ఉన్నది గాని, లేనిది గాని, సాక్షాత్తుగా గాని, పరంపరయా గాని.

"వల్మీకోదర" మొ. (వల్మీకము నుదరమున బుట్టిన కపికచ్ఛువు సహోదరులైన దుష్టదృష్టులు సజ్జనులను బాధించి చంపుచున్నారు.)

ఇచట కపికచ్ఛు సహోదరులుగా నుండుటవల్ల మారకత్వము ప్రాప్తించలేదు; ఇక నేమనగా బాధపెట్టుట మాత్రమే. కవిచే "పీడను గల్పించి చంపుచున్నారు" అను ఈ రూపమగు నతిశయము వివక్షింపబడుచున్నది అందుకలన, వల్మీకోదర సంభూతత్వము, సర్వాధికరణ వృత్తితారూపము, కపికచ్ఛూ విశేషణము, మారకత్వ నిర్ణాయకముగా స్వప్రతిభచేత కవి గల్పించెను.

యథా వా—

'మంథాచలభ్రమణవేగవశంవదా యే
దుగ్ధాంబుధేరుదపతన్నణవః సుధాయాః.
తైరేకతాముపగతైర్వివిధౌషధీభి-
ర్ధాతా ససర్జ తవ దేవ దయాదృగంతాన్'.

అత్ర దృగంతేషు న కేవలం సంజీవకత్వాదయోఽమృతమాత్రగుణా ఏవ కవేర్బుబోధయిషితాః అపి తు నిఖిలజనవశీకారకత్వాదయోఽన్యేఽపీతి సుధాకణౌషధ్యౌషధీసంసర్గో విశేషణతయాతిశయార్థముపాత్తః. ఉత్పాద్యోత్పాదకభావశ్చాత్ర న లోకసిద్ధః, అపి తు కవిమాత్రనిబద్ధః.

ఎట్లనగా—

"మంథాచల" మొ. (మందరాచలము తిరిగెడు వేగమునకు లోబడి పాల సముద్రము నుండి యే అణువులు, అమృతమునకు సంబంధించినవి, పైకి

లేచినవో వానిని నానాఔషధులచే నొకటిగాఁజేసి ఓ ప్రభువా! బ్రహ్మ నీ యొక్క కరుణాపాంగములను నిర్మించెను."

ఇచట దృగంతములయందు కేవలము సంజీవకత్వాదులు, అమృత మాత్రగుణములు మాత్రమే, కవి బోధింపదలచినవి గావు; ఇక నేమనగా— నిఖిల జన వశీకరత్వాదులగు ఇతరములు గూడాను, అని సుధాకణము లందు ఓషధీసంసర్గము విశేషణముగా నతిశయముకొరకై ఉపాత్తము ఉత్పాద్య ఉత్పాదకభావమును ఇచట లోకసిద్ధము గాదు; కవి మాత్ర నిబద్ధము.

యథా వా—

'త్వదంగణసముద్భూతా సిక్తా కుంకుమవారిభిః
త్వదంగతులనాం యాంతి కదాచిల్లవలీలతా'.

అత్ర కేవవలాయా లవల్యా ఉపమానతాభరసహనసామర్థ్య స్యాభావాత్తస్య సిద్ధయే నాయికాసామానాధికరణ్యకుంకుమజలసం యోగయోరుపాదానమ్.

అత్ర చ ధర్మివిశేషసంసర్గాదతిశయో ధర్మ్యంతరగతో యద్వ్యా గూరణవిషయస్తదైవాయమలంకారః. వాచ్యవృత్త్యా తత్తత్ప్రయుక్త త్వేనాభిహితశ్చేత్సమాలంకారస్యైవ విషయః. యథా—

'త్వత్తో జన్మ హిమాంశుశేఖరతనుజ్యోత్స్నానిమగ్నాత్మనో
దుగ్ధాంభోనిధిముగ్ధవీచివలయైః సాకం పరిక్రీడనమ్.
సంవాసః సురలోకసింధుపులినే వాదః సుధాంశోః కరైః
కస్మాన్నోజ్జ్వలిమానమంచతి తమాం దేవ త్వదీయం యశః'

అత్ర యశసో ధవలతాతిశయస్తత్తద్ధర్మిసంబంధప్రయుక్తత్వేన కథిత ఇతి తదంశే సమ ఏవాలంకారః. అంశుకకృతశ్చంద్రే చంద్రకృతశ్చ భగవతి భగవత్కృతో రాజనీత్యేవముత్తరోత్తరముపచీయమానో రాజగతస్త్వనుక్తత్వాత్ప్రౌఢోక్తేరేవ విషయః.

మరొకటి—

"త్వదంగణ" మొ. (నీ యంగణమున బుట్టి కుంకుమోదకముచే తడుప బడినదైన లవలీలత యొకవుడు నీ శరీరముతో సమమగును.)

ఇచట కేవల లవలికి ఉపమానతాధర సహనసామర్థ్యము లేనందున అది సిద్ధించుటకై నాయికా సామానాధికరణ్య-కుంకుమజల సంయోగములు స్వీకరించబడినవి. ఇచట ధర్మివిశేష సంసర్గమువలన అతిశయము ధర్మ్యం-తరగతమై ఇది, ఆగూరణ విషయమగునప్పుడే ఇది అలంకారము వాచ్య వృత్తిచేతను, తత్ప్రయుక్తముగా జెప్పబడినదన్నచో సమాలంకారమునకే విషయమగును.

ఎట్లనగా—

"త్వత్తో" మొ. (చంద్రశేఖరుని శరీరపు వెన్నెలతో మునిగిన నీవల్లనే పుట్టుక; పాలసంద్రపు టందపు తరగల వలయములతో పరిక్రీడనమును, దేవ నదీపులినముల నునికియు చంద్రుని కిరణముతో సంవాదమున్ను; ఇట్టి నీకీర్తి ఏల యుజ్జ్వలముకాదు?)

ఇచట కీర్తియొక్క ధవళతాతిశయము తత్తద్ధర్మి సంబంధ ప్రయుక్త ముగా జెప్పబడినది అని ఆ యంశమందు సమాలంకారమే. అంశుకృతము చంద్రునందు, చంద్రకృతము భగవంతునందు, భగవత్కృతమైనది రాజునందు, అని ఈతీరుగా ఉత్తరోత్తరముగా వృద్ధిపొందుచున్న రాజగతమైనది చెప్పబడ నందున ప్రౌఢోక్తికే విషయము.

ఏవం చ—

'శశశృంగధనుర్లసత్కరా గగనాంభోరుహమాలికాధరాః
తనయైః సహ భావిజన్మనాం తవ ఖేలంతి నరేంద్ర వైరిణః'.

ఇత్యాదావేకస్య మిథ్యాత్వసిద్ధ్యర్థం మిథ్యాభూతవస్త్వంతర కల్పనం మిథ్యాధ్యవసితాఖ్యమలంకారాంతరమితి న వాచ్యమ్, ప్రౌఢోక్త్యైవ గతార్థత్వాత్. 'కేశాః కలిందజాతీరతమాలస్తోమమేచకాః' ఇత్యాదౌ ప్రాచీనకృతప్రౌఢోక్త్యుదాహరణే యథా తమాలేషు శ్యామత్వాతిశయసిద్ధ్యర్థం శ్యామత్వాధికరణీభూతకాలిందీసంబంధ ఉద్భావ్యతే తథా వైరిష్వపి మిథ్యాత్వసిద్ధయే మిథ్యాత్వాధికరణశశ శృంగాదిసంబంధ ఇత్యస్యాపి సువచత్వాత్. తత్ర శ్యామత్వాతిశయః ఇహ తు మిథ్యాత్వమాత్రం, న తు తస్యాతిశయః సిద్ధ్యతీతి వైలక్షణ్యం తు న వాచ్యమ్. తమాలస్తోమే ప్రమాణాంతరేణ సిద్ధేఽపి శ్యామత్వే కాలిందీసంసర్గోద్భావనం పునః శ్యామత్వసాధనే

నాతిశయాగూరకమేవ స్యాత్. వైరిషు తు మిథ్యాత్వస్యాసిద్ధత్వా చ్ఛశశృంగాదిసంబంధై ర్మిథ్యాత్వస్య సిద్ధిరిత్యార్థసమాజాధీనేయమతి శయసిద్ధిర్వైలక్షణ్యం న ప్రయోజయతి. యత్తు 'వేశ్యాం వశయేత్స్రజం వహన్' ఇతికువలయానందకృతా మిథ్యాధ్యవసితేరుదాహరణం నిర్మితం తత్తు నిదర్శనయైవ గతార్థమ్. నిదర్శనాగర్భాత్ర మిథ్యాధ్యవసితిరితి తు న యుక్తమ్. మిథ్యాధ్యవసితేరేవ మిథ్యాత్వాత్. యది చ మిథ్యాధ్యవసితిరేవాలంకారాంతరం స్యాత్, సత్యాధ్యవసితిరపి తథా స్యాత్. యథా—

'హరిశ్చంద్రేణ సంజ్ఞప్తాః ప్రగీతా ధర్మసూనునా
ఖేలంతి నిగమోత్సంగే మాతర్గంగే గుణాస్తవ'

అత్ర హరిశ్చంద్రయుధిష్ఠిరనిగమసంబంధాద్ గుణానాం సత్యత్వం ప్రతీయతే. ఏవమ్—

'మధ్యే సుధాసముద్రస్య సితామయగృహోదరే
పూర్ణేందువిష్టరే దేవ స్థాతుం యోగ్యాస్తవోక్తయః'.

అత్రాపి సుధాసముద్రాదిసంబంధాదుక్తిషు మాధుర్యాతిశయః ప్రతీయమానః కస్యాలంకారస్య గోచరః స్యాత్? అతోఽలంకారాంతరం స్యాత్. మమ తు ప్రౌఢోక్త్యైవ గతార్థతేత్యాస్తాం తావత్.

ఇది రసగంగాధరే ప్రౌఢోక్తిప్రకరణమ్.

ఈ విధముగా—

"శశశృంగ" మొ. (కుందేటి కొమ్మువింటితో విలసిల్లు చేతులుకల వారై, ఆకాశపద్మపుదండల ధరించి, ముందుజన్మల బిడ్డలతోగూడ, ఓ రాజా! నీ శత్రువులు ఆడుకొనుచున్నారు.)

ఇత్యాదులయందొకదానికి మిథ్యాత్వము సిద్ధించుటకు మిథ్యాభూత వస్త్వంతర కల్పనము, మిథ్యాధ్యవసితి యనుపేర బరగు నలంకారాంతరమని చెప్పనక్కరలేదు; ప్రౌఢోక్తిచేతనే గతార్థము గనుక. "కేశాః కళిందజాతీర తమాలస్తోమమేచకాః" ఇత్యాదులందు, ప్రాచీనకృత ప్రౌఢోక్తి ఉదాహరణ మందు, ఎట్లు దమాలములందు శ్యామత్వాతిశయముకొరకై శ్యామత్వాధి-

కరణీభూత కాళిందీ సంబంధము ఉద్భావించబడుచున్నదో, అట్లే శత్రువులం దును మిథ్యాత్వసిద్ధికై మిథ్యాత్వాధికరణ శశశృంగాది సంబంధము అనియు సువచము గనుక. అచట శ్యామత్వాతిశయము; ఇచటనైతే మిథ్యాత్వము మాత్రము; దానికి అతిశయము సిద్ధించదు, అని వైలక్షణ్యమును చెప్పదగదు. తమాలస్తోమమందు ప్రమాణాన్తరముచే శ్యామత్వము సిద్ధించినను, కాళిందీ సంసర్గోద్భావనమైతే శ్యామత్వ సాధనముచే నతిశయాగూరకమేయగును. శత్రువులందైతే మిథ్యాత్వము సిద్ధించదు గనుక శశశృంగాది సంబంధములచే మిథ్యాత్వమునకు సిద్ధి అని అర్థసమాజాధీనమగు ఈ అతిశయమునకు సిద్ధి వైలక్షణ్యమును కల్పింపదు

ఏదైతే— "వేశ్యాం వశయేత్స్రజం వహన్" అని కువలయానంద కారులు మిథ్యాధ్యవసితికి ఉదాహరణ నిర్మించిరో అది నిదర్శనచేతనే గతార్థ మైనది. నిదర్శనాగర్భము ఇట మిథ్యాధ్యవసితి యని చెప్పదగదు; మిథ్యాధ్యవ సితికే మిథ్యాత్వము గనుక. మిథ్యాధ్యవసితియే అలంకారాంతరమైనచో సత్యాధ్యవసితియును అటులగునదే గదా? ఎట్లనగా—

"హరిశ్చంద్రేణ" మొ. (హరిశ్చంద్రునిచే బాగాజ్ఞప్తిచేయబడి, ధర్మ జునిచే బాగుగ గానము చేయబడినవై, తల్లీ గంగా! నీ గుణములు వేదముల ఉత్సంగమున విహరించుచున్నవి,)

ఇచట హరిశ్చంద్రుడు యుధిష్ఠిరుడు వేదములు, వీటి యొక్క సంబం ధముచేతను గుణములకు సత్యత్వము ప్రతీతమగుమ.

ఇటులనే "మధ్యే" మొ. (ఓదేవా! నీ ఉక్తులు సుధాసముద్రము యొక్క మధ్యయందు చక్కెరతోనిండిన ఇంటిమధ్యయందు, పూర్ణేందు రూపసింహాసనముపై నుండుటకు తగినవి.)

ఇచటను సుధాసముద్రాది సంబంధమువలన ఉక్తులందు మాధుర్యాతి శయము ప్రతీయమానము ఏయలంకారమునకు గోచరమగును? అందుచే అలంకారాంతరము కావలసియుండును. మేమైతే ప్రౌఢోక్తిచేతనే గతార్థ మందుము. ఇంతటితో చాలును.

ఇది ప్రౌఢోక్తి ప్రకరణము

## లలితాలఙ్కారః

అథ లలితమ్.

ప్రకృతధర్మిణి ప్రకృతవ్యవహారానుల్లేఖేన నిరూప్యమాణోఽప్రకృతవ్యవహారసంబంధో లలితాలంకారః.

'ఆదదానః పరద్రవ్యం విషం భక్షయసి ధ్రువమ్' ఇత్యాదినిదర్శనావారణాయ తృతీయాంతమ్. అప్రస్తుతప్రశంసావారణాయ ప్రకృతధర్మిణీతి. యథా—

'క్వ వా రామః కామప్రతిభటలలాటంతపబల-
స్తవ క్వామీ వీరా రణశిరసి ధీరా మఖభుజామ్.
దిధక్షోస్త్రైలోక్యం ప్రలయశిఖినః పద్మమథన
ప్రగల్భైః ప్రాలేయైః ప్రశమమసి కర్తుం వ్యవసితః'

అత్ర ప్రకృతే ధర్మిణి రావణే పరదత్తపురోడాశాదికమశ్నతాం దేవానామగ్రే ధీరైః కుంభకర్ణాదిభిర్వీరైర్భగవతో రామస్య పరాభవమిచ్ఛన్నిత్యేవం కంఠరవేణ తాదృశేచ్ఛారూపం ప్రకృతవ్యవహారం విషయమనుక్త్వైవ తాదృశప్రాలేయకరణకతాదృశాగ్నిప్రశమనవ్యవసాయరూపోఽప్రకృతవ్యవహారో విషయ్యుపాత్తః. విషయోపాదానే తు నిదర్శనైవ.

అనంతరము లలితము.

ప్రకృత ధర్మియందు ప్రకృత వ్యవహార ముల్లేఖించకుండుటచేత నిరూప్యమాణమగు నప్రకృత వ్యవహార సంబంధము లలితము అను నలంకారము.

"ఆదదానః" మొ. (పరద్రవ్యమును తీసుకొను నీవు విషమును దినుచున్నావు; నిశ్చయము )

ఇత్యాది నిదర్శనావారణకై తృతీయాంతము. అప్రస్తుత ప్రశంసావారణకై ప్రకృత ధర్మియందు అని. ఎట్లనగా—

"క్వ వా రామః" మొ. (శివునికూడ పీడింపగల్గిన బలముగలరాము డెక్కడ; యజ్ఞము నందు భోక్తలగు దేవతల ముందు వీరులగు నీ యుద్ధభటు లెక్కడ. మూడులోకములను దహింపజేయునట్టి ప్రళయాగ్నిని పద్మమథన ప్రగల్భమగు మంచుచే శమింపచేయుటకు దల్చుచున్నావు.)

ఇచట ప్రకృత ధర్మియగు రావణునియందు; పరదత్తపురోడాశాదిక-మశ్నువానులగు దేవతలముందు ధీరులైన కుంభకర్ణాదులు మొదలగు వీరుల చేతను భగవంతుడగు రాముని పరాభవము గోరుచున్నాడని ఈ తీరుగా కంఠరవముతో దాదృశేచ్ఛారూపమగు ప్రకృత వ్యవహారమగు విషయమును జెప్పకయే తాదృశప్రాలేయకరణక తాదృశాగ్నిపరిశమనవ్యవసాయ రూపమగు నప్రకృత వ్యవహారము, విషయి ఉపాత్తము అయినది. విషయోపాదానము జేసినయెడల నిదర్శనయేను.

యథా వా—

'నాన్యాస్తి కిం భూమితలే సురూపా సీతైవ వా కిం భవతోఽనురూపా
ఆకర్షతా చందనశాఖిశాఖాం ప్రబోధితోఽయం భవతా ఫణీంద్రః'

అత్రాపి రాఘవసంబంధినాయికాహరణప్రయుక్తం తదీయక్రోధోద్బోధమనుక్త్వైవ చందనసంబంధిశాఖాకర్షణప్రయుక్తం ఫణీంద్రబోధనముపన్యస్తమ్. న చాత్ర భేదేఽప్యభేద ఇత్యతిశయోక్త్యా గతార్థతేతి వాచ్యమ్. తత్ర హి పదార్థేన పదార్థస్యైవాభేదాధ్యవసానం 'కనకలతాయాం విరాజతే చంద్రః' ఇత్యాదౌ దృష్టమ్, న తు వ్యవహారేణ వ్యవహారస్యేత్యవిషయ ఏవాయమతిశయోక్తేః, నాపి సాదృశ్యమూలయా ప్రస్తుతప్రశంసయా. ధర్మాంశేఽప్రస్తుతత్వవిరహాత్. నాపి నిదర్శనయా. ఏకధర్మిగతవ్యవహారద్వయోపాదాన ఏవ తస్యా ఇష్టేః. అత ఏవ 'ఉపాత్తయోః' ఇతి తల్లక్షణేవిశేషణముక్తమ్, ప్రకృతే చ ప్రకృతవ్యవహారస్యానుపాత్తత్వాదలంకారాంతరమేవ.

మరొకటి—

"నాన్యాస్తి" మొ. (సీతవలె భూమియందు మరియొకతె మంచి రూపముకలది గాదా? నీకు సీత ఒక్కతియే తగినదా! చందనవృక్షపు కొమ్మను ఆకర్షించునట్టి నీచేత సర్పరాజము మేల్కొల్పబడినది)

ఇచటను రాఘవ సంబంధినాయకాహరణ ప్రయుక్తమగు తదీయక్రోధోద్బోధనము చెప్పకయే, చందన సంబంధియగు శాఖాకర్షణ ప్రయుక్తమగు ఫణీంద్ర ప్రబోధనము ఉపన్యసించబడినది.

ఇచట భేదమునందభేదమని చెప్పిన అతిశయోక్తిచే గతార్థతయనరాదు. అచటనైతే పదార్థముతో పదార్థమునకు నభేధాధ్యవసానము, "కన

కలతాయాం, విరాజతే చంద్రః" ఇత్యాదులందు చూడదగినది; అంతే కాని వ్యవహారముచేత వ్యవహారమునకు కాదు, అని ప్రకృత మతిశయోక్తికి విషయముకాదు. సాదృశ్యమూల యగు నప్రస్తుతప్రశంసచేత కూడ కాదు. ధర్మ్యంశమునందు అ ప్రస్తుతత్వము లేదు గనుక; నిదర్శనతోనుగాదు. ఏక ధర్మిగత వ్యవహార ద్వయమునందే అది ఇష్టము గనుక. అందువలననే "ఉపాత్తములగు రెంటికి" అని దాని లక్షణమునందు విశేషణము చెప్పబడెను. ప్రకృతమునందు ప్రకృత వ్యవహార మనుపాత్తమైనందున అలంకరాన్తరమేను.

ఏవం చ—

'క్వ సూర్యప్రభవో వంశః క్వ చాల్పవిషయా మతిః
తితీర్షుర్దుస్తరం మోహాదుడుపేనాస్మి సాగరమ్'.

ఇత్యత్ర కావ్యప్రకాశకారో యన్నిదర్శనాముదాహార్షీత్తదసంగతమేవ. లలితస్యావశ్యాభ్యుపగమ్యత్వాన్నిదర్శనాయా అత్రాప్రాప్తేశ్చ. తదిత్థం లలితస్యాలంకారాంతరత్వమురరీకుర్వతామాశయః.

ఈ తీరుగా—

"క్వ సూర్య" అనుచోట కావ్యప్రకాశకారులు నిదర్శన అని ఉదహరించిరి; అది కూడదు. లలితమును ఈ తీరుగా తప్పక అంగీకరింపవలసియున్నది; నిదర్శనకు ఇచట ప్రాప్తిలేదు కూడాను, అని లలితము అలంకారాంతరము అని అంగీకరించువారి యభిమతము

అన్యే తు "లలితం నాలంకారాంతరమ్, నిదర్శనయైవ గతార్థత్వాత్. నన్వేకధర్మిగతాప్రస్తుతవ్యవహారద్వయోపాదానజీవితా నిదర్శనా కథమప్రస్తుతవ్యవహారమాత్రోపాదానే పదమాధత్తామితి చేత్, శ్రూయతామాయుష్మతా. ఇహ తావదలంకారాః ప్రాయశః శ్రౌతా ఆర్థాశ్చ సంభవంతి. తత్ర శ్రౌతేభ్య ఆర్థా న పృథగలంకారత్వేన గణ్యంతే. కిం తు పృథగ్ భేదత్వేన, తదలంకారసామాన్యలక్షణేన క్రోడీకరణాత్. ఇదం పునర్వాక్యార్థనిదర్శనాస్వరూపమ్ — వ్యవహారద్వయవద్ధర్మ్యభేదప్రతిపాదనాక్షిప్తో వ్యవహారద్వయాభేదః. తత్ర వ్యవహారద్వయవద్ధర్మ్యభేదస్య ప్రతిపాదనం శ్రౌతమేవాపేక్షితమితి న నియమః. కింతు ప్రతిపాదనమాత్రమ్. తేన 'పరద్రవ్యం హారన్మర్త్యో గిలతి క్ష్వేడసంచయమ్' ఇత్యత్ర వ్యవహారద్వయవద్ధర్మిణోరభేదస్య

శ్రుత్యా ప్రతిపాదన ఇవ 'ధిక్ పరస్వం తథా ప్యేష గిలతి క్ష్వేడసంచయమ్' ఇత్యత్రార్థప్రకృతవ్యవహారవద్ధర్మి- శ్రౌతాప్రకృతవ్యవహార వద్ధర్మిణో రార్థాభేదస్య ప్రతిపాదనేఽపి వాక్యార్థనిదర్శనాత్వమక్షతమ్. ఏకత్ర శ్రౌతీత్వమపరత్రార్థీత్వమితి విశేషో న వార్యతే. పదార్థని- దర్శనాస్వరూపం తూపమానోపమేయధర్మయోరభేదాధ్యవసాయ మూల ఉపమేయోపమానధర్మసంబంధ ఇతి పృథగేవ. ఏతదుభయా న్యతరత్వం చ ప్రాచీనరీత్యా సామాన్యలక్షణమ్. యది తు లలితం పృథగలంకారః స్యాత్ లుప్తోపమాదిరప్యుపమాదేః పృథక్స్యాత్, త్వదుక్తయుక్తేస్తుల్యత్వాత్.

ఇతరులైతే—

"లలితము అలంకారాన్తరముగాదు; నిదర్శనచేతనే గతార్థము గనుక. అయ్యా! ఏక ధర్మియందున్న ప్రస్తుతాప్రస్తుత వ్యవహార ద్వయమును, స్వీకరిం చుటయే జీవితముగా గల నిదర్శన ఎట్లు అప్రస్తుత వ్యవహార మాత్రోపాదనము నందు అడుగు పెట్టగలదు? అన్నచో-

ఆయుష్మంతుడా వినుము. ఇక్కడనైతే అలంకారములు తరచు శ్రౌతములు అని, ఆర్థములు అని అగును. అచట శ్రౌతములకంటే నార్థములు పృథగలంకారములుగా గణింపబడవు. ఇకనేమంటే పృథగ్భేదముగానే గణింప బడును, ఆఅలంకార సామాన్యలక్షణముచే క్రోడీకరింపబడును గాన. వాక్యార్థ నిదర్శనా స్వరూపము ఇది– వ్యవహారద్వయ వద్ధర్మ్యభేద ప్రతి పాదనాక్షి ప్తమైన వ్యవహారద్వయాభేదము- అచట వ్యవహార ద్వయముగల ధర్మ్య- భేదమునకు ప్రతిపాదనము శ్రౌతమే, అపేక్షితమని నియమములేదు. ఇకనేమంటే ప్రతిపాదన మాత్రమే. దానిచేత—

"పరద్రవ్యం హరన్మర్త్యో గిలతి క్ష్వేడ సంచయం" అనుచోట వ్యవహార ద్వయము గల ధర్ముల కభేదము శ్రుతిచేత ప్రతిపాదితమైనపుడు. వలె,

"ధిక్ పరస్వం తథా ప్యేష గిలతి క్ష్వేడసంచయం" అనుచోటనార్థప్రకృత వ్యవహారవద్ధర్మి శ్రౌతాప్రకృత వ్యవహారవద్ధర్ములకు రార్థాభేదము ప్రతి పాదించినప్పటికి వాక్యార్థనిదర్శనయగుట నిరభ్యంతరమైనది. ఒక చోట శ్రౌతీత్వము మరొకచోట నార్థీత్వము అను విశేషము వారింపబడలేదు. పదార్థ నిదర్శనా స్వరూపమైతే ఉపమానోపమేయధర్మముల అబేదాధ్యవసాయ మూల

మగు ఉపమేయోపమాన ధర్మసంబంధము అని పృథక్కేను. ఏతదుభయా న్యతరత్వము ప్రాచీనుల మతమున సామాన్య లక్షణము. లలితాలంకారము పృథగలంకారమైన యెడల లుప్తోపమాదులును ఉపమాదికన్న పృథక్కుగానే యగును; నీవు చెప్పిన యుక్తి సమానమేగనుక.

నన్వతిశయోక్తిరేవం సతి రూపక ఏవ విలీయేత, విషయ విషయిణోర్ద్వయోరప్యుపాదానే శ్రౌతం రూపకమ్, విషయిమాత్రో పాదానే త్వార్థమిత్యస్యాపి సువచత్వాత్. సత్యమ్. యత్ర హ్యాలం కారశరీరముభయత్రాప్యవిలక్షణమ్, తత్రైకాలంకారవ్యపదేశోయుక్తః. యథా సాదృశ్యం నిష్పాద్యమానముపమాశరీరం లుప్తోపమాదిష్వ విలక్షణ మేవేతి తత్రాప్యుపమయైవ వ్యపదేశో న్యాయ్యః, నాలంకా రాంతరేణ, లుప్తత్వపూర్ణత్వాదిస్తు న తచ్ఛరీరనివిష్ట ఇతి స్వయం వ్యావర్తమానోఽపి నోపమాత్వవ్యావర్తకః, తథాన్యత్రాపీతి స్థితిః. ఏవం చ విషయతావచ్ఛేదకరూపేణ భాతే విషయే విషయితావచ్ఛేద కావచ్ఛిన్నాభేదస్య రూపకశరీరస్య విషయితావచ్ఛేదకరూపేణాభాస మానవిషయాత్మకాదతిశయోక్తిరూపాద్విలక్షణత్వేన ద్వయోరేకాలం- కారత్వం న యుక్తమ్. నిదర్శనాలలితయోస్తు స్వరూపావైలక్షణ్యం ప్రదర్శితమిత్యేకాలంకారత్వమేవ" ఇత్యాహుః.

ఏమయ్యా! అతిశయోక్తియు, ఇట్లయినచో, రూపకమునందే విలీన మగును. విషయ విషయులకు రెంటికిన్ని ఉపాదానము నందు శ్రౌతమగు రూపకము విషయమాత్రోపాదనమునం దార్థము అనియు సువచము గదా? నిజమే, ఎక్కడ అలంకార శరీరముభయత్రయును, నవిలక్షణముగా నగునో నచటనొకే యలంకారమని వ్యపదేశము యుక్తము. ఎట్లనగా సాదృశ్యము, నిష్పాద్యమానము, ఉపమాశరీరమైనది, లుప్తోపమాదుల యందును అవిలక్ష ణమేనని అచటకూడ ఉపమచేతనే వ్యపదేశము న్యాయ్యము, అలంకారాన్తర ముచేతగాదు, లుప్తత్వ పూర్ణత్వాదికమైతే దాని శరీరములో చేరినదిగాదని తాను వ్యావర్తమానమైనను, ఉపమాత్వ వ్యావర్తకము కాదు. అటులనే ఇతర స్థలములందును అని స్థితి. ఈ తీరుగా విషయతానిర్ణాయక రూపముతో ప్రకాశించునట్టి విషయమునందు, విషయితా వచ్ఛేదకావచ్ఛిన్న భేదమునకు

రూపక శరీరమునకు, విషయితావచ్ఛేదక రూపముతో ప్రకాశించని విషయ మాత్రముగాగల అతిశయోక్తి స్వరూపముకంటే విలక్షణత్వము గనుక రెండును ఒక యలంకారమగుట యుక్తముగాదు. నిదర్శనా లలితములకైతే స్వరూపా వైలక్షణ్యము ప్రదర్శితమని ఏకాలంకారత్వమేను" అని చెప్పుదురు.

'ఆహార్యనిశ్చయవిషయీభూతో విషయే విషయ్యభేదో రూపకస్వరూపముచ్యతే. న నివేశ్యతే చ విషయతావచ్ఛేదకాది, గౌరవాత్. ఏవం చాతిశయోక్తేర్నిగీర్యాధ్యవసానరూపాయా రూపకభేదత్వమస్తు నామ! కా నో హానిః? ఏవమపహ్నుతేరపి, విషయతావచ్ఛేదక నిహ్నవానిహ్నవనిగరణాని రూపకస్యైవావాంతరవిశేషాః' ఇతి తు నవ్యాః. ఏతన్మతరీత్యా తు లలితస్య నిదర్శనాతః పృథగలంకారత్వం మనోరథ లలిత మేవేతి.

"విషయమునందు ఆహార్యనిశ్చయ విషయీభూతమైన విషయికభేదము రూపక స్వరూపమనబడుచున్నది, విషయతావచ్ఛేదకాదికము నివేశింపబడుట లేదు; గౌరవము వలన. ఈ తీరుగా నతిశయోక్తికి, నిగీర్యాధ్యవసాన రూపమునకు, రూపక ప్రభేదత్వము ఉండుగాక. మాకేలహాని? ఈ తీరుగా నపహ్నుతికిని విషయతావచ్ఛేదక నిహ్నవా నిహ్నవనిగరణములు రూపకము యొక్కయే అవాంతర విశేషములు" అని నవ్యులందురు. వీరి మత ప్రకారముగా లలితమునకు నిదర్శనముకంటే ప్రత్యేకాలంకారత్వము మనోరథ లలితమేనని.

ఏవం చ 'తితీర్షుర్దుస్తరం మోహాదుడుపేనాస్మి సాగరమ్' ఇత్యత్ర నిదర్శనా సాధు సంగచ్ఛతే. క్వ సూర్యేత్యాదినా స్వమతి-సూర్యప్రభవవంశయోరత్యంతాననురూపత్వకథనోత్తరముడుపకరణక-సాగరతరణేచ్ఛాయా అప్రకృతాయాః కథనేన తాదృశమతికరణక-వర్ణనేచ్ఛాయాః ప్రకృతాయాః ప్రతిపత్తేః.

ఈవిధముగా-"తితీర్షుః దుస్తరం మోహాదుడుపేనాస్మి సాగరం" అనే చోట నిదర్శన చక్కగాసంగతమగును. క్వసూర్యేత్యాదిచే స్వబుద్ధి సూర్యప్రభవ వంశములకు నత్యంతాననురూపత్వము చెప్పిన తరువాతను ఉడుపకరణక సాగరతరణోద్దేశ్యకేచ్ఛను, అప్రకృతమును చెప్పుటచే తాదృశమతి కరణక వర్ణనేచ్ఛకు, ప్రకృతమునకు, ప్రతిపత్తి వలన.

యత్తు "—'అనాయి దేశః కతమ స్త్వయాద్య వసంతము క్తస్య దశాం వనస్య' ఇతి పద్యే కతమో దేశ స్త్వయా పరిత్యక్త ఇతి ప్రస్తుతార్థమనుపన్యస్య వసంతము క్తస్య వనస్య దశామనాయీతి తత్ప్రతిబింబభూతార్థమాత్రోపన్యాసా ల్లలితాలంకారః" ఇతి కువలయానందకార ఆహ. తదత్యంతమసంగతమ్. అత్ర కథమన్యస్య దశామన్యో నేతుం శక్య ఇతి వసంతము క్తవనదశాం నిఃశ్రీకత్వలక్షణామనాయీతి హి పర్యవసన్నోఽర్థః. తత్ర నిఃశ్రీకత్వరూపకార్యద్వారా కారణస్య రాజక ర్తృకత్యాగకర్మత్వస్యాభిధానం పర్యాయో క్తేర్విషయః, దశయో రేకత్వాధ్యవసానం తు పదార్థనిదర్శనాయా అత్వియో క్తేర్వేత్యన్యదేతత్. ఏవం చ పదార్థనిదర్శనోపబృంహితస్య పర్యాయో క్తస్యైవాత్ర విషయః, న లలితస్య. కిం చ త్వదు క్తం లలితాలంకారలక్షణమపి నాత్ర సంభవతి. తచ్చ "—'ప్రస్తుతే వర్ణ్యవాక్యార్థప్రతిబింబస్య వర్ణనమ్' ప్రస్తుతే ధర్మిణి వర్ణనీయం వాక్యార్థమవర్ణయిత్వా కస్యచిదప్రస్తుతస్య వాక్యార్థస్య వర్ణనం లలితమ్" ఇత్యాదినా గ్రంథేన భవతా వివేచితమ్. ఇహ చ ప్రస్తుతే ధర్మిణి దేశవిశేషే రాజక ర్తృకత్యాగకర్మత్వరూపస్య వర్ణ్యస్యార్థస్యావర్ణనేఽప్యప్రస్తుతస్య వసంతక ర్తృకత్యాగకర్మత్వస్యాప్యవర్ణనాత్కథం సంగచ్ఛతామ్. యది పునః 'అకారి దేశః కతమ స్త్వయాద్య నిర స్త చంద్రః కఠినాశయేన' ఇతి పద్యం స్యా త్తదా స్యాదపి తవ మనోరథః. న చ తాదృశవనదశాయా అప్రస్తుతాయా దేశవిశేషే వర్ణనమ స్త్యేవేతి వాచ్యమ్. దశాశబ్దేన తద్దశాసదృశస్య దశాంతరస్య లక్ష్యత్వేన తస్యాప్రస్తుతత్వాయోగాత్. అన్యథా పదార్థనిదర్శనోచ్ఛేదాప త్తేః.

"అనాయి దేశః కతమస్త్వయాద్య వసంతముక్తస్య దశాం వనస్య" అను పద్యమందు, ఏ దేశము నీచేత విడువబడినది, అని ప్రస్తుతార్థము నుపన్యసింపక వసంతముక్త వనముల యొక్క దశను పొందింపబడెను, అని తత్ప్రతిబింబ భూతమగు నర్థమునుమాత్ర ముపన్యసించుటవలన లలితాలంకారము అని కువలయానందకారులు ఏది చెప్పిరో, అది అత్యంతమసంగతము. ఇచట ఎట్లు ఇతరుల యొక్క దశను ఇతరుడు పొందుటకు వీలగును; అని వసంతము క్త వనదశను నిఃశ్రీకత్వ లక్షణయగు దానిని పొందింపబడెను, అనిగదా పర్య

వసితమగునర్థము. అక్కడ నిఃశ్రీకత్వరూపమగు కార్యము ద్వారా, కారణమగు రాజకర్తృక. త్యాగ కర్మత్వమునకు నభిధానము పర్యాయోక్తికి విషయము, రెండు దశలకు నేకత్వాధ్యవసానము మాత్రము పదార్థ నిదర్శనకుగాని అతిశయోక్తికిగాని, అని అది విషయాంతరము. కావున ఇది పదార్థ నిదర్శనోప బృంహితమగు పర్యాయోక్తమునకే విషయముకాని లలితాలంకారమునకు గాదు. నీవు చెప్పిన లలితాలంకార లక్షణమును ఇచట కుదురదు.

అదియు "ప్రస్తుతే" మొ. (ప్రస్తుతధర్మియందు వర్ణనీయమగు వాక్యార్థమును వర్ణించక ఒకానొక యప్రస్తుత వాక్యార్థమును వర్ణించుట లలితము) ఇత్యాదియగు గ్రంథముచే నీచేతనే వివేచింపబడినది. ఇక్కడ ప్రస్తుతమగు ధర్మియందు, దేశవిశేషమునందు రాజకర్తృక త్యాగకర్మత్వ రూపమగు వర్ణ్యమగు అర్థమును వర్ణించకపోయినను అప్రస్తుతమగు వసంత కర్తృకత్యాగకత్వమును గూడ వర్ణించక పోవుట వలన ఎట్లు సంగతమగును?

ఒకప్పుడు "అకారి దేశః కతమస్త్వయావ్య నిరస్తచంద్రః కఠినాశయేన" అని పద్య మున్నయెడల, అప్పుడు నీ కోరిక నెరవేరును. అటువంటి వనము యొక్క దశకు, నప్రస్తుతమునకు, దేశ విశేషమునందు వర్ణనమున్నది కదా— అన్నచో, దశాశబ్దముచేత నా దశతో సమానమైన దశాంతరము లక్ష్యముగా జెప్పబడెనుగాన దానికి అప్రస్తుతత్వము కుదురదు కనుక. అలా కాని యెడల పదార్థ నిదర్శనకు నుచ్ఛేదము సంభవించును.

ఏవమ్—

'రామో విజయతే యస్య తుణాత్తాన్నమర్షి పీతుణాత్
దావాగ్ని దగ్ధకాంతారలీలాం లంకాపురీ దధౌ.'

ఇత్యాదౌ లలితస్యాలంకారాంతరతామభ్యుపగచ్ఛతామపి మతేన తస్య విషయః, కింతు నిదర్శనాయాః. అత ఏవ—

'ఉదయతి వితతోర్ధ్వరశ్మిరజ్జా -
వహిమరుచౌ హిమధామ్ని యాతి చాస్తమ్,
వహతి గిరిరయం విలబిఘంటా
ద్వయపరివారితవారణేంద్ర లీలామ్'.

ఇతి ప్రాచాం నిదర్శనోదాహరణమపి సంగచ్ఛతే. తవ తు రశ్మి రజ్జునియంత్రిత పార్శ్వద్వయ సంలగ్నసూర్యచంద్రోఽయం గిరిరి-త్యేవం ప్రకృతధర్మ్యారూఢతయా ప్రకృతార్థానుపాదానాల్లలితమేవ స్యాత్. ప్రకృతవ్యవహారస్య లేశతోఽప్యకీర్తనే కేవలం ప్రకరణాదినా గమ్యత్వే లలితమ్ అన్యథా నిదర్శనేతి చేత్ 'క్వ సూర్యప్రభవః——' ఇత్యస్మాత్కథం నిదర్శనా తర్హి నిర్వాసితేతి సర్వమసమంజసమేవ.

ఇతి రసగంగాధరే లలితాలంకారప్రకరణమ్.

ఈ విధముగా "రామో విజయతే" మొ. (ఎవని సామర్థ్యమగు చూపు వలన లంకా పట్టణము క్షణకాలములో దావాగ్నిలో దగ్ధమగు అడవియొక్క లీలను ధరించెనో అటువంటి రాముడు అధికముగానున్నాడు.)

ఇత్యాదులందు లలితమును అలంకారాంతరముగా సమ్మతించిన వారి మతములోనైనను దానికి ప్రసక్తి లేదు; మరినిదర్శనమునకే. ఇందు వల్లనే —

"ఉదయతి" మొ. (విస్తరించిన ఊర్ధ్వములగు రశ్మిరజ్జువులుకల్గి సూర్యుడుదయించుచుండగా, చంద్రుడస్తమించుచుండగా, నీకొండ వ్రేలాడు చుండు రెండు ఘంటలచే పరివారితమగు గజశ్రేష్ఠము యొక్క లీలను వహించుచున్నది.)

అను ప్రాచీనుల నిదర్శనోదాహరణము సరిపోవును. నీకైతే రశ్మిరజ్జు నియంత్రిత పార్శ్వద్వయమునందు సంలగ్నమైన సూర్య చంద్రులు గలది యీ గిరియని. ప్రకృతధర్మ్యారూఢముగా ప్రకృతార్థము పాత్రముగాకుండు టచే లలితమేయగును. ప్రకృత వ్యవహారము లేశమైనను కీర్తించక, అది కేవ లము ప్రకరణాదులచే గమ్యమగునపుడు మాత్రమే లలితము. మరొకవిధమున నిదర్శనయనిన యెడల "క్వసూర్య ప్రభవః" అను దాని నుండి యెట్లు నిదర్శన నిర్వాసితమైనది, అని అంతయు నసమంజసమే.

ఇది లలితాలంకారము

## ప్రహర్షణాలఙ్కారః

అథ ప్రహర్షణమ్——

సాక్షాత్తదుద్దేశ్యకయత్నమంతరేణాప్యభీష్టార్థలాభః ప్రహర్షణమ్. ఇదం చ సామాన్యలక్షణం త్రివిధప్రహర్షణసాధారణమ్.

తత్రాకస్మాదభీప్సితార్థలాభ ఇత్యేకా విధా. వాంఛితార్థసిద్ధ్యర్థం యత్నే క్రియమాణే తతోఽప్యధికతరార్థలాభ ఇత్యపరా. ఉపాయ సిద్ధ్యర్థాద్యత్నాత్సాక్షాత్ఫలస్య లాభ ఇతి తృతీయా. అస్యామేవా వ్యాప్తినిరాసార్థం లక్షణే సాక్షాదిత్యుక్తమ్.

క్రమేణోదాహరణాని—

'తిరస్కృతో రోషవశాత్పరిష్వ జ -
న్ప్రియో మృగాక్ష్యా శయితః పరాఙ్ముఖః.
కిం మూర్ఛితోఽసావితి కాందిశీకయా
కయా చిదాచుంబ్య చిరాయ సస్వజే'.

అత్ర యత్నసామాన్య శూన్యస్యాపీష్టలాభః.

'కేలీమందిరమాగతస్య శనకై రాలీరపాస్యేంగితైః
సుప్తాయాః పరుషః సరోరుహదృశః సంవీజనం కుర్వతః.
జానంత్యాప్యనభిజ్ఞయేవ కపటవ్యామీలితాక్ష్యా సఖి
శ్రాంతాసీత్యభిధాయ వక్షసి తయా పాణిర్మమాధీయత.'

అత్ర భామిన్యా రోషనివారణాయ యత్నే క్రియమాణే రోషనివారణాదప్యధికతరసుఖప్రదః కాముకస్య భామినీకర్తృకః స్వకర్మ-కస్తత్కుచాధికరణక ఆసంగః. న చాత్ర తృతీయభేదః శంక్యః. వ్యజనవీజనసమయే కాముకస్య మానినివారణస్యైవముఖ్యోద్దేశ్యత్వేన తదుపేయకుచస్పర్శాదిఫలాంతరస్యానుపస్థితేః.

అనంతరము—ప్రహర్షణము.

సాక్షాత్తుగా దానినుద్దేశించిన యత్నముండకున్నను నభీష్టార్థలాభము ప్రహర్షణము. ఇది సమాన్య లక్షణము మూడు రకములైన ప్రహర్షణ మునకు సాధారణము. అచట సాకస్మికముగా నభీష్టార్థ లాభము ఒక విధము. వాంఛితార్థసిద్ధికై యత్నము చేయగా అంతకంటెను అధికతర ముగా నర్థలాభము అని రెండవ రకము. ఉపాయసిద్ధ్యర్థమైన యత్నము వలన సాక్షాత్తు ఫలము లాభించుట మూడవది. దీనియందే అవ్యాప్తినిరాస మునకై 'సాక్షాత్' అని పదము వాడబడినది. క్రమముగా నుదాహరణ ములు—

"తిరస్కృతః" మొ. (కౌగలించుకొనుచున్న ప్రియుడు మృగాక్షిచే

కోపవశమున తిరస్కరింపబడి పందుకొనెను, మూర్ఛపోయినాడా అని భయ పడిన ఆమెచే ముద్దుపెట్టుకొని చాలసేపు కౌగలించుకొనబడెను.)

ఇచట యత్నసామాన్య శూన్యునకు గూడ ఇష్టలాభము.

"కేళీమందిరం" మొ. (కేళీమందిరమునకు పోయి, సఖురాండ్రను సంజ్ఞలచేత దూరముగపంపి నేను కోపముతో నిదురించుచున్న ఆమెకు వీచు చుండగా, ఆమె ఇదియంతయు తెలిసియు తెలియనిదివలె కండ్లు మూసుకొని "సఖీ, అలసితివి; చాలును" అనిపలుకుచు నాహస్తమును తనవక్షమునచేర్చెను.)

ఇచట భామినికి రోషనివారణకొరకు యత్నము చేయబడుచుండగా రోషనివారణకంటెను అధికతరముగా సుఖము గలిగించునట్టి కాముకుని యొక్క భామినీకర్తృకమగు స్వకరకర్మకమైన తత్కుచాధికరణకాసంగము. ఇచట తృతీయభేద మాశంకించరాదు; విసనకర్రతో వీచుసమయమునందు కాముకునకు కోపము పోగొట్టటమే ముఖ్యోద్దేశ్యము గనుక తదుపేయమగు కుచస్పర్శాదియగు ఫలాంతరము ఉపస్థితము గాదుగదా ?

యథా వా—

'లోభాద్ వరాటికానాం విక్రేతుం తక్రమనిశమటంత్యా
లబ్ధో గోపకిశోర్యా మధ్యేరథ్యం మహేంద్రనీలమణిః'.

అత్ర ప్రహర్షణద్వితీయభేదః స్ఫుట ఏవ-అననురూపసంబంధ మాదాయ విషమాలంకారశ్చ. తత్ర మహేంద్రనీలమణిరిత్యతిశయో క్త్యాలీఢయోర్విషయవిషయిణోరుభయోరపి ప్రహర్షణేఽనుగుణత్వమ్. వాంఛితాధికార్థత్వస్య మణిభగవదుభయసాధారణత్వాత్. విషమే తు నీలమణిరూపస్య విషయిమాత్రస్య. యతో వరాటికార్థినో యథా మహేంద్రనీలమణేః కోటిమూల్యస్య సంసర్గోఽననురూపో న తథా భగవత్సంసర్గో భవితుం ప్రభవతి. న చాజ్ఞానినాం భగవత్సంసర్గోఽ ననురూప ఏవేతి వాచ్యమ్. ఏవం తర్హి తక్రవిక్రయ కర్తృత్వేనైవాజ్ఞా నిత్వలాభే వరాటికాలోభరూపహేతూపన్యాసస్యానతిప్రయోజకత్వాప త్తేః. యాదృశవాంఛితార్థసిద్ధ్యర్థం యత్నః క్రియతే తాదృశవాంఛిత సిద్ధౌ తు సమాలంకార ఏవ.

ఇంకొకటి—

"లోభాద్వరాటి కానాం" మొ.

ఇచట ప్రహర్షణము యొక్క రెండవ భేదముస్ఫుటము. అననురూప

సంబంధము దీసుకొని విషమాలంకారమున్ను, అక్కడ 'మహేంద్రనీలమణి' అని అతిశయోక్తిచేత నాశీఢములగు విషయ విషయులకు రెంటికిని ప్రహర్షణమునందు అనుగుణత్వము; వాంఛితాధికార్థత్వము, మణి భగవదుభయ సాధారణమగుటవలన. విషమము నందైతే నీలమణి రూపమగు విషయమాత్రమునకు; ఎందువలననగా గవ్వలను కోరువాని కెట్లు కోటిమూల్యా మహేంద్రనీలమణి యొక్క సంసర్గము అననురూపమైయుండునో అలా భగవత్సంసర్గమగుటకు తగియుండదుకదా ? అజ్ఞానులకు భగవత్సంసర్గమనను రూపమేను అనియెదరా - ఇలాగైతే, తత్క్రవిక్రియ కర్తృత్వముచేతనే అజ్ఞానిత్వమునకు ప్రాప్తిగలుగుచుండగా వరాటికాలాభరూపమగు హేతూపన్యాసము ఎక్కువప్రయోజనముకలది కాకపోవలసివచ్చును. యాదృశ వాంచాసిద్ధికొరకై ప్రయత్నము చేయబడునో తాదృశవాంఛాసిద్ధియందైతే సమాలంకారమే.

'తద్దర్శనోపాయవిమర్శనార్థం
మయా తదాలీసదనం గతేన.
తత్రైవ సాలఙ్కృత పక్ష్మలాక్షీ
దాక్షాయణీమర్చయితుం ప్రయాతా'

అత్ర తద్దర్శనోపాయసిద్ధ్యర్థం ప్రయుక్తాత్తత్సఖీసదనగమనయత్నాత్సాక్షాదేవ తద్దర్శనలాభః.

యత్తు—

'చాతకస్త్రిచతురాన్పయః కణాన్
యాచతే జలధరం పిపాసయా.
సోఽపి పూరయతి విశ్వమంభసా
హంత హంత మహతాముదారతా'

ఇతి పద్యమ్ 'వాంఛితాదధికార్థస్య సంసిద్ధిశ్చ ప్రహర్షణమ్' ఇతి ప్రహర్షణద్వితీయప్రభేదం లక్షయిత్వోదాహృతం కువలయానందకృతా, తదసత్. వాంఛితాదధికార్థస్య సంసిద్ధిరితి లక్షణే సంసిద్ధిపదేన నిష్పత్తిమాత్రం న వక్తుం యుక్తమ్. సత్యామపి నిష్పత్తౌ వాంఛితుస్తల్లాభకృతసంతోషాతిశయే ప్రహర్షణశబ్దయోగార్థాసంగత్యా తదలంకారత్వాయోగాత్. కింతు లాభేన కృతః సంతోషాతిశయంః. ఏవం

చ ప్రకృతే చాతకస్య త్రిచతుఃకణమాత్రార్థితయా జలదకర్తృక జలకరణక విశ్వపూరణేన హర్షాధిక్యాభావాత్ప్రహర్షణం కథం కారం పదమాధత్తామ్ ? వాంఛితాదధికప్రదత్వేన దాతురుత్కర్షో భవంస్తు న వార్యతే. అత ఏవ హంతహంతేత్యాదినార్థాంతరన్యాసేన స ఏవ పోష్యతే. లోభాద్వరాటికానామిత్యస్మదీయే తూదాహరణే వాంఛితుర్వాంఛితార్థాదధికవస్తులాభేన సంతోషాధిక్యాత్తద్యుక్తమ్.

ఇతి రసగంగాధరే ప్రహర్షణప్రకరణమ్.

"తద్దర్శనోపాయ" మొ. (ఆమె దర్శనమునకై ఉపాయమును వెదకుటకై ఆమె సఖి ఇంటికి వెళ్ళిన నాచేత, దాక్షాయణిని పూజించుటకు బయల్వెడలిన ఆమె అచ్చటనే చూడబడినది.)

ఇచట తద్దర్శనోపాయ సిద్ధ్యర్థమై ప్రయుక్తమైన తత్సఖీసదనగమన యత్నమువలన సాక్షాత్తుగానే తద్దర్శనలాభము.

"చాతకః" మొ. (వానకోయిల మూడు నాలుగు నీటి చుక్కలను మేఘుని యాచించును. ఆ మేఘుడు ప్రపంచమునంతటను నీటితో నింపి వేయును గొప్పవారల ఔదార్యము ఆశ్చర్యదాయకమైనది.)

అను పద్యము, "వాంఛితాదధికార్థస్య సంసిద్ధిశ్చ ప్రహర్షణం"—అని రెండవ ప్రహర్షణ భేదమును లక్షించి దాని యుదాహరణముగా కువలయానందకారుడు చూపెను. అది యుక్తముగాదు. 'వాంఛితాదధికార్థ సంసిద్ధిః' అను లక్షణమునందు సంసిద్ధిపదముచే నిష్పత్తిని మాత్రము చెప్పుట వీలుపడదు. నిష్పత్తి యున్నను కోరువానికి తల్లాభకృత సంతోషాతిశయము లేకున్నచో ప్రహర్షణ శబ్దము యొక్క యోగార్థము సంగతమగుటవలన తదలంకారత్వము సంభవించదు కనుక, ఇకనేమనగా-లాభముచే కల్గిన సంతోషాతిశయము.

ఈతీరుగా ప్రకృతమునందు మూడు నాల్గు కణములను చాతకము కోరుటచే జలదకర్తృక జలకరణకమైన విశ్వపూరణముచే హర్షాధిక్యము లేకపోవుటవలన ప్రహర్షణము ఎట్లు స్థానమును సంపాదించును ? వాంఛితముకన్న నధికప్రదమగుటచే దాతకుత్కర్షమైనచో అది వారింపబడదు. ఇందువల్లనే 'హన్త—హన్త'— ఇత్యాది అర్థాంతరన్యాసమ్ముచేత నదియే పోషింపబడు

చున్నది. "లోభాద్వరాటికానాం" అనే మాపద్యమునందు కోరువానికి వాంఛితార్థముకంటె నధికార్థలాభముచే సంతోషాతిశయము అయినందున అది యుక్తమేను,

ఇది ప్రహర్షణ ప్రకరణము.

## విషాదనాలఙ్కారః

అథ విషాదనమ్—

అభీష్టార్థవిరుద్ధలాభో విషాదనమ్.

అస్య చాభీష్టార్థలాభార్థం కారణప్రయోగో యత్ర న కృతః కేవలమిచ్ఛైవ కృతా జాతశ్చ విరుద్ధార్థలాభః, సః యత్ర చేష్టార్థం ప్రయుక్తేఽపి కారణే తస్మాన్న విరుద్ధార్థలాభః, అపి తు స్వకారణ వశాత్స చ వివిక్తో విషయః, యత్ర త్విష్టార్థం ప్రయుక్తాత్కారణాదేవ విరుద్ధార్థలాభస్తత్ర తాదృశకారణ విరుద్ధార్థయోరుత్పాదకోత్పాద్య భావలక్షణసంసర్గస్యాననురూపత్వాద్విషమమ్, ఇష్యమాణవిరుద్ధార్థలాభసత్త్వాచ్చ విషాదనమితి సంకీర్ణతైవ. ఏవం చాస్య విషమభేదైర్గతార్థతేతి నాశంకనీయమ్, విషమరహితస్యాప్యేతద్విషయస్య దర్శయిష్యమాణత్వాత్.

అనంతరము విషాదనము.

అభీష్టార్థమునకు విరుద్ధము ప్రాప్తించుట విషాదనము. దీనికి అభీష్టార్థ లాభము కొరకు కారణ ప్రయోగమెక్కడ చేయబడలేదో, కేవల మిచ్ఛయే చేయబడినదో, విరుద్ధార్థలాభము కలిగినదో అదియు, ఎక్కడనైతే ఇష్టము నకై ఒక కారణము ప్రయోగింపబడినను దానినుండి విరుద్ధార్థలాభము లేదో, కాని స్వకారణవశమువలన కల్గునో, నదియు వివిక్తమగు విషయము. కాని ఎక్కడ ఇష్టముకొరకై ప్రయోగింపబడిన కారణమువలననే విరుద్ధార్థలాభమో అచట తాదృశకారణమునకును విరుద్ధార్థమునకును నుత్పాదకోత్పాద్యభావ లక్షణ సంసర్గమునకు నననురూపత్వమువలన విషమము. ఇష్యమాణ విరు ద్ధార్థలాభముండుటవలన విషాదనమని సంకీర్ణతయే. ఈ తీరుగా దీనికి విషమ భేదములచే గతార్థత యని శంకించరాదు. విషమరహితమగు విష యము కూడ దీనికి చూపబడనున్నది కనుక,

యథా—

'స్వస్వవ్యాపృతిమగ్నమానసతయా మత్తో నివృత్తే జనే
చంచూకోటినిరాకృతార్గల ఇతో యాస్యామ్యహం పంజరాత్.
ఏవం కీరవరే మనోరథమయం పీయూషమాస్వాదయ-
త్యంతః సంప్రవివేశ వారణకరాకారః ఫణిగ్రామణీః'.

అత్ర హి విషమప్రభేదస్య నాస్తి విషయః, ఇష్టార్థం కారణప్రయోగాభావాత్, ఇష్టార్థప్రయుక్తకారణేన సహ విరుద్ధార్థస్యోత్పాదోత్పాదకసంసర్గస్యానురూపత్వం హి తచ్ఛరీరమ్. తస్మాద్విషాదన-మేవాప్రస్తుతప్రశంసాఘటకతయావస్థితమ్.

ఎట్లనగా—

"స్వస్వవ్యాపృతి" మొ. (తమ తమ పనులయందాసక్తులై జనులుండగా నేను ముక్కుతో పంజరపు గడియను తొలగించుకొని పోయెదను, యీ తీరుగా ఆ కోరికలమయమైన అమృతము చిలుక ఆస్వాదించు చుండగా ఏనుగుతొండముయొక్క ఆకారముగల పాము అందులో ప్రవేశించెను.)

ఇచట విషమ ప్రభేదమునకు విషయములేదు; ఇష్టార్థమై కారణ ప్రయోగాభావమువలన. ఇష్టార్థప్రయుక్తకారణముతో గూడ విరుద్ధార్థమునకు ఉత్పాద్యోత్పాదక భావలక్షణ సంసర్గముయొక్క అననురూపత్వమే తచ్ఛరీరము కదా? అందువలన విషాదనమే అప్రస్తుత ప్రశంసాఘటకముగా నిలచినది.

'చేలాంచలేనాననశీతరశ్మిం సంవృణ్వతీనాం హరిదృశ్వరీణామ్
గోపాంగనానాం స్మరజాతకంపాదకాండసంపాతమియాయ నీవీ'

అత్రేష్టస్యాననగోపనస్య విరుద్ధోఽర్థో నీవీస్ఖలనమ్. కారణీభూతత్రపాసంఘాతపరిపంథిత్వాత్. తచ్చ సాత్త్విక- కంపరూపాత్స్వకారణాదేవోత్పన్నమ్, న తు గోపనానుకూలయత్నాత్. నాపీష్టసాధనత్వేన ప్రయుక్తాత్కారణాదిష్టానుత్పత్తిరత్రాస్తి, చేలాంచలావరణేనాననగోపనరూపస్యేష్టస్యోత్పత్తేః. అతో విషాదనమేవాత్ర; న విషమమ్,

"చేలాంచలేన" మొ. (చేలాంచలమున ముఖచంద్రు నావరించుకొను చున్న గోపాంగనలకు మదనజాతమగు కంపమువలన నీవి అసమయమున పడిపోయెను.)

ఇచట ఇష్టమగు నానన గోపనమునకు విరుద్ధమగు నర్థము నీవీస్ఖలనము; కారణీభూతమగు లజ్జాసంభూత పరిపంథియగుటవలన. అదియు సాత్త్వికకంపరూపమగు స్వకారణమునుండియే యుత్పన్నమైనది కాని గోపనానుకూలయత్నమువలనగాదు. ఇష్టసాధనమని ప్రయుక్తమగు కారణము వలన ఇష్టానుత్పత్తియు ఇక్కడలేదు; చేలాంచలావరణముచేత నాననగోపనరూపమగు నిష్టమునకు నుత్పత్తివలన. అందువలన ఇచట విషాదనమే కాని విషమముగాదు.

అత్రేదం బోధ్యమ్—ఇష్టసాధనత్వేన నిశ్చితాదనిష్టోత్పత్తిరితి యో విషమస్య భేదః ప్రాక్ప్రత్యపాది సోఽనేన విషాదనేన గ్రస్తత్వాదస్యైవ ప్రభేదో భవితుమీష్టే, న తు విషమస్యేతి కశ్చిద్ యది బ్రూయాత్స ప్రష్టవ్యః—న విషమస్యేతి యదుక్తం తత్కస్య హేతోః? విషాదనేనేవ విషమేణాపి కార్యకారణసంసర్గాననురూపతాలక్షణేన గ్రస్తత్వాత్. న చాత్రైకస్యాన్యాపవాదకత్వం యుక్తమ్. ద్వయోరపి సావకాశత్వాత్, భిన్నవిషయత్వాచ్చ విరుద్ధలాభాంశో విషాదనస్య, విరుద్ధలాభేష్టార్థప్రయుక్తకారణయోః సంసర్గాననురూపతాంశశ్చ విషమస్య విషయ ఇత్యవోచామ. తస్మాత్తత్ర కించిదంశే విషమమ్, కించిదంశే విషాదనమిత్యుభయోరపి సమావేశో బోధ్యః.

ఇతి రసగంగాధరే విషాదనప్రకరణమ్

ఇచట నిది తెలియవలెను—

ఇష్టసాధనముగా నిశ్చితమునుండి యనిష్టోత్పత్తియని ఏ విషమభేదము పూర్వము చెప్పబడెనో నది ఈ విషాదనముచేత గ్రస్తము గనుక దీనికే ప్రభేదము అగుట శక్యమగుమ; అంతేకాని విషమముయొక్క ప్రభేదముగాదు, అని, ఎవరేనియు జెప్పిన యెడల నతని నడుగవలెను. విషమము యొక్క ప్రభేదముగాదని చెప్పుటకు కారణమేమి? విషాదనముచేతనువలె, కార్యకారణ సంసర్గముయొక్క అననురూపత్వలక్షణమగు విషమముచేతగూడ గ్రస్తమగుటవలన. ఇచట ఒకదానికి అన్యాపవాదకత్వము యుక్తముకాదు.

రెండును సావకాశములగుటవలన; భిన్న విషయములగుటవలనను విరుద్ధ లాభాంశము విషాదనమునకును, విరుద్ధలాభేష్టార్థ ప్రయుక్త కారణములకు సంసర్గానురూపతాంశము విషమమునకును విషయము అని చెప్పియుంటిమి. అందువలన ఇచట ఒక యంశమందు విషమము, మఱియొక యంశమందు విషాదనము అని రెంటికిని సమావేశనము అని తెలియవలెను—

ఇది విషాదన ప్రకరణము.

## ఉల్లాసాలఙ్కారః

అథోల్లాసః—

అన్యదీయ గుణ దోష ప్రయుక్తమన్యస్య గుణదోషయో రాధానముల్లాసః. తచ్చ గుణేన గుణస్య దోషస్య వా. దోషేణ గుణస్య దోషస్య వేతి చతుర్ధా. ఆధానం చ తద్వత్తాబుద్ధిః. క్రమేణో దాహరణాని—

'అలభ్యం సౌరభ్యం హరతి సతతం యః సుమనసాం
క్షణాదేవ ప్రాణానపి విరహశస్త్రక్షతహృదామ్.
త్వదీయానాం లీలాచలితలహరీణాం వ్యతికరాత్
పునీతే సోఽపి ద్రాగహహ పవమానస్త్రిభువనమ్'.

అత్ర లహరీణాం పావనత్వాతిశయేన పవమానస్య పావనత్వ గుణాంతరం వర్ణితమ్.

'విశాలాభ్యామాభ్యాం కిమిహ నయనాభ్యాం ఖలు ఫలం
న యాభ్యామాలీఢా పరమ రమణీయా తవ తనుః.
అయం తు న్యక్కారో జనని మనుజస్య శ్రవణయో
ర్యయోర్నాంతర్యాతస్తవ లహరిలీలాకలకలః'.

అత్ర శ్రీభాగీరథీరమణీయత్వగుణేన తద్రూపశబ్దవిముఖయో ర్నయనయోః శ్రవణయోశ్చ నైష్ఫల్యధిక్కారరూపౌ దోషౌ.

అనంతర ముల్లాసము.

అన్యదీయ గుణదోషములవలన ప్రయుక్తమగు నన్యదీయగుణదోషముల యాధాన ముల్లాసము.

అది గుణముతో గుణమునకుగాని దోషమునకుగాని, దోషముచే గుణమునకుగాని దోషమునకుగాని, అని నాల్గు రకములు. ఆధానమున్ను తద్వృత్త్యాబుద్ధి.

క్రమముగా నుదాహరణములు—

"అలభ్యం" మొ. (పూవులయొక్క దుర్లభమగు సౌరభమును ఎవడు హరించునో, విరహమను శస్త్రముచేత క్షతమగు హృదయము గలవారియొక్క ప్రాణమును ఎవడు హరించునో, ఆ పవనుడు నీదగు లీలగా కదల్పబడిన ప్రవాహముయొక్క సంబంధమువలన మూడు లోకములను పవిత్రము చేయును.)

ఇచట తరంగములయొక్క పావనత్వాతిశయముచే పవమానునకు పావనత్వము అను గుణాంతరము వర్ణింపబడినది.

"విశాలాభ్యాం" మొ. (వేనిచే మిక్కిలి రమణీయమగు నీ శరీరము అవలోకింపబడలేదో అట్టి నీ ఈ విశాలములగు కన్నుల వలని ఫలమేమి? ఓ తల్లీ! మనుష్యుని చెవుల కిది మాత్రము తిరస్కారమే వేనిలోపల నీ ప్రవాహపు గలకలము పోలేదో.)

ఇచట శ్రీభాగీరథీ రమణీయత్వగుణముచేత, తద్రూపశబ్ద విముఖములగు నయనములకు చెవులకున్ను నైష్ఫల్య ధిక్కారరూపములగు దోషములు.

యథా వా—

'హింసాప్రధానైః ఖలు యాతుధానై
ర్యానీయతాఽపావనతాం సదైవ.
రామాంఘ్రియోగాదథ సాపి వన్యా
వింధ్యస్య ధన్యాస్త మునేః సతీవ'.

అత్ర దోషేణ దోషః పూర్వార్ధే, ద్వితీయార్ధే తు గుణేన గుణ ఇతి విశేషః. యథా వా—

'భూషితాని హరేర్భక్తైర్దూషితాని పరాఙ్ముఖైః
స్వకులం నగరం దేశో ద్వీపం సర్వా చ మేదినీ'.

అత్రోత్తరోత్తరవ్యాపకతయా తథేతి విశేషః.

'శ్వపాకానాం వ్రాతైరమిత విచికిత్సా విచలితై
ర్విముక్తానామేకం కిల సదనమేనః పరిషదామ్.
ముదా మాముద్ధర్తుం జనని ఘటయంత్యాః పరికరం
తవ శ్లాఘాం కర్తుం కథమివ సమర్థో నరపశుః'

అత్ర వక్తృగతపాపరూపదోషప్రయుక్తస్తదుద్ధర్త్ర్యాః శ్రీగంగాయాః శ్లాఘ్యత్వ గుణః.

మరియొకటి—

"హింస్రాప్రధానైః" మొ. (ఏది హింస్రాప్రధానులైన రాక్షసులచే ఎల్లప్పుడును అపవిత్రత్వమును పొందింపబడెనో ఆ వింధ్యాటవికూడ, ముని భార్యవలె, రామచరణ సంయోగముచే ధన్యమైనది.)

ఇచట దోషముచే దోషము పూర్వార్ధమునందును, రెండవ సగము నందు గుణముచే గుణము అని విశేషము.

మరియొకటి—

"భూషితాని" మొ. (హరిభక్తులచే భూషింపబడినది. పరాఙ్ముఖులచే దూషింపబడినదిని, స్వకులము, నగరము, దేశము, ద్వీపము, భూమియంతయు.)

ఇచట నుత్తరోత్తర వ్యాపకతచే అలాగ అని విశేషము.

"శ్వపాకానాం" మొ. (ఓ జననీ! అమితముగా సందేహముచే చలితులైన శ్వపాకులచే విడువబడిన పాపముల కిక్కయైన నన్నుద్ధరించుటకై నడుముకట్టుచున్న నీయొక్క శ్లాఘనుచేయుటకు నరపశువెట్లు సమర్థుడు ?)

ఇచట వక్తృగత పాపరూప దోషములచే ప్రయోగింపబడినదై వానిని ఉద్ధరించునట్టి శ్రీగంగయొక్క శ్లాఘ్యత్వము గుణము.

యథా వా—

శ్వవృత్తివ్యాసంగో నియతమథ మిథ్యాప్రలపనం
కుతర్కేష్వభ్యాసః సతతపరపైశున్యమననమ్.
అపి శ్రావం శ్రావం మమ తు పునరేవంవిధగుణా-
నృతే త్వత్కో నామ క్షణమపి నిరీక్షేత వదనమ్.'

ఇహాపి ప్రాగ్వదేవ కింతు వ్యంగ్యః స ఇతి విశేషః. 'కావ్య లింగేన గతార్థోఽయమ్, నాలంకారాంతరత్వభూమిమారోహతి' ఇత్యేకే. 'లౌకికార్థమయత్వాదనలంకార ఏవ' ఇత్యపరే.

ఇతి రసగంగాధరే ఉల్లాసప్రకరణమ్.

మరియొకటి—

"శ్వవృత్తిః" మొ. (శ్వవృత్తియందు ప్రవృత్తి; తప్పక అసత్య భాష ణము, కుతర్కములయం దభ్యాసము. ఎల్లప్పుడు పరపై శున్యచింతనము. ఇట్టి నా గుణములను మాటిమాటికి వినియు నీవు తక్క మరి యెవ్వడు ఘణ మైనను ముఖమును చూతురు ?)

ఇచటను వెనుకటివలెనే. అయితే అది వ్యంగ్యము అని విశేషము. "ఇది కావ్యలింగముచేతనే గతార్థమైనది. అలంకారాన్తరము గాదు" అని కొందరు చెప్పుదురు. ఇది లౌకికార్థమయమే కనుక అలంకారాన్తరముగాదు అనియు కొందరు చెప్పుదురు.

ఇది ఉల్లాస ప్రకరణము.

## అవజ్ఞాలఙ్కారః

అథావజ్ఞా—

తద్విపర్యయోఽవజ్ఞా. తస్యోల్లాసస్య విపర్యయోఽభావః. అన్యస్యాన్యదీయగుణదోష ప్రయుక్తగుణదోషాధానాభావ ఇతి పర్య వసితోఽర్థః. యథా—

'నిష్ణాతోఽపి చ వేదాంతే వైరాగ్యం నైతి దుర్జనః
చిరం జలనిధౌ మగ్నో మైనాక ఇవ మార్దవమ్.'

అత్ర పూర్వార్ధే ప్రపంచానిత్యత్వబోధకతారూపవేదాంత శాస్త్రగుణప్రయుక్తస్య ఖలే వైరాగ్యరూపగుణాధానస్య, ఉత్తరార్ధే ద్రవత్వరూప జలనిధిగుణప్రయుక్తస్య మైనాకే మార్దవరూపగుణా ధానస్య చ విపర్యయో వర్ణితః.

అనంతర మవజ్ఞ

దాని విపర్యయ మవజ్ఞ. ఆ ఉల్లాసముయొక్క విపర్యయ మవజ్ఞ. విపర్యయమనగా నభావము. అన్యునకు ఇతరులకు సంబంధించిన గుణదోష

ములవలన ప్రయోగింపబడిన గుణదోషముల అభావ మవజ్ఞ అని పర్యవసన్న మైన యర్థము. ఎట్లనగా—

"నిష్ణాతోఽపి" మొ. (దుర్జనుడు వేదాంతమునందు నిష్ణాతుడైనను వైరాగ్యమును, జలధియందు చిరకాలము మగ్నమైన మైనాకము మార్దవమును వలె పొందడు.)

ఇచట పూర్వార్ధమున ప్రపంచముయొక్క ననిత్యత్వమును బోధించునట్టి వేదాంతశాస్త్రముయొక్క గుణప్రయుక్తమగు ఖలునియందు వైరాగ్యరూప గుణాధానముయొక్కయు, ఉత్తరార్ధమున ద్రవత్వరూప జలనిధి గుణప్రయుక్తమగు మైనాకమునందు మార్దవరూపమగు గుణాధానముయొక్క విపర్యయమున్ను వర్ణితమైనది.

'మధ్యేగలం విహరతాం గరలం నికామం
నాగాధిపః శిరసి, భాలతలే హుతాశః.
ధ్యాతా భవజ్వలనమధ్యగతైస్తథాపి
తాపం తదైవ హరతే హర తే తనుశ్రీః'.

అత్ర తాపకతారూపగరలాదిదోషప్రయుక్తస్య భగవన్మూర్తేః క్రూరత్వాదిదోషాధానస్యాభావః.

నచాత్రాతద్గుణో వక్ష్యమాణోఽలంకార ఇతి వాచ్యమ్. యతో యమునాజలస్థరాజహంసాదేర్యథా యమునాజలగతశ్యామత్వాగ్రహణం న తథా భగవన్మూర్తేర్గరలాదిగతక్రూరత్వాగ్రహణం వివక్షితమ్; అపి తు తాదృశక్రూరత్వప్రయుక్తస్య క్రూరత్వాంతరస్యానావిష్కరణమిత్యస్తి విశేషః. 'నిష్ణాతోఽపి—' ఇత్యాదౌ తు అతద్గుణస్యాప్రసక్తిరేవ.

"మధ్యేగలం" మొ (కంఠ మధ్యమునందు చాల విషము విహరించుగాక, శిరస్సునందు నాగరాజు, లలాటమునందు అగ్నియును విహరించుగాక. ఐనను, ఓ శివా, సంసారాగ్ని మధ్యయందున్నవారిచే ధ్యానించబడిన నీ శరీరలక్ష్మి తాపమును వెంటనే తొలగించును)

ఇచట భగవన్మూర్తియందు తాపకతారూప గరళాది దోషప్రయుక్తమైన క్రూరత్వాది దోషాధానము నభావము. ఇచట చెప్పబోవు అతద్గుణాలంకార మనరాదు. యమునా జలమందున్న రాజహంసాదులకు యమునాజల

గత శ్యామలత్వాద్య గ్రహణమెట్లో అటుల భగవన్మూర్తికి గరళాదిగత క్రూరత్వమును గ్రహించకుండుట విపతింపబడలేదు. ఇకనేమనగా—శాద్బళ క్రూరత్వప్రయుక్తమగు క్రూరత్వాంతరమునకు ననావిష్కరణమని ఉన్నది విశేషము. 'నిష్ణాతోఽపి' ఇత్యాదియందైతే అతద్గుణమునకు ప్రసక్తియే లేదు.

'మద్వాణి మా కురు విషాదమనాదరేణ
మాత్సర్య మంద మనసాం సహసా ఖలానామ్.
కావ్యారవిందమకరందమధువ్రతానా-
మాస్యేషు యాస్యసి సతాం విపులం విలాసమ్.'

అత్ర పూర్వార్ధేఽనాదరరూపఖలదోషప్రయుక్తస్య కవివాణ్యాం విషాదరూపదోషస్య నిషిధ్యమానత్వాదప్రతిష్ఠానేనాభావః శాబ్దః వాణీగతరమణీయతారూపగుణప్రయుక్తస్య ఖలే సంతోషరూపగుణాధానస్యాభావః పునరార్థ ఇత్యుభయవిధాప్యవజ్ఞా. ఉత్తరార్ధే తు సహృదయగుణేన సరసతారూపేణ వాణ్యా ఉల్లాసరూపగుణాధాన మిత్యుల్లాస ఏవ. విశేషోక్త్యైవ గతార్థత్వాదవజ్ఞా నాలంకారాంతర మిత్యపి వదంతి.

ఇతి రసగంగాధరే అవజ్ఞాప్రకరణమ్.

"మద్వాణి" మొ (నా వాణీ! మాత్సర్య మందమనస్కుల నాదరించిరని దుఃఖపడకుము; కావ్యములను నరవిందముల మధువ్రతములగు సత్పురుషుల నోళ్ళయందు విపులమగు విలాసము నొందెదవు.)

ఇచట పూర్వార్ధమునందు అనాదరరూపమైన ఖలదోషప్రయుక్తమైన విషాదరూపదోషము కవి వాణియందు నిషేధింపబడుచున్నది గనుక అప్రతిష్ఠానముచే అభావము శాబ్దమైనది. వాణీగత రమణీయతారూప గుణ ప్రయుక్తమగు ఖలునియందు సంతోషరూపగుణముయొక్క నాధానపుటభావము ఆర్థము; అని ఉభయవిధమగు నవజ్ఞ. ఉత్తరార్ధమందైతే—సరసతారూపమగు సహృదయ గుణముచే వాణియందు ఉల్లాసరూప గుణాధానమని ఉల్లాసమే. విశేషోక్తిచేతనే గతార్థమగుటవలన అవజ్ఞ అలంకారాన్తరము కాదనియు జెప్పుదురు—

ఇది అవజ్ఞా ప్రకరణము.

## అనుజ్ఞాలఙ్కారః

అథానుజ్ఞా—

ఉత్కటగుణవిశేషలాలసయా దోషత్వేన ప్రసిద్ధస్యాపి వస్తునః ప్రార్థనమనుజ్ఞా. యథా—

'ప్రణిపత్య విధే భవంతమద్ధా వినిబద్ధాంజలిరేకమేవ యాచే
జనురస్తు కులే కృషీవలానామపి గోవిందపదారవిందభాజామ్'.

అత్ర హరిభక్తిలాలసయా కృషీవలకులజన్మనః ప్రార్థనమ్.

ఇతి రసగంగాధరే అనుజ్ఞాప్రకరణమ్.

అనంతర **మనుజ్ఞ**. ఉత్కటమగు గుణవిశేషమునందలి **లాలసతచే** దోషమని ప్రసిద్ధమైన వస్తువునుగూడ ప్రార్థించుట **అనుజ్ఞ**. ఎట్లనగా—

"ప్రణిపత్య" మొ. (ఓ విధీ! నిన్ను నమస్కరించి, నిజముగ, **ఒకటి అడిగెదను**; నాకు హరిభక్తులగు కర్షకుల కులమందైనను జన్మ అగుగాక!)

ఇచట హరిభక్తి లాలసచేత కృషీవలకులజన్మను ప్రార్థించుట.

ఇది అనుజ్ఞా ప్రకరణము.

## తిరస్కారాలఙ్కారః

అథ తిరస్కారః—

ఏవం దోషవిశేషానుబంధాద్ గుణత్వేన ప్రసిద్ధస్యాపి ద్వేష స్తిరస్కారః. యథా—

'శ్రియో మే మా సంతు క్షణమపి చ మాద్యద్గజఘటా
మదభ్రామ్యద్ భృంగావలిమధురసంగీతసుభగాః.
నిమగ్నానాం యాసు ద్రవిణరసపర్యాకులహృదాం
సపర్యా సౌకర్యం హరిచరణయోర స్తమయతే'.

అత్ర హరిచరణభజనచ్యుతిభయాద్రాజ్యసుఖస్య తిరస్కారః. అముం చ తిరస్కారమలక్షయిత్వాఽనుజ్ఞాం లక్షయతః కువలయానందకృతో విస్మరణమేవ శరణమ్. అన్యథా 'భవద్భవన గేహాలీ—' ఇతి తదుదాహృతపద్యే 'కిమిత్యమరసంపదామ్' ఇత్యంశే తిరస్కారస్య స్ఫురణానాపత్తేః.

అనంతరము తిరస్కారము.

ఈ తీరుగా దోష విశేషానుబంధమువలన గుణముగా ప్రసిద్ధమైన దానిని కూడ ద్వేషించుట తిరస్కారము.

ఎట్లనగా—

"శ్రియో మే" మొ. (మదించుచున్న ఏనుగుల గుంపు యొక్క మద మున దిరుగుచున్న తుమ్మెద ఆ మధుర సంగీతముచే నందమగు సిరులు నాకు క్షణమైన వద్దు; ఆ వానిలో మున్గినవారికి ధనమునం దతిప్రీతితో హృదయ ములు పర్యాకులములుకాగా శ్రీహరిచరణ సేవాసౌకర్యము నశించుచున్నది)

ఇచట హరిచరణ భజనచ్యుతి భయమువలన రాజ్యసుఖమునకు తిర స్కారము.

ఈ తిరస్కారమునకు లక్షణము చెప్పక యనుజ్ఞ నుదహరించినట్టి కువలయానందకారులకు విస్మరణమే శరణము అలాగాని యెడల. "భవద్భవన దేహలీ" అను అతడుదాహరించిన పద్యమునందు "ఃమిత్యమపసంపదామ్" అను నంశమునందు తిరస్కారమునకు స్ఫురణములేక పోవలసి వచ్చును.

నను కథమనయోరలఙ్కారయోః సంభవః ? యావతా ప్రార్థ నమిచ్ఛా, తిరస్కారశ్చ ద్వేషః. తత్ర దోషే ఇష్టసాధనతాజ్ఞానరూప కారణాభావాదిచ్ఛా న యుక్తా. గుణే చ ద్విష్టసాధనతాజ్ఞానా భావాద్ ద్వేషోఽపి తథా. వైపరీత్యం తు కారణసత్త్వాదుచితమితి చేత్ మైవమ్. దోషగుణయోర్గుణదోషాంశమాదాయేష్ట ద్విష్టసాధన తాజ్ఞానయోః సత్త్వాత్త్వదుక్తం కారణం తావదవ్యాహతమ్. ఉత్కటద్విష్టాననుబంధీష్టసాధనతాజ్ఞానస్యోపాయేచ్ఛాం ప్రతి ఉత్క- టేష్టాననుబంధిద్విష్టసాధనతాజ్ఞానస్య చోపాయద్వేషం ప్రతి కారణత్వ స్య వాచ్యత్వాద్వైపరీత్యమపి నోచితమ్. అన్యథా సుఖదుఃఖోభయ సాధనేషు చాంద్రాయణకలంజభక్షణాదిషు హరీతకీ దధిత్రపుషభక్ష ణాదిషు చేచ్ఛాద్వేషయోరనియమ ఏవ స్యాత్. అత్ర చ పురుషకాల ప్రవేశ ఆవశ్యకః. ఉత్కటతత్పురుషీయతాత్కాలికద్విష్టాననుబంధి తత్పురుషీయతాత్కాలికేచ్ఛావిషయఫలసాధనతాజ్ఞానం తత్పురుషీయో పాయేచ్ఛాం ప్రతి కారణమ్. ఏవముత్కటతత్పురుషీయ తాత్కాలికేష్టా ననుబంధితత్పురుషీయతాత్కాలికద్వేషవిషయఫలసాధనతాజ్ఞానం తత్పు

రుషీయోపాయద్వేషం ॥ [illegible]న పురుషాంతరీయం కాలాంతరీయం చ ద్విష్టమిష్టమాదాయ న దోషః

ఓయి? ఈ అలంకారములు రెంటికిని సంభవము ఎట్లు? ప్రార్థన మనగా ఇచ్ఛ, తిరస్కారమనగా ద్వేషము. అక్కడ దోషమునందు ఇష్టసాధ నతాజ్ఞాన రూపకారణము యొక్క నభావమువలన ఇచ్ఛ యుక్తము గాదు. గుణమునందు ద్విష్టసాధనతా జ్ఞానము లేకపోవుట వలన ద్వేషమున్ను యుక్తముకాదు. కారణములుండుట వలన వైపరీత్యమైతే ఉచితమన్నచో- ఇలా అనవద్దు. దోషగుణములయందు గుణదోషాంశములను తీసుకొని, ఇష్ట ద్విష్ట సాధనతాజ్ఞానముండుట వలన నీవు చెప్పినది కారణమైతే అవ్యాహతమే ఉత్కట ద్విష్టాననుబంధీష్టసాధనతాజ్ఞానమున కుపాయేచ్ఛను గురించియు, ఉత్కటేష్టాననుబంధియగు ద్విష్టసాధనతాజ్ఞానమునకు నుపాయ ద్వేషమును గురించియు కారణత్వము చెప్పవలెను కనుక వైపరీత్యమును ఉచితముగాదు.

అట్లుకాని యెడల సుఖదుఃఖోభయ సాధనములగు చాంద్రాయణ కలంజ భక్షణాదులయందును, హరీతకీదధిత్రపుష భక్షణాదుల యందును, ఇచ్ఛాద్వేషములకు రెండింటికిని నియమము. లేకపోవుటయే కలుగవలెను. ఇచట పురుషకాల ప్రవేశమావశ్యకము ఉత్కట తత్పురుషీయ తాత్కాలికే చ్ఛావిషయ ఫలసాధనతాజ్ఞానము తత్పురుషీయోపాయేచ్ఛను గురించి కార ణము. ఈ తీరుగా—ఉత్కట తత్పురుషీయ తాత్కాలికేష్టాననుబంధి తత్పు రుషీయ తాత్కాలిక ద్వేషవిషయ ఫలసాధనతాజ్ఞానము తత్పురుషీయోపాయ ద్వేషమును గురించి కారణము. అందుచేతను పురుషాంతరీయము కాలాంత రీయమున్ను అయిన ద్విష్టమును ఇష్టమును తీసుకొని దోషములేదు.

ఇదంతు బోధ్యమ్-ఫలే ఉత్కటేచ్ఛయా ఉపాయేఽప్యుత్క టేచ్ఛైవ జాయతే; ఏవం ఫలే ఉత్కటద్వేషేణోపాయేఽపి ద్వేష ఏవ. ఏవం చ సుఖదుఃఖోభయసాధనేషు చాంద్రాయణాదిషు యది స్వసా మగ్రీవశాత్ ప్రథమం సుఖే ఉత్కటేచ్ఛా తదా తత్సాధనేషు చాంద్రాయణాదిష్వపి సైవ. అథ స్వసామగ్రీవశాత్ప్రథమం దుఃఖేః ఉత్కటద్వేషస్తదాచాంద్రాయ ణాదిషు స ఏవ, ఉత్కటసామగ్ర్యా బలవత్త్వకల్పనాత్.

ఉత్కటత్వం చ ప్రకృతే ఇచ్ఛాద్వేషగతో విషయితా విశేషః, ఏకసాధనజన్యే ఇష్టానిష్టరూపే ఫలద్వయే ఏకకాలావచ్ఛేదేనైకత్రోత్కటేచ్ఛా అపరత్రోత్కటద్వేషశ్చ న సంఘటతే. తథా సతి చాంద్రాయణాదిష్వేకస్మిన్నేవ సమయే ఇచ్ఛాద్వేషయోర్ద్వయోరప్యాపత్తేః. ఏవంచ బలవదనిష్టానను బన్ధిత్వం బలవదిష్టాననుబన్ధిత్వంచోపాయేచ్ఛాద్వేషయోః కారణతావచ్ఛేదకే న దేయమేవేత్యాహుః.

ఇది తెలియవలెను-

ఫలమునందుత్కటేచ్ఛచేత నుపాయమందును ఉత్కటేచ్ఛ గల్గును. అటులనే ఫలమునం దుత్కటద్వేషముచే నుపాయమునందును ద్వేషమే. ఈ తీరుగా సుఖదుఃఖోభయ సాధనములగు చాంద్రాయణాదులయందు సర్వసామగ్రీ వశమువలన మొదట సుఖమునందుత్కటేచ్ఛ ఉన్నట్లైతే అపుడు తత్సాధనములగు చాంద్రాయణాదుల యందును నదియేయుండును. అట్లుకాక, స్వసామగ్రీ వశమువలన మొట్టమొదట దుఃఖమునందు ఉత్కట ద్వేషమున్నచో నపుడు చాంద్రాయణాదులయందును అదియే. ఉత్కట సామగ్రికి బలవత్త్వము కల్పించుటవలన. ఉత్కటత్వము ప్రకృతమునందు ఇచ్ఛాద్వేషగతమగు విషయితా విశేషము. ఏకసాధన జన్యమగు ఇష్టానిష్టరూపఫల ద్వయమునందు ఏకకాలావచ్ఛేదమున, నొకచోటను ఉత్కటేచ్ఛ మరొకచోట ఉత్కట ద్వేషమున్ను సంభవించదు. అలాగైనచో చాంద్రాయణాదుల యందు ఒక సమయమునందే ఇచ్ఛాద్వేషములు రెంటికిన్ని నాపత్తి గల్గును. ఈ తీరుగా బలవదనిష్టానుబంధిత్వము, బలవదిష్టాననుబంధిత్వమున్ను ఉపాయేచ్ఛాద్వేషముల కారణతావచ్ఛేదకమునందు వేయగూడదనియే చెప్పుచున్నారు.

అన్యే తు-ఫలేచ్ఛా ఫలసాధనతాజ్ఞానయోర్ద్వయోరుపాయేచ్ఛాం ప్రతి, ఫలద్వేషఫలాస్సాధనతాజ్ఞానయో రుపాయ ద్వేషం ప్రతి చ కారణత్వమ్. ఉత్కటసామగ్ర్యా బలత్వాచ్చేష్టానిష్టోభయసాధనే న దోషః ఇత్యపి వదంతి.

ఏవం చేష్టానిష్టోభయసాధనే దోషే గుణే చ గుణేన దోషేణ చ మిశ్రితే సహృదయానామిచ్ఛాద్వేషయోరుచితైవోత్పత్తిః; హారీతకీకదలభక్షణయోరివేతి.

ఇతి రసగంగాధరే తిరస్కారప్రకరణమ్.

ఇతరులైతే- ఫలేచ్ఛా ఫలసాధనతాజ్ఞానములకు రెంటికిని ఉపాయేచ్ఛను గూర్చియు, ఫలద్వేష ఫలాసాధనతా జ్ఞానములకు నుపాయ ద్వేషమును గురించియు కారణత్వము. ఉత్కట సామగ్రి బలవత్తగుట వలన ఇష్టానిష్టోభయ సాధనమునందు దోసములేదని చెప్పుచున్నారు.

ఈ తీరుగా నిష్టానిష్టోభయ సాధనమగు దోషమునందును గుణమునందును, గుణముతోడను దోషముతోడను మిశ్రితమగు దానియందు, సహృదయులకు ఇచ్ఛాద్వేషముల యొక్క ఉత్పత్తి ఉచితమేను; కరక్కాయ అరటిపండు భక్షణమువలె అని.

ఇది తిరస్కార ప్రకరణము

## లేశాలఙ్కారః

అథ లేశః—

గుణస్యానిష్టసాధనతయా దోషత్వేన, దోషస్యేష్టసాధనతయా గుణత్వేన చ వర్ణనం లేశః. యథా—

'అపి బత గురుగర్వం మా స్మ కస్తూరి యాసీ
రఖిలపరిమలానాం మౌలినా సౌరభేణ.
గిరిగహనగుహాయాం లీనమత్యంతదీనం
స్వజనకమమునైవ ప్రాణహీనం కరోషి'.

'నైర్గుణ్యమేవ సాధీయో ధిగస్తు గుణగౌరవమ్
శాఖినోఽన్యే విరాజంతే ఖండ్యంతే చందనద్రుమాః'

పూర్వత్ర గుణస్య దోషత్వేన వర్ణనమాత్రమ్, ఉత్తరత్ర తు దోషస్య గుణత్వేన వర్ణన మర్థాంతరన్యాసానువిద్ధమ్.

'స్ఖలంతీ స్వర్లోకాదవనితలశోకాపహృతయే
జటాజూటగ్రంథౌ యదపి వినిబద్ధా పురభిదా.
అయే నిర్లోభానామపి మనసి లోభం జనయతాం
గుణానామేవాయం తవ జనని దోషః పరిణతః.'

అత్ర దోషోఽపరాధః. తథా చాపరాధత్వేన గుణానాం దోషత్వముక్తం భవతి.

అనంతరము లేశము.

గుణమును అనిష్టసాధన మగుటచేత దోషముగాను, దోషమును ఇష్ట సాధనమగుటచేత గుణముగాను వర్ణించుట లేశము ఎట్లనగా—

"అపి బత" మొ. (ఓ కస్తూరి! అన్ని పరిమళములలో శ్రేష్ఠమైన పరిమళముచే గర్వించకుము. కొండకోనలలోని గుహలో దాగుకొనియున్న సత్యాన్తము దీనమగు నీ బంధుజనమును దీనిచేతనే జంపించుచున్నావు )

"నైర్గుణ్యమేవ" మొ. (గుణములు లేకుండుటయే మంచిది; గుణ గౌరవము పనికిరాదు. కదమ చెట్లన్నియు బాగుగానున్నవి. చందన వృక్షములు ఖండితములగుచున్నవి.)

మొదటిచోట గుణమును దోషముగా వర్ణించుట మాత్రము, రెండవ చోట దోషమును గుణముగా వర్ణించుట అర్థాన్తర న్యాసముతో అనువిద్ధము.

"స్ఖలంతీ" మొ (ఓ తల్లీ గంగా! స్వర్గలోకమునుండి భూలోకము నందు దుఃఖమును పోగొట్టుటకై ప్రవహించుచు శివుని జటాజూటపు ముడిలో కట్టివేయబడితివి లోభము లేనివారి హృదయమున గూడ లోభమును గల్గించు నీ గుణముల సమూహము దోషమే యిట్లు పరిణమించినది )

ఇచట దోషమపరాధము కావున నపరాధముగా గుణములకు దోషత్వము చెప్పబడినది.

న చాయమలంకారో వ్యాజస్తుత్యా ఉభయరూపయా గతార్థ ఇతి శంక్యమ్. ముఖప్రతిపాదితార్థవైపరీత్యేనాత్ర సర్వత్ర పర్యవసానాభావాత్. న హి 'అపి బత గురు గర్వమ్—' ఇత్యత్ర కస్తూర్యాః స్తుతౌ కవేస్తాత్పర్యమ్, అపి తు జనకప్రాణాపరిహారిత్వేన నిందాయామేవ. అత ఏవాప్రస్తుతకస్తూరీవృత్తాంతాభివ్యక్తే ప్రస్తుతవృత్తాన్తేఽపి తస్యామేవ విశ్రాంతిః. ఏవం 'నైర్గుణ్యమేవ సాధీయః' ఇత్యత్ర శాఖ్యంతరాణాం నిందా న వివక్షితా, కిం తు సుఖావస్థానమ్. గుణినః స్వగుణైర్దుఃఖితస్య వాక్యేఽస్మిన్నిర్గుణానాం నిందాయా అవక్తవ్యత్వాత్. ప్రత్యుత స్తుతేరేవ వాచ్యత్వాత్. 'స్ఖలంతీ స్వర్లోకాత్—' ఇతి పద్యే భాగీరథీస్తుతి ప్రకరణ పఠితే యద్యపి భాగీరథీస్తుతౌ తాత్పర్యం తదా వ్యాజస్తుతిరప్యస్తు. తస్యాః సావకాశత్వేనైతద్బాధకత్వాయోగాత్.

'రవితురగదిగ్గజేషు స్వర్ణాచలజలధిధనదకోషేషు
సత్స్వేవ రాజపుంగవ కిం దాతాస్మీతి గర్వమావహసి.'

అత్ర పర్యంతే ప్రతీయమానస్య రవితురగాది పరిసంఖ్యాత పదార్థాతిరిక్త సకలవస్తుదానరూపస్య గుణస్య దోషత్వేనావర్ణనాద్, తత్త్వేన వర్ణ్య- మానస్య చ రవితురగాద్యదానస్యాగుణత్వాద్ గుణ దోషయోర్భిన్న విషయత్వేనావస్థానేన లేశస్పర్శరహితా వ్యాజస్తుతిరితి స్ఫుటమేవ సావకాశత్వమ్. అత ఏవ లేశోఽపి న వ్యాజస్తుతేర్బాధక ఇతి ప్రాగుక్తజాహ్నవీస్తుతౌ ద్వయోరపి సమావేశః.

ఇతి రసగంగాధరే లేశప్రకరణమ్.

ఈ యలంకారము ఉభయ రూపయగు వ్యాజస్తుతిచే గతార్థమని శంకింపరాదు. ఆదియందు ప్రతిపాదింపబడిన అర్థమునకు వైపరీత్యముతో నన్నిచోట్లను పర్యవసానము లేదుగనుక. "అపి బత గురు గర్వం" అనుచోట కస్తూరి యొక్క స్తోత్రమునందు కవికి తాత్పర్యములేదు; ఇక నేమనగా జనక ప్రాణాపహారిత్వముచే నిందయందే తాత్పర్యము. ఇందువలననే అప్రస్తుత కస్తూరీ వృత్తాంతముచే నభివ్యక్తమగు ప్రస్తుత వృత్తాంతము నందును దానియందే విశ్రాంతి. ఈ తీరుగా "నైర్గుణ్యామేవ సాధీయః" అను చోట శాఖ్యంతరములకు నిందయు వివక్షితముగాదు; ఇక నేమనగా— సుఖముగా నుండుట. తన గుణములచే దుఃఖితుడగు గుణవంతుని యొక్క వాక్యమునందు నిర్గుణుల నింద జెప్పదగదు గనుక; ప్రత్యుత స్తుతియే వాచ్యమగుటవలన, "ఖలంతీ స్వర్లోకాత్" అనుపద్యమునందు, భాగీరథీస్తుతి పరముగ పఠితమైన దానియందు, భాగరథీస్తుతియందు తాత్పర్యమున్నయెడల అపుడు వ్యాజస్తుతియును అయిన నగుగాక. అది సావకాశమగుటచే దీనికి బాధకమగుట సంభవింపదు గనుక.

"రవితురగ" మొ. (సూర్యుని గుర్రములు, దిగ్గజములు, సువర్ణగిరి, సముద్రములు, కుబేరుని నిధులు, ఇవన్నీ ఉండగానే నేను దాతనని ఓ రాజ పుంగవా! ఏల గర్వింతువు?)

ఇచట పర్యంతమున ప్రతీయ మానమగు రవితురగాది పరిసంఖ్యాత పదార్థాతిరిక్త సకలవస్తుదాన రూపమగు గుణమును దోషముగా వర్ణింప

